



## శ్రీ గురుభ్యోనమః.

### శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

దేవతాప్రార్థన.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః.

## వాల్మీకి ప్రార్థన.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః
శృణ్వన్రామకథానాదం కోనయాతి పరాంగతిమ్.

## ఆంజనేయ ప్రార్థన.

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్
కపీశమక్షహంతారం వందే లంకాభయంకరమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్
రామాయణమహామాలా రత్నం వందేఽనిలాత్మజమ్.
మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాంవరిష్ఠమ్
వాతాత్మజంవానరయూథముఖ్యంశ్రీరామదూతంశిరసానమామి.

## శ్రీరామాయణప్రశంస.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.
శ్రీమద్బ్రహ్మతదేవబీజ మమలం యస్యాఙ్కుర శ్చిన్మయః
కాండైస్సప్తభిరన్వితోఽనివితతో ఋష్యాలవాలోదితః.
పత్రైస్తత్త్వసహస్రకైస్సువిలస చ్ఛాఖాశతైఃపంచభిః
స్వాత్మప్రాప్తిఫలప్రదోవిజయతే రామాయణస్స్వస్తరుః.
యఃకర్ణాఞ్జలిసంపుటై రహరహ స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకేర్వదనారవిందగళితం రామాయణాఖ్యంమధు.
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారంసవిహాయగచ్ఛతిపుమా న్విష్ణోఃపదంశాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా
శ్రీమద్రామాయణీ గంగా పునాతుభువనత్రయమ్.



నారదమహర్షి.



శ్రీవాల్మీకిమహర్షి.

మూలం, తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్.

అవతరణిక.—చతుర్ముఖాంశసంభూతులును సర్వజ్ఞులునగు వాల్మీకిమహాముని, "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరేజనాః, సయత్ప్రమాణంకురుతేలోకస్తదనువర్తతే" (ఎద్దాని శ్రేష్ఠుఁడాచరించునో, దానినేయితరజనులునాచరింతురు ; ఆశ్రేష్ఠుఁ డెద్దానిఁబ్రమాణముగాఁజేయునో, దానిలోకమంతయు ననుసరించును.) అనున్యాయంబున, లోకులందఱును గురూపగమనపూర్వకముగఁ దాపత్రియ విముక్తినొందుదురుగాకయని యనుగ్రహించి, తాముపరమజ్ఞానులైనప్పటికిని, బరమదయాళువులుగావున, నారదముఖమునఁ, దాపత్రయవిమోచనంబును బరమప్రాప్యంబునగు బ్రహ్మస్వరూపమును దెలిసికొని,యప్పరమార్థంబందఱకును దెల్లంబగునట్లు,రామాయణాఖ్యమహాకావ్యరూపమునఁ బ్రచురింపఁదలంచినవారై, యయ్యాది నిర్విఘ్నంబుగఁ బరిసమాప్తినొందుటకొఱకు, గురూపదిష్టవస్తుస్మరణేష్టదేవతానమస్కారలక్షణమంగళమును శ్లోకరూపముగా నాచరించుచున్నవారు.

టీక ॥ తపస్వీ=కృఛ్రచాంద్రాయణాది నిత్య నైమిత్తిక వ్రతానుష్ఠానముగల; వాల్మీకిః=వాల్మీకియనుమహర్షి; తపస్స్వాధ్యాయనిరతం,తపః= (తపఆలోచనేఅనుధాతువునఁబుట్టినది) జ్ఞానమందును,స్వాధ్యాయ=వేదములయందును, నిరతం=మిక్కిలియాసక్తుఁడును;లేక, తపః=బ్రహ్మప్రతిపాదకమగు, స్వాధ్యాయ=వేదములయందు,అనఁగా,వేదాంతములయందు, నిరతం; లేక, తపః=చాంద్రాయణాది నిత్యనైమిత్తిక వ్రతానుష్ఠానమందును స్వాధ్యాయ=అర్థావబోధపర్యంత వేదాధ్యయనమందును,నిరతం; వాగ్విదాం, వాక్=బ్రహ్మమును, విదాం=ఎఱింగినవారిలోపల, వరం=శ్రేష్ఠుఁడును, లేక, వాక్=శబ్దప్రతిపాదకమగు వ్యాకరణము, ఇదియితరాంగములకుపలక్షణము;షడంగములనెఱింగినవారిలోశ్రేష్ఠుఁడును; లేక, వాక్=అష్టాదశవిద్యలు; వాటినెఱింగినవారిలోశ్రేష్ఠుఁడును;లేక,వాక్=వివక్షితమగుదాని బయలుపఱుపసమర్థమగువాక్యము; దానిఁదెలిసినవారిలోశ్రేష్ఠుఁడును; మునిపుంగవం,ముని=మననశీలురయందు, అనఁగా, బ్రహ్మానుసంధానము సేయువారలయందు, పుంగవం=శ్రేష్ఠుఁడును; అగు; నారదం=నారదమహాముని ని;పరిపప్రచ్ఛ=(వక్ష్యమాణప్రశ్నమును)విశేషించి (ఏలాగడిగినట్టైన వారికిఁగృపపుట్టునోఆలాగు) అడిగెను.

విశేషార్థములు—తపస్వీ=శ్రేష్ఠమైనతపస్సుగలవాఁడు; "తపః" అనుదానిపైని, మత్వర్థీయమైన విన్ప్రత్యయమురాఁగా, "తపస్వీ" అనిమైనది. "భూమనిందాప్రశంసాసునిత్యయోగేతిశాయనే, సంసర్గేస్తివివక్షాయాం భవంతిమతుబాదయః" అనియుండుటవలనమత్వర్థీయమునకు భూమాదులర్థములు.ఇచ్చటఁబ్రాశస్త్యమర్థము. తపస్సుజ్ఞానసాధనమని వేదము చెప్పుచున్నది.అట్టితపస్సేసాధనచతుష్టయసంపత్తి. అదియే వేదాంతశాస్త్రాధికారిలక్షణము. అదికలవారిలోనుత్తముఁడనియర్థము. వాల్మీకిః=వల్మీకమందు, అనఁగా, పుట్టయందుఁ,బుట్టినపురుషుఁడు.బ్రహ్మ

కైవర్తము "అథాబ్రవీన్మహాతేజా బ్రహ్మా లోకపితామహః। వల్మీకప్రభవో యస్మాత్తస్మాద్వాల్మీకిరిత్యసౌ" (మహాతేజుండును లోకపితామహుండునగు బ్రహ్మ "యీ ఋక్షుఁడు, వల్మీకమందుఁ బుట్టినవాఁడగుటవలన, వాల్మీకియని చెప్పఁబడు" ననిపలికెను) అని వాల్మీకిశబ్దార్థమును జెప్పుచున్నది. "ఋక్షో భూద్భార్గవ స్తస్మా ద్వాల్మీకిర్యోభిధీయతే" (అతనివలన (అనఁగా, ఆప్రచేతసునివలన) వాల్మీకి యనిప్రసిద్ధుఁడైన భార్గవుఁడగు ఋక్షుఁడుపుట్టెను) అనువిష్ణుపురాణవచనము, వాల్మీకి, ఋక్షుఁడను నామాంతరము కలవాఁ డనియు, భృగువంశమునందుఁ బుట్టినప్రచేతసునకుఁగుమారుఁడనియుఁ, దెల్పుచున్నది. "చక్రే ప్రచేతసః పుత్రః" అనువచనమును దీనికుపష్టంభక మగుచున్నది. ఇందువలన, వాల్మీకి, భృగువంశోత్పన్నుఁడైన ప్రచేతసునకు జనించి, ఋక్షుఁడనునామముగలిగియుండెననియు, నటువెనుక స్థాణువువలెఁ గదలక మెదలక నిశ్చలదేహుఁడైతపము సేయుచుండ, నతని చుట్టునువల్మీకము మొలిచిన, నంతనావల్మీకగర్భముననుండి తపస్సు చేయుటంబట్టి "వాల్మీకి" యనపౌరుషనామంబునఁబ్రసిద్ధుఁడయ్యెననియుఁ, దెలియవచ్చుచున్నది. ఇట్లు ఋక్షాదినామములున్నను, వాల్మీకి యనుపౌరుషనామంబున నిర్దేశించుటంబట్టి, శమాదిసంపత్తియుఁ దపఃప్రాచుర్యమును, సూచితమగుచున్నది. "తపస్వీ, వాల్మీకిః" అనునీశబ్దములచేత వాల్మీకియందు వేదాంతశాస్త్రాధికారిలక్షణము సూచింపఁబడినది. "తపస్స్వాధ్యాయ నిరతం, వాగ్విదాంవరం, మునిపుంగవం, నారదం" అనునవి నారదునియందుగురులక్షణమును సూచింపుచున్నవి. "సాధనచతుష్టయ సంపన్నుఁడగువాఁడు, బ్రహ్మస్వరూపమును దెలిసికొనుటకు, సమిత్పాణియై, శ్రోత్రియుఁడును బ్రహ్మనిష్ఠుఁడునగు గురువును, బొందవలయు" నని వేదమందుండుటంబట్టి, "గురువు" అనఁగా, శ్రోత్రియత్వమును బ్రహ్మనిష్ఠత్వమునుగలవాఁడు. "శ్రోత్రియశ్ఛందోధీతే" అనునను శాసనమువలన, శ్రోత్రియుఁ డనఁగా,

వేదవేదార్థములు దెలిసినవాఁడని యర్థము. అట్టిశ్రోత్రియ శబ్దార్థమును, "తపస్స్వాధ్యాయనిరతం" అనుశబ్దము చెప్పుచున్నది. బ్రహ్మనిష్ఠ శబ్దార్థమును, "వాగ్విదాం వరం, మునిపుంగవం" అనునవి, చెప్పుచున్నవి, "గుశబ్దస్త్వంధ కారస్స్యాద్రుశబ్దస్తన్నిరోధకః, అంధకార నిరోధిత్వా ద్గురురిత్యభిధీయతే" ("గుః" అనఁగా, అంధకారము; "రుః" అనఁగా, దానినిరోధించువాఁడు; అంధకారమును బోఁగొట్టుటవలన "గురుః" అని చెప్పఁబడుచున్నాఁడు) అనఁగా నజ్ఞానమును బోఁగొట్టువాఁడనియర్థము; ప్రకాశమును గలుగఁజేయక చీఁకటిని బోఁగొట్టుటశక్యము గానట్లు, జ్ఞానమును గలుగఁజేయక యజ్ఞానమును బోఁగొట్టుట శక్యము కాదు కావున, అజ్ఞానమును బోఁగొట్టి జ్ఞానము నిచ్చువాఁడని గురుశబ్దార్థము. "గాయన్నారాయణకథాం సదా పాపభయాపహాం, నారదో నాశయన్నేతి నృణామజ్ఞానజం తమః" (పాపభయంబులఁ బోఁగొట్టు నారాయణకథ నెల్లప్పుడును బాడుచు, మనుష్యుల యజ్ఞానజన్యమగు నంధకారమును నశింపఁజేయుచు, నారదుఁడు వచ్చుచున్నాఁడు) అను నారదీయము రీతిని; నరసంబంధి నారం- అనఁగా నజ్ఞానము, దాని, దః (ద్యతి, దో అవఖండనే) ఖండించువాఁడు కాఁగా, నారదుఁడని చెప్పఁబడును; అనఁగా నజ్ఞానమును బోఁగొట్టువాఁడని యర్థము. లేక; "నరతీతి నరః ప్రోక్తః పరమాత్మా సనాతనః" (ప్రపంచమునందు సృష్టిస్థితిలయముల నయించువాఁడు నరుఁడనఁబడును (నరతీతి నరః, నృ నయే, అను ధాతువునఁ బుట్టినది) అట్టి నరుఁడే సనాతనుఁడగు పరమాత్మ) అను ప్రమాణమును బట్టి 'నారం' (నరసంబధి) అనఁగా బరమాత్మవిషయకమగు జ్ఞానము, దాని, దః (దదాతి, డుదాఞ్ దానే) ఇచ్చువాఁడు, పరమాత్మ విషయకమగు జ్ఞానమునిచ్చువాఁడని యర్థము; అనఁగా, నజ్ఞానమును బోఁగొట్టి జ్ఞానమునిచ్చువాఁడని, నారద శబ్దార్థ మేర్పడుచున్నది. కావున, "నారదం" అనుశబ్దము చేత గురుశబ్దార్థము చెప్పఁబడినది "పరిపప్రచ్ఛ" అని పరిపూర్వకమగు ప్రచ్ఛ ధాతువును బ్రయోగించు

టవలన "తద్విద్ధిప్రణిపాతేనపరిప్ర శ్నేన సేవయా" ఽ యశాస్త్రముఁబట్టి శాస్త్రోక్తవిధానమున నేప్రచ్ఛించిరని తెలియఁజేయఁబడుచున్నది. ఇట్లు, ఈశ్లోకమున, శిష్యలక్షణమును, గురులక్షణమును, శాస్త్రోక్తగురూపగమనరీతియును, సూచింపఁబడిన వి.-"శ్లోకేచ ప్రతిసాహస్రంప్రథమే ప్రథమేక్రమాత్ । గాయత్ర్యక్షరమేకైకంస్థాపయామాస వై మునిః" (ప్రతిశ్లోకసహస్రమునకును, మొదటిశ్లోకమందు మొట్టమొదట, వాల్మీకిమహాముని, యొక్కొక గాయత్ర్యక్షరమునుగూర్చెను) అనియుండునట్లు, ఇచ్చట, గాయత్రీప్రథమాక్షరమగు తకారముగూర్పఁబడినది.

వాల్మీకిమహాముని, తపోవిశేషముచేతనిష్కల్మషుఁడై, వేదాంతపరమార్థము దెలిసికొనఁగోరి, మహాశ్రోత్రియుఁడును బ్రహ్మనిష్ఠాగ్రగణ్యుఁడునగు నారదమహామునిని, భక్తితోనిట్లని, యడిగెను; అని తాత్పర్యము.

అర్థాంతరము.—తపస్వీ; వాల్మీకిః; స్వాధ్యాయనిరతం, స్వాధ్యాయ= అర్థజ్ఞానపర్యంత వేదాధ్యయనమందు, నిరతం = మిక్కిలి యాసక్తుఁడును; వాగ్విదాం; వరం; మునిపుంగవం; నారదం; తపః=(తపఆలోచనే అనుధాతువునఁబుట్టినది) బ్రహ్మమును; పరిపప్రచ్ఛ.

వాల్మీకి మహాముని నారదుల వారినిబ్రహ్మమెట్టిదనియడిగెనని తాత్పర్యము. (శేషము-పై.)

కోన్వస్మింత్సాంప్రతం లోకే గుణవాన్కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చకృతజ్ఞశ్చ సత్యవాక్యోదృఢవ్రతః. ౨.

అ॥ ఆప్రశ్నము నేవివరించుచున్నారు.—

టీక ॥ అస్మిన్ లోకే=ఈభూలోకమందు; సాంప్రతం=ఇప్పుడు; గుణవాన్=ప్రశస్తములైనగుణములుకలవాఁడు; కోను = ఎవ్వఁడు? ("నుఃపృచ్ఛాయాంవికల్పేచ" అనియమరము.) వీర్యవాంశ్చ=వీర్యవంతుఁడును, దేనిచేఁదనకుక్షతికలుగకుండఁబురుషుఁడు పరులజయించునోఅదివీర్యమనిచెప్పఁబడును, అట్టిశక్తికలవాఁడును; కః=ఎవ్వఁడు? (చకారంబుక్త సముచ్చాయకము, "గుణవంతుఁడును వీర్యవంతుఁడు

నగువాఁడెవ్వఁడు?" అనుసముచ్చితార్థమునుగలిగించుచున్నది. ఇట్లుత్తరస్థలములయందును దెలిసికొనునది.) ధర్మజ్ఞశ్చ, ధర్మః=సామాన్యవిశేషరూపంబగునలౌకికశ్రేయస్సాధనమును, జ్ఞశ్చ=ఎఱింగినవాఁడును; కః=ఎవ్వఁడు? (ఇచ్చట, చకారం బనుక్త సముచ్చాయకము, "అధర్మమునుగూడఁదెలిసినవాఁ" డనునర్థమునిచ్చుచున్నది. "కః" అనునదియధ్యాహృతము. "కః" అనియొకమాటుప్రయోగమేచాలియున్నను, ఆదరాతిశయమునఁ బలుమఱుఁబ్రయుక్తమైనది. ఈశబ్దములేనిస్థలములయందంతట నిట్లేయధ్యాహృతమగును.) కృతజ్ఞశ్చ, కృత=ఇతరులచేఁదనకుఁజేయఁబడినస్వల్పమగునుపకారమును; జ్ఞశ్చ=అధికముగాఁదెలిసికొనువాఁడును; కః=ఎవ్వఁడు? సత్యవాక్యః, సత్య=అతిప్రయాస కాలములయందైన నన్నృతశూన్యమగు, వాక్యః=పలుకుగలవాఁడు; కః=ఎవ్వఁడు? దృఢవ్రతః, దృఢ=ఫలపర్యంతము విడువఁబడని, వ్రతః=సంకల్పముగలవాఁడు; కః=ఎవ్వఁడు.

విశేషార్థము.— లోకాంతరమందు, నారాయణాదులుండుట, ప్రసిద్ధమగుటవలనఁ, దెలిసినదికాఁబట్టి, యడుగవలసినదిలేదని "భూలోకమందు" అనిచెప్పఁబడినది-కాలాంతరమందు, నరసింహాద్యవతారములు, ప్రసిద్ధములుకాఁబట్టి, యవియు, జిజ్ఞాసావిషయములుకావుకావున, "ఇప్పుడు" అనిచెప్పఁబడినది-చకారములు ప్రయోగించుటవలన, గుణవత్త్వాదివిశేషణ సముదాయవిశిష్టత్వముసూచితమగుచున్నది-ఒకచకార ప్రయోగముననే అట్టిసముచ్చయము సిద్ధించుచున్నను, మాటిమాటికిఁబ్రయోగించుట, ఉక్తవిశేషణసముదాయ విశిష్టునందలి యాదరాతిశయమునుసూచించుచున్నది. "గుణవాన్" ఇత్యాది విశేషణములువేదోక్తమహాపురుషలక్షణమును జెప్పుచున్నవి.

చారిత్రేణచ కోయుక్త స్సర్వభూతేషు కోహితః
విద్వాన్కః కస్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః॥ ౩.

టీక ॥ చారిత్రేణ = కులక్రమాగతాచారముతో (చరిత్రం అనఁగా, కులక్రమాగతాచారము; చరిత్రమేవచారిత్రం స్వార్థేణ్, చరిత్రమేచారిత్రమని నైనది.) యుక్తశ్చ=కూడియుండువాఁడును; కః= ఎవ్వఁడు? సర్వభూతేషు=సమస్త ప్రాణులవిషయమై, అనఁగా, సాపరాధులవిషయమైగాని యనపరాధులవిషయమైగాని, యనియర్థము; హితః=హితమును జేయువాఁడు (హితశబ్దముపైని, తత్కరోతీతిణిచ్, పచాద్యచ్, ణిలోపము, రాఁగా, నీయర్థముకలిగినది); కః=ఎవ్వఁడు? విద్వాన్ = తెలిసికొనఁదగినవాని నన్నిటిని దెలిసి కొనినవాఁడు; కః=ఎవ్వఁడు? సమర్థశ్చ=ఇతరులకు నిర్వహింప నశక్యమగు కార్యమును నిర్వహించువాఁడును; కః=ఎవ్వఁడు? ఏకప్రియదర్శనశ్చ, ఏక = ఒకటే రీతిగ నుండునట్టి, ప్రియ=సంతోషజనకమగు, దర్శనశ్చ= చూడఁబడుటకలవాఁడును, అనఁగా, "క్షణేక్షణే యన్నవతాముపైతితదేవరూపంరమణీయతాయాః" (ప్రతిక్షణమును ఏదినూతనమగుచుండునో; అదియెరమణీయతకుస్వరూపము) అని చెప్పఁబడినట్లు, ఎల్లప్పుడును జూడఁబడుచుండినప్పటికిని క్రొత్తగాఁ జూడఁబడువానియట్లు, విస్మయమునుగలుగఁజేయువాఁడుననియర్థము; లేక, ఏక=సరిలేని, ప్రియ= సంతోషజనకమగు, దర్శనశ్చ= చూడఁబడుటకలవాఁడును; కః=ఎవ్వఁడు?

తాత్పర్యము సులభము.

ఆత్మవాన్కో-జితక్రోధో ద్యుతిమాన్కో-నసూయకః
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే. ౪

టీక ॥ ఆత్మవాన్=ధైర్యము కలవాఁడు ("ఆత్మాజీవేధృతౌదేహేస్వభావేపరమాత్మని" అనియమరము); కః= ఎవ్వఁడు? జితక్రోధః, జిత=జయింపఁబడిన, క్రోధః= కోపముకలవాఁడును, క్రోధశబ్దము కామాద్యుపలక్షకము, వశీకృతమైనయరిషడ్వర్గముకలవాఁడని యర్థము; కః= ఎవ్వఁడు? ద్యుతిమాన్= ప్రశస్తమైనకాంతికలవాఁడు; కః=

ఎవ్వఁడు? అనసూయకః= గుణములయందుదోషారోపణము "అసూయ" అని చెప్పఁబడును ("అసూయాతుదోషారోపోగుణేష్వపి" అనియమరము) అది లేనివాఁడు; కః= ఎవ్వఁడు? జాతరోషస్య, జాత=పుట్టిన, రోషస్య= రోషముగల, అనఁగా, రుష్టుఁడైన; కస్య=ఎవ్వనికి; సంయుగే = యుద్ధమునందు; దేవాశ్చ = (చకారమసురాది సముచ్చయార్థము) దేవాసురాదులును; బిభ్యతి=భీతిలుదురు? లేక; జాతరోషస్య, కస్య, సంయుగే, దేవాశ్చ=(చకారమప్యర్థకము) మిత్రులైనదేవతలును, బిభ్యతి; (కోపమువచ్చినపుడు మిత్రులకుఁగూడ భయముపుట్టఁగా శత్రువులకు భయముపుట్టుట చెప్పవలసినది లేదనియభిప్రాయము.) అనియడిగెనని, "పరిపప్రచ్ఛ" అను క్రియతో సంబంధము.

ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం పరంకౌతూహలం హిమే
మహర్షే త్వంసమర్థోసి జ్ఞాతు మేవంవిధన్నరం. ౫

టీక ॥ ఏతత్ = ఇట్టిగుణములుగలమనుష్యరూపమయినవస్తువును; అహం= నేను; శ్రోతుం=వినుటకు; ఇచ్ఛామి= కోరుచున్నాను. మే=నాయొక్క; కౌతూహలం = హర్షము; పరంహి= అధికముగదా. మహర్షే, మహత్ =పూజ్యుఁడైన, ఋషే = జ్ఞానపారంగతుఁడా; అనఁగా, జ్ఞానపారంగతులలోనుత్తముఁడా; త్వం= నీవు; ఏవంవిధం=ఇట్టిగుణములుగల; నరం=మనుష్యుని; జ్ఞాతుం=ఎఱుంగుటకు; సమర్థః=నేర్పరివి; అసి = అగుచున్నావు.

విశేషార్థము.— ఋషతీతి ఋషిః ("ఋషగతౌ" అనుధాతువునఁబుట్టినది) జ్ఞానముయొక్క పారమును బొందుచున్నాఁడు కాఁగా, "ఋషిః" అనిచెప్పఁబడును- 'ఇట్టిగుణములుగల పురుషునిఁ దెలిసికొనఁగోరి తాముచెప్పఁగా వినవలెనని యడిగితిని గాని యాక్షేపింపలేదు' (అని "శ్రోతుం" అనునదిసూచింపుచున్నది) "తామనుగ్రహించిచెప్పినట్లైనవినఁ గోరెదను, అవశ్యముగాఁ జెప్పవలయునని నిర్బంధింపఁ

జాలను" (అని "ఇచ్ఛామి" అనుదాని చేఁ దెల్పఁబడుచున్నది) "దీనియందునాకుఁ జాలఁ గుతూహలమున్నదనియింగితాకారములచేఁ దమకును దెలియవచ్చియే యున్నది" (అని "హి" అనుశబ్దము తెల్పుచున్నది.) మీరు జ్ఞానవంతులలో నుత్తములు కాఁబట్టి, యిట్టిలోకోత్తరుండగు మనుష్యునెఱుంగుటకు, మీకన్నమఱి యెవ్వరునుసమర్థులు లేనందున, మీ రాకనుఇంతవఱకుఁ బ్రతీక్షింపుచుంటిని (అనియుత్తరార్థముచే సూచితమగుచున్నది.)

తాత్పర్యము సులభము.

శ్రుత్వా చైత త్త్రిలోకజ్ఞో వాల్మీకే ర్నారదో వచః
శ్రూయతా మితిచామన్త్ర్య ప్రహృష్టో వాక్యమబ్రవీత్. ౬

టీక ॥ త్రిలోకజ్ఞః, త్రిలోక = మూఁడులోకములను, జ్ఞః = ఎఱింగినట్టి, లేక, త్రిలోక = భూర్భువస్సువః అనెడు మూఁడులోకములుగల బ్రహ్మాండమును, జ్ఞః; లేక, త్రిలోక = బద్ధముక్తనిత్యులనెడు త్రివిధజనులను, జ్ఞః; ("లోకస్తుభువనేజనే" అనియమరము.) నారదః = నారదమహాముని; ఏతత్ = ఇప్పుడుచెప్పఁబడిన; వాల్మీకేః = వాల్మీకిమహామునియొక్క; వచః = వాక్యమును; శ్రుత్వాచ = వినియు; శ్రూయతాం = వినఁబడుఁగాక; ఇతి = అని; ఆమన్త్ర్యచ = పిలిచియు; అనఁగా, వాల్మీకినిఅభిముఖునిఁగాఁజేసికొని; ప్రహృష్టః = సంతసించినవాఁడై; వాక్యం = (వక్ష్యమాణమగు) మాటను; అబ్రవీత్ = పలికెను.

లోకములనన్నింటినిఎఱింగియున్న నారదమహర్షి, వాల్మీకిమహామునియొక్క ప్రశ్నమునువిని, "ఇది గో! వినవలసినది" అనివారినభిముఖీకరించుకొని, "ఈవాల్మీకి, సమస్తగుణసంపన్నుఁడైన, మనుష్యునిఁ దెలిసికొనఁగోరెను, ఈగుణములుసార్వభౌమసామాన్యునియందు దొరకొనవు- సమస్త జగద్రక్షణార్థము మనుష్య రూపముతో నవతరించిన సాక్షాన్నారాయణమూర్తియొక్కఁడేయిట్టి గుణములు కలిగినవాఁడు, కావున, భగవద్గుణ కీర్తనము ఘటిల్లె" నని సంతోషించి, ఇట్లని,

ప్రత్యుత్తరమును జెప్పెను- అని తాత్పర్యము.

బహవో దుర్లభాశ్చైవ యేత్వయా కీర్తితాగుణాః
మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తశ్శ్రూయతాన్నరః॥ ౭.

టీక ॥ బహవః= విపులములును, లేక, అనంతములును; దుర్లభాశ్చైవ=సాధారణుల కెంతమాత్రమును బొందఁగూడ నివియును, అగు; యేగుణాః = యేవీర్యాదిగుణములు; త్వయా=నీచేత; కీర్తితాః= వర్ణింపఁబడినవో; మునే=ఓవాల్మీకిమహాముని! తైః=ఆగుణములతో; యుక్తః= కూడియున్న, నరః=మనుష్యుఁడు; శ్రూయతాం = వినఁబడుగాత; అహం= నేను; బుద్ధ్వా= తెలిసికొని; వక్ష్యామి = చెప్పెదను.

విశేషార్థము.— ఇప్పుడు వాల్మీకిచేనడుగఁబడినగుణములుకొద్దిగా నే తెలియవచ్చుచున్నను, అవి, అనంత కల్యాణ గుణము లేపురుషుని యందుండునో, వానియందే యుండుటంబట్టి, "బహవః" అనుశబ్దము చేనిర్దేశింపఁబడినవి.

ఓవాల్మీకిమహాముని, నీవడిగిన గుణములు అనంతములు, సాధారణులయందుదొరకొనవు- అట్టిగుణములతోఁగూడినమహాపురుషునినిశ్చయించి చెప్పెదను, సావధానముగావినుము; అని తాత్పర్యము.

ఇక్ష్వాకువంశప్రభవో రామోనామ జనైశ్శ్రుతః
నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ధృతిమాన్వశీ॥ ౮.

టీక ॥ ఇక్ష్వాకువంశప్రభవః; ఇక్ష్వాకు= ఇక్ష్వాకు మహారాజుయొక్క, వంశ=కులము, ప్రభవః=ఉత్పత్తి స్థానముగాఁగల ; రామోనామ=రాముఁడుగదా ! (అతఁడే మీరడిగిన గుణములతోఁగూడినవాఁడనుట.) సః (అధ్యాహృతము- ఇట్లుప్రతివిశేషణమందును అధ్యాహృతమగుచుండును) =ఆరాముఁడు; జనైః=లోకులచేత; శ్రుతః= గుణములచేత సాక్షాన్నాయకుఁడనినిశ్చయింపఁబడినవాఁడు ("శ్రు

తం శాస్త్రావిధ్భృతయోః" అనియమరము), లేక, శ్రుతః= వినఁబడినవాఁడు; జనులందఱును దన్నెఱుంగునట్లు గుణసంపత్తి గలవాఁడని యభిప్రాయము. సః=ఆరాముఁడు; నియతాత్మా, నియత=నిశ్చితమగు, ఆత్మా=స్వభావముగలవాఁడు, నిర్వికారస్వరూపుఁడనుట. సః=ఆరాముఁడు; మహావీర్యః, మహత్=అచింత్యమగు, వీర్యః = శక్తికలవాఁడు. సః = ఆరాముఁడు; ద్యుతిమాన్=ప్రశస్తమగు ప్రకాశముగలవాఁడు, స్వయంప్రకాశస్వరూపుఁడనుట. సః= ఆరాముఁడు; ధృతిమాన్ = ప్రశస్తధైర్యముకలవాఁడు; లేక, ప్రశస్తమగు నానందము కలవాఁడు; నిరతిశయానందస్వరూపుఁడనుట. ("ధృతిస్తుతుష్టిస్సంతోషః" అని వైజయంతి) సః= ఆరాముఁడు; వశీ=ఇంద్రియనిగ్రహముకలవాఁడు; లేక, సమస్తప్రపంచమును దనవశములో నుంచికొనినవాఁడు; సర్వేశ్వరుఁడనుట.

విశేషార్థము.— "రామో రమయతాంవరః" (రమింపఁజేయువారిలో రాముఁడు శ్రేష్ఠుఁడు) అనియుండుటంబట్టి, రమయతీతి రామః, రమింపఁజేయువాఁడని రామశబ్దార్థము, లేక, "రమంతే యోగినోనంతే సత్యానందేచిదాత్మని, ఇతి రామపదేనాసౌ పరంబ్రహ్మాభిధీయతే" (అనంతసచ్చిదానందాత్మకుఁడగువీనియందు యోగులురమింతురు. ఇట్లు రామశబ్దముచేఁబరబ్రహ్మ చెప్పఁబడుచున్నది.) అనుసగస్త్యసంహితావచనమువలన, రమంతేఽస్మిన్నితి రామః, వీనియందు యోగులురమింతురని గాని, రామశబ్దార్థము. "రాముఁడు గదా" అని చెప్పుటంబట్టి "మీరునజిత్రకూటపర్వతమునందుండు నపుడు రామునింజూచియున్నా"రనిజ్ఞాపకసఅచడమైనది.

తాత్పర్యము సులభము.

బుద్ధిమాన్నీతిమాన్వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః
విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః. ౯

టీక ॥ సః=ఆరాముఁడు, బుద్ధిమాన్ = ప్రశస్తమైనబుద్ధికలవాఁడు; సర్వజ్ఞుఁడనుట. సః=ఆరాముఁడు; నీతిమాన్=ప్రశస్తమగునీతికలవాఁడు, లేక, సృష్టిస్థితిలయరూపమర్యాదలుకలవాఁడు. సః=ఆరాముఁడు; వాగ్మీ = సమస్తవిద్యలును దెలిసినవాఁడు. సః=ఆరాముఁడు; శ్రీమాన్ = అఖండమైనయైశ్వర్యముకలవాఁడు. సః=ఆరాముఁడు; శత్రునిబర్హణః, శత్రు=విరోధులను, నిబర్హణః = నశింపఁజేయువాఁడు. సః=ఆరాముఁడు; విపులాంసః, విపుల = ఉన్నతములగు, అంసః = మూఁపులుకలవాఁడు. సః=ఆరాముఁడు; మహాబాహుః, మహత్ =బలిసిన, బాహుః=భుజములుగలవాఁడు. సః= ఆరాముఁడు; కంబుగ్రీవః, కంబు=శంఖమువంటి, గ్రీవః=కంఠముకలవాఁడు. సః= ఆరాముఁడు; మహాహనుః, మహత్ =ఉన్నతములగు, హనుః=చెక్కిళ్లమీఁదిభాగములు కలవాఁడు.

విశేషార్థము.— విపులాంసః= "కక్షఃకుక్షిశ్చవక్షశ్చఘ్రాణస్కంధో లలాటికా, సర్వభూతేషునిర్దిష్టాఉన్నతాస్తుసుఖప్రదాః" (చంక, కడుపు, ఱొమ్ము, ముక్కు, మూఁపు, నొసలు, ఇవి, సమస్తప్రాణులయందును, ఉన్నతములైనట్లైన, సుఖప్రదములుగాఁజెప్పఁబడినవి) అని సాముద్రికములోఁ జెప్పఁబడినట్లు; ఉన్నతములైన మూఁపులుగలవాఁడనుట- కంబుగ్రీవః= "కంబుగ్రీవశ్చ నృపతిర్లంబకర్ణోతిభూషణః" (శంఖమువంటికంఠముగలవాఁడు, రాజగును; వ్రేలాడు చెవులు గలవాఁడు, పెక్కుభూషణములుగలిగియుండును.) అనుసాముద్రిక వచనమురీతిని; శంఖమువలెనుండు కంఠముగలవాఁడనుట. మహాహనుః= "మాంసలేతుహనూయస్యభవతస్త్వీషదున్నతే, సనరోమృష్టమశ్నాతియావదాయుస్సుఖాన్వితః" (ఎవ్వనియొక్క, చెక్కిళ్లమీఁది భాగములు, బలిసియుండుటచేఁ, గొంచెమున్నతములుగానుండునో; ఆమనుష్యుఁడు, జీవితకాలమంతయు, సుఖముగలిగి, మృష్టాన్నముభుజించుచుండును) అనియుండునట్లు, ఉన్నతములైన హనువులుగలవాఁడనుట.

తాత్పర్యముసులభము.

మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిందమః
ఆజానుబాహు స్సుశిరా స్సులలాట స్సువిక్రమః. ౧౦

టీక ॥ సః= ఆరాముఁడు;మహోరస్కః,మహత్ = విశాలమగు,ఉరస్కః=ఱొమ్ముగలవాఁడు. సః=ఆరాముఁడు; మహేష్వాసః, మహత్ =గొప్పదగు, ఇష్వాసః= విల్లుగలవాఁడు. సః = ఆరాముఁడు;గూఢజత్రుః,గూఢ=మాంసమగ్నములగుటవలననగుపడనట్టి, జత్రుః=మూఁపులసంధి యెముకలు కలవాఁడు. సః=ఆరాముఁడు; అరిందమః, అరిం=కామక్రోధాదిశత్రువులను, లేక, పాపములను, దమః=పోఁగొట్టువాఁడు. సః=ఆరాముఁడు;ఆజానుబాహుః,ఆజాను= మోఁకాళ్లవఱకు నిడుదలైన, బాహుః=భుజములుగలవాఁడు. సః= ఆరాముఁడు;సుశిరాః=మంచిలక్షణముతోఁగూడినశిరముగలవాఁడు. సః=ఆరాముఁడు; సులలాటః=శుభలక్షణముగల నొసలుగలవాఁడు. సః= ఆరాముఁడు; సువిక్రమః = శోభన మగు పాదవిన్యాసముగలవాఁడు.

విశేషార్థము.— మహోరస్కః= "స్థిరంవిశాలంకఠినమున్నతమ్మాంసలంసమం, వక్షోయస్య మహీపాల స్తత్స్యాద్భవేన్నరః" (దృఢమై,విశాలమై, కఠినమై, యున్నతమై,బలిసి,సమముగానుండుఱొమ్ము,ఎవ్వనికిఁగలదో; వాఁడు,రాజుగాని,రాజసముఁడుగాని, యగును.) ఇట్లుశాస్త్రోక్తవక్షోలక్షణముగలవాఁడనుట.'మహేష్వాసః' ఈశబ్దముచే, "గొప్పధనువును ధరింపఁదగినంతదృఢమైన శరీరము గలవాఁడు" అనునర్థము సూచింపఁబడుచున్నది, కావునఁ, బ్రక్రమభంగములేదు.గూఢజత్రుః= "విషమైర్జత్రుభిర్నిస్స్వాఅతిసూక్ష్మైశ్చమానవాః, ఉన్నతైర్భోగినోనిమ్నైర్నిస్స్వాః పీనై ర్నరాధిపాః" (మూఁపులసంధియెముకలు "జత్రువు" లనంబడును)మనుజులు, ఎచ్చుతక్కువలు గలిగిగాని, యతిసూక్ష్మములుగఁగాని, యుండు,జత్రువులచే,దరిద్రులగుదురు; ఉన్న



తెములైన జత్రువులచే భోగులగుదురు, లోఁతుగానుండు జత్రువులచే బీదవాండ్రగుదురు; బలిసిన జత్రువులచే, రాజులగుదురు.) అనునట్లు, మాంసాధిక్యము గలిగి బలిసియున్నందున, గూఢములగు, మూఁపులసంధియెముకలుగలవాఁడనుట. అరిందమః= కామక్రోధాదిశత్రువర్గమునుబోఁగొట్టువాఁడనియర్థము; కామక్రోధాదులులేక కర్మము గలుగదు, కర్మములేకశరీరపరిగ్రహముసంభవింపదు; కాఁబట్టి, ఈ శబ్దముచే, "ఇప్పుడు, రామునిచేనంగీకరింపఁబడినమనుష్యశరీరము, కర్మమూలకము గాదు; లోకానుగ్రహార్థమైయంగీకరింపఁబడినది" అనిసూచితమగుచున్నది. ఆజానుబాహుః = "ఆజానులంబినౌబాహూ వృత్తపీనౌ మహేశ్వరః" (గుండ్రముగాబలిసి మోఁకాళ్లవఱకు వ్రేలాడునట్టి బాహువులుగలవాఁడు, సార్వభౌముఁడగును.) అనుసాముద్రికవచనమురీతిని; సార్వభౌమలక్షణముగలబాహువులుగలవాఁడనుట. సుశిరాః="సమవృత్తశిరాశ్చైవ ఛత్రాకార శిరాస్తథా, ఏకచ్ఛత్రాంమహీంభుఙ్క్తేదీర్ఘమాయుశ్చజీవతి" (సమముగా గుండ్రమయియుండుశిరముగలవాఁడును, గొడుగువంటిశిరముగలవాఁడును, ఏకచ్ఛత్రాధిపత్యముసేయుచు, దీర్ఘకాలముజీవించును.) అనురీతిని, శుభలక్షణముగల శిరముగలవాఁడనుట. సులలాటః= "అర్ధచంద్రనిభస్తుంగం లలాటం యస్య సప్రభుః" (అర్ధచంద్రాకారముగలిగి యున్నతమైన లలాట, మెవ్వనికిఁగలదో; వాఁడురాజగును.) అనిచెప్పఁబడిన లలాటలక్షణముగల నొసలుగలవాఁడనుట. సువిక్రమః= "సింహర్షభగజవ్యాఘ్రగతయో మనుజామునే, సర్వత్రసుఖమేధంతే సర్వత్రజయినస్సదా" (సింహమువంటిగాని, వృషభమువంటిగాని, యేనుఁగువంటిగాని, బెబ్బులివంటిగాని, గమనముగలవారలు, సమస్తస్థలములయందును, ఎల్లప్పుడు, సుఖముగావృద్ధిఁబొందుచు, జయముగలిగి యుందురు.) అని జగద్వల్లభయందుండునట్లు, శుభలక్షణములుగలనడకగలవాఁడనుట.

తాత్పర్యము సులభము.




శ్లో ॥ సమ స్సమవిభక్తాంగ స్స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః. ౧౧

టీక ॥ సః = ఆరాముఁడు; సమః = అతిదీర్ఘమును అతిహ్రస్వమునుగాని దేహము గలవాఁడు. సః = ఆరాముఁడు; సమవిభక్తాంగః, సమ=ఎచ్చుతక్కువలు లేని, విభక్త=విభజింపఁబడిన, అంగః= అవయవములుగలవాఁడు. సః=ఆరాముఁడు; స్నిగ్ధవర్ణః, స్నిగ్ధ= స్నేహముగల, వర్ణః=రంగుగలవాఁడు. సః=ఆరాముఁడు; ప్రతాపవాన్=ప్రశస్తమగు, పరాక్రమముగలవాఁడు, లేక, తేజస్సు కలవాఁడు. సః=ఆరాముఁడు; పీనవక్షాః, పీన=బలిసిన, వక్షాః=ఱొమ్ముగలవాఁడు. సః=ఆరాముఁడు, విశాలాక్షః, విశాల=దీర్ఘములైన, అక్షః=నేత్రములు గలవాఁడు. సః=ఆరాముఁడు ; లక్ష్మీవాన్= ప్రశస్తమైన యవయవకాంతి గలవాఁడు. సః=ఆరాముఁడు ; శుభలక్షణః, శుభ=మంగళకరములగు, లక్షణః=సాముద్రికశాస్త్రమందుఁ జెప్పఁబడినలక్షణములుగలవాఁడు.

విశేషార్థము.—
సమః="షణ్ణవత్యంగుళోత్సేధస్సార్వభౌమోభవేన్నృపః" (తొంబదియాఱంగుళముల పొడవుగలరాజు సార్వభౌముఁడగును.) అనిజగద్వల్లభయందుఁజెప్పఁబడినట్లు, ఎచ్చుతక్కువలులేకతొంబది యాఱంగుళములపొడవు గలవాఁ డనుట. సమవిభక్తాంగః= "భ్రువౌనాసాపుటౌనేత్రేకర్ణావోష్ఠౌచ చూచుకే, కూర్పరౌమణిబంధౌచజానునీవృషణౌకటీ, కరౌపాదౌస్ఫిజౌయస్యసమౌజ్ఞేయస్సభూపతిః" ( కనుబొమలు, నాసికారంధ్రములు,కండ్లు, చెవులు, పెదవులు, చనుమొనలు, మోఁచేతులు, మనికట్లు,మోఁకాళ్లు,వృషణములు,కటిప్రదేశములు, హస్తములు, పాదములు , పిఱుఁదులు, ఇవి, యెవ్వనికి, సమములగునో;అతఁడు రాజుగాఁగలఁడు) అనుసాముద్రికమురీతిని , ఎచ్చుతక్కువలులేక, సమములై, విభక్తములైన , కనుబొమలు మొదలగు

నవయవములుగలవాఁ డనుట. స్నిగ్ధవర్ణః="చక్షుస్స్నేహేనసౌభాగ్యందంతస్నేహేనభోజనం, త్వచిస్నేహేనశయ్యాచ పాదస్నేహేనవాహనం" (స్నేహమనఁగా, మెఱుఁగుగలిగియుండుట. నేత్రములయందు స్నేహముండెన, సౌభాగ్యముగలుగును ; దంతములయందు స్నేహముండిన, మంచిభోజనముగల్గును ; చర్మమందుస్నేహముండినసుఖశయ్యాగలుగును; పాదముల యందు, స్నేహముండిన, వాహనములుగలుగును)అనివరరుచిచెప్పినట్లు, నేత్రాద్యవయవములయందు, స్నేహముగలవాఁడనుట.

తాత్పర్యము సులభము.

శ్లో ॥ ధర్మజ్ఞ స్సత్యసంధశ్చ ప్రజానాంచ హితేరతః
యశస్వీజ్ఞానసంపన్నశ్శుచిర్వశ్యస్సమాధిమాన్. ౧౨

టీక ॥ సః=ఆరాముఁడు ; ధర్మజ్ఞః, ధర్మ=శరణాగత రక్షణాది ధర్మములను, జ్ఞః= ఎఱింగినవాఁడు. సః=ఆరాముఁడు ; సత్యసంధః, సత్య=యధార్థమైన, సంధః= ప్రతిజ్ఞగలవాఁడు (చకారముపాదపూరణార్థము. ("తుహిచస్మహవై పాద పూరణే" అనియమరము.) సః=ఆరాముఁడు;ప్రజానాం = ప్రాణులకు; హితే= హితము సేయుటయందు; రతః= ఆసక్తుఁడు. సః = ఆరాముఁడు ; యశస్వీ=ప్రశస్తమగుకీర్తికలవాఁడు. సః=ఆరాముఁడు; జ్ఞానసంపన్నః, జ్ఞాన=సర్వవిషయకజ్ఞానముతో, సంపన్నః = కూడినవాఁడు. సః=ఆరాముఁడు ; శుచిః=పరిశుద్ధుఁడు.సః=ఆరాముఁడు; వశ్యః= గురుజనులకు లోఁకువ యగువాఁడు, లేక , ఆశ్రితపరతంత్రుఁడు సః=ఆరాముఁడు;సమాధిమాన్= ఆశ్రితరక్షణచింత గలవాఁడు.

తాత్పర్యము సులభము

శ్లో ॥ ప్రజాపతి సమ శ్శ్రీమాన్ ధాతా రిపునిషూదనః
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా. ౧౩

టీక ॥ సః=ఆరాముఁడు ; ప్రజాపతిసమః, ప్రజాపతి = బ్రహ్మతో, సమః=సమానుఁడు. సః=ఆరాముఁడు; శ్రీమాన్=సర్వమునతిశయించినవాఁడు. సః=ఆరాముఁడు ; ధాతా=సమస్త ప్రపంచమునుబోషించు వాఁడు. సః = ఆరాముఁడు; రిపునిషూదనః, రిపు= శత్రువులను , నిషూదనః=నిరసించు వాఁడు. సః= ఆరాముఁడు ; జీవలోకస్య=ప్రాణివర్గమునకు; రక్షితా=పాలకుఁడు. సః = ఆరాముఁడు ; ధర్మస్య= తత్తద్వర్ణాశ్రమధర్మమునకు; పరిరక్షితా= విశేషించి రక్షకుఁడు.

విశేషార్థము.—“జీవలోకస్య రక్షితా” సార్వభౌమ మాత్రుఁడు , స్వజనములమాత్రము, రక్షించును, లేక, మనుష్యులనుమాత్రమురక్షించును. రాముఁడట్లుకాదు. ప్రాణివర్గమునంతయుఁ, బిపీలికాది బ్రహ్మపర్యంతము, రక్షించువాఁ డనుట. ప్రాణివర్గమునంతయురక్షించుపక్షమునఁ, బాపులనుగూడరక్షించునా ! అనిన; “ధర్మస్యపరిరక్షితా” ధర్మమునురక్షించుటవలనఁ బాపులనుగూడ రక్షించువాఁడే! ఎట్లనఁగా; ఏలాగు , చికిత్సకుఁడు , రోగికి, అప్పుడపకారిగానగుపడు చుండెనను, రోగమును బోఁగొట్టుటచే, నుపకారియగునో; అలాగు, పాపులకు, శిక్షకుఁడగుటచే, నప్పటికిఁ గ్రూరుఁడుగానగుపడినప్పటికిని, అధర్మములోఁబడి, పాపములనాచరించుచు, నశించు చున్నవారి, నుద్ధరించుటంబట్టి, వారికే , విశేషించి రక్షకుఁడగును.

తాత్పర్యము సులభము.

శ్లో ॥ రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్యచ రక్షితా
వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదేచ నిష్ఠితః. ౧౪

టీక ॥ సః=ఆరాముఁడు; స్వస్య=తనదగు ; ధర్మస్య=శరణాగత రక్షణరూప దర్మమునకు , లేక, క్షత్రియ ధర్మమునకు; రక్షితా=రక్షకుఁడు , సః=ఆరాముఁడు. స్వజనస్యచ=ఆశ్రితబాంధవాదిస్వీయజనమునకును; రక్షితా=రక్షకుఁడు. సః=ఆరాముఁడు, వేదవే

దాంగతత్త్వజ్ఞః, వేద=ఋగ్యజుస్సామాథర్వణములనెడు చతుర్విధ వేదములయొక్కయు, వేదాంగ=శిక్షావ్యాకరణ చ్ఛందోనిరుక్తజ్యోతిషకల్పము లనెడు షడ్విధ వేదాంగములయొక్కయు, తత్త్వ=సిద్ధాంతమును, జ్ఞః=ఎఱింగినవాఁడు. సః=ఆరాముఁడు; ధనుర్వేదేచ = ధనుర్విద్యను దెల్పు నుపవేదమందును, (చకారమనుక్తసముచ్చాయకము, ఇతరోప వేదముల గ్రహింపుచున్నది.) ఆయుర్వేదమునందును, గాంధర్వవేదమునందును, అర్థశాస్త్రమునందును; నిష్ఠితః=నిష్ఠగలవాఁడు.

విశేషార్థము.—ధర్మప్రవర్తకమాత్రుఁడు" ధర్మోపదేశసమయేజనాస్సర్వేపిపండితాః, తదనుష్ఠానసమయే మునయోపినపండితాః" (ధర్మోపదేశముసేయుటయందు సమస్త జనులును బండితులే; ఆధర్మమునను ష్ఠించు కాలమందు ఋషులు సగా పండితులు కాఁజాలరు.) అనిచెప్పఁబడినట్లు, పరులకుధర్మోపదేశము సేయసమర్థుఁడేకాని, తాననుష్ఠింపఁడు. రాముఁడట్లుకాదు అని తెల్పుటకుఁగా "రక్షితాస్వస్య ధర్మస్య" అని చెప్పఁ బడినది. లేక, "ధర్మ" మనఁగా, ధనువు. (స్వామ్యస్వభావసుకృతేష్వస్త్రీధర్మంతుకార్ముకే" అనిబాణనిఘంటువు.) తనదగు ధనువును రక్షించుకొను వాఁడు, (ధర్మశబ్దమురథాద్యుపలక్షకము.) యుద్ధమునందు, భంగములేకుండ, ధనువును, రథమును, సారథిని, గుఱ్ఱములను, ఛత్రకేతనములను, రక్షించుకొను నట్టియతిరథ శ్రేష్ఠుఁడనుట. లేక, శివధనుర్భంగ పరశురామ పరాజయాదులచేఁ దనదు శ్రీనారాయణావతారత్వరూపధర్మమునురక్షించు వాఁడనుట. "స్వజనస్యచరక్షితా" అని, జీవలోకరక్షణములో నే, స్వజనరక్షణమంతర్భూతమైనను, మఱలఁజెప్పుట, స్వజనులయందలిరామునకుఁగలయాదరాతిశయమునుసూచించుచున్నది. లేక, "దాస్యమైశ్వర్య భావేన జ్ఞాతీనాంచ కరోమ్యహం" (ఐశ్వర్యముగలిగినదనునహంకారముచేత, నేను, జ్ఞాతులకుసగా, దాస్యమును గలుగఁజేయు చు

న్నాను.) అని భగవంతునిచేఁ జెప్పఁబడినట్లు, బాంధవాదులఁ దిరస్కరించుట ప్రభువునకుసహజము, రామున కట్లు కాదు. "అత్యాసన్నంపరిత్యజ్యమునే దర్తత్తంతు నిష్ఫలం" (ఆశ్రితునిఁగాని బంధువునుగాని విడిచి, మునీశ్వరు కివ్వఁబడిన దియు నిష్ఫలమగును.) అనుశాస్త్రమురీతిని, ఆశ్రితబాంధవుల విశేషించిరక్షించు వాఁడనుట.

తాత్పర్యము సులభము.

శ్లో ॥ సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ స్స్మృతిమాన్ప్రతిభానవాన్
సర్వలోకప్రియ స్సాధు రదీనాత్మా విచక్షణః. ౧౫

టీక ॥ సః=ఆ రాముఁడు; సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః, సర్వ=సమస్తములైన, శాస్త్ర=ముందుచెప్పఁబడినవేదములు, వేదాంగములు, వీటికంటె వ్యతిరిక్తములగు, ధర్మశాస్త్రపురాణ మీమాంసాన్యాయసాంఖ్యవైశేషిక యోగశాస్త్రములయొక్క, అర్థ=అభిప్రాయముయొక్క, తత్త్వ = సిద్ధాంతమును, జ్ఞః=ఎఱింగినవాఁడు. సః=ఆ రాముఁడు; స్మృతిమాన్= జ్ఞప్తికలవాఁడు, అనఁగా, తెలిసినవిషయమునకెంతమాత్రము మఱవు లేని వాఁడనుట. సః=ఆ రాముఁడు; ప్రతిభానవాన్=వ్యవహారమునందు, ఉత్తరోత్తర యుక్తిస్ఫూర్తి కలవాఁడు. సః=ఆ రాముఁడు; సర్వలోకప్రియః, సర్వ=సమస్తములైన, లోక=జనములకును, ప్రియః=ఇష్టుఁడు, లేక, సర్వ=సమస్తములైన, లోక=జనములు, ప్రియః=ఇష్టులుగాఁగలవాఁడు. సః=ఆ రాముఁడు; సాధుః=తనకపకారము చేసిన వారికిని ఉపకారముసేయువాఁడు. సః=ఆ రాముఁడు; అదీనాత్మా, అదీన=అతిదుఃఖకాలమందైనను క్షోభమునొందనట్టి, ఆత్మా=మనస్సుకలవాఁడు. సః=ఆ రాముఁడు; విచక్షణః=వినువారికి హృదయానందముగ నానావిధములగు మాటలాడువాఁడు, లేక, ఆయాకాలములయందుఁ జేయవలసిన వాటిని జేయుటయందుఁ జతురుఁడు.

తాత్పర్యము సులభము.

శ్లో ॥ సర్వదాభిగత స్సద్భి స్సముద్ర ఇవ సింధుభిః
ఆర్య స్సర్వసమశ్చైవ సదైకప్రియదర్శనః. ౧౬

టీక ॥ సః=ఆ రాముఁడు ; సద్భిః=సత్పురుషుల చేత; సర్వదా= ఎల్లప్పుడు, అనఁగా, కాలత్రియమందును; సముద్రః=మున్నీరు; సింధుభిరివ = నదుల చేతంబోలె; అభిగతః=పొందఁబడిన వాఁడు. సః=ఆ రాముఁడు ; ఆర్యః=పొందఁ దగిన వాఁడు, లేక, పూజ్యుఁడు; సఏవ=ఆ రాముఁడే; సర్వసమః, సర్వ=జాతి వర్ణాది తారతమ్యములు లేక సమస్త భూతములయందును, సమః= వైషమ్యము లేనివాఁడు.(చకారము పాదపూరణార్థము "తుహిచస్మహవై పాద పూరణే" అనియమరము) సః=ఆ రాముఁడు; సదైకప్రియదర్శనః (ఇదిగోవిందరాజపారము.) సదా=ఎల్లప్పుడు, ఏక=ఒక టేరీతిగనుండు, ప్రియ=సంతోషజనకమగు, దర్శనః=చూడఁబడుట గలవాఁడు(దీనివిశేషార్థము, వాల్మీకిప్రశ్నశ్లోకములో వివరింపఁ బడినది.)సదైవ(ఇదిమహేశ్వరతీర్థీయపారము) =ఎల్లప్పుడును (ఏవకారమప్యర్థకము,) ప్రియదర్శనః, ప్రియ=సంతోషజనకమగు, దర్శనః=చూడఁబడుటగలవాఁడు.

విశేషార్థము.—"సర్వదా" అనుటవలన, "ఏలాగునదులకు సముద్రిని సేవించుటయందుఁ, గాలనియమమక్కఱ లేదో, ఆలాగు, భక్తులకు, రాముని సేవించుటయందుఁ, గాలనియమమక్కఱ లేదు" అని దెల్పఁబడినది. "అభిగతః" అను శబ్దముచే, "సత్పురుషులకుఁ బరమ ప్రాప్యస్థానమీ రాముఁ"డని సూచితమైనది. "సముద్రః సింధు భిరివ" అను నుపమానముచే, "నదులకు సముద్రుఁడు తప్ప వేఱుగతి లేనట్లు, సత్పురుషులకు రాముఁడు తప్ప గత్యంతరము లేదు" అని సూచింపఁ బడుచున్నది.

తాత్పర్యము సులభము.

శ్లో ॥ సచ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః
సముద్రఇవగాంభీర్యే ధైర్యేణహిమవానివ. ౧౭

టీక॥ సచ=ఆరాముఁడే(చకారమేవకారార్థకము.); సర్వగుణోపేతః, సర్వ=సమస్తములైనఅనఁగా, ఇప్పుడుచెప్పఁబడినవియుఁజెప్పఁబడనివియునైన, గుణ=గుణములతో, ఉపేతః=కూడికొనినవాఁడు. సః=ఆరాముఁడు; కౌసల్యానందవర్ధనః, కౌసల్యా=కోసలదేశపురాజుయొక్క పుత్రికయగు, కౌసల్యాదేవికి, ఆనంద=సంతోషమున్ను, వర్ధనః=కుమారుఁడగుటంబట్టి, వృద్ధిఁబొందించువాఁడు. సః=ఆరాముఁడు, గాంభీర్యే=తనహృదయములోనుండుదానిబైటికిఁ దెలియకుండఁజేయుటయందు, సముద్రఇవ = సముద్రుని వంటివాఁడు, అనగా, సముద్రుఁడు తనలోపలనుండురత్నాదులనుబైటికిఁదెలియకుండఁ జేయుచుండునట్లు, హృదయమునందుండుదానిబైటికిదెలియకుండఁజేయువాఁడనుట. సః=ఆరాముఁడు; ధైర్యేణ=దుఃఖ కారణమున్నను దుఃఖము నొందకయుండుటచేత, హిమవానివ=హిమవత్పర్వతమువంటివాఁడు, అనఁగా, "గిరయోవర్షధారాభిహన్యమానా నవివ్యథుః, అభిభూయ మానావ్యసనైర్యథాధోక్షజచేతసః" (ఏలాగు, నారాయణ భక్తులు, వ్యసనములచేఁ గొట్టుపడుచుండినను, దుఃఖింపరో; ఆలాగు, పర్వతములు, వర్ష ధారలచేఁ గొట్టు పడుచుండినను దుఃఖింపలేదు.) అనిచెప్పఁబడినట్లు వర్షము గురియుట, పిడుగులు పడుట మొదలగు దుఃఖము గలిగించు కారణము లున్నను, బర్వతములకు వ్యథకలుగదు; అట్టిపర్వతములనన్నింటికన్నను, హిమవంతుఁడు, పర్వతరాజుకావున, మిక్కిలిధైర్యశాలి; ధైర్యముచేనట్టి హిమవంతునితోసమానుఁడనుట.

తాత్పర్యము సులభము.

శ్లో॥ విష్ణునాసదృశోవీర్యే సోమవత్ప్రియదర్శనః
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయాపృథివీసమః. ౧౮.

టీక॥ సః=ఆరాముఁడు; వీర్య=పరాక్రమమునందు (దేనిచేదనకుక్షతి

గలుగ కుండఁబురుషుఁడు పరులజయించునో; అదివీర్యమనఁ బడును.) విష్ణునా=విష్ణుదేవునితో; సదృశః=సమానుఁడు; ఈరాముఁడే విష్ణువైనను, అవతారోపాధివలన, విష్ణువుకంటెభిన్నుఁడుకాఁబట్టి, "విష్ణువుతోసమానుఁ"డనిచెప్పఁ బడెనది. లేక, "వీర్యవిషయమందు, విష్ణువగు తనతోనే సమానుఁడు, ఉపమానములేనివాఁ" డనిమైనను జెప్పవచ్చును. సః=ఆరాముఁడు; సోమవత్=చంద్రుఁడువలె; ప్రియదర్శనః, ప్రియః=దుఃఖమునుబోఁగొట్టిసంతోషమును గలిగించునట్టి, దర్శనః=చూడఁ బడుట గలవాఁడు. సః=ఆరాముఁడు; క్రోధే=కోపమునందు; కాలాగ్నిసదృశః, కాల=ప్రళయకాలమందలి, అగ్ని=నిప్పుతో, సదృశః=సమానుఁడు. సః=ఆరాముఁడు; క్షమయా=ఓర్పుచే; పృథివీసమః, పృథివీ=భూమితో, సమః=సమానుఁడు, భూమి,తన్ను జనులు,త్రొక్కినను, ద్రవ్వినను, ఏమిచేసినను, ఓర్చియుండునట్లు, తనకెంతయపకారముచేసినను, అచేతనపదార్థమువలె మిన్నక యుండువాఁడనుట.

తాత్పర్యము సులభము.

శ్లో॥ ధనదేన సమస్త్యాగే సత్యేధర్మఇవాపరః. ౧౮।

టీక॥ సః=ఆరాముఁడు; త్యాగే=ఈవియందు; ధనదేన=కుబేరునితో; సమః=సమానుఁడు. ఇచ్చటధనద (ధనము నిచ్చువాఁడు) శబ్దప్రయోగముచేఁ గుబేరుని త్యాగవిశేషము సూచింపఁ బడినది. సః=ఆరాముఁడు, సత్యే=సత్య వచనమందు; అపరః=తనకన్న నితర మగు నుత్కృష్టవస్తువులేని, ధర్మఇవ=ధర్మదేవతవంటివాఁడు. (ఇదిగోవిందరాజమతము.) అపరః=రెండవదిమైన; ధర్మఇవ=ధర్మదేవతయట్లున్నవాఁడు. (ఇదిమహేశ్వరతీర్థమతము.)

తాత్పర్యము సులభము.

శ్లో॥ తమేవంగుణసంపన్నం రామం సత్యపరాక్రమం. ౧౯

జ్యేష్ఠం శ్రేష్ఠగుణైర్యుక్తం ప్రియం దశరథ స్సుతమ్
ప్రకృతీనాం హితైర్యుక్తం ప్రకృతి ప్రియకామ్యయా. ౨౦
యౌవరాజ్యేన సంయోక్తు మైచ్ఛ త్ప్రీత్యా మహీపతిః.

అవతరణిక.— నారదులవారు, మొదట; "ఇక్ష్వాకువంశప్రభవః" అనుశబ్దముచే, రామావతారమును జెప్పిరి, "మహావీర్యః,శత్రునిబర్హణః" అనుశబ్దములచేఁ, దాటకామారీచవధపరశురామ పరాజయముల, సూచించిరి, "లక్ష్మీవాన్, శ్రీమాన్" అనుశబ్దములచే, సీతాపరిణయమును దెలియఁజేసిరి, "ధనుర్వేదేచనిష్ఠితః" అను వాక్యముచేఁగౌశికునివలనరామునకుఁగలిగిన సమస్తాస్త్రప్రాప్తిని దెలిపిరి. ఇట్లు బాలకాండకథనుజెప్పి, యిప్పుడయోధ్యాకాండకథను జెప్పుచున్నారు.

టీక॥ మహీపతిః,మహీ=భూమికి,పతిః=ప్రభువైన; దశరథః=దశరథమహారాజు; ఏవం గుణసంపన్నం, ఏవంగుణ = ఇప్పుడుచెప్పఁబడిన గుణములతో, సంపన్నం = కూడుకొనినవాఁడును;సత్యపరాక్రమం, సత్య=వ్యర్థముకాని, పరాక్రమం = వీర్యముగలవాఁడును; జ్యేష్ఠం=తనకుమారులలోఁ బెద్దవాఁడును; శ్రేష్ఠగుణైః, శ్రేష్ఠ=ఉత్తమములైన, గుణైః=గుణములతో; యుక్తం = కూడియుండు వాఁడును; ప్రియం=తనదుప్రీతికిఁ బాత్రభూతుఁడను; సుతం=పుత్త్రుఁడును; ప్రకృతీనాం=ప్రజలకు;హితైః=సౌఖ్యముగలిగించుకార్యములతో; యుక్తం=కూడుకొనినవాఁడును; తం=ప్రసిద్ధుఁడునగు;రామం=రాముని; ప్రకృతిప్రియకామ్యయా, ప్రకృతి=ప్రజలకు;ప్రియకామ్యయా=ప్రీతిసేయునిచ్ఛచేతను;ప్రీత్యా = ప్రేమచేతను,యౌవరాజ్యేన = యువరాజుదొరతనముతో;సంయోక్తుం=కూర్చుటకు;ఐచ్ఛత్ =కోరెను.

దశరథ మహారాజు, ప్రజలకు హితముసేయఁదలంచి, సమస్తగుణసంపన్నుఁడై, యమోఘంబగు పరాక్రమముగలిగి వెలుఁగుచు, నె

ల్లప్పుడును బ్రజలకు హితము సేయు చున్న ప్రియుఁడైన తన జ్యేష్ఠపుత్రుఁడగు రాముని యువరాజుగాఁ జేయఁగోరెను; అని తాత్పర్యము.

తస్యాభిషేకసంభారా న్దృష్ట్వా భార్యాథ కైకయీ. ౨౧
పూర్వ న్దత్త వరా దేవీ వరమేన మయాచత
వివాసనంచ రామస్య భరతస్యాభిషేచనమ్. ౨౨

టీక ॥ అథ=అటుపిమ్మట ; తస్య=ఆరామునియొక్క; అభిషేకసంభారాన్, అభిషేక=రాజ్యాభిషేకముయొక్క, సంభారాన్=ఉపకరణములను; దృష్ట్వా=చూచి, (తెలిసికొనియనుట.); భార్యా=పత్నియు; దేవీ= రాణిగారునైన; పూర్వం= మునుపు; దత్తవరా, దత్త=ఇవ్వఁబడిన; వరా=వరములు గలది(గనుకనే) కైకయీ=కేకయ రాజపుత్రి; ఏనం=ఈదశరథుని; రామస్య=రామునకు; వివాసనం=వనవాసముచేయించడమును; భరతస్య=భరతునకు; అభిషేచనంచ= రాజ్యాభిషేకము సేయించడమును; వరం=(ఈ)వరమును; అయాచత=యాచించెను.

దశరథుని రాణులలో నొకతెయగు కైకయి, రామాభిషేకమునకుగా నేర్పరిచిన యుపకరణములఁ దెలిసికొని, తనకుమున్ను దశరథుఁడు రెండువరములిచ్చియున్నందున, "అందొకవరమునకు, రామునరణ్యమునకుఁబంపవలెను; రెండవవరమునకు, భరతుని రాజ్యాభిషిక్తునిఁగాఁ జేయవలె"నని దశరథుని యాచించెను; అని తాత్పర్యము.

స సత్య వచనాచ్చైవ ధర్మపాశేన సంయతః
వివాసయామాస సుతం రామం దశరథః ప్రియమ్. ౨౩

టీక॥ రాజా=సర్వజనులనురంజిల్లఁజేయునట్టి; సః=ఆ, (పూర్వము రామునకు రాజ్యమిచ్చిన); దశరథః=దశరథమహారాజు; సత్యవచనాత్ =సత్యవాక్యమువలన; ధర్మపాశేన; ధర్మ = ధర్మమనెడు,

పాశేన=త్రాటిచే; సంయతః=కట్టఁబడినవాఁడై; ప్రియం = ప్రేమార్హుఁడైన; సుతం= కుమారుఁడగు; రామం=రాముని; వివాసయామాస=అరణ్యమునకంపెను.

సమస్తజనులనుసంతోషింపఁజేయుచుండు నాదశరధమహారాజు, సత్యవాక్యుఁడు కావున, పూర్వము తానుగైకకిచ్చినవరద్వయము నం జేసి, ధర్మమునతిక్రమింపలేక, తనకుఁ బ్రియపుత్రుఁడైనను, రాముని, వనమునకుఁ బంపెను; అని తాత్పర్యము.

స జగామ వనం వీరః ప్రతిజ్ఞా మనుపాలయన్
పితుర్వచననిర్దేశా త్కైకేయ్యాః ప్రియకారణాత్. ౨౮

టీక ॥ వీరః = పరాక్రమశాలియగు; సః = ఆరాముఁడు; కైకేయ్యాః= కైకయొక్క; ప్రియకారణాత్ =ప్రీతిహేతువైన; పితుః= తండ్రియొక్క; వచననిర్దేశాత్, వచన= మాటయనెడు, నిర్దేశాత్ =ఆజ్ఞవలన; ప్రతిజ్ఞాం=తనయొక్క ప్రతిజ్ఞను; అనుపాలయన్ =రక్షింపుచు; వనం= అరణ్యమునుగూర్చి; జగామ=వెళ్లెను.

ఆరాముఁడు, అతిపరాక్రమశాలియైనను, గైకేయికి సంతోషముగలిగించుటకై, తండ్రిగారు మాటమాత్రముచెప్పినంతనె, తాను "తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞోయదభికాంక్షితమ్, కరిష్యే ప్రతిజానే చ రామోద్వి ర్నాభిభాషతే" (తల్లీ! రాజుగారికేదియిష్టమో; ఆమాటనుజెప్పుము; దానిఁజేసెదను; ఆప్రకారము ప్రతిజ్ఞ చేయుచున్నాను; రాముఁడు రెండువిధములుగమాటలాడువాఁడుకాఁడు) అనికైకేయీసమ్ముఖమునఁ జేసిన ప్రతినను చాలింపుచు, వనముఁగూర్చి వెళ్లెను; అని తాత్పర్యము.

తం వ్రజంతం ప్రియోభ్రాతా లక్ష్మణో నుజగామహ
స్నేహాద్వినయ సంపన్న స్సుమిత్రానంద వర్ధనః. ౨౯
భ్రాతరందయితో భ్రాతు స్సౌభ్రాత్ర మనుదర్శయన్.

టీక ॥ ప్రియః= రామునియందుసహజప్రీతిగలవాఁడును; భ్రాతా=రామునకనుజుఁడును; వినయసంపన్నః, వినయ = కైంకర్యముతో, సంపన్నః=కూడియుండువాఁడును; సుమిత్రానందవర్ధనః, సుమిత్రా = సుమిత్రాదేవికి, ఆనంద= సంతోషమును, వర్ధనః=వృద్ధిఁబొందించువాఁడును; భ్రాతుః = అగ్రజుఁడగు రామునకు; దయితః=ఇష్టుఁడును; అగు; లక్ష్మణః= లక్ష్మణుఁడు; సౌభ్రాత్రం = మంచితోడఁబుట్టుదనమును; అనుదర్శయన్=చూపుచు; వ్రజంతం = అరణ్యమునకుఁబోవుచున్న; తం = ఆ; భ్రాతరం= అగ్రజుఁడగు రాముని; స్నేహాత్ = భక్తివలన; అనుజగామ= వెంబడించి వెళ్లెను; హ=ఆశ్చర్యము ("హవిస్మయే విషాదేచ" అని బాణ నిఘంటువు).

ఆ రాముఁ డరణ్యమునకు వెళ్లుచుండఁగా, నతని కిష్టుఁడును అనుజుఁడునగు సుమిత్రా పుత్రుఁడై న లక్ష్మణుఁడు, రామునియందు సహజ ప్రీతిగలవాఁడు కావున, నతనికిఁ గైంకర్యము సేయఁగోరి, మంచి తోడఁబుట్టుదనమును జనులకుఁ దెలియఁజేయుచు, భక్తితో వెంబడించెను; అని తాత్పర్యము.

రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణ సమా హితా. ౨౭
జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా
సర్వలక్షణ సంపన్నా నారీణా ముత్తమా వధూః. ౨౮
సీతాప్యనుగతా రామం శశినం రోహిణీ యథా.

టీక॥ రామస్య= రామునకు; దయితా=ఇష్టురాలును; భార్యా=పత్నియును; ప్రాణసమా, ప్రాణ =ప్రాణములతో, సమా=సమానురాలును; నిత్యం=ఎల్లప్పుడును; హితా=హితము సేయునదియును; జనకస్య=జనకమహారాజు యొక్క; కులే=యజ్ఞగృహమునందు; జాతా=పుట్టినదియు; నిర్మితా= సుందోపసుంద మోహనార్థము దేవతలచే నిర్మింపఁబడిన; దేవమాయేవస్థితా ("స్థితా" అనునది

యధ్యాహృతము.) తిలోత్తమయట్లున్నదియు; లేక, నిర్మితా=అమృతమధనానంతరము రాక్షసమోహనార్థముతనచే నిర్మింపఁబడిన; దేవమాయేవస్థితా=విష్ణుదేవునియొక్క మాయామోహినీరూపమువలెనున్నదియు; సర్వలక్షణసంపన్నా,సర్వ=సమస్తములైన, లక్షణ=సాముద్రికమందుఁజెప్పఁబడినశుభలక్షణములతో, సంపన్నా=కూడినదియు;నారీణాం = స్త్రీలలోపల;ఉత్తమా=శ్రేష్ఠురాలును; వధూః = దశరథునికోడలునగు;సీతాపి=సీతాదేవియును; ("సీతా లాంగలపద్ధతిః."లాంగలపద్ధతిలోఁ బుట్టినదికాఁబట్టి."సీత" యనిపేరు కలిగినది.) శశినం=చంద్రుని; రోహిణీయథా = రోహిణీదేవివలె; అనుగతా=వెంబడించెను.

రామునకుఁ, బ్రియభార్యయుఁ బ్రాణసమానురాలును ఎల్లప్పుడు హితకారిణియునై, జనకకులమందుఁబుట్టితిలోత్తమవలెసర్వోత్తర సౌందర్యశాలినియై,సర్వలక్షణములునుగలిగియుత్తమవనితయై వెలింగడుసీతాదేవియును,చంద్రునిరోహిణి వెంబడించునట్లు, రాముని, వెంబడించెను;అనితాత్పర్యము.

పౌరైరనుగతో దూరం పిత్రా దశరథేనచ. ౨౮

టీక ॥ సః=ఆరాముఁడు; పౌరైః= అయోధ్యాపురవాసులగుజనులచేతను,పిత్రా=తండ్రియైన; దశరథేనచ=దశరథమహారాజుచేతను; దూరం=దవ్వు; అనుగతః=వెంబడింపఁబడెను.

"పునర్విశ్లేషభీరుత్వంపరమాభక్తిరుచ్యతే" (మఱలవియోగమునందుభయముగలుగుట "పరమభక్తి" యనిచెప్పఁబడుచున్నది.)అన్నట్లు, పరమభక్తివలన, బాలవృద్ధావిశేషముగ,సమస్తపౌరులును, దశరథుఁడును, దూరమువఱకు,రాముని వెంబడించిరి;అనితాత్పర్యము.

శృంగిబేరపురే సూతం గంగాకూలే వ్యసర్జయత్
గుహమాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియం. ౨౯
గుహేన సహితోరామో లక్ష్మణేనచ సీతయా.

టీక ॥ ధర్మాత్మా, ధర్మ = ఆశ్రిత రక్షణాది ధర్మములే; ఆత్మా = స్వభావముగాఁగల; రామః= రాముఁడు; గంగాకూలే, గంగా=గంగానదియొక్క, కూలే=తీరమందు; స్థితే(అధ్యాహృతము)= ఉండునట్టి; శృంగిబేరపురే=శృంగిబేరమను పట్టణమందు, స్థితం (అధ్యాహృతము) = ఉన్నట్టి, నిషాదాధిపతిం, నిషాద = బోయవాండ్రకు, అధిపతిం = ప్రభువైన; ప్రియం= తనయందుఁబ్రీతిగల; గుహం=గుహుని; ఆసాద్య= చేరి; గుహేన= గుహునితోను; లక్ష్మణేన = లక్ష్మణునితోను; సీతయాచ=సీతాదేవితోను; సహితః=కూడుకొనినవాఁడై; సూతం= సారథియైనసుమంత్రుని; వ్యసర్జయత్ =అయోధ్యకనిచెను.

ధర్మాత్ముఁడైన రాముఁడు, గంగాతీరమందున్న శృంగిబేరమనెడుపట్టణమందు బోయ వాండ్రకుఁ బ్రభువైనగుహునిఁజేరి, సీతాలక్ష్మణగుహులతోఁ గూడికొనినవాఁడై తనసారథియగు సుమంత్రు నయోధ్యకుఁబంపెను; అనితాత్పర్యము.

అర్థాంతరము.—ధర్మాత్మా, ధర్మ= ఆశ్రితరక్షణాదిధర్మములే, ఆత్మా = స్వభావముగాఁగలరాముఁడు; గంగాకూలే; స్థితే; శృంగిబేరపురే; స్థితం; నిషాదాధిపతిం; ప్రియం; గుహం; ఆసాద్య; సూతం; వ్యసర్జయత్, సః=ఆ; రామః= రాముఁడు; లక్ష్మణేన=లక్ష్మణునితోను; సీతయాచ= సీతతోను; సహ (అధ్యాహృతము)=కూడ; గుహేన= గుహునిచే; హితః=పంపఁబడెను, అనగా, గంగానదినిదరింపఁజేయఁబడెననుట.

ధర్మాత్ముఁడైన రాముఁడు, గంగాతీరమందున్న శృంగిబేరమనెడు పట్టణమందు, బోయవాండ్రకుఁబ్రభువగు గుహునిఁజేరి, తనసారథియగుసుమంత్రుని నయోధ్యకుఁబంపెను. ఆగుహుఁడు, రాముని, సీతాలక్ష్మణులతోఁగూడ, గంగానదిని, దాఁటించెను; అని తాత్పర్యము.

విశేషార్థము.— శృంగిణాం, బేరాణి, యస్మిన్, తత్, శృంగిబేరం; జింకలుమొదలగుకొమ్ములుగలమృగములయొక్క, కృత్రిమశరీరములుఅనఁగా వానివలెఁజేయఁబడి

నప్రతిమలు,ఎచ్చటనుండునో,అది, "శృంగిబేరం" అనఁబడును - అనఁగా,తమవంటి ప్రతిమలను జూచి యవియు మృగములేయనుభ్రాంతి చే,వానివద్దకురాఁగా,జింకలుమొదలగుమృగములను బట్టుకొనవచ్చునని,నిర్మింపఁబడిన, మృగములవలెనుండు, ప్రతిమలుగలదియనుట. ఈశబ్దముచే, నాపట్టణమునందుండువారల సాధారణవృత్తి, జీవహింసయని,సూచితమగుచున్నది. గుహతీతి,గుహః("గుహూసంవరణే"అనుధాతువునఁబుట్టినది.) పరద్రవ్యాదులను, దాఁచువాఁడుకాఁగా, గుహుఁడనంబడును - అనఁగాఁబరులహింసించి ధనముమొదలగుపదార్థములఁజూఅగొని, వానినితరులకుఁ దెలియకుండ దాఁచువాఁడనుట.

గుహుఁడు,స్వవృత్తిచేతనుదనకులవృత్తిచేతను,అతినీచుఁడైనను, దనయందుఁబ్రేమగలిగి వర్తించిన మాత్రమున నే, వానియందు, రాముఁడు,సీతాలక్ష్మణుల యందుంబలే, స్నేహమునుంచెను; అనుటచే, "ఆశ్రితుఁడెవ్వఁడైనను, ఆశ్రయణమాత్రిననే, రాముఁడు వానిరక్షించు"ననిసూచితమగుచున్నది.

తేవనేన వనంగత్వా నదీస్తీర్త్వా బహూదకాః. ३०
చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్
రమ్యమావసథం కృత్వా రమమాణా వనేత్రయః. ३౧
దేవగంధర్వ సంకాశా స్తత్ర తేన్యవస న్సుఖమ్

టీక ॥ తే=ఆసీతారామలక్ష్మణులు;వనేన=వనమునుండి (పంచమ్యర్థమందు,తృతీయ); వనం=వనమును;గత్వా=పొంది; బహూదకాః; బహు = అధికమగు, ఉదకాః=జలముగల;నదీః= నదులను; తీర్త్వా=దాఁటి;అను= అటువెనుక;భరద్వాజస్య=భరద్వాజమహర్షియొక్క;శాసనాత్ = ఆజ్ఞవలన;చిత్రకూటం=చిత్రకూటమనెడుపర్వతమును;ప్రాప్య=పొంది;రమ్యం=మనోహరమైన;ఆవసథం=పర్ణమయమగు గృహమును; కృత్వా=నిర్మించికొని; తే= ఆ,అనఁగా,నయోధ్యలో సమస్తసుఖములననుభవించిన;త్రయః=సీతారా

మలక్ష్మణులుముగ్గురును; తత్ర=
ఆచిత్రకూట పర్వతము నందుండె
డి; వనే= వనమునందు; రమమా
ణాః=క్రీడింపుచు; దేవగంధర్వసం
కాశాః, దేవ=దేవతలతోను;గంధ
ర్వ = గంధర్వుల తోను, సంకా
శాః=సమానులై;సుఖం=సుఖము
గా;న్యవసన్=ఉండిరి.

ఆసీతారామలక్ష్మణులు, ఒక
వనమునుండి మఱియొక వనముఁజే
రుచు,గొప్ప గొప్పనదులు దాఁటు
చు,భరద్వాజమహామునినిసందర్శిం
చి,వారియాజ్ఞచేఁ,జిత్రకూటపర్వ
తమునకుఁబోయి, యందొక పర్ణ
శాల నిర్మించికొని, యయోధ్య
లోసమస్తసుఖముల ననుభవించిన
వారైనను, వారుముగ్గురు, నాచి
త్రకూటవనములో, దేవగంధర్వస
మానులై, యెంత మాత్రమునుదుః
ఖములేక,సుఖముగాఁ గ్రీడింపుచుం
డిరి;అనితాత్పర్యము.

అర్థాంతరములు.—తే=ఆ,అ
నఁగా,అయోధ్యలోసమస్తసుఖము
ల ననుభవింపుచుండిన; త్రయః=సీ
తారామలక్ష్మణులుముగ్గురు; అవ
నేన=పరస్పరరక్షణముచే; వనం=
అరణ్యమును; గత్వా = పొంది;బ
హూదకాః;నదీః;తీర్త్వా;అను;భ
రద్వాజస్య; శాసనాత్; చిత్రకూ
టం;ప్రాప్య;రమ్యం; ఆవసథం;కృ
త్వా;తత్ర;వనే; తే=ఆఅయోధ్య
లో నుండు వారుగానే; రమమా
ణాః = క్రీడారసమనుభవింపుచు;
(సీతారాములు,వనవిహారాదిక్రీడ
లననుభవింపుచు; లక్ష్మణుఁడు, త
త్సేవారసము ననుభవింపుచు, అ
నుట.) దేవగంధర్వసంకాశాః, దే
వ=లక్ష్మీనారాయణులతోను,(దే
వీచదేవశ్చ=దేవౌ, పుమాన్ స్త్రి
యేత్యేకశేషః)గంధర్వ=ఎల్లప్పు
డుసామగానపరుఁడగుజీవన్ముక్తుని
తోను (గానం ధారయతీతిగంధ
ర్వః; గానమును,ధరింపుచుండును,
అనఁగాబాడుచుండును, కావున,
గంధర్వుఁడనఁబడును) ; సంకా
శాః = సమానులై,(సీతారాము
లు, లక్ష్మీనారాయణులతోను, ల
క్ష్మణుఁడుసామగాన పరుఁడగుజీ
వన్ముక్తునితోను సమానులై,యను
ట.); సుఖం;న్యవసన్

ఆసీతారామలక్ష్మణులుముగ్గు
రును,బరస్పరమురక్షించుకొనుచు,

అరణ్యమునఁ బ్రవేశించి, నదుల దాఁటుచు, భరద్వాజాజ్ఞవలనఁ జిత్రకూటపర్వతమునకుఁబోయి, యందొక పర్ణశాల నేర్పఱిచి కొని, తామయోధ్యలో నెట్లుసుఖముగా నుందురో, అట్లే, సుఖముగానుండిరి; సీతారాములు, ఆచిత్రకూటవనమందుఁ గ్రీడింపుచు, లక్ష్మీనారాయణులుం బలెఁ బ్రకాశింపుచుండిరి. లక్ష్మణుండును, సాక్షాల్లక్ష్మీనారాయణరూపులగు, సీతారాముల సేవింపుచు, సామగానపరాయణుఁడగు జీవన్ముక్తునియట్లు సంతసంబునఁ బొదలుచుండెను; అని తాత్పర్యము.

తేః త్రయః, అవనేనసహ ("సహ" అనునదియధ్యాహృతము.) స్థలప్రదేశముతోఁగూడ; వనం= అరణ్యమును; గత్వా=పొంది (అనఁగా, స్థలప్రదేశమును, అరణ్యమును, బొంది, యనుట.); బహూదకాః; నదీః; అను; తీర్త్వా; భరద్వాజస్య; శాసనాత్; చిత్రకూటం, ప్రాప్య; రమ్యం; ఆవసథం; కృత్వా; తే=వనవాసులుగానే, అనఁగా, నాగరికులుగానుండి నూతనముగా వనవాసులైనవారి కుండునట్టి వైలక్షణ్యములేక, యెప్పటికిని వనములోనే వాసముచేయుచుండు వారుగానే యనుట; తత్ర; వనే; రమమాణాః; దేవగంధర్వసంకాశాః; సుఖం; న్యవసన్,

ఆ సీతారామలక్ష్మణులు, మువ్వురును, స్థలప్రదేశములకును వనప్రదేశములకునుం బోవుచు, భరద్వాజాజ్ఞవలనఁ జిత్రకూటపర్వతమునకుఁబోయి, యందుఁ బర్ణశాలనిర్మించికొని, నగరములో సుఖముల ననుభవించిన వారమను భేదమెంతమాత్రములేక, వనవాసులెట్లుసంతోషముతోనుందురో, ఆలాగుసంతోషముగలవారై యాచిత్రకూటవనములో విహరింపుచు, దేవగంధర్వ సమానులై, సుఖముగానివసించిరి; అని తాత్పర్యము.

తేః త్రయః; తే వనేన= క్రీడచే, ("తేవృ దేవనే" అనుధాతువునఁ బుట్టినది.) వనం=అరణ్యమును; గత్వా=ప్రవేశించి; (శేషము-పై).

ఆ సీతారామలక్ష్మణులు క్రీడించునట్లుసుఖముగానరణ్యముఁ బ్రవేశించి, నదులనుదాఁటుచు, భరద్వాజాజ్ఞవలనఁ జిత్రకూట పర్వతమున

కుంబోయి, యచ్చటం బర్ణశాల నిర్మించికొని, ఆవనమందుఁ గ్రీడింపుచు, దేవగంధర్వసమానులై, సుఖముగా నుండిరి. అని తాత్పర్యము.

తే;త్రయః; తేవ నేన=కాలినడకచే ("తేవృ దేవనే" అనుధాతువునఁబుట్టినది.) వనం=అరణ్యమును; గత్వా=ప్రవేశించి;(శేషము,పై.)

ఆసీతారామలక్ష్మణులు పాదసంచారముచేనరణ్యమును బ్రవేశించి. (శేషము,పై.); అని తాత్పర్యము,

విశేషార్థము.—భరద్వాజః=బిభ్రత్,వాజః, "వాజః" అనఁగా, "ప్రజ" యని వేదమందుఁ జెప్పఁబడి యున్నది; ప్రజలభరించువాఁడు కాఁగా భరద్వాజుఁడనుట; లేక, "వాజః" అనఁగా "రేతస్సు" అని వేదమందుఁ జెప్పఁబడియున్నది, రేతస్సును భరించినవాఁడు, నిత్యబ్రహ్మచారియనుట.

చిత్రకూటం గతే రామే పుత్రశోకాతుర స్తథా. ౩౭
రాజా దశరథ స్స్వర్గం జగామ విలపన్ సుతమ్

టీక ॥ రామే=రాముఁడు, తథా(ఇదిగోవిందరాజపాఠము)= అట్లు,అనఁగా,ఉక్తప్రకారమున; చిత్రకూటం = చిత్రకూటపర్వతమునుగూర్చి;గతే=పోయిన వెనుక;పుత్రశోకాతురః,పుత్ర=కుమారునిగుఱించిన, శోక = దుఃఖముచే, ఆతురః=పీడింపఁబడిన; రాజా=ప్రభువైన; దశరథః=దశరథుఁడు;సుతం=కుమారునిఁగూర్చి; విలపన్=ఏడ్చుచు; స్వర్గం=దేవలోకమును; జగామ=పొందెను.

రామే,చిత్రకూటం; గతే; పుత్రశోకాతురః; తదా (ఇదిమహేశ్వరతీర్థపాఠము) = అప్పుడు; రాజా;దశరథః;(శేషము.పై.)

రాముఁడుచిత్రకూటమునకు వెళ్లినవెనుక,దశరథమహారాజు, పుత్రశోకముచేఁబీడితుఁడై, పుత్రునిఁగూర్చి యేడ్చుచు,మృతిఁబొందెను; అని తాత్పర్యము.

మృతేతు తస్మిన్ భరతో వసిష్ఠ ప్రముఖై ర్ద్విజైః. ౩౩
నియుజ్యమానో రాజ్యాయ నైచ్ఛ ద్రాజ్యం మహాబలః

టీక॥ తస్మిన్=ఆ; దశరథే=దశరథమహారాజు; మృతే=మృతిఁబొందినవెనుక; మహాబలః; మహత్=గొప్పదగు,బలః = శక్తిగల, అనఁగా,రాజ్యముసేయసమర్థుఁడైన;భరతస్తు=భరతుఁడును (తుకారమప్యర్థకము) ; వసిష్ఠప్రముఖైః;వసిష్ఠ=వసిష్ఠమహామునిః; ప్రముఖైః = మొదలుగాఁగల; ద్విజైః=బ్రాహ్మణులచేత; రాజ్యాయ=రాజ్యముసేయుటకు; నియుజ్యమానః=నియోగింపఁబడినవాఁడైనను;రాజ్యం = దొరతనమును; నైచ్ఛత్ =కోరలేదు.

దశరథుఁడుమృతిఁబొందినవెనుక,భరతుఁడు, రాజ్యముసేయసమర్థుఁడైనను,వసిష్ఠాదులుగూడఁదన్నురాజ్యముసేయుమని నియోగించినను,రామునియందలి గౌరవముచే,రాజ్యమునకొప్పలేదు; అని తాత్పర్యము.

స జగామ వనం వీరో రామపాద ప్రసాదకః. ౩౪

టీక ॥ వీరః=రాగద్వేషాదిజయముగల;సః=ఆభరతుఁడు; రామపాదప్రసాదకః; రామపాద=పూజ్యుఁడైన రాముని యొక్క, ("పూజ్యేతు పాదనామాంకః" అనియమరము.), ప్రసాదకః= ప్రసన్నుఁగాఁజేయువాఁడై;(అనఁగా, పూజ్యుఁడైన రాముని, ప్రసన్నునిగాఁజేయుటకనుట.) లేక, రామ=రామునియొక్క, పాద=చరణములయొక్క,ప్రసాదకః=ప్రసన్నములుగాఁజేయువాఁడై, (రామునిచరణములఁ బ్రసన్నములుగాఁజేయుటకనుట.) వనం=అరణ్యమును; జగామ=పొందెను.

రాగద్వేషాదులను జయించినయాభరతుఁడు, రాముని ప్రసాదమునుగోరి, యరణ్యమునకు వెళ్లెను; అని తాత్పర్యము.

గత్వాతు సుమహాత్మానం రామంసత్య పరాక్రమమ్
అయాచ ద్భ్రాతరం రామ మార్యభావ పురస్కృతః. ౩౫

టీక॥సః(అధ్యాహృతము)=ఆభరతుఁడు;ఆర్యభావ పురస్కృతః, ఆర్యభావ=వినయముచే,పురస్కృతః=పూజింపఁబడినవాఁడై(వినయముగలిగియుండుటంబట్టి జనులచేఁ బూజింపఁబడినవాఁడై యనుట); లేక,పూజింపఁబడిన వినయముగలవాఁడై (విశేషణోత్తర పదకర్మధారయము, వినయముగలవాఁడై యనుట.);సుమహాత్మానం, సుమహాత్=మిక్కిలిపూజ్యమైన,ఆత్మానం=హృదయముగల వాఁడును;సత్యపరాక్రమం,సత్య = నిజమునందు,పరాక్రమం= దృఢవ్రతముగలిగినవాఁడును; అగు; రామం=రాముని;గత్వా=పొంది; (తుశబ్దము పాదపూరణార్థము), భ్రాతరం=తోడంబుట్టువగు; రామం=రాముని; అయాచత్ (తనయభీష్టమును)=ప్రార్థించెను.

సః,ఆర్యభావపురస్కృతః;సుమహాత్మానం; సత్యపరాక్రమం;రామం=సంతోషజనకుఁడును; భ్రాతరం= తోడంబుట్టువును; అగు; రామం=రాముని;గత్వా= పొంది;అయాచత్;

ఆభరతుఁడు, వినయముతోఁ గూడుకొనినవాఁడై, పూజ్యంబగు హృదయమును ఎడతెగనిసత్యవ్రతమునుగలతనభ్రాతయగు రామునిఁ జేరి,యిట్లని, ప్రార్థించెను; అని తాత్పర్యము.

త్వమేవరాజా ధర్మజ్ఞ ఇతి రామం వచోఽబ్రవీత్.

అ,ఆప్రార్థనమునేవివరింపుచున్నారు.

టీక ॥ సః=ఆభరతుఁడు,ధర్మజ్ఞః,ధర్మ=జ్యేష్ఠుఁడుండఁగాఁగనిష్ఠుఁడు రాజ్యార్హుఁడుకాఁడనుధర్మమును; జ్ఞః=ఎఱింగి యున్నట్టి; త్వమేవ=నీవే; రాజా=రాజవు;ఇతి=ఇట్లని; రామం=రామునిఁగూర్చి;వచః=వాక్యమును;అబ్రవీత్=పలికెను.

"నీవుసమస్త ధర్మములనెఱింగినవాఁడవు, జ్యేష్ఠుఁడుండఁగాఁగనిష్ఠుఁడు రాజు గాఁగూడదనుధర్మము నీకుం దెలిసియే యున్నది, కాఁబట్టినీవే రాజు, నీవుతప్పమఱియెవ్వరును, రాజు కాఁదగరు" అనిభరతుఁడు రామునితోఁ జెప్పెను; అని తాత్పర్యము.

రామోఽపిపరమోదారస్సుముఖస్సుమహాయశాః. ౩౬
నచైచ్ఛత్పితురాదేశాద్రాజ్యంరామో మహాబలః.

టీక॥ రామోఽపి=సమస్తజనుల నురంజిల్లఁజేయునట్టివాఁడైనను; పరమోదారోఽపి (అపిశబ్దమన్నివిశేషణములయందునను వర్తించును)=స్వసాయుజ్యము మొదలగు సర్వాభీష్టముల నిచ్చువాఁడైనను; సుముఖోఽపి=యాచకలాభముచేఁ, బ్రసన్నమగుముఖముగలవాఁడైనను; సుమహాయశాః, సుమహాత్=మిక్కిలి గొప్పదగు, యశాః= దానాతిశయమునఁగలిగిన, కీర్తిగలవాఁడైనను,; మహాబలః=ఒకబాణముచేసమస్తరాక్షసుల సంహరించునంతబలముగలవాఁడైనను, లేక, ఆశ్రితుల యభీష్టమును బూర్ణముసేయసమర్థుఁడైనను; రామః=రాముఁడు; పితుః=తండ్రియొక్క; ఆదేశాత్= ఆజ్ఞవలన; రాజ్యం = దొరతనమును; నైచ్ఛత్=కోరలేదు, చకారముచే "పితృనియోగకాలానంతరము, కోరెను" అనిసూచితమగుచున్నది.

రాముఁడు, తాను, సమస్తజనులకుసంతోషము నేగలిగించువాఁడైనను, తనయొక్క సాయుజ్యము మొదలగుసమస్తాభీష్టముల నాశ్రితులకిచ్చువాఁడైనను, "యాచితో మోదమాదత్తే వాంఛితాదధికప్రదః, అనుసృత్యప్రియంబ్రూతే తస్మాత్కర్ణోఽధికోఽర్జున" (యాచింపఁబడినవాఁడై సంతోషమునొందును; కోరినదాని కన్న నెచ్చుగానిచ్చును; అనుసరించి ప్రియముగా మాటలాడును; కాఁబట్టి, ఓఅర్జునుఁడా! కర్ణుండధికుఁడు.) అని భారతమునందున్నట్టు యాచనమాత్రముననే "యాచకులమనోరథమును బూర్ణముచేయునంత భాగ్యము నాకుఁ గలిగెనుగదా!" అనిసంతోషమునొందువాఁడైనను, "నహ్యర్థినః కార్యవశాదుపేతాః కకుత్థ్సవంశేవిము

ఖాః ప్రయాంతి" (కకుత్థ్సవంశము నందుఁ, గార్యార్థులై వచ్చినయాచకులు, విముఖులై పోవరుగదా.) అనివిష్ణుపురాణమునందున్నట్లు, పురాణప్రసిద్ధమైన దానజనితమగు కీర్తిఁగలవాఁడైనను, ఆశ్రితాభీష్టములనెఱవేర్చుటకు సమర్థుఁడైనను, భరతుఁడెంత ప్రార్థించినను, దండ్రిపనుపునంజేసి, రాజ్యమునుగోరలేదు. అని తాత్పర్యము.

పాదుకేచాస్య రాజ్యాయ న్యాసందత్వా పునఃపునః. ౩౭
నివర్తయామాస తతో భరతం భరతాగ్రజః

టీక॥ చ=మఱియేమన్నను; భరతాగ్రజః, భరత=భరతునకు, అగ్రజః=అన్నయగు రాముఁడు; రాజ్యాయ=రాజ్యము సేయుటకు; అస్య=ఈభరతునకు; పాదుకే=తన పావకోళ్లను; న్యాసం=ఇల్లడగా, దత్వా=ఇచ్చి; తతః=ఆవెనుక; పునఃపునః = మాటిమాటికిని; భరతం= భరతుని; నివర్తయామాస=మఱలించెను.

అయితే, రాముఁడు, రాజ్యము సేయుటకుఁగాఁదన పాదుకలనుభరతునకుఁదానువచ్చునంతవఱకును దనకుఁ బ్రతినిధిగానుంచికొనుమని యిచ్చి, అటువెనుకనతనినయోధ్యకుఁ బొమ్మని నానావిధముగాబోధించిపంపెను; అని తాత్పర్యము.

సకామ మనవాప్యైవ రామపాదా వుపస్పృశన్. ౩౮
నందిగ్రామేఽకరో ద్రాజ్యం రామాగమన కాంక్షయా

టీక॥ సః=ఆభరతుఁడు, కామం=మనోరథమును; అనవాప్యైవ=పొందకనే; రామపాదౌ, రామ=రామునియొక్క, పాదౌ(పాదశబ్దము పాదుకోపలక్షకము.)= పావకోళ్లను; ఉపస్పృశన్= సేవింపుచు; రామాగమన కాంక్షయా, రామ=రామునియొక్క, ఆగమన=వచ్చుటయందలి, కాంక్షయా=కోరికతో, రాజ్యం=రాజకార్యమును; నందిగ్రామే= అయోధ్యకుసమీపమందుండు నందిగ్రామ

మనెడుగ్రామమందు; అకరోత్=చేసెను.

ఆభరతుఁడు, రామ కైంకర్యముసేయవలెనను తన మనోరథమునుబొందకయే వెళ్లి, రామపాదుకలను సేవింపుచు, రాముఁడులేని యయోధ్యలోనుండరోసి, నందిగ్రామమందు, రామాగమనమును గోరుచు, రాజ్యముచేసెను; అని తాత్పర్యము.

> గతేతు భరతే శ్రీమాన్ సత్యసంధో జితేంద్రియః. ౩౯
> రామస్తు పునరాలక్ష్య నాగరస్య జనస్యచ
> తత్రాగమన మేకాగ్రో దండకాన్ప్రవివేశహ. ౪౦

టీక॥ భరతే=భరతుఁడు; గతేతు=పోఁగానే; శ్రీమాన్=భరతాగమనముచేఁగలిగినప్రతిజ్ఞాభంగభయముపోయినందున, ప్రశస్తకాంతి గలవాఁడును; సత్యసంధః, సత్య=భరతుఁడునిర్బంధించినను, ఎంతమాత్రముచలింపని, సంధః=ప్రతిజ్ఞగలవాఁడును, జితేంద్రియః, జిత=జయింపఁబడిన,ఇంద్రియః=ఇంద్రియములుగలవాఁడును, అనఁగా,తల్లి,భరతుఁడు,వీరిప్రార్థనలువ్యాజముగానున్నను, రాజ్యభోగమునందుఁ జాపలములేనివాఁడును అగు; రామస్తు = తుకారమునమచ్చయార్థకము) రాముఁడును; నాగరస్య = పట్టణమందుఁగల; జనస్యచ= జనముయొక్కయు, భరతుని యొక్కయు (చకారమను క్తసముచ్చాయకము, "భరతుని యొక్కయు" అనిసూచించు చున్నది); తత్ర=ఆచిత్రకూట పర్వతమునందు; పునః=మరల; ఆగమనం= వచ్చుటను; ఆలక్ష్య=ఊహించి; ఏకాగ్రః=తండ్రిపనుపును జేయుటయందుసావధానుఁడై; లేక, విరోధులగురాక్షసులున్నందున సావధానుఁడై; దండకాన్ = దండకారణ్యమును; ప్రవివేశహ = ప్రవేశించెను. (హకారముపాదపూరణార్థము).

భరతుఁడువెళ్లఁగానే, రాముఁడు,భరతుఁడువచ్చినపుడుతనకుఁగలిగినప్రతిజ్ఞాభంగ భయముపోవుటచే,సర్వాతిశాయియగుకాంతిగలిగినవాఁడై ప్రియానుజుఁడగుభరతుఁ

డెంతనిర్బంధించినను గొంచెమైనఁ దనస్థిరమైనప్రతినను జలింపనీయక, కౌసల్య, భరతుఁడు, వీరు చేసినప్రార్థనలు, రాజ్యాంగీకారమందవకాశమునకు వ్యాజముగానుండినను, రాజ్య భోగములం దెంతమాత్రమును జాపలమునొందక, యాచిత్రకూట పర్వతమునందుఁ దానుండడమంద అకును దెలిసియున్నందున, అయోధ్యలోనుండుజనులుగాని, భరతుఁడుగానిమఱల నచ్చటికివత్తురని ఊహించి, పితృాజ్ఞాపరిపాలనమందు సావధానుఁడై, దండకావనమును బ్రవేశించెను. అని తాత్పర్యము.

ప్రవిశ్యతు మహారణ్యం రామో రాజీవలోచనః
విరాధం రాక్షసం హత్వా శరభంగం దదర్శహ. ౪౧
సుతీక్ష్ణం చాప్యగస్త్యంచ అగస్త్య భ్రాతరం తథా

అ, ఇట్లు, అయోధ్యాకాండకథను జెప్పియిప్పుడరణ్యకాండకథను జెప్పుచున్నారు.

టీక ॥ రాజీవ లోచనః, రాజీవ=కమలములవంటి, లోచనః=కండ్లుగల; రామః=రాముఁడు; మహారణ్యం= దండకారణ్యమును; ప్రవిశ్యతు = ప్రవేశించుచునే; విరాధం=విరాధుఁడను; రాక్షసం=రక్కసుని; హత్వా=చంపి; శరభంగం = శరభంగమహామునిని; సుతీక్ష్ణంచాపి = సుతీక్ష్ణమహామునిని; అగస్త్యంచ=అగస్త్యమహర్షిని; అగస్త్యభ్రాతరంతథా= అగస్త్యుని తమ్ముఁడగు సుదర్శనమహామునిని; దదర్శహ=చూచెను (హకారము పాదపూరణార్థము).

కమలములవంటినేత్రములుగల రాముఁడుదండకారణ్యమును, బ్రవేశించుచునే, విరాధుఁడను రాక్షసునిఁ జంపి, శరభంగులవారిని, సుతీక్ష్ణమహామునిని, అగస్త్యమహర్షిని, అగస్త్యభ్రాతయగు సుదర్శనమహామునిని, చూచెను. అని తాత్పర్యము.

అగస్త్య వచనాచ్చైవ జగ్రాహైంద్రం శరాసనమ్. ౪౨
ఖడ్గంచ పరమప్రీత స్తూణీచాక్షయ సాయకౌ

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; అగస్త్యవచనాచ్చైవ, అగస్త్య = అగస్త్యమహాముని యొక్క, వచనాచ్చైవ = వాక్యమువలననే; ఐంద్రం = ఇంద్రుని చేనియ్యఁబడిన; శరాసనం = విల్లును; ఖడ్గంచ = కత్తిని; అక్షయసాయకౌ, అక్షయ = నాశములేని, సాయకౌ = బాణములుగల, తూణౌచ = అమ్ములపొదులను; పరమప్రీతః, పరమ = అధికముగా, ప్రీతః = సంతసించినవాఁడై; జగ్రాహ = స్వీకరించెను.

అగస్త్యుఁడు, తన కింద్రుని చేనియ్యఁబడిన, విల్లు, కత్తి, యుద్ధములో నెంత ప్రయోగించినను దగ్గని బాణములుగల యమ్ముల పొదులు రెండు, వీటిని బుచ్చుకొనుమని చెప్పఁగా, రాముఁడు, తన పరాక్రమమునకుఁదగిన యాయుధములు దొరకొనినందుకు సంతసించినవాఁడై, వానిఁ, బుచ్చుకొనెను. అని తాత్పర్యము.

వసతస్తస్య రామస్య వనే వనచరైస్సహ. ౪౩
ఋషయో భ్యాగమన్సర్వే వధాయాసురరక్షసామ్,

టీక ॥ వనే = శరభంగమహర్షి యొక్క, తపోవనమునందు; తస్య = ఆ; రామస్య = రాముఁడు; వసతః = వాసముచేయుచుండఁగా; సర్వే = సమస్తులైన; ఋషయః = ఋషులు; వనచరైస్సహ = వానప్రస్థులగు, మునులతోఁగూడ; అసుర = అసురులయొక్కయు, రక్షసాం = రాక్షసులయొక్కయు; వధాయ = చంపుటను ప్రార్థించుటకొఱకు; అభ్యాగమన్ = (రామునిసమీపమునకు) వచ్చిరి.

ఆశరభంగ మహామునియొక్క తపోవనమునందు రాముఁడు వాసముసేయుచుండఁగాఁ, జుట్టుప్రక్కలనుండు సమస్తఋషులును, అసురులను రాక్షసులను వధింపుమని ప్రార్థించుటకొఱకు, రామునిసమీపమునకువచ్చిరి; అని తాత్పర్యము.

అర్థాంతరము.—వనే = శరభంగుని తపోవనమునందు; వనచరైస్సహ = వనమునందు వసించుచుండు మునులతోగూడ, వసతః = వాసముచేయుచున్న; తస్య = ఆ; రామ

స్యః=రామునకు; సర్వే; ఋషయః; అసురరక్షసాం, అసు=ప్రాణములను, ర=గ్రహించునట్టి; రక్షసాం=రాక్షసులయొక్క; వధాయ=చంపుటకై; అభ్యాగమన్ = శరణాగతులైరి.

శరభంగతపోవనమందువనవాసులతోఁగూడవసింపుచుండునారామునకు, దండకావనమందుండునట్టి సమస్తఋషులును, దమకుఁ బ్రాణహింసకులగు రాక్షసులనుజంపించుటకై, శరణాగతులైరి; అని తాత్పర్యము.

స తేషాం ప్రతిశుశ్రావ రాక్షసానాం తథావనే. ౪౪

టీక ॥ సః = ఆరాముఁడు; రాక్షసానాం= రాక్షసులయొక్క; వనే=నివాసమైన, దండకారణ్యమందు; తేషాం = ఆఋషులయొక్క; తథా=ఆప్రార్థనను; ప్రతిశుశ్రావ=అంగీకరించెను.

ఆరాముఁడు, రాక్షస నివాసభూతమైనదండకారణ్యమందు, ఋషులుతన్నుఁబ్రార్థించినట్లు, అంగీకరించెను; అని తాత్పర్యము.

ప్రతిజ్ఞాతశ్చ రామేణ వధ స్సంయతి రక్షసామ్
ఋషీణా మగ్నికల్పానాం దండకారణ్య వాసినామ్. ౪౫

టీక ॥ రామేణ=రామునిచేత; అగ్నికల్పానాం, అగ్ని=నిప్పుతో, కల్పానాం=సమానులైన, దండకారణ్యవాసినాం, దండకారణ్య=దండకారణ్యమందు, వాసినాం=వసింపుచున్నట్టి; ఋషీణాం = ఋషులకొఱకు (చతుర్థ్యర్థమందుషష్ఠి); సంయతి = యుద్ధమందు; రక్షసాం=రాక్షసులయొక్క; వధశ్చ=చంపుటయును; ప్రతిజ్ఞాతః=తప్పక చేసెదనని చెప్పఁబడెను.

అగ్నిహోత్రమువలెఁ బరిశుద్ధస్వభావులై దండకారణ్యమందువాసము చేయుచుండు ఋషుల కొఱకు, "యుద్ధమునందు రాక్షసులఁ దప్పకవధించెద" నని రాముఁడుప్రతిజ్ఞ చేసెను; అని తాత్పర్యము.

తేన తత్రైవ వసతా జనస్థాన నివాసినీ
విరూపితా శూర్పణఖా రాక్షసీ కామరూపిణీ. ౪౬

టీక॥ తత్రైవ=ఆదండకారణ్యమునందే; వసతా = వసింపుచున్న; తేన=ఆ రామునిచేత; కామరూపిణీ, కామ=ఇచ్ఛాధీనమగు; రూపిణీ=ఆకారముగలదియు; జనస్థాననివాసినీ, జనస్థాన=జనస్థానమను పేరుగల దండకారణ్యముతోఁ జేరిన యొక్క ప్రదేశమందు, నివాసినీ= వాసముచేయుచుండునదియునగు; శూర్పణఖా=శూర్పణఖయనెడు; రాక్షసీ=రాక్షసస్త్రీ; విరూపితా=వికృతమగురూపముగలదిగాఁ జేయఁబడెను.

విశేషార్థము.— శూర్పతుల్యానఖాః యస్యాః, సా శూర్పణఖా, యేస్త్రీకి, చేటలవంటి గోళ్లుగలవో; ఆస్త్రీ "శూర్పణఖ" యనఁబడును. శూర్పణఖను, లక్ష్మణుఁడే, విరూపిణిగాఁ జేసినను; "రామస్యదక్షిణోబాహుః" అని, లక్ష్మణుఁడు రామునియొక్క దక్షిణబాహువుగాఁ జెప్పఁబడినందువలనను; లక్ష్మణుఁడు రామాజ్ఞంబట్టియె అట్లు చేసెనందువలనను "రామేణవిరూపితా" అని, రాముఁడే శూర్పణఖను విరూపిణిగాఁ జేసినట్లు, చెప్పఁబడినది.

రాముఁ, డా దండ కారణ్యములోనే వాసము సేయుచు, నా దండకారణ్యములో రావణుని సేనానివేశస్థానమగు జనస్థాన మందు వాసము చేయుచుఁ గామరూపిణియై యున్న శూర్పణఖయను రక్కసిని, ముక్కుఁ జెవులుఁ గోసి, విరూపిణిగాఁ జేసెను. అని తాత్పర్యము.

తతః శూర్పణఖా వాక్యా దుద్యుక్తా న్సర్వరాక్షసాన్
ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్. ౪౭
నిజఘాన రణే రామ స్తేషాం చైవ పదానుగాన్

టీక॥ తతః=అటుపిమ్మట; శూర్పణఖావాక్యాత్, శూర్పణఖా=శూర్పణఖయొక్క, వాక్యాత్ = మాటవలన; ఉద్యుక్తాన్ = యుద్ధము సేయుటకు సన్నద్ధులైన; సర్వరాక్షసాన్, సర్వ = సమస్తులైన,

రాక్షసాన్=రాక్షసులను;(ఎవ్వరినన?గా)ఖరం=ఖరుని;త్రిశిరసంచైవ=త్రిశిరసుని; దూషణం= దూషణుఁడను; రాక్షసంచైవ= రాక్షసుని; తేషాం=ఆఖరత్రిశిరోదూషణులయొక్క;పదానుగాంశ్చైవ= అనుచరులగువారిని; రణే=యుద్ధమునందు; రామః=రాముఁడు;నిజఘాన=చంపెను.

అర్థాంతరము.—తతః;శూర్పణఖా వాక్యాత్; ఉద్యుక్తాన్; ఖరం;త్రిశిరసంచైవ;దూషణం;రాక్షసంచైవ;తేషాం; పదానుగాంశ్చైవ; (ఇట్లు)సర్వరాక్షసాన్,సర్వ=సమస్తులైన,రాక్షసాన్=రాక్షసులను,రణే;రామః;నిజఘాన.

శూర్పణఖ విరూపితయైనపిమ్మట,ఆశూర్పణఖయొక్క మాటవిని యుద్ధమునకువచ్చిన,ఖరుని,త్రిశిరుని,దూషణుని, వారిసైన్యములను, నిశ్శేషముగా,రాముఁడు యుద్ధమునందుఁజంపెను; అనితాత్పర్యము.

వనే తస్మిన్నివసతా జనస్థాన నివాసినామ్. ౪౯
రక్షసా న్నిహతా న్యాస న్సహస్రాణి చతుర్దశ

టీక॥ తస్మిన్=ఆ;వనే=దండకారణ్యమందు; నివసతా= వాసముచేయుచున్న;రామేణ (అధ్యాహృతము)=రామునిచేత;జనస్థాననివాసినాం, జనస్థాన= జనస్థానమందు, నివాసినాం= వసించుచున్న;రక్షసాం=రాక్షసులలో;చతుర్దశ= పదునాలుగు; సహస్రాణి=సహస్రములు. (ఆసంఖ్యగల రక్కసులనుట) నిహతాని= చంపఁబడినవి;ఆసన్=అయినవి.

రాముఁడు, తానాదండకారణ్యములోనుండఁగా, జనస్థానమునందువాసముసేయువారలలోఁ,బదునాలుగువేలరాక్షసులను, జంపెను;అనితాత్పర్యము.

తతోజ్ఞాతి వధం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః. ౫౦
సహాయం వరయామాస మారీచన్నామ రాక్షసమ్

టీక॥ తతః=ఆపిమ్మట;జ్ఞాతివధం,జ్ఞాతి= దాయాదులయొక్క, వధం=చావును;శ్రుత్వా=విని;రావణః=రావణుఁడు; క్రోధమూర్ఛి

తః, క్రోధ = కోసముచే, మూర్ఛితః = వ్యాపింపఁబడినవాఁడై; మారీచన్నామ = మారీచుఁడనెడు, రాక్షసం = రాక్షసుని; సహాయం = తనకుఁదోడైనవానిఁగా; వరయామాస = కోరెను.

రామునిచే ఖరాదులు చచ్చిన వెనుక, రావణుఁడు, తనవారియాదులగుఖరాదులమరణమునువిని, చాలఁగోపముగలవాఁడై; సీతనపహరించుటయందుఁ దనకుఁ దోడుగా నుండుటకు, మారీచుఁడను రాక్షసుని, గోరెను; అని తాత్పర్యము.

విశేషార్థము.— రావయతీతి, రావణః, "రుశబ్దే" అనుధాతువునఁబుట్టినది, ఈలోకము నంతయు, రోదనధ్వనిచే, శబ్దింపఁజేయువాఁడు, కాఁగా, రావణుఁడనంబడెను, లేక, 'విశ్రవసోవిశ్రవణరవణః' అను ప్రమాణముఁ బట్టి, విశ్రవసః అపత్యం పుమాన్, రావణః, విశ్రవసునకుఁ గుమారుఁడు, కాఁగా, రావణుఁడని చెప్పఁబడును.

వార్యమాణ స్సుబహుశో మారీచేన సరావణః. ౫౦
న విరోధో బలవతా క్షమో రావణ తేన తే

టీక॥ సః = ఆ, రావణః = రావణుఁడు, హే రావణ = ఓ రావణుఁడా! తే = నీకు, బలవతా = ఖరాది రాక్షసులనుజంపుటచేఁ బ్రసిద్ధమైన, బలముగల; తేన = ఆ రామునితో; విరోధః = పగ, నక్షమః = తగినది కాదు, ఇతి (అధ్యాహృతము) = ఇట్లని, సుబహుశః = పలుమారు, వార్యమాణః = అడ్డగింపఁబడినవాఁడు, అభూత్ (అధ్యాహృతము) = ఆయెను.

ఆమారీచుఁడు "ఓ రావణా! మహాబలవంతులైనఖరుఁడు మొదలగు పదునాలుగు వేలరాక్షసులను జంపినట్టిబలవంతుఁడైనయా రామునితో టిపగనీకుఁదగదు, సీతనుఅపహరింపవలదు" అని పలుమారు రావణు నడ్డగించెను, అని తాత్పర్యము.

అనాదృత్యతు తద్వాక్యం రావణః కాలచోదితః. ౫౧
జగామ సహమారీచ స్తస్యాశ్రమ పదం తదా

టీక॥ రావణః = రావణుఁడు, కాలచోదితః, కాల=మృత్యువుచేత, చోదితః = ప్రేరింపఁబడినవాఁడై, తద్వాక్యం, తత్ =ఆమారీచుని యొక్క, వాక్యం=మాటను; అనాదృత్యతు = ఆదరింపకయే; సహమారీచః=మారీచునితోఁగూడుకొనినవాఁడై; తదా= అప్పుడు; తస్య=ఆరామునియొక్క; ఆశ్రమపదం=ఆశ్రమస్థానమునుగూర్చి; జగామ=వెళ్లెను.

రావణుఁడు, తనకుమృత్యువు సమీపములోనున్నందున, నామారీచునిమాట నెంతమాత్ర మొప్పుకొనక, ఆమారీచుని వెంటఁబెట్టుకొని, యప్పుడు రాముని యాశ్రమమునకు వెళ్లెను; అని తాత్పర్యము.

తేన మాయావినా దూర మపవాహ్య నృపాత్మజౌ. ౫౭
జహార భార్యాం రామస్య గృధ్రం హత్వా జటాయుషమ్

టీక ॥ సః=(అధ్యాహృతము) ఆరావణుఁడు; మాయావినా = మాయకాఁడగు, తేన=ఆమారీచునిచే; నృపాత్మజౌ= రాచకొమరులగు రామలక్ష్మణులను, దూరం= దూరముగా, అపవాహ్య=తొలంగిపోవునట్లు చేయించి, జటాయుషం=జటాయువను, గృధ్రం= గద్దను, హత్వా=చంపి, రామస్య=రామునియొక్క, భార్యాం= పత్నియగుసీతాదేవిని, జహార= అపహరించెను.

విశేషార్థము.— "హత్వా" అను చోట, అపూర్వ కాలమందు క్త్వాప్రత్యయముగలిగినది. "ముఖం వ్యాదాయస్వపితి" (నోరు తెఱచుకొనినిద్రించుచున్నాఁడు) అని, నిద్రవచ్చినవెనుక, నోరు తెఱవడమగుచున్నను, "నోరు తెఱచి నిద్రపోవుచున్నాఁ" డను వ్యవహారముండునట్లు, సీతనపహరించినవెనుక, జటాయువునుజంపడమైనను, "జటాయువునుజంపి సీతనపహరించె" నని చెప్పఁబడినది.

మాయకాఁడైన మారీచుఁడుదన మాయచే రామలక్ష్మణులనుదూరముగొనిపోవఁగా, నారావణుఁడు రామునిభార్యయగు సీతాదేవినప

హరించి, యాసీతాదేవిని విడిపించుటకై, యుద్ధమునకు వచ్చిన జటాయువునుజంపెను; అని తాత్పర్యము.

గృధ్రంచ నిహతం దృష్ట్వా హృతాం శ్రుత్వాచ మైథిలీమ్. ౫౩
రాఘవ శ్శోకసంతప్తో విలలా పాకులేంద్రియః,

టీక ॥ నిహతం = చక్కగా కొట్టఁబడిన, గృధ్రం=గద్దను, దృష్ట్వాచ=చూచియును, మైథిలీం=మిథిలారాజపుత్రియగు సీతాదేవిని, హృతాం= అపహరింపఁబడిదానిఁగా, శ్రుత్వాచ=వినియును, రాఘవః=రఘువంశమునందుఁబుట్టినరాముఁడు; శోకసంతప్తః, శోక=దుఃఖముచే, సంతప్తః= మిక్కిలితపింపఁబడిన వాఁడై; ఆకులేంద్రియః, ఆకుల=దుఃఖముచేఁ బరవశములైన, ఇంద్రియః= ఇంద్రియములుగలవాఁడై; విలలాప=ఏడ్చెను.

రాముఁడు, చచ్చుటకు, సిద్ధమైపడియున్న జటాయువునుజూచి, ఆ జటాయువువలన రావణుఁడుసీతాదేవినపహరించిన సంగతిని విని, మిక్కిలిదుఃఖితుఁడై, ఇంద్రియములను వశములోనుంచలేక, యేడ్వసాగెను; అని తాత్పర్యము.

తతస్తేనైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్. ౫౪
మార్గమాణో వనే సీతాం రాక్షసం సందదర్శహ
కబంధన్నామరూపేణ వికృతం ఘోరదర్శనమ్. ౫౫

టీక ॥ తేన=ఆ; శోకేనైవ=దుఃఖముచేతనే; తతః=వ్యాపింపఁబడిన; సః (అధ్యాహృతము)= ఆ రాముఁడు; గృధ్రం=గద్దమైనను; జటాయుషం = జటాయువును; దగ్ధ్వా=దహించి; వనే= అరణ్యమందు; సీతాం=సీతాదేవిని; మార్గమాణః = వెదకుచు; రూపేణ=ఆకారముచే; వికృతం=వికారముగలవాఁడును; ఘోరదర్శనం, ఘోర=భయమునుబుట్టించు, దర్శనం=చూడఁబడుటగలవాఁడును; అగు; కబంధన్నామ=కబంధుఁడనెడు; రాక్షసం= రాక్షసుని; సందదర్శహ=

చూచెను.

అంత, రాముఁడు, ఆదుఃఖము తోనే, జటాయువు గద్దయైనను, దన తండ్రిగారికి మిత్రుఁడై తనకార్యమునకుఁగాయుద్ధముచేసి చచ్చినందున, నాజటాయువునకు, దహనసంస్కారముచేసి,అరణ్యమందు, సీతాదేవిని వెదకుచు, వికృతరూపుఁడైచూపరులకుభయముఁబుట్టించునట్టికబంధుఁడనురాక్షసునిఁ, జూచెను; అని తాత్పర్యము.

తన్నిహత్య మహాబాహు ర్దదాహ స్వర్గత శ్చసః

టీక ॥ మహాబాహుః, మహత్ = గొప్పబలము గలిగిన, బాహుః = చేతులుగల;సః (అధ్యాహృతము)= ఆరాముఁడు;తం=ఆకబంధుని; నిహత్య=చంపి; దదాహ=దహించెను.సచ=ఆకబంధుడును; స్వః= స్వర్గమును; గతః=పొందెను.

బలిష్ఠములైనబాహువులు గలయారాముఁడుకబంధునిఁజంపివానిని దహనక్రియతోసంస్కరించెను-ఆకబంధుఁడును, రామునిచేదహనసంస్కారమునుబొంది,స్వర్గమునకువెళ్లెను; అని తాత్పర్యము.

సచాస్య కధయామాస శబరీం ధర్మచారిణీమ్. ౫౬
శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛేతి రాఘవ

టీక ॥ సచ= స్వర్గమునకువెళ్లుచున్నయాకబంధుఁడును;అస్య=ఈరామునకు;రాఘవ=ఓరాముఁడా!ధర్మచారిణీం, ధర్మ=ధర్మములను,చారిణీం= ఆచరించుచున్నదియు;శ్రమణీం = సన్యాసాశ్రమమునుబొందియున్నదియు; ధర్మనిపుణాం, ధర్మ = ధర్మములయందు;నిపుణాం=సమర్థురాలును;అగు;శబరీం= శబరజాతిస్త్రీని గూర్చి;అభిగచ్ఛ=పొమ్ము; ఇతి=ఇట్లని,కధయామాస=చెప్పెను.

విశేషార్థము.— "చతుర్థమాశ్రమంప్రాప్తాశ్శ్రమణా నామ తే స్మృతాః" (నాలవయాశ్రమమును బొందినవారలుశ్రమణులని చెప్పఁ




బడుదురు)లనియుండుటవలన, "శ్రమణః" అనఁగా, నాలవ యాశ్రమమును బొందినవాఁడు; స్త్రీ కావున "శ్రమణీ" అని చెప్పఁబడినది. "నృపాయాం వైశ్యతో జాతశ్శబరః పరికీర్తితః, మధూనివృక్షాదానీయవిక్రీణీతే స్వవృత్తయే" (క్షత్రియస్త్రీయందు వైశ్యునివలనఁబుట్టినవాఁడు శబరుఁడనంబడును; అతఁడు, తనజీవనముకొఱకు, వృక్షమునుండి తేనెనుదీసి, విక్రయించును) అనునారదీయవచనమురీతిని, క్షత్రియస్త్రీకిని వైశ్యపురుషునకును బుట్టినస్త్రీ "శబరి" యనంబడును.

ఆకబంధుఁడు, స్వర్గమునకుఁ బోవుచు, "ఓ రాముఁడా! ధర్మసూక్ష్మములనెఱింగి, సమస్తధర్మములనాచరించుచు, సన్యాసాశ్రమమునవలంబించియున్న, యొకశబరజాతిస్త్రీ, యున్నది; నీవాబిడవద్దకుఁ బొమ్ము; నిన్నుఁజాల సత్కరించును.' అని రామునకుఁజెప్పెను. అని తాత్పర్యము.

సోఽభ్యగచ్ఛ న్మహాతేజా శ్శబరీం శత్రుసూదనః. ౫౭

టీక ॥ మహాతేజాః, మహత్ = ప్రశస్తమగు, తేజాః = కాంతిగలవాఁడైనను; శత్రుసూదనః, శత్రు = విరోధులను; సూదనః = బాధించువాఁడైనను; సః = ఆ రాముఁడు; శబరీం = శబరజాతిస్త్రీని గూర్చి, అభ్యగచ్ఛత్ = వెళ్లెను.

ఆ రాముఁడు, తాను మహాతేజుండును సమస్తశత్రువులబాధించువాఁడునైనను, భక్తపరాధీనుఁడుగావున, నది నీచజాతిలోఁ బుట్టినదైనను, ఆశబర స్త్రీవద్దకుఁ బోయెను; అని తాత్పర్యము.

శబర్యా పూజిత స్సమ్య గ్రామో దశరథాత్మజః,

టీక॥ దశరథాత్మజః, దశరథ = దశరథ మహారాజునకు, ఆత్మజః = పుత్రుఁడైన; రామః = రాముఁడు; శబర్యా = శబరస్త్రీచేత; సమ్యక్ = చక్కగా; పూజితః = పూజింపఁబడెను.




విశేషార్థము. "దశరథాత్మజుఁడగు రాముఁడు చక్కఁగాఁబూజింపఁబడెను" అనుటచే, "అఱువదివేలసంవత్సరములు సంతానములేకయుండియటువెనుక మహాప్రయత్నమున సంతానమునుబొందినదశరథుఁడు తనప్రియపుత్రుఁడగు రామునకిచ్చుభోజనముకన్నను, ఆశబరస్త్రీ,యిప్పుడు,వన్యాహారముచేనిచ్చిన యాతిథ్యము, రామునకెచ్చుగాఁబ్రీతినిగలిగించిన" దనిసూచితమగుచున్నది.

ఆశబరస్త్రీ, యాతిథ్యాదిపూజలచే, దశరథ పుత్రుఁడగు రామునిఁ,జక్కఁగా, సత్కరించెను; అని తాత్పర్యము.

పంపాతీరే హనుమతా సంగతో వానరేణహ. ౫౮

అ, ఇట్లు,అరణ్యకాండ కథను జెప్పియిఁకఁ గిష్కింధాకాండ కథనుజెప్పుచున్నారు.

టీక ॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; పంపాతీరే,పంపా=పంపయనెడుపద్మసరస్సుయొక్క, తీరే=గట్టునందు; హనుమతా=హనుమంతుఁడనెడు; వానరేణ=కోఁతితో; సంగతః=చేరెను; హ=సంతోషము.

విశేషార్థము.— హనుమాన్=ప్రశస్తములైన చెక్కిళ్లమీఁది భాగములుగలవాఁడు; పూర్వము, హనుమంతుఁడుపుట్టుచునే, సూర్యునిఁ జూచి, "యిదియొకఫలము, దీనిభక్షించెదను" అనితలంచి, యతనిపైకెగిరెను;ఇట్లు, సూర్యునివేఁడిమిని, ఎంతమాత్రములెక్కింపక,మున్నూఱు యోజనముల వఱకుఁ, బైకిలంఘింపఁగాఁజూచి,యింద్రుఁడు,కోపించి, యాహనుమంతునిపై, వజ్రమును వేసెను; ఆవజ్రముచేఁగొట్టఁబడినవాఁడై,యొకపర్వత శిఖరముపైఁబడఁగా,నప్పుడతని వామహనువుభగ్నమయ్యె. కాఁబట్టి,యతనికి హనుమంతుఁడనుపేరుగలిగె. అనికిష్కింధాకాండములోఁ జెప్పఁబడియున్నది- ఈశబ్దముచే,మహాపరాక్రమశాలియని సూచింపఁబడుచున్నది. "సీతనుబోఁగొట్టుకొని,యతిదుఃఖితుఁడైయరణ్యములోసంచరింపుచుండు,రామునకు,మహాపరాక్ర

మహాశాలియగు హనుమంతుని స్నేహము ఘటిల్లెను; సంతోషము!" అని యీశ్లోకమందుఁ గవితాత్పర్యము.

రాముఁడు, విరహిజనులకుఁజాలబాధగలిగించునట్టి పంపాతీరమం దుఁజరింపుచు, లోక ప్రసిద్ధమైనపరాక్రమముగల హనుమంతుఁ డను వానరునితోఁ జేరెను; సంతోషము! అని తాత్పర్యము.

హనుమద్వచనాచ్చైవ సుగ్రీవేణ సమాగతః,

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; హనుమ ద్వచనాత్, హనుమత్ = హనుమంతుని యొక్క, వచనాత్ =మాటవలన;సుగ్రీవేణచైవ= సుగ్రీవునితోనుగూడ;సమాగతః=చేరెను.

రామునకు, హనుమంతుని స్నేహమువలన, సుగ్రీవునితోఁ గూడ, స్నేహము, సమకూరెను; అనితాత్పర్యము.

సుగ్రీవాయచ తత్సర్వం శంస ద్రామో మహాబలః. ౫౯
ఆదిత స్తద్యథా వృత్తం సీతాయాశ్చ విశేషతః

టీక॥ మహాబలః,మహత్ =గొప్పదగు, బలః= బలముగల; రామః=రాముఁడు; ఆదితః=తనపుట్టుకమొదలు;తత్ =ప్రసిద్ధమైన;సర్వం=సమస్తమైనదానిని;సుగ్రీవాయచ=సుగ్రీవునికొఱకును (చకారమువలన) హనుమంతునికొఱకును;శంసత్ =చెప్పెను,మహాబలః= గొప్పబలముగల;రామః=రాముఁడు; సీతాయాశ్చ=సీతాదేవియొక్కయు; తత్ = ఆవృత్తాంతమును;యథావృత్తం=నడిచినదినడిచినట్లు;విశేషతః = అధికముగా;సుగ్రీవాయచ=సుగ్రీవునికొఱకును(చకారమువలన) హనుమంతునికొఱకును;శంసత్ =చెప్పెను,

మహాబలుఁడైన రాముఁడు,జన్మముమొదలు,తనవృత్తాంతమంతయును,సుగ్రీవునకునుహనుమంతునకును జెప్పి; మఱివిశేషముగా,సీతావృత్తాంతమును, నడిచినది నడిచినట్లు,వారలకుఁ దెలియఁజేసెను.అని తాత్పర్యము.

సుగ్రీవశ్చా పితత్సర్వం శ్రుత్వారామస్య వానరః. ౭౦
చకార సఖ్యంరామేణ ప్రీతశ్చై వాగ్నిసాక్షికం,

టీక ॥ వానరః= కోఁతియగు; సుగ్రీవశ్చాపి=సుగ్రీవుఁడును; రామస్య=రామునియొక్క; సర్వం=సమస్తమైన; తత్= ఆవృత్తాంతమును; శ్రుత్వా=విని; ప్రీతః=సంతోషించినవాఁడై; అగ్నిసాక్షికంచైవ, అగ్ని= అగ్నిహోత్రుఁడే, సాక్షికంచైవ= సాక్షిగాగలుగునట్లుగానే; రామేణ=రామునితో; సఖ్యం=మైత్రిని; చకార=చేసెను.

సుగ్రీవుఁడురామవృత్తాంతమంతయునువిని, తనవలెనేదుఃఖితుఁడైన మహాబలునితోఁటి మైత్రి గలిగినదని సంతోషించి, యగ్ని హోత్రుని సాక్షిగా నుంచికొని, రామునితో మైత్రిగావించెను; అని తాత్పర్యము.

తతో వానరరాజేన వైరానుకథనంప్రతి. ౭౧
రామాయా వేదితంసర్వం ప్రణయా ద్దుఃఖితేనచ

టీక॥ తతః=అటువెనుక, దుఃఖితేన=దుఃఖముగల; వానరరాజేనచ, వానర= కోఁతులకు, రాజేనచ= ప్రభువగుసుగ్రీవునిచేతను; వైరానుకథనంప్రతి, వైర=వాలితోఁటి విరోధము యొక్క, అనుకథనంప్రతి= ప్రశ్నమును గూర్చి; రామాయ= రాముని కొఱకు; ప్రణయాత్=స్నేహమువలన; సర్వం=సమస్తమును; ఆవేదితం=చక్కఁగాఁ జెప్పఁబడినది.

అంతట, పరమ స్నేహితుఁడైన రాముఁడుసమీపమందుండుటచే, దుఃఖముబైటికుబ్బగాఁ దల్లడిల్లుచున్నసుగ్రీవునిఁజూచి, యారాముఁడు "నీకునువాలికినివిరోధమెట్లుకలిగె" నని యడిగెను; అందుకా సుగ్రీవుఁడు, స్నేహమువలన, రహస్యములను సగాదాఁపక, సమాచారమంతయు, రామునకుఁజక్కఁగాఁ దెలియఁజెప్పెను. అని తాత్పర్యము.

ప్రతిజ్ఞాతంచ రామేణ తదా వాలివధంప్రతి. ౭౨

టీక ॥ తదా=అప్పుడు; రామేణ=రామునిచే; వాలివధం ప్రతి, వాలి=వాలియొక్క, వధం ప్రతి=చంపుటనుగురించి; ప్రతిజ్ఞాతం= ప్రతిన సేయడము; బభూవ(అధ్యాహృతము=)అయినది.

తనకును వాలికిని విరోధము గలిగినరీతిని సుగ్రీవుఁడు చెప్పినవెనుక, రాముఁడు, "వాలిని దప్పక చంపెద"నని ప్రతిజ్ఞ చేసెను; అని తాత్పర్యము.

వాలినశ్చ బలం తత్ర కథయామాస వానరః,

టీక ॥ తత్ర=ఆ ఋశ్యమూకమందు; వానరః= కోఁతియగు సుగ్రీవుఁడు; రామస్య= (అధ్యాహృతము)=రామునకు; వాలినః=వాలియొక్క; బలం = వీర్యమును; కథయామాస=చెప్పెను.

ఆ ఋశ్యమూకమందు, సుగ్రీవుఁడు, అరుణోదయము మొదలు సూర్యోదయములోపల నాలుగుసముద్రములయందును అర్ఘ్యములు విడుచుట మొదలగు వాలియొక్క బలమునంతయు రామునకుఁ జెప్పెను; అని తాత్పర్యము.

సుగ్రీవ శ్శంకిత శ్చాసీ న్నిత్యం వీర్యేణ రాఘవే. ౬౩

టీక ॥ సుగ్రీవశ్చ= సుగ్రీవుఁడును; రాఘవే= రామునివిషయమై; వీర్యేణ=పరాక్రమముచే; నిత్యం=ఎల్లప్పుడును; శంకితః=సందేహముగలవాఁడుగా; ఆసీత్ =ఆయెను.

సుగ్రీవుఁడు, రామునిఁ జూచినది మొదలుకొని, "యితఁడు వాలిని జంపసమర్థుఁడో, కాఁడో" యని సందేహించుచుండెను; అని తాత్పర్యము.

రాఘవప్రత్యయార్థం తు దుందుభేః కాయ ముత్తమమ్
దర్శయామాస సుగ్రీవో మహాపర్వత సన్నిభమ్. ౬౪

టీక ॥ రాఘవప్రత్యయార్థం తు, రాఘవ= రామునియందు, ప్రత్యయార్థం తు= నమ్మకముకొఱకు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; దుందు

భేః=దుందుభియను రాక్షసునియొక్క; ఉత్తమం=శ్రేష్ఠమైన; మహాపర్వతసన్నిభం, మహాపర్వత=గొప్పకొండతో, సన్నిభం = సమానమగు; కాయం=కళేబరమును; రామస్య (అధ్యాహృతము)= రామునకు; దర్శయామాస=చూపెను.

సుగ్రీవుఁడు, రామునియందుఁదనకునమ్మకముగలుగుటకై, పూర్వమువాలిచే దూరముగావిసరివైవఁబడిగొప్పకొండవలెనున్న దుందుభియనురాక్షసునియొక్క కళేబరమును, రామునకుఁజూపెను; అనితాత్పర్యము.

ఉత్స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్యచాస్థి మహాబలః
పాదాంగుష్ఠేన చిక్షేప సంపూర్ణం దశయోజనమ్. ౬౫

టీక ॥ మహా బాహుః, మహత్=గొప్పవగు, బాహుః=చేతులుగలవాఁడును; మహాబలః, మహత్=లెక్కింపరాని, బలః=వీర్యముగలవాఁడునగు; రామః(అధ్యాహృతము) = రాముఁడు; ఉత్స్మయిత్వా= గంభీరముగాఁగొంచెమునవ్వి; అస్థిచ=ఎముకను; ప్రేక్ష్య=చూచి; పాదాంగుష్ఠేన, పాద=అడుగులోని, అంగుష్ఠేన= బొటనవ్రేలిచే; దశయోజనం= పదియోజనములదూరము; సంపూర్ణము=తక్కువలేకుండునట్లు; చిక్షేప=చిమ్మెను.

అంగుళ్యగ్రమాత్రమున రాక్షసాదిసమస్తలోకవిరోధుల వధించుటకుసమర్థములైనబాహువులును లెక్కింపరాని వీర్యమును గల రాముఁడు, "నావిషయమై జ్ఞానులుసగా మోహమునొందెదరు; ఈయరణ్యములోని కోఁతి మోహమునొందుటకేమియాశ్చర్యము!" అనిగంభీరముగాఁ జిఱునవ్వునవ్వి, యస్థిమయమైపడియున్నయాదుందుభికళేబరమును జూచి, కొంచెమైనను దక్కువలేకుండఁ బది యోజనముల దూరములోఁబడునట్లు, దానిఁ, దన పాదాంగుష్ఠముతోఁ, జిమ్మెను. అని తాత్పర్యము. ఇట్లు, మహేశ్వరతీర్థులవారు, వ్యాఖ్యానము చేసిరి.

మహాబాహుః; మహాబలః; రామః; అస్థిచ; ప్రేక్ష్య; స్మయిత్వా; చిఱునవ్వునవ్వి; పాదాంగుష్ఠేన; దశ

యోజనం; సంపూర్ణం; ఉచ్చిక్షే స=ఎత్తి చిమ్మెను. ("ఉత్స్మయిత్వా" అనుచోటనుండు "ఉత్" అను నుపసర్గము "చిక్షేప" అనుదానితోఁ జేర్పఁబడియె.)

లెక్కింపరాని బలముగల వాఁడును ఆబలమునకుఁ దగినట్లుకార్యము సేయ సమర్థములైన బాహువులుగలవాఁడునగు రాముఁడు, అస్థిమయమైనయాదుందుభి కళేబరమునుజూచి, "ఇదియెంతమాత్రము" అనినవ్వి, కొంచెమైనను దక్కువ లేకుండఁ బదియోజనముల దూరము లోఁబడునట్లు, దానిఁ, దనపాదాంగుష్ఠముతో నెత్తిచిమ్మెను. అనితాత్పర్యము. ఇట్లుగోవిందరాజులవారు, వ్యాఖ్యానముచేసిరి.

బిభేదచ పున స్సాలా\~ సప్తై_కేన మహేషుణా
గిరిం రసాతలంచైవ జనయ\~ ప్రత్యయ\~ తదా. ౬౬

టీక ॥ తదా= అప్పుడు; పునశ్చ=మఱలను; రామః (అధ్యాహృతము)=రాముఁడు; ప్రత్యయం=నమ్మకమును; జనయ\~ = పుట్టింపుచు; ఏకేన = ఒకటైన; మహేషుణా=గొప్పబాణముచేత; సప్త=ఏడింటిని; సాలా\~ = మద్దిచెట్లను; గిరిం= సమీపమందుండు, కొండను; రసాతలంచైవ= రసాతలలోకమునుగూడ; బిభేద=భేదించెను.

అప్పుడా రాముఁడు, దుందుభికళేబరమునుజిమ్ముటచేత సుగ్రీవునకుఁ దనయందునమ్మకము గలుగకపోవుటనుజూచి యతనికిఁ దనయందునమ్మకమును బుట్టించుటకై, ఏడుమద్దిచెట్లను, ఆసమీపమందుండు కొండను, అధోలోకములలోనాఱవదియగు రసాతలలోకమును, ఒకబాణముచే భేదించెను; అనితాత్పర్యము.

తతః ప్రీతమనాశ్చైవ విశ్వస్త స్సమహాకపిః
కిష్కింధాం రామసహితో జగామచ గుహాం తదా. ౬౭



టీక ॥ తతః= అటుపిమ్మట; తేన= రామునిచేఁ జేయఁబడినయాసప్తసాలభేదనాదులచే; విశ్వస్తః= నమ్మకమును బొందినవాఁడును; ప్రీతమనాః, ప్రీత=సంతోషించిన, మనాః=మనసుగలవాఁడునైన; సః= ఆ; మహాకపిః= పెద్దకోఁతియగుసుగ్రీవుఁడు; తదా=అప్పుడు; రామసహితః, రామ=రామునితో; సహితః=కూడుకొనినవాఁడై; గుహాం= గుహవలెనుండునట్టి; కిష్కింధాం చ=కిష్కింధాపట్టణమును గూర్చి యయౌ; జగామ=వెళ్లెను.

సప్తసాలములను, సమీపపర్వతమును, రసాతలలోకమును, నొక బాణముచే భేదించిన వెనుక, సుగ్రీవుఁడు, రాముఁడు వాలినిజంపఁగలండని నమ్మినవాఁడై, తనకు శీఘ్రముగా రాజ్యము ప్రాప్తమగునని సంతోషించి, రాముని వెంటఁబెట్టుకొని, తనకు, రామునితోడులేక, యెంతమాత్రమును, జొరుటకశక్యమైన, కిష్కింధా పట్టణమును ప్రవేశించెను. అని తాత్పర్యము.

తతోఽగర్జ ద్ధరివర స్సుగ్రీవో హేమపింగళః,

టీక ॥ తతః=అటువెనుక; హరివరః, హరి = కోఁతులలోపల, వరః=శ్రేష్ఠుఁడును; హేమపింగళః, హేమ= బంగారువలె, పింగళః= గోరోచనవర్ణముగల వాఁడునగు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; అగర్జత్ = సింహనాదముచేసెను.

కిష్కింధనుబ్రవేశించుచునే, రామసాహాయ్యమునంజేసి, సంతోషాతిశయమున, బంగారువంటివన్నెగలిగి ప్రకాశించుచుఁ, దనకన్న నెచ్చనవానరుఁడులేఁడనితలంచి, సింహనాదముచేసెను. అని తాత్పర్యము.

తేన నాదేన మహతా నిర్జగామ హరీశ్వరః. ౬౮

టీక ॥ మహతా= గొప్పదగు; తేన=ఆ; నాదేన= ధ్వనిచేత; హరీశ్వరః, హరి = కోఁతులకు, ఈశ్వరః=ప్రభువగువాలి; నిర్జగామ=బైలువెడలెను.

ఎప్పటి కన్నను విలక్షణముగా



నుండు సుగ్రీవునిసింహనాదమునువిని,వాలి,గృహమునుండిబయలువెడలివచ్చెను.అని తాత్పర్యము.

అనుమాన్య తదా తారాం సుగ్రీవేణ సమాగతః,

టీక ॥ తదా=బయలువెడలునప్పుడు; సః(అధ్యాహృతము)=ఆ వాలి;తారాం = తనభార్యయగు తారను;అనుమాన్య=ఒప్పించి;సుగ్రీవేణ=సుగ్రీవునితో;సమాగతః=చేరెను.

ఇంటినుంచి బయలు వెడలునప్పుడు, వాలి, "సుగ్రీవునకుబలవంతుఁడగు రాముఁడుసహాయుఁడుగానున్నాఁడని మనయంగదునివలనఁదెలియవచ్చుచున్నది, కాఁబట్టినీవిప్పుడు యుద్ధమునకుఁబోవలదు" అనియడ్డగించు తనభార్యయగు తారను,"రాముఁడుపరమధార్మికుఁడు,కాఁబట్టి, నన్నేమియుఁ జేయఁడు" అని యొప్పించి, సుగ్రీవునితో యుద్ధము సేయ సాగెను- అనితాత్పర్యము.

నిజఘానచ తత్రైనం శరేణైకేన రాఘవః. ౬౯

టీక ॥ రాఘవశ్చ=రఘువంశమునందుఁబుట్టినరాముఁడును; తత్ర = ఆయుద్ధభూమియందు; ఏనం=ఈవాలిని; ఏకేన=ఒకటైన; శరేణ=బాణముచే;నిజఘాన=చంపెను.

అతిపూజ్యమగు రఘువంశమునందుఁబుట్టుటచే సకలధర్మసూక్ష్మములనెఱింగినరాముఁడు, యుద్ధభూమియందుఁజాల వరబలముగలిగి సుగ్రీవునితో యుద్ధముసేయుచున్న వాలిని, ఒకబాణముతోనే, చంపెను.అనితాత్పర్యము.

తత స్సుగ్రీవవచనా ద్ధత్వా వాలిన మాహవే
సుగ్రీవమేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్. ౭౦

టీక॥ సుగ్రీవవచనాత్, సుగ్రీవ=సుగ్రీవునియొక్క,వచనాత్=మాటవలన;ఆహవే=యుద్ధమునందు; వాలినం=వాలిని; హత్వా=

చంపి;తతః=అటుపిమ్మట; రాఘవః=రఘువంశమునందుఁబుట్టినరాముఁడు;తద్రాజ్యే, తత్ =ఆవాలియొక్క,రాజ్యే=దొరతనమందు;సుగ్రీవమేవ= సుగ్రీవునే;ప్రత్యపాదయత్ =ప్రతిష్ఠించెను.

రాముఁడు సుగ్రీవుని ప్రార్థనప్రకారము, సుగ్రీవునితో యుద్ధముసేయుచుండునపుడు, వాలినిజంపి, యావెనుక, నావాలిరాజ్యమందు,సుగ్రీవునే,పట్టాభిషిక్తుఁజేసెను. అనితాత్పర్యము.

సచ సర్వాన్ సమానీయ వానరాన్ వానరర్షభః
దిశః ప్రస్థాపయామాస దిదృక్షుర్జనకాత్మజామ్. ౭౧

టీక ॥ సః=ఆ;వానరర్షభశ్చ = సుగ్రీవుఁడును;జనకాత్మజాం, జనక=జనకమహారాజుయొక్క; ఆత్మజాం=పుత్రియగుసీతాదేవిని,దిదృక్షుః = చూడ నిచ్ఛగలవాఁడై;సర్వాన్ = సమస్తము లైన; వానరాన్=కోఁతులను;సమానీయ=రప్పించి;దిశః=దిక్కులనుగూర్చి;ప్రస్థాపయామాస=పంపెను.

వానరప్రభువైన యాసుగ్రీవుఁడును,రామునకుఁ బ్రత్యుపకరింపఁదలంచినవాఁడై, సీతాదేవిని వెదకి చూచి వచ్చుటకుఁగా, సమస్తవానరులనురప్పించినాలుగుదిక్కులకును బంపెను.అనితాత్పర్యము.

తతో గృధ్రస్య వచనాత్సంపాతే ర్హనుమాన్బలీ
శతయోజనవిస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్. ౭౨

అ, ఇట్లుకిష్కింధాకాండకథనుజెప్పి యిఁకసుందరకాండ కథను జెప్పుచున్నారు.

టీక॥తతః=అటువెనుక;బలీ=ప్రశస్తమైనబలముగల;హనుమాన్=హనుమంతుఁడు; సంపాతేః=సంపాతియనెడు; గృధ్రస్య=గద్దయొక్క;వచనాత్ = మాటవలన;శతయోజనవిస్తీర్ణం, శతయోజన = నూఱుయోజనములచే, విస్తీర్ణం=వెడల్పుగల;లవణార్ణవం=ఉప్పుసముద్రమును;పుప్లువే=దాఁటెను.




విశేషార్థము.— "బలీ, హనుమాన్" అనుశబ్దములచే, జాంబవంతుం డుత్సాహము కల్పింపఁగాహనుమంతునకప్రమేయమైనబలముగలుగుట, సూచితమైనది.

సుగ్రీవుఁడు వానరుల నాలుగుదిక్కులకునుబంపినపిమ్మట, బలవంతుఁడగుహనుమంతుఁడు, సంపాతియనెడుగద్దబోధించినప్రకారము, నూఱుయోజనముల వెడల్పుగలయప్పుసముద్రమును, దాఁటెను. అని తాత్పర్యము.

తత్ర లంకాం సమాసాద్య పురీం రావణపాలితామ్
దదర్శ సీతాం ధ్యాయంతీ మశోకవనికాం గతామ్. ౭౩

టీక॥ సః=(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; రావణ పాలితాం, రావణ= రావణునిచే, పాలితాం = రక్షింపఁబడిన; లంకాం= లంకయనెడు; పురీం =పట్టణమును; సమాసాద్య=చేరి; తత్ర=ఆలంకాపురియందు; అశోకవనికాం=అశోకవనికయనెడు రావణునియంతఃపురోద్యానమును; గతాం=పొందినదియు; ధ్యాయంతీం=రామునే, స్మరింపుచున్నదియునగు; సీతాం=సీతాదేవిని; దదర్శ=చూచెను.

విశేషార్థము.— నవిద్యతేశోకః, యస్యాః, సాఅశోకా, అశోకాచసావనికాచ; అశోకవనికా. దేనికి దుఃఖములేదో, అనఁగా, ఎచ్చోనుండువారికిదుఃఖములేదో; అది "అశోకా" అనఁబడును; అశోకయగువనికకాఁగా; "అశోకవనికా" అనిచెప్పఁబడుచున్నది. "వనికా" అనఁగా, చిన్నవనము; అనఁగా, "అంతఃపురములోనుండువనము", అనుట. లేక; అశోకానాం వనికా, "అశోకవృక్షములవనము" అనుట.

ఆహనుమంతుఁడు, సముద్రమును దాఁటి, రావణునిచేఁబాలింపఁబడుచుండు, లంకాపురిఁజేరి, యచ్చట, నశోకవనికయనెడు రావణునియంతఃపురోద్యానమున నెప్పుడును రామునే స్మరింపుచున్న సీతా దేవిని, జూచెను-అని తాత్పర్యము.




నివేదయిత్వాఽభిజ్ఞానం ప్రవృత్తించ నివేద్యచ
సమాశ్వాస్యచ వైదేహీం మర్దయామాస తోరణమ్. ౨౪

టీక ॥ సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; అభిజ్ఞానం= గుఱుతును; నివేదయిత్వా= సమర్పించి; ప్రవృత్తించ= వృత్తాంతమును; నివేద్యచ = విన్నవించియు; వైదేహీం= సీతాదేవిని; సమాశ్వాస్యచ= ఊఱడించియు; తోరణం= బహిర్ద్వారమును; మర్దయామాస= చూర్ణముచేసెను.

ఆహనుమంతుఁడు, రాముఁడు తనచేతికిచ్చిన యంగుళీయకమును, సీతాదేవికి, గుఱుతుగా సమర్పించి, సుగ్రీవునకును రామునకును సఖ్యము గలిగినది మొదలుగ వృత్తాంతమంతయును విన్నవించి, "రాముఁడుశీఘ్రముగా వచ్చును దుఃఖింపకు" మని యాబిడనూఱడించి; ఆయశోకవనబహిర్ద్వారమును, చూర్ణము చేసెను. అనితాత్పర్యము.

పంచసేనాగ్రగాన్ హత్వా సప్త మంత్రిసుతానపి
శూర మక్షంచ నిష్పిష్య గ్రహణం సముపాగమత్. ౨౫

టీక ॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; సేనాగ్రగాన్= సేనాపతులను; పంచ=ఐదుగురిని; మంత్రిసుతాన్, మంత్రి= మంత్రులయొక్క; సుతాన్=కుమారులను; సప్తాపి=ఏడ్వురను; హత్వా=చంపి; శూరం=యుద్ధమునకు భయపడనివాఁడగు; అక్షంచ=అక్షుఁడను రావణుకుమారుని, నిష్పిష్య= ముద్దచేసి; గ్రహణం= బంధనమును; సమపాగమత్ =పొందెను.

ఆహనుమంతుఁడు, సేనాపతులనైదుగురను, మంత్రిపుత్రుల నేడ్వురనుజంపిశూరుఁడగు నక్షకుమారునివధించివానిశరీరమును ముద్దగాఁజేసి, యింద్రజిత్తుచేఁబ్రయుక్తమైన బ్రహ్మాస్త్రమునకుఁ, గట్టువడెను. అనితాత్పర్యము.

అస్త్రేణోన్ముక్త మాత్మానం జ్ఞాత్వాపైతామహాద్వరాత్
మర్షయన్రాక్షసాన్వీరో యంత్రిణస్తాన్యదృచ్ఛయా. ౨౬

తతోదగ్ధ్వా పురీం లంకా మృతే సీతాంచ మైథిలీమ్
రామాయ ప్రియమాఖ్యాతుం పునరాయాన్మహాకపిః. ౭౭

టీక॥ వీరః=పరాక్రమశాలియగు; మహాకపిః = హనుమంతుఁడు; పైతామహాత్ = బ్రహ్మచేనివ్వఁబడిన; వరాత్ =వరమువలన; ఆత్మానం=తన్ను; అస్త్రేణ=బ్రహ్మాస్త్రముచే; ఉన్ముక్తం=విడువఁబడినవానిఁగా; జ్ఞాత్వా=తెలిసికొని; యదృచ్ఛయా=మఱియొక కార్యమునందలియాపేక్షచే; యంత్రిణః=త్రాటిచేఁ దన్నుఁ గట్టి యీడ్చుచున్న; తాన్=ఆ; రాక్షసాన్=రాక్షసులను; మర్షయన్=క్షమించుచు; తతః=ఆకార్యమైన వెనుక; మైథిలీం=మిథిలారాజ పుత్రియగు; సీతాం చ=సీతాదేవిని (చకారముచే)విభీషణగృహమును; ఋతే=విడిచి; లంకాం=లంకయనెడు; పురీం=పట్టణమును; దగ్ధ్వా=కాల్చి; రామాయ=రాముని కొఱకు; ప్రియం=సంతోషవార్తను; ఆఖ్యాతుం=చెప్పుటకు; పునః=మఱల; ఆయాత్ = వచ్చెను.

సురాసురులకు సగా ప్రవేశింపఁగూడని లంకాపురిని బ్రవేశించి సీతంగాంచుటచేఁబ్రసిద్ధమగుపరాక్రమముగలహనుమంతుఁడు, పూర్వముతనకుబ్రహ్మదేవుఁడిచ్చినవరముయొక్కమహిమవలన, తన్నుబ్రహ్మాస్త్రబంధము వదలిపోవుట నెఱింగి, తన్నుఁద్రాటిచేఁగట్టి యీడ్చుకొనిపోవుచున్నరాక్షసులను వధించుటకుసమర్థుఁడైనను, రావణునిఁజూడఁగోరి, వారినిమన్నించుచు, తానురావణునితోమాటలాడిన వెనుక, సీతాదేవియుండుప్రదేశమునువిభీషణగృహమునుమాత్రము విడిచి, లంకాపురినంతయుఁగాల్చి, రామునకీసంతోషవార్తనుజెప్పుటకై, మఱల రాముని సమీపమునకు వెళ్లెను. అని తాత్పర్యము.

సోఽభిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్
న్యవేదయ దమేయాత్మా దృష్టాసీతేతి తత్త్వతః. ౭౮

టీక॥ అమేయాత్మా, అమేయ=లెక్కింపరాని, ఆత్మా=బుద్ధిగల; సః=ఆహనుమంతుఁడు; మహాత్మానం, మహత్=గొప్పదగు, ఆత్మానం=ధైర్యముగల; రామం=రాముని; అభిగమ్య=పొంది; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా=చేసి; సీతా=సీతాదేవి; దృష్టా=చూడఁబడినది; ఇతి=ఇట్లని; తత్త్వతః=యథార్థముగా; న్యవేదయత్=విన్నవించెను.

విశేషార్థము.— "సీతాదృష్టా" (సీతాదేవిచూడఁబడెను) అని చెప్పఁదగియున్నను, అట్లుచెప్పక, "దృష్టాసీతా" (చూడఁబడినదిసీతాదేవి) అనినిర్దేశించుట, "సీతా" అనియుచ్చరించినమాత్రముననే, పైమాట నుచ్చరించుటకు మునుపు, "సీతబ్రతికియున్నదోలేదో, చూడఁబడెనోలేదో" అనిరామునకుఁదోఁచునమంగళశంకనునివారించుటకై, చేయఁబడినది.

అతి బుద్ధిశాలియగు హనుమంతుఁడు, సీతావియోగము గలిగినను ఎంత మాత్రమును దగ్గని ధైర్యము గలరామునివద్దకుఁబోయి, యాతనివలగొని, "చూడఁబడెనుసీత" యని, యథార్థముగావిన్నవించెను. అని తాత్పర్యము.

తత స్సుగ్రీవసహితో గత్వా తీర మ్మహోదధేః
సముద్రం క్షోభయామాస శరై రాదిత్యసన్నిభైః. ౭౯

అ, ఇట్లు సుందరకాండ కథను జెప్పి యిప్పుడుయుద్ధకాండ కథను జెప్పుచున్నారు.

టీక ॥ తతః=అటుపిమ్మట; సః (అధ్యాహృతము)=ఆరాముఁడు; సుగ్రీవసహితః, సుగ్రీవ=సుగ్రీవునితో, సహితః=కూడుకొనినవాఁడై; మహోదధేః=సముద్రముయొక్క; తీరం=గట్టును; గత్వా=పొంది; ఆదిత్యసన్నిభైః, ఆదిత్య=సూర్యునితో, సన్నిభైః=సమానములైన; శరైః = బాణములచే; సముద్రం=సముద్రుని; క్షోభయామాస=కలఁతపడఁజేసెను.

హనుమంతుఁడు సీతావృత్తాంతమును జెప్పినవెనుకనే, రాముఁడు,

సుగ్రీవుని వెంటఁబెట్టుకొని సముద్ర తీరముఁజేరి, సముద్రుఁడుతనకువశముగాకుండుటఁజూచి కోపించి, సూర్యుని వలెఁ దీక్ష్ణములైన బాణములచే, నాసముద్రునిఁగలఁతపడఁ జేసెను. అని తాత్పర్యము.

దర్శయామాస చాత్మానం సముద్ర స్సరితాం పతిః
సముద్రవచనాచ్చైవ నళం సేతు మకారయత్. ౮౦

టీక ॥ సరితాం= నదులకు; పతిః=ప్రభువైన; సముద్రశ్చ=సముద్రుఁడును; ఆత్మానం = తనరూపమును; రామాయ (అధ్యాహృతము)=రామునికొఱకు; దర్శయామాస=చూపెను. సః (అధ్యాహృతము)=ఆరాముఁడు; సముద్రవచనాచ్చైవ, సముద్ర = సముద్రుని యొక్క, వచనాచ్చైవ=మాటవలననే; నళం=నళుని; సేతుం=సేతువును; అకారయత్ = చేయించెను.

నదీ నాయకుఁడగు సముద్రుఁడు, రామునికోపమునకు భయపడి, నిజరూపమును, రామునకుఁజూపెను; ఆ రాముఁడును, సముద్రునిమాట ప్రకారము, నళునిచే, సేతువు కట్టించెను. అని తాత్పర్యము.

తేన గత్వా పురీం లంకాం హత్వా రావణ మాహవే
రామ స్సీతా మను ప్రాప్య పరాం వ్రీడా ముపాగమత్. ౮౧

టీక॥ రామః= రాముఁడు; తేన= ఆసేతువుచే, లంకాం = లంకయనెడు; పురీం=పట్టణమును; గత్వా= పొంది; ఆహవే= యుద్ధమునందు; రావణం=రావణుని; హత్వా=చంపి; సీతాం=సీతాదేవిని; ప్రాప్య= పొంది; అను=అటువెనుక; పరాం= అధికమైన; వ్రీడాం= సిగ్గును; ఉపాగమత్ =పొందెను.

రాముఁడా సేతు మార్గమున నేలంకాపురిఁజేరి, యుద్ధమునందు రావణు వధించి, సీతాదేవినిబొందియటువెనుక, "పరగృహములోఁ జాలఁగాలమువసించినభార్య నెట్లు పరిగ్రహింతు" నని యధికముగా సిగ్గుపడెను. అని తాత్పర్యము.

తా ముువాచ తతో రామః పరుషం జనసంసది,

టీక ॥ తతః=అందువలన; రామః=రాముఁడు; తాం=ఆసీతాదేవినిగూర్చి; జనసంసది, జన=జనుల యొక్క, సంసది = సభయందు; పరుషం=కఠినమగుమాటను; ఉవాచ=పలికెను,

అందువలన రాముఁడు, మహా పాతివ్రత్యముతోఁ గూడి యున్న యాసీతాదేవితో, దేవతలువానరులురాక్షసులువినుచుండఁ, గ్రూరముగా మాటలాడెను. అని తాత్పర్యము.

అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం సతీ. ౬౨

టీక ॥ సతీ = పతివ్రతయగు; సా=ఆ, సీతా= సీతాదేవి; అమృష్యమాణా=సహింపలేనిదై; జ్వలనం=అగ్నిహోత్రమును; వివేశ= చొచ్చెను.

ఆసీతాదేవి, పతివ్రతకావున, రాముఁడు, తనయందు దోషముదలంచుటకు సహింప లేక, యగ్ని హోత్రముఁ జొచ్చెను. అని తాత్పర్యము.

తతోఽగ్ని వచనా త్సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్
బభౌ రామ స్సంప్రహృష్టః పూజిత స్సర్వ దైవతైః. ౬౩

తతః = ఆపిమ్మట; రామః= రాముఁడు; అగ్ని వచనాత్; అగ్ని = అగ్నిహోత్రునియొక్క, వచనాత్=మాటవలన; సీతాం=సీతాదేవిని; విగతకల్మషాం, విగత= పోయినదిగాఁబోయిన, కల్మషాం=దోషముగలదానిఁగా, జ్ఞాత్వా=ఎఱింగి, సంప్రహృష్టః = సంతోషించినవాఁడును; సర్వదైవతైః= ఎల్లదేవతలచేతను; పూజితః=పూజింపఁబడినవాఁడునై, బభౌ=ప్రకాశించెను.

సీతాదేవియగ్నిప్రవేశముచేసినవెనుక, రాముఁడగ్ని హోత్రుని మాటనుబట్టి, సీతాదేవిని గరణత్రయమందును ఎంతమాత్రము దోష గంధము లేని దానిఁగా నెఱింగి, "ప్రియు రాలగు సీతాదేవి, పరిశుద్ధురాలై పరిగ్రహింపఁ దగి

యున్నదిగదా" యనిసంతోషించి, సమస్తదేవతలచేతను బూజింపఁ ఒడినవాఁడై, ప్రకాశించెను.అని తాత్పర్యము.

కర్మణా తేన మహతా త్రైలోక్యం సచరాచరమ్
సదేవర్షిగణం తుష్టం రాఘవస్య మహాత్మనః. ౮౪

టీక॥ మహాత్మనః,మహత్ = అధికమగు, ఆత్మనః=ధైర్యముగల; రాఘవస్య = రామునియొక్క; మహతా=గొప్పదియగు; తేన=ఆ, కర్మణా=రావణవధరూపమగు, కార్యముచే; సచరాచరం= జంగమస్థావరములతోఁ గూడినవియు; సదేవర్షిగణం, దేవ=దేవతలయొక్కయు,ఋషి= ఋషులయొక్కయు, స+గణం = సమూహములతోఁగూడుకొనినవియునగు; త్రైలోక్యం = మూఁడులోకములును; తుష్టం=సంతోషించినవి.

విశేషార్థము.— స్థావరములగువృక్షాదులయొక్క సంతోషము, చిగిరించుట మొదలగు వానిచేఁ దెలియ వచ్చుచున్నది- గనుకనే, "అంతస్సంజ్ఞా భవంత్యేతే"(ఈస్థావరములగువృక్షాదులు సూక్ష్మములగుసంజ్ఞలుగలిగియున్నవి) అనివిష్ణుపురాణమునందు, "స్థావరములు సగా, సంజ్ఞలచే, సంతోషాదిభావములను,సూచింపుచున్నవి" అని, చెప్పఁబడియున్నది. ఆసంజ్ఞలు, చిగిరించుటమొదలగునవి.

మహాధైర్యశాలియగు రాముఁడు,దుర్జయుఁడును లోకకంటకుఁడునగు రావణునిఁ జంపుటచే,జంగమస్థావరాత్మకములైన మూఁడు లోకములును,దేవతాఋషిసమూహసహితముగా సంతోషించినవి. అనితాత్పర్యము.

అభిషిచ్యచ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్
కృతకృత్య స్తదా రామో వి జ్వరః ప్రముమోదహ. ౮౫

టీక॥రామః=రాముఁడు; రాక్షసేంద్రం,రాక్షస=రక్కసులకు, ఇంద్రం = ప్రభు వగు; విభీషణం=విభీషణునికి లంకాయాంచ=

లంకయందును; అభిషిచ్య=అభిషేకించి; తదా = అప్పుడు; కృతకృత్యః, కృత=చేయఁబడిన, కృత్యః= ప్రతిజ్ఞారూప కార్యముగలవాఁడును; విజ్వరః, వి=పోయిన, జ్వరః= అంతస్తాపముగలవాఁడునై; ప్రముమోద= సంతసించెను; హ=ఆశ్చర్యము.

రాముఁడు, పూర్వముతనచేస ముద్రతీరమందు రాక్షసరాజుగాన భిషిక్తుఁడైన విభీషణుని, మఱలలంకాపురియందును బ్రతిజ్ఞా ప్రకారము, అభిషిక్తునిఁజేసికృతకృత్యుఁడైనందునఁ, "దనప్రతిజ్ఞ నెఱవేఱునో, నెఱవేఱదో" అనెడితాపమించుకయులేక, సంతసించెను- రాముని సత్యవ్రతమత్యాశ్చర్యకరము ! అని తాత్పర్యము.

అర్థాంతరము.— రామః; రాక్షసేంద్రం; విభీషణం; లంకాయాంచ; అభిషిచ్య; తదా; కృతకృత్యః; విజ్వరః, వి=పక్షియగుజటాయువువిషయమై, జ్వరః=అంతస్తాపముగలవాఁడునై; ప్రముమోద; హ;

రాముఁడు, తనప్రతిజ్ఞాప్రకారము, విభీషణుని లంకాపురిలోరాక్షసరాజుగానభిషిక్తునిఁజేసి, కృతకృత్యుఁడై, తండ్రి, ఒకకొడుకుచనిపోయినపిమ్మట మఱియొకకొడుకునకు ఉత్సవకాలము వచ్చినప్పుడు సంతోషమునిండియున్నను చనిపోయిన కొడుకును దలంచుకొని దుఃఖము నొందునట్లు, రాజ్యాభిషేకమును బొందకయె చనిపోయిన జటాయువునుదలంచుకొని దుఃఖించుచు, సంతసించెను. అని తాత్పర్యము.

దేవతాభ్యో వరంప్రాప్య సముత్థాప్యచ వానరాన్
అయోధ్యాం ప్రస్థితోరామః పుష్పకేణ సుహృద్వృతః. ౮౬

టీక॥ రామః=రాముఁడు; దేవతాభ్యః=వేల్పులవలన; వరం= వరమును; ప్రాప్య=పొంది; వానరాన్=కోఁతులను; సముత్థాప్య చ=లేపియు; సుహృద్వృతః, సుహృత్=స్నేహితులచే; వృతః= చుట్టఁబడినవాఁడై; పుష్పకేణ=పుష్పకమను విమానముచే; అయో

ధ్యాం=అయోధ్యనుగూర్చి; ప్రస్థితః=తర్లెను.

రాముఁడు, రావణ వధానంతరము విజయ లక్ష్మీవిరాజమానుఁడైనతన్నుఁజూడవచ్చిన దేవతలవలనవరముఁ బొంది, యావరముచే యుద్ధమునందుఁజచ్చినవానరులనందఱఁబ్రతికించికొని, సుగ్రీవవిభీషణాదిస్నేహితులతోఁగూడి, పుష్పకవిమానారూఢుఁడై, యయోధ్యనుగూర్చి పయనమైపోయెను. అని తాత్పర్యము.

భరద్వాజాశ్రమం గత్వా రామ స్సత్యపరాక్రమః
భరతస్యాంతికం రామో హనూమంతం వ్యసర్జయత్. ౮౭

టీక॥ సత్యపరాక్రమః, సత్య=సత్యమునందు; పరాక్రమః= దార్ఢ్యముగల; రామః=రాముఁడు; భరద్వాజాశ్రమం, భరద్వాజ= భరద్వాజమహర్షియొక్క; ఆశ్రమం= పర్ణశాలను, గత్వా=పొంది; రామః (క్రియాభేదముఁబట్టి మఱలఁజెప్పఁబడినది)=రాముఁడు; భరతస్య=భరతునియొక్క; అంతికం=సమీపమునుగూర్చి; హనూమంతం=హనుమంతుని; వ్యసర్జయత్= పంపెను.

సత్యవ్రతుండగు రాముఁడు, భరద్వాజమహామునియొక్క యాశ్రమమునకువెళ్లి, వారియాజ్ఞచే నచ్చోట నొకదినముండఁగోరి, తన రాకభరతునకుఁదెలియుటకై, యతనియొద్దకు హనుమంతుని ముందుగాఁబంపెను. అని తాత్పర్యము.

పునరాఖ్యాయికాం జల్పన్ సుగ్రీవసహితశ్చ సః
పుష్పకం తత్సమారుహ్య నందిగ్రామం యయౌతదా. ౮౮

టీక ॥ పునః=మఱల; సః=ఆ రాముఁడు; సుగ్రీవసహితశ్చ, సుగ్రీవ=సుగ్రీవునితో, సహితశ్చ=కూడినవాఁడును (చకారముచే) విభీషణాదులతోఁ గూడిన వాఁడునై; తత్=ఆ; పుష్పకం=పుష్పకవిమానమును; సమారుహ్య=ఎక్కి; ఆఖ్యాయికాం= పూర్వవృత్తాంతమును;

జల్పన్=చెప్పుచు; నందిగ్రామం=నందిగ్రామమును; తదా=అప్పుడు; యయౌ=పొందెను.

ఆరాముఁడు, సుగ్రీవవిభీషణాదులఁగూడి, పుష్పకవిమానారూఢుఁడై, పూర్వవృత్తాంతములను జెప్పికొనుచు నందిగ్రామమునకు వెళ్లెను. అని తాత్పర్యము.

నందిగ్రామే జటాం హిత్వా భ్రాతృభి స్సహితో౽నఘః
రామ స్సీతా మనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్. ౮౯

టీక॥ అనఘః=పాపరహితుఁడైన; రామః = రాముఁడు; భ్రాతృభిః=తోడఁబుట్టువులతో; సహితః=కూడినవాఁడై; నందిగ్రామే=నందిగ్రామమందు; జటాం= జటను; హిత్వా=విడిచి; సీతాం=సీతాదేవిని; అనుప్రాప్య=అనుకరించి; పునః=మఱల; రాజ్యం=దొరతనమును; అవాప్తవాన్=పొందెను.

పాపరహితుఁడగు రాముఁడు, తోడంబుట్టువులఁగూడి, నందిగ్రామమందు, జటనువిడిచి, మునివేషమును విడుచుటచే, సీతాదేవిననుకరింపుచు, మఱల రాజ్యమును బొందెను. అని తాత్పర్యము.

ప్రహృష్టముదితో లోక స్తుష్టః పుష్ట స్సుధార్మికః
నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్ష భయవర్జితః. ౯౦

టీక॥ లోకః=జనము; ప్రహృష్టముదితః, ప్రహృష్ట=గగుర్పాటుగలిగినదియు, ముదితః= సంతసించినదియు; తుష్టః=కోరికలను బొందుటచేఁ గలుగు ప్రీతితోఁ గూడినదియు; పుష్టః= సంతోషముచే వృద్ధిఁబొందిన శరీరము గలిగినదియు; సుధార్మికః= చక్కఁగా ధర్మములనాచరించునదియు; నిరామయః=పీడలేనిదియు; అరోగః= వ్యాధిలేనిదియు; దుర్భిక్షభయవర్జితశ్చ, దుర్భిక్ష=క్షామమువలనఁ గలుగు; భయ=భయముచే; వర్జితశ్చ=విడువఁబడినదియు; ఆసీత్ (అధ్యాహృతము)=ఐనది; హి=ఆశ్చర్యము.

రాముఁడు రాజ్యాభిషిక్తుఁడగు

చుండఁగా,లోకమునకంతయు,నానందాతిశయమున గగుర్పాటుగలిగెను. "ఇచ్ఛామోహి మహాబాహుంరఘువీరం మహాబలం, గజేన మహతా యాంతం రామంఛత్రావృతాననం" (మహాబాహువునుమహాబలుఁడును రఘువీరుఁడునగురాముఁడు,పట్టాభిషిక్తుఁడై, మహాగజమునెక్కి శ్వేతచ్ఛత్రచ్ఛాయచేఁ గప్పఁబడినముఖము గలిగియుండఁగోరెదము)అనియయోధ్యాకాండములోఁజెప్పఁబడినట్లుతమకోరికసఫలమగుటచేలోకమంతయుఁ బ్రకృతియుక్తమయ్యె-సంతోషాతిశయమునంజేసిస్థావరజంగమాత్మకమైనప్రపంచముయొక్క శరీరమంతయువృద్ధిఁబొందెను-ప్రజలందఱుఁజక్కగాధర్మము నాచరించు చుండిరి. లోకమందుఁ బీడావ్యాధి దుర్భిక్షభయములును దొలంగిపోయెను. అనితాత్పర్యము.

నపుత్రమరణం కించి ద్ద్రక్ష్యంతి పురుషాః క్వచిత్
నార్య శ్చావిధవా నిత్యం భవిష్యంతి పతివ్రతాః. ౯౧

అ, ఇట్లు యుద్ధకాండకథను జెప్పియిఁక నుత్తరకాండకథను జెప్పుచున్నారు.

టీక ॥ పురుషాః= పురుషులు; క్వచిత్ = ఒకానొకచోటనైనను; కించిత్=కొంచెమైనను; పుత్రమరణం, పుత్ర=కొడుకుయొక్క, మరణం=చావును;నద్రక్ష్యంతి=చూడఁబోరు- నార్యశ్చ = స్త్రీలును; నిత్యం= ఎల్లప్పుడును; అవిధవాః= ముండమోపులు గానివారలును, లేక,అవిధవాః= వివిధులైనభర్తలుగలుగనివారలును, అనఁగా,వ్యభిచారిణులుకానివారలును; పతివ్రతాః=పతిభక్తిగలవారలునై; భవిష్యంతి=అగుదురు.

రాముఁడుధారతనము సేయునపుడు; తండ్రిబ్రతికియుండఁగాఁ బుత్రుఁడుచావఁబోఁడు; స్త్రీలందఱు విధవలుకాకుండఁబతివ్రతలైయుందురు. అనితాత్పర్యము.

నచాగ్నిజం భయం కించి న్నాప్సు మజ్జంతి జంతవః
నవాతజం భయం కించి న్నాపి జ్వరకృతం తథా. ౯౨
నచాపి క్షుద్భయం తత్ర నతస్కర భయం తథా

టీక॥ తత్ర=ఆరామరాజ్యమందు; అగ్నిజం, అగ్ని=నిప్పువలన, జం=పుట్టునట్టి; భయం=భయము; కించిత్=కొంచమైనను; నభవిష్యతి("భవిష్యతి" అనునదియధ్యాహృతము; ఇట్లుత్తరస్థలములయందును దెలిసికొనునది.)=కలుగదు. జంతవః=ప్రాణులు; అప్సు=నీళ్లయందు; నమజ్జంతి=మునుఁగరు, అనఁగా, మునిఁగిచావరు. వాతజం, వాత=వాయువువలన, జం=పుట్టునట్టి; భయం=భయము; కించిత్=కొంచెమైనను; నభవిష్యతి=కలుగదు. తథా=అట్లు; జ్వరకృతం, జ్వర=జ్వరమువలన, కృతం=కలుగునట్టి; భయమపి (అధ్యాహృతము)=భయమును; నభవిష్యతి=కలుగదు. క్షుద్భయంచాపి, క్షుత్=ఆఁకలివలనఁ గలుగు, భయంచాపి=భయమును; నభవిష్యతి=కలుగదు-తస్కరభయంతథా, తస్కర=దొంగలవలనఁగలుగు, భయం తథా=భయమును; నభవిష్యతి=కలుగదు.

రామరాజ్యమందు, కొంచెమైన, నగ్నిభయముగలుగదు; ప్రాణులునీళ్లలోమునిఁగిచావరు; ఎంతమాత్రమునువాయుభయముకలుగదు; స్వల్పమైనను, జ్వరభయముజనింపదు; ప్రాణులు, ఎప్పుడునుసిద్ధభోజనులుగానున్నస్దున, ఆఁకలిదుఃఖమెట్టిదో యెఱుంగఁజాలరు; రాముఁడుదుష్టులఁగఠినముగాశిక్షించువాఁడుకావునఁబ్రజలకుదొంగలభయముకొంచెమైననుగలుగదు. అని తాత్పర్యము.

నగరాణిచ రాష్ట్రాణి ధనధాన్యయుతానిచ. ౯౩

టీక ॥ నగరాణి=పట్టణములును; రాష్ట్రాణిచ=దేశములును; ధనధాన్యయుతాని, ధన=ధనములతోను, ధాన్య=ధాన్యములతోను,

యుతాని=కూడినవిగా; (చకారముపాదపూరణార్థము.) భవిష్యంతి(అధ్యాహృతము) = కాఁబోవుచున్నవి.

పట్టణములును దేశములును, ధనధాన్యములుగలిగి సమృద్ధములుగానుండును. అని తాత్పర్యము.

నిత్యం ప్రముదితా స్సర్వే యథాకృతయుగే తథా

టీక॥ సర్వే=సమస్తజనులును; నిత్యం=ఎల్లప్పుడును; కృతయుగే=కృతయుగమందు; యథా=ఎట్లు; (సంతోషించిరో) తథా= అట్లు; ప్రముదితాః= సంతోషించినవారలు; భవిష్యంతి(అధ్యాహృతము)= కాఁబోవుచున్నారు.

సమస్తజనులును, సంపూర్ణమైన ధర్మముగల కృతయుగమునందు సంతోషముగలిగియుండునట్లు, రాముఁడు రాజ్యపాలనము సేయుచుండఁగాఁ త్రేతాయుగమందును, సంతోషముగలిగియుండెదరు; అని తాత్పర్యము.

అశ్వమేధ శతై రిష్ట్వా తథా బహు సువర్ణకైః. ౯౪
గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి
అసంఖ్యేయం ధనం దత్వా బ్రాహ్మణేభ్యో మహాయశాః. ౯౫

టీక॥ మహాయశాః, మహత్ = పూజ్యమగు, యశాః= కీర్తిగల; రామః (అధ్యాహృతము) = రాముఁడు; అశ్వమేధశతైః, అశ్వమేధ=అశ్వమేధయాగముల యొక్క, శతైః=నూఱులచే; అనఁగా, అనేకశతసంఖ్యగల యశ్వమేధములచేతను; బహుసువర్ణకైస్తథా= బహుసువర్ణకములను యాగములచేతను; ఇష్ట్వా= దేవతలఁదృప్తినొందించి; గవాం=ఆవులయొక్క; కోట్యయుతం=పదివేలకోట్లను; బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకొఱకు; దత్వా=ఇచ్చి; అసంఖ్యేయం=లెక్కింపరాని; ధనం=ధనమును; బ్రాహ్మణేభ్యః(అధ్యాహృతము)=బ్రాహ్మణులకొఱకు; దత్వా=ఇచ్చి; బ్రహ్మలోకం, బ్రహ్మ=బ్రహ్మయగుతనయొక్క, లోకం=స్థానమును; ప్రయాస్యతి=పొందఁగలఁడు.

విశేషార్థము.—'సుబహూనిసువర్ణానియత్రోపకరణత్వతః, విందంతే సక్రతు స్సద్భిస్స్మృతోబహుసువర్ణకః" (ఏయాగమందు మిక్కిలి యధికమగు సువర్ణము ఉప కరణముగా నుండునో, ఆ యాగము"బహుసువర్ణక" మనఁబడును.) అనుప్రమాణమునుబట్టి; బహుసువర్ణకమనఁగా, అధికమైనబంగార ముపకరణముగాఁ గల యొకయాగము."మహాయశాః" అనుశబ్దముచే, స్వల్పమగు నపవాదమునకుఁగాసీతాదేవిని విడిచిపెట్టుటసూచితమగుచున్నది.

మహాయశుఁడగు రాముఁడు, అనేకశతాశ్వమేధములచేతనుఅనేకబహుసువర్ణకములచేతను దేవతలఁ బూజించి, పదివేలకోట్లగోవులనులెక్కింపరానిధనమును బ్రాహ్మణులకిచ్చి, శాశ్వతమగు తనస్థానమునుబొందఁగలఁడు. అనితాత్పర్యము.

రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః
చాతుర్వర్ణ్యంచ లోకేఽస్మిన్ స్వేస్వేధర్మేనియోక్ష్యతి.౯౬

టీక ॥ అస్మిన్=ఈ; లోకే=భూలోకమందు; రాఘవః= రాముఁడు;రాజవంశాన్, రాజ=క్షత్రియులయొక్క, వంశాన్=కులములను;శతగుణాన్=నూఱింతలైనవానిఁగా; స్థాపయిష్యతి= ప్రతిష్ఠింపఁగలఁడు-చాతుర్వర్ణ్యం=నాలుగు వర్ణములను; స్వేస్వే=తమతమవర్ణాశ్రమములకుఁదగిన; ధర్మే=ధర్మమునందు; నియోక్ష్యతి=ప్రవర్తింపఁజేయఁగలఁడు.

రాముఁడు క్షత్రియులకు రాజ్యములనిచ్చినూఱింతలుగావారివంశమునువృద్ధిఁబొందించును; బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులనువారివారివర్ణాశ్రమములకుఁ దగినధర్మములోఁబ్రవర్తింపఁజేయును. అని తాత్పర్యము.

దశవర్షసహస్రాణి దశవర్షశతానిచ
రామోరాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి. ౯౭

టీక॥ రామః=రాముఁడు; దశవర్షసహస్రాణి = పదివేలసంవత్సరములును; దశవర్షశతానిచ= మఱి, వేయిసంవత్సరములును; అనఁగా, పదునొకండువేలసంవత్సరములు; రాజ్యం = రాజ్యమును; ఉపాసిత్వా=సేవించి ; బ్రహ్మలోకం, బ్రహ్మ = బ్రహ్మ మగువిష్ణువుయొక్క, లోకం=స్థానమైన వైకుంఠమును; గమిష్యతి = పొందఁగలఁడు.

రాముఁడు, పదునొకండువేల సంవత్సరములు, రాజ్యమును, ప్రజలకుసుఖము గలుగునట్లు, పాలించి, వైకుంఠమును బొందఁగలఁడు. అని తాత్పర్యము.

ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్
యః పఠే ద్రామ చరితం సర్వపాపైః ప్రముచ్యతే. ౯౮

టీక॥ పవిత్రం = పరిశుద్ధినిగలిగించునదియు; పాపఘ్నం = పాపములఁ బోఁగొట్టునదియు ; పుణ్యం = పుణ్యమును గలుగఁజేయునదియు; వేదైశ్చ=వేదములతోను; సమ్మితం = సమానమై నదియైనగు; ఇదం=ఈ, పూర్వోక్తమైన; రామచరితం, రామ=రామునియొక్క , చరితం=చరిత్రమును; యః=ఎవఁడు; పఠేత్ = చదువునో; సః (అధ్యాహృతము) = వాఁడు; సర్వపాపైః, సర్వ= సమస్తములైన , పాపైః=పాపములచే; ప్రముచ్యతే=విడువఁబడును.

పరిశుద్ధి సాధనమును సమస్త పాపములఁబోఁగొట్టునదియుఁ బుణ్యప్రదమును సర్వవేదసదృశమునగు నీసంక్షేపరూపమైన రామచరిత్రమును, ఎవ్వఁడు, భక్తియుక్తుఁడై, వేదములఁబఠించునట్లు, నియమముతోఁ, బఠించునో, వాఁడు, సమస్త పాపములచేతను విడువఁబడును. అని తాత్పర్యము.

ఏత దాఖ్యాన మాయుష్యం పఠ న్రామాయణ న్నరః
సపుత్ర పౌత్ర స్సగణః ప్రేత్య స్వర్గే మహీయతే. ౯౯

టీక॥ ఆయుష్యం=ఆయుర్వృద్ధికరమును; ఆఖ్యానం=వాస్తవార్థముగలదియునగు;ఏతత్=ఈ; రామాయణం, రామ = రాముని యొక్క, అయనం ("అయగతౌ" అనుధాతువునఁబుట్టినది)= చరిత్రమును;పఠన్=చదువుచున్న;నరః= మనుష్యుఁడు;సపుత్రపౌత్రః=కొడుకులతోనుమనుమలతోనుగూడినవాఁడును; సగణః = భృత్యబంధు సమూహముతోఁగూడిన వాఁడునై ; ప్రేత్య= దేహమునువిడిచి;స్వర్గే= స్వర్గలోకమందు;మహీయతే = పూజింపఁబడుచుండును.

ఆయుర్వృద్ధి కరంబును వాస్తవార్థప్రతిపాదకమునగునీరామాయణమునుబరించు మనుష్యుఁడు,ఈ లోకమందుఁ,బుత్ర పౌత్రమిత్రభృత్యబంధువులతోఁ గూడిసమస్తభోగముల ననుభవించి, అంతమందు, స్వర్గ లోకమునుబొంది, దేవతలచేఁ బూజింపఁ బడుచుండును. అని తాత్పర్యము.

పఠన్ ద్విజో వాగృషభత్వ మీయాత్
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వ మీయాత్
వణి గ్జనః పణ్యఫలత్వ మీయాత్
జనశ్చ శూద్రోపి మహత్త్వ మీయాత్. ౧౦౦

టీక ॥ పఠన్=ఈరామాయణమునుజదువునట్టి;జనః = మనుష్యుఁడు; ద్విజస్స్యాత్ = బ్రాహ్మణుఁడైనట్టైన; వాగృషభత్వం, వాక్=అష్టాదశవిద్యలయందును, ఋషభత్వం = శ్రేష్ఠుఁడగుటను, అనఁగా, అష్టాదశవిద్యాపారం గతుఁడగుటను ; ఈయాత్ =పొందును. పఠన్ = (అధ్యాహృతము,ఇట్లుత్తరస్థలములయందును దెలిసికొనునది) ఈరామాయణమును జదువునట్టి; జనః (అధ్యాహృతము, ఇట్లుత్తరస్థలములయందునుదెలిసికొనునది) = మనుష్యుఁడు; క్షత్రియస్స్యాత్= క్షత్రియుఁడైనట్టైన; భూమిపతిత్వం, భూమి=భూమండలమునకు,పతిత్వం=ప్రభువగుటను;ఈయాత్ =పొందును.పఠన్=

ఈ రామాయణమును జదువునట్టి; జనః=మనుష్యుఁడు; వణిక్స్యాత్=వైశ్యుఁడైనట్లైన; పణ్యఫలత్వం, పణ్య=క్రయవిక్రయార్హ్యములగు వస్తువులవలన, ఫలత్వం=లాభము గలిగియుండుటను; ఈయాత్=పొందును. పరక్=ఈ రామాయణమును జదువునట్టి; జనః=మనుష్యుఁడు; శూద్రోఽపిచస్యాత్=శూద్రుఁడైనట్లైనను; మహత్త్వం=పూజ్యుఁడగుటను; ఈయాత్=పొందును.

ఈ రామాయణమును, బ్రాహ్మణుఁడు పఠించినట్లైన, నష్టాదశవిద్యా పారంగతుఁడగును; క్షత్రియుఁడు పఠించినట్లైన, భూమండలాధిపత్యమునుబొందును; వైశ్యుఁడుపఠించినట్లైన, వాణిజ్యమునందులాభమును బొందును; శూద్రుఁడు పఠించినట్లైన, శూద్రకులములోఁబూజ్యుఁ డగును. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, సంక్షేపోనామ ప్రథమ స్సర్గః.

టీక॥ ఇతి=ఇట్లు; ఆర్షే=ఋషిప్రోక్తమైన, రామాయణే=రామాయణమనెడు; ఆదికావ్యే=ఆదికావ్యమందలి; బాలకాండే=బాలకాండమందు; సంక్షేపోనామ=సంక్షేపమనిప్రసిద్ధమైన; ప్రథమః=మొదటిదియగు; సర్గః=సర్గము; సమాప్తః (అధ్యాహృతము)=ముగిసినది.

ఇట్లు, ఋషిప్రోక్తమైన రామాయణమనునాదికావ్యమునందలి బాలకాండము నందు, రామాయణకథా సంక్షేపమని ప్రసిద్ధమైన మొదటిసర్గము ముగిసినది. అని తాత్పర్యము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండప్రథమసర్గటీక, ముగిసినది.

శ్రీరామాయనమః.

అథ ద్వితీయసర్గ ప్రారంభః.

నారదస్యతు తద్వాక్యం శ్రుత్వా వాక్య విశారదః
పూజయామాస ధర్మాత్మా సహశిష్యో మహామునిః. ౧

టీక॥ నారదస్య=నారదమహామునియొక్క; తత్=ముందుచెప్పఁబడిన; వాక్యం=వాక్యమును; శ్రుత్వాతు = వినినంతనే;వాక్యవిశారదః,వాక్య= వాక్యములయందు, విశారదః=పండితుఁడును;ధర్మాత్మా, ధర్మ = ధర్మమందు, ఆత్మా =బుద్ధిగలవాఁడునగు, మహామునిః = వాల్మీకిమహాముని; సహశిష్యః= శిష్యునితోఁగూడినవాఁడై; పూజయామాస= పూజించెను.

వాల్మీకిమహాముని, తానుధర్మబుద్ధిగలవాఁడును వాక్యములవిశేషమునెఱింగిన వాఁడును గావున,నారదులుచెప్పిన సంక్షేప రామాయణరూపమగు వాక్యమును వినినంతనే,శిష్యసహితుఁడై, దానిశ్లాఘించెను. అనితాత్పర్యము.

విశేషార్థము.—వాక్యవిశారదః,వాక్య = వాక్యరూపమగుసమస్తశాస్త్రములయందును, విశారదః = పండితుఁడును ; ధర్మాత్మా,ధర్మ = ధర్మమునందు, ఆత్మా = బుద్ధిగలవాఁడును,అనఁగా, ధర్మము నాచరించు వాఁడును, అగు; వాల్మీకిః (అధ్యాహృతము)=వాల్మీకిమహర్షి; నారదస్య= "నరతీతినరఃప్రోక్తః పరమాత్మా సనాతనః" (సనాతనుఁడగుపరమాత్మ, ప్రపంచమునందు సృష్టిస్థితిలయములనయించునుగావున , నరుఁడనంబడును) అనుప్రమాణమును బట్టి;"నరః" అనఁగా, పరమాత్మ, నరసంబంధి, నారం,పరమాత్మ సంబంధిజ్ఞానము "నారం" అనఁబడును ; నారందదాతీతి నారదః ; పరమాత్మ విషయకమగు జ్ఞానమునిచ్చు వాఁడుకావున నారదుఁ డనఁబడును ; ఆశ్రితులకు బ్రహ్మోపదేశము సేయునట్టి నారదమహర్షియొక్క ; తత్ = ఆ, అనఁగా వేదాంత ప్రసిద్ధమైన ;



వాక్యం = వాక్యమును; శ్రుత్వా తు=వినినంతనే; మహామునిః, మహాత్=పూజ్యుఁడైన, మునిః=బ్రహ్మానుసంధానము సేయు వాఁడును; సహశిష్యః=శిష్యునితోఁ గూడినవాఁడునై; పూజయామాస =శ్లాఘించెను.

సమస్తశాస్త్రార్థములఁ దెలిసికొని జ్ఞానమునుగలిగించునట్టి కర్మానుష్ఠానము సేయుచున్న వాల్మీకిమహర్షి, బ్రహ్మోపదేశాచార్యుఁడైన నారదమహర్షి యుపదేశించిన వేదాంతార్థము విని సంతసనె, తాను బ్రహ్మానుభవము నొందుటయేకాక, శిష్యులకును ఆయర్థము నుపదేశించి, శిష్యునితోఁగూడినవాఁడై, యెల్లప్పుడు నావేదాంతపరమార్థానందమునే యనుభవింపు చుండెను. అని తాత్పర్యము.

యథావ త్పూజిత స్తేన దేవర్షి ర్నారద స్తథా
ఆపృష్ట్వై వాభ్యనుజ్ఞాత స్సజగామ విహాయసం. ౨

టీక॥ దేవర్షిః = దేవతయును ఋషియునైన; సః=ఆ; నారదః= నారదుఁడు; తేన=ఆవాల్మీకిమహర్షిచే; యథావత్ = యథాయోగ్యముగ; పూజితః=పూజింపఁబడినవాఁడై; ఆపృష్ట్వైవ = వాల్మీకిని, సంతోషపఱచియే; అభ్యనుజ్ఞాతః=అనుజ్ఞనుబొందినవాఁడగుచు; విహాయసం=ఆకాశమును ; జగామ=పోయెను.

దేవర్షియగు నారదమహామునిని, వాల్మీకిచే యథోచితముగఁ బూజింపఁబడినవాఁడై, యావాల్మీకిని ఆలింగనాదులచే సంతోషపఱచి, వారియనుజ్ఞనుబొంది, యాకాశ మార్గమున, దేవలోకమునకు వెళ్లెను. అని తాత్పర్యము.

విశేషార్థము.—దేవర్షిః, దేవ=దేవతలలోపల, ఋషిః=జ్ఞానపారంగతుఁడగు వాఁడైన ("ఋషీగతౌ" అను ధాతువునఁబుట్టినది); సః= ఆ(వాల్మీకికి జ్ఞానోపదేశము చేసిన); నారదః=జ్ఞానప్రదాతయగునారదమహాముని; తేన=శిష్యుఁడగునావాల్మీకిచేత; యథావత్ = గురువును బూజింపవలసిన రీతిని;




పూజితః=పూజింపఁబడినవాఁడై; అపృష్ట్వా=సంశయములనన్నింటిని దీర్చుటచే,సంతోషపఱచి; అభ్యనుజ్ఞాతఏవ=అనుజ్ఞనుబొందినవాఁడైయే;విహాయసం= (భావప్రధాననిర్దేశము) ఆకాశమగుటను; జగామ=పొందెను.

దేవతలలోజ్ఞానపారంగతుఁడునుఆశ్రితులకు జ్ఞానమునిచ్చువాఁడునగు నారదమహాముని, వాల్మీకికివేదాంతపరమార్థోపదేశముచేసి, యావాల్మీకిచేగురుపూజనుబొంది, యతనికిఁ గలసమస్త సంశయములనుందీర్చి సంతోషపఱచి, తాను, వాల్మీకికిఁ బరమార్థోపదేశముసేయుటకైయే గురుత్వాభిమానమును గల్పించికొనినవాఁడు కావునను, ఆయభిమానముకల్పితముకాఁబట్టి,యుపదేశానంతరము, మఱలశాశ్వతమగుసిరభిమానత్వమే సిద్ధముగానున్నందునను , జ్ఞానోపదేశానంతరమువాల్మీకికిఁగలశిష్యత్వాభిమానమును దనకన్ననుత్కృష్టుఁడను నారదుని యందలి గురుత్వాభిమానమునునశించుటవలనను, మఱల,నాకాశమువలెనిర్వికల్పమగుతనస్వరూపమును బొందెను. అనితాత్పర్యము.

స ముహూర్తం గతే తస్మిన్ దేవలోకం ముని స్తదా
జగామ తమసాతీరం జాహ్నవ్యా స్త్వ విదూరతః. ౩

టీక ॥ తస్మిన్=ఆనారదమహాముని ; ముహూర్తం=అల్పకాలముచే, ("ముహూర్తమల్ప కాలేపి స్యాత్" అనినిఘంటువు ; అత్యంత సంయోగ మందు ద్వితీయ.) దేవలోకం=బ్రహ్మలోకమును; గతే=పొందఁగా; తదా=అప్పుడు;మునిః=వాల్మీకిమహాముని; జాహ్నవ్యాస్తు=గంగానదికిని;అవిదూరతః=సమీపమందు(ఉన్న);తమసాతీరం = తమసానదిగట్టును;జగామ = పొందెను.

ఆనారద మహాముని శీఘ్రములోనేబ్రహ్మలోకమునకువెళ్లినవెనుక,వాల్మీకి, మాధ్యాహ్నిక స్నానముకై, గంగానదికి సమీపమందుండు తమసానదీతీరముఁ,జేరెను. అనితాత్పర్యము.

విశేషార్థము.— తస్మిన్ = తనగురువగు నారదమహామునిః ముహూర్తే=అల్పకాలముచే ; దేవలోకం, దేవ=పరబ్రహ్మముయొక్క, లోకం=స్థానమును, అసంగా, పరబ్రహ్మస్వరూపమును; గతే=పొందఁగా; తదా= అప్పుడు; మునిః = బ్రహ్మను సంధానముసేయుజ్ఞానియగువాల్మీకి ; జాహ్నావ్యాః; అవిదూరతః;తమసాతీరం ; జగామ.

ఆనారదమహాముని, వాల్మీకికుపదేశించినయుత్తరక్షణము నందే, వాల్మీకి కుపదేశము సేయుటకై కల్పించికొనిన గురుత్వము మొదలగు నభిమానములను వదలి, తనయథార్థరూపమగు బ్రహ్మత్వమునుబొందినవెనుక, ఆవాల్మీకిమహర్షి, తాను బ్రహ్మవేత్త కాఁబట్టి, తనకుఁగర్మానుష్ఠానావశ్యకత లేక పోయి నను, "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరేజనాః, సయత్ప్రమాణం కురుతేలోకస్తదనువర్తతే" (ఎద్దాని శ్రేష్ఠుఁడాచరించునో, దానినేయితర జనులు నాచరింతురు ; ఆశ్రేష్ఠుఁడెద్దానిఁబ్రమాణముగాఁ జేయునో, దానిలోకమంతయు ననువర్తించును) అనుగీతావచనమురీతిని, ఉత్తమమగు భృగువంశమునందుఁబుట్టినవాఁడును బ్రహ్మపుత్రుఁడగు నారదమహర్షికిశిష్యుఁడును జితేంద్రియత్వ మహిమంబట్టి "వాల్మీకి" యను నన్వర్థాభిధానమునం బ్రసిద్ధుఁడునగు, తానే, కర్మానుష్ఠానమునువదలినచో, అజ్ఞానులును గర్మానుష్ఠానము కన్న మఱివేఱుగతిలేనివారునగు జనులు, తన్నుఁజూచి, సిద్ధమగు కర్మానుష్ఠానగతినిఅజ్ఞానముచేవిడిచి, యసిద్ధమగుదాని సంపాదింప నశక్తులై, నశింతురని, లోకానుగ్రహార్థమై, యప్రతిబంధకమగుకర్మానుష్ఠానమునం బ్రవర్తింపఁబూని, మాధ్యాహ్నిక స్నానముసేయుటకై తమసాతీరమునకుఁ బోయెను. అనితాత్పర్యము.

సతు తీరం సమాసాద్య తమసాయా మహామునిః
శిష్య మాహ స్థితం పార్శ్వే దృష్ట్వా తీర్థ మకర్దమమ్. ౪

టీక॥ సః=ఆ; మహామునిః = వాల్మీకిమహామునిః; తమసాయాః = తమసానదియొక్క; తీరం = గట్టును; సమాసాద్యతు = పొందినంతనే; అకర్దమం = బురదలేనట్టి; తీర్థం = రేవును; దృష్ట్వా=చూచి; పార్శ్వే=పక్కను; స్థితం = ఉన్నట్టి; శిష్యం = శిష్యుఁడగు భరద్వాజునిఁగూర్చి; ఆహ= (వక్ష్యమాణరీతిని,) చెప్పెను.

ఆవాల్మీకిమహాముని, తమసానదీతీరముఁజేరి, యందుబురదలేనిరేవునుజూచి, పక్కనున్నతనశిష్యుఁడగు భరద్వాజునితోనిట్లని చెప్పెను. అనితాత్పర్యము.

అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనోయథా. ౫

టీక॥ భరద్వాజ=భరద్వాజుఁడా! సన్మనుష్యమనోయథా = సత్పురుషుని హృదయమువలె; అకర్దమం= బురదలేనిదియును, (పక్షాంతరమందు) పాపములేనిదియును; ప్రసన్నాంబు, ప్రసన్న=నిర్మలమైన, అంబు= జలముగలదియును, (ప) జలమువలె నిర్మలమైనదియును (గనుకనే) ; రమణీయం= మనోహరమైనదియునగు; ఇదం= ఈ; తీర్థం = రేవును ; నిశామయ=చూడుము.

ఓభరద్వాజుఁడా! సత్పురుషుని హృదయమువలె నిష్పంకమై నిర్మలజలమై మనోహరమై యుండు నీరేవునుజూడుము. అనితాత్పర్యము.

విశేషార్థము.— ఉపమానమగు సత్పురుషుని హృదయ మందలి పాపరహితత్వమును జలమువలె నిర్మలముగా నుండుటయును, ఉపమేయమగు తీర్థమందలి బురదలేకయుండుటను నిర్మలమైన జలముగలిగియుండుటనుం, దెలిపెడి, అకర్దమప్రసన్నాంబుశబ్దములు, అర్థభేదము గలిగియున్నను, శబ్దభేదములేనివిగావున, సాదృశ్యమును గలిగించుచున్నవి. "అర్థతశ్శబ్దతోవాపిమనాక్కావ్యార్థసూచనం" (గ్రంథాదియందు (అనఁగా, మంగళమునందు.) అర్థము

వలనఁగాని, శబ్దమువలనఁగాని, క్రౌంచెము కావ్యకథను సూచింపఁ నది.) అనువాలంకారికసరణిననుసరించి, వాల్మీకి చెప్పిన యీ "అకర్దమ మిదం తీర్థం" ఇత్యాది గ్రంథ సందర్భమందీ యాదికావ్యముయొక్క కథయును, సూచింపఁబడినవి. అందు: "అకర్దమ మిదం తీర్థం" అనుటచే, పరిశుద్ధమగు సముద్రసేతుస్థలము జ్ఞాపితమైనది.

న్యస్యతాం కలశ స్తాత దీయతాం వల్కలం మమ
ఇదమే వావగాహిష్యే తమసా తీర్థ ముత్తమమ్. ౬

టీక ॥ తాత=నాయనా; కలశః=జలపాత్రము; న్యస్యతాం = క్రిందనుంచఁ బడుఁగాక. మమ= నాకు; వల్కలం=నారచీర; దీయతాం = ఇవ్వఁబడుఁగాక. ఉత్తమం=శ్రేష్ఠమైన; ఇదం=ఈ; తమసాతీర్థమేవ = తమసానది రేవునందే; అవగాహిష్యే=స్నానముచేసెదను.

"నాయనా! జల పాత్రమును క్రిందనుంచుము; నాకునారచీర నిమ్ము; శ్రేష్ఠమైన యీతమసా తీర్థమునందే స్నానముచేసెదను." అని వాల్మీకి శిష్యునితోఁజెప్పెను. అనితాత్పర్యము.

ఏవ ముక్తో భరద్వాజో వాల్మీకేన మహాత్మనా
ప్రాయచ్ఛత మునే స్తస్య వల్కలం నియతో గురోః. ౭

టీక ॥ మహాత్మనా, మహత్=పూజ్యమగు, ఆత్మనా=మనస్సుగల; వాల్మీకేన = వాల్మీకిచేతను; ఏవం=ఈప్రకారము, ఉక్తః=చెప్పఁబడినవాఁడును; గురోః=గురువైనట్టి; నియతః= విధేయుఁడునైన; భరద్వాజః = భరద్వాజుఁడు; తస్య=ఆ; మునేః=వాల్మీకిమహామునికి; వల్కలం=నారచీరను; ప్రాయచ్ఛత=ఇచ్చెను.

ఈప్రకారము, మహాత్ముఁడగు వాల్మీకి యడుగఁగా, గురువిధేయుండైనభరద్వాజుఁడు వాల్మీకికి నారచీరనిచ్చెను. అని తాత్పర్యము.

సశిష్యహస్తా దాదాయ వల్కలం నియతేంద్రియః
విచచారహ పశ్యంస్త త్సర్వతో విపులం వనమ్. ౭

టీక ॥ నియతేంద్రియః, నియత = నిగ్రహింపఁబడిన, ఇంద్రియః=ఇంద్రియములుగల ; సః= ఆవాల్మీకి; శిష్యహస్తాత్, శిష్య= శిష్యునియొక్క, హస్తాత్ = చేతినుంచి; వల్కలం=నారచీరను; ఆదాయ=తీసికొని ; విపులం=విశాలమైన;తత్=ఆ;వనం=వనమును; సర్వతః=అంతటను; పశ్యన్=చూచుచు; విచచార= తిరిగెను. హ= ఆశ్చర్యము.

ఆవాల్మీకి, భరద్వాజుని చేతినుంచి నారచీరను బుచ్చికొని, తానింద్రియ నిగ్రహము గలవాఁడైనను, విశాలమగు నావనము నంతయుఁ జూచుచు, సంచరించెను; ఆశ్చర్యము. అని తాత్పర్యము.

తస్యాభ్యాశేతు మిథునం చరంత మనపాయినం
దదర్శ భగవాం స్తత్ర క్రౌంచయో శ్చారునిస్వనమ్. ౮

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగలవాల్మీకి; ("భగశ్శ్రీ కామ మాహాత్మ్య వీర్యయత్నార్క కీర్తిషు" అనియమరము); తత్ర = ఆవనమునందు;తస్య=ఆరేవునకు; అభ్యాశేతు=సమీపమునందే ; చరంతం= తిరుగుచున్నదియును; అనపాయినం=ఎడఁబాటులేనిదియు ; చారునిస్వనం, చారు=మనోహరమగు, నిస్వనం = ధ్వనిగలదియునగు; క్రౌంచయోః = క్రౌంచపక్షులయొక్క; మిథునం = ఆలుమగల జతను; దదర్శ=చూచెను.

శాపానుగ్రహాది మాహాత్మ్యముగల వాల్మీకిమహర్షి, యావనములో నాతమసా తీర్థమునకు సమీపముననే, సంచరించుచు మనోహరంబుగఁ గూయుచున్నవియు క్షణకాలమైన నెడఁబాటులేనివియునగు క్రౌంచపక్షిదంపతులం జూచెను. అని తాత్పర్యము

ఇందు, వక్ష్యమాణప్రకారము

గఁ, గావ్యకథయు సూచింపఁబడి నది.— భగవాన్=మాహాత్మ్యముగల (అనఁగా, త్రైకాలికజ్ఞానముగల,అనుట) వాల్మీకిమహర్షి; తస్య=ఆసముద్రమునకు;అభ్యాశేతు = సమీపమందే; తత్ర= ఆలంకాపురియందు; చరంతం = భోగములననుభవించుచున్నదియు(“చర గతిభక్షణయోః” అనుధాతువువలనఁ బుట్టినది)అనపాయినం=బ్రహ్మవరమహిమవలన, బహుకాలమునుండి యపాయములేనిదియు;చారునిస్వనం=మనోహరమగువీణానాదముగలదియు నగు; క్రౌంచయోః=కుటిలులగురాక్షసుల యొక్క (“క్రుంచగతికౌటిల్యాల్పీ భావయోః” అనుధాతువువలనఁబుట్టినది);మిథునం=ఆలుమగలజతను ; దదర్శ=తెలిసికొనెను.

భూతభవిష్యద్వర్తమానజ్ఞానముగలయావాల్మీకిమహర్షి, సముద్రతీరమందున్న లంకాపురియందు సమస్త భోగములననుభవించుచు,బ్రహ్మదేవునివరమునంజేసి దీర్ఘకాలమునుండి యపాయములేక,మనోహరంబగువీణానాదముమొదలగు క్రీడారసంబులం దేలుచున్నరాక్షసదంపతుల నెఱింగెను. అనితాత్పర్యము.

తస్మాత్తు మిథునాదేకం పుమాంసం పాపనిశ్చయః
జఘాన వైరనిలయో నిషాద స్తస్య పశ్యతః. ౧౦

టీక॥ పాపనిశ్చయః, పాప=క్రూరమగు , నిశ్చయః=నిర్ణయముగలవాఁడును;వైరనిలయః , వైర=పగకు,నిలయః=స్థానమునైన; నిషాదః=బోయవాఁడు;తస్మాత్ =ఆ; మిథునాత్ =క్రౌంచపక్షులజతనుండి (ల్యబ్లోపమందుఁ బంచమి);ఏకం=ఒకటైన ; పుమాంసంతు=పురుషపక్షినిమాత్రము; పశ్యతః=చూచుచున్న,తస్య=ఆవాల్మీకిమునినాదరింపక (అనాదరమందు షష్ఠి);జఘాన=చంపెను.

సమస్త జంతువులయందును సహజమైన పగగలిగి క్రూరముగాజీవించుచుండు నొక బోయవాఁడు, ఆక్రౌంచపక్షి దంపతులను డగ్గఱి,

యందొకడైనపురుషపక్షిని, దానిఁ జూచుచున్న వాల్మీకి మహా మునినిఁ గూడనాదరింపక, చంపెను. అని తాత్పర్యము.

విశేషార్థము.—ఇందును వక్ష్యమాణరీతిని గావ్యకథ సూచితమైనది.—పాపనిశ్చయః= దుష్టుఁడనునిర్ణయముగలవాఁడును; (అనఁగా, రావణుఁడు దుష్టుఁ డని నిశ్చయించినవాఁ డనుట); వైరనిలయః=దుష్టులతోటి పగకుస్థానభూతుఁడునైన; నిషాదః=సమస్తజగంబులకు నాధారభూతుఁడైన విష్ణువు(నిషీదంత్యత్ర సర్వాణిజగంతీతి షాదః; వీనియందు సమస్తజగములునుండును గావున "నిషాదుఁ"డనబడును); తస్మాత్=ఆ; మిథునాత్=రాక్షసదంపతుల దగ్గఱి ; ఏకం=ఒకడైన; పుమాంసంతు=పురుషుఁడగు రావణుని మాత్రము ; పశ్యతః=చూచుచున్న; తస్య= ఆ రాక్షసదంపతులలో రెండవదియగుమందోదరినాదరింపక (అనఁగా మందోదరిని జంపకయనుట.); జఘాన=చంపెను.

దుష్టులయందు సహజమైన వైరము గలిగి సమస్త జగంబులకునాధారభూతుఁడై వెలుంగుచున్న శ్రీమహావిష్ణువు, ఆరాక్షసదంపతుల దగ్గఱి,యందొకడైన రావణుఁడు పరమదుష్టుఁ డనియెఱింగి, యదుష్టయగుమందోదరినిబీడింపక , యా రావణునిమాత్రము,చంపెను. అని తాత్పర్యము.

తం శోణిత పరీతాంగం వేష్టమానం మహీతలే
భార్యాతు నిహతం దృష్ట్వా రురావ కరుణాం గిరమ్. ౧౧
వియుక్తా పతినా తేన ద్విజేన సహచారిణా
తామ్రశీర్షేణ మత్తేన పత్రిణా సహితేనవై. ౧౨

టీక॥ భార్యాతు=క్రౌంచియు; పతినా = పెనిమిటియును ; సహచారిణా = కూడఁ దిరుగునదియును; తామ్రశీర్షేణ, తామ్ర=ఎఱ్ఱనగు, శీర్షేణ=తలగలదియును; మత్తేన = మదించినదియును; పత్రి

ణాం=ప్రశస్తములగు ఱెక్కలు గ
లదియును; సహితేన=మనస్సాంగ
త్యము గలదియునగు("వై" అనునది
పాదపూరణార్థము); తేన=ఆ; ద్వి
జేన=మగపక్షిచే; వియుక్తాం=విడు
వఁబడినదై;నిహతం=చంపఁ బడిన
దియును (గనుకనే); మహీతలే=
భూతలమందు; వేష్టమానం=పొర
లుచున్నదియును= శోణితపరీతాం
గం,శోణిత = నెత్తురుచే,పరీత=క
ప్పఁ బడిన , అంగం=శరీరముగలది
యునగు; తం=ఆక్రౌంచమును;దృ
ష్ట్వా=చూచి;కరుణాం=కనికరము
నుబుట్టించెడి;గిరం=వాక్కును; రు
రావ=పలికెను.

భార్యయగుక్రౌంచి,ప్రశస్తము
లగు ఱెక్కలునుఎఱ్ఱనితలయునుగ
లిగిరతిపరవశతచేఁ బ్రకాశింపుచుఁ
దనకుఁ బెనిమిటియై సహచారియై
మనఃప్రియమైయున్న క్రౌంచపక్షిచే
విడువఁబడినదై బోయవానిచేఁజం
పఁ బడినేలం బొరలుచు నెత్తుటం
దోఁగి పడియున్నయా క్రౌంచము
నుజూచి,కనికరముపుట్టునట్టులేడ్చె
ను. అని తాత్పర్యము.

విశేషార్థము.—ఈశ్లోకము
లయందుమందోదరీప్రలాపముసూ
చితమైనది.—భార్యాతు = మం
దోదరియును; పతినాం; సహచారి
ణాం; తామ్రశీర్షేణ=రత్నమయ
కిరీటముచే నెఱ్ఱగానుండు తలగ
లవాఁడును;పత్రిణాం= వాహనాదు
లతోఁ గూడియుండువాఁడును; మ
త్తేన=బ్రహ్మవరమువలనమదించిన
వాఁడును; సహితేన=ఇంద్రజిత్కుం
భకర్ణాదులగుహితులతోఁ గూడి
నవాఁడునైన; తేన=ఆ; ద్విజేన=
బ్రాహ్మణుఁడగురావణునిచే ; వి
యుక్తాం;నిహతం; మహీతలే; వేష్ట
మానం;శోణిత పరీతాంగం;తం=
ఆరావణుని;దృష్ట్వా; కరుణాం;గి
రం;రురావ.

పులస్త్యవంశమునందుఁ బుట్టి
బ్రహ్మదేవునివలనవరము పొందియె
దురులేకగర్వించి కుంభ కర్ణాది
హితులతోఁగూడి మణిమయకిరీటా
లంకృత శిరస్కుఁడై వెలింగెడి తన
ప్రియుఁడైన పెనిమిటిచేవిడువఁబడి
నదై,యామందోదరి,విష్ణుదేవునిచేఁ
జంపఁబడినేలంబొరలుచు నెత్తుటం

దోఁగిపడియున్న తన పెనిమిటి యగు రావణునింజూచి, కనికరము ప్రట్టునట్టు లేడ్చెను. అని తాత్పర్యము.

తదాతు తం ద్విజం దృష్ట్వా నిషాదేన నిపాతితమ్
ఋషే ర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సమపద్యత. ౧౩

టీక॥ తదాతు=అప్పుడె; నిషాదేన=బోయవానిచే; నిపాతితం=పడఁద్రోయఁబడిన; తం=ఆ; ద్విజం=పక్షిని; దృష్ట్వా=చూచి; స్థిత స్య(అధ్యాహృతము)=ఉన్నట్టి; ధర్మాత్మనః=ధర్మస్వభావుఁడైనట్టి; తస్య=ఆ; ఋషేః=వాల్మీకిమహర్షికి; కారుణ్యం=దయ; సమపద్యత=కలిగినది. తాత్పర్యము సులభము.

విశేషార్థము.—ఇది పునరావృత్తార్థసూచనము చేయఁబడినది.—తదాతు=అప్పుడె; నిషాదేన=విష్ణువుచే; నిపాతితం; తం; ద్విజం=బ్రాహ్మణుఁడగు రావణుని; దృష్ట్వా; స్థితస్య; ధర్మాత్మనః; తస్య; ఋషేః; కారుణ్యం=జుగుప్స; సమపద్యత=కలిగినది.

ఆరావణుని, విష్ణురూపుఁడగు రాముఁడు చంపఁగాఁ జూచుచున్న ధర్మస్వభావుఁడైన యావాల్మీకిమహర్షికి "అధర్మాత్ముని స్మరణముగూడ నమంగళకరము" అని జుగుప్స కలిగినది. అని తాత్పర్యము.

తతః కరుణ వేదిత్వా దధర్మోఽయ మితి ద్విజః
నిశామ్య రుదతీం క్రౌంచీ మిదం వచన మబ్రవీత్. ౧౪

టీక॥ తతః=పిమ్మట; ద్విజః=బ్రాహ్మణుఁడగువాల్మీకిమహర్షి; రుదతీం=ఏడ్చుచున్న; క్రౌంచీం=ఆఁడుక్రౌంచపక్షిని; నిశామ్య=చూచి; కరుణవేదిత్వాత్=దయఁబొందినవాఁడగుటవలన; అయం=ఈరతికాలవధము; అధర్మః=ధర్మముకాదు; ఇతి=అని; మత్వా (అధ్యాహృతము)=తలఁచి; ఇదం=ఈ(వక్ష్యమాణమగు); వచనం=వాక్యమును; అబ్రవీత్=పలికెను.

అటుపిమ్మట, ఆవాల్మీకిమహ

ముని, యేడ్చుచున్నక్రౌంచిని జూచి, దయగలవాఁడై, "రతికాలమందుఁ జంపుట పాడిగాదు" అనితలంచుచు, నిట్లనిచెప్పెను. అనితాత్పర్యము.

విశేషార్థము.—తతః ; న్నైజః ; మదతం ; క్రౌంచీం = రాక్షసస్త్రీయగుమందోదరిని ; నిశామ్య ; అయం = ఈపరభార్యనపహరించుట ; అధర్మః ఇతి = పాడికాదని ; మత్వా = తలంచి ; కరుణవేదిత్వాత్ = జుగుప్సఁబొందినవాఁడగుట వలన ; ఇదం ; వచనం ; అబ్రవీత్.

అటుపిమ్మట, వాల్మీకిమహర్షి, యేడ్చుచున్న మందోదరిని జూచి, "పరభార్యనపహరించిన యీరావణుండిప్పటికిట్టిస్థితిని బొందినాఁడు కాఁబట్టి, పరభార్యనపహరించుట యెంతమాత్రము ధర్మముకాదు" అనితలంచి, జుగుప్సఁ బొందినవాఁడై, యిట్లనిచెప్పెను. అనితాత్పర్యము.



భరద్వాజుఁడు వాల్మీకి క్రౌంచపక్షులు బోయవాఁడు

మానిషాద ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్. ౧౫

టీక ॥ అమ = నిర్భాగ్యుఁడైన ; నిషాద = బోయవాఁడా, త్వం=నీవు; యత్ =ఏకారణముచేత, క్రౌంచ మిథునాత్ = క్రౌంచపక్షిదంపతులను డగ్గటి; కామ మోహితం, కామ=మన్మథునిచే, మోహితం=మోహమునుబొందఁ జేయఁబడిన ; ఏకం=ఒకదాని; అవధీః= చంపితివో; తత్ (అధ్యాహృతము)=ఆకారణమువలన;శాశ్వతీః=స్థిరములైన; సమాః= సంవత్సరములయందు (అత్యంత సంయోగమందు ద్వితీయ) ; ప్రతిష్ఠాం = ఉండుటను; మాగమః= పొందకపోదువుగాక.

"నిర్భాగ్యుఁడైన యోబోయవాఁడా! క్రౌంచపక్షి దంపతుల డగ్గఱి, యందు మన్మథపరవశమగునొకదానిని, జంపితివి, కావున నీవు, శాశ్వతకాలముప్రతిష్ఠనుబొందక పోయెదవుగాక; అనిపలికెను. అనితాత్పర్యము.

విశేషార్థము.— "ఇది బ్రహ్మానుగ్రహమునంజేసి, శ్రీమద్వాల్మీకిమహర్షిముఖము వలన, మొదట, నిర్గమించినశ్లోకము.కావునఁ, గేవలశాపరూపము కాఁదగదు. ఇదియాగ్రంథమునకు మంగళము." అనిపూర్వాచార్యులు వచించిరి.—

మానిషాద = లక్ష్మికినివాసస్థానమైన విష్ణువా (నిషీదత్యస్మిన్ ఇతినిషాదః, దీనియం దుండును, గాఁబట్టి, "నిషాదః" అనంబడును, అనఁగా నివాస స్థానము); త్వం = నీవు ; యత్ = ఏకారణమున; క్రౌంచమిథునాత్ =రాక్షసదంపతులగు రావణమందోదరుల డగ్గఱి; కామమోహితం=మన్మథపరవశమగు; ఏకం=ఒకటైనరావణుని; అవధీః=చంపితివో; తత్ = ఆకారణమున; శాశ్వతీః= స్థిరములైన;సమాః=సంవత్సరములయందు;ప్రతిష్ఠాం=మాహాత్మ్యమును. ("ప్రతిష్ఠాస్థితిమాహాత్మ్యే" అనివైజయంతి); అగమః = పొందెదవుగాక.

ఓశ్రీనివాసుఁడా! రావణమందోదరులను రాక్షసదంపతుల వద్దకుఁ బోయి, వారిలో నొకఁ డును

మన్మధపరవశుఁడైసీతాదేవినపహరించినవాఁడునగురావణునిఁజంపితివికావున,నీవు,శాశ్వతకాలముమాహాత్మ్యమును, బొందితివి. అనితాత్పర్యము.

"కావ్యార్థః సూచనంకైశ్చిన్నాంద్యామేవనిరూప్యతే" (మంగళశ్లోకమునందే,కొందఱిచేఁ , గావ్యకథాసూచనము నిరూపింపఁ బడుచున్నది) అనునాలంకారిక వచనమునసుసరించి,యిచ్చట , రామాయణకథయంతయు , సంక్షేపముగా,సూచింపఁబడినది.— "మానిషాద"అనుశబ్దముచే,సీతావివాహపర్యంతమగు బాలకాండకథసంగ్రహింపఁ బడినది "ప్రతిష్ఠాంత్వమగమశ్శాశ్వతీస్సమాః"అనుటచేఁ, పితృవచనపరిపాలనమనెడు మాహాత్మ్యముఁబొందుటను దెలుపు నట్టియయోధ్యాకాండకథ,సూచింపఁబడినది. ఈవాక్యముచేతనే, యరణ్యకాండకథయును జూపఁబడినది. "క్రౌంచమిధునాదేకమవధీః కామమోహితం"("క్రౌంచశబ్దము,క్రుంచగతికౌటిల్యాల్పీభావయోః" అనుధాతువునఁబుట్టినది. క్రౌంచమిధునం" కుటిలులగు వానర దంపతులనుట.) ఈవాక్యముచే, కుటిలులగు వానరదంపతులైనతారావాలులలో నొకఁడును సుగ్రీవ భార్యనప హరించిన వాఁడునగు వాలిని జంపితివి" అనునర్థముచే,కిష్కింధా కాండకథయును సూచిత మైనది. క్రౌంచౌ=అల్పీభూతులు, అనఁగా , కృశులనుట. ఈవాక్యముచేతనే , కృశులగు సీతారాములలోనొకతెయగుసీతాదేవి, నపహరించి మిక్కిలి, పీడించితివి" అని , సీతాదేవివిరహదుఃఖమునువర్ణించెడు సుందర కాండ కథయును , దెల్పఁ బడినది. దీనిచేతనే, "రాక్షసదంపతులగు రావణ మందోదరులలో నొకఁడైన రావణునిఁ జంపితివి" అని, యుద్ధకాండకథయును గ్రథితమైనది. ఈవాక్య మననే, (మానిషాద=ఓశ్రీనివాసుఁడా,అనగా,ఓదైవమాఅనుట)ఓదైవమా! పూర్వమరణ్యా వాసమున, ననుభవింపఁబడినవియోగదుఃఖమునంజేసి యత్యంత కృశులగు సీతారాము

లలో నొకతెయగు సీతాదేవిని మఱల నరణ్యములోఁ జేర్చి మిక్కిలి పీడించితివి" అని, యుత్తరకాండ కథయును జెప్పఁబడినది.

తస్యైవం బ్రువత శ్చింతా బభూవ హృది వీక్షతః
శోకార్తే నాస్య శకునేః కిమిదం వ్యాహృతం మయా. ౧౬

టీక ॥ వీక్షతః = చూచుచున్న వాఁడును; ఏవం=ఇప్పుడు చెప్పఁబడినట్లు; బ్రువతః= పలుకుచున్న వాఁడు నగు; తస్య= ఆవాల్మీకిమహర్షికి; హృది=మనస్సునందు ; అస్య=ఈ; శకునేః= పక్షినిమిత్తము; శోకార్తేన, శోక = దుఃఖముచే, ఆర్తేన= పీడింపఁబడిన ; మయా=నాచేత; అద్య=ఇప్పుడు; వ్యాహృతం=పలుకంబడిన;ఇదం= ఈవాక్యము; కిం=ఎట్టిది! ఇతి (అ ధ్యాహృతము)= అని; చింతా= తలఁపు; బభూవ=కలిగెను.

ఆ క్రౌంచ దంపతులను జూచి మానిషా దేత్యాదివాక్యమును బలికిన యావాల్మీకి మహర్షికి , హృదయమునందు, "ఈపక్షింజూచి దుఃఖితుఁడనైన నేనెట్టి వాక్యమును బలికితిని!" అని చింత పుట్టినది. అని తాత్పర్యము.

చింతయన్ స మహాప్రాజ్ఞ శ్చకార మతిమాన్ మతిమ్
శిష్యం చైవాఽబ్రవీ ద్వాక్య మిదం స మునిపుంగవః. ౧౭

టీక॥ మహాప్రాజ్ఞః=పూజ్యుఁడగుపండితుఁడును; మతిమాన్ = బుద్ధిమంతుఁడునగు; సః=ఆవాల్మీకి; చింతయన్= చింతింపుచు; మతిం=నిశ్చయమును; చకార=చేసెను. చ=మఱియు; సః=ఆ; మునిపుంగవః=మునులందు శ్రేష్ఠుఁడైన వాల్మీకి; శిష్యమేవ=శిష్యునిఁగూర్చియే; అబ్రవీత్= పలికెను.

మహా పండితుఁడును బుద్ధిమంతుఁడునగు వాల్మీకిమహాముని యీ ప్రకారమాలోచన సేయుచు, వక్ష్యమాణప్రకారముగనిశ్చయించి. శిష్యునితో నిట్లని చెప్పెను. అని తాత్పర్యము.

పాదబద్ధోఽక్షరసమ స్తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా. ౧౮

టీక ॥ శోకార్తస్య, శోక = దుఃఖముచే, ఆర్తస్య = పీడింపఁబడిన; మే(పంచమ్యర్థ మందు షష్ఠి)=నావలన; ప్రవృత్తః= పుట్టినదియు; పాదబద్ధః, పాద= నాలుగు పాదములచే, బద్ధః = నియతమైనదియు;అక్షరసమః,అక్షర=ప్రతిపాదాక్షరములచేతను, సమః= సమానమైనదియు ; తంత్రీలయ సమన్వితః, తంత్రీ= వీణెతంతులతోను,లయ=నృత్తగీతవాద్యములసమపరామముతోను, సమన్వితః=కూడినదియునైన(అనఁగా, వీణెయందారోపించి నృత్తగీతవాద్య ములతోఁబాడుటకు యోగ్యమైనదనుట. "నాశేసంశ్లేషణేతౌర్యత్రిక సామ్యే భవేల్లయః" అనిరత్నమాల. తౌర్యత్రిక మనఁగా, నృత్తగీతవాద్యము ౧)ః అయం(అధ్యాహృతము) ఈగ్రంథము; శ్లోకః=శ్లోకముగా; భవతు = అగుఁగాక, అన్యథా= వేఱువిధముగఃన (భవతు)= కాకపోవుఁగాక.

దుఃఖితుఁడనైననాముఖము వలననిర్గమించి నాలుగు పాదములు గలదై ప్రతిపాదమును సమసంఖ్యగలయక్షరములతోఁగూడినదై వీణెయందారోపించి నృత్తగీతవాద్యములతోఁ బాడఁదగియున్న ఈగ్రంథము,శ్లోకమనుపేరం బ్రసిద్ధమగుఁగాకఁ, మఱివేఱుపేరం జెప్పఁదగదు.అనితాత్పర్యము.

శిష్యస్తు తస్య బ్రువతో మునే ర్వాక్య మనుత్తమమ్
ప్రతి జగ్రాహ సంహృష్ట స్తస్య తుష్టో భవ ద్గురుః. ౧౯

టీక॥ శిష్యస్తు=శిష్యుఁడైనభరద్వాజుఁడును;తస్య=ఆ;మునేః= వాల్మీకి మహాముని ; బ్రువతః=చెప్పుచుండఁగా; అనుత్తమం=తనకన్న మఱియొకశ్రేష్ఠపదార్థము లేనిదగు ; వాక్యం=మానిషాదేత్యాదివాక్యమును; ప్రతిజగ్రాహ=ప్రతిగ్రహించెను; గురుః=గురువైనవా

ల్మీకిమహాముని; తస్య=ఆభరద్వాజుని విషయమై;తుష్టః=సంతసించినవాఁడుగా;అభవత్ = ఆయెను.

భరద్వాజుఁడు, తనగురువగు వాల్మీకిమహామునిచేఁ జెప్పంబడి, శ్రీమద్రామాయణార్థ సంగ్రహమగుటచే సర్వోత్తమమై వెలుంగుచున్న, మానిషాదేత్యాది వాక్యమును, వాగ్విధేయముగాఁ జేసికొనెను; వాల్మీకి మహామునియును, అందుకుఁగాఁ,దనశిష్యునియందుఁ, బ్రీతిగలవాఁ డాయెను. అని తాత్పర్యము.

సోభిషేకం తతః కృత్వా తీర్థే తస్మిన్ యథావిధి
తమేవ చింతయన్నర్థ ముపావర్తత వై మునిః. ౨౦

టీక॥ తతః = అటుపిమ్మట; సః=ఆ;మునిః=వాల్మీకిమహాముని; తస్మిన్=ఆ; తీర్థే=తమసాతీర్థమందు;యథావిధి=యథాశాస్త్రముగ; అభిషేకం = స్నానమును; కృత్వా=చేసి; తం=ఆ; అర్థమేవ=ఆకస్మికముగ, ఛందోబద్ధశ్లోకము పుట్టుటనే;చింతయన్=చింతించుచు;ఉపావర్తత= ఆశ్రమమునకుఁ బోవమఱలెను ("వై" అనునదిపాదపూరణార్థము.)

ఆపిమ్మట, వాల్మీకిమహాముని, యాతమసా తీర్థమునందు, యథాశాస్త్రముగ, మాధ్యాహ్నికస్నానమొనరించి, యాకస్మికముగఁ దననోటనుండి, ఛందోబద్ధమును బరమార్థప్రతిపాదకము నగు శ్లోకము వెడలుటనుగుఱించియే చింతింపుచు,నాశ్రమము తట్టు మఱలెను.అనితాత్పర్యము.

భరద్వాజ స్తత శ్శిష్యో వినీత శ్శ్రుతవాన్ మునిః
కలశం పూర్ణ మాదాయ పృష్ఠతో ను జగామహ. ౨౧

టీక॥ తతః=పిమ్మట;శిష్యః=శిష్యుఁడును; వినీతః=వినయముగలవాఁడును; శ్రుతవాన్ = శాస్త్రములు తెలిసినవాఁడును; మునిః=బ్రహ్మను సంధానము సేయువాఁడునగు; భరద్వాజః=భరద్వాజుఁ

డుః పూర్ణం=నిండిన; కలశం=జల పాత్రమును; ఆదాయ=తీసికొని; పృష్ఠతః=వెనుకను ; అనుజగామ హ=వెంబడించెను.

వాల్మీకిమహాముని యాశ్రమ మునట్టు మఱలఁగానే, వినయసం పన్నుఁడై సమస్తశాస్త్రములనెఱింగి , బ్రహ్మానుసంధానము సేయుచు వాల్మీకికి శిష్యుఁడై యున్న భరద్వాజుఁడు, జలపూర్ణమగు కలశమును దీసికొని , యావాల్మీకిని వెంబడించెను . అనితాత్పర్యము.

స ప్రవిశ్యాశ్రమపదం శిష్యేణసహ ధర్మవిత్
ఉపవిష్టః కథాశ్చాన్యా శ్చకార ధ్యాన మాస్థితః. ౨౨

టీక ॥ ధర్మవిత్; ధర్మ = ధర్మములను; విత్ = ఎఱింగిన ; సః=ఆవాల్మీకి; శిష్యేణ సహ=శిష్యునితోఁగూడ; ఆశ్రమపదం= ఆశ్రమస్థానమును; ప్రవిశ్య=చొచ్చి; ఉపవిష్టః= కూర్చుండిన వాఁడై; ధ్యానం = అకారణముగ బోయఁవాఁడు క్రౌంచమునుజంపుట, ఆకస్మికముగ దననోట ఛందోబద్ధమగుశ్లోకము వెడలుట, వీటిని గుఱించినచింతను; ఆస్థితః (ఏవ)=పొందినవాఁడైయె; అన్యాః=ఇతరములైన; కథాశ్చ= బ్రహ్మయజ్ఞపారాయణాదులను; చకార = చేసెను.

సమస్త ధర్మముల నెఱింగిన యా వాల్మీకి మహాముని , శిష్యునితోఁగూడ నాశ్రమమును బ్రవేశించి, సుఖాసనంబునఁ గూర్చుండి, 'అకారణముగ బోయవాఁడు చారు స్వరంబగు క్రౌంచమును జంపుట, ఆకస్మికముగఁదననోట ఛందోబద్ధమును విచిత్రార్థప్రతి పాదకమునగు శ్లోకరూప వాక్యము వెడలుట'' వీటినిగుఱించి , చింతింపుచునే, బ్రహ్మయజ్ఞ పారాయణము మొదలగు క్రియా కలాపము నిర్వర్తించెను. అనితాత్పర్యము.




ఆజగామ తతో బ్రహ్మా లోకకర్తా స్వయంప్రభుః
చతుర్ముఖో మహాతేజా ద్రష్టుం తం మునిపుంగవమ్. ౨౩

టీక॥ తతః=అటువెనుక; లోకకర్తా, లోక=లోకములను, కర్తా, చేయువాఁడును; ప్రభుః = లోకములకు, స్వామియును; చతుర్ముఖః=నాలుగు మొగములు గలవాఁడును; మహాతేజాః, మహత్=అతిశయించిన, తేజాః=ప్రభావము గలవాఁడు నగు; బ్రహ్మా=నలువ ; మునిపుంగవం = మునిశ్రేష్ఠుండగు; తం= ఆవాల్మీకిని; ద్రష్టుం = చూచుటకు; ఆజగామ = వచ్చెను.

అటువెనుక , సమస్తలోకములనుసృజించువాఁడునుసమస్త లోకముల కధిపుండునునాలుగు మోములచే నొక్కఁట నాలుగు వేదముల నుచ్చరింప సమర్థుఁడును మహా ప్రభావుండునగు బ్రహ్మదేవుఁడు మునిశ్రేష్ఠుఁడైన యావాల్మీకి మహామునిం జూడనేతెంచెను. అని తాత్పర్యము.

వాల్మీకి రథ తం దృష్ట్వా సహ సోత్థాయవాగ్యతః
ప్రాంజలిః ప్రయతో భూత్వా తస్థౌ పరమ విస్మితః. ౨౪

టీక ॥ అథ = పిమ్మట; వాల్మీకిః = వాల్మీకిమహాముని; తం= ఆ బ్రహ్మదేవుని; దృష్ట్వా=చూచి; సహసా=శీఘ్రముగ; ఉత్థాయ=లేచి; పరమవిస్మితః = మిక్కిలియాశ్చర్యమును బొందిన వాఁడై; వాగ్యతః=నిగ్రహింపఁ బడినవాక్కుగలవాఁడును (అనగామౌనముగలవాఁడనుట) ; ప్రాంజలిః=ఉత్కృష్టమగుచేమోడ్పు గలవాఁడును ; ప్రయతః= పరిశుద్ధుఁడును; భూత్వా=అయి; తస్థౌ=నిలిచెను.

వాల్మీకి మహాముని బ్రహ్మదేవునిఁ జూచుచునే, "ఊర్ధ్వంప్రాణాహ్యుత్క్రామంతియూనస్థ్సవిర ఆగతే, ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ప్రతిపద్యతే" (ముదుసలివాఁడుదగ్గిఱకు వచ్చుచుండఁగ నేప్రాయపువాని ప్రాణంబులుపైకెఁబోవంజూచును. అతండెదుర్కొనుటనమస్కరించుటలచే మఱల,వానిఁ బొందును.) అనుశాస్త్రమరీతిని, దన ప్రాణములు పోఁజూచుననుభయంబున దిగ్గనలేచి, మిక్కిలియాశ్చర్యమును బొందినవాఁడై, మౌనముధరించి, చేమోడ్పు గీలుకొల్పి, పరిశుద్ధ హృదయుండై, నిలిచెను. అని తాత్పర్యము.

పూజయామాస తం దేవం పాద్యార్ఘ్యాసన వందనైః
ప్రణమ్య విధివచ్చైనం పృష్ట్వా నామయ మవ్యయమ్. ౨౫

టీక॥ సః (అధ్యాహృతము)= ఆవాల్మీకి; తం ఏనం=ఆయీ; దేవం=బ్రహ్మదేవుని ; విధివత్=శాస్త్రీయరీతిని; ప్రణమ్య = నమస్కరించి;అవ్యయం=అవిచ్ఛిన్నమగు; అనామయంచ=కుశలమును ; పృష్ట్వా=అడిగి ; పాద్యార్ఘ్యాసనవందనైః, పాద్య=పాద ములకు జలము నిచ్చుటచేతను, అర్ఘ్య=పూజాయోగ్యమగు జలమును సమర్పించుటచేతను;ఆసన = పీఁటను సమర్పించుటచేతను; వందనైః= స్తుతించుట చేతను; పూజయామాస=పూజించెను.

వాల్మీకిమహాముని , బ్రహ్మదేవుని, యథాశాస్త్రముగ నమస్కరించి,యవిచ్ఛిన్నమగు కుశలమును బృచ్ఛించి,యర్ఘ్యపాద్యాసనము

లచేతను, స్తుతులచేతను, బూజించెను. అని తాత్పర్యము.

అథోపవిశ్య భగవా నాసనే పరమార్చితే
వాల్మీకయే మహర్షయే సందిదేశాసనం తతః.

టీక॥ అథ=తర్వాతను ; భగవాన్= మహాత్మ్యముగల బ్రహ్మదేవుఁడు ; పరమార్చితే , పరమ=మిక్కిలి; అర్చితే=పూజింపఁబడెన; ఆసనే=ఆసనమందు; ఉపవిశ్య = కూర్చుండి ; మహర్షయే=ఋషిశ్రేష్ఠుఁడగు ; వాల్మీకయే=వాల్మీకికొఱకు; ఆసనం=కూర్చుండుటను; సందిదేశ=ఆజ్ఞాపించెను.

భగవంతుఁడగు బ్రహ్మదేవుఁడు, పరమపూజితమగు సుత్తమాసనమందుఁ గూర్చుండి, ఋషిశ్రేష్ఠుండగు, వాల్మీకి మహామునింగూర్చుండ నియోగించెను. అని తాత్పర్యము.

బ్రహ్మణా సమనుజ్ఞాత స్సోఽప్యుపావిశ దాసనే. ౨౬

టీక॥ సోపి=ఆవాల్మీకి మహర్షియును; బ్రహ్మణా=బ్రహ్మదేవునిచే; సమనుజ్ఞాతః=ఆజ్ఞాపింపఁబడెనవాఁడై; ఆసనే = పీఁటయందు; ఉపావిశత్=కూర్చుండెను. తాత్పర్యము. సులభము.

ఉపవిష్టే తదా తస్మిన్ సాక్షా ల్లోక పితామహే
తద్గతే నైవ మనసా వాల్మీకి ర్ధ్యాన మాస్థితః. ౨౭॥

టీక॥ లోకపితామహే ; లోక=లోకములకంతయు , పితామహే=తాతయైన ; తస్మిన్=ఆబ్రహ్మదేవుఁడు; సాక్షాత్ = ప్రత్యక్షముగా; ఉపవిష్టే= కూర్చుండినవాఁడగుచుండఁగా; తదా= అప్పుడు; వాల్మీకిః=వాల్మీకిమహాముని; తద్గతేన , తత్=ఆక్రొంచని, గతేన=పొందినట్టి; మనసైవ మనస్సుచేతనే; ధ్యానం = చిను; ఆస్థితః=పొందెను.

సర్వలోకంబులకును బితహుండైన బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షముగాఁ గూర్చు

వాల్మీకి మహాముని , యాక్రౌంచమునందే మనస్సునుంచి, చింతింపసాగెను. అని తాత్పర్యము.

పాపాత్మనా కృతం కష్టం వైర గ్రహణ బుద్ధినా
యస్తాదృశం చారురవం క్రౌంచం హన్యాదకారణాత్. ౧౮

టీక ॥ యః = ఏబోయవాఁడు; తాదృశం=అట్టిదియును (అనఁగా, రతిపరవశమైనదిఅనుట); చారురవం, చారు= మనోహరమైన,రవం= కూఁతలుగలదియునగు; క్రౌంచం=క్రౌంచపక్షిని ; అకారణాత్ =నిష్కారణముగ; హన్యాత్ =చంపునో ; వైరగ్రహణ బుద్ధినా; వైర=పగచేతను, గ్రహణ= గ్రహించుటయందు, బుద్ధినా=బుద్ధిగల వాఁడును; పాపాత్మనా= పాప స్వరూపుఁడునగు; తేన=ఆబోయవానిచేతను; కష్టం=భయంకరమగు కార్యము; కృతం = చేయఁబడినది.

రతిపరవశమై మనోహరముగఁ గూయుచుండునట్టి క్రౌంచమును నిష్కారణముగఁ జంపఁ గలిగిన , పాపస్వరూపుఁడును వైరోపజీవియునగు నాబోయవాఁడు భయంకరమగు కార్యముఁజేసెను.అనిచింతించెను. అని తాత్పర్యము.

శోచన్నేవ ముహుః క్రౌంచీ ముప శ్లోక మిమం పునః
జగావంతర్గతమనా భూత్వా శోకపరాయణః. ౧౯

టీక ॥ శోకపరాయణః= దుఃఖపరవశుఁడైన; సః (అధ్యాహృతము) = ఆవాల్మీకి; అంతర్గతమనాః,అంతర్గత=హృదయగతమగుశ్లోకార్థమందు, మనాః=మనస్సుగలవాఁడు; భూత్వా = అజలము నిచ్చ్ ) = ఆఁడుక్రౌంచపక్షినిగుఱించి; ముహుః= పలుమాఱు; శోచన్నేవ = దుఃఖింపుచునే; పునః=మఱల; ఇమం = ఈ; శ్లోకం=మానిషాదేత్యాదిశ్లోకమును; ఉపజగౌ= పఠించెను.

దుఃఖపరవశుండగు వాల్మీకిమహర్షి, హృదయగతమగు మా

నిషాదేత్యాదిశ్లోకార్థమును జింతింపుచుమఱలనాయాఁడుక్రౌంచపక్షినిదలంచి, పలుమాఱు దుఃఖింపుచు, మానిషాదేత్యాది శ్లోకమును బరించెను. అనితాత్పర్యము.

త మువాచ తతో బ్రహ్మా ప్రహస న్మునిపుంగవమ్
శ్లోకఏవ త్వయాబద్ధో నాత్ర కార్యా విచారణా. ౩౦

టీక॥ తతః=ఆపిమ్మట; బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు; మునిపుంగవం=మునులయందు శ్రేష్ఠుఁడగు; తం=ఆవాల్మీకినిగూర్చి; ప్రహసన్=నవ్వుచు; త్వయా=నీచేత; బద్ధః=గ్రథితమైనది; శ్లోకఏవ=శ్లోకమే; అత్ర=ఈవిషయమందు; విచారణా=చింత; నకార్యా=చేయఁదగినదికాదు.

వాల్మీకియాశ్లోకమును బరింపఁగావిని, బ్రహ్మదేవుఁడు, మునిశ్రేష్ఠుఁడగునా వాల్మీకినిజూచి, "ఇతఁడు నాదునియోగంబునఁ దనజిహ్వాగ్రమందవతీర్ణ యగు సరస్వతీదేవి నెఱుంగఁడు" అని నవ్వుచు, నీచే గ్రథితంబైన వాక్యము శ్లోకమేయగును, ఈవిషయంబునఁ జింతింపవలదు" అనిచెప్పెను. అనితాత్పర్యము.

మచ్ఛందా దేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ
రామస్య చరితం సర్వం కురు త్వ మృషి సత్తమ. ౩౧

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడైన వాల్మికిమహామునీ! తే=నీయొక్క; ఇయం=ఈ; సరస్వతీ=మానిషాదేత్యాదివాక్కు; మచ్ఛందాదేవ, మత్=నాయొక్క, ఛందాదేవ=ఇచ్ఛవలననే; ప్రవృత్తా=పుట్టినది. ఋషిసత్తమ=ఋషిశ్రేష్ఠుఁడా! త్వం=నీవు; సర్వం=సమస్తమైన; రామస్య=రామునియొక్క; చరితం=చరిత్రమును; కురు, చేయుము.

ఓవాల్మీకి మహామునీ! నాయొక్కయిచ్ఛవలననే, నీముఖమునుండి యీమానిషాదేత్యాదిశ్లోకమువెడలినది; ఋషిశ్రేష్ఠుఁడా! నీవు, రా

మకథనంతయు శ్లోకరూపముగాఁ జేయుము. అని తాత్పర్యము.

విశేషార్థము.— "బ్రహ్మ" అనిసంబోధించుటచే, "నీవును బ్రహ్మాయగు నాయంశమునంబుట్టినవాఁడగుటం జేసి, నీముఖమునుండి, నాయిచ్ఛ చొప్పున, సరస్వతి వెడలినది" అని సూచితమగుచున్నది. "ఋషిసత్తమ" అనుటచే, "నానృషిఃకురుతేకావ్యం" (ఋషికానివాఁడు కావ్యమును జేయఁ జాలఁడు) అను, న్యాయమురీతిని, "నీవు కావ్యముచేయశక్తిగలవారిలో శ్రేష్ఠుఁడు, గాఁబట్టి,నీవురచించినకావ్యమును, అన్నింటి కన్న, శ్రేష్ఠమగును" అని తెల్పఁ బడుచున్నది.

ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః
వృత్తం కథయ ధీరస్య యథా తే నారదాచ్ఛ్రితమ్. ౩౨

టీక ॥ ధర్మాత్మనః= ధర్మస్వభావుఁడును; లోకే= లోకమందు; గుణవతః=ప్రశస్త గుణములు గలవాఁడును; ధీమతః = బుద్ధిమంతుఁడును; ధీరస్య=ధైర్యశాలియునగు; రామస్య=రామునియొక్క; వృత్తం= చరిత్రమును; యథా = యేప్రకారము; తే=నీచేతను (తృతీయార్థమందు షష్ఠి); నారదాత్ = నారదునివలన; శ్రుతం=వినఁబడెనో; తథా = ఆప్రకారము; కథయ=చెప్పుము.

ధర్మస్వభావుండును లోకమునందుఁ బ్రశస్తంబులగుసమస్తగుణములుగల వాఁడును బండితుండును ధైర్యశాలియు నగు రాముని చరిత్రమును,నీవు,నారదునివలన వినినట్లు, చెప్పుము. అని తాత్పర్యము.

రహస్యంచ ప్రకాశంచ యద్వృత్తం తస్య ధీమతః
రామస్య సహసౌమిత్రే రాక్షసానాంచ సర్వశః. ౩౩
వైదేహ్యాశ్చాపి యద్వృత్తం ప్రకాశం యదివా రహః
తచ్చాప్య విదితం సర్వం విదితం తే భవిష్యతి. ౩౪

టీక ॥ ధీమతః = బుద్ధిమంతుఁడైన; సహసౌమిత్రేః= లక్ష్మణుని

తోఁగూడిన; తస్య=ఆ; రామస్య=రామునియొక్క_యు; రాక్షసానాం చ=రాక్షసులయొక్కయు; రహస్యంచ=ఇతరులకుఁదెలియనిదియును; ప్రకాశంచ= అందఱకును దెలిసినదియును; సర్వశః = సర్వప్రకారముగా; యత్=ఏ; వృత్తం=చరిత్రమో; వైదేహ్యాశ్చాపి= సీతాదేవియొక్కయు (అపిశబ్దము వలన)భరతాదులయొక్కయు;ప్రకాశంయదివా= అందఱకును దెలిసినదిగాని;రహోవా=రహస్యముగాని;యత్ = ఏ,వృత్తం=చరిత్రమో; తచ్చ=అదియంతయు;అవిదితమపి=తెలియనిదియైనను, తే=నీకు;విదితం=తెలిసినదిగా; భవిష్యతి=కాఁగలదు.

లక్ష్మణ సహితుఁడైన రామునియొక్కయు, రాక్షసులయొక్కయు, సీతాదేవి యొక్కయు, భరతాదుల యొక్కయు, రహస్యముగాఁగాని ప్రకాశముగాఁ గాని నడచినచరిత్ర మంతయు, నిప్పుడు నీకుఁదెలియకున్నను, ఇఁక, స్పష్టముగాఁ దెలియఁ బోవుచున్నది.అని తాత్పర్యము.

న తే వా గనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్. ౩౫

టీక ॥ అత్ర=ఈ; కావ్యే=కావ్యమందు; తే=నీయొక్క; వాక్=వాక్యము; కాచిత్= ఒకానొకటియైనను; అనృతా=అసత్యముగా; నభవిష్యతి= కానేరదు. త్వం (అధ్యాహృతము)= నీవు; పుణ్యాం=పాపములఁబోఁగొట్టునదియు; మనోరమాం = మనస్సున కానందముఁబుట్టించునదియు; శ్లోకబద్ధాం, శ్లోక=శ్లోకములచే,బద్ధాం= నియతమైనదియునగు ; రామకథాం, రామ = రామవిషయకమైన ; కథాం= ప్రబంధమును ; కురు=చేయుము.

ఈకావ్యమందు,నీవుచెప్పినయొకమాటయైన నసత్యము కానేరదు; నీవుశ్లోకములచే, రామకథను జేయుము. అది , వినువారి సమస్తపాపములఁబోఁగొట్టుచు, వినినయుత్తరక్షణమునందే, పరమానం

దమును బుట్టించుచుండును. అని తాత్పర్యము.

యావత్ స్థాస్యంతి గిరయ స్సరితశ్చ మహీతలే
తావ ద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి. ౩౬

టీక ॥ గిరయః= పర్వతములును,సరితశ్చ= నదులును; మహీతలే= భూతలమందు; యావత్ = ఎంతవఱకు;స్థాస్యంతి= ఉండఁగలవో; తావత్ = అంతవఱకు; రామాయణకథా,రామాయణ=రామాయణమనెడు; కథా=ప్రబంధము; లోకేషు=లోకములయందు; ప్రచరిష్యతి= ప్రవర్తింపఁగలదు.

పర్వతములును నదులును భూతలమం దెంతవఱకుండఁ గలవో; అంతవఱకు నీవుచేసిన రామాయణము సప్తలోకములయందును బ్రచారమును బొందఁగలదు. (ఈరామాయణం బెంతవఱకుఁ బ్రచారము గలిగి యుండునో; అంతవఱకును నీదు కీర్తిలోకంబులయందు వ్యాపించి యుండును.) అనితాత్పర్యము.

యావ ద్రామాయణ కథా త్వత్కృతా ప్రచరిష్యతి
తావ దూర్ధ్వ మధ శ్చత్వం మల్లోకేషు నివత్స్యసి. ౩౭

టీక॥ యావత్=ఎంతవఱకు; త్వత్కృతా, త్వత్ = నీచేత;కృతా=చేయఁబడిన; రామాయణకథా=రామాయణప్రబంధము; ప్రచరిష్యతి=ప్రచారము గలిగియుండునో; తావత్ = అంతవఱకు; త్వం=నీవు; ఊర్ధ్వం=పైని; అధశ్చ=క్రిందను; మల్లోకేషు; మత్=నాయొక్క, లోకేషు= లోకములయందు; నివత్స్యసి = నివసింపఁగలవు.

నీవుచేసినరామాయణం బెంతవఱకుఁ బ్రచారముగలిగి యుండునో;అంతవఱకు, నాచేసృజింపఁబడిన యూర్ధ్వలోకముల యందును అధోలోకములయందును, ఎదురులేక, సంచరింపుచుండఁగలవు. అనిచెప్పెను.అనితాత్పర్యము.

ఇత్యుక్త్వా భగవాన్ బ్రహ్మా తత్రైవాంతరధీయత
తత స్సశిష్యో భగవా న్ముని ర్విస్మయ మాయయౌ. ౩౭

టీక॥ ఇతి=ఈప్రకారము; ఉక్త్వా=చెప్పి; భగవాన్=మాహాత్మ్యముగల; బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు; తత్రైవ=ఆయాసనము నందే; అంతరధీయత= అంతర్ధానముఁ బొందెను. తతః= అటుపిమ్మట; భగవాన్=మాహాత్మ్యముగల; మునిః=వాల్మీకిమహాముని; సశిష్యః=శిష్యునితోఁ గూడినవాఁడై; విస్మయం=ఆశ్చర్యమును; ఆయయౌ=పొందెను.

ఈప్రకారము వాల్మీకి కుపదేశించి, బ్రహ్మదేవుఁడాయాసనము నందుండియే, అంతర్ధానమును బొందెను; ఆపిమ్మట, బ్రహ్మదేవుఁ డుపదేశించిన యర్థమునుదలంచి, వాల్మీకిమహాముని, శిష్యునితోఁగూడ, నాశ్చర్యమును బొందెను. అని తాత్పర్యము.

తస్య శిష్యా స్తత స్సర్వే జగు శ్శ్లోక మిమం పునః
ముహుర్ముహుః ప్రీయమాణాః ప్రాహుశ్చ భృశవిస్మితాః. ౩౮

టీక॥ తతః=ఆపిమ్మట; సర్వే=సమస్తులైన; తస్య=ఆవాల్మీకిమహామునియొక్క; శిష్యాః=శిష్యులు; ముహుర్ముహుః = మాటిమాటికి; ప్రీయమాణాః=సంతోషింపుచు; పునః=మఱల; ఇమం=ఈ; శ్లోకం=మానిషాదేత్యాదిశ్లోకమును; జగుః=పాడిరి. భృశవిస్మితాః, భృశ=మిక్కిలి, విస్మితాః=ఆశ్చర్యమునుబొందినవారలై; ప్రాహుశ్చ=పరస్పరమును, జెప్పికొనిరి.

ఆవెనుక, వాల్మీకిశిష్యులందఱును, మాటిమాటికి సంతసింపుచు, మఱల, నీమానిషాదేత్యాదిశ్లోకమును బఠించి, యొండొరులకుఁ, జెప్పికొనిరి. అని తాత్పర్యము.

సమాక్షరై శ్చతుర్భిర్యః పాదై ర్గీతో మహర్షిణా
సో నువ్యాహరణా ద్భూయ శ్శ్లోక శ్శ్లోకత్వ మాగతః. ౩౯

టీక॥యః=ఏది; సమాక్షరైః=సమానమైన సంఖ్యతోఁగూడినయక్షరములుగల ; చతుర్భిః=నాలుగైన; పాదైః=పాదములతో; మహర్షిణా=వాల్మీకి మహర్షిచేతను; గీతః=చెప్పఁబడినదో; సః=ఆ; శ్లోకః=శ్లోకము; అనువ్యాహరణాత్=మాటిమాటికిఁ బరించుట వలన; భూయః = మఱల ; శ్లోకత్వం=శ్లోకమగుటను (శ్లోక్యమానమగుట వలన, అనఁగా, కీర్తింపఁబడుచుండుటవలన,అర్థాంతరవిశిష్టమగుశ్లోకశబ్దమునకువాచ్యమగుటను,అనుట); ఆగతః=పొందెను.

సమానమైన సంఖ్యగల నాలుగు పాదములతో వాల్మీకిచేఁ జెప్పఁబడిన శ్లోకలక్షణముగలిగి యున్న శ్లోకము , శిష్యులచే, మాటిమాటికిఁ బరింపఁబడుటంబట్టి, మఱల, శ్లోకమైనది. అని తాత్పర్యము.

తస్య బుద్ధిరియం జాతా మహర్షే ర్భావితాత్మనః
కృత్స్నం రామాయణంకావ్యమీదృశైఃకరవాణ్యహమ్. ౪౧

టీక॥అహం=నేను; కృత్స్నం=సమస్తమైన; రామాయణం=రామాయణమనెడు; కావ్యం = కావ్యమును; ఈదృశైః = ఇట్టిశ్లోకములతో; కరవాణి = చేయుదునుగాక. ఇయం=ఈ; బుద్ధిః=బుద్ధి ; భావితాత్మనః,భావిత=ధ్యానింపఁబడిన,ఆత్మనః = పరమాత్మగల ; తస్య=ఆ; మహర్షేః=వాల్మీకిమహర్షికి; జాతా=కలిగెను.

వాల్మీకి మహాముని , పరమాత్మధ్యానముసేయుచు , 'రామాయణకావ్యము నంతయుఁ, దలఁచుగా, మానిషాదేత్యాదిశ్లోకమువంటిశ్లోకములతోఁ జేసెద" ననుబుద్ధి కలవాఁడయ్యెనుఅని, తాత్పర్యము.

ఉదారవృత్తార్థపదైర్మనోరమై
స్తదాస్య రామస్య చకార కీర్తిమాన్
సమాక్షరై శ్లోకశతై ర్యశస్వినో
యశస్కరం కావ్య ముదారధీ ర్మునిః. ౪౨

టీక ॥ కీర్తిమాన్ = కీర్తిగలవాఁడును; ఉదారధీః, ఉదార = గొప్పదియైన, ధీః = బుద్ధిగలవాఁడునగు; మునిః = మననశీలుఁడైన వాల్మీకి; తదా=అప్పుడు; యశస్వినః=కీర్తిమంతుఁడగు; అస్య=ఈ (ప్రసిద్ధుఁడైన) రామస్య=రామునకును; యశస్కరం= కీర్తినిగలిగించునట్టి; కావ్యం= కావ్యమును; ఉదారవృత్తార్థపదైః, ఉదార = ఉత్తమలక్షణముతోఁ గూడిన, వృత్త= పద్యములును, అర్థ=శబ్దార్థములును, పదైః=శబ్దములును, గలిగినవియు; మనోరమైః= మనోహరము లైనవియును; సమాక్షరైః=సమములైనయక్షరములుగలవియునగు; శ్లోకశతైః, శ్లోక=శ్లోకములయొక్క, శతైః=నూఱులచేత; చకార=చేసెను.

కీర్తిమంతుఁడును మహాబుద్ధిమంతుఁడునగు వాల్మీకి మహాముని యశస్వియగు రామునిమాహాత్మ్యమును దెలుపునట్టికావ్యమును, మనోహరములైనవియును, ఉత్తమములగు పద్యముల నర్థముల శబ్దములం బ్రకాశింపుచున్నవియును, సమాక్షరములు గలిగినవియునగు ననేకశత శ్లోకములతోఁ జేసెను. అని తాత్పర్యము.

తదుపగతసమాససంధియోగంసమమధురోపనతార్థవాక్యబద్ధమ్
రఘువరచరితంమునిప్రణీతందశశిరసశ్చవధన్నిశామయధ్వం. ౪౩

టీక ॥ ఉపగత సమాస సంధియోగం, ఉపగత=శాస్త్రమువలన ప్రాప్తములైన, సమాస=సమాసములును, సంధి=సంధులును; యోగం= శబ్దవ్యుత్పత్తులునుగలదియును; సమమధురోపనతార్థవాక్యబద్ధం, సమ=సమానములును, మధుర = మనోహరములును, ఉపనతార్థ= సంగతమైన యర్థము గలవియునగు, వాక్య=వాక్యములచేత, బద్ధం=కట్టఁబడినదియును; రఘువరచరితం = రామచరిత్రమును; దశశిరసః = రావణునియొక్క; వధంచ = చంపుటను గుఱించి; మునిప్రణీతం, ముని= వాల్మీకిమునిచే, ప్రణీతం = చేయబడినది

యునగు; తత్ = ఆ రామాయణమును; నిశామయధ్వం = చూడుఁడు. (వినుఁడనుట).

జనులారా! శాస్త్రప్రాప్తములైన సమాసములును సంధులును వ్యుత్పత్తులును, గలిగి, సమములును మధురములును స్పష్టార్థములు నగువాక్యములతోఁ గూడియుండునట్లు, రామచరిత్రమును రావణ వధమును గుఱించి వాల్మీకిచేఁ జేయంబడిన, రామాయణమును వినుఁడు. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ద్వితీయస్సర్గః.
ఇది, స్పష్టార్థము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండద్వితీయసర్గటీక, ముగిసినది.

శ్రీ

తృతీయసర్గప్రారంభః.

శ్రుత్వా వస్తు సమగ్రం తద్ధర్మాత్మా ధర్మసంహితమ్
వ్యక్త మన్వేషతే భూయో యద్వృత్తం తస్య ధీమతః. ౧

టీక ॥ ధర్మాత్మా = ధర్మస్వభావుఁడైనవాల్మీకి; ధర్మసంహితం = ధర్మముతోఁగూడిన; కృత్స్నం = సమస్తమైన; తత్ = ఆ, నారదునిచేఁ జెప్పఁబడిన; వస్తు = రామకథారూపమైన వస్తువును; శ్రుత్వా = విని; భూయః = ఇంకను; ధీమతః = బుద్ధిమంతుఁడగు; తస్య = ఆ రామునియొక్క; వృత్తం = చరిత్రము; యత్ = ఏది; అస్తి (అధ్యాహృతము) = కలదో; తత్ = దానిని; వ్యక్తం = స్పష్టమగునట్లు; అన్వేషతే = ఆలోచించెను.

ధర్మస్వభావుఁడైన వాల్మీకి, నారదుఁడు చెప్పఁగా, ధర్మసహితంబగు రామకథను, సమగ్రముగ వినియును, అంతకన్ననధికమైనచరిత్రభాగమును, దెలియఁగోరి, యాలోచించెను. అని తాత్పర్యము.

ఉపస్పృశ్యోదకం సమ్య ఙ్ముని స్థిత్వా కృతాంజలిః
ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మేణాన్వేషతే గతిమ్. ౨

టీక ॥ మునిః=వాల్మీకి; సమ్యక్=చక్కగా; ఉదకం=జలమును; ఉపస్పృశ్య = ఆచమించి; ప్రాచీనాగ్రేషు, ప్రాచీన=తూర్పుమొగములైన, అగ్రేషు=కొనలుగల; దర్భేషు=దర్భలయందు; స్థిత్వా=ఉండి; కృతాంజలిః, కృత=చేయఁబడిన, అంజలిః; చేమోడ్పుగలవాఁడై; ధర్మేణ=బ్రహ్మానుగ్రహరూపమైనధర్మముచేతను; గతిం= రామచరిత్రముయొక్క రీతిని ; అన్వేషతే=ఆలోచించెను.

వాల్మీకి, చక్కగాజలమునాచమించి , తూర్పుమొగములగుకొనలుగలుగునట్లుపఱచినదర్భలయందుండి, చేమోడ్పుగీలించి, బ్రహ్మప్రసాదమునందు మనస్సునిడి , శ్రీరామ చరిత్రము నాలోచించెను. అని తాత్పర్యము.

రామలక్ష్మణ సీతాభీ రాజ్ఞా దశరథేన చ
సభార్యేణ సరాష్ట్రేణ య త్ప్రాప్తం తత్ర తత్త్వతః. ౩
హసితం భాషితం చైవ గతి ర్యాయచ్చ చేష్టితమ్
తత్సర్వం ధర్మ వీర్యేణ యథావ త్సంప్రపశ్యతి. ౪

టీక ॥ సః(అధ్యాహృతము)=ఆవాల్మీకి; రామలక్ష్మణసీతాభిః=రామలక్ష్మణసీతలచేతను; రాజ్ఞా=రాజైన; దశరథేనచ = దశరథునిచేతను ; సభార్యేణ = భార్యతోఁ గూడినరామునిచేతను ; సరాష్ట్రేణ = రాజ్యముతోఁగూడినరామునిచేతను; యత్=ఏది; ప్రాప్తం=పొందఁబడినదో; తత్ర= ఆవిషయమై; యత్ ( అధ్యాహృతము)=ఏది ; హసితం = నవ్వుటయో; యత్ (అధ్యాహృతము)=ఏది; భాషితంచైవ = మాటలాడుట యునో; యా=ఏది ; గతిః=గమనమో; యత్ = ఎది; చేష్టితంచ=నడతయునో; సర్వం=సమస్తమైన; తత్=దాని; తత్త్వతః=యథార్థముగా; యథావత్ = నడ

చినట్లు; ధర్మవీర్యేణ, ధర్మ=బ్రహ్మానుగ్రహముయొక్క, వీర్యేణ=శక్తిచేతను ; సంప్రపశ్యతి=చక్కగాఁజూచెను.

దశరథమహారాజును, రామలక్ష్మణసీతాదేవులును, రాజ్యములో నేమేమిచేసిరో, నవ్వులును మాటలు గమనములు చేష్టలు ఇవిమొదలగువాటి నంతయు, బ్రహ్మానుగ్రహబలముచే వాల్మీకి, యథార్థముగా, నడిచినట్లు, చక్కగాఁ దెలిసికొనెను. అని తాత్పర్యము.

స్త్రీ తృతీయేన చ తదా యత్ప్రాప్తం చరతా వనే
సత్య సంధేన రామేణ తత్సర్వం చాన్వవేక్షితమ్. ౫

టీక॥ స్త్రీతృతీయేన, స్త్రీ=భార్యచేతను, తృతీయేన=మూఁడవ వాఁడును ; వనే=అరణ్యమందు; చరతా=తిరుగుచున్న వాఁడును; సత్యసంధేన, సత్య=అబద్ధముకాని, సంధేన=ప్రతిజ్ఞ గలవాఁడునగు; రామేణ=రామునిచేతను; తదాచ=అప్పుడును; యత్=ఏది; ప్రాప్తం=పొందఁబడెనో; తత్=అది; సర్వంచ=అంతయును ; అన్వవేక్షితం=చూడఁ బడినది.

వాల్మీకి, సత్యప్రతిజ్ఞుఁడగు రాముఁడు, సీతాలక్ష్మణులతోఁ గూడి, యరణ్యములో సంచరింపుచుండునపుడు, చేసినకార్యముల నన్నియునుగూడఁ, దెలిసికొనెను. అని తాత్పర్యము.

తతః పశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగ మాస్థితః
పురా యత్తత్ర నిర్వృత్తం పాణౌ వామలకం యథా. ౬

టీక॥ తతః=ఆపిమ్మట ; ధర్మాత్మా=ధర్మస్వభావుఁడైన వాల్మీకి; యోగం = యోగమును; ఆస్థితః=పొందినవాఁడై ; పురా=మునుపు; తత్ర=ఆరామాదుల యందు; యత్=ఏది; నిర్వృత్తం=జరిగెనో; తత్=అది ; సర్వం=సమస్తమును ; పాణౌ=అఱచేతియందు ; ఆమలకంయథా=ఉసిరికకాయవలె; పశ్యతి=చూచెను.

అటుపిమ్మట, ధర్మాత్ముండగు వాల్మీకి, పూర్వము రామాదు

లకుజరిగినవృత్తాంతమంతయు,నఱచేతియందలియుసీరికకాయువలెఁ, దెలిసికొనెను.

అనితాత్పర్యము.

తత్సర్వం తత్త్వతో దృష్ట్వా ధర్మేణ సమహా ద్యుతిః
అభి రామస్య రామస్య చరితం కర్తు ముద్యతః. ౭
కామార్థ గుణ సంయుక్తం ధర్మార్థ గుణవిస్తరమ్
సముద్ర మివ రత్నాఢ్యం సర్వ శ్రుతి మనోహరమ్. ౮

టీక॥ మహాద్యుతిః=పూజ్యమగుకాంతిగల; సః=ఆవాల్మీకి ; తత్=ఆచరిత్రమును; సర్వం=అంతయును; ధర్మేణ=ధర్మము చేతను; తత్త్వతః=యథార్థముగా; దృష్ట్వా=చూచి; అభి రామస్య=సమస్తగుణములచే, నొప్పుచున్న; రామస్య=రాముని యొక్క ; కామార్థగుణసంయుక్తం, కామార్థ=కామార్థములే ప్రయోజనముగాఁ గల, గుణ=గుణములతో; సంయుక్తం = కూడియున్నదియును; ధర్మార్థగుణవిస్తరం , ధర్మార్థ=ధర్మమోక్షములె ప్రయోజనముగాఁ గల, గుణ=గుణములను, విస్తరం=విస్తరించు నదియును; (గనుకనే) రత్నాఢ్యం=రత్నములతోఁ గూడిన; సముద్రమివ (స్థితం)=సముద్రమువలె నున్నదియును; సర్వశ్రుతిమనోహరం,సర్వ = సమస్తమైన వారియొక్క, శ్రుతి=చెవులను, మనః=హృదయములను , హరం=ఆకర్షించునదియును; లేక, సర్వ=సమస్తములైన , శ్రుతి=వేదములయొక్క , మనః= హృదయ రూపమైన తత్త్వమును; హరం=సంగ్రహించు నదియును, అగు; చరితం=చరిత్రమును; కర్తుం=చేయుటకు ; ఉద్యతః=యత్నించెను.

మహాతేజుండగు వాల్మీకి, యారామచరిత్రమునంతయు, ధర్మశక్తిచే, యథార్థముగాఁ, దెలిసికొని, ధర్మార్థకామ మోక్షంబులగు చతుర్విధ పురుషార్థంబులవిస్తరించియిచ్చుటంబట్టి, రత్నాకరంబగుసముద్రంబునుఁ బోలియున్నదియును వినువారియొక్కకర్ణ



హృదయంబులనెల్ల నానందింపఁజే
నదియును శ్రుతిరహస్యార్థ ప్రతి
పాదకంబునగు,సమస్తగుణంబులచే
నొప్పుచున్న రాముని,చరిత్రంబుఁజె
యనారంభించెను.

అని తాత్పర్యము.

స యథాకథితం పూర్వం నారదేన మహర్షిణా
రఘువంశస్య చరితం చకార భగవా నృషిః. ౯

టీక॥ భగవాన్ = మాహాత్మ్య
ముగల; సః = ఆ; ఋషిః = వా
ల్మీకి; మహర్షిణా=ఋషిశ్రేష్ఠుఁ
డగు; నారదేన=నారదునిచే; పూ
ర్వం=మునుపు; యథా = ఎట్లు ;
కథితం=చెప్పఁబడెనో; తథా (అ
ధ్యాహృతము ) = అట్లు ; రఘు
వంశస్య=రఘువుయొక్కవంశమం
దుఁబుట్టిన రామునియొక్క ; చరి
తం=చరిత్రమును; చకార=చేసెను

భగవంతుండగు నావాల్మీకిమ
హర్షి, నారదమహాముని , మును
పు, తనకుఁజెప్పియుండినట్లు , ర
ఘువంశమందుఁబుట్టిన రాముని చరి
త్రమును జేసెను.

అని తాత్పర్యము.

జన్మ రామస్య సుమహ ద్వీర్యం సర్వానుకూలతామ్
లోకస్య ప్రియతాం క్షాంతిం సౌమ్యతాం సత్యశీలతామ్. ౧౦

టీక॥ రామస్య = రామునియొ
క్క;జన్మ=అవతారమును; సుమహ
త్ =మిక్కిలియధికమైన ; వీర్యం=
పరాక్రమమును ; సర్వానుకూల
తాం= అందఱికిననుకూలముగ
నుండుటను;లోకస్య=ప్రపంచమున
కు; ప్రియతాం= ప్రేమపాత్రమ
గుటను ; క్షాంతిం = అపరాధము
లనోర్చుటను;సౌమ్యతాం =సౌంద
ర్యమును; సత్యశీలతాం= సత్యస్వ
భావుఁడగుటను; (భగవాన్=మా
హాత్మ్యముగలవాఁడును;ఋషిః=త
త్త్వమునుజూచినవాఁడునగు ; వా
ల్మీకిః=వాల్మీకి; చకార=చేసెను.
(అని, ౯లవశ్లోకమువఱకు, ఆశ్లోక
మునందుండు కర్తృక్రియ లధ్యా
హార్యంబులు.)

రామునియవతారమును , అత
ని, మహాపరాక్రమమును, అతఁడం
దఱకు నను కూలముగనుంచుటను






అతఁడు లోకము నకంతయుఁబ్రియుఁడగుటను, అతని యోర్పును, అతని సత్యస్వభావతను, అతనిసౌందర్యమును, వాల్మీకి, రామాయణములో, నభివర్ణించెను. అనితాత్పర్యము.

నానాచిత్ర కధా శ్చాన్యా విశ్వామిత్రసమాగమే
జానక్యాశ్చ వివాహంచ ధనుషశ్చ విభేదనమ్.౧౧

టీక॥విశ్వామిత్రసమాగమే,విశ్వామిత్ర=విశ్వామిత్రమహర్షితో,సమాగమే = చేరుటయందు ; అన్యాః=ఇతరములైన , నానాచిత్ర కధాశ్చ , నానా=అనేక విధములైన,చిత్ర=ఆశ్చర్యకరములగు, కధాశ్చ=కధలను; జానక్యాశ్చ=సీతాదేవియొక్కయు(చకారమువలన)ఊర్మిళామాండవీశ్రుత కీర్తులయొక్కయు; వివాహంచ=పెండ్లిని; ధనుషః=శివుని వింటి యొక్క (వింటినిఅనుట); విభేదనంచ=విఱుచుటను; (చకార=చేసెను).
తాత్పర్యము,సులభము.

రామ రామ వివాదంచ గుణా న్దాశరథే స్తధా
తధాభిషేకం రామస్య కైకేయ్యా దుష్ట భావతామ్. ౧౨

టీక॥ రామ రామవివాదంచ , రామరామ=రఘురామ పరశురాములయొక్క , వివాదంచ=తగవును; దాశరథేః=దశరధ పుత్రుఁడగు రామునియొక్క; గుణాన్ తధా=గుణములను; రామస్య=రామునకు; అభిషేకంతధా=అభిషేకప్రయత్నమును ; కైకేయ్యాః= కైకయొక్క;దుష్టభావతాం= దుష్టమైన మనసు గలిగియుండుటను. (చకార=చేసెను.) తాత్పర్యము సులభము.

విఘాతం చాభిషేకస్య రాఘవస్య వివాసనమ్
రాజ్ఞ శ్శోక విలాపంచ పరలోకస్య చాశ్రయమ్.౧౩

టీక॥ అభిషేకస్య=పట్టాభిషేకమునకు ; విఘాతంచ=విఘ్నమును; రాఘవస్య= రామునియొక్క (రాముని) వాసనం=అరణ్యము




నకుఁ బంపుటను; రాజ్ఞః=దశరథ మహారాజు యొక్క; శోకవిలాపం చ, శోక=దుఃఖముతో; విలాపం చ=ఏడ్చుటను; పరలోకస్య=స్వర్గ లోకముయొక్క (స్వర్గ లోకమును); ఆశ్రయంచ=పొందుటను (చ కార=చేసెను.)

తాత్పర్యముసులభము.

ప్రకృతీనాం విషాదంచ ప్రకృతీనాం విసర్జనమ్
నిషాదాధిపసంవాదం సూతోపావర్తనం తథా. ౧౪

టీక ॥ ప్రకృతీనాం=జనులయొక్క విషాదంచ = దుఃఖమును ; ప్రకృతీనాం=జనులయొక్క (జనులను); విసర్జనం = విడుచుటను; నిషాదాధిపసంవాదం, నిషాదాధిప=బోయలఱేనితో, సంవాదం= సంభాషణమును; సూతోపావర్తనంతథా, సూత= సారథియైనసుమంత్రునియొక్క , ఉపావర్తనం తథా = మఱలివచ్చుటను. (చకార=చేసెను.)

తాత్పర్యముసులభము.

గంగాయాశ్చాపి సంతారం భరద్వాజస్య దర్శనమ్
భరద్వాజాభ్యనుజ్ఞానా చ్చిత్రకూటస్య దర్శనమ్.

టీక ॥ గంగాయాః=గంగానదియొక్క (గంగానదిని); సంతారంచాపి=దాఁటుటను; భరద్వాజస్య=భరద్వాజమహామునియొక్క (భరద్వాజమహామునిని) ; దర్శనం= చూచుటను; భరద్వాజాభ్యనుజ్ఞాత్ , భరద్వాజ = భరద్వాజునియొక్క, అభ్యనుజ్ఞాత్ = ఆజ్ఞ వలన; చిత్రకూటస్య=చిత్రకూటపర్వతముయొక్క (చిత్రకూటపర్వతమును); దర్శనం= చూచుటను. (చకార=చేసెను.)

తాత్పర్యము,సులభము.

వాస్తు కర్మనివేశంచ భరతాగమనం తథా
ప్రసాదనంచ రామస్య పితుశ్చ సలిలక్రియామ్. ౧౬

టీక ॥ వాస్తుకర్మ=శాస్త్రోక్తవిధానమునగృహమును నిర్మించుటను, నివేశంచ=ఆగృహమునందుండుటను ; భరతాఽగమనంతథా; భరత=భరతుని యొక్క, ఆగమనంతథా=వచ్చుటను ; రామస్య=రామునియొక్క (రాముని); ప్రసాదనంచ= వేడుకొనుటను ; పితుః= తండ్రియైన దశరథునకు ; సలిలక్రియాంచ=జలదానరూపమైనకార్యమును. (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

పాదుకాగ్ర్యాభి షేకంచ నందిగ్రామ నివాసనమ్
దండకారణ్య గమనం విరాధస్య వధం తథా. ౧౭

టీక ॥ పాదుకాగ్ర్యాభిషేకంచ, పాదుకాగ్ర్య = శ్రేష్ఠములైన పావకోళ్లకు,అభిషేకంచ= పట్టాభిషేకమును;నందిగ్రామనివాసనం, నంది గ్రామ=నందిగ్రామ మనెడు గ్రామమందు , నివాసనం=నివసించుటను; దండకారణ్యాగమనం=దండకారణ్యమునకుఁ బోవుటను; విరాధస్య=విరాధుని యొక్క (విరాధుని); వధంతథా=చంపుటను; (చకార=చేసెను)

భరతుఁడు, శ్రేష్ఠములైన రామపాదుకలకుఁబట్టాభి షేకముసేయుటను నందిగ్రామమందునివసించుటను, రాముఁడు, దండకారణ్యమునకుఁ బోవుటను విరాధునింజంపుటను, వాల్మీకియభివర్ణించెను. అనితాత్పర్యము.

దర్శనం శరభంగస్య సుతీక్ష్ణేన సమాగమమ్
అనసూయా సహాస్యా మప్యంగ రాగస్య చార్పణమ్ ౧౮

టీక ॥ శరభంగస్య=శరభంగ మహాముని యొక్క (శరభంగమహామునిని)దర్శనం= చూచుటను; సుతీక్ష్ణేన = సుతీక్ష్ణమహామునితో, సమాగమం = చేరుటను ; అనసూయాసహాస్యామపి, అనసూయా= అనసూయాదేవితో, సహాస్యామపి=కూడఁగూర్చుండుటను ; అంగరాగస్య=మైపూఁతయొక్క (మైపూతను); అర్పణంచ=ఇచ్చుటను;

(చకార=చేసెను.)
రాముడు, శరభంగునిఁజూచుటను సుతీక్ష్ణునితోఁజేరుటను, సీతాదేవి యనసూయాదేవితోఁ గూడఁ గూర్చుండుటను, ఆయనసూయాదేవిసీతాదేవికిఁ జందనంపుమైపూఁత నిచ్చుటను, వాల్మీకియభివర్ణించెను- అని తాత్పర్యము.

అగస్త్యదర్శనం చైవ జటాయో రభిసంగమమ్
పంచవట్యాశ్చ గమనం శూర్పణఖ్యాశ్చ దర్శనమ్. ౧౯

టీక॥ అగస్త్యదర్శనంచైవ=అగస్త్యమహామునినిజూచుటను; జటాయోః=జటాయువుయొక్క; అభిసంగమం=సమాగమమును; పంచవట్యాః= పంచవటీక్షేత్రమునకు; గమనంచ=పోవుటను; శూర్పణఖ్యాః = శూర్పణఖయొక్క-(శూర్పణఖను); దర్శనం=చూచుటను, (చకార=చేసెను).
తాత్పర్యము, సులభము.

శూర్పణఖ్యాశ్చ సంవాదం విరూప కరణం తథా
వధం ఖరత్రిశిరసో రుత్థానం రావణస్యచ. ౨౦

టీక॥ శూర్పణఖ్యాః = శూర్పణఖయొక్క; సంవాదం = సంభాషణమును; విరూపకరణంతథా, విరూప = రూపవికారముయొక్క-( రూప వికారమును ), కరణంతథా=చేయుటను; ఖరత్రిశిరసోః= ఖరత్రిశిరులను రాక్షసుల యొక్క-(రాక్షసులను); వధం=చంపుటను; రావణస్య = రావణునియొక్క; ఉత్థానంచ=బైలువెడలుటను. (చకార=చేసెను ).
తాత్పర్యము, సులభము.

మారీచస్య వధంచైవ వైదేహ్యా హరణం తథా
రాఘవస్య విలాపంచ గృధ్రరాజ నిబర్హణమ్. ౨౧

టీక॥ మారీచస్య = మారీచునియొక్క-(మారీచుని); వధంచైవ = చంపుటను; వైదేహ్యాః= సీతాదేవియొక్క- (సీతాదేవిని); హరణం

తథా=అపహరించుటను; రాఘవస్య=రామునియొక్క; విలాపంచ=దుఃఖించుటను; గృధ్రరాజ నిబర్హణం, గృధ్రరాజ = గద్దలతేఁడగుజటాయువు యొక్క- (జటాయువును), నిబర్హణం=చంపుటను. (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

కబంధ దర్శనంచైవ పంపాయాశ్చాపి దర్శనమ్
శబర్యా దర్శనంచైవ హనూమ ద్దర్శనం తథా. ౭౨

టీక॥ కబంధదర్శనంచైవ, కబంధ=కబంధునియొక్క-(కబంధుని), దర్శనంచైవ=చూచుటను; పంపాయాః=పంపాసరస్సుయొక్క-(పంపాసరస్సును); దర్శనంచాపి=చూచుటను; శబర్యాః=శబరస్త్రీయొక్క-(శబరస్త్రీని); దర్శనంచైవ=చూచుటను; హనూమ ద్దర్శనం తథా, హనూమత్=హనుమంతునియొక్క-(హనుమంతుని), దర్శనంతథా=చూచుటను. (చకార=చేసెను) తాత్పర్యము, సులభము.

ఋశ్యమూకస్య గమనం సుగ్రీవేణ సమాగమమ్
ప్రత్యయోత్పాదనం సఖ్యం వాలిసుగ్రీవ విగ్రహమ్. ౭౩

టీక॥ ఋశ్యమూకస్య=ఋశ్యమూకపర్వతమునకు; గమనం=పోవుటను; సుగ్రీవేణ= సుగ్రీవునితోఁ; సమాగమం= చేరుటను; ప్రత్యయోత్పాదనం, ప్రత్యయః=(సుగ్రీవునకు) నమ్మకమును, ఉత్పాదనం=పుట్టించుటను; సఖ్యం = (రామసుగ్రీవులకు) స్నేహమును; వాలిసుగ్రీవ విగ్రహం, వాలిసుగ్రీవ= వాలికిని సుగ్రీవునకును, విగ్రహం=యుద్ధమును. (చకార=చేసెను).

తాత్పర్యముసులభము.

వాలిప్రమథనం చైవ సుగ్రీవ ప్రతి పాదనమ్
తారా విలాసం సమయం వర్షరాత్ర నివాసనమ్. ౭౪

టీక ॥ వాలిప్రమథనంచైవ, వాలి=వాలియొక్క-(వాలిని); ప్రమథనంచైవ=చంపుటను; సుగ్రీవ ప్రతి పాదనం, సుగ్రీవ=సుగ్రీవునకు, ప్ర




తిపాదనం=రాజ్యము, నిచ్చుటను; తారావిలాపం, తారా=వాలిభార్యయగుతారయొక్క; విలాపం=ఏడ్పును;సమయం=రామసుగ్రీవుల సంకేతమును; వర్షరాత్రనివాసనం,వర్షరాత్ర=వానగల,రాత్రులయందు (వర్షర్తువునందుఅనుట), నివాసనం= నివసించుటను. (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

కోపం రాఘవ సింహస్య బలానా ముపసంగ్రహమ్
దిశః ప్రస్థాపనం చైవ పృధివ్యాశ్చ నివేదనమ్. ౭౫

టీక ॥ రాఘవసింహస్య,రాఘవ=రఘువంశమునందుఁబుట్టిన రాజులయందు, సింహస్య=శ్రేష్ఠుఁడగురామునియొక్క; కోపం=సుగ్రీవుని యందలి కోపమును; బలానాం=సైన్యములయొక్క (సైన్యములను), ఉపసంగ్రహం=చేర్చుటను;దిశః=దిక్కులనుగూర్చి;ప్రస్థాపనంచైవ=సైన్యములఁ, బంపుటను; పృధివ్యాః=భూమియొక్క (భూమిని- అనఁగా దేశములస్థితిని అనుట); నివేదనంచ=చెప్పుటను. (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

అంగుళీయకదానంచ ఋక్షస్య బిలదర్శనమ్
ప్రాయోపవేశనం చాపి సంపాతేశ్చాపి దర్శనమ్ ౭౬

టీక ॥ అంగుళీయకదానంచ, అంగుళీయక=ఉంగరముయొక్క, (ఉంగరమును) దానంచ = హనుమంతున,కిచ్చుటను;ఋక్షస్య=ఋక్షునియొక్క;బిలదర్శనం,బిల=బిలముయొక్క(బిలమును),దర్శనం=చూచుటను; ప్రాయోపవేశనంచాపి,ప్రాయ= చావుకొఱకు, ఉపవేశనంచాపి=కూర్చుండుటను; సంపాతేః= జటాయువు అన్నయగు సంపాతియొక్క (సంపాతిని); దర్శనంచాపి=చూచుటను, (చకార=చేసెను).

రాముఁడు హనుమంతున కుంగరమునిచ్చుటను, హనుమదాదులు ఋక్షబిలమునునొక్కగొప్ప గుహనుజూచుటను, వారలు సీతంగానక మరణార్థముసిద్ధపడుటను, వార




లుసంపాతిం జూచుటను, వాల్మీకి రామాయణములో నభివర్ణించె ను- అని తాత్పర్యము.

పర్వతా రోహణం చాపి సాగరస్యచ లంఘనమ్
సముద్ర వచనాచ్చైవ మైనాకస్యచ దర్శనమ్. ౨౭

టీక॥ పర్వతారోహణం చాపి, పర్వత= మహేంద్రపర్వతముయొక్క-(మహేంద్ర పర్వతమును), ఆరోహణంచాపి=ఎక్కుటను; సాగరస్య= సముద్రముయొక్క- (సముద్రమును);లంఘనంచ = దాటుటను; సముద్ర వచనాచ్చైవ, సముద్ర = సముద్రునియొక్క-, వచనాచ్చైవ=మాటవలన;మైనాకస్య= మైనాక పర్వతము యొక్క-; దర్శనంచ=చూడఁబడుటను.(చకార=చేసెను). తాత్పర్యము సులభము.

సింహికాయాశ్చ నిధనం లంకామలయదర్శనమ్
రాత్రౌ లంకాప్రవేశంచ ఏకస్యాథ విచింతనమ్. ౨౮

టీక॥సింహికాయాః=సింహికయొక్క-;నిధనంచ=చావును;లంకామలయదర్శనం,లంకామలయ=లంకయందుండెడి పర్వతైక దేశముయొక్క-(పర్వతైకదేశమును, "మలయః పర్వతాంతరే,పర్వతాంశే ప్రియోద్యానే" అనిరత్నమాల),దర్శనం= చూచుటను, రాత్రౌ=రాత్రియందు;లంకాప్రవేశంచ, లంకా=లంకయొక్క-(లంకను)ప్రవేశంచ=చొచ్చుటను;అథ = ఆపిమ్మట,ఏకస్య= ఒకఁడైన హనుమంతుని యొక్క-;విచింతనం=ఆలోచించుటను. (చకార=చేసెను)తాత్పర్యమును.

దర్శనం రావణస్యాపి పుష్పకస్యచ దర్శనమ్
ఆపానభూమి గమన మవరోధస్య దర్శనం. ౨౯

టీక॥ రావణస్య = రావణుని యొక్క-( రావణుని);దర్శనమపి= చూచుటను;పుష్పకస్య = పుష్పకవిమానముయొక్క- ( పుష్పకవిమానమును);దర్శనంచ= చూచుటను;ఆపానభూమి గమనం, ఆపానభూ

మి=మధ్యమునుద్రాగు ప్రదేశమునకు,గమనం=పోవుటను ; అవరోధస్య=అంతఃపురముయొక్క-(అంతఃపురమును); దర్శనం=చూచుటను. (చకార=చేసెను).

తాత్పర్యము,సులభము.

అశోకవనికాయానం సీతాయాశ్చాపి దర్శనమ్
అభిజ్ఞానప్రదానంచ రావణస్యచ దర్శనమ్. ౩౦

టీక॥ అశోకవనికాయానం, అశోకవనికా = అశోకవనమునకు, యానం=పోవుటను; సీతాయాః= సీతాదేవియొక్క- (సీతాదేవిని) ; దర్శనంచాపి=చూచుటను;అభిజ్ఞానప్రదానంచ,అభిజ్ఞాన=గుఱుతగునుంగరముయొక్క-(ఉంగరమును), ప్రదానంచ=ఇచ్చుటను; రావణస్య=రావణునియొక్క-(రావణుని) దర్శనంచ=చూచుటను. (చకార= చేసెను ).

తాత్పర్యము, సులభము.

రాక్షసీ తర్జనం చైవ త్రిజటా స్వప్న దర్శనమ్
మణిప్రదానం సీతాయా వృక్షభంగం తథైవచ. ౩౧

టీక ॥ రాక్షసీతర్జనంచైవ, రాక్షసీ=రాక్షసస్త్రీలయొక్క-,తర్జనంచైవ=సీతనుద్దేశించి, యదల్చుటను; త్రిజటాస్వప్నదర్శనం, త్రిజటా=త్రిజటయొక్క-, స్వప్నదర్శనం=కలగనుటను;సీతాయాః= సీతాదేవియొక్క-; మణిప్రదానం, మణి=శిరోరత్నముయొక్క- (శిరోరత్నమును), ప్రదానం=హనుమంతునకిచ్చుటను;తథా=అట్లు; వృక్షభంగమేవచ,వృక్ష=చెట్లయొక్క-, (చెట్లను) భంగమేవచ=విఱుచుటను.(చకార=చేసెను)

తాత్పర్యము, సులభము.

రాక్షసీ విద్రవం చైవ కింకరాణాం నిబర్హణమ్
గ్రహణం వాయుసూనోశ్చ లంకాదాహాభి గర్జనమ్. ౩౨

టీక॥ రాక్షసీవిద్రవంచైవ, రాక్షసీ=రాక్షసస్త్రీలయొక్క-, విద్రవంచైవ = పాఱుటను; కింకరాణాం = రావణునిభటులయొక్క-

(భటులను), నిబర్హణం=చంపుటను; వాయుసూనోః=వాయువుకొడుకైనహనుమంతునియొక్క (హనుమంతుని); గ్రహణంచ=పట్టుకొనుటను; లంకా దాహాఽభిగర్జనం; లంకా=లంక యొక్క (లంకను) దాహ = కాల్చుటచే, అభిగర్జనం=అఱచుటను; (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

ప్రతిప్లవన మేవాథ మధూనాం హరణం తథా
రాఘవాశ్వాసనం చాపి మణినిర్యాతనంతథా. ౩౩

టీక॥ అథ=ఆపిమ్మట; ప్రతిప్లవన మేవ=మఱల సముద్రమును దాఁటుటను; మధూనాం=తేనియలయొక్క (తేనియలను); హరణంతథా=అపహరించుటను; రాఘవాశ్వాసనంచాపి, రాఘవ=రాముని యొక్క (రాముని), ఆశ్వాసనంచాపి=ఊఱడించుటను; మణినిర్యాతనం తథా, మణి=శిరోరత్నముయొక్క (శిరోరత్నమును), నిర్యాతనం తథా=రామునకు, అప్పగించుటను- (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

సంగమంచ సముద్రేణ నళసేతోశ్చ బంధనమ్
ప్రతారంచ సముద్రస్య రాత్రౌ లంకావరోధనమ్. ౩౪

టీక॥ సముద్రేణ = సముద్రునితోః సంగమంచ=సైన్యసహితుఁడై రాముఁడు, చేరుటయును; నళసేతోః=నలునిచేఁ గట్టఁబడిన సేతువుయొక్క (సేతువును); బంధనంచ=కట్టుటను; సముద్రస్య=సముద్రముయొక్క (సముద్రమును); ప్రతారంచ=దాఁటుటను; రాత్రౌ=రాత్రియందు; లంకా వరోధనం, లంకా = లంకయొక్క (లంకను), అవరోధనం = ముట్టడించుటను. (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

విభీషణేన సంసర్గం వధోపాయ నివేదనమ్




కుంభకర్ణస్య నిధనం మేఘనాద నిబర్హణమ్. ౩౫

టీక॥ విభీషణేన = విభీషణుని తో; సంసర్గం = సంబంధమును; వధోపాయనివేదనం, వధ=రావణునిఁజంపుటయందు; ఉపాయ= వెరపుయొక్క (వెరవును), నివేదనం= తెల్పుటను; కుంభకర్ణస్య= కుంభకర్ణునియొక్క; నిధనం= చావును; మేఘనాదనిబర్హణం, మేఘనాద=ఇంద్రజిత్తుయొక్క (ఇంద్రజిత్తును), నిబర్హణం=చంపుటను. (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

రావణస్య వినాశంచ సీతావాప్తి మరేః పురే
విభీషణాభి షేకంచ పుష్పకస్యచ దర్శనమ్. ౩౬

టీక॥ రావణస్య = రావణుని యొక్క; వినాశంచ=చావును; అరేః=శత్రువుయొక్క; పురే=పట్టణమందు; సీతావాప్తిం, సీతా=సీతాదేవియొక్క (సీతాదేవిని), అవాప్తిం= పొందుటను; విభీషణాభిషేకంచ, విభీషణ = విభీషణునియొక్క, అభిషేకంచ=పట్టాభిషేకమును; పుష్పకస్య= పుష్పకవిమానము యొక్క (పుష్పకవిమానమును); దర్శనంచ=చూచుటను. (చకార= చేసెను). తాత్పర్యము సులభము.

అయోధ్యాయాశ్చ గమనం భరతేన సమాగమమ్
రామాభిషేకా భ్యుదయం సర్వసైన్య విసర్జనమ్
స్వరాష్ట్ర రంజనంచైవ వైదేహ్యాశ్చ విసర్జనమ్. ౩౭

టీక॥ అయోధ్యాయాః = అయోధ్యా పట్టణమునకు; గమనంచ=పోవుటను; భరతేన=భరతునితో; సమాగమం=చేరుటను; రామాభిషేకాభ్యుదయం, రామ = రామునియొక్క, అభిషేకాభ్యుదయం=పట్టాభిషేకోత్సవమును; సర్వసైన్యవిసర్జనం, సర్వ=సమస్తములైన, సైన్య = సైన్యములయొక్క (సైన్యములను), విసర్జనం=




విడుచుటను, స్వరాష్ట్రరంజనంచైవ, స్వ=తనదగు, రాష్ట్ర=రాజ్యముయొక్క (రాజ్యమును), రంజనంచైవ=సంతోషింపఁజేయుటను; వైదేహ్యాః=సీతాదేవియొక్క (సీతాదేవిని) విసర్జనంచ=విడుచుటను. (చకార=చేసెను).

తాత్పర్యము, సులభము.

అనాగతంచ యత్కించి ద్రామస్య వసుధాతలే
తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకి ర్భగవానృషిః. ౩౯

టీక॥ రామస్య=రామునకు; వసుధాతలే=భూతలమందు; అనాగతం=నడవఁబోవునట్టి; యత్=ఏ చరిత్రము; కించిత్=కొంచెము; అస్తి (అధ్యాహృతము) కలదో; ఉత్తరే=ఉత్తరకథాప్రతిపాదకమగు; కావ్యే=కావ్యమందు; తచ్చ=దానిని; భగవాన్=మాహాత్మ్యము గలవాఁడును; ఋషిః= పరమార్థము నుదెలిసినవాఁడునగు; వాల్మీకిః = వాల్మీకిమహర్షి; చకార=చేసెను.

(ఇట్లు, ౧౦వశ్లోకము మొదలు, ౩౯వశ్లోకము కడవఱకు, నేకాన్వయముగా, నెఱుంగునది).

సీతావిసర్జనమునకుఁ బూర్వముజరిగినకథాభాగమును షట్కాండముల యందును, సీతావిసర్జనము మొదలగు భవిష్యత్కథాభాగము నుత్తరకాండమునందును, భగవంతుఁడగువాల్మీకిమహర్షి, యభివర్ణించెను. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, తృతీయస్సర్గః.

ఇది, స్పష్టార్థము

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ తృతీయసర్గటీక,
ముగిసినది.

౫౪

చతుర్థసర్గప్రారంభః.

ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవా నృషిః
చకార చరితం కృత్స్నం విచిత్ర పద మాత్మవాన్. ౧

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగలవాఁడును; ఆత్మవాన్=బుద్ధిశాలియును; ఋషిః = కార్యముసేయశక్తుఁడునగు; వాల్మీకిః = వాల్మీకి; ప్రాప్తరాజ్యస్య, ప్రాప్త=పొందఁబడిన, రాజ్యస్య= రాజ్యముగల; రామస్య= రామునియొక్క; విచిత్రపదం, విచిత్ర= ఆశ్చర్యజనకములగు, పదం=శబ్దములుగల; కృత్స్నం=సమస్తమైన; చరితం = చరిత్రమును; చకార=చేసెను.

భగవంతుండును "నానృషిఃకురుతేకావ్యం" (ఋషిగానివాఁడుకావ్యముసేయఁజాలఁడు) అనునట్లు, ఋషియగుటం బట్టి, కావ్యము సేయసమర్థుండునగు వాల్మీకి, రాముఁడు, రాజ్యమును బాలింపుచుండఁగా, నతనిచరిత్రమంతయు, విచిత్రంబులగుశబ్దములతోఁ జేసెను. అని తాత్పర్యము.

చతుర్వింశ త్సహస్రాణి శ్లోకానా ముక్తవా నృషిః
తథా సర్గశతాన్ పంచ షట్కాండాని తథోత్తరమ్. ౨

టీ॥ఋషిః=వాల్మీకిమహర్షి; శ్లోకానాం=శ్లోకములయొక్క; చతుర్వింశత్సహస్రాణి=ఇరువదినాలుగువేలును (ఇరువదినాలుగువేలశ్లోకములనుఅనుట); పంచ=ఐదు; సర్గశతాన్ తథా=నూఱుసర్గలను; షట్=ఆఱు; కాండాని=కాండములను; ఉత్తరంతథా=ఉత్తరకాండమును; ఉక్తవాన్=చెప్పెను.

వాల్మీకిమహర్షి, ఇరువదినాలుగువేలశ్లోకములును, ఐదునూఱులసర్గలును, ఏడు కాండములును, ఉండునట్లు, రామాయణమును జేసెను. అని తాత్పర్యము.

కృత్వాపి తన్మహాప్రాజ్ఞ స్సభవిష్యం సహోత్తరమ్
చింతయామాస కోన్వేత త్ప్రయుంజీయా దితి ప్రభుః. ౩

టీక॥ మహాప్రాజ్ఞః = పండితశ్రేష్ఠుఁడైన;ప్రభుః = సమర్థుఁడగు వాల్మీకి;సహోత్తరం= శ్రీరామపట్టాభిషేకమునకు వెనుకటికథాభాగముతోఁ గూడినదియు ; సభవిష్యం=అశ్వమేధమునకు వెనుకటిభవిష్యత్కథతోఁ గూడినదియు నగు; తత్ = ఆరామాయణమును; కృత్వాపి=చేసియు;కోను=ఎవ్వఁడు; ఏతత్ =దీనిని;ప్రయుంజీయాత్ = ప్రయోగించును;ఇతి = అని;చింతయామాస=ఆలోచించెను.

పండితశ్రేష్ఠుండును సమర్థుండునగువాల్మీకి, శ్రీరామపట్టాభిషేకమునకు వెనుకటికథలను, అశ్వమేధముసేయుటకు వెనుకటి భవిష్యత్కథలునుం, జేర్చి , యారామ కథనంతయుఁజేసి, "దీని నెవ్వఁడుపరించిలోకమునందుఁ బ్రవర్తిల్లఁ జేయును" అని యాలోచించెను.
అని తాత్పర్యము.

తస్య చింతయ మానస్య మహర్షే ర్భావితాత్మనః
అగృహ్ణీతాం తతః పాదౌ ముని వేషౌ కుశీలవౌ. ౪

టీక॥తతః=ఆపిమ్మట; మునివేషౌ, ముని= మునులయొక్క, వేషౌ = వేషముల వంటివేషములుగల;కుశీలవౌ=కుశలవులు; చింతయమానస్య = ఆలోచించుచున్నవాఁడును; భావితాత్మనః, భావిత= ధ్యానింపఁబడిన,ఆత్మనః=పరమాత్మగలవాఁడునగు;తస్య=ఆవాల్మీకియొక్క;పాదౌ=అడుగులను; అగృహ్ణీతాం=పట్టుకొనిరి.

ఆవాల్మీకిమహాముని, తగిన శిష్యుఁడుదొరకొనుటకై పరమాత్మయందు మనసునిడి చింతింపు చుండఁగా,మునివేషములధరించి యుండుకుశలవులను రాజపుత్రులు, ఆవాల్మీకిపాదములకభివందనముఁజేసిరి.
అని తాత్పర్యము.

కుశీలవౌ తు ధర్మజ్ఞౌ రాజపుత్రౌ యశస్వినౌ
భ్రాతరౌ స్వరసంపన్నౌ దదర్శాశ్రమ వాసినౌ. ౫

టీక॥ సః(అధ్యాహృతము)= ఆవాల్మీకి; ధర్మజ్ఞౌ=ధర్మముల నెఱింగినవారును; రాజపుత్రౌ = రాచకొమరులును; యశస్వినౌ= కీర్తిగలవారును; భ్రాతరౌ=తోడంబుట్టువులును; స్వరసంపన్నౌ, స్వర=శారీరసౌష్ఠవముతో, సంపన్నౌ=కూడుకొనినవారును; ఆశ్రమవాసినౌ, ఆశ్రమ=తనయాశ్రమమందు, వాసినౌ=వాసముసేయుచుండువారనగు; కుశీలవౌ=కుశలవులను;("తు" అనునది పాదపూరణార్థము.)దదర్శ =చూచెను. తాత్పర్యము,సులభము.

వాల్మీకిమహర్షి.





లవుడు.



కుశుడు.

సతు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ
వేదోప బృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః. ౬

కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్
పౌలస్త్య వధ మిత్యేవ చకార చరితవ్రతః. ౭

టీక ॥ ప్రభుః=స్వతంత్రుఁడైన; సః=ఆవాల్మీకి; మేధావినౌ=బుద్ధిశాలులును; వేదేషు= వేదములయందు; పరినిష్ఠితౌ=దృఢమైననిష్ఠగలవారునగు; కుశీలవౌ (అధ్యాహృతము) = కుశలవులను; దృష్ట్వా=చూచి; (తాను) చరితవ్రతః, చరిత=ఆచరింపంబడిన, వ్రతః=చాంద్రాయణాదివ్రతములుగలవాఁడై; సీతాయాః=సీతాదేవియొక్క; కృత్స్నం=సమస్తమైన; చరితం=చరిత్రమును; పౌలస్త్యవధం, పౌలస్త్య=పులస్త్యవంశమందుఁ బుట్టిన రావణునియొక్క, వధం=చంపుటను; ఇత్యేవ= వీనిగుఱించియే; రామాయణం=రామాయణమనెడు; యత్=ఏ; మహత్=గొప్పదైన; కావ్యం=కావ్యమును; చకార=చేసెనో; వేదోపబృంహణార్థాయ, వేద=వేదములయొక్క, ఉపబృంహణ=అర్థనిర్వచనమును, అర్థాయ = ప్రయోజనముకొఱకు; తౌ=ఆకుశలవులను; తత్ (అధ్యాహృతము)=ఆకావ్యమును; అగ్రాహయత=గ్రహింపఁజేసెను.

స్వతంత్రుఁడగువాల్మీకి, బుద్ధిశాలులును సాంగంబుగ వేదాధ్యయనముఁజేసినవారలునగు నా కుశలవులంజూచి, తాను సీతాచరిత్రమును రావణవధమునుం గుఱించిరచించిన రామాయణంబనుమహాకావ్యము నాకుశలవులకుఁ దెలియఁజెప్పెను. అని తాత్పర్యము.

పాఠ్యే గేయేచ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితమ్
జాతిభి స్సప్తభి ర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్. ౮
రసై శ్శృంగార కారుణ్య హాస్య వీర భయానకైః
రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్య మేత దగాయతామ్. ౯
తౌతు గాంధర్వ తత్త్వజ్ఞౌ మూర్ఛనాస్థానకోవిదౌ

భ్రాతరౌ స్వరసంపన్నౌ గంధర్వా వివ రూపిణౌ. ౧౦
రూప లక్షణ సంపన్నౌ మధుర స్వరభాషిణౌ
బింబా దివోద్ధృతౌ బింబౌ రామదేహా త్తథాపరౌ. ౧౧

టీక॥ గాంధర్వతత్త్వజ్ఞౌ; గాంధర్వ=గానశాస్త్రముయొక్క, తత్త్వ=రహస్యములను, జ్ఞౌ=ఎఱింగినవారును; మూర్ఛనాస్థాన కోవిదౌ, మూర్ఛనా=స్వరపూర్తియొక్క, స్థాన = పుట్టుచోట్లను; కోవిదౌ=ఎఱింగినవారును; భ్రాతరౌ= తోడఁ బుట్టువులును ; స్వరసంపన్నౌ, స్వర = శారీరముతో, సంపన్నౌ=కూడుకొనినవారును; రూపిణౌ= మనుష్యరూపముగల; గంధర్వావివ(స్థితౌ)=గంధర్వులవలెనున్నవారును; రూపలక్షణసంపన్నౌ, రూప=నాటకముయొక్క("రూప స్స్వభావేశుక్లాదౌ సౌందర్యేనాటకేపశౌ" అనిభాస్కరనిఘంటువు), లక్షణ = లక్షణములతో ; సంపన్నౌ=కూడికొనినవారును; మధురస్వరభాషిణౌ, మధురస్వర = మనోహర మైన ధ్వని గలుగు నట్లు, భాషిణౌ=పలుకువారును; తథా= అట్లు; బింబాత్ = మూల బింబ మైన; రామదేహాత్, రామ= రాముని యొక్క, దేహాత్ = దేహము నుండి; ఉద్ధృతౌ=నిర్మింపఁబడిన; అపరౌ=ఇతరములైన; బింబావివ (స్థితౌ)= ప్రతిబింబములువలెనున్న వారునగు; తౌ = ఆకుశలవులు ("తు" అనునది పాదపూరణార్థము.); పాఠ్యే = పఠించుటయందును; గేయేచ = పాడుటయందును; మధురం = మనోహరమైనదియును; త్రిభిః=మూఁడైన; ప్రమాణైః= ద్రుత మధ్యవిలంబితము లనెడుప్రమాణములతో; అన్వితం=కూడినదియును; సప్తభిః=ఏడైన; జాతిభిః = షడ్జమధ్యమగాంధారనిషాదఋషభధైవతపంచమంబు లనెడు జాతులతో; బద్ధం=కట్టఁబడినదియును; తంత్రీలయసమన్వితం, తంత్రీ=వీణెతంతులయొక్క, లయ=తాళాదిసామ్యముతో, సమన్వితం= కూడినదియును; శృంగారకారుణ్యహాస్యవీరభయానకైః= శృంగారకారుణ్యహాస్యవీర భయానకంబులను నవి




యును; రౌద్రాదిభిశ్చ = రౌద్ర, (ఆదిశబ్దముచేత) బీభత్సాద్భుత శాంతంబులనునవియునగు; రసైః= రసములతోఁ; సంయుక్తం=కూడు కొనినదియునగు; ఏతత్=ఈ; కావ్యం=రామాయణకావ్యమును; అగాయతాం=పాడిరి.

గానశాస్త్రరహస్యములనెఱింగి షడ్జాది స్వరముల యుత్పత్తిస్థానంబులఁదెలిసికొని, నాటకయోగ్యములైన యభినయములతో, మనోహారంబగుకంఠంబున, మధురస్వరంబుగభాషింపుచు, మానుషవేషధారులగుగంధర్వులుంబోలె వెలుంగుచున్నవారునుమూలబింబంబగురామదేహంబువలన సంగ్రహింపఁబడినప్రతిబింబములట్లున్నవారు నగు నా కుశలవులు, మనోహరంబుగఁ బఠించుటకును బాడుటకునుందగి, ద్రుతమధ్యవిలంబితములనొప్పుచు, షడ్జాదిసప్తజాతులుగలిగి, శృంగారాదినవరసంబులచే రమణీయంబైన యీ రామాయణ కావ్యమును బాడిరి. అని తాత్పర్యము.

తౌ రాజపుత్రౌ కార్త్స్న్యేన ధర్మ్యమాఖ్యాన ముత్తమమ్
వాచోవిధేయం తత్సర్వం కృత్వా కావ్య మనిందితౌ. ౧౨
ఋషీణాంచ ద్విజాతీనాం సాధూనాం చ సమాగమే
యథోపదేశం తత్త్వజ్ఞౌ జగతు స్సుసమాహితౌ. ౧౩
మహాత్మానౌ మహాభాగౌ సర్వలక్షణ లక్షితౌ

టీక॥ రాజపుత్రౌ=రాచకొమరులును; అనిందితౌ=దూఱఁదగనివారును; తత్త్వజ్ఞౌ=నిశ్చితాభిప్రాయము నెఱింగినవారును; సుసమాహితౌ=మిక్కిలి మెచ్చరికగలవారును; మహాత్మానౌ=గొప్పబుద్ధిగలవారును; మహాభాగౌ=గొప్పభాగ్యము గల వారును ("భాగాభాగ్యాంశతుల్యాంశాః" అని వైజయంతి); సర్వలక్షణలక్షితౌ, సర్వ=సమస్తములైన, లక్షణ=శుభలక్షణములతోఁ, లక్షితౌ=కూడుకొనినవారు నగు; తౌ=ఆకుశలవులు; కార్త్స్న్యేన=సాకల్యముగ; ధర్మ్యం= ధ




మర్మముతోఁగూడినదియును; ఉత్తమం=శ్రేష్ఠమైనదియునగు; ఆఖ్యానం=చరిత్రరూపమైన; తత్=ఆ; కావ్యం = రామాయణకావ్యమును; సర్వం=అంతయును; వాచః=నోటికి; విధేయం=వశమునుగా; కృత్వా= చేసికొని; ఋషీణాంచ= ఋషులయొక్కయు; ద్విజానాం= ద్విజులయొక్కయు; సాధూనాం చ= పెద్దలయొక్కయు; సమాగమే=సభయందు; యథోపదేశం= తమకుపదేశించినరీతినిదప్పక; జగతుః=పాడిరి.

మిక్కిలిబుద్ధిశాలులును సమస్త శుభలక్షణములతోను గూడినవారు నగు నారాచకొమరులు, రామాయణముయొక్క యథార్థార్థము దెలిసికొని, సావధానులై, సమస్త స్థలములయందును ధర్మమయమై యుత్తమమై పూర్వముజరిగిన చరిత్రమును జెప్పుచున్న యీ రామాయణ మహాకావ్యమునంతయు నోటికివచ్చునట్లుచేసికొని, ఋషులును ద్విజులునుసాధువులును, జేరు కాలనులయందుఁ, బాడసాగిరి. అని తాత్పర్యము.

తౌ కదాచి త్సమేతానా మృషీణాం భావితాత్మనామ్. ౧౪
ఆసీనానాం సమీపస్థా విదం కావ్య మగాయతామ్

టీక॥ తౌ=ఆకుశలవులు, కదాచిత్=ఒకానొకప్పుడు, భావితాత్మనాం, భావిత=ధ్యానింపఁబడిన, ఆత్మనాం=పరమాత్మగలవారును, సమేతానాం = గుంపుచేరినవారును, ఆసీనానాం=కూర్చుండినవారునగు, ఋషీణాం = ఋషులయొక్క; సమీపస్థౌ=సమీపమందున్నవారలై; ఇదం=ఈ, కావ్యం=రామాయణ కావ్యమును, అగాయతాం=పాడిరి.

ఆకుశలవులు, ఒకానొకప్పుడు, పరమజ్ఞానులగు ఋషులుకొందఱు సభచేరి కూర్చుండియుండఁగా, వారిసమీపమందుండి యీ రామాయణకావ్యమునుబాడిరి. అని తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా మునయ స్సర్వే బాష్పపర్యాకులేక్షణాః. ౧౫

సాధుసాధ్వితి తా వూచుః పరంవిస్మయ మాగతాః

టీక॥సర్వే=సమస్తులయిన,మునయః=మునులు,తత్ = ఆపాటనుః;శ్రుత్వా=విని, పరం=అధికమైన,విస్మయం=ఆశ్చర్యమును; ఆగతాః=పొందినవారును; బాష్పపర్యాకులేక్షణాః,బాష్ప=సంతసంపుఁగన్నీరుచే,వ్యాకుల=కలఁతపడిన, ఈక్షణాః=నేత్రములుగలవారునై; తౌ=ఆకుశలవులఁగూర్చి, సాధుసాధ్వితి= బళాబళా యని; ఊచుః= చెప్పిరి.

ఆఋషులు,వారి పాటనువిని,మిగుల నాశ్చర్యమునుబొంది,కన్నుల నానందబాష్పములు గాఱఁగా నా కుశలవులఁజూచి, బళే! బళే! అని మెచ్చుకొనిరి-అని తాత్పర్యము.

తే ప్రీతమనస స్సర్వే మునయో ధర్మవత్సలాః. ౧౬
ప్రశశంసుః ప్రశస్తవ్యౌ గాయమానౌ కుశీలవౌ

టీక॥ ధర్మవత్సలాః,ధర్మ = ధర్మమందు;వత్సలాః = మిక్కిలి స్నేహముగల; తే=ఆ;సర్వే=సమస్తులయిన;మునయః=ఋషులు;ప్రీతమనసః,ప్రీత= సంతోషించిన,మనసః= హృదయములుగలవారలై; గాయమానౌ= పాడుచున్నవారును;ప్రశస్తవ్యౌ= కొనియాడఁదగినవారునైన,కుశీలవౌ=కుశలవులను; ప్రశశంసుః=కొనియాడిరి.

ధర్మైకబుద్ధిగల ఆఋషులందఱును, సంతసించి, మధురముగా రామాయణమును బాడుటం బట్టి కొనియాడందగి యున్న కుశలవులను,బ్రశంసించిరి. అనితాత్పర్యము.

అహో గీతస్య మాధుర్యం శ్లోకానాంతు విశేషతః- ౧౭
చిరనిర్వృత్త మప్యేత త్ప్రత్యక్షమివ దర్శితమ్

టీక॥ గీతస్య= పాటయొక్క; మాధుర్యం = మనోహరమగుట; అహో = ఆశ్చర్యకరము; శ్లోకానాం = శ్లోకముల యొక్క;

మర్మముతోఁగూడినదియును; ఉత్తమం=శ్రేష్ఠమైనదియునగు; ఆఖ్యానం=చరిత్రరూపమైన; తత్=ఆ; కావ్యం = రామాయణకావ్యమును; సర్వం=అంతయును; వాచః=నోటికి; విధేయం=వశమునుగా; కృత్వా= చేసికొని; ఋషీణాంచ= ఋషులయొక్కయు; ద్విజానాం= ద్విజులయొక్కయు; సాధూనాం చ= పెద్దలయొక్కయు; సమాగమే=సభయందు; యథోపదేశం= తమకుపదేశించినరీతినిదప్పక; జగతుః=పాడిరి.

మిక్కిలిబుద్ధిశాలులును సమస్త శుభలక్షణములతోను గూడినవారు నగు నారాచకొమరులు, రామాయణముయొక్క యథార్థార్థము దెలిసికొని, సావధానులై, సమస్త స్థలములయందును ధర్మమయమై యుత్తమమై పూర్వముజరిగిన చరిత్రమును జెప్పుచున్న యీరామాయణ మహాకావ్యమునంతయు నోటికివచ్చునట్లుచేసికొని, ఋషులును ద్విజులును సాధువులును, జేరు కాలనులయందుఁ, బాడసాగిరి. అని తాత్పర్యము.

తౌ కదాచి త్సమేతానా మృషీణాం భావితాత్మనామ్. ౧౪
ఆసీనానాం సమీపస్థా విదం కావ్య మగాయతామ్

టీక॥ తౌ=ఆకుశలవులు, కదాచిత్=ఒకానొకప్పుడు, భావితాత్మనాం, భావిత=ధ్యానింపఁబడిన, ఆత్మనాం=పరమాత్మగలవారును, సమేతానాం = గుంపుచేరినవారును, ఆసీనానాం=కూచుండినవారునగు, ఋషీణాం = ఋషులయొక్క; సమీపస్థౌ=సమీపమందున్నవారలై; ఇదం=ఈ, కావ్యం=రామాయణ కావ్యమును, అగాయతాం=పాడిరి.

ఆకుశలవులు, ఒకానొకప్పుడు, పరమజ్ఞానులగు ఋషులుకొందఱు సభచేరి కూర్చుండియుండఁగా, వారిసమీపమందుండి యీరామాయణకావ్యమునుబాడిరి. అని తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా మునయ స్సర్వే బాష్పపర్యాకులేక్షణాః. ౧౫

ప్రకారము; తౌ=ఆకుశలవులు;ప్రశస్యమానౌ= కొనియాడఁబడుచున్నవారై;సంరక్తతరం =శ్రేష్ఠములైనరాగములు హెచ్చుగాఁగలుగు నట్లును; అత్యర్థం= మిక్కిలి;మధురం = మనోహరమగు నట్లును; తౌ=ఆకుశలవులు;అగాయతాం= పాడిరి.

మిక్కిలియుఁ దపస్వులునుబుద్ధిశాలులునగు మహర్షు లీప్రకారముశ్లాఘింపుచుండఁగా, మఱంత మంచిరాగములతో,మిక్కిలిమధురముగాఁబాడిరి. అని తాత్పర్యము.

ఋషులు కుశలవులకు బహుమతు లిప్పించుట.







ప్రీతః కశ్చి న్ముని స్తాభ్యాం సంస్థితః కలశం దదౌ. ౨౦

ప్రసన్నో వల్కలం కశ్చి ద్దదౌ తాభ్యాం మహాయశాః

టీక॥ కశ్చిత్=ఒకానొక; ముని:=ఋషి; ప్రీతః = సంతసించినవాఁడును; సంస్థితః= లేచినవాఁడునై; తాభ్యాం= ఆకుశలవులకొఱకు; కలశం = జలపాత్రమును; దదౌ=ఇచ్చెను, మహాయశాః = గొప్పకీర్తిగల; కశ్చిత్ = ఒకానొక ముని; ప్రసన్నః= సంతసించినవాఁడై; తాభ్యాం = ఆకుశలవులకొఱకు; వల్కలం=నారచీరను; దదౌ= ఇచ్చెను.

ఒకానొక మహర్షి, సంతసించి ప్రేమాతిశయంబున లేచి, యాకుశలవులకు, జలపాత్రమునిచ్చెను; మహాయశుండగు మఱియొకండు, సంతుష్టుఁడై, నారచీరనిచ్చెను. అని తాత్పర్యము.

ఆశ్చర్య మిద మాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్. ౨౧
పరం కవీనా మాధారం సమాప్తంచ యథాక్రమమ్
అభిగీత మిదం గీతం సర్వగీతేషు కోవిదౌ. ౨౨
ఆయుష్యం పుష్టిజనకం సర్వశ్రుతి మనోహరమ్
ప్రశస్యమానౌ సర్వత్ర కదాచి త్తత్ర గాయకౌ. ౨౩
రథ్యాసు రాజమార్గేషు దదర్శ భరతాగ్రజః

టీక ॥ ఆశ్చర్యం=ఆశ్చర్యము గలిగించునదియును; మునినా=వాల్మీకిచేత; సంప్రకీర్తితం=చక్కగాఁ జెప్పఁబడినదియును; కవీనాం=కవులకు; పరం=ఉత్కృష్టమైన; ఆధారం = ఆధారమైనదియును; యథాక్రమం=వరుసతప్పక; సమాప్తం=ముగిసినదియును; ఆఖ్యానం=చరిత్రరూపమునైన; ఇదం=ఈప్రబంధమునుగూర్చి; సర్వగీతేషు= సమస్తగానములయందును; కోవిదౌ=సమర్థులగు కుశలవులారా! యువాభ్యాం (అధ్యాహృతము)=మీచేత; ఆయుష్యం= ఆయుస్సును వృద్ధిఁబొందించునదియును; పుష్టిజనకం=పుష్టినిగలిగించు నదియును; సర్వశ్రుతి మనోహరం, సర్వశ్రుతి=స్వరావయవ



రూపములైన సమస్త శ్రుతులచేత, మనోహరం=ఇంపైనదియునగు; ఇదం=ఈ; గీతం=పాట; అభిగీతం=చక్కఁగాఁబాడఁబడినది; ఇతి (అధ్యాహృతము)=అని; తత్ర=ఆయశ్వమేధ యజ్ఞవాటమందును; రథ్యాసు=వీథులయందును; రాజమార్గేషు=రాజమార్గములయందును; ప్రశస్యమానౌ=కొనియాడఁబడుచుండునట్టి; గాయకౌ=గానము సేయువారైనకుశలవులను; కదాచిత్=ఒకానొకప్పుడు; భరతాగ్రజః= భరతునకన్నయైనరాముఁడు; దదర్శ=చూచెను.

"సమస్తగానములయందునుసమర్థులైన ఓకుశలవులారా! వాల్మీకిమహాముని చే, వరుసదప్పక రచింపఁబడి, కవులకుఁ బరమాధారంబై, యాశ్చర్యావహంబై వెలుంగుచున్న, శ్రీరామచరిత్రరూపమగు నీరామాయణంబును, ఆయుర్వృద్ధికరంబును బుష్టిప్రదంబును యుక్తస్వరావయవంబులచే నొప్పుచున్నదియునత్యుత్తమంబునగు గానముచేఁ, బాడితిరి" అని, అశ్వమేధయజ్ఞవాటమునందును రాజమార్గాదులయందునుగొనియాడఁబడుచుండుకుశలవులను, రాముఁడు తానశ్వమేధయాగము సేయుచున్నప్పుడు, చూచెను. అని తాత్పర్యము.

స్వవేశ్మ చానీయ తతో భ్రాతరౌ స కుశీలవౌ. ౨౮
పూజయామాస పూజార్హౌ రామ శ్శత్రునిబర్హణః

టీక॥ తతః=ఆపిమ్మట; శత్రునిబర్హణః = శత్రువులఁజంపునట్టి; సః=ఆ; రామః = రాముఁడు; పూజాపశాౝ, పూజ = పూజకు, అర్హౌ=తగినవారును; భ్రాతరౌ=తోఁడఁబుట్టువులునగు; కుశీలవౌ=కుశలవులను; స్వవేశ్మ=తనయశ్వమేధశాలాగృహమును; ఆనీయ = పొందించి; పూజయామాస = కొనియాడెను.

శత్రువులఁ జంపునట్టి యారాముఁ, డాకుశలవులనుదా నజూచిన వెనుకనే, వారిందనయశ్వమేధశాలాగృహమునకురప్పించి, శ్లాఘించెను. అని తాత్పర్యము.



ఆసీనః కాంచనే దివ్యే సచ సింహాసనే ప్రభుః. ౨౫
ఉపోప విష్ట స్సచివై ర్భ్రాతృభిశ్చ పరంతపః
దృష్ట్వాతు రూపసంపన్నౌ తావుభౌ నియత స్తథా. ౨౬
ఉవాచ లక్ష్మణం రామ శ్శత్రుఘ్నం భరతంతథా
శ్రూయతా మిద మాఖ్యాన మనయో ర్దేవవర్చసోః. ౨౭
విచిత్రార్థపదం సమ్య గ్గాయకౌ తావచోదయత్

టీక॥ ప్రభుః=రాజును; కాంచనే= బంగారుతోఁ జేయఁ బడినదియును; దివ్యే=స్వర్గమునందుఁబుట్టినదియునగు; సింహాసనే=సింహాసనమందు; ఆసీనః=కూర్చుండియున్నవాఁడును; సచివైః = మంత్రులచేతను; భ్రాతృభిశ్చ=తోఁబుట్టువులచేతను; ఉపోపవిష్టః=చుట్టఁబడినవాఁడును; పరంతపః, పరం=శత్రువులను; తపః=వేఁచువాఁడును; నియతః = యజ్ఞదీక్షితుఁడునగు; సః=ఆ ("చ" అనునది పాదపూరణార్థము); రామః=రాముఁడు; రూపసంపన్నౌ, రూప= సౌందర్యముతో, సంపన్నౌ=కూడికొనినట్టి; తౌ=ఆ; ఉభౌ=ఇద్దఱైనకుశలవులను; దృష్ట్వా=చూచి ("తు" అనునది పాదపూరణార్థము); తదా=అప్పుడు; తథా=అట్లు; దేవవర్చసోః, దేవ=దేవతలయొక్క, వర్చసోః = కాంతివంటికాంతిగల; అనయోః= వీరియొక్క; విచిత్రార్థపదం, విచిత్ర=ఆశ్చర్యమునుగలిగించునట్టి, అర్థపదం = అర్థశబ్దములుగల; ఆఖ్యానం=ప్రబంధమును; సమ్యక్= చక్కఁగా; శ్రూయతాం=వినబడుఁగాక; ఇతి(అధ్యాహృతము)=అని; లక్ష్మణం=లక్ష్మణుని; శత్రుఘ్నం= శత్రుఘ్నుని, భరతం=భరతునింగూర్చి, ఉవాచ=చెప్పెను. తౌ=ఆ; గాయకౌ=పాఠకులగుకుశలవులను, అచోదయత్=ప్రేరేపించెను.

యజ్ఞదీక్షితుండగు రాముఁడు, దశరథునిచేస్వర్గమునుండి తీసికొనిరాఁబడినస్వర్ణమయ సింహాసనమునందుఁగూర్చుండి, తోఁబుట్టువులు నుమంత్రులునుం గొలువ నిండుకొలువుండి, యతి సుందర రూపులగు

నాకుశలవులంజూచి, "ఆశ్చర్యావహంబులగు శబ్దార్థంబులనొప్పు ప్రబంధమును వీరుగానముసేయఁగా వినుఁడు" అనితోడంబుట్టువులకుఁజెప్పి, యాకుశలవుల గానముసేయని యోగించెను. అనితాత్పర్యము.

తౌ చాపి మధురం రక్తం స్వంచితాయతనిస్వనమ్. ౨౮
తంత్రీలయవ దత్యర్థం విశ్రుతార్థ మగాయతామ్

టీక ॥ తౌచాపి=ఆకుశలవులును; మధురం=మనోహరముగాను; రక్తం=రాగయుక్తముగాను; స్వంచితాయతనిస్వనం, స్వంచిత=మిక్కిలిపూజ్యమును, ఆయత=దీర్ఘమునైన, నిస్వనం=ధ్వనిగలుగునట్లుగాను; తంత్రీలయవత్=వీణెతంతులును దాళాదిసామ్యమునుగలుగునట్లుగాను; అత్యర్థం=మిక్కిలి; విశ్రుతార్థం=స్పష్టమైన అర్థముగలుగునట్లుగాను; అగాయతాం=పాడిరి. తాత్పర్యము, సులభము.

హ్లాదయ త్సర్వగాత్రాణి మనాంసి హృదయానిచ
శ్రోత్రాశ్రయ సుఖం గేయం తద్బభౌ జనసంసది. ౨౯

టీక॥ శ్రోత్రాశ్రయసుఖం, శ్రోత్ర=చెవియే, ఆశ్రయ=స్థానముగాఁగలశ్రోత్రేంద్రియములకు; సుఖం=సుఖమును గలుగఁజేయునట్టి; తత్=ఆ; గేయం=కుశలవులపాట; సర్వగాత్రాణి=సమస్తావయవములను; మనాంసి=మనస్సులను; హృదయానిచ=మనస్సులకధిష్ఠానములైనహృదయములను; హ్లాదయత్=సంతోషింపఁ జేయుచు; జనసంసది, జన=జనులయొక్క, సంసది=సభయందు, బభౌ=ప్రకాశించెను.

వీనులకానందముగలుగఁజేయు నాకుశలవులగానము, వినువారి, సమస్తావయవములను, మనస్సులను, మనస్సుల కధిష్ఠానభూతములైన హృదయములను సంతసింపఁజేయుచు, జనసమాజమందంతటను, బ్రకాశించెను. అని తాత్పర్యము.

ఇమౌ మునీ పార్థివ లక్షణాన్వితౌ
కుశీలవౌ చైవ మహా తపస్వినౌ
మమాపి తద్భూతి కరం ప్రవక్ష్యతే
మహాను భావం చరితం నిబోధత. ౩౦

టీక॥ హేజనాః (అధ్యాహృతము)=ఓజనులారా! ఇమౌ=ఈ కుశలవులు; మునీ= మునులైనను; పార్థివలక్షణాన్వితౌ, పార్థివలక్షణ=రాజలక్షణములతో, అన్వితౌ=కూడుకొనినవారుగాను; కుశీలవౌచైవ=గాయకులైనను; మహా తపస్వినౌ=తపస్సుగలవారిలోశ్రేష్ఠులుగాను;భవతః (అధ్యాహృతము) = అగుచున్నారు. ఆభ్యాం (అధ్యాహృతము)= వీరిచేత; మమాపి=నాకును; భూతికరం=శ్రేయస్కరమును; మహానుభావం=గొప్పప్రభావముగలదియునగు, తత్ = ఆ; చరితం=సీతాదేవిచరిత్రము,ప్రవక్ష్యతే= చెప్పఁబడుచున్నది.నిబోధత= తెలిసికొనుఁడు.

ఓజనులారా! ఈకుశలవులు , సాధారణముగమనులుగానగుపడినను రాజలక్షణములుగలిగియున్నారు, గాయకులుగానున్నను గొప్పతపస్సుగల వారలుగానున్నారు.వీరలు,సీతావిరహముచేఁ బీడింపఁబడుచున్ననాకును గొంతసౌఖ్యమునిచ్చునదియుమహాప్రభావంబునగుసీతాచరిత్రమును జెప్పఁబోయెదరు, కాఁబట్టి,సావధానముగావినుఁడు. అనితాత్పర్యము.

తతస్తు తౌ రామవచః ప్రచోదితా
వగాయతాం మార్గవిధాన సంపదా
సచాపి రామః పరిషద్గత శ్శనై
ర్బుభూషయా సక్తమనా బభూవ. ౩౧

టీక॥ తతస్తు = ఆపిమ్మటనే, తౌ=ఆకుశలవులు ; రామవచఃప్రచోదితౌ, రామ=రామునియొక్క, వచః = మాటచే, ప్రచోదితౌ= ప్రేరేపింపఁ బడిన వారై; మార్గవిధానసంపదా, మార్గవిధాన= మార్గమనెడిగానప్రకారముయొక్క, సంపదా=అతిశయతోఁ; అగాయతాం=పాడిరి; సః = ఆ; రామశ్చాపి=రాముఁడును; శనైః=మెల్లగా; పదిషద్గతః = సభనుబొందినవాఁడై; బుభూషయా = సుఖమును, అనుభవింప నిచ్ఛచేత; సక్తమనాః, సక్త=ఆసక్తిగల, మనాః = హృదయముగలవాఁడుగా; బభూవ=ఆయెను.

అంత, రాముఁడు ప్రేరేపింపఁగానే, యాకుశలవులు, "మార్గము, దేశి"యనెడుగానప్రకారములరెంటిలోను, ముఖ్యమైనమార్గమును బట్టి, పాడనారంభించిరి. అంత రాముఁడును, "దిగ్గనలేచివెళ్లినచో సభికులును లేవంబూతురు, దానరసభంగమగు"నని, మెల్లగాసింహాసనమునుండిడిగ్గిసభఁజేరి, యాశ్రోత్రానందమనుభవింపఁగోరి, వారిపాటనువిని నాసక్తుఁడయ్యెను. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, చతుర్థస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, బాలకాండ చతుర్థసర్గటీక,

ముగిసినది.

౫

పంచమసర్గ ప్రారంభః.

శ్రీరామ సన్నిధానంబునఁ గుశలవులు
రామాయణమును గానము సేయుట.



సర్వాపూర్వ మియం యేషా మాసీ త్కృత్స్నా వసుంధరా
ప్రజాపతి ముపాదాయ నృపాణాం జయశాలినామ్. ౧

టీక॥ కృత్స్నా=సమస్తమైన; ఇయం=ఈ; వసుంధరా=భూమి; జయశాలినాం=జయముచేఁ బ్రకాశించునట్టి; యేషాంనృపాణాం=ఏ రాజులదిగా; ప్రజాపతిం=మనుప్రజాపతిని; ఉపాదాయ= ఆరంభించి; సర్వాపూర్వాం, సర్వ=సమస్త రాజులకును, అపూర్వాం=నూతనమగు నట్లు; ఆసీత్ = ఆయెనో (ఈశ్లోకమునకు మూఁడవశ్లోకంబునందన్వయపూర్తియగును)

జయశాలులైనయేరాజులదిగానీ భూమియంతయు, మనుప్రజాపతి మొదలుకొని, ఇతరరాజుల కెవ్వరికినిసంబంధములేనట్లుండినదో. (అని, మూఁడవశ్లోకంబుతో నన్వయము.)అని తాత్పర్యము.

యేషాం స సగరో నామ సాగరో యేన ఖానితః
షష్టిః పుత్రసహస్రాణి యం యాంతం పర్యవారయన్. ౨

టీక॥ యేన = ఎవనిచేత; సాగరః=సముద్రము; ఖానితః=త్రవ్వింపఁబడెనో; యాంతం=యుద్ధమునకుఁబోవుచున్నట్టి; యం=ఎవ్వని; పుత్రసహస్రాణి= వెయ్యికొమారులు; షష్టిః=అఱువదిమంది; పర్యవారయన్=చుట్టుకొనిరో; సః=అటువంటి; సగరో నామ=సగరుఁడనిప్రసిద్ధుఁడైనరాజు; యేషాం =ఎవ్వరిలో; ఆసీత్=(అధ్యాహృతము)= కలిగెనో.

ఎవ్వనిచేఁ ద్రవ్వింపఁబడిసముద్రము "సాగర" మను పేరునుబొందెనో, ఎవ్వఁడు, యుద్ధమునకు అఱువేలకుమారులతో వెళ్లుచుండెనో; అట్టిసగరచక్రవర్తి యెవ్వరివంశమునఁబుట్టెనో-( "అటువంటి" అని పై శ్లోకములతో నన్వయము ). అని తాత్పర్యము.

ఇక్ష్వాకూణా మిదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనామ్
మహ దుత్పన్న మాఖ్యానం రామాయణ మితి శ్రుతమ్. ౩

టీక॥ మహాత్మనాం=గొప్పప్రభావము గలవారును ; ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకు వంశమునందుఁబుట్టినవారునగు; తేషాం = అటువంటి; రాజ్ఞాం = రాజులయొక్క ; వంశే=వంశమందు ; రామాయణమితి=రామాయణమని; శ్రుతం=ప్రసిద్ధమైన; మహత్ =పూజ్యమగు; ఇదం=ఈ; ఆఖ్యానం=ప్రబంధము; ఉత్పన్నం=పుట్టినది.

అటువంటి మహాత్ములైన యిక్ష్వాకు వంశపురాజుల వంశమునందు, రామాయణమను పేరంబ్రసిద్ధమగు, నీపూజ్య ప్రబంధము, పుట్టినది. అని తాత్పర్యము.

త దిదం వర్తయిష్యామి సర్వం నిఖిల మాదితః
ధర్మకామార్థ సహితం శ్రోతవ్య మనసూయయా. ౪

టీక ॥ తత్ = అటువంటి (అనఁగా, బ్రహ్మప్రసాదమునఁబుట్టిన); ఇదం = ఈరామాయణమును; వర్తయిష్యామి = ప్రవర్తిల్లఁజేయఁబోవుచున్నాను. ధర్మకామార్థసహితం = ధర్మకామార్థములతోఁగూడిన; సర్వం = సమస్తమైనరామాయణము; నిఖిలం = తక్కువపడనట్లు; అనసూయయా = అసూయలేమితో; శ్రోతవ్యం = వినంబడవలయును.

సాక్షాద్బ్రహ్మప్రసాదమునఁబుట్టిన ఈరామాయణమును నేను లోకమునం బ్రవర్తిల్లఁజేసెద- ధర్మకామార్థప్రదంబగుదీనినంతయుఁదక్కువపడకుండ, నసూయలేనివారలై, వినవలయును. అని తాత్పర్యము.

కోసలో నామ ముదితస్స్ఫీతో జనపదో మహాన్
నివిష్టస్సరయూతీరే ప్రభూతధనధాన్యవాన్. ౫

టీక॥ ముదితః = సంతోషించినదియును (లక్షణవలన, సంతోషించినజనముగలదియనుట); స్ఫీతః = సమృద్ధమైనదియును; ప్రభూతధనధాన్యవాన్, ప్రభూత = అధికములైన, ధనధాన్యవాన్ = ధనధాన్యములు గలదియునగు; కోసలోనామ = కోసలమని ప్రసిద్ధమైన; మహాన్ = గొప్పదియైన; జనపదః = దేశము; సరయూతీరే = సరయూనదిగట్టునందు; నివిష్టః = ఉన్నది.

అధికంబులగుధనధాన్యంబులచేస మృద్ధమై యెప్పుడును సంతసంబునం బొదలెడి జనులతో నొప్పుచున్న కోసలదేశంబనునొకగొప్పదేశము, సరయూనది తీరంబునంగలదు. అని తాత్పర్యము.

అయోధ్యా నామ నగరీ తత్రాసీ ల్లోకవిశ్రుతా
మనునా మానవేంద్రేణ యాపురీ నిర్మితా స్వయమ్. ౬
ఆయతా దశచ ద్వేచ యోజనాని మహాపురీ
శ్రీమతీ త్రీణి విస్తీర్ణా సువిభక్తమహాపథా. ౭

రాజమార్గేణ మహతా సువిభక్తేన శోభితా
ముక్తపుష్పావకీర్ణేన జలసిక్తేన నిత్యశః. ౮

టీక॥ యాపురీ = ఏపట్టణము; మానవేంద్రేణ = మనుష్యులకుఁబ్రభువైన; మనునా = వైవస్వతమనువుచేత; స్వయం = తానుగానే; నిర్మితా = నిర్మింపఁబడినదో; యా (అధ్యాహృతము) మహాపురీ = ఏమహాపట్టణము; దశచ = పదియును; ద్వేచ = రెండును; యోజనాని = యోజనముల; ఆయతా = దీర్ఘమై; శ్రీమతీ = కాంతిగలదియై; త్రీణి = మూఁడుయోజనముల; విస్తీర్ణా = వెడల్పుగలదై; సువిభక్తమహాపథా, సువిభక్త = చక్కఁగాఁగ్లిప్తములైన, మహాపథా = గొప్పమార్గములుగలదై; నిత్యశః = ఎల్లప్పుడును; ముక్తపుష్పావకీర్ణేన, ముక్త = విడువఁబడిన, పుష్ప = పువ్వులచే; అవకీర్ణేన = వ్యాప్తమైనదియును; జలసిక్తేన, జల = నీటిచే, సిక్తేన = తడుపఁబడినదియును; సువిభక్తేన = చక్కఁగాఁ గ్లిప్తమైనదియును; మహతా = గొప్పదియనగు; రాజమార్గేణ = రాజవీధిచేత; శోభితా = ప్రకాశింపఁజేయఁబడినదై; స్యాత్ = (అధ్యాహృతము) = ఉండునో; సా (అధ్యాహృతము) = అటువంటిదియును; లోకవిశ్రుతా, లోక = ప్రపంచమునందు, విశ్రుతా = ప్రసిద్ధమయినదియునగు; అయోధ్యానామ = అయోధ్యయనిప్రసిద్ధమైన; నగరీ = పట్టణము; తత్ర = ఆకోసలదేశమందు; ఆసీత (లకారవ్యత్యయము, ఆర్షము) = కలదు.

ఆకోసలదేశమందు, మొట్టమొదటమనుష్యులకందఱకును రాజుగానుండిన వైవస్వతమనువుచే సంకల్పమాత్రమున నిర్మింపఁబడి, పండ్రెండు యోజనంబుల నిడుపును మూఁడుయోజనంబుల తనర్పునుం గలిగి, వంకరలేనట్లు చక్కఁగా నేర్పఱుపంబడిన గొప్పమార్గంబులచే నొప్పుచు, ఎల్లప్పుడును రాజపురుషులుపరిమళార్థమై పుష్పంబుల వెదచల్లఁజల్లఁదనంబునకై యుదకంబునందడుపఁ గమ్మనితావిగలిగి చల్లగావిసరు మందమారుతంబులశోభి

ల్లుచున్న రాజవీధిం దేజరిల్లుచు, లోకత్రయంబుననువినుతికెక్కిన, యయోధ్యయనెడు నొక్కపట్టణంబు గలదు. అని తాత్పర్యము.

తాం తు రాజా దశరథో మహారాష్ట్ర వివర్ధనః
పురీ మావాసయామాస దివం దేవపతి ర్యథా. ౯

టీక ॥ మహారాష్ట్రవివర్ధనః, మహారాష్ట్ర=గొప్పరాజ్యమును,వివర్ధనః= వృద్ధిఁబొందించువాఁడైన; దశరథః=దశరథుఁడనెడి; రాజా=రాజు;దివం (సప్తమ్యర్థమునందుద్వితీయ)=స్వర్గమందు; దేవపతిర్యథా = దేవేంద్రుఁడుంబోలె;తాం=ఆ;పురీం (సప్తమ్యర్థమందుద్వితీయ)= అయోధ్యాపట్టణమందు;ఆవాసయామాస=వాసముచేసెను.

గొప్పరాజ్యమును ధర్మముతోఁబాలించివృద్ధిఁ బొందింపఁగలిగినట్టిదశరథుఁడనునొకరాజు, స్వర్గమునందుదేవేంద్రుఁడుంబోలె, నాయయోధ్యాపురియందు, వాసముచేసెను.

అనితాత్పర్యము.

కవాట తోరణవతీం సువిభక్తాంత రాపణామ్
సర్వయంత్రా యుధవతీ ముపేతాం సర్వశిల్పిభిః. ౧౦

టీక॥కవాటతోరణవతీం=ప్రశస్తములైన నగరమునకువెలుపలితలుపులును దారుబంధములునుం గలదియును;సువిభక్తాంతరాపణాం,సువిభక్త=చక్కగా నేర్పఱుపఁబడిన, అంతర=మధ్యప్రదేశములుగల, ఆపణాం = అంగడివీదులుగలదియును; సర్వయంత్రాయుధవతీం, సర్వ=సమస్తములైన,యంత్రాయుధవతీం = యంత్రములునుఆయుధములునుంగలదియును;సర్వశిల్పిభిః, సమస్తశిల్పులతోను; ఉపేతాం = కూడినదియును (అగు,అయోధ్యాపురియందుదశరథమహారాజువాసముచేసెనని ౨౨వ శ్లోకమునందన్వయము.ఇట్లే, ఇతర శ్లోకములయందునుజూచుకొనునది.)

తాత్పర్యముసులభము.

సూత మాగధ సంబాధాం శ్రీమతీ మతుల ప్రభామ్
ఉచ్చాట్టాల ధ్వజవతీం శతఘ్నీశతసంకులామ్. ౧౧

టీక ॥ సూతమాగధసంబాధాం, సూత=స్తుతిచేయువారిచేతను, మాగధ= కులవంశములఁబొగడువారిచేతను, సంబాధాం=నిండినదియు; శ్రీమతీం = సమృద్ధిగలదియు; అతులప్రభాం, అతుల=సరిలేని, ప్రభాం= కాంతిగలదియును; ఉచ్చాట్టాలధ్వజవతీం; ఉచ్చ=ఉన్నతములైన, అట్టాల = కోటబురుజులును, ధ్వజవతీం= టెక్కెములునుగలదియును; శతఘ్నీ శతసంకులాం, శతఘ్నీశత=అనంతములగుగొప్పయినుపగుదియలచే, సంకులాం = నిండినదియును (అగుఅని, ౧౨వశ్లోకంబునన్వయము).

తాత్పర్యము సులభము.

వధూనాటక సంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్
ఉద్యానామ్రవణోపేతాం మహతీం సాలమేఖలామ్. ౧౨

టీక ॥ పురీం (సప్తమ్యర్థమందుద్వితీయ)= పట్టణమందు; సర్వతః=అంతటను ; వధూనాటకసంఘైశ్చ, వధూ=స్త్రీలయొక్కయు, నాటక = నటులయొక్కయు, సంఘైశ్చ=సమూహములతోను; సంయుక్తాం=కూడుకొనినదియును; ఉద్యానామ్రవణోపేతాం, ఉద్యాన= ఉపవనములతోను, ఆమ్రవణ= మామిడితోఁటలతోను; ఉపేతాం= కూడుకొనినదియును; మహతీం=విశాలమైనదియును; సాలమేఖలాం, సాల = ప్రాకారమే, మేఖలాం= మొలనూలు గాఁగలదియును- (అగు, అని౨౨వశ్లోకంబునన్వయము).

తాత్పర్యముసులభము.

దుర్గగంభీరపరిఘాం దుర్గా మన్యై ర్దురాసదామ్
వాజివారణసంపూర్ణాం గోభి రుష్ట్రైః ఖరైస్తథా. ౧౩

టీక॥ దుర్గగంభీరపరిఘాం , దుర్గ= ప్రవేశింపఁగూడనిదియు, గంభీర= అగాధమైనదియునగు, పరిఘాం = అగడ్తగలదియును; దు

ల్లుచున్న రాజవీధిం దేజరిల్లుచు, లోకత్రయంబుననువినుతికెక్కిన, యయోధ్యయనెడు నొక్కపట్టణంబు గలదు. అని తాత్పర్యము.

తాం తు రాజా దశరథో మహారాష్ట్ర వివర్ధనః
పురీ మావాసయామాస దివం దేవపతి ర్యథా. ౯

టీక ॥ మహారాష్ట్రవివర్ధనః, మహారాష్ట్ర=గొప్పరాజ్యమును, వివర్ధనః= వృద్ధిఁబొందించువాఁడైన; దశరథః=దశరథుఁడనెడి; రాజా=రాజు; దివం (సప్తమ్యర్థమునందుద్వితీయ)=స్వర్గమందు; దేవపతిర్యథా = దేవేంద్రుఁడుంబోలె; తాం=ఆ; పురీం (సప్తమ్యర్థమందుద్వితీయ)= అయోధ్యాపట్టణమందు; ఆవాసయామాస=వాసముచేసెను.

గొప్పరాజ్యమును ధర్మముతోఁబాలించివృద్ధిఁ బొందింపఁగలిగినట్టిదశరథుఁడనునొకరాజు, స్వర్గమునందు దేవేంద్రుఁడుంబోలె, నాయయోధ్యాపురియందు, వాసముచేసెను.

అని తాత్పర్యము.

కవాట తోరణవతీం సువిభక్తాంత రాపణామ్
సర్వయంత్రా యుధవతీ ముపేతాం సర్వశిల్పిభిః. ౧౦

టీక॥కవాటతోరణవతీం=ప్రశస్తములైన నగరమునకువెలుపలితలుపులును దారుబంధములునుం గలదియును;సువిభక్తాంతరాపణాం,సువిభక్త=చక్కగా నేర్పఱుపఁబడిన, అంతర=మధ్యప్రదేశములుగల, ఆపణాం= అంగడివీదులుగలదియును; సర్వయంత్రాయుధవతీం, సర్వ=సమస్తములైన,యంత్రాయుధవతీం = యంత్రములునుఆయుధములునుంగలదియును;సర్వశిల్పిభిః, సమస్తశిల్పులతోను; ఉపేతాం = కూడినదియును (అగు,అయోధ్యాపురియందుదశరథమహారాజువాసముచేసెనని ౯వ శ్లోకమునందన్వయము.ఇట్లే, ఇతర శ్లోకములయందునుజూచుకొనునది.)

తాత్పర్యముసులభము.

చిత్రా మష్టాపదాకారాం వరనారీగణై ర్యుతామ్
సర్వరత్నసమాకీర్ణాం విమానగృహశోభితామ్. ౧౬

టీ॥ చిత్రాం=నానావిధమైనదియును; అష్టాపదాకారాం, అష్టాపద = జూదమాడెడిపీటయొక్క, ఆకారాం=ఆకారమువంటి యాకారముగలదియును; వరనారీగణైః,వరనారీ=సుందరస్త్రీలయొక్క,గణైః = సమూహములతోఁ; యుతాం=కూడుకొనినదియును; సర్వరత్నసమాకీర్ణాం, సర్వ=సమస్తములైన, రత్న=మణులచేత,సమాకీర్ణాం=వ్యాపింపఁబడినదియును; విమాన గృహ శోభితాం, విమానగృహ=సార్వభౌమ గృహముల చేతను ("విమానోస్త్రీదేవయానే సార్వభౌమికసద్మని"అనిభాస్కరనిఘంటువు), శోభితాం= ప్రకాశింపఁజేయఁబడినదియును(అగు,అని,౨౨వ శ్లోకమునన్వయము).

తాత్పర్యము,సులభము.

గృహగాఢా మవిచ్ఛిద్రాం సమభూమౌ నివేశితామ్
శాలితండులసంపూర్ణా మిక్షుకాండ రసోదకామ్. ౧౭

టీక॥ గృహగాఢాం, గృహ=ఇండ్లచేతను, గాఢాం=దట్టమైనదియును; అవిచ్ఛిద్రాం=దోషములేనిదియును; సమభూమౌ=మిట్టపల్లములులేని ప్రదేశమందు; నివేశితాం = నిర్మింపఁబడినదియును, శాలితండుల సంపూర్ణాం, శాలితండుల = తెల్లవరిబియ్యముచే, సంపూర్ణాం = నిండినదియును; ఇక్షు కాండ రసోదకాం, ఇక్షు కాండ= చెఱకుకాఁడయొక్క, రస=రసమువంటి, ఉదకాం=నీళ్లు గలదియును.(అగు,అని, ౨౨వశ్లోకంబుననన్వయము).

తాత్పర్యము,సులభము.

దుందుభీభి ర్మృదంగై శ్చ వీణాభిః పణవై స్తథా
నాదితాం భృశమత్యర్థం పృథివ్యాం తా మనుత్తమామ్.౧౮

టీక ॥ దుందుభీభిః=భేరులచేతను; మృదంగైశ్చ= మద్దెళలచేతను; వీణాభిః=వీణెలచేతను; తథా=అట్లు; పణవైః=తమ్మటములచేతను; భృశం=మిక్కిలి; నాదితాం= ధ్వనింపఁజేయఁబడి నదియును; అత్యర్థం=మిక్కిలి; పృథివ్యాం=భూమియందు; అనుత్తమాం=తనకన్న మఱివేఱుశ్రేష్ఠమైనపట్టణము లేనిదియును; తాం=ప్రసిద్ధమైనదియును. (అగు,అని ౨౨వశ్లోకమునసన్వయము).

తాత్పర్యముసులభము.

విమాన మివ సిద్ధానాం తపసా ధిగతం దివి
సునివేశిత వేశ్మాంతాం నరోత్తమ సమావృతామ్. ౧౯

టీక॥ దివి = స్వర్గమునందు; తపసా = తపస్సుచేతను ; అధిగతం=పొందఁబడిన; సిద్ధానాం=తపస్సిద్ధులయొక్క; విమానమివ=విమానమువలె; స్థితాం (అధ్యాహృతము)=ఉన్నదియును; సునివేశిత వేశ్మాంతాం, సునివేశిత = చక్కగా నేర్పుఱుపఁబడిన, వేశ్మాంతాం=గృహప్రదేశములుగలదియును ; నరోత్తమసమావృతాం, నరోత్తమ=మనుష్యశ్రేష్ఠులచే, సమావృతాం= నిండియున్నదియును; (అగు,అని, ౨౨వశ్లోకమునసన్వయము).

తాత్పర్యము సులభము.

యేచబాణై ర్నవిధ్యంతి వివిక్త మపరాపరమ్
శబ్దవేధ్యంచ వితతం లఘుహస్తా విశారదాః. ౨౦
సింహవ్యాఘ్ర వరాహాణాం మత్తానాం నదతాంవనే
హంతారోని శితైశ్శస్త్రై ర్బలాద్బాహు బలైరపి. ౨౧
తాదృశానాం సహస్రై స్తా మభిపూర్ణాం మహారథైః
పురీ మావాసయామాస రాజా దశరథ స్తదా. ౨౨

టీక॥ లఘుహస్తాః, లఘు=లాఘవముగల,హస్తాః= చేతులుగలవారును;విశారదాః=నేర్పరులునైన; యే=ఎవరు; వివిక్తం=ఒంటరి

మైనవానిని; అపరాపరం=ముందు వెనుక లేనివాని ( తండ్రిమైననుగుమారుఁడైనను లేనివానిని అనుట) శబ్దవేధ్యం, శబ్ద=ధ్వనిచే, వేధ్యం=కొట్టఁదగినవానిని; వితతంచ= పరుగెత్తువానిని; బాణైః=బాణముల చేతను; నవిధ్యంతి = కొట్టరో; మత్తానాం=క్రొవ్వినవియును; వనే=అరణ్యమందు; నర్దతాం= గర్జించునవియునగు; సింహవ్యాఘ్రవరాహాణాం=సింహముల యొక్కయుఁబులుల యొక్కయుఁ బందుల యొక్కయు( సింహములను బులులను బందులను); బలాత్ =బలాత్కారముగా; నిశితైః=కఱకుగలః; శస్త్రైః=ఆయుధముల చేతను; బాహుబలైరపి= భుజబలముల చేతను; హంతారః=చంపువారలో; మహారథైః=తన్నుసారథిని గుఱ్ఱములనుం బ్రోచికొనుచు యుద్ధము సేయునట్టి; తాదృశానాం=అట్టివారి యొక్క ; సహస్రైః=వేలసంఖ్యల చేతను, అభిపూర్ణాం=నిండినట్టి; తాం= ఆ; పురీం(సప్తమ్యర్థమందు ద్వితీయ)= అయోధ్యాపట్టణమందు ; దశరథః= దశరథుఁడనెడి; రాజా=రాజు; తదా= అప్పుడు; ఆవాసయామాస=వాసము చేసెను.

తాము నేర్పరితనముతో నతివేగముగ బాణప్రయోగము సేయఁగలిగియున్నను , ధార్మికులైనందున, నొంటరిమైనవానిఁగాని, తండ్రులునుగొడుకులును దోడంబుట్టువులును లేనివానిఁగాని, కండ్లకగుపడక, మఱుఁగుననుండి ధ్వని మాత్రముగుఱిగాఁగొట్టఁదగినవానిఁగాని, పరుగెత్తువానిఁగాని, యుద్ధమునందు బాణముచే నైనఁ బ్రహరింపనోడు వారును, వనమునందు మదించి యథేచ్ఛముగ గర్జించుచున్న సింగములు పులులు మొదలగు క్రూర మృగంబులఁ బట్టి బలాత్కారముగ నాయుధములతోఁగాని తమ భుజబలంబులతోఁగాని చంపఁ గలవారునగు, గొప్ప శూరుల చే నిండియున్న యీ యయోధ్యాపట్టణమందు, దశరథమహారాజు, వాసము సేయుచుండెను.

అని, తాత్పర్యము.

తా మగ్నిమద్భి ర్గుణవద్భి రావృతామ్

ద్విజోత్తమై ర్వేదషడంగ పారగైః
సహస్రదై స్సత్యరతై ర్మహాత్మభి
ర్మహర్షి కల్పై ఋషిభిశ్చ కేవలైః. ౨౩

టీక॥ అగ్నిమద్భిః= ఆహితాగ్నులును; గుణవద్భిః = మంచిగుణములుగలవారును; వేదషడంగపారగైః, వేద=ఋగ్యజుస్సామాథర్వణంబులను వేదములయొక్కయు, షడంగ=శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్త జ్యౌతిష కల్పంబులను నాఱువేదాంగములయొక్కయు, పారగైః= అంతమునుబొందినవారును; సహస్రదైః= అనంతముగ దానముసేయువారును; సత్యరతైః, సత్య= సత్యమునందు, రతైః = ఆసక్తులును; మహాత్మభిః=గొప్పబుద్ధిగల వారును; కేవలైఃఋషిభిశ్చ= కేవలఋషులైనను; మహర్షికల్పైః=మహర్షులవంటివారునగు; ద్విజోత్తమైః= బ్రాహ్మణక్షత్రియ వైశ్యులలో శ్రేష్ఠులచేత; ఆవృతాం = నిండిన; తాం(సప్తమ్యర్థమందుద్వితీయ)= ఆయయోధ్యాపట్టణమందు; (దశరథః = దశరథమహారాజు; ఆవాసయామాస=వాసముచేసెను.).

తాత్పర్యము సులభము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, పంచమస్సర్గః.
ఇది స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండ పంచమసర్గ టీక,
ముగిసినది.

౭౨

షష్ఠసర్గప్రారంభః.

తస్యాం పుర్యా మయోధ్యాయాం వేదవి త్సర్వసంగ్రహ
దీర్ఘదర్శీ మహాతేజాః పౌరజానపదప్రియః. ౧
ఇక్ష్వాకూణా మతిరథో యజ్వా ధర్మరతో వశీ
మహర్షికల్పో రాజర్షి స్త్రిషు లోకేషు విశ్రుతః. ౨
బలవా న్నిహతామిత్రో మిత్రవా న్విజితేంద్రియః
ధనైశ్చ సంగ్రహై శ్చాన్యై శ్శక్ర వైశ్రవణోపమః. ౩
యథా మను ర్మహాతేజా లోకస్య పరిరక్షితా
తథా దశరథో రాజా వస న్జగ దపాలయత్. ౪

టీక॥ వేదవిత్ = వేదములనెఱింగినవాఁడును; సర్వసంగ్రహః, సర్వ=శూరులు పండితులు మొదలగుసమస్తజనులయొక్క (సమస్తజనులను), సంగ్రహః= దానాదులచే,వశీకరించువాఁడును; దీర్ఘదర్శీ, దీర్ఘ=పెద్దకాలమునకుఁబిమ్మట రాఁబోవునర్థమును,దర్శీ= చూచువాఁడును;మహాతేజాః=గొప్పపరాక్రమముగలవాఁడును; పౌరజానపదప్రియః, పౌర= పట్టణమందువసించెడుజనులును, జానపద=గ్రామమునందు వసించెడుజనులును,ప్రియః=ఇష్టులు గాఁగలవాఁడును; ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశపురాజులలోపల; అతిరథః= పెక్కుమహారథులతో నొంటరిగా యుద్ధము సేయఁజాలినరథికశ్రేష్ఠుఁడును; యజ్వా = యజ్ఞములుసేసిన వాఁడును; ధర్మరతః = ధర్మమునందాసక్తుఁడును;వశీ=సమస్తజనులుతనస్వాధీనతకులోఁబడినవారుగాఁగలవాఁడును; మహర్షికల్పః = మహర్షితోసరియైనవాఁడును; రాజర్షిః= రాజునుఋషియునైనవాఁడును; త్రిషు=మూఁడైన; లోకేషు=భూర్భువస్సువర్లోకములయందును; విశ్రుతః=

వినుతికెక్కినవాఁడును; బలవాన్ = పెక్కు సైన్యములు గలవాఁడును; నిహతామిత్రః, నిహత=చంపఁబడిన, అమిత్రః=శత్రువులుగలవాఁడును; మిత్రవాన్ = గొప్ప చెలికాండ్రుగలవాఁడును; విజితేంద్రియః, విజిత=చక్కగా జయింపఁబడిన, ఇంద్రియః = ఇంద్రియములు గల వాఁడును; ధనైశ్చ=ధనముల చేతను;అన్యైః = ఇతరములైన; సంగ్రహైశ్చ= కూడఁబెట్టఁబడిన వానిచేతను; శక్రవైశ్రవణోపమః= ఇంద్రునితోను కుబేరునితోను సరియైనవాఁడునగు; దశరథః=దశరథుఁడనెడు; రాజా=రాజు; యథా=ఎట్లు; మహాతేజాః=గొప్ప పరాక్రమముగల; మనుః=వైవస్వతమనువు; లోకస్య = ప్రపంచము యొక్క(ప్రపంచమును); పరిరక్షితా=రక్షించువాఁడుగా; ఆసీత్ (అధ్యాహృతము)=అయ్యెనో; తథా=అట్లు;తస్యాం=ఆ; అయోధ్యాయాం = అయోధ్యయనెడు; పుర్యాం=పట్టణమందు; వసన్ = వాసముచేయుచు; జగత్ = భూమండలమును; అపాలయత్ =పాలించెను.

దశరథమహారాజు, ఆయయోధ్యాపురంబుననివసించుచు, వేదవేదార్థంబులనెఱింగి, పండితులు శూరులు మొదలగువారి నెల్లయథోచితంబుగ నాదరింపుచుఁ, బెద్దకాలంబునకుఁ బిమ్మటరాఁబోవునర్థము నెఱింగియెచ్చరికతోఁ బ్రవర్తిల్లుచుఁ,బట్టణవాసులయందును గ్రామవాసులయందు నేకరీతిగఁ బ్రీతి నెఱపుచు, నెల్లజనంబులస్వాధీనులుగాఁజేసికొని,యాహితాగ్నియై ధర్మరతుండై, రాజర్షియైమహర్షియుం బోలెఁ బ్రకాశింపుచు, మూఁడు లోకంబులయందునుందన పేరుప్రసిద్ధి వహింపమహాపరాక్రముండైచలంబున శత్రువుల నడఁచి,యింద్రకుబేరులుంబోలె వివిధధనంబులఁగూడఁబెట్టుచు నిక్ష్వాకువంశపురాజులలోపలనతిరథుండై, జితేంద్రియుండై, మహాతేజుండగు వైవస్వతమనువుంబోలె భూమండలముంబాలింపుచుండెను. అని తాత్పర్యము.

తేన సత్యాభిసంధేన త్రివర్గ మనుతిష్ఠతా
పాలితాసా పురీ శ్రేష్ఠా ఇంద్రేణే వామరావతీ. ౫

టీక॥ సత్యాభిసంధేన, సత్య=సత్యమునందు, అభిసంధేన = అభిప్రాయముగలవాఁడును; త్రివర్గం=ధర్మార్థకామంబులను ; అనుతిష్ఠతా=అనుసరించువాఁడునగు; తేన=ఆదశరథమహారాజుచేత ; శ్రేష్ఠా=ఉత్తమమైన; సా=ఆ; పురీ=అయోధ్యాపట్టణము; ఇంద్రేణ=దేవేంద్రునిచేత; అమరావతీవ=అమరావతివలె; పాలితా=పాలింపఁబడినది.

ఆదశరథమహారాజు, సత్యమునందుశ్రద్ధగలిగి, ధర్మార్థకామంబులననుసరింపుచు, నింద్రుండమరావతీపురినిబాలించునట్లు , ఆయయోధ్యాపట్టణమునుబాలించెను. అనితాత్పర్యము.

తస్మిన్ పురవరే హృష్టా ధర్మాత్మానో బహుశ్రుతాః
నరా స్తుష్టా ధనై స్స్వైస్స్వై రలుబ్ధా స్సత్యవాదినః. ౬

టీక॥ తస్మిన్=ఆ; పురవరే=పట్టణశ్రేష్ఠమైన యయోధ్యాపురమునందు; నరాః = మనుష్యులు; హృష్టాః = ప్రీతిఁబొందినవారుగాను; ధర్మాత్మానః= ధర్మస్వభావులుగాను; బహుశ్రుతాః, బహు=అధికమైన, శ్రుతాః=శాస్త్రాభ్యాసముగలవారుగాను; స్వైస్స్వైః = తమతమవియగు; ధనైః = ధనములతో; తుష్టాః=సంతసించువారుగాను; అలుబ్ధాః= ఆశలేనివారుగాను; సత్యవాదినః= సత్యముగమాటలాడువారుగాను; ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి.

ఆయయోధ్యాపట్టణమందు, మనుష్యులందఱును, మనస్సంతోషముగలిగిధర్మస్వభావులై, యధికముగశాస్త్రాభ్యాసముచేసి, మేరమీఱినయాశలేకతమవర్ణాశ్రమధర్మములకుఁదగినట్లుతమకుదొరకొను ధనంబులందృప్తిఁ బొందుచు, సత్యవాదులై, యుండిరి. అనితాత్పర్యము.

నాల్పసన్నిచయః కశ్చిదాసీ త్తస్మిన్ పురోత్తమే
కుటుంబీ యో హ్యసిద్ధార్థోఽ గవాశ్వధనధాన్యవాన్. ౭

టీక॥ తస్మిన్ = ఆ; పురోత్తమే = పట్టణశ్రేష్ఠమైనయయోధ్యయందు; యః= ఎవ్వఁడు; అల్పసన్నిచయః, అల్ప=కొంచెమైన, సన్నిచయః= కోశముగలవాఁడును; అసిద్ధార్థః, అసిద్ధ = ప్రాప్తించని, అర్థః=ధర్మార్థకామములుగలవాఁడును; అగవాశ్వధనధాన్యవాన్ = గోవులును గుఱ్ఱములును ధనధాన్యములును లేనివాఁడునైన; కుటుంబీ= తలిదండ్రులు బిడ్డలు కొడుకులుబిడ్డలుకోడండ్రును గొమార్తెయును భార్యయు నతిథియును దానును గాఁ బోష్యులు పదిమందిగలవాఁడు; కశ్చిత్ =ఒకానొకండును; నాసీద్ధి=లేఁడుగదా.

కొంచెముగాఁగోశముగలిగి, ధర్మార్థకామములఁబొందనేరక, గోవులును గుఱ్ఱములును ధనధాన్యములు నేమియులేక, గొప్పకుటుంబము గలిగియుండు వాఁడెవ్వఁడును లేఁడు-అని తాత్పర్యము.

కామీ వా న కదర్యోవా నృశంసః పురుషః క్వచిత్
ద్రష్టుం శక్య మయోధ్యాయాన్నా విద్వా న్నచ నాస్తికః. ౮

టీక॥ కామీవా=కాముకుఁడుగాని; కదర్యోవా=లోభంబునఁదన్నుధర్మకార్యమును గొడుకులను భార్యనుదలిదండ్రులను దోఁబుట్టువులనుంబీడించువాఁడుగాని; నృశంసః (వా) = క్రూరుండుగాని; అయిన; పురుషః=పురుషుఁడు; అయోధ్యాయాం= అయోధ్యాపట్టణమందు; క్వచిత్ =ఒకానొకచోటనైనను; ద్రష్టుం=చూచుటకు; న శక్యం=అలవికాఁడు; అవిద్వాన్= పండితుఁడు కాని వాఁడును; (ద్రష్టుం=చూచుటకు;) న(శక్యం)=అలవికాఁడు; నాస్తికశ్చ=పరలోకము లేదని చెప్పు వాఁడును; (ద్రష్టుం=చూచుటకు); న(శక్యం)=అలవికాఁడు.

ఆయయోధ్యా పట్టణమందు,

ఒకానొకచోటనైనను, గాముకుఁడుగాని, యతిలోభంబునఁదన్నుధర్మమును గొడుకులను భార్యను దలిదండ్రులనుదోఁబుట్టువులనుం బీడించువాఁడుగాని, పండితుఁడుకానివాఁడుగాని, నాస్తికుఁడుగాని, యొకఁడైనను,దొరకొనఁడు. అని తాత్పర్యము.

సర్వే నరాశ్చ నార్యశ్చ ధర్మశీలా స్సుసంయతాః
ఉదితా శ్శీలవృత్తాభ్యాం మహర్షయ ఇవామలాః. ౯

టీక ॥ సర్వే= సమస్తులయిన; నరాశ్చ = మనుష్యులును; నార్యశ్చ=స్త్రీలును;ధర్మశీలాః=ధర్మస్వభావముగలవారలుగాను; సుసంయతాః=చక్కగా నింద్రియనిగ్రహముగలవారలుగాను; శీలవృత్తాభ్యాం, శీల=మంచిస్వభావముతోను, వృత్తాభ్యాం=మంచియాచారముతోను;ఉదితాః=పుట్టినవారలుగాను; మహర్షయఇవ=మహర్షులుంబోలె; అమలాః=పరిశుద్ధులగు వారలు గాను; ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి.

అయోధ్యాపట్టణమునందుఁ, బురుషులుస్త్రీలునందఱును, ధర్మ గుణము నింద్రియ నిగ్రహమునుగలవారలై, పుట్టిననాఁటనుండి మంచిస్వభావమును మంచియాచారమునుగలిగి,మహర్షులుంబోలెఁబరిశుద్ధులుగా,నుండిరి.అనితా.

నాకుండలీ నామకుటీ నాస్రగ్వీ నాల్పభోగవాన్
నామృష్టో నానులిప్తాంగో నాసుగంధశ్చ విద్యతే. ౧౦

టీక ॥ అకుండలీ=కర్ణభూషణములులేనివాఁడు; నవిద్యతే=లేఁడు. అమకుటీ=శిరోభూషణములేనివాఁడు;న(విద్యతే)=లేఁడు;అస్రగ్వీ=పుష్పములేనివాఁడు; న (విద్యతే)= లేఁడు. అల్పభోగవాన్ = కొంచెమైనసుఖముగలవాఁడు; న (విద్యతే)= లేఁడు. అమృష్టః=అభ్యంగములేనివాఁడు;న(విద్యతే)= లేఁడు. నానులిప్తాంగః=మైపూఁతలేనిదేహముగలవాఁడు; (నవిద్యతే)=లేఁడు. అసుగంధశ్చ=మంచివాసనలేనివాఁడును;న(విద్యతే)= లేఁడు. తాత్పర్యము,సులభము.

నామృష్టభోజీ నాదాతా నాప్యనంగద నిష్కధృక్
నాహస్తాభరణోవాపి దృశ్యతే నాప్యనాత్మవాన్. ౧౧

టీక॥అమృష్టభోజీ=కడుపునిండభుజింపనివాఁడు;నదృశ్యతే=కానఁబడఁడు. అదాతా = ఈవిలేనివాఁడు;న(దృశ్యతే)= కానఁబడఁడు; అనంగదనిష్కధృగపి = బాహుపురులను ఱొమ్మునధరింపఁదగినపతకమునుధరింపనివాఁడు;న(దృశ్యతే)=కానఁబడఁడు. అహస్తాభరణోవాపి = కడియములులేనివాఁడును;న(దృశ్యతే)=కానఁబడఁడు. అనాత్మవానపి= జితేంద్రియుఁడు కానివాఁడును; న(దృశ్యతే)=కానఁబడఁడు.

తాత్పర్యము,సులభము.

నానాహితాగ్ని ర్నాయజ్వా నక్షుద్రోవా నతస్కరః
కశ్చిదాసీదయోధ్యాయా న్నచ నిర్వృత్త సంకరః. ౧౨

టీక ॥ అయోధ్యాయాం= అయోధ్యాపట్టణమందు; కశ్చిత్= ఒకానొకండును; అనాహితాగ్నిః = ఆధానముసేయనివాఁడు; నాసీత్ =లేఁడు. అయజ్వా=యాగముసేయనివాఁడు; న(ఆసీత్)= లేఁడు. క్షుద్రోవా=నీచుఁడైనవాఁడుగాని;న(ఆసీత్)=లేఁడు. తస్కరః=దొంగయైనవాఁడు; న (ఆసీత్)=లేఁడు. నిర్వృత్తసంకరశ్చ,నిర్వృత్త=చేయఁబడిన,సంకరశ్చ= వర్ణసంకరము గలవాఁడును; న (ఆసీత్)=లేఁడు.

తాత్పర్యము,సులభము.

స్వకర్మ నిరతా నిత్యం బ్రాహ్మణా విజితేంద్రియాః
దానాధ్యయన శీలాశ్చ సంయతాశ్చ పరిగ్రహే. ౧౩

టీక॥ బ్రాహ్మణాః=బ్రాహ్మణులు;నిత్యం=ఎల్లప్పుడును; స్వకర్మనిరతాః, స్వకర్మ = తమకర్మములయందు, నిరతాః=ఆసక్తులును;విజితేంద్రియాః,విజిత=చక్కగా జయింపఁ బడిన, ఇంద్రియాః= ఇంద్రియములుగలవారలును;దానాధ్యయనశీలాశ్చ, దాన=

ఈవియును,అధ్యయన = వేదపారాయణమును, శీలాశ్చ=స్వభావముగాఁగలవారును; పరిగ్రహే=పుచ్చుకొనుటయందు; సంయతాశ్చ=సంకోచముగలవారునై (అని గోవిందరాజాభిప్రాయము); పరిగ్రహే=భార్యయందు;సంయతాశ్చ=నియమముగలవారునై; (అని మహేశ్వర తీర్థాభిప్రాయము) సంతి(అధ్యాహృతము) = ఉన్నారు.

ఆయయోధ్యా పట్టణమందు, బ్రాహ్మణులందఱు, నెల్లప్పుడును, దమకర్మములననుష్ఠింపుచు, జితేంద్రియులై,యతిథులకభీష్టంబులనొసంగుచు, వేదంబులఁ బఠింపుచుఁ,గొంచెముగఁ బరిగ్రహముసేయుచు (అని,గోవిందరాజాభిప్రాయము) స్వభార్యామాత్రగాములై పరదారపరాఙ్ముఖులై, యున్నారు. (అనిమహేశ్వరతీర్థాభిప్రాయము) అనితాత్పర్యము.

ననాస్తికో నానృతకో నకశ్చిదబహుశ్రుతః
నాసూయకోనచాశక్తో నావిద్వాన్ విద్యతే తదా. ౧౪

టీక॥తదా = ఆదశరథుఁడు పరిపాలించునప్పుడు;కశ్చిత్ = ఒకానొకండును;నాస్తికః = పరలోకము లేదనువాఁడు;నవిద్యతే = లేఁడు. అనృతకః=అసత్యమాడువాఁడు;న(విద్యతే)= లేఁడు. అబహుశ్రుతః=మిగుల శాస్త్రాభ్యాసములేనివాఁడు;న(విద్యతే)=లేఁడు. అసూయకః=గుణములయందు దోషము నారోపించు వాఁడు;న(విద్యతే)=లేఁడు.అశక్తశ్చ=సమర్థుఁడు కానివాఁడును; న(విద్యతే)=లేఁడు. అవిద్వాన్= జ్ఞానము లేనివాఁడును;న(విద్యతే)=లేఁడు. "ఆదశరథుఁడు పరిపాలించునప్పుడు" అనియున్నందున, నీశ్లోకము దశరథునిచేఁ బాలింపఁబడుచుండిన జనపదాదులను గుఱించినదిగాఁ గనుపడుటం బట్టి,యందలి విషయములకుఁ బౌనరుక్త్య దోషంబులేదు.

తాత్పర్యము,సులభము.

నాషడంగవి దత్రాసీ న్నావ్రతో నాసహస్రిదః
నదీనః క్షిప్తచిత్తోవా. వ్యధితోవాపి కశ్చన. ౧౫

టీక॥అత్ర=ఈయయోధ్యయం దుః కశ్చన= ఒకానొకండును;అష డంగవిత్ = శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్తి జ్యోతిషకల్పంబులను నాఱు వేదాంగముల నెఱుంగని వాఁడు; నాసీత్=లేఁడు. అవ్రతః = చాం ద్రాయణము మొదలుగాఁగల వ్రతములు లేనివాఁడు;న(ఆసీత్)= లేఁడు. అసహస్రదః=సహస్ర జనులకు దానము సేయనివాఁడు;న(ఆసీత్)=లేఁడు. దీనః=దైన్యము గలవాఁడు;న(ఆసీత్)=లేఁడు క్షిప్తచిత్తోవా,క్షిప్త=కలఁతపడిన,చిత్తో వా= మనస్సుగలవాఁడును;న(ఆసీత్)=లేఁడు. వ్యధితోవాపి=వ్యాధి గలవాఁడును;న(ఆసీత్)= లేఁడు.

తాత్పర్యము,సులభము.

కశ్చి న్నరోవా నారీవా నాశ్రీమాౘ నాప్యరూపవాౘ
ద్రష్టుం శక్యమయోధ్యాయాం నాపిరాజన్య భక్తిమాౘ. ౧౬

టీక॥అయోధ్యాయాం = అయోధ్యా పట్టణమందు;నరోవా= పురుషుఁడు గాని;నారీవా=స్త్రీగా ని;కశ్చిత్= ఒకానొకజనమును;అ శ్రీమాౘ = కాంతిలేనిది;ద్రష్టుం= చూచుటకు;నశక్యం=సాధ్యము కా దు. అరూపవానపి = మంచిరూప ము లేనిదియును; (ద్రష్టుంశక్యం) న=చూచుటకుసాధ్యముకాదు. రాజని=రాజైన దశరథునియందు;అ భక్తిమానపి = భక్తిలేనిదియును. (ద్రష్టుంశక్యం)న= చూచుటకుసా ధ్యముకాదు.

అయోధ్యాపట్టణమందు సమస్త పురుషులును సమస్త స్త్రీలు ను గాంతియును రూపమునుం గలిగి రాజభక్తి యుక్తులై యుండిరి. అనితాత్పర్యము.

వర్ణే ష్వగ్ర్యచతుర్థేషు దేవతా తిథి పూజకాః
కృతజ్ఞాశ్చ వదాన్యాశ్చ శూరా విక్రమ సంయుతాః. ౧౭

దీర్ఘాయుషో నరాస్సర్వే ధర్మం సత్యంచ సంశ్రితాః
సహితాః పుత్రపౌత్రైశ్చ నిత్యం స్త్రీభిః పురోత్తమే. ౧౭

టీక॥పురోత్తమే=పట్టణశ్రేష్ఠమైనయయోధ్యయందు; అగ్ర్యైచతుర్వర్ణేషు, అగ్ర్యై=ముందుపుట్టినబ్రాహ్మణులే,చతుర్థేషు నాలవవారలుగాఁగల; వర్ణేషు=క్షత్రియవైశ్య శూద్రులనెడు వర్ణములయందు;(ఉన్న) సర్వే=సమస్తులైన;నరాశ్చ=మనుష్యులును;దేవతాతిథిపూజకాః = దేవతాతిథులను బూజించు వారుగాను; కృతజ్ఞాశ్చ=ఉపకారమెఱింగియుండువారుగాను; వదాన్యాశ్చ=మిక్కిలి దానముసేయు వారుగాను; శూరాః= యుద్ధమునందు భయపడనివారుగాను; విక్రమసంయుతాః=పరాక్రమముతోఁ గూడినవారుగాను; దీర్ఘాయుషః=దీర్ఘమైనజీవితకాలము గల వారుగాను; ధర్మం=ధర్మమును; సత్యంచ=సత్యమును; సంశ్రితాః= పొందినవారుగాను; నిత్యం=ఎల్లప్పుడును; స్త్రీభిః=భార్యలతోను; పుత్రపౌత్రైశ్చ=కొడుకులుమనుమలతోను; సహితాః=కూడియుండువారుగాను;ఆసన్(అధ్యాహృతము)=ఉండిరి.

అయోధ్యాపట్టణమందు, క్షత్రియవైశ్యశూద్రులందఱును, దేవతలనతిథులఁబూజింపుచు, నుపకారజ్ఞులై,యత్యంతముగా దానముసేయుచు,మిక్కిలిపరాక్రమముగలిగి యుద్ధములందువెనుదీయనివారైన ను,ఎల్లయుద్ధములందును జయముగొనుచుండుటంబట్టి, దీర్ఘకాలముజీవింపుచు, ధర్మము సత్యంబునవలంబించి, కొడుకులునుమనుములునుంగలిగి, తమకుసన్యాసాశ్రమమునిషిద్ధమైనందుననెల్లప్పుడునుగృహస్థాశ్రమమందే వర్తింపుచునుండిరి. అని తాత్పర్యము.

క్షత్రం బ్రహ్మముఖం చాసీ ద్వైశ్యాః క్షత్ర మనువ్రతాః
శూద్రాః స్వధర్మనిరతా స్త్రీన్వర్ణా నుపచారిణః. ౧౯

టీక॥ క్షత్రం=క్షత్రియజాతి; బ్రహ్మముఖం=బ్రాహ్మణులే ప్రధానముగాఁగలదిగా; ఆసీత్=అయినది. వైశ్యాశ్చ=వైశ్యులును; క్షత్రం=క్షత్రజాతిని; అనువ్రతాః=అనుసరించియుండువారుగా; ఆసన్ (అధ్యాహృతము) = అయిరి. శూద్రాః=శూద్రులు; త్రీన్=మూఁడైన; వర్ణాన్=బ్రాహ్మణక్షత్రియవైశ్యజాతులను; ఉపచారిణః=సేవింపుచున్నవారై; స్వధర్మ నిరతాః, స్వ=తమదైన, ధర్మ=బ్రాహ్మణక్షత్రియవైశ్యసేవనమనెడు ధర్మమందు; నిరతాః=ఆసక్తులుగా; ఆసన్(అధ్యాహృతము)=ఉండిరి.

క్షత్రియులు బ్రాహ్మణుల ననుసరించియుండిరి, వైశ్యులా క్షత్రియులనను వర్తించుచుండిరి, శూద్రులు, బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్యులనుంగొలుచుచు, నాము వ్వరిని సేవించుటయనెడు తమధర్మమందు వ్యవస్థితులుగా, నుండిరి. అనితాత్పర్యము.

సా తే నేక్ష్వాకు నాథేన పురీ సుపరి రక్షితా
యథా పురస్తా న్మనునా మానవేంద్రేణ ధీమతా. ౨౦

టీక ॥ సా=ఆ; పురీ= అయోధ్యాపట్టణము; యథా= ఎట్లు; పురస్తాత్ =మునుపు; ధీమతా= బుద్ధిగలవాఁడును; మానవేంద్రేణ= మనుష్యులకుఁ బ్రభువునగు; మనునా=వైవస్వతమనువుచేత; సుపరి రక్షితా (అధ్యాహృతము) = చక్కఁగారక్షింపఁబడెనో; తథా (అధ్యాహృతము)=అట్లు; ఇక్ష్వాకునాథేన=ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినవారికిఁ బ్రభువైన; తేన = ఆదశరథునిచేత; సుపరిరక్షితా=చక్కఁగారక్షింపఁబడినది.

బుద్ధిమంతుఁడును మనుష్యులకుఁ బ్రభువు నగు వైవస్వత మనువు, పూర్వము, అయోధ్యానగరము, నెట్లురక్షించెనో, ఆప్రకారముననే, యిక్ష్వాకు వంశమురాజులలో మేటి యగునా దశరథుం, డయోధ్యానగరమును రక్షించుచుండెను. అనితాత్పర్యము.

యోధానా మగ్నికల్పానాం పేశలానా మమర్షిణామ్
సంపూర్ణా కృతవిద్యానాం గుహా కేసరిణామివ. ౨౧

టీక॥ సా(అధ్యాహృతము)= ఆయయోధ్యాపట్టణము; అగ్నికల్పానాం = నిప్పుతోసరివచ్చునట్టి వారును; పేశలానాం = కుటిలులు గానివారును;అమర్షిణాం=కోపము గలవారును;కృతవిద్యానాం= అభ్యసింపఁబడిన సమస్త విద్యలు గలవారునగు;యోధానాం (తృతీయార్థమందుషష్ఠి) = భటులచేత; గుహా=పర్వతము నందుండుగొప్ప బిలము; కేసరిణామివ (తృతీయార్థమందుషష్ఠి)=సింహములచేతంబోలె;పూర్ణా=నిండినది;ఆసీత్(అధ్యాహృతము)=ఆయెను.

ఆయయోధ్యాపట్టణమందు,సమస్తశస్త్రవిద్యలనభ్యసించి శౌర్యంబున నిప్పు వలెఁ బరిభవింప నశక్యులై, కొంచెమైనను గౌటిల్యములేక,చాలఁగోపము గలిగి,వఱలుచున్న భటులు,పర్వత గుహయందు సింగంబులుంబోలె, నిండియుండిరి.అనితాత్పర్యము.

కాంభోజవిషయే జాతై ర్బాహ్లికైశ్చ హయోత్తమైః
వనాయుజై ర్నదీజైశ్చ పూర్ణా హరి హయోత్తమైః. ౨౨

టీక॥సా(అధ్యాహృతము)= ఆయయోధ్య; కాంభోజవిషయే = కాంభోజ మనెడుదేశమందు; జాతైః=పుట్టినవియు; బాహ్లికైశ్చ= బాహ్లికం దేశమునందుఁ బుట్టినవియు; వనాయుజైః=వనాయుదేశమందుఁబుట్టినవియు;నదీజైశ్చ=సింధుదేశమునందుఁబుట్టినవియు; హరిహయోత్తమైః, హరిహయ=ఇంద్రునిగుఱ్ఱమగు నుచ్చైశ్శ్రవము వలె,ఉత్తమైః=శ్రేష్ఠము లైనవియు నగు;హయోత్తమైః = అశ్వశ్రేష్ఠములచేత;పూర్ణా=నిండినది; ఆసీత్(అధ్యాహృతము)=ఆయెను.

ఆయయోధ్యయందుఁ,గాంభోజబాహ్లికవనాయు సింధుదేశములందుఁబుట్టి యుచ్చైశ్శ్రవముతోసరియై వెలుంగుచున్న శ్రేష్ఠములైనగుఱ్ఱములు,మెండుగా నిండి, యుండినవి. అనితాత్పర్యము.

వింధ్యపర్వతజై ర్మత్తైః పూర్ణా హైమవతైరపి
మదాన్వితై రతిబలై ర్మాతంగైః పర్వతోపమైః. ౨౩
ఐరావత కులీనైశ్చ మహాపద్మ కులై స్తథా
అంజనాదపి నిష్పన్నై ర్వామనా దపిచ ద్విపైః. ౨౪

టీక॥ సా(అధ్యాహృతము)= ఆ యయోధ్యాపురి; మత్తైః=గర్వించినట్టి; వింధ్యపర్వతజైః = వింధ్యపర్వతమునందుఁబుట్టిన; మాతంగైః= ఏనుఁగులచేతను, మదాన్వితైః = గర్వముతోఁగూడినవియు; అతిబలైః=చాలబలము గలవియు; పర్వతోపమైః = కొండలతోసరివచ్చునట్టివియునగు; హైమవతైరపి= హిమవత్పర్వతము నందుఁ బుట్టిన యేనుఁగులచేతను; ఐరావత కులీనైః = ఇంద్రుని యేనుఁగైన యైరావతము యొక్క కులమందుఁ బుట్టిన; ద్విపైశ్చ=ఏనుఁగులచేతను; మహాపద్మకులై స్తథా = పుండరీకమను దిగ్గజము యొక్క కులమందుఁ గలిగిన యేనుఁగులచేతను; అంజనాత్ = వరుణ దిగ్గజమయిన యంజనమువలన; నిష్పన్నైరపి = పుట్టిన యేనుఁగులచేతను; వామనాత్ యమదిగ్గజమయిన వామనమువలన; నిష్పన్నైః(అధ్యాహృతము)అపిచ= పుట్టిన యేనుగులచేతను; పూర్ణా= నిండినది; ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

ఆయయోధ్యయందు, వింధ్యపర్వతమునందుఁ బుట్టినమత్త గజములును, హిమవద్గిరియందు జనియించినయతిబలాఢ్యములగు మదపుటేనుంగులును, ఐరావతవంశమునందు సంభవించిన మత్తేభంబులును, పుండరీకకులంబునందుత్పత్తినొందిన మాతంగంబులును, అంజన వామన సంతతులంగల్గిన కుంజరంబులును, నిండియుండినవి. అని తాత్పర్యము.

భద్రై ర్మన్ద్రై ర్మృగైశ్చైవ భద్రమన్ద్రమృగై స్తథా
భద్రమన్ద్రై ర్భద్రమృగై ర్మృగమన్ద్రైశ్చ సాపురీ
నిత్యమత్తైస్సదా పూర్ణా నాగై రచల సన్నిభైః. ౨౫

స ౬

టీక॥ సా=ఆ; పురీ=అయోధ్యా పట్టణము; భద్రైః=భద్రజాతీయములును; మంద్రైః=మంద్రజాతీయములును; మృగైశ్చైవ = మృగజాతీయములును; భద్రమంద్రమృగైస్తథా= భద్రమంద్రమృగంబులనెడు మూఁడుజాతుల లక్షణములును సంకీర్ణముగాఁగలవియును; భద్రమంద్రైః= భద్రమంద్రములనెడు రెండుజాతులలక్షణములు సంకీర్ణముగాఁగలవియు; భద్రమృగైః= భద్రమృగంబులనెడు రెండుజాతులలక్షణములు సంకీర్ణముగాఁగలవియు; మృగమంద్రైశ్చ=మృగమంద్రములనెడు రెండుజాతులలక్షణములు సంకీర్ణముగాఁగలవియు; నిత్యమత్తైః = ఎల్లప్పుడును మదించియుండునవియు; అచలసన్నిభైః= పర్వతముతో సరివచ్చునవియునగు; నాగైః=ఏనుంగులచే; సదా=ఎల్లప్పుడును; పూర్ణా=నిండినది; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది.

ఆ యయోధ్యాపట్టణమందు, "భద్రములు, మంద్రములు, మృగములు, భద్రమంద్రమృగములు, భద్రమంద్రములు, భద్రమృగములు, మృగమంద్రములు," అనుగజజాతులలో, నన్నిటియందును, ఎల్లప్పుడుమదించిపర్వతములుం బోలె నున్నతములై యుండు నేనుంగులును, నిండియుండినవి. అని తాత్పర్యము.

సా యోజనేచ ద్వే భూయ స్సత్యనామా ప్రకాశతే
యస్యాం దశరథో రాజా వస న్జగద పాలయత్. ౨౬

టీ॥ యస్యాం = ఏపట్టణమందు; రాజా=రాజైన; దశరథః=దశరథుఁడు; వసన్=వాసము సేయుచు; జగత్=ప్రపంచమును; అపాలయత్=పాలించెనో; సా=అట్టి; పురీ = అయోధ్యాపట్టణము; భూయః = అధికముగా (అనఁగా నగరమునకు వెలుపలననుట) ద్వే=రెండైన; యోజనేచ=యోజనములును; సత్యనామా, సత్యా= యథార్థమైన, నామా= పేరుగలదిగా (అనగా "అయోధ్యా" ఎదిరించుటకుశక్యముకానిది, యను పేరు యథార్థముగాఁగలదిగా, ఎదిరింప నశక్యమై

యనుట); ప్రకాశతే=వెలుంగుచున్నది.

ప్రపంచమునంతయుఁబాలించుచుండిన దశరథమహారాజునకునివాసస్థానమైనయయోధ్యాపురము, పట్టణమునకు వెలుపలనైతము, రెండు యోజనములదూరము, శత్రువులకెదిరింపనశక్యమై తనదు "అయోధ్య" యనెడు నామధేయశబ్దము యొక్కయర్థము యథార్థముగాఁదనయందున్నదని, తెల్పుచుఁ బ్రకాశించుచున్నది. అని తాత్పర్యము.

తాం పురీం స మహాతేజా రాజా దశరథో మహాన్
శశాస శమితామిత్రో నక్షత్రాణీవ చంద్రమాః. ౨౭

టీక॥ మహాతేజాః = మిక్కిలి పరాక్రమము గలవాఁడును; మహాన్=పూజ్యుఁడును; రాజా=రంజిల్లఁజేయువాఁడునగు; దశరథః=దశరథమహారాజు; శమితామిత్రః, శమిత=శాంతినొందింపఁబడిన, అమిత్రః = శత్రువులు గలవాఁడై; తాం=ఆ; పురీం = అయోధ్యాపట్టణమును; చంద్రమాః=చంద్రుఁడు; నక్షత్రాణీవ=నక్షత్రములంబోలె; శశాస=పాలించెను.

అధికంబగు పరాక్రమముగలిగి జనరంజన సామర్థ్యముతో వెలుంగుచున్న దశరథమహారాజు, శత్రువులంజక్కడిచి, చంద్రుండు తనభార్యలగు నక్షత్రంబులంబోలె, జనులకందఱకును సౌఖ్యంబుగలుగఁ జేయుచు, నాయయోధ్యను, పాలించుచుండెను.

అని తాత్పర్యము.

తాం సత్యనామాం దృఢతోరణార్గళాం
గృహై ర్విచిత్రై రుపశోభితాం శివామ్
పురీ మయోధ్యాం నృసహస్ర సంకులాం
శశాస వై శక్రసమో మహీపతిః. ౨౮

టీక॥శక్రసమః=ఇంద్రునితో సరివచ్చునట్టి;మహీపతిః=భూమికిం బ్రభువైన దశరథుఁడు, సత్యానామాం,సత్య=యథార్థమైన; నామాం=పేరుగలదియును; దృఢతోరణార్గళాం, దృఢ=గట్టివియైన, తోరణ=ద్వారములును, అర్గళాం=గడియమ్రాకులుంగలదియును;విచిత్రైః=ఆశ్చర్యకరములైన, గృహైః=ఇండ్లచే; ఉపశోభితాం=ప్రకాశింపఁ జేయఁబడినదియును; శివాం=శుభముగలదియును;నృసహస్రసంకులాం, నృసహస్ర=వేనవేలమనుష్యులచేత, సంకులాం=నిండినదియునగు; తాం=ఆ; అయోధ్యాం=అయోధ్యయనెడు; పురీం=పట్టణమును; శశాస=పాలించెను. ("వై"అనునది పాదపూరణార్థము).

శత్రువులకెదిరింపనశక్యమైనందున,యథార్థమగు "అయోధ్య" అనుపేరం బరఁగుచు, దిటవు గల ద్వారములుగడియమ్రాకులు నాశ్చర్యకరములైన గృహంబులుంగలిగి, యెల్లప్పుడు మంగళోపేతమై వేనవేల మనుష్యులచే నిండియున్నయాయయోధ్యను, ఇంద్రతుల్యుండగు దశరథమహారాజు పాలింపుచుండెను. అనితాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, షష్ఠస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, బాలకాండ షష్ఠసర్గ టీక,

ముగిసినది.

౩౭

# సప్తమసర్గప్రారంభః.

తస్యామాత్యా గుణైరాస న్నిక్ష్వాకోస్తు మహాత్మనః
మంత్రజ్ఞాశ్చేంగితజ్ఞాశ్చ నిత్యం ప్రియహితే రతాః. ౧

టీక ॥ మహాత్మనః=అధికమైన బుద్ధిగలః తస్య=ఆః ఇక్ష్వాకోః=ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినదశరథునకుః గుణైః=మంత్రికినుండవలసినప్రజ్ఞాదిగుణములచేతః మంత్రిజ్ఞాశ్చ=ఆలోచనము దెలిసినవారును; ఇంగితజ్ఞాశ్చ = ఇతరులయభిప్రాయము దెలుసుకొనువారును;నిత్యం=ఎల్లప్పుడును;ప్రియహితే,ప్రియ = తమకుఁబ్రియుఁడైన రాజునకు, హితే=మేలుసేయుటయందు; రతాః = ఆసక్తులునగుః అమాత్యాః=మంత్రులుఃఆసన్=ఉండిరి

అతిబుద్ధిశాలియగునాదశరథమహారాజునకుఁ, బ్రజ్ఞాదిబలముచేఁ, గార్యాలోచనవిధమునెఱింగి, ముఖవికాసాదులచేఁ,బరులయభిప్రాయములం దెలిసికొనుచు, రాజునకు మేలుసేయ నాసక్తులైన, మంత్రులుండిరి.అని తాత్పర్యము.

అష్టౌ బభూవు ర్వీరస్య తస్యామాత్యా యశస్వినః
శుచయ శ్చానురక్తాశ్చ రాజకృత్యేషు నిత్యశః. ౨

టీక॥వీరస్య=పరాక్రమముగలవాఁడును; యశస్వినః = కీర్తిగలవాఁడునగుః తస్య=ఆదశరథమహారాజునకు; శుచయశ్చ=పరిశుద్ధులును;నిత్యశః=ఎల్లప్పుడును; రాజకృత్యేషు = రాచకార్యములయందుః అనురక్తాశ్చ=మిక్కిలియాసక్తులునగుఃఅష్టౌ=ఎనమండ్రైనఃఅమాత్యాః=మంత్రులుఃబభూవుః=ఉండిరి.

పరాక్రమమును గొప్ప కీర్తియునుగలదశరథునకుఁబరిశుద్ధులును ఎల్లప్పుడును రాచకార్యములందుమిక్కిలియాసక్తులు నగు నెన

మండు) మంత్రులుండిరి. అని తాత్పర్యము.

ధృష్టి ర్జయంతో విజయ స్సిద్ధార్థో హ్యర్థసాధకః
అశోకో మంత్ర పాలశ్చ సుమంత్రశ్చాష్టమో భవత్. ౩

టీక॥ ధృష్టిః = ధృష్టియనువాఁడు; ప్రథమః (అధ్యాహృతము)= మొదటివాఁడు; అభవత్ = ఆయెను. జయంతః=జయంతుండనువాఁడు; ద్వితీయః(అధ్యాహృతము)= రెండవ వాఁడు; అభవత్ (అధ్యాహృతము)=ఆయెను. విజయః=విజయుండనువాఁడు; తృతీయః (అధ్యాహృతము)= మూఁడవవాఁడు; అభవత్ (అధ్యాహృతము)= ఆయెను. సిద్ధార్థః=సిద్ధార్థుఁడను వాఁడు, చతుర్థః అభవత్ (అధ్యాహృతము) = నాలవ వాఁడాయెను. ("హి" అనునది పాద పూరణార్థము). అర్థసాధకః = అర్థసాధకుఁడనువాఁడు; పంచమః అభవత్ (అధ్యాహృతము)= అయిదవ వాఁడాయెను. అశోకః= అశోకుఁడనువాఁడు; షష్ఠః అభవత్ (అధ్యాహృతము) = ఆఱవ వాఁడాయెను. మంత్రపాలశ్చ = మంత్రపాలుండనువాఁడును; సప్తమః అభవత్ (అధ్యాహృతము)= ఏడవవాఁడాయెను. సుమంత్రశ్చ= సుమంత్రుఁ డను వాఁడును; అష్టమః=ఎనిమిదవవాఁడు; అభవత్= (అధ్యాహృతము)=ఆయెను.

తాత్పర్యము, సులభము.

ఋత్విజౌ ద్వా వభిమతౌ తస్యాస్తా మృషిసత్తమౌ
వసిష్ఠో వామదేవశ్చ మంత్రిణశ్చ తథాపరే. ౪

టీక॥ తస్య=ఆదశరథమహారాజునకు; వసిష్ఠః = వసిష్ఠమహర్షియును; వామదేవశ్చ=వామదేవమహర్షియును; ద్వౌ=ఇద్దఱైన; ఋషిసత్తమౌ = ఋషిశ్రేష్ఠులు; అభిమతౌ=ప్రధానులైన; ఋత్విజౌ=పురోహితులుగా; ఆస్తాం=ఉండిరి. తథా= అట్లు; అపరే=ఇతరులైన; మంత్రిణశ్చ= మంత్రులును(చకారమువలన) పురోహితులును; ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి.

తాత్పర్యము, సులభము.

విద్యావినీతా హ్రీమంతః కుశలా నియతేంద్రియాః
శ్రీమంతశ్చ మహాత్మాన శ్శాస్త్రజ్ఞా దృఢవిక్రమాః. ౫
కీర్తిమంతః ప్రణిహితా యథావచన కారిణః
తేజఃక్షమాయశఃప్రాప్తా స్స్మితపూర్వాభిభాషిణః. ౬

టీక॥ తే (అధ్యాహృతము)= ఆమంత్రులు; విద్యావినీతాః, విద్యా = రాజనీతిమొదలగువిద్యలందు,వినీతాః=శిక్షితులుగాను;హ్రీమంతః=లజ్జగలవారుగాను; కుశలాః=సమర్థులుగాను; నియతేంద్రియాః,నియత = నిగ్రహింపఁబడిన,ఇంద్రియాః = ఇంద్రియములుగల వారుగాను (శాస్త్రనిషిద్ధముగు నింద్రియవ్యాపారము లేనివారుగాననుట); శ్రీమంతశ్చ=సంపదగలవారుగాను; మహాత్మానః=గొప్ప బుద్ధి గలవారుగాను; శాస్త్రజ్ఞాః=నీతిశాస్త్రము మొదలగుశాస్త్రముల నెఱింగినవారుగాను;దృఢవిక్రమాః, దృఢ=ఎదురులేని,విక్రమాః = పరాక్రమముగలవారుగాను;కీర్తిమంతః=గొప్పమంతులను కీర్తిగలవారుగాను;ప్రణిహితాః = రాచకార్యములందుఁ, బ్రమాదములేనివారుగాను;యథావచనకారిణః,యథావచన=చెప్పెడి మాటనతిక్రమింపక, కారిణః=చేయు వారుగాను, (ఏప్రకారము చెప్పుదురో, ఆప్రకారముగనే చేయువారుగాని, ఒక విధముగాఁ జెప్పి మఱియొక విధముగాఁజేయువారుగారనుట); తేజఃక్షమాయశఃప్రాప్తాః, తేజః=ప్రతాపమును, క్షమా=ఓర్పును, యశః=కీర్తిని,ప్రాప్తాః=పొందినవారుగాను;స్మితపూర్వాభిభాషిణః, స్మితపూర్వ=చిఱునవ్వుముందుగాఁ గల్గునట్లు,అభిభాషిణః=మాటలాడువారుగాను;ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి.

ఆమంత్రులు, సమస్తవిద్యలందును నేర్పరులై, యకార్యములవలనలజ్జచేనివర్తిల్లుచు,యుక్తాయుక్తపర్యాలోచనము నందు సమర్థులై, యుక్తంబగు నింద్రియ వ్యాపారముగలిగి, శ్రీమంతులై, బుద్ధిమంతు

లై, సమస్తశాస్త్రముల నెఱింగి, పరాక్రమమునం దెదురు లేక, ప్రజల చేఁగీర్తితులై, రాజకార్యములం దప్రమత్తులై, మాటదాఁటక జరిగించుచుఁ, బ్రతాపంబున నోర్పునంగీకరించి, మాత్సర్యము లేక చిఱునవ్వుతో మాటలాడుచు, నుండిరి. అని తాత్పర్యము.

క్రోధా త్కామార్థహేతోర్వా నబ్రూయు రనృతం వచః

టీక॥ తే(అధ్యాహృతము)= ఆమంత్రులు; క్రోధాత్ = కోపమువలనఁగాని; కామార్థహేతోర్వా = కామనిమిత్తమువలనఁగాని, యర్థనిమిత్తమువలనఁగాని; అనృతం = అసత్యమైన; వచః = మాటను; నబ్రూయుః = పలుకరు.

ఆమంత్రులు, కోపమువలననైనను, గామనిమిత్తమైనను అర్థనిమిత్తమైనను, అసత్యము పలుకరు. అని తాత్పర్యము.

తేషా మవిదితం కించి త్స్వేషు నాస్తి పరేషు వా. ౭
క్రియమాణం కృతంవాపి చారేణాపి చికీర్షితమ్

టీక॥ తేషాం = ఆమంత్రులకు; స్వేషు = తమరాజ్యమందలివృత్తాంతములయందుఁగాని; పరేషువా = ఇతరుల రాజ్యముల యందలి వృత్తాంతములందుఁగాని; క్రియమాణం = చేయఁబడుచుండునదిగాని; కృతం = చేయఁబడినదిగాని; చికీర్షితమపి = చేయనిచ్ఛింపఁబడినదిగాని; కించిత్ = ఏదియైనను; చారేణ = వేగువానిచే; అవిదితం = తెలియనిది; నాస్తి = లేదు.

తమరాజ్యములందును బరరాజ్యములందును, చేయఁబడుచుండునదిగాని, చేయఁబడినదిగాని, చేయనిచ్ఛింపఁబడినదిగాని, యేదియైనను, వేగువాని మూలముగా, నామంత్రులు తెలిసికొననిది, లేదు. అని తాత్పర్యము.

కుశలా వ్యవహారేషు సౌహృదేషు పరీక్షితాః. ౮
ప్రాప్తకాలం తు తే దండం ధారయేయు స్సుతేష్వపి

టీక॥ వ్యవహారేషు = వ్యవహారములయందు; కుశలాః = సమర్థులును; సౌహృదేషు = మిత్రభావముల విషయమై; పరీక్షితాః = పరీక్షింపఁబడినవారునగు; తే = ఆమంత్రులు; సుతేష్వపి = కొడుకులయందును; ప్రాప్తకాలం, ప్రాప్త = పొందఁబడిన; కాలం = సమయముగల; దండం తు = శిక్షనుమాత్రము; ధారయేయుః = ప్రవర్తింపఁజేయుదురు.

వ్యవహారములందుసమర్థులును, న్యాయవిచారమున, మిత్రశత్రులందును సమముగానుండు వారు, నగు, నామంత్రులు, తమకొడుకులైన, నపరాధము చేసినచో, సరియైన దండమును విధింతురు. అనితాత్పర్యము.

కోశసంగ్రహణే యుక్తా బలస్యచ పరిగ్రహే. ౯
అహితం చాపి పురుషం నవిహింస్యు రదూషకమ్

టీక॥ తే (అధ్యాహృతము) = ఆమంత్రిలు; కోశసంగ్రహణే, కోశ = బొక్కసముయొక్క, సంగ్రహణే = సంపాదించుటయందును; బలస్య = సైన్యముయొక్క, పరిగ్రహేచ = సంగ్రహించుటయందును, యుక్తాః = ఆసక్తులై, అహితంచాపి = శత్రువునైనను, అదూషకం = అపరాధముసేయని; పురుషం = పురుషుని, నవిహింస్యుః = పీడింపరు.

ఆమంత్రిలు, బొక్కసమును వృద్ధిఁబొందింపుచు, సైన్యములసంగ్రహించికాపాడుచుఁ, దమకుశత్రువైనను, అపరాధము సేయనివాని, నెంతమాత్రమును, బీడింపరు. అని తాత్పర్యము.

వీరాశ్చ నియతోత్సాహా రాజశాస్త్ర మనుష్ఠితాః. ౧౦
శుచీనాం రక్షితారశ్చ నిత్యం విషయవాసినామ్

టీక॥ తే(అధ్యాహృతము)= ఆ మంత్రులు,వీరాశ్చ= పరాక్రమము గలవారుగాను; నియతోత్సాహాః, నియత=స్థిరమైన,ఉత్సాహాః= ప్రయత్నమందలిసంతోషముగలవారుగాను; రాజశాస్త్రం=నీతిశాస్త్రమును;అనుష్ఠితాః = అనుష్ఠించినవారుగాను; విషయవాసినాం,విషయ= దేశమందు,వాసినాం=వసింపుచున్న;శుచీనాం = సాధువుల యొక్క (సాధువులను);నిత్యం=ఎల్లప్పుడును; రక్షితారశ్చ=కాపాడువారుగాను, ఆసన్(అధ్యాహృతము)=అయిరి.

ఆమంత్రులు, శత్రువులజయింపసమర్థులై,యెల్లప్పుడునుమిక్కిలి సంతోషముతోఁబ్రయత్నములు సేయుచు, నీతిశాస్త్రోక్త పద్ధతినిగార్యములనడుపుచు,సమస్త స్థలములయందునుండుసాధుపురుషులసంరక్షింపుచు, నుండిరి. అని తాత్పర్యము.

బ్రహ్మక్షత్ర మహింసంత స్తేకోశం సమపూరయన్. ౧౧
సుతీక్ష్ణదండా స్సంప్రేక్ష్య పురుషస్య బలాబలమ్

టీక॥ తే = ఆమంత్రులు, బ్రహ్మ=బ్రాహ్మణజాతిని;క్షత్రం= క్షత్రియజాతిని,అహింసంతః = పీడింపనివారై;పురుషస్య=అపరాధియగు పురుషునియొక్క, బలాబలం=శక్తిని అశక్తిని;సంప్రేక్ష్య= చక్కగాఁజూచి;సుతీక్ష్ణదండాః,సుతీక్ష్ణ= మిక్కిలి తీవ్రమయిన, దండాః = శిక్షగలవారలై ; కోశం= బొక్కసమును, సమపూరయన్= నిండించిరి.

ఆమంత్రులు, బ్రాహ్మణక్షత్రియులఁబీడింపక,అపరాధిబలాబలములఁ జక్కగాఁ బరీక్షించి, ప్రబలునకుఁ దీవ్రశిక్షయును దుర్బలునకు మృదుశిక్షయును విధింపుచు, బొక్కసమును, నిండింపుచుండిరి. అని తాత్పర్యము.

శుచీనా మేకబుద్ధీనాం సర్వేషాం సంప్రజానతామ్. ౧౨
నాసీత్పురేవా రాష్ట్రేవా మృషావాదీ నరః క్వచిత్

టీక॥ శుచీనాం = పరిశుద్ధులును; ఏకబుద్ధీనాం= ఒకటేబుద్ధిగలవారునగు; సర్వేషాం=సమస్తమంత్రులు;సంప్రజానతాం=రాజ్యతంత్రమును, విచారింపుచుండఁగా(భావలక్షణసప్తమ్యర్థమందు, షష్ఠి);పురేవా=పట్టణమందుఁగాని;రాష్ట్రేవా=రాజ్యమందుఁగాని;క్వచిత్=ఒకానొకచోటనైనను; మృషావాదీ = దబ్బఱలాడునట్టి; నరః=మనుష్యుఁడు;నాసీత్=లేకపోయెను.

ఆమంత్రులందఱుఁ, బరస్పరమసూయపడక, యేకకంఠులై, యైకమత్యముగలిగి, రాజ్య తంత్రములు విచారింపుచుండఁగా,నయోధ్యాపట్టణమందును, దేశములయందును, ఏమూలయందైనను,దబ్బఱలాడుమనుష్యుఁడు, లేకపోయెను.

అని తాత్పర్యము.

కశ్చి న్నదుష్ట స్తత్రాసీ త్పరదార రతో నరః. ౧౩
ప్రశాంతం సర్వమేవాసీ ద్రాష్ట్రం పురవరంచ తత్

టీక॥ తత్ర=ఆరాజ్యమందు; కశ్చిత్=ఒకానొక;నరః=మనుష్యుఁడును;దుష్టః=కుటిలుఁడుగాను; పరదారరతః, పరదార=ఇతరులభార్యలందు,రతః= ఆసక్తుఁడుగాను; నాసీత్=కాలేదు; పురవరం=పట్టణశ్రేష్ఠమైనయయోధ్యయును; రాష్ట్రంచ=దేశమును;తత్=ఆదశరథమహారాజుచేఁ బాలింపఁ బడునట్టి;సర్వం=సమస్తప్రదేశమును;ప్రశాంతమేవ= అధర్మము లేనందున, మిక్కిలిశాంతముగానే;ఆసీత్=అయినది.

తాత్పర్యము,సులభము.

సువాసస స్సువేషాశ్చ తేచ సర్వే సుశీలినః. ౧౪
హితార్థంచ నరేంద్రస్య జాగ్రతో నయచక్షుషా

టీక॥ తే = ఆమంత్రులు;సర్వేచ=అందఱును;సువాససః= మంచివస్త్రములు గలవారుగాను;సువేషాశ్చ=మంచియలంకారము గల

వారుగాను;సుశీలినః= మంచియాచారము గలవారుగాను; నరేంద్రస్య= రాజుయొక్క;హితార్థం= మేలుకొఱకు; నయచక్షుషా, నయ=నీతియనెడు,చక్షుషా=నేత్రముచే;జాగ్రతశ్చ=మేలుకొనియుండువారుగాను (అనఁగా,నీతియనెడినేత్రము,నెప్పుడును మూయక తెఱచికొనియేయుండువారుగా,ననుట);ఆసన్(అధ్యాహృతము)= అయిరి.

ఆమంత్రులందఱును, మంచివస్త్రములు మంచి యలంకారములు మంచియాచారములుం గలిగి,రాజునకు మేలుగలుగుటకై,యెల్లప్పుడును,రాజనీతియుక్తముగానే, యెంతమాత్రము నేమఱక, ప్రవర్తించుచుండిరి.అని తాత్పర్యము.

గురౌ గుణగృహీతాశ్చ ప్రఖ్యాతాశ్చ పరాక్రమే. ౧౫
విదేశేష్వపి విజ్ఞాతా స్సర్వతో బుద్ధి నిశ్చయాత్

టీక॥ తేసర్వేచ (అధ్యాహృతము)=ఆమంత్రులందఱును;గురౌ= మాతాపిత్రాది గురుజనమందు;గుణగృహీతాశ్చ= గుణములమాత్రముగ్రహించినవారుగాను;పరాక్రమే = పరాక్రమవిషయమందు;ప్రఖ్యాతాశ్చ= ప్రసిద్ధులుగాను;సర్వతః= అన్నిటను;బుద్ధినిశ్చయాత్= బుద్ధియొక్క నిశ్చయించుటవలన;విదేశేష్వపి = దేశాంతరములందును;విజ్ఞాతాః= ప్రసిద్ధులుగాను;ఆసన్(అధ్యాహృతము)= అయిరి.

ఆమంత్రులందఱును, గురుజనమందు,గుణములమాత్రముగ్రహించి దోషంబులగణింపక, గౌరవమునెఱపుచు,"గొప్పపరాక్రము గలవా"రనివినుతినొందినవారై, అన్నివిషయములందు,నిశ్చయజ్ఞానము గలిగియుండుటంబట్టి,యెల్ల దేశంబులందునుంబ్రసిద్ధులై,యుండిరి. అని తాత్పర్యము.

సంధివిగ్రహతత్త్వజ్ఞాః ప్రకృత్యా సంపదాఽన్వితాః. ౧౬
మంత్ర సంవరణే శక్తా శ్శక్తా స్సూక్ష్మాసు బుద్ధిషు




టీక॥ తేసర్వేచ(అధ్యాహృతము)= ఆమంత్రులందఱును; సంధివిగ్రహతత్త్వజ్ఞాః, సంధి=సంధానముయొక్కయు, విగ్రహ=కలహించుటయొక్కయు, తత్త్వ= నిర్ణయమును; జ్ఞాః= ఎఱింగినవారుగాను; ప్రకృత్యా = స్వభావముచేత; సంపదా = ఐశ్వర్యముతో; అన్వితాః = కూడియుండువారుగాను; మంత్రసంవరణే=ఆలోచింపఁబడినరహస్యముయొక్క దాఁచుటయందు; శక్తాః=సమర్థులుగాను; సూక్ష్మాసు=ఎఱుంగుటకుఁగష్టములైన; బుద్ధిషు = బుద్ధినిశ్చయములందు; శక్తాః= సమర్థులుగాను(అనిమహేశ్వరతీర్థపాఠము); శ్లక్ష్ణాః= మృదువైనవారుగాను(అనిగోవిందరాజపాఠము); ఆసన్(అధ్యాహృతము)=అయిరి.

ఆమంత్రులందఱును, ఎప్పుడు ఎవనితోసంధిసేయవలెనో, ఎప్పుడు ఎవనితో యుద్ధము సేయవలెనో, ఆనిర్ణయమంతయు నెఱింగినవారలై, పుట్టిననాఁటనుండి స్వతస్సిద్ధంబగునైశ్వర్యంబునం బొదలుచు, మంత్రరహస్యంబుల నెవ్వరికిం దెలియరాకుండునట్లు మఱుఁగు పఱచుటకు, దురవగాహంబులగుసూక్ష్మార్థంబుల నిర్ణయించుటకు, నతిసమర్థులై, యుండిరి. అనితాత్పర్యము.

నీతిశాస్త్రవిశేషజ్ఞా స్సతతం ప్రియవాదినః. ౧౭

టీక॥ తేసర్వేచ(అధ్యాహృతము)= ఆమంత్రులందఱును; నీతిశాస్త్రవిశేషజ్ఞాః, నీతి = రాజనీతిచే, శాస్త్ర=శిక్షించుటయందలి("గ్రంథశాసనయోశ్శాస్త్రం" అని భాస్కరనిఘంటువు), విశేష= విశేషములను, జ్ఞాః = ఎఱింగినవారుగాను; సతతం= ఎల్లప్పుడును; ప్రియవాదినః = ఇంపుగామాటలాడువారుగాను; ఆసన్ (అధ్యాహృతము)= అయిరి.

ఆమంత్రులందఱును, ఎవ్వని, నెట్లు, ఎప్పుడు, శిక్షించఁదగునో, ఆనీతివిశేషముల నెఱింగినవారలై, ఎల్ల




ప్పుడును, అందఱకు, నింపుజనించున టులు, మాటలాడువారుగా, నుండి రి. అని తాత్పర్యము.

ఈదృశై స్తైరమాత్యైస్తు రాజా దశరథోఽనఘః
ఉపపన్నో గుణోపేతై రన్వశాస ద్వసుంధరామ్. ౧౮

టీక॥ అనఘః = కామక్రోధములం బుట్టినవ్యసనములు లేనట్టి; రాజా = రాజైన; దశరథః = దశరథుండు; ఈదృశైః = ఇప్పుడు చెప్పంబడినగుణములు గలవారును; గుణోపేతైః, గుణ = ఇతరగుణములతోను, ఉపేతైః = కూడియుండువారునగు; తైః = ఆ; అమాత్యైః = మంత్రులతో; ఉపపన్నస్తు = కూడినవాఁడై యే; వసుంధరాం = భూమిని; అన్వశత్ = పాలించెను.

తాత్పర్యము, సులభము.

అవేక్షమాణ శ్చారేణ ప్రజా ధర్మేణ రంజయన్
ప్రజానాం పాలనం కుర్వ న్నధర్మాన్ పరివర్జయన్. ౧౯
విశ్రుత స్త్రిషు లోకేషు వదాన్య స్సత్యసంగరః
స తత్ర పురుష వ్యాఘ్రి శ్శశాస పృథివీ మిమాం. ౨౦

టీక॥ సః = ఆ; పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుండగు దశరథ మహారాజు; చారేణ (జాత్యేకవచనము) = వేగువాండ్రచే; అవేక్షమాణః = చూచుచు; ప్రజాః = ప్రజలను; ధర్మేణ = ధర్మముచే; రంజయన్ = సంతోషింపఁజేయుచు; ప్రజానాం = ప్రజలయొక్క; పాలనం = రక్షణమును; కుర్వన్ = చేయుచు; అధర్మం = అధర్మమును; పరివర్జయన్ = విడిచిపెట్టుచు; త్రిషు = మూఁడైన; లోకేషు = లోకములయందును; విశ్రుతః = ప్రసిద్ధుండై; వదాన్యః = చాలనీవిగలవాఁడై; సత్యసంగరః = సత్యమైన ప్రతిజ్ఞ గలవాఁడై; తత్ర = ఆయయోధ్యాపట్టణమందు; వసన్ (అధ్యాహృతము) = వసింపుచు; ఇమాం = ఈ; పృథివీం = భూమి

నిఃశశాస=పాలించెను.

పురుషశ్రేష్ఠుండైన యాదశరధ మహారాజు, వేగువాండ్రవలన నిఖిలదేశవృత్తాంతంబుల నెఱుంగుచు, నపరాధులనెల్ల దండించి ప్రజలకు సంతోషము కల్పించుచుఁ, బ్రజలకు సౌఖ్యముగలుగునట్లురక్షింపుచు, నధర్మమును బాఱందోలి, తనకీర్తి మూఁడులోకంబులయందును వినుతికెక్క, మహాదాతయై, సత్యప్రతిజ్ఞుండై, యయోధ్యానగరంబున నివసించి, యీభూమండలం బంతయుఁ బాలింపుచుండెను. అని తాత్పర్యము.

నాధ్యగచ్ఛ ద్విశిష్టంవా తుల్యంవా శత్రు మాత్మనః
మిత్రవా న్నతసామంతః ప్రతాప హతకంటకః. ౨౧

టీక॥ మిత్రవాన్=స్నేహితులుగలవాఁడును; నతసామంతః, నత=నమస్కరించిన, సామంతః=పొరుగురాజులుగలవాఁడును; ప్రతాపహతకంటకః, ప్రతాప=పరాక్రమముచేత, హత=కొట్టఁబడిన, కంటకః=శత్రువులుగలవాఁడునగు; సః(అధ్యాహృతము)=ఆదశరథమహారాజు; ఆత్మనః=తనకు; విశిష్టంవా=అధికుఁడుగాని; తుల్యంవా=సమానుఁడుగాని, యగు; శత్రుం=పగవాని; నాధ్యగచ్ఛత్=ఎఱుంగఁడు.

మిత్రసంపన్నుండగు దశరథమహారాజు, సామంత ప్రభువులందఱుఁబాదానతులై, దన్నుఁ గొల్చుచుండఁ, బేరువినినంతనే, తనప్రతాపముదలంచి, శత్రువులందఱు ఱిచ్చవడి పాఱిపోవ, నిష్కంటకుండై, పుడమింబాలింపుచుఁ, దనకన్ననధికుఁడుగానిసమానుఁడుగానియగు, శత్రువెట్టివాఁడో, యెఱుంగలేనివాఁడాయెను

అని తాత్పర్యము.

స శశాస జగద్రాజా దివం దేవ పతిర్యధా

టీక॥సః=ఆ; రాజా=దశరధమహారాజు; జగత్=ప్రపంచమును; దివం=స్వర్గమును; దేవపతిర్యధా=దేవేంద్రుఁడువలె; శశాస=పాలించెను.

తాత్పర్యము, సులభము.

తై ర్మంత్రిభి ర్మంత్రహితే నివిష్టైః
వృతోనుర క్తైః కుశలై స్సమర్థైః
స పార్థివో దీ ప్తి మవాప యు క్త
స్తేజోమయై గోభిరి వోదితో ఒర్కః. ౨౨

టీక॥ మంత్రహితే, మంత్ర=ఆలోచనమందును, హితే = తనకు, మేలునందును; నివిష్టైః=ఆసక్తిగల వారును (అనిమహేశ్వరతీర్థపాఠము); నియుక్తైః=నియోగింపఁబడినవారును (అని గోవిందరాజపాఠము); అనురక్తైః= తనయందు, స్నేహముగలవారును; కుశలైః= బుద్ధికౌశలముగలవారును; సమర్థైః = కార్యములు సేయుటయందు, నేర్పరులునగు; తైః=ఆ, మంత్రిభిః= మంత్రులచేత;వృతః=చుట్టఁబడిన;సః=ఆ; పార్థివః=దశరథమహారాజు; తేజోమయైః = తేజోరూపములైన;గోభిః = కిరణములతో; యుక్తః=కూడియుండు; ఉదితః=ఉదయించిన; అర్క ఇవ=బాలసూర్యుఁడువలె; దీప్తిం=కాంతిని;అవాప=పొందెను.

ఆలోచనమందును దనకు మేలు సేయుటయందు నభినివిష్టులై, తనయందనురాగముగలిగి, సమస్తకార్యములయందునుసమర్థులైయుండు, మంత్రులతోఁ, గూడియున్న, యాదశరథమహారాజు, తేజోరూపంబులగుటంజేసిపరులఁబరిభవింప సమర్థము లైన, కిరణములతోఁ, గూడి, యుదయించిన, బాలసూర్యుఁడుంబోలెఁ,బ్రకాశించెను.
అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, సప్తమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ సప్తమసర్గ టీక,
ముగిసినది.

శ్రీః

అష్టమసర్గప్రారంభః.

తస్య త్వేవం ప్రభావస్య ధర్మజ్ఞస్య మహాత్మనః
సుతార్థం తప్యమానస్య నాసీ ద్వంశకర స్సుతః. ౧

టీక॥ ఏవం ప్రభావస్య=ఇట్టిప్రభావము గలవాఁడును; ధర్మజ్ఞస్య=ధర్మము నెఱింగినవాఁడును; మహాత్మనః= పూజ్యమగుస్వభావముగలవాఁడును; సుతార్థం=పుత్త్రునికొఱకు; తప్యమానస్య=పరితపించుచున్నవాఁడు నగు; తస్య తు = ఆదశరథమహారాజునకును; వంశకరః= వంశమును జేయునట్టి; సుతః=కుమారుఁడు; నాసీత్=కలుగలేదు.

ఇట్టిప్రభావముగలయాదశరథమహారాజు, ధర్మముల నెఱింగిప్రవర్తించుచు, ధర్మస్వభావముగలిగి, సంతానముగలుగుటకుఁ బ్రతిబంధకములు లేకపోయినను దనకుఁ బుత్త్రుండుగలుగమిం జేసి, పరితపించుచున్నను, వానికి, వంశకరుండగు కుమారుఁడు, జనింపలేదు.

అని తాత్పర్యము.

చింతయానస్య తస్యైవం బుద్ధి రాసీ న్మహాత్మనః
సుతార్థం హయ మేధేన కిమర్థం న యజా మ్యహమ్. ౨

టీక॥ చింతయానస్య=చింతించుచున్న; మహాత్మనః=మిక్కిలిబుద్ధిశాలియగు; తస్య= ఆదశరథమహారాజునకు; సుతార్థం=పుత్త్రునికొఱకు; హయమేధేన=అశ్వమేధమనుయాగముచేత; అహం=నేను; కిమర్థం=ఎందుకు; నయజామి=దేవతలఁబూజింపలేదు; ఏవం=ఈప్రకారము; బుద్ధిః= తలంపు; ఆసీత్=కలిగినది.

పుత్త్రుండుకలుగలేదని చింతించుచున్నమహాబుద్ధిశాలియగు నాదశరథమహారాజునకు, ఇదివఱకు నేనేల, యశ్వమేధయాగముచే, దేవతల నారాధింపలేదు? అనితలంపు వొడమినది. అని తాత్పర్యము.

స ౮

స నిశ్చితాం మతిం కృత్వా యష్టవ్య మితి బుద్ధిమాన్
మంత్రిభి స్సహ ధర్మాత్మా సర్వైరేవ కృతాత్మభిః. ౩
తతో౽బ్రవీ దిదం రాజా సుమంత్రం మంత్రిసత్తమమ్
శీఘ్ర మానయమేసర్వాన్ గురూంస్తాన్ సపురోహితాన్. ౪

టీక ॥ బుద్ధిమాన్ = బుద్ధిశాలి యును; ధర్మాత్మా = ధర్మస్వభావుండునగు; సః = ఆ; రాజా = దశరథమహారాజు; కృతాత్మభిః, కృత = చాలునంత, ("క్లీబేకృతం యుగేపిస్యాత్ఫలపర్యాప్తయోరపి" అనిభాస్కరనిఘంటువు), ఆత్మభిః = బుద్ధిగల; సర్వైః = సమస్తులయిన; మంత్రిభిస్సహైవ = మంత్రులతోఁ గూడనే; యష్టవ్యం = యజింపఁబడవలసినది; ఇతి = అని; నిశ్చితాం = నిశ్చయముతోఁగూడిన; మతిం = ఆలోచనమును; కృత్వా = చేసి; తతః = ఆపిమ్మట; మంత్రిసత్తమం = మంత్రిశ్రేష్ఠుఁడైన; సుమంత్రం = సుమంత్రునిఁగూర్చి; సపురోహితాన్ = పురోహితులతోఁ గూడిన; తాన్ = ఆ, ప్రసిద్ధులైన; మే = నాయొక్క; గురూన్ = గురువులను; సర్వాన్ = అందఱను; శీఘ్రం = వడిగా; ఆనయ = తోడితెమ్ము; ఇదం = ఈవాక్యమును; అబ్రవీత్ = చెప్పెను.

బుద్ధిశాలియుధర్మస్వభావుండునగు నాదశరథమహారాజు, మంత్రికార్యంబుల నారితేరి యెంతకునుం జాలియున్న మంత్రులందఱితో "యాగముసేయవలసినది" అని గట్టిగానాలోచనచేసి, యాపిమ్మట, మంత్రిశ్రేష్ఠుండగు సుమంత్రునకు, "మాగురువులఁ బురోహితులనందఱిందోడితెమ్ము" అని, యాజ్ఞాపించెను.

అని తాత్పర్యము.

తత స్సుమంత్ర స్త్వరితం గత్వా త్వరిత విక్రమః
సమానయ త్స తాన్ సర్వాన్ సమస్తా న్వేదపారగాన్. ౫
సుయజ్ఞం వామదేవంచ జాబాలి మథ కాశ్యపమ్
పురోహితం వసిష్ఠంచ యేచాన్యే ద్విజసత్తమాః. ౬

టీక॥తతః=ఆపిమ్మట; త్వరితవిక్రమమః=శీఘ్రమైననడకగల; సః=ఆ; సుమంత్రః=సుమంత్రుఁడు; త్వరితం=శీఘ్రముగా; గత్వా=పోయి; వేదపారగాన్, వేద = వేదముల యొక్క; పార = అంతమును, గాన్=పొందిన; సమస్తాన్=గుంపుచేరిన; తాన్=ఆగురువులను; సుయజ్ఞం= సుయజ్ఞుని; వామదేవం=వామదేవుని; జాబాలిం= జాబాలిని; అథ=ఇంకను; కాశ్యపం=కాశ్యపుని; పురోహితం= పురోహితుఁడైన; వసిష్ఠంచ=వసిష్ఠుని; అన్యే= ఇతరులైన; ద్విజసత్తమాః=బ్రాహ్మణశ్రేష్ఠులు; యే(సంతి) = ఎవరుగలరో; (తాన్)చ=వారిని; సర్వాన్=అందఱను; సమానయత్ =తోడతెచ్చెను.

తాత్పర్యము, సులభము



తాన్ పూజయిత్వా ధర్మాత్మా రాజా దశరథస్తదా
ఇదంధర్మార్థ సహితం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౭

టీక॥తదా= అప్పుడు; ధర్మాత్మా = ధర్మస్వభావుఁడగు; రాజా=రాజైన; దశరథః= దశరథుఁడు; తాన్ = ఆగురువులను; పూజయిత్వా = పూజించి; ధర్మార్థసహితం=ధర్మార్థములతోఁగూడినదియు; శ్లక్ష్ణం=మనోహరమైనదియునగు; ఇదం = ఈ, వక్ష్యమాణ

మగు; వచనం=వాక్యమును; అబ్రవీత్ =పలికెను. తాత్పర్యము, సులభము.

మమలాలప్యమానస్య పుత్త్రార్థం నాస్తి వై సుఖమ్
తదహం హయమేధేన యక్ష్యామీతి మతిర్మమ. ౮

టీక॥ పుత్త్రార్థం=కొడుకులకొఱకు; లాలప్యమానస్య=మిక్కిలి విలపించుచున్న; మమ=నాకు; సుఖం సౌఖ్యము; నాస్తి వై=కలుగనేలేదు, తత్ =అందువలన; అహం= నేను; హయమేధేన=అశ్వమేధయాగము చే; యక్ష్యామి= దేవతలనారాధింపుదును; ఇతి=అని; మమ = నాకు; మతిః=తలంపు; ఆసీత్ (అధ్యాహృతము)=కలిగినది.

తాత్పర్యము, సులభము.

తదహం యష్టుమిచ్ఛామి శాస్త్రదృష్టేన కర్మణా
కథం ప్రాప్స్యామ్యహం కామం బుద్ధిరత్ర విచార్యతామ్. ౯

టీక॥ తత్ =కావున; అహం=నేను; శాస్త్రదృష్టేన=శాస్త్రములందుఁజూడఁబడిన; కర్మణా = క్రియాకలాపముచేత; యష్టుం= యాగముసేయుటకు; ఇచ్ఛామి= కోరుచున్నాను. అహం= నేను; కామం= కోరికను; కథం = ఎట్లు; ప్రాప్స్యామి= పొందఁగలను; అత్ర=ఈవిషయమందు; బుద్ధిః = ఉపాయము; విచార్యతాం=ఆలోచింపఁబడుఁగాక.

తాత్పర్యము, సులభము.

తతస్సాధ్వితి తద్వాక్యం బ్రాహ్మణాః ప్రత్యపూజయన్
వసిష్ఠప్రముఖాస్సర్వే పార్థివస్య ముఖాచ్చ్యుతమ్. ౧౦

టీక॥ తతః=ఆపిమ్మట; వసిష్ఠప్రముఖాః= వసిష్ఠుఁడుమొదలుగాఁగల; సర్వే = సమస్తులైన; బ్రాహ్మణాః = బ్రాహ్మణులు; పార్థివస్య=రాజుయొక్క; ముఖాత్ =ముఖమువలన; చ్యుతం = జాఱిన; తత్ =ఆ; వాక్యం = మాటను, సాధ్వితి=“బళే” అని; ప్రత్యపూజయన్=

శ్లాఘించిరి.

అంతట, వసిష్ఠుఁడు మొదలుగా బ్రాహ్మణులందఱును, సాక్షాద్బ్రాజముఖంబునుండిబయలు వెడలిన ధర్మిష్ఠమగునావాక్యమును, "చక్కగానున్నది" అనిశ్లాఘించిరి. అనితాత్పర్యము.

ఊచుశ్చ పరమప్రీతా స్సర్వే దశరథం వచః

టీక॥ సర్వేచ=బ్రాహ్మణులందఱును; పరమప్రీతాః = అత్యంతముసంతసించినవారలై; దశరథం= దశరథునిఁగూర్చి; వచః = (వక్ష్యమాణమగు) వాక్యమును; ఊచుః= చెప్పిరి.

తాత్పర్యము, సులభము.

సంభారా స్సంభ్రియంతాం తే తురగశ్చ విముచ్యతామ్. ౧౧

టీక॥ తే = ఆ, ప్రసిద్ధములైన; సంభారాః = ఉపకరణములు; సంభ్రియంతాం= సంపాదింపఁబడుఁగాక. తురగశ్చ= గుఱ్ఱమును; విముచ్యతాం=విడువబడుఁగాక.

తాత్పర్యము, సులభము.

సర్వథా ప్రాప్స్యసే పుత్రా నభిప్రేతాంశ్చ పార్థివ
యస్య తే ధార్మికీ బుద్ధి రియం పుత్రార్థ మాగతా. ౧౨

టీక॥ పార్థివ = రాజా; యస్య=ఏ; తే=నీకు; ఇయం= ఈ; ధార్మికీ = ధర్మమే ప్రయోజనముగాఁగలబు; ద్ధిః = తలంపు; పుత్రార్థం = కొడుకులకొఱకు; ఆగతా = వచ్చినదో; సః త్వం(అధ్యాహృతము)=అట్టినీవు; సర్వథా=అన్నివిధములను; అభిప్రేతాన్= కోరఁబడెన; పుత్రాంశ్చ = కొడుకులను(చకారమువలన)కీర్తిని; ప్రాప్స్యసే=పొందఁగలవు.

రాజా! పుత్రార్థమునీకిట్టి ధార్మికబుద్ధిజనించినదికావున, నన్నివిధంబుల, నుత్తమగుణులగు కుమారులంబడసెదవు. అని తాత్పర్యము.

తతః ప్రీతో భవ ద్రాజా శ్రుత్వా తద్ద్విజ భాషితమ్
అమాత్యాంశ్చా బ్రవీ ద్రాజా హర్షపర్యా కులేక్షణః. ౧౩

టీక॥ తతః=ఆపిమ్మట; ద్విజభాషితం, ద్విజ=బ్రాహ్మణులచే, భాషితం=పలుకంబడిన; తత్=ఆమాటను; శ్రుత్వా=విని; రాజా=దశరథమహారాజు; ప్రీతః=సంతసించినవాఁడు; అభవత్=ఆయెను. రాజా=దశరథమహారాజు; హర్షపర్యాకులేక్షణః, హర్ష=సంతోషముచే, పర్యాకుల=కలఁతపడిన, ఈక్షణః=కండ్లుగలవాఁడై; అమాత్యాంశ్చ= మంత్రులనుంగూర్చి; అబ్రవీత్ (వక్ష్యమాణ వాక్యమును)=చెప్పెను.

తాత్పర్యము, సులభము.

సంభారా స్సంభ్రియంతాం మే గురూణాం వచనా దిహ
సమర్థా ధిష్ఠిత శ్చాశ్వ స్సోపాధ్యాయో విముచ్యతామ్. ౧౪

టీక॥ ఇహ=ఇప్పుడు; మే=నాయొక్క; గురూణాం= గురువులయొక్క; వచనాత్=వాక్యమువలన; సంభారాః=ఉపకరణములు; సంభ్రియంతాం= సంపాదింపంబడుఁగాక. సమర్థాధిష్ఠితః, సమర్థ=నేర్పరులచే; అధిష్ఠితః=రక్షింపఁ బడినదియు; సోపాధ్యాయః=ఉపాధ్యాయులతోఁగూడినదియునగు; అశ్వశ్చ=గుఱ్ఱమును; విముచ్యతాం=విడువఁబడుఁగాక.

తాత్పర్యము, సులభము.

సరయ్వా శ్చోత్తరే తీరే యజ్ఞభూమి ర్విధీయతామ్
శాంతయ శ్చాభివర్ధంతాం యథాకల్పం యథావిధి. ౧౫

టీక॥ సరయ్వాః= సరయూనదియొక్క; ఉత్తరే=ఉత్తరపుదిక్కునందలి; తీరే=గట్టునందు; యజ్ఞభూమిశ్చ=యాగభూమియును; విధీయతాం=చేయఁబడుఁగాత; శాంతయశ్చ= శాంతికర్మములును; యథాకల్పం=యథాక్రమముగాను; అభివర్ధంతాం=వృద్ధినొందెడుఁగాక.

తాత్పర్యము, సులభము.

శక్యః ప్రాప్తు మయం యజ్ఞ స్సర్వేణాపి మహీక్షితా
నాపరాధో భవే త్కష్టో యద్యస్మిన్ క్రతుసత్తమే. ౧౮

టీక॥ అస్మిన్ = ఈ; క్రతుసత్తమే = యాగశ్రేష్ఠమైనయశ్వమేధమందు; కష్టః = అపాయకరమైన; అపరాధః = అపచారము; యదినభవేత్ = కలుగకుండినట్టైన; అయం = ఈ; యజ్ఞః = అశ్వమేధయాగము; మహీక్షితా = రాజుగానున్న; సర్వేణాపి = సమస్తజనముచేతను; ప్రాప్తుం = పొందుటకు; శక్యః = సాధ్యము; స్యాత్ (అధ్యాహృతము) = అగును.

ఈయశ్వమేధయాగమునం దపాయకరమైనయపచారము గలుగుట కవకాశము లేకున్నట్టైన, దీని, సమస్తరాజులును జేయ సమర్థులు కాఁగలరు. అని తాత్పర్యము.

ఛిద్రంహి మృగయంతేఽత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః
నిహతస్యచ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి. ౧౯

టీక॥ అత్ర = ఈయశ్వమేధయాగమునందు; విద్వాంసః = పండితులయిన; బ్రహ్మరాక్షసాః = బ్రహ్మరక్షస్సులు; ఛిద్రం = అపచారమును; మృగయంతేహి = వెదకుచున్నారుగదా; నిహతస్య = కొట్టువడిన; యజ్ఞస్య = యాగముయొక్క; కర్తాచ = చేయువాఁడును (యజమానుఁడుననుట); సద్యః = అప్పుడే; వినశ్యతి = నశించుచున్నాఁడు.

బ్రాహ్మణులుగానుండే, యాగములు సేయుటయందుఁ బ్రమాదంబులుగలుగుటంజేసి, రాక్షసత్వంబు నొందిన, బ్రహ్మరాక్షసులు, యాగములందుఁగలుగు నపరాధంబుఁలజక్కఁగా నెఱింగియున్నవారు కావున, నీయశ్వమేధయాగము సేయునప్పుడును, అపరాధంబులనే వెదకుచు, యాగమును జెఱుపంజూతురు; యాగము చెడినచో, దానియజమానుఁడును, అప్పుడే, నశించును. అని తాత్పర్యము.

తద్యథా విధిపూర్వం మే క్రతు రేష సమాప్యతే

తథా విధానం క్రియతాం సమర్థాః కరణే ష్విహ. ౧౮

టీక॥ తత్ = కావున; యథా = ఎట్లు; మే = నాయొక్క; ఏషః = ఈ; క్రతుః = అశ్వమేధయాగము; విధిపూర్వం = శాస్త్రప్రకారముగ; సమాప్యతే = ముగియునో, తథా = అట్లు; విధానం = యత్నము; క్రియతాం = చేయఁబడుఁగాక; ఇహ = ఇచ్చట; కరణేషు = కార్యములందు; యూయం (అధ్యాహృతము) = మీరు, సమర్థాః = నేర్పరులరు.

తాత్పర్యము, సులభము.

తథేతి చాబ్రువన్ సర్వే మంత్రిణః ప్రత్యపూజయన్
పార్థివేంద్రస్య తద్వాక్యం యథాజ్ఞప్తం నిశమ్య తే. ౧౯

టీక॥ తే = ఆ, మంత్రిణః = మంత్రులు; సర్వే = అందఱును; పార్థివేంద్రస్య = రాజశ్రేష్ఠుఁడైనదశరథునియొక్క; తత్ = ఆ; వాక్యం = మాటను, నిశమ్య = విని; యథా = ఎట్లు; ఆజ్ఞప్తం = ఆజ్ఞాపింపఁబడినదో; తథా = అట్లే; ఇతి = అని; అబ్రువన్ = చెప్పిరి. ప్రత్యపూజయంశ్చ = దాని, శ్లాఘనమును జేసిరి.

దశరథమహారాజు వాక్యమును విని, యామంత్రులందఱును "ఆజ్ఞాప్రకారము చేసెదము" అనిమనవిచేసి, శ్లాఘించిరి.

అని తాత్పర్యము.

తథా ద్విజాస్తే ధర్మజ్ఞా వర్ధయంతో నృపోత్తమమ్
అనుజ్ఞాతా స్తత స్సర్వే పునర్జగ్ము ర్యథాగతమ్. ౨౦

టీక॥ ధర్మజ్ఞాః = ధర్మముల నెఱింగిన; తే = ఆ; ద్విజాః = బ్రాహ్మణులు; సర్వే = అందఱును; నృపోత్తమం = రాజశ్రేష్ఠుఁడైన దశరథుని; తథా = అట్లు; వర్ధయంతః = వృద్ధినొందించుచు; అనుజ్ఞాతాః = అనుజ్ఞనుబొందినవారలై, తతః = ఆపిమ్మట, యథాగతం = వచ్చినట్లు; పునః = మఱల; జగ్ముః = పోయిరి.

ధర్మజ్ఞులగు నాబ్రాహ్మణు లందఱును, దశరథమహారాజునకు, "నీవుకోరినపద్ధతినే,యజ్ఞము, నిర్విఘ్నముగాc, దుదముట్టెడు" నని, యాశీర్వాదముచేసి,యతనిచే ననుజ్ఞాతులై, వచ్చినప్పుడుతమకుcగలిగినగౌరవములతో, వెళ్లిరి.

అని తాత్పర్యము.

విసర్జయిత్వా తాన్ విప్రాన్ సచివా నిద మబ్రవీత్
ఋత్విగ్భి రుపదిష్టోఽయం యథావ త్క్రతు రాప్యతామ్. ౨౧

టీక॥ సః(అధ్యాహృతము)= ఆదశరథమహారాజు; తాన్=ఆ;విప్రాన్= బ్రాహ్మణులను;విసర్జయిత్వా=వదలి; ఋత్విగ్భిః=ఋత్విక్కులచేత;ఉపదిష్టః=చెప్పంబడిన;అయం=ఈ; క్రతుః=యాగము(యాగమునకుcగావలయునుపకరణంబులనుట); యథావత్ = క్రమముదప్పక; ఆప్యతాం= సంపాదింపcబడుcగాక; ఇదం=ఈ వాక్యమును; సచివాన్=మంత్రులనుగూర్చి; అబ్రవీత్=పలికెను.

దశరథమహారాజు,ఆబ్రాహ్మణులనందఱంబంపి, "ఋత్విక్కులు చెప్పినప్రకారము, యాగోపకరణద్రవ్యంబుల నన్నింటిని సంపాదింపుcడు" అనిమంత్రులకాజ్ఞాపించెను. అనితాత్పర్యము.

ఇత్యుక్త్వా నృపశార్దూల స్సచివాన్ సముపస్థితాన్
విసర్జయిత్వా స్వం వేశ్మ ప్రవివేశ మహాద్యుతిః. ౨౨

టీక॥ మహాద్యుతిః=అధికమగు కాంతిగల; నృపశార్దూలః=రాజశ్రేష్ఠుcడైన దశరథమహారాజు, ఇతి = ఇప్పుడుచెప్పినప్రకారము; ఉక్త్వా=చెప్పి;సముపస్థితాన్=సమీపమందున్నట్టి; సచివాన్=మంత్రులను; విసర్జయిత్వా=వదలి; స్వం=తనదైన; వేశ్మ=గృహమును;ప్రవివేశ=ప్రవేశించెను.

తాత్పర్యము,సులభము.

తత స్సగత్వా తాః పత్నీ నరేంద్రో హృదయప్రియాః
ఉవాచ దీక్షాం విశత యక్ష్యేహం సుతకారణాత్. ౨౩

టీక॥ తతః=ఆపిమ్మట; సః=ఆ దశరథమహారాజు; గత్వా = పోయి; హృదయప్రియాః, హృదయ= మనస్సునకు, ప్రియాః=సంతోషము గలిగించువారును; పత్నీః=తనతో యజ్ఞముసేయుటకుసంబంధముగల వారునగు; తాః=ఆకౌసల్యమొదలగుభార్యలనుగూర్చి; యూయం (అధ్యాహృతము)=మీరు; దీక్షాం=యజ్ఞదీక్షను; విశత = పొందుడు; అహం=నేను; సుతకారణాత్ =పుత్రనిమిత్తము; యక్ష్యే = యాగము చేసెదను; ఇతి(అధ్యాహృతము)= అని; ఉవాచ=పలికెను.

అంతట, నాదశరథమహారాజు, ఇంటిలోనికి వెళ్లి, తనమనః ప్రియలగు కౌసల్యాది పత్నులంజూచి "మీరుదీక్షనొందుఁడు, నేనుబుత్రుఁడు గలుగుటకైయాగముచేసెదను" అనిచెప్పెను. అనితాత్పర్యము

తాసాం తేనాతికాంతేన వచనేన సువర్చసామ్
ముఖపద్మా న్యశోభంత పద్మానీ వ హిమాత్యయే. ౨౪

టీక॥ అతికాంతేన=మిక్కిలిమనోహరమైన; తేన=ఆ; వచనేన= మాటచేత; సువర్చసాం = మంచి కాంతిగల; తాసాం = వారలయొక్క; ముఖపద్మాని= కమలమువలె సుందరములైన మొగములు; హిమాత్యయే; హిమ=హేమంత ఋతువుయొక్క; అత్యయే=అంతమందు; పద్మానీవ=కమలములుంబోలె; అశోభంత=ప్రకాశించినవి.

అతిమనోహరంబగు నామాట నువినఁగానే, హేమంతఋతువుగడచినపిదపఁ గమలములు ప్రకాశించునట్లు, లాదశరథకాంతల, ముఖములు ప్రకాశించినవి. అనితాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, అష్టమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండాష్టమసర్గటీక,
ముగిసినది.

౫౭

నవమసర్గప్రారంభః.

ఏతచ్ఛ్రుత్వా రహస్సూతో రాజానమిద మబ్రవీత్

టీక॥ ఏతత్ = ఈవృత్తాంతమును; శ్రుత్వా = విని; సూతః = సారధియైనసుమంత్రుఁడు; రహః = రహస్యప్రదేశమందు; రాజానం = రాజునుగూర్చి; ఇదం = దీనిని(వక్ష్యమాణమును); అబ్రవీత్ = చెప్పెను.

తాత్పర్యము, సులభము.

ఋత్విగ్భి రుపదిష్టోయం పురావృత్తో మయా శ్రుతః. ౧

టీక॥ ఋత్విగ్భిః = వసిష్ఠుఁడు మొదలగు ఋత్విక్కులచేత; ఉపదిష్టః = ఉపదేశింపఁబడిన; అయం = ఈయుపాయము; మయా = నాచేత; పురావృత్తః = ఇతిహాసరూపముగా; శ్రుతః = వినఁబడినది.

ఈవసిష్ఠాదిమహర్షులుపదేశించిన పుత్రప్రాప్త్యుపాయమును, నేను బూర్వము, ఇతిహాసరూపముగా వినియున్నాను. అని తాత్పర్యము.

సనత్కుమారో భగవాన్ పూర్వం కధితవాన్ కధామ్
ఋషీణాం సన్నిధౌ రాజన్ తవ పుత్రాగమంప్రతి. ౨

టీక॥ రాజన్ = దశరధమహారాజా; పూర్వం = మునుపు; భగవాన్ = మాహాత్మ్యముగల; సనత్కుమారః = సనత్కుమారమహర్షి; ఋషీణాం = ఋషులయొక్క; సన్నిధౌ = సమీపమందు; తవ = నీయొక్క; పుత్రాగమంప్రతి = పుత్రప్రాప్తినిగుఱించి; కధాం = కధను; కధితవాన్ = చెప్పెను.

మున్ను, భూతభవిష్యద్వర్తమానజ్ఞానాదిమాహాత్మ్యములుగల సనత్కుమారమహర్షి, ఋషులందఱునువినుచుండ, నీపుత్రప్రాప్తిని గుఱించి, జరుగంబోవు, నొక్కకధను, జెప్పెను.

అని తాత్పర్యము.

కాశ్యపస్యతు పుత్రోఽస్తి విభండక ఇతిశ్రుతః
ఋశ్యశృంగ ఇతి ఖ్యాత స్తస్య పుత్రో భవిష్యతి. ౩

టీక॥ కాశ్యపస్యతు = కాశ్యప మహర్షికిని; విభండక ఇతి= విభండకుండని; శ్రుతః=ప్రసిద్ధుఁడైన; పుత్రః= కుమారుఁడు; అస్తి=కలఁడు. తస్య = ఆవిభండకునకు; ఋశ్యశృంగ ఇతి = ఋశ్య శృంగుఁడని; ఖ్యాతః = ప్రసిద్ధుఁడైన; పుత్రః = కుమారుఁడు; భవిష్యతి= కాఁగలఁడు.

తాత్పర్యము, సులభము.

స వనే నిత్యసంవృద్ధో ముని ర్వనచర స్సదా
నాన్యం జానాతి విప్రేంద్రో నిత్యం పిత్రను వర్తనాత్. ౪

టీక॥ వనే= అడవియందు; నిత్యసంవృద్ధః, నిత్య= ఎల్లప్పుడు, సంవృద్ధః= పెరిఁగినవాఁడును; సదా= ఎల్లప్పుడు; వనచరః, వన= అడవియందు, చరః= తిరుగుచున్నవాఁడును; విప్రేంద్రః= బ్రాహ్మణశ్రేష్ఠుఁడునగు; సః= ఆ; మునిః= ఋశ్యశృంగమహాముని; నిత్యం= ఎల్లప్పుడును; పిత్రనువర్తనాత్, పితృ = తండ్రియొక్క (తండ్రిని), అనువర్తనాత్ =అనుసరించుటవలన; అన్యం= అడవికన్ననితరమగుదానిని; నజానాతి (భవిష్యదర్థమందు వర్తమానము)= ఎఱుంగకయుండును.

ఆఋశ్యశృంగమహాముని, విడువకయడవిలోనే పెరిఁగి, యడవిలోనే యెల్లప్పుడును సంచరింపుచు, నడవిలోనుండుతండ్రిగారినే యనుసరింపుచు, నుండుటంజేసి, యడవికన్ననితరములగు నగరగ్రామములను గాని యందుండు విశేషపదార్థములను గాని, యెఱుంగకయుండును. అని తాత్పర్యము.

ద్వైవిధ్యం బ్రహ్మచర్యస్య భవిష్యతి మహాత్మనః
లోకేషు ప్రథితం రాజన్ విప్రైశ్చ కథితం సదా. ౫




టీక॥ రాజః = దశరథమహారాజు; మహాత్మనః = పూజ్యమగుస్వభావముగలఋశ్యశృంగమహామునియొక్క; బ్రహ్మచర్యస్య = బ్రహ్మచర్యమునకు; లోకేషు = లోకములందు; ప్రథితం = ప్రసిద్ధమైనదియును; విప్రైః = బ్రాహ్మణులచేత, సదా = ఎల్లప్పుడును; కథితంచ = చెప్పంబడినదియునగు; ద్వైవిధ్యం = రెండువిధములుగలిగియుండుట; భవిష్యతి = కలుగును.

విశేషార్థము.— బ్రహ్మచారులు, గాయత్రుఁడు, వ్రతి, ప్రాజాపత్యుఁడు, నైష్ఠికుఁడు, అని, నాలుగువిధములు. అందుభిక్షాటనము, గురుశుశ్రూష, సేయుచు, వేదాధ్యయన మాచరించువాఁడు, "వ్రతి" యనియు, వివాహముచేసికొని, పరదార వర్జితుఁడై, శాస్త్రనియతంబులగుఋతుకాలంబులందుమాత్రము, భార్యోపగమము సేయువాఁడు, "ప్రాజాపత్యుఁడు" అనియు ననంబడుదురు.

ఆఋశ్యశృంగుఁడు, లోకంబులందుఁబ్రసిద్ధమై, బ్రాహ్మణులచేఁగొనియాడంబడురీతిని, వ్రతిత్వమునుబ్రాజాపత్యత్వమునను, రెండువిధములబ్రహ్మచర్యములు, నొందఁగలఁడు.

అనితాత్పర్యము.

తస్యైవం వర్తమానస్య కాల స్సమభివర్తత
అగ్నిం శుశ్రూషమాణస్య పితరంచ యశస్వినమ్. ౬

టీక॥ తస్య = ఆఋశ్యశృంగమహాముని (భావలక్షణ స్తమర్థమందు, షష్ఠి); అగ్నిం = అగ్నిహోత్రమును; యశస్వినం = కీర్తిగల; పితరంచ = తండ్రిని; శుశ్రూషమాణస్య = సేవించుచు (భావలక్షణసప్తమ్యర్థమందుషష్ఠి); ఏవం = ఈప్రకారము; వర్తమానస్య = ఉండుచుండఁగా (సప్తమ్యర్థమందు షష్ఠి); కాలః = కొంత, కాలము; సమభివర్తత = కడవఁగలదు (భవిష్యదర్థమందు, లఙ్)

ఆఋశ్యశృంగ మహాముని, అగ్నిహోత్రమును గీర్తిసంపన్నుండగుతండ్రిని సేవింపుచుఁ, గొంతకాలము, వ్రతిత్వంబనెడు బ్రహ్మచర్య






మందుండఁగలఁడు. అని తాత్పర్యము.

ఏతస్మిన్నేవ కాలేతు రోమపాదః ప్రతాపవాన్
అంగేషు ప్రథితోరాజా భవిష్యతి మహాబలః. ౭

టీక॥ ఏతస్మిన్=ఈ; కాలఏవ తు=కాలమందే; అంగేషు=అంగదేశములందు; ప్రతాపవాన్=పరాక్రమము గలవాఁడును; ప్రథితః=ప్రసిద్ధుఁడును; మహాబలః=గొప్పబలముగలవాఁడునగు; రోమపాదః=రోమపాదుఁడనెడు; రాజా=రాజు; భవిష్యతి = ఉండఁగలఁడు.

ఈకాలమందే, యంగదేశమందు, మహాపరాక్రమమును, మహాబలమును గలిగి, జగద్విఖ్యాతుఁడై, యుండు, రోమపాదుండను రాజొకం, డుండఁగలఁడు.

అని తాత్పర్యము.

తస్య వ్యతిక్రమాద్రాజ్ఞో భవిష్యతి సుదారుణా
అనావృష్టి స్సుఘోరావై సర్వభూత భయావహా. ౮

టీక॥తస్య=ఆ; రాజ్ఞః = రోమపాదమహారాజుయొక్క; వ్యతిక్రమాత్ =ధర్మమును నతిక్రమించుటయనెడుదోషమువలన; సుదారుణా= పెద్దకాల ముండుటచే, భయంకరమగునదియు, సుఘోరా= పెక్కు దేశంబుల వ్యాపించుటచే, వెఱపుఁబుట్టించునదియును ("వై" అనునది పాద పూరణార్థము); (గనుకనే)సర్వభూతభయావహా, సర్వభూత=ఎల్లప్రాణులకును, భయ=వెఱపును, ఆవహా=కలిగించునదియునగు; అనావృష్టిః=వఱపు; భవిష్యతి=కాఁగలదు.

ఆరోమపాదుఁడు, ధర్మమునతిక్రమించుటంజేసి, పెక్కు దేశంబులం, బెద్దకాలమువఱకు, సర్వప్రాణిభయంకరంబైన, యనావృష్టి, జనింపంగలదు.

అని తాత్పర్యము.



స ౯

అనావృష్ట్యాంతు వృత్తాయాం రాజా దుఃఖసమన్వితః
బ్రాహ్మణాన్ శ్రుతవృద్ధాంశ్చ సమానీయ ప్రవక్ష్యతి. ౯

టీక॥ అనావృష్ట్యాం = వఱపు; వృత్తాయాంతు = కలుగఁగానే; రాజా = రోమపాదమహారాజు; దుఃఖసమన్వితః=దుఃఖముతోఁగూడినవాఁడై, శ్రుతవృద్ధాన్, శ్రుత= శాస్త్రాభ్యాసముచే, వృద్ధాన్ = పెద్దవారగు; బ్రాహ్మణాంశ్చ=బ్రాహ్మణులను, సమానీయ=రప్పించి; ప్రవక్ష్యతి=ఇట్లని, చెప్పఁగలఁడు.

అనావృష్టి రాఁగానే, యారోమపాదుఁడు, దుఃఖము నొంది, వేద శాస్త్రసంపన్నులగు బ్రాహ్మణుల రావించి, యిట్లని, యడుగును.

అని తాత్పర్యము

భవంత శ్శ్రుతధర్మాణో లోకచారిత్ర వేదినః
సమాదిశంతు నియమం ప్రాయశ్చిత్తం యథాభవేత్. ౧౦

టీక॥ శ్రుతధర్మాణః, శ్రుత = వినంబడిన, ధర్మాణః= ధర్మము గలవారును; లోకచారిత్రవేదినః, లోకచారిత్ర= లోకాచారమును, వేదినః=ఎఱింగినవారునగు; భవంతః=మీరలు; యథా = ఎట్లు; ప్రాయశ్చిత్తం = పాప పరిహారము; భవేత్ = అగునో; తథా (అధ్యాహృతము) = అట్లు; నియమం= అనుష్ఠానమును; సమాదిశంతు=ఆజ్ఞాపింపుఁడు. (అని, "చెప్పఁగలఁడు" అనుపూర్వశ్లోక క్రియతో నన్వయము.)

మీరు, సమస్తధర్మంబుల లోకాచారంబుల నెఱుంగుదురు, ఈ యనావృష్టికిఁ గారణమైన పాపము పోవునట్లు ఒకనియమమును, నాకు పదేశింపుఁడు. అని తాత్పర్యము.

వక్ష్యంతి తే మహీపాలం బ్రాహ్మణా వేదపారగాః

టీక॥ వేదపారగాః, వేద= వేదములయొక్క, పార=అంతమును, గాః= ఎఱింగినట్టి; తే= ఆ, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు; తం= ఆ;

మహీపాలం=భూమికిఁ బ్రభువైన రోమపాదునిగూర్చి; వక్ష్యంతి= ఇట్లని, చెప్పఁగలరు.

తాత్పర్యము, సులభము.

విభండకసుతం రాజన్ సర్వోపాయై రిహానయ. ౧౧
ఆనాయ్యచ మహీపాల ఋశ్యశృంగం సుసత్కృతమ్
ప్రయచ్ఛ కన్యాం శాంతాం వై విధినా సు సమాహితః. ౧౨

టీక॥ రాజన్ = రోమపాదమహారాజా! విభండకసుతం= విభండకమహామునికొడుకైనఋశ్యశృంగుని; సర్వోపాయైః= సమస్తోపాయముల చేత; ఇహ=ఇచ్చటకి; ఆనయ = తోడితెమ్ము, మహీపాల= భూమికిఁ బ్రభువైనవాఁడా! ఋశ్యశృంగం=ఋశ్యశృంగుని; సుసత్కృతం=మంచిసత్కారముతోఁ గూడియుండునట్లు; ఆనాయ్యచ=రప్పించియు; త్వం(అధ్యాహృతము)=నీవు; సుసమాహితః= మనస్సమాధానముగలవాఁడవై, కన్యాం= కూఁతురైన, శాంతాం=శాంతను; ("వై" అననది పాదపూరణార్థము) విధినా = శాస్త్రీయమగుక్రమముచే; ప్రయచ్ఛ=ఇమ్ము (అని, "చెప్పఁగలరు" అనుదానితోనన్వయము.)

రోమపాద మహారాజా! ఏయుపాయముచేతనైనను, విభండకమహామునికొడుకైనఋశ్యశృంగు, నిచ్చటకిఁ, దోడితెమ్ము; అట్లుచిత సత్కారంబులతోఁ దోడితెచ్చి, విచారముదక్క, యాయనకు, నీకూఁతురైనశాంతను, యథావిధిగ, నొసంగుము. అని తాత్పర్యము.

తేషాంతు వచనం శ్రుత్వా రాజా చింతాం ప్రపత్స్యతే
కేనోపాయేన వై శక్య ఇహానేతుం స వీర్యవాన్. ౧౩

టీక॥ తేషాం= ఆబ్రాహ్మణుల యొక్క; వచనం = మాటను; శ్రుత్వాతు = వినినంతనె; రాజా=రోమపాదమహారాజు; కేన=ఏ; ఉపాయేన = ఉపాయముచేత; వీర్యవాన్= ఇంద్రియనిగ్రహముగల; సః = ఆఋశ్యశృంగుఁడు; ఇహ= ఇచ్చటికి; ఆనేతుం= తెచ్చుటకు; శ

క్యః=సాధ్యుఁడు; స్యాత్ (అధ్యాహృతము)=అగును; ఇతి (అధ్యాహృతము) = అని; చింతాం = ఆలోచనమును; ప్రపత్స్యతే=పొందఁగలఁడు.

ఆబ్రాహ్మణులమాటనువినఁగానే రోమపాదుండు, "ఏయుపాయమున, జితేంద్రియుండగునాఋశ్యశృంగునిటకుఁ దోడితేఁదగు" ననియాలోచింపఁగలఁడు. అని తాత్పర్యము

తతో రాజా వినిశ్చిత్య సహమంత్రిభి రాత్మవాక్
పురోహిత మమాత్యాంశ్చ తతః ప్రేష్యతి సత్కృతాక్. ౧౪

టీక॥ తతః=ఆపిమ్మట; ఆత్మవాక్=ధైర్యశాలియగు; రాజా=రోమపాదమహారాజు; మంత్రిభిస్సహ = మంత్రులతోఁగూడ; వినిశ్చిత్య=నిశ్చయించి; తతః=పిమ్మట; సత్కృతాక్=సత్కరింపఁబడిన; అమాత్యాక్=మంత్రులను; పురోహితంచ= పురోహితుని; ప్రేష్యతి=(భవిష్యదర్థమందులట్) పంపఁగలఁడు.

పిమ్మట, మంత్రులతో నాలోచించి, నిశ్చయించి, మంత్రులనుంబురోహితునిం బూజించి, ఋశ్యశృంగునిం దోడితెచ్చుటకు, వారిం బంపఁగలఁడు.

అని తాత్పర్యము.

తేతు రాజ్ఞో వచశ్శ్రుత్వా వ్యథితా వినతాననాః
నగచ్ఛేమ ఋషేర్భీతా అనునేష్యంతి తం నృపమ్. ౧౫

టీక॥ రాజ్ఞః = రోమపాదమహారాజుయొక్క; వచః=వాక్యమును; శ్రుత్వా=విని; తేతు=ఆపురోహితమంత్రులును; వ్యథితాః= దుఃఖితులై; వినతాననాః; వినత=వంగిన, ఆననాః=ముఖముగలవారలై; ఋషేః= విభండకమహర్షివలన; భీతాః=భయముపడినవారలై; నగచ్ఛేమ= మేముపోఁజాలము; ఇతి(అధ్యాహృతము)=అని; తం=ఆ; నృపం=రోమపాదమహారాజును; అనునేష్యంతి=ఊఁరడింపఁగలరు.

ఆపురోహితమంత్రులును, రోమపాదునిమాటనాలకించి,మహాతపస్వియును జండకోపుండునగు విభండక మహర్షి వలన భయంపడి, దుఃఖితులై, మొగమువాంచి, "మేముపోఁజాలము" అనియారోమపాదుని,ననునయింతురు.

అని తాత్పర్యము.

వక్ష్యంతి చింత యిత్వా తే తస్యోపాయాంశ్చ తత్క్షమాన్
అనేష్యామో వయం విప్రం నచ దోషో భవిష్యతి. ౧౬

టీక॥ తే = ఆపురోహితమంత్రులు; తత్క్షమాన్ = ఆఋష్యశృంగునిం దోడితెచ్చుటయందు సమర్థములైన; ఉపాయాంశ్చ=ఉపాయములను; చింతయిత్వా=ఆలోచించి; వయం=మేము; విప్రం=బ్రాహ్మణుఁడైన ఋష్యశృంగుని; ఆనేష్యామః=తోడితేగలము; దోషశ్చ=దోషమును; (అనావృష్టిగానివిభండకునిశాపముగాని,చెప్పవచ్చును); నభవిష్యతి=కలుగదు; ఇతి(అధ్యాహృతము)=అని, తస్య=ఆరోమపాదునకు, వక్ష్యంతి=చెప్పగలరు.

ఆపురోహితమంత్రులు, ఋష్యశృంగునిఁ దోడి తెచ్చుటకుం దగిన యుపాయంబు నాలోచించి, "మేము,ఋష్యశృంగునిదోడితెచ్చెదము దోషమేమియుంగలుగదు" అనియారోమపాదునకుం జెప్పఁగలరు.

అని తాత్పర్యము.

ఏవ మంగాధిపేనైవ గణికాభిః ఋషే స్సుతః
ఆనీతోఽవర్షయద్దేవ శ్శాంతా చాస్మై ప్రదీయతే. ౧౭

టీక॥ ఏవం = ఈప్రకారము; అంగాధిపేన= అంగదేశమునకుఁ బ్రభువైనరోమపాదునిచేత; గణికాభిరేవ = వేశ్యలచేతనే; ఋషేః=విభండకమహర్షియొక్క, సుతః=కుమారుఁడగు ఋష్యశృంగుఁడు; ఆనీతః = తెప్పింపఁబడును; దేవః = వర్షాధిదేవతయగు పర్జన్యుఁడు; అవర్షయత్ =వర్షించును. (భవిష్యదర్థ మందులఙ్)

శాంతాచ= రోమపాదునికూఁతురైనశాంతయును; అస్మై=ఈఋశ్యశృంగునికొఱకు; ప్రదీయతే(భవిష్యదర్థమందులట్) =ఇయ్యఁబడును.

ఈప్రకారము, రోమపాదుండు, వేశ్యలచే, నాఋశ్యశృంగునిఁ, దన పట్టణమునకుం, దోడితెప్పించఁగానే, పర్జన్యుండువర్షము గురియును; అంత, రోమపాదుఁడు, తనకూఁతురైనశాంత, నాఋశ్యశృంగున, కిచ్చును. అని తాత్పర్యము.

ఋశ్యశృంగస్తు జామాతా పుత్రాం స్తవ విధాస్యతి
సనత్కుమారకథిత మేతావద్వ్యాహృతం మయా. ౧౮

టీక॥ జామాతా= అల్లుఁడైన; ఋశ్యశృంగస్తు=ఋశ్యశృంగుఁడుమాత్రము; తవ=నీకు; పుత్రాన్= కొడుకులను; విధాస్యతి= చేయఁగలఁడు; సనత్కుమారకథితం; సనత్కుమార = సనత్కుమారునిచే; కథితం = చెప్పఁబడినదాని; ఏతావత్ = ఇంతమాత్రము; మయా=నాచే; వ్యాహృతం=చెప్పఁబడినది. అని, సుమంత్రుఁడు, చెప్పెనుట. ఋశ్యశృంగునిభార్యయగు శాంత, దశరథునకు, ఔరసపుత్రియును, దశరథునిచే రోమపాదునకుదత్తయైనదియును, గావున, ఋశ్యశృంగుఁడు, దశరథునకును రోమపాదునకును, జామాత యగుచున్నాఁడు.

తాత్పర్యము, సులభము.

అథ హృష్టో దశరథ స్సుమంత్రం ప్రత్యభాషత
యథర్శ్యశృంగ స్త్వానీతో విస్తరేణ త్వయోచ్యతామ్. ౧౯

టీక॥ అథ=అటుపిమ్మట; దశరథః=దశరథమహారాజు; హృష్టః= సంతోషించినవాఁడై; యథా=ఎట్లు; ఋశ్యశృంగః=ఋశ్యశృంగుఁడు; ఆనీతః = తోడితేఁబడెనో; (తథా)తు=ఆవిధమంతయును; విస్తరేణ=వివరముతో; త్వయా = నీచేత; ఉచ్యతాం=చెప్పఁబడుఁగాక; ఇతి(అభ్యాహృతము)= అని; సుమంత్రం ప్రతి= సుమంత్రునిఁగూర్చి;

అభాషత=పలికెను.

సుమంత్రుఁడు చెప్పినకథయంతయువినినపిమ్మట, దశరథుండు, సంతుష్టుఁడై, "వారలు ఋశ్యశృంగునిఁదోడి తెచ్చినవిధమంతయు, వివరముగాఁజెప్పుము" అని, సుమంత్రునకానతిచ్చెను. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, నవమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇచ్చట, సర్గసమాప్తి యుచితముగాదనియు, నిద్రాయువారి ప్రమాదమువలనం గలిగినదనియు, గోవిందరాజులవారు, వచించిరి. మహేశ్వరతీర్థులవారుమాత్రము, ఈవిషయమై యేమియుఁ వ్రాయనందున, వారి, కిట్టుటసర్గసమాప్తియుండుట, సమ్మతమని, తోఁచెడిని.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ నవమసర్గ టీక,

ముగిసినది.

---

శ్రీ

దశమ సర్గ ప్రారంభః.

సుమంత్ర శ్చోదితో రాజ్ఞా ప్రోవాచేదం వచ స్తదా

టీక॥ రాజ్ఞా=దశరథమహారాజుచే; చోదితః=ప్రేరేపింపఁబడిన; సుమంత్రః=సుమంత్రుఁడు; తదా=అప్పుడు; ఇదం=ఈ, వక్ష్యమాణముగు; వచః=మాటను; ప్రోవాచ=పలికెను.

తాత్పర్యము, సులభము.

యథ ర్ష్యశృంగ స్త్వానీత శ్శృణు మే మంత్రిభిస్సహ. ౧

టీక॥యథా=ఎట్లు;సః=ఆఋశ్యశృంగుఁడు;మంత్రిభిః=మంత్రులచేత;ఆనీతః = తోడితేఁబడెనో;(తథా)తు = ఆవిధమునే;మే = నావలన;శృణు=వినుము.

తాత్పర్యము,సులభము.

రోమపాద మువాచేదం సహామాత్యః పురోహితః
ఉపాయో నిరపాయోఽయ మస్మాభి రభిచింతితః. ౨

టీక॥పురోహితః = పురోహితుఁడు;సహామాత్యః = మంత్రులతోఁగూడినవాఁడై;ఇదం = ఈ;వక్ష్యమాణ మగుదాని; రోమపాదం = రోమపాదునిగూర్చి;ఉవాచ=పలికెను.నిరపాయః = అపాయములేని; అయం = ఈ;ఉపాయః = ఉపాయము;అస్మాభిః= మాచేత;అభిచింతితః = ఆలోచింపఁబడెను.

తాత్పర్యము,సులభము.

ఋశ్యశృంగో వనచర స్తపస్స్వాధ్యాయనే రతః
అనభిజ్ఞ స్స నారీణాం విషయాణాం సుఖస్యచ. ౩

టీక॥వనచరః= అడవియందుఁ దిరుగుచుండువాఁడును; తపస్స్వాధ్యాయనే;తపః = తపస్సునందును;స్వాధ్యాయనే= వేదాధ్యయనమందును;రతః = ఆసక్తుఁడునగు; సః=ఆ;ఋశ్యశృంగః=ఋశ్యశృంగుఁడు;నారీణాం= స్త్రీలను(కర్మణిషష్ఠి);విషయాణాం=విషయములయొక్క; సుఖస్యచ (కర్మణిషష్ఠి)=సౌఖ్యమును;అనభిజ్ఞః = ఎఱింగినవాఁడుకాఁడు.

ఆఋశ్యశృంగుఁడు, అడవియందేతిరుగుచు, ఎల్లప్పుడును, దపస్సు వేదాధ్యయనము,వీటియందేవర్తింపుచుండుటంబట్టి,స్త్రీలంగాని,విషయసుఖముగాని, యెంతమాత్రము, నెఱుంగఁడు.అని, తాత్పర్యము.

ఇంద్రియార్థై రభిమతై ర్నరచిత్త ప్రమాథిభిః
పుర మానాయయిష్యామః క్షిప్రం చాధ్యవసీయతామ్. ౪

టీక॥నరచిత్త ప్రమాథిభిః,నరచిత్త = పురుషునిహృదయమును, ప్రమాథిభిః = క్షోభింపఁజేయునవియును;అభిమతైః=పురుషులకు సమ్మతములైనవియునగు; ఇంద్రియార్థైః= ఇంద్రియములకువిషయములైనగంధాదులచేతను;పురం = పట్టణమునుగూర్చి;తం(అధ్యాహృతము) = ఆఋశ్యశృంగుని;ఆనాయయిష్యామః = తోడితెప్పించెదము;క్షిప్రం = శీఘ్రముగా;అధ్యవసీయతాంచ = నిశ్చయముం జేయుఁడు

పురుషహృదయములకు క్షోభమును గలిగించు,సర్వసమ్మతములైనరూపరసగంధాదులగు నింద్రియవిషయములచే, నాఋశ్యశృంగునిహృదయమును వశీకరించి,యతని, నీపట్టణమునకుం, దోడితెప్పించెదము; శీఘ్రముగానాప్రకారమునిశ్చయింపుఁడు.అనితాత్పర్యము.

గణికా స్తత్ర గచ్ఛంతు రూపవత్యః స్వలంకృతాః
ప్రలోభ్య వివిధోపాయై రానేష్యం తీహ సత్కృతాః. ౫

టీక॥రూపవత్యః=మంచిరూపముగలవారును; స్వలంకృతాః = మంచియలంకారముగలవారునగు; గణికాః=వేశ్యలు;తత్ర = ఆఋశ్యశృంగుఁ డున్నచోటికి; గచ్ఛంతు = పోదురుగాక;తాః(అధ్యాహృతము) = ఆవేశ్యలు;సత్కృతాః = ఆఋశ్యశృంగునివలన,సత్కారమునొందినవారలై;తం(అధ్యాహృతము) = ఆఋశ్యశృంగుని;వివిధోపాయైః= నానావిధములగునుపాయములచేత; ప్రలోభ్య =వంచించి;ఆనేష్యంతి = తోడితేఁగలరు.

ఆఋశ్యశృంగునియెడకు, మంచిరూపముగలిగి,చక్కనైనయలంకారములుధరించియుండు, వేశ్యలం,బంపవలయు; వారలా ఋశ్య

శృంగునింబలుదెఱంగుల, వంచించియిటకుఁదోడితేఁగలరు. అని తా.

శ్రుత్వా తథేతి రాజాచ ప్రత్యువాచ పురోహితమ్
పురోహితో మంత్రిణశ్చ తథా చక్రు శ్చతేతదా. ౬

టీక॥ శ్రుత్వా=విని; రాజాచ=రోమపాద మహారాజును; పురోహితం=పురోహితునిగూర్చి; తథా=అట్లే; ఇతి=అని; ప్రత్యువాచ=బదులుపలికెను. పురోహితః=పురోహితుండును; తే=ఆ; మంత్రిణశ్చ=మంత్రులును; తదా=అప్పుడు; తథా=అట్లే; చక్రుశ్చ=కార్యమునుంజేసిరి.

రోమపాదుండామాటనువిని, యాలాగుననే, సేయవలయునని, పురోహితునితోఁజెప్పెను, అప్పుడు ఆపురోహితుండును, మంత్రులును ఆప్రకారమే, వేశ్యల, నచ్చటికిఁ బంపిరి. అని తాత్పర్యము.

వారముఖ్యాశ్చ తచ్ఛ్రుత్వా వనం ప్రవివిశు ర్మహత్

టీక॥ వారముఖ్యాశ్చ=వేశ్యలలో మేటిమైనవారును; తత్=ఆ మంత్రివాక్యమును; శ్రుత్వా=విని; మహత్=గొప్పదైన; వనం=అడవిని; ప్రవివిశుః=ప్రవేశించిరి.

తాత్పర్యము, సులభము.

ఆశ్రమస్యా విదూరేస్మిన్ యత్నం కుర్వంతి దర్శనే. ౭
ఋషిపుత్రస్య ధీరస్య నిత్య మాశ్రమ వాసినః

టీక॥ తాః(అధ్యాహృతము)=ఆవేశ్యలు; అస్మిన్=ఈయడవియందు; ఆశ్రమస్య=ఆవిభండకాశ్రమమునకు; అవిదూరే=సమీపమందు; స్థిత్వా(అధ్యాహృతము)=ఉండి; ధీరస్య = ఇంద్రియములకు లోఁబడనివాఁడును; నిత్యం= ఎల్లప్పుడును; ఆశ్రమవాసినః=ఆశ్రమమునందుండు వాఁడు నగు; ఋషి పుత్రస్య=విభండకమహర్షి కుమారుఁ

డైన ఋశ్యశృంగునియొక్క (ఋశ్యశృంగుని); దర్శనే=చూచుట యందు; యత్నం=ప్రయత్నమును; కుర్వంతి=చేసిరి (భూతార్థమందు,లట్).

ఆవేశ్యలు,విభాండకాశ్రమమునకు సమీపప్రదేశమునందుండి,ఋశ్యశృంగుఁడు ఋషి పుత్రుఁడై యడవిలోనే యున్నందున నాగరక క్రియ నెఱుంగని వాఁడై, జితేంద్రియుండై, యెప్పుడును శ్రీ...లోనే యుండుటం బట్టి, యాయనకుం గోపమువొడముచుండునట్లు, చూడవలెనని, అయత్నమును జేయుచుండెరి.

అని తాత్పర్యము.

పితుస్స నిత్య సంతుష్టో నాతిచక్రామ చాశ్రమాత్. ౮

టీక॥ పితుః=తండ్రివలన;నిత్యసంతుష్టః = ఎల్లప్పుడునుసంతోషమునొందియున్న; సః= ఆఋశ్యశృంగుఁడు; ఆశ్రమాచ్చ=ఆశ్రమమునుండియు; నాతిచక్రామ=దాఁటివచ్చుట లేదు.

ఆ ఋశ్యశృంగుఁడు, పితృశుశ్రూషయందేయాసక్తుండగుటం బట్టి,యాశ్రమమునుసైతము, దాఁటియవ్వలికిఁబోవుట లేదు.

అని తాత్పర్యము.

న తేన జన్మప్రభృతి దృష్టపూర్వం తపస్వినా
స్త్రీర్వా పుమాన్వా యచ్చాన్య త్సర్వం నగరరాష్ట్రజమ్. ౯

టీక॥తపస్వినా=శ్రేష్ఠమైనతపస్సుగల; తేన= ఆఋశ్యశృంగుని చేత; జన్మప్రభృతి=పుట్టినదిమొదలు; స్త్రీర్వా= స్త్రీగాని; పుమాన్వా=పురుషుఁడుగాని; అన్యచ్చ=ఇతరమును;యత్ (అస్తి)=ఏదికలదో;తద్వా (అధ్యాహృతము) = అదిగాని, నగరరాష్ట్రజం=పట్టణములయందును గ్రామములందునుం బుట్టిన; సర్వం=సమస్తమును;దృష్టపూర్వం= మునుపుచూడఁబడినది, న(ఆసీత్)=కాలేదు.

ఆఋశ్యశృంగుఁడు, పుట్టినది మొదలు, అంతకుమున్ను, స్త్రీనిగాని, పురుషునిగాని, యింకనితరజంతువైనవానిగాని, పట్టణములందు, గ్రామములందుఁ బుట్టిన, యేపదార్థమునుం, జూచి యెఱుంగఁడు.

అని తాత్పర్యము.

తతః కదాచి త్తం దేశ మాజగామ యదృచ్ఛయా
విభండక సుత స్తత్ర తా శ్చాపశ్య ద్వరాంగనాః. ౧౦

టీక॥ తతః=ఆపిమ్మట; కదాచిత్ = ఒకానొప్పుడు; విభండకసుతః=విభండకునికొడుకైన ఋశ్యశృంగుఁడు; యదృచ్ఛయా=దైవవశముచేత; తం=ఆ; దేశం=ప్రదేశమును; ఆజగామ=పొందెను. తత్ర=అచ్చట; తాః=ఆ; వరాంగనాశ్చ=ఉత్తమస్త్రీలను; అపశ్యత్ = చూచెను.

ఆపిమ్మట, నొకానొకప్పుడా ఋశ్యశృంగుండు, దైవవశంబునం జేసి, యావేశ్యలుండు చోటికేతెంచి, యాయుత్తమ స్త్రీలంబూచెను. అని తాత్పర్యము.



తాశ్చిత్రవేషాః ప్రమదా గాయంత్యో మధురస్వరాః
ఋషిపుత్ర ముపాగమ్య సర్వా వచన మబ్రువన్. ౧౧

స ౧౦

టీక॥చిత్రవేషాః= నానావిధములైన యలంకారములుగలవారునుః మధురస్వరాః= మనోహరమైనకంఠధ్వనిగలవారునగు; తాః = ఆ; ప్రమదాః = స్త్రీలు; సర్వాః= అందఱును; గాయంత్యః = పాడుచు; ఋషిపుత్రం= విభండకమహర్షికొడుకైన, ఋశ్యశృంగుని; ఉపాగమ్య = చేరి; వచనం=(వక్ష్యమాణమగు) మాటను; అబ్రువన్= పలికిరి.

ఆవేశ్యలందఱును, నానావిధంబులగు నలంకారంబులు దాల్చి, మనోహరంబైనకంఠధ్వనితో గానము సేయుచు, నా ఋశ్యశృంగునిం జేరి, యిట్లనిపలికిరి. అని తాత్పర్యము.

క స్త్వం కిం వర్తసే బ్రహ్మన్ జ్ఞాతు మిచ్ఛామహే వయమ్
ఏక స్త్వం విజనే ఘోరే వనే చరసి శంస నః.౧౨

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుండా! త్వం=నీవు; కః = ఎవ్వఁడవు? కిం=ఎందుకు; వర్తసే=ఈయడవియందు,నుండెదవు? వయం = మేము; జ్ఞాతుం= తెలిసికొనుటకు; ఇచ్ఛామహే = కోరుచున్నాము. త్వం=నీవు; ఏకః = అసహాయుఁడవై; విజనే= జనులులేనట్టిదియును; ఘోరే = భయంకరమైనదియునగు; వనే= అడవియందు; చరసి=తిరుగుచున్నావు. నః=మాకు; శంస= ఆకారాణమును, చెప్పుము. (అని, "పలికిరి" అనుదానితో నన్వయము.)

బ్రాహ్మణుఁడా! "నీవెవ్వఁడవు? ఎందుకీయడవిలోనుండెదవు? మేము దానినెఱుంగగోరితిమి; జనసంచారమే లేక భయంకరంబై యుండునీడవిలోనొంటిఁజరించెదవు; ఆకారణమును మాకుం జెప్పుము." అనిపలికిరి. అని తాత్పర్యము.

అదృష్టరూపా స్తా స్తేన కామ్యరూపా వనే స్త్రియః
హార్దా త్తస్య మతి ర్జాతా హ్యాఖ్యాతుం పితరం స్వకమ్.౧౩

టీక॥యస్మాత్(అధ్యాహృతము)= ఏకారణము వలన; కామ్య రూపాః = కోరఁదగిన రూపముగల; తాః=ఆ; స్త్రియః=స్త్రీలు; వనే=

అడవియందు; తేన=ఆఋశ్యశృంగునిచేత; అదృష్టరూపాః=చూడంబడనిరూపముగలవారలో; తస్మాత్ (అధ్యాహృతము) = ఆకారణమువలన; హార్దాత్ = స్నేహమువలన; తస్య= ఆఋశ్యశృంగునకు; స్వకం=తన; పితరం = తండ్రిని; ఆఖ్యాతుం= తెల్పుటకు; మతిః = బుద్ధిః; జాతాహి=పుట్టినదిగదా.

ఆవేశ్యలవంటి రూపముగలవారినడవియందుఋశ్యశృంగుండెప్పుడుం జూచియుండనందున, వారియందతనికిమిగుల స్నేహముగలిగి, వారికిం, దనతండ్రిగారినిం, దెలుపవలెనని, బుద్ధిపుట్టెను.

అని తాత్పర్యము.

పితా విభండకోఽస్మాకం తస్యాహం సుత ఔరసః
ఋశ్యశృంగ ఇతి ఖ్యాతం నామ కర్మ చ మే భువి. ౧౪

టీక॥ అస్మాకం= మాయొక్క; పితా=తండ్రి; విభండకః= విభండకుండను పేరుగలవాఁడు; తస్య= ఆ విభండకునకు; అహం= నేను; ఔరసః = ఔరసుండగు(అనఁగా, ఉరమునందుఁబుట్టిన, ఊర్ధ్వగతమైన రేతస్సునకుఁబుట్టిన, అనియర్థము. రేతస్సుఊర్ధ్వమున నుండుట ప్రసిద్ధము); సుతః, కుమారుఁడను; మే=నాయొక్క; నామ, పేరు; ఋశ్యశృంగ ఇతి= ఋశ్యశృంగుఁడని; ఖ్యాతం= ప్రసిద్ధము. కర్మ చ=తపోరూపమైనకర్మమును; భువి = భూమియందు; ఖ్యాతం(అధ్యాహృతము)=ప్రసిద్ధము.

తాత్పర్యము, సులభము.

ఇహాశ్రమపదోఽస్మాకం సమీపే శుభదర్శనాః
కరిష్యేఽత్ర పూజాం వై సర్వేషాం విధిపూర్వకమ్. ౧౫

టీక॥ శుభదర్శనాః= మంగళకరమైనచూడఁబడుటగలవారలా; ఇహ=ఇచ్చట; సమీపే=సమీపమందు; అస్మాకం=మాయొక్క; ఆశ్రమపదః=ఆశ్రమస్థానము; అస్తి(అధ్యాహృతము) = ఉన్నది. అత్ర= ఈయాశ్రమమందు; వః= మీకు; సర్వేషాం=అందఱకును; పూజాం=

పూజను;("వై"అనునదిపాదపూరణార్థము) విధిపూర్వకం = శాస్త్రప్రకారముగా; కరిష్యే = చేయఁగలను.

ఇచ్చట,ఋశ్యశృంగునకు,స్త్రీలనెడుజ్ఞానంబులేనందునఁ, బురుషులేయనియెంచి, "సర్వేషాం" అని పుంలింగముప్రయుక్తంబయ్యె.

తాత్పర్యము,సులభము.

ఋషిపుత్రవచశ్శ్రుత్వా సర్వాసాం మతిరాసవై
తదాశ్రమపదం ద్రష్టుం జగ్ము స్సర్వాశ్చ తేన తాః. ౧౬

టీక॥ఋషిపుత్రవచః=ఋషికుమారుఁడైన ఋశ్యశృంగునిమాటను;శ్రుత్వా = విని;తదాశ్రమపదం=ఆఋశ్యశృంగునియాశ్రమస్థానమును;ద్రష్టుం = చూచుటకు;సర్వాసాం,అందఱకును;మతిః,తలంపు;ఆస = కలిగినది.("వై"అనునది పాదపూరణార్థము)తాః=ఆవేశ్యలు;సర్వాశ్చ=అందఱును; తేన=ఆ ఋశ్యశృంగునితో; జగ్ముః=వెళ్లిరి.

తాత్పర్యము,సులభము.

ఆగతానాం తతః పూజా మృషిపుత్ర శ్చకారహ
ఇద మర్ఘ్య మిదం పాద్య మిదం మూలం ఫలంచ నః. ౧౭

టీక॥తతః=ఆపిమ్మట; ఆగతానాం= తనయాశ్రమమునకు,వచ్చినయావేశ్యలకు;ఋషిపుత్రః=ఋషికుమారుఁడైనఋశ్యశృంగుఁడు; నః=మామాయొక్క;అర్ఘ్యం= అర్ఘ్యము; ఇదం=ఇదిగో; పాద్యం=పాద్యము; ఇదం= ఇదిగో; మూలం=గడ్డలును;ఫలంచ=పండును; ఇదం=ఇదిగో;ఇతి(అధ్యాహృతము)=అని;పూజాం=పూజను;చకార=చేసెను( "హ" అనునదిపాదపూరణార్థము.)

తాత్పర్యము,సులభము.

ప్రతిగృహ్యా చ తాం పూజాం సర్వాఏవ సముత్సుకాః
ఋషే ర్భీతాశ్చ శీఘ్రం తా గమనాయ మతిం దధుః. ౧౮




టీక॥ తాః = ఆ వేశ్యలు; సర్వా ఏవచ = అందఱు నే; సముత్సుకాః = ఉత్సాహముగలవారలై; తాం = ఆ; పూజాం = పూజను; ప్రతిగృహ్య = స్వీకరించి; ఋషేః = విభండకమహర్షి వలన; భీతాశ్చ = భయముపడినవారునై; శీఘ్రం = శీఘ్రముగా; గమనాయ = పోవుటకు; మతిం = తలంపును; దధుః = ధరించిరి.

ఆ వేశ్య లందఱును, మిగులను త్సాహముతో నా ఋశ్యశృంగుండు సేయుపూజం బ్రతిగ్రహించి, విభండకమహర్షి దీని నెఱింగినఁ గోపించి శపించునని భయ మొంది, "యిచ్చట దడవు సేయరాదు, శీఘ్రముగా వేళ్ల వలయు" నని నిశ్చయించిరి. అని తాత్పర్యము.

అస్మాక మపి ముఖ్యాని ఫలా నీమాని వై ద్విజ
గృహాణ ప్రతి భద్రం తే భక్షయస్వ చ మాచిరమ్. ౧౯

టీక॥ ద్విజ = బ్రాహ్మణుఁడా! అస్మాకం = మాయొక్క; ముఖ్యాని = శ్రేష్ఠములగు; ఇమాని = ఈ ("వై" అనునది పాదపూరణార్థము); ఫలాన్యపి = పండ్లను; ప్రతిగృహాణ = స్వీకరించుము. తే = నీకు; భద్రం = మంగళము; అస్తు (అధ్యాహృతము) = అగుఁగాక; భక్షయస్వచ = తిని వేయుము. చిరం = విళంబనము; మా (కురు) = చేయకుము.

అన్నిటఁ శ్రేష్ఠములైన యీ మా ఫలములనుం బుచ్చుకొనుము; దీననీకు మంగళమొదవు; ఆలస్యముసేయక, వీటిని, భక్షింపుము. అని తాత్పర్యము.

తత స్తా స్తం సమాలింగ్య సర్వా హర్షసమన్వితాః
మోదకాన్ ప్రదదు స్తస్మై భక్ష్యాంశ్చ వివిధాన్ బహూన్. ౨౦

టీక॥ తతః = ఆపిమ్మట; తాః = ఆ వేశ్యలు; సర్వాః = అందఱును; హర్షసమన్వితాః = సంతోషముతోఁ గూడుకొనినవారలై; తం = ఆ ఋశ్యశృంగుని; సమాలింగ్య = చక్కఁగాఁ గౌఁగిలించికొని; తస్మై = ఆ




ఋశ్య శృంగుని కొఱకు; మోదకాన్=కుడుములను; వివిధాన్=నానావిధము లయినవి యును; బహూన్=అనేకములయినవియును; భక్ష్యాంశ్చ=ఇతరములైనపిండివంటలను;ప్రదదుః=ఇచ్చిరి.

అంతట, నావేశ్యలందఱును,సంతోషముతో నాఋశ్యశృంగుని కౌఁగిలించికొని,యతనికిఁగుడుములను,మఱియు, ననేకములయిన నానావిధభక్ష్యములను,నొసంగిరి.

అని తాత్పర్యము.

తాని చాస్వాద్య తేజస్వీ ఫలానీతి స్మమన్యతే
అనాస్వాదిత పూర్వాణి వనే నిత్య నివాసినామ్. ౨౧

టీక॥ తేజస్వీ=బ్రహ్మతేజము గల ఋశ్యశృంగుఁడు; తాని=ఆభక్ష్యములను;ఆస్వాద్యచ= భక్షించియు;ఇమాని (అధ్యాహృతము)=ఇవి;వనే=అడవియందు; నిత్యనివాసినాం=ఎల్లప్పుడును వసించియుండువారికి (వసించి యుండు వారిచేతననుట, తృతీయార్థమందుషష్ఠి);అనాస్వాదితపూర్వాణి=మున్నుభక్షింపఁబడనట్టి; ఫలాని=పండ్లు;ఇతి,అని;మన్యతేస్మ,తలంచెను.

తపస్సునందేదృష్టిగల, ఆఋశ్యశృంగుఁడు, వారిచ్చినభక్ష్యంబులమెసవియు,నవిభక్ష్యములని తెలిసికొనంజాలక, "ఇవి,యెల్లప్పుడునడవియందు వాసము సేయు, మముబోఁటివారలిదివఱకుంజవిచూడనిఫలములు" అనితలంచెను.

అని తాత్పర్యము

ఆపృచ్ఛ్య చ తదా విప్రం వ్రతచర్యాం నివేద్య చ
గచ్ఛంతి స్మా పదేశా త్తా భీతా స్తస్య పితు స్స్త్రియః. ౨౨

టీక॥తదా=అప్పుడు; తాః=ఆః స్త్రియః=వెలయాండ్రు; తస్య=ఆఋశ్యశృంగునియొక్క; పితుః=తండ్రియైనవిభండకునివలన; భీతాః=వెఱచినవారలై=విప్రం=బ్రాహ్మణుఁడైన ఋశ్యశృంగుని;




ఆపృచ్ఛ్యచ=వీడుకొనియు; వ్రతచర్యాం = వ్రతానుష్ఠానమును; నివేద్యచ=చెప్పియు; అపదేశాత్ = వ్యాజమువలన; గచ్ఛంతిస్మ=వెళ్లిరి.

అప్పుడా వేశ్యలు, "విభాండకునకుం దెలిసినచో నపాయముగలుగు" నని భయమునొంది, ఋశ్యశృంగుని వీడుకొలిపి, "యింక వ్రతానుష్ఠానమునకుఁ బోవలయు" నని యొక సాకు సెప్పి వెళ్లిరి అని తాత్పర్యము.

గతాసు తాసు సర్వాసు కాశ్యపస్యాత్మజో ద్విజః
అస్వస్థహృదయ శ్చాసీ ద్దుఃఖా త్స్మ పరివర్తతే. ౨౩

టీక॥ తాసు=ఆవేశ్యలు; సర్వాసు=అందఱు; గతాసు=వెళ్లఁగా; కాశ్యపస్య= కశ్యపునికొడుకైనవిభండకునియొక్క; ఆత్మజః = కొడుకైన; ద్విజః=బ్రాహ్మణుఁడగు ఋశ్యశృంగుఁడు; అస్వస్థహృదయశ్చ, అస్వస్థ = కలంతవడిన, హృదయశ్చ= మనసుగలవాఁడుగాను; ఆసీత్ = ఆయెను. దుఃఖాత్ =దుఃఖమువలన; పరివర్తతేస్మ=తిరుగుచుండెను.

ఆవేశ్యలందఱును వెళ్లినవెనుక, విభండకసుతుండగు నాఋశ్యశృంగుఁడు, మనస్సున స్వాస్థ్యము లేక, దుఃఖంబున, నిట్టట్టు, తిరుగుచుండెను. అని తాత్పర్యము.

తతోఽపరేద్యు స్తందేశ మాజగామ స వీర్యవాన్
మనోజ్ఞా యత్ర తా దృష్టా రూపవత్య స్స్వలంకృతాః. ౨౪

టీక॥ తతః=ఆపిమ్మట; అపరేద్యుః=మఱుసటినాఁడు; వీర్యవాన్=నియతమైనబ్రహ్మచర్యముగల; సః=ఆ ఋశ్యశృంగుఁడు; యత్ర=ఎచ్చట; మనోజ్ఞాః = మనోహరలును; రూపవత్యః= మంచి రూపముగలవారును; స్వలంకృతాః=మంచియలంకారముతోఁ గూడినవారునగు; తాః=ఆ; వారముఖ్యాః= మేటిదైన వేశ్యలు; దృష్టాః=చూడఁబడిరో; తం=ఆ; దేశం=స్థలమును; ఆజగామ=పొందెను.




అంతనామునిసటినాఁడు, నియతబ్రహ్మచర్యుఁడైనఋష్యశృంగుఁడు, తాను, మున్ను, మనోహరంబగు రూపముగలిగిమంచియలంకారంబులతోఁ వెలుంగుచున్నయావేశ్యలం జూచినప్రదేశమునకు, వచ్చెను.

అని తాత్పర్యము.

దృష్ట్వైవ తా స్తదా విప్ర మాయాంతం హృష్టమానసాః
ఉపసృత్య తత స్సర్వా స్తా స్తమూచు రిదం వచః. ౨౫

టీక॥ తదా=అప్పుడు; తాః=ఆవేశ్యలు; ఆయాంతం = వచ్చుచున్న; విప్రం=బ్రాహ్మణుఁడైన ఋష్యశృంగుని; దృష్ట్వైవ = చూచినంతనే; హృష్టమానసాః= సంతోషించినమనస్సుగలవారలై; తతః= ఆపిమ్మట; తాః = ఆవేశ్యలు; సర్వాః=అందఱును; తం=ఆఋష్యశృంగుని; ఉపసృత్య=దగ్గఱి; ఇదం= ఈ, వక్ష్యమాణమగు, వచః=వాక్యమును; ఊచుః=పలికిరి.

ఆఋష్యశృంగుండు తమయొద్దికే తెంచుటను జూచినంతనే, సంతసించి, యతని, దగ్గఱి, యిట్లనిపలికిరి. అని తాత్పర్యము.

ఏహ్యాశ్రమపదం సౌమ్య హ్యాస్మాక మితి చాబ్రువన్
తత్రాప్యేష విధి శ్శ్రీమాన్ విశేషేణ భవిష్యతి. ౨౬

టీక॥సౌమ్య= శాంతుఁడా! అస్మాకం = మాయొక్క; ఆశ్రమపదం = ఆశ్రమస్థానమునుగూర్చి; ఏహిహి=వచ్చెదవుగదా (అని "పలికిరి" అను పూర్వశ్లోకక్రియతో నన్వయము) తత్రాపి = అచ్చటను; శ్రీమాన్=శ్రేష్ఠమైన; ఏషః= ఈ; విధిః = అతిథిసత్కారము; విశేషేణ=అతిశయముచే; భవిష్యతి=కాఁగలదు. ఇతిచ = అనియును; అబ్రువన్=చెప్పిరి.

"సౌమ్యుఁడా! మాయాశ్రమమునకు, నీవు రావలయు; నచ్చట, స్వదేశమగుట వలన, నీకుఁ, జక్కగాస

త్కారము సేయఁగలము; అనివచించిరి. అని తాత్పర్యము.

శ్రుత్వాతు వచనం తాసాం సర్వాసాం హృదయంగమమ్
గమనాయ మతిం చక్రే తంచ నిన్యు స్తదా స్త్రియః. ౨౭

టీక॥ తాసాం = ఆ; సర్వాసాం = వేశ్యలందఱియొక్కయు; హృదయంగమం = మనోహరమయిన; వచనం= మాటను; శ్రుత్వాతు=వినినంతనే; సః (అధ్యాహృతము)=ఆఋశ్యశృంగుఁడు; గమనాయ=పోవుటకు; మతిం=బుద్ధిని; చక్రే=చేసెను. తదా=అప్పుడు; స్త్రియశ్చ=వెలయాండ్రును; తం= ఆ ఋశ్యశృంగుని; నిన్యుః=తీసికొనివెళ్లిరి.

ఆవేశ్యలందఱును జెప్పిన మనోహరమైనమాటనువిని, యీఋశ్యశృంగుఁడు, వారలవెంబడించుటకిచ్చగించెను, అంత, వారలతనిందోడుకొని వెళ్లిరి. అని తాత్పర్యము.

తత్ర చానీయ మానేతు విప్రే తస్మిన్ మహాత్మని
వవర్ష సహసా దేవో జగత్ప్రహ్లా దయం స్తదా. ౨౮

టీక॥ తత్రచ=ఆయంగదేశమందును; మహాత్మని=పూజ్యమైనస్వభావముగల; తస్మిన్ = ఆ; విప్రే= బ్రాహ్మణుఁడైనఋశ్యశృంగుఁడు; ఆనీయమానేతు =తీసికొనిరాఁబడుచుండఁగానే; తదా= అప్పుడు; సహసా=శీఘ్రముగా; దేవః = వర్షాధిష్ఠాన దైవతమైన పర్జన్యుఁడు; జగత్ =ప్రపంచమును; ప్రహ్లాదయన్ = సంతోషింపఁజేయుచు, వవర్ష=వర్షించెను.

అంగదేశమందును, మహాత్ముండగు నాఋశ్యశృంగుఁడు ప్రవేశించినంతనే, శీఘ్రముగా, ప్రపంచమునంతయు, సంతోషము గలుగునట్లువర్షము గురిసెను. అని తాత్పర్యము.

వర్షేణైవాగతం విప్రం విషయం స్వం నరాధిపః
ప్రత్యుద్గమ్య మునిం ప్రహ్వ శ్శిరసాచ మహీం గతః. ౨౯

టీక॥నరాధిపః=మనుష్యులకుఁ బ్రభువైన రోమపాదుఁడు; ప్రహ్వః=వినయముచేవంగినవాఁడై; వర్షేణైవ = వర్షముతోనే; స్వం= తనదైన;విషయం= దేశమునుగూర్చి; ఆగతం = వచ్చిన;విప్రం =బ్రాహ్మణుఁడగు;మునిం= ఋశ్యశృంగ మహామునిని; ప్రత్యుద్గమ్య=ఎదుర్కొని,శిరసా = తలచేత;మహీం=భూమిని;గతశ్చ = పొందినవాఁడునాయెను.

రోమపాదుండు, వర్షముతోఁగూడఁదనదేశమునకే తెంచినమహాబ్రాహ్మణుండగు నాఋశ్యశృంగమహర్షిని,వినయనమ్రుండై, యెదుర్కొని,సాష్టాంగముగ, నభివందించెను.అని తాత్పర్యము.

అర్ఘ్యంచప్రదదౌ తస్మై న్యాయత స్సు సమాహితః
వవ్రే ప్రసాదం విప్రేంద్రా న్మావిప్రం మన్యు రావిశత్. ౩౦

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరోమ పాదుఁడు; సుసమాహితః =మనస్సమాధానముగలవాఁడై;తస్మై= ఆఋశ్యశృంగునికొఱకు;అర్ఘ్యంచ= అర్ఘ్యమును(చకారమువలన) పాద్యమును; న్యాయతః=శాస్త్రక్రమంబువలన; ప్రదదౌ= ఇచ్చెను. విప్రేంద్రాత్ =బ్రాహ్మణశ్రేష్ఠుఁడగుఋశ్యశృంగునివలన;ప్రసాదం=అనుగ్రహమును; వవ్రే=యాచించెను.విప్రం= బ్రాహ్మణుఁడగు ఋశ్యశృంగుని; మన్యుః=కోపము,మావిశత్ =పొందలేదు.

ఆరోమపాదుఁడు, నిర్మలమయినహృదయముగలవాఁడై, యాఋశ్యశృంగున కర్ఘ్య పాద్యంబుల,శాస్త్రక్రమంబున, నొసంగి,అనుగ్రహింపవలయునని, వేఁడెను.ఆఋశ్యశృంగుఁడును, అతనిప్రార్థన నంగీకరించి,యతండు మోసంబునందన్నుఁగొని తెచ్చుటకుఁ,గోపగింపలేదు,అని తాత్పర్యము.

అర్థాంతరము.— పూర్వార్ధముసమానార్థకము.సః = ఆరోమపాదుఁడు;విప్రేంద్రాత్ =బ్రాహ్మ

"మిమ్ములందోడితెచ్చినందున, మీతండ్రియగు విభండకమహర్షి నామీఁదఁ గోపమునొందకుండునట్లను గ్రహింపు" మనియురోమపాదుండాబుుశ్యశృంగునిం, బ్రార్థించెను, అనితాత్పర్యము.

ణ=శ్రేష్ఠుఁడగుబుుశ్యశృంగునివలన;వి ప్రం=బ్రాహ్మణుఁడైనవిభాండకుని; మన్యుః=కోపము;మావిశత్(లకారవ్యత్యయంబార్షము)=పొందకుండెడుఁగాక, ఇతి (అధ్యాహృతము)=అని; ప్రసాదం=అనుగ్రహమును;వవ్రే=యాచించెను.

అంతఃపురం ప్రవిశ్యాస్మై కన్యాం దత్వా యథావిధి
శాంతాం శాంతేన మనసా రాజా హర్ష మవాప సః. ౩౧

టీక॥సః=ఆరోమపాదమహారాజు; తేనసహ(అధ్యాహృతము)=ఆబుుశ్యశృంగునితోఁగూడ; అంతఃపురం=అంతఃపురమును;ప్రవిశ్య=చొచ్చి;శాంతేన = దుఃఖములేనందున,శాంతమైన;మనసా = హృదయముతో; యుక్తః(అధ్యాహృతము)=కూడుకొనినవాఁడై;అస్మై=ఈ బుుశ్య శృంగుని కొఱకు; కన్యాం = తనకూఁతురైన; శాంతాం=శాంతను; యథావిధి=యథాశాస్త్రముగ; దత్వా= ఇచ్చి; హర్షం= సంతోషమును;అవాప=పొందెను.

రోమపాద మహారాజాబుుశ్యశృంగు, నంతి పురికిం గొనిపోయి, శాంతమనస్కుండై, యతనికిం దన కూఁతురైన శాంతను, యథాశాస్త్రంబుగనొసంగి, సంతోషంబు,నొందెను. అనితాత్పర్యము.

ఏవం స న్యవస త్తత్ర సర్వకామై స్సుపూజితః

టీక॥ ఏవం = ఈప్రకారము; సః=ఆబుుశ్యశృంగుఁడు; సర్వకామైః=ఎల్లకోర్కెలచేతను; సుపూజితః=చక్కఁగాఁబూజింపఁబడినవాఁడై; తత్ర = ఆయంతఃపురమునందు;న్యవసత్=ఉండెను.

ఆబుుశ్యశృంగుఁడాప్రకారము శాంతను వివాహంబై, రోమపా

దుండుతనకోర్కెలన్నియుం దీర్చుచుఁగొలుచుచుండ, నాయంతః పురంబునందుండెను.

అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, దశమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, బాలకాండ దశమసర్గ టీక,

ముగిసినది.

---

శ్రీః

## ఏ కా ద శ స ర్గ ప్రా రం భః.

భూయఏవ హి రాజేంద్ర శృణు మే వచనం హితమ్
యథా స దేవప్రవరః కథాయా మేవ మబ్రవీత్. ౧

టీక॥ రాజేంద్ర=రాజశ్రేష్ఠుఁడైన, దశరథుఁడా; భూయఏవ= ఇంకను; యథా=ఎట్లు; సః=ఆ; దేవప్రవరః= దేవతలలోశ్రేష్ఠుఁడైన సనత్కుమారుఁడు; కథాయాం= కథయందు; ఏవం=ఈప్రకారము; అబ్రవీత్ = చెప్పెనో; తథా= అట్లు; మే = నాయొక్క హితం=మేలుగలిగించునట్టి; వచనం = వాక్యము, శృణు=వినుము.

దశరథుఁడా! ఇంకనాసనత్కుమారుండు చెప్పినట్లుసెప్పెద; నామాట వినుము. అని తాత్పర్యము.

ఇక్ష్వాకూణాం కులే జాతో భవిష్యతి సుధార్మికః
నామ్నా దశరథో నామ శ్రీమా న్సత్యప్రతిశ్రవః. ౨

టీక॥శ్రీమాన్ = కాంతిగలవాఁడును; సత్యప్రతిశ్రవః = సత్యమైన ప్రతిజ్ఞ గలవాఁడును; నామ్నా = పేరుచేత; దశరథోనామ = దశరథుండని ప్రసిద్ధుఁడైనవాఁడునగు; సుధార్మికః = చక్కగా ధర్మమునాచరించునొకఁడు; ఇక్ష్వాకూణాం = ఇక్ష్వాకువంశపురాజులయొక్క; కులే = వంశమునందు; జాతః = పుట్టినవాఁడుగా; భవిష్యతి, కాఁగలఁడు.

శ్రీమంతుండును సత్యప్రతిజ్ఞుండునగుదశరథుండనియెడునొకధార్మికుం, డిక్ష్వాకువంశమునం బుట్టఁగలఁడు. అని తాత్పర్యము.

అంగరాజేన సఖ్యంచ తస్య రాజ్ఞో భవిష్యతి

టీక॥తస్య = ఆ; రాజ్ఞః = దశరథమహారాజునకు; అంగరాజేన = అంగదేశపురాజుతో; సఖ్యంచ = చెలిమియును; భవిష్యతి = కాఁగలదు.

ఆదశరథునకు నంగదేశ ప్రభువునకునుం జెలిమిగలుగును. అని తాత్పర్యము.

కన్యా చాస్య మహాభాగా శాంతా నామ భవిష్యతి. ౩
పుత్రస్తు సోఽంగరాజస్య రోమపాద ఇతి శ్రుతః
తం స రాజా దశరథో గమిష్యతి మహాయశాః. ౪

టీక॥అంగరాజస్యతు = అంగదేశ ప్రభువునకును; రోమపాదఇతి = రోమపాదుఁడని; శ్రుతః = ప్రసిద్ధుఁడైన; సః = ఆ; పుత్రః = కొడుకు; భవిష్యతి = కాఁగలఁడు. అస్య = ఈరోమపాదునకు; మహాభాగా = పూజ్యమైనభాగ్యముగల; శాంతా నామ = శాంతయనెడు; కన్యాచ = కూఁతురును; భవిష్యతి (అధ్యాహృతము) = కాఁగలదు. మహాయశాః = గొప్పకీర్తిగల; సః = ఆ, దశరథః = దశరథుఁడనెడు; రాజా = రాజు; తం = ఆరోమపాదునింగూర్చి; గమిష్యతి = పోఁగలడు.

ఆయంగరాజునకు, రోమపాదుండనెడు ప్రసిద్ధుఁడైన కుమారుఁడు, పుట్టఁగలఁడు; ఆరోమపాదునకు శాంతయనెడు, మహాభాగ్యవతి

యగు, నొకకూఁతురుజనింపఁగల దు; ఆరోమపాదునియొద్దకు దశరథుండు,పోఁగలఁడు. అని తాత్పర్యము.

అనపత్యోఽస్మి ధర్మాత్మన్ శాంతాభర్తా మమ క్రతుమ్
ఆహరేత త్వయాఽఽజ్ఞప్త స్సంతానార్థం కులస్యచ. ౫

టీక॥ ధర్మాత్మన్=ధర్మస్వభావుఁడైనరోమపాదుఁడా;అహం(అధ్యాహృతము) = నేను; అనపత్యః = బిడ్డలులేనివాఁడుగా; అస్మి = అగుచున్నాను. శాంతాభర్తా = శాంతకుఁబెనిమిటియైన ఋష్యశృంగుఁడు;త్వయా = నీచేత;ఆజ్ఞప్తః= ఆజ్ఞాపింపఁబడినవాఁడై;మమ = నాయొక్క;క్రతుం= యాగమును;కులస్య=వంశమునకు; సంతానార్థంచ = సంతతియుంగలుగటకై;ఆహరేత= నిర్వహించును.

"ధర్మాత్ముఁడవైన, రోమపాదుఁడా! నాకుసంతానములేకయున్నది;నీవాజ్ఞాపించినబైన,శాంతాపతియైన ఋశ్యశృంగుండు, వంశమునకు సంతానముగలుగునట్లుగ, నాయజ్ఞమునుజక్కఁగా నెఱవేర్చును." అని,దశరథుఁడురోమపాదునడుగంగలఁడు.అనితాత్పర్యము.

శ్రుత్వా రాజ్ఞోఽథ తద్వాక్యం మనసా స విచింత్యచ
ప్రదాస్యతే పుత్రవంతం శాంతాభర్తార మాత్మవాన్. ౬

టీక॥ఆత్మవాన్= బుద్ధిశాలియగు;సః = ఆరోమపాదుఁడు;రాజ్ఞః=దశరథమహారాజుయొక్క;తత్ =ఆ;వాక్యం = మాటను;శ్రుత్వా=విని;అథ=అటుపిమ్మట;మనసా=మనస్సుచేత,విచింత్యచ = ఆలోచించియు;పుత్రవంతం=కొడుకులుగల(తాను;దేని, సంపాదించికొనలేఁడో,దాని నితరులకిచ్చుటకెట్లుసమర్థుఁడగును? తనకే కొడుకులు లేకయుండునప్పుడు, ఇతరులకుఁ గొడుకులుగల్గించుట తనచేఁ




టీక॥శ్రీమాన్=కాంతిగలవాఁడును; సత్యప్రతిశ్రవః = సత్యమైంప్రతిజ్ఞగలవాఁడును; నామ్నా=పేరుచేత; దశరథోనామ= దశరథుండని ప్రసిద్ధుఁడైనవాఁడునగు; సుధార్మికః= చక్కఁగాధర్మమునాచరించునొకఁడు; ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశపురాజులయొక్క; కులే=వంశమునందు; జాతః= పుట్టినవాఁడుగా; భవిష్యతి, కాఁగలఁడు.

శ్రీమంతుండును సత్యప్రతిజ్ఞుండునగుదశరథుండనియెడునొకధార్మికుం, డిక్ష్వాకువంశమునం బుట్టఁగలఁడు. అని తాత్పర్యము.

అంగరాజేన సఖ్యంచ తస్య రాజ్ఞో భవిష్యతి

టీక॥తస్య=ఆ; రాజ్ఞః= దశరథమహారాజునకు; అంగరాజేన = అంగదేశపురాజుతో; సఖ్యంచ= చెలిమియును; భవిష్యతి= కాఁగలదు.

ఆదశరథునకు నంగదేశ ప్రభువునకునుం జెలిమిగలుగును. అని తాత్పర్యము.

కన్యా చాస్య మహాభాగా శాంతా నామ భవిష్యతి. ౩
పుత్రస్తు సోఽంగరాజస్య రోమపాద ఇతి శ్రుతిః
తం స రాజా దశరథో గమిష్యతి మహాయశాః. ౪

టీక॥అంగరాజస్యతు= అంగదేశ ప్రభువునకును; రోమపాదఇతి=రోమపాదుఁడని; శ్రుతః=ప్రసిద్ధుఁడైన; సః=ఆ; పుత్రః = కొడుకు; భవిష్యతి=కాఁగలఁడు. అస్య= ఈరోమపాదునకు; మహాభాగా= పూజ్యమైనభాగ్యముగల; శాంతా నామ= శాంతయనెడు; కన్యాచ= కూఁతురును; భవిష్యతి (అధ్యాహృతము) = కాఁగలదు. మహాయశాః=గొప్పకీర్తిగల; సః= ఆ, దశరథః = దశరథుఁడనెడు; రాజా= రాజు; తం= ఆరోమపాదునింగూర్చి; గమిష్యతి=పోఁగలడు.

ఆయంగరాజునకు, రోమపాదుండనెడుప్రసిద్ధుఁడైన కుమారుఁడు, పుట్టఁగలఁడు; ఆరోమపాదునకుశాంతయనెడు, మహాభాగ్యవతి




శ్వరః=మనుష్యులకుఁబ్రభువునగు; దశరథశ్చ=దశరథుఁడును; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; ద్విజశ్రేష్ఠం=బ్రాహ్మణశ్రేష్ఠుఁడైన; తం=ఆ; ఋశ్యశృంగం=ఋశ్యశృంగుని; యజ్ఞార్థం=యాగము కొఱకును; ప్రసవార్థం చ=సంతానముకొఱకును; స్వర్గార్థంచ=స్వర్గముకొఱకును; వరయిష్యతి=ప్రార్థింపఁగలఁడు. సః=ఆ; విశాంపతిః=మనుష్యులకుఁ ప్రభువైనదశరథుఁడు; తం = ఆ; కామంచ=కామ్యయాగమును; ద్విజముఖ్యాత్ =బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు ఋశ్యశృంగునివలనః; లభతే(భవిష్యదర్థమందులట్)=పొందఁగలఁడు.

ఆదశరథమహారాజును, యజ్ఞము సేయఁదలంచి, మోడుపుఁజేయిదాల్చి, బ్రాహ్మణశ్రేష్ఠుండగు నా ఋశ్యశృంగునిఁ, దనకుయాగమును జేయించుటకును, దాన, సంతానముగలిగించుటకును, దాన, స్వర్గముప్రాప్తించునట్లుసేయుటకునుం, బ్రార్థింపఁగలడు. ఆఋశ్యశృంగుఁడును, దశరథుని ప్రార్థన నంగీకరించి, యాకామ్య యాగమును జేయించును.

అని తాత్పర్యము

పుత్రాశ్చాస్య భవిష్యంతి చత్వారోఽ మితవిక్రమాః
వంశప్రతిష్ఠానకరా స్సర్వలోకేషు విశ్రుతాః. ౧౦

టీక ॥ అస్య=ఈదశరథమహారాజునకు; అమితవిక్రమాః, అమిత=కొలందిలేని, విక్రమాః=పరాక్రమముగలవారును; వంశప్రతిష్ఠానకరాః, వంశ=కులముయొక్క-(కులమును), ప్రతిష్ఠాన= శాశ్వతముగానిలుపుటను, కరాః=చేయువారును; సర్వలోకేషు=సమస్తలోకములయందును; విశ్రుతాః=ప్రసిద్ధులనగు; చత్వారః=నలువురు; పుత్రాశ్చ= కొడుకులును; భవిష్యంతి=కాఁగలరు

దశరథమహారాజునకుఁ, గొలందిలేనిపరాక్రమముగలిగి, యాచంద్రార్కముగవంశమును వృద్ధిఁబొందించుచు, సమస్తలోకంబులందునుంబ్రసిద్ధులై, వెలుంగు, కొడుకులునలువురు, జనింపంగలరని తాత్పర్యము.

ఏవం స దేవ ప్రవరః పూర్వం కథితవాన్ కథామ్
సనత్కుమారో భగవాన్ పురా దేవ యుగే ప్రభుః. ౧౧

టీక॥ దేవ = దశరథమహారాజా ! ఏవం=ఈప్రకారము; దేవ ప్రవరః=దేవతలలో శ్రేష్ఠుఁడును; భగవాన్=మహాత్మ్యము గలవాఁడును; ప్రభుః=సమర్థుఁడునగు; సః=ఆ; సనత్కుమారః = సనత్కుమారుఁడు; పూర్వం=మునుపు; పురా=మునుపటి; యుగే=యుగమునందు (అనఁగా, కృతయుగమందనుట); కథాం=కథను; కథితవాన్=చెప్పెను.

దేవశ్రేష్ఠుండును మాహాత్మ్యముగలవాఁడును సమర్థుండునగు నాసనత్కుమారుండు, మునుపుకృతయుగమునం, దీప్రకారము కథ చెప్పెను.

అని తాత్పర్యము.

స త్వం పురుషశార్దూల త మానయ సుసత్కృతమ్
స్వయమేవ మహారాజ గత్వా సబలవాహనః. ౧౨

టీక॥ పురుషశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవైన; మహారాజ = దశరథమహారాజా; సః=ఆ; పుత్రార్థివైన; త్వం=నీవు; సబలవాహనః=సైన్యములతోను వాహనములతోను గూడికొనినవాఁడవై; స్వయమేవ= నీవే; గత్వా=పోయి; తం=ఆఋశ్యశృంగుని; సుసత్కృతం=మంచిసత్కారముగలుగునట్లు; ఆనయ=తోడితెమ్ము.

పురుషశ్రేష్ఠుఁడవైనదశరథుఁడా! నీవుపుత్రార్థివికావున,నీవే,సైన్యవాహనములతోనచ్చోటికివెళ్లి,గొప్పసత్కారముసేసి, యాఋశ్యశృంగునిందోడ్కొనిరమ్ము;అని, సుమంత్రుఁడు, దశరథునకుఁ, జెప్పెను.

అని తాత్పర్యము.

అనుమాన్య వసిష్ఠంచ సూతవాక్యం నిశమ్యచ
సాంతఃపుర స్సహామాత్యః ప్రయయౌ యత్ర స ద్విజః. ౧౩

 

టీక॥ సః(అధ్యాహృతము)= ఆ దశరథ మహారాజు; సూతవాక్యం=సారధియైనసుమంత్రునిమాటను; నిశమ్యచ=వినియు; వసిష్ఠం=వసిష్ఠమహర్షిని; అనుమాన్యచ=ఒప్పించియున్న; సాంతఃపురః=అంతపురమువారితోఁగూడుకొనినవాఁడై; సహామాత్యః = మంత్రులతోఁగూడినవాఁడై; సః=ఆ; ద్విజః=బ్రాహ్మణుఁడైన ఋశ్యశృంగుఁడు; యత్ర=ఎచ్చట; వర్తతే (అధ్యాహృతము) ఉన్నాఁడో; తత్ర (అధ్యా)= అచ్చటికి; ప్రయయౌ= పోయెను.

ఆదశరథుండు, సుమంత్రునిమాటవిని, వసిష్ఠునకుం దెలిపి, వారియనుజ్ఞనొంది, యంతఃపురస్త్రీలనుం దోడ్కొని, మంత్రి సహితుండై, యా ఋశ్యశృంగుండున్న రోమపాదునిపట్టణమునకుం బోయెను.

అని తాత్పర్యము.

వనాని సరితశ్చైవ వ్యతిక్రమ్య శనైశ్శనైః
అభిచక్రామ తం దేశం యత్ర వై మునిపుంగవః. ౧౪

టీక॥ సః (అధ్యాహృతము)= ఆదశరథుండు; వనాని=అడవులను; సరితశ్చైవ= నదులను; శనైశ్శనైః=మెల్లమెల్లగా; అతిక్రమ్య= దాఁటి; యత్ర=ఎచ్చట; ("వై" అనునది పాదపూరణార్థము); మునిపుంగవః=మునిశ్రేష్ఠుఁడు; వర్తతే (అధ్యాహృతము)= ఉన్నాఁడో; తం=ఆ; దేశం= దేశమును; అభిచక్రామ=ప్రవేశించెను.

ఆదశరథమహారాజు, అడవులనునదులనుం జూచుచు మెల్లమెల్లగా దాఁటి, ఆఋశ్యశృంగుఁడున్న దేశమును బ్రవేశించెను.

అని తాత్పర్యము.

ఆసాద్య తం ద్విజశ్రేష్ఠం రోమపాదసమీపగమ్
ఋషిపుత్రం దదర్శాదౌ దీప్యమాన మివానలమ్. ౧౫

టీక॥ సః(అధ్యాహృతము)= ఆదశరథుఁడు; ఆసాద్య = ప్రవేశించి; ద్విజశ్రేష్ఠం= బ్రాహ్మణశ్రేష్ఠుడును; రోమపాదసమీపగం, రోమ

 

పాద=రోమపాదునియొక్క, సమీప=సమీపమును, గం=పొందినవాఁడును; దీప్యమానం=మండుచున్న; అనలమివ(స్థితం)= అగ్నిహోత్రముపలెనుండువాఁడునగు; తం= ఆ; ఋషిపుత్రం= ఋషికుమారుఁడైన ఋశ్యశృంగుని; ఆదౌ=మొదట; దదర్శ=చూచెను.

ఆదశరథుండంగదేశముఁబ్రవేశించి, మండెడునగ్నిహోత్రముంబోలెఁబ్రకాశించుచు రోమపాదునిసమీపంబునఁగూర్చుండియున్నబ్రాహ్మణశ్రేష్ఠుండగు నాఋశ్యశృంగుని, మొదటఁ జూచెను.

అని తాత్పర్యము.

తతో రాజా యథాన్యాయం పూజాం చక్రే విశేషతః
సఖిత్వా త్తస్య వై రాజ్ఞః ప్రహృష్టేనాం తరాత్మనా. ౧౬

టీక॥ తతః = ఆపిమ్మట; రాజా = రోమపాదమహారాజు; సఖిత్వాత్=మిత్రుఁడగటవలన; ప్రహృష్టేన=మిక్కిలిసంతసించిన; అంతరాత్మనా= అంతకపిరణముతో; తస్య=ఆ(“వై”అనునది, పాదపూరణార్థము); రాజ్ఞః, దశరథమహారాజునకు; యథాన్యాయం=యథాశాస్త్రముగ; విశేషతః=అధికముగా; పూజాం=పూజను; చక్రే=చేసెను.

ఆపిమ్మట, రోమపాదుండు, తనమిత్రుఁడు వచ్చినందున, మిక్కిలి సంతసమంది, యాదశరథమహారాజునకు, న్యాయప్రకార మధికముగాఁ, బూజచేసెను.

అని తాత్పర్యము.

రోమపాదేన చాఖ్యాత మృషిపుత్రాయ ధీమతే
సఖ్యం సంబంధకం చైవ తదా తం ప్రత్యపూజయత్. ౧౭

టీక॥ రోమపాదేనచ= రోమపాదునిచేతను; ధీమతే = బుద్ధిమంతుఁడగు; ఋషిపుత్రాయ=ఋషికొమరుఁడైనఋశ్యశృంగునకొఱకు; సఖ్యం=స్నేహమును; సంబంధకం చైవ = శాంతదశరథునకుఁబుట్టినకొ

మార్తయగుట వలనం గలిగినసంబంధమును; ఆఖ్యాతం=చెప్పఁబడినది. తదా, అప్పుడు; సః(అధ్యా)=ఆ ఋశ్యశృంగుఁడు; తం=ఆదశరధుని; ప్రత్యపూజయత్=పూజించెను.

రోమపాదుఁడు, బుద్ధిశాలియగు నాఋశ్యశృంగునకు, "ఈదశరధమహారాజు, నాకుంజాల స్నేహితుండు; ఇతండు, నీభార్యయగు శాంతకు, జనకపిత; నీకునుమామయగు" నని చెప్పెను; అంతనాఋశ్యశృంగుండుదన మామయగుదశరధునింబూజించెను.

అని తాత్పర్యము.

ఏవం సుసత్కృత స్తేన సహోషిత్వా నరర్షభః
సప్తాష్ట దివసాన్ రాజా రాజాన మిద మబ్రవీత్. ౧౮

టీక॥ నరర్షభః= మనుష్యశ్రేష్ఠుండగు; రాజా=దశరధమహారాజు; ఏవం=ఈప్రకారము; సుసత్కృతః= చక్కఁగాఁ బూజింపఁబడినవాఁడై; తేనసహ=ఆరోమపాదునితోఁగూడ; సప్తాష్టదివసాన్=ఏడెనిమిదిదినములను; ఉషిత్వా=ఉండి; రాజానం= రోమపాదమహారాజునుగూర్చి; ఇదం= దీనిని(వక్ష్యమాణవాక్యమును); అబ్రవీత్ =పలికెను.

పురుషశ్రేష్ఠుండగు నాదశరధమహారాజు, ఈప్రకారముచక్కఁగాఁ బూజనొంది, యారోమపాదునితోఁగూడనచ్చట, నేడెనిమిదిదినములుండి, యంత, వానితోఁ, నిట్లని, చెప్పెను.

అని తాత్పర్యము.

శాంతా తవ సుతా రాజన్ సహ భర్త్రా విశాంపతే
మదీయనగరం యాతు కార్యం హి మహ దుద్యతమ్. ౧౯

టీక॥ విశాంపతే=మనుష్యులకుఁ బ్రభుఁడవైన; రాజన్=రోమపాదమహారాజా; తవ = నీయొక్క; సుతా = కొమార్తయగు; శాంతా= శాంత; భర్త్రాసహ = పెనిమిటితోఁగూడ; మదీయనగరం= నాదైనపట్టణమును; యాతు =పొందునుగాక; మహత్=గొప్పదైన; కార్యం=పని; ఉద్యతంహి= సంభవించినదిగదా.

మనుష్యులకందఱకును బ్రభుఁడవైనరోమపాదుఁడా! నీకొమార్తె యగుశాంత, పెనిమిటితోఁగూడ, నాపట్టణమునకు రావలయును; గాప్ప కార్యమొకటిసంభవించియున్నది. అనిదశరథుఁడు, రోమపాదునితోఁజెప్పెను.

అని తాత్పర్యము.

తథేతి రాజా సంశ్రుత్య గమనం తస్య ధీమతః
ఉవాచ వచనం విప్రం గచ్ఛ త్వం సహభార్యయా. ౨౦

టీక॥ రాజా=రోమపాదమహారాజు; తథేతి = అట్లేయని; ధీమతః=బుద్ధిమంతుఁడగు; తస్య = ఆ ఋశ్యశృంగునియొక్క; గమనం= పోవుటను; సంశ్రుత్య = అంగీకరించి; విప్రం=బ్రాహ్మణుఁడైనఋశ్యశృంగునిగూర్చి; త్వం = నీవు; భార్యయాసహ = భార్యతోఁగూడ; గచ్ఛ=పొమ్ము; (ఇతి=అని) వచనం= మాటను; ఉవాచ=పలికెను.

రోమపాదుండు, బుద్ధిమంతుండగు ఋశ్యశృంగుం డయోధ్యకుం బోవుట నంగీకరించి, "నీవుభార్యతోఁగూడదశరథునివెంటంబొమ్ము" అనిఋశ్యశృంగునకుఁజెప్పెను.

అని తాత్పర్యము.

ఋషిపుత్రః ప్రతిశ్రుత్య తథేత్యాహ నృపం తదా
స నృపేణాభ్యనుజ్ఞాతః ప్రయయౌ సహ భార్యయా. ౨౧

టీక॥ తదా=అప్పుడు; ఋషిపుత్రః= ఋషికొడుకైన ఋశ్యశృంగుఁడు; ప్రతిశ్రుత్య= అంగీకరించి; నృపం=రోమపాదమహారాజునుం గూర్చి; తథేతి= అట్లేయని; ఆహ (భూతార్థమందులట్)= చెప్పెను. సః= ఆఋశ్యశృంగుఁడు; నృపేణ= రోమపాదమహారాజుచేత; అభ్యనుజ్ఞాతః = అనుజ్ఞనుబొందినవాఁడై; భార్యయాసహ = భార్యతోఁగూడ; ప్రయయౌ= పోయెను.

అప్పుడా ఋశ్యశృంగుండంగీకరించి, "యట్లే" యనిరోమపాదునితోఁజెప్పెను; ఇట్లు, ఋశ్యశృంగుఁడు, రోమపాదునిచే నభ్యనుజ్ఞను బొంది, భార్యతోఁగూడఁ, బయ

నంబయ్యె. అని తాత్పర్యము.

తా వన్యోన్యాంజలిం కృత్వా స్నేహాత్సంశ్లిష్య చోరసా
ననందతు ర్దశరథో రోమపాదశ్చ వీర్యవాన్. ౨౨

టీక॥ తౌ=ఆ; దశరథః=దశరథుండును; వీర్యవాన్= పరాక్రమశాలియగు; రోమపాదశ్చ=రోమపాదుండును; అన్యోన్యాంజలిం, అన్యోన్య = పరస్పరముగుఱించి, అంజలిం = చేమోడుపును; కృత్వా=చేసి; స్నేహాత్ = చెలిమివలన; ఉరసా=ఱొమ్ముచేత; సంశ్లిష్యచ= కౌఁగిలించి కొనియును; ననందతుః=సంతసించిరి.

దశరథుండును రోమపాదుండును, బరస్పరమంజలిఘటించి, స్నేహంబున ఱొమ్ముంటఁగవుంగిలించుకొని, సంతసించిరి.

అని తాత్పర్యము.

తత స్సుహృద మాపృచ్ఛ్య ప్రస్థితో రఘునందనః
పౌరేభ్యః ప్రేషయామాస దూతా న్వై శీఘ్రగామినః. ౨౩

టీక॥ తతః = అటుపిమ్మట; రఘునందనః=రఘువంశపువారినిసంతసింపఁజేయునట్టిదశరథుఁడు; సుహృదం=స్నేహితుఁడైనరోమపాదుని; ఆపృచ్ఛ్య=వీడుకొని; ప్రస్థితః= బయలుదేఱినవాఁడై; పౌరేభ్యః = పట్టణమునందువాసముసేయువారలకొఱకు; శీఘ్రగామినః = వడిగానడుచునట్టి; దూతాన్=వార్తాహరులను ("వై" అనునది పాదపూరణార్థము); ప్రేషయామాస=పంపెను.

అంత నాదశరథుఁడు, తనమిత్రుండగురోమపాదునివీడుకొని, పయనంబైయయోధ్యావాసులగు జనులకుఁ దమరాక తెలియుటకై, శీఘ్రముగానడువంగలదూతలంబంపెను. అనితాత్పర్యము.

క్రియతాం నగరం సర్వం క్షిప్రమేవస్వలంకృతమ్
ధూపితం సిక్తసమ్మృష్టం పతాకాభి రలంకృతమ్. ౨౪

టీక॥ నగరం = పట్టణము; సర్వం=అంతయును; క్షిప్రమేవ=శీఘ్రముగానే; స్వలంకృతం=చక్కగా సింగారింపఁబడినదిగాను; ధూపితం=ధూపము వేయఁబడినదిగాను; సిక్తసమ్మృష్టం; సిక్తం = తడుపఁబడినదిగాను, సమ్మృష్టం = గరగరమైనదిగాను; పతాకాభిః = ధ్వజముల చేత; అలంకృతం, సింగారింపఁబడినదిగాను; క్రియతాం= చేయఁబడుఁగాక (అని పౌరులకుఁ జెప్పుఁడని, దశరథుఁడు, దూతల కాజ్ఞాపించెను )

"అయోధ్యాపట్టణ మంతయును, జక్కగా సింగారించి, ధూపము వేసి, వీధులనన్నింటినిం దడిపి గరగరగానుండునట్లు చేసి, ధ్వజములతోన లంకరించి, యుంచవలెను." అని, పౌరులకుఁ జెప్పుఁడని. దశరథుఁడు, దూతలకాజ్ఞాపించెను.

అని తాత్పర్యము.

తతః ప్రహృష్టాః పౌరా స్తే శ్రుత్వా రాజాన మాగతమ్
తథా ప్రచక్రు స్త త్సర్వం రాజ్ఞా య త్ప్రేషితం యథా. ౨౫

టీక॥ తతః= అటుపిమ్మట; తే= ఆ; పౌరాః=పట్టణవాసిజనులు; ప్రహృష్టాః = సంతసించినవారలై; రాజానం= దశరథమహారాజును; ఆగతం = వచ్చినవానిఁగా; శ్రుత్వా = విని; రాజ్ఞా దశరథమహారాజుచేత; యత్ =ఏది; యథా = ఎట్లు; ప్రేషితం = పంపఁబడెనో; తత్ = దాని; సర్వం=అంతను; తథా= అట్లు; ప్రచక్రుః=చక్కగాఁజేసిరి.

అంత నాపౌరులు; దశరథమహారాజయోధ్యకు వచ్చుటవిని, సంతసించినవారలై, యాదశరథమహారాజు, ఎట్లుదేనిఁ జేయనాజ్ఞాపించి పంపెనో, దానినట్లు చక్కగాఁజేసిరి. అని తాత్పర్యము.

తత స్స్వలంకృతం రాజా నగరం ప్రవివేశ హ
శంఖదుందుభినిర్ఘోషైః పురస్కృత్య ద్విజర్షభమ్. ౨౬




టీక ॥ తతః=ఆపిమ్మట; రాజా = దశరథమహారాజు; ద్విజర్షభం= బ్రాహ్మణశ్రేష్ఠుఁడైన ఋశ్యశృంగుని; పురస్కృత్య=మున్నిడుకొని; శంఖదుందుభినిర్ఘోషైః(సహ)= శంఖభేరీధ్వనులతోఁగూడ; స్వలంకృతం=చక్కఁగాసింగారింపఁబడిన; నగరం=పట్టణమును; ప్రవివేశ=ప్రవేశించెను ("హ" అనునది పాదపూరణార్థము).

అంత, దశరథమహారాజు, ఋశ్యశృంగు మున్నిడుకొని, శంఖభేర్యాది వాద్యధ్వనులతోఁగూడి, చక్కఁగానలంకరింపఁబడియున్న యయోధ్యాపట్టణమును బ్రవేశించెను.

అని తాత్పర్యము.

తతః ప్రముదితా స్సర్వే దృష్ట్వా తం నాగరా ద్విజమ్
ప్రవేశ్యమానం సత్కృత్య నరేంద్రేణేంద్ర కర్మణా. ౨౭

టీక॥ తతః= ఆపిమ్మట; నాగరాః= పట్టణవాసిజనులు; సర్వే= అందఱును; ఇంద్రకర్మణా = ఇంద్రునియొక్క కార్యములవంటికార్యములుగల; నరేంద్రేణ=మనుష్యులకుఁ బ్రభువైన దశరథమహారాజుచేత; సత్కృత్య=సమ్మానించి; ప్రవేశ్యమానం = ప్రవేశింపఁజేయఁబడుచున్న; తం=ఆ; ద్విజం=బ్రాహ్మణుఁడగు ఋశ్యశృంగుని; దృష్ట్వా= చూచి; ప్రముదితాః=సంతసించినవారలు; ఆసన్ (అధ్యాహృతము)=అయిరి.

అంతఁ బౌరులందఱు, దేవేంద్రునితోసరిసేయందగిన దశరథమహారాజు, నానావిధ సత్కారంబులు సేసి, దారిచూపుచుఁ, బట్టణంబునకుం దోడ్కొనివచ్చుచున్న ఋశ్యశృంగునిం, జూచి, సంతసించిరి.

అని తాత్పర్యము.

అంతఃపురం ప్రవేశ్యైనం పూజాం కృత్వా చ శాస్త్రతః
కృతకృత్యం తదాత్మానం మేనే తస్యోపవాహనాత్. ౨౮

టీక॥ సః(అధ్యాహృతము)= ఆదశరథమహారాజు; ఏనం = ఈ ఋశ్యశృంగుని, అంతఃపురం= అంతిపురిని; ప్రవేశ్య= ప్రవేశింపఁజేసి;




శాస్త్రతః= శాస్త్రమువలన; పూజాంచ=పూజను; కృత్వా= చేసి; తదా=అప్పుడు; తస్య = ఆఋశ్య శృంగునియొక్క (ఆఋశ్యశృంగుని), ఉపవాహనాత్ = తోడితెచ్చుటవలన; ఆత్మానం=తన్ను; కృతకృ కృత్యం, కృత = చేయఁబడిన, కృత్యం= చేయవలసినది గలవానిఁగా; మేనే=ఎంచికొనెను.

ఆ దశరథమహారాజు, ఋశ్యశృంగునంతిపురికిం దోడ్కొని పోయి, యథాశాస్త్రముగఁ బూజించి, యతనిందోడి తెచ్చినందునఁ, దన్నుఁ గృతార్థునిఁగాఁ దలంచుకొనెను.

అని తాత్పర్యము.

అంతఃపుర స్త్రియ స్సర్వా శాంతాం దృష్ట్వా తథాగతామ్
సహ భర్త్రా విశాలాక్షీం ప్రీత్యానంద ముపాగమన్. ౨౯

టీక॥ అంతఃపురస్త్రియః=అంతిపురమునందుండు స్త్రీలు; సర్వాః=అందఱును; తథా= అట్లు; భర్త్రా సహ=పెనిమిటితోఁగూడ; ఆగతాం = వచ్చిన; విశాలాక్షీం= వెడందకన్నులుగల; శాంతాం = శాంతను; దృష్ట్వా = చూచి; ప్రీత్యా=ప్రేమచేత; ఆనందం= సంతసమును; ఉపాగమన్=పొందిరి.

అంతిపురంబునందుండు దశరథ భార్యలందఱు, నంతటివైభవంబునఁ బెనిమిటితోనే తెంచిన వెడందకన్నులుగల శాంతంజూచి, ప్రేమభరంబున, నానందంబునొందిరి.

అని తాత్పర్యము.

పూజ్యమానాచ తాభి స్సా రాజ్ఞాచైవ విశేషతః
ఉవాస తత్ర సుఖితా కంచి త్కాలం సహర్త్విజా. ౩౦

టీక॥ తత్ర=ఆయయోధ్యయందు; సా=ఆశాంత; ఋత్విజాసహ= యజ్ఞంబున ఋత్విజుండైన ఋశ్యశృంగునితోఁగూడ; తాభిః=ఆయంతఃపురస్త్రీలచేతను; విశేషతః=అధికముగా; రాజ్ఞాచైవ=దశరథమ

హారాజుచేతను; పూజ్యమానా= పూజింపఁ బడు చున్నదై; సుఖితా=సుఖముగలిగినదై; కంచిత్= కొంత; కాలం= కాలమును(అత్యంతసంయోగమునందు ద్వితీయ); ఉవాస=ఉండెను.

ఆశాంతయును, ఋశ్యశృంగసహితమైయతఃపుర స్త్రీలును విశేషించిదశరథమహారాజునుందన్నువివిధసత్కారంబులంబూజింపుచుండఁ,గొంతకాలం, బాయయోధ్యానగరంబునందు,సుఖంబుండెను.

అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే,ఏకాదశస్సర్గః.

ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబు నందు, బాలకాండైకాదశసర్గ టీక, ముగిసినది.

---

శ్రీ

ద్వాదశసర్గప్రారంభః.

తతఃకాలే బహుతిథే కస్మింశ్చిత్సుమనోహరే
వసంతే సమనుప్రాప్తే రాజ్ఞో యష్టుం మనోభవత్. ౧

టీక॥ తతః=ఆపిమ్మట; బహుతిథే=చాలదీర్ఘమైన; కాలే=కాలము; గతే(అధ్యాహృతము)= కడచినదగుచుండఁగా;కస్మింశ్చిత్=ఒకానొక;సుమనోహరే= మిక్కిలియింపైన; వసంతే= వసంతర్తువు; సమనుప్రాప్తే=వచ్చినదగుచుండఁగా; రాజ్ఞః= దశరథమహారాజునకు;యష్టుం= యజ్ఞముసేయుటకు; మనః=తలంపు; అభవత్ = కలిగినది.

అంతటం, బెద్దకాలముకడచిన

పిమ్మట, మిక్కిలి మనోహరమైనవ సంతర్పుపుతటస్థింపఁగానే, దశరథ మహారాజు యాగము సేయఁదలంచెను. అనితాత్పర్యము.

తతః ప్రసాద్య శిరసా తం విప్రం దేవవర్ణినమ్
యజ్ఞాయ వరయామాస సంతానార్థం కులస్య వై. ౨

టీక॥తతః=ఆపిమ్మట; సః(అధ్యాహృతము)=ఆదశరథుఁడు; దేవవర్ణినం = దేవతలయొక్క-కాంతి వంటికాంతికల; తం = ఆ; విప్రం= బ్రాహ్మణుఁడైనఋశ్యశృంగుని; శిరసా = తలచేతను; ప్రసాద్య=అనుగ్రహింపఁజేసి; యజ్ఞాయ= యాగముకొఱకు; కులస్య = వంశమునకు ("వై" అనునది పాదపూరణార్థము); సంతానార్థం =పుత్రపౌత్రాదిపారంపర్యముగలుగుటకై; వరయామాస=ప్రార్థించెను.

ఆపిమ్మట, నా దశరథుండు, దేవతయుం బోలె వెలుంగుచున్న యాఋశ్యశృంగుని సాష్టాంగనమస్కారంబులం బ్రసన్నునింజేసి, తనచే యాగము సేయించితనవంశము పుత్రపౌత్రాదిపారంపర్యముగలిగియుండునట్లు ఘటింపం బ్రార్థించెను. అనితాత్పర్యము.

తథేతిచ స రాజాన మువాచచ సుసత్కృతః
సంభారా స్సంభ్రియంతాం తే తురగశ్చ విముచ్యతామ్. ౩

టీక॥సచ=ఆఋశ్యశృంగుండును; సుసత్కృతః=చక్కగాసమ్మానింపఁబడినవాఁడై; రాజానం=దశరథమహారాజునుగూర్చి; తథేతి=అలాగేయని; ఉక్త్వా (అధ్యాహృతము)=చెప్పి; తే=ఆ; సంభారాః= ఉపకరణద్రవ్యములు; సంభ్రియంతాం = కూర్పంబడుఁగాక; తురగశ్చ=గుఱ్ఱమును; విముచ్యతాం=విడువంబడుఁగాక; ఇతి(అధ్యాహృతము)చ=అనియును; ఉవాచ=పలికెను.

ఆ ఋశ్యశృంగుఁడును, చక్కగాసన్మానమునొంది, యాదశరథమహారాజునుగూర్చి, "అలాగేచేసెదను; యాగోపకరణములన్నియుం

గూర్చుఁడు; అశ్వంబును విడువుఁడు." అని చెప్పెను. అనితాత్పర్యము.

తతో రాజా బ్రవీ ద్వాక్యం సుమంత్రం మంత్రిసత్తమమ్
సుమంత్రావాహయ క్షిప్రం ఋత్విజో బ్రహ్మవాదినః. ౪
సుయజ్ఞం వామదేవంచ జాబాలి మథ కాశ్యపమ్
పురోహితం వసిష్ఠంచ యేచాన్యే ద్విజసత్తమాః. ౫

టీక॥తతః = ఆపిమ్మట; రాజా=దశరథమహారాజు; మంత్రిసత్తమం=మంత్రులలో శ్రేష్ఠుండగు; సుమంత్రం = సుమంత్రునిం గూర్చి; సుమంత్ర =సుమంత్రుఁడా! ఋత్విజః = ఋతువునందు యాగముసేయువారును; బ్రహ్మవాదినః= వేదములుచదువువారునగు; సుయజ్ఞం=సుయజ్ఞుని; వామదేవంచ= వామదేవుని; జాబాలిం=జాబాలిని; కాశ్యపమథ=కాశ్యపుని ("అథ" అనునది సముచ్చయార్థకము); పురోహితం = పురోహితుఁడైన; వసిష్ఠంచ=వసిష్ఠుని; అన్యే = ఇతరులైన; ద్విజసత్తమాః= బ్రాహ్మణశ్రేష్ఠులు; యే=ఎవరు; సంతి (అధ్యాహృతము)=కలరో; తాన్ (అధ్యాహృతము) చ=వారలను; క్షిప్రం=శీఘ్రముగా; ఆవాహయ= తోడితెమ్ము. ఇతి (అధ్యాహృతము) = అనెడు; వాక్యం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

అంత, దశరథమహారాజు, మంత్రిశ్రేష్ఠుండగు సుమంత్రునిం బిలిచి, నీవు, ఋత్విజులును వేదాధ్యయనపరులునగు, సుయజ్ఞుని, వామదేవుని, జాబాలినిఁ, గాశ్యపునిఁ, బురోహితుండగు వసిష్ఠుని, నింక, నితరులైన బ్రాహ్మణశ్రేష్ఠులెవ్వరుగలరో వారినందఱ, శీఘ్రముగాఁ దోడితెమ్ము" అని యాజ్ఞాపించెను. అని తాత్పర్యము.

తత స్సుమంత్ర స్త్వరితం గత్వా త్వరిత విక్రమః
సమానయ త్స తాన్ సర్వాన్ సమస్తాన్ వేదపారగాన్. ౬

టీక॥తతః=ఆపిమ్మట; త్వరితవిక్రమః= శీఘ్రమైననడకగల; సః= ఆ; సుమంత్రః=సుమంత్రుఁడు; త్వరితం=శీఘ్రముగా; గత్వా=పోయి;

వేదపారగాన్ = వేదములయొక్క యంతము నెఱింగినవారును; సమస్తాన్ = గుంపు చేరిన వారునగు; తాన్=వారిని; సర్వాన్=అందఱు; సమానయత్ =తోడ్కొనివచ్చెను,

అంత, శీఘ్రముగా నడుచునట్టి యాసుమంత్రుఁడు, త్వరితముగాఁ బోయి, సమస్తవేదంబుల నెఱింగిన వారినందఱు,గుంపుగాఁ దోడ్కొని వచ్చెను. అని తాత్పర్యము.



తాన్ పూజయిత్వా ధర్మాత్మా రాజా దశరథ స్తదా
ధర్మార్థ సహితంయుక్తం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౭

టీక॥ తదా=అప్పుడు; ధర్మాత్మా = ధర్మస్వభావుండగు; రాజా = రాజైన; దశరథః=దశరథుఁడు; తాన్=ఆ ఋత్విజ్ఞాదులను; పూజయిత్వా=పూజించి; ధర్మార్థసహితం = ధర్మార్థములతోఁగూడు కొనినదియును; యుక్తం=సరియైనదియును; శ్లక్ష్ణం= మృదువైనదియునగు; వచనం=మాటను; అబ్రవీత్ =పలికెను.

అప్పుడు, ధర్మస్వభావుం డగుదశరథ మహారాజు, ఆ ఋత్విజ్ఞాదులం బూజించి, ధర్మార్థసహితంబును సంగతంబునగు మృదువైనమాటఁ జెప్పెను.

అని తాత్పర్యము.

మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్
తదర్థం హయమేధేన యక్ష్యామీతి మతి ర్మమ. ౮

టీక॥ పుత్రార్థం=కొడుకులకొఱకు; లాలప్యమానస్య= మిక్కిలిపరితపించుచున్న; మమ= నాకు; సుఖం=సౌఖ్యము; నాస్తి వై= లేనే లేదు. తదర్థం=దానికొఱకు; హయమేధేన = అశ్వమేధము చేత; యక్ష్యామి= దేవతలం బూజించెదను; ఇతి=అని; మమ=నాకు; మతిః=తలంపు; ఆసీత్ ( అధ్యాహృతము )= కలిగెను. తాత్పర్యము, సు

తదహం యష్టు మిచ్ఛామి శాస్త్ర దృష్టేన కర్మణా
ఋషిపుత్రప్రభావేన కామా న్ప్రాప్స్యామి చాప్యహమ్. ౯

టీక॥ తత్ = అందువలన; అహం=నేను; శాస్త్రదృష్టేన= శాస్త్రమునందుఁ జూడంబడిన; కర్మణా=విధిచేత; యష్టుం= యాగము సేయుటకు; ఇచ్ఛామి= కోరెదను. ఋషిపుత్రప్రభావేన = ఋషికుమారుఁడైన ఋశ్యశృంగునియొక్క మాహాత్మ్యముచేత; కామానపి చ=కోర్కులను; ప్రాప్స్యామి= పొందఁగలను.

కావున, నేనిప్పుడు, యథాశాస్త్రముగ యాగము సేయఁగోరెదను; ఋశ్యశృంగుని ప్రభావంబునం జేసి, కోర్కులనుం బడయఁగలను.

అని తాత్పర్యము.

తత స్సాధ్వితి త ద్వాక్యం బ్రాహ్మణాః ప్రత్యపూజయన్
వసిష్ఠ ప్రముఖా స్సర్వే పార్థివస్య ముఖాచ్చ్యుతమ్. ౧౦

టీక॥ తతః=అటుపిమ్మట; వసిష్ఠప్రముఖాః=వసిష్ఠుఁడు మొదలుగాఁగల; బ్రాహ్మణాః=బ్రాహ్మణులు; సర్వే=అందఱును; పార్థివస్య=

దశరథమహారాజుయొక్క=; ముఖాత్=ముఖమువలన; చ్యుతం= జాతిని; తత్=ఆ; వాక్యం=మాటను; సాధ్వితి = మంచిదని; ప్రత్యపూజయన్=కొనియాడిరి.

వసిష్ఠుండు మొదలుగానాబ్రాహ్మణులందఱును దశరథ మహారాజుముఖంబునుండి వెల్వడిన యామాటంజాలఁగొనియాడిరి.

అని తాత్పర్యము.

ఋశ్యశృంగపురోగాశ్చ ప్రత్యూచు ర్నృపతిం తదా
సంభారా స్సంభ్రియంతాం తే తురగశ్చ విముచ్యతామ్. ౧౧
సర్వథా ప్రాప్స్యసే పుత్రాం శ్చత్వారోఽమితవిక్రమాన్
యస్య తే ధార్మికీ బుద్ధి రియం పుత్రార్థ మాగతా. ౧౨

టీక॥ తదా=అప్పుడు; బ్రాహ్మణాః (అధ్యాహృతము) =వసిష్ఠుండు మొదలుగాఁగల, బ్రాహ్మణులు; ఋశ్యశృంగపురోగాశ్చ = ఋశ్యశృంగుఁడు మొదలుగాఁగల వారలునై; నృపతిం= దశరథమహారాజును గూర్చి; తే=ఆ; సంభారాః=ఉపకరణములు; సంభ్రియంతాం= కూర్పఁబడుఁగాక; తురగశ్చ=గుఱ్ఱమును; విముచ్యతాం=విడువంబడుఁగాక; యస్య=ఏ; తే=నీకు; ఇయం=ఈ; ధార్మికీ = ధర్మమే ప్రయోజనముగాఁగల; బుద్ధిః= తలంపు; పుత్రార్థం=కొడుకులకొఱకు; ఆగతా = వచ్చినదో; సః (అధ్యాహృతము) = అట్టి; త్వం (అధ్యాహృతము) = నీవు; సర్వథా= అన్నివిధంబుల; అమితవిక్రమాన్=కొలందిలేని పరాక్రమముగల; చత్వారః = నలువురిని; పుత్రాన్= కొడుకులను; ప్రాప్స్యసే=పొందఁగలవు; ఇతి(అధ్యాహృతము)=అని; ప్రత్యూచుః=బదులు చెప్పిరి.

వసిష్ఠుఁడు మొదలుగా బ్రాహ్మణులందఱును, ఋశ్యశృంగుని మున్నిడుకొని, "ఉపకరణములన్నియుం గూర్పుఁడు; తురగమును విడువుఁడు; నీకుఁ, బుత్రార్థమై, యిట్టిధార్మికబుద్ధిగలిగినందున, నన్నివిధంబులం గొలందిలేనిపరాక్రమముగల నలువురఁగొడుకులం బడసెదవు" అని దశరథమహారాజునకుఁ జెప్పిరి.

అని తాత్పర్యము.

తతః ప్రీతోఽ భవ ద్రాజా శ్రుత్వా త ద్ద్విజభాషితమ్
అమాత్యాం శ్చాబ్రవీ ద్రాజా హర్షే ణేదం శుభాక్షరమ్. ౧౩

టీక॥తతః=ఆపిమ్మట;రాజా=దశరథమహారాజు;తత్=ఆ; ద్విజభాషితం= బ్రాహ్మణులమాటను;శ్రుత్వా=విని;ప్రీతః=సంతసించినవాఁడు;అభవత్=ఆయెను. రాజా=దశరథమహారాజు;హర్షేణ=సంతసముచేత;అమాత్యాన్=మంత్రులంగూర్చి, శుభాక్షరం = మంగళకరములైన యక్షరములుగల;ఇదం=ఈమాటను;అబ్రవీత్= చెప్పెను.

దశరథమహారాజు బ్రాహ్మణులమాటవిని,సంతసమంది, మంత్రులకు,మంగళకరములైనమాటలతో,నిట్లనియాజ్ఞాపించెనని తాత్పర్యము.

గురూణాంవచనా చ్ఛీఘ్రం సంభారా స్సంభ్రియంతు మే
సమర్థాధిష్ఠిత శ్చాశ్వ స్సోపాధ్యాయో విముచ్యతామ్. ౧౪

టీక॥మే=నాయొక్క; గురూణాం = గురువులయొక్క;వచనాత్=మాటవలన;శీఘ్రం= త్వరితముగా;సంభారాః= ఉపకరణములు;సంభ్రియంతు (పరస్మైపదమార్షము)=కూర్పఁబడుఁగాక. సమర్థాధిష్ఠితః=నేర్పరులచేరక్షింపఁబడినదియు;సోపాధ్యాయః = ఉపాధ్యాయులతోఁగూడినదియు నగు;అశ్వశ్చ = గుఱ్ఱమును;విముచ్యతాం=విడువఁబడుఁగాక.

తాత్పర్యము,సులభము.

సరయ్వా శ్చో త్తరే తీరే యజ్ఞభూమి ర్విధీయతామ్
శాంతయ శ్చా భివర్ధంతాం యథాకల్పం యథావిధి. ౧౫

టీక॥సరయ్వాః= సరయూనదియొక్క;ఉత్తరే=ఉత్తరపుదిక్కునందలి,తీరే=గట్టునందు; యజ్ఞభూమిశ్చ=యాగభూమియును; విధీయతాం = చేయఁబడుఁగాక. శాంతయశ్చ = శాంతులును;యథాకల్పం=కల్పప్రకారముగ; యథావిధి=యథాశాస్త్రముగఁ;అభివర్ధంతాం=వృద్ధినొందెడుఁగాక.

తాత్పర్యము,సులభము.

శక్యః ప్రాప్తు మయం యజ్ఞ స్సర్వేణాపి మహీక్షితా
నాపరాధో భవే త్కష్టో య ద్యస్మిన్ క్రతుసత్తమే. ౧౮

టీక॥ అస్మిన్=ఈ; క్రతుసత్తమే= యాగశ్రేష్ఠమైన యశ్వమేధమునందు; కష్టః=అపాయకరమైన; అపరాధః=అపచారము; యదిన భవేత్= కలుగకుండినట్లైన; మహీక్షితా=రాజైన; సర్వేణాపి=సమస్తజనముచేతను; అయం = ఈ; యజ్ఞః=అశ్వమేధయాగము; ప్రాప్తుం=పొందుటకు; శక్యం=సాధ్యము; స్యాత్ (అధ్యాహృతము)= అగును.

తాత్పర్యము, సులభము.

ఛిద్రంహి మృగయంతేఽత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః
నిహతస్యచ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి. ౧౯

టీక॥ అత్ర=ఈ యశ్వమేధయాగమందు; విద్వాంసః = పండితులయిన; బ్రహ్మరాక్షసాః=బ్రహ్మరక్షస్సులు; ఛిద్రం=అపచారమును, మృగయంతేహి = వెదకుచున్నారుగదా, నిహతస్య=కొట్టువడిన; యజ్ఞస్య=యాగముయొక్క; కర్తాచ=చేయువాఁడును (యజమానుఁడుననుట); సద్యః=అప్పుడె, వినశ్యతి=నశించుచున్నాఁడు.

తాత్పర్యము, సులభము.

త ద్యథా విధిపూర్వం మే క్రతు రేష సమాప్యతే
తథా విధానం క్రియతాం సమర్థాః కరణేష్విహ. ౧౭

టీక॥ తత్=కావున ; యథా= ఎట్లు, మే=నాయొక్క, ఏషః=ఈ; క్రతుః=అశ్వమేధయాగము; విధిపూర్వం = శాస్త్రప్రకారముగ; సమాప్యతే = తుదముట్టునో; తథా=అట్లు; విధానం=యత్నము;

క్రియతాం=చేయంబడుఁగాక. ఇహ=ఇచ్చట ;కరణేషు= కార్యములందు; యూయం (అధ్యాహృతము)=మీరు; సమర్థాః=నేర్పరులరు.

తాత్పర్యము,సులభము.

తథేతిచ తత స్సర్వే మంత్రిణః ప్రత్యపూజయన్
పార్థివేంద్రస్య త ద్వాక్యం యథాజ్ఞప్త మకుర్వత. ౧౯

టీక॥తతః = అటుపిమ్మట,మంత్రిణః=మంత్రులు,సర్వే= అందఱును;తథేతి=ఆలాగేయని;ఉక్త్వా(అధ్యాహృతము)చ = చెప్పియును; పార్థివేంద్రస్య= రాజశ్రేష్ఠుండగుదశరధునియొక్క;తత్ = ఆ;వాక్యం = మాటను; ప్రత్యపూజయన్ = కొనియాడిరి.యథాజ్ఞప్తం=ఆజ్ఞాపింపఁబడినప్రకారముగ;అకుర్వత=చేసిరి.

మంత్రులందఱును,ఆలాగేచేసెదమని, రాజశ్రేష్ఠుఁడగు దశరథుని వాక్యమునుగొనియాడి, యాజ్ఞాప్రకార మంతయుం జేసిరి.

అని తాత్పర్యము.

తతో ద్విజా స్తే ధర్మజ్ఞ మస్తువన్ పార్థివర్షభమ్
అనుజ్ఞాతా స్తత స్సర్వే పున ర్జగ్ము ర్యథాగతమ్. ౨౦

టీక॥ తతః=ఆపిమ్మట; తే=ఆ; ద్విజాః = బ్రాహ్మణులు; ధర్మజ్ఞం=ధర్మమునెఱింగిన; పార్థివర్షభం= రాజశ్రేష్ఠుఁడగు దశరథుని; అస్తువన్=స్తుతించిరి; తతః=అటువెనుక; సర్వే=అందఱును;అనుజ్ఞాతాః=అనుజ్ఞను బొందినవారలై; పునః=మఱల;యథాగతం= వచ్చినట్లు;జగ్ముః=వెళ్లిరి.

అంత నాబ్రాహ్మణులందఱును,సమస్తధర్మంబులనెఱింగి, సమస్తరాజులకును మేటినై వెలుంగుచున్నయాదశరథమహారాజుం, బ్రస్తుతించి,యతనివలననను జ్ఞం బొంది,వచ్చునప్పుడు తమకుగౌరవార్థమైరాజుచేసమర్పింపఁబడినయుత్తమయానంబుల నారోహించి,యంతటిగౌరవంబుననే, తమతమయిరవులకుంబోయిరి.

అని తాత్పర్యము.

గతే ష్వథ ద్విజాగ్ర్యేషు మంత్రిణ స్తా న్నరాధిపః
విసర్జయిత్వా స్వం వేశ్మ ప్రవివేశ మహాద్యుతిః. ౨౧

టీక ॥ అథ=అటుపిమ్మట; ద్విజాగ్ర్యేషు=బ్రాహ్మణశ్రేష్ఠులు; గతేషు= వెళ్లఁగా; మహాద్యుతిః= గొప్పకాంతిగల; నరాధిపః= మనుష్యులకుఁ బ్రభువైనదశరథుఁడు; తాన్ = ఆ; మంత్రిణః=మంత్రులను; విసర్జయిత్వా= విడిచిపెట్టి, స్వం= తనదైన; వేశ్మ=గృహమును; ప్రవివేశ=ప్రవేశించెను.

వసిష్ఠుఁడుమొదలగు బ్రాహ్మణశ్రేష్ఠులందఱును వెళ్లఁగా, సంతోషముచే నధికమైన కాంతిగల యాదశరథుఁడు, మంత్రులకు సెలవిచ్చి తాననంతః పురంబునకుం బోయెను. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ద్వాదశ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండ ద్వాదశసర్గ టీక, ముగిసినది.

---



## త్రయోదశసర్గప్రారంభః.

పునః ప్రాప్తే వసంతే తు పూర్ణస్సంవత్సరోఽభవత్
ప్రసవార్థం గతో యష్టుం హయమేధేన వీర్యవాన్. ౧

టీక॥ పునః = మఱల; వసంతే = వసంతఋతువు; ప్రాప్తే = రాఁగా; సంవత్సరః = ఏఁడాది; పూర్ణః = నిండినది; అభవత్ = అయినది; వీర్యవాన్ = పరాక్రమముగలదశరథుఁడు; ప్రసవార్థం = సంతానము కొఱకు; హయమేధేన = అశ్వమేధయాగముచేత; యష్టుం = దేవతలఁ బూజించుటకు; గతః = (యాగశాలకు) పోయెను.

రెండవవసంతఋతువు రాఁగానే యేఁడాదిసంపూర్ణమయినది; అంతటఁ బరాక్రమశాలియగు దశరథుఁడు, సంతానముకొఱకు, నశ్వమేధయాగముసేయుటకు యాగశాలను బ్రవేశించెను.

అని తాత్పర్యము.

అభివాద్య వసిష్ఠంచ న్యాయతః ప్రతిపూజ్యచ
అబ్రవీత్ప్రశ్రితం వాక్యం ప్రసవార్థం ద్విజోత్తమమ్. ౨

టీక॥ సః (అధ్యాహృతము) = ఆదశరథుఁడు; ద్విజోత్తమం = బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు; వసిష్ఠం = వసిష్ఠమహర్షిని; అభివాద్యచ = నమస్కరించియు; న్యాయతః = శాస్త్రమువలన; ప్రతిపూజ్యచ = పూజించియు; ప్రసవార్థం = సంతానముకొఱకు; ప్రశ్రితం = వినయముతోఁగూడిన; వాక్యం (వక్ష్యమాణమగు) మాటను; అబ్రవీత్ = పలికెను.

ఆదశరథుండు, బ్రాహ్మణశ్రేష్ఠుండగు వసిష్ఠ మహామునిని నమస్కరించి యథాశాస్త్రముగఁ బూజించి, తనకునిర్విఘ్నముగ సంతానముగల్గుటకై, వినయముతోనిట్లని, చెప్పెను.

అని తాత్పర్యము.

యజ్ఞో మే క్రియతాం బ్రహ్మన్ యథోక్తం మునిపుంగవ
యథా న విఘ్నః క్రియతే యజ్ఞాంగేషు విధీయతామ్. ౩

టీక ॥ మునిపుంగవ= మునిశ్రేష్ఠుఁడవగు; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా ! మే=నాయొక్క; యజ్ఞః= యాగము; యథోక్తం = శాస్త్రమందుఁ జెప్పఁబడినదానినతిక్రమింపక; క్రియతాం=చేయఁబడుఁగాక. యజ్ఞాంగేషు = యాగముయొక్క-అంగములయందు ; యాథా = ఎట్లు; విఘ్నః= [illegible] ; నక్రియతే=చే[illegible] (అధ్యాహృతము) = అట్లు; విధీయతాం=చేయఁబడుఁగాక.

"మునిశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా! నాయాగమునుయథా శాస్త్రంబుగనెఱవేర్ప వలయును ; ఉపకరణము, క్రియ, దేవత, మొదలగుయాగాంగములయందు, రాక్షసు , లంతరాయముసేయుట కవకాశములేకుండు నట్లు, సేయవలయును.

అని తాత్పర్యము.

భవాన్ స్నిగ్ధస్సుహృన్మహ్యం గురుశ్చ పరమో మహాన్
ఓఢవ్యో భవతా చైవ భారో యజ్ఞస్య చో[illegible] ౪

టీక॥ భవాన్=నీవు; మహ్యం (షష్ఠ్యర్థమందుఁ జతుర్థి)=నాకు; స్నిగ్ధః=స్నేహముతోఁ గూడినః సుహృత్ = స్నేహితుఁడు. పరమః=ఉత్కృష్టుఁడును; మహాన్= పూజ్యుఁడునగు; గురుశ్చ = ఆచార్యుఁడును. ఉద్యతః=అరంభింపఁ బడిన; యజ్ఞస్య=యాగముయొక్క; భారశ్చ= భారమును (చకారముచే) ఆర్త్విజ్యమును; భవతైవ = నీచేతనే; ఓఢవ్యః=వహింపఁ బడవలయును.

నీవునాకుఁ,బరమస్నేహితుండవు ; పరమపూజ్యాచార్యుండవు ; ఈ యాగమునకు ఋత్విజుండవై, యిందలిభారమునంతయు వహింపవలయును;అనిచెప్పెను. అనితాత్పర్యము.

తథేతి చ స రాజాన మబ్రవీ ద్ద్విజసత్తమః
కరిష్యే సర్వమేవైత ద్భవతా య త్సమర్థితమ్. ౫

టీక ॥ ద్విజసత్తమః=బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు; సచ = ఆవసిష్ఠుఁడు

నుః రాజానం=దశరథమహారాజును గూర్చిఁ; భవతా=నీచేత ; యత్=ఏది; సమర్థితం=ప్రార్థింపఁబడెనో ; తత్ (అధ్యాహృతము)=ఆ; ఏతత్=దీని; సర్వమేవ=అంతయునే; తథా=ఆలాగు; కరిష్యే=చేసెదను; ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను.

బ్రాహ్మణశ్రేష్ఠుండగు నావసిష్ఠుండును, "నివుప్రార్థించినవాని నంతయు నాలాగే చేసెదను" అని, దశరథమహారాజుతోఁ జెప్పెను, అని తాత్పర్యము.

తతో బ్రవీ ద్ద్విజా న్వృద్ధా న్యజ్ఞకర్మసు నిష్ఠితాన్
స్థాపత్యే నిష్ఠితాం శ్చైవ వృద్ధా న్పరమ ధార్మికాన్. ౬
కర్మాంతికాన్ శిల్పకరా న్వర్ధకీన్ ఖనకా నపి
గణకాన్ శిల్పిన శ్చైవ తథైవ నటనర్తకాన్. ౭
తథా శుచీన్ శాస్త్రవిదః పురుషాన్ సుబహుశ్రుతాన్
యజ్ఞకర్మ సమీహంతాం భవంతో రాజశాసనాత్ ౮
ఇష్టకా బహుసాహస్రా శ్శీఘ్ర మానీయతా మితి

టీక ॥ తతః=ఆపిమ్మట ; సః (అధ్యాహృతము)= ఆవసిష్ఠుఁడు; యజ్ఞకర్మసు=యాగకార్యములయందు; నిష్ఠితాన్ = నియోగింపఁబడిన; వృద్ధాన్=ముసలివాండ్రగు; ద్విజాన్=బ్రాహ్మణులను; వృద్ధాన్=ముసలివాండ్రను; పరమధార్మికాన్=మిక్కిలిధర్మము నాచరించువారునగు ; స్థాపత్యే= ఆయాద్రవ్యములఁదెప్పించుట యందలి యధికారమునందు ; నిష్ఠితాం శ్చైవ=నియోగింపఁ బడినట్టి వారలను; కర్మాంతికాన్ = పనివాండ్రను; శిల్పకరాన్ = ఇటికెరాళ్లుమొదలగువాటిని జేయువారలను; వర్ధకీన్=వడ్ల వాండ్రను; ఖనకానపి=త్రవ్వువారలను ; గణకాన్=లెక్కించువారలను; శిల్పిన శ్చైవ=చిత్రములు వ్రాయువారలను; తథైవ=ఆలాగే ; నటనర్తకాన్, నట=రసము నభినయించువారలను , నర్తకాన్=భావము

నభి నయించు వారలను; తథా= ఆలాగు; శుచీన్= పరిశుద్ధులును; శాస్త్రవిదః=శాస్త్రముల నెఱింగి నవారును; సుబహుశ్రుతాన్=మిక్కిలియధికమైనశాస్త్రనిశ్చయము గలవారునగు; పురుషాన్= రాజపురుషులనుంగూర్చి ; భవంతః= మీరలు; రాజశాసనాత్= రాజాజ్ఞవలన;యజ్ఞకర్మ=యాగకార్యమును; సమీహంతాం=ప్రయత్నింపుదురుగాక. బహుసాహస్రాః - పెక్కువేలసంఖ్యగల ; ఇష్టకాః- ఇటికఱాళ్లు; శీఘ్రం=వడిగా; ఆనీయతాం= (ఏకవచనంబార్షము) తేఁబడుఁగాక. ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను.

అంత, నావసిష్ఠుండు, యాగకార్యనియుక్తులైనవృద్ధబ్రాహ్మణులను,వృద్ధులును ధార్మికులునగు నాయాద్రవ్యములఁ దెప్పించుటయందధికృతులైనవారలను , బనివాండ్రను, ఇటికఱాళ్లు మొదలగువానిం జేయువారలను,వడ్లవాండ్రను, దటాకము మొదలైన వానిం ద్రవ్వువారలను,లెక్కలు వ్రాయు వారలను,జత్తరువులు కల్పించువారలను, రసభావంబుల నభినయించువారలను, [illegible] శుద్ధులును శాస్త్రత [illegible] గినవారలునగు రాజపురుషులనుం,జూచి, "రాజాజ్ఞం బట్టి,మీరందఱుయాగకార్యములఁబ్రవర్తింపుఁడు, ఇటికఱాళ్లు పెక్కుసహస్రంబులు కొనిరండు" అనియాజ్ఞాపించెను. అని తాత్పర్యము.

ఔపకార్యాః క్రియంతాంచ రాజ్ఞాం బహుగుణాన్వితాః. ౯

టీక ॥ రాజ్ఞాం= రాజులకు; బహుగుణాన్వితాః= పెక్కుగుణములతోఁగూడిన;ఔపకార్యాశ్చ= మేడలును; క్రియంతాం=చేయంబడుఁగాక.

పెక్కుపదార్థంబుల సంపూర్ణంబులయిన రాజగృహంబులరచియింప వలయును.

అని తాత్పర్యము.

బ్రాహ్మణావసథా శ్చైవ కర్తవ్యా శ్శతశ స్సుభాః

భక్ష్యాన్నపానై ర్బహుభి స్సముపేతా స్సునిష్ఠితాః. ౧౦

టీక ॥ శుభాః=మంగళకరములైనవియును; బహుభిః = అనేకములైన; భక్ష్యాన్నపానైః = భక్ష్యములతోను అన్నములతోను పానీయంబులతోను ; సముపేతాః = కూడినవియును; సునిష్ఠితాః= స్థిరములునగు; బ్రాహ్మణావసథాశ్చ వ=బ్రాహ్మణగృహములును ; శతశః=అనేకములుగా; కర్తవ్యాః= చేయంబడవలయును.

నానా విధంబులగు భక్ష్యాన్నపానీయంబులతోఁగూడి, మంగళకరంబులై గాలివానలం గూలకుండునట్లు సుస్థిరంబులై, యుండు, బ్రాహ్మణగృహంబులనుం, గావింప వలయును.

అని తాత్పర్యము.

తథా పౌరజనస్యాపి కర్తవ్యా బహువిస్తరాః
ఆవాసా బహుభక్ష్యై ర్వై సర్వకామై రుప స్థితాః ౧౧

టీక ॥ తథా= ఆప్రకారము; పౌరజనస్యాపి= పట్టణమునందువసించు జనమునకును ; బహువిస్తరాః= అధికమైనవెడల్పును నిడుపునుంగలవియును; బహుభక్ష్యైః=అనేకములైనభక్ష్యములు గలవియును; ("వై" అనునది పాదపూరణార్థము) సర్వకామైః, సర్వ =సమస్తములైన, కామైః = కోరఁబడు పదార్థములతోః ఉపస్థితాః= కూడినవియు నగు; ఆవాసాః= నివాస స్థానములు; కర్తవ్యాః = చేయఁబడవలయును.

ఆప్రకారము, పట్టణమునందుండు జనులకును, మిక్కిలి వెడల్పును నిడుపునుం గలిగి, నానావిధభక్ష్యంబులతోను శ్రేష్ఠములైనసమస్తపదార్థములతోనుంగూడిననివాసస్థానములు కల్పింపవలయును.

అని తాత్పర్యము.

తథా జానపదస్యాపి జనస్య బహుశోభనమ్
దాతవ్య మన్నం విధివ త్సత్కృత్య నతు లీలయా. ౧౨

టీక ॥ తథా= ఆప్రకారము; జానపదస్య = గ్రామములలోనుండు నట్టి; జనస్యాపి = జనమునకును; విధివత్=శాస్త్రప్రకారముగ; బహుశోభనం= మిక్కిలి మంగళకరములయిన; అన్నం= అన్నము; దాతవ్యం=ఇవ్వఁబడవలయును. లీలయాతు= అనాదరముచేత మాత్రము; న(దాతవ్యం)= ఇవ్వఁబడఁగూడదు.

ఆప్రకారము, గ్రామ్యజనులకును, మిక్కిలిశ్రేష్ఠమైన యన్నమును శాస్త్రప్రకారము, శ్రద్ధతో, నివ్వవలయును; అనాదరముగామాత్ర మివ్వఁగూడదు.

అని తాత్పర్యము.

సర్వే వర్ణా యథా పూజాం ప్రాప్నువంతి సుసత్కృతాః
న చావజ్ఞా ప్రయోక్తవ్యా కామక్రోధవశాదపి. ౧౩

టీక॥యథా=ఎట్లు;వర్ణాః= జాతులు; సర్వే=అన్నియును; సుసత్కృతాః = చక్కఁగాసత్కరింపఁబడినవై;పూజాం= పూజను; ప్రాప్నువంతి= పొందుదురో; తథాకర్తవ్యం(అధ్యాహృతము)= ఆ ప్రకారముచేయఁ బడవలయును,కామక్రోధవశాదపి = కామక్రోధముల కధీనతవలనను (అపిశబ్దమువలన) అనాదరమువలనను; అవజ్ఞాచ = అవమానము మాత్రము; నప్రయోక్తవ్యా = చేయఁబడఁగూడదు.

అన్నిజాతులు, నెట్లు, చక్కఁగాఁబూజనొందునో;ఆప్రకారము చేయవలయును; కామక్రోధములవలనఁగాని యనాదరమువలనఁగాని, యెంతమాత్రమవమానముచేయఁగూడదు. అని తాత్పర్యము.

యజ్ఞకర్మసు యే వ్యగ్రాః పురుషాశ్శిల్పిన స్తథా
తేషామపి విశేషేణ పూజా కార్యా యథాక్రమమ్. ౧౪

టీక ॥ తథా= ఆప్రకారము; యజ్ఞకర్మసు = యాగకార్యములందు; వ్యగ్రాః=ఆసక్తులైన ; పురుషాః=రాజపురుషులును ; శిల్పి

నః=శిల్పముచేయువారును ; యే (సంతి)=ఎవరుగలరో ; తేషామపి=వారలకును; విశేషేణ= అతిశయముచేత ; యథాక్రమం=వరుసదప్పక; పూజా=పూజ ; కార్యా=చేయఁదగినది.

మఱియు , యాగకార్యములయందాసక్తులయిన రాజపురుషులకును శిల్పులకును, విశేషముగా, వారివారియోగ్యతననుసరించి, పూజసేయవలయును.

అనితాత్పర్యము.

తే చ స్యు స్సంభృతా స్సర్వే వసుభి ర్భోజనే నచ

టీక ॥ తే=ఆయాగ కార్యములయందాసక్తులయినవారు; సర్వే చ=అందఱును ; వసుభిః=ధనములచేతను; భోజనేనచ=భోజనముచేతను; సంభృతాః=తృప్తులుగా, స్యుః=అగుదురు.

యాగకార్యములయందాసక్తులగువారందఱును, ధనములచేతను భోజనముచేతనుం,దృప్తులగుదురు. అనితాత్పర్యము.

యథా సర్వం సువిహితం న కించి త్పరిహీయతే. ౧౫
తథా భవంతః కుర్వంతు ప్రీతిస్నిగ్ధేన చేతసా

టీక ॥ యథా=[illegible]ర్వం= సమస్తమును; సువిహి[illegible]=చక్కఁగాఁజేయఁబడినది;స్యాత్ (అభ్యాహృతము)=అగునో ; కించిత్=కొంచమైనను ; నపరిహీయతే=విడువంబడదో; తథా = అట్లు; భవంతః=మీరలు ; ప్రీతిస్నిగ్ధేన, ప్రీతి=ప్రేమచే, స్నిగ్ధేన=ఆర్ద్రమైన; చేతసా=మనస్సుతో; కుర్వంతు=చేయుదురుగాక.

సమస్తమునుం జక్కఁగాఁ జేయఁబడి, కొంచమైనను విడువంబడకుండునట్లు, మిక్కిలిప్రేమగలహృదయముతో,మీరలు, చేయుదురుగాక అని,వసిష్ఠుఁడు, ఆబ్రాహ్మణులంజూచి, చెప్పెను , అని తాత్పర్యము.

తత స్సర్వే సమాగమ్య వసిష్ఠ మిద మబ్రువ[illegible] ౧౬

యథోక్తం త త్సువిహితం నకించి త్పరిహీయతే
యథోక్తం త త్కరిష్యామో నకించి త్పరిహాస్యతే. ౧౭

టీక॥ తతః=ఆపిమ్మట;సర్వే=అందఱును; సమాగమ్య=వచ్చి;వసిష్ఠం=వసిష్ఠునిఁగూర్చి; తత్=ఆ, రాజగృహముల నేర్పఱచుట మొదలగు కార్యము; యథా = ఎట్లు;ఉక్తం = చెప్పఁబడినదో; తథా(అధ్యాహృతము) = అట్లు; సువిహితం=చక్కఁగాఁజేయఁబడినది. కించిత్=కొంచెమైనను; నపరిహీయతే=విడువంబడలేదు. తత్=ఆ,అన్నదానము మొదలగు కార్యము ; యథా=ఎట్లు;ఉక్తం=చెప్పఁబడెనో;తథా(అధ్యాహృతము) = అట్లు,కరిష్యామః = చేసెదము. కించిత్ = కొంచెమైనను;నపరిహాస్యతే=విడువఁబడదు;ఇదం = ఈవాక్యమును;అబ్రువన్=చెప్పిరి.

అంతట,వారలందఱును,వచ్చి, "రాజగృహములనిర్మించుట మొదలగువానిం,దాము సెలవిచ్చినపద్ధతినే,చక్కఁగాఁజేసితిమి;కొంచెమైనను విడువలేదు; అన్నదానము మొదలగువానినిం,దాము సెలవిచ్చినట్లే, చేసెదము, కొంచెమైనను, విడవము"అని, వసిష్ఠునితోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

తత స్సుమంత్ర మానీయ వసిష్ఠో వాక్య మబ్రవీత్

టీక॥ తతః=ఆపిమ్మట; వసిష్ఠః=వసిష్ఠుఁడు; సుమంత్రం=సుమంత్రుని; ఆనీయ=రప్పించి; వాక్యం=(వక్ష్యమాణమగు)మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, వసిష్ఠుఁడు, సుమంత్రుని రావించి,యిట్లని,చెప్పెను.

అని,తాత్పర్యము.

నిమంత్రయస్వ నృపతీన్ పృథివ్యాం యేచ ధార్మికాః. ౧౮

టీక॥ పృథివ్యాం = భూమియందు;యే=ఎవరు (చకారంబు పాదపూరణార్థము); ధార్మికాః = ధర్మమునాచరించువార

లో; తాన్ (అధ్యాహృతము)=ఆ; నృపతీన్=రాజులను; నిమంత్రయస్వ=పిలువుము.

భూమండలమందు ధార్మికులుగానున్నరాజులనందఱిఁ బిలువుము. అని, తాత్పర్యము.

బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాంశ్చైవ సహస్రశః
సమానయస్వ సత్కృత్య సర్వదేశేషు మానవాన్. ౧౯

టీక॥ బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులును; క్షత్రియాన్= క్షత్రియులును; వైశ్యాన్=వైశ్యులును; శూద్రాంశ్చైవ=శూద్రులునగు; సర్వదేశేషు = సమస్తదేశములందును; స్థితాన్ (అధ్యాహృతము)= ఉన్నట్టి; మానవాన్= మనుష్యులను; సత్కృత్య=పూజించి, సహస్రశః= వేనవేలుగా; సమానయస్వ=తెమ్ము.

సమస్తదేశముల యందుండు, బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రులనుం, బూజించి, వేనవేల కొలందిని టకుఁ, దోడితెమ్ము.

అని, తాత్పర్యము.

మిథిలాధిపతిం శూరం జనకం సత్యవిక్రమమ్
నిష్ఠితం సర్వశాస్త్రేషు తథా వేదేషు నిష్ఠితమ్. ౨౦
తమానయ మహాభాగం స్వయమేవ సుసత్కృతమ్
పూర్వసంబంధినం జ్ఞాత్వా తతః పూర్వం బ్రవీమి తే. ౨౧

టీక ॥ మిథిలాధిపతిం=మిథిలదేశమునకుఁబ్రభువును; శూరం= యుద్ధమునందుభయము లేనివాఁడును; సత్యవిక్రమం= యథార్థపరాక్రమముగలవాఁడును; సర్వశాస్త్రేషు=సమస్తశాస్త్రములయందును; నిష్ఠితం=సమర్థుఁడును; తథా=అట్లు; వేదేషు=వేదములందు; నిష్ఠితం=సమర్థుఁడును; మహాభాగం = గొప్పభాగ్యముగలవాఁడునగు; తం=ఆ; జనకం=జనకమహారాజును; స్వయమేవ=నీవే;

సుసత్కృతం=చక్కఁగాఁబూజింపఁబడినవానిఁగా; అనయ=తోడితెమ్ము; తం (అధ్యాహృతము) = ఆజనక మహారాజును; పూర్వసంబంధినం=మునుపటిబంధుసంబంధముగలవానిఁగ; జ్ఞాత్వా=ఎఱింగి; తతః=అందువలన; పూర్వం=ముందు; తే=నీకు; బ్రవీమి=చెప్పుచున్నాను.

దృఢ సర్వాక్రియముగలిగి హా

దుండై, సమస్తశాస్త్రములును వేదములునుం జక్కఁగా నెఱింగి, మహాభాగ్యశాలియై యున్న, మిథిలాధిపతియగు జనకమహారాజును, నీవే, నానావిధ సత్కారములుం జేసి, తోడితెమ్ము; అతఁడు మునుపటిసంబంధియని యెఱింగి యున్నందున, మొదట, నతనిఁదోడితెమ్మని, నీకుఁ జెప్పితిని.

అని, తాత్పర్యము.

తథా కాశీపతిం స్నిగ్ధం సతతం ప్రియవాదినమ్
వయస్యం రాజసింహస్య స్వయమేవా నయస్వ హ. ౨౨

టీక॥ తథా=అట్లు; స్నిగ్ధం=దయగలవాఁడును; సతతం = ఎల్లప్పుడును; ప్రియవాదినం=సంతోషముపుట్టునట్లు మాటలాడు వాఁడును; రాజసింహస్య=రాజశ్రేష్ఠుఁడగు దశరథునకు; వయస్యం=స్నేహితుఁడునగు; కాశీపతిం=కాశీదేశపురాజును; స్వయమేవ=నీవే; ఆనయస్వ=తోడితెమ్ము("హ" అనునది పాదపూరణార్థము).

దయాశాలియు, నెల్లప్పుడునుం బ్రియముగా మాటలాడువాఁడునై, రాజశ్రేష్ఠుండగు దశరథునకుఁ బ్రియమిత్రుండై యుండు, కాశీరాజును, నీవే, తోడితెమ్ము.

అని, తాత్పర్యము.

తథా కేకయరాజానం వృద్ధం పరమ ధార్మికమ్.
శ్వశురం రాజసింహస్య సపుత్రం త్వ మిహానయ. ౨౩

టీక॥ తథా=అట్లు; త్వం=నీవు; ఇహ=ఇచ్చటికి; వృద్ధం=ముసలివాఁడును; పరమధార్మికం=మిక్కిలిధర్మము నాచరించువాఁడు

ను; రాజసింహస్య=రాజశ్రేష్ఠుండగుదశరథునకు;శ్వశురం=మామగారునగు; సపుత్రం=కొడుకుతోఁగూడుకొనిన; కేకయరాజానం=కేకయదేశపురాజును; ఆనయ = తోడితెమ్ము.

వృద్ధుండై, ధర్మమునాచరించువారలలో శ్రేష్ఠుండై, రాజశ్రేష్ఠుండగు దశరథునకు మామయైన కేకయరాజు, నతనికుమారునితోఁగూడనిచ్చటికి,నీవుతోడితెమ్ము.

అని తాత్పర్యము.

అంగేశ్వరం మహాభాగం రోమపాదం సుసంస్కృతమ్
వయస్యం రాజసింహస్య సమానయ యశస్వినమ్. ౨౪

టీక॥ అంగేశ్వరం=అంగదేశప్రభువును; మహాభాగం=పూజ్యమగుభాగ్యముగలవాఁడును;సుసంస్కృతం=చక్కగా నలంకరింపఁబడినవాఁడును; రాజసింహస్య=రాజశ్రేష్ఠుండగు దశరథునకు, వయస్యం=స్నేహితుండును; యశస్వినం= శ్రేష్ఠమైనకీర్తిగలవాఁడునగు; రోమపాదం = రోమపాదమహారాజును;సమానయ=చక్కగాఁదోడితెమ్ము.

సద్గుణంబులచే నలంకరింపఁబడి, శ్రేష్ఠంబైనకీర్తిగలిగి,మహాభాగ్యశాలియై, రాజశ్రేష్ఠుండగు దశరథునకుఁ బ్రియమిత్రుండై, యున్న,యంగదేశాధిపతియగు రోమపాదునిందోడితెమ్ము.

అని, తాత్పర్యము.

ప్రాచీనా న్సింధుసౌవీరాన్ సౌరాష్ట్రేయాంశ్చ పార్థివాన్
దాక్షిణాత్యా న్నరేంద్రాంశ్చ సమస్తా నానయస్వహ. ౨౫

టీక॥ ప్రాచీనాన్=తూర్పుదిక్కునందలిరాజులను; సింధుసౌవీరాన్ = సింధుసౌవీర దేశంబులందుండు రాజులను; సౌరాష్ట్రేయాన్= సౌరాష్ట్రదేశమునందుండు; పార్థివాంశ్చ=రాజులను; దాక్షిణాత్యాన్=దక్షిణపుదిక్కునందుండు;నరేంద్రాంశ్చ=రాజులను;




సమస్తాన్ = అందఱను; ఆనయ స్వ=తోడి తెమ్ము (హకారంబు పాదపూరణార్థము).

తూర్పుదిక్కునందలి రాజులను, సింధుసౌవీర దేశంబులనుండు రాజులను, సౌరాష్ట్ర దేశమునందుండు రాజులను, దక్షిణపుదిక్కునందలి రాజులను, నందఱం దోడి తెమ్ము.

అని, తాత్పర్యము.

సంతి స్నిగ్ధాశ్చ యేచాన్యే రాజానః పృధివీతలే
తానానయ యధాక్షిప్రం సానుగాన్ సహబాంధవాన్. ౨౮

టీక॥ పృధివీతలే=భూమండలమందు; స్నిగ్ధాః=దయగలవారును; అన్యేచ=ఇతరులునగు; యే=ఏ; రాజానః = రాజులు; సంతి=కలరో; తాంశ్చ=వారలను; సానుగాన్=పరివారముతోఁగూడినవారుగాను; సహబాంధవాన్=బంధువులతోఁగూడినవారుగాను; యధాక్షిప్రం=వేగమునతిక్రమింపక; ఆనయ=తోడితెమ్ము. మఱియు, భూమండలమందు, స్నేహులైనదయాదిసద్గుణములు గల రాజు లెవ్వరుగలరో, వారినందఱను బరివారబంధు జనంబులతోడం గూడశీఘ్రంబుగఁదోడి తెమ్ము; అని వసిష్ఠుఁడుసుమంత్రునకుఁజెప్పెను.

అని తాత్పర్యము.

వసిష్ఠవాక్యం తచ్ఛ్రుత్వా సుమంత్ర స్త్వరిత స్తదా
వ్యాదిశ త్పురుషాం స్తత్ర రాజ్ఞా మానయనే శుభాన్. ౨౯

టీక॥ తత్ =ఆ; వసిష్ఠవాక్యం=వసిష్ఠునిమాటను; శ్రుత్వా=విని; తదా=అప్పుడు; సుమంత్రః=సుమంత్రుఁడు; త్వరితః = వేగముగలవాఁడై; తత్ర=అచ్చట; రాజ్ఞాం=రాజులయొక్క (రాజులను); ఆనయనే=తోడితెచ్చుటయందు; శుభాన్ = మంచిగుణములుగల; పురుషాన్=పురుషులను; వ్యాదిశత్=ఆజ్ఞాపించెను.

సుమంత్రుండావసిష్ఠవచనమువిని, శీఘ్రముగాఁ, గొందఱ రాజులఁ, దోడితెచ్చుటకు, సద్గుణసంపన్నులయిన, పురుషులం, బంచెను.

అని తాత్పర్యము.




స్వయమేవహి ధర్మాత్మా ప్రయయౌ మునిశాసనాత్
సుమంత్ర స్త్వరితో భూత్వా సమానేతుం మహీక్షితః. ౨౮

టీక॥ మునిశాసనాత్=వసిష్ఠ మహాముని యాజ్ఞ వలన; ధర్మాత్మా = ధర్మస్వభావుండగు; సుమంత్రః=సుమంత్రుఁడు; త్వరితః=వేగము గలవాఁడు; భూత్వా=అయి; మహీక్షితః=రాజులను; సమానేతుం = చక్కఁగాఁదోడి తెచ్చుటకు; స్వయమేవ=తానే; ప్రయయౌ హి=పోయెనుగదా.

వసిష్ఠమహామునిపనుపునంజేసి, ధర్మస్వభావుండగు సుమంత్రుండు, జనకమహారాజుమొదలగుమహారాజులఁ, జక్కఁగాఁబిలిచికొనివచ్చుటకు, శీఘ్రముగాఁదానేపోయెను.

అని తాత్పర్యము.

తేచ కర్మాంతికా స్సర్వే వసిష్ఠాయ చ ధీమతే
సర్వం నివేదయంతి స్మ యజ్ఞే య దుపకల్పితమ్. ౨౯

టీక॥ తే=ఆ; కర్మాంతికాః=పనివాండ్రు; సర్వేచ=అందఱును; యజ్ఞే=యాగమునందు(యాగనిమిత్తము); యత్ = ఏది; ఉపకల్పితం=చేయఁబడెనో; తత్(అధ్యాహృతము)=దాని; సర్వం=అంతను; ధీమతే = బుద్ధిమంతుఁడగు; వసిష్ఠాయ = వసిష్ఠునికొఱకు(చకారము పాదపూరణార్థము); నివేదయంతిస్మ=అప్పగించిరి.

ఆపని వాండ్రందఱును, తాము యాగ నిమిత్తము నిర్మించిన దంతయు, బుద్ధిమంతుండగువసిష్ఠున,కప్పగించిరి.

అని తాత్పర్యము.

తతః ప్రీతో ద్విజశ్రేష్ఠ స్తాన్ సర్వా నిద మబ్రవీత్
అవజ్ఞయా న దాతవ్యం కస్యచి ల్లీలయాపివా. ౩౦
అవజ్ఞయా కృతం హన్యా ద్దాతార న్నాత్ర సంశయః

టీక॥ తతః = అంతట; ద్విజశ్రేష్ఠః = బ్రాహ్మణశ్రేష్ఠుండగు వసిష్ఠుండు; ప్రీతః = సంతసించినవాఁడై; తాన్ = ఆపనివాండ్రను; సర్వాన్ = అందఱనుంగూర్చి; "కస్యచిత్ = ఒకానొకనికైనను; అవజ్ఞయా = అనాదరముచేతఁగాని; లీలయాపివా = అశ్రద్ధచేతఁగాని; న దాతవ్యం = ఇవ్వఁబడఁగూడదు. అవజ్ఞయా = అనాదరముచేత; కృతం = చేయఁబడిన దానము; దాతారం = దానముచేయువాని; హన్యాత్ = చంపును; అత్ర = ఈవిషయమందు; సంశయః = సందియము; న = లేదు" ఇదం = ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, బ్రాహ్మణశ్రేష్ఠుండగు వసిష్ఠుండు, సంతసించి, యాపనివాండ్ర నందఱంబూచి, "అనాదరముగాఁగాని, శ్రద్ధలేకగాని, యొకానొకనికైనను, దానము చేయఁగూడదు; అనాదరముగా దానచేసినట్టయిన, దానము చేయువానికిం గీడువాటిల్లును, ఇందెంతమాత్రముసందియంబులేదు." అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తతః కైశ్చి దహోరాత్రై రుపయాతా మహీక్షితః. ౩౧
బహూని రత్నాన్యాదాయ రాజ్ఞో దశరథస్యవై

టీక॥ తతః = ఆపిమ్మట; కైశ్చిత్ = కొన్ని; అహోరాత్రైః = అహోరాత్రములచేత; మహీక్షితః = రాజులు; రాజ్ఞః = రాజైన; దశరథస్య = దశరథునకు; ("వై" అనునది పాద పూరణార్థము). బహూని = అనేకములైన; రత్నాని = మణులను; ఆదాయ = తీసికొని; ఉపయాతాః = వచ్చిరి.

అంతఁ, గొన్ని యహోరాత్రంబులకు, రాజులందఱు, దశరథమహారాజునకుపాయనంబిడుటకై, పెక్కుమణులందీసికొని, వచ్చిరి.

అని, తాత్పర్యము.

తతో వసిష్ఠ స్సుప్రీతో రాజాన మిద మబ్రవీత్. ౩౨

స ౧౩



తతః=ఆపిమ్మట, వసిష్ఠః=వసిష్ఠుఁడు; సుప్రీతః=మిక్కిలిసంతసించినవాఁడై; రాజానం= దశరథమహారాజునుగూర్చి; ఇదం=ఈ; మాటను; అబ్రవీత్ =చెప్పెను.

అంత, వసిష్ఠుండు, మిక్కిలి సంతసించి, దశరథమహారాజుతో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఉపయాతా నరవ్యాఘ్ర రాజాన స్తవ శాసనాత్
మయాపి సత్కృతా స్సర్వే యథార్హంరాజసత్తమాః. ౩౩

టీక ॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడైనదశరథుఁడా ! తవ=నీయొక్క, శాసనాత్ =ఆజ్ఞవలన; రాజానః=రాజులు; ఉపయాతాః=వచ్చిరి; రాజసత్తమాః=రాజశ్రేష్ఠులు; సర్వే=అందఱు; మయాపి=నాచేతను; యథార్హం=యథాయోగ్యముగ; సత్కృతాః= పూజింపఁబడిరి.

పురుషశ్రేష్ఠుండవైన దశరథుఁడా! నీయాజ్ఞవలన రాజులందఱువచ్చిరి, నేను, నారాజశ్రేష్ఠుల, వారి వారిగౌరవమునకుం దగురీతింబూజించితిని. అని తాత్పర్యము.

యజ్ఞీయం చ కృతం రాజన్ పురుషై స్సుసమాహితైః
నిర్యాతు చ భవాన్యష్టుం యజ్ఞాయతన మంతికాత్. ౩౪
సర్వకామై రుపహృతై రుపేతం వై సమంతతః

టీక॥ రాజన్ = దశరథమహారాజా! సుసమాహితైః=మిక్కిలిమెచ్చరికగలిగిన; పురుషైః=పురుషులచేత; యజ్ఞీయంచ=యాగమునకుఁగావలయునన్నియును; కృతం=చేయఁబడినది. భవాంశ్చ=నీవును; యష్టుం=యాగముసేయుటకు; అంతికాత్ = (సప్తమ్యర్థమందుఁబంచమి)సమీపమునందు; సమంతతః = అంతటను; ఉపహృతైః=చేర్చఁబడిన; సర్వకామైః= సమస్తములైన కామ్యవస్తువులతో ;



ఉపేతం=కూడినట్టి ("వై" అనునది పాదపూరణార్థము); యజ్ఞాయతనం= యాగశాలనుగూర్చి; నిర్యాతు=బయలు వెడలుదువుగాక.

రాజపురుషులు మిక్కిలి యెచ్చరికగలిగి, యాగమునకుఁగావలయువానిం జేసిరి; నీవును, యాగముసేయుటకై, సమీపమందు, సమస్తకామంబులనంతటను, నిండియున్న, యజ్ఞశాలఁబ్రవేశింపుము.

అని, తాత్పర్యము.

ద్రష్టు మర్హసి రాజేంద్ర మనసేవ వినిర్మితమ్. ౩౫

టీక॥ రాజేంద్ర = రాజశ్రేష్ఠుఁడా; మనసా=మనస్సుచేత; వినిర్మితమివ(స్థితం)=చేయఁబడిన దన్నట్లున్న, యాగశాలను; ద్రష్టుం=చూచుటకు; అర్హసి=తగుదువు.

రాజశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా నీవు, మనస్సుచేఁజేయఁబడినట్లతిశీఘ్రముగానిర్మింపఁబడిన యాగశాలనుంజూడవలయును.

అని, తాత్పర్యము.

తథా వసిష్ఠ వచనా దృశ్యశృంగస్య చోభయోః
శుభే దివస నక్షత్రే నిర్యాతో జగతీపతిః. ౩౬

టీక॥ తథా=అట్లుః వసిష్ఠస్య=వసిష్ఠుని యొక్కయు; ఋశ్యశృంగస్యచ = ఋశ్యశృంగుని యొక్కయు; ఉభయోః=ఇద్దఱియొక్క; వచనాత్= మాటవలన; జగతీపతిః=భూమికిఁ బ్రభువైనదశరథుఁడు; శుభే=మంగళకరమైన; దివసనక్షత్రే=దినమందునునక్షత్రమందును; నిర్యాతః=బయలు వెడలెను.

ఇచ్చట, "వసిష్ఠస్యవచనాత్" అనిచెప్పవలసియుండఁగా, ఆర్షమగుటంజేసి, "వసిష్ఠస్య" అనుపదమునందలి విభక్తి ప్రత్యయంబగు "స్య" అనుదాని, లోపింపఁజేసి, "వసిష్ఠవచనాత్" అనిప్రయుక్తంబైనది. కావున, "వసిష్ఠస్య వచనాత్" అనియేవిభాగముచేసి వ్యాఖ్యానము వ్రాయఁబడినది.

ఆప్రకారము, వసిష్ఠుండును ఋష్యశృంగుండునుం జెప్పఁగా, దశరథ మహారాజు, మంగళకరమైన, వారనక్షత్రముగలతిథియందు, గృహమునుండి, యాగశాలకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తతో వసిష్ఠ ప్రముఖా స్సర్వఏవ ద్విజోత్తమాః
ఋశ్యశృంగం పురస్కృత్య యజ్ఞకర్మారభం స్తదా. ౩౭

టీక॥తతః=ఆపిమ్మట; తదా=అప్పుడు; వసిష్ఠప్రముఖాః=వసిష్ఠుఁడు మొదలు గాఁగల; ద్విజోత్తమాః=బ్రాహ్మణశ్రేష్ఠులు; సర్వఏవ=అందఱునే; ఋశ్యశృంగం=ఋశ్యశృంగుని; పురస్కృత్య=మున్నిడికొని; యజ్ఞకర్మ=యాగకార్యమును; ఆరభన్=మొదలుపెట్టిరి.

అంత, వసిష్ఠుఁడు మొదలగు బ్రాహ్మణశ్రేష్ఠులందఱు, ఋశ్యశృంగు మున్నిడుకొని, యాగకార్యము నారంభించిరి. అని తాత్పర్యము.

యజ్ఞవాట గతా స్సర్వే యథాశాస్త్రం యథావిధి

టీక॥సర్వే=అందఱును; యజ్ఞవాటగతాః= యాగశాలనుబొందినవారలై; యథాశాస్త్రం=కల్పసూత్రమునతిక్రమింపక; యథావిధి=వేదమందుఁ జెప్పఁబడిన దానినతిక్రమింపక; ఆరభన్(అధ్యాహృతము)=ఆరంభించిరి.

అందఱును, యాగశాలం జేరి, కల్పములోఁ జెప్పఁబడినట్లును, వేదములచే విధింపఁబడినట్లును, యాగకార్యంబులఁ, జేయసాగిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, త్రయోదశ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండ త్రయోదశసర్గ టీక,
ముగిసినది.

శ్రీ

చతుర్దశసర్గప్రారంభః.

అధ సంవత్సరే పూర్ణే తస్మిౝ ప్రాప్తే తురంగమే
సరయ్వాశ్చోత్తరే తీరే రాజ్ఞో యజ్ఞోఽభ్యవర్తత. ౧

టీక॥ అధ=గుఱ్ఱమునువిడిచినపిమ్మట; సంవత్సరే = ఏఁడాది; పూర్ణే=నిండఁగా; తస్మిౝ=ఆ; తురంగమే=గుఱ్ఱము; ప్రాప్తే=రాఁగా; సరయ్వాః=సరయూనదియొక్క; ఉత్తరే = ఉత్తరపుదిక్కునందలి; తీరే=గట్టునందు; రాజ్ఞః=దశరధమహారాజుయొక్క; యజ్ఞశ్చ=యాగమును; అభ్యవర్తత=జరిగినది.

గుఱ్ఱమును విడిచియేఁడాదియు నిండఁగానే యాగుఱ్ఱముమఱలవచ్చినది; అంత, సరయూనదియుత్తరతీరమందు, దశరధుని, యశ్వమేధము, ప్రవర్తించెను. అని తాత్పర్యము.

ఋశ్యశృంగం పురస్కృత్య కర్మ చక్రు ర్ద్విజర్షభాః
అశ్వమేధే మహాయజ్ఞే రాజ్ఞోస్య సుమహాత్మనః. ౨

టీక॥ ద్విజర్షభాః = బ్రాహ్మణశ్రేష్ఠులు; సుమహాత్మనః = మిక్కిలి పూజ్యమైనస్వభావముగల; అస్య=ఈ; రాజ్ఞః=దశరధమహారాజుయొక్క; అశ్వమేధే = అశ్వమేధమనెడు; మహాయజ్ఞే = గొప్పయాగమునందు; ఋశ్యశృంగం=ఋశ్యశృంగుని; పురస్కృత్య=మున్నిడుకొని; కర్మ=కార్యమును; చక్రుః=చేసిరి.

మిక్కిలి పూజ్యంబగు స్వభావముగలయీదశరధుని యశ్వమేధమహాయాగమునందు, బ్రాహ్మణశ్రేష్ఠులందఱు, ఋశ్యశృంగునిమున్నిడికొని, కార్యములం, జేయుచుండిరి. అని తాత్పర్యము.

కర్మ కుర్వంతి విధివ ద్యాజకా వేదపారగాః
యథావిధి యథాన్యాయం పరిక్రామంతి శాస్త్రతః. ౩

టీక॥ వేదపారగాః=వేదముల యొక్క-యంతమునెఱింగినట్టి; యాజకాః=ఋత్విజులు; విధివత్=యథాశాస్త్రముగ; కర్మ=కార్యమును; కుర్వంతి = (భూతార్థమందులట్)చేయుచుండిరి. యథావిధి=వేదములయందుఁ జెప్పఁబడినదానినతిక్రమింపక; యథాన్యాయం = మీమాంసాన్యాయము [illegible] పక; శాస్త్రతః=కల్ప[illegible]త్రములవ; పరిక్రామంతి=(భూతార్థమందులట్)సంచరింపుచుండిరి.

సమస్త వేదముల పారంబు నెఱింగినట్టి ఋత్విజులు, యథాశాస్త్రముగఁ, గర్మములం జేయుచు, వేదంబుల యందు విధింపఁబడినట్లును, మీమాంసాన్యాయంబుల నిశ్చితంబగునట్లును, కల్పసూత్రంబునఁ జెప్పంబడినట్లును, సంచరింపుచుండిరి.

అని, తాత్పర్యము.

ప్రవర్గ్యం శాస్త్రతః కృత్వా తథైవోపసదం ద్విజాః
చక్రుశ్చ విధివత్సర్వ మధికం కర్మ శాస్త్రతః. ౪

టీక॥ ద్విజాః=బ్రాహ్మణులు; శాస్త్రతః= శాస్త్రప్రకారమున; ప్రవర్గ్యం= ప్రవర్గ్యమనుకర్మమును; తథైవ=ఆలాగే; ఉపసదం= ఉపసత్తు అనెడు కర్మమును; కృత్వా=చేసి; సర్వం=సమస్తమైన; కర్మచ=కర్మమును; విధివత్=వేదవిధిప్రకారము; శాస్త్రతః=కల్పసూత్రప్రకారమున; అధికం=ఎచ్చుగా (కొఱఁతపడకుండననుట) చక్రుః=చేసిరి.

బ్రాహ్మణులు, ప్రవర్గ్యమును, ఉపసత్తును, యథా శాస్త్రముగఁ జేసి, సమస్తమయినకర్మమును, వేదవిధిప్రకారమును, కల్పసూత్రమందుఁ జెప్పఁబడినట్లును, గొఱంతపడకుండఁ, జేసిరి.

అని తాత్పర్యము.

అభిపూజ్య తతో హృష్టా స్సర్వే చక్రు ర్యథావిధి
ప్రాతస్సవనపూర్వాణి కర్మాణి మునిపుంగవాః. ౫

టీక॥తతః=ఆపిమ్మట;మునిపుంగవాః=మునిశ్రేష్ఠులు; సర్వే=అందఱును;హృష్టాః=సంతసించినవారలై;అభిపూజ్య= ఆయాకర్మదేవతలను,పూజించి; ప్రాతస్సవనపూర్వాణి=ప్రాతస్సవనముమొదలుగాఁగల;కర్మాణి=కర్మములను; యథావిధి=యథాశాస్త్రముగ;చక్రుః=చేసిరి.

మునిశ్రేష్ఠులందఱును,సంతోషముతో, నాయా కర్మదేవతలం బూజించి,ప్రాతస్సవనము మొదలగుకర్మంబుల, యథాశాస్త్రముగాఁజేసిరి. అని తాత్పర్యము.

ఐంద్రశ్చ విధివ ద్దత్తో రాజాచా భిష్టుతోఽనఘః
మాధ్యందినంచ సవనం ప్రావర్తత యథాక్రమమ్. ౬

టీక॥ ఐంద్రశ్చ=ఇంద్రదేవతాకమైనహవిర్భాగమును; విధివత్=యథా శాస్త్రముగ ; దత్తః=ఇవ్వఁ బడినది. అనఘః = దోషరహితమైన; రాజాచ=సోమలతయును;అభిష్టుతః=స్తుతింపఁబడినది. మాధ్యందినం=మధ్యాహ్నమందుఁజేయఁదగిన; సవనంచ=సవనకర్మమును; యథాక్రమం=వరుసనతిక్రమింపక;ప్రావర్తత=ప్రవర్తించెను.

ఇంద్రునకివ్వవలసిన హవిర్భాగంబింద్రునకివ్వఁబడినది;దోషరహితంబగుసోమలతయును, స్తుతింపఁబడినది; యథాక్రమముగా, మాధ్యందినసవనము నుజరిగిది.

అని,తాత్పర్యము.

తృతీయ సవనం చైవ రాజ్ఞోఽస్య సుమహాత్మనః
చక్రు స్తే శాస్త్రతో దృష్ట్వా తథా బ్రాహ్మణ పుంగవాః. ౭

టీక॥తథా=అట్లు; తే=ఆ;బ్రాహ్మణపుంగవాః=బ్రాహ్మణశ్రేష్ఠులు;సుమహాత్మనః=మిక్కిలిపూజ్యమగుస్వభావముగల; అస్య=ఈ; రాజ్ఞః= (చతుర్థ్యర్థమందుషష్ఠి) దశరథమహారాజుకొఱకు; శాస్త్ర

తః=శాస్త్రమువలన; దృష్ట్వా=చూచి; తృతీయసవనంచైవ=తృతీయసవనమును; చక్రుః=చేసిరి.

ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు, మహాత్ముండగు దశరథమహారాజుకొఱకు, శాస్త్రప్రకారము నెఱింగి, తృతీయసవనమునుం జేసిరి.

అని, తాత్పర్యము.

న చాహుత మభూ త్తత్ర స్ఖలితం వాపి కించన
దృశ్యతే బ్రహ్మవ త్సర్వం క్షేమయుక్తం హి చక్రిరే. ౮

టీక॥ తత్ర=ఆయాగమందు, అహుతం=వేల్వఁబడనిది గాని; స్ఖలితంవాపి=తప్పినది గాని; కించనచ=కొంచెమైనను; నాభూత్=కాలేదు. సర్వం=సమస్తమును; బ్రహ్మవ[illegible]=మంత్రయుక్తముగా; దృశ్యతే=(భూతార్థమందు లట్) కనుపడుచుండినది. క్షేమయు[illegible]=క్షేమముతోఁగూడియుం[illegible]; చక్రిరేహి=చేసిరిగదా!

ఆయాగమునందు, మంత్రప్రకారము వేల్వఁబడనిది గాని, వేఱువిధముగా వేల్వఁబడినదిఁ గాని కొంచెమైననుండలేదు; విఘ్నములేమియు లేక, క్షేమముతోనే చేసిరి కావున, మంత్రయుక్తముగానే, యంతయు [illegible]నుపడుచుండినది.

[illegible]ని తాత్పర్యము.

న తే ష్వహస్సు శ్రాంతో వా క్షుధితో వాపి దృశ్యతే
నావిద్వా న్బ్రాహ్మణ స్తత్ర నాశతానుచర స్తథా. ౯

టీక॥ తత్ర=ఆయాగమందు; తేషు=ఆ; అహస్సు=దినములందు; శ్రాంతో వా=శ్రమమును బొందినవాఁడు గాని, క్షుధితో వాపి=ఆకలిగొన్నవాఁడు గాని; నదృశ్యతే=కనుపడలేదు. అవిద్వాన్=పండితుఁడు గాని; బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు; న(దృశ్యతే)=కనుపడలేదు. తథా=అట్లు; అశతానుచరః=నూఱుగురు పరివారజనులు లేనివాఁడు; న(దృశ్యతే)=కనుపడలేదు.

ఆయశ్వమేధయాగదినములందు,

దప్పిగొన్నవాఁడు గాని, యాఁకలిగొన్నవాఁడుగాని, కనుపడలేదు; పండితుఁడు గాని బ్రాహ్మణుండు నుండలేదు; నూఱుగురు పరివారజనులు లేనివాఁడు దొరకలేదు.

అని, తాత్పర్యము.

బ్రాహ్మణా భుంజతే నిత్యం నాథవంతశ్చ భుంజతే
తాపసా భుంజతే చాపి శ్రమణా భుంజతే తథా. ౧౦

టీక॥ నిత్యం=ఎల్లప్పుడును; బ్రాహ్మణాః= బ్రాహ్మణులు; భుంజతే=(భూతార్థమందులట్) భుజింపుచుండిరి; నాథవంతశ్చ=నాథులుగలవారును (శూద్రులు మొదలగుదాసులనట); భుంజతే=భుజింపుచుండిరి. తాపసాశ్చాపి=తపస్సు చేయువారును; భుంజతే=భుజింపుచుండిరి. తథా=అట్లు; శ్రమణాః= సన్న్యాసులు; భుంజతే= భుజింపుచుండిరి.

యాగమునందు, ఎల్లప్పుడును బ్రాహ్మణులును, శూద్రులును, దపస్వులును, సన్న్యాసులును, భుజింపుచుండిరి.

అని, తాత్పర్యము.

వృద్ధాశ్చ వ్యాధితాశ్చైవ స్త్రియో బాలా స్తథైవచ
అనిశం భుంజమానానాం న తృప్తి రుపలభ్యతే. ౧౧

టీక॥ వృద్ధాశ్చ=ముసలివాండ్రును; వ్యాధితాశ్చైవ= వ్యాధిగలవారును; స్త్రియః=స్త్రీలును; తథైవ=అలాగే; బాలాశ్చ=పిన్నవాండ్రును; ఏతేషాం(అధ్యాహృతము) వీరలు; అనిశం=ఎల్లప్పుడును; భుంజమానానాం= భుజింపుచున్నను; తృప్తిః=తనివి; నోపలభ్యతే=పొందఁబడలేదు.

ముసలివాండ్రును, వ్యాధిగ్రస్తులును, స్త్రీలును, బాలురును, ఎల్లప్పుడును భుజింపుచున్న వారైనను, పదార్థముల యందలి రుచ్యతిశయమువలనఁ, దనివినొందలేరైరి, అని, గాని; లేక ముసలివాండ్రును వ్యాధిగ్రస్తులును, స్త్రీలును, బాలురును, ఎ

ల్లప్పుడునుభుజింపుచున్నను, మహాదాతయగుదశరథమహారాజు దనివినొందక, "యింకను భుజింపుదురుగాక" యనియే,కోరుచుండెను,అని,గాని, తాత్పర్యము.

దీయతాం దీయతా మన్నం వాసాంసి వివిధానిచ
ఇతి సంచోదితా స్తత్ర తథా చక్రు రనేకశః. ౧౨

టీక॥ తత్ర=ఆయాగమునందు; అన్నం=అన్నము;దీయతాం = ఇవ్వఁబడుఁగాక! దీయతాం=ఇవ్వఁబడుఁగాక!వివిధాని = నానావిధములైన;వాసాంసిచ=వస్త్రములును; దీయంతాం (అధ్యాహృతము)=ఇవ్వఁబడుఁగాక! ఇతి = ఇట్లు; సంచోదితాః=ప్రేరేపింపఁబడినవారలై; తథా=ఆప్రకారము; అనేకశః = అనేకవిధములుగా,చక్రుః=చేసిరి.

"అన్నం, బివ్వఁబడుఁగాక!యివ్వఁబడుఁగాక! నానావిధంబులగు వస్త్రిలబులునివ్వంబడుఁగాక!" అని,దశరథునిచే, నాదరాతిశయంబునఁబలుమఱుఁ, బ్రేరేపింపఁబడినవారలై,రాజపురుషు, లాప్రకారమనేకవిధములుగా,నిచ్చిరి.

అనితాత్పర్యము.

అన్నకూటాశ్చ బహవో దృశ్యంతే పర్వతోపమాః
దివసే దివసే తత్ర సిద్ధస్య విధివ త్తదా. ౧౩

ఇచ్చట,"అన్నస్యకూటాః"అని చెప్పవలసియుండఁగా, అర్థంబగుటచే,"స్య"అనునదిలుప్తముగా,"అన్నకూటాః" అనిచెప్పఁబడినది,

టీక॥ తత్ర ఆయాగశాలయందు;తదా=ఆయాగకాలమందు; దివసేదివసే=ప్రతిదినమందును; విధివత్=పాకశాస్త్రిపకారముగ; సిద్ధస్య=ఈడేఱిన;అన్నస్య = అన్నముయొక్క;బహవః=అనేకములును; పర్వతోపమాః=కొండలతోసరియైనవియునగు; కూటాశ్చ =

రాసులును; దృశ్యంతే=(భూతార్థమందులట్)కనుపడుచుండినవి.

ఆయాగశాలలో,నప్పుడు,ప్రతిదినమందును, పాకశాస్త్రపద్ధతిగసిద్ధముచేయఁబడినకొండలంతేశియన్నరాసులనేకములు,కనుపడినవి.

అని తాత్పర్యము.

నానాదేశా దనుప్రాప్తాః పురుషా స్త్రీగణా స్తథా
అన్నపానై స్సువిహితా స్తస్మి న్యజ్ఞే మహాత్మనః. ౧౪

టీక॥ మహాత్మనః =పూజ్యమైనస్వభావముగలదశరథునియొక్క; తస్మిన్=ఆ;యజ్ఞే=అశ్వమేధయాగమందు; నానాదేశాత్ =పలుదేశములనుండి;అనుప్రాప్తాః = వచ్చిన;పురుషాః = మగవాండ్రును; తథా=అట్లు;స్త్రీగణాః=ఆఁడువారల సమూహములును; అన్నపానైః= అన్నములచేతనుపానీయములచేతను;సువిహితాః=చక్కఁగాఁదనివినొందింపఁబడిరి.

మహాత్ముండగుదశరథునియశ్వమేధయాగమునందు, నానాదేశంబులనుండివచ్చినపురుషులును స్త్రీలును,అన్నపానంబులచేఁజక్కఁగాఁదనివినొందునట్లు,చేయఁబడిరి.

అని తాత్పర్యము.

అన్నం హి విధివ త్స్వాదు ప్రశంసంతి ద్విజర్షభాః
అహో తృప్తాస్మ భద్రం తే ఇతి శుశ్రావ రాఘవః. ౧౫

టీక॥ "అన్నం = అన్నము;విధివత్ =ఉపచారముగలదిగాను;స్వాదు=రుచ్యముగాను;అస్తి=(అధ్యాహృతము) ఉన్నదిగవాం.తృప్తాః=తనివినొందినవారము;స్మ=అగుచున్నారము. అహో = ఆశ్చర్యము; తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక"ఇతి=అని; ద్విజర్షభాః=బ్రాహ్మణశ్రేష్ఠులు;ప్రశంసంతి=(భూతార్థమందులట్) కొనియాడిరి. తత్(అధ్యాహృతము)= ఆమాట



ను; రాఘవః=రఘువంశమునందుఁ బుట్టినదశరథుఁడు; శుశ్రావ= వినెను.

“అన్నము, బహురుచిగానున్నది! మిక్కిలియుపచారముతోనివ్వఁబడుచున్నది ! మేమందఱమునుదనివినొందితిమి ! ఆశ్చర్యము ! నీకు మంగళమగుఁగాక!” అని, బ్రాహ్మణశ్రేష్ఠులు, నానావిధంబులం గొనియాడిరి; దానిదశరథుండు వినియెను.

అని, తాత్పర్యము.

స్వలంకృతాశ్చ పురుషా బ్రాహ్మణాన్ పర్యవేషయన్
ఉపాసతే చ తా నన్యే సుమృష్ట మణికుండలాః. ౧౬

టీక॥ స్వలంకృతాః=చక్కఁగా నలంకరింపఁబడిన; పురుషాశ్చ=పురుషులును; బ్రాహ్మణాన్=(చతుర్థ్యర్థమందుద్వితీయ) బ్రాహ్మణులకొఱకు; పర్యవేషయన్= వడ్డించిరి. తాంశ్చ=ఆపురుషులను; సుమృష్టమణికుండలాః, సుమృష్ట= మంచికాంతిగల,మణికుండలాః=రత్నమయములగు కుండలములుగల; అన్యే=ఇతరులు;ఉపాసతే=(భూతార్థమందులట్)సేవించిరి.

మంచియలంకారములతోఁ గూడినపురుషులు, బ్రాహ్మణులకు, వడ్డింపుచుండిరి;ఆపురుషులను, మణికుండలములం దాల్చియున్న మఱికొందఱు,సహాయార్థము, సేవించిరి.

అని, తాత్పర్యము.

కర్మాంతరే తదా విప్రా హేతువాదాన్ బహూ నపి
ప్రాహుశ్చ వాగ్మినో ధీరాః పరస్పర జిగీషయా. ౧౭

టీక॥ తదా=అప్పుడు;కర్మాంతరే=ఆయాకర్మములమధ్యకాలమందు;ధీరాః=పండితులును; వాగ్మినః=యుక్తియుక్తముగామాటలాడువారునగు; విప్రాశ్చ=బ్రాహ్మణులును; పరస్పరజిగీషయా= ఒండొరుల జయింపనిచ్ఛచేత; బహూన్= అనేకములైన; హేతు



వాదానపి = యుక్తివాదములను; ప్రాహుః=చెప్పిరి.

అప్పుడు,ఆయాకర్మముల మధ్యకాలమందుఁ, బండితులునువావదూకులునగు బ్రాహ్మణులొండొరులజయింపఁదలంపుగొని, యుక్తివాదంబులఁజేసిరి.

అని, తాత్పర్యము.

దివసే దివసే తత్ర సంస్తరే కుశలా ద్విజాః
సర్వకర్మాణి చక్రు స్తే యథాశాస్త్రం ప్రచోదితాః. ౧౮

టీక॥తత్ర=ఆః సంస్తరే= యాగమందు ("సంస్తరౌప్రస్తరాధ్వరౌ"అనియమరము) ; దివసేదివసే=ప్రతిదినమందును; తే=ఆ, ఋత్విజులైన; ద్విజాః=బ్రాహ్మణులు; యథాశాస్త్రం=యథావిధిగ; ప్రచోదితాః= ప్రేరేపింపఁబడినవారలై; సర్వకర్మాణి=సమస్తకర్మములను; చక్రుః=చేసిరి.

ఆయశ్వమేధమందుఁ, బ్రతిదినంబును,యథాశాస్త్రముగా వృద్ధులచేఁ బ్రేరేపింపఁబడినవారలై, ఋత్విజులు,సమస్తకర్మంబులంజేసిరి.

అని, తాత్పర్యము.

నాషడంగవి దత్రాసీ న్నావ్రతో నా బహుశ్రుతః
సదస్యా స్తస్య వై రాజ్ఞో నావాదకుశలా ద్విజాః. ౧౯

టీక॥ అత్ర=ఈయశ్వమేధమునందు; అషడంగవిత్=ఆఅంగంబులం దెలియనివాఁడు; నాసీత్ =ఉండలేదు. అవ్రతః= బ్రహ్మచర్యాది వ్రతములు లేనివాఁడు; న(ఆసీత్)= ఉండలేదు. అబహుశ్రుతః= అధికమైనశాస్త్రాభ్యాసము లేనివాఁడు; న (ఆసీత్) =ఉండలేదు. తస్య=ఆ; ("వై" అనునది పాదపూరణార్థము) రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; సదస్యాః=సభికులైన; ద్విజాః=బ్రాహ్మణులు; అవాదకుశలాః=వాదమునందు సమర్థులుకానివారలు; న(ఆసన్) = ఉండలేదు.

ఆయశ్వమేధ యాగమందు,

బ్రాహ్మణులందఱును, శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తజ్యోతిష కల్పంబులనియెడు నాఱు వేదాంగంబులనెఱింగినవారుగాను, బ్రహ్మచర్యాదివ్రతాచరణశీలురుగాను, అధికంబగు శాస్త్రాభ్యాసముం గలవారుగాను, నుండిరి; ఆదశరథమహారాజసదస్యులందఱును, వాదము నందు, సమర్థులుగా, నుండిరి.

అని, తాత్పర్యము.

ప్రాప్తే యూపోచ్ఛ్రయే తస్మిన్ షడ్బైల్వాః ఖాదిరా స్తథా
తావంతో బిల్వ సహితాః పర్ణినశ్చ తథాపరే. ౨౨
శ్లేష్మాతక మయ స్త్వేకో దేవదారు మయ స్తథా
ద్వావేవ విహితౌ తత్ర బాహువ్యస్త పరిగ్రహౌ. ౨౩

టీక ॥ తస్మిన్=ఆయాగమందు; యూపోచ్ఛ్రయే=యూప స్తంభముల యొక్క నిలుపుట; ప్రాప్తే=రాఁగా; షట్=ఆఱు, బైల్వాః=బిల్వ[illegible] త[illegible] థా=అట్లు; త[illegible] సహితాః = బిల్వయూపములసమీపంబుననున్న; ఖాదిరాః=చండ్రవియును; తథా=అట్లు; అపరే=ఇతరములైన; పర్ణినః= మోదుగవియును; ఏకః=ఒకటి; శ్లేష్మాతకమయస్తు= శ్లేష్మాతకవృక్షసంబంధమైనదియును; దేవదారుమయః=దేవదారు వృక్షసంబంధమైనదియొకటియును; తథా=అట్లు, దేవదారువృక్షసంబంధమైనది మఱియొకటియును; ఉచ్ఛ్రితాః = (అధ్యాహృతము) నిలుపఁబడినవి; తత్ర=అందు; ద్వౌ = రెండేసియూపములు, బాహువ్యస్తపరిగ్రహౌ ఏవ, బాహువ్యస్త=చాచఁబడిన చేతులచే (విశేషణోత్తరపదము), పరిగ్రహౌ ఏవ= తాఁకదగినవిగానే; విహితౌ=చేయఁబడినవి.

ఆయశ్వమేధమందు, యూపస్తంభంబులనిలుపునప్పుడు, ఆఱుబిల్వయూపంబులను, వానిదగ్గిఱ నాఱు ఖాదిరయూపంబులను, ఆఱుపలాశయూపంబులను, ఒకశ్లేష్మాతకయూపంబును, రెండు దేవదారు

యూపంబులను, నిలిపిరి; ఆయూపంబులలో రెండేసి యూపంబులుగాఁ జాఁచినబాహువంత వ్యవధానము గల్గునట్లు, నిలిపిరి.

అని, తాత్పర్యము.

కారితా స్సర్వ ఏవైతే శాస్త్రజ్ఞై ర్యజ్ఞకోవిదైః
శోభార్థం తస్య యజ్ఞస్య కాంచనాలంకృతా భవన్. ౨౨

టీక॥ ఏతే=ఈయూపస్తంభములు; సర్వఏవ=అన్నియును; శాస్త్రజ్ఞైః = శాస్త్రంబులనెఱింగినవారును; యజ్ఞకోవిదైః=యాగంబులనెఱింగిన వారునగు వారిచేతను; కారితాః=చేయింపఁబడినవై; తస్య=ఆ; యజ్ఞస్య=యాగమునకు; శోభార్థం=అలంకారముకొఱకు; కాంచనాలంకృతాః=బంగారుచే నలంకరింపఁ బడినవిగా; భవన్(ఆర్షము)=అయినవి.

ఈయూపములన్నియు, శాస్త్రవేత్తలునుయాగంబులం దెలిసినవారునగుబ్రాహ్మణులచేఁ, జేయింపంబడినవై, యాయాగశాలకలంకారంబుగల్గుటకై, బంగారముచేనలంకరింపఁబడినవి.

అని, తాత్పర్యము.

ఏకవింశతి యూపాస్తే ఏకవింశత్యరత్నయః
వాసోభి రేకవింశద్భి రేకైకం సమలంకృతాః. ౨౩

టీక॥ తే=ఆ; ఏకవింశతియూపాః=ఇరువదియొక్క యూపంబులును; ఏకవింశత్యరత్నయః=చాఁచబడిన చిటికెనవ్రేలుగలపిడికెటితోఁ గూడిన యిరువదియొక్క మూరలు గలిగినవిగాను; ఏకవింశద్భిః=ఇరువదియొక్క; వాసోభిః=వస్త్రములచేత; ఏకైకం=ఒకవస్త్రముచేనొక్కయూపము వంతున; సమలంకృతాః=చక్కగానలంకరింపఁ బడినవిగాను; ఆసన్= (అధ్యాహృతము) ఉండినవి.

ఆ యిరువదియొక్క యూపస్తంభంబులు, చాఁచఁబడినచిటికెనవ్రేలుగల పిడికిళ్లతోనుండునిర్వదియొక్క మూరలపొడవుగలవై, ప్రతి

యూపమును, ఒక్కొక వస్త్ర ముచేనలంకరింపఁబడినవై, యుం డినవి.

అని, తాత్పర్యము.

విన్యస్తా విధివ త్సర్వే శిల్పిభి స్సుకృతా దృఢాః
అష్టాశ్రయ స్సర్వఏవ శ్లక్ష్ణరూప సమన్వితాః. ౨౪

టీక॥ సర్వే = అన్నియూపములును; విధివత్ = యథాశాస్త్రముగా; విన్యస్తాః = ఉంచఁబడినవిగాను; శిల్పిభిః = శిల్పులచేత; సుకృతాః = చక్కగాఁజేయఁబడినవిగాను; దృఢాః = గట్టివిగాను; ఆసన్ (అధ్యాహృతము) = ఉండినవి. సర్వఏవ = అన్నియూపములునే; అష్టాశ్రయః = ఎనిమిదంచులు గలవిగాను ("స్త్రియః పా[illegible] కో[illegible]" అనియమరము) ; శ్లక్ష్ణరూపసమన్వితాః = నునుపైనరూపముతోఁగూడినవిగాను; ఆసన్ (అధ్యాహృతము) = ఉండినవి.

యూప స్తంభంబు లన్నియు, యథాశాస్త్రంబుగ స్థాపితంబులై, శిల్పులచేఁజక్కగాఁజేయఁబడినవై, దృఢంబులై, యెనిమిదంచులు గల్గి, నున్నగా, నుండినవి.

అని తాత్పర్యము.

ఆచ్ఛా[illegible] [illegible]ః పుష్పై ర్గంధైశ్చ భూషితాః
సప్త ర్షయో దీప్తిమంతో విరాజంతే యథా దివి. ౨౫

టీక॥ వాసోభిః = వస్త్రములచేత; ఆచ్ఛాదితాః = కప్పఁబడినవియును; పుష్పైః = పువ్వులచేతను; గంధైశ్చ = గంధములచేతను; భూషితాః = అలంకరింపఁ బడినవియునగు; తే = ఆయూప స్తంభంబులు; దివి = ఆకాశమునందు; దీప్తిమంతః = కాంతిగల; సప్తర్షయోయథా = సప్తర్షులువలె; విరాజంతే = (భూతార్థమందులట్) ప్రకాశింపుచుండినవి.

ఆయూప స్తంభంబులు, వస్త్రంబులచేఁగప్పఁబడి, పుష్పగంధంబుల నలంకృతంబులై, యాకాశమందుఁ

దేజరిల్లెడుసప్తర్షులుంబోలెం,బ్రకాశించుచుండినవి. అని తాత్పర్యము.

ఇష్టకాశ్చ యథాన్యాయం కారితాశ్చ ప్రమాణతః
చితోఽగ్ని ర్బ్రాహ్మణై స్తత్ర కుశలై శ్శుల్బకర్మణి. ౨౮

టీక॥ ఇష్టకాశ్చ=ఇటికతాళ్లును; యథాన్యాయం = యథాశాస్త్రముగను; ప్రమాణతశ్చ=కొలతప్రకారముగను; కారితాః = చేయింపఁబడినవి. శుల్బకర్మణి=శుల్బమనెడుయాగకార్యమందు; కుశలైః = నేర్పరులగు; బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత; తత్ర=ఆయాగశాలయందు; అగ్నిః=వేది(ఇచ్చట, అగ్నిశబ్దముచేత, అగ్నికాధారమైన, వేది, లక్షితమగుచున్నది); చితః=కట్టఁబడినది.

విశేషార్థము.— "శుల్బం"అనఁగా, ఒంటిపేటత్రాడు; అదిసాధనముగాఁగల కార్యము "శుల్బం" అని వ్యవహరింపఁ[illegible]చుచున్నది.

శాస్త్ర[illegible] జెప్పఁబడిన కొలఁదనిబట్టి, యిటకతాళ్లు, చేయింపఁబడినవి; శుల్బకార్యమందు నేర్పరులగు బ్రాహ్మణులు, ఆయిటికతాళ్లతో,నగ్నివేదిం గట్టిరి.

అని తాత్పర్యము.

స చిత్యో రాజ సింహస్య సంచితః కుశలై ర్ద్విజైః
గరుడో రుక్మపక్షో వై త్రిగుణోఽష్టా దశాత్మకః. ౨౯

టీక॥ సః=ఆ; చిత్యః=కట్టఁదగినప్రదేశము; రాజసింహస్య=రాజశ్రేష్ఠుఁడగుదశరథునియొక్క; కుశలైః=నేర్పరులగు; ద్విజైః=ఋత్విజులచేత; రుక్మపక్షః= బంగారముతోఁగూడినఱెక్కలుగలదియు; ("వై" అనునది పాదపూరణార్థము) త్రిగుణః=ప్రతిప్రస్తారమందును, మూఁడుగుణములుగలదియును (మూఁడుఇటికతాళ్లుగలదియు ననుట)గనుకనే; అష్టాదశాత్మకః=పదునెనిమిదియిటికతాళ్లస్వరూపముగాఁగలదియునగు; గరుడః=గరుడాకారముగా; సంచితః= చ



క్కఁగాఁగట్టఁబడినది

సమర్థులగుదశరథునిఋత్విజులు, ఆకట్టవలసినప్రదేశమును, బంగారముతోఁగూడినఱెక్కలుగలిగి ప్రతి ప్రస్తారమందును మూఁడేసి యిటికఱాళ్లుండుటంజేసి, యాఱు ప్రస్తారములకును, బదునెనిమిదియిటికఱాళ్లుగలదియైయుండు, గరుడపక్షిరూపమునఁ, జక్కఁగాఁగట్టిరి. అని, తాత్పర్యము.

నియుక్తా స్తత్ర పశవ స్తత్త దుద్దిశ్య దైవతమ్
ఉరగాః పక్షిణశ్చైవ యథాశాస్త్రం ప్రచోదితాః. ౨౮

టీక॥ తత్ర=ఆయూపస్తంభంబులందు; యథాశాస్త్రం=యథావిధిగ; ప్రచోదితాః = శాస్త్రములందు, విధింపఁబడిన; పశవః=పశువులును; ఉరగాః=సర్పంబులును; పక్షిణశ్చైవ= పక్షులును; తత్తత్=ఆయా; దైవతం=దేవతను; ఉద్దిశ్య=ఉద్దేశించి; నియుక్తాః=కట్టఁబడినవి.

శాస్త్రంబులవిధింపఁబడిన, పశువులను, సర్పంబులను, పక్షులను, ఆయా దేవతలనుద్దేశించి, యథావిధిగ, నాయూపస్తంభంబులంగట్టిరి. అని, తాత్పర్యము.

శామిత్రేతు హయ స్తత్ర తథా జలచరాశ్చ యే
ఋత్విగ్భి స్సర్వ మేవైత న్నియుక్తం శాస్త్రత స్తదా. ౨౯

టీక॥ శామిత్రేతు=పశుబంధము సేయుటయందుమాత్రము; తదా= ఆపశుబంధకాలమందు; తత్ర = ఆయాగములందు; ఋత్విగ్భిః=ఋత్విజులచేత, హయః= గుఱ్ఱమును; తథా=అట్లు; జలచరాః= నీళ్లలోఁదిరుగునవి; యే(సంతి)= ఏవిగలవో; తే(అధ్యాహృతము) చ=అవియును; ఏతత్ =ఇది ; సర్వమేవ = అంతయునే; శాస్త్రతః = శాస్త్రప్రకారము; నియుక్తం=కట్టఁబడినది.

పశుబంధము సేయుట యందు మాత్రమాకాలమందు, ఋత్విజులు,






శాస్త్రోక్తంబులగు, గుఱ్ఱము, జలచరములు మొదలగు గ్రామజమృగంబులనుమాత్రము, ఆయాపంబులం గట్టిరి. అని, తాత్పర్యము.

పశూనాం త్రిశతం తత్ర యూపేషు నియతం తదా
అశ్వరత్నోత్తమం తస్య రాజ్ఞో దశరథస్యచ. ౩౦

టీక॥ తత్ర = ఆయశ్వమేధమందు; తదా = ఆపశుబంధకాలమందు; యూపేషు = యూపస్తంభంబులందు; పశూనాం = (ప్రథమార్థమందు షష్ఠి) పశువులు; త్రిశతం = మున్నూఱును; రాజ్ఞః = రాజైన; తస్య = ఆదశరథస్య = దశరథునియొక్క; అశ్వరత్నోత్తమంచ = అశ్వశ్రేష్ఠంబులలోనుత్తమంబయినదియును; నియతం = కట్టఁబడినవి.

ఆ యశ్వమేధమందుఁ, బశుబంధకాలంబున, మున్నూఱుపశువులును, దశరథమహారాజునుత్తమాశ్వంబును, యూపస్తంభంబులందుఁ, గట్టఁబడినవి.

అనితాత్పర్యము.

కౌసల్యా తం హయం తత్ర పరిచర్య సమంతతః
కృపాణై ర్విశశాసైనం త్రిభిః పరమయా ముదా. ౩౧

టీక॥ తత్ర = ఆపశుబంధప్రదేశమందు; కౌసల్యా = కౌసల్యాదేవి; తం = ఆ; హయం = గుఱ్ఱమును; సమంతతః = అంతటను; పరిచర్య = ప్రదక్షిణముచేసి; త్రిభిః = మూఁడైన; కృపాణైః = బంగారపుసూదులచేత; ఏనం = ఈగుఱ్ఱమును; పరమయా = మిక్కిలియధికమైన; ముదా = సంతోషముతో; విశశాస = గీఱెను.

విశేషార్థము.—ఇచ్చట "సౌవర్ణీభిస్సూచీభిః పత్న్యోశ్వస్యాసిపథాన్ కల్పయంతి" (బంగారపుసూదులచే, భార్యలు, గుఱ్ఱమునకుఁ, గత్తివాట్లువేయవలయును) అనుకల్పసూత్రమునుబట్టి, "కృపాణైః" అనుటకు "బంగారపుసూదులచేత" అని యర్థము వ్రాయఁబడినది. మఱియు




నీకల్ప సూత్రమందు "పత్న్యః" (భార్యలు)అనిబహువచనముగాను న్నది, కావున"కౌసల్యా"అనుశబ్దము కైకయీసుమిత్రల కుపలక్షణ మగునని యెఱుంగునది.

దశరథునిభార్యలు, ఆగుఱ్ఱమునకుఁ,బ్రదక్షిణముచేసి, మిక్కిలిసంతోషంబున, బంగారపు సూదులచేఁ,గత్తివాట్లువేసిరి

అని తాత్పర్యము.

పతత్రిణా తదా సార్ధం సుస్థితేనచ చేతసా
అవసద్రజనీ మేకాం కౌసల్యా ధర్మకామ్యయా. ౩౨

టీక॥ కౌసల్యా=కౌసల్యాదేవి; తదా=అప్పుడు;పతత్రిణాసార్ధం=గుఱ్ఱముతోఁగూడ; సుస్థితేన = మిక్కిలిస్థిరమైన;చేతసా = మనస్సుతోను;ధర్మకామ్యయా = ధర్మమునందలియిచ్ఛచే; ఏకాం=ఒకటైన; రజనీం = రాత్రియంతయు; అవసత్=ఉండెను.

అప్పుడు, కౌసల్యాదేవి, ధర్మమునందలియిచ్ఛచే, సుస్థిరంబగుమనంబుగలిగి, యాగుఱ్ఱముతోఁగూడ, నొకరాత్రియంతయు, నివసించెను.

అనితాత్పర్యము.

హోతా ధ్వర్యు స్తథో ద్గాతా హస్తేన సమయోజయన్
మహిష్యా పరివృత్త్యా చ వావాతాంచ తథాపరామ్. ౩౩

టీక॥ హోతా= హోతయును;అధ్వర్యుః = అధ్వర్యువును; ఉద్గాతా=ఉద్గాతయును; తథా= (ఇది,అనుక్తసముచ్చాయకము) బ్రహ్మయును; మహిష్యా=మహిషితోను;పరివృత్త్యాచ=పరివృత్తితోనుంగూడ ; వావాతాం=వావాతను;తథా=అట్లు; అపరాం=ఇప్పుడుచెప్పఁబడినవారికన్ననితరయగు పాలాకలిని; హస్తేన=తమహస్తముతో; సమయోజయన్=గ్రహించిరి. " కృతాభిషేకా మహిషీ పరివృత్తి రుపేక్షితా, వావాతా భోగినీపాత్ర ప్రదా పాలాకలీమ

త్రా" అనివైజయంతి.

హావిర్భాగార్థము.— అశ్వమేధ ... యజమానుఁడు, హోత ను; ...ర్యునకును, ఉద్గాతకును, టీకను,(వీరలుబుత్విజులు)మ క్రమమ్ము,పరివృత్తిని,వావాతను, బా తను లిని,క్రమముగా, నివ్వవలయు ను.ఆవెనుకఁ,బ్రతినిధిదానంబున,మ అలఁ, బుచ్చుకొనుట సంప్రదాయ ము.

దశరథుఁడివ్వఁగా,హోతయు ను, అధ్వర్యువును,ఉద్గాతయును, బ్రహ్మయును,ఈనలువురుబుత్విజు లును,మహిషిని,బరివృత్తిని, వావా తను,బాలాకలినిం, గ్రమముగఁ,బ రిగ్రహించిరి. అని తాత్పర్యము.

పతత్రిణ స్తస్య వపా ముద్ధృత్య నియతేంద్రియః
బుత్విక్పరమసంపన్న శ్శ్రపయామాస శాస్త్రతః. ౩౪

టీక॥ నియతేంద్రియః=నిగ్రహింపఁబడిన యింద్రియములు గలవాఁడును; పరమసంపన్నః=అధికమైన శాస్త్రజ్ఞానసంపత్తిగలవాఁడునగు; బుత్విక్=అధ్వర్యువు;తస్య=ఆ;పతత్రిణః=గుఱ్ఱముయొక్క;వపాం=మెదడును;ఉద్ధృత్య=ఎత్తి; శాస్త్రతః = శాస్త్రప్రకారముగ; శ్రపయామాస= పక్వముచేసెను.

ఇంద్రియనిగ్రహముగలవాఁడును, సమస్తశాస్త్రంబుల నెఱింగిన వాఁడునగు,నధ్వర్యువు,ఆయశ్వము నందలి మెదడు నెత్తి, యథాశాస్త్రంబుగఁ,బక్వముచేసెను. అనితాత్పర్యము

ధూమగంధం వపాయాస్తు జిఘ్రతిస్మ నరాధిపః
యథాకాలం యథాన్యాయం నిర్ణుదన్ పాపమాత్మనః. ౩౫

టీక॥నరాధిపస్తు=మనుష్యులకుఁబ్రభువైనదశరథుఁడును; ఆత్మనః=తనయొక్క;పాపం=పాపమును; నిర్ణుదన్=పోఁగొట్టుకొనుచు;యథాకాలం=కాలమునతిక్రమింపక;యథాన్యాయం = శాస్త్రము నతిక్ర

మింపక; వపాయాః = మెదడుయొక్క; ధూమగంధం = పొగవాసనను; జిఘ్రతిస్మ = ఆఘ్రాణించెను.

దశరథమహారాజును, దనపాపమును బోఁగొట్టుకొనుటకై, యావపయగ్ని హోత్రమందు వేల్చఁబడుచుండఁగా, దానిపొగవాసనను శాస్త్రోక్తకాలంబున నాఘ్రాణించెను.

అని, తాత్పర్యము.

హయస్య యాని చాంగాని తాని సర్వాణి బ్రాహ్మణా
అగ్నౌ ప్రాస్యంతి విధివ త్సమంత్రా ష్షోడ శర్త్విజః. ౩౬

టీక॥ హయస్య=గుఱ్ఱముయొక్క; అంగాని = అవయములు ; యాని (సంతి)=ఏవిగలవో; తాని=వాటిని; సర్వాణిచ = అన్నింటిని; సమంత్రాః = మంత్రములతోఁగూడిన; ఋత్విజః=ఋత్విజులైన; బ్రాహ్మణాః=బ్రాహ్మణులు; షోడశ=పదునాఱుగురు; విధివత్=యథాశాస్త్రముగ; అగ్నౌ=అగ్నిహోత్రమందు; ప్రాస్యంతి (భూతార్థమందులట్)=హోమముచేసిరి.

మంత్రవేత్తలగుఋత్విజులుపదియాఱుగురు, ఆగుఱ్ఱమునంగంబులన్నియు, యథాశాస్త్రంబుగ, నగ్నిహోత్రంబునందు, హోమముచేసిరి. అని, తాత్పర్యము.

ప్లక్షశాఖాసు యజ్ఞానా మన్యేషాం క్రియతే హవిః
అశ్వమేధస్య యజ్ఞస్య వైతసో భాగ ఇష్యతే. ౩౭

టీక॥ అన్యేషాం=ఇతరములైన; యజ్ఞానాం = యాగములకు; హవిః=హవిస్సు; ప్లక్షశాఖాసు= జువ్వికొమ్మలయందు; క్రియతే= సంస్కరింపఁబడుచున్నది. అశ్వమేధస్య= అశ్వమేధమనెడు; యజ్ఞస్య = యాగమునకు; వైతసః=ప్రబ్బలితీఁగెయందు సంస్కరింపఁబడిన; భాగః=హవిర్భాగము; ఇష్యతే=విధింపఁబడుచున్నది.

ఇతరయాగంబులకు, హవిస్సు, జువ్వికొమ్మలయందు, సంస్కరిం

ఘంబడుచున్నది; అశ్వమేధంబునకు, హావిభాగము, ప్రబ్బలి తీఁగెల యందు, సంస్కరింపఁబడుచున్నది.

అని, తాత్పర్యము.

త్ర్యహో ఽశ్వమేధ స్సంఖ్యాతః కల్పసూత్రేణ బ్రాహ్మణైః

టీక ॥ కల్పసూత్రేణ=యాగక్రమమును దెల్పెడికల్పసూత్రము చేతను; బ్రాహ్మణైః=వేదంబులయందలి విధివాక్యంబుల చేతను; అశ్వమేధః = అశ్వమేధయాగము; త్ర్యహః= మూఁడుదినములుగలదిగా; సంఖ్యాతః=లెక్కింపఁబడినది.

కల్పసూత్రము చేతను, వేదవాక్యంబుల చేతను, అశ్వ మేధము, మూఁడుదినములయాగమని, చెప్ప బడుచున్నది.

అని తాత్పర్యము.

చతుష్టోమ మహ స్తస్య ప్రథమం పరికల్పితమ్. ౫౦
ఉక్థ్యం ద్వితీయం సంఖ్యాత మతిరాత్రం తథో త్తరమ్

టీక ॥ తస్య=ఆయశ్వమేధము యొక్క; ప్రథమం=మొదటిదైన; అహః=దినము; చతుష్టోమం=చతుష్టోమమని; పరికల్పితం=ఏర్పఱుపఁబడినది. ద్వితీయం=రెండవదినము; ఉక్థ్యం=ఉక్థ్యమని; సంఖ్యాతం=లెక్కింపఁబడినది. తథా=అట్లు; ఉత్తరం= ఆపైదియగు మూఁడవదినము; అతిరాత్రం=అతిరాత్రమని; సంఖ్యాతం(అధ్యాహృతము)= లెక్కింపఁబడినది.

ఆయశ్వమేధము మొదటిదినము చతుష్టోమమనియు, రెండవదినంబు ఉక్థ్యమనియు; మూఁడవదినంబతిరాత్రమనియుఁ, జెప్పఁబడుచున్నది.

అని, తాత్పర్యము.

కారితా స్తత్ర బహవో విహితా శ్శాస్త్ర దర్శనాత్. ౫౧

టీక॥ తత్ర=ఆయశ్వమేధమునందు; శాస్త్రదర్శనాత్ =ప్రమాణముయొక్క అగుపడుటవలన; విహితాః=విధింపఁబడిన; బహవః=అ

నేకము లైన యాగములు; కారితాః=చేయింపఁబడినవి.

అందుఁబ్రమాణాంతరమునుంబట్టి, శాస్త్రవిహితంబులగు, బహుయాగంబులు, చేయింపఁబడినవి.

అని, తాత్పర్యము.

జ్యోతిష్టోమాయుషీ చైవ మతిరాత్రౌ వినిర్మితౌ
అభిజి ద్విశ్వజి చ్చైవ మప్తోర్యామో మహాక్రతుః. ౪౦

టీక॥ జ్యోతిష్టోమాయుషీ=జ్యోతిష్టోమమునుఆయుర్యాగమును; వినిర్మితౌ=చేయఁబడినవి.ఏవం=ఇట్లు;అతిరాత్రౌచ=రెండతిరాత్రములును; వినిర్మితౌ (అధ్యాహృతము)=చేయఁబడినవి. అభిజిత్=అభిజిత్తను యాగమొకటియును; విశ్వజిత్=విశ్వజిద్యాగమొకటియును;ఏవం=ఇట్లు; అప్తోర్యామః=అప్తోర్యామంబనెడు; మహాక్రతుః = గొప్పయాగమొకటియును;వినిర్మితాః (అధ్యాహృతము)=చేయఁబడినవి.

జ్యోతిష్టోమం బొకటియును,ఆయుర్యాగంబొకటియును, రెండతిరాత్రంబులును,అభిజిద్యాగంబొకటియును, విశ్వజిద్యాగంబొకటెయును, అప్తోర్యామంబొకటియునుం, జేసిరి.

అని, తాత్పర్యము.

ప్రాచీం హోత్రే దదౌ రాజా దిశం స్వకులవర్ధనః
అధ్వర్యవే ప్రతీచీంతు బ్రహ్మణే దక్షిణాం దిశమ్.౪౧
ఉద్గాత్రేచ తథోదీచీం దక్షిణైషా వినిర్మితా
అశ్వమేధే మహాయజ్ఞే స్వయంభువిహితే పురా. ౪౨

టీక॥ స్వకులవర్ధనః=తనవంశమునువృద్ధిఁ బొందించునట్టి; రాజా=దశరథమహారాజు; హోత్రే=హోతకొఱకు;ప్రాచీం=తూర్పు;దిశం=దిక్కును; దదౌ=ఇచ్చెను.అధ్వర్యవేతు=అధ్వర్యువుకొఱకును;ప్రతీచీం=పడమటిదిక్కును;దదౌ(అధ్యాహృతము)=ఇచ్చె

ను. బ్రహ్మణే=బ్రహ్మకొఱకు; దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కును; దదౌ(అధ్యాహృతము)=ఇచ్చెను; తథా=అట్లు; ఉద్గాత్రేచ=ఉద్గాతకొఱకును; ఉదీచీం= ఉత్తరపుదిక్కును; దదౌ(అధ్యాహృతము)=ఇచ్చెను. పురా=మునుపు; స్వయంభువిహితే= బ్రహ్మచేస్ృజింపఁబడిన; అశ్వమేధే=అశ్వమేధమనెడు; మహాయజ్ఞే=గొప్పయాగమందు; ఏషా=ఈ; దక్షిణా=దక్షిణ; వినిర్మితా=ఏర్పఱుపఁబడినది.

దానమహిమచేఁదనకులంబును వృద్ధిఁబొందించునట్టి దశరథమహారాజు, హోతకుఁదూర్పుదిక్కునందలి దేశమునిచ్చెను; అధ్వర్యువునకుఁ, బడమటిదిక్కునందలిదేశంబు నొసంగెను; బ్రహ్మకు దక్షిణపుదిక్కునందలి దేశంబుసమర్పించెను; ఉద్గాతకుత్తరదిక్కునందలి దేశంబునిచ్చెను; మునుపు, బ్రహ్మచేస్ృజింపఁబడిన యశ్వమేధమహాయాగమం, దీదక్షిణ యేర్పఱుపఁబడినది.

అని, తాత్పర్యము.

క్రతుం సమాప్యతు తదా న్యాయతః పురుషర్షభః
ఋత్విగ్భ్యో హి దదౌ రాజా తాం ధరాం క్రతువర్ధనః.౪౩

టీక॥ పురుషర్షభః=పురుషశ్రేష్ఠుండును; క్రతువర్ధనః=యాగమునువృద్ధిఁబొందించువాఁడునగు; రాజా=దశరథమహారాజు; క్రతుం=యాగమును; సమాప్యతు=ముగించినంతనే; న్యాయతః = యథాశాస్త్రముగ; తాం=ఆ; ధరాం=భూమిని; ఋత్విగ్భ్యః=ఋత్విజులకొఱకు; దదౌహి=ఇచ్చెనుగదా!

అశ్వమేధంబు ముగియఁగానే, పురుషశ్రేష్ఠుండగు దశరథమహారాజు, క్రతుఫలంబభివృద్ధినొందుటకై, భూమండలం బంతయు, ఋత్విజుల,కిచ్చెను.

అని తాత్పర్యము.

ఋత్విజ స్త్వబ్రువన్ సర్వే రాజానం గతకల్మషమ్



టీక॥ ఋత్విజః=ఋత్విజులు; సర్వేతు = అందఱును; గతకల్మషం=పోయిన పాపముగల; రాజానం= దశరథమహారాజునుగూర్చి; అబ్రువన్=(వక్ష్యమాణవాక్యమును)చెప్పిరి.

ఋత్విజులందఱును, నిష్కల్మషుండగు దశరథమహారాజుతో, నిట్లని, చెప్పిరి.

అని తాత్పర్యము.

భవానేవ మహీం కృత్స్నా మేకో రక్షితు మర్హతి.౪౪

టీక॥ భవాన్=నీవు; ఏకఏవ=ఒకఁడే; కృత్స్నాం=సమస్తమయిన; మహీం = భూమిని; రక్షితుం=పాలించుటకు; అర్హతి=తగుదువు.

నీ వొకఁడవే సమస్తం బగు భూమినింబరి పాలింప నర్హుండవగుదువు; మఱియెవ్వరునుం గారాజారు.

అనితాత్పర్యము.

నభూమ్యా కార్య మస్మాకం నహి శక్తా స్మ పాలనే
రతా స్స్వాధ్యాయకరణే వయం నిత్యంహి భూమిప. ౪౫
నిష్క్రయం కించి దేవేహ ప్రయచ్ఛతు భవా నితి

టీక॥భూమిప=భూమిం బాలించుదశరథుఁడా!అస్మాకం=మాకు; భూమ్యా=భూమిచేత; కార్యం=చేయఁదగినది; న= లేదు. పాలనే=భూమిని, రక్షించుట యందు; శక్తాః=సమర్థులము; నస్మహి=కాముగదా!వయం=మేము; నిత్యం=ఎల్లప్పుడు=స్వాధ్యాయకరణే=వేదాధ్యయనము సేయుటయందు; రతాహి=ఆసక్తులముగదా!ఇతి=ఇందువలన,భవాన్=నీవు; ఇహ దీనివిషయ మందు; నిష్క్రయం = మూల్యమును; కించిదేవ=కొంచెమునే; ప్రయచ్ఛతు=ఇత్తువుగాక

విశేషార్థము.—"భూమిప" (భూమింబాలించువాఁడా!)అనిసంబోధించుటచేత;"భూమిం బాలించుటనీకుసహజము;మాకట్లుకాదు' అనిసూచితమగుచున్నది. "నిష్క్రయం కించి దేవ ప్రయచ్ఛతు



(మూల్యముకొంచెముగానే యిత్తువుగాక" అని చెప్పుటచే", ఇప్పుడుమీకునాచేనివ్వఁబడినసమస్తభూమండలమునకును, ఏమిమూల్యంబివ్వఁగలనని శంకింపవలదు, ఇష్టమువర్చనంతయిచ్చినంజాలును" అని తెల్పఁబడినది.

౯ దశరథ మహారాజా! మాకు భూమిచ్చేనేమియుంబ్రయోజనంబు లేదు; మేముదానిం బాలించుటకు సమర్థులముకామనియు, నెల్లప్పుడు వేదాధ్యయనమునే చేసికొనుచుండువారమనియు, నీకునుం దెలిసియున్నందున, మాకుదానం గలుగుసంకటంబుల నెచ్చుగాఁ జెప్పనక్కఱ లేదు; కావునఁ, గొంచెముగనేదానికి బదులుగా మూల్యం బిత్తువు గాక.

అని తాత్పర్యము.

మణిరత్నం సువర్ణం వా గావో యద్వా సముద్యతమ్. ४౭
తత్ప్రయచ్ఛ నరశ్రేష్ఠ ధరణ్యా న ప్రయోజనమ్

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుఁడవగుదశరథుండా! మణిరత్నం = మణిశ్రేష్ఠముగాని; సువర్ణం వా = బంగారముగాని; యద్వా = ఏదిగాని; సముద్యతం=సిద్ధమైనదిగా; (అధ్యాహృతము) = అగున్నదో; తత్ = దాని; ప్రయచ్ఛ= ఇమ్ము; ధరణ్యా=భూమిచే; ప్రయోజనం=ఫలము; న=లేదు.

పురుషశ్రేష్ఠుఁడవగు దశరథుండా; మంచిరత్నముగాని, బంగారముగాని, ఏదిసిద్ధముగా నున్నదో; దానిమాకిమ్ము; ఈభూమిచే మాకెంతయుఁ బ్రయోజనంబు లేదు. అనిదశరథునితోఁ జెప్పిరి.

అని తాత్పర్యము.

ఏవ ముక్తో నరపతి బ్రాహ్మణై ర్వేదపారగైః. ४౮
గవాం శతసహస్రాణి దశ తేభ్యో దదౌ నృపః
శతకోటీ స్సువర్ణస్య రజతస్య చతుర్గుణమ్. ४౯

టీక॥ నరపతిః=మనుష్యులకుఁబ్రభువైన; నృపః=దశరథమహారా




జు ("నరపతిశబ్ద మయౌగికము , నృపశబ్దమురూఢము, కాఁబట్టిపౌనరుక్త్యములేదు" అనిమహేశ్వరతీర్థులు,వ్రాసియుండుటంబట్టి, నరపతిశబ్దమునకుమాత్రంబవయవార్థము వ్రాయఁ బడినది); వేదపారగైః=వేదంబులయంతమునెఱింగిన;బ్రాహ్మణైః= ఋత్విజులచేత;ఏవం=ఈప్రకారముః ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తేభ్యః= ఆఋత్విజులకొఱకు; గవాం = (ద్వితీయార్థమందుషష్ఠి) ఆవులను; దశ=పది; శతసహస్రాణి= నూఱువేలును(పదిలక్షలను); సువర్ణస్య = (ద్వితీయార్థమందుషష్ఠి ) బంగారమును; శతకోటీః=నూఱుకోట్లను; రజతస్య=(ద్వితీయార్థమందుషష్ఠి) వెండిని;చతుర్గుణం=బంగారమునకు, నాల్గంతలను (నన్నూఱుకోట్లను); దదౌ=ఇచ్చెను.

సమస్తవేదంబులనుసాంతంబుగ నెఱింగినఋత్విజులీరీతింజెప్పఁగా, నాదశరథమహారాజు,పదిలక్షలగోవులను, నూఱుకోట్లబంగారమును నన్నూఱుకోట్లవెండిని,వారలకిచ్చెను.

అని తాత్పర్యము.

ఋత్విజశ్చ తత స్సర్వే ప్రదదు స్సహితా వసు
ఋశ్యశృంగాయ మునయే వసిష్ఠాయచ ధీమతే. ౪౯

టీక॥ తతః=ఆపిమ్మట;ఋత్విజః= ఋత్విజులు; సర్వేచ=అందఱును; సహితాః = కూడికొనినవారలై; మునయే=మననముచేయునట్టి;ఋశ్యశృంగాయ= ఋశ్యశృంగునికొఱకును;ధీమతే= బుద్ధిమంతుఁడగు; వసిష్ఠాయచ= వసిష్ఠుని కొఱకును; వసు=ధనమును;ప్రదదుః=ఇచ్చిరి.

అంత, నాఋత్విజులందఱుంజేరి, దశరథుండు తమకందఱకును , మొత్తముగాదక్షిణయిచ్చినధనమును, దమకుఁ బంచిపెట్టుటకై, ఋశ్యశృంగ మహామునికిని , బుద్ధిమంతుండగు వసిష్ఠమహర్షికిని, సమర్పించిరి.

అని తాత్పర్యము.

తతస్తే న్యాయతః కృత్వా ప్రవిభాగం ద్విజోత్తమాః




సుప్రీతమనస స్సర్వే ప్రత్యూచు ర్ముదితా భృశమ్. ౫౧

టీక ॥ తతః=ఆపిమ్మట; తే=ఆ=ద్విజోత్తమాః=బ్రాహ్మణశ్రేష్ఠులు; సర్వే=అందఱును; సుప్రీత మనసః=మిక్కిలిసంతసించిన హృదయముగలవారలై; న్యాయతః=న్యాయముగా; ప్రవిభాగం=పంచుకొనుటను; కృత్వా=చేసికొని; భృశం=మిక్కిలి; ముదితాః=సంతసించినవారలై; ప్రత్యూచుః=పరస్పరము, చెప్పుకొనిరి.

అంత నాబ్రాహ్మణశ్రేష్ఠులందఱును, న్యాయముగా, ధనమునంతయును, బంచికొని, సంతసమునొంది, పరస్పరము స్తోత్రవాక్యములఁ జెప్పుకొనిరి.

అని తాత్పర్యము.

తతః ప్రసర్పకేభ్యస్తు హిరణ్యం సుసమాహితః
జాంబూనదం కోటిసంఖ్యం బ్రాహ్మణేభ్యో దదౌ తదా. ౫౨

టీక ॥ తతః=అటుపిమ్మట; తదా=అప్పుడు; సః (అధ్యాహృతము)=ఆదశరథమహారాజు; సుసమాహితః = శ్రద్ధతోఁగూడినవాఁడై; ప్రసర్పకేభ్యః= అభ్యాగతులగు; బ్రాహ్మణేభ్యస్తు = బ్రాహ్మణుల కొఱకును; జాంబూనదం=జంబూనదియందుఁ బుట్టినదియును; కోటిసంఖ్యం=కోటికొలఁదిగలదియునగు; హిరణ్యం= బంగారమును; దదౌ=ఇచ్చెను.

అంత, నప్పుడా దశరథ మహారాజు శ్రద్ధగలవాఁడై, యభ్యాగతులగు బ్రాహ్మణులకు, జంబూనదీసంభవమైనబంగారమును గోటికొలంది నిచ్చెను.

అని తాత్పర్యము.

దరిద్రాయ ద్విజాయాథ హస్తాభరణ ముత్తమమ్
కస్మై చి ద్యాచమానాయ దదౌ రాఘవనందనః. ౫౩

టీక ॥ అథ=పిమ్మట; రాఘవనందనః=రఘువంశమునందుఁబుట్టిన యజమహారాజు కొడుకైన దశరథుఁడు; యాచమానాయ=యాచించునట్టి; కస్మై చిత్ = ఒకానొక; దరిద్రాయ=దరిద్రుఁడైన ; ద్విజాయ=బ్రాహ్మణునికొఱకు ; ఉత్తమం=శ్రేష్ఠమైన ; హస్తాభరణం=కడియమును; దదౌ=ఇచ్చెను

అంత , రాఘవుండగు నజమహారాజుకొడుకైన దశరథుండు , ఒకానొక దరిద్ర బ్రాహ్మణుండు యాచింపఁగా, నతనికి , శ్రేష్ఠంబగు తనచేతి కడియము నిచ్చెను. అని తాత్పర్యము.

తతః ప్రీతేషు నృపతిః ద్విజేషు ద్విజవత్సలః
ప్రణామ మకరో త్తేషాం హర్షపర్యా కులేక్షణః. ౫౩

టీక ॥ తతః=ఆపిమ్మట; ద్విజవత్సలః=బ్రాహ్మణులయందు వాత్సల్యము గలవాఁడైన ; నృపతిః=మనుష్యులకుఁ బ్రభువైన దశరథుఁడు; ద్విజేషు=బ్రాహ్మణులు; ప్రీతేషు=తృప్తినొందినవారలగుచుండఁగా; హర్షపర్యాకులేక్షణః , హర్ష= సంతోషముచే , పర్యాకుల = కలతనొందిన, ఈక్షణః=కండ్లు గలవాఁడై; తేషాం = ఆబ్రాహ్మణులకు; ప్రణామం=నమస్కారంబును; అకరోత్ =చేసెను.

అంత , బ్రాహ్మణులయందుఁ జాలం బ్రేమగల దశరథ మహారాజు, బ్రాహ్మణులుతృప్తి నొందగాఁనే, సంతోషవిశేషంబునం గలతవడినకండ్లుకలిగినవాఁడై , వారలకు నమస్కారము చేసెను. అని, తా.

తస్యా శిషో థ విధివ ద్బ్రాహ్మణై స్సముదీరితాః
ఉదారస్య నృవీరస్య ధరణ్యాం ప్రణతస్యచ. ౫౪

టీక ॥ అథ=ఆపిమ్మట; ఉదారస్య=మిక్కిలిదాతయును ; నృవీరస్య = మనుష్యులలోఁ బరాక్రమ శాలియును ; ధరణ్యాం =

భూమియందు; ప్రణతస్య = పడియున్నవాఁడు నగు; తస్య = ఆదశరథమహారాజునకు; బ్రాహ్మణైశ్చ=బ్రాహ్మణులచేతను ; విధివత్ =యథాశాస్త్రముగ;ఆశిషః= ఆశీర్వచనములు; సముదీరితాః=చెప్పఁ బడినవి,

అంత , నాబ్రాహ్మణులును , మహాదాతయును మనుష్యుల నందఱిలోనుం బరాక్రమశాలియనందగియుండువాఁడును, దమముంగలనేలంబడియున్నవాఁడునగు , నాదశరథమహారాజునకు, వేదోక్తాశీర్వాదంబులు చేసిరి. అని తాత్పర్యము.

తతః ప్రీతమనా రాజా ప్రాప్య యజ్ఞ మనుత్తమమ్
పాపాపహం స్వర్నయనం దుష్కరం పార్థివర్షభైః. ౫౫

టీక ॥ తతః=ఆపిమ్మట ; రాజా=దశరథమహారాజు ; అనుత్తమం= తనకన్న శ్రేష్ఠంబగు నితరములేనిదియును ; పాపాపహం= పాపంబులఁ బోఁగొట్టునదియును; స్వర్నయనం=స్వర్గమును బొందించునదియును ; పార్థివర్షభైః= రాజశ్రేష్ఠులచేతను ; దుష్కరం= చేయఁగూడనిదియునగు; యజ్ఞం= అశ్వమేధయాగమును ; ప్రాప్య= పొంది; ప్రీతమనాః= సంతసించినమనస్సుగలవాఁడుగా;బభూవ (అధ్యాహృతము) ఆయెను.

అంతదశరథమహారాజు , సర్వోత్తమంబును , సకల పాపంబులఁబోఁగొట్టునదియును, స్వర్గప్రదంబునై, రాజశ్రేష్ఠులచేతనుం జేయనశక్యంబై యుండు , నశ్వమేధం,బొంది సంతుష్టుం డయ్యెను .
అని తాత్పర్యము.

తతో ఋష్యశృంగం రాజా దశరథ స్తదా
కులస్య వర్ధనం త్వంతు కర్తు మర్హసి సువ్రత. ౫౬

టీక ॥ తతః= ఆపిమ్మట ; తదా= అప్పుడు; రాజా=రాజైన, దశరథః=దశరథుఁడు ; ఋష్యశృంగం=ఋష్యశృంగునిఁ గూర్చి; సు

వ్రత = మంచివ్రతముగల ఋశ్య శృంగుఁడా! త్వంతు=నీవుమాత్రము; కులస్య=వంశముయొక్క; వర్ధనం=వృద్ధిని గలుగఁ జేయునట్టి కర్మమును ; కర్తుం=చేయుటకు;అర్హసి=తగుదువు; ఇతి (అధ్యాహృతము)=అని; అబ్రవీత్ = చెప్పెను.

అంత దశరథమహారాజు, ఋశ్యశృంగునిం జూచి,దృఢ వ్రతుఁడవైన ఋశ్యశృంగుడా! నీవుమాత్రము,నాకు, వంశవృద్ధికరంబగుకర్మమును జేయవలయునని చెప్పెను.

అని తాత్పర్యము.

తథేతి చ స రాజాన మువాచ ద్విజసత్తమః
భవిష్యంతి సుతా రాజం శ్చత్వార స్తే కులోద్వహాః. ౫౭

టీక॥ ద్విజసత్తమః=బ్రాహ్మణశ్రేష్ఠుండగు;సః=ఆఋశ్యశృంగుఁడు; రాజానం= దశరథమహారాజునుగూర్చి; రాజన్ = దశరథమహారాజా! తథా=ఆలాగే, తే= నీకు; కులోద్వహాః=కులమునుద్ధరించునట్టి; సుతాః = కుమారులు; చత్వారః=నలువురు; భవిష్యంతి= కలుగుదురు. ఇతి=అని; ఉవాచ = చెప్పెను.

బ్రాహ్మణశ్రేష్ఠుండగు నాఋశ్యశృంగుఁడు. "ధశరథ మహారాజా! ఆలాగేచేసెదను, నీకువంశోద్ధారకులగు నలువురుకొడుకులు , గల్గుదురు" అని, దశరథ మహారాజుతోఁ, జెప్పెను.

అనితాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, చతుర్దశ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండచతుర్దశసర్గ టీక, ముగిసినది.

శ్రీః

పంచదశసర్గప్రారంభః.

మేధావీ తు తతో ధ్యాత్వా స కించి దిద ముత్తరమ్
లబ్ధసంజ్ఞ స్తత స్తంతు వేదజ్ఞో నృప మబ్రవీత్. ౧

టీక ॥ తతః=అంతట; మేధావీ=ధారణసమర్థంబగు బుద్ధిగలవాఁడును; వేదజ్ఞః= వేదంబులనెఱింగిన వాఁడునగు ; సతు=ఆఋశ్యశృంగుఁడును; కించిత్=కొంచెము; ధ్యాత్వా = ఆలోచించి; తతః=ఆపిమ్మట; లబ్ధసంజ్ఞః= పొందఁబడినస్మృతిగలవాఁడై;తం=ఆ, (తుకారంబుపాదపూరణార్థము) నృపం= దశరథమహారాజును గూర్చి; ఇదం=ఈ; ఉత్తరం=మాఱుమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత వేదంబులనెఱింగిన యాఋశ్యశృంగుఁడు , "ఈ దశరథునకుఁబుత్రోత్పత్తి యే కర్మంబునం గల్గు" ననికొంచె మాలోచించి , ధారణ సామర్థ్యంబు గలవాఁడు కావుననంతలోస్మృతినొంది, యాదశరథున కిట్లు ప్రత్యుత్తరంబు చెప్పెను.

అని తాత్పర్యము.

ఇష్టిం తేఽహం కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్
అథర్వశిరసి ప్రోక్తై ర్మంత్రై స్సిద్ధాం విధానతః. ౨

టీక॥ అహం=నేను; తే=నీకొఱకు; పుత్రకారణాత్=కొడుకులనిమిత్తము;పుత్రీయాం=కొడుకులఁగల్గించునదియు; విధానతః= శాస్త్రమువలన; సిద్ధాం= ఏర్పడినదియునగు; ఇష్టిం=యాగమును;అథర్వశిరసి=అథర్వశిరస్సనెడు వేదమునందు;ప్రోక్తైః=చెప్పఁబడిన, మంత్రైః=మంత్రములచే;కరిష్యామి=చేసెదను.

నేనునీకుఁగొడుకులుగలుగుటకై, శాస్త్రసిద్ధంబైపుత్రోత్పత్తినిమిత్తంబైయున్న,యొక యాగమును,అథర్వశిరస్సునందుజెప్పఁబడినమంత్రం

బులచేఁ, జేసెదను. అని చెప్పెను. అని తాత్పర్యము.

తతః ప్రాక్రమ్య తామిష్టిం పుత్రీయాం పుత్రకారణాత్
జుహావ చాగ్నౌ తేజస్వీ మంత్రదృష్టేన కర్మణా. ౩

టీక॥ తతః=ఆపిమ్మట; పుత్రకారణాత్=కొడుకులనిమిత్తము; పుత్రీయాం = కొడుకులఁగల్గించునట్టి; తాం=ఆ; ఇష్టిం= యాగమును, ప్రాక్రమ్య=ఆరంభించి, తేజస్వీ= బ్రహ్మతేజముగల ఋశ్యశృంగుఁడు; మంత్రదృష్టేన = వేదమంత్రంబులందుఁ జూడఁబడిన; కర్మణా=కర్మముచేత, అగ్నౌ=అగ్నిహోత్రమునందు ; జుహావ చ=హోమమునుం జేసెను.

అంతఁ, బుత్రనిమిత్తము,పుత్రులఁగల్గించునట్టి యాయాగము, నారంభించి, వేదమునందుఁజెప్పంబడినట్లుహోమమునుంజేసెను.

అని తాత్పర్యము.

తతో దేవా స్స గంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
భాగప్రతిగ్రహార్థం వై సమవేతా యథావిధి. ౪

టీక॥తతః=అంతట;సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన; దేవాః=దేవతలును;పరమర్షయః=శ్రేష్ఠులగు ఋషులును;సిద్ధాశ్చ=సిద్ధులును(చకారంబుచే)బ్రహ్మయును; యథావిధి=యథాశాస్త్రముగ; భాగప్రతిగ్రహార్థం = హవిర్భాగముయొక్క (హవిర్భాగమును)బుచ్చుకొనుటకొఱకు; సమవేతాః=చేరిరి.

అంత,దేవతలును, గంధర్వులును,సిద్ధులును, బ్రహ్మదేవుండును , బరమర్షులును ,ఆ యాగంబునందు హవి ర్భాగమును బుచ్చుకొనుటకై,యొకటిగాఁజేరిరి. అని తాత్పర్యము.

తా స్సమేత్య యథాన్యాయం తస్మిన్ సదసి దేవతాః
అబ్రువన్ లోకకర్తారం బ్రహ్మాణం వచనం మహత్. ౫

టీక ॥ తాః= ఆ; దేవతాః= దేవతలు; తస్మిన్=ఆ;సదసి=యాగసభయందు; యథాన్యాయం = యథాశాస్త్రముగ; సమేత్య= చేరి; లోకకర్తారం= లోకంబులఁ జేయునట్టి; బ్రహ్మాణం= బ్రహ్మదేవునిగూర్చి; మహత్=గొప్పదైన; వచనం=వాక్యమును; అబ్రువన్=చెప్పిరి.

ఆదేవతలందఱు , యథాశాస్త్రంబుగ , నాయాగసదస్సునందుఁ జేరి,లోకంబులంజేయునట్టిబ్రహ్మ దేవునితో,నిట్లని, యొకగొప్ప మాటను, జెప్పిరి.

అనితాత్పర్యము.

భగవన్ త్వత్ప్రసాదేన రావణో నామ రాక్షసః
సర్వా న్నో బాధతే వీర్యా చ్ఛాసితుం త న్న శక్నుమః. ౬

టీక ॥ భగవన్ = భగవంతుఁడా! రావణోనామ= రావణుండనియెడు; రాక్షసః= రాక్షసుఁడు; త్వత్ప్రసాదేన= నీయనుగ్రహము చేత; వీర్యాత్ =పరాక్రమమువలన; నః=మమ్ము; బాధతే= కాఁకియపెట్టుచున్నాఁడు; తం=వాని ; శాసితుం= శిక్షించుటకు; నశక్నుమః=సమర్థులముకాము.

భగవంతుఁడా! రావణుండను నొకరక్కసుండు,నీయనుగ్రహము నొంది, పరాక్రమంబుచే, మమ్ము లంగాఁకియ పెట్టుచున్నాఁడు; అతని శాసింపమాకు శక్తిలేదు.

అనితాత్పర్యము.

త్వయా తస్మై వరో దత్తః ప్రీతేన భగవన్ పురా
మానయంత శ్చ త న్నిత్యం సర్వం తస్య క్షమామహే. ౭

టీక ॥ భగవన్= భగవంతుఁడా!పురా=మునుపు; ప్రీతేన=సంతసించినట్టి; త్వయా= నీచేత, తస్మై =ఆరావణునికొఱకు; వరః= వరము; దత్తః = ఇవ్వఁబడినది.వయం(అధ్యాహృతము)చ= మేమును; తం=ఆవరమును ; మానయంతః=పూజింపుచు ; తస్య=ఆరావ

ణునియొక్క; సర్వం=అంతకార్యమును; క్షమామహే = ఓర్చుచున్నాము.

భగవంతుఁడా! నీవుపూర్వము, సంతోషవిశేషంబున, నతనికి, వరంబొసంగితివి; మేము, నావరమును బూజింపుచు, వాఁడుచేసిన యపకారంబుల నంతయు, నోర్చుచున్నాము.

అని తాత్పర్యము.

ఉద్వేజయతి లోకాం స్త్రీ నుచ్ఛ్రితాన్ ద్వేష్టి దుర్మతిః
శక్రం త్రిదశరాజానం ప్రధర్షయితు మిచ్ఛతి. ౮

టీక ॥ దుర్మతిః=దుర్బుద్ధియగు రావణుండు; లోకాన్=లోకంబుల; త్రీన్=మూఁటిని; ఉద్వేజయతి = భీతిలఁ జేయుచున్నాఁడు. ఉచ్ఛ్రితాన్=గొప్పవారగులోకపాలురను; ద్వేష్టి = ద్వేషించుచున్నాఁడు. త్రిదశరాజానం=దేవతలకుఁ బ్రభువైన; శక్రం=ఇంద్రుని; ప్రధర్షయితుం=అవమానించుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడు.

ఆరావణుఁడు, దుర్బుద్ధియై, లోకంబుల భయ పడఁ జేయుచున్నాఁడు; ఉన్నతపదస్థులగు లోకపాలుర ద్వేషించుచున్నాఁడు; దేవతలందఱకును బ్రభుండగు నింద్రున వమానింపఁ గోరుచున్నాఁడు.

అని తాత్పర్యము.

ఋషీన్ యక్షాన్ సగంధర్వా నసురాన్ బ్రాహ్మణాం స్తథా
అతిక్రామతి దుర్ధర్షో వరదానేన మోహితః. ౯

టీక ॥ దుర్ధర్షః= ఎదిరింపఁగూడనియారావణుఁడు; వరదానేన= వరప్రదానముచేత; మోహితః= ఒడలెఱుంగనివాఁడై; ఋషీన్ = ఋషులను; సగంధర్వాన్=గంధర్వులతోఁగూడిన; యక్షాన్= యక్షులను; అసురాన్=రాహువుమొదలగునసురులను; తథా=అట్లు; బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను; అతిక్రామతి; అవమానించుచున్నాఁడు.

ఆరావణుఁడు, నీవరముచే నొడలెఱుంగక, యెదిరింపనలవిగాక,

ఋషులను, యక్షులను, గంధర్వులను, అసురులను, బ్రాహ్మణులను, నవమానించుచున్నాఁడు.

అని తాత్పర్యము.

నైనం సూర్యః ప్రతపతి పార్శ్వే వాతి న మారుతః
చలోర్మిమాలీ తం దృష్ట్వా సముద్రోపి న కంపతే. ౧౦

టీక ॥ ఏనం=ఈరావణునిగూర్చి సూర్యః= సూర్యుఁడు; నప్రతపతి= చక్కఁగానెండ కాయఁడు అస్య (అధ్యాహృతము)= ఈరావణునియొక్క; పార్శ్వే= ప్రక్కయందు; మారుతః = వాయువు; నవాతి = వీవఁడు. చలోర్మిమాలీ=చంచలములగు నలలపఙ్క్తి గల; సముద్రోపి=సముద్రుఁడును ; తం=ఆరావణుని; దృష్ట్వా= చూచి; నకంపతే= కదలఁడు.

ఈరావణుని మీఁద సూర్యుం డెండగాయఁడు; వానిప్రక్కనైన వాయువువీవనోడు ; ఎల్లప్పుడును జంచలంబులగు తరంగంబులు గల సముద్రుండును, వానింజూచి, కదలకుండు.

అని తాత్పర్యము.

తన్మహా న్నో భయం తస్మా ద్రాక్షసా ద్ఘోరదర్శనాత్
వధార్థం తస్య భగవ న్నుపా యంకర్తు మర్హసి. ౧౧

టీక ॥ తత్=అందువలన; ఘోరదర్శనాత్= భయంకరమగుచూడఁబడుటగల; తస్మాత్=ఆ; రాక్షసాత్= రాక్షసునివలన; నః= మాకు; మహత్= గొప్పదగు; భయం=వెఱపు; అస్తి(అధ్యాహృతము)= కలదు. భగవన్= భగవంతుఁడా! తస్య = ఆరావణునియొక్క; వధార్థం=వధముకొఱకు; ఉపాయం=వెరవును; కర్తుం= చేయుటకు; అర్హసి=తగుదువు.

కాఁబట్టి, భయంకరాకారుండగు నారాక్షసునివలన, మాకుగొప్పభయంబుగలిగియున్నది. అతనివధంబగువట్లు వెరవేదైనం జేయవలయును.

అని తాత్పర్యము.

స ౧౫



ఏవ ముక్త స్సురై స్సర్వై శ్చింతయిత్వా తతో బ్రవీత్

టీక ॥ బ్రహ్మ (అధ్యాహృతము)= బ్రహ్మదేవుఁడు ; ఏవం= ఈప్రకారము; సర్వైః=సమస్తులైన; సురైః=దేవతలచే, ఉక్తః=చెప్పఁబడినవాఁడై; చింతయిత్వా= ఆలోచించి; తతః=ఆపిమ్మట ; అబ్రవీత్ = దేవతలనుగూర్చి, చెప్పెను.

దేవతలీప్రకారముచెప్పఁగా, బ్రహ్మదేవుఁడాలోచించి, యాపిమ్మట, దేవతలకిట్లనిచెప్పెను.

అని తాత్పర్యము.

హంతా యం విదిత స్తస్య వధోపాయో దురాత్మనః. ౧౨

టీక ॥ దురాత్మనః= దుష్టస్వభావముగల; తస్య = ఆరావణునియొక్క; అయం=ఈ; వధోపాయః=వధమునకు వెరవు; విదితః= ఎఱుంగఁబడినది హంత=సంతోషము.

సంతోషము! దుష్టస్వభావుండగు నారావణుని వధంబునకీయుపాయంబు తోఁచినది.

అని తాత్పర్యము.

తేన గంధర్వయక్షాణాం దేవదానవరక్షసామ్
అవధ్యోస్మీతి వాగుక్తా తథే త్యుక్తంచ తన్మయా. ౧౩

టీక ॥ తేన=ఆరావణునిచేత, గంధర్వయక్షాణాం = గంధర్వులకును యక్షులకును; దేవదానవరక్షసాం= దేవతలకును దానవులకును రాక్షసులకును; అహం (అధ్యాహృతము)= నేను; అవధ్యః=చంపఁగూడనివాఁడుగా; అస్మి=అగుదును. ఇతి=అని; వాక్=మాట ; ఉక్తా=చెప్పఁబడినది. తత్ =ఆమాట; మయాచ=నాచేతను; తథేతి= ఆలాగయని; ఉక్తం= చెప్పఁబడినది.

ఆరావణుఁడు, తాను, గంధర్వులకును, యక్షులకును, దేవతలకును, దానవులకును, రాక్షసులకును, అవధ్యుఁడుకావలయునని, వరంబుకోరెను; నేనాలాగె యగుఁగాకయని చెప్పితిని.

అని తాత్పర్యము.




నాకీర్తయ దవజ్ఞానా త్త ద్రక్షో మానుషాం స్తదా
తస్మాత్స మానుషాద్వధ్యో మృత్యునా న్యోస్యవిద్యతే. ౧౪

టీక ॥ తదా = ఆవరమడుగు కాలమందు; తత్ = ఆ; రక్షః = రాక్షసుఁడగు రావణుఁడు; అవజ్ఞానాత్ = అవమానంబు వలన; మానుషాన్ = మనుష్యులను ; నాకీర్తయత్ = చెప్పలేదు . తస్మాత్ = అందువలన; సః = ఆ రావణుఁడు; మానుషాత్ = మనుష్యునివలన ; వధ్యః = చంపఁదగినవాఁడు; అస్య = వీనికి ; అన్యః = మనుష్యునికన్ననితరుఁడయినః మృత్యుః = చంపువాఁడు; నవిద్యతే = లేఁడు.

ఆ రావణుఁడు, వరమడుగుకాలమందు, అవమానమగునని యెంచి, మనుష్యులవలనఁ దనకుఁ జావులేకుండునట్లడుగ లేదు ; కాఁబట్టి, వాఁడు మనుష్యునిచేఁ జంపంబడుఃమఱియెవ్వఁడును,వానింజంపలేఁడు.అనిబ్రహ్మదేవుఁడుచెప్పెను.

అని తాత్పర్యము.

ఏత చ్ఛ్రుత్వా ప్రియం వాక్యం బ్రహ్మణా సముదాహృతమ్
దేవా మహర్షయ స్సర్వే ప్రహృష్టా స్తేఽభవం స్తదా.౧౫

టీక ॥ బ్రహ్మణా = బ్రహ్మదేవునిచే; సముదాహృతం = చెప్పఁబడిన; ప్రియం = సంతోషముగలిగించునట్టి ; ఏతత్ = ఈ; వాక్యం = మాటను; శ్రుత్వా = విని; తదా = అప్పుడు; తే = ఆ; దేవాః = దేవతలును; మహర్షయః = గొప్పఋషులును; సర్వే = అందఱును ; ప్రహృష్టాః = మిక్కిలిసంతసించినవారలు; అభవన్ = అయిరి.

ఇట్లు బ్రహ్మదేవుఁడు చెప్పఁగా, సంతోష జనకంబగు బ్రహ్మదేవుని మాటను విని, దేవతలును, మహర్షులు నందఱును , మిక్కిలి సంతోషము గలవారైరి.

అని తాత్పర్యము.



ఏ తస్మి న్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః
శంఖ చక్ర గదా పాణిః పీతవాసా జగత్పతిః. ౧౬

టీక ॥ ఏతస్మిన్ = ఈ ; అంతరే = మధ్యమందు; మహాద్యుతిః = ఎచ్చైనకాంతిగలవాఁడును; శంఖచక్రగదాపాణిః = శంఖము , చక్రము, గద, ఇవి, హస్తములందుఁ గలవాఁడును; పీతవాసాః = పసపువన్నె వస్త్రముగలవాఁడును; జగత్పతిః = ప్రపంచమునకుఁ బ్రభువైనః విష్ణుః = విష్ణువు; ఉపయాతః = వచ్చెను.

ఇంతలో, నాపన్న రక్షణంబు దొరకొనుటం గల్గిన సంతోషవిశేషంబున నినుమడించిన కాంతిగలిగి, నిజ భక్తులం బొరిగొన నెడఁబాయకకరంబుల శంఖచక్రగదలధరింపుచు, పీతాంబరుండును జగన్నాథుండునగు, విష్ణుదేవుండరుగు దెంచెను. అని తాత్పర్యము.

బ్రహ్మణాచ సమా గమ్య తత్ర తస్థౌ సమాహితః
త మబ్రువన్ సురా స్సర్వే సమభిష్టూయ సన్నతాః. ౧౭

టీక ॥ (సః = ఆవిష్ణువు;) తత్ర = ఆ యాగశాలయందు; బ్రహ్మణాచ = బ్రహ్మదేవునితోను; సమాగమ్య = కూడుకొని; సమాహితః = సమా

ధిగలవాఁడై; తస్థౌ=ఉండెను. సురాః=దేవతలు;సర్వే=అందఱును; తం = ఆవిష్ణుదేవుని ; సమభిష్టూయ=చక్కఁగాఁ బ్రస్తుతించి; సన్నతాః = మిక్కిలినమ్రులై; అబ్రువన్=చెప్పిరి.

విష్ణుదేవుఁడు, వచ్చి , బ్రహ్మతోఁగూడనచ్చట సమాహితుండై యుండెను ; దేవతలందఱును, ఆవిష్ణుదేవునింబ్రస్తుతించినమ్రులై, యిట్లని, పలికిరి.

అని తాత్పర్యము.

త్వాన్నియోక్ష్యామహేవిష్ణో లోకానాం హిత కామ్యయా

టీక॥విష్ణో=విష్ణుదేవుఁడా! లోకానాం; లోకములకు ; హితకామ్యయా = మేలునందిచ్చ చేత ; త్వాం= నిన్ను = నియోక్ష్యామహే=ప్రేరేపించెదము.

విష్ణుదేవుఁడా!సమస్తలోకంబులకును, మేలుగలుగుటకై,నిన్నొకకార్యమునందుఁ, బ్రేరేపించెదము.

అని తాత్పర్యము.

రాజ్ఞో దశరథస్య త్వ మయోధ్యాధిపతేః ప్రభోః. ౧౮
ధర్మజ్ఞస్య వదాన్యస్య మహర్షి సమ తేజసః
తస్య భార్యాసు తిసృషు హ్రీశ్రీకీర్త్యుపమాసుచ. ౧౯
విష్ణో పుత్రత్వ మాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్

టీక ॥ విష్ణో=విష్ణుదేవుఁడా! అయోధ్యాధిపతేః= అయోధ్యానగరంబునకుఁ బ్రభువును; ప్రభోః= రాజ్యపాలన సమర్థుండును;ధర్మజ్ఞస్య=ధర్మంబుల నెఱింగినవాఁడును; వదాన్యస్య = మహాదాతయును; మహర్షిసమ తేజసః=గొప్పఋషితోసరియగుతేజస్సు గలవాఁడును; రాజ్ఞః=రాజునగు ; దశరథస్య=దశరథునకు;తస్య = ఆదశరథునియొక్క;హ్రీశ్రీకీర్త్యుపమాసు=హ్రీ, శ్రీ, కీర్తి,యను దక్షుకూతులతో సరివచ్చునట్టి; తిసృషు=ముగ్గురైన;భార్యాసుచ=భార్యలందును;త్వం=నీవు;ఆత్మానం=స్వరూపమును; చతుర్విధం = నా

లుగు భాగములు గలవానిఁగా; కృత్వా=చేసికొని ; పుత్రత్వం=కొడుకగుటను; ఆగచ్ఛ=పొందుమా .

విష్ణుదేవుఁడా! సమస్త ధర్మజ్ఞులనెఱింగి, మహోదాత్తుఁడై, మహర్షితుల్యుండై , రాజ్యమును యథాన్యాయంబుగఁ బాలింపసమర్థుండై, యయోధ్యానగరంబున నుండ్రభువై, యున్న, దశరథమహారాజునకు, హ్రీశ్రీ కీర్తులతో సరివచ్చు, నతని, ముగ్గురి భార్యలందును, నీవు, స్వరూపమును, నాలుగుభాగంబులుగావించికొని, నలువురుకొడుకులుగా, జనింపుము.

అని తాత్పర్యము.

తత్ర త్వం మానుషోభూత్వా ప్రవృద్ధం లోకకంటకమ్. ౨౦
అవధ్యం దైవతై ర్విష్ణో సమరే జహి రావణమ్

టీక ॥ విష్ణో= విష్ణుదేవుఁడా; త్వం=నీవు; తత్ర = ఆదశరథభార్యలందు; మానుషః= మనుష్యుఁడుగా; భూత్వా=అయి; ప్రవృద్ధం=వరబలంబున, మిక్కిలివృద్ధిఁబొందిన వాఁడును ; లోక కంటకం=లోకంబులకు శత్రువును, దైవతైః=దేవతలచేత; అవధ్యం=చంపఁగూడని వాఁడునగు; రావణం=రావణుని; సమరే= యుద్ధమునందు; జహి= చంపుము.

విష్ణుదేవుఁడా! నీవాదశరథ భార్యలందు, మనుష్యుఁడైపుట్టి , వరబలంబున నభివృద్ధి నొందినవాఁడును, లోకకంటకుండును, దేవతలకవధ్యుండునగు, రావణుని, యుద్ధంబునం జంపుము.

అని తాత్పర్యము.

సహి దేవాంశ్చ గంధర్వాన్ సిద్ధాంశ్చ మునిసత్తమాన్. ౨౧
రాక్షసో రావణోమూర్ఖో వీర్యోత్సేకేన బాధతే

టీక ॥ రాక్షసః = రాక్షసుండును ; మూర్ఖః=జ్ఞానహీనుండునగు; సః=ఆ; రావణః = రావణుఁడు; వీర్యోత్సేకేన= పరాక్రమాతిశయముచే ; దేవాంశ్చ=దేవతలను; గంధర్వాన్= గంధర్వు

లను; సిద్ధాంశ్చ=సిద్ధులను; మునిసత్తమాన్=మునిశ్రేష్ఠులను ; బాధతేహ= కాఁజియపెట్టుచున్నాఁడు గదా!

రాక్షసుండును మూర్ఖుఁడును నగు నారావణుండు, పరాక్రమాతిశయంబున, దేవతలను, గంధర్వులను, సిద్ధులను, మునిశ్రేష్ఠులనుం, గాఁజియపెట్టుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఋషయశ్చ తత స్తేన గంధర్వాప్సరస స్తథా. ౨౨
క్రీడంతో నందనవనే క్రూరేణ కిల హింసితాః

టీక॥ తతః=ఆపరాక్రమాతిశయమువలన;క్రూరేణ=క్రూరుఁడైన; తేన=ఆరావణునిచేత; ఋషయశ్చ=ఋషులును;తథా=అట్లు; నందనవనే = నందనవనంబనును ద్యానవనమునందు;క్రీడంతః (లింగవ్యత్యయమార్షము)=క్రీడించుచున్నట్టి;గంధర్వాప్సరసః=గంధర్వులతోఁగూడినయప్సరసలును;హింసితాఃకిల=బాధింపఁబడిరిగదా!

ఆరావణుండు, క్రూరస్వభావుండగుటంజేసి,ఋషులను, నందనవనమందు, గంధర్వులంగూడివిహరింపుచున్న,యప్సరసలనుం గాఁజియపెట్టెను; కావున, నీవవశ్యంబువానింజంపవలయు.

అని, తాత్పర్యము.

వధార్థం వయ మాయాతా స్తస్య వైమునిభిస్సహ. ౨౩
సిద్ధగంధర్వయక్షాశ్చ తత స్త్వాం శరణం గతాః

టీక॥ తస్య= ఆరావణునియొక్క ("వై"అనునదిపాదపూరణార్థము); వధార్థం=వధముకొఱకు; సిద్ధగంధర్వయక్షాశ్చ=సిద్ధులునుగంధర్వులునుయక్షులును; వయంచ=మేమును; మునిభిస్సహ=మునులతోఁగూడ; ఆయాతాః=వచ్చినాము. తతః=అందుకై; శరణం=రక్షకుఁడవగు;త్వాం=నిన్ను; గతాః=పొందితిమి.

ఆరావణునివధముకొఱకు,య | క్షగంధర్వసిద్ధులును,మునులును, మే | ము ను,మీకడకు,వచ్చితిమి;అందుకై | మే,రక్షకుండగునిన్నుఁబొందితిమి.

అని, తాత్పర్యము.

త్వం గతిః పరమా దేవ సర్వేషా న్నః పరంతప. ౨౪
వధాయ దేవశత్రూణాం నృణాం లోకే మనః కురు

టీక॥ పరంతప=శత్రువులఁదపింపఁ జేయునట్టి; దేవ= విష్ణుదేవుఁడా! నః=మాకు; సర్వేషాం=అందఱ కు;త్వం=నీవు; పరమా=ముఖ్యమైన; గతిః= ఉపాయమవు; దేవశత్రూణాం=రాక్షసులయొక్క; వధార్థం = వధముకొఱకు; నృణాం=మనుష్యులయొక్క;లోకే= లోకమందు; మనః=మనస్సును;కురు=చేయుము,

శత్రుంజయుండవగువిష్ణుదేవుఁడా!నీవు,మాకందఱకును, బరమగతివి.రాక్షసులవధంబుకొఱకు,మనుష్య లోకంబున నవతరింప, నిచ్చగొనుము.అని, దేవతలుచెప్పిరి.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు దేవేశో విష్ణు స్త్రిదశపుంగవః. ౨౫
పితామహపురోగాం స్తాన్ సర్వలోకనమస్కృతః
అబ్రవీ త్త్రిదశాన్సర్వాన్ సమేతాన్ ధర్మసంహితాన్. ౨౬

టీక ॥ దేవేశః=దేవతలకుఁబ్రభువును; త్రిదశపుంగవః=దేవతలలో శ్రేష్ఠుఁడును; సర్వలోక నమస్కృతః= సమస్తలోకంబులచేన మస్కరింపఁబడినవాఁడునగు; విష్ణుస్తు=విష్ణుదేవుఁడును; ఏవం=ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై;సమేతాన్= చేరినవారును; ధర్మసంహితాన్ = ధర్మముతోఁగూడిన వారునగు;తాన్=ఆ; పితామహపురోగాన్= బ్రహ్మమొదలుగాఁగల; త్రిదశాన్= దేవతలను; సర్వాన్=అందఱనుంగూర్చి=;అబ్రవీత్ =చెప్పెను.

దేవతలీప్రకారము దన్నుఁ బ్రార్థింపఁగా, దేవతాధిపుండును, దేవశ్రేష్ఠుండును, సమస్తలోకంబులచే నమస్కరింపఁబడిన వాఁడునగు, విష్ణుదేవుండు, ఆసదస్సునందుఁ జేరియున్న, ధర్మిష్ఠులగు, బ్రహ్మ మొదలైన, దేవతల నందఱం జూచి, యిట్లనిచెప్పెను. అనితాత్పర్యము.

భయం త్యజత భద్రంవో హితార్థం యుధి రావణమ్
సపుత్రపౌత్రం సామాత్యం సమిత్రజ్ఞాతిబాంధవమ్. ౨౭
హత్వా క్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహమ్
దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ. ౨౮
వత్స్యామి మానుషే లోకే పాలయన్ పృథివీమిమామ్

టీక ॥ యూయం (అధ్యాహృతము) = మీరలు; భయం = వెఱపును; త్యజత = విడువుఁడు. భద్రం = మంగళము; అస్తు (అధ్యాహృతము) = అగుఁగాక. వః = మీయొక్క; హితార్థం = మేలుకొఱకు; సపుత్రపౌత్రం = కొడుకులుమనుమలతోఁగూడినవాఁడును; సామాత్యం = మంత్రులతోఁగూడినవాఁడును; సమిత్రజ్ఞాతిబాంధవం = స్నేహితులతోనుజ్ఞాతులతోను బంధువులతోనుంగూడినవాఁడును; క్రూరం = క్రూరుఁడును; దురాత్మానం = దుష్టస్వభావముగలవాఁడును; దేవర్షీణాం = దేవతలకునుఋషులకును; భయావహం = వెఱపుఁబుట్టించువాఁడునగు; రావణం = రావణుని; యుధి = యుద్ధమునందు; హత్వా = చంపి; దశ = పది; వర్షసహస్రాణి = వేలసంవత్సరంబులను; దశ = పది; వర్షశతానిచ = నూఱుసంవత్సరంబులను (పదునొకండు వేలసంవత్సరంబులనుట); ఇమాం = ఈ; పృథివీం = భూమిని; పాలయన్ = పాలింపుచు; మానుషే = మనుష్యసంబంధియగు; లోకే = భూలోకమందు; వత్స్యామి = వాసముచేసెదను

దేవతలారా! మీరలుభయంబు విడువుఁడు; మీకుమంగళంబగుఁగాక; మీమేలుకొఱకు, క్రూరుఁడై, దు

ష్టస్వభావుఁడై, దేవతల ఋషుల వెఱపించుచున్న, రావణుని, వాని కొడుకులను,మనుమలను,మంత్రులను,మిత్రులను,జ్ఞాతులను, బంధువులనుం,జంపి,మనుష్యలోకంబున, నీ భూమిఁబాలింపుచుఁ,బదునొకండు వేలవత్సరంబు,లుండెదను. అని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం దత్వా వరం దేవో దేవానాం విష్ణురాత్మవాన్. ౨౯
మానుషే చింతయామాస జన్మభూమి మథాత్మనః

టీక॥ దేవః=సృష్టిస్థితి లయంబులచేఁ,గ్రీడించునట్టి ("దేవృ దేవనే" అనుధాతువువంబుట్టినది); ఆత్మవాన్=జీవాత్మలుగల (జీవాత్మలకాధారభూతుఁడైనయనుట; దేనినేది గలిగి యున్నదో, దానికది యాధారమనుటస్పష్టము.) ; విష్ణుః=విష్ణుదేవుఁడు; దేవానాం=దేవతలకు;ఏవం=ఈప్రకారము;వరం=వరమును; దత్వా=ఇచ్చి; అథ = అటుపిమ్మట; మానుషే=మనుష్యలోకంబునందు; ఆత్మనః=తనకు; జన్మభూమిం=పుట్టుటకుఁదగుస్థానమును; చింతయామాస=ఆలోచించెను.

సృష్టిస్థితిలయంబులం గ్రీడించుచు, సమస్తజీవాత్మలకు నాధారభూతుఁడైయున్న,విష్ణుదేవుం,డీప్రకారము దేవతలకు వరంబొసంగి, యంత, మనుష్యలోకంబునందుఁ, దానుబుట్టుటకుందగు నిరవునాలోచించెను. అని, తాత్పర్యము.

తతః పద్మపలాశాక్షః కృత్వాత్మానం చతుర్విధమ్. ౩౦
పితరం రోచయామాస తదా దశరథ న్నృపమ్

టీక॥తతః=ఆపిమ్మట; తదా=అప్పుడు; పద్మపలాశాక్షః=తమ్మితేకులవంటి కండ్లుగల విష్ణుదేవుఁడు; ఆత్మానం=తన్ను; చతుర్విధం=నాలుగుభాగములు గలవానిఁగా; కృత్వా=చేసికొని;నృపం=రాజైన;దశరథం=దశరథుని; పితరం=తండ్రినిగా; రోచయామా

స=ఇచ్చించెను.

అంత, నపుడు, తమ్మిఱేకులం బోలునయనంబులు గలవిష్ణుదేవుఁడు, తన్నునాలుగుభాగములుగాఁ జేసికొని, దశరథమహారాజుం దన కుఁదండ్రిగా, నిచ్చించెను.

అని, తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వా స్సరుద్రా స్సాప్సరోగణాః
స్తుతిభి ర్దివ్య రూపాభి స్తుష్టువు ర్మధుసూదనమ్. ౩౧

టీక॥ తతః=ఆపిమ్మట; సగంధర్వాః=గంధర్వులతోఁగూడినవారును; సరుద్రాః=రుద్రులతోఁగూడినవారును; సాప్సరోగణాః=అప్సరసలసమూహముతోఁ గూడినవారునగు; దేవాః = దేవతలు; దివ్యరూపాభిః=దివ్యంబగునాత్మస్వరూపంబుగుఱించిన; స్తుతిభిః=స్తోత్రములచేత; మధుసూదనం="మధు"అను రాక్షసునింజంపిన విష్ణుదేవుని, తుష్టువుః=స్తుతియించిరి.

అంత, గంధర్వులును, ఏకాదశరుద్రులును, దేవతలును, అప్సరసలును, దివ్యాత్మవిషయకంబులగు స్తోత్రంబుల, విష్ణుదేవునిం, బ్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

త ముద్ధతం రావణ ముగ్రతేజసం
ప్రవృద్ధదర్పం త్రిదశేశ్వరద్విషమ్
విరావణం సాధు తపస్వికంటకం
తపస్వినా ముద్ధర తంభయావహమ్. ౩౨

టీక॥ తం = ప్రసిద్ధుఁడును; ఉద్ధతం=గర్వించినవాఁడును; ఉగ్రతేజసం= భయంకరమగుపరాక్రమము గలవాఁడును; ప్రవృద్ధదర్పం=వరబలంబున, వృద్ధినొందిన గర్వముగలవాఁడును; త్రిదశేశ్వరద్విషం = దేవేంద్రునకుశత్రువును; విరావణం= లోకంబుల, మొఱలిడునట్లు సేయువాఁడును; తపస్వికంటకం=తపస్సు సేయువారికి శత్రువును; (గనుకనే) తపస్వినాం= తపస్సు సేయువారలకు; భయావహం= వెఱపుగల్గించు



వాఁడునగు; తం = ఆ; రావణం = రావణుని, సాధు = చక్కగా; ఉద్ధర = ఉన్మూలనము సేయుము.

విష్ణుదేవుఁడా! సమస్తలోకంబులం బ్రసిద్ధుఁడై, వరబలంబున, నినుమడించినగర్వంబుగలిగి, భయంకరంబగుపరాక్రమంబున లోకంబులనన్నియు మొఱలిడం జేయుచు, తపస్సు సేయువారలకు శత్రుమై, భయంబుఁబుట్టింపుచు, దేవేంద్రుని ద్వేషించి, యుండు, నా రావణునిం, బుత్రపౌత్రాదిసహితంబుగాఁ జంపుము.

అని తాత్పర్యము.

త మేవ హత్వా సబలం సబాంధవం
విరావణం రావణ మగ్ర్యపౌరుషమ్
స్వలోక మాగచ్ఛ గతజ్వర శ్చిరం
సురేంద్రగుప్తం గతదోషకల్మషమ్. ౩౩

టీక॥ సురేంద్ర = దేవశ్రేష్ఠుఁడా! సబలం = సైన్యముతోఁగూడినవాఁడును; సబాంధవం = బంధువులతోఁ గూడినవాఁడును; విరావణం = లోకంబుల, మొఱలిడునట్లు సేయువాఁడును; అగ్ర్యపౌరుషం = శ్రేష్ఠమైన మగఁటిమిగలవాఁడును, తం = ఆ; రావణమేవ = రావణునిమాత్రము (విభీషణునిజంపకయనుట); హత్వా = చంపి; గతజ్వరః = పోయినవ్యథగలవాఁడవై; చిరం = పురాతనమును, గుప్తం = రహస్యమును; గతదోషకల్మషం = పోయినదోషంబులనుకల్మషముగలదియునగు; స్వలోకం = వైకుంఠమును; ఆగచ్ఛ = పొందుము.

దేవశ్రేష్ఠుండవగువిష్ణుదేవుఁడా! శ్రేష్ఠంబగుమగఁటిమిగలిగి, లోకంబులన్నియు మొఱ లిడం జేయుచున్న, యా రావణునిమాత్రము, వాని సైన్యములతోను బాంధవులతోనుం జంపి, గతవ్యథుండవై, పురాతనంబును, రహస్యంబును, నిర్దోషంబునగు, వైకుంఠమునకురమ్ము. అని, ఆ దేవతలువిష్ణుదేవుని, స్తుతియించిరి.

అని, తాత్పర్యము.



ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, పంచదశ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండపంచదశసర్గ టీక,
ముగిసినది.

---

౩౦

షో డ శ స ర్గ ప్రా రం భః.

తతో నారాయణో దేవో నియుక్త స్సురసత్తమైః
జానన్నపి సురానేవం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౧

టీక॥ తతః=ఆ; దేవః=సృష్టిస్థితిలయముల చే గ్రీడించునట్టి; నారాయణః=సృష్టికిఁబూర్వము, జలము లే స్థానముగాఁ గల (సమస్తకారణభూతుండగుననుట) విష్ణుదేవుఁడు; సురసత్తమైః=దేవశ్రేష్ఠుల చే; నియుక్తః = ప్రేరేపింపఁబడినవాఁడై; జానన్నపి=ఎఱింగినవాఁడయ్యును; సురాన్=దేవతలనుగూర్చి; ఏవం=ఇట్లు; శ్లక్ష్ణం=మధురంబైన; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

అంత, సృష్టిస్థితిలయంబులం గ్రీడించువాఁడును, సృష్టికిఁబూర్వము జలంబుల శయనించియుండువాఁడు నగువిష్ణుదేవుండు, దేవతల చేఁబ్రార్థితుఁడై, తనకు రావణవధోపాయంబు దెలిసియున్నను, దేవతలం గూర్చి, యిట్లని, మధురంబగుమాటం జెప్పెను. అని తాత్పర్యము.

ఉపాయః కో వధే తస్య రావణస్య దురాత్మనః
య మహం తం సమాస్థాయ నిహన్యా మృషికంటకమ్. ౨

టీక ॥ అహం=నేను; యం=ఏయుపాయమును; సమాస్థాయ=ఆశ్రయించి; ఋషికంటకం=ఋషులశత్రువగు; తం=ఆరావణుని; నిహన్యాం=చంపుదునో; దురాత్మనః=దుష్టస్వభావుండగు; తస్య=ఆ; రావణస్య=రావణునియొక్క; వధే=వధమునందు; సః=ఆ; ఉపాయః=ఉపాయము; కః=ఏది?

ఏయుపాయంబునాశ్రయించి, ఋషులకుశత్రుండగు నారావణునిం, జంపఁగలనో, దుష్టస్వభావుండగు రావణునివధంబునకై; యట్టియుపాయంబునాకుఁజెప్పవలయును. అనిపలికెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా స్సురా స్సర్వే ప్రత్యూచు ర్విష్ణు మవ్యయమ్

టీక ॥ సురాః=దేవతలు; సర్వే=అందఱు; ఏవం= ఇట్లు; ఉక్తాః=చెప్పఁబడినవారలై; అవ్యయం= నాశములేని; విష్ణుం=విష్ణుదేవునిఁగూర్చి; ప్రత్యూచుః= బదులుసెప్పిరి.

ఈప్రకారము విష్ణుదేవుండడుగఁగా, దేవతలందఱు, నాశరహితుండగునావిష్ణు దేవున, కిట్లని, బదులుపలికిరి. అని, తాత్పర్యము.

మానుషీం తను మాస్థాయ రావణం జహి సంయుగే. ౩

టీక॥ మానుషీం= మనుష్యసంబంధియగు; తనుం=దేహమును; ఆస్థాయ=పొంది; సంయుగే=యుద్ధమునందు; రావణం=రావణుని; జహి=చంపుము.

మనుష్యదేహంబునొంది, యుద్ధమునందు, రావణునిం, జంపుము.

అని, తాత్పర్యము.

స హి తేపే తప స్తీవ్రం దీర్ఘకాల మరిందమ
యేన తుష్టో భవ ద్బ్రహ్మా లోకకృ ల్లోకపూర్వజః. ౪

టీక॥ అరిందమ = శత్రువులంజంపునట్టివిష్ణుదేవుఁడా! సః=ఆరావ

ణుఁడు; యేన=ఏతపస్సుచేతను; లోకకృత్=లోకంబులఁజేయువాఁడు ను; లోకపూర్వజః = లోకంబులకన్నముందు పుట్టినవాఁడునగు; బ్రహ్మ=బ్రహ్మదేవుఁడు; తుష్టః=సంతసించినవాఁడు; అభవత్=ఆయెనో; తీవ్రం=తీక్ష్ణమగు; తత్ (అధ్యాహృతము)=ఆ; తపః=తపస్సును; దీర్ఘకాలం=బహుకాలము; తేపే హి = తపించెనుగదా!

ఆరావణుఁడు, బహుకాలము, తీక్ష్ణంబగుతపస్సుచేసెను; దానంజేసి, లోకంబులకన్నముందుపుట్టిసమస్తలోకంబులఁ బుట్టించునట్టిబ్రహ్మదేవుఁడుసంతసించినవాఁడయ్యెను.

అని, తాత్పర్యము.

సంతుష్టః ప్రదదౌ తస్మై రాక్షసాయ వరం ప్రభుః
నానావిధేభ్యో భూతేభ్యో భయన్నాన్యత్ర మానుషాత్. ౫

టీక॥ ప్రభుః=వరంబులనిచ్చుటయందు సమర్థుఁడైన, బ్రహ్మదేవుఁడు; సంతుష్టః=సంతసించినవాఁడై; తస్మై=ఆ; రాక్షసాయ=రాక్షసుండగు రావణునికొఱకు; మానుషాత్= మనుష్యునికన్న; అన్యత్ర=ఇతరస్థలములందు; నానావిధేభ్యః=పలుదెఱంగులుగల; భూతేభ్యః=ప్రాణులవలన; భయం=వెఱపు; న=లేదు; ఇతి(అధ్యాహృతము)=అని; వరం=వరంబును; ప్రదదౌ=ఇచ్చెను.

వరదానంబుల సమర్థుఁడగు బ్రహ్మదేవుండు, సంతసించి, ఆరావణాసురునకు, మనుష్యుఁడుతక్కఁ దక్కినసమస్తభూతంబుల వలనను భయంబులేదని, వరంబొసంగెను.

అని, తాత్పర్యము.

అవజ్ఞాతాః పురా తేన వరదానే హి మానవాః

టీక॥ పురా=మునుపు; వరదానే=వరముయొక్క (వరమును) యిచ్చుటయందు; తేన=ఆరావణునిచేత; మానవాః=మనుష్యులు; అవజ్ఞా



తాహి = అవమానింపఁబడిరిగ దా!

మనువు, బ్రహ్మవరమిచ్చునట్టి కాలమునందు, నతండు, మనుష్యుల, "వీరలెంతమాత్రము". అని, యవమానబుద్ధితోఁ, జూచెను.

అని, తాత్పర్యము.

ఏవం పితామహా త్తస్మా ద్వరం ప్రాప్య స దర్పితః. ౬
ఉత్సాదయతి లోకాం స్త్రీ న్ స్త్రియశ్చాప్యప కర్షతి

టీక॥ ఏవం=ఇట్లు; తస్మాత్=ఆ; పితామహాత్=బ్రహ్మదేవునివలన; వరం=వరమును; ప్రాప్య=పొంది; సః=ఆరావణుఁడు; దర్పితః=గర్వించినవాఁడై; లోకాన్=లోకములను; త్రీన్=మూఁడింటిని; ఉత్సాదయతి = నశింపఁజేయుచున్నాఁడు. స్త్రియశ్చాపి=స్త్రీలను; అపకర్షతి= అపహరింపుచున్నాఁడు.

ఇట్లా రావణుండు, బ్రహ్మదేవునివలనవరంబునొంది, గర్వించి, ముల్లోకంబులనశింపఁ జేయుచున్నాఁడు; స్త్రీలనందఱనుం జెఱగొనుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

తస్మా త్తస్య వధో దృష్టో మానుషేభ్యః పరంతప. ౭

టీక॥ తస్మాత్ = అందువలన; మానుషేభ్యః=మనుష్యులవలన; తస్య=ఆరావణునకు; వధః=చావు; దృష్టః=చూడఁబడినది (నిశ్చయింపఁబడినదనుట).

అందువలన, నారావణునకు, మనుష్యులవలనం, జావు, సిద్ధము. అని, దేవతలుచెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యేత ద్వచనం శ్రుత్వా సురాణాం విష్ణు రాత్మవాన్
పితరం రోచయామాస తదా దశ రథం నృపమ్. ౮



టీక॥ఇతి=ఈప్రకారము;ఆత్మవాన్=జీవులకాధార భూతుండైన; విష్ణుః=విష్ణుదేవుఁడు; సురాణాం=దేవతలయొక్క; ఏతత్=ఈ;వచనం=మాటను; శ్రుత్వా=విని;తదా=అప్పుడు; నృపం=రాజైన;దశరథం=దశరథుని;పితరం=తండ్రినిగా; రోచయామాస= ఇచ్ఛించెను.

ఈప్రకారము, సమస్తజీవులకు నాధార భూతుండగు విష్ణుదేవుండు, దేవతలమాటలంతయువిని,యప్పుడు,మనుష్యరూపంబుననవతరించుటకు, దశరథమహారాజునుం,దనకుఁదండ్రిగాఁ,గోరెను.

అని, తాత్పర్యము.

స చాప్యపుత్రో నృపతి స్తస్మిన్ కాలే మహాద్యుతిః
అయజత్పుత్రియా మిష్టిం పుత్రేప్సు రరిసూదనః. ౯

టీక॥ తస్మిన్=ఆ;కాలే=కాలమందు;అపుత్రః = కొడుకులులేనివాఁడును; మహాద్యుతిః = గొప్పకాంతిగలవాఁడును;అరిసూదనః=శత్రువులంజంపువాఁడునగు; సః=ఆ; నృపతిశ్చాపి=దశరథమహారాజును; పుత్రేప్సుః=కొడుకులయందిచ్ఛగలవాఁడై; పుత్రియాం=కొడుకులఁగల్గించునట్టి;ఇష్టిం=యాగమును;అయజత్=యజించెను.

ఆకాలమునందే,గొప్పకాంతిగలిగిసమస్తశత్రువులంజంపునట్టియాదశరథమహారాజును, దనకుఁగొడుకులులేకుండుటం జేసి,కొడుకులంబడయఁగోరి, పుత్రప్రదంబగుయాగముఁజేసెను.

అనితాత్పర్యము.

స కృత్వా నిశ్చయం విష్ణు రామంత్ర్యచ పితామహమ్
అంతర్ధానం గతో దేవైః పూజ్యమానో మహర్షిభిః. ౧౦

టీక॥సః=ఆ;విష్ణుః=విష్ణుదేవుఁడు; నిశ్చయం= ఏర్పాటును; కృత్వా=చేసి;పితామహంచ=బ్రహ్మదేవుని (చకారముచే) దేవతలను;ఆ

మంత్య్రైః=వీడ్కొని; దేవైః=దేవతలచేతను; మహర్షిభిః=పూజ్యులగు ఋషులచేతను; పూజ్యమానః=పూజింపఁబడుచున్నవాఁడై; అంతర్ధానం=మఱుఁగుపాటును; గతః=పొందెను.

ఆవిష్ణుదేవుండు "మనుష్యులయందేయవతరించెదను" అనినిశ్చయించి, బ్రహ్మదేవునివీడుకొని, దేవతలచేతనుమహర్షులచేతనుంబూజింపఁబడుచు, నంతర్ధానంబు, నొందెను. అని, తాత్పర్యము.



తతో వై యజమానస్య పావకా దతులప్రభమ్
ప్రాదుర్భూతం మహద్భూతం మహావీర్యం మహాబలమ్. ౧౧
కృష్ణరక్తాంబరధరం రక్తాస్యం దుందుభిస్వనమ్
స్నిగ్ధహర్యక్షతనుజ శ్మశ్రుప్రవరమూర్ధజమ్. ౧౨
శుభలక్షణ సంపన్నం దివ్యాభరణ భూషితమ్
శైలశృంగ సముత్సేధం దృప్తశార్దూల విక్రమమ్. ౧౩
దివాకర సమాకారం దీప్తానల శిఖోపమమ్
తప్తజాంబూనదమయీం రాజతాంత పరిచ్ఛదామ్. ౧౪

దివ్యపాయససంపూర్ణాం పాత్రీం పత్నీ మివ ప్రియామ్
ప్రగృహ్యావిపులాందోర్భ్యాం స్వయంమాయామయీమివ. ౧౫

టీక॥ తతః=ఆపిమ్మట; అతుల ప్రభం=సరి లేని కాంతిగలదియును; మహావీర్యం=గొప్ప పరాక్రమముగలదియును; మహాబలం=గొప్పబలము గలదియును; కృష్ణరక్తాంబరధరం = నలుపు నెఱుపునుంగలసినవస్త్రము ధరించినదియును; రక్తాస్యం =ఎఱ్ఱనిముఖముగలదియును; దుందుభిస్వనం= భేరియొక్కధ్వనివంటిధ్వనిగలదియును; స్నిగ్ధహర్యక్షతనుజశ్మశ్రుప్రవరమూర్ధజం, స్నిగ్ధ=సుందరములైన, హర్యక్ష=సింహముయొక్క, తనుజ=వెండ్రుకలవంటివెంట్రుకలును, శ్మశ్రుప్రవర=శ్రేష్ఠములైన మీసములవంటిమీసములును, మూర్ధజం=తలవెంట్రుకలవంటితలవెంట్రుకలునుంగలదియును; శుభలక్షణసంపన్నం=మంగళకరంబులగు సాముద్రికలక్షణంబులతోఁ గూడినదియును; దివ్యాభరణభూషితం = స్వర్గమునందుఁబుట్టినయాభరణంబులచేనలంకరింపఁబడినదియును; శైలశృంగసముత్సేధం=పర్వతశృంగముయొక్క పొడవువంటిపొడవుగలదియును; దృప్తశార్దూలవిక్రమం= గర్వించినపెద్దపులియొక్క పరాక్రమమువంటి పరాక్రమముగలదియును; దివాకరసమాకారం=సూర్యునితోసమానంబగురూపముగలదియును; దీప్తానలశిఖోపమం= మండుచున్ననిప్పుమంటతోసమానమగునదియును; మహత్ = గొప్పదైన; భూతం = పురుషరూపంబగుభూతము; తప్తజాంబూనదమయీం= కరఁగఁబెట్టినబంగారమువికారమైనదియును; రాజతాంతపరిచ్ఛదాం= వెండిచేఁజేయఁబడినపైమూఁతగలిగినదియును; దివ్యపాయససంపూర్ణాం= స్వర్గమునందుఁబుట్టిన పాయసముచే నిండినదియును; మాయా మయీమివ (స్థితాం) = మాయామయమనునట్లున్నదియును; విపులాం=పెద్దదియు నగు; పాత్రీం = కలశమును; ప్రియాం = ప్రియురాలగు; పత్నీమివ= భార్యనుంబోలెఁ స్వ



యం=తానే; దోర్భ్యాం=బాహువులచేత; పరిగృహ్య=ఎత్తికొని; యజమానస్య=యాగముసేయుచున్నదశరథునియొక్క ("వై" అనునది పాదపూరణార్థము); పావకాత్=అగ్నిహోత్రమువలన; ప్రాదుర్భూతం=బయలువెడలెను.

అంత, సరిలేనికాంతియుఁబరాక్రమంబును బలంబునుం గలిగి, ఎఱుపు నలుపునుం గలసినవస్త్రంబుగట్టి, మెట్టనిముఖంబును భేరీధ్వనిసమానంబగు కంఠధ్వనియునుంగల్గి, సింహకేశంబులం బోలినరోమంబులునుమీసంబులునుదలవెండ్రుకలును మనోహరంబులై ప్రకాశింప, శుభలక్షణసహితంబై, స్వర్ణంబునందుఁబట్టినయాభరణంబులధరించి, పర్వతశృంగంబుంబోలెసమున్నతంబై, మదించిన పెద్దపులికి సాటియగుచు, సూర్యునితోను మండుచున్న నిప్పుమంటతోనుసరివచ్చునాకారమునం దేజరిల్లు నొకగొప్పభూతము, పురుషరూపంబుతో, యాగముసేసెడునాదశరథుని యగ్నిహోత్రంబుననుండి, తప్తంబగు బంగారముతోఁజేయఁబడిన, వెండిమూఁతగలిగి, దివ్యపాయసపూర్ణంబై, మాయామయంబో యన్న ట్లున్నదగియున్నయొక్క పాత్రమును, ప్రియభార్యంబోలె, బాహువులఁగదియంబట్టి, బయలువెడలెను.

అని, తాత్పర్యము.

సమవేక్ష్యాబ్రవీ ద్వాక్య మిదం దశరథం నృపమ్
ప్రాజాపత్యం నరం విద్ధి మా మిహా భ్యాగతం నృప. ౧౬

టీక॥ తత్ (అధ్యాహృతము)=ఆభూతము; నృపం=రాజైన; దశరథం=దశరథుని; సమవేక్ష్య=చూచి; "నృప=రాజా! ఇహ=ఇచ్చటికి; అభ్యాగతం=వచ్చిన; మాం=నన్ను; ప్రాజాపత్యం=ప్రజాపతియొద్దనుండివచ్చిన; నరం=పురుషునిఁగా; విద్ధి=తెలిసికొనుము" ఇదం=ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.



ఆభూతము, దశరథమహారాజుం జూచి, "రాజా ! ఇచ్చటికి వచ్చిననన్నుఁ బ్రజాపతియొద్దనుండి వచ్చినపురుషునిఁగా నెఱుంగుము" అనిచెప్పెను.

అని, తాత్పర్యము.

తతః పరం తదా రాజా ప్రత్యువాచ కృతాంజలిః
భగవన్ స్వాగతం తేఽస్తు కిమహం కరవాణి తే. ౧౭

టీక॥ తతఃపరం=ఆపిమ్మట; తదా=అప్పుడు; రాజా=దశరథమహారాజు; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పు గలవాఁడై; "భగవన్=భగవంతుఁడా ! తే=నీకు; స్వాగతం = సుఖముతోడిరాక; అస్తు=అగుఁగాక ! తే = నీకు; అహం=నేను; కిం=ఏమి; కరవాణి=చేయుదును. ఇతి=(అధ్యాహృతము) అని; ప్రత్యువాచ=బదులుపలికెను.

అంత, నప్పుడు, దశరథమహారాజు చేమోడ్పుగీలించి, "భగవంతుఁడా ! నీకుస్వాగతంబగుఁగాక ! నీకు నేనేమి సేయుదు, నానతిమ్ము" అని, బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

అథో పున రిదం వాక్యం ప్రాజాపత్యో నరోఽబ్రవీత్

టీక॥ అథో=ఆపిమ్మట; ప్రాజాపత్యః=ప్రజాపతియొద్దనుండి వచ్చిన; నరః=పురుషుఁడు; పునః=మఱల; ఇదం=ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్ = దశరథునిగూర్చి, చెప్పెను.

ఆపిమ్మటఁ, బ్రజాపతియొద్దనుండివచ్చినపురుషుఁడు, మఱల, నిట్లని, దశరథునకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

రాజ న్నర్చ యతా దేవా నద్య ప్రాప్త మిదం త్వయా. ౧౮

టీక॥ రాజన్ = దశరథమహారాజా! దేవాన్=దేవతలను; అర్చయతా = పూజించుచున్న; త్వయా=నీచే; అద్య=ఇప్పుడు; ఇదం=

ఈపాయసము; ప్రాప్తం=పొందఁబడినది.

దశరథమహారాజా! నీవు,యాగంబులచే దేవతలందృప్తినొందించితివి, కావున, నీపాయసం, బిప్పుడు,నీకుఁబ్రాప్తించినది.

అని, తాత్పర్యము.

ఇదంతు నృపశార్దూల పాయసం దేవనిర్మితమ్
ప్రజాకరం గృహాణ త్వం ధన్య మారోగ్య వర్ధనమ్. ౧౯

టీక॥ నృపశార్దూల= రాజశ్రేష్ఠుఁడా ! దేవనిర్మితం=దేవతలచేనిర్మింపఁబడినదియును; ప్రజాకరం=సంతానమును గల్గించునదియును; ధన్యం=ధనమునిచ్చునదియును; ఆరోగ్య వర్ధనం=ఆరోగ్యమునువృద్ధిఁబొందించునదియునగు;ఇదం=ఈ; పాయసంతు=పాయసమును మాత్రము; త్వం=నీవు; గృహాణ=స్వీకరింపుము.

రాజశ్రేష్ఠుఁడా ! దేవతలచేనిర్మింపఁబడి,సంతానప్రదంబై, ధన్యంబై,యారోగ్యమునువృద్ధిఁబొందించునదియై, యుండు, నీపాయసంబునుమాత్రము,నీవు,తప్పక,స్వీకరింపుము. అని తాత్పర్యము.

భార్యాణా మనురూపాణా మశ్నీతేతి ప్రయచ్ఛవై
తాసు త్వం ప్రాప్స్యసే పుత్రాన్ యదర్థం యజసేనృప. ౨౦

టీక॥ నృప=రాజా; అనురూపాణాం=సజాతీయలగు; భార్యాణాం=భార్యలకు;అశ్నీత=భోజనముసేయుఁడు;ఇతి=అని; ఉక్త్వా=(అధ్యాహృతము) చెప్పి; ప్రయచ్ఛ=ఇమ్ము ("వై" అనునదిపాదపూరణార్థము); త్వం=నీవు;యదర్థం=ఎవరికొఱకు; యజసే=యాగముసేయుచున్నావో; తాన్ (అధ్యాహృతము)=ఆ;పుత్రాన్=కొడుకులను; తాసు=ఆభార్యలందు;ప్రాప్స్యసే=పొందఁగలవు.

రాజా! ఈపాయసంబును,సజాతీయలగు క్షత్రియ జాతీయభార్యలకు"భుజింపుఁడు"అని,చెప్పియిమ్ము;(విజాతీయలగువైశ్యాదిభార్య

లకివ్వకుము;) దీనింగుడుచుటవలన ఆభార్యలందు, నీవిప్పు, డెవరికొఱకుయాగము సేసెదవో, అట్టిపుత్రులంబడసెదవు. అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తథేతి నృపతిః ప్రీత శ్శిరసా ప్రతిగృహ్య తామ్
పాత్రీం దేవాన్నసంపూర్ణాం దేవదత్తాం హిరణ్మయీమ్. ౨౧

టీక॥ నృపతిః = మనుష్యులకుఁ బ్రభువైనదశరథుఁడు;తథేతి=ఆలాగేయని; దేవాన్నసంపూర్ణాం= దేవతలయొక్క యన్నముచే నిండియున్నదియును; దేవదత్తాం=దేవతలచేనివ్వఁబడినదియును; హిరణ్మయీం= బంగారువికారమైనదియునగు;తాం=ఆ; పాత్రీం=కలశమును;శిరసా = శిరస్సుచేత; ప్రతిగృహ్య=స్వీకరించి; ప్రీతః=సంతోసించినవాఁడు;అభవత్ (అధ్యాహృతము)=ఆయెను.

దశరథమహారాజు, ఆలాగేయని చెప్పి, దేవాన్నముతోనిండియున్నదియు, దేవతలచేనివ్వఁబడినదియు, బంగారుతోఁ జేయఁబడినదియునగు, నాకలశమునుశిరస్సుచే,నమ్రుఁడై,పుచ్చుకొని,సంతసించెను.

అని, తాత్పర్యము.

అభివాద్య చ త ద్భూత మద్భుతం ప్రియదర్శనమ్
ముదా పరమయా యుక్త శ్చకారా భిప్రదక్షిణమ్. ౨౨

టీక॥ సః (అధ్యాహృతము)= ఆదశరథుఁడు;పరమయా=మిక్కిలియధికమైన; ముదా= సంతోషముతో;యుక్తః = కూడినవాఁడై; అద్భుతం=ఆశ్చర్యకరమును;ప్రియదర్శనం=సంతోషముగలిగించునట్టిదర్శనము గలదియునగు; తత్=ఆ ; భూతం=భూతమును; అభివాద్య చ=నమస్కరించియు; అభిప్రదక్షిణం=చుట్టుంబ్రదక్షిణము;చకార= చేసెను.

ఆదశరథుఁడు, పరమసంతోష

మునొంది, ఆశ్చర్యకరుండును, ప్రియదర్శనుండు నగునాప్రాజాపత్యపురుషునమస్కరించి, చుట్టునుం ప్రదక్షిణము చేసెను.

అని, తాత్పర్యము.

తతో దశరథః ప్రాప్య పాయసం దేవనిర్మితమ్
బభూవ పరమప్రీతః ప్రాప్య విత్త మివాధనః. ౨౩

టీక॥ తతః = ఆపిమ్మట; దశరథః=దశరథుఁడు; దేవనిర్మితం=దేవతలచే నిర్మింపఁబడిన ; పాయసం = పాయసమును; ప్రాప్య= పొంది; విత్తం=ధనమును; ప్రాప్య= పొంది; అధనఇవ=ధనములేనివాఁడువలె; పరమప్రీతః=మిక్కిలియధికముగా సంతసించినవాఁడు; బభూవ=ఆయెను.

అంత, దశరథుండు, దేవనిర్మితంబగు పాయసంబునొంది, ధనమునొందినదరిద్రుండుంబోలె, మిక్కిలి యధికముగా సంతసించెను.

అని, తాత్పర్యము.

తతస్త దద్భుతప్రఖ్యం భూతం పరమ భాస్వరమ్
సంవర్తయిత్వా తత్కర్మ తత్రైవాం తరధీయత. ౨౪

టీక॥తతః=ఆపిమ్మట; అద్భుతప్రఖ్యం= ఆశ్చర్యకరంబగునాకారము గలదియును; పరమభాస్వరం= మిక్కిలి యధికముగాఁ ప్రకాశించునదియు నగు; తత్ =ఆ, భూతం= భూతము; తత్ =ఆ; కర్మ= కార్యమును; సంవర్తయిత్వా=ముగించి; తత్రైవ=అచ్చటనే; అంతరధీయత=మఱుఁగు పాటునొం దెను.

అంత, నద్భుతంబగునాకారంబునుం బరమంబగు కాంతియునుంగల, ఆ ప్రాజాపత్యపురుషుఁడు, పాయసమునిచ్చుటముగియఁగానే, అచ్చటనే, యంతర్ధానంబునొం దెను.

అని తాత్పర్యము.

హర్షరశ్మిభి రుద్ద్యోతం తస్యాంతఃపుర మాబభౌ
శారదస్యా భిరామస్య చంద్రస్యేవ నభోంశుభిః. ౨౫

టీక॥ హర్షరశ్మిభిః = సంతోషముచేతఁ గలుగుకాంతులచేత; ఉద్ద్యోతం = వ్యాపించుచున్న ప్రకాశముగల; తస్య = ఆదశరథమహారాజుయొక్క; అంతఃపురం = అంతిపురము; శారదస్య = శరదృతువునందుఁ బుట్టినవాఁడును; అభిరామస్య = ప్రకాశించు చున్నవాఁడునగు; చంద్రస్య = చంద్రునియొక్క; అంశుభిః = కిరణములచేత; ఉద్ద్యోతం (అధ్యాహృతము) = వ్యాపించుచున్న ప్రకాశముగల; నభ ఇవ = ఆకాశమువలె; ఆబభౌ = మిక్కిలిప్రకాశించెను.

సంతోషంబునం గల్గుకాంతులచే వెలుంగుచున్న యాదశరథునంతిపురము, శరత్కాలము నందలిచంద్రుని కాంతులచే వెలుంగునాకాశముంబోలెఁబ్రకాశించెను.

అని, తాత్పర్యము.

సంతోషము "తెల్లనిది" అని, కవిసంకేతము, పుత్రప్రదంబగుపాయసము దొరకొనుటంజేసి, యాదశరథునియంతఃపురస్త్రీలు, మిగుల, సంతసించిరి.

అని, భావము.

సోఽంతఃపురం ప్రవిశ్యైవ కౌసల్యా మిద మబ్రవీత్
పాయసం ప్రతిగృహ్ణీష్వ పుత్రీయం త్విద మాత్మనః. ౨౬

టీక॥ సః = ఆదశరథుఁడు; అంతఃపురం = అంతిపురమును; ప్రవిశ్యైవ = ప్రవేశించినంతనే; కౌసల్యాం = కౌసల్యనుగూర్చి; ఆత్మనః = నాకు; పుత్రీయం = కొడుకులనుగల్గించునట్టి; ఇదం = ఈ; పాయసం తు = పాయసమునుమాత్రము; ప్రతిగృహ్ణీష్వ = పుచ్చుకొనుము. ఇదం = ఈమాటను; అబ్రవీత్ = పలికెను.

ఆదశరథుండంతిపురముప్రవేశించి, "నాకుఁబుత్రప్రదంబగు, నీపాయసమును దప్పకపుచ్చుకొనుము" అని, కౌసల్యకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌ తదా
అర్ధా దర్ధం దదౌచాపి సుమిత్రాయై నరాధిపః, ౨౭
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థ కారణాత్
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యా మృతోపమమ్. ౨౮
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః
ఏవంతాసాం దదౌరాజా భార్యాణాంపాయసంపృథక్. ౨౯

టీక॥ తదా=అప్పుడు; పుత్రార్థకారణాత్ = పుత్రుఁడనుప్రయోజనముయొక్క నిమిత్తము; నరపతిః = మనుష్యులకుఁబ్రభువైనదశరథుఁడు; కౌసల్యాయై=కౌసల్యకొఱకు; పాయసార్థం= పాయసముయొక్క సగమును ; దదౌ = ఇచ్చెను. నరాధిపః=మనుష్యులకుఁబ్రభువైనదశరథుఁడు;సుమిత్రాయైచాపి = సుమిత్రకొఱకును;అర్ధాత్=మిగిలినసగమునుండి;అర్ధం=సగమును(నాలవభాగముననుట); దదౌ=ఇచ్చెను. కైకేయ్యైచ=కైకేయికొఱకును; అవశిష్టార్ధం=మిగిలిననాలవభాగముయొక్క సగమును (ఎనిమిదవభాగముననుట); దదౌ= ఇచ్చెను. మహీపతిః=భూమికిఁబ్రభువగుదశరథుఁడు ;అనుచింత్య=ఆలోచించి;పునరేవ=మఱలనే;సుమిత్రాయై=సుమిత్రకొఱకు; పాయసస్య=పాయసముయొక్క; అమృతోపమం=అమృతముతోసమానముగు; అవశిష్టార్ధంచ=కైకేయికివ్వఁగామిగిలిననాలవభాగములోనిసగమును(రెండవదియగునెనిమిదవభాగముననుట) ప్రదదౌ=ఇచ్చెను. రాజా=దశరథమహారాజు,ఏవం=ఈప్రకారము, తాసాం=ఆ; భార్యాణాం=భార్యలకు;పాయసం=పాయసమును;పృథక్=వేఱువేఱుగా; దదౌ=ఇచ్చెను.

అప్పుడు, దశరథమహారాజు, సంతానముగలుగుటకై, యాపాయసంబులో, సగము, కౌసల్యకిచ్చెను;యామిగిలినసగములోసగముసుమిత్రకొసంగెను; సుమిత్రకివ్వఁగామిగిలినదానిలోసగముకైకేయికిడెను;ఆవెనుక, సుమిత్ర కైకేయికన్న

నెచ్చుగా భుజింప నర్హురాలని యాలోచించి, మఱలనా కైకేయి కివ్వఁగామిగిలినపాయసమును, సుమిత్రకొసంగెను;ఈప్రకారము, దశరథమహారాజు, భార్యలకుఁ బాయసమునుబంచిపెట్టెను.

అనఁగా, పాయసములో, సగముకౌసల్యకును, నాలవపాలుసుమిత్రకును,ఎనిమిదవపాలు కైకేయికెని మఱలనా మిగతయైనెనిమిదవపాలు నుసుమిత్రకిచ్చెను.

అని, తాత్పర్యము.

ఇట్లు,మహేశ్వరతీర్థగోవింద రాజులువ్యాఖ్యానముసేసిరి. మునిభావప్రకాశికాకారులుమాత్రము, మఱియొక విధంబునను వ్యాఖ్యానముచేసిరి.

విశేషార్థములు.— తదా=అప్పుడు; పుత్రార్థకారణాత్=పుత్రప్రయోజననిమిత్తము;నరపతిః=దశరథమహారాజు;కౌసల్యాయై=కౌసల్యకొఱకు; పాయసార్థం=పాయసముయొక్క సగమును; దదౌ=ఇచ్చెను.నరాధిపః=దశరథమహారాజు;సుమిత్రాయైచాపి=సుమిత్రకొఱకును; శేషస్య(అర్ధ్యాహృతము)=కౌసల్యకివ్వఁగా మిగిలినసగముయొక్క;అర్ధాత్ = సగమునుండి (నాలవభాగమునుండియనుట);అర్ధం=సగమును (ఎనిమిదవభాగమును);దదౌ=ఇచ్చెను. కైకేయ్యైచ=కైకేయికొఱకును; అవశిష్టార్థం=కౌసల్యకివ్వఁగామిగిలిన సగములో సుమిత్రకిచ్చుటకు రెండు భాగములుచేసినసగముపోఁగా, మిగిలినసగమును(నాలవభాగమనను ట);దదౌ=ఇచ్చెను; మహీపతిః=దశరథుఁడు;అనుచింత్య = ఆలోచించి;పునరేవ = మఱలనే;సుమిత్రాయై=సుమిత్రకొఱకు; అమృతోపమం= అమృతముతోసమానమగు; పాయసస్య=పాయసముయొక్క; అవశిష్టార్ధంచ=పూర్వము,సుమిత్రకిచ్చుటకుఁగా రెండుభాగములుచేసిననాలవభాగములో, నపుడుసుమిత్రకివ్వఁగామిగిలినసగమును(రెండవదియగు నెనిమిదవ భాగ మనను ట);ప్రదదౌ=ఇచ్చెను. రాజా=దశరథుఁడు;ఏవం=ఇట్లు; తాసాం=ఆ;భార్యాణాం= భార్యలకు; పాయసం=పాయసమును; పృథక్=వేఱువేఱుగ;దదౌ=ఇచ్చెను.

అప్పుడు,దశరథమహారాజు,సంతానము గలుగుటకై,కౌసల్యకుఁ, బాయసములోసగమునిచ్చెను;సుమిత్రకుమిగిలినసగములోనిసగములోసగము(ఎనిమిదవభాగమును) నిచ్చెను; సుమిత్రకుఁ గావిభజింపఁబడిననాలవపాలు గాక మిగిలిన నాలవపాలును,గైకేయికిచ్చెను; పూర్వమొసఁ నాలవపాలు విభజించియందుసగముసుమిత్రకివ్వఁగా మిగిలినసగమును( రెండవదియగునెనిమిదవభాగమును)మఱల,సుమిత్రకేయిచ్చెను.

అనఁగా; కౌసల్యకుఁ బాయసములో సగమునిచ్చెను; సుమిత్రకెనిమిదవపాలిచ్చెను; కైకేయికినాలవపాలిచ్చెను; మిగిలినయెనిమిదవభాగమునుమఱల సుమిత్రకేయిచ్చెను.

అని, తాత్పర్యము.

వీరే, పురాణాంతరవిరోధంబు పరిహరించుటకై, మఱియొకవిధంబునను,వ్రాసిరి. —తదా; పుత్రార్థకారణాత్; నరపతిః; కౌసల్యాయై; పాయసార్ధం=;దదౌ. (ఇది సమానార్థకము)నరాధిపః= దశరథుఁడు; సుమిత్రాయైచాపి=సుమిత్రకొఱకును; అర్ధాత్=కౌసల్యకివ్వఁబడినసగమునుండి; అర్ధం=సగమును;దదౌ=ఇచ్చెను. కైకేయ్యైచ= కైకేయికొఱకును; అవశిష్టార్ధం=పూర్వముకౌసల్యాసుమిత్రలకివ్వఁగా మిగిలిన సగములోసగమును;దదౌ=ఇచ్చెను;మహీపతిః=దశరథుఁడు,అనుచింత్య=ఆలోచించి; పునరేవ=మఱలనే;సుమిత్రాయై=సుమిత్రకును; అవశిష్టార్ధంచ=సగములోసగముకైకేయికివ్వఁగామిగిలినసగమును;ప్రదదౌ=ఇచ్చెను.

అప్పుడు, దశరథుఁడు మొదటఁ, గౌసల్యకుఁ, బాయసంబులో సగము,నిచ్చెను;కౌసల్యకిచ్చిన సగములోసగముదీసిసుమిత్రకిచ్చెను; మిగిలినసగములోసగమునుగైకేయికిచ్చెను. అంతనవశిష్టంబగు నాలవపాలును,సుమిత్రకేయిచ్చెను.అనఁగా, కౌసల్యకునాలవపాలును,సుమిత్రకునాలవపాలును, గైకేయికినాలవపాలును, మిగిలిననాలవపాలునుమఱల,సుమిత్రకునిచ్చెను.

అని, తాత్పర్యము.

విచారము.—"ఋశ్యశృంగవసిష్ఠాభ్యామనుజ్ఞాతో దదౌహరిః, కౌసల్యాయైసకైకేయ్యోఅర్ధమర్ధం




ప్రయత్నతః. తతస్సుమిత్రా సంప్రాప్తాజిఘృక్షుః పాత్రికీంచరుం, కౌసల్యాతుస్వభాగార్ధం దదౌ తస్యై ముదాన్వితా. కైకేయీచ స్వభాగార్ధందదౌ ప్రీతిసమన్వితా." (ఆదశరథుఁడు, ఋశ్యశృంగవసిష్ఠులవలననను జ్ఞ నొంది పాయసమును, గౌసల్యకును గైకేయికిని సగముసగము గాఁబంచిపెట్టెను; అప్పుడు, పుత్రప్రదంబగు పాయసంబుగ్రహింపనిచ్చగోని, సుమిత్రయువచ్చెను; కౌసల్య, సంతోషముతోఁ, దనభాగములోసగము సుమిత్రకొసంగెను; కైకేయియును, బ్రీతితోఁగూడినదై, తనభాగములోసగము, సుమిత్రకిడెను.) అనునధ్యాత్మరామాయణమందలిపాయసవిభాగఘట్టమందు, పాయసమంతయుసరిగా రెండుభాగములుచేసి, దశరథుండు, కౌసల్యాకైకేయులకొసంగినట్లును, అంతనా కౌసల్యాకైకేయులు, తమతమభాగములలోసగముసగముదీసి, సుమిత్రకిచ్చినట్లును, జెప్పఁబడియున్నది. ఇచ్చట, ఈయధ్యాత్మరామాయణమునకును, మహేశ్వరతీర్థగోవిందరాజులవారుచేసిన, వ్యాఖ్యానమునకునువిరోధముస్పష్టముగానగుపడుచున్నది. గోవిందరాజులవారుమాత్రము, పురాణాంతర విరోధము, కల్పభేదముకల్పించి, పరిహరింపఁదగినదనివచించిరి. మునిభావ ప్రకాశికాకారు, లీయధ్యాత్మరామాయణవచన విరోధ పరిహారంబునకై యే, రెండవయర్థము, వ్రాసినట్లగుపడుచున్నది. అయినను, అందు, కౌసల్యాదులుభుజించిన పాయసభాగనిర్ణయవిషయమునందుమాత్రము విరోధము లేదుగాని, యధ్యాత్మరామాయణంబునందు సుమిత్రకుఁ గౌసల్యాకైకేయులుపాయసమునిచ్చినట్లుచెప్పఁబడియున్నందునను, వీరివ్యాఖ్యానంబునదశరథుఁడేసుమిత్రకునుంచాయసమునిచ్చెనని యేర్పడినందువలనను, పాయసప్రదాతృభేదవిరోధముమాత్రముజాగరూకమగుచున్నది. ఐనను, భిన్నగ్రంథములకుస్వల్పవిరోధంబున నేమియు దోషంబు లేదు. వక్ష్యమాణప్రకారంబున వ్యాఖ్యానంబుచేసిన నావిరోధంబునుం బరిహరింపంబడు.

తదా=అప్పుడు; పుత్రార్థకారణాత్=పుత్రప్రయోజననిమిత్తము;




 

నరపతిః=దశరథుఁడు; కౌసల్యాయై=కౌసల్యకొఱకు; పాయసార్ధం=పాయసములో సగపాలును; దదౌ=ఇచ్చెను. నరాధిపః=దశరథుఁడు; అర్ధాత్=కౌసల్యకిచ్చినసగమునుండే; అర్ధం=సగమును; సుమిత్రాయైచాపి=సుమిత్రకొఱకును; దదౌ=ఇచ్చెను. కైకేయ్యైచ=కైకేయికొఱకును; అవశిష్టార్ధం=కౌసల్యాసుమిత్రలకివ్వఁగామిగిలిన సగపాలును; దదౌ=ఇచ్చెను. మహీపతిః=దశరథుఁడు; అనుచింత్య (అధ్యాత్మరామాయణములో, "ఋశ్యశృంగ వసిష్ఠులవలన ననుజ్ఞ నొంది" యని యుండుటవలన)=ఋశ్యశృంగవసిష్ఠులతోనాలోచించి, పునరేవ=మఱలనే; సుమిత్రాయై=సుమిత్రకొఱకు; అవశిష్టార్ధం=పూర్వము కౌసల్యాసుమిత్రులకివ్వఁగామిగిలి యావెనుకఁ గైకేయికివ్వఁబడిన సగములోసగము; ప్రదదౌ=ఇచ్చెను.

దశరథుఁడు, మొదటఁ, గౌసల్యకుఁ బాయసములో సగముదీసి యిచ్చెను; మఱలఁ గౌసల్యకిచ్చినసగములో సగము దీసి, సుమిత్రకిచ్చెను; అందుమిగిలినదానిఁ గౌసల్య కొసంగెను; అంతఁగౌసల్యాసుమిత్రలకివ్వఁగామిగిలినసగమును గైకేయికిచ్చెను; సుమిత్రకిద్దఱుకొడుకులుపుట్టదగి యుండుట నెఱింగిన ఋశ్యశృంగవసిష్ఠులప్రేరణచే, కైకేయికిచ్చినసగములో, సగముదీసి, మఱల సుమిత్రకొసంగెను.

అని, తాత్పర్యము.

అధ్యాత్మ రామాయణమునందు, ఋశ్యశృంగవసిష్ఠులుచెప్పినరీతింబట్టి, దశరథుఁడు, పాయసమునంతయుఁ బంచిపెట్టినట్లును, వారలుసుమిత్రకిచ్చినట్లును, జెప్పఁబడియున్నదిగదా! కౌసల్యా కైకేయులు, దీర్ఘదర్శులగు ఋశ్యశృంగవసిష్ఠుల యాజ్ఞాప్రకారము తమభర్తయగుదశరథుండు తమకిడిన, దివ్యపాయసంబులోఁబతియాజ్ఞలేకయే, కొంతభాగమును, సుమిత్రకొసంగుటకు, సాహసింపలేరు; కావున, దశరథునియాజ్ఞంబట్టియే, వారలట్లుచేసియుందురు. దశరథుండును, ఋశ్యశృంగ వసిష్ఠాజ్ఞానువర్తి కావున, వారి యనుమతిం బట్టియే, భార్యల కట్లాజ్ఞాపించి

 

యుండును. కాఁబట్టి; "దశరథుఁడు, మొదటఁ, గౌసల్యాకైకేయులకుఁ బాయసం బంతయుఁబంచిపెట్టి , ఋశ్యశృంగవసిష్ఠులు, దీర్ఘదర్శులు కావున,సుమిత్రయందిద్దఱుకొడుకులుగల్గుటెఱింగి, తన్నుఁబ్రేరేపింపఁగా,సుమిత్రకుక్తరీతినిచ్చునట్లు,కౌసల్యాకైకేయులకాజ్ఞాపించిన,వారలట్లుచేసిరి."అని, యధ్యాత్మరామాయణవచనంబునకభిప్రాయము.

సుమిత్రకుఁ, గౌసల్యాకైకేయులు,పాయసంబునిచ్చినప్పటికిని, వారలు, దశరథుని యాజ్ఞచొప్పుననే యిచ్చుటంబట్టి,దశరథుండిచ్చినట్లే, యగుచున్నది. కావున, ఈరామాయణంబునకును, అధ్యాత్మరామాయణంబునకు, విరోధం,బేమియు, లేదనుట,స్పష్టము.

ఇంక, నీరామాయణంబుననే, యుక్తార్థంబునకు, విరుద్ధంబులగునట్లు కనుపడుచున్నవచనంబులయభిప్రాయమువివరింపఁబడుచున్నది.

అష్టాదశసర్గమందు ," కౌసల్యా జనయ ద్రామం సర్వ లక్షణ సంయుతం, విష్ణోరర్ధంమహాభాగం పుత్రమైక్ష్వాకవర్ధనం. భరతో నామకైకేయ్యాం జజ్ఞేసత్యపరాక్రమః, సాక్షాద్విష్ణో శ్చతుర్భాగస్సర్వైస్సముదితోగుణైః. అథలక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రా జన యత్సుతౌ, వీరౌసర్వాస్త్రకుశలౌవిష్ణోరర్ధసమన్వితౌ."అని, రాముఁడు,విష్ణువులోనర్ధభాగమనియు, భరతుఁడుచతుర్భాగమనియు,లక్ష్మణశత్రుఘ్నులుఅర్ధభాగమనియుఁజెప్పఁబడియున్నది,పాయసమునుభార్యలందఱుసమముగాభుజించియున్నట్లైన,రామాదులయందు, విష్ణ్వంశంబును, సమముగానేయుండును; "చతుర్భాగః"అనుటకు, అష్టమాంశంబని, మహేశ్వర తీర్థగోవింద రాజులువ్యాఖ్యానము సేసియుండుటంబట్టి, భరతుఁడుమాత్రమష్టమాంశమని, యేర్పడుచున్నది; మఱియు, రాముఁడుఅర్ధభాగమును,లక్ష్మణశత్రుఘ్నులు, క్రమంబున ( ఇచ్చటి యర్ధశబ్దమునకు అంశపర్యాయముగా వ్యాఖ్యానము సేయఁబడియుండుట వలన ) చతుర్థాష్టమాంశంబులనియు, నిశ్చితమగుచున్నది. పాయసవిభాగము సమముగానున్నప్పు, డిచ్చటమాత్రము వి




ష్ణ్వంశంబుసమముగాకయుండుట, పూర్వగ్రంథమునకు, విరుద్ధమగుచున్నది. అని విరోధోపన్యాసము. ఇఁక, సమాధానమువ్రాయఁబడుచున్నది.

రాముఁడు, విష్ణువులోనర్ధభాగంబగుటయు, భరతుండష్టమభాగంబగుటయు, లక్ష్మణశత్రుఘ్నులు, క్రమంబునఁ, జతుర్థాష్టమభాగంబు లగుటయు, సిద్ధాంతితార్థమే పాయస విభాగంబు ననుసరించి యంశస్థితి నుండవలయునని, నియమం బేమియు లేదు. పాయసము, ఋశ్యశృంగ మహామునిచేఁ జేయింపఁబడిన పుత్రీయేష్టిప్రభావంబున, లబ్ధంబైనది. కావుననే "అథో పునరిదం వాక్యం ప్రాజాపత్యో నరోఽబ్రవీత్, రాజన్నర్చయతా దేవా నద్య ప్రాప్తమిదం త్వయా" (పిమ్మటఁ బ్రాజాపత్యుండగు పురుషుఁడు "దశరథుఁడా! దేవతల యజించునట్టి నీచేతనీపాయసంబిప్పుడు లబ్ధంబయ్యె, దేవతలయజించుటయనఁగాయాగము సేయుట) అని, యాగము సేయుటవలననే పాయసంబు దొరకొనెనని చెప్పఁబడియున్నది. రామాదుల యందు, దేవతాప్రార్థితుండై విష్ణుదేవుండవతరించుటం జేసి, విష్ణుదేవుని యంశంబులు సన్నివిష్టంబులయ్యె. దీనికిని, దానికి, నేమియు, సంబంధం బుండునట్లు, గ్రంథంబువలనం గానరాదు. "కృత్వాత్మానం చతుర్విధం" (విష్ణుదేవుఁడు, తన్నునాలుగుభాగములుగాఁ జేసికొని) యను వచనంబునను, సమభాగంబులని నిరూపితంబు కాదయ్యె. కావున, యాగప్రభావంబువలన, లబ్ధంబయిన, పాయసంబుభుజించిన క్రమంబుననే, విష్ణ్వవతారఘటకంబగు నంశస్థితియునుండవలయునని చెప్పుటకేమియునవకాశంబులేదు. ఇట్లు, ఉక్తవచనవిరోధంబును లేదని, యెఱుంగునది. గ్రంథ విస్తర భయంబున, నీవిచారం, బింతటతో, ముగింపఁబడినది.

తాస్త్వేతత్పాయసం ప్రాప్య నరేంద్ర స్యోత్తమాః స్త్రియః
సమ్మానం మేనిరే సర్వాః ప్రహర్షోదితచేతసః. 30







టీక॥ ఉత్తమాః=గుణములచే నుత్తమలయిన ;నరేంద్రస్య= మనుష్యులకుఁ బ్రభువైన దశరధునియొక్క; తాః=ఆ; స్త్రియః=భార్యలు;సర్వాస్తు=అందఱును;ఏతత్= ఈ;పాయసం = పాయసమును; ప్రాశ్య=పొంది;ప్రహర్షోదితచేతసః, ప్రహర్షోదిత=పుట్టినసంతోషముగల (పూర్వపద విశేషణము); చేతసః= మనస్సుగలవారలై; సమ్మానం = బహుమానముగా; మేనిరే=తలంచిరి.

దశరధునిభార్యలందఱును, శ్రేష్ఠములైన గుణములుగలవారు గావున, నాపాయసంబునొంది, సంతసించినవారలై, దశరధుండుచేసిన పాయసప్రదానక్రమమును, జాల, బహుమానముగా, నెంచిరి.

అని, తాత్పర్యము.

తతస్తు తాః ప్రాశ్య త దుత్తమ స్త్రియో
మహీపతే రుత్తమపాయసం పృధక్
హుతాశనాదిత్యసమానతేజస
శ్చిరేణగర్భాన్ ప్రతిపేదిరే తదా. ౩౧

టీక॥తతః=ఆపిమ్మట; మహీపతేః=భూమికిఁబ్రభువైన దశరధునియొక్క;ఉత్తమస్త్రియః=ఉత్తమభార్యలు; తత్=ఆ;ఉత్తమపాయసం = శ్రేష్ఠమైనపాయసమును; ప్రాశ్య=భుజించి; తదా= అప్పుడు; హుతాశనాదిత్యసమానతేజసః=వివ్హితోను సూర్యునితోనుసరివచ్చుకాంతిగలవారలై; చిరేణ= కొంత కాలమునకు వెనుక ; గర్భాన్=గర్భములను; ప్రతిపేదిరే=పొందిరి.

అంత, నాదశరధుని యుత్తమభార్యలు, ఆయుత్తమ పాయసంబుభుజించి,అగ్నిహోత్రునితోను, సూర్యునితోను సరివచ్చుకాంతిగలవారలై, కొంతకాలమునకు వెనుక,గర్భంబులఁబొందిరి.

అని,తాత్పర్యము.




తత స్తు రాజా ప్రస మీక్ష్య తాః స్త్రియః
ప్రరూఢగర్భాః ప్రతిలబ్ధమానసః
బభూవ హృష్ట స్త్రిదివే యథా హరిః
సురేంద్రసిద్ధర్షి గణాభిపూజితః. ౩౨

టీక॥ తతః=ఆపిమ్మట; రాజా తు = దశరథమహారాజును; ప్రరూఢగర్భాః= మొలిచిన గర్భములు గల; తాః = ఆ; స్త్రియః = భార్యలను; ప్రసమీక్ష్య= చూచి; ప్రతిలబ్ధమానసః=మఱలఁబొందఁబడినమనస్సుగలవాఁడై(స్వస్థచిత్తుఁడై యనుట); త్రిదివే=స్వర్గమునందు; సురేంద్రసిద్ధర్షిగణాభిపూజితః= దేవతాశ్రేష్ఠులచేతను సిద్ధులచేతను ఋషులచేతనుంబూజింపఁబడినట్టి; హరిర్యథా =ఇందు్రఁడువలె; హృష్టః= సంతసించినవాఁడు; బభూవ=ఆయెను.

అంత, దశరథుండును, గర్భిణులైనతనభార్యలంజూచి, స్వస్థచిత్తుఁడై, స్వర్గమునందు దేవశ్రేష్ఠులచేతను సిద్ధులచేతను ఋషులచేతనుం బూజింపఁబడుచుండు దేవేంద్రుఁడుంబోలె, సంతసించియుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే, షోడశ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండ షోడశసర్గ టీక, ముగిసినది.

---

శ్రీ

సప్తదశసర్గప్రారంభః.

పుత్రత్వంతు గతే విష్ణౌ రాజ్ఞ స్తస్య మహాత్మనః
ఉవాచ దేవతా స్సర్వా స్స్వయంభూ ర్భగవా నిదమ్. ౧

టీక॥ విష్ణౌ= విష్ణుదేవుఁడు;మహాత్మనః = పూజ్యంబగుస్వభావముగల;తస్య=ఆ; రాజ్ఞః=దశరథమహారాజునకు; పుత్రత్వం=కొడుకగుటను;గతేతు=పొందఁగానే;భగవాన్=భగవంతుఁడగు; స్వయంభూః=బ్రహ్మ; దేవతాః=దేవతలను;సర్వాః=అందఱినుంగూర్చి; ఇదం=ఈమాటను; ఉవాచ=పలికెను.

విష్ణుదేవుఁడు, మహాత్ముండగు నాదశరథమహారాజునకుఁ, గొడుకుగాఁ,బుట్టుటకుద్యుక్తుఁడుకాఁగానే, భగవంతుండగుబ్రహ్మదేవుండు, దేవతలనందఱ(ఁ)గూర్చి,యిట్లని చెప్పెను.

అని,తాత్పర్యము.

సత్యసంధస్య వీరస్య సర్వేషా న్నో హితైషిణః
విష్ణో స్సహాయా న్బలిన స్సృజధ్వం కామరూపిణః. ౨

టీ॥సత్యసంధస్య=సత్యమైనప్రతిజ్ఞగలవాఁడును; వీరస్య=పరాక్రమముగలవాఁడును; నః=మనకు;సర్వేషాం = అందఱకును;హితైషిణః = మేలుగోరువాఁడునగు; విష్ణోః=విష్ణుదేవునకు;బలినః = బలముగలవారును; కామరూపిణః=ఇచ్ఛాధీనమగు రూపముగలవారు నగు; సహాయాన్ =తోడైనవాండ్రను;సృజధ్వం=సృజింపుఁడు.

సత్యంబగు ప్రతిజ్ఞగలిగి, పరాక్రమశాలియై, మనకందఱకునుమేలుగోరునట్టివిష్ణుదేవునకు, బలముగలవారును గామరూపులునగుసహాయుల,సృజింపుఁడు.

అని,తాత్పర్యము.

మాయావిద శ్చ శూరాంశ్చ వాయువేగసమాన్ జవే

నయజ్ఞాన్ బుద్ధిసంపన్నాన్ విష్ణుతుల్య పరాక్రమాన్. ౩
అసంహార్యా నుపాయజ్ఞాన్ దివ్యసంహననాన్వితాన్
సర్వాస్త్రగుణ సంపన్నా నమృత ప్రాశనా నివ. ౪
అప్సరస్సు చ ముఖ్యాసు గంధర్వీణాం తనూషు చ
సృజధ్వం హరిరూపేణ పుత్రాం స్తుల్యపరాక్రమాన్. ౫

టీక॥ మాయావిదశ్చ=మాయలనెఱింగినవారును; శూరాంశ్చ=యుద్ధమునందు భయములేనివారలును; జవే=వేగవిషయమందు; వాయువేగసమాన్=వాయువుయొక్క వేగముతో సమానులైనవారును; నయజ్ఞాన్=నీతులనెఱింగినవారును; బుద్ధిసంపన్నాన్ శ్రేష్ఠమైనబుద్ధితోఁగూడినవారును; విష్ణుతుల్యపరాక్రమాన్= విష్ణుదేవునితో సమానమయిన పరాక్రమముగలవారును; అసంహార్యాన్=సంహరింపఁగూడనివారును; ఉపాయజ్ఞాన్= ఉపాయంబులనెఱింగినవారును; దివ్యసంహననాన్వితాన్=శ్రేష్ఠమైన శరీరముతోఁగూడిన వారును(ఇదిమహేశ్వరతీర్థపాఠము); సింహసంహననాన్వితాన్=సింహముయొక్క శరీరమువంటిశరీరముతోఁగూడినవారును (ఇదిగోవిందరాజపాఠము); సర్వాస్త్రగుణసంపన్నాన్=సమస్తములైన యస్త్రములయొక్క శక్తితోఁగూడినవారును; అమృతప్రాశనానివ(స్థితాన్) = అమృతముభుజించినవారలో యనున్నట్లున్నవారును; తుల్యపరాక్రమాన్= మీతో సమానమైనపరాక్రమముగలవారునగు; హరిరూపేణ=వానరరూపముతో; ఉపలక్షితాన్(అధ్యాహృతము)=కూడిన; పుత్రాన్=కొడుకులను; ముఖ్యాసు=శ్రేష్ఠలగు; అప్సరస్సుచ= అప్సరసలయందును; గంధర్వీణాం = గంధర్వస్త్రీలయొక్క; తనూషుచ=దేహములయందును; సృజధ్వం=సృజింపుఁడు.

దేవతలారా ! సమస్తమాయలనెఱింగి, శూరులై, వాయువేగముంబోలినవేగంబు గలిగి, నయజ్ఞులై, బుద్ధిశాలులై, విష్ణుదేవుఁడుంబోలెఁ బరాక్రమశాలులై, పరుల

కెదిరింప నలవిగానివారలై, సమ స్తోపాయంబులు నేర్చిన, శ్రేష్ఠంబగుసింహశరీరంబుంబోలు శరీరంబు నుసర్వాస్త్రంబులకుంగలశక్తియు నుంగలిగి, యమృతముఁగుడిచినవారువోలెత్క్షుత్పిపాసాదిరహితులై, మీయొక్క పరాక్రమమువంటిపరాక్రమముతోఁగూడిన, వానరరూపధరులగుకొడుకులను, శ్రేష్ఠ లగు నప్సర స్త్రీలందునుగంధర్వయువతులందునుం బుట్టింపుఁడు.

అని, తాత్పర్యము.

విశేషార్థము. — పార్వతీశాపంబువలనదేవతలకుఁ దమ భార్యలయందుఁ బుత్రోత్పత్తి గలుగ నేరదు,కావున, "నప్సరసలందును, గంధర్వస్త్రీలందునుసృజింపుఁడు" అని,చెప్పఁబడినది. నంది కేశ్వరుఁడు రావణునకువానరులవలనభయముగలుగునట్లుశాపమిచ్చుటను, దలంచి "వానర రూపులగు పుత్రులసృజింపుఁడు"అని,చెప్పఁబడినది.

పూర్వమేవ మయా సృష్టో జాంబవా నృక్షపుంగవః
జృంభమాణస్య సహసా మమ వక్త్రా దజాయత. ౬

టీక॥ పూర్వమేవ=మునుపే; మయా = నాచేత; ఋక్షపుంగవః= ఎలుఁగుగొడ్డులలో శ్రేష్ఠుఁడగు; జాంబవాన్=జాంబవంతుఁడను వాఁడు; సృష్టః=సృజింపఁబడెను. సః(అధ్యాహృతము)=ఆజాంబవంతుఁడు;జృంభమాణస్య=ఆవులించుచున్న;మమ=నాయొక్క; వక్త్రాత్=ముఖమువలన;సహసా=తటాలున;అజాయత=పుట్టెను.

మునుపే,నేను, ఎలుఁగుగొడ్డులలో శ్రేష్ఠుండగు జాంబవంతుఁడను వానింబుట్టించితి; అతండు; నేనావులింత విడుచుచుండఁగా, నా ముఖంబుననుండి, తటాలునం, బుట్టెను. అని, బ్రహ్మదేవుఁడు, దేవతలతోఁజెప్పెను.

అనితాత్పర్యము.

తేతథోక్తా భగవతా తత్ప్రతిశ్రుత్య శాసనమ్
జనయామాసు రేవం తే పుత్రా న్వానరరూపిణః. ౭

టీక॥ తే = ఆదేవతలు; భగవతా = భగవంతుఁడగు బ్రహ్మదేవుని చేత; తథా = అట్లు; ఉక్తాః = చెప్పఁబడినవారై; తత్ = ఆ; శాసనం = ఆజ్ఞను; ప్రతిశ్రుత్య = అంగీకరించి; తే = ఆదేవతలు; ఏవం = ఈ (వక్ష్యమాణ) ప్రకారము; వానరరూపిణః = కోఁతిరూపుగల; పుత్రాన్ = కొడుకులను; జనయామాసుః = పుట్టించిరి.

బ్రహ్మదేవుండట్లు చెప్పఁగా నే, యాయాజ్ఞ నంగీకరించి, యాదేవతలు, ఈప్రకారము వానరరూపులగు పుత్రులం బుట్టించిరి.

అని తాత్పర్యము.

ఋషయశ్చ మహాత్మాన స్సిద్ధవిద్యాధరోరగాః
చారణాశ్చ సుతా న్వీరా న్ససృజు ర్వనచారిణః. ౮

టీక॥ మహాత్మానః = గొప్పవీర్యముగల; ఋషయశ్చ = ఋషులును; సిద్ధవిద్యాధరోరగాః = సిద్ధులును విద్యాధరులును ఉరగులును; చారణాశ్చ = చారణులును; వీరాన్ = పరాక్రమముగల; వనచారిణః = కోఁతులగు; సుతాన్ = కొడుకులను; ససృజుః = సృజించిరి.

మహావీర్యులగు, ఋషులును, సిద్ధులును, విద్యాధరులును, ఉరగులును, చారణులును, పరాక్రమశాలులగు కోఁతి రూపుగల కొడుకుల సృజియించిరి.

అని, తాత్పర్యము.

వానరేంద్రం మహేంద్రాభ మింద్రో వాలిన మూర్జితమ్
సుగ్రీవం జనయామాస తపన స్తపతాం వరః, ౯

టీక॥ ఇంద్రః = దేవేంద్రుఁడు; మహేంద్రాభం = మహేంద్రపర్వతముతో సమానుఁడైనవాఁడును; ఊర్జితం = దృఢదేహముగలవాఁడునగు; వానరేంద్రం = వానరులకుఁ బ్రభువైన; వాలినం = వాలిని; జనయామాస = పుట్టించెను. తపతాం = తపించువారిలోపల; వరః = శ్రేష్ఠుఁడగు;

తపనః=సూర్యుఁడు;సుగ్రీవం= సుగ్రీవుని; జనయామాస(అధ్యాహృతము)పుట్టించెను.

దేవేంద్రుఁడు, మహేంద్రపర్వతముతో సరివచ్చు దృఢంబైనశరీరముగలవానరరాజుండగువాలియనువానిం బుట్టించెను; ప్రతాపముగలవారిలోశ్రేష్ఠుండగు సూర్యుండుసుగ్రీవునింబుట్టించెను.

అని, తాత్పర్యము.

బృహస్పతి స్త్వజనయ త్తారం నామ మహాహరిమ్
సర్వవానరముఖ్యానాం బుద్ధిమంత మనుత్తమమ్. ౧౦

టీక॥ బృహస్పతిస్తు=బృహస్పతియును;సర్వవానరముఖ్యానాం=సమస్తవానరశ్రేష్ఠులలోపల; బుద్ధిమంతం = ప్రశస్తమైనబుద్ధిగలవాఁడును;అనుత్తమం=తనకన్నశ్రేష్ఠుఁడైనయితరుఁడులేనివాఁడునగు;తారంనామ= తారుఁడనిప్రసిద్ధుఁడైన;మహాహరిం=గొప్పకోఁతిని;అజనయత్ =పుట్టించెను.

బృహస్పతియు, వానరశ్రేష్ఠులనందఱిలోశ్రేష్ఠుండునుబుద్ధిమంతుఁడునగు తారుఁడనుగొప్పవానరునింబుట్టించెను.

అని, తాత్పర్యము.

ధనదస్య సుత శ్శ్రీమాక్ వానరో గంధమాదనః
విశ్వకర్మా త్వ జనయ న్నళం నామ మహాహరిమ్. ౧౧

టీక॥ధనస్య = కుబేరునకు; శ్రీమాక్=కాంతిగల;గంధమాదనః=గంధమాదనుఁడను; వానరః=కోఁతి;సుతః = కొడుకు;అభవత్ (అధ్యాహృతము)= ఆయెను. విశ్వకర్మాతు=విశ్వకర్మయును;నళంనామ=నళుఁడనిప్రసిద్ధుఁడైన; మహాహరిం = గొప్పకోఁతిని; అజనయత్ =పుట్టించెను.

కుబేరునకు,మంచికాంతిగలగంధమాదనుఁడను వానరుఁడుకొడుకయ్యెను; విశ్వకర్మ,నళుఁడనుగొప్పకోఁతిని,బుట్టించెను.

అని, తాత్పర్యము.

పావకస్య సుత శ్శ్రీమాన్ నీలోఽగ్ని సదృశప్రభః
తేజసా యశసా వీర్యా దత్యరిచ్యత వానరాన్. ౧౨

టీక॥ పావకస్య = అగ్నిహోత్రునియొక్క; సుతః=కొడుకును; శ్రీమాన్=సంపత్తుగలవాఁడును; అగ్నిసదృశప్రభః=అగ్నితోసరివచ్చు కాంతిగలవాఁడునగు; నీలః = నీలుఁడు, తేజసా = కాంతిచేతను; యశసా=కీర్తిచేతను; వీర్యాత్ =పరాక్రమమువలనను; వానరాన్= కోఁతులను; అత్యరిచ్యత=అతిశయించెను.

అగ్నిహోత్రుని పుత్రుండగు నీలుండు, శ్రీమంతుండై, యగ్నిదేవుని కాంతితో సరియగు కాంతిగలిగి, కాంతిచేతను, గీర్తిచేతను, బరాక్రమముచేతనుం, గోఁతులనందఱ,నతిశయించెను. అని, తాత్పర్యము.

రూపద్రవిణసంపన్నా వశ్వినౌ రూపసమ్మతౌ
మైందంచ ద్వివిదంచైవ జనయామాసతు స్స్వయమ్. ౧౩

టీక॥ రూపద్రవిణసంపన్నౌ = సౌందర్యమనెడు ధనముతోఁగూడినః అశ్వినౌ = అశ్వినీదేవతలు; స్వయం=తామె; రూపసమ్మతౌ = సౌందర్యముచేత బహుమానింపఁబడినః మైందంచ=మైందునిః ద్వివిదంచైవ=ద్వివిదునిః జనయామాసతుః=పుట్టించిరి.

రూపధనంబుతోఁగూడినయశ్వినీదేవతలు,రూపమున, గారవింపఁబడిన, మైందద్వివిదులం,బుట్టించిరి. అని, తాత్పర్యము.

వరుణో జనయామాస సుషేణం వానరర్షభమ్
శరభం జనయామాస పర్జన్యస్తు మహాబలమ్.౧౪

టీక॥ వరుణః = వరుణదేవుఁడు; సుషేణం=సుషేణుండను; వానరర్షభం= వానరశ్రేష్ఠునిః జనయామాస=పుట్టించెను. పర్జన్యస్తు=వర్షంబునకధిదేవతయగు పర్జన్యుఁడునుః మహాబలం=గొప్ప

బలముగల; శరభం=శరభుని; జనయామాస=పుట్టించెను.

వరుణునకు, సుషేణుండను వానరశ్రేష్ఠుఁడుపుట్టెను; పర్జన్యునకుమహాబలుండగు శరభుండుపుట్టెను. అని, తాత్పర్యము.

మారుతస్యాత్మజ శ్శ్రీమాన్ హనుమాన్నామ వీర్యవాన్.
వజ్రసంహననోపేతో వైనతేయసమో జవే. ౧౫

టీక॥ మారుతస్య=వాయుదేవునకు; శ్రీమాన్= కాంతిగలవాఁడును; వీర్యవాన్=పరాక్రమముగలవాఁడును; వజ్రసంహననోపేతః=వజ్రమువంటి దేహముతోఁగూడినవాఁడును; జవే=వేగమునందు; వైనతేయసమః = గరుత్మంతునితో సమానుఁడైనవాఁడును; హనుమాన్ నామ= హనుమంతుఁడనువాఁడు; ఆత్మజః = కొడుకు; అభవత్ = (అధ్యాహృతము) ఆయెను.

వాయుదేవునకు, శ్రీమంతుండై, పరాక్రమశాలియై, వజ్రముంబోలె నభేద్యమగుదేహముగలిగి, వేగమునందు, గరుత్మంతునకు సాటియై, యున్నహనుమంతుఁడు, పుట్టెను. అని, తాత్పర్యము.

తే సృష్టా బహుసాహస్రా దశగ్రీవవధే రతాః
అప్రమేయబలా వీరా విక్రాంతాః కామరూపిణః. ౧౬

టీక ॥ బహుసాహస్రాః=పెక్కువేలసంఖ్యగలవారును; దశగ్రీవవధే =రావణునివధమునందు; రతాః = ఆసక్తులైనవారును; అప్రమేయబలాః=ఎఱుంగనలవిగాని బలముగలవారును; వీరాః=పరాక్రమముగలవారును; విక్రాంతాః=విక్రమించియుండువారును; కామరూపిణః= ఇచ్ఛాధీనమగురూపముగలవారునగు; తే=ఆవానరులు; సృష్టాః=సృజింపఁబడిరి.

మఱియుఁ, బెక్కుసహస్రములసంఖ్యగలవారు, రావణవధమందాసక్తులై, కొలందిలేనిబలంబుగలి

గి,వీరులై పరాక్రమించిన వారలై, కామరూపులైయుండు,వానరులు, సృజింపఁబడిరి.

అని తాత్పర్యము.

మేరుమందరసంకాశా వపుష్మంతో మహాబలాః
ఋక్షవానరగోపుచ్ఛాః క్షిప్రమేవా భిజజ్ఞిరే. ౧౭

టీక॥ మేరుమందరసంకాశాః=మేరుపర్వతముతోను మందరపర్వతముతోను సమానులైనవారును; వపుష్మంతః = మంచి దేహముగలవారును; మహాబలాః=అధికంబగుబలముగలవారునగు;ఋక్షవానరగోపుచ్ఛాః=ఎలుఁగుగొడ్డులునుగోఁతులునుగొండముచ్చులును; క్షిప్రమేవ= శీఘ్రముగనే,అభిజజ్ఞిరే=పుట్టినవి.

మేరుపర్వతముతో మందరనగంబుతోనసరివచ్చుచు, దృఢంబగుశరీరంబుగలిగి, యధికబలములై,యుండు, నెలుఁగుగొడ్డులును, గోఁతులును, గొండముచ్చులును, శీఘ్రంబుగఁ,బుట్టినవి.

అని, తాత్పర్యము.

యస్య దేవస్య యద్రూపం వేషో యశ్చ పరాక్రమః
అజాయత సమస్తేన తస్య తస్య సుతః పృథక్. ౧౮

టీక॥ యస్య=ఏ;దేవస్య=దేవునకు;యత్=ఏది; రూపం=సౌందర్యమో; యః=ఏది;వేషః=ఆకారమో;యః=ఏది; పరాక్రమశ్చ=పరాక్రమమునో;తస్యతస్య= ఆయాదేవునియొక్క;సుతః=కొడుకు; పృథక్ =వేఱువేఱుగా; తేన=ఆరూపముచేతను,ఆవేషముచేతను,పరాక్రమముచేతను; సమః=ఆయాదేవునితో,సమానుఁడై;అజాయత=పుట్టెను.

ఏ దేవున, కేరూపము,ఏవేషము, ఏపరాక్రమము, గలిగియుండునో, ఆదేవునికొడుకు,ఆరూపము, ఆవేషము, ఆపరాక్రమమునే, గలిగియుండెను. అని,తాత్పర్యము.

గోలాంగూలీషు చోత్పన్నాః కేచి త్సమ్మత విక్రమాః

ఋక్షీషుచ తథా జాతా వానరాః కిన్నరీషుచ. ౧౯

టీక॥ సమ్మతవిక్రమాః=బహుమానింపఁబడినపరాక్రమముగల; కేచిత్=కొందఱు; వానరాః=వానరులు; గోలాంగూలీషుచ=ఆఁడుకొండముచ్చులయందును; ఉత్పన్నాః=పుట్టిరి. కేచిత్ (అధ్యాహృతము)=కొందఱువానరులు; ఋక్షీషుచ = ఆఁడుఎలుఁగుగొడ్డులయందును; జాతాః= పుట్టిరి. తథా = అట్లు; కేచిత్(అధ్యాహృతము)=కొందఱు వానరులు; కిన్నరీషుచ=కిన్నరస్త్రీలయందును; జాతాః(అధ్యాహృతము)=పుట్టిరి.

అధికపరాక్రమశాలులగుకొందఱువానరులు, కొండముచ్చులందును, కొందఱు ఎలుఁగుగొడ్డులందును, కొందఱు కిన్నరస్త్రీలందును, చిత్రవిచిత్రముగాఁ, బుట్టిరి.

అని, తాత్పర్యము.

దేవా మహర్షి గంధర్వా స్తార్క్ష్యా యక్షా యశస్వినః
నాగాః కింపురుషాశ్చైవ సిద్ధవిద్యా ధరోరగాః. ౨౦
బహవో జనయామాసు హృష్టా స్తత్ర సహస్రశః
వానరాన్ సుమహాకాయాన్ సర్వాన్వై వనచారిణః. ౨౧
అప్సరస్సుచ ముఖ్యాసు తథా విద్యాధరీషుచ
నాగకన్యాసు చ తథా గంధర్వీణాం తనూషుచ. ౨౨

టీక॥ యశస్వినః= కీర్తిగలవారును; బహవః=అనేకులునైన; దేవాః = దేవతలును; మహర్షిగంధర్వాః=మహర్షులునుగంధర్వులును; తార్క్ష్యాః=గరుడులును; యక్షాః=యక్షులును; నాగాః = దిగ్గజంబులును; కింపురుషాశ్చైవ=కింపురుషులును; సిద్ధవిద్యాధరోరగాః=సిద్ధులునువిద్యాధరులును సర్పములును; హృష్టాః=సంతసించినవారలై; తత్ర = ఆవిష్ణుదేవునియవతారకాలమందు; ముఖ్యాసు=శ్రేష్ఠలయిన; అ

ప్సరస్సుచ=అప్సరసలయందును;త థా=అట్లు,విద్యాధరీషుచ=విద్యాధరస్త్రీలయందును; నాగకన్యాసుచ=నాగకన్యలందును;తథా= అట్లు; గంధర్వీణాం= గంధర్వస్త్రీలయొక్క; తనూషుచ=దేహంబులందును; సుమహాకాయాన్=మిక్కిలియధికమైనదేహముగలవారును; వనచారిణః=వనములందుఁదిరుగువారునగు;వానరాన్=వానరులను;సర్వాన్=అందఱను("వై") అనునది పాదపూరణార్థము);సహస్రశః=వేనవేలుగా;జనయామాస=పుట్టించిరి.కీర్తిమంతులగు, దేవతలును,మహర్షులును, గంధర్వులును, గరుడులును,యక్షులును, దిగ్గజంబులును, గింపురుషులును,సిద్ధులును,విద్యాధరులును, ఉరగులును, సంతోషముతో,నప్సరసలందునువిద్యాధరస్త్రీలయందును, నాగకన్యలందును,గంధర్వ స్త్రీల యందును, వనంబులందుఁదిరుగు వారును మహాకాయులునగు, వానరులనందఱు, వేనవేలుగఁ,బుట్టించిరి. అని తాత్పర్యము.

కామరూపబలోపేతా యథాకామం విచారిణః
సింహశార్దూలసదృశా దర్పేణచ బలేనచ. ౨౩

టీక॥ తే (అధ్యాహృతము)=ఆ వానరులు; కామ రూప బలోపేతాః=ఇచ్ఛాధీనమగు రూపముతోనుబలముతోనుంగూడిన వారలుగాను;యథాకామం= యథేచ్ఛముగను;విచారిణః = సంచరించు వారుగాను;దర్పేణచ=గర్వముచేతను;బలేనచ = బలముచేతను;సింహశార్దూలసదృశాః= సింహముతోను బెద్దపులితోనుసమానులుగాను; అభవన్(అధ్యాహృతము)=అయిరి.

ఆవానరులు, ఇచ్ఛకువచ్చినట్లు రూపంబునుబలంబునుంగలిగి, యిచ్ఛకువచ్చినట్లుసంచరించుచు, దర్పబలంబులచేసింహవ్యాఘ్రంబులతో సరివచ్చుచు,నుండిరి.

అని, తాత్పర్యము.

శిలాప్రహరణాస్సర్వే సర్వే పాదపయోధినః

నఖదంష్ట్రాయుధా స్సర్వే సర్వే సర్వాస్త్రకోవిదాః. ౨౪

టీక॥ సర్వే=అందఱును; శిలాప్రహరణాః = ఱాళ్లేయాయుధము గాఁగలవారలుగా; అభవన్ = (అధ్యాహృతము, ఇళ్లేయుత్తరస్థలంబులందును) అయిరి. సర్వే=అందఱును; పాదపయోధినః= చెట్లతోయుద్ధముచేయువారుగా; అభవన్=అయిరి; సర్వే = అందఱును; నఖదంష్ట్రాయుధాః= గోళ్లు నుంగోఱలు నాయుధములుగాఁగలవారలుగా; అభవన్=అయిరి. సర్వే=అందఱును; సర్వాస్త్రకోవిదః=సమస్తాస్త్రముల నెఱింగినవారుగా; అభవన్=అయిరి.

ఆవానరులందఱు, ఱాళ్లేయాయుధముగాఁ గలిగి, పెద్దపెద్దవృక్షంబులతోయుద్ధముసేయుచు, గోళ్లునుంగోఱలతోనుం బ్రహరింపుచు, సమస్తాస్త్రంబుల నెఱింగియుండిరి. అని, తాత్పర్యము.

విచాలయేయు శ్శైలేంద్రా న్భేదయేయు స్థిరాన్ద్రుమాన్
క్షోభయేయు శ్చవేగేన సముద్రం సరితాం పతిమ్. ౨౫

టీక॥ తే (అధ్యాహృతము) = ఆవానరులు; శైలేంద్రాన్=పర్వతశ్రేష్ఠములను; విచాలయేయుః=కదిలింతురు. స్థిరాన్=కదిలింపఁగూడని; ద్రుమాన్=వృక్షములను; భేదయేయుః=పెఱికివైతురు. వేగేన=వేగముచేత; సరితాం= నదులకు; పతిం= పెనిమిటియైనః సముద్రం చ=సముద్రునిః క్షోభయేయుః= కలఁతపడఁజేయుదురు.

ఆవానరులు, గొప్పపర్వతంబులఁగదిలింపఁగలరు; గొప్పవృక్షంబులఁబెఱికివైవఁగలరు; నదులకుఁ బెనిమిటియైనసముద్రునింగూడఁ, గలంతపడఁజేయంగలరు. అని, తాత్పర్యము.

దారయేయుః క్షితిం పద్భ్యా మాప్లవేయు మహార్ణవమ్
నభస్థ్సలం విశేయుశ్చ గృహ్ణీయు రపి తోయదాన్. ౨౬

టీక॥ తే (అధ్యాహృతము)= ఆవానరులు; పద్భ్యాం = పాదములచేత; క్షితిం = భూమిని; దారయేయుః= పగులఁగొట్టుదురు; మహార్ణవం = గొప్ప సముద్రమును; ఆప్లవేయుః= దాఁటుదురు. నభస్స్థలంచ = ఆకాశమును గూడ; విశేయుః= చొత్తురు. తోయదానపి= మేఘములనుంగూడ; గృహ్ణీయుః= పట్టుకొనుదురు.

ఆవానరులు, పాదములతో భూమినింబగులఁ గొట్టఁగలరు; ఎగిరి సముద్రమును దాఁటఁగలరు; ఆకాశమునుంబ్రవేశింపఁగలరు; మేఘములనుం జేతులతోఁబట్టుకొనఁగలరు.

అని, తాత్పర్యము.

గృహ్ణీయు రపి మాతంగా న్మత్తాన్ ప్రవ్రజతో వనే
నర్దమానాశ్చ నాదేన పాతయేయు ర్విహంగమాన్. ౨౭

టీక॥ తే (అధ్యాహృతము)= ఆవానరులు; మత్తాన్=మదించినవియును; వనే=అరణ్యమందు; ప్రవ్రజతః = పరుగులెత్తుచున్నవియునగు; మాతంగానపి= ఏనుఁగులను; గృహ్ణీయుః = పట్టుకొనుదురు; నర్దమానాః= అఱచుచున్నవారలై; నాదేన=ధ్వనిచేత; విహంగమాంశ్చ=పక్షులను; పాతయేయుః=పడఁద్రోయుదురు.

ఆవానరులు, అరణ్యంబునమదించిపరు లెత్తుచున్న యేనుంగులంబట్టుకొనంగలరు; వారఱచినట్టయిన, ఆధ్వనికిఁ, బక్షులుసైతముక్రిందం బడును.

అని, తాత్పర్యము.

ఈదృశానాం ప్రసూతాని హరీణాం కామరూపిణామ్
శతం శతసహస్రాణి యూథపానాం మహాత్మనామ్. ౨౮

టీక॥ ఈదృశానాం = ఇట్టివారును; కామరూపిణాం = ఇచ్ఛాధీనమగురూపము గలవారును; యూథపానాం=సేనానాయకులును; మహాత్మనాం=అధికమైనధైర్యముగలవారునగు; హరీణాం = వానరులు (ప్రథమార్థమందుషష్ఠి) శతం=నూఱు; శతసహస్రాణి = నూఱువేలు

(నూఱులక్షలనుట); ప్రసూతాని= పుట్టిరి.

ఇట్టిశక్తిగలిగినవారును,ఇచ్ఛకు వచ్చినరూపును గైకొనసమర్థులు ను,గొప్పధైర్యముగలవారునగు, సేనానాయకులైనవానరులు, నూఱులక్షలు,పుట్టిరి.

అని,తాత్పర్యము.

తే ప్రధానేషు యూథేషు హరీణాం హరియూథపాః
బభూవు ర్యూథపశ్రేష్ఠా వీరాంశ్చా జనయన్ హరీన్. ౨౯

టీక॥ తే=ఆ,ముందుచెప్పఁబడిన; హరియూథపాః=వానరసేనానాయకులగు వాలిమొదలగు వారలు;ప్రధానేషు=ప్రధానములైన; హరీణాం = వానరులయొక్క ; యూథేషు = సమూహములందు; యూథపశ్రేష్ఠాః= సేనానాయకులలోముఖ్యులుగాః;బభూవుః = అయిరి. వీరాన్=పరాక్రమముగల; హరీంశ్చ = వానరులను; అజనయన్=పుట్టించిరి.

ఆవాలిమొదలగు వానరసేనానాయకులు ప్రధానంబులగువానరసమూహంబులందు సేనానాయకులలోముఖ్యులుగానుండిరి; వారుపరాక్రమశాలులగువానరులంబుట్టించిరి.

అని,తాత్పర్యము.

అన్యే ఋక్షవతః ప్రస్థా నవతస్థు స్సహస్రశః
అన్యే నానా విధాన్ శైలాన్ భేజిరే కాననానిచ. ౩౦

టీక॥అన్యే=ఇతరవానరులు;ఋక్షవతః=ఋక్షవంతమనెడుపర్వతముయొక్క;ప్రస్థాన్=కొండనెత్తములను;సహస్రశః=వేనవేలుగా; అవతస్థుః=అధిష్ఠించిరి. అన్యే = ఇతరవానరులు; నానావిధాన్ = పలుతెఱంగులైన; శైలాన్=పర్వతములను; కాననానిచ = అడవులను; భేజిరే=ఆశ్రయించిరి.

మఱి, కొందఱువానరులు,ఋక్షవత్పర్వతముకొండనెత్తములందు నివసించిరి; మఱికొందఱు,నానావి

ధంబులగు పర్వతంబుల నరణ్యంబులనాశ్రయించిరి. అని, తాత్పర్యము.

సూర్యపుత్రంచ సుగ్రీవం శక్రపుత్రంచ వాలినమ్
భ్రాతరా వుపతస్థు స్తే సర్వఏవ హరీశ్వరాః. ౩౧
నళం నీలం హనూమంత మన్యాంశ్చ హరియూథపాన్

టీక॥ తే=ఆ; హరీశ్వరాః=వానరశ్రేష్ఠులు; సర్వఏవ=అందఱు నే; భ్రాతరా=తోడంబుట్టువులైన; సూర్యపుత్రం=సూర్యునికొడుకగు; సుగ్రీవంచ = సుగ్రీవుని; శక్రపుత్రం= ఇంద్రునికొడుకగు; వాలినంచ=వాలిని; నళం=నళుని; నీలం=నీలుని; హనూమంతం= హనుమంతుని; అన్యాన్ = ఇతరులైన; హరియూథపాంశ్చ = వానరసేనానాయకులను, ఉపతస్థుః=కొలుచుచుండిరి.

ఆవానరశ్రేష్ఠులందఱును, సుగ్రీవుని, వాలిని, నళుని, నీలుని, హనుమంతుని, మఱియు, నితరులగు వానరసేనానాయకులనుం గొలుచుచుండిరి. అని, తాత్పర్యము.

తే తార్క్ష్య బల సంపన్నా స్సర్వే యుద్ధ విశారదాః. ౩౨
విచరంతోఽ ర్దయన్ దర్పా త్సింహవ్యాఘ్ర మహోరగాన్

టీక॥ తే=ఆవానరులు; సర్వే= అందఱును; తార్క్ష్య బల సంపన్నాః=గరుడునిబలమువంటిబలముగల వారలు గాను; యుద్ధవిశారదాః=యుద్ధమునందు నేర్పరులుగాను; దర్పాత్ =గర్వమువలన; సింహవ్యాఘ్రమహోరగాన్ = సింహములను బెద్దపులులనుగొప్పసర్పములను; అర్దయన్= నొప్పించుచు; విచరంతః = తిరుగుచున్నవారుగాను; అభవన్ (అధ్యాహృతము)=అయిరి.

ఆవానరు లందఱు, గరుడునకున్నబలముగలిగి, యుద్ధమునందు నేర్పరులై, దర్పంబున, సింహంబులను బెద్దపులులనుగొప్ప సర్పంబులను నొప్పించుచుఁ, దిరుగుచుండిరి. అని, తాత్పర్యము.

తాంశ్చ సర్వాన్ మహాబాహు ర్వాలీ విపులవిక్రమః. ३३
జుగోప భుజవీర్యేణ ఋక్షగోపుచ్ఛ వానరాన్

టీక॥ మహాబాహుః=గొప్పబాహువులుగలవాఁడును; విపులవిక్రమః = అధికమైనపరాక్రమముగలవాఁడునగు; వాలీ=వాలి; తాన్= ఆ; ఋక్షగోపుచ్ఛవానరాన్= ఎలుఁగొడ్డులును గొండముచ్చులనుం గోఁతులను; సర్వాంశ్చ=అందఱను; భుజవీర్యేణ= చేతులయొక్క పరాక్రమముచేత; జుగోప = రక్షించుచుండెను.

గొప్పచేతులును గొప్పపరాక్రమమునుంగలవాలి, యాయెలుంగుగొడ్డులఁగొండముచ్చులఁ గోఁతుల నందఱు, బాహుపరాక్రమముచేఁ, బాలించుచుండెను.

అని, తాత్పర్యము.

తై రియం పృథివీ శూరై స్సపర్వతవనార్ణవా. ३४
కీర్ణా వివిధ సంస్థానై ర్నానావ్యంజనలక్షణైః

టీక॥ శూరైః=యుద్ధమునందు భయములేనివారును; వివిధసంస్థానైః=నానావిధములైన యాకృతులుగలిగినవారును; నానావ్యంజనలక్షణైః=నానావిధములైన దేహమునకుఁగలగుఱుతులును జాతికిఁగలగుఱుతులునుంగలిగినవారునగు; తైః= వారిచేతను; సపర్వతవనార్ణవా (అర్ణవ (సముద్ర) శబ్దముచేతసముద్రములోనుండు ద్వీపములక్షితమగుచున్నది)=పర్వతములతోనువనములతోను ద్వీపములతోనుఁగూడిన; ఇయం=ఈ; పృథివీ=భూమి; కీర్ణా=వ్యాపింపఁబడినది.

వారలందఱు, నానావిధంబులైన యాకారంబులును, నానావిధములుగానుండు, నాయాదేహమునకును ఆయాజాతికినింగలగుఱుతులునుం, గలిగి, శూరులై, భూమండలంబులోనిపర్వతంబులయందునువనంబులందునుద్వీపంబులందంతటను, వ్యాపించియుండిరి. అని, తాత్పర్యము.

తై ర్మేఘబృందాచల కూటకల్పైః
మహాబలై ర్వానరయూథపాలైః
బభూవ భూ ర్భీమ శరీరరూపై
స్సమావృతా రామ సహాయహేతోః. ౩౫

టీక॥ మేఘబృందాచలకూటకల్పైః, మేఘబృంద=మబ్బులసమూహములతోను, అచలకూట=కొండకొమ్ములతోను, కల్పైః=సమానులైనవారును; మహాబలైః = అధికమైనబలము గలవారును, భీమశరీరరూపైః, భీమ = భయముగలిగించునట్టి, శరీర=దేహముయొక్క, రూపైః = ఆకారముగలవారునగు; తైః=ఆ; వానరయూథపాలైః=వానరసేనానాయకులచేత; రామసహాయహేతోః=రామునకుసహాయనిమిత్తము; భూః=భూమి; సమావృతా = కప్పఁబడినది; బభూవ=అయినది.

మేఘసమూహంబులను గొండకొమ్ములనుంబోలినవారును, అధికంబగుబలముగలవారును, వెఱపుపుట్టించు శరీరాకృతులు గలవారునగు, నావానరసేనానాయకులు, రామునకు, సహాయముసేయునిమిత్తము, భూమండలంబంతయు, వ్యాపించియుండిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, సప్తదశ స్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ సప్తదశసర్గ టీక,
ముగిసినది.

శ్రీ

అ ష్టా ద శ స ర్గ ప్రా ర ం భః.

నివృత్తేతు క్రతౌ తస్మిన్ హయమేధే మహాత్మనః
ప్రతిగృహ్యా సురా భాగాన్ ప్రతిజగ్ము ర్యథాగతమ్. ౧

టీక॥ మహాత్మనః= పూజ్యస్వభావుండగు దశరథునియొక్క; తస్మిన్=ఆ; హయమేధే=అశ్వమేధమును; క్రతౌతు = యాగమును; (తుకారంబుచకారార్థకంబుఃఅందువలన)పుత్రకామేష్టియును; నివృత్తే=కడవఁగా; సురాః=దేవతలు; భాగాన్ = హవిర్భాగంబులను; ప్రతిగృహ్యా=పుచ్చుకొని; యథాగతం=వచ్చినవిధంబునతిక్రమింపక; ప్రతిజగ్ముః=మఱలివెళ్లిరి.

మహాత్ముండగు, నాదశరథుని యశ్వమేధంబునుబుత్రకామేష్టియు నుంగాఁగానే, దేవతలు,హవిర్భాగంబులంబుచ్చుకొని, వచ్చినరీతి,మఱల,వెళ్లిరి. అని, తాత్పర్యము.

సమాప్తదీక్షానియమః పత్నీగణ సమన్వితః
ప్రవివేశ పురీం రాజా సభృత్యబలవాహనః. ౨

టీక॥ పత్నీగణసమన్వితః=భార్యలసమూహముతోఁ గూడినవాఁడును;సభృత్యబలవాహనః = భృత్యులతోను సైన్యములతోను వాహనములతోనుంగూడిన వాఁడునగు ; రాజా=దశరథమహారాజు; సమాప్తదీక్షానియమః=ముగిసినయాగదీక్షకొఱకైన నియమముగలవాఁడై; పురీం=పట్టణమును; ప్రవివేశ=ప్రవేశించెను.

దశరథమహారాజు,యాగదీక్షానియమముముగిసినపిమ్మట, భార్యలతోను భృత్యులతోను సైన్యములతోనువాహనములతోనుంగూడి, పట్టణమును బ్రవేశింప నుద్యుక్తుఁ, డయ్యెను. అని, తాత్పర్యము.

యథార్హం పూజితా స్తేన రాజ్ఞావై పృథివీశ్వరాః
ముదితాః ప్రయయు ర్దేశాన్ ప్రణమ్య మునిపుంగవమ్. ౩

టీక॥ పృథివీశ్వరాః=భూమికిం బ్రభువులగు రాజులు; తేన = ఆ; రాజ్ఞా= దశరథమహారాజుచేత("వై" అనునది పాదపూరణార్థము); యథార్హం=యథాయోగ్యముగ, పూజితాః = పూజింపఁబడినవారలై; ముదితాః=సంతసించినవారలై; మునిపుంగవం=మునిశ్రేష్ఠుఁడగువసిష్ఠుని; ప్రణమ్య=నమస్కరించి, దేశాన్ = (తమతమ) దేశములనుగూర్చి; ప్రయయుః=పోయిరి.

యాగమునకువచ్చినరాజులందఱు, దశరథునిచేఁదమతమయోగ్యతకుఁదగునట్లుపూజింపఁబడిసంతసమునొంది, మునిశ్రేష్ఠుండగువసిష్ఠుని నమస్కరించి, తమతమ దేశంబులకుఁబోయిరి.

అని, తాత్పర్యము.

శ్రీమతాం గచ్ఛతాం తేషాం స్వపురాణి పురా త్తతః
బలాని రాజ్ఞాం శుభ్రాణి ప్రహృష్టాని చకాశిరే. ౪

టీక॥తతః = ఆ; పురాత్=అయోధ్యాపట్టణమునుండి, స్వపురాణి=తమపట్టణములనుగూర్చి; గచ్ఛతాం = పోవుచున్న; శ్రీమతాం= కాంతిగల; తేషాం=ఆ; రాజ్ఞాం= రాజులయొక్క; బలాని=సైన్యములు; శుభ్రాణి=దశరథునిచేనివ్వఁబడినవస్త్రాదులచేత, తెల్లనివిగాను; ప్రహృష్టాని= మిక్కిలిసంతసించినవిగాను; చకాశిరే=ప్రకాశించినవి.

ఆయయోధ్యాపురంబు నుండితమతమపట్టణంబులకుఁ బోవుచున్న శ్రీమంతులగు నారాజులసైన్యంబులు దశరథునిచే నీఁబడినవస్త్రాదులచేఁ దెల్లనివిగా, సంతసంబుగలవై, ప్రకాశించినవి.

అని, తాత్పర్యము.

గతేషు పృథివీశేషు రాజా దశరథ స్తదా

శ్రీ

అష్టాదశసర్గప్రారంభః.

నివృత్తేతు క్రతౌ తస్మిౝ హయమేధే మహాత్మనః
ప్రతిగృహ్యా సురా భాగాౝ ప్రతిజగ్ముః యథాగతమ్. ౧

టీక॥ మహాత్మనః= పూజ్యస్వభావుండగు దశరథునియొక్క; తస్మిౝ=ఆ; హయమేధే=అశ్వమేధమను; క్రతౌతు = యాగమును; (తుకారంబు చకారార్థకంబు;అందువలన) పుత్రకామేష్టియును; నివృత్తే=కడవఁగా; సురాః=దేవతలు; భాగాౝ = హవిర్భాగంబులను; ప్రతిగృహ్యా=పుచ్చుకొని; యథాగతం=వచ్చినవిధంబునతిక్రమింపక; ప్రతిజగ్ముః=మఱలివెళ్లిరి.

మహాత్ముండగు, నాదశరథుని యశ్వమేధంబును బుత్రకామేష్టియు నుంగాఁగానే, దేవతలు, హవిర్భాగంబులం బుచ్చుకొని, వచ్చినరీతి, మఱల, వెళ్లిరి. అని, తాత్పర్యము.

సమాప్తదీక్షానియమః పత్నీగణ సమన్వితః
ప్రవివేశ పురీం రాజా సభృత్యబలవాహనః. ౨

టీక॥ పత్నీగణసమన్వితః=భార్యలసమూహముతోఁ గూడినవాఁడును;సభృత్యబలవాహనః = భృత్యులతోను సైన్యములతోను వాహనములతోనుంగూడిన వాఁడునగు ; రాజా=దశరథమహారాజు; సమాప్తదీక్షానియమః=ముగిసినయాగదీక్షకొఱకైన నియమముగలవాఁడై; పురీం=పట్టణమును; ప్రవివేశ=ప్రవేశించెను.

దశరథమహారాజు,యాగదీక్షానియమముముగిసినపిమ్మట, భార్యలతోను భృత్యులతోను సైన్యములతోనువాహనములతోనుంగూడి, పట్టణమునుబ్రవేశింప నుద్యుక్తుఁ, డయ్యెను. అని, తాత్పర్యము.

సంపూర్ణమానసః= నిండినకోర్కి గలవాఁడై,సుఖితః = సుఖముగల వాఁడై; పుత్రోత్పత్తిం=కొడుకుల యొక్కపుట్టుటను; విచింతయన్= తలఁచుకొనుచు;తత్ర = ఆయయోధ్యయందు;ఉవాస=ఉండెను.

ఈప్రకారము, బ్రాహ్మణశ్రేష్ఠులనందఱు వారివారివాసస్థానములకంపి,దశరథమహారాజు, సంపూర్ణమనోరథుఁడై,కొడుకులెప్పుడుపుట్టుదురోయనియాలోచించుచు,సుఖముగా,నుండెనని తాత్పర్యము.

తతో యజ్ఞే సమాప్తేతు ఋతూనాం షట్సమత్యయుః

టీక॥ యజ్ఞే= అశ్వమేధయాగము; సమాప్తేతు=ముగియఁగానే; తతః=ఆపిమ్మట;ఋతూనాం=(ప్రథమార్థమందుషష్ఠి)ఋతువులు; షట్=ఆఱు;సమత్యయుః=కడచినవి

అశ్వమేధ యాగము ముగిసినపిమ్మట,నొకసంవత్సరము,కడచినది. అని, తాత్పర్యము.



కౌసల్య. కైకేయి. సుమిత్ర.

తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ. ౮
నక్షత్రేఽదితిదైవత్యే స్వోచ్ఛసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ. ౯
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్
కౌసల్యా జనయ ద్రామం సర్వలక్షణ సంయుతమ్. ౧౦

విష్ణో రర్ధం మహాభాగం పుత్ర మైక్ష్వాకవర్ధనమ్

టీక॥తతశ్చ=ఆపిమ్మటను; ద్వాదశే= పండ్రెండవదియగు; చైత్రే= చైత్రమనెడు; మాసే = మాసమందు; నావమికే = నవమియనెడు; తిథౌ=తిథియందు; అదితిదైవత్యే=అదితియే దేవతగాఁగల; నక్షత్రే=పునర్వసూత్రమందు; పంచసు = ఐదైన; గ్రహేషు=గ్రహములు; స్వోచ్చసంస్థేషు= తమతమయుచ్చస్థానంబులందుండఁగా; కర్కటే = కర్కటకమనెడు; లగ్నే=లగ్నమందు; వాక్పతౌ = బృహస్పతి; ఇందునాసహ=చంద్రునితోఁగూడ; ప్రోద్యమానే= ఉదయించుచుండఁగా; కౌసల్యా=కౌసల్యాదేవి; జగన్నాథం = లోకంబులకుఁబ్రభువును; సర్వలోకనమస్కృతం = సమస్తలోకంబులచేతనమస్కరింపఁబడినవాఁడును; సర్వలక్షణసంయుతం=సమస్తశుభలక్షణంబులతోనుం గూడినవాఁడును; విష్ణోః= విష్ణుదేవునిలో; అర్ధం=సగమైనవాఁడును; మహాభాగం = అధికమైనభాగ్యముగలవాఁడును; ఐక్ష్వాకవర్ధనం = ఇక్ష్వాకువంశంబునం బుట్టిన వారి వృద్ధిఁ బొందించువాఁడునగు; రామం = రాముఁడను; పుత్రం=కొడుకును; అజనయత్ =కనెను.

అంతఁ, గౌసల్యాదేవి, పండ్రెండవదియగుచైత్రమాసమునందు, నవమీతిథియందుఁ, బునర్వసూనక్షత్రమందు, సూర్యాంగారకశనిబృహస్పతి శుక్రులైదుగురునుం దమతమయుచ్చస్థానంబులగు మేషమకరతులాకర్కటక మీనంబు లందుండఁగా, నందుబృహస్పతిచంద్రునితోఁ జేరియుండగాఁ, గర్కటకలగ్నమందు, సమస్తలోకనాయకుండును, సమస్తలోకంబులచే నమస్కరింపఁబడువాఁడును, సమస్తశుభలక్షణంబులతోనుంగూడియుండువాఁడును, ఇక్ష్వాకువంశంబునందుఁబుట్టినవారినభివృద్ధిఁబొందించువాఁడును, మహాభాగ్యశాలియును, విష్ణుదేవునిలోనిసగంబునైన, రాముండను, కొడుకును, బ్రసవించెను. అని, తాత్పర్యము.

కౌసల్యా శుశుభే తేన పుత్రేణా మితతేజసా. ౧౧

యథా వరేణ దేవానా మదితి ర్వజ్రపాణినా

టీక॥ కౌసల్యా=కౌసల్యాదేవి; అమిత తేజసా = కొలందిలేనికాంతి గల; తేన=ఆః పుత్రేణ=కొడుకుచేత; దేవానాం = దేవతలలోపల;వరేణ=శ్రేష్ఠుఁడైన; వజ్రపాణినా= ఇంద్రునిచేతను; అదితిర్యథా=అదితివలె; శుశుభే=ప్రకాశించెను.

కౌసల్యాదేవి, కొలందిలేనికాంతితోఁగూడెనయాకొడుకుంబొంది, దేవశ్రేష్ఠుండగు నింద్రునింబొందిన యదితియట్లు,ప్రకాశించెను.

అని, తాత్పర్యము.

భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః. ౧౨
సాక్షా ద్విష్ణో శ్చతుర్భాగ స్సర్వై స్సముదితో గుణైః

టీక॥ కైకేయ్యాం= కైకేయీదేవియందు;సత్యపరాక్రమః = సత్యమయిన పరాక్రమముగలవాఁడును;సాక్షాద్విష్ణోః = ప్రత్యక్షుండగువిష్ణువుయొక్క; చతుర్భాగః;చతుః=నాలవభాగములో, భాగః= అంశమును(ఎనిమిదవభాగమనుట); సర్వైః=సమస్తములైన; గుణైః= గుణములతో; సముదితః = కూడినవాఁడునగు;భరతో నామ=భరతుఁడనువాఁడు;జజ్ఞే=పుట్టెను.

సాక్షాద్విష్ణుదేవునిలో నెనిమిదవయంశంబైనవాఁడును, సమస్తగుణంబులతోనుంగూడినవాఁడును, సత్య పరాక్రముండునగు, భరతుండనువాఁడు, కైకేయియందుఁ,బుట్టెను. అని, తాత్పర్యము.

అథ లక్ష్మణ శత్రుఘ్నౌ సుమిత్రాఽజనయ త్సుతౌ. ౧౩
వీరౌ సర్వాస్త్ర కుశలౌ విష్ణో రర్ధ సమన్వితౌ

టీక॥ అథ=అటుపిమ్మట; సుమిత్రా=సుమిత్రాదేవి; వీరౌ=పరాక్రమముగలవారునుః సర్వాస్త్రకుశలౌ=సమస్తంబులయినయస్త్రంబు

లందునుసమర్థులును; విష్ణోః=విష్ణు దేవునియొక్క; అర్ధసమన్వితౌ=అంశంబులతోఁ గూడినవారునగు ("భిత్తంశకలఖం డేవా పుంస్యర్ధోర్ధంస మేంశకే" అనియమరము); లక్ష్మణశత్రుఘ్నౌ= లక్ష్మణశత్రుఘ్నులను; సుతౌ=ఇద్దఱుఁగొడుకులను; అజనయత్=కనెను.

అంతఁ, బరాక్రమశాలులును, సమస్తాస్త్రంబుల నెఱింగినవారును, విష్ణుదేవుని యంశంబులంబుట్టినవారునునగు, లక్ష్మణశత్రుఘ్నులను, కొడుకు, లిద్దఱు, సుమిత్రకుజన్మించిరి అని, తాత్పర్యము.

పుష్యే జాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః. ౧౫
సార్పే జాతౌ తు సౌమిత్రీ కుళీరేఽభ్యుదితే రవౌ

టీక॥ భరతస్తు=భరతుఁడుమాత్రము; పుష్యే=పుష్యమీనక్షత్రమందు; మీనలగ్నే=మీనలగ్నమందు; ప్రసన్నధీః= నిర్మలమైనబుద్ధిగలవాఁడై; జాతః=పుట్టెను. సౌమిత్రీతు= సుమిత్రకొడుకులగు లక్ష్మణశత్రుఘ్నులును; సార్పే=ఆశ్రేషానక్షత్రమందు; కుళీరే=కర్కాటకలగ్నమందు; రవౌ=సూర్యుఁడు; అభ్యుదితే= ఉదయించిన వాఁడు కాఁగా (మధ్యాహ్నమందనుట); జాతౌ= పుట్టిరి.

నిర్మలంబగు బుద్ధిగలభరతుండు, పుష్యమీనక్షత్రమందు మీనలగ్నమందుఁబుట్టెను; లక్ష్మణశత్రుఘ్నులు, ఆశ్రేషానక్షత్రమందుఁ, గర్కాటకలగ్నమందు, మధ్యాహ్నంబునఁ, బుట్టిరి. అని, తాత్పర్యము.

రాజ్ఞః పుత్రా మహాత్మాన శ్చత్వారో జజ్ఞిరే పృథక్. ౧౬
గుణవంతో నురూపాశ్చ రుచ్యా ప్రోష్ఠ పదోపమాః

టీక॥ రాజ్ఞః=దశరధమహారాజునకు; మహాత్మానః = పూజ్యస్వభావముగలవారును; గుణవంతః= మంచిగుణములుగలవారును; అనురూపాశ్చ=తనకు, సమానులైనవారును; రుచ్యా=కాంతిచేత; ప్రోష్ఠ

తిక్రమించినంతనే; నామకర్మ= నామకరణమును; తథా=అట్లు; అకరోత్=చేసెను.

విశేషార్థము.— "క్షత్రియులకుఁబన్రెండుదినములాశౌచ" మని, శ్రుతియందును, "బదుమూఁడవదినంబునక్షత్రియులకునామకరణంబుసేయవలయు"నని, స్మృతియందునుం, జెప్పఁబడియున్నందున, వాటికి, విరోధముగలుగకుండునట్లు, ఇచ్చట"ఏకాదశాహం"అనుదానికి "లక్ష్మణుఁడుపుట్టినదినము మొదలుగాఁబదునొకండవదినమును" అని, అర్థముచెప్పవలయును. అట్లుచెప్పినచో, రాముఁడుపుట్టినమఱునటిదినమునలక్ష్మణుఁడుపుట్టెను గావున,విరోధముకలుగదు.

రాముఁడుపుట్టిన దినముమొదలు,పన్రెండవదినముగడవఁగానే, దశరథమహారాజు, కొడుకులకునామకరణము, చేసెను.

అని, తాత్పర్యము.

జ్యేష్ఠం రామం మహాత్మానం భరతం కైకయీసుతమ్. ౨౦
సౌమిత్రిం లక్ష్మణ మితి శత్రుఘ్న మపరం తథా
వసిష్ఠః పరమప్రీతో నామాని కురుతే తదా. ౨౧

టీక॥ తదా=అప్పుడు;వసిష్ఠః= వసిష్ఠుఁడు;పరమప్రీతః = మిక్కిలియధికముగాసంతసించినవాఁడై ; మహాత్మానం= పూజ్యమైనస్వభావముగల; జ్యేష్ఠం=పెద్దకొడుకును; రామం = రాముఁడనుపేరుగలవానిఁగాను; కైకయీసుతం=కైకయియొక్క కొడుకును; భరతః=భరతుఁడనుపేరుగలవానిఁగాను; సౌమిత్రిం=సుమిత్రయొక్కకొడుకును;లక్ష్మణం=లక్ష్మణుఁడనుపేరుగలవానిఁగాను; తథా=అట్లు; అపరం= సుమిత్రయొక్క రెండవకొడుకును; శత్రుఘ్నం=శత్రుఘ్నుఁడనుపేరుగలవానిఁగాను;ఇతి=ఈప్రకారము; నామాని=పేళ్లను; కురుతే=(భూతార్థమందులట్)చేసెను.

విశేషార్థము. — "రమంతేసర్వేజనాగుణైరస్మిన్, ఇతి,రామః" జనులందఱు, గుణంబులచే,వీనియందు, రమింతురుకావున, రాముఁడనంబడును;అని, రామశబ్దార్థము."ల

ష్మీః అస్యా స్తీతి లక్ష్మణః" సంపదగలవాఁడు కావున, లక్ష్మణుఁడనంబడును; అనిలక్ష్మణశబ్దార్థము. "బిభర్తీతిభరతః" రాజ్యమును, భరించువాఁడు కావున, భరతుఁడనంబడును; అని, భరతశబ్దార్థము. "శత్రూన్ హన్తీతిశత్రుఘ్నః" శత్రువులంజంపువాఁడు కావున, శత్రుఘ్నుఁడనంబడును; అని, శత్రుఘ్నశబ్దార్థము.

వసిష్ఠుం, డప్పుడు, సంతోషంబున, జ్యేష్ఠునకు రాముండనియుఁ, గైకయికొడుకునకుభరతుండనియు, సుమిత్ర కొడుకులలో, నొకనికిలక్ష్మణుండనియు, మఱియొకనికి శత్రుఘ్నుఁడనియుఁ, పేర్లు, పెట్టెను.

అని, తాత్పర్యము.

బ్రాహ్మణాన్ భోజయామాస పౌరాన్ జానపదానపి
అదదా ద్బ్రాహ్మణానాంచ రత్నౌఘ మమితం బహు. ౨౨

టీక॥ సః (అధ్యాహృతము)= ఆదశరథుఁడు; పౌరాన్=పట్టణములందుండునట్టివారును; జానపదానపి=గ్రామంబులనుండునట్టివారునగు; బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను; భోజయామాస=భుజింపఁజేసెను. బ్రాహ్మణానాం= బ్రాహ్మణులకు; అమితం=కొలందిలేని; రత్నౌఘం చ=మణిసమూహమును; బహు=అధికముగా; అదదాత్=ఇచ్చెను.

అంత, నాదశరథుండు, పట్టణంబుల, గ్రామంబుల, నుండునట్టి, బ్రాహ్మణులకు, భోజనం, బిడెను; బ్రాహ్మణులకుఁ, గొలందిలేని రత్నసమూహంబు, నధికముగానిచ్చెను.

అని, తాత్పర్యము.

తేషాం జన్మక్రియాదీని సర్వకర్మా ణ్యకారయత్

టీక॥ సః (అధ్యాహృతము)= ఆదశరథుఁడు; తేషాం=ఆకొడుకులకు; జన్మక్రియాదీని=జాతకర్మమొదలుగాఁగల; సర్వకర్మాణి=సమస్తకర్మంబులను; అకారయత్=చేయించెను.

దశరథుఁడు, కొడుకులకు, జాతకర్మమొదలగుసమస్తకర్మంబులనుం

(అన్నప్రాశనచౌళోపనయనంబులను) జేయించెను. అని, తాత్పర్యము.

తేషాం కేతు రివ జ్యేష్ఠో రామో రతికరః పితుః. ౨౩
బభూవ భూయో భూతానాం స్వయంభూ రివ సమ్మతః

టీక॥ తేషాం=ఆకొడుకులలోపల; జ్యేష్ఠః = వయస్సుచే; పెద్దవాఁడును; కేతురివ(స్థితః) ధ్వజమువలె నున్నవాఁడునగు; రామః=రాముఁడు; పితుః=తండ్రికి, భూయః=అధికముగా; రతికరః=సంతోషము సేయువాఁడుగాను; భూతానాం=ప్రాణులకు; స్వయంభూరివ=బ్రహ్మదేవుఁడువలె; సమ్మతః=మిక్కిలియిష్టుఁడుగాను; బభూవ = ఆయెను.

ఆకొడుకులలలోఁ బెద్దవాఁడును, గుణంబులచేనధికుఁడు కావున, ధ్వజమువలెఁబ్రకాశించు చున్నవాఁడునగు, రాముఁడు, తండ్రికి, ఇతరులకన్న నధికముగా, సంతోషము సేయుచు, బ్రహ్మదేవుఁడుంబోలె, సమస్తప్రాణులకు, మిక్కిలియిష్టుఁడుగా నుండెను. అని తాత్పర్యము.

సర్వే వేదవిద శ్శూరా స్సర్వే లోకహితే రతాః. ౨౪
సర్వే జ్ఞానోపసంపన్నా స్సర్వే సము దితా గుణైః

టీక॥ సర్వే=కొడుకులందఱును; వేదవిదః = వేదంబులనెఱింగినవారుగాను; శూరాః=యుద్ధంబులందుభయముపడనివారును; సర్వే=అందఱును; లోకహితే = లోకముయొక్క మేలునందు; రతాః = ఆసక్తులుగాను; సర్వే=అందఱును; జ్ఞానోపసంపన్నాః= వేదార్థజ్ఞానముతోఁగూడినవారుగాను; సర్వే=అందఱును; గుణైః=గుణంబులతో; సముదితాః=కూడినవారుగాను; ఆసక(అధ్యాహృతము)=అయిరి.

దశరథుని కొడుకులందఱు, వేదంబులనెఱింగినవారుగాను, యుద్ధములందు భయములేనివారుగాను, లోకమునకు మేలు గోరు వారలు

గాను, వేదార్థంబు దెలిసినవారు గాను, దయమొదలగుసద్గుణంబుల తోఁగూడినవారుగాను, ఉండిరి.

అని, తాత్పర్యము.

తేషామపి మహాతేజా రామ స్సత్యపరాక్రమః. ౨౫
ఇష్ట స్సర్వస్య లోకస్య శశాంక ఇవ నిర్మలః

టీక ॥ తేషామపి=వారిలోపలను; రామః=రాముఁడు; మహాతేజాః = అధికమైనప్రతాపముగలవాఁడుగాను; సత్యపరాక్రమః=ఎచ్చటనైననువ్యర్థముగానిపరాక్రమముగలవాఁడుగాను; నిర్మలః=కలంకములేని; శశాంకఇవ=చంద్రుఁడువలె; సర్వస్య = సమస్తమైన; లోకస్య = ప్రపంచమునకును; ఇష్టః = ప్రియుఁడుగాను; ఆసీత్= (అధ్యాహృతము)ఆయెను.

వారిలోను, రాముఁడు, అధికమయినప్రతాపమును, ఎచ్చటనైనను వ్యర్థముకానిపరాక్రమమునుంగలిగి, కళంకములేనిచంద్రుఁడుంబోలె, సమస్త లోకంబులకుం బ్రియుఁడై యుండెను.

అని, తాత్పర్యము.

గజస్కంధేఽ శ్వపృష్ఠేచ రథచర్యాసు సమ్మతః. ౨౬
ధనుర్వేదేచ నిరతః పితృశుశ్రూషణే రతః

టీక॥ రామః(అధ్యాహృతము)= రాముఁడు; గజస్కంధే=ఏనుఁగుయొక్కమూఁపునందును; అశ్వపృష్ఠే = గుఱ్ఱముయొక్కవీఁపునందును; రథచర్యాసుచ=రథముచేఁదిరుగుటలయందును; సమ్మతః= సమర్థుఁడని, యొప్పుకొనఁబడినవాఁడుగాను; ధనుర్వేదేచ=విలువిద్యయందును(చకారముచే)నితరవిద్యలందును; నిరతః=మిక్కిలియాసక్తుఁడుగాను; పితృశుశ్రూషణే = తండ్రియొక్కసేవయందు; రతః= ఆసక్తుఁడుగాను; ఆసీత్(అధ్యాహృతము)=ఆయెను.

రాముఁడు, ఏనుఁగుమూఁపునందును, గుఱ్ఱమువీఁపునందును, రథం

బులందులందును, ఎక్కుయుద్ధంబు సేయసమర్థుండని, యందఱు, నొప్పుకొనిరి; మఱియు, రాముఁడు, విలువిద్య మొదలగువిద్యలందు మిక్కిలి సమర్థుండై పితృసేవయందు దాసక్తుఁడుగా, నుండెను.

అని, తాత్పర్యము.

బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః. ౨౭
రామస్య లోకరామస్య భ్రాతు ర్జ్యేష్ఠస్య నిత్యశః

టీక ॥ లక్ష్మివర్ధనః=సంపదనువృద్ధిఁబొందించునట్టి; లక్ష్మణః=లక్ష్మణుఁడు; లోకరామస్య=లోకంబులనంతయు రమింపఁజేయునట్టివాఁడును; జ్యేష్ఠస్య=తనకన్నఁబెద్దయగు, భ్రాతుః=తోఁడబుట్టువైనవాఁడునగు; రామస్య=రామునకు; బాల్యాత్ప్రభృతి=బాల్యము మొదలుకొని; నిత్యశః=ఎల్లప్పుడును; సుస్నిగ్ధః=మిక్కిలిస్నేహితుఁడుగా; ఆసీత్ (అధ్యాహృతము) = ఆయెను.

అనంతావతారముకావున, భక్తులకు, సంపద్వృద్ధిఁ జేయునట్టిలక్ష్మణుండు, తనకు జ్యేష్ఠభ్రాతయు, లోకంబులనంతయు రమింపఁజేయువాఁడునగు, రామునియందు, బాల్యము మొదలుగా, నెల్లప్పుడును, మిక్కిలి, స్నేహము గలవాఁడయ్యెను. అని, తాత్పర్యము.

సర్వప్రియకర స్తస్య రామస్యాపి శరీరతః. ౨౮
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిః ప్రాణ ఇవా పరః

టీక॥ లక్ష్మిసంపన్నః= సంపదతోఁగూడిన; లక్ష్మణః = లక్ష్మణుఁడు; తస్య=ఆ; రామస్య=రామునకు; శరీరతోపి=దేహమునకన్నను; సర్వప్రియకరః, సర్వ=సమస్తకాలములందును, ప్రియకరః = సంతోషమును జేయువాఁడై; అపరః=మఱియొకటైన; బహిః ప్రాణఇవ=బయటనుండు ప్రాణమువలె; ఆసీత్ (అధ్యాహృతము)=ఉండెను.

సంపదతోఁగూడియుండులక్ష్మణుం, డా రామునకు, అతని దేహము నకన్నను, సంతోషముగల్గించుచు, దేహమునకు వెలుపల నుండు మఱి యొక ప్రాణంబనఁదగి, యుండెను. అని, తాత్పర్యము.

నచ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః. ౨౯
మృష్ట మన్న ముపానీత మశ్నాతి నచ తం వినా

టీక॥ పురుషోత్తమః, పురుష=పురుషులలో, ఉత్తమః=శ్రేష్ఠుఁడగు రాముఁడు; తేనవినా=ఆలక్ష్మణుని విడిచి; నిద్రాంచ = నిద్రను; నలభతే=పొందఁడు. తంవినా=ఆలక్ష్మణునివిడిచి; ఉపానీతం=తేఁబడిన; మృష్టం=శ్రేష్ఠమైన; అన్నంచ=ఆహారమును; నాశ్నాతి=తినఁడు.

పురుషశ్రేష్ఠుండగు నారామునకు, ఆలక్ష్మణుఁడులేనట్టైన, నిద్రమైనను రాదు; మఱియు, నాలక్ష్మణునివిడిచి, శ్రేష్ఠమైనయాహారంబును, భుజింప, నిచ్ఛపుట్టదు. అని, తాత్పర్యము.

యదా హి హయమారూఢో మృగయాం యాతిరాఘవః. ౩౦
తదైనం పృష్ఠతోఽన్వేతి సధనుః పరిపాలయన్

టీక॥ యదా=ఎప్పుడు; రాఘవః = రఘువంశంబునందుఁబుట్టిన రాముఁడు; హయం=గుఱ్ఱమును; ఆరూఢః = ఎక్కినవాఁడై; మృగయాం=వేఁటనుగూర్చి; యాతి=పోవునో; తదా=అప్పుడు; సః(అధ్యాహృతము)=ఆలక్ష్మణుఁడు; ఏనం=ఈరాముని; సధనుః=వింటితోఁగూడినవాఁడై; పరిపాలయన్=కాపాడుచు; పృష్ఠతః=వెనుకనుండి; అన్వేతి=వెంబడించునుగదా!

శ్రాముం, డెప్పుడు, గుఱ్ఱము నెక్కి, వేఁటకుఁబోవునో, అప్పుడే, యాలక్ష్మణుఁడు, విల్లుచేతంబూని, యాతనిరక్షింపుచు, వెంటనే వెంబడించును. అని, తాత్పర్యము.

భరతస్యాపి శత్రుఘ్నో లక్ష్మణావరజో హి సః. ౩౧

ప్రాణైః ప్రియ తరో నిత్యం తస్య చాసీ త్తథా ప్రియః

టీక॥ భరతస్యాపి=భరతునకును;శత్రుఘ్నః = శత్రుఘ్నుఁడు; హి = ఏకారణమువలన,సః=ఆశత్రుఘ్నుఁడు;లక్ష్మణావరజః,లక్ష్మణ=లక్ష్మణునియొక్క, అవరజః=తమ్ముఁడో;తస్మాత్ (అధ్యాహృతము) = ఆకారణంబువలన; ప్రాణైః= (పంచమ్యర్థమందుఁదృతీయ) ప్రాణములకన్న;ప్రియతరః=అధికముగాసంతోషము గల్గించు వాఁడుగా;నిత్యం = ఎల్లప్పుడు;ఆసీత్=ఆయెను. తస్యచ = ఆశత్రుఘ్ననకును; సః(అధ్యాహృతము)=ఆభరతుఁడు; తథా=అట్లు;ప్రియః=సంతోషముగల్గించువాఁడుగా; అసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

శత్రుఘ్నుఁడు,లక్ష్మణునితమ్ముఁడగుటంజేసి,యతనికింగలగుణసంపత్తిగలవాఁడుకావున, భరతునకుఁ, బ్రాణంబులకన్న, నధికప్రియుండయ్యెను;ఆప్రకారముగనే, భరతుండును,శత్రుఘ్ననకు, అధికప్రియుఁడుగా,నుండెను.

అని, తాత్పర్యము.

స చతుర్భి ర్మహాభాగైః పుత్రై ర్దశ రథః ప్రియైః. ౩౭
బభూవ పరమప్రీతో దేవైరివ పితామహః

టీక॥ సః=ఆ; దశరథః=దశరథుఁడు;మహాభాగైః = అధికమైన భాగ్యముగలవారును;ప్రియైః=తనకుసంతోషముగల్గించువారునగు;చతుర్భిః=నలుగురైన; పుత్రైః=కొడుకులచేత; దేవైః=దిక్పాలకులచేత; పితామహఇవ=బ్రహ్మదేవుఁడువలె; పరమప్రీతః=మిక్కిలియధికముగ సంతోషించినవాఁడుగా; బభూవ=ఆయెను.

ఆదశరథుఁడు, మహాభాగ్యశాలులును,ప్రియులునగునలువురికొడుకులచేత, నలువురి దిక్పాలకులచేత బ్రహ్మదేవుఁడుంబోలె, మిక్కిలిసంతసించియుండెను.

అని, తాత్పర్యము.

తే యదా జ్ఞానసంపన్నా స్సర్వే స్సముదితా గుణైః. ౩౩
హ్రీమంతః కీర్తిమంతశ్చ సర్వజ్ఞా దీర్ఘదర్శినః
తేషా మేవం ప్రభావానాం సర్వేషాం దీప్తతేజసామ్. ౩౪
పితా దశరథో హృష్టో బ్రహ్మాలోకాధిపో యథా

టీక॥ తే= ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులు; యదా=ఎప్పుడు; జ్ఞానసంపన్నాః= శాస్త్రజ్ఞానముతోఁగూడినవారుగాను; సర్వేః=సమస్తములైన; గుణైః=గుణములతోను; సముదితాః = కూడినవారుగాను; హ్రీమంతః = లజ్జగలవారుగాను; కీర్తిమంతశ్చ=కీర్తిగలవారుగాను; సర్వజ్ఞాః = అన్నింటినెఱింగినవారుగాను; దీర్ఘదర్శినః=దూరముగాఆలోచించువారుగాను; ఆసక్ (అధ్యాహృతము) = అయిరో; తదా=అప్పుడు; ఏవంప్రభావానాం= ఇట్టిప్రభావముగలవారును; దీప్తతేజసాం=ప్రకాశించుచున్న కాంతిగలవారు నగు; సర్వేషాం=సమస్తులైన; తేషాం=వారలయొక్క; పితా=తండ్రియగు; దశరథః=దశరథుఁడు; బ్రహ్మాలోకాధిపోయథా, బ్రహ్మాలోక= బ్రహ్మాలోకముయొక్క, అధిపోయథా= ప్రభువైనబ్రహ్మాదేవుఁడువలె; హృష్టః=సంతసించినవాఁడు; ఆసీత్= (అధ్యాహృతము)ఆయెను.

ఆరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు, ఎప్పుడు, శాస్త్రంబులనెఱింగి, సమస్తసద్గుణంబులుం గలిగి, తప్పుకార్యంబులవలన లజ్జించుచు, "మంచిగుణంబులుగలవారు; చక్కఁగాశాస్త్రంబుల నెఱింగినవారు" అనెడుకీర్తినొంది, సర్వజ్ఞులు గాను, దీర్ఘాలోచనగలవారుగాను, ఐరో, అప్పుడు, ఇంతటిప్రభావంబుతోఁగూడి తేజరిల్లుచున్న యారామలక్ష్మణభరతశత్రుఘ్నులతండ్రి దశరథుండు, బ్రహ్మాలోకాధిపతియుంబోలె, సంతసించియుండెను.

అని, తాత్పర్యము.

తేచాపి మనుజవ్యాఘ్రా వైదికాధ్యయనే రతాః. ౩౫

పితృశుశ్రూషణరతా ధనుర్వేదేచ నిష్ఠితాః

టీక॥ మనుజవ్యాఘ్రాః=పురుషశ్రేష్ఠులయిన; తేచాపి=ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులును; వైదికాధ్యయనే, వైదిక=వేదసంబంధులగు స్మృతులు మొదలయినవానియొక్క, అధ్యయనే= చదువుటయందు;రతాః=ఆసక్తులు గాను; పితృశుశ్రూషణరతాః, పితృ= తండ్రియొక్క,శుశ్రూషణ = సేవయందు;రతాః=ఆసక్తులు గాను;ధనుర్వేదే=విలువిద్యయందు;నిష్ఠితాశ్చ= ఆసక్తులుగాను;ఆసక్(అధ్యాహృతము)=అయిరి.

ఆ రామలక్ష్మణభరతశత్రుఘ్నులును, పురుషశ్రేష్ఠులు కావునఁ,దండ్రిమెచ్చుటచే విఱ్ఱవీఁగి సోమరులుగాక,మఱియు, నినుమడిగా, స్మృతులు మొదలగువానిఁజదువుటయందును, దండ్రికి శుశ్రూషసేయుటయందును,విలువిద్యయందును, ఆసక్తులై,యుండిరి.

అని, తాత్పర్యము.

అథ రాజా దశరథ స్తేషాం దారక్రియాం ప్రతి. ౩౬

చింతయామాస ధర్మాత్మా సోపాధ్యాయ స్సబాంధవః

టీక॥ అథ=ఆపిమ్మట; ధర్మాత్మా=ధర్మమందు బుద్ధిగల; రాజా=రాజైన; దశరథః=దశరథుఁడు; తేషాం = ఆకొడుకులయొక్క; దారక్రియాంప్రతి=వివాహమునుగూర్చి; సోపాధ్యాయః=పురోహితునితోఁగూడినవాఁడును; సబాంధవః=బంధువులతోఁగూడినవాఁడునై; చింతయామాస = ఆలోచించెను.

అంత,ధర్మబుద్ధియగు నాదశరథమహారాజు, కొడుకులవివాహమునుగుఱించి, పురోహితునిబంధువులనుంగూడి, యాలోచించెను.

అని, తాత్పర్యము.

తస్య చింతయమానస్య మంత్రిమధ్యే మహాత్మనః .౩౭

అభ్యాగచ్ఛ న్మహా తేజా విశ్వామిత్రో మహామునిః

టీక॥ మహాత్మనః=ధర్మమందు బుద్ధిగల; తస్య=ఆదశరధుఁడు; మంత్రిమధ్యే=మంత్రులనడుమ; చింతయమానస్య = ఆలోచింపుచుండఁగా; మహాతేజాః=అధికమైనప్రభావముగలవాఁడును; మహామునిః=పూజ్యుఁడైనఋషియునగు; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; అభ్యాగచ్ఛత్ =వచ్చెను.

ధర్మంబునం దాసక్తిగలయాదశరధమహారాజు, మంత్రులతోఁగొడుకుల వివాహమునుగుఱించి యాలోచింపుచుండఁగా, తపోవిశేషం నంగల్గిన ప్రభావంబధికముగాఁగల విశ్వామిత్రమహాముని,వచ్చెను అని, తాత్పర్యము.

స రాజ్ఞో దర్శనాకాంక్షీ ద్వారాధ్యక్షా నువాచ హ. ३౮
శీఘ్ర మాఖ్యాత మాం ప్రాప్తం కౌశికం గాధిన స్సుతమ్

టీక॥ సః=ఆవిశ్వామిత్రుఁడు; రాజ్ఞః = దశరధమహారాజుయొక్క; దర్శనాకాంక్షీ=దర్శనమును గోరు వాఁడై; ద్వారా ధ్యక్షాన్ = ద్వారపాలకులనుం గూర్చి; గాధినః= గాధియనువానియొక్క; సుతం = కొడుకును; కౌశికం = కుశికవంశమునందుఁబుట్టినవాఁడునగు; మాం=నన్ను; ప్రాప్తం=వచ్చినవానిఁగా; శీఘ్రం=వేగముగా; ఆఖ్యాత=చెప్పుఁడు; ఇతి (అధ్యాహృతము)=అని; ఉవాచ=చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

ఆవిశ్వామిత్రుఁడు, రాజునుజూడఁగోరి, "మీరలు,కుశికవంశంబునఁ బుట్టిన వాఁడును గాధి పుత్రుండనగు నేనువచ్చియున్నానని,రాజుతోఁ జెప్పుఁడు" అని,ద్వారపాలకులతోఁ జెప్పెను. అని,తాత్పర్యము.

త చ్ఛ్రుత్వా వచనం త్రాసా ద్రాజ్ఞో వేశ్మ ప్రదుద్రువుః. ३౯
సంభ్రాంతమనస స్సర్వే తేన వాక్యేన చోదితాః

టీక॥ సర్వే=ద్వారపాలకులందఱును; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; తేన=ఆ; వాక్యేన=మాటచేత; చోదితాః=ప్రేరేపింపఁబడినవారలై, త్రాసాత్=భయంబువలనః సంభ్రాంత మనసః, సంభ్రాంత=కలఁతపడిన, మనసః=మనస్సుగలవారలై; రాజ్ఞః=రాజుయొక్క; వేశ్మ=గృహమునుగూర్చి; ప్రదుద్రువుః=పరుగెత్తిరి.

ద్వారపాలకులందఱు విశ్వామిత్రునిమాటవిని, భయంబునఁ గలఁతపడినమనస్సుతో, రాజగృహముగూర్చిపరుగులిడిరి. అని, తాత్పర్యము.

తే గత్వా రాజభవనం విశ్వామిత్ర మృషిం తదా. ౪౦
ప్రాప్త మావేదయామాసు నృపాయైక్ష్వాకవే తదా

టీక॥ తదా=అప్పుడు; తే=ఆద్వారపాలకులు ః రాజభవనం=రాజుయొక్క గృహమును ః గత్వా=పొంది; తదా=అప్పుడు; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడనెడు; ఋషిం=ఋషిని; ప్రాప్తం=వచ్చినవానిఁగా, ఐక్ష్వాకవే=ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినః నృపాయ=రాజైన దశరథునికొఱకు; ఆవేదయామాసు=తెల్పిరి.

ఆద్వార పాలకులు, రాజగృహంబునకుఁబోయి, "విశ్వామిత్రుఁడను ఋషి, యిప్పుడు వచ్చియున్నాఁడు." అని, యిక్ష్వాకువంశంబునం బుట్టిన, దశరథమహారాజునకుఁ దెల్పిరి. అని, తాత్పర్యము.

తేషాం త ద్వచనం శ్రుత్వా సపురోధా స్సమాహితః. ౪౧
ప్రత్యుజ్జగామ తం హృష్టో బ్రహ్మాణ మివ వాసవః

టీక॥ తేషాం= ఆద్వారపాలకులయొక్కః తత్ = ఆః వచనం=మాటనుః శ్రుత్వా=విని; సః(అధ్యాహృతము)=ఆదశరథుఁడుః సపురోధాః = పురోహితునితోఁగూడినవాఁడై; సమాహితః=ఎచ్చరికగలవాఁడై; హృష్టః=సంతసించినవాఁడై; తం=ఆవిశ్వామిత్రునిః బ్రహ్మా

ణం=బ్రహ్మదేవుని; వాసవఇవ= ఇంద్రుఁడువలె; ప్రత్యుజ్జగామ=ఎదుర్కొనెను.

ఆద్వార పాలకులమాటనువిని, దశరథుఁడు, పురోహితునింగూడి, ఎచ్చరికగలిగినవాఁడై, సంతసించి, బ్రహ్మదేవుని, దేవేంద్రుండుంబోలె, నావిశ్వామిత్రు, నెదుర్కొనెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా జ్వలితం దీప్తతపసం సంశిత వ్రతమ్. ౪౨
ప్రహృష్టవదనో రాజా తతోర్ఘ్య ముపహారయత్

టీక॥ తతః = అపిమ్మట; జ్వలితం=ప్రకాశించుచున్నవాఁడును; దీప్తతపసం, దీప్త = ప్రకాశించుచున్న, తపసం=తపస్సుగలవాఁడును; సంశితవ్రతం, సంశిత=మిక్కిలితీక్ష్ణమయిన, వ్రతం=నియమముగలవాఁడునగు; తం = ఆవిశ్వామిత్రుని; దృష్ట్వా = చూచి; రాజా=దశరథమహారాజు; ప్రహృష్టవదనః=ప్రహృష్ట=మిక్కిలిసంతసించిన (సంతోష చిహ్నములుగలయనుట), వదనః= ముఖముగలవాఁడై; అర్ఘ్యం=అర్ఘ్యమును; ఉపహారయత్=ఇప్పించెను.

అంత, శరీరకాంతిచేజ్వలింపుచు, నధికంబగుతపస్సునుదీక్ష్ణంబగు వ్రతమునుం గలిగియున్న, యావిశ్వామిత్రునిం, జూచి, సంతుష్టుండై, యాయనకుఁ, బురోహితునిచేనర్ఘ్యమిప్పించెను.

అని, తాత్పర్యము.

సరాజ్ఞః ప్రతిగృహ్యార్ఘ్యం శాస్త్రదృష్టేన కర్మణా. ౪౩
కుశలం చావ్యయం చైవ పర్యపృచ్ఛ న్నరాధిపమ్

టీక॥ సః=ఆవిశ్వామిత్రుఁడు; శాస్త్రదృష్టేన=శాస్త్రమునందుఁ జూడఁబడిన; కర్మణా=విధిచేత; రాజ్ఞః=రాజువలన; అర్ఘ్యం=అర్ఘ్యమును; ప్రతిగృహ్య=స్వీకరించి; కుశలం=క్షేమమును; అవ్యయంచైవ=

అపాయములేకుండుటను; నరాధి పం=మనుష్యులకు ప్రభువైనదశరథ మహారాజును; పర్యపృచ్ఛత్=అడిగెను.

ఆవిశ్వామిత్రుఁడు, యథాశాస్త్రంబుగ, దశరథమహారాజిచ్చిన యర్ఘ్యమునుస్వీకరించి, యాదశరథమహారాజును, "నీకుక్షేమమా! అపాయములేకయున్నదా." అని,యడిగెను. అని, తాత్పర్యము.

పురే కోశే జనపదే బాంధవేషు సుహృత్సుచ. ౪౪
కుశలం కౌశికో రాజ్ఞః పర్యపృచ్ఛ త్సుధార్మికః

టీక॥ సుధార్మికః= చక్కగా ధర్మమునాచరించునట్టి; కౌశికః= కుశికవంశమునందుఁబుట్టినవిశ్వామిత్రుఁడు; రాజ్ఞః=దశరథ మహారాజుయొక్క; పురే=పట్టణమందును; కోశే= బొక్కసమందును; జనపదే=దేశమునందును;బాంధవేషు= బంధువులందును; సుహృత్సుచ = స్నేహితులందును; కుశలం=క్షేమమును; పర్యపృచ్ఛత్ = చక్కగానడిగెను.

మిక్కిలి ధార్మికుండగు నావిశ్వామిత్రుండు, "నీపట్టణమును,బొక్కసమును,దేశమును,ఉపద్రవము,లేకయున్నదా? నీబంధువులును స్నేహితులును, క్షేమముగనున్నారా? అని,చక్కగా,దశరథమహారాజునడిగెను. అని, తాత్పర్యము.

అపి తే సన్నతా స్సర్వే సామంతా రిపవో జితాః. ౪౫
దైవం చ మానుషం చాపి కర్మ తే సాధ్వనుష్ఠితమ్

టీక॥ సామంతాః=పొరుగురాజులు; సర్వే=అందఱును; తే=నీకు; అపిసన్నతాః=మిక్కిలినమ్రులైనారా? రిపవః = శత్రువులు; (అపి)జితాః=జయింపఁబడిరా? తే=నీయొక్క; దైవంచ=దేవతాసంబంధియైనదియును; మానుషంచ=మనుష్యసంబంధియైనదియునగు; కర్మ=కార్యము; సాధు=చక్కగా; అపిఅనుష్ఠితం=చేయఁబడినదా?

నీకుఁ, బొరుగు రాజులందఱు, లొంగియున్నారా? శత్రువులు జయింపఁబడిరా? దేవతాసంబంధియై నయజ్ఞము మొదలయినకర్మమును, మనుష్య సంబంధియగు సామదానభేద దండాదులును, నీకు, సరిగాఁ, జేయఁబడుచున్నవా? అని, విశ్వామిత్రుఁడు, దశరథునిఁ అడిగెను.

అని, తాత్పర్యము.

వసిష్ఠంచ సమాగమ్య కుశలం మునిపుంగవః. ౨౬
ఋషీంశ్చ తాన్ యథాన్యాయం మహాభాగా నువాచహ

టీక॥ మునిపుంగవః=మునిశ్రేష్ఠుఁడగువిశ్వామిత్రుఁడు; వసిష్ఠంచ=వసిష్ఠునిః మహాభాగాన్=మహాత్ములయిన; తాన్=ఆ; ఋషీంశ్చ=ఋషులను; సమాగమ్య=పొంది; యథాన్యాయం=క్రమమునతిక్రమింపక; కుశలం=క్షేమమును; ఉవాచ=పలికెను (అడిగెననుట); "హ" అనునది పాదపూరణార్థము.

మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు, వసిష్ఠుని, మఱియు, మహాత్ములగునితరమునులనుం, జేరి, యథాన్యాయంబుగ, వారివారి క్షేమంబు, నడిగెను. అని, తాత్పర్యము.



తే సర్వే హృష్టమనస స్తస్య రాజ్ఞో నివేశనమ్. ౪౭
వివిశుః పూజితా స్తత్ర నిషేదుశ్చ యథార్హతః

టీక॥ తే=ఆఋషులు; సర్వే=అందఱును; హృష్టమనసః, హృష్ట=సంతసించిన, మనసః=మనస్సుగలవారలై; తస్య=ఆ; రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; నివేశనం=సభను; వివిశుః=ప్రవేశించిరి. తత్ర=అచ్చట; పూజితాః=పూజింపఁబడినవారలై; యథార్హతః=యోగ్యతనతిక్రమింపక; నిషేదుశ్చ=కూచుండిరియు.

ఆఋషులందఱు, సంతసించి, యాదశరథమహారాజుసభను బ్రవేశించిరి; అచ్చట, నారాజుచే, బూజింపఁబడి, వారివారియోగ్యతకుఁదగినట్లు, కూచుండిరి.

అని, తాత్పర్యము.

అథ హృష్టమనా రాజా విశ్వామిత్రం మహామునిమ్. ౪౮
ఉవాచ పరమోదారో హృష్ట స్త మభిపూజయన్

టీక॥ అథ=అటుపిమ్మట; పరమోదారః=మిక్కిలియధికముగా దానముసేయునట్టి; రాజా=దశరథమహారాజు; హృష్టమనాః=సంతసించిన మనస్సు గలవాఁడై; హృష్టః=గగుర్పాటుగలవాఁడై; మహామునిం=పూజ్యుఁడగుఋషియైన; తం=ఆ; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; అభిపూజయన్=స్తుతించుచు; ఉవాచ=పలికెను.

అంతఁ, బరమదాతయగుదశరథుఁడు, సంతోషవిశేషంబున గగుర్పాటునొందినవాఁడై, యావిశ్వామిత్రమహామునిని బ్రస్తుతింపుచు, నిట్లని, పలికెను.

అని, తాత్పర్యము.

యథాఽమృతస్య సంప్రాప్తి ర్యథా వర్ష మనూదకే, ౪౯
యథా సదృశ దారేషు పుత్రజన్మాఽప్రజస్యచ
ప్రణష్టస్య యథాలాభో యథాహర్షో మహోదయే. ౫౦

తథైవాగమనం మన్యే స్వాగతం తే మహామునే

టీక ॥ అమృతస్య=అమృతముయొక్క; సంప్రాప్తిః=పొందుట; యథా=ఎట్లో; అనూదకే=నీళ్లులేనిప్రదేశమునందు; వర్షణం=వాన; యథా=ఎట్లో; అప్రజస్య=సంతానములేనివానికి; సదృశదారేషు=సజాతీయభార్యలందు; పుత్రజన్మ చ=కొడుకులయొక్కపుట్టుటయును; యథా=ఎట్లో; ప్రణష్టస్య=అగుపడకపోయిన నిధిమొదలగుదానియొక్క; లాభః=దొరకుట; యథా=ఎట్లో; మహోదయే, మహా=ఉత్సవముయొక్క, ఉదయే=ప్రారంభమందు; హర్షః=సంతోషము; యథా=ఎట్లో; తథైవ=ఆప్రకారముగనే; తే=నీయొక్క; ఆగమనం=రాకను; మన్యే=తలఁచెదను మహామునే=పూజ్యుఁడైన మునియగువిశ్వామిత్రుఁడా! తే(అధ్యాహృతము)=నీకు; స్వాగతం=సుఖముతోడిరాక; అస్తు=(అధ్యాహృతము)అగుఁగాక.

విశ్వామిత్రుఁడా! అమృతము లబ్ధమగుటయెట్టిదో, నిర్జలప్రదేశమందు వానగురియుట యేలాటిదో, సంతానములేనివానికి సజాతీయమైనభార్యయందుఁ గొడుకుపుట్టుటయెటువంటిదో, అగుపడకపోయిననిక్షేపము మఱలదొరకుటయేరీతిదో, ఉత్సవారంభమందు సంతోషముగల్గుటయెట్లో, నేనుగొడుకుల వివాహమునుగుఱించి యాలోచించుచుండఁగా, నీవువచ్చుట, యాలాటిదేయని, తలంచెద; నీకుస్వాగతంబగుఁగాక అని, తాత్పర్యము.

కం చ తే పరమం కామం కరోమి కిము హర్షితః. ౫౧
పాత్రభూతోఽసి మే బ్రహ్మన్ దిష్ట్యా ప్రాప్తోఽసి కౌశిక

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా! అహం(అధ్యాహృతము)=నేను; హర్షితః=సంతసించినవాఁడనై; తే=నీయొక్క; పరమం=శ్రేష్ఠమైన; కం=ఏ; కామం=కోరికను; కిము చ=ఏప్రకారముగాను; కరో

మి=చేయుదును; కౌశిక=విశ్వామిత్రుఁడా! మే=నాకు; పాత్రభూతః = దానమునకుయోగ్యుఁడైన వాఁడవు; అసి=అగుచున్నావు;దిష్ట్యా=భాగ్యముచేత;ప్రాప్తః=వచ్చినవాఁడవు;అసి=అగుచున్నావు.

బ్రాహ్మణుఁడవైన విశ్వామిత్రుఁడా! నీముఖ్యమైనకోరికయెద్ది? దానినేనేవిధంబునఁ జేయవలయు? ఆనతిమ్ము;నీవునాకుదానయోగ్యుండవు;నాభాగ్యంబుననీవిచ్చోటికి విచ్చేసితివి. అని, తాత్పర్యము.

అద్య మే సఫలం జన్మ జీవితంచ సుజీవితమ్. ౫౨

టీక॥అద్య=ఇప్పుడు; మే=నాయొక్క;జన్మ=పుట్టుక; సఫలం=ఫలముతోఁగూడినది; అభవత్ =(అధ్యాహృతము) అయినది. జీవితం=బ్రతుకును;సుజీవితం=మంచిబ్రతుకు; అభవత్ =(అధ్యాహృతము)అయినది.

ఇప్పుడు, నాపుట్టుకసఫలంబైనది,నాబ్రతుకుమంచిబ్రతుకైనది.

అని, తాత్పర్యము.

పూర్వం రాజర్షిశబ్దేన తపసా ద్యోతితప్రభః
బ్రహ్మర్షిత్వ మనుప్రాప్తః పూజ్యోసి బహుధామయా. ౫౩

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; పూర్వం=మొదట; రాజర్షిశబ్దేన = రాజఋషియనుశబ్దముతో; సహితః(అధ్యాహృతము)=కూడుకొనినవాఁడవై; అను=అటువెనుక;తపసా=తపస్సుచేత; ద్యోతితప్రభః,ద్యోతిత=ప్రకాశింపఁజేయఁబడిన, ప్రభః= కాంతులుగలవాఁడవై;బ్రహ్మర్షిత్వం=బ్రహ్మర్షియగుటను; ప్రాప్తః=పొందినవాఁడవైతివి.అతః(అధ్యాహృతము)=ఇందువలన;బహుధా=అనేకవిధంబుల; మయా=నాచేత; పూజ్యః=పూజింపఁదగినవాఁడవు; అసి=అగుచున్నావు.

నీవు, మొదట రాజర్షివై, యటువెనుకసూర్యాదికాంతులకునుం బ్రకాశముగల్గించు తపస్సునొందుటం




జేసి, బ్రహ్మర్షి వైతివి; కావున, బహువిధంబుల, నీవు, నాకుఁబూజ్యుం డవు.

అని, తాత్పర్యము.

త దద్భుత మిదం బ్రహ్మన్ పవిత్రం పరమం మమ
శుభ క్షేత్ర గతశ్చాహం తవ సందర్శనా త్ప్రభో. ౫౪

టీక॥ బ్రహ్మన్ = బ్రాహ్మణుఁడా; తత్ = అట్టి; ఇదం = ఈనీయాగమనము అద్భుతం = ఆశ్చర్యకరమును; మమ = నాకు; పరమం = మిక్కిలియధికమైన; పవిత్రం = పరిశుద్ధి సేయునదియును; భవతి (అధ్యాహృతము) = అగుచున్నది ప్రభో = ఏలికా! తవ = నీయొక్క; సందర్శనాత్ = చూచుటవలన; అహంచ = నేనును; శుభక్షేత్రగతః, శుభ = మంగళకరమైన, క్షేత్ర = పుణ్యస్థలమును, గతః = పొందినవాఁడను; భవామి (అధ్యాహృతము) = అగుచున్నాను.

విశ్వామిత్రుఁడా! అట్టినీవు, వచ్చుట, మిక్కిలియాశ్చర్యకరము; నాకుఁ, జాలఁ, బరిశుద్ధినిగల్గించునది; నిన్నుఁజూచుటవలన, నేను, బుణ్యస్థలంబునందుండు వాఁడనైతిని. (నీవిచ్చటికి వచ్చుటవలన, నేనుండునట్టియీప్రదేశము, పుణ్యస్థలంబైనదనుట) అని, తాత్పర్యము.

బ్రూహి యత్ప్రార్థితం తుభ్యం కార్య మాగమనం ప్రతి
ఇచ్ఛా మ్యనుగృహీతోఽహం త్వదర్థపరివృద్ధయే. ౫౫

టీక॥ ఆగమనంప్రతి = వచ్చుటనుగూర్చి; తుభ్యం = (తృతీయార్థమందుఁజతుర్థి) నీచేత; యత్ = ఏ; కార్యం = ప్రయోజనము; ప్రార్థితం = కోరఁబడినదో; తత్ (అధ్యాహృతము) = ఆప్రయోజనమును, బ్రూహి = చెప్పుము. అహం = నేను; అనుగృహీతః = నీచేత, అనుగ్రహింపఁ బడినవాఁడనై; త్వదర్థపరివృద్ధయే, త్వత్ = నీయొక్క, అర్థ = ప్రయోజనము యొక్క, పరివృద్ధయే = అభివృద్ధికొఱకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

నీవిచ్చటి కేమిప్రయోజనముగో




రివచ్చితివో, దానిం జెప్పుము; నీచేనిట్లనుగ్రహమునొంది, నీప్రయోజనం బభివృద్ధినొందునట్లు, చేయఁగోరుచున్నాను. అని, తాత్పర్యము.

కార్యస్య న విమర్శంచ గంతు మర్హసి కౌశిక
కర్తా చాహ మశేషేణ దైవతం హి భవాన్మమ. ౫౬

టీక॥ కౌశిక=విశ్వామిత్రుఁడా! కార్యస్య=కార్యముయొక్క; విమర్శంచ=విచారమునుమాత్రము; గంతుం=పొందుటకు; నార్హసి= తగవు. అహం = నేను; అశేషేణచ= కొంచెంతలేనట్టుగాను; కర్తా = చేయువాఁడను; అస్మి(అధ్యాహృతము)=అగుచున్నాను. భవాన్=నీవు; మమ=నాకు; దైవతంహి = దేవుఁడవుగదా!

విశ్వామిత్రుఁడా! "ఈకార్యము గొప్పదే, యితఁడు చేయఁ గలడో చేయలేడో చేయునో చేయఁడో" అనెడు విచారము నొందవలదు; నీవునాకుదైవతమవుకావున, నాకార్యంబంతయు, నెంతమాత్రముకొంచెంతవడకుండ, నేఁజేసెదను. అని, తాత్పర్యము.

మమ చాయ మనుప్రాప్తో మహా నభ్యుదయో ద్విజ
తవా గమనజః కృత్స్నో ధర్మ శ్చాను త్తమో మమ. ౫౭

టీక॥ ద్విజ=బ్రాహ్మణుఁడా! మమచ = నాకును; అయం = ఈ; మహాన్=గొప్పదైన; అభ్యుదయః= మంగళము; అనుప్రాప్తః= లబ్ధమైనది. మమ=నాకు; అనుత్తమః=తనకన్ననధికములేనిదగు; తవ = నీయొక్క; ఆగమనజః=నీరాకవలనఁబుట్టిన; ధర్మః=ధర్మము; కృత్స్నశ్చ= సమస్తమును; అనుప్రాప్తః = లబ్ధమైనది.

నాకు, నీరాకయనెడునొకగొప్ప మంగళము, లబ్ధమైనది; నీరాకవలన ననుత్తమంబగుధర్మంబంతయు, దొరకొనినది. అనితాత్పర్యము.

ఇతి హృదయసుఖం నిశమ్య వాక్యమ్
శ్రుతిసుఖ మాత్మవతా వినీత ముక్తమ్
ప్రథితగుణయశా గుణై ర్విశిష్టః
పరమఋషిః పరమం జగామ హర్షమ్. ౫౮

టీక॥ ఇతి=ఈప్రకారము; ఆత్మవతా = బుద్ధిశాలియగుదశరథునిచేత; వినీతం=వినయముతోఁగూడునట్లుగ; ఉక్తం=చెప్పఁబడినదియును; హృదయసుఖం, హృదయ=మనస్సునకు, సుఖం=ఇంపైనదియును; శ్రుతిసుఖం, శ్రుతి=చెవులకు, సుఖం=ఇంపైనదియునగు; వాక్యం=మాటను, నిశమ్య=విని; ప్రథితగుణయశాః, ప్రథిత=ప్రసిద్ధమైన, గుణ = గుణములచేతఁగలిగిన, యశాః=కీర్తిగలవాఁడును; గుణైః=గుణములతో; విశిష్టః=కూడినవాఁడు నగు; పరమఋషిః=శ్రేష్ఠుఁడైనఋషియగువిశ్వామిత్రుఁడు; పరమం=మిక్కిలియధికమైన; హర్షం=సంతోషమును; జగామ=పొందెను.

ఈప్రకారము, మనస్సునకును జెవులకును సుఖకరంబగునట్లు బుద్ధిశాలియగుదశరథునిచేసవినయంబుగఁజెప్పఁబడినమాటనువిని, మహాగుణవంతుండునుమహాగుణవంతుండనుకీర్తిగలవాఁడు నగు విశ్వామిత్రమహాముని, పరమ సంతోషంబు నొందెను. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, సప్తదశ స్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండాష్టాదశసర్గ టీక,
ముగిసినది.

శ్రీ

ఏకోనవింశతిసర్గప్రారంభః.

తచ్ఛ్రుత్వా రాజసింహస్య వాక్య మద్భుతవిస్తరమ్
హృష్టరోమా మహాతేజా విశ్వామిత్రో భ్యభాషత. ౧

టీక॥ రాజసింహస్య=రాజశ్రేష్ఠుఁడగుదశరథునియొక్క; అద్భుతవిస్తరం, అద్భుత=ఆశ్చర్యముయొక్క,విస్తరం=అతిశయముగల; తత్=ఆ; వాక్యం = మాటను;శ్రుత్వా=విని; మహాతేజాః=అధికమైనప్రభావముగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; హృష్టరోమా,హృష్ట=గగుర్పాటుగొనిన, రోమా=వెండ్రుకలుగలవాఁడై; అభ్యభాషత=బదులుచెప్పెను.

రాజశ్రేష్ఠుండగు దశరథునియత్యాశ్చర్యకరమైనమాటనువిని, మహాప్రభావుండగు విశ్వామిత్రుఁడు, సంతోషంబునఁ బులకితంబులగు వెండ్రుకలుగల్గి, యిట్లని,బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

సదృశం రాజశార్దూల తవైత ద్భువి నాన్యథా
మహావంశప్రసూతస్య వసిష్ఠవ్యపదేశినః. ౨

టీక॥ రాజశార్దూల=రాజశ్రేష్ఠుఁడా! భువి= భూమియందు; ఏతత్ =ఈమాట; మహావంశప్రసూతస్య, మహావంశ=గొప్పవంశమునందు, ప్రసూతస్య=పుట్టినవాఁడవును;వసిష్ఠవ్యపదేశినః వసిష్ఠ=వసిష్ఠునిచే,వ్యపదేశినః=ఉపదేశముగలవాఁడవునగు, తవ= నీకు; సదృశం=తగినది. అన్యథా =వేఱువిధము;న=కాదు.

రాజశ్రేష్ఠుఁడవైనదశరథుఁడా! భూమియందు, ఈప్రకారముమాటలాడుట, రఘువంశమంతటిమహావంశమునందుఁ బుట్టివసిష్ఠుని వలననుపదేశమునొందిననీకుఁదగినదేను; వేఱుకాదు. అని, తాత్పర్యము.

యత్తు మే హృద్గతం వాక్యం తస్య కార్యస్య నిశ్చయమ్
కురుష్వ రాజశార్దూల భవ సత్యప్రతిశ్రవాః. 3

టీక॥ రాజశార్దూల= రాజశ్రేష్ఠుఁడవైనదశరథుఁడా! మే=నాయొక్క; హృద్గతం=మనస్సునుబొంది యున్న; యత్ = ఏకార్యము;వాక్యం=చెప్పఁదగినదో;తస్య=ఆ;కార్యస్య = కార్యమునకు;నిశ్చయంతు = ఏర్పాటునుమాత్రము;కురుష్వ=చేయుము; సత్యప్రతిశ్రవాః, సత్య = అనృతముకాని, ప్రతిశ్రవాః=ప్రతిజ్ఞగలవాఁడవు; భవ=కమ్ము.

రాజశ్రేష్ఠుఁడవైనదశరథుఁడా! నామనస్సులోనుండునట్టి యేకార్యమిప్పుడు నాచేఁ జెప్పఁబడుచున్నదో; దానికిఁదప్పకతగినయేర్పాటుచేసి "ఏకార్యంబైనఁజేసెదను" అని నీవుచేసినప్రతిజ్ఞను సత్యముకావించుకొనుము. అని, తాత్పర్యము.

అహం నియమ మాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ
తస్య విఘ్నకరౌ ద్వౌతు రాక్షసౌ కామరూపిణౌ. ४

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవైనదశరథుఁడా; అహం=నేను; సిద్ధ్యర్థం=సిద్ధికొఱకు; నియమం=దీక్షను;ఆతిష్ఠే = పొందితిని. తస్య తు=ఆదీక్షకును;విఘ్నకరౌ=విఘ్నముసేయునట్టి; కామరూపిణౌ=ఇచ్ఛాధీనమగురూపముగల; ద్వౌ=ఇద్దఱు;రాక్షసౌ = రాక్షసులు; స్తః (అధ్యాహృతము)=ఉన్నారు.

పురుష శ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! నేనొకసిద్ధి నపేక్షించిదీక్ష వహించితిని;దానికివిఘ్నముగావించు నిద్దఱు కామరూపులగు రాక్షసులున్నారు. అని, తాత్పర్యము.

వ్రతే మే బహుశశ్చీర్ణే సమాప్త్యాం రాక్షసా విమౌ
మారీచశ్చ సుబాహుశ్చ వీర్యవంతౌ సుశిక్షితౌ. ५
సమాంసరుధిరౌఘేణ వేదిం తా మభ్యవర్షతామ్

టీక॥ మే=నాయొక్క; వ్రతే= దీక్షావ్రతము; బహుశః=చాలమట్టు కు; చీర్ణే=ఆచరింపఁబడఁగా; సమాప్త్యాం = ముగింపునందు; వీర్యవంతౌ=పరాక్రమముగలవారును; సుశిక్షితౌ=మిక్కిలిసమర్థులునగు; మారీచశ్చ=మారీచుఁడును; సుబాహుశ్చ=సుబాహువును; ఇమౌ=ఈ; రాక్షసౌ=రాక్షసులు; సమాంస రుధిరౌఘేణ, సమాంస=మాంసముతోఁగూడిన, రుధిరౌఘేణ=నెత్తురుప్రవాహముచేత; తాం=ఆ; వేదిం = యాగవేదిని; అభ్యవర్షతాం=తడిపిరి.

నావ్రతము, చాలమట్టుకాచరింపఁబడి ముగింపునకువచ్చునట్టికాలమందుఁబరాక్రమముగలవారును నేర్పరులునగు, మారీచుఁడును సుబాహుఁడునను నీయిద్దఱురాక్షసులు, మాంసములతోఁగూడిన నెత్తురుప్రవాహములచేత, నాయాగవేదినంతయుఁదడిపిరి. అని, తాత్పర్యము.

అవధూతే తథాభూతే తస్మిన్నియమనిశ్చయే. ౬
కృతశ్రమో నిరుత్సాహ స్తస్మా ద్దేశా దపాక్రమే

టీక॥ తథాభూతే=ఆప్రకారమైన; తస్మిన్= ఆ; నియమనిశ్చయే= దీక్షాసంకల్పము; అవధూతే=కొట్టుపడఁగా; కృతశ్రమః, కృత=చేయఁబడిన, శ్రమః= ప్రయాసముగలవాఁడును; నిరుత్సాహః=పోయినయుత్సాహముగలవాఁడునగు; అహం(అధ్యాహృతము)= నేను; తస్మాత్ = ఆ; దేశాత్= ప్రదేశమునుండి; అపాక్రమే = పాఱివచ్చితిని.

ఆప్రకారము చాలమట్టు కాచరింపఁబడిన వ్రతము కొట్టుపడఁగానే, నేను బ్రయాసమునొందియును, ఉత్సాహములేనివాఁడనై, యాప్రదేశమునుండి, పాఱివచ్చితిని.

అని, తాత్పర్యము.

నచ మే క్రోధ ముత్స్రష్టుం బుద్ధి ర్భవతి పార్థివ. ౭
తథాభూతా హి సాచర్యా నశాప స్తత్ర ముచ్యతే

టీక॥ పార్థివ=రాజా! క్రోధం = కోపమును; ఉత్స్రష్టుం=విడుచుటకు; బుద్ధిశ్చ=తలంపును, నభవతి=కలుగదు; సా=ఆ; చర్యా=యాగ కార్యము; తథా భూతా హి=ఆలాటిదిగదా! తత్ర=ఆరాక్షసులయందు; శాపః =శాపము; నముచ్యతే=విడువఁబడలేదు.

ఆరాక్షసులపైఁ గోపమును బ్రయోగించుటకును దలంపు గలుగదు, ఆయాగములోఁ గోపము నొందఁగూడదు కావున, నారాక్షసుల శపింపనలవికాదయ్యె.

అని, తాత్పర్యము.

స్వపుత్రం రాజశార్దూలం రామం సత్యపరాక్రమమ్. ౮
కాకపక్షధరం శూరం జ్యేష్ఠం మే దాతు మర్హసి

టీక॥ స్వపుత్రం=నీకొడుకును; రాజశార్దూలం=రాజశ్రేష్ఠుఁడును; సత్యపరాక్రమం=సత్యమైనపరాక్రమముగలవాఁడును; కాకపక్ష ధరం, కాకపక్ష= పిల్లజుట్టును, ధరం=ధరించినవాఁడును; శూరం=యుద్ధమునందు భయములేనివాఁడును; జ్యేష్ఠం=సహోదరులలోఁ బెద్దవాఁడునగు; రామం= రాముని; మే=నాకు; దాతుం=ఇచ్చుటకు; అర్హసి=తగుదువు.

ఎచ్చటనైననువ్యర్థముకాని పరాక్రమముగలిగి, యుద్ధంబులభయములేనివాఁడై, రాజశ్రేష్ఠుండై, పిల్లజుట్టుధరించియుండు, నీజ్యేష్ఠకుమారుండగు రాముని, నా, కివ్వ వలయును. అని, తాత్పర్యము.

శక్తో హ్యేష మయా గుప్తో దివ్యేన స్వేన తేజసా. ౯
రాక్షసా యే వికర్తార స్తేషామపి వినాశనే

టీక॥ ఏషః=ఈరాముఁడు; మయా=నాచేత; గుప్తః=రక్షింపఁబడినవాఁడై; దివ్యేన=శ్రేష్ఠమైన; స్వేన=తనదగు; తేజసా=ప్రభావము చేత; యే=ఏ; రాక్షసాః=రాక్షసులు; వికర్తారః=విఘ్నముచేయువారలో; తేషామపి = వారలయొక్క యు; వినాశనే= నాశమునొం




దించుటయందు; శక్తోహి = సమర్థుఁడుకదా!

ఈరాముఁడు, నేనుగాపుండఁగా, దివ్యంబగుతన తేజస్సుచేత, విఘ్నముచేయు రాక్షసుల నందఱం జంపసమర్థుండు. అని, తాత్పర్యము.

శ్రేయ శ్చాస్మై ప్రదాస్యామి బహురూపం న సంశయః. ౧౦
త్రయాణామపి లోకానాం యేన ఖ్యాతిం గమిష్యతి

టీక॥ యేన=ఏశుభముచేత; త్రయాణాం=మూఁడైన; లోకానామపి=లోకములలోను; ఖ్యాతిం=కీర్తిని; గమిష్యతి = పొందఁగలఁడో; తత్ (అధ్యాహృతము)=అటువంటి; బహురూపం= పలుదెఱంగులైన; శ్రేయః=శుభమును; అస్మై= ఈరామునికొఱకు; ప్రదాస్యామి=ఇచ్చెదను. సంశయః=సందేహము; న=లేదు.

ఈరామునకు, మూఁడులోకంబులందును ప్రఖ్యాతిగల్గునట్లు, నానావిధములుగా, మంచి నిచ్చెదను. అని, తాత్పర్యము.

నచ తౌ రామ మాసాద్య శక్తౌ స్థాతుం కధంచన. ౧౧
నచ తౌ రాఘవా దన్యో హంతు ముత్సహతే పుమాన్

టీక॥ తౌ=ఆమారీచసుబాహువులు; రామం=రాముని; ఆసాద్య= పొంది; కధంచనచ=అతిప్రయాసంబునసైనను; స్థాతుం=నిలుచుటకు; శక్తౌ=సమర్థులు; న=కారు. రాఘవాత్=రఘువంశమునందుఁబుట్టినరామునికన్న; అన్యః=ఇతరుఁడైన; పుమాన్=పురుషుఁడు; తౌ=ఆమారీచ సుబాహువులను; హంతుం=చంపుటకు; నోత్సహతేచ= ఉత్సహింపను లేఁడు.

ఆమారీచసుబాహువులు, రామునెదుట, నెంతమాత్రము, నిలువలేరు; రాముఁడుగాక మఱియొకఁడు వారలంజంపలేఁడు. అని, తాత్పర్యము.

వీర్యోత్సిక్తౌ హి తౌ పాపౌ కాలపాశవశంగతౌ. ౧౨




రామస్య రాజశార్దూల న పర్యాప్తౌ మహాత్మనః

టీక ॥ రాజశార్దూల=రాజశ్రేష్ఠుఁడా! వీర్యోత్సిక్తౌ,వీర్య=పరాక్రమముచేత, ఉత్సిక్తౌ = గర్వించినవారును; పాపౌ=పాపస్వభావులు నగు; తౌ = ఆమారీచసుబాహువులు; కాలపాశవశంగతౌ, కాల=యముఁడనెడి, పాశ=త్రాటికి, వశంగతౌ=లోఁకువయగుటను బొందినవారలై; మహాత్మనః=అధికమగువీర్యముగల; రామస్య=రామునకు; నపర్యాప్తౌహి=చాలరుగదా!

రాజశ్రేష్ఠుఁడవైన దశరథుఁడా! పాపస్వభావులగు నామారీచసుబాహువులు, పరాక్రమముచేఁగర్వించియున్నవారైనను,మృత్యుపాశమునకులోఁకువపడినవారగుటచే, నధికపరాక్రమశాలియగు రామనకు,యుద్ధమునందుఁజాలరు.

అని, తాత్పర్యము.

నచ పుత్రకృతస్నేహం కర్తు మర్హసి పార్థివ. ౧౩
అహం తే ప్రతిజానామి హతౌ తౌ విద్ధి రాక్షసౌ

టీక॥ పార్థివ=రాజా!పుత్రకృతస్నేహంచ, పుత్ర=కొడుకగుటచే,కృత = చేయఁబడిన, స్నేహంచ=స్నేహమును;కర్తుం=చేయుటకు;నార్హసి=తగవు.అహం=నేను; తే=నీకొఱకు; ప్రతిజానామి=ప్రతిజ్ఞ చేసెదను.తౌ = ఆ; రాక్షసౌ= ఇద్దఱరాక్షసులను; హతౌ=చంపఁబడినవారినిగా; విద్ధి=ఎఱుంగుము.

దశరథమహారాజా!కొడుకనిగారాబముంచవలదు;నామాటనమ్ముము;నేను నీకుఁబ్రతిజ్ఞచేసియిచ్చెదను;ఆరాక్షసులిద్దఱునుజంపఁబడిరనియేయెఱుంగుము.అనితాత్పర్యము.

అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్. ౧౪
వసిష్ఠోపి మహాతేజా యేచేమే తపసి స్థితాః

టీక॥ అహం=నేను; రామం=రాముని; మహాత్మానం=అధికమైన




ధైర్యముగలవానిఁగాను; సత్యపరాక్రమం=ఎచ్చటనైనను వ్యర్థముకాని పరాక్రమము గలవానిఁగాను; వేద్మి=ఏఱుంగుదును. మహాతేజాః=అధికమైన ప్రభావముగల; వసిష్ఠోపి=వసిష్ఠమహర్షియును; వేత్తి=(అధ్యాహృతము)ఎఱుంగును. ఇమే=ఈ; తపసి=తపస్సునందు; స్థితాః=ఉన్నట్టిఋషులు; యే(సంతి)=ఎవరుగలరో; తే (అధ్యాహృతము) చ=వారును; విదంతి=(అధ్యాహృతము)ఎఱుంగుదురు.

ఈ రాముఁడు, అధికంబగు ధైర్యముగలవాఁడనియు నెచ్చటనైనను బ్రతిహతము కాఁగూడని పరాక్రమము గలవాఁడనియు, నేనెఱుంగుదును; మహా ప్రభావుండగు వసిష్ఠుండు నెఱుంగును; మఱియు, తపస్సు చేసెడి యీ ఋషులందఱు, నెఱుంగుదురు అని, తాత్పర్యము.

విశేషార్థము.—అహం=యోగబలంబునఁ జక్కఁగాఁ బరమాత్మస్వరూపంబు నెఱింగినవాఁడును జటావల్కలంబుల ధరించి యాకులల్లంబు దినుచుఁ దపస్సు చేయు సాత్త్వికుండును, మోక్షకామేష్టి యాగము చేసినవాఁడును, బ్రహ్మర్షి యను పేరువహించిన వాఁడును ధర్మమోక్షంబులు మాత్రము కోరుచుండువాఁడనగు నేను (ఈయర్థము, "అహం" అనునది, ప్రసిద్ధార్థపరామర్శకంబగు సర్వనామనామకం బగుట వలన, నిష్పన్నంబైనది.); రామం=రాముని; మహాత్మానం=అపరిచ్ఛిన్నమగు స్వరూపము గలవానిఁగాను; లేక, "నతస్య ప్రాకృతామూర్తిః" (ఆపరమాత్మకు ప్రాకృతంబగు స్వరూపముండదు) అను స్మృతిం బట్టి, మహత్=ప్రాకృతముకాని, ఆత్మానం=స్వరూపము గలవానిఁగాను; లేక, మహత్=పూజ్యముగు; ఆత్మానం=స్వభావముగలవానిఁగాను (శరణాగతులను రక్షించుట మొదలగు మహాగుణములు గలవానిఁగాననుట); సత్యపరాక్రమం, సత్య=ఎల్లప్పుడు నొకటేరీతిగనుండు, పరాక్రమం= పరాక్రమముగలవానిఁగాను (తాను నిద్రించునప్పుడును శత్రువుల సరకు సేయనివానిఁగాననుట); వేద్మి=ఎఱుంగుదును. (ఒకవేళఁ, గేవలకర్మరుండవు, రత్నకిరీటాద్యలంకృతుండవు, రాజసుండవు,




పుత్రికామేష్టిచేసినవాఁడవు, క్షత్రియుండవు, కేవలకామార్థపరుండవునగునీవు, రామునట్టివానిఁగా నెఱుంగక పోయినను గొఱంతలేదను ట)మహాతేజాః=అధికమైన ప్రభావముగల, లేక, నాకును జయింపనలవిగానిప్రభావముగల, లేక, బ్రహ్మషిత్వము సిద్ధమగుటకై సాక్షిగా నాచేతనుంగోరఁబడిననంతటి ప్రభావము గల వాఁడగు; వసిష్ఠోపి=(అపిశబ్దమువిరోధార్థకము) నాకు విరోధియగు వసిష్ఠుఁడును; లేక, (అపిశబ్దము సముచ్చయార్థకము) మీకుఁ గులాచార్యుం డగు వసిష్ఠుండును; లేక, సాక్షాద్బ్రహ్మకుమారుండగు వసిష్ఠుండును; వేత్తి=రామునట్టివానిఁగా నెఱుంగును. ఇమే=ఈ, నీకుఁబ్రియంబుగోరు మునియొద్దనున్నట్టి; తపసిస్థితాః=కాయికవ్యాపారాదులవిడిచియెల్లప్పుడునుజ్ఞానయోగంబునందెయుండునట్టి, వామదేవాదిబుుషులు; విదంతి=రామునట్టివానిఁగా, ఎఱుంగుదురు.

రాముఁడు, సాక్షాద్భగవత్స్వరూపుండుగావున, నతనిస్వరూపంబు, నాకుఁ, దెలియునుగాని, నీకుఁ దెలియదు, నేనుగార్యార్థినై చెప్పెదనంటివేని; నాకువిరోధియును నీకుఁ గులాచార్యుండునగు వసిష్ఠునకుందెలియును, మఱియు, నీప్రియముఁగోరునట్టి, వామదేవాది మహషులకుందెలియును, వారితోనాలోచించి, వారొప్పినట్టయిన, రామునినాకిమ్ము.

అని, తాత్పర్యము.

యది తే ధర్మలాభంచ యశశ్చ పరమం భువి. ౧౫
స్థిత మిచ్ఛసి రాజేంద్ర రామం మే దాతు మర్హసి

టీక॥ రాజేంద్ర=రాజశ్రేష్ఠుఁడా! భువి=భూమియందు; తే=నీయొక్క-; ధర్మలాభంచ=ధర్మవృద్ధిని; యశశ్చ=కీర్తిని; స్థితం=ఉన్నదానిఁగా; యదిఇచ్ఛసి=కోరువాఁడవైనట్టయిన; మే=నాకు; రామం=రాముని; దాతుం=ఇచ్చుటకు; అర్హసి=తగుదువు.

రాజశ్రేష్ఠుఁడవైనదశరథుఁడా! భూమియందు, పరమంబగు నీధర్మంబునుగీర్తియును, స్థిరముగా నుండ వలయునని కోరువాఁడవైనట్టయిన, రామునినాకీవలయు.

అని, తాత్పర్యము.

యది హ్యనుజ్ఞాం కాకుత్థ్స దదతే తవ మంత్రిణః. ౧౬
వసిష్ఠ ప్రముఖా స్సర్వే తతో రామం వ్యసర్జయ

టీక॥ కాకుత్థ్స = కకుత్థ్సవంశంబునఁబుట్టినదశరథుఁడా! వసిష్ఠప్రముఖాః=వసిష్ఠుఁడుమొదలుగాఁగల; తవ=నీయొక్క; మంత్రిణః=మంత్రులు; సర్వే=అందఱు; అనుజ్ఞాం=అనుమతిని; యదిదదతే=ఇచ్చినట్టైన ("హి" అనునదిపాదపూరణార్థము); తతః=అంతమీఁద; రామం=రాముని; వ్యసర్జయ=పంపుము.

వసిష్ఠుఁడుమొదలుగా నీమంత్రులందఱునొప్పుకొనినట్టైన రామునినాతోఁబంపుము.

అని, తాత్పర్యము.

అభిప్రేత మసంసక్త మాత్మజం దాతు మర్హసి. ౧౭
దశరాత్రం హి యజ్ఞస్య రామం రాజీవలోచనమ్

టీక॥ అభిప్రేతం= ప్రియుఁడును; రాజీవలోచనం = కమలములవంటికండ్లు గలవాఁడును; ఆత్మజం = కుమారుఁడునగు; రామం=రాముని; యజ్ఞస్య=యాగమునకు; దశరాత్రం=పదిరాత్రులు; అసంసక్తం=జాగుపడనట్లు; దాతుం=ఇచ్చుటకు; అర్హసి=తగుదువు.

నీకుఁబ్రియకుమారుండైనను, తమ్మితేకులవంటికండ్లుగల యీరామునియాగసంరక్షణమునకై, జాగుసేయకపదిరాత్రములు, నావశంబున, నుంచవలయు.

అని, తాత్పర్యము.

నాత్యేతి కాలో యజ్ఞస్య యథాయం మమ రాఘవ. ౧౮

తథా కురుష్వ భద్రంతే మాచ శోకే మనః కృథాః

టీక॥ రాఘవ=రఘువంశమునం దుఁబుట్టినదశరథుఁడా! యథా=ఎట్లు; అయం=ఈ; మమ=నాయొక్క; యజ్ఞస్య=యాగముయొక్క; కాలః=కాలము; నాత్యేతి=అతిక్రమింపదో; తథా=అట్లు; కురుష్వ=చేయుము; తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. శోకేచ=దుఃఖమునం దుమాత్రము; మనః=మనస్సును; మాకృథాః=చేయవలదు.

దశరథుఁడా! నాయాగకాల మతిక్రమింపకమున్నె నాతో రాము నింబంపుము; నీకుమంగళంబగుఁగాక; దుఃఖమునొందకుము. అని, విశ్వామిత్రుఁడుదశరథునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా ధర్మాత్మా ధర్మార్థ సహితం వచః. ౧౯
విరరామ మహాతేజా విశ్వామిత్రో మహామునిః

టీక॥ ధర్మాత్మా, ధర్మ=ధర్మమందు, ఆత్మా=బుద్ధిగలవాఁడును; మహాతేజాః=అధికమైనప్రభావము గలవాఁడును; మహామునిః=పూజ్యుఁడైనమునియునగు; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; ఇత్యేవం=ఈప్రకారము; ధర్మార్థసహితం, ధర్మార్థ=ధర్మముతోను అర్థముతోను, సహితం=కూడినట్టి; వచః=మాటను; ఉక్త్వా=చెప్పి; విరరామ= విరమించెను.

ధర్మస్వభావంబును అధికమగుప్రభావమునుంగలవిశ్వామిత్రమహాముని, యీప్రకారము, ధర్మార్థ సహితంబగు మాటచెప్పి, యంతనోరుమూసెను.

అని, తాత్పర్యము.

స త న్నిశమ్య రాజేంద్రో విశ్వామిత్ర వచ శ్శుభమ్. ౨౦

శోక మభ్యాగమ త్తీవ్రం వ్యషీదత భయాన్వితః

టీక॥ సః=ఆ; రాజేంద్రః=రాజశ్రేష్ఠుఁడగుదశరథుఁడు; శుభం=మంగళకరమగు; తత్=ఆ; విశ్వామిత్రవచః, విశ్వామిత్ర=విశ్వామిత్రుని యొక్క, వచః=మాటను; నిశమ్య=విని; తీవ్రం=తీక్ష్ణమైన; శోకం=దుఃఖమును; అభ్యాగమత్=పొందెను. భయాన్వితః=భయముతోఁగూడినవాఁడై; వ్యషీదత=దుఃఖించెను.

రాజులలో మేటియగు నాదశరథుఁడు, శుభంబగు నావిశ్వామిత్రుని మాటనువిని, భయమునొంది, మిక్కిలియుదుఃఖింపసాగెను.

అని, తాత్పర్యము.

ఇతి హృదయ మనోవిదారణం
మునివచనం తదతీవ శుశ్రువాన్
నరపతి రభవ న్మహాం స్తదా
వ్యథితమనాః ప్రచచాల చాసనాత్. ౨౧౫

టీక॥ ఇతి=ఈప్రకారము; అతీవ=మిక్కిలి; హృదయమనోవిదారణం, హృత్=మనస్సుయొక్క; అయ=స్థానమును, మనః=మనస్సును, విదారణం=పగులఁగొట్టునట్టి, తత్=ఆ; మునివచనం=విశ్వామిత్రుని యొక్క మాటను; శుశ్రువాన్=వినినట్టి; మహాన్=పూజ్యుఁడైన; నరపతిః=మనుష్యులకుఁబ్రభువైనదశరథుఁడు; తదా=అప్పుడు; వ్యథితమనాః, వ్యథిత=పీడింపఁబడిన, మనాః=మనస్సుగలవాఁడుగా; అభవత్=ఆయెను. ఆసనాచ్చ=సింహాసనమునుండియు; ప్రచచాల=మిక్కిలికదలెను

ఇట్లు, మనస్సుయొక్క అధిష్ఠానంబునుమనస్సునుంబగులఁదీయువిశ్వామిత్రువచనంబువిని, యప్పుడు పూజ్యుండగుదశరథమహారాజు, నొచ్చినమనస్సు గలవాఁడై, సింహాస

నంబుననుండిగడగడవడం కెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, ఏకోనవింశ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయ ణాంధ్ర

వ్యాఖ్యానంబు నందు, బాలకాం డైకోన వింశసర్గ టీక,

ముగిసినది.

---

శ్రీ

వింశ సర్గ ప్రారంభః

తచ్ఛ్రుత్వా రాజశార్దూలో విశ్వామిత్రస్య భాషితమ్
ముహూర్తమివ నిస్సంజ్ఞ స్సంజ్ఞావా నిద మబ్రవీత్. ౧

టీక॥ రాజశార్దూలః=రాజశ్రేష్ఠుఁడగుదశరథుఁడు; తత్ = ఆ;విశ్వామిత్రస్య = విశ్వామిత్రునియొక్క; భాషితం = మాటను;శ్రుత్వా = విని; ముహూర్తం=ముహూర్తకాలము; నిస్సంజ్ఞ ఇవ(స్థితః) = తెలివిలేనివాఁడువలెనున్నవాఁడై; సంజ్ఞావాన్ = తెలివిగలవాఁడై;ఇదం=దీని; అబ్రవీత్=చెప్పెను.

రాజశ్రేష్ఠుండగు దశరథుఁడు, ఆవిశ్వామిత్రునిమాటవిని,ముహూర్తకాలము తెలివిలేనివాఁడువోలెఁ బడియుండి, యంతఁదెలివి నొంది, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

ఊనషోడశవర్షో మే రామో రాజీవ లోచనః

న యుద్ధ యోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః. ౨

టీక॥ మే=నాయొక్క; రాజీవలోచనః, రాజీవ = కమలమువంటి, లోచనః= కన్నులుగల; రామః = రాముఁడు; ఊనషోడశవర్షః, ఊన=తక్కువయయిన, షోడశవర్షః = పదియాఱేండ్లుగలవాఁడు; భవతి(అధ్యాహృతము)= అగుచున్నాఁడు. అస్య= ఈరామునకు; రాక్షసైస్సహ=రాక్షసులతోఁగూడ; యుద్ధయోగ్యతాం=యుద్ధమునకుఁదగుటను; నపశ్యామి=చూడను.

కమలంబులంబోలుకన్నులు గల మా రామునకుఁ, బదియాఱేండ్లయినను గాలేదు; వీఁడు రాక్షసులతో యుద్ధము సేయుటకు యోగ్యుఁడని నాకుఁదోఁచలేదు.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—"బాలోద్వాదశవర్షోఽయమకృతాస్త్రశ్చ రాఘవః" (అప్పుడు, రాముఁడు, బాలుఁడును, బండ్రెండేండ్లవాఁడును, ఎచ్చుగానస్త్రాభ్యాసములేనివాఁడునుగా, నుండెను)" అని, యరణ్యకాండంబున, విశ్వామిత్రయాగరక్షణకాలమందు, "రాముఁడుపండ్రెండేండ్లవాఁడు" అని, రావణునింగూర్చి, మారీచునిచేఁ జెప్పఁబడుటంబట్టి, యిచ్చట, "ఊనషోడశవర్షః" అనుదానికి, పండ్రెండేండ్ల వాఁడని వ్యాఖ్యానముచేయఁబడినది.

ఇయ మక్షౌహిణీ పూర్ణా యస్యాహం పతి రీశ్వరః
అనయా సంవృతో గత్వా యోద్ధాహం తై ర్నిశాచరైః. ౩

టీక॥యస్యాః=(సంధియార్షము)దేనికి; అహం=నేను; పతిః=ప్రభువునో; ఈశ్వరః=నియామకుఁడనో; సా(అధ్యాహృతము)=ఆ; ఇయం=ఈ; అక్షౌహిణీ = అక్షౌహిణీపరిమితిగలసేన; పూర్ణా= నిండినదిగా; భవతి (అధ్యాహృతము)=అగుచున్నది. అహం=నేను;

అనయా=ఈయక్షౌహిణిచేః సంవృతః = చుట్టఁబడినవాఁడనై; గత్వా=పోయి; తైః=ఆ; నిశాచరైః=రాక్షసులతో; యోద్ధా=యుద్ధముచేయువాఁడను; అస్మి(అధ్యాహృతము)=అగుచున్నాను.

ఇదిగో సంపూర్ణమగునక్షౌహిణియంత సేననాకున్నది; ఈ సేనతో వెళ్లి, యా రాక్షసులతో యుద్ధముచేసెదను. అని, తాత్పర్యము.

ఇమే శూరాశ్చ విక్రాంతా భృత్యామేఽ స్త్రవిశారదాః
యోగ్యా రక్షోగణై ర్యోద్ధుం న రామం నేతు మర్హసి. ౪

టీక॥ శూరాః = యుద్ధమునందు భయపడని వారును; విక్రాంతాః=పరాక్రమించియుండువారును; అస్త్రవిశారదాశ్చ=అస్త్రంబులలో నేర్పరులునగు; మే = నాయొక్క; ఇమే=ఈ; భృత్యాః = భటులు; రక్షోగణైః=రాక్షససమూహములతో; యోద్ధుం = యుద్ధముసేయుటకు; యోగ్యాః=తగినవారు; రామం = రాముని; నేతుం=తోడ్కొని పోవుటకు; నార్హసి=తగవు.

సమస్తాస్త్రంబుల సమర్థులై యుద్ధంబున నెంతమాత్రము భయములేక పరాక్రమించి యుండు నా భృత్యులు, రాక్షసులతో యుద్ధము సేయఁదగుదురు; రాముఁడు తగఁడు కావున, రాముని తోడ్కొని పోవలదు.

అని, తాత్పర్యము.

అహ మేవ ధనుష్పాణి ర్గోప్తా సమరమూర్ధని
యావ త్ప్రాణా న్ధరిష్యామి తావ ద్యోత్స్యే నిశాచరైః. ౫

టీక ॥ అహమేవ=నేనే; ధనుష్పాణిః = విల్లుచేతఁగలవాఁడనై; గోప్తా = రక్షించువాఁడను; భవిష్యామి(అధ్యాహృతము)=అయ్యెదను. యావత్=ఎంతవఱకు; ప్రాణాన్= ప్రాణంబులను; ధరిష్యామి=ధరించెదనో; తావత్=అంతవఱకు; సమరమూర్ధని, సమర=



యుద్ధముయొక్క, మూర్ధని=శిరస్సునందు; నిశాచరైః=రాక్షసులతో; యోత్స్యే = యుద్ధముచేసెదను.

నేనే, ధనుస్సు చేతంబట్టి, యాగమురక్షించెదను; నాకుఁబ్రాణంబులున్నంతవఱకు, యుద్ధభూమియందు నిలిచి, రాక్షసులతో యుద్ధముచేసెదను.

అని, తాత్పర్యము.

నిర్విఘ్నా వ్రతచర్యా సా భవిష్యతి సురక్షితా
అహం తత్రా గమిష్యామి న రామం నేతు మర్హసి. ౬

టీక॥ తత్ర= ఆయాగమునకు; అహం = నేను; ఆగమిష్యామి=వచ్చెదను. సా=ఆ; వ్రతచర్యా=దీక్షాకార్యము; నిర్విఘ్నా =విఘ్నములేనిదై; సురక్షితా=చక్కగారక్షింపఁబడినది; భవిష్యతి=కాఁబోవుచున్నది. రామం=రాముని; నేతుం=తోడ్కొనిపోవుటకు; నార్హసి=తగవు.

నేను యాగంబునకువచ్చెదను; దానం జేసి, నీవ్రతకార్యము, నిర్విఘ్నముగాఁ, జక్కగారక్షింపఁబడును; రామునిందోడ్కొనిపోవలదు.

అని, తాత్పర్యము.

బాలో హ్యకృత విద్యశ్చ నచ వేత్తి బలాబలమ్
న చాస్త్ర బలసంయుక్తో నచ యుద్ధ విశారదః. ౭

టీక॥ రామః ( అధ్యాహృతము)=రాముఁడు; బాలః=పంద్రెండేండ్ల పిల్లవాఁడును; అకృతవిద్యశ్చ, అకృత=చక్కగా నేర్పఁబడని, విద్యశ్చ = విలువిద్య గల వాఁడునుగా; భవతి(అధ్యాహృతము)హి=ఉన్నాఁడు గదా ! బలాబలంచ, బల=బలమును, అబలంచ=దౌర్బల్యమును; నవేత్తి=ఎఱుంగఁడు. అస్త్రబలసంయుక్తశ్చ, అస్త్రబల=అస్త్రములవలనఁగలిగినబలముతో, సంయుక్తశ్చ = కూడినవాఁడును; న=కాఁడు. యుద్ధవిశారదశ్చ = యుద్ధమునందుగట్టివాఁడును; న=



కాఁడు.

రాముం,డిప్పటికిఁ,బండ్రెండేండ్లవాఁడు; ఇంకను, విలువిద్యనుగూడఁజక్కఁగా నేర్చుకొని యుండలేదు; బలమెట్టిదో, అబలమెట్టిదో, యెఱుంగఁడు; అస్త్రబలంబుగలవాఁడును కాఁడు; యుద్ధమునందారితేరియుండువాఁడును కాఁడు.

అని, తాత్పర్యము.

నచా సౌ రక్షసాం యోగ్యః కూటయుద్ధాహి తే ధ్రువమ్

టీక॥ అసౌ= ఈరాముఁడు; రక్షసాం = రాక్షసులకు; యోగ్యశ్చ = తగినవాఁడును; న=కాఁడు; తే=ఆరాక్షసులు; ధ్రువం = నిశ్చయముగా; కూటయుద్ధాహి=కపటయుద్ధముగలవారలుకదా!

రాక్షసులుకపటముగా యుద్ధముసేయువారలు కావున, నీరాముఁడువారలతో యుద్ధముసేయఁదగినవాఁడుకాఁడు. అని, తాత్పర్యము.

విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే. ౮
జీవితుం మునిశార్దూల న రామం నేతు మర్హసి

టీక॥మునిశార్దూల = మునిశ్రేష్ఠుఁడవైనవిశ్వామిత్రుఁడా ! అహం= (అధ్యాహృతము) నేను; రామేణ = రాముని చేత; విప్రయుక్తః = విడువఁబడినవాఁడనై; ముహూర్తమపి=మూఁడున్నకాఁలుగడియయైనను; జీవితుం=బ్రతుకుటకు; నోత్సహే=ఉత్సహింపను. రామం=రాముని; నేతుం= తోడ్కొనిపోవుటకు; నార్హసి=తగవు.

విశ్వామిత్రుఁడా! నేను, రాముని విడిచి ముహూర్తమైనను జీవించియుండలేను; కావున, రామునిఁదోడ్కొనిపోవలదు. అని, తాత్పర్యము

యది వా రాఘవం బ్రహ్మన్ నేతు మిచ్ఛసి సువ్రత. ౯
చతురంగ సమాయుక్తం మయాచ సహితం నయ

టీక॥ సువ్రత=మంచివ్రతముగ ల; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా! రాఘవం= రఘువంశమునందుఁబుట్టిన రామునిఁ; నేతుం=తోడ్కొనిపోవుటకు; ఇచ్ఛసియదివా=కోరువాఁడ వైనట్టైన; చతురంగ సమాయుక్తం,చతురంగ = సేనయొక్క నాలు గంగముల తోను, సమాయుక్తం = కూడినవానిఁగాను;మయా చ=నాతోను;సహితం = కూడిన వానిఁగాను; నయ=తోడ్కొనిపొమ్ము.

గొప్ప వ్రతములు గలబ్రాహ్మణుఁడవైన విశ్వామిత్రుఁడా! నీవు, రామునే, దోడ్కొనిపోవలయునని కోరినట్టయిన, రథంబులును,ఏనుంగులును, గుఱ్ఱంబులును, నన్నునుం గూడ, రామునితోఁగొనిపొమ్ము.

అని, తాత్పర్యము.

షష్టి ర్వర్ష సహస్రాణి మమ జాతస్య కౌశిక. ౧౦
దుఃఖే నోత్పాదిత శ్చాయం న రామం నేతు మర్హసి

టీక॥ కౌశిక = విశ్వామిత్రుఁడా!జాతస్య=పుట్టిన;మమ=నాకు; వర్షసహస్రాణి,వర్ష = సంవత్సరములయొక్క, సహస్రాణి=వేలు; షష్టిః = అఱువది;ఆసన్(అధ్యాహృతము)=అయినవి. అయంచ= ఈ రాముఁడును;దుఃఖేన = దుఃఖముచేత; ఉత్పాదితః=పుట్టించుకొనఁబడినవాఁడు. రామం=రామునిఁ; నేతుం=గొనిపోవుటకు; నార్హసి= తగవు.

నాకఱువదివేలేండ్ల వయసుఅయినపిమ్మట,వ్రతము,ఉపవాసముమొదలగునతి ప్రయాసములచే,నితఁడు పుట్టెను;కావున, నీరామునిఁగొని పోవలదు. అని,తాత్పర్యము.

చతుర్ణా మాత్మజానాం హి ప్రీతిః పరమికా మమ. ౧౧
జ్యేష్ఠం ధర్మ ప్రధానంచ న రామం నేతు మర్హసి

టీక॥ మమ=నాకు;చతుర్ణాం=నలువురైన; ఆత్మజానాం=కొడుకు

లలోఁ; రామే(అధ్యాహృతము)=రామునియందు; పరమికా=మిక్కిలియధికమైన; ప్రీతిః=ప్రేమగదా! జ్యేష్ఠం=కొడుకులలోఁ బెద్దవాఁడును; ధర్మప్రధానంచ, ధర్మ=ధర్మమె, ప్రధానంచ=ప్రధానముగాఁగలవాఁడునగు; రామం=రాముని; నేతుం=కొనిపోవుటకు; నార్హసి=తగవు.

కొడుకులునల్వురిలోను, నాకు, రామునియందుఁ, మిక్కిలిప్రీతి; కావున, జ్యేష్ఠపుత్రుండును ధార్మికుండునగు రామునిఁగొనిపోవలదు. అని, తాత్పర్యము.

కింవీర్యా రాక్షసాస్తేచ కస్య పుత్రాశ్చ కేచ తే. ౧౨
కథంప్రమాణాః కే చైతాన్ రక్షంతి మునిపుంగవ

టీక॥ మునిపుంగవ=మునిశ్రేష్ఠుఁడా! తే=ఆ; రాక్షసాశ్చ=రాక్షసులును; కింవీర్యాః=ఏమిపరాక్రమము గలవారు ? కస్య=ఎవనికి; పుత్రాశ్చ=కొడుకులును? తేచ=ఆరాక్షసులును; కే=ఎవ్వరు? కథంప్రమాణాః = ఎంతటియాకారముగలవారు? కే=ఎవరు; ఏతాన్ చ=ఈరాక్షసులను; రక్షంతి=రక్షించుచున్నారు

ఆరాక్షసుల పరాక్రమమెట్టిది? వారెవ్వానికొడుకులు? వారలపేరేమి? వారలయాకారమెంతటిది? వారికిఁ బ్రభువులెవ్వరు? వీటిని, నాకుఁ జెప్పుము. అని, తాత్పర్యము.

కథంచ ప్రతికర్తవ్యం తేషాం రామేణ రక్షసామ్. ౧౩
మామకైర్వా బలైర్బ్రహ్మన్ మయావా కూటయోధినామ్

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా! కూటయోధినాం, కూట=కపటముగా, యోధినాం=యుద్ధముసేయునట్టి; తేషాం=ఆ; రక్షసాం=రాక్షసులకు; రామేణ=రామునిచేతఁగాని; మామకైః=నావియగు; బలైః=సైన్యములచేతఁగాని; మయావా=నాచేతఁగాని; ప్రతికర్తవ్యంచ= ప్రతీకారముచేయఁబడవలసినదియును; కథం=ఎట్లు?

విశ్వామిత్రుఁడా! రాముఁడు గాని, నాసైన్యములు గాని, నేను గాని, కపటముగా యుద్ధము సేయునారాక్షసులకుఁ బ్రతీకార మెట్లు సేయవలయును? దీనిం జెప్పుము.

అని, తాత్పర్యము.

సర్వం మే శంస భగవన్ కథం తేషాం మయా రణే. ౧౪
స్థాతవ్యం దుష్టభావానాం వీర్యోత్సిక్తా హి రాక్షసాః

టీక॥ కథం=ఎట్లు; దుష్టభావానాం, దుష్ట=కపటముతోఁగూడిన, భావానాం=మనస్సుగల; తేషాం=ఆరాక్షసులయొక్క; రణే=యుద్ధమందు; మయా=నాచేత; స్థాతవ్యం=ఉండుట కావలయును; రాక్షసాః=రాక్షసులు; వీర్యోత్సిక్తాహి, వీర్య=పరాక్రమముచేత, ఉత్సిక్తాహి=గర్వించినవారలుగదా! భగవన్ = భగవంతుఁడవైనవిశ్వామిత్రుఁడా! సర్వం = అన్నింటిని; మే=నాకు; శంస=చెప్పుము.

ఆరాక్షసులయుద్ధమునందు, నేనేవ్యూహముఁబన్ని యేరీతిగనుండవలయును; రాక్షసులుమిక్కిలియుఁ బరాక్రమించియుండువారలు గావున, నాకంతయుఁ జెప్పుము. అని, దశరథుఁడు, విశ్వామిత్రునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య త ద్వచనం శ్రుత్వా విశ్వామిత్రోఽ భ్యభాషత. ౧౫

టీక॥ విశ్వామిత్రః = విశ్వామిత్రమహాముని, తస్య = ఆదశరథుని యొక్క, తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని, అభ్యభాషత=బదులు చెప్పెను.

విశ్వామిత్రుండా దశరథుని మాటను విని యిట్లని బదులు చెప్పెను.

అని, తాత్పర్యము.

పౌలస్త్య వంశప్రభవో రావణో నామ రాక్షసః

టీక॥ పౌలస్త్యవంశప్రభవః, పౌలస్త్య=పులస్త్యమహర్షి సంబంధ



మైన, వంశ=సంతతియందు, ప్రభవః=పుట్టుకగల; రావణో నామ=రావణుఁడని ప్రసిద్ధుఁడైన; రాక్షసః=రాక్షసుఁడు; అస్తి (అధ్యాహృతము)=కలఁడు.

పులస్త్య మహాముని వంశంబునందుఁబుట్టినరావణుండనెడు రాక్షసుండొకఁడుగలఁడు.

అని, తాత్పర్యము.

స బ్రహ్మణా దత్తవర స్త్రైలోక్యం బాధతే భృశమ్. ౧౬
మహాబలో మహావీర్యో రాక్షసై ర్బహుభి ర్వృతః

టీక॥ మహాబలః=అధికమైనబలముగలవాఁడును; మహావీర్యః=అధికమైనపరాక్రమముగలవాఁడును; బహుభిః=పెక్కండ్రగు; రాక్షసైః=రక్కసులచేత; వృతః=చుట్టఁబడినవాఁడునగు; సః = ఆరావణుఁడు; బ్రహ్మణా = బ్రహ్మదేవునిచేత; దత్తవరః=దత్త=ఇవ్వఁబడిన; వరః=వరముగలవాఁడై; త్రైలోక్యం = మూఁడులోకములను; భృశం=మిక్కిలి; బాధతే=పీడించుచున్నాఁడు.

మహాబలుండును మహాపరాక్రమశాలియునగు నారావణుండు బ్రహ్మదేవుని వలన వరంబు నొంది మూఁడులోకంబుల మిక్కిలియుఁ బీడించుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

శ్రూయతేహి మహావీర్యో రావణో రాక్షసాధిపః. ౧౭
సాక్షా ద్వైశ్రవణ భ్రాతా పుత్రో విశ్రవసో మునేః

టీక ॥ సాక్షాత్=ప్రత్యక్షముగ; వైశ్రవణభ్రాతా, వైశ్రవణ=కుబేరునియొక్క, భ్రాతా=తమ్ముఁడును; విశ్రవసః= విశ్రవసుండనెడి; మునేః = ఋషియొక్క; పుత్రః=కొడుకును; మహావీర్యః=అధికమైనపరాక్రమముగలవాఁడును; రాక్షసాధిపః=రాక్షసులకుఁబ్రభువునైన; రావణః = రావణుఁడు; శ్రూయతేహి= వినఁబడుచున్నాఁ



ఈప్రకారము విశ్వామిత్రుఁడు చెప్పఁగానామాటవిని, దశరథమహారాజు, అతనితోనిట్లనిబదులుచెప్పెను. అని, తాత్పర్యము.

నహి శక్తో౽స్మి సంగ్రామే స్థాతుం తస్య దురాత్మనః. ౨౦

టీక॥ దురాత్మనః=దుష్టస్వభావముగల; తస్య = ఆరావణునియొక్క; సంగ్రామే=యుద్ధమునందు; స్థాతుం=నిలుచుటకు; శక్తః=సమర్థుఁడను; నాస్మిహి = కానుగదా!

దుష్టస్వభావుండగు నారావణునితో యుద్ధము సేయుటకు నేనుశక్తుఁడనుగాను.

అని, తాత్పర్యము.

స త్వం ప్రసాదం ధర్మజ్ఞ కురుష్వ మమ పుత్రకే
మమ చైవాల్ప భాగ్యస్య దైవతంహి భవా న్గురుః. ౨౧

టీక॥ ధర్మజ్ఞ = ధర్మంబులనెఱింగినవిశ్వామిత్రుఁడా! సః=అటువంటి; త్వం=నీవు; మమ = నాయొక్క; పుత్రకే=చిన్నికొమరునియందును; అల్పభాగ్యస్య, అల్ప=తక్కువమైన, భాగ్యస్య=అదృష్టముగల; మమచైవ=నాకును; ప్రసాదం=అనుగ్రహమును; కురుష్వ = చేయుము; భవాన్=నీవు; గురుః = ఆచార్యుండవును; దైవతంహి=దేవతవునుగదా!

ధర్మజ్ఞుండ వగు విశ్వామిత్రుఁడా! నీవునాకాచార్యుండవు, దేవతవు; కావున, నాచిన్నికొమరునియందును, అల్పభాగ్యుండనగు నాయందును, అనుగ్రహింపుము; కోపము సేయవలదు. అని, తాత్పర్యము.

దేవదానవగంధర్వా యక్షాః పతగపన్నగాః
న శక్తా రావణం సోఢుం కింపున ర్మానవా యుధి. ౨౨

టీక॥ దేవదానవగంధర్వాః=దేవతలునుదానవులునుగంధర్వులును;




యక్షాః= యక్షులును; పతగప న్నగాః, పతగ=పక్షులును,పన్న గాః=సర్పములును,యుధి=యుద్ధ మునందు; రావణం=రావణుని;సో ఢుం=ఓర్చుటకు; శక్తాః=సమర్థుల రు;న=కారు. పునః=ఇంకను;మా నవాః = మనుష్యులు;కిం=ఎట్లు;స హేయుః(అధ్యాహృతము)= ఓ ర్వఁగలరు.

దేవతలును దానవులును గంధ ర్వులునుయక్షులును బక్షులునుబ న్నగంబులును, యుద్ధమునందు,రా వణునోర్వలేరు;మనుష్యులెట్లోర్వఁ గలరు. అని, తాత్పర్యము.

సహి వీర్యవతాం వీర్య మాదత్తే యుధి రాక్షసః
తేన చాహం న శక్తోఽస్మి సంయోద్ధుం తస్యవాబలైః. ౨౩
సబలో వా మునిశ్రేష్ఠ సహితోవా మమాత్మజైః

టీక॥ మునిశ్రేష్ఠ = మునులలో మేటివగువిశ్వామిత్రుఁడా ! సః= ఆ; రాక్షసః=రావణుఁడనురాక్ష సుఁడు;యుధి=యుద్ధమునందు, వీ ర్యవతాం= పరాక్రమముగలవారి యొక్క; వీర్యం=పరాక్రమమును; ఆదత్తేహి = గ్రహించునుగదా. (నశింపఁజేయుననుట) అహం=నే ను; సబలోవా = సైన్యముతోఁగూ డుకొనినవాఁడైనను;మమ=నాయొ క్క; అత్మజైః=కొడుకులతో; స హితోవా=కూడినవాఁడైనను; తే నచ=ఆరావణునితోఁగాని;తస్య= ఆరావణునియొక్క; బలైర్వా= సైన్యములతోఁగాని;సంయోద్ధుం= యుద్ధముసేయుటకు; శక్తః=సమ ర్థుఁడను;నాస్మి=కాను.

ఆరావణాసురుఁడు, యుద్ధము న,నెట్టిపరాక్రమముగలవారినైనను మొక్కపుచ్చును; నేను సైన్యమునా కొడుకులనుంగూడియు, వానితోఁ గాని, వానిసైన్యములతోఁగాని, పో రొనర్పలేము. అని, తాత్పర్యము.

కథమ ప్యమర ప్రఖ్యం సంగ్రామాణా మకోవిదమ్. ౨౪
బాలం మే తనయం బ్రహ్మన్ నైవ దాస్యామి పుత్రకమ్




టీక॥ బ్రహ్మన్ = బ్రాహ్మణుఁడా! అమరప్రఖ్యం = దేవతతోసమానుఁడైన వాఁడును; సంగ్రామాణాం = యుద్ధములలో; అకోవిదం = పండితుఁడు కానివాఁడును; బాలం = పంద్రెండేండ్లపిన్నవాఁడును; పుత్రకం = పున్నామకమైననరకమునుండి రక్షించువాఁడునగు; మే = నాయొక్క; తనయం = కొడుకును; కథమపి = ఎట్లైనను; నదాస్యామ్యేవ = ఇచ్చుటయే లేదు.

దేవతతోసమానుఁడుగా నుండువాఁడును, యుద్ధమనుసమాచారమే యెంతమాత్రము తెలియనిపంద్రెండేండ్లపిల్లవాఁడునునన్నుఁబున్నామకంబగునరకంబునుండి రక్షించువాఁడునగునాకొడుకు, నెంతమాత్రము నిచ్చుటలేదు. అని, తాత్పర్యము.

అథ కాలోపమౌ యుద్ధే సుతౌ సుందోపసుందయోః. ౨౫
యజ్ఞవిఘ్నకరౌ తౌ తే నైవ దాస్యామి పుత్రకమ్

టీక॥ అథ = మఱియును; యుద్ధే = యుద్ధమునందు; కాలోపమౌ = యమునితోసమానులైనవారలగు; సుందోపసుందయోః = సుందుఁడును ఉపసుందుఁడనెడు వారియొక్క; సుతౌ = కొడుకులగు; తౌ = ఆమారీచ సుబాహువులు; తే = నీకు; యజ్ఞవిఘ్నకరౌ = యాగవిఘ్నము చేయువారలుగా; భవతః (అధ్యాహృతము) = ఉన్నారు. పుత్రకం = చిన్నికొమరుని; నదాస్యామ్యేవ = ఇచ్చుటయే లేదు.

మఱియు, యుద్ధమునందు యమునకుసరివచ్చునట్టి, సుందోపసుందపుత్రులగు నామారీచసుబాహువులు, నీకు, యాగవిఘ్నము సేయువారలుగానున్నారు; కావున, నే నెంతమాత్రము నాచిన్ని కొడుకునివ్వను. అని, తాత్పర్యము.

మారీచశ్చ సుబాహుశ్చ వీర్యవంతౌ సుశిక్షితౌ. ౨౬
తయో రన్యతరేణాహం యోద్ధాస్యాం ససుహృద్గణః



టీక॥ మారీచశ్చ=మారీచుఁడును; సుబాహుశ్చ=సుబాహువును; వీర్యవంతౌ=పరాక్రమముగలవారలును;సుశిక్షితౌ=మిక్కిలియు నేర్పరులునుగా; భవతః(అధ్యాహృతము)=ఉన్నారు. అహం=నేను;స సుహృద్గణః= స్నేహితులసమూహముతోఁ గూడిన వాఁడనై; తయోః=వారిలో; అన్యతరేణ=ఒకనితో;యోద్ధా = యుద్ధముచేయు వాఁడను;స్యాం=కాఁగలనా!

మారీచుండును సుబాహువును బరాక్రమముగలిగిమిక్కిలియు నేర్పరులు గానున్నారు; వారిలో నొకనితోనైనను, నేను నా స్నేహితులనం దఱంగూడియయును, యుద్ధము సేయలేను. అని, దశరథుఁడు విశ్వామిత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి నరపతిజల్పనా ద్ద్విజేంద్రం
కుశికసుతం సుమహా న్వివేశ మన్యుః
సుహుత ఇవ మఖేఽగ్ని రాజ్యసిక్త
స్సమభవ దుజ్జ్వలితో మహర్షివహ్నిః. ౨౭॥

టీక॥ఇతి=ఈప్రకారము;నరపతిజల్పనాత్, నరపతి= మనుష్యులకుఁబ్రభు వైనదశరథునియొక్క, జల్పనాత్= అసంగతముగా మాటలాడుటవలన; సుమహాన్=మిక్కిలియధికమైన;మన్యుః=కోపము;ద్విజేంద్రం= బ్రాహ్మణ శ్రేష్ఠుఁడైన; కుశికసుతం= విశ్వామిత్రుని; వివేశ=పొందెను.మఖే=యాగమందు; సుహుతః=చక్కగా వేల్వఁబడినదియును;ఆజ్యసిక్తః, ఆజ్య=నేతిచే, సిక్తః=తడపఁబడినదియునగు; అగ్నిరివ=అగ్నిహోత్రమువలె;మహర్షివహ్నిః= నిప్పువంటివిశ్వామిత్రమహర్షి,ఉజ్జ్వలితః=చక్కగామండు చున్నవాఁడు; సమభవత్ =ఆయెను.

ఇట్లు,దశరథమహారాజు, అసంగతముగ మాటలాడఁగా,బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుండు మిక్కిలియుఁగోపమునొంది, యాగమునందు మొదటసమిధలచే వేల్వఁ



బడియంతటనాజ్యమునం దడపంబడిన యగ్నిహోత్రముంబోలెం, బ్రజ్వలించెను.
అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబు నందు, బాలకాండ వింశసర్గ టీక,
ముగిసినది.

౨౧

ఏ క విం శ స ర్గ ప్రా రం భః.

తచ్ఛ్రుత్వా వచనం తస్య స్నేహపర్యాకులాక్షరమ్
సమన్యుః కౌశికో వాక్యం ప్రత్యువాచ మహీపతిమ్. ౧

టీక॥ తస్య = ఆదశరథునియొక్క; స్నేహపర్యాకులాక్షరం, స్నేహ=చెలిమిచే, పర్యాకుల=కలంతవడిన, అక్షరం=అక్షరములుగల; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; కౌశికః=విశ్వామిత్రుండు; సమన్యుః=కోపముతోఁగూడినవాఁడై; మహీపతిం=భూమికిఁబ్రభువైన దశరథునిఁ గూర్చి; వాక్యం = వక్ష్యమాణమగుమాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

పుత్త్ర స్నేహంబునఁ దడఁబడుచు, దశరథమహారాజుచేఁ, జెప్పఁబడిన మాటనువిని, విశ్వామిత్రుఁడు, కోపించి, దశరథమహారాజుతో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పూర్వ మర్థం ప్రతిశ్రుత్య ప్రతిజ్ఞాం హాతు మిచ్ఛసి
రాఘవాణా మయుక్తోఽయం కులస్యాస్య విపర్యయః. ౨

టీక ॥ పూర్వం = మొదట; అర్థం=కోరఁబడినదాని; ప్రతిశ్రుత్య= అంగీకరించి; ప్రతిజ్ఞాం=ప్రతినను; హాతుం=విడుచుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు, అయం=ఈ; విపర్యయః=ప్రతిజ్ఞను భేదించుట; రాఘవాణాం=రఘువంశమునందుఁబుట్టినవారియొక్క; అస్య = ఈ; కులస్య=వంశమునకు; అయుక్తః=తగినదికాదు.

"నీవు కోరినదాని నిచ్చెదను" అని, మొదటనొప్పుకొని యాప్రతిజ్ఞనువిడువఁగోరెదవు; ఇట్లుప్రతిజ్ఞను విడుచుట, రఘువంశమునందుఁ బుట్టినవారి కులమునకుఁ దగినది కాదు. అని, తాత్పర్యము.

యదీదం తే క్షమం రాజన్ గమిష్యామి యథాగతమ్
మిథ్యాప్రతిజ్ఞః కాకుత్స్థ సుఖీ భవ సబాంధవః. ౩

టీక॥ రాజన్=దశరథమహారాజా! ఇదం=ఇది; తే=నీకు; క్షమం యది = తగినదైనట్టయిన; అహం= (అధ్యాహృతము) నేను; యథాగతం=వచ్చినట్లు; గమిష్యామి=పోయెదను, కాకుత్స్థ=కకుత్స్థవంశమునందుఁ బుట్టిన దశరథమహారాజా! త్వం(అధ్యాహృతము)=నీవు; మిథ్యాప్రతిజ్ఞః, మిథ్యా = దబ్బఱయైన; ప్రతిజ్ఞః=ప్రతినగలవాఁడవై; సబాంధవః= బంధువులతోఁగూడినవాఁడవై; సుఖీ=సుఖముగలవాఁడవుగా, భవ=అగుము.

ఇట్లు, మొదటనొప్పుకొని, వెనుకఁబ్రతిజ్ఞ తప్పుటనీకుఁ దగినదైనట్టైన, నేనువచ్చినట్లుపోయెదను; నీవుప్రతిజ్ఞతప్పి, బంధువులంగూడి, సుఖంబుండుము. అని, విశ్వామిత్రుఁడు దశరథునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య రోషపరీతస్య విశ్వామిత్రస్య ధీమతః

చచాల వసుధా కృత్స్నా వివేశచ భయం సురాన్. ४

టీక॥ధీమతః=ప్రశస్తమైన బుద్ధిగల; తస్య=ఆ; విశ్వామిత్రస్య=(సప్తమ్యర్థమందుషష్ఠి) విశ్వామిత్రుఁడు; రోషపరీతస్య, రోష=రోషముచే, పరీతస్య=వ్యాపింపఁబడినవాఁడగుచుండఁగా; కృత్స్నా=సమస్తమయిన; వసుధా=భూమి; చచాల = కదలినది. సురాంశ్చ=దేవతలను; భయం=వెఱపు; వివేశ=పొందినది.

బుద్ధిమంతుండగు నావిశ్వామిత్రుఁడు, రోషము నొందఁగానే, భూమియంతయువడంకినది; దేవతలుభయంబునొందిరి.

అని, తాత్పర్యము.

త్రస్తరూపం తు విజ్ఞాయ జగత్సర్వం మహానృషిః
నృపతిం సువ్రతో ధీరో వసిష్ఠో వాక్యమబ్రవీత్. ౫

టీక॥ మహాన్=పూజ్యుఁడైనవాఁడును; ఋషిః=ఋషియును; సువ్రతః=మంచివ్రతములుగలవాఁడును; ధీరః=ధైర్యముగలవాఁడునగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు; సర్వం=సమస్తమైన; జగత్=ప్రపంచమును; త్రస్తరూపం=మిక్కిలియుభయపడియున్నదానిఁగా; విజ్ఞాయ=ఎఱింగి; నృపతిం=రాజునుగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

పూజ్యుండునుమంచివ్రతంబులు చేసినవాఁడును ధైర్యశాలియునగు వసిష్ఠుండు, ప్రపంచము నంతయు సంత్రస్తంబుగా నెఱింగి, దశరథమహారాజుతో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇక్ష్వాకూణాం కులే జాత స్సాక్షాద్ధర్మ ఇవాపరః
ధృతిమాన్ సువ్రతః శ్రీమా న్నధర్మం హాతు మర్హసి. ౬




టీక॥ ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశంబునందుఁ బుట్టిన వారియొక్క-; కులే=వంశమునందు; జాతః=పుట్టినవాఁడవును; అపరః=రెండవదియైన; సాక్షాద్ధర్మ ఇవ (స్థితః)=సాక్షాద్ధర్మము అనునట్లున్నవాఁడవును; ధృతిమాన్=ధైర్యముగలవాఁడవును; సువ్రతః=మంచివ్రతములుగలవాఁడవును; శ్రీమాన్=సంపదగలవాఁడవునగు; త్వం (అధ్యాహృతము)=నీవు; ధర్మం=ధర్మమును; హాతుం=విడుచుటకు; నార్హసి=తగవు.

నీవు, పరమధార్మికమగునిక్ష్వాకువంశమునంబుట్టినవాఁడవు; రెండవదియగు సాక్షాద్ధర్మ మనందగియుండువాఁడవు; ధైర్యవంతుండవు; గొప్పవ్రతములు చేసినవాఁడవు; శ్రీమంతుండవు; అట్టినీకు, ధర్మము విడుచుటదగదు. అని, తాత్పర్యము.

త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మాత్మా ఇతి రాఘవ
స్వధర్మం ప్రతిపద్యస్వ నాధర్మం వోఢుమర్హసి. ౭

టీక॥ రాఘవ = రఘువంశమునందుఁబుట్టిన దశరథుఁడా! త్వం (అధ్యాహృతము) = నీవు; త్రిషు=మూఁడైన; లోకేషు=లోకంబులందును; ధర్మాత్మా=ధర్మస్వభావుఁడవు; ఇతి=అని; విఖ్యాతః=ప్రసిద్ధుఁడవైనవాఁడవు. స్వధర్మం= నీదైనధర్మమును; ప్రతిపద్యస్వ=పొందుము. అధర్మం=అధర్మమును; వోఢుం=వహించుటకు; నార్హసి=తగవు.

రఘువంశమునందుఁ బుట్టినదశరథుఁడా! నీవుమూఁడులోకంబులను, ధర్మాత్ముండని ఖ్యాతివహించినవాఁడవు; నీకులధర్మంబగు ప్రతిజ్ఞాపాలనము సేయుము; అధర్మంబున నుసరింపవలదు.

అని, తాత్పర్యము.

సంశ్రుత్యైవం కరిష్యామీ త్యకుర్వాణస్య రాఘవ
ఇష్టాపూర్తవధో భూయా త్తస్మా ద్రామం విసర్జయ. ౮




టీక॥ రాఘవ= రఘువంశమునఁబుట్టినవాఁడా! ఏవం=ఈప్రకారము; కరిష్యామి=చేసెదను; ఇతి= అని; సంశ్రుత్య=ప్రతిజ్ఞచేసి; అకుర్వాణస్య = చేయనివానియొక్క; ఇష్టాపూర్తవధః, ఇష్ట=యాగములకును; పూర్త=వాపీకూపతటాకాదినిర్మాణమునకును, వధః=వ్యర్థమగుట; భూయాత్ = అగును. తస్మాత్ =కాఁబట్టి; రామం=రామునిఁ; విసర్జయ=ఇమ్ము.

ఈప్రకారముచేసెదనని, మొదట నొప్పుకొని, యటువెనుకనొప్పుకొనినట్లుచేయని వాని యాగములును వాపీకూప తటాకాదినిర్మాణాదికర్మంబులును నిష్ఫలంబులగును; కావున, రామునివిశ్వామిత్రునకిమ్ము.

అని, తాత్పర్యము.

కృతాస్త్ర మకృతాస్త్రంవా నైనం శక్ష్యంతి రాక్షసాః
గుప్తం కుశికపుత్రేణ జ్వలనే నామృతం యథా. ౯

టీక॥ కృతాస్త్రం= నేర్పఁబడినయస్త్రములుగలవాఁడైనగాని; అకృతాస్త్రంవా = నేర్పఁబడినయస్త్రములుగలవాఁడు కానివాఁడైనగాని; కుశికపుత్రేణ=విశ్వామిత్రునిచేత; గుప్తం=రక్షింపఁబడిన; ఏనం=ఈరాముని; జ్వలనేన=అగ్నిహోత్రునిచేత; గుప్తం=(అధ్యాహృతము) రక్షింపఁబడిన; అమృతంయథా=అమృతమునువలె; రాక్షసాః=రాక్షసులు; నశక్ష్యంతి = సాధింపలేరు.

ఈరాముఁడు, అస్త్రంబులయందుసమర్థుఁడుకాని యసమర్థుఁడుకాని, విశ్వామిత్రునిచే రక్షింపఁబడియుండఁగా, నితని, నగ్నిహోత్రునిచేరక్షింపఁబడిన యమృతమునుంబోలె, రాక్షసులెంతమాత్రముసాధింపలేరు.

అని, తాత్పర్యము.

ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః
ఏష బుధ్యాఽధికో లోకే తపసశ్చ పరాయణమ్. ౧౦

ఏషోఽస్త్రాన్ వివిధాన్ వేత్తి త్రైలోక్యే సచరాచరే
నైన మన్యః పుమాన్ వేత్తి నచ వేత్స్యంతి కేచన. ౧౧
నదేవా నర్షయః కేచి న్నాసురా నచ రాక్షసాః
గంధర్వయక్షప్రవరా స్సకిన్నరమహోరగాః. ౧౨

అవతారిక. — విశ్వామిత్రుని చేరక్షింపఁబడినరాముని రాక్షసులు సాధింపలేరనుటనుస్థిరీకరించుటకై, విశ్వామిత్రప్రభావమును జెప్పుచున్నాఁడు.

టీక ॥ ఏషః=ఈవిశ్వామిత్రుండు; విగ్రహవాన్=ఆకారముగల; ధర్మః=ధర్మము ఏషః= ఈవిశ్వామిత్రుఁడు; వీర్యవతాం=పరాక్రమముగలవారిలోపల; వరః=శ్రేష్ఠుఁడు. ఏషః= ఈవిశ్వామిత్రుఁడు; లోకే=జగత్తునందు; బుద్ధ్యా=బుద్ధిచేతను; అధికః= ఎక్కుడైనవాఁడు. సచరాచరే= జంగమస్థావరములతోఁగూడిన; త్రైలోక్యే=మూఁడు లోకంబులందును; వివిధాన్=నానావిధములైన; అస్త్రాన్=అస్త్రములను; వేత్తి= ఎఱుంగును. అన్యః=ఇతరుఁడైన; పుమాన్=పురుషుఁడు; ఏనం=ఈవిశ్వామిత్రుఁడు నేర్చినయస్త్రసమూహమును; న వేత్తి=ఎఱుంగఁడు. కేచనచ=కొందఱైనను; నవేత్స్యంతి=ఎఱుంగఁబోరు. దేవాః=దేవతలును; న(వేత్స్యంతి)= ఎఱుంగరు. కేచిత్ = కొందఱైనను; ఋషయః= ఋషులు; న(వేత్స్యంతి)=ఎఱుంగరు; అసురాః=అసురులు; న(వేత్స్యంతి)= ఎఱుంగరు. రాక్షసాశ్చ=రాక్షసులును; న(వేత్స్యంతి)=ఎఱుంగరు. సకిన్నరమహోరగాః= కిన్నరులతోను మహాసర్పములతోనుంగూడిన; గంధర్వయక్షప్రవరాః, గంధర్వ= గంధర్వులలోను, యక్ష=యక్షులలోను, ప్రవరాః= శ్రేష్ఠులు। నవేత్స్యంతి(అధ్యాహృతము) = ఎఱుంగరు.

ఈవిశ్వామిత్రుఁడు, ఆకారమునొందిన ధర్మము, ఇతండుపరాక్రమముగలవారిలోమేటి, లోకంబున నందఱికన్నను బుద్ధిశాలి, మహాతపస్వి, జంగమ స్థావర సహితంబగు

త్రైలోక్యంబునం గల అస్త్రంబుల నన్నింటి నెఱుంగును, ఇతఁడెఱింగి నన్ని యస్త్రంబుల మఱి యెవ్వరిప్పటి కెఱుంగరు, ఇఁకమీఁద నెఱుంగఁబోరు, దేవతలకును ఋషులకును అసురులకును రాక్షసులకును గంధర్వులకును యక్షులకును కిన్నరులకును మహోరగులకును, ఎవ్వరికిని, ఇన్ని యస్త్రంబులు దెలియవు.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—అ॥ ఈరామున కురక్షకబలమున్నదని చెప్పఁబడినది; స్వబలంబును హెచ్చుగాఁగలదని చెప్పుచున్నాఁడు.

ఇందు, "ఏషః" అను దానికి, అంతటను, "రాముఁడు" అనియర్థము చూచుకొనునది. ఏనం=ఈరాముని; అన్యః=ఇతరుఁడైన; పుమాన్=పురుషుఁడు; నవేత్తి=ఎఱుంగఁడు. ఇది, విశేషము.

ఈరాముఁడు, ఆకారమునొంది నధర్మము, పరాక్రమము గలవారిలో మేటి; లోకంబుననందఱికన్నను బుద్ధిమంతుఁడు, జంగమస్థావర సహితంబగు త్రైలోక్యంబు నందలి యస్త్రంబులనన్నింటి నెఱుంగును; ఇతనిస్వరూప మితనికే దక్క మఱియొకని కెవ్వరికిని దెలియదు; ఇంకను, మఱియెవ్వరు నెఱుంగఁబోరు; దేవతలకును, ఋషులకును, అసురులకును, రాక్షసులకును, గంధర్వులకును, యక్షులకును కిన్నరులకును, మహోరగులకును, ఎవ్వరికిని, ఇతని స్వరూపము తెలియదు.

అని, తాత్పర్యము.

> సర్వాస్త్రాణి భృశాశ్వస్య పుత్రాః పరమ ధార్మికాః
> కౌశికాయ పురా దత్తా యదా రాజ్యం ప్రశాసతి. ౧౩

టీక॥ పరమధార్మికాః= మిక్కిలియు ధర్మిష్ఠులును; సర్వాస్త్రాణి=సమస్తములైన యస్త్రములునగు; భృశాశ్వస్య=భృశాశ్వుని యొక్క; పుత్రాః= కొడుకులు; కౌశికాయ = విశ్వామిత్రునికొఱకు; పురా=మునుపు; యదా=ఎప్పుడు, రాజ్యం=రాజ్యమును; ప్రశాసతి=(భూతార్థమందులట్) పాలింపుచుండెనో; తదా=(అధ్యా

హృతము)అపుడు; దత్తాః=(శివుని చేత) ఇవ్వఁబడినవి.

పూర్వము రాజ్యముఁ బాలింపు చుండునపుడు, ఈవిశ్వామిత్రునకు, భృశాశ్వునకుఁ బుట్టినపరమధార్మికంబులగునస్త్రంబులన్నియు, నీశ్వరుఁడిచ్చెను. అని, తాత్పర్యము.

తేపి పుత్రా భృశాశ్వస్య ప్రజాపతి సుతాసుతాః
నైకరూపా మహావీర్యా దీప్తిమంతో జయావహాః. ౧౪

టీక॥ తే=ఆ; భృశాశ్వస్య=భృశాశ్వునియొక్క; పుత్రాఅపి=కొడుకులును; ప్రజాపతి సుతాసుతాః, ప్రజాపతిసుతా=దక్షప్రజాపతికొమార్తెలకు, సుతాః=కొడుకులుగాను; నైకరూపాః, నైక=అనేకములైన, రూపాః=రూపులు గలవారుగాను; మహావీర్యాః=అధికమైన పరాక్రమము గలవారుగాను; దీప్తిమంతః=కాంతిగలవారుగాను; జయావహాః=జయమునుగల్గించువారుగాను; భవంతి(అధ్యాహృతము)= అగుచున్నారు.

ఆ భృశాశ్వునికొడుకులు, దక్షప్రజాపతి కొమార్తెలకుఁ బుట్టినవారు; నానావిధంబులగురూపంబులుగల్గి, మిక్కిలియుఁబరాక్రమవంతులై, ప్రకాశింపుచు, జయము గల్గించుచుందురు.

అని, తాత్పర్యము.

జయాచ సుప్రభాచైవ దక్షకన్యే సుమధ్యమే
తే సువాతేఽస్త్ర శస్త్రాణి శతం పరమభాస్వరమ్. ౧౫

టీక ॥ జయాచ=జయయును; సుప్రభాచైవ=సుప్రభయును, అనెడు, సుమధ్యమే = మంచినడుముగలు; తే=ఆ; దక్షకన్యే=దక్షప్రజాపతికొమార్తెలు; పరమభాస్వరం=మిక్కిలి ప్రకాశించునట్టి; అస్త్రశస్త్రాణి= (విశేషణపూర్వపదకర్మధారయము) ఛేదించునట్టి యస్త్రములు; శతం=నూటిని; సువాతే=(భూతార్థమందులట్) కనిరి.

సౌందర్యవతులగు జయ సుప్రభయనెడి దక్షకన్య లిర్వురును, మిక్కిలియుం బ్రకాశించుచు శత్రువగణంబులఛేదించునట్టియస్త్రంబుల

సూటిని గనిరి. అని, తాత్పర్యము.

పంచాశతం సుతాన్ లేభే జయానామ పరాన్ పురా
వధాయా సురసైన్యానా మమేయాన్ కామరూపిణః. ౧౬

టీక॥ పురా=మునుపు; జయానామ = జయయనునది; అసురసైన్యానాం = రాక్షసుల సైన్యముల యొక్క; వధాయ = వధముకొఱకు; పరాన్ =. అధికులును; అమేయాన్=కొలతపెట్టరానివారును; కామరూపిణః= ఇచ్ఛాధీనమగురూపముగలవారునగు; సుతాన్=కొడుకులను; పంచాశతం=ఏబదిమందిని; లేభే=పొందెను.

పూర్వము, జయయనునది, రాక్షససైన్యంబులంజంపుటకై, యధికులై, కొలతలేనిప్రభావమును, ఇచ్ఛాధీనమగు రూపంబునుంగల్గి వెలుంగుచుండు నేబదికొడుకులంబొందెను. అని, తాత్పర్యము.

సుప్రభాఽజనయచ్చాపి పుత్రాన్ పంచాశతం పునః
సంహారాన్నామ దుర్ధర్షాన్ దురాక్రామాన్ బలీయసః. ౧౭

టీక॥ సుప్రభాచాపి = సుప్రభయును; పునః=ఇంకను; సంహారాన్ నామ=చంపువారుఅనెడు పేరుగలవారును; దుర్ధర్షాన్=ఎదిరింపనలవి గాని వారును; దురాక్రామాన్= ఆక్రమింపనలవిగానివారును; బలీయసః=మిక్కిలిబలముగలవారునగు; పుత్రాన్=కొడుకలను; పంచాశతం=ఏబదిమందిని; అజనయత్=పుట్టించెను.

సుప్రభయనునదియును, జంపువారనెడుపేరువహించి దుర్ధర్షులై యమోఘులై మిక్కిలియు బలముగల్గియుండు నేబదికొడుకులంబుట్టించెను. అని, తాత్పర్యము.

తాని చాస్త్రాణి వేత్త్యేష యథావ త్కుశికాత్మజః
అపూర్వాణాంచ జననే శక్తో భూయ స్సధర్మవిత్. ౧౮

టీక॥ ఏషః = ఈకుశికాత్మజః=విశ్వామిత్రుఁడు; తాని=ఆ; అస్త్రాణిచ = అస్త్రములను; యథావత్=చక్కఁగా; వేత్తి = ఎఱుంగును; ధర్మవిత్=ధర్మంబుల నెఱింగిన, సః=అవిశ్వామిత్రుఁడు; భూయః= ఇంకను; అపూర్వాణాంచ=క్రొత్తయస్త్రంబులయొక్కయు; జననే= పుట్టించుటయందు, శక్తః=సమర్థుఁడు.

ఈవిశ్వామిత్రుం డాయస్త్రంబులనన్నింటినిం జక్కఁగానెఱుంగును; మఱియుసకలధర్మంబుల నెఱింగినయీవిశ్వామిత్రుఁడు, క్రొత్తక్రొత్తయస్త్రంబులనుం బుట్టింపఁగలఁడు. అని, తాత్పర్యము.

ఏవం వీర్యో మహాతేజా విశ్వామిత్రో మహాయశాః
న రామగమనే రాజన్ సంశయం కర్తు మర్హసి. ౧౯

టీక॥ విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; ఏవంవీర్యః=ఇట్టిపరాక్రమముగలవాఁడుగాను; మహాతేజాః= అధికమైనప్రభావముగలవాఁడుగాను; మహాయశాః=అధికమైనకీర్తిగలవాఁడుగాను; భవతి(అధ్యాహృతము)=అగుచున్నాఁడు. రాజన్= రాజా! రామగమనే=రాముని యొక్కపోవుటయందు; సంశయం=సందేహమును; కర్తుం= చేయుటకు; నార్హసి=తగవు.

విశ్వామిత్రుఁడు, ఇట్టిపరాక్రమముగలవాఁడు; మిక్కిలియుఁబ్రభావము గలవాఁడు; చాలఁగీర్తిగలవాఁడు; కావున, దశరథమహారాజా! "రాముఁడు, విశ్వామిత్రునితోఁబోయినట్టయిన, నేమిసంభవించునో" అనియెంతమాత్రమును సందేహింపవలదు.

అని, తాత్పర్యము.

తేషాం నిగ్రహణే శక్త స్స్వయంచ కుశికాత్మజః
తవ పుత్ర హితార్థాయ త్వాముపేత్యాభియాచతే. ౨౦

టీక॥కుశికాత్మజః=విశ్వామిత్రుఁడు; స్వయంచ=తానును; తేషాం=




ఆరాక్షసులయొక్క; నిగ్రహణే=నిగ్రహించుటయందు; శక్తః=సమర్థుఁడు. తవ=నీయొక్క; పుత్రహితార్థాయ, పుత్ర=కొడుకులయొక్క, హిత=మేలనెడు, అర్థాయ=ప్రయోజనముకొఱకు; త్వాం=నిన్ను; ఉపేత్య=పొంది; అభియాచతే=యాచించుచున్నాఁడు.

విశ్వామిత్రుఁడు, తానునారాక్షసులంజంపసమర్థుఁడే; అయినను, నీకొడుకులకు మేలు గలుగుటకై, నిన్నుయాచించుచున్నాఁడు. అనివసిష్ఠుఁడు దశరథునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి మునివచనాత్ప్రసన్నచిత్తో
రఘువృషభస్తు ముమోద భాస్వరాంగః
గమన మభిరురోచ రాఘవస్య
ప్రథితయశాః కుశికాత్మజాయ బుధ్యా. ౨౧

టీక॥ రఘువృషభస్తు=రఘువంశమునందుఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడైనదశరథమహారాజును; ఇతి=ఇప్పుడుచెప్పఁబడిన; మునివచనాత్=వసిష్ఠ మహాముని మాటవలన; ప్రసన్నచిత్తః = నిర్మలమైనమనస్సుగలవాఁడై; భాస్వరాంగః=ప్రకాశించుచున్న యవయవములు గలవాఁడై; ముమోద=సంతసించెను. ప్రథితయశాః= విస్తరిల్లినకీర్తిగలదశరథుఁడు; బుధ్యా=తనబుద్ధిచేతను; కుశికాత్మజాయ=విశ్వామిత్రునికొఱకు; రాఘవస్య = రఘువంశమునందుఁబుట్టిన రామునియొక్క; గమనం=పోవుటను; అభిరురోచ=అంగీకరించెను.

రఘువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుండగు దశరథుఁడు, వసిష్ఠుని మాటవిని, ప్రసన్న హృదయుఁడై యవయవంబు లుప్పొంగ, సంతసించెను; అంత, మహాకీర్తియగునాదశరథుఁడు, విశ్వామిత్రార్థమై రామగమనమునంగీకరించెను.

అని, తాత్పర్యము.




ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండైకవింశసర్గటీక,
ముగిసినది.

---

## ద్వావింశసర్గప్రారంభః.

తథా వసిష్ఠే బ్రువతి రాజా దశరథ స్స్వయమ్
ప్రహృష్ట వదనో రామ మాజుహావ సలక్ష్మణమ్. ౧

టీక॥ వసిష్ఠే=వసిష్ఠమహర్షి; తథా=అట్లు; బ్రువతి=చెప్పఁగా; రాజా=రాజైన; దశరథః=దశరథుఁడు; ప్రహృష్టవదనః=సంతసించినముఖముగలవాఁడై; స్వయం=తాను; సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడిన; రామం=రాముని; ఆజుహావ=పిలిచెను.

వసిష్ఠుం డాప్రకారము చెప్పఁగానే, దశరథమహారాజు, సంతసించి, తానే, రాముని, లక్ష్మణునితోఁగూడరమ్మని, పిలిచెను.

అని, తాత్పర్యము.



కృతస్వస్త్యయనం మాత్రా పిత్రా దశరథేనచ
పురోధసా వసిష్ఠేన మంగళై రభిమంత్రితమ్. ౨
సపుత్రం మూర్ధ్న్యుపాఘ్రాయ రాజా దశరథః ప్రియమ్
దదౌ కుశిక పుత్రాయ సుప్రీతేనాంతరాత్మనా. ౩

టీక॥ రాజా=రాజైన; సః=ఆ; దశరథః = దశరథుఁడు; మాత్రా=తల్లిచేతను; పిత్రా=తండ్రియైన; దశరథేనచ=దశరథునిచేతను; కృతస్వస్త్యయనం, కృత=చేయఁబడిన, స్వస్త్యయనం=మంగళాచరణముగలవాఁడును; పురోధసా= పురోహితుఁడగు; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; మంగళైః=మంగళముల నిచ్చు మంత్రములచేత; అభిమంత్రితం = అభిమంత్రింపఁ బడిన వాఁడును; ప్రియం= సంతోషము గల్గించు వాఁడునగు; పుత్రం=కొడుకును; మూర్ధ్ని= శిరస్సునందు; ఉపాఘ్రాయ=వాసనచూచి; సుప్రీతేన=మిక్కిలిసంతసించిన; అంతరాత్మనా=మనస్సుతో; కుశికపుత్రాయ=విశ్వామిత్రునికొఱకు; దదౌ=ఇచ్చెను.

ఆదశరథమహారాజు, తానుం గౌసల్యయు రామునకుమంగళంబుగావించి, పురోహితుండైన వసిష్ఠునిచేమంగళప్రదంబులగుమంత్రింబులచేనభి మంత్రింపఁ బడిన ప్రియకుమారుండగునారాముని, శిరంబున మూర్కొని, పరమసంతుష్టం బగు హృదయంబున, విశ్వామిత్రునకిచ్చెను. అని, తాత్పర్యము.

తతో వాయు స్సుఖస్పర్శో నీరజస్కో వవౌ తదా
విశ్వామిత్రగతం దృష్ట్వా రామం రాజీవలోచనమ్. ౪

టీక॥ తతః=ఆపిమ్మట; విశ్వామిత్రగతం=విశ్వామిత్రునిఁబొందిన; రాజీవలోచనం=కమలములవంటికండ్లుగల; రామం=రాముని; దృష్ట్వా=చూచి; తదా=అప్పుడు; వాయుః=గాలి; సుఖస్పర్శః= సౌఖ్య

ముగలతొడుగుగలది గాను; నీరజస్కః=దుమ్ము లేనిది గాను; వవౌ=వీచెను.

అంత, విశ్వామిత్రునింబొంది నకమలలోచనుండగు రాముని జూచి, గాలి, దుమ్ము లేక, సుఖముగా వీచెను.

అని, తాత్పర్యము.

పుష్పవృష్టి ర్మహా త్యాసీ ద్దేవదుందుభినిస్వనైః
శంఖదుందుభినిర్ఘోషః ప్రయాతే తు మహాత్మని. ౫

టీక ॥ మహాత్మని=అధికమైన ధైర్యముగల రాముడు; ప్రయాతే తు= విశ్వామిత్రునితోఁగూడఁబోయి నంతనే; దేవదుందుభినిస్వనైః, దేవ=దేవతలయొక్క, దుందుభి=భేరులయొక్క, నిస్వనైః=(సహ) ధ్వనులతోఁగూడి; మహత్=గొప్పదైన; పుష్పవృష్టిః=పూలవానయును; శంఖ దుందుభి నిర్ఘోషః=శంఖములయొక్కయు భేరులయొక్కయుధ్వనియును; ఆసీత్=కలిగినది.

మహాత్ముండగు రాముఁడు విశ్వామిత్రునితోఁగూడం బోయినంతనే, గొప్పపుష్పవృష్టి గల్గినది; దేవతలు దుందుభులమ్రోయించిరి; దశరధుండునుశంఖంబులభేరులనుధ్వనింపఁజేసెను. అని, తాత్పర్యము.

విశ్వామిత్రో యయా వగ్రే తతో రామో ధనుర్ధరః
కాకపక్షధరో ధన్వీ తంచ సౌమిత్రి రన్వగాత్. ౬

టీక॥అగ్రే= ముందట; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; యయౌ=పోయెను. తతః=ఆవెనుక; ధనుర్ధరః=ధనుస్సునుధరించిన; రామః=రాముఁడు; యయౌ=(అధ్యాహృతము)=వెళ్లెను. తంచ=ఆరామునిఁ; కాకపక్షధరః= పిల్లజుట్టుధరించినవాఁడును; ధన్వీ=ధనుస్సుగలవాఁడగు; సౌమిత్రిః=లక్ష్మణుఁడు; అన్వగాత్=వెంబడించెను.

ముందటవిశ్వామిత్రుండునడచెను; అతని, ధనుర్ధరుండైన రాముండువెంబడించెను; కాకపక్షధరుండగులక్ష్మణుండు, విల్లుచేతం బూని

రాముని వెంబటించెను. అని, తాత్పర్యము.

కలాపినౌ ధనుష్పాణీ శోభయానౌ దిశో దశ
విశ్వామిత్రం మహాత్మానం త్రిశీర్షా వివ పన్నగౌ. ౭
అనుజగ్మతు రక్షుద్రౌ పితామహ మివాశ్వినౌ

టీక॥ కలాపినౌ=అమ్ములపొదులుగలవారును("కలాపోభూషణేబర్హేతూణీరేసంహతావపి"అనియమరము)గనుకనే; త్రిశీర్షౌ=మూడుతలలుగల;పన్నగావివ(స్థితౌ)=సర్పములువలెనున్నవారును; ధనుష్పాణీ = ధనుస్సుచేతంగలవారును;దిశః=దిక్కులను;దశ=పదింటిని; శోభయానౌ= ప్రకాశింపఁజేయువారును; అక్షుద్రౌ= కుటిలులుగానివారునగు;తౌ(అధ్యాహృతము)=ఆరామలక్ష్మణులు; అశ్వినౌ=అశ్వినీదేవతలు; పితామహమివ = బ్రహ్మదేవునివలె;మహాత్మానం=పూజ్యమైన స్వభావముగల; విశ్వామిత్రం = విశ్వామిత్రుని; అనుజగ్మతుః=వెంబడించిపోయిరి.

ఆ రామలక్ష్మణులు, ప్రత్యేకముగా రెండేసియమ్ముల పొదుల ధరించియుండుటంబట్టి, మూఁడుతలలసర్పంబులుంబోలె వెలుంగుచు, ధనుష్పాణులై, దశదిక్కులంబ్రకాశింపఁజేయుచు, కుటిలులుగాక,మహాత్ముండగువిశ్వామిత్రుని, నశ్వినీదేవతలు బ్రహ్మదేవునట్లు, వెంబడించిరి. అని, తాత్పర్యము.

తదా కుశికపుత్రంతు ధనుష్పాణీ స్వలంకృతౌ. ౮
బద్ధగోధాంగుళిత్రాణౌ ఖడ్గవంతౌ మహాద్యుతీ
కుమారౌ చారువపుషౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౯
అనుయాతౌ శ్రియాదీప్తా శోభయేతా మనిందితౌ
స్థాణుం దేవ మివాచింత్యం కుమారావివ పావకీ. ౧౦

టీక॥ తదా=అప్పుడు;ధనుష్పాణీ = ధనుస్సుచేతంగలవారును; స్వ

లంకృతౌ=చక్కఁగానలంకరింపఁబడినవారును; బద్ధగోధాంగుళిత్రాణౌ,బద్ధ=కట్టఁబడిన,గోధా=ఉడుముతోలుతోఁజేయఁబడినహస్తకవచమును,అంగుళిత్రాణౌ=వ్రేళ్లకవచమునుగలవారును;ఖడ్గవంతౌ=కత్తిగలవారును; మహాద్యుతీ= అధికమైన కాంతి గలవారును; కుమారౌ = పిల్లవాండ్రును; చారువపుషౌ= సుందరమైనదేహముగలవారును; భ్రాతరౌ=తోడంబుట్టువులును;శ్రియా=కాంతిచేత; దీప్తౌ=ప్రకాశించు చున్నవారును ; అనిందితౌ=నిందింపఁబడనివారును; కుశికపుత్రం=విశ్వామిత్రుని, అనుయాతౌ= వెంబడించియున్నవారునగు; రామలక్ష్మణౌతు= రామలక్ష్మణులు;దేవం= సృష్టిస్థితిసంహారములచేఁ, గ్రీడించు వాఁడును ; అచింత్యం=చింతింపనలవిగాని వాఁడునగు;స్థాణుం=శివుని;అనుయాతౌ(అధ్యాహృతము)=వెంబడించిన; పావకీ= అగ్నియందుఁబుట్టిన; కుమారౌవివ=స్కందవిశాఖులువలె; శోభయేతాం =(ఉజర్థమందులోట్) ప్రకాశించిరి.

అప్పుడు,మనోహరంబుగు దేహముగలిగి, కాంతిచేఁబ్రకాశింపుచు, ధనుష్పాణులై, యుడుము తోలుతోఁజేసిన హస్తకవచంబునంగుళికవచంబునుందొడిగి, ఖడ్గధరులై,చక్కఁగా నలంకరింపఁబడి, విశ్వామిత్రునివెంబడింపుచున్న, సహోదరులును బాలురును నిందింపఁదగనివారునగు రామలక్ష్మణులు, అచింత్యుండగు నీశ్వరునివెంబడించునగ్నిహోత్రోద్భవులగు స్కందవిశాఖులుంబోలెఁబ్రకాశించిరి.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—"తతోఽభవచ్చతుర్మూర్తిః క్షణేనభగవాన్ప్రభుః, స్కందోవిశాఖశ్శాకశ్చనైగమేషశ్చపృష్ఠతః."(అంత, భగవంతుండునుబ్రభువునగు కుమారస్వామి,"స్కందుఁడు,విశాఖుఁడు శాకుఁడు,నైగమేషుఁడు"అనినాలుగురూపములుగలవాఁడయ్యె)అని,భారతమందుఁ,గుమారస్వామి, నాలుగురూపములు ధరించినట్లు చెప్పఁబడియున్నది. ఇందు,స్కందవిశాఖు

లిద్వారు, ఉపమానముగా గ్రహింపఁబడిరి.

అధ్యర్ధ యోజనం గత్వా సరయ్వా దక్షిణే తటే
రామేతి మధురాం వాణీం విశ్వామిత్రోఽభ్యభాషత. ౧౧

టీక॥ అధ్యర్ధయోజనం, అధ్యర్ధ=సగముఅధికముగాఁగల, యోజనం=ఆమడను; గత్వా=పొంది; సరయ్వాః=సరయూనదియొక్క; దక్షిణే = దక్షిణపుదిక్కునందలి; తటే=గట్టునందు విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; రామ = రాముఁడా! ఇతి=అని; మధురాం=మనోహరమైన; వాణీం=మాటను; అభ్యభాషత=పలికెను.

ఒకటిన్నఱ యామడ దూరము పోయి, సరయూనదిదక్షిణతీరమందు, విశ్వామిత్రుఁడు, "రాముఁడా!"అనిమధురముగాఁబిలిచెను.

అని, తాత్పర్యము.

గృహాణ వత్స సలిలం మాభూ త్కాలస్య పర్యయః
మంత్రగ్రామం గృహాణ త్వం బలా మతిబలాం తథా. ౧౨

టీక॥ వత్స=బిడ్డా! సలిలం=జలమును; గృహాణ=తీసికొనుము. కాలస్య=కాలమునకు; పర్యయః=కడచిపోవుట; మాభూత్ = కారాదు. త్వం=నీవు; మంత్రగ్రామం= మంత్ర=మంత్రములయొక్క, గ్రామం=సమష్టిరూపమైన; బలాం=బలయనెడువిద్యను; తథా=అట్లు; అతిబలాం= అతిబలయనెడువిద్యను; గృహాణ= తెలిసికొనుము.

బిడ్డా! జలముతీసికొనుము; కాలాతిక్రమముకారాదు; సమస్తమంత్ర సమూహస్వరూపములైన, బల, అతిబల, యనెడువిద్యలం దెలిసికొనుము. అని, తాత్పర్యము.

నశ్రమో నజ్వరోవా తే నరూపస్య విపర్యయః
నచసుప్తం ప్రమత్తంవా ధర్షయిష్యంతి నైరృతాః. ౧౩

టీక॥ తే=నీకు; శ్రమః=అలసట; న (భవిష్యతి)=కలుగదు. జ్వరోవా=దప్పియైనను; న (భవిష్యతి)= కలుగదు. రూపస్య=రూపముయొక్క; విపర్యయః= మాఱుపాటు; న(భవిష్యతి)=కలుగదు. సుప్తం=నిద్రపోయిన వానిఁగాని; ప్రమత్తం వా = మఱపు నొందినవానిఁగాని; త్వాం(అధ్యాహృతము)=నిన్ను; నైరృతాః=రాక్షసులు; నధర్షయిష్యంతి=ఎదిరింపలేరు.

ఈవిద్యల నెఱింగినట్టయిన, నీకు, అలసట గాని దప్పి గాని మాఱురూపు గాని కలుగదు; నీవు నిద్రపోవుచుండినను మఱపుదగిలియుండినను నిన్ను రాక్షసు లెదిరింపలేరు. అని తాత్పర్యము

నబాహ్వో స్సదృశో వీర్యే పృథివ్యా మస్తి కశ్చన
త్రిషు లోకేషు వై రామ నభవే త్సదృశ స్తవ. ౧౪

టీక॥ రామ=రాముఁడా! బాహ్వోః=చేతులయొక్క; వీర్యే=బలమునందు; సదృశః=సమానుఁడు; కశ్చన=ఒకానొకఁడైనను; పృథివ్యాం=భూమియందు; నాస్తి=(భవిష్యదర్థమందులట్) ఉండఁడు. త్రిషు=మూఁడైన; లోకేషు=లోకములయందును ("వై" అనునది పాదపూరణార్థము) తవ=నీకు; సదృశః= సమానుఁడు; నభవేత్=లేకపోవును.

ఈవిద్యలనీవుజపించుచున్న యెడల, భూమండలమందు బాహుబలంబుననీ కెవ్వండును సాటికాఁజాలఁడు; ముల్లోకంబులందును నీకు సమానుఁడెవ్వండునుండఁడు.

అని, తాత్పర్యము.

న సౌభాగ్యే న దాక్షిణ్యే న జ్ఞానే బుద్ధినిశ్చయే
నోత్తరే ప్రతివక్తవ్యే సమో లోకే తవానఘ. ౧౫

టీక॥ అనఘ=పాపములేని రాముఁడా! లోకే=ప్రపంచమందు; తవ=నీకు; సమః=సరియైనవాఁడు; సౌభాగ్యే=సౌందర్యమందు; న=

(భవిష్యతి) ఉండఁడు; దాక్షిణ్యే= సామర్థ్యమందు; న (భవిష్యతి)= ఉండఁడు. జ్ఞానే= తెలివియందు; న (భవిష్యతి)= ఉండఁడు. బుద్ధినిశ్చయే; బుద్ధి=బుద్ధిచేత, నిశ్చయే=నిశ్చయించుటయందు; నభవిష్యతి= (అధ్యాహృతము)ఉండఁడు, ప్రతివక్తవ్యే=బదులు చెప్పఁబడవలసిన; ఉత్తరే = ప్రత్యుత్తరమందు; న (భవిష్యతి)=ఉండఁడు.

పాపరహితుండవైన రామఁడా! నీవీవిద్యలజపించుచున్నట్టయిన, ప్రపంచమునందంతటను, సౌందర్యమందును, సామర్థ్యమందును, తెలివియందును, బుద్ధిచేఁ గార్యాకార్యంబుల నిశ్చయించుటయందును, ఉత్తర ప్రత్యుత్తరములయందును, నీకుసరియైనవాఁడుండఁడు.

అని, తాత్పర్యము.

ఏతద్విద్యా ద్వయే లబ్ధే భవితా నాస్తితే సమః
బలాత్వతి బలాచైవ సర్వజ్ఞానస్య మాతరౌ. ౧౬

టీక॥ఏతద్విద్యాద్వయే, ఏతత్= ఈ, విద్యా=విద్యలయొక్క, ద్వయే=జంట, లబ్ధే=పొందఁబడఁగా; తే= నీకు; సమః= సరియైనవాఁడు; నాస్తి=లేఁడు; న(అధ్యాహృతము)భవితా=(ఇంకమీఁద) కలుగఁడు. బలాతు=బలయనెడువిద్యయును; అతిబలాచైవ= అతిబలయనెడువిద్యయును; సర్వజ్ఞానస్య=సమస్తమైన జ్ఞానమునకును; మాతరౌ=తల్లులు.

ఈరెండువిద్యలంబొందినపిమ్మట, నీకుసరియైనవాఁ డిప్పటికుండఁడు; మఱియెప్పటికినుండఁబోఁడు; బల, అతిబల, అనువిద్యలు సమస్త జ్ఞానంబులనిచ్చునవి.

అని, తాత్పర్యము.

క్షుత్పిపాసే నతే రామ భవిష్యేతే నరోత్తమ
బలా మతి బలాంచైవ పఠతః పథి రాఘవ. ౧౭

టీక॥నరోత్తమ=మనుష్యులలో శ్రేష్ఠుఁడవైన; రాఘవ=రఘువంశమునందుఁబుట్టిన రాముఁడా! పధి=మార్గమునందు; బలాం=బలయనెడువిద్యను; అతిబలాంచైవ=అతిబలయనెడువిద్యను; పఠతః=జపించుచున్న; తే=నీకు; క్షుత్పిపాసే=ఆఁకలియును దప్పియును; నభవిష్యేతే=కలుగవు.

నరశ్రేష్ఠుండవైన రాముఁడా నీవు, మార్గమునందు బలాతిబలల నుజపించుచు నడిచినట్టయిన, నీకు, ఆఁకలియును దప్పియునుం గలుగదు.

అని, తాత్పర్యము.

విద్యాద్వయ మధీయానే యశశ్చాప్యతులం త్వయి

టీక॥విద్యాద్వయం = విద్యలయొక్క-జంటను; అధీయానే=జపించునట్టి; త్వయి=నీయందు; అతులం=సరిలేని; యశశ్చాపి= కీర్తియును; భవిష్యతి (అధ్యాహృతము)=కలుగును.

ఈ రెండువిద్యల జపించుచున్నట్టయిన, నీకుసరిలేనికీర్తియునుం గలుగును.

అని, తాత్పర్యము.

పితామహసుతే హ్యేతే విద్యే తేజస్సమన్వితే. ౧౮
ప్రదాతుం తవ కాకుత్స్థ సదృశ స్త్వం హి ధార్మిక

టీక॥ తేజస్సమన్వితే=ప్రభావముతోఁగూడినట్టి; ఏతే = ఈ; విద్యే = బలాతిబలలనెడువిద్యలు; పితామహసుతేహి = బ్రహ్మదేవుని కొమార్తెలుగదా ధార్మిక=ధర్మిష్ఠుఁడవైన; కాకుత్స్థ=కకుత్స్థవంశంబునంబుట్టిన రాముఁడా! ఏతే(అధ్యాహృతము)=ఈవిద్యలను; ప్రదాతుం=ఇచ్చుటకు; తవ=నీకు; సదృశః = సరియైనవాఁడవు; త్వం హి=నీవేకదా!

మహాప్రభావంబులగు నీవిద్యలు బ్రహ్మదేవునిచేస్సృజింపఁ బడినవి; ధార్మికుండవు కకుత్స్థవంశంబునం బుట్టినవాఁడవు నీవెయిట్టివిద్యలకుఁ బాత్రభూతుండవు; నీవుదక్క-నీవం

టివాఁడుమఱియెవ్వండును లేఁడు. అని, తాత్పర్యము.

కామం బహుగుణా స్సర్వే త్వయ్యేతే నాత్ర సంశయః. ౧౯
తపసా సంభృతే చైతే బహురూపే భవిష్యతః

టీక॥ ఏతే=ఈ, ఇప్పుడు చెప్పఁబడిన; బహుగుణాః=అనేకములైన సౌభాగ్యాదిగుణములు; సర్వే=అన్నియును; కామం = ఎచ్చుగా; త్వయి=నీయందు; సంతి(అధ్యాహృతము)= ఉన్నవి. అత్ర=ఈవిషయమందు; సంశయః = సందేహము; న=లేదు. తపసా= తపస్సుచేత; సంభృతే= పొందఁబడిన; ఏతేచ= ఈవిద్యలును; బహురూపే=అనేకములైనగుణములుగలవిగా; భవిష్యతః=కాఁగలవు.

ఇప్పుఁడు చెప్పఁబడిన సౌభాగ్యాది గుణములన్నియు నీయందు మెండుగానున్నవి; ఇందెంతమాత్రము సందేహము లేదు; ఈవిద్యలును, గొప్పతపస్సుచేసి సంపాదింపఁబడినవిగావున, బహుఫలంబుల నీయఁగలవు. అని, విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తతో రామో జలం స్పృష్ట్వా ప్రహృష్ట వదన శ్శుచిః. ౨౦
ప్రతిజగ్రాహ తే విద్యే మహర్షే ర్భావితాత్మనః

టీక॥ తతః=అపిమ్మట; రామః= రాముఁడు; జలం=జలమును; స్పృష్ట్వా = ఆచమించి; ప్రహృష్టవదనః=సంతసించినముఖముగలవాఁడై; శుచిః=పరిశుద్ధుఁడై; భావితాత్మనః, భావిత=ధ్యానింపఁబడిన, ఆత్మనః=పరమాత్మగల; మహర్షేః= విశ్వామిత్రమహర్షివలన; తే=ఆ; విద్యే= బలాతిబలలనెడువిద్యలను; ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

అంత, రాముం డాచమనంబుచేసి, సంతుష్టుఁడై, శుచియై యెల్లప్పుడుం బరమాత్మధ్యానము సేయుచుండునావిశ్వామిత్రమహామునివలన, నావిద్యల రెంటిని, బ్రతిగ్రహించెను. అని తాత్పర్యము.

విద్యాసముదితో రామ శ్శుశుభే భూరివిక్రమః. ౨౧
సహస్ర రశ్మిర్భగవాన్ శరదీవ దివాకరః
గురుకార్యాణి సర్వాణి నియుజ్య కుశికాత్మజే. ౨౨

టీక॥కుశికాత్మజే=విశ్వామిత్రునియందు; సర్వాణి=సమస్తములైన; గురుకార్యాణి=ఆచార్యునకుఁ జేయవలసిన కార్యములను; నియుజ్య=చేసి; విద్యాసముదితః=బలాతిబలల నెడువిద్యల చేత వృద్ధిఁబొందినట్టి; రామః=రాముఁడు; శరది=శరదృతువునందు; సహస్రరశ్మిః=వేయికిరణములు గలవాఁడును; భగవాన్=మాహాత్మ్యము గలవాఁడు నగు; దివాకరఇవ = సూర్యుఁడువలె; భూరివిక్రమః, భూరి=అతిశయించిన, విక్రమః=పరాక్రమముగలవాఁడై; శుశుభే=ప్రకాశించెను.

విశ్వామిత్రునకు, వందనాదిగురుకార్యంబులుచేసి, రాముఁడు, విద్యలచేవృద్ధిఁ బొందినవాఁడై, శరత్కాలమందు, భగవంతుండును వేయికిరణంబులు గలవాఁడునగు సూర్యుఁడుంబోలె, మహాపరాక్రమశాలియై ప్రకాశించెను.

అని, తాత్పర్యము.

ఊషు స్తాం రజనీం తత్ర సరయ్వాం సుసుఖం త్రయః

టీక॥ సరయ్వాం= సరయూనదియందు; తత్ర=ఆదక్షిణపుదిక్కునందలిగట్టునందు; త్రయః=మువ్వురును; తాం = ఆ; రజనీం=(అత్యంత సంయోగమందు ద్వితీయ) రాత్రియందు; సుసుఖం=చాలసుఖముగా; ఊషుః=వాసముచేసిరి.

ఆసరయూనది దక్షిణతీరమందు, రామలక్ష్మణవిశ్వామిత్రులు మువ్వురును, ఆరాత్రియంతయు, సుఖముగా నివసించిరి.

అని, తాత్పర్యము.

దశరథ నృపసూను సత్తమాభ్యామ్
తృణశయనే నుచితే సహోషితాభ్యామ్

కుశిక సుతవచోను లాలితాభ్యామ్
సుఖమివ సా విబభౌ విభావరీచ. ౨౩౬

టీక॥ అనుచితే =అనుసరించిప ఱుపఁబడినట్టి; తృణశయనే=కసవు పాన్పు నందు; సహోషి తాభ్యాం=కూడఁబరుండినవారును; కుశికసుతవచోనులాలితాభ్యాం, కుశికసుత = విశ్వామిత్రునియొక్క, వచః = మాటలచేత, అనులాలితాభ్యాం=బుజ్జగింపఁ బడినవారునగు; దశరథనృపసూనుసత్తమాభ్యాం,దశరథనృప= దశరథమహారాజుయొక్క,సూను = కొడుకులలో,సత్తమాభ్యాం=శ్రేష్ఠులైన రామలక్ష్మణులకు (షష్ఠ్యర్థమందుఁజతుర్థి); సా=ఆ;విభావరీచ=రాత్రియును; సుఖమివ=("ఇవ" అనునదివాక్యాలంకారార్థకము)సుఖముగా; విబభౌ=తోఁచినది.

దగ్గఱగాఁగసవుతోఁబాన్పులుపఱచికొని, కూడఁబరుండివిశ్వామిత్రునిమాటలచే బుజ్జగింపఁ బడుచున్నదశరథమహారాజుకొడుకులలో శ్రేష్ఠులగు రామలక్ష్మణులకు, ఆరాత్రియంతయు, సుఖముగానేయుండెను.అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ద్వావింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండద్వావింశసర్గ టీక,
ముగిసినది.

(౨౩)

త్రయోవింశసర్గప్రారంభః.

ప్రభాతాయాంతు శర్వర్యాం విశ్వామిత్రో మహామునిః
అభ్యభాషత కాకుత్థ్సౌ శయానౌ పర్ణసంస్తరే. ౧

టీక॥ శర్వర్యాం=రాత్రి; ప్రభాతాయాంతు= వేకువ కాగానే; మహామునిః=పూజ్యుఁడైన మునియగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; పర్ణసంస్తరే=ఆకులపాన్పునందు; శయానౌ=పరుండియున్న ; కాకుత్థ్సౌ=కకుత్థ్సవంశమునంబుట్టినరామలక్ష్మణులను గూర్చి; అభ్యభాషత=పలికెను.

వేకువ కాగానే, మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుఁడు, పర్ణశయనంబునందుఁ బవ్వళించియున్న, రామలక్ష్మణులంజూచి, యిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

కౌసల్యాసుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్. ౨

టీక ॥ కౌసల్యాసుప్రజాః=కౌసల్యయొక్క సత్సంతానమైన; రామ=రాముఁడా! పూర్వా=తూర్పుదిక్కునందుఁగల్గు; సంధ్యా= సంధ్యాకాలము; ప్రవర్తతే=ప్రవర్తించుచున్నది. నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవైనరాముఁడా! ఉత్తిష్ఠ=లెమ్ము; దైవం = దేవునిచే నేర్పఱుపఁబడిన; ఆహ్నికం=నిత్యకర్మము; కర్తవ్యం=చేయంబడవలయును.

కౌసల్యాదేవి సత్పుత్రుఁడవైన రాముఁడా! వేకువకావచ్చినది; పురుషశ్రేష్ఠుఁడా! లెమ్ము; ఈశ్వరచోదితమైననిత్యకర్మము సేయవలయు.

అని, తాత్పర్యము.

విశేషార్థములు. — మునివర్యుండగువిశ్వామిత్రుఁడు, రామలక్ష్మణుల మేలుకొల్పవచ్చి, రాముని యచింత్యరూపంబుచూచి విస్మితుండై చేయందగిన కార్యంబుమఱ

చి, యిట్టిరామునింగన్న కౌసల్యపుణ్యంబేమియనిమెచ్చియిట్లనిచెప్పుచున్నాఁడు.—రామ=సర్వోత్తరంబగుసౌందర్యము గలవాఁడా! కౌసల్యా= సర్వేశ్వరుండగునిన్నుఁగన్న కౌసల్యాదేవి; సుప్రజాః=సర్వేశ్వరుండగునీవుకొడుకుగాఁబుట్టినందున,మంచికొడుకుగలది. లేక; మాతృశుశ్రూషలంజక్కఁగాఁ జేయుచుండునీచేతఁగౌసల్య సుపుత్రవతియైనది. లేక; రాముని యమేయస్వరూపంబుచూచిమనంబులోనిట్లనివిశ్వామిత్రుఁడు, వితర్కించు చున్నాఁడు.— కౌసల్యా=ఇట్టిరామునింగన్న కౌసల్యాదేవి; సుప్రజాః=మంచిసంతానముగలది. (ఈయర్థమందు,"రామ" అనునదిపైనిఅన్వయించుచున్నది). రాముఁడుకొడుకుగాఁ బుట్టినందున, మంచి కొడుకుగలిగియుండుట,కౌసల్యకునుదశరథునకునుసమానమైయున్నను, "పితుశ్శతగుణంమాతా" (తండ్రికన్ననూఱంతలుతల్లి) యనియుండుటం బట్టి, కౌసల్యాదేవిమాత్రము, మంచికొడుకుగలదిగా,నిచ్చట, నుదాహరింపఁబడినది. లేక; కౌసల్యా దశరథులకుఁజాలనంతరమున్నది; విశ్వామిత్రుఁడు, "అహంవేద్మి మహాత్మానం" అనునదిమొదలుగా ననేక సమాధానములుచెప్పినను. దశరథుఁడు,రామునివిశ్వామిత్రునకొసంగుటకుసందేహించెను; కౌసల్యస్త్రీజాతియైనను, తల్లికావున,దశరథునికన్ననునుమడిగా రామునందు వాత్సల్యంబుగలదైనను, ఎంతమాత్రముసందేహింపలేదు; అనునభిప్రాయంబున, కౌసల్యయనియుదాహరింపఁబడినది. రామ=రాముఁడా! పూర్వాసంధ్యాప్రవర్తతే= తూర్పుదిక్కునందుఁ గల్గు సంధ్యప్రవర్తించుచున్నది, నీవు, కౌసల్యకుం బోలె, దీనికినుపచారముసేయ వలయు; లేక; ఇంక,సూర్యుఁడుదయింపఁబోవుచున్నాఁడు; సూర్యునకుం బోలెనీకునింక శత్రువులంజంపసమయంబువచ్చినది; లేక;పూర్వాసంధ్యాప్రవర్తతే=అంధకారముపోయినది తెల్లవాఱవచ్చినది, నాయజ్ఞానంబునశించినది భగవంతుండవగునీదర్శనంబుగల్గినది.ఉత్తిష్ఠ=లెమ్ము; నీనిద్రాకాలలక్ష్మినిజూచితిని, ఇంకఁబ్రబోధలక్ష్మింజూడఁగోరెద

ను; నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడా! నరశ్రేష్ఠుఁడవుకావున "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవే తరోజనః" అనునట్టు, నీకును సంధ్యయుపాసింపవలసినదేకదా! లేక; నీవు,ఆశ్రితులరక్షింపవలయు, తద్విరోధుల శిక్షింపవలయు, నీకునిద్రించుటకవకాశమెక్కడిది; దైవమాహ్నికంకర్తవ్యం, దైవం=దేవునిచే,అనఁగా,సర్వేశ్వరునిచే నేర్పఱుపఁబడిన; ఆహ్నికం= నిత్యకర్మము;కర్తవ్యం=చేయఁబడవలయును. లేక;దైవం=(దేవశబ్దముభావదర్థకము) నీచే నేర్పఱుపఁబడిన; ఆహ్నికంకర్తవ్యం=నిత్యకర్మము చేయఁబడవలయును; నీవేర్పఱచిన నియమమునునీవే యనుష్ఠింపక పోరాదుగదాయనుట. లేక, నేనునీచే నాజ్ఞాపింపఁ బడిన భగవత్ప్రాజనరూపమైననిత్యకర్మము సేయవలయునుగదా!దానింబ్రతిగ్రహించుటకులెమ్ము.అనుట.ఇంకనిట్లనేకార్థంబులు బుద్ధిమంతులూహించునది.

తస్యర్షేః పరమోదారం వచ శ్శ్రుత్వా నృపాత్మజౌ
స్నాత్వా కృతోదకౌ వీరౌ జపతుః పరమం జపమ్. ౩

టీక॥తస్య=ఆ;ఋషేః=విశ్వామిత్రమహర్షియొక్క; పరమోదారం = మిక్కిలియుగంభీరమైన; వచః=మాటను;శ్రుత్వా = విని;వీరౌ=పరాక్రమశాలులగు; నృపాత్మజౌ=రాచకొమరులగు రామలక్ష్మణులు; స్నాత్వా=స్నానముచేసి;కృతోదకౌ, కృత=చేయఁబడిన, ఉదకౌ=అర్ఘ్యములు గలవారలై; పరమం=ఉత్కృష్టమైన;జపం=గాయత్రిని;జపతుః=జపించిరి.

ఆవిశ్వామిత్ర మహర్షి చెప్పినపరమగంభీరమగుమాటనువిని, పరాక్రమ శాలులగు రామలక్ష్మణులు, స్నానముచేసి,యర్ఘ్యంబు విడిచి, పరమంబగు గాయత్రీమంత్రంబును, జపించిరి.

అని, తాత్పర్యము.

కృతాహ్నికౌ మహావీర్యౌ విశ్వామిత్రం తపోధనమ్

అభివాద్యాభిసంహృష్టౌ గమనాయాభితస్థతుః. ౪

టీక ॥ మహావీర్యా=గొప్పపరాక్రమముగల రామలక్ష్మణులుఁ కృతాహ్నికౌ=చేయఁబడినయాహ్నికంబుగలవారలై; తపోధనం=తపస్సే ధనము గాఁగల; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; అభివాద్య=నమస్కరించి;అభిసంహృష్టౌ=సంతసించినవారలై; గమనాయ=పోవుటకొఱకు; అభితస్థతుః = తరలిరి.

మహాపరాక్రమశాలులగు రామలక్ష్మణులు, సంధ్యోపాసనబ్రహ్మయజ్ఞసమిదాధానాది ప్రాతఃకాలకరణీయంబులనిర్వర్తించిన వారలై, తపోధనుండగు విశ్వామిత్రునమస్కరించి, సంతోషంబునఁబయనంబయిరి.

అని, తాత్పర్యము.

తౌ ప్రయాతౌ మహావీర్యౌ దివ్యాం త్రిపథగాం నదీమ్
దదృశాతే తతస్తత్ర సరయ్వాస్సంగమే శుభే. ౫

టీక॥ మహావీర్యౌ = గొప్పపరాక్రమముగల;తౌ=ఆ రామలక్ష్మణులు (విశ్వామిత్రుఁడును);తతః=అచ్చటనుండి; ప్రయాతౌ=తరలినవారలై;తత్ర=ఆ;సరయ్వాః=సరయూనదియొక్క; శుభే=మంగళకరమైన; సంగమే=సంగమస్థానమందు; దివ్యాం=స్వర్గమునందుఁబుట్టిన;త్రిపథగాం=గంగయనెడు; నదీం=ఏటిని;దదృశాతే=చూచిరి.

మహాపరాక్రమశాలులగు, నా రామలక్ష్మణవిశ్వామిత్రులు,అచ్చటనుండితరల్లి, మంగళకరంబగుసరయూనదీ సంగమమందు, గంగానదింబూచిరి.

ఆని, తాత్పర్యము.

తత్రాశ్రమ పదం పుణ్యం ఋషీణా మగ్ర్యతేజసామ్
బహువర్ష సహస్రాణి తప్యతాం పరమం తపః. ౬

టీక॥ తత్ర=ఆసరయూనదీసంగమమందు; తే(అధ్యాహృతము)=ఆరామలక్ష్మణవిశ్వామిత్రులు; అగ్ర్యతేజసాం=శ్రేష్ఠమైన ప్రభావముగలవారును;బహువర్షసహస్రాణి = పెక్కువేలేండ్లు; పరమం=ఉత్కృష్టమైన; తపః=తపస్సును; తప్యతాం=తపించువారునగు; ఋషీణాం = ఋషులయొక్క; పుణ్యం=పరిశుద్ధమైన; ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును; దదృశుః= (అధ్యాహృతము)చూచిరి.

ఆసరయూనదీ సంగమమందు, రామలక్ష్మణవిశ్వామిత్రులు,మహాప్రభావులై పెక్కువేలేండ్లు పరమతపంబుచేయు,ఋషుల యాశ్రమస్థానంబుచూచిరి.

అని,తాత్పర్యము.

తం దృష్ట్వా పరమప్రీతౌ రాఘవౌ పుణ్య మాశ్రమమ్
ఊచతు స్తం మహాత్మానం విశ్వామిత్ర మిదం వచః. ౭

టీక॥రాఘవౌ = రఘువంశమునందుఁబుట్టిన రామలక్ష్మణులు; పుణ్యం=పవిత్రమైన;తం=ఆ; ఆశ్రమం=ఆశ్రమమును; దృష్ట్వా=చూచి;పరమప్రీతౌ=మిక్కిలియుసంతసించినవారలై; మహాత్మానం = పూజ్యమైనమనస్సుగల;తం=ఆ; విశ్వామిత్రం = విశ్వామిత్రునిఁగూర్చి;ఇదం=ఈ; వచః=మాటను; ఊచతుః=చెప్పిరి.

రామలక్ష్మణులు, పవిత్రంబగు నాయాశ్రమమునుజూచి, చాలసంతసించి, మహాత్ముండగు విశ్వామిత్రునితో,నిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

కస్యాయ మాశ్రమః పుణ్యః కోన్వస్మి న్వసతే పుమాన్
భగవన్ శ్రోతు మిచ్ఛావః పరం కౌతూహలం హి నౌ. ౮

టీక॥ పుణ్యః=పవిత్రమైన; అయం=ఇది;కస్య=ఎవనియొక్క;ఆశ్రమః=ఆశ్రమము;అస్మిన్ = ఈ యాశ్రమమందు; కః = ఏ; పు

మాన్=పురుషుఁడు; వసతేను=వాసముచేయుచున్నాఁడు? భగవన్=మాహాత్మ్యము గల విశ్వామిత్రుఁడా; శ్రోతుం=వినుటకు; ఇచ్ఛామః=కోరుచున్నాము; నౌ=మాయొక్క; కౌతూహలం=కోరిక; పరంహి=అధికముగదా!

పవిత్రంబగు నీయాశ్రమమెవ్వనిది! ఇందెవ్వఁడు వాసముచేయుచున్నాఁడు! భగవంతుఁడా! మేముదాని వినఁగోరెదము; మాకధికముగాఁ గౌతుకమున్నది. అని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

తయో స్త ద్వచనం శ్రుత్వా ప్రహస్య మునిపుంగవః
అబ్రవీ చ్ఛ్రూయతాం రామ యస్యాయం పూర్వ ఆశ్రమః. ౯

టీక॥ తయోః = ఆరామలక్ష్మణులయొక్క; తత్ =ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; మునిపుంగవః=మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు; ప్రహస్య=నవ్వి; అబ్రవీత్ =పలికెను. రామ=రాముఁడా! అయం=ఈ; పూర్వః = ప్రాచీనమైన; ఆశ్రమః=ఆశ్రమము; యస్య = ఎవ్వనిదో; సః(అధ్యాహృతము)= వాఁడు; శ్రూయతాం= వినఁబడుఁగాక.

రామలక్ష్మణులమాటవిని, మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుఁడునవ్వి, యిట్లనిచెప్పెను; రాముఁడ! ఈయాశ్రమముఎవ్వనిదో, అతనిం దెల్పెదవినుము. అని, తాత్పర్యము.

కందర్పో మూర్తిమా నాసీ త్కామ ఇత్యుచ్యతే బుధైః

టీక॥ కందర్పః=మన్మథుఁడు; లేక, కుత్సిత మగుగర్వము; మూర్తిమాన్= ఆకారముగలవాఁడుగా; ఆసీత్=ఉండెను. సః(అధ్యాహృతము)=అతఁడు; బుధైః=పండితులచేత; కామః=కాముఁడు; ఇతి=అని; ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

మునుపుమన్మథుఁడు ఆకారముగలిగియుండెను; అతనినే, పండితులు కాముఁడని, చెప్పెదరు. లేక; పూ

ర్వము, కుత్సితంబగుగర్వమురూపముగలిగియుండెను; దానినే,పండితులు,కాముఁడనిచెప్పెదరు.

అని, తాత్పర్యము.

తపస్యంత మిహ స్థాణుం నియమేన సమాహితమ్. ౧౦
కృతోద్వాహం తు దేవేశం గచ్ఛంతం సమరుద్గణమ్
ధర్షయామాస దుర్మేధా హుంకృతశ్చ మహాత్మనా. ౧౧

టీక ॥ దుర్మేధాః=దుష్టబుద్ధి గలయామన్మథుఁడు; ఇహ = ఈ యాశ్రమమందు;తపస్యంతం=తపస్సుచేయుచున్నవాఁడును; నియమేన=గట్టిపట్టుచేత; సమాహితం=సమాధి గలవాఁడును; కృతోద్వాహం= ఇంకమీఁద, చేయఁబడిన వివాహము గల వాఁడై; సమరుద్గణం=దేవతలసమూహముతోఁ గూడినవాఁడై; గచ్ఛంతం=(భవిష్యదర్థమందువర్తమానము)పోఁగలవాఁడును;దేవేశం=దేవతలకుఁబ్రభువునగు; స్థాణుం=శివుని; ధర్షయామాస=ఎదిరించెను; మహాత్మనా = మహాప్రభావుండగుశివునిచేత;హుంకృతశ్చ=హుంకరింపఁబడినవాఁడునాయెను.

దుష్టుండగునామన్మథుఁడు, ఈ యాశ్రమమందుఁదపస్సుచేయుచు, దృఢంబగునియమంబున సమాధిగలిగి, యున్న, దేవేశ్వరుండగు శివుని,ఆశివుఁడు, పార్వతినివివాహమై దేవతలఁగూడి యిచ్చటనుండిపోవుటకుమునుపు,ధర్షించెను; అంత, మహాత్ముండగు శివుండు హుంకారంబున, నామన్మథుని వెరటుపడఁజేసెను.

అని, తాత్పర్యము.

మునిభావప్రకాశికాకారులుమఱియొక్కవిధముగా వ్యాఖ్యానము చేసిరి.— "సమరుద్గణం" అనుచోట, "మరుద్గణం" అని, విభాగము.దుర్మేధాః=దుష్టబుద్ధిగల; సః=ఆమన్మథుఁడు; ఇహ=ఈయాశ్రమమందు;గచ్ఛంతం = సంచరించుచున్నట్టి; మరుద్గణం=వాయువులసమూహమునుగూర్చి;కృతోద్వాహం,కృత=చేయఁబడిన, ఉద్వాహం =




వహించుట గలవాఁడును; వాయువుఁబూరించి స్తంభించి యున్నవాఁడుననుట; నియమేన=గట్టిపట్టుచేత; సమాహితం = సమాధిగలవాఁడును; తపస్యంతం=తపస్సుసేయువాఁడును; దేవేశం= దేవతలకుఁబ్రభువగు; స్థాణుం=ఈశ్వరుని; ధర్షయామాస=ధర్షించెను. మహాత్మనా=మహాత్ముండగునీశ్వరుని చేత; హుంకృతశ్చ= హుంకరింపఁబడినవాఁడున య్యెను.

దుష్టుండగునామన్మథుఁడు, ఈ యాశ్రమమందు, లోపల వెలుపల నుందిరుగుచున్న వాయువులం జిక్కఁబట్టి, దృఢంబగుసమాధిగలిగి, తపము సేయుచున్న, దేవేశ్వరుండగునీశ్వరు, నెదిరించెను; అంత, నీశ్వరుండు, హుంకారంబున, నామన్మథుని, బ్రేటుపడం జేసెను.

అని, తాత్పర్యము.

అవదగ్ధస్య రౌద్రేణ చక్షుషా రఘునందన
వ్యశీర్యంత శరీరాత్స్వా త్సర్వగాత్రాణి దుర్మతేః. ౧౨

టీక॥ రఘునందన = రఘువంశమునఁబుట్టినవారి సంతోషింపఁ జేయు రాముఁడా! రౌద్రేణ=అగ్నివికారమైన; చక్షుషా= నేత్రము చేత; అవదగ్ధస్య=దహింపఁబడిన; దుర్మతేః = దుష్టబుద్ధిగలమన్మథునియొక్క; స్వాత్ =తనదైన; శరీరాత్ = దేహమునుండి; సర్వగాత్రాణి=సమస్తావయవములును; వ్యశీర్యంత= భస్మమైనవి.

రాముఁడా! అగ్నినేత్రంబున, దహింపఁబడిన దుష్టుండగుమన్మథుని దేహంబంతయు, నీఱైనది.

అని, తాత్పర్యము.

తస్య గాత్రం హతం తత్ర నిర్దగ్ధస్య మహాత్మనా
అశరీరః కృతః కామః క్రోధా ద్దేవే శ్వరేణహి. ౧౩

టీక ॥ తత్ర=ఆకాలమందు; మహాత్మనా = మహాప్రభావుండగునీ




శ్వరునిచేత; నిర్దగ్ధస్య=దహింపఁబడినదైన; తస్య=ఆమన్మథునియొక్క; గాత్రం=దేహము; హతం=కొట్టఁబడినది. దేవేశ్వరేణ=దేవతలకుఁబ్రభువైన శివునిచేత; క్రోధాత్=కోపమువలన; కామః=మన్మథుఁడు, అశరీరః = దేహము లేనివాఁడుగా; కృతోహి=చేయఁబడెనుగదా!

అప్పుడు, మహాప్రభావుండగునీశ్వరునిచేనగ్ని నేత్రంబునదహింపఁబడినదైయామన్మథునిశరీరముభస్మమైనది, దేవేశ్వరుండగునీశ్వరుండు, కోపంబున, మన్మథుని, శరీరములేనివానిఁగాఁ, జేసెను.

అని, తాత్పర్యము.

అనంగ ఇతి విఖ్యాత స్తదాప్రభృతి రాఘవ
సచాంగవిషయ శ్శ్రీమా న్యత్రాంగం ప్రముమోచహ. ౧౪

టీక॥ రాఘవ=రఘువంశమునఁబుట్టినరాముఁడా! తదాప్రభృతి=అదిమొదలు; కామః (అధ్యాహృతము)=మన్మథుఁడు; అనంగః=శరీరములేనివాఁడు; ఇతి = అని; విఖ్యాతః=ప్రసిద్ధుఁడయ్యెను. యత్ర=ఎచ్చట; అంగం=శరీరమును; ప్రముమోచ=విడిచెనో ("హ" అనునది పాదపూరణార్థము); శ్రీమాన్=సర్వాతిశాయియగు; సచ=అదియును; అంగవిషయః (ఇతి)=అంగదేశమని; విఖ్యాతః (అధ్యాహృతము)=ప్రసిద్ధమయ్యెను.

రాముఁడా! అదిమొదలు, మన్మథుఁడు, అనంగుఁడని ప్రసిద్ధినొందెను; మన్మథుఁడెచ్చట శరీరమునువిడిచెనో; ఆదేశముఅంగదేశమని ప్రసిద్ధినొందెను. అని, తాత్పర్యము.

తస్యాయ మాశ్రమః పుణ్య స్తస్యేమే మునయః పురా
శిష్యా ధర్మపరా నిత్యం తేషాం పాపం న విద్యతే. ౧౫

టీక॥ పుణ్యః=పవిత్రమైన; అయం=ఈయాశ్రమము. తస్య=అస్థాణు రూపుండగు నీశ్వరునియొక్క; ఆశ్రమః=ఆశ్రమము. ఇమే=

ఈః మునయః=మునులు; పురా = పూర్వము మొదలు; తస్య=ఆస్థాణు నియొక్క-; శిష్యాః = శిష్యులు. తే (అధ్యాహృతము) = వారలు; నిత్యం=ఎల్లప్పుడును; ధర్మపరాః=ధర్మమందాసక్తులు. తేషాం=ఆమునులకు; పాపం=పాపము; నవిద్యతే= లేదు.

ఆస్థాణుని యాశ్రమం బిది; యీమునులతనిశిష్యులు; వీరలు, ఎల్లప్పుడునుధర్మపరులు; వీరలకుఁబాపం బేమియు లేదు.

అని, తాత్పర్యము.

ఇహాద్య రజనీం రామ వసేమ శుభదర్శన
పుణ్యయోః స్సరితో ర్మధ్యే శ్వ స్తరిష్యామహే వయమ్. ౧౬

టీక॥ శుభదర్శన, శుభ=మంగళకరమైన, దర్శన=చూడఁబడుటగల; రామ=రాముఁడా ! వయం=మనము; ఇహ=ఇచ్చట; అద్య=ఈ; రజనీం=(అత్యంతసంయోగమందు ద్వితీయ) రాత్రియంతయు; వసేమ= వాసము సేసెదము. శ్వః=రేపు; పుణ్యయోః= పవిత్రములైన; సరితోః= గంగాసరయూనదులయొక్క-; మధ్యే=నడుమను; తరిష్యామహే=దాఁటుదము.

శుభదర్శనుండవైన రాముఁడా! ఇచ్చటనీరాత్రియంతయు నుండుదము; రేపుపవిత్రంబులగు నీరెండునదులనడుమను గంగానదిని దాఁటుదము. అని, తాత్పర్యము.

అభిగచ్ఛామహే సర్వే శుచయః పుణ్య మాశ్రమమ్
స్నాతాశ్చ కృత జప్యాశ్చ హుతహవ్యా నరోత్తమ. ౧౭

టీక॥ నరోత్తమ=పురుషశ్రేష్ఠుండవైన రాముఁడా! వయం (అధ్యాహృతము)=మనము; సర్వే=అందఱము; స్నాతాశ్చ=స్నానము చేసిన వారలుగాను; కృతజప్యాశ్చ= చేయఁబడిన గాయత్రీజపముగలవారలుగాను; హుతహవ్యాః=వేల్వఁబడిన హోమముగలవారలుగాను; శు

చయః = పరిశుద్ధులుగాను; భూత్వా(అధ్యాహృతము)=అయి; పుణ్యాం=పవిత్రమైన; ఆశ్రమం=ఆశ్రమమును; అభిగచ్ఛామహే= ప్రవేశించెదము.

రాముఁడా! మనమందఱమును, స్నానముచేసి, జపముసల్పి, హోమంబుగావించి, పరిశుద్ధులమై, పవిత్రంబగునాశ్రమపదంబుప్రవేశించెదము. అని, విశ్వామిత్రుఁడుచెప్పెను.

అని, తాత్పర్యము.

తేషాం సంవదతాం తత్ర తపో దీర్ఘేణ చక్షుషా
విజ్ఞాయ పరమప్రీతా మునయో హర్ష మాగమన్. ౧౮

టీక॥ తత్ర=అచ్చట; తేషాం= ఆరామలక్ష్మణవిశ్వామిత్రులు; సంవదతాం=సల్లాపము సేయుచుండఁగా; మునయః=మునులు; తపోదీర్ఘేణ, తపః= తపస్సుచేత, దీర్ఘేణ=నిడుపైన (చాలదూరమునందలియర్థంబు నెఱుంగంజాలిన యనుట); చక్షుషా= నేత్రముచేత; (జ్ఞానముచేతననుట) విజ్ఞాయ=ఎఱింగి; పరమప్రీతాః=మిక్కిలిసంతసించినవారలై; హర్షం= (తృతీయార్థమందుద్వితీయ) గగుపాటుతో; ఆగమన్=వచ్చిరి.

ఆరామలక్ష్మణవిశ్వామిత్రులిచ్చట సల్లాపము సేయుచుండఁగా నాయాశ్రమమందలిమునులు, తపోవిశేషంబునసంపాదింపఁబడిన దివ్యజ్ఞానంబుచే నెఱింగి, మిక్కిలిసంతసించి, గగుపాటు నొందినవారలై, వారియొద్దకువచ్చిరి.

అని, తాత్పర్యము.

అర్ఘ్యం పాద్యం తథాతిథ్యం నివేద్య కుశికాత్మజే
రామలక్ష్మణయోః పశ్చా దకుర్వ న్నతిథిక్రియామ్. ౧౯

టీక॥ తే(అధ్యాహృతము)= ఆమునులు; కుశికాత్మజే = విశ్వామి

త్రునియందు; అర్ఘ్యం=పూజోదకమును; పాద్యం=పాదోదకమును; తధా=అట్లు; ఆతిధ్యం = అతిధిసత్కారమును; నివేద్య= సమర్పించి; పశ్చాత్=పిమ్మట; రామలక్ష్మణయోః = రామునకునులక్ష్మణునకును; అతిథిక్రియాం=ఆతిధ్యమును; అకుర్వన్ =చేసిరి.

ఆమునులు, మొదట, విశ్వామిత్రునకు, అర్ఘ్యపాద్యాతిధ్యములసమర్పించి, పిమ్మట, రామునకునులక్ష్మణునకును ఆతిధ్యము,నిచ్చిరి.

అని, తాత్పర్యము.

సత్కారం సమనుప్రాప్య కథాభి రభిరంజయన్
యథార్హమజపన్ సంధ్యా మృషయ స్తే సమాహితాః. ౨౦

టీక॥ తే=ఆ; ఋషయః=మునులు; సత్కారం=పూజను ; సమనుప్రాప్య=పొంది; కథాభిః=కథలచేత; అభిరంజయన్=సంతోషింపజేసిరి. సమాహితాః=మనస్సమాధానముగలవారలై; సంధ్యాం = సంధ్యను; యథార్హం=యథాయోగ్యముగా; అజపన్= ఉపాసించిరి.

ఆఋషులు, రామలక్ష్మణవిశ్వామిత్రులవలనసత్కారమును బొంది, అతిధులైనరామలక్ష్మణవిశ్వామిత్రులనుగథలచే సంతోషపఱచిరి; అంత,మనస్సమాధానముఁబొంది, యథాయోగ్యముగ, సంధ్యనుపాసించిరి. అని, తాత్పర్యము.

తత్రవాసిభి రానీతా మునిభి స్సువ్రతై స్సహ
న్యవసన్ సుసుఖం తత్ర కామాశ్రమ పదే తదా. ౨౧

టీక॥ తే(అధ్యాహృతము)=ఆ రామలక్ష్మణ విశ్వామిత్రులు; తత్ర=ఆయాశ్రమమందు; వాసిభిః=వాసముసేయు మునులచేత; ఆనీతాః = తోడ్కొనిపోఁబడినవారలై; సువ్రతైః=మంచివ్రతములుగలు; మునిభిస్సహ=మునులతోఁగూడ; తదా=అప్పుడు; తత్ర=ఆ; కామా

శ్రమపదే = కామాశ్రమస్థానమందు; (కాముఁడు, అనఁగా మన్మథుఁడు, ఇందుదహింపఁబడెను, గావునఁ, గామాశ్రమమని చెప్పఁబడినది) సుసుఖం = మిక్కిలిసుఖముగా; న్యవసన్ = నివసించిరి.

ఆ రామలక్ష్మణవిశ్వామిత్రులు, ఆయాశ్రమవాసులగు మునులచేత నాశ్రమమునకుఁ దోడ్కొనిపోఁబడి, యచ్చట, సుపవిత్రులగుమునులతోఁగూడ, సుఖంబుండిరి.

అని, తాత్పర్యము.

కథాభి రభిరామాభి రభిరామౌ నృపాత్మజౌ
రమయామాస ధర్మాత్మా కౌశికో మునిపుంగవః. ౨౭

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుఁడును; మునిపుంగవః = మునిశ్రేష్ఠుఁడునగు; కౌశికః = విశ్వామిత్రుఁడు; అభిరామౌ = మనోహరులయిన; నృపాత్మజౌ = రాచకొమరులను; అభిరామాభిః = మనోహరంబులగు; కథాభిః = కథలచేత; రమయామాస = రమింపఁజేసెను.

ధర్మస్వభావుండును మునిశ్రేష్ఠుండునగువిశ్వామిత్రుఁడు, మనోహరులగు రామలక్ష్మణులను, వినవినవింపుగానుండుకథలచే, రమింపఁజేసెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, త్రయోవింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ త్రయోవింశసర్గటీక, ముగిసినది.

---

(౫౭)

## చతుర్వింశసర్గప్రారంభః

తతః ప్రభాతే విమలే కృతాహ్నిక మరిందమౌ
విశ్వామిత్రం పురస్కృత్య నద్యా స్తీర ముపాగతౌ. ౧

టీక॥ తతః=అపిమ్మట; విమలే=స్వచ్ఛమైన; ప్రభాతే=ప్రాతఃకాలమందు; అరిందమౌ=శత్రువుల నణఁగఁదొక్కునట్టి రామలక్ష్మణులు; కృతాహ్నికం = చేయఁబడిన యాహ్నికముగల; విశ్వామిత్రం= విశ్వామిత్రుని; పురస్కృత్య = ముందిడికొని; నద్యాః=గంగానదియొక్క; తీరం=గట్టును; ఉపాగతౌ=పొందిరి.

అంత, సూర్యోదయముకాఁగానే, మహాపరాక్రమశాలులగు రామలక్ష్మణులు, ప్రాతఃకాలకృత్యం బుదీర్చికొనిసిద్ధుఁడుగానున్న విశ్వామిత్రునిముందిడికొని, గంగానదీ తీరమునకుఁబోయిరి. అని తాత్పర్యము.

తేచ సర్వే మహాత్మానో మునయ స్సంశితవ్రతాః
ఉపస్థాప్య శుభా న్నావం విశ్వామిత్ర మథాబ్రువన్. ౨

టీక॥ మహాత్మానః = పూజ్యమయినస్వభావముగలవారును; సంశితవ్రతాః = తీక్ష్ణమయిన వ్రతములుగలవారునగు; తే=ఆ; మునయః=మునులు; సర్వేచ=అందఱును; శుభాం = మంగళకరమయిన; నావం=ఓడను; ఉపస్థాప్య=తెచ్చి; అథ=పిమ్మట; విశ్వామిత్రం = విశ్వామిత్రునిగూర్చి; అబ్రువన్= చెప్పిరి.

మహాత్ములును, దీక్షవ్రతులునగు నామునులందఱును, మంచియోడ దెచ్చివిశ్వామిత్రునితో నిట్లని చెప్పిరి. అని, తాత్పర్యము.

ఆరోహతు భవా న్నావం రాజపుత్ర పురస్కృతః

అరిష్టం గచ్ఛ పంథానం మాభూ త్కాల విపర్యయః. 3

టీక॥ భవాన్=నీవు; రాజపుత్రపురస్కృతః = రాచకొమరులచే మున్నిడుకొనఁబడినవాఁడవై; నావం=ఓడను; ఆరోహతు=ఎక్కుము. అరిష్టం=శుభముగల్గునట్లు; పంథానం=మార్గమును; గచ్ఛ=పొందుము. కాలవిపర్యయః=కాల, విళంబము; మాభూత్=లేకపోవుఁగాక.

నీవు, రామలక్ష్మణుల వెంటఁ బెట్టుకొని, యోడనెక్కుము; మార్గమున శుభంబుల నెఱపుచుఁబొమ్ము కాలవిళంబము, లేకపోవుఁగాక. నిఃమునులు చెప్పిరి.

అని, తాత్పర్యము.

విశ్వామిత్ర స్తథేత్యుక్త్వా తా నృషీ నభిపూజ్యచ
తతార సహిత స్తాభ్యాం సరితం సాగరంగమామ్. ౪

టీక॥ విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; తథేతి = అలాగేయని; ఉక్త్వా=చెప్పి; తాన్=ఆ; ఋషీన్=ఋషులను; అభిపూజ్యచ=పూజించియు; తాభ్యాం = ఆరామలక్ష్మణులతో; సహితః=కూడినవాఁడై; సాగరంగమాం = సముద్రమును బొందునట్టి; సరితం=గంగానది తతార=దాఁటెను.

విశ్వామిత్రుఁ, డాలాగేయని ప్పి, యాఋషులంబూజించి, రామలక్ష్మణులంగూడి, సముద్రగామగుగంగానదిని దాఁటనారంభించెను. అని, తాత్పర్యము.

తత శ్శుశ్రావ వై శబ్ద మతిసంరంభ వర్ధితమ్
మధ్య మాగమ్య తోయస్య సహ రామః కనీయసా. ౫

టీక॥ తతః = ఆపిమ్మట; రామః=రాముఁడు; కనీయసాసహ=తమ్మునితోఁగూడ; తోయస్య=జలముయొక్క; మధ్యం=మధ్య దేశము; ఆగమ్య=పొంది; అతిసంరంభవర్ధితం, అతిసంరంభ = అధి

కిగిరపాటుచేత, వర్ధితం = వృద్ధిఁ బొందింపఁబడిన; శబ్దం=ధ్వనిని; శుశ్రావ=వినెను ("వై" అనునది పాదపూరణార్థము).

అంత, రాముండును లక్ష్మణుండును, జలమధ్యంబున, వేగిరపాటుచే వృద్ధిఁబొందిన, యొకధ్వనిని, వినిరి. అని, తాత్పర్యము.

అథ రామ స్సరిన్మధ్యే పప్రచ్ఛ మునిపుంగవమ్
వారిణో భిద్యమానస్య కిమయం తుములోధ్వనిః. ౬

ల టీక॥ అథ=పిమ్మట; రామః=రాముఁడు; సరిన్మధ్యే=నదీమధ్యమందు; భిద్యమానస్య= పరస్పరముకలయుచున్న; వారిణః=జలముయొక్క; అయం=ఈ; తుములః=దట్టమైన; ధ్వనిః=ధ్వనియు; కిం=ఎక్కడిది. ఇతి (ఇత్థం వ్యాహృతము)=అని; మునిపుంగవం = మునిశ్రేష్ఠుఁడగువిశ్వామిత్రుని; పప్రచ్ఛ=అడిగెను.

అంత, రాముఁడు, నదీమధ్యమందు, పరస్పరముతాఁకుడు గల్గియున్న నీళ్లయందలి దట్టమైనధ్వని యెందు వలనఁ గల్గినదని విశ్వామిత్రునడిగెను. అని, తాత్పర్యము.

రాఘవస్య వచ శ్శ్రుత్వా కౌతూహలసమన్వితః
కథయామాస ధర్మాత్మా తస్య శబ్దస్య నిశ్చయమ్. ౭

టీక॥ రాఘవస్య = రఘువంశమునంబుట్టిన రామునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; ధర్మాత్మా=ధర్మస్వభావుండగువిశ్వామిత్రుఁడు; కౌతూహలసమన్వితః=కౌతుకముతోఁగూడినవాఁడై; తస్య=ఆ; శబ్దస్య=ధ్వనియొక్క; నిశ్చయం=తత్త్వమును; కథయామాస=చెప్పెను.

రామునిమాటవిని, ధర్మాత్ముండగు విశ్వామిత్రుఁడు, కౌతుకముతోఁగూడినవాఁడై, ఆధ్వనికిం గలగారణమును, జెప్పెను. అని, తాత్పర్యము.

కైలాసపర్వతే రామ మనసా నిర్మితం సరః
బ్రహ్మణా నరశార్దూల తేనేదం మానసం సరః. ౭

టీక॥ రామ = రాముఁడా! కైలాసపర్వతే = కైలాసపర్వతమందు; బ్రహ్మణా = బ్రహ్మదేవునిచేత; మనసా = మనస్సుచేత; సరః = గుంట; నిర్మితం = నిర్మింపఁబడినది. నరశార్దూల = పురుషశ్రేష్ఠుఁడవైన రాముఁడా! తేన = ఆమనస్సుచేనిర్మింపఁబడుటచేత; ఇదం = ఈ; సరః = గుంట; మానసం = మానససరస్సనుపేరుగలది; అభూత్ (అధ్యాహృతము) = అయినది.

రాముఁడా! కైలాసపర్వతంబున, బ్రహ్మదేవుఁడు తనమనస్సుచేనొకసరస్సుసృజించెను; మనస్సుచేసృజించుటంబట్టి, యదిమానససరస్సు అని, పేరుపొందినది.

అని, తాత్పర్యము.

తస్మాత్సుస్రావ సరసస్సాయోధ్యాముపగూహతే
సరఃప్రవృత్తా సరయూః పుణ్యా బ్రహ్మసరశ్చ్యుతా. ౮

టీక॥ యా (అధ్యాహృతము) = ఏనది; తస్మాత్ = ఆ; సరసః = సరస్సునుండి; సుస్రావ = స్రవించెనో; సా = ఆనది; అయోధ్యాం = అయోధ్యాపట్టణమును; ఉపగూహతే = చుట్టుకొనియున్నది. సా (అధ్యాహృతము) = ఆనది; సరఃప్రవృత్తా = సరస్సునుండిపుట్టినది, గనుకనే; సరయూః = సరయూఅనుపేరుగలది. బ్రహ్మసరశ్చ్యుతా, బ్రహ్మసరః = బ్రహ్మదేవునిసరస్సునుండి, చ్యుతా = జారినది, గనుకనే; పుణ్యా = పవిత్రమైనది.

ఆసరస్సునుండి యొకనదిపుట్టినది; అదియయోధ్యాపట్టణమునావరించిపాఱుచున్నది; అది, సరస్సువలనఁబుట్టినది గాన, సరయూఅనుపేరొందినది; మఱియు, బ్రహ్మదేవునిసరస్సులోనుండిపుట్టినందునను, బవిత్రమైనది. అని, తాత్పర్యము.

తస్యాయమతుల శ్శబ్దో జాహ్నవీ మభివర్తతే
వారిసంక్షోభజో రామ ప్రణామం నియతః కురు. ౧౦

టీక॥ సా (అధ్యాహృతము)= ఆసరయూనదిః జాహ్నవీం=గంగను; అభివర్తతే=పొందుచున్నది. అయం=ఈ, అతులః = సరిలేని; శబ్దః = ధ్వని; తస్యాః (సంధియార్షము)=ఆసరయూనదియొక్క; వారిసంక్షోభజః, వారి = జలముయొక్క; సంక్షోభ = కలయుటవలన; జః=పుట్టినది రామ=రామఁడా నియతః= నియమముగలవాఁడవై ప్రణామం= నమస్కారమును; కురు=చేయుము.

ఆసరయూనది, గంగతోఁజేరుచున్నది; ఈగొప్ప శబ్దము, ఆసరయూనదిజలము, గంగాజలముతోఁ గలయుటవలనఁగల్గినది; నీవునియమంబున నీరెండునదులకుం బ్రణామంబుసేయుము. అని, విశ్వామిత్రుఁడుచెప్పెను. అని, తాత్పర్యము.

తాభ్యాంతు తావుభౌ కృత్వా ప్రణామ మతిధార్మికౌ
తీరం దక్షిణ మాసాద్య జగ్మతు ర్లఘువిక్రమౌ. ౧౧

టీక॥ అతిధార్మికౌ=మిక్కిలిధర్మిష్ఠులగు; తౌ=ఆరామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; తాభ్యాంతు= ఆగంగాసరయూనదులకొఱకు; ప్రణామం= నమస్కారమును, కృత్వా=చేసి; దక్షిణం=దక్షిణపుదిక్కునందలి; తీరం=గట్టును; ఆసాద్య=పొంది; లఘువిక్రమౌ=శీఘ్రమైననడకగలవారలై; జగ్మతుః= పోయిరి.

అతిధార్మికులగు నారామలక్ష్మణులిద్దఱు, గంగాసరయూనదులకునమస్కరించి, దక్షిణతీరంబుఁజేరి, శీఘ్రంబుగా నడుచుచుఁ, బోయిరి. అని, తాత్పర్యము.

స వనం ఘోరసంకాశం దృష్ట్వా నృప వరాత్మజః

అవిప్రహత మైక్ష్వాకః పప్రచ్ఛ మునిపుంగవమ్. ౧౨

టీక॥ ఐక్ష్వాకః=ఇక్ష్వాకువంశమునందుఁబుట్టిన; సః=ఆ; నృపవరాత్మజః, నృపవర=రాజశ్రేష్ఠుండగు దశరథునియొక్క, ఆత్మజః=కొడుకైనరాముఁడు; ఘోరసంకాశం=భయంకరముగా నుండునదియును; అవిప్రహతం = త్రొక్కఁబడనిదియునగు; వనం=అడవిని; దృష్ట్వా=చూచి; మునిపుంగవం= మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుని; పప్రచ్ఛ=అడిగెను.

ఇక్ష్వాకువంశమునంబుట్టిన దశరథపుత్రుఁడగు నారాముఁడు, భయంకరంబును, బాదసంచారము లేమిచేఁద్రొక్కఁబడనిదియునగునడవింజూచి, మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రునిట్లని, యడిగెను.

అని, తాత్పర్యము.

అహో వన మిదం దుర్గం ఝిల్లికాగణనాదితమ్
భైరవై శ్శ్వాపదైః పూర్ణం శకుంతై ర్దారుణారుతైః. ౧౩
నానాప్రకారై శ్శకునై ర్వాశ్యద్భి ర్భైరవస్వనైః
సింహవ్యాఘ్రవరాహైశ్చ వారణై శ్చోపశోభితమ్. ౧४
ధవాశ్వ కర్ణకకుభై ర్బిల్వతిందుకపాటలైః
సంకీర్ణం బదరీభిశ్చ కిన్న్వేత ద్దారుణం వనమ్. ౧५

టీక॥ ఇదం=ఈ, వనం=అడవి; దుర్గం = ప్రవేశింపనశక్యముగానును; ఝిల్లికాగణనాదితం, ఝిల్లికాగణ= ఈలపురుగుల సమూహముచేత, నాదితం=ధ్వనింపఁజేయఁబడినదిగాను; భైరవైః=భయంకరములగు; శ్వాపదైః = క్రూరమృగములచేతను; దారుణారుతైః, దారుణ=భయంకరమగు, ఆరుతైః=ధ్వనిగల; శకుంతైః=భాసపక్షులచేతను; పూర్ణం=నిండినదిగాను; భైరవస్వనైః = భయంకరధ్వనిగలవియును; వాశ్యద్భిః=కుత్సితముగానఱచుచున్నవియును; నానాప్రకా

రై:=నానావిధములైనవియునగు; శకునైః = పక్షులచేతను;సింహవ్యాఘ్రవరాహైశ్చ= సింహముల చేతను పెద్దపులులచేతనుపందులచేతను; వారణైశ్చ=ఏనుఁగులచేతను; ఉపశోభితం = ప్రకాశించుచున్నది గాను; ధవాశ్వకర్ణకకుభైః, ధవ= చండ్రచెట్లచేతను, అశ్వర్ణ=ఇనుమద్దిచెట్లచేతను,కకుభైః=ఏఱుమద్దిచెట్లచేతను; బిల్వతిందుకపాటలైః,బిల్వ = మారేడుచెట్లచేతను,తిందుక=తుమికిచెట్లచేతను, పాటలైః= కలిగొట్టుచెట్లచేతను; బదరీభిశ్చ= రేఁగుచెట్లచేతను; సంకీర్ణం= వ్యాపింపఁబడినదిగాను; భవతి=అగుచున్నది. అహో = ఆశ్చర్యము!ఏతత్=ఈ; దారుణం=భయంకరమైన; వనం=అడవి=కిన్ను=ఏమిటిది?

ఈయడవి,ప్రవేశింపనశక్యమై, ఈలపురుగుల గుంపుచే శబ్దాయమానమై, భయంకరంబులగుక్రూర మృగంబులును దారుణంబుగానఱచుభాస పక్షులునుంగలిగి, మఱియు, భయంకరంబుగాధ్వనించునట్టినానావిధంబులగుపక్షులచేతసింహవ్యాఘ్ర వరాహంబులచేత నేనుంగులచేతఁబూర్ణంబై, చండ్రయినుమద్దియేఱుమద్దిమారేడు తుమ్మికి కలిగొట్టురేఁగుమొదలగు వృక్షంబులనిండియున్నది;ఆశ్చర్యము!భయంకరంబగు నీయడవిపేరేమి? అనిరాముఁడడిగెను. అని, తాత్పర్యము.

తమువాచ మహాతేజా విశ్వామిత్రో మహామునిః
శ్రూయతాం వత్స కాకుత్స్థ యస్యైత ద్దారుణం వనమ్. ౧౬

టీక॥ మహాతేజాః=అధికమైన ప్రభావముగలవాఁడును; మహామునిః=పూజ్యుఁడైనమునియునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; తం= ఆరామునిఁగూర్చి; ఉవాచ=పలికెను. కాకుత్స్థ=కకుత్స్థవంశమునఁబుట్టిన;వత్స=చిన్నవాఁడా!ఏతత్= ఈ; దారుణం=భయంకరమైన;వనం=అడవి; యస్య=ఏప్రాణిదో; సః(అధ్యాహృతము)= ఆప్రాణి; శ్రూయతాం=వినఁబడుఁగాక.

మహాప్రభావుండగువిశ్వామిత్ర

మహాముని, రామునింజూచి, యిట్లని, చెప్పెను: రాముఁడా! భయంకరంబగునీవనంబే ప్రాణిదో, ఆప్రాణింజెప్పెద, వినుము. అని, తాత్పర్యము.

ఏతౌ జనపదా స్స్ఫీతౌ పూర్వ మాస్తాం నరోత్తమ
మలదాశ్చ కరూశాశ్చ దేవనిర్మాణ నిర్మితౌ. ౧౮

టీక ॥ నరోత్తమ=పురుషశ్రేష్ఠుఁడవైనరాముఁడా! దేవనిర్మాణనిర్మితౌ, దేవనిర్మాణ=దేవతలయొక్క పనివంటిపనిచేత, నిర్మితౌ = నిర్మింపఁబడిన; మలదాశ్చ=మలదదేశంబును; కరూశాశ్చ = కరూశదేశంబుననియెడు; ఏతౌ=ఈ, జనపదౌ=దేశములు; పూర్వం = మునుపు; స్ఫీతౌ=వృద్ధిఁబొందినవిగా; ఆస్తాం=ఉండినవి.

రాముఁడా! దేవతలుచేయుపనివంటిపనిచేతనిర్మింపఁబడిన, యీమలదకరూశదేశంబులు రెండును, మునుపు, ధనధాన్యంబులవృద్ధినొంది, యుండినవి.

అని, తాత్పర్యము.

పురా వృత్రవధే రామ మలేన సమభిప్లుతమ్
క్షుధా చైవ సహస్రాక్షం బ్రహ్మహత్యా సమావిశత్. ౧౯

టీక॥ రామ=రాముఁడా! పురా=మునుపు; వృత్రవధే=వృత్రాసురునిచంపుటయగుచుండఁగా; మలేన=అశుచిత్వముచేతను; క్షుధా చైవ=ఆకలిచేతను; సమభిప్లుతం=వ్యాపింపఁబడిన; సహస్రాక్షం=వేయికండ్లుగలయిందునిని; బ్రహ్మహత్యా= బ్రహ్మహత్యపాపము; సమావిశత్=పొందెను.

రాముఁడా! పూర్వము, ఇంద్రుఁడువృత్రునిం జంపిన పిమ్మట, నాయింద్రుఁడు, అశుచిత్వము నాఁకలియునుంగల్గి, బ్రహ్మహత్యపాపము నొందెను. అని, తాత్పర్యము.

త మింద్రం స్నాపయన్ దేవా ఋషయశ్చ తపోధనాః

కలశై స్స్నాపయామాసు ర్మలంచాస్య ప్రమోచయన్. ౧౯

టీక॥ దేవాః=దేవతలు; తపోధనాః=తపస్సే ధనముగాఁగల; ఋషయశ్చ=ఋషులును. తం = ఆ; ఇంద్రం=ఇంద్రుని; స్నాపయన్ (పుణ్యతీర్థంబులచేత) స్నానముచేయించిరి. కలశైః=(మంత్రపూతంబులగు) కలశంబులచేత ; స్నాపయామాసుః=స్నానముచేయించిరి. అస్య=ఈయింద్రునియొక్క; మలంచ=అశుచిత్వమును, (చకారముచే) ఆఁకలిని, ప్రమోచయన్=విడిపించిరి.

దేవతలునుదపోధనులగు ఋషులును, ఆయిందు (ని గంగాది పుణ్యతీర్థంబులనభిషేకించి, పిమ్మట, మంత్రపూతంబు లగు కలశజలంబుల స్నానముచేయించి, యతనియశుచిత్వము నాఁకలినివిడిపించిరి.

అని, తాత్పర్యము.

ఇహ భూమ్యాం మలం దత్వా దత్వా కారూశ మేవచ
శరీరజం మహేంద్రస్య తతో హర్షం ప్రపేదిరే. ౨౦

టీక॥ తే (అధ్యాహృతము)= ఆదేవతలును ఋషులును; ఇహ= ఈ; భూమ్యాం=ప్రదేశమందు; మహేంద్రస్య= దేవేంద్రునియొక్క; శరీరజం=దేహమందుఁబుట్టిన; మలం=అశుచిత్వమును; దత్వా=ఇచ్చి; కారూశమేవచ= ఆఁకలిని; దత్వా=ఇచ్చి; తతః=అటుపిమ్మట; హర్షం= సంతసమును; ప్రపేదిరే=పొందిరి.

ఆదేవతలునుఋషులును, ఇంద్రునిశరీరమువందుఁబుట్టిన యశుచిత్వమునాఁకలి నీదేశంబునవిడచి, యంతట, సంతసమునొందిరి.

అని, తాత్పర్యము.

నిర్మలో నిష్కరూశశ్చ శుచి రింద్రో యదాభవత్
దదౌ దేశస్య సుప్రీతో వరం ప్రభు రనుత్తమమ్. ౨౧

టీక॥ ప్రభుః=రాజైన; ఇంద్రః=ఇంద్రుఁడు; యదా=ఎప్పుఁడు;

నిర్మలః = అశుచిత్వములేనివాఁడై; నిష్కరూశశ్చ = ఆఁకలిలేనివాఁడై, శుచిః = పరిశుద్ధుఁడుగా; అభవత్ = ఆయెనో; తదా (అధ్యాహృతము) = అప్పుడు; సుప్రీతః = మిక్కిలి సంతసించినవాఁడై; దేశస్య = దేశమునకు, అనుత్తమం = తనకన్నశ్రేష్ఠమయినవరము లేనిదగు; వరం = వరమును; దదౌ = ఇచ్చెను.

ప్రభువైనయింద్రుఁడు, ఎప్పుడు తాను, మలమునాఁకలివిడిచి పరిశుద్ధుండయ్యెనో, అప్పుడు, చాలసంతసించి, యీదేశమునకు శ్రేష్ఠమయినవరంబొసంగెను.

అని, తాత్పర్యము.

ఇమౌ జనపదౌ స్ఫీతౌ ఖ్యాతిం లోకే గమిష్యతః
మలదాశ్చ కరూశాశ్చ మమాంగమలధారిణౌ. ౨౨

టీక॥ మమ = నాయొక్క; అంగమలధారిణౌ, అంగ = శరీరమునందలి, మల = మలమును (ఇది కారూశమునకు నుపలక్షణము) కారూశమును, ధారిణౌ = ధరించియున్న; ఇమౌ = ఈ; దేశౌ = దేశములు; స్ఫీతౌ = వృద్ధిబొందినవై; మలదాశ్చ = మలదములనియు (మలంద్యతీతిమలదః, మలమునుఖండించునదికావున మలదమనంబడును); కరూశాశ్చ = కరూశములనియును (కరూశమస్యాస్తీతికరూశః కరూశము గలది కరూశమనంబడును); లోకే = ప్రపంచమునందు; ఖ్యాతిం = ప్రసిద్ధిని; గమిష్యతః = పొందఁగలవు.

నాదేహంబునంగల్గిన మలంబు నాఁకలినిధరించినయీదేశంబులు, ధనధాన్యాదికంబులవృద్ధినొంది, నాదేహమలమునుఖండించుటం బట్టిమలదంబులనియు, నాకరూశమునుగ్రహించుటం బట్టి, కరూశంబు లనియు, లోకంబునఁబ్రసిద్ధివహింపఁగలవు. అనియింద్రుఁడువరంబిచ్చెను.

అని, తాత్పర్యము.

సాధు సాధ్వితి తం దేవాః పాకశాసన మబ్రువన్
దేశస్య పూజాం తాం దృష్ట్వా కృతాం శక్రేణ ధీమతా. ౨౩

టీక॥ ధీమతా = బుద్ధిశాలియగు; శక్రేణ = ఇంద్రునిచేత; కృతాం=చేయఁబడిన; తాం=ఆ; దేశస్య=దేశముయొక్క; పూజాం=పూజను; దృష్ట్వా=చూచి; దేవాః=దేవతలు; తం=ఆ; పాకశాసనం=పాకాసురుని శిక్షించిన దేవేంద్రునిఁ గూర్చి; సాధుసాధు=బాగుబాగు; ఇతి=అని; అబ్రువన్=పల్కిరి.

ధీమంతుఁడగునింద్రుఁడు దేశమునుబూజించినది చూచి, దేవతలాయింద్రుని, బాగుబాగని, కొనియాడిరి. అని. తాత్పర్యము.

ఏతౌ జనపదౌ స్ఫీతౌ దీర్ఘకాల మరిందమ
మలదాశ్చ కరూశాశ్చ ముదితౌ ధనధాన్యతః. ౨४

టీక॥ అరిందమ=శత్రువులనణఁగఁద్రొక్కు రాముఁడా! ఏతౌ=ఈ; మలదాశ్చ=మలదంబులును; కరూశాశ్చ=కరూశంబులునవేడు; జనపదౌ=దేశములు; దీర్ఘకాలం=పెద్దకాలము; స్ఫీతౌ=వృద్ధిఁబొందినవిగాను; ధనధాన్యతః=ధనంబున ధాన్యంబునను; ముదితౌ=సంతసించినవిగాను; అభూతాం(అధ్యాహృతము)=ఉండినవి.

శత్రువులం జంపునట్టి రాముఁడా! ఈమలదంబులుకరూశంబులునవేడు దేశంబులు పెద్దకాలము వఱకు, వృద్ధినొందిధనధాన్యంబులసంతుష్టినొందియుండినవి.

అని, తాత్పర్యము.

కస్యచి త్త్వథ కాలస్య యక్షీ వై కామరూపిణీ
బలం నాగసహస్రస్య ధారయంతీ తదాహ్యభూత్. ౨౫
తాటకానామ భద్రంతే భార్యా సుందస్య ధీమతః
మారీచో రాక్షసః పుత్రో యస్యా శ్శక్రపరాక్రమః. ౨౬

టీక॥ అథ=అటుపిమ్మట; కస్యచిత్=ఒకానొక; కాలస్యతు=కాల




ముకాఁగా నే;కామరూపిణీ=ఇచ్ఛాధీనమగురూపము గలదియును; తదాహి=అప్పుడే,అనఁగా, పుట్టినప్పుడే;నాగసహస్రస్య = వెయ్యేనుఁగులయొక్క; బలం= లావును; ధారయంతీ= ధరింపుచున్నదియును;ధీమతః=బుద్ధిశాలియగు; సుందస్య=సుందునియొక్క; భార్యా=భార్యయునగు; రాక్షసః= రక్కసుండును;శక్రపరాక్రమః=ఇంద్రునియొక్క పరాక్రమమువంటి పరాక్రమముగలవాఁడునగు;మారీచః=మారీచుఁడు;యస్యాః=ఎవ్వతెయొక్క;పుత్రః=కొడుకో;సా(అధ్యాహృతము)=అట్టి;తాటకానామ=తాటకయనుపేరుగల; యక్షీ=యక్షస్త్రీ ("వై" అనునది పాదపూరణార్థము);అభూత్=కల్గినది. తే=నీకు;భద్రం = మంగళము;అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక.

అంతఁ గొంత కాలముగడచినపిదపఁ, గామరూపిణియును,బుట్టినప్పుడె , వెయ్యేనుఁగులబలముగల్గియుండినదియును , ధీమంతుండగు సుందుని భార్యయునగుతాటకయనునొక్కయక్షస్త్రీ,పుట్టినది; ఆబిడకు, రాక్షసుండునుఇంద్రునితోసరివచ్చుపరాక్రమము గలవాఁడునగు మారీచుండుకొడుకయ్యెను; నీకా తాటకామారీచులవలనిభయంబుగలుగకుండుఁగాక.

అని, తాత్పర్యము.

వృత్తబాహు ర్మహావీర్యో విపులాస్యతను ర్మహాన్
రాక్షసో భైరవాకారో నిత్యం త్రాసయతే ప్రజాః. ౨౭

టీక ॥ వృత్తబాహుః=గుండ్రములైనచేతులుగలవాఁడును;మహావీర్యః=గొప్పపరాక్రమముగలవాఁడును; విపులాస్యతనుః, విపుల=విశాలములైన, ఆస్య=ముఖమును,తనుః=శరీరమునుంగలవాఁడును; మహాన్=గొప్పవాఁడును;భైరవాకారః=భయంకరమైన యాకారముగలవాఁడునగు; రాక్షసః=రాక్షసుఁడైనమారీచుఁడు;నిత్యం=ఎల్లప్పుడును;ప్రజాః = జనులను;త్రాసయతే=వెఱపించుచున్నాఁడు.




మహాపరాక్రమశాలియగు, నా మారీచుఁడు,గుండ్రంబులగుబాహువులునువిశాలంబయినముఖంబునుం గల్గి, భయంకరాకారుండై,యెల్లప్పుడుం బ్రజలను వెఱపించు చున్నాఁడు. అని, తాత్పర్యము.

ఇమౌ జనపదౌ నిత్యం వినాశయతి రాఘవ
మలదాంశ్చ కరూశాంశ్చ తాటకా దుష్టచారిణీ. ౨౭

టీక॥ రాఘవ=రఘువంశమునం బుట్టిన రాముఁడా! దుష్టచారిణీ=దుర్మార్గురాలైన, లేక, దుష్టముగాసంచరించునట్టి; తాటకా=తాటక; ఇమౌ=ఈ; మలదాంశ్చ=మలదంబులును; కరూశాంశ్చ=కరూశంబులు ననియెడి; జనపదౌ=దేశములను; నిత్యం=ఎల్లప్పుడును; వినాశయతి=నాశనము సేయుచున్నది.

రాముఁడా! దుష్టచారిణియగు తాటక, ఈమలదకరూశ దేశంబుల, నెల్లప్పుడును, నాశనము సేయుచున్నది. అని, తాత్పర్యము.

సేయం పంథాన మావృత్య వస త్యధ్యర్థయోజనే
అతఏవ నగంతవ్యం తాటకాయా వనం యతః. ౨౮

టీక॥ సా=అట్టి, అనఁగా, పుట్టినప్పుడె వెయ్యేనుంగులబలముగల్గియుండిన; ఇయం=ఈ తాటక; అధ్యర్థయోజనే, అధ్యర్థ=సగము అధికముగాఁగల; యోజనే = ఆమడదూరంబునందు; పంథానం=మార్గమును; అవృత్య (ఇదిమహేశ్వరతీర్థపారము) ఆవార్య (ఇది గోవింద రాజపారము)=అడ్డగించి; వసతి=వాసముసేయుచున్నది. యతః= ఏమార్గమందు; తాటకాయాః= తాటకయొక్క; వనం=అడవి; అస్తి(అధ్యాహృతము)=ఉన్నదో; అతఏవ=అట్టి, యీమార్గముననే ; నగంతవ్యం=పోఁబడరాదు.

ఆ తాటక, యిక్కడికిఒకటిన్నఅయామడదూరంబున, మార్గమునడ్డగించివసించుచున్నది; అదే తాట

కావనముకావున, నీమార్గంబుననునముపోరాదు. అని, తాత్పర్యము.

స్వబాహుబల మాశ్రిత్య జహీమాం దుష్టచారిణీమ్
మన్నియోగా దిమం దేశం కురు నిష్కంటకం పునః. ౩౦

టీక॥ స్వబాహుబలం, స్వ=స్వీయమైన, బాహు=చేతులయొక్క, బలం=లావును; ఆశ్రిత్య=ఆశ్రయించి; ఇమాం=ఈ; దుష్టచారిణీం=దుర్మార్గురాలైనతాటకను ; జహి=చంపుము. మన్నియోగాత్=నాయాజ్ఞవలన; ఇమం= ఈ; దేశం=దేశమును; పునః = మరల; నిష్కంటకం=ఉపద్రవములేనిదిగా; కురు=చేయుము.

నీవు, స్వబాహుబలంబు నాశ్రయించి, దుష్టచారిణియగు నీతాటకంజంపుము; నాపంపున, నీదేశమును మునుపటివలె , నిరుపద్రవముగాఁజేయుము.

అని, తాత్పర్యము.

నహి కశ్చి దిమం దేశం శక్నోత్యాగంతు మీదృశమ్
యక్షిణ్యా ఘోరయా రామ ఉత్సాదిత మసహ్యయా. ౩౧

టీక॥ రామ=రాముఁడా! ఘోరయా=భయంకరురాలును; అసహ్యయా= ఇతరులచే, సహింపఁగూడనిదియునగు; యక్షిణ్యా=యక్షస్త్రీయగుతాటకచేత; ఉత్సాదితం=విజనముగాఁజేయఁబడిన; ఈదృశం= ఇట్టిపవిత్రమైన; ఇమం= ఈ, దేశం=దేశమును; ఆగంతుం= పొందుటకు; కశ్చిత్=ఒకానొకఁడైనను; నశక్నోతిహి=సమర్థుఁడు కాఁడుగదా'

రాముఁడా! ఎవ్వరికినిసహింపఁగూడనిభయంకరియగు నీతాటకచే నిర్జనముగాఁజేయఁబడిన యిట్టిపుణ్య దేశమును బ్రవేశించుటకెవ్వండునుసమర్థుఁడుగాఁడు.

అని, తాత్పర్యము.

ఏత త్తే సర్వ మాఖ్యాతం యథైత ద్దారుణం వనమ్
యక్ష్యోచ్చోత్సాదితం సర్వ మద్యాపి న నివర్తతే. ౩౨

టీక॥ యథా=ఎట్లు; ఏతత్=ఈ; వనం=అడవి; దారుణం=భయంకరమయినదో; యక్ష్యా=తాటకచేత; సర్వం=అంతయును; ఉత్సాదితంచ=నిర్జనముగాఁ జేయఁబడినదో; అద్యాపి=ఇప్పటికిని; ననివర్తతే= సరిపడలేదో; తత్=(అధ్యాహృతము) ఆ; ఏతత్=ఈ వృత్తాంతము; సర్వం=అంతయును; తే=నీకు; ఆఖ్యాతం=చెప్పఁబడినది.

ఈవనము, ఎట్లుభయంకరమైనదో, ఎట్లుతాటకచేతవిజనముగాఁ జేయఁబడినదో, ఎట్లు, ఇప్పటికిని, ఆలాగేయున్నదో; ఆవృత్తాంతమంతయును నీకుఁ జెప్పితిని. అని, విశ్వామిత్రుఁడు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, చతుర్వింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండ చతుర్వింశసర్గ టీక, ముగిసినది.

---

శ్రీ

## పంచవింశసర్గప్రారంభః.

అథ తస్యాప్రమేయస్య మునే ర్వచన ముత్తమమ్
శ్రుత్వా పురుషశార్దూలః ప్రత్యువాచ శుభాం గిరమ్. ౧

టీక॥ అథ=పిమ్మట; అప్రమేయస్య=కొలతపెట్టరాని; తస్య=ఆ; మునేః=విశ్వామిత్రునియొక్క; ఉత్తమం=శ్రేష్ఠమయిన; వచనం=మాటను; శ్రుత్వా=విని; పురుషశార్దూలః= పురుషశ్రేష్ఠుండగు రాముఁడు; శుభాం=మంగళకరంబైన; గిరం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

అంత, నప్రమేయంబగుప్రభావముగలవిశ్వామిత్రుని యుత్తమంబగుమాటవిని, పురుషశ్రేష్ఠుండయిన రాముండు, ఇట్లని, మనోహరంబుగాఁబలికెను. అని, తాత్పర్యము.

అల్పవీర్యా యదా యక్షా శ్శ్రూయంతే మునిపుంగవ
కథ న్నాగసహస్రస్య ధారయ త్యబలా బలమ్. ౨

టీక॥ మునిపుంగవ= మునిశ్రేష్ఠుఁడవైన విశ్వామిత్రుఁడా! యదా=ఏకారణమువలన; యక్షాః=యక్షులు; అల్పవీర్యాః= కొంచెముబలముఁగలవారలుగా; శ్రూయంతే= వినఁబడుచున్నారో; తత్=(అధ్యాహృతము) ఆకారణంబున; కథం=ఎట్లు; అబలా=స్త్రీ; నాగసహస్రస్య = వెయ్యేనుఁగులయొక్క; బలం=లావును; ధారయతి= ధరింపుచున్నది?

మునిశ్రేష్ఠుఁడవైన విశ్వామిత్రుఁడా! యక్షులల్ప వీర్యులని ప్రసిద్ధము; అందు, బలములేమిచే, అబలయనిచెప్పఁబడు స్త్రీకి, వెయ్యేనుంగులబలంబెట్లున్నది ? అని, రాముఁడడిగెను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రో బ్రవీ ద్వాక్యం శృణు యేన బలోత్తరా
వరదానకృతం వీర్యం ధారయ త్యబలా బలమ్. ౩

టీక॥ విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను. యేన = దేనిచేత; బలోత్తరా = బలముచేనధికురాలో; తత్ (అధ్యాహృతము) = ఆ కారణమును; శృణు = వినుము. వరదానకృతం = వరదానంబుచేఁజేయఁబడిన; బలం = బలము; అస్తి (అధ్యాహృతము) = ఉన్నది. గనుక; అబలా = (స్త్రీ); బలం = బలమును; ధారయతి = ధరింపుచున్నది.

విశ్వామిత్రుండు చెప్పెను. తాటకకు బలంబు గలిగి నందుకుం గల కారణంబువినుము; ఆబిడకువరదానంబునఁబలంబుగల్గినది; కాఁబట్టి, (స్త్రీ) యైనను బలాఢ్యురాలుగానున్నది. అని, తాత్పర్యము.

పూర్వ మాసీ న్మహాయక్ష స్సుకేతు ర్నామ వీర్యవాన్
అనపత్య శ్శుభాచార స్సచ తేపే మహ త్తపః. ౪

టీక॥ పూర్వం = మునుపు; వీర్యవాన్ = పరాక్రమముగలవాఁడును; అనపత్యః = సంతానములేనివాఁడును; శుభాచారః = మంగళకరమైన యాచారముగలవాఁడునగు; సుకేతుర్నామ = సుకేతువుఅనెడు; మహాయక్షః = గొప్పయక్షుఁడు; ఆసీత్ = ఉండెను. సచ = వాఁడును; మహత్ = గొప్పదగు; తపః = తపస్సును; తేపే = తపించెను.

పూర్వము; పరాక్రమశాలియగుసుకేతుండను మహాయక్షుండొకఁడు, మంచియాచారముగల్గి, యనపత్యుండై, యుండెను; వాఁడుసంతానార్థముగా గొప్పతపస్సుచేసెను. అని, తాత్పర్యము.

పితామహస్తు సుప్రీత స్తస్య యక్షపతే స్తదా
కన్యారత్నం దదౌ రామ తాటకా నామ నామతః. ౫

టీక॥ రామ = రామునఁడా! తదా=అప్పుడు; పితామహస్తు=బ్రహ్మ దేవుండును; సుప్రీతః=మిక్కిలి సంతసించినవాఁడై; తస్య=ఆ; యక్షపతేః=యక్షులకుఁ బ్రభువగుసుకేతునకు; నామతః= పేరువలన; తాటకానామ=తాటకయనిప్రసిద్ధమైన; కన్యారత్నం= శ్రేష్ఠమయిన కొమార్తెను, దదౌ=ఇచ్చెను.

రామునఁడా! అప్పుడు, బ్రహ్మదేవుండును, జాలసంతసించి, యాయక్షపతియగుసుకేతునకు, తాటకయనెడుకొమార్తె నిచ్చెను.

అని, తాత్పర్యము.

దదౌ నాగసహస్రస్య బలం చాస్యాః పితామహః
నత్వేవ పుత్రం యక్షాయ దదౌ బ్రహ్మా మహాయశాః. ౬

టీక॥ పితామహః= బ్రహ్మ దేవుఁడు; అస్యాః=ఈ తాటకకు; నాగసహస్రస్య = వెయ్యేనుంగులయొక్క; బలంచ=బలమును(చకారముచేఇతరవరములను); దదౌ=ఇచ్చెను. మహాయశాః=గొప్పకీర్తిగల; బ్రహ్మా= బ్రహ్మ దేవుఁడు; యక్షాయ= యక్షుండగుసుకేతునికొఱకు; పుత్రంతు = కొడుకునుమాత్రము; నదదౌఏవ=ఇవ్వనేలేదు.

బ్రహ్మదేవుం డీతాటకకు వెయ్యేనుంగులబలముసైతమునిచ్చెను; సుకేతునకుఁ గొడుకునుమాత్రము, బ్రహ్మ దేవుండివ్వనేలేదు.

అని, తాత్పర్యము.

తాంతు జాతాం వివర్ధంతీం రూపయౌవనశాలినీమ్
ఝర్ఝరపుత్రాయ సుందాయ దదౌ భార్యాం యశస్వినీమ్. ౭

టీక॥ సుకేతుః (అధ్యాహృతము)=సుకేతువు; జాతాం=పుట్టినదియును; వివర్ధంతీం=చక్కఁగావృద్ధిఁబొందుచున్నదియును ; రూపయౌవనశాలినీం, రూప=సౌందర్యముచేతను, యౌవన=యౌవనముచేతను, శాలినీం=ప్రకాశించునదియును; యశస్వినీం = మంచికీర్తిగలది

 

యునగు; తాం = ఆ తాటకను; ఝర్ఝర పుత్రాయ = ఝర్ఝరునికొడుకైన; సుందాయ = సుందునికొఱకు; భార్యాం = భార్యనుగా; దదౌ = ఇచ్చెను.

సుకేతుం, డిట్లు, పుట్టి, పెరుఁగుచు, సౌందర్య యౌవనంబులనొప్పుచు, మంచికీర్తిగలిగియున్న, యాతాటకను, ఝర్ఝరపుత్రుండగు సుందునకిచ్చి, పెండ్లిగావించెను.

అని, తాత్పర్యము.

కస్యచి త్త్వథ కాలస్య యక్షీ పుత్ర మజాయత
మారీచం నామ దుర్ధర్షం య శ్శాపా ద్రాక్షసోఽభవత్. ౧౦

టీక॥ అథ = అటుపిమ్మట; కస్యచిత్ = ఒకానొక; కాలస్యతు = కాలముకాఁగానే; యక్షీ = యక్షస్త్రీయగు తాటక; యః = ఎవఁడు; శాపాత్ = శాపమువలన; రాక్షసః = రాక్షసుఁడుగా; అభవత్ = ఆయెనో; తం (అధ్యాహృతము) = అట్టి; దుర్ధర్షం = ఎదిరింపఁగూడని; మారీచం నామ = మారీచుఁడనెడు; పుత్రం = కొడుకును; అజాయత = కనెను.

అంతఁ, గొంత కాలముగడచినపిదప, తాటక, శాపంబువలన రాక్షసత్వంబుఁబొందిన మారీచుండనియెడునొకపరాక్రమశాలియగుకుమారునింగనెను. అని, తాత్పర్యము.

సుందేతు నిహతే రామ సాఽగస్త్య మృషిసత్తమమ్
తాటకా సహపుత్రేణ ప్రధర్ష యితు మిచ్ఛతి. ౧౧

టీక॥ రామ = రాముఁడా! సుందే = సుందుఁడు; నిహతేతు = అగస్త్యునిచేత, చంపఁబడఁగానే; సా = ఆ; తాటకా = తాటక; పుత్రేణసహ = కొడుకుతోఁగూడ; ఋషిసత్తమం = ఋషిశ్రేష్ఠుండగు; అగస్త్యం = అగస్త్యుని; ప్రధర్షయితుం = ఎదిరించుటకు, ఇచ్ఛతి (భూతార్థమందులట్) = కోరెను.

అగస్త్యునిచేసుందుఁడుచంపఁబ

 

డఁగానే, తాటకమారీచునింగూడి, కోపించి , ఋషిసత్తముండగునగస్త్యునిధర్షింపఁగోరెను.

అని, తాత్పర్యము.

భక్షార్థం జాతసంరంభా గర్జంతీ సాభ్యధావత

టీక॥ సా=ఆతాటక; జాతసంరంభా, జాత=పుట్టిన; సంరంభా=వేగిర పాటుగలదై; గర్జంతీ=అఱచుచు; భక్షార్థం= భక్షించుటకొఱకు; అభ్యధావత=అగస్త్యునిపైకి, పరుగెత్తెను.

ఆతాటక, వేగముగలదై, యఱచుచు, నాయగస్త్యునిపైకిఁబరుగెత్తెను. అని, తాత్పర్యము.

ఆపతంతీంతు తాం దృష్ట్వా అగస్త్యో భగవానృషిః. ౧౦
రాక్షసత్వం భజస్వేతి మారీచం వ్యాజహార సః

టీక॥ ఆపతంతీం=పైకి, వచ్చుచున్న; తాం=ఆతాటకను; దృష్ట్వా తు=చూచినంతనే; భగవాన్=భగవంతుఁడైన; ఋషిః=ఋషియగు; సః=ఆ; అగస్త్యః=అగస్త్యుఁడు; రాక్షసత్వం = రాక్షసుండగుటను; భజస్వ=పొందుము; ఇతి=అని; మారీచం=మారీచునిఁగూర్చి; వ్యాజహార=చెప్పెను.

ఆతాటక, పైకివచ్చుటం జూచినంతనే; భగవంతుండగు నాయగస్త్యమహర్షి, రాక్షసుండవుగమ్మని, మారీచునిశపించెను.

అని, తాత్పర్యము.

అగస్త్యః పరమక్రుద్ధ స్తాటకామపి శప్తవాన్. ౧౧
పురుషాదీ మహాయక్షీ విరూపా వికృతాననా
ఇదం రూపం విహాయాథ దారుణం రూపమస్తు తే. ౧౨

 



టీక॥ అగస్త్యః=అగస్త్యుఁడు; పరమక్రుద్ధః= మిక్కిలియుఁగోపించినవాఁడై; త్వం = నీవు; ఇదం=ఈ; రూపం=రూపును; విహాయ=విడిచి; పురుషాదీ=మనుష్యులభక్షించుదానవుగా; మహాయక్షీ=గొప్పయక్షస్త్రీగా; విరూపా=వికృతరూపముగలదానవుగా; వికృతాననా, వికృత=రోఁతయయిన, ఆననా=ముఖముగల దానవుగా; భవ(అధ్యాహృతము)=కమ్ము. అథ=ఇంకమీఁద; తే=నీకు, దారుణం = భయంకరమగుఁ రూపం=రూపము; అస్తు=అగుఁగాక. ఇతి (అధ్యాహృతము)=అని; తాటకామపి= తాటకనుంగూడ; శశప్తవాన్=శపించెను.

అగస్త్యుఁడు, చాలఁగోపించి, "నీవీరూపమునువిడిచి, మనుష్యమాంసమునుభక్షించుచు, మహాయక్షివై, వికృతంబగు శరీరంబును ముఖంబునుంగలిగి, యుండుము; ఇంకమీఁద, నీకుభయంకరంబగు రూపముగలుగుఁగాక," అని, తాటకనుంగూడ, శపించెను. అని, తాత్పర్యము.

సైషా శాపకృతామర్షా తాటకా క్రోధమూర్ఛితా
దేశ ముత్సాదయ త్యేన మగస్త్యచరితం శుభమ్. ౧౩

టీక॥ సా=అట్టి; ఏషా = ఈ; తాటకా=తాటక; శాపకృతామర్షా, శాప = శాపముచే, కృత=చేయఁబడిన, అమర్షా= ఓర్వమిగలదై; క్రోధమూర్ఛితా, క్రోధ=కోపముచేత, మూర్ఛితా=వ్యాపింపఁబడినదై; అగస్త్యచరితం=అగస్త్యునిచేసంచరింపఁబడినదియును; శుభం= మంగళకరమయినదియునగు; ఏనం=ఈ; దేశం=దేశమును; ఉత్సాదయతి = నిర్జనముగాఁజేయుచున్నది.

ఆతాటక, శాపంబు సహింపక, కోపంబువహించి, పూర్వంబగస్త్యునియునికిపట్టయియుండినమంగళకరంబగునీదేశంబునంతయు నిర్జనముగాఁజేయుచున్నది.

అని, తాత్పర్యము.

ఏనాం రాఘవ దుర్వృత్తాం యక్షీం పరమ దారుణామ్

 

గోబ్రాహ్మణ హితార్థాయ జహి దుష్ట పరాక్రమామ్. ౧౪

టీక॥ రాఘవ=రఘువంశమునఁ బుట్టినరాముఁడా! దుర్వృత్తాం=దురాచారము గలదియును; పరమదారుణాం = మిక్కిలిభయంకరురాలును; దుష్టపరాక్రమాం, దుష్ట=దుష్టమైన, పరాక్రమాం= వీర్యముగలదియునగు; ఏనాం=ఈ; యక్షీం =యక్షస్త్రీయైన తాటకను; గోబ్రాహ్మణహితార్థాయ, గో=ఆవులయొక్కయు, బ్రాహ్మణ=బ్రాహ్మణులయొక్కయు, హిత=మేలనెడు, అర్థాయ = ప్రయోజనముకొఱకు; జహి=చంపుము.

రాముఁడా! గోబ్రాహ్మణుల మేలుకొఱకు,దురాచారయై పరమభయంకరయైదుస్సహముగు పరాక్రమముగలిగియున్న యీ తాటకం జంపుము.

అని, తాత్పర్యము.

నహ్యేనాం శాపసంస్పృష్టాం కశ్చి దుత్సహతే పుమాన్
నిహంతుం త్రిషు లోకేషు త్వా మృతే రఘునందన. ౧౫

టీక॥ రఘునందన=రాముఁడా! శాపసంస్పృష్టాం= శాపముచేత వ్యాపింపఁబడినట్టి; ఏనాం=ఈతాటకను;నిహంతుం=చంపుటకు;త్వా మృతే=నిన్నువిడిచి; త్రిషు=మూఁడైన; లోకేషు=లోకములయందును;కశ్చిత్ =ఒకానొక;పుమాన్= పురుషుఁడును; నోత్సహతే=హి=ఉత్సహింపఁడు.గదా!

రాముఁడా! నీవుదక్క,శాపంబుచేఁగోపించియుండు నీతాటకం జంపుటకు,మూఁడులోకంబులందెవ్వండునుశక్తుండుకాఁడు.

అని, తాత్పర్యము.

నహి తే స్త్రీ వధకృతే ఘృణా కార్యా నరోత్తమ
చాతుర్వర్ణ్య హితార్థాయ కర్తవ్యం రాజసూనునా. ౧౬

టీక॥ నరోత్తమ=మనుష్యశ్రేష్ఠుఁడవైనరామఁడా! స్త్రీవధకృతే, స్త్రీవధ=ఆఁడుదానిచంపుట యొక్క, కృతే=చేయుటయందు; ఘృణా=జుగుప్స; తే=నీకు; నకార్యాహి = చేయఁదగినదికాదుగదా! రాజసూనునా = రాచకొమరుఁడగువానిచేత; చాతుర్వర్ణ్యహితార్థాయ, చాతుర్వర్ణ్య= నాలుగవర్ణములయొక్క, హిత= మేలనెడు, అర్థాయ=ప్రయోజనముకొఱకు; కర్తవ్యం= చేయఁబడవలసినది.

రామఁడా! నీవాఁడుదానిఁజంపవలయునని జుగుప్స సేయవలదు, రాజపుత్రుండగువాఁడు, నాలుగువర్ణములకును హితమయినకార్యమునునవశ్యము, సేయవలయు.

అని; తాత్పర్యము.

నృశంస మనృశంసం వా ప్రజారక్షణకారణాత్
పాతకం వా సదోషంవా కర్తవ్యం రక్షతా సతా. ౧౮

టీక॥ సతా=ధర్మిష్ఠుఁడైన; రక్షతా=రక్షించునట్టిరాజుచేత; ప్రజారక్షణకారణాత్, ప్రజా = జనుల యొక్క, రక్షణ=రక్షించుటయనెడు, కారణాత్=కారణమువలన; నృశంసం=క్రూరమైనదిగాని; అనృశంసంవా =క్రూరముకానిదిగాని; పాతకంవా=మహాపాపమైనదిగాని; సదోషంవా=అపవాదముతోఁగూడినదిగాని; కర్తవ్యం=చేయఁబడవలయును.

ధార్మికుండై ప్రజలరక్షించునట్టి రాజు, ప్రజలరక్షింపవలసియుండుటంబట్టి, క్రూరమైనదిగాని, క్రూరముకానిదిగాని, మహాపాపముగాని, అపవాదము వచ్చునదిగాని, యేది ప్రజలకుహితమో, దానినవశ్యము, సేయవలయును. అని, తాత్పర్యము.

రాజ్యభారనియుక్తానా మేష ధర్మ స్సనాతనః
అధర్మ్యాం జహి కాకుత్స్థ ధర్మోహ్యస్యా న విద్యతే. ౧౯

టీక॥ ఏషః=ఇది; రాజ్యభారని యుక్తానాం, రాజ్య=దొరతనము యొక్క, భార=భరించుటయందు, నియుక్తానాం= నియోగింపఁబడిన ట్టివారలయొక్క; సనాతనః=నిత్యమైన; ధర్మః=ధర్మము. కాకుత్థ్స=కకుత్థ్సవంశమునంబుట్టిన రాముఁడా! అధర్మ్యాం=అధర్మముగల తాటకను; జహి=చంపుము. అస్యాః=ఈ తాటకకు; ధర్మః=ధర్మము; నవిద్యతేహి=లేదుగదా!

ప్రజాలక్షణనిమిత్తమై, యేకార్యమైనను జేయుట, రాజ్యభారము నువహించియుండువారికి యెడతెగని ధర్మము; అధర్మములోనుండునీ తాటకం జంపుము; ఈ తాటక కెంతమాత్రమును ధర్మము లేదు.

అని, తాత్పర్యము.

శ్రూయతే హి పురా శక్రో విరోచనసుతాం నృప
పృథివీం హంతు మిచ్ఛంతీం మంథరా మభ్యసూదయత్ ౨౯

టీక॥ నృప=రాజా! పురా= మునుపు; శక్రః=ఇంద్రుఁడు; పృథివీం=భూమిని; హంతుం=చంపుటకు; ఇచ్ఛంతీం=కోరుచున్న; విరోచనసుతాం=విరోచనునికూఁతురైన; మంథరాం=మంథరను; అభ్యసూదయత్=చంపెను; ఇతి=(అధ్యాహృతము) అని; శ్రూయతే హి=వినఁబడుచున్నదిగదా!

రాముఁడా పూర్వము, విరోచనునికూఁతురగు మంథర భూమిం జంపఁగోరినందున ఇంద్రుండు దానిం జంపెను; అని వినుచున్నారముగదా! అని, తాత్పర్యము.

విష్ణునాపి పురా రామ భృగుపత్నీ దృఢవ్రతా
అనింద్రం లోక మిచ్ఛంతీ కావ్యమాతా నిషూదితా. ౨౦

టీక॥ రామః=రాముఁడా! పురా=మునుపు; విష్ణునాపి= విష్ణుదేవునిచేతను; లోకం=ప్రపంచమును; అనింద్రం = ఇంద్రుఁడులేనిదానిఁగా; ఇచ్ఛంతీ= కోరుచున్న; దృఢవ్రతా=స్థిరమైనవ్రతముగల; కావ్య

మాతా=శుక్రునితల్లియైన; భృగుపత్నీ=భృగుమహర్షి యొక్క-భార్య; నిషూదితా=చంపఁబడినది.

రాముఁడా! పూర్వము; ప్రపంచములో, నింద్రుఁడె, లేకపోవుఁగా కయనియింద్రునింజంపఁగడంగుటం బట్టి, శుక్రునితల్లియగుభృగుమహర్షి భార్య, విష్ణుదేవునిచేఁజంపఁబడినది.

అని, తాత్పర్యము.

ఏతై శ్చాన్యైశ్చ బహుభీ రాజపుత్ర మహాత్మభిః
అధర్మసహితా నార్యో హతాః పురుషసత్తమైః. ౨౧

టీక ॥ రాజపుత్ర=రాచకొమరుఁడవైనరాముఁడా! ఏతైశ్చ=ఇప్పుడు చెప్పఁబడినవారును; అన్యైశ్చ=ఇతరులునగు; బహుభిః=అనేకులయిన; మహాత్మభిః=మహాత్ములగు; పురుషసత్తమైః= పురుషశ్రేష్ఠులచేత; అధర్మసహితాః=అధర్మముతోఁగూడిన; నార్యః=స్త్రీలు; హతాః=చంపఁబడిరి.

ఇప్పుడు, చెప్పఁబడినవారలు, ఇంకనితరులనేకులు, మహాత్ములగు పురుషశ్రేష్ఠులు, అధర్మములు సేయుస్త్రీలంజంపియున్నారు.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, పంచవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ పంచవింశసర్గటీక,
ముగిసినది.



(శ్రీ)

షడ్వింశస్సర్గప్రారంభః.

మునే ర్వచన మక్లీబం శ్రుత్వా నరవరాత్మజః
రాఘవః ప్రాంజలి ర్భూత్వా ప్రత్యువాచ దృఢవ్రతః. ౧

టీక॥ మునేః = విశ్వామిత్రుని యొక్క; అక్లీబం=వ్యర్థముగానిదియగు; వచనం=మాటను; శ్రుత్వా=విని; దృఢవ్రతః=స్థిరమైనవ్రతముగల; నరవరాత్మజః, నరవర=రాజుయొక్క, ఆత్మజః=కొడుకైన; రాఘవః=రఘువంశమునందుఁబుట్టినరాముఁడు; ప్రాంజలిః = మంచిచేమోడ్పుగలవాఁడు; భూత్వా= అయి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

విశ్వామిత్రుఁడుచెప్పినయర్థవంతమగుమాటవిని, దృఢమైనవ్రతముగలరాజపుత్రుఁడగురాముండు, చేమోడ్పుగీలించి యిట్లని బదులు చెప్పెను. అని, తాత్పర్యము.

పితు ర్వచన నిర్దేశా త్పితు ర్వచనగౌరవాత్
వచనం కౌశికస్యేతి కర్తవ్య మవిశంకయా. ౨

టీక॥ పితుః=తండ్రియొక్క; వచననిర్దేశాత్, వచన=మాటయొక్క, నిర్దేశాత్=ఆజ్ఞవలనను; పితుః = తండ్రియొక్క; వచనగౌరవాత్, వచన=మాటయందలి, గౌరవాత్ =బహుమానమువలనను; ఇతి=ఇట్లు; కౌశికస్య=విశ్వామిత్రుని యొక్క; వచనం=మాట; అవిశంకయా = సందేహాభావముచేత; కర్తవ్యం=చేయఁబడవలయు.

తండ్రిగారియాజ్ఞవలనను, తండ్రిగారియాజ్ఞయందలిగౌరవంబునను, విశ్వామిత్రుండాజ్ఞాపించినట్లు, ఎంతమాత్రము సంశయముంచక, చేయవలసినది.

అని, తాత్పర్యము.

అనుశిష్టో ఽ స్మ్యయోధ్యాయాం గురుమధ్యే మహాత్మనా
పిత్రా దశరథేనాహం నావజ్ఞేయం హి తద్వచః. ౩

టీక॥ అయోధ్యాయాం=అయోధ్యయందు; మహాత్మనా=పూజ్యమగుస్వభావముగల;పిత్రా = తండ్రియయిన; దశరథేన= దశరథునిచేత; గురుమధ్యే=ఆచార్యులనడుమ; అహం=నేను; అనుశిష్టః=ఆజ్ఞాపింపఁబడినవాఁడను;అస్మి = అగుచున్నాను. తద్వచః=.ఆదశరథునిమాట;నావజ్ఞేయంహి = అవమానింపఁదగినదికాదుగదా!

అయోధ్యానగరమందు, మహాత్ముండునుదండ్రియునగు దశరథుండు, వసిష్ఠాదిగురుమధ్యంబున, "విశ్వామిత్రుండు సెప్పినట్లు, చేయుము" అని,నాకాజ్ఞాపించెను;ఆయనమాట, నుల్లంఘింప నలవిగాదు గదా!అని,తాత్పర్యము.

సోఽహం పితుర్వచ శ్శ్రుత్వా శాసనా ద్బ్రహ్మవాదినః
కరిష్యామి న సందేహ స్తాటకావధ ముత్తమమ్. ౪

టీక॥ పితుః=తండ్రియొక్క;వచః=మాటను;శ్రుత్వా = విని;స్థితః=ఉన్న;సః=అట్టి,అనఁగా,పితృవచనపాలనధురంధరుండనగు; అహం = నేను;బ్రహ్మవాదినః,బ్రహ్మ=వేదమును,వాదినః = చెప్పునట్టి విశ్వామిత్రుని యొక్క, అనఁగా,వేదార్థములనుపదేశించువిశ్వామిత్రునియొక్క; లేక,బ్రహ్మ=బ్రహ్మమును,వాదినః = చెప్పునట్టివిశ్వామిత్రునియొక్క , అనఁగా,బ్రహ్మోపదేశముసేయునట్టివిశ్వామిత్రునియొక్క; శాసనాత్=ఆజ్ఞవలన; ఉత్తమం=శ్రేష్ఠమైన;తాటకావధం=తాటకయొక్క చంపుటను;కరిష్యామి = చేసెదను.సందేహః=సందియము;న=లేదు.

ఇట్లు, తండ్రియాజ్ఞను వినియున్నవాఁడఁగావునఁ, దండ్రియాజ్ఞం బాలించుట నాకు ముఖ్యవ్రతంబగు

టంజేసి, బ్రహ్మవాదియగువిశ్వామిత్రునియాజ్ఞంబట్టి, తాటకంజంపెదనుఃసందియంబులేదు.

అని, తాత్పర్యము.

గోబ్రాహ్మణహితార్థాయ దేశస్యాస్య సుఖాయచ
తవ చైవా ప్రమేయస్య వచనం కర్తు ముద్యతః. ౫

టీక॥ గోబ్రాహ్మణహితార్థాయ, గో=ఆవులయొక్కయు, బ్రాహ్మణ = బ్రాహ్మణులయొక్కయు, హితార్థాయ=మేలనెడుప్రయోజనముకొఱకు; అస్య=ఈ; దేశస్య=దేశముయొక్క; సుఖాయచ=సుఖముకొఱకును; అప్రమేయస్య=కొలతపెట్టరాని; తవచైవ=నీయొక్కయు; వచనం=మాటను; కర్తుం=చేయుటకు ; అహం (అధ్యాహృతము)=నేను; ఉద్యతః=సిద్ధుఁడనైతిని.

గోబ్రాహ్మణులకు మేలు గల్గుటకును, ఈదేశమునకుసుఖంబుసిద్ధించుటకొఱకును, మహానుభావుండగునీపనువుచేయుటకుసిద్ధుండనైతి.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా ధనుర్మధ్యే బధ్వా ముష్టి మరిందమః
జ్యాశబ్ద మకరో త్తీవ్రం దిశ శ్శబ్దేన నాదయన్. ౬

టీక॥ ఏవం= ఈప్రకారము; ఉక్త్వా=చెప్పి; అరిందమః=శత్రువుల నణఁగఁద్రొక్కనట్టిరాముఁడు; ధనుర్మధ్యే=వింటినడుమ; ముష్టిం=పిడికిలిని; బధ్వా=కట్టి; శబ్దేన=ధ్వనిచేత; దిశః = దిక్కులను; నాదయన్=ధ్వనింపఁజేయుచు; తీవ్రం=తీక్ష్ణమైన; జ్యాశబ్దం=వింటినారియొక్కధ్వనిని; అకరోత్ =చేసెను.

ఇట్లుచెప్పి, శత్రువుల నణఁగఁద్రొక్కనట్టిరాముఁడు, ధనుర్మధ్యంబుపిడికిటంబట్టి, దిక్కులనన్నింటిని ధ్వనింపఁజేయుచు, టంకారంబుగావించెను. అని, తాత్పర్యము.

తేన శబ్దేన విత్రస్తా స్తాటకావనవాసినః
తాటకాచ సుసంక్రుద్ధా తేన శబ్దేన మోహితా. ౭

టీక॥ తేన=ఆ; శబ్దేన=ధ్వనిచేత; తాటకావనవాసినః=తాటకావనమునందు వసించువారలు; విత్రస్తాః=భయపడిరి. సుసంక్రుద్ధా = మిక్కిలి కోపముగలదియగు; తాటకాచ=తాటకయును; తేన=ఆ; శబ్దేన = ధ్వనిచేత; మోహితా= భ్రాంతినొందినదియైనది.

ఆధ్వనివిని, తాటకావనమునందుండువారలందఱు, భయపడిరి; పరమకోపనయగు తాటకయును, ఆ శబ్దమువిని, సంభ్రాంతయైనది.

అని, తాత్పర్యము.

తం శబ్ద మభినిధ్యాయ రాక్షసీ క్రోధమూర్ఛితా
శ్రుత్వా చాభ్యద్రవ ద్వేగా ద్యత శ్శబ్దో వినిస్సృతః. ౮

టీ॥ తం=ఆ; శబ్దం=ధ్వనిని; శ్రుత్వాచ=వినియును; అభినిధ్యాయ= ఆలోచించి; రాక్షసీ=రక్కసియగు తాటక; క్రోధమూర్ఛితా=కోపముచే వ్యాపింపఁబడినదై; యతః=ఎచటనుండి; శబ్దః = ధ్వని; వినిస్సృతః= బయలువెడలెనో; తత్ర (అధ్యాహృతము) = అచ్చటికి; వేగాత్ = వేగమువలన; అభ్యద్రవత్=పరుగెత్తెను.

ఆధ్వనినివిని, ఆలోచించి, రక్కసియగు తాటక పరమకోపంబుపూని, యాశబ్దమెందుండి వెడలెనో, అచ్చటికి వేగంబునఁ బరుగెత్తెను. అని, తాత్పర్యము.

తాం దృష్ట్వా రాఘవః క్రుద్ధాం వికృతాం వికృతాననామ్
ప్రమాణే నాతివృద్ధాంచ లక్ష్మణం సోఽభ్యభాషత. ౯

టీక॥ క్రుద్ధాం = కోపించియున్నదియును; వికృతాం=రోఁతగానుం

డునదియును; వికృతాననాం = వికారమునొందిన ముఖముగలదియును; ప్రమాణేన=కొలతచేత, పొడవుచేతననుట; అతివృద్ధాం=మిక్కిలియనధికమైనదియునగు; తాం=ఆతాటకను; దృష్ట్వా=చూచి; రాఘవః= రఘువంశమునంబుట్టిన; సః= ఆరాముఁడు; లక్ష్మణం = లక్ష్మణునిఁగూర్చి; అభ్యభాషత=పలికెను

చూపఱులకురోఁతపుట్టించుశరీరంబును వికృతంబయిన ముఖంబునుంగల్గి, యత్యున్నతమై, కోపంబునవచ్చునాతాటకంజూచి, రాముండు, లక్ష్మణునితో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పశ్య లక్ష్మణ యక్షిణ్యా భైరవం దారుణం వపుః
భిద్యేరన్ దర్శనా దస్యా భీరూణాం హృదయానిచ. ౧౦

టీక ॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! యక్షిణ్యాః=యక్షస్త్రీయగు తాటకయొక్క; భైరవం = భయంకరమైనదియును; దారుణం=వికృతమునగు; వపుః=దేహమును; పశ్య= చూడుము. అస్యాః=ఈతాటకయొక్క; దర్శనాత్ =చూచుటవలన; భీరూణాం= భయశీలురయొక్క; హృదయానిచ= మనస్సును; భిద్యేరన్=పగులును.

లక్ష్మణుఁడా! ఈతాటకయొక్క భయంకరంబును వికృతంబవ్వగుశరీరంబుం జూడుము; ఈతాటకంబూచి నట్టయిన, భీరువులహృదయంబులుపగిలిపోవును.

అని, తాత్పర్యము.

ఏనాం పశ్య దురాధర్షాం మాయాబలసమన్వితామ్
వినివృత్తాం కరోమ్యద్య హృతకర్ణాగ్ర నాసికామ్. ౧౧

టీక॥ దురాధర్షాం=ఎదిరింపఁగూడనిదియును; మాయాబలసమన్వితాం = మాయాబలముతోఁగూడినదియునగు; ఏనాం=ఈతాటకను; వినివృత్తాం=పరాజయమునొందినదానిఁగాను; హృతకర్ణా

గ్రనాసికాం, హృత=హరింపఁబడిన, కర్ణ = చెవులును, అగ్రనాసికాం=ముందుముక్కును గలదానిఁగాను; అద్య=ఇప్పుడు; కరోమి= చేసెదను. పశ్య=చూడుము.

ఎదిరింపఁగూడనిదియును మాయాబలంబుగలదియునగు నీతాటకనిప్పుడు, చెవులునుముక్కునుంగోసి, పరాజయము నొందించెదను; చూడుము. అని, తాత్పర్యము.

న హ్యేనా ముత్సహే హంతుం స్త్రీస్వభావేన రక్షితామ్
వీర్యం చాస్యా గతిం చాపి హనిష్యామీతి మే మతిః. ౧౨

టీక॥ స్త్రీస్వభావేన=ఆఁడుదియగుటచేతను; రక్షితాం=రక్షింపఁబడిన; ఏనాం = ఈతాటకను; హంతుం=చంపుటకు; నోత్సహే హి=యత్నింపనుగదా! అస్యాః= ఈతాటకయొక్క; వీర్యంచ=బలమును; గతించాపి=నడకను; హనిష్యామి=కొట్టెదను; ఇతి = అని; మే=నాయొక్క; మతిః=తలంపు.

ఈతాటకయాఁడుదిగనుక, నేనుదీనింజంపుటలేదు; దీనిచేతులను గాళ్లనుంగోసి, పరాక్రమంబునుగమనంబును, లేకుండఁజేసెదను. అని, రాముఁడు లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం బ్రువాణే రామేతు తాటకా క్రోధమూర్ఛితా
ఉద్యమ్య బాహూ గర్జంతీ రామ మేవాభ్యధావత. ౧౩

టీక॥ రామే=రాముఁడు; ఏవం=ఈప్రకారము; బ్రువాణేతు= చెప్పుచుండఁగానే; తాటకా=తాటక; క్రోధమూర్ఛితా=కోపముచేవ్యాపింపఁబడినదై; బాహూ= చేతులను; ఉద్యమ్య=పైకెత్తి; గర్జంతీ=అఱచుచు; రామమేవ= రామునిగూర్చియె; అభ్యధావత= పరుగెత్తెను.

రాముండీప్రకారముచెప్పుచుండఁగానే, తాటక, కోపంబువహించి, చేతులుపైకెత్తి, గర్జించుచు,

లక్ష్మణునితట్టుపోక, రామునిపైకిం, బరుగెత్తెను. అని తాత్పర్యము.

విశ్వామిత్రస్తు బ్రహ్మర్షిః హుంకారేణా భిభర్త్స్య తామ్
స్వస్తి రాఘవయో రస్తు జయంచై వాభ్యభాషత. ౧౪

టీక॥ బ్రహ్మర్షిః=బ్రాహ్మణుండగు ఋషియునైన; విశ్వామిత్రస్తు=విశ్వామిత్రుండును; తాం=ఆ తాటకను; హుంకారేణ="హుం" అనుటచేత; అభిభర్త్స్య=అదల్చి; రాఘవయోః= రఘువంశమునంబుట్టిన రామలక్ష్మణులకు; స్వస్తి=మంగళమును; జయంచైవ=గెలుపును; అస్తు=కలుగుంగాక; ఇతి (అధ్యాహృతము)=అని; అభ్యభాషత=పలికెను.

బ్రహ్మర్షియగు; విశ్వామిత్రుండును, తాటకను, హుంకారంబునన దల్చి, "రామలక్ష్మణులకు మంగళంబునుజయంబునుంగల్గుంగాక" అని యాశీర్వదించెను. అని తాత్పర్యము.



ఉద్ధూన్వానా రజో ఘోరం తాటకా రాఘవా వుభౌ
రజోమోహేన మహతాముహూర్తంసావ్యమోహయత్. ౧౫

టీక॥ సా=ఆ; తాటకా=తాటక; ఘోరం = భయంకరమగు;

రజః=దుమ్మును; ఉద్ధూన్వానా=వెదచల్లుచున్నదై; రాఘవౌ=రఘువంశమునఁబుట్టిన రామలక్ష్మణుల ను; ఉభౌ=ఇద్దఱను; మహతా=గొప్పదైన; రజోమోహేన, రజః=దుమ్ముచేఁగలిగిన, మోహేన=చీఁకటిచేత; ముహూర్తం=కొంచెము కాలము; వ్యమోహాయత్=మోహింపఁజేసెను.

ఆతాటక, భయంకరముగాఁ బరాగంబుల వెదచల్లుచు, నారామలక్ష్మణులనిర్వురనాదుమ్ముచేఁగల్గినయంధకారముచేఁ, గొంతకాలంబు మోహపఱచెను. అని, తాత్పర్యము.

తతో మాయాం సమాస్థాయ శిలావర్షేణ రాఘవౌ
అవాకిర త్సుమహతా తత శ్చుక్రోధ రాఘవః. ౧౬

టీక॥ తతః=అటుపిమ్మట; సా (అధ్యాహృతము) = ఆతాటక; మాయాం = మాయను; సమాస్థాయ=పొంది; రాఘవౌ=రఘువంశమునఁబుట్టిన రామలక్ష్మణులనుగూర్చి; సుమహతా=మిక్కిలిగొప్పదైన; శిలావర్షేణ=ఱాళ్లవానచేత; అవాకిరత్=వెదచల్లెను, తతః=ఆపిమ్మట; రాఘవః = రాముఁడు; చుక్రోధ=కోపించెను.

అంతట, నాతాటక, మాయవహించి, రామలక్ష్మణుల మీఁదగొప్పఱాళ్లవానగురిపించెను; రాముఁడంతఁగోపంబునొందెను.

అని, తాత్పర్యము.

శిలావర్షం మహ త్తస్యా శ్శరవర్షేణ రాఘవః
ప్రతిహత్యో పధావం త్యాః కరౌ చిచ్ఛేద పత్రిభిః. ౧౭

టీక॥ రాఘవః=రఘువంశమునఁబుట్టినరాముఁడు; తస్యాః = ఆతాటకయొక్క; మహత్ = గొప్పదైన; శిలావర్షం=ఱాళ్లవానను; శరవర్షేణ= బాణములవానచేత; ప్రతిహత్య=కొట్టివేసి; ఉపధావంత్యాః=పరుగెత్తివచ్చుచున్న, తాటకయొక్క; కరౌ=చేతులను; పత్రి

భిః=బాణములచేత; చిచ్ఛేద=నఱికెను.

రాముండు తాటకగురిపించిన ఱాళ్లవానను. బాణవర్షముచేవారించి, తనపైకెత్తిబరువచ్చుచున్న యాతాటకచేతులు రెండును, బాణంబుల, నఱికెను.

అని, తాత్పర్యము.

తత శ్ఛిన్నభుజాం శ్రాంతా మభ్యాశే పరిగర్జతీమ్
సౌమిత్రి రకరో త్క్రోధా ద్ధృతకర్ణాగ్రనాసికామ్. ౧౮

టీక॥ తతః=ఆపిమ్మట; సౌమిత్రిః=సుమిత్రకొడుకగు లక్ష్మణుండు; ఛిన్నభుజాం, ఛిన్న=ఖండింపఁబడిన, భుజాం=చేతులుగలదియును; శ్రాంతాం=అలసటనొందినదియును;అభ్యాశే = సమీపమందు;పరిగర్జతీం = అఱచుచున్నదియునగు; తాం(అధ్యాహృతము)=ఆతాటకను; క్రోధాత్=కోపమువలన;హృతకర్ణాగ్రనాసికాం,హృత=హరింపఁబడిన , కర్ణ=చెవులును,అగ్రనాసికాం=ముందుముక్కునుగలదానిఁగా; అకరోత్=చేసెను.

అంత, చేతులుదెగి, యలసటనొంది, సమీపంబున నఱచుచున్న యాతాటకకర్ణనాసికలను, కోపంబున,లక్ష్మణుండు,కోసివేసెను.

అని, తాత్పర్యము.

కామరూపధరా సద్యః కృత్వా రూపా ణ్యనేకశః
అంతర్ధానం గతా యక్షీ మోహయంతీవ మాయయా. ౧౯
అశ్మవర్షం విముంచంతీ భైరవం విచచార హ

టీక॥ కామరూపధరా=ఇచ్ఛాధీనమగురూపముధరించియుండు ; యక్షీ=యక్షస్త్రీయగుతాటక; సద్యః=అప్పుడు;అనేకశః = అనేకములుగా; రూపాణి=రూపములను;కృత్వా=చేసి; మాయయా=మాయచేత; అంతర్ధానం=మఱుఁగుపాటును; గతా= పొందినదై;

అశ్మవర్షం=ఱాళ్ల వానను; విముంచంతీం=విడుచుచున్నదై; మోహయంతీవ=మోహింపఁజేయుచున్నదివోలె; భైరవం = భయంకరముగా; విచచారహ=సంచరించెను. "హ" అనునది పాదపూరణార్థము.

ఆ తాటక, కామరూపిణి గావున, నప్పుడు అనేకరూపములొంది యు, మాయాబలంబుననంతర్ధానంబునొందియు, ఱాళ్లవానగురియించుచు, మోహముగల్గునట్లు, భయంకరముగాసంచరించెను.

అని, తాత్పర్యము.

తత స్తా వశ్మవర్షేణ కీర్యమాణౌ సమంతతః. ౨౦
దృష్ట్వా గాధిసుత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్

టీక॥ తతః = అటుపిమ్మట; సమంతతః=అంతటను; అశ్మవర్షేణ=ఱాళ్లవానచేత; కీర్యమాణౌ= కప్పఁబడుచున్న; తౌ = ఆరామలక్ష్మణులను; దృష్ట్వా = చూచి; శ్రీమాన్=కాంతిగల, లేక, సర్వాతిశాయియైన; గాధిసుతః=గాధికొడుకైనవిశ్వామిత్రుఁడు; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, నాల్గుప్రక్కల, ఱాళ్లవానంగప్పఁబడుచున్న రామలక్ష్మణులంజూచి, శ్రీమంతుండగువిశ్వామిత్రుఁడిట్లనిచెప్పెను. అనితాత్పర్యము

అలం తే ఘృణయా రామ పాపైషా దుష్టచారిణీ. ౨౧
యజ్ఞవిఘ్నకరీ యక్షీ పురా వర్ధతి మాయయా

టీక॥ రామ=రామఁడా! తే=నీయొక్క; ఘృణయా=దయచేత; అలం = చాలును; ఏషా=ఈ; యక్షీ=యక్ష(స్త్రీ)యగుతాటక; పాపా=పాపముగలది, దుష్టచారిణీ=దుష్టముగాసంచరించునది. యజ్ఞవిఘ్నకరీ, యజ్ఞ = యాగములకు, విఘ్న=అంతరాయములను, కరీ=చేయునది. పురా=ముందు; మాయయా=మాయచేత; వర్ధతి = (భవి

ష్యదర్థమందులట్) వృద్ధిఁబొందును రాముఁడా! నీవీతాటకయందు దయయుంచినది చాలును; ఈతాటక, పాపిష్ఠురాలు; దుర్మార్గురాలు; యాగంబులకు విఘ్నముసేయునది; మఱియు, నీతాటక, సాయంకాలమైనంతట, ఇంకంజాల మాయగలదియౌను. అని, తాత్పర్యము.

వధ్యతాం తావ దేవైషా పురా సంధ్యా ప్రవర్తతే. ౨౨
రక్షాంసి సంధ్యాకాలేషు దుర్ధర్షాణి భవంతి వై

టీక॥ పురా = ముందు; సంధ్యా=సాయంకాలము; ప్రవర్తతే (భవిష్యదర్థమందులట్) = ప్రవర్తింపఁ గలదు. తావదేవ=అంతలోనే; ఏషా = ఈతాటక; వధ్యతాం = చంపఁబడుగాక. రక్షాంసి=రాక్షసులు; సంధ్యాకాలేషు= సాయంకాలములందు; దుర్ధర్షాణి = ఎదిరింపఁగూడనివారు; భవంతి=అగుచున్నారు. "వై" అనునది పాదపూరణార్థము.

ముందుసాయంకాలమురాఁబోవుచున్నది ; అంతలోనేయీతాటకంజంపుము; సాయంకాలంబున౦దురాక్షసులనెదిరించుటకష్టము. అని,విశ్వామిత్రుఁడుచెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త స్తు తదా యక్షీ మశ్మవృష్ట్యా భివర్షతీమ్. ౨౩
దర్శయ౯ శబ్దవేధిత్వం తాం రురోధ స సాయకైః

టీక॥ సః=ఆరాముఁడు; ఇతి= ఈప్రకారము; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తదాతు=అప్పుడే; శబ్దవేధిత్వం, శబ్ద=ధ్వనిచేత, వేధిత్వం=కొట్టుటను; దర్శయ౯=చూపుచు; అశ్మవృష్ట్యా=ఱాళ్లవానచేత; అభివర్షతీం=వర్షించుచున్న; తాం=ఆ; యక్షీం=తాటకను; సాయకైః= బాణములచేత; రురోధ=అడ్డగించెను

విశ్వామిత్రుం డిట్లుచెప్పినంతటనే, రాముండప్పుడు, ఎదిరికనుపడక

పోయినను అతనిశబ్దము నేగుఱిగాఁ బట్టి, యతనిపైఁబడునట్లు, బాణము వేయుటయందుఁ, దనకుంగలసామర్థ్యముచూపుచు, తాఁజ్ఞానగురిపించుచున్నయాతాటకను, బాణంబుల నిరోధించెను. అని, తాత్పర్యము.

సా రుద్ధా శరజాలేన మాయాబలసమన్వితా. ౨౪
అభిదుద్రావ కాకుత్థ్సం లక్ష్మణం చ వినేదుషీ

టీక॥ మాయాబలసమన్వితా= మాయాబలంబుతోఁగూడిన; సా= ఆతాటక; శరజాలేన=బాణముల గుంపుచేత; రుద్ధా=అడ్డగింపఁబడినదై; వినేదుషీ=అఱచుచున్నదై; కాకుత్థ్సం=రామునిఁ;లక్ష్మణంచ= లక్ష్మణునినింగూర్చి; అభిదుద్రావ= పరుగెత్తెను.

మాయాబలంబుగల యాతాటక, బాణంబులనిరోధింపంబడి,రామలక్ష్మణులపైకిఁ,బరుగెత్తెను.

అని, తాత్పర్యము.

తా మాపతంతీం వేగేన విక్రాంతా మశనీ మివ. ౨౫
శరేణో రసి వివ్యాధ సా పపాత మమార చ

టీక॥ విక్రాంతాం=పరాక్రమించినదియును; అశనీమివ=పిడుగుంబోలె; వేగేన=వేగముచేత; ఆపతంతీం= వచ్చుచున్నదియునగు; తాం=ఆతాటకను; రామః(అధ్యాహృతము)= రాముఁడు; ఉరసి= ఱొమ్మునందు;శరేణ = బాణముచేత; వివ్యాధ=కొట్టెను. సా=ఆతాటక;పపాత=పడెను. మమారచ=చచ్చెను.

పరాక్రమించి, పిడుగుంబోలె, వేగంబునం బైకిఁ బఱతెంచుచున్నయాతాటకఱొమ్మున, రాముండు బాణంబునంగొట్టెను; అంతనది, నేలంబడిప్రాణంబులువిడిచెను.

అని, తాత్పర్యము.

తాం హతాం భీమసంకాశాం దృష్ట్వా సురపతి స్తదా. ౨౬

సాధుసాధ్వితి కాకుత్థ్సం సురాశ్చ సమపూజయన్

టీక॥ తదా = అప్పుడు; హతాం = చంపఁబడిన; భీమసంకాశాం = భయంకరిగా నున్నట్టి; తాం = ఆతాటకను; దృష్ట్వా = చూచి; సురపతిః = దేవేంద్రుఁడును; సురాశ్చ = దేవతలును; సాధుసాధు = బాగుబాగు; ఇతి = అని; కాకుత్థ్సం = రామునిఁ; సమపూజయన్ = చక్కఁగాఁబూజించిరి.

అప్పుడు, భయంకరా కారయగు నా తాటకచంపఁ బడుటంజూచి, దేవేంద్రుండును దేవతలును, బాగుబాగని, రామునింగొనియాడిరి.

అని, తాత్పర్యము.

ఉవాచ పరమప్రీత స్సహస్రాక్షః పురందరః. ౨౭
సురాశ్చ సర్వే సంహృష్టా విశ్వామిత్ర మథాబ్రువన్

టీక॥ అథ = అటుపిమ్మట; సహస్రాక్షః = వేయికండ్లుగల; పురందరః = దేవేంద్రుఁడు; పరమప్రీతః = మిక్కిలిసంతసించినవాఁడై; విశ్వామిత్రం = విశ్వామిత్రునిఁగూర్చి; ఉవాచ = పలికెను. సురాశ్చ = దేవతలును; సర్వే = అందఱు; సంహృష్టాః = సంతసించినవారలై; అబ్రువన్ = పల్కిరి.

అంత, సహస్రాక్షుండగు, దేవేంద్రుండును, దేవతలునందఱును, చాలసంతసించి, విశ్వామిత్రునితో నిట్లనిపల్కిరి.

అని, తాత్పర్యము.

మునే కౌశిక భద్రం తే సేంద్రా స్సర్వే మరుద్గణాః. ౨౮
తోషితాః కర్మణా నేన స్నేహం దర్శయ రాఘవే

టీక॥ మునే = మునివైన; కౌశిక = విశ్వామిత్రుఁడా! తే = నీకు; భద్రం = మంగళము; అస్తు (అధ్యాహృతము) = అగుఁగాక. అనేన = ఈ; కర్మణా = కార్యముచేత; సేంద్రాః = ఇంద్రునితోఁగూడిన; మరు




ద్గణాః= దేవతలసమూహములు; సర్వే=అన్నియు; తోషితాః=సంతోషింపఁ జేయఁబడినవి. రాఘవే= రామునియందు; స్నేహం= చెలిమి నిఃదర్శయ=చూపుము.

విశ్వామిత్రుఁడా! నీకుమంగళమగుఁగాక! ఈతాటకంజంపుటచే, దేవేంద్రుండు దేవతలునందఱును,సంతసించిరి; నీవురామునియందనుగ్రహంబునెఱపుము.

అని, తాత్పర్యము.

ప్రజాపతే ర్భృశాశ్వస్య పుత్రాన్ సత్యపరాక్రమాన్. ౨౯
తపోబలభృతాన్ బ్రహ్మన్ రాఘవాయ నివేదయ

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా! తపోబలభృతాన్, తపోబల=తపస్సుయొక్క-బలిమిచేత,భృతాన్= సంపాదింపఁ బడిన; సత్యపరాక్రమాన్= వ్యర్థముకానిపరాక్రమముగల; ప్రజాపతేః=ప్రజాపతియగు; భృశాశ్వస్య=భృశాశ్వునియొక్క; పుత్రాన్=కొడుకులను; రాఘవాయ=రామునికొఱకు; నివేదయ= తెల్పుము.

విశ్వామిత్రుఁడా! నీవుతపోబలంబునసంపాదించిన సత్యపరాక్రమంబులగు, భృశాశ్వప్రజాపతికొడుకులైనయస్త్రంబులరామునకుఁ, జెప్పుము.

అని, తాత్పర్యము.

పాత్రభూత శ్చతే బ్రహ్మం స్తవా నుగమనే ధృతః. ౩౦
కర్తవ్యంచ మహత్కర్మ సురాణాం రాజసూనునా

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా! తవ=నీయొక్క; అనుగమనే= వెంబడించుటయందు; ధృతః=నియతుఁడైన ; అయం (అధ్యాహృతము)=ఈరాముఁడు; తే=నీకు; పాత్రభూతశ్చ=ఇవ్వఁదగినవాఁడును; భవతి (అధ్యాహృతము)=అగుచున్నాఁడు. రాజసూనునా=రాచకొ







మరుఁడగు రామునిచేత ; సురాణాం=దేవతలకు; మహత్ = గొప్పదైన; కర్మ=కార్యము; కర్తవ్యం చ=చేయఁబడవలసినదిగాను, అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

విశ్వామిత్రుఁడా ఈరాముఁడు, నియతంబుగా, నీయాజ్ఞాప్రకారము నడుచువాఁడు కావున, నీకుఁబాత్రభూతుఁడు నగుచున్నాఁడు; మఱియు నీరాజపుత్రుఁడగు రాముఁడు, దేవతలకుఁగాను, గొప్పకార్యము చేయవలసినదిగానున్నది. అని చెప్పిరి. అని, తాత్పర్యము.

ఏవముక్త్వా సురా స్సర్వే హృష్టా జగ్ము ర్యథాగతమ్. ౩౧
విశ్వామిత్రం పురస్కృత్య తత స్సంధ్యా ప్రవర్తతే

టీక॥ ఏవం=ఈప్రకారము; ఉక్త్వా=చెప్పి; సురాః=దేవతలు; సర్వే=అందఱును; హృష్టాః=సంతసించి; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; పురస్కృత్య=పూజించి; యథాగతం=వచ్చినట్లు; జగ్ముః=పోయిరి. తతః=అటుపిమ్మట; సంధ్యా=సంధ్యాకాలము; ప్రవర్తతే(భూతార్థమందులట్)=వచ్చినది.

ఇట్లు, చెప్పి, దేవతలందఱును సంతసించి విశ్వామిత్రుంబూజించి, వచ్చినట్లు, పోయిరి; అంత, సంధ్యాకాలంబువచ్చినది.

అని, తాత్పర్యము.

తతో మునివరః ప్రీత స్తాటకావధ తోషితః. ౩౨
మూర్ధ్ని రామ ముపాఘ్రాయ ఇదం వచన మబ్రవీత్

టీక॥ తతః=అటుపిమ్మట; మునివరః=మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు; తాటకావధతోషితః, తాటకావధ=తాటకయొక్క-చంపుటచేత, తోషితః=సంతోషింపం జేయఁబడినవాఁడై; ప్రీతః=సంతసించినవాఁడై; రామం=రాముని; మూర్ధ్ని=శిరస్సునందు; ఉపాఘ్రాయ=వా




సనచూచి; ఇదం=ఈ; వచనం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

అంత,మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, తాటకంజంపుటవలన సంతసంబొంది, రామునిశిరంబున మూర్కొని,యిట్లని,చెప్పెను.

అని,తాత్పర్యము.

ఇహాద్య రజనీం రామ వసేమ శుభదర్శన. 33
శ్వః ప్రభాతే గమిష్యామ స్తదాశ్రమపదం మమ

టీక॥ శుభదర్శన= మంగళకరమైనచూడఁ బడుటగలవాఁడవైన, రామ=రాముఁడా!ఇహ = ఇచ్చట;అద్య=ఈ; రజనీం(అత్యంతసంయోగమందుద్వితీయ)=రాత్రియంతయు;వసేమ=ఉండెదము. శ్వః=రేపు; ప్రభాతే=వేకువయందు;మమ=నాయొక్క;తత్=ఆ; ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును;గమిష్యామః=పొందెదము.

శుభదర్శనుండవగు రాముఁడా! ఈరాత్రియంతయు,నీతాటకావనమందేయుందము;రేపువేకువను,నాయాశ్రమంబునకుఁబోయెదము.

అని,తాత్పర్యము.

విశ్వామిత్రవచః శ్రుత్వా హృష్టో దశరథాత్మజః. 3४
ఉవాస రజనీం తత్ర తాటకాయా వనే సుఖమ్

టీక॥ విశ్వామిత్రవచః=విశ్వామిత్రునిమాటను; శ్రుత్వా=విని;దశరథాత్మజః= దశరథునికొడుకైన రాముఁడు; హృష్టః=సంతసించినవాఁడై;తత్ర=ఆ; తాటకాయాః=తాటకయొక్క; వనే=అడవియందు;సుఖం=సుఖముగా; రజనీం(అత్యంతసంయోగమందుద్వితీయ) =రాత్రియంతయు; ఉవాస=ఉండెను.

విశ్వామిత్రుని మాటవిని, రాముండు, సంతసించి, రాత్రియంత

యు, నాతాటకావనంబున, సుఖంబుండెను. అని, తాత్పర్యము.

ముక్తశాపం వనం తచ్చ తస్మిన్నేవ తదాహని. ౩౫
రమణీయం విబభ్రాజ యథా చైత్ర రథం వనమ్

టీక॥ తస్మిన్=ఆ; అహాని=దినమందు; తదైవ=అప్పుడు; తత్=ఆ; వనంచ=అడవియును; ముక్తశాపం=విడువఁబడినయుపద్రవముగలదై; చైత్రరథం=చైత్రరథమనెడు; వనంయథా=వనమువలె; రమణీయం=మనోహరమై; విబభ్రాజ=ప్రకాశించినది.

ఆదినమునందప్పుడే, యావనంబునుపద్రవంబులువీడి, చైత్రరథంబనెడు కుబేరుని యుద్యానవనంబునుంబోలె, మనోహరమైయొప్పెను. అని, తాత్పర్యము

నిహత్య తాం యక్షసుతాం స రామః
ప్రశస్యమాన స్సురసిద్ధసంఘైః
ఉవాస తస్మి న్మునినా సహైవ
ప్రభాతవేళాం ప్రతిబోధ్యమానః. ౩౬

టీక॥ సః=ఆ; రామః=రాముఁడు; తాం=ఆ; యక్షసుతాం=యక్షునికూఁతురైనతాటకను; నిహత్య=చంపి; సురసిద్ధసంఘైః=దేవతలయొక్కయు సిద్ధులయొక్కయు సమూహములచేత; ప్రశస్యమానః=కొనియాడఁబడుచున్నవాఁడై; ప్రభాతవేళాం=(అత్యంతసంయోగమందుద్వితీయ) వేకువయందు; ప్రతిబోధ్యమానః=మేలుకొలుపఁబడుచున్నవాఁడై; మునినాసహైవ=విశ్వామిత్రునితోఁగూడనే; తస్మిన్=ఆయడవియందు; ఉవాస=ఉండెను.

రాముండా తాటకంజంపి, దేవతలచేతనుసిద్ధులచేతనుం గొనియాడంబడుచు, విశ్వామిత్రునితోఁగూడ, నావనంబుననుండెను, వేకువ

కాగానే, విశ్వామిత్రునిచే మేలుకొలుపఁబడెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, షడ్వింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, బాలకాండ షడ్వింశసర్గటీక,

ముగిసినది.

---

(శ్రీ)

సప్తవింశసర్గప్రారంభః.

అథ తాం రజనీ ముష్య విశ్వామిత్రో మహాయశాః
ప్రహస్య రాఘవం వాక్య మువాచ మధురాక్షరమ్. ౧

టీక ॥ అథ = అటుపిమ్మట; తాం=ఆ; రజనీం = (అత్యంతసంయోగమందుద్వితీయ) రాత్రియంతయు; ఉష్య=ఉండి; మహాయశాః= గొప్పకీర్తిగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; ప్రహస్య=నవ్వి; రాఘవం = రామునిఁగూర్చి; మధురాక్షరం = మనోహరములయినయక్షరములుగల; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

అంత, నారాత్రియంతయునచ్చటనుండి, మహాయశుండగువిశ్వామిత్రుఁడు, చిఱునవ్వుఁజేసి, రాముని తోనిట్లని, మధురంబుగాఁబలికెను.

అని, తాత్పర్యము.

పరితుష్టో స్మిభద్రంతే రాజపుత్ర మహాయశః

ప్రీత్యా పరమయా యుక్తో దదామ్యస్త్రాణి సర్వశః. ౨

టీక॥ మహాయశః= గొప్పకీర్తిగల; రాజపుత్ర = రాచకొమరుఁడవైనరాముఁడా! అహం (అధ్యాహృతము)=నేను; పరితుష్టః=సంతసించినవాఁడను; అస్మి=అగుచున్నాను. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము) = అగుఁగాక. పరమయా=అధికమైన; ప్రీత్యా = సంతసముతో ; యుక్తః = కూడినవాఁడనై; సర్వశః= సాకల్యముగా; అస్త్రాణి = అస్త్రములను; దదామి=ఇచ్చెదను.

మహాయశుండవగు రాముఁడా! నేనుసంతసించితి; నీకుమంగళ మొదవుఁగాక; నేనుబరమసంతోషంబునొందితింగావున, నస్త్రంబులనన్నింటినినీకిచ్చెదను.

అని, తాత్పర్యము.

దేవాసురగణా న్వాపి సగంధర్వోరగా నపి
యై రమిత్రాన్ ప్రసహ్యా జౌ వశీకృత్య జయిష్యసి. ౩
తాని దివ్యాని భద్రం తే దదామ్య స్త్రాణి సర్వశః

టీక॥ యైః= ఏయస్త్రములచేత; సగంధర్వోరగానపి=గంధర్వులతోనుఉరగులతోనుంగూడినవారలైనను; దేవాసురగణాన్వాపి= దేవతలయొక్కయు రాక్షసులయొక్కయుసమూహంబులనైనను , అమిత్రాన్=శత్రువులను; ఆజౌ=యుద్ధమునందు; ప్రసహ్య=బలాత్కరించి; వశీకృత్య=స్వాధీనముచేసికొని, జయిష్యసి=జయింపఁగలవో ; దివ్యాని=శ్రేష్ఠములయిన; తాని=ఆ; అస్త్రాణి=అస్త్రములను; సర్వశః= సాకల్యముగా ; దదామి=ఇచ్చెదను. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)= అగుఁగాక.

దేవతలు, రాక్షసులు, గంధర్వులునురగులుంజేరి యొక్కపెట్టనెత్తివచ్చినను, శత్రువుల, నేయస్త్రంబుల, యుద్ధంబునంజక్కడిచి , జయింపఁగలవో; అట్టిదివ్యంబులగునస్త్రంబులనన్నింటిని , నీకొసంగెద

ను; నీకు మంగళము దవుఁగాక. అని, తాత్పర్యము.

దండచక్రం మహా ద్దివ్యం తవ దాస్యామి రాఘవ.౪

టీక ॥ రాఘవ=రఘువంశము నఁబుట్టిన రామఁడా! తవ=నీకు; మహత్=గొప్పదైన; దివ్యం=శ్రేష్ఠము గు; దండచక్రం=దండచక్రమనెడు చక్రమును; దాస్యామి=ఇచ్చెదను.

రామఁడా! నీకు, గొప్పదియును శ్రేష్ఠంబునగు దండచక్రంబునిచ్చెదను. అని, తాత్పర్యము.

ధర్మచక్రం తతో వీర కాలచక్రం తథైవచ
విష్ణుచక్రం తథా త్యుగ్ర మైంద్ర మస్త్రం తథైవచ.౫
వజ్రమస్త్రం నరశ్రేష్ఠ శైవం శూలవరం తథా
అస్త్రం బ్రహ్మశిరశ్చైవ ఐషీక మపి రాఘవ.౬
దదామి తే మహాబాహొ బ్రాహ్మ మస్త్ర మనుత్తమమ్

టీక॥వీర=పరాక్రమశాలివగు; నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుఁడవయిన; మహాబాహొ=గొప్ప చేతులుగల; రాఘవ = రామఁడా! తే=నీకు; తతః=అటుపిమ్మట; ధర్మచక్రం=ధర్మచక్రమనెడు చక్రమును; తథైవ=ఆలాగే; కాలచక్రంచ=కాలచక్రమనెడుచక్రమును; తథా= అట్లు; అత్యుగ్రం=మిక్కిలిభయంకరమగు; విష్ణుచక్రం=విష్ణుచక్రమనెడు చక్రమును; తథైవ=అట్లే; ఐంద్రం=ఇంద్రదేవతాకమైన; అస్త్రంచ=అస్త్రమును; వజ్రం=వజ్రమనెడు; అస్త్రం=అస్త్రమును; తథా=అట్లు; శైవం=శివదేవతాకమైన; శూలవరం=శూలశ్రేష్ఠమును; బ్రహ్మశిరః=బ్రహ్మశిరస్సనెడు; అస్త్రంచైవ=అస్త్రమును; ఐషీకమపి=ఐషీకాస్త్రమును; అనుత్తమం=తనకన్నశ్రేష్ఠమైనది లేనట్టి; బ్రాహ్మం=బ్రహ్మసంబంధియగు, అస్త్రం=అస్త్రమును; దదామి=ఇచ్చెదను.

వీరుండవు, పురుషశ్రేష్ఠుండవు మహాబాహుండవగు రామఁడా! నీకు,

ధర్మచక్రంబును గాలచక్రంబును అతిభయంకరంబగు విష్ణుచక్రంబును ఐంద్రాస్త్రంబును, వజ్రాస్త్రంబును శైవంబగు శూలంబును బ్రహ్మశిరంబనెడియస్త్రంబును ఐషీకంబును, బ్రహ్మాస్త్రంబు నిచ్చెదను.

అని, తాత్పర్యము.

గదే ద్వే చైవ కాకుత్థ్స మోదకీ శిఖరీ ఉభే. ౭
ప్రదీప్తే నరశార్దూల ప్రయచ్ఛామి నృపాత్మజ

టీక॥ నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవైన; నృపాత్మజ = రాచకొమరుండవగు; కాకుత్థ్స = కకుత్థ్స వంశమునంబుట్టిన రాముఁడా! మోదకీశిఖరీ=మోదకి, శిఖరి, యనెడు; ప్రదీప్తే=చాలఁబ్రకాశించునట్టి; ఉభే=రెండు; గదే=గదలు; విద్యేతే (అధ్యాహృతము)=ఉన్నవి. తే(అధ్యాహృతము)=ఆగదలను; ద్వేచైవ=రెంటిని; ప్రయచ్ఛామి=ఇచ్చెదను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! మోదకి, శిఖరి, యనెడు రెండు మంచిగదలున్నవి; ఆగదల రెంటిని నీకిచ్చెదను. అని, తాత్పర్యము.

ధర్మపాశ మహం రామ కాలపాశం తథైవచ. ౮
పాశం వారుణ మస్త్రంచ దదామ్యహ మనుత్తమమ్

టీక॥ రామ = రాముఁడా! అహం=నేను; ధర్మపాశం=ధర్మపాశమును; తథైవ=ఆలాగే; కాలపాశంచ=కాలపాశమును; దదామి(అధ్యాహృతము)=ఇచ్చెదను. అనుత్తమం= తనకన్న శ్రేష్ఠములేనట్టి; వారుణం = వరుణదేవతాకమైన; పాశం = పాశమును; అస్త్రంచ=అస్త్రమును; అహం=నేను; దదామి=ఇచ్చెదను.

రాముఁడా! నీకు, ధర్మపాశంబును కాలపాశంబును వరుణపాశంబును వారుణాస్త్రంబు నిచ్చెదను. అని, తాత్పర్యము.

అశనీ ద్వే ప్రయచ్ఛామి శుష్కార్ద్రే రఘునందన. ౯
దదామి చాస్త్రం పైనాక మస్త్రం నారాయణం తథా

టీక ॥ రఘునందన= రాముఁడా! శుష్కార్ద్రే=శుష్కంబును ఆర్ద్రంబున నెడు; అశనీ=పిడుగులను; ద్వే= రెంటిని; ప్రయచ్ఛామి= ఇచ్చెదను. పైనాకం=శివదేవతాకమైన; అస్త్రంచ=అస్త్రమును; తథా=అట్లు; నారాయణం=నారాయణదేవతాకమైన; అస్త్రం=అస్త్రమును; దదామి=ఇచ్చెదను.

రాముఁడా! నీకు, శుష్కాశనిని, ఆర్ద్రాశనిని, పైనాకాస్త్రమును, నారాయణాస్త్రమును, ఇచ్చెదను.

అని, తాత్పర్యము.

ఆగ్నేయ మస్త్రం దయితం శిఖరంనామ నామతః. ౧౦
వాయవ్యం ప్రథనం నామ దదామిచ తవానఘ

టీక॥ అనఘ= పాపములేని రాముఁడా! నామతః=పేరువలన; శిఖరంనామ=శిఖరమని ప్రసిద్ధమైన; ఆగ్నేయం= అగ్నిదేవతాకమగు; దయితం= (అగ్నిదేవునకు) ప్రియమైన; అస్త్రం=అస్త్రమును; ప్రథనం నామ=ప్రథనమని ప్రసిద్ధమైన; వాయవ్యంచ=వాయుదేవతాకమయిన యస్త్రంబును; తవ=నీకు; దదామి=ఇచ్చెదను.

అనఘుండవగు రాముఁడా! అగ్నిదేవునకుఁ బ్రియంబయిన శిఖరంబనియెడు నాగ్నేయాస్త్రంబును, బ్రథనంబనెడు వాయవ్యాస్త్రంబును, నీకిచ్చెదను.

అని, తాత్పర్యము.

అస్త్రం హయశిరో నామ క్రౌంచ మస్త్రం తథైవచ. ౧౧
శక్తిద్వయంచ కాకుత్స్థ దదామి తవ రాఘవ

టీక॥ కాకుత్స్థ=కకుత్స్థవంశంబునఁ బుట్టిన; రాఘవ=రాముఁడా;

హయశిరోనామ=హయశిరస్సనెడు;అస్త్రం=అస్త్రమును;తథైవ=అలాగే; క్రౌంచం=క్రౌంచమనెడు;అస్త్రంచ=అస్త్రమును;శక్తిద్వయంచ=శక్తులయొక్క-జంటను; తవ=నీకు;దదామి=ఇచ్చెదను.

రాముఁడా! హయశిరస్సనెడియస్త్రంబును, క్రౌంచాస్త్రంబును, విష్ణుశక్తియురుద్రశక్తియుననెడుశక్తులరెంటిని,నీకిచ్చెదను.

అని, తాత్పర్యము.

కంకాళం ముసలం ఘోరం కాపాల మథ కంకణమ్. ౧౨
ధారయం త్యసురా యాని దదా మ్యేతాని సర్వశః

టీక॥ ఘోరం = భయంకరమగు;కంకాళం=కంకాళమనెడు; ముసలం=రోకలిని;కాపాలం = కాపాలమనెడు ముసలమును; అథ=ఇంక; కంకణం=కంకణమనుముసలమును; యాని=ఏముసలములను,అసురాః=రాక్షసులు;ధారయంతి=ధరింపు చున్నారో; తాని(అధ్యాహృతము)=ఆ;ఏతాని=ఈముసలములను;సర్వశః=సాకల్యముగా;దదామి=ఇచ్చెదను.

రాక్షసులుధరించునట్టి,భయంకరమైన,కంకాళముకాపాలముకంకణము , అనుముసలములనన్నింటిని చ్చెదను. అని, తాత్పర్యము.

వైద్యాధరం మహాస్త్రం చ నందనం నామ నామతః. ౧౩
అసిరత్నం మహాబాహో దదామిచ నృపాత్మజ

టీక॥ మహాబాహో=గొప్పచేతులుగల; నృపాత్మజ=రాచకొమరుఁడవగు రాముఁడా; వైద్యాధరం=విద్యాధరదేవతాకమైన , మహాస్త్రంచ=గొప్పయస్త్రమును; నామతః=పేరువలన; నందనంనామ=నందనమని ప్రసిద్ధమైన; అసిరత్నంచ = శ్రేష్ఠమైనకత్తిని;దదామి=ఇచ్చెదను.

మహాబాహుండవగు రాముఁడా!

వైద్యాధరాస్త్రంబును, నందనంబనియెడు శ్రేష్ఠంబగు కత్తిని, నీకిచ్చెదను.

అని, తాత్పర్యము.

గాంధర్వ మస్త్రం దయితం మానవంనామ నామతః.౧౪
ప్రస్వాపన ప్రశమనే దద్మి సౌరంచ రాఘవ

టీక॥ రాఘవ = రామునిడా! గాంధర్వం= గంధర్వదేవతాకమైన; దయితం=(గంధర్వులకు)ప్రియమగు; నామతః=పేరువలన; మానవంనామ= మానవంబనిప్రసిద్ధమైన; అస్త్రం=అస్త్రంబును; ప్రస్వాపన ప్రశమనే, ప్రస్వాపన=నిద్రింపఁజేయునట్టియస్త్రంబును, ప్రశమనే = శాంతిసేయునట్టియస్త్రంబును; సౌరంచ= సూర్యదేవతాకమగునస్త్రంబును;దద్మి = ఇచ్చెదను.

రామునిడా! గంధర్వులకుఁ బ్రియమైన,మానవము,ప్రస్వాపనము ప్రశమనమునని యెడు గాంధర్వాస్త్రంబులను, సౌరాస్త్రంబును,నీకిచ్చెదను.అని,తాత్పర్యము.

దర్పణం శోషణం చైవ సంతాపన విలాపనే. ౧౫
మదనం చైవ దుర్ధర్షం కందర్పదయితం తథా
పైశాచ మస్త్రం దయితం మోహనం నామ నామతః.౧౬
ప్రతీచ్ఛ నరశార్దూల రాజపుత్ర మహాయశః

టీక॥ నరశార్దూల=పురుష శ్రేష్ఠుండవైన; మహాయశః=గొప్పకీర్తిగల;రాజపుత్ర = రాచకొమరుడవైనరామునిడా! దర్పణం=గర్వింపఁజేయునట్టి యస్త్రంబును; శోషణంచైవ=శోషిల్లఁ జేయునట్టియస్త్రంబును; సంతాపనవిలాపనే, సంతాపన=తపింపఁజేయునట్టియస్త్రంబును,విలాపనే=ఏడ్పించునట్టియస్త్రంబును; తథా=అట్లు;

కంధర్పదయితం=మన్మథునకుఁ బ్రియంబైన; దుర్ధర్షం=ఎదిరింపఁగూడనిః మదనం చైవ=మదింపఁజేయునట్టి యస్త్రంబును; పైశాచం=పిశాచదేవతాకమగు; దయితం=(పిశాచములకు) ప్రియమైన; నామతః=పేరువలన; మోహనం నామ=మోహనమని ప్రసిద్ధమైన; అస్త్రం=అస్త్రమును; ప్రతీచ్ఛ=గ్రహింపుము.

పురుష శ్రేష్ఠుండవు మహాయశుండవగు రాముఁడా! దర్పణము శోషణము సంతాపనము విలాపనము దుర్ధర్షంబును మన్మథునకుఁ బ్రియంబునగు మదనము పిశాచదేవతాకంబగు మోహనము, అను నీయస్త్రంబులం, బ్రతిగ్రహింపుము.

అని, తాత్పర్యము.

తామసం నరశార్దూల సౌమనంచ మహాబల. ౧౭
సంవర్తం చైవ దుర్ధర్షం మౌసలంచ నృపాత్మజ
సత్య మస్త్రం మహాబాహో తథా మాయాధరం పరమ్ ౧౮
ఘోరం తేజః ప్రభం నామ పర తేజోపకర్షణమ్
సౌమ్యాస్త్రం శిశిరం నామ త్వష్టు రస్త్రం సుదామనమ్. ౧౯
దారుణంచ భగస్యాపి శీతేషు మథ మానవమ్

టీక॥ నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవైన; మహాబల=గొప్పబలముగల; నృపాత్మజ=రాచకొమరుఁడవగు రాముఁడా! తామసం=తామసమనెడియస్త్రంబును; సౌమనం చ=సౌమనమనెడి యస్త్రంబును, సంవర్తం చైవ=సంవర్తమనెడియస్త్రంబును; దుర్ధర్షం=ఎదిరింపఁగూడనిః మౌసలం చ=మౌసలమను నస్త్రంబును; సత్యం=సత్యమనెడు; అస్త్రం=అస్త్రమును; తథా=అట్లు; పరం=ఉత్కృష్టమైన మాయాధరం=మాయాధరమనెడు నస్త్రంబును; ఘోరం=భయంకరమైన; పర తేజోపకర్షణం, పర=శత్రువులయొక్క, తేజః=పరాక్రమముయొక్క, అపకర్షణం=పోఁగొట్టునదియనఁగుః తేజః ప్రభం నామ=

తేజఃప్రభమనునస్త్రంబును; శిశిరం నామ = శిశిరమని ప్రసిద్ధమైన; సౌమ్యాస్త్రం= చంద్ర దేవతాకమయిన యస్త్రంబును; సుదామనం = సుదామనమనెడు; త్వష్టుః = త్వష్టయొక్క; అస్త్రం = అస్త్రమును; దారుణం = భయంకరమైన; భగస్య= భగునియొక్క; శితేషుం చాపి = తీక్ష్ణమైనబాణమును, అస్త్రముననుట; అథ=ఇంక; మానవం=మానవాస్త్రంబును; ప్రతీచ్ఛ (అధ్యాహృతము) = గ్రహింపుము.

పురుషశ్రేష్ఠుండవుమహాబలుండవుమహాబాహుండవునగు రాముఁడా! తామసము, సౌమనము, సంవర్ధము, దుర్ధర్షంబగుమౌసలము, సత్యము, మాయాధరము, శత్రువుల తేజస్సును బోఁగొట్టునట్టి తేజఃప్రభంబు, చంద్ర దేవతాకమగుశిశిరము, త్వష్ట్ర దేవతాకమగు సుదామనము, దారుణంబగుభగాస్త్రంబును, మానవంబుననునీయస్త్రంబులఁ బ్రతిగ్రహింపుము. అని, తాత్పర్యము.

ఏతాన్ రామ మహాబాహో కామరూపాన్ మహాబలాన్. ౨౦
గృహాణ పరమోదారాన్ క్షిప్రమేవ నృపాత్మజ

టీక ॥ నృపాత్మజ=రాచకొమరుఁడవైన; మహాబాహో=గొప్ప చేతులుగల; రామ = రాముఁడా; కామరూపాన్ = ఇచ్ఛాధీనమగు రూపము గలవియును; మహాబలాన్=గొప్పబలము గలవియును; పరమోదారాన్= మిక్కిలి యతిశయించి యున్నవియు నగు; ఏతాన్= ఈయస్త్రములను; క్షిప్రమేవ=శీఘ్రముగనే; గృహాణ=తెలిసికొనుము.

రాజపుత్రుండవుమహాబాహుండవునగు రాముఁడా! తమకువలయునట్టిరూపముధరింపఁగలిగి, మహాబలంబులై, యన్నిటినిఅతిశయించియుండు, నీయస్త్రంబుల, శీఘ్రముగాఁదెలిసికొనుము. అని, విశ్వామిత్రుఁడురామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

స్థితస్తు ప్రాఙ్ముఖో భూత్వా శుచి ర్మునివర స్తదా. ౨౧
దదౌ రామాయ సుప్రీతో మంత్రగ్రామ మనుత్తమమ్

టీక॥ తదా=అప్పుడు; మునివరః=మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు; సుప్రీతః = సంతసించినవాండై; శుచిః = పరిశుద్ధుండై; ప్రాఙ్ముఖః = తూర్పుమొగము గలవాండుగా; భూత్వా=అయి; స్థితస్తు=నిలిచినవాండై; రామాయ= రామునికొఱకు; అనుత్తమం= తనకన్న శ్రేష్ఠములేనట్టి; మంత్రగ్రామం=మంత్రములయొక్క సమూహమును; దదౌ=ఇచ్చెను.

అప్పుడు, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, సంతసించి, పరిశుద్ధుండై, తూర్పుమొగముగానిలిచి, శ్రేష్ఠంబులగు నాయస్త్రమంత్రంబుల నన్నిటిని, రామున కుపదేశించెను. అని, తాత్పర్యము.

సర్వసంగ్రహణం యేషాం దైవతైరపి దుర్లభమ్. ౨౨
తాన్యస్త్రాణి తదా విప్రో రాఘవాయ న్యవేదయత్

టీక॥ తదా=అప్పుడు; యేషాం=ఏయస్త్రములయొక్క; సర్వసంగ్రహణం, సర్వ=సాకల్యముచేత, సంగ్రహణం=తెలిసికొనుట; దైవతైరపి=దేవతలచేతను; దుర్లభం=పొందంగూడనిదో; తాని=అట్టి; అస్త్రాణి= అస్త్రములను; విప్రః = బ్రాహ్మణుండగువిశ్వామిత్రుండు; రాఘవాయ=రామునికొఱకు; న్యవేదయత్=తెలిపెను.

ఏయస్త్రంబుల నన్నింటినిం దెలిసికొనుట దేవతలకునశక్యమో, ఆయస్త్రంబులనన్నింటిని, అప్పుడు, విశ్వామిత్రుండు, రామునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

జపతస్తు మునే స్తస్య విశ్వామిత్రస్య ధీమతః. ౨౩

ఉపతస్థు ర్మహార్హాణి సర్వాణ్యస్త్రాణి రాఘవమ్

టీక॥ ధీమతః=బుద్ధిశాలియగు; తస్య=ఆ; మునేః= బ్రహ్మానుసంధానముసేయువాఁడైన; విశ్వామిత్రస్య=విశ్వామిత్రుఁడు;జపతస్తు=జపించుచుండఁగానే; మహార్హాణి=శ్రేష్ఠములైన; అస్త్రాణి=అస్త్రములు;సర్వాణి=అన్నియును; రాఘవం=రామునిః ఉపతస్థుః=సేవించినవి.

బుద్ధిమంతుండగు నా విశ్వామిత్రమహాముని, యయ్యస్త్రములరామునకు వశ్యములుగాఁ జేయుటకు కొంతజపముసేయఁగానే, శ్రేష్ఠములైన యస్త్రములన్నియు, రామునిసేవించినవి.

అని, తాత్పర్యము.

ఊచుశ్చ ముదితా స్సర్వే రామం ప్రాంజలయ స్తదా. ౨౮
ఇమే స్మ పరమోదారాః కింకరా స్తవ రాఘవ

టీక॥ తదా=అప్పుడు;సర్వే=అస్త్రదేవతలందఱును;ముదితాః=సంతసించిన వారలై; ప్రాంజలయః = మంచిచేమోడ్పుగలవారలై; రామం= రామునిఁగూర్చి; "రాఘవ=రాముఁడా!పరమోదారాః = మిక్కిలియతిశయించిన; ఇమే=ఈ; వయం (అధ్యాహృతము) = మేము; తవ=నీకు; కింకరాః=పరిచారకులము; స్మ=అయితిమి;" ఇతి(అధ్యాహృతము)=అని;ఊచుశ్చ=చెప్పిరి.

ఆయస్త్రదేవతలందఱును, సంతసించి,చేతులుమొగిడ్చి, "రాముఁడా!సర్వాతిశాయులమగు మేము,నీకుఁబరిచారకులమైతి"మనీ, రామునితోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

ప్రతిగృహ్య చ కాకుత్థ్స స్సమాలభ్య చ పాణినా. ౨౯
మానసా మే భవిష్యధ్వ మితి తా నభ్యచోదయత్

టీక॥ కాకుత్థ్సః= కకుత్థ్సవంశమునందుఁబుట్టిన రాముఁడు; ప్రతిగృహ్య = స్వీకరించియు; పాణినా= చేతిచేత; సమాలభ్యచ = తాఁకియు; మే=నాయొక్క; మానసాః = మనస్సుననుసరించువారలుగా; భవిష్యథ్వం=అగుదురు గాక, ఇతి=అని; తాః=ఆయస్త్రదేవతలను; అభ్యచోదయత్ =ఆజ్ఞాపించెను.

రాముఁడు, ఆయస్త్రదేవతలు సేయు సేవం బ్రతిగ్రహించి, వారల హస్తంబున సంస్పృశించి, "నామనస్సుననుసరించుచునుండుఁడు" అని, వారలకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తతః ప్రీతమనా రామో విశ్వామిత్రం మహామునిమ్. ౨౮
అభివాద్య మహాతేజా గమనాయోప చక్రమే

టీక॥ తతః=అటుపిమ్మట; మహాతేజాః=అధికమైన ప్రభావము గల; రామః = రాముఁడు; ప్రీతమనాః= సంతసించినమనస్సుగలవాఁడై; మహామునిం=పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; అభివాద్య=నమస్కరించి; గమనాయ=పోవుటకొఱకు; ఉపచక్రమే=ఆరంభించెను.

అంత, మహాతేజుండగు రాముఁడు, సంతసించి, విశ్వామిత్రమహామునికి, నమస్కరించి, పయనమగుటకు, యత్నించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, సప్తవింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండసప్తవింశసర్గటీక,
ముగిసినది.

౨౮

అష్టావింశసర్గప్రారంభః.

ప్రతిగృహ్య తతో స్త్రాణి ప్రహృష్టవదన శ్శుచిః
గచ్ఛన్నేవచ కాకుత్థ్సో విశ్వామిత్ర మథాబ్రవీత్. ౧

టీక॥ తతః = అంతట; కాకుత్థ్సః = రాముఁడు; అస్త్రాణి = అస్త్రములను; ప్రతిగృహ్య = స్వీకరించి; ప్రహృష్టవదనః = మిక్కిలిసంతసించినముఖముగలవాఁడై; శుచిః = పరిశుద్ధుఁడై; అథ = అటుపిమ్మట; గచ్ఛన్నేవచ = (భవిష్యదర్థమందు లట్) పోఁబోవువాఁడైయే; విశ్వామిత్రం = విశ్వామిత్రునిఁగూర్చి; అబ్రవీత్ = పలికెను.

అంత, రాముండు, అస్త్రంబులఁ బ్రతిగ్రహించి, సంతోషంబు నొంది, పరిశుద్ధుఁడై, పయనముకాఁబోవుచు, విశ్వామిత్రునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

గృహీతాస్త్రో స్మి భగవన్ దురాధర్ష స్సురైరపి
అస్త్రాణాం త్వహ మిచ్ఛామి సంహారం మునిపుంగవ. ౨

టీక॥ భగవన్ = మాహాత్మ్యముగల; మునిపుంగవ = మునిశ్రేష్ఠుఁడైనవిశ్వామిత్రుఁడా! అహం = నేను గృహీతాస్త్రః, గృహీత = తెలిసికొనఁబడిన, అస్త్రః = అస్త్రములుగలవాఁడనై; సురైరపి = దేవతలచేతను; దురాధర్షః = ఎదిరింపఁగూడనివాఁడనుగా; అస్మి = అయితిని. అస్త్రాణాం = అస్త్రములయొక్క; సంహారంతు = ఉపసంహారమును మాత్రము; ఇచ్ఛామి = కోరుచున్నాను.

భగవంతుఁడవు మునిశ్రేష్ఠుఁడవగువిశ్వామిత్రుఁడా! నేను, అస్త్రంబులఁదెలిసికొనినందున, దేవతలకు నెదిరింపఁగూడని వాఁడనైతిని; తాము, అస్త్రములప్రయోగమును

మాత్రము నాకుపదేశించితిరి; ఇప్పుడు, ఉపసంహారమునుపదేశింపఁగోరెదను. అని, రాముఁడు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం బ్రువతి కాకుత్స్థే విశ్వామిత్రో మహామునిః
సంహారం వ్యాజహారాథ ధృతిమాన్ సువ్రత శ్శుచిః. ౩

టీక॥ కాకుత్స్థే=రాముఁడు; ఏవం=ఇట్లు; బ్రువతి=చెప్పుచుండఁగా; అథ= పిమ్మట; ధృతిమాన్=సంతోషముగలవాఁడును, లేక, జ్ఞాపకశక్తిగలవాఁడును; సువ్రతః=మంచివ్రతములుగలవాఁడును; శుచిః=పరిశుద్ధుఁడును; మహామునిః= పూజ్యుఁడైన మునియునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; సంహారం=ఉపసంహారమును; వ్యాజహార=చెప్పెను.

రాముండిట్లుడుగఁగానే, సంతోషంబునొంది, గొప్పవ్రతములనాచరించి పరిశుద్ధుండైయున్న, విశ్వామిత్ర మహాముని, యుపసంహారమంత్రంబుల, రామునకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సత్యవంతం సత్యకీర్తిం ధృష్టం రభస మేవచ
ప్రతిహారతరం నామ పరాఙ్ముఖ మవాఙ్ముఖమ్. ౪

లక్షాక్ష విషమౌ చైవ దృఢనాభ సునాభకౌ
దశాక్ష శతవక్త్రౌ చ దశశీర్ష శతోదరౌ. ౫

పద్మనాభ మహానాభౌ దుందునాభ సునాభకౌ
జ్యోతిషం కృశనం చైవ నైరాశ్య విమలావుభౌ. ౬
యోగంధర హరిద్రౌ చ దైత్యప్రశమనౌ తథా
సార్చిమాలీ ధృతి మాలీ వృత్తిమాన్ రుచిర స్తథా. ౭
పిత్ర్యసౌమనసం చైవ విధూత మకరా వుభౌ
కరవీరకరం చైవ ధనధాన్యౌ చ రాఘవ. ౮

కామరూపం కామరుచిం మోహ మావరణం తధా
జృంభకం సర్వనాభంచ సంతాన వరణౌతధా. ౯
భృశాశ్వ తనయాన్ రామ భాస్వరా న్కామరూపిణః
ప్రతీచ్ఛ మమ భద్రంతే పాత్రభూతోసి రాఘవ. ౧౦

టీక॥ రాఘవ = రఘువంశము నందుఁబుట్టిన; రామ=రాముఁడా; సత్యవంతం= సత్యవంతమనుదానిని; సత్యకీర్తిం = సత్యకీర్తియనుదానిని; ధృష్టం = ధృష్టమనుదానిని; రభసమేవచ= రభసమనుదానిని; ప్రతిహారతరం నామ = ప్రతిహారతరమని ప్రసిద్ధమైన దానిని; పరాఙ్ముఖం=పరాఙ్ముఖమనుదానిని; అవాఙ్ముఖం=అవాఙ్ముఖమనుదానిని; లక్షాక్షవిషమౌచైవ, లక్షాక్షు=లక్షాక్షమనుదానిని, విషమౌచైవ=విషమమనుదానిని; దృఢనాభసునాభకౌ, దృఢనాభ=దృఢనాభమనెడుదానిని, సునాభకౌ=సునాభమనుదానిని; దశాక్షశతవక్త్రౌచ, దశాక్ష = దశాక్షమనుదానిని, శతవక్త్రౌచ=శతవక్త్రమనుదానిని; దశశీర్షశతోదరౌ, దశశీర్ష=దశశీర్షమను దానిని, శతోదరౌ=శతోదరమనెడుదానిని; పద్మనాభమహానాభౌ, పద్మనాభ=పద్మనాభమనుదానిని, మహానాభౌ=మహానాభమనుదానిని; దుందునాభసునాభకౌ, దుందునాభ=దుందునాభమనుదానిని, సునాభకౌ=సునాభకమనుదానిని; జ్యోతిషం=జ్యోతిషమనెడుదానిని; కృశనంచైవ=కృశనమనెడు దానిని; నైరాశ్య విమలౌ, నైరాశ్య=నైరాశ్యము, విమలౌ=విమలమునను పేర్లుగల; ఉభౌ=రెంటిని; యోగంధరహరిద్రౌచ, యోగంధర= యోంగధరమనుదానిని, హరిద్రౌ చ= హరిద్రమనుదానిని; తధా=అట్లు; దైత్యప్రశమనౌ, దైత్య=దైత్యమనుదానిని, ప్రశమనౌ = ప్రశమనమనుదానిని; సార్చిర్మాలీ= (ద్వితీయార్ధమందు ప్రథమ, ఇట్లుత్తరస్థలంబులందును.) సార్చిర్మాలియనుదానిని; ధృతిః=ధృతియ




నుదానిని; మాలీ=మాలియనుదా
నిని;వృత్తిమాన్=వృత్తిమంతమను
దానిని;తథా=అట్లు;రుచిరః=రుచి
రమనుదానిని; పితృసౌమనసం చై
వ= పితృసౌమనసమనెడుదానిని;వి
ధూతమకరౌ= విధూతమనుమకర
మనను పేర్లుగల;ఉభౌ=రెంటిని;క
రవీరకరంచైవ= కరవీరకరమనెడు
దానిని;ధనధాన్యౌచ, ధన=ధనమ
నుదానిని, ధాన్యౌచ=ధాన్యమను
దానిని; కామరూపం=కామరూప
మనుదానిని; కామరుచిం=కామరు
చియనుదానిని; మోహం= మో
హమనుదానిని; తథా = అట్లు;
ఆవరణం = ఆవరణ మను దా
నిని; జృంభకం=జృంభకమనుదాని
ని;సర్వనాభంచ= సర్వనాభమను
దానిని;తథా= అట్లు; సంతానవ
రణౌ, సంతాన=సంతానమనుదా
నిని,వరణౌ=వరణమనుదానిని;భా
స్వరాన్=ప్రకాశించునవియును;
కామరూపిణః=ఇచ్ఛాధీనమగురూ
పముగలవియు నగు;భృశాశ్వ తన
యాన్=భృశాశ్వునికొడుకులైన;
ఏతాన్=. (అధ్యాహృతము) ఈ
యుపసంహార ములను; మమ =
(పంచమ్యర్థకమందు షష్ఠి) నావ
లన; ప్రతీచ్ఛ = ప్రతిగ్రహింపు
ము. తే=నీకు; భద్రం = మంగ
ళము; అస్తు= (అధ్యాహృతము)
అగుఁగాక. రాఘవ = రాముఁ
డా ! పాత్రభూతః= దానమున
కుఁదగినవాఁడవు;అసి=అయితివి.

రాముఁడా ! సత్యవంతమును,
సత్యకీర్తిని, ధృష్టమును,రభసము
ను, ప్రతిహారతరంబును, పరాఙ్ము
ఖంబును, అవాఙ్ముఖంబును, ల
క్షాక్షమును, విషమమును, దృఢ
నాభమును, సునాభమును, దశా
క్షమును, శతవక్త్రమును, దశశీ
ర్షమును, శతోదరమును,పద్మనా
భమును,మహానాభమును, దుందు
నాభమును, సునాభకమును,జ్యోతి
షమును, కృశనమును,నైరాశ్యము
ను,విమలమును, యోగంధరమును,
హరిద్రమును, దైత్యమును, ప్రశ
మనమును,సార్చిర్మాలిని, ధృతి
ని, మాలిని, వృత్తిమంతమును, రు
చిరమును, పితృసౌమనసమును,వి
ధూతమును,మకరమును,కరవీరకర
మును, ధనమును,ధాన్యమును, కా
మరూపమును, కామరుచిని, మో




హాముసు, ఆవరణమును, జృంభకమును, సర్వనాభమున, సంతానమును, వరణమును, కామరూపులై ప్రకాశించునట్టి, భృశాశ్వునికొడుకులైన, యీయుపసంహారముల, నిచ్చెదను, ప్రతిగ్రహింపుము; నీకు మంగళ మొదవుఁగాక; నీవునాకుఁ బాత్రభూతుఁడవైతివి. అని, విశ్వామిత్రుఁడు, రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

బాఢ మిత్యేవ కాకుత్థ్సః ప్రహృష్టే నాంతరాత్మనా

టీక॥ కాకుత్థ్సః= రాముఁడు; ప్రహృష్టేన = సంతసించిన;అంతరాత్మనా = మనస్సుతో;బాఢమేవ=మంచిదే; ఇతి=అని; ఉక్త్వా= చెప్పి;ప్రత్యజగ్రాహ(అధ్యాహృతము)=ప్రతిగ్రహించెదను.

రాముండు, సంతసించి, "మంచిదే" అనిచెప్పి,యామంత్రంబులు,బ్రతిగ్రహించెను.

అని, తాత్పర్యము.

దివ్యభాస్వరదేహా శ్చ మూర్తిమంత స్సుఖప్రదాః. ౧౧
కేచి దంగారసదృశాః కేచి ద్ధూమోపమా స్తథా
చంద్రార్క సదృశాః కేచి త్ప్రహ్వాంజలిపుటా స్తథా. ౧౨
రామం ప్రాంజలయో భూత్వా బ్రువన్ మధురభాషిణః
ఇమే స్మ నరశార్దూల శాధి కిం కరవామ తే. ౧౩

టీక॥ దివ్యభాస్వరదేహాశ్చ, దివ్య=శ్రేష్ఠములైన, భాస్వర=ప్రకాశించునట్టి, దేహాశ్చ=దేహముగలవారును;మూర్తిమంతః = ఆకారములుగలవారును;సుఖప్రదాః=సుఖమునిచ్చువారును; కేచిత్=కొందఱు; అంగారసదృశాః, అంగార=నిప్పుతో,సదృశాః = సమానులైనవారును,తథా = అట్లు;కేచిత్= కొందఱు; ధూమోపమాః, ధూమ=పొగతో, ఉపమాః=సరివచ్చువారును; కేచిత్ = కొందఱు;చంద్రార్కసదృశాః, చంద్రార్క= చంద్రసూర్యులతో, సదృశాః=సమానులైనవారును; తథా=అట్లు; కేచిత్(అధ్యాహృతము)= కొంద

లు; పరిహ్వాంజలిపుటాః, ప్రహ్వా=న
మ్రములైన, అంజలిపుటాః=దొప్ప
లవంటిచేమోడ్పులుగలవారునైన; 
తే(అధ్యాహృతము)= ఆమంత్రదే
వతలు; ప్రాంజలయః = మంచిచే
మోడ్పుగలవారలు; భూత్వా=అ
యి; మధురభాషిణః=మనోహరము
గామాటలాడువారలై; రామం=
రామునింగూర్చి; నరశార్దూల=
పురుషశ్రేష్ఠుఁడవైనరాముఁడా! ఇ
మే = ఈ; వయం(అధ్యాహృత
ము)=మేము; స్మ = ఉన్నాము; శా
ధి=ఆజ్ఞాపింపుము; తే=నీకు; కిం=
దేనిని; కరవామ=చేయుదుము; ఇతి
(అధ్యాహృతము) = అని; అబ్రు
వన్=చెప్పిరి.

దివ్యంబులును దేదీప్యమానంబులుననగు దేహములుగల్గి, మూర్తిమంతులై, సుఖప్రదాతలైయుండు, నామంత్రాధిష్ఠానదేవతలందఱును, గొందఱు, నిప్పువంటివారును, గొందఱుపొగవలెనుండు వారును, గొందఱుచంద్రసూర్యులకు సరివచ్చువారును, గొందఱునమ్రములైనచేమోడ్పులుగలవారునుంగావచ్చి, చేతులుమొగిడ్చి, "పురుష శ్రేష్ఠుఁడవైన రాముఁడా! ఇదిగోయున్నాము; ఆజ్ఞాపింపుము; నీకేమిసేయవలయును" అని, రామునితో, మధురంబుగాఁ, జెప్పిరి. అని, తాత్పర్యము.

మానసాః కార్యకాలేషు సాహాయ్యం మే కరిష్యథ
గమ్యతా మితి తా నాహ యథేష్టం రఘునందనః. ౧౪

టీక॥ రఘునందనః = రాముఁడు; "యూయం (అధ్యాహృతము)=మీరలు; కార్యకాలేషు=కార్యముగల్గుకాలములయందు; మానసాః= నామనస్సుననుసరించువారలై; మే=నాకు; సాహాయ్యం=తోడుపాటును; కరిష్యథ=చేయఁగలరు. యథేష్టం=మీయిష్టమున్నట్లు; యుష్మాభిః(అధ్యాహృతము)=మీచేత; గమ్యతాం=పోఁబడుఁగాక. ఇతి=అని; తాన్=వారలంగూర్చి; ఆహ= (భూతార్థమందులట్)చెప్పెను.

"మీరలు, కార్యముగల్గినపుడు,

నేనుదలంచినప్పుడు, వచ్చి, నాకుసాహాయ్యము సేయుఁడు; ఇప్పుడు, యథేష్టముగాఁబొండు." అని, రాముఁడు, ఆమంత్రాధిష్ఠానదేవతలతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

అథ తే రామ మామంత్ర్య కృత్వాచాపి ప్రదక్షిణమ్
ఏవ మస్త్వితి కాకుత్థ్స ముక్త్వా జగ్ము ర్యథాగతమ్. ౧౫

టీక॥ అథ=అటుపిమ్మట; తే=ఆదేవతలు; కాకుత్థ్సం=కకుత్థ్సవంశంబునఁబుట్టిన; రామం=రాముని; ఆమంత్ర్య=వీడుకొని; ప్రదక్షిణం చాపి=ప్రదక్షిణమును; కృత్వా=చేసి; ఏవం=ఇట్లు, అస్తు=అగుఁగాక; ఇతి=అని; ఉక్త్వా=చెప్పి; యథాగతం=వచ్చినట్లు; జగ్ముః=పోయిరి.

అంత, నామంత్రాధిష్ఠానదేవతలు, రాముని వీడుకొని ప్రదక్షిణించి, "ఈప్రకారమే యగుఁగాక" యనిచెప్పి, వచ్చినట్లు, వెళ్లిరి.

అని, తాత్పర్యము.

సచ తాన్ రాఘవో జ్ఞాత్వా విశ్వామిత్రం మహామునిమ్
గచ్ఛన్నే వాథ మధురం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౧౬

టీక॥ సః=ఆ; రాఘవశ్చ=రాముఁడును; తాన్=ఆయుపసంహారమంత్రములను; జ్ఞాత్వా = తెలిసికొని; అథ=పిమ్మట; గచ్ఛన్నేవ=పోవుచునే; మహామునిః=పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రం=విశ్వామిత్రునిఁగూర్చి; మధురం=మనోహరమైనదియును; శ్లక్ష్ణం=స్పష్టమైనదియునగు; వచనం=వాక్యమును; అబ్రవీత్=పలికెను.

ఆరాముండును, ఉపసంహారమంత్రంబులనెఱింగి, దారినడుచుచు, మనోహరంబునుస్పష్టంబునగు నొకమాటచెప్పెను.

అని, తాత్పర్యము.

కి న్న్వేత న్మేఘ సంకాశం పర్వతస్యా విదూరతః
వృక్షషండ మితో భాతి పరం కౌతూహలం హి మే. ౧౭
దర్శనీయం మృగాకీర్ణం మనోరమ మతీవ చ
నానాప్రకారై శ్శకునై ర్వల్గునాదై రలంకృతమ్. ౧౮

టీక॥ ఇతః = ఇక్కడ; పర్వతస్య=పర్వతమునకు; అవిదూరతః=కొంచెముదూరమునందు; మేఘసంకాశం=మేఘముతో సమానమైనదియును; దర్శనీయం=చూడఁదగినదియును; మృగాకీర్ణం, మృగ=జింకలచే, ఆకీర్ణం = వ్యాపింపఁబడినదియును; అతీవ=మిక్కిలి; మనోరమం చ=మనోహరమైనదియును, నానాప్రకారైః= పలుదెఱంగులైన; వల్గునాదైః, వల్గు=మనోహరమైన, నాదైః=ధ్వనిగల; శకునైః=పక్షులచేత; అలంకృతం=అలంకరింపఁబడినదియునగు; వృక్షషండం, వృక్ష=మ్రాకులయొక్క, షండం=సమూహము; భాతి=ప్రకాశించునది. ఏతత్ =ఇది; కిన్ను=ఏది? మే=నాకు; పరం=అధికమయిన; కౌతూహలం హి=కోర్కిగదా!

ఇచ్చట, పర్వతమునకుఁగొంచెముదూరములో, మేఘమువలెదట్టమై, దర్శనీయంబై, మృగములు గల్గి, మనోహరంబై, మనోహరముగా ధ్వనించు నానావిధంబులగుపక్షులచే నలంకృతంబైయొప్పు, నొక్కవనము ప్రకాశించుచున్నది, ఈవనమేది ? నాకుఁజాలఁగోర్కెయున్నదిగావునఁజెప్పవలయును.

అని, తాత్పర్యము.

నిస్సృతాస్స్మ మునిశ్రేష్ఠ కాంతారా ద్రోమహర్షణాత్

టీక ॥ మునిశ్రేష్ఠ=మునులలో మేటియైన విశ్వామిత్రుఁడా! రోమహర్షణాత్= గగుర్పాటుగల్గించునట్టి; కాంతారాత్ = అడవి

నుండి; నిస్సృతాఃస్మ=బయలువెడలినాముగదా!

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! భయంకరమగుటచేగగుర్పాటుగల్గించునట్టి యాతాటకావనమునుదాఁటితిమిగదా!

అని, తాత్పర్యము.

అనయాం త్వ వగచ్ఛామి దేశస్య సుఖవత్తయా. ౧౯
సర్వం మే శంస భగవ& కస్యా శ్రమపదం త్విదమ్

టీక॥ దేశస్య=ప్రదేశమందు; అనయా=ఈ; సుఖవత్తయాతు=సుఖముగల్గియుండుటచేత మాత్రము;ఇదం=దీనిని; ఆశ్రమపదంతు=ఆశ్రమస్థానమునుగామాత్రము; అవగచ్ఛామి = తెలిసికొనుచున్నాను కస్య= ఎవ్వనిది; భగవ&=మాహాత్మ్యముగలవిశ్వామిత్రుఁడా! సర్వం=అంతను; మే=నాకు; శంస=చెప్పుము.

ఈప్రదేశమందు, భయములేక సుఖముగానుండుటచే నిది ఋష్యాశ్రమమనిమాత్రము తెలిసి కొంటిని; ఈయాశ్రమ మెవ్వనిది? దీనినామూలాగ్రముగా నాకుఁ జెప్పుము. అని, తాత్పర్యము.

సంప్రాప్తా యత్ర తే పాపా బ్రహ్మఘ్నా దుష్టచారిణః. ౨౦
తవ యజ్ఞస్య విఘ్నాయ దురాత్మానో మహామునే
భగవ& తస్య కో దేశ స్సా యత్ర తవ యాజ్ఞికీ. ౨౧
రక్షితవ్యా క్రియా బ్రహ్మ న్మయా వధ్యాశ్చ రాక్షసాః

టీక ॥ మహామునే=పూజ్యుఁడైనమునివగువిశ్వామిత్రుఁడా! తవ=నీయొక్క; యజ్ఞస్య=యాగమునకు,విఘ్నాయ= అంతరాయముకొఱకు; దురాత్మానః=దుష్టస్వభావముగలవారును;పాపాః=పాపముగలవారును; బ్రహ్మఘ్నాః=బ్రాహ్మణులంజంపువారును; దుష్టచారిణః = దుష్టముగానడుచువారునగు; తే = ఆమారీచుఁడుమొదలగురాక్షసులు; యత్ర = ఏయాశ్రమమందు; సంప్రాప్తాః=వచ్చినవా

రలు, భవంతి(అధ్యాహృతము) అగుచున్నారో; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవైనవిశ్వామిత్రుఁడా! తవ=నీయొక్క; యాజ్ఞికీ=యజ్ఞసంబంధియగు; సా=ఆ; క్రియా=కర్మము; మయా=నాచేత; యత్ర=ఏయాశ్రమమందు; రక్షితవ్యా=రక్షింపఁబడవనసినదో; రాక్షసాశ్చ=మారీచుఁడు మొదలగు రాక్షసులును; వధ్యాః = చంపఁదగినవారలో; భగవన్= మాహాత్మ్యముగలవిశ్వామిత్రుఁడా! తస్య=ఆయాశ్రమము యొక్క; దేశః=స్థానము; కః=ఏది?

మునిశ్రేష్ఠుండవు భగవంతుండవునగువిశ్వామిత్రుఁడా! ఏయాశ్రమమందు, నీవు సేయుయాగమునకు విఘ్నముగావించుటకై, దురాత్ములును, పాపస్వభావులును, బ్రహ్మఘాతుకులును, దుష్టాచారముగలవారునగు రాక్షసులు వత్తురో; ఎచ్చట, నేనా రాక్షసులంజంపినీయాగకార్యమునురక్షింపవలయునో; ఆయాశ్రమ మెచ్చటనున్నది?

అని, తాత్పర్యము.

ఏత త్సర్వం మునిశ్రేష్ఠ శ్రోతు మిచ్ఛా మ్యహం ప్రభో. ౨౨

టీక ॥ ప్రభో=సమర్థుఁడవగు; మునిశ్రేష్ఠ= మునులలో మేటివైన విశ్వామిత్రుఁడా! అహం=నేను; ఏతత్=దీనిని; సర్వం=అంతను; శ్రోతుం=వినుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

మునిశ్రేష్ఠుండవుఁ బ్రభువునగు విశ్వామిత్రుఁడా! దీనినంతయు వినఁగోరెదను. అని, రాముఁడు విశ్వామిత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, అష్టావింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రీ

వ్యాఖ్యానంబునందు, బాలకాండాష్టావింశసర్గ టీక,
ముగిసినది.

---

౨౯

ఏకోనత్రింశసర్గప్రారంభః.

అధ తస్యాప్రమేయస్య తద్వనం పరిపృచ్ఛతః
విశ్వామిత్రో మహాతేజా వ్యాఖ్యాతు ముపచక్రమే. ౧

టీక॥ అధ=అటుపిమ్మట; మహాతేజాః=అధికమైన ప్రభావముగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; అప్రమేయస్య=కొలతపెట్టఁగూడనట్టి; తత్=ఆ; వనం=వనమును; పరిపృచ్ఛతః = అడుగుచున్న; తస్య = (చతుర్థ్యర్థమందు షష్ఠి) ఆరామునికొఱకు; వ్యాఖ్యాతుం=వివరించిచెప్పుటకు; ఉపచక్రమే= ఆరంభించెను.

అంత, రాముఁడు, నారాయణావతారరూపుఁడైనను, మనుష్యత్వంబునంజేసి, తన మునుపటివృత్తాంతమును దెలియనట్లు, అడుగఁగానే, మహాతేజుండగు విశ్వామిత్రుఁడు, ఆయాశ్రమమునువివరించి చెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

ఇహ రామ మహాబాహో విష్ణుర్దేవవరః ప్రభుః
వర్షాణి సుబహూనీహ తథా యుగశతాని చ. ౨
తపశ్చరణయోగార్థ మువాస సుమహాతపాః

టీక॥ మహాబాహో=గొప్పచేతులుగల; రామ=రాముఁడా! ఇహ=ఈవనమందు; ఇహ=ఈప్రదేశమందు; దేవవరః=దేవతలలో

శ్రేష్ఠుఁడును ; ప్రభుః=సమస్తలోకంబులకు,నధిపుఁడును; సుమహాతపాః= మిక్కిలియధికమైనతపస్సు గలవాఁడునగు; విష్ణుః=విష్ణుదేవుఁడు; సుబహూని=అనేకములైన,వర్షాణి= (అత్యంతసంయోగమందు ద్వితీయ) సంవత్సరములును; తథా=అట్లు; యుగశతానిచ=యుగములనూఱులును; తపశ్చరణయోగార్థం,తపః=తపస్సుయొక్క,చరణ = అనుష్ఠానముకొఱకును,యోగార్థం=యోగముకొఱకును; ఉవాస=ఉండెను.

మహాబాహుండవగురామఁుఁడా! ఈవనమందిచ్చట, దేవశ్రేష్ఠుండును సమస్తలోకనాయకుండును మిక్కిలియుఁదపస్వియునగు విష్ణుదేవుఁడు, పెక్కునూఱులయుగంబులు,“తపస్సు, యోగము,”ఇవిసిద్ధించుటకై,వాసముచేసెను.

అని, తాత్పర్యము.

ఏష పూర్వాశ్రమో రామ వామనస్య మహాత్మనః‌। ౩
సిద్ధాశ్రమ ఇతి ఖ్యాత స్సిద్ధో హ్యత్ర మహాతపాః

టీక॥ రామ = రామఁుఁడా! ఏషః=ఇది;మహాత్మనః=పూజ్యమైన స్వభావముగల; వామనస్య=వామనావతారరూపుఁడగు విష్ణుదేవునియొక్క; పూర్వాశ్రమః=మునుపటియాశ్రమము.హి=ఏకారణమువలన; అత్ర=ఈయాశ్రమమందు;మహాతపాః = అధికమైనతపస్సుగల కాశ్యపుఁడు; సిద్ధః = సిద్ధినొందినవాఁడో; తస్మాత్ (అధ్యాహృతము)=ఆకారణమువలన; సిద్ధాశ్రమః=సిద్ధాశ్రమము;ఇతి=అని;ఖ్యాతః=ప్రసిద్ధమైనది.

రామఁుఁడా! నారాయణావతారరూపుండగువామనుఁడు,పూర్వము,అవతరించుటకు మునుపునారాయణుఁడుగానున్నపుడును, అవతరించినపిమ్మటనుగూడ,వాసముచేసినయాశ్రమమిది;ఇచ్చట, కాశ్యపుఁడుసిద్ధినిబొందినాఁడు కావున,ని ది, సిద్ధాశ్రమమని పేరొందఁబడినది.అని, తాత్పర్యము.

ఏతస్మిన్నేవ కాలేతు రాజా వైరోచని ర్బలిః. ४
నిర్జిత్య దైవతగణాన్ సేంద్రాంశ్చ సమరుద్గణాన్
కారయామాస తద్రాజ్యం త్రిషు లోకేషు విశ్రుతః. ౫

టీక॥ ఏతస్మిన్=ఈ; కాలేత్వేవ=కాలమందే; వైరోచనిః=విరోచనునికొడుకైన; బలిః=బలియనెడు; రాజా=రాజు; సేంద్రాంశ్చ=ఇంద్రునితోఁగూడినవారును; సమరుద్గణాన్= వాయువులసమూహముతోఁగూడినవారునగు; దైవతగణాన్= దేవతలయొక్కసమూహములను; నిర్జిత్య=జయించి; త్రిషు=మూఁడైన; లోకేషు = లోకములయందు; విశ్రుతః=ప్రసిద్ధుఁడై; తద్రాజ్యం, తత్=ఆదేవతలయొక్క, రాజ్యం=దొరతనమును; కారయామాస= (స్వార్థమందుణిచ్)చేసెను.

ఇట్లువిష్ణుదేవుఁడిచ్చటతపస్సు సేయుచుండు నపుడే, ప్రహ్లాదపుత్రుండగు విరోచనునికొడుకైనబలి చక్రవర్తి, వాయుగణంబులతోఁ గూడినదేవతలనందఱ నింద్రసహితంబుగా జయించి, ముల్లోకంబులందునుం బ్రసిద్ధినొంది, యాదేవతారాజ్యమగు స్వర్గమును, పాలించుచుండెను. అని, తాత్పర్యము.

బలేస్తు యజమానస్య దేవా స్సాగ్ని పురోగమాః
సమాగమ్య స్వయం చైవ విష్ణు మూచు రిహా శ్రమే. ౬

టీక॥ బలేః=బలిచక్రవర్తి; యజమానస్యతు= యాగముసేయుచుండఁగానే; సాగ్నిపురోగమాః=ముందునడుచువాఁడైనయగ్నిదేవునితోఁ గూడిన; దేవాః=దేవతలు; స్వయం చైవ=తామే; సమాగమ్య=వచ్చి; ఇహ=ఈ; ఆశ్రమే=ఆశ్రమమందు; స్థితం(అధ్యాహృతము)=ఉన్నట్టి; విష్ణుం=విష్ణుదేవునింగూర్చి; ఊచుః=పలికిరి.

బలిచక్రవర్తి యాగముసేయుచుండఁగా, దేవతలందఱును, అగ్ని

దేవుని ముస్నిడికొని, తామేవచ్చి, యీ యాశ్రమమందుఁ దపస్సుసేయుచున్న, విష్ణుదేవునితో,నిట్లనిచెప్పిరి. అని, తాత్పర్యము.

బలి ర్వైరోచని ర్విష్ణో యజతే యజ్ఞ ముత్తమమ్
అసమాప్తే క్రతౌ తస్మిన్ స్వకార్య మభిపద్యతామ్. ౭

టీక॥ విష్ణో=విష్ణుదేవుఁడా! వైరోచనిః=విరోచనునికొడుకైన; బలిః=బలిచక్రవర్తి; ఉత్తమం=శ్రేష్ఠమైన; యజ్ఞం=యాగమును; యజతే (చేయుచున్నాఁడు)= యజించుచున్నాఁడు. తస్మిన్=ఆ; క్రతౌ=యాగము; అసమాప్తే=ముగియనిదిగానుండఁగా; స్వకార్యం=తమకార్యము, దేవకార్యమనుట, ఆశ్రితులగువారికార్యము, స్వకార్యమేయనియభిప్రాయము; అభిపద్యతాం = సంపాదింపఁబడుఁగాక.

విష్ణుదేవుఁడా! విరోచనపుత్రుండగు బలిచక్రవర్తి యుత్తమంబైన యాగముసేయుచున్నాఁడు; ఆయాగముసమాప్తిఁ బొందుటకు మును పే,మనకార్యమునుసంపాదింపవలయును. అని, తాత్పర్యము.

యే చైన మభివర్తంతే యాచితార ఇతస్తతః
యచ్చ యత్ర యథావచ్చ సర్వం తేభ్యః ప్రయచ్ఛతి. ౮

టీక॥ ఇతస్తతః= ఒకచోటనుండి మఱియొక చోటికి; గచ్ఛతః (అధ్యాహృతము) = పోవుచున్నట్టి; యేచ=ఎవరు; యత్ర=ఏకాలమందు; యచ్చ=దేనిని; యథావత్=ఎందుతమట్టుకు; యాచితారః=యాచించువారలై; ఏనం=ఈబలిచక్రవర్తినిగూర్చి; అభివర్తంతే = వచ్చుచున్నారో; తేభ్యః=వారలకొఱకు; తత్ర(అధ్యాహృతము)= ఆకాలమందు; తత్(అధ్యాహృతము)=దానిని; సర్వంచ=అంతను; ప్రయచ్ఛతి= ఇచ్చుచున్నాఁడు.

ఇటు, అటు,పోవువారలెవ్వరు,

ఎప్పుడు, దేనిని, ఎంతమట్టుకు, ఈబలిచక్రవర్తిని యాచించుచున్నారో; వారలకు, అప్పుడే, దానినంతను, ఇచ్చుచున్నాఁడు. అని, తాత్పర్యము.

సత్వం సురహితార్థాయ మాయాయోగ ముపాగతః
వామనత్వం గతో విష్ణో కురు కల్యాణ ముత్తమమ్. ౯

టీక॥ విష్ణో = విష్ణుదేవుఁడా! సః=అట్టి; త్వం=నీవు; సురహితార్థాయ, సుర=దేవతలయొక్క, హిత=మేలనెడు, అర్థాయ=ప్రయో[redacted]కొఱకు; మాయాయో మాయా = మాయయొక్క, యోగం=సంబంధమును; ఉపాగతః = పొందినవాఁడవై; వామనత్వం=పొట్టివాఁడవగుటను; గతః= ...దినవాఁడవై; ఉత్తమం=శ్రేష్ఠమైన; కల్యాణం=మంగళమును; కురు=చేయుము.

విష్ణుదేవుఁడా! మున్నెంతకష్టంబునను మమ్ముఁ దేర్చినట్టిమహాప్రభావుండవగు నీవు, దేవతలకు మేలుగల్గుటకై, మాయవహించి, వామనుండవయి, ఉత్తమంబగు మంగళంబానగూర్పుము. అని దేవతలు చెప్పిరి. అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే రామ కాశ్యపో గ్నిసమప్రభః
అదిత్యా సహితో రామ దీప్యమాన ఇవౌజసా. ౧౦
దేవీసహాయో భగవాన్ దివ్యం వర్షసహస్రకమ్
వ్రతం సమాప్య వరదం తుష్టావ మధుసూదనమ్. ౧౧

టీక॥ రామ=రాముఁడా! ఏతస్మిన్=ఈ; అంతరే=మధ్యమందు; భగవాన్=మాహాత్మ్యముగలవాఁడును; అగ్నిసమప్రభః, అగ్ని=నిప్పుతో, సమ=సరివచ్చునట్టి, ప్రభః=కాంతిగలవాఁడునగు; కాశ్యపః=కాశ్యపుఁడు; అదిత్యా=అదితితో; సహితః=కూడినవాఁడై; ఓజసా=కాంతిచేత; దీప్యమానఇవ (స్థితః) ప్రకాశించుచున్నట్లున్నవాఁడై; రామ=రాముఁడా! (ఇప్పుడు రాముఁడుగానుండు విష్ణుఁడేకదా యిన్నికా

ర్యములునుంజేసినది! కాశ్యపాదుల కుఁగూడఁగష్టసాధ్యమైన యీవిష్ణు దేవుఁడు,ఇష్టుఁడు,రామరూపంబున, మనకట్టెదుటఁ గాన్పించు చున్నాఁడుగదా!మనపుణ్యమేమి! అని సంతోషంబున, "రామ" అని రెండవమాఱును, విశ్వామిత్రుండు చ్చరించెను.) దివ్యం= స్వర్గము నందుఁబుట్టిన; వర్షసహస్రికం= వెయ్యేండ్లు (అత్యంతసంయోగమందుద్వితీయ) వ్రతం=వ్రతమును;సమాప్య=ముగించి; దేవీసహాయః= భార్యయైనయదితియేతోడుగాఁగలవాఁడై; వరదం=వరంబులనిచ్చునట్టి; మధుసూదనం=మధువనురాక్షసునింజంపిన విష్ణుదేవుని; తుష్టావ=స్తుతించెను.

రాముఁడా! యీమధ్యమందు; నిప్పువంటికాంతిగల భగవంతుండగుకాశ్యపుండు,అదితింగూడి, కాంతిచేఁ బ్రకాశింపుచు, సహస్రదివ్యవర్షంబులు,వ్రతంబుసల్పి, తనకు వరంబొసంగుటకై పొడసూపిన విష్ణుదేవుని, భార్యయునుందాట్లని,స్తుతించెను.

అని, తాత్పర్యము.

తపోమయం తపోరాశిం తపోమూర్తిం తపాత్మకమ్
తపసా త్వాం సుతప్తేన పశ్యామి పురుషోత్తమమ్. ౧౨

టీక॥ తపోమయం=తపస్సుప్రచురముగాఁగల వాఁడవును; తపోరాశిం = తపస్సులసమూహమైన వాఁడవును,తపోమూర్తిం,తపః= జ్ఞానము,మూర్తిం=శరీరముగాఁగలవాఁడవును; తపాత్మకం,తపః= (సంధియార్షము) తపస్సే,ఆత్మకం= స్వభావముగాఁగలవాఁడవును;పురుషోత్తమం=పురుషశ్రేష్ఠుండవునగు; త్వాం=నిన్ను;సుతప్తే చక్కఁగాఁజేయబడిన; తపసా తపస్సుచేత; పశ్యామి = చూన్నాను.

నీవు, తపోమయుండవు, తపోరాశివి,జ్ఞానస్వరూపుండవు, నీకుఁదపస్సేస్వభావంబు, నీవు పురుషోత్తముండవు,అట్టినిన్ను, చక్కఁగానునుష్ఠింపఁబడిన, తపస్సుచేఁ జూచు

చున్నాను.

అని తాత్పర్యము.

ఇట్లు, మహేశ్వరతీర్థ గోవింద రాజు లిద్దరును వ్యాఖ్యానము చేసిరి.

విశేషార్థము.—తపోమయం= జ్ఞాన మయుండవును; తపోరాశిం, తపః=తేజస్సులయొక్క, రాశిం= సమూహమయినవాడవును. ("తపోవీర్యమహశౌర్య జ్ఞాన తేజస్సుకీర్త్యతే" అని, హలాయుధనిఘంటువు.) తపోమూర్తిం=జ్ఞానము శరీరము గాఁగల వాఁడవును; తపాత్మకం= జ్ఞానస్వరూపుఁడవును; పురుషోత్తమం = పురుషశ్రేష్ఠుండవున గు; త్వాం=నిన్ను; సుతప్తేన=చక్కగా ననుష్ఠింపఁబడిన; తపసా=తపస్సుచేత; పశ్యామి=చూచెదను.

నీవు, జ్ఞానమయుండవు, తేజో రాశిస్వరూపుండవు, జ్ఞానశరీరుండవు, జ్ఞానస్వరూపుండవు, పురుషోత్తముండవు, నిన్ను సాంగముగా ననుష్ఠింపఁబడినతపస్సుచేతం జూచుచున్నాను. అని, తాత్పర్యము.

ఇట్లు, మునిప్రభావ ప్రకాశికా కారులువర్ణించిరి.

శరీరే తవ పశ్యామి జగత్సర్వ మిదం ప్రభో
త్వ మనాది రనిర్దేశ్య స్త్వా మహం శరణం గతః. ౧౩

టీక॥ ప్రభో=సమస్తలోకనాయకుఁడవైనవిష్ణుదేవుఁడా! తవ=యొక్క; శరీరే=దేహమందు; ఇదం=ఈ; జగత్=ప్రపంచమును; సర్వం=అంతను; పశ్యామి=చూచుచున్నాను; (జగత్తంతయు నీవికారంబేయనుట.) త్వం=నీవు; అనాదిః=పుట్టుకలేనివాఁడవు; అనిర్దేశ్యః=నిర్దేశింపఁ గూడనివాఁడవు; అహం=నేను; త్వాం=నిన్ను; శరణం= రక్షించువానిఁగా; గతః= పొందినాఁడను.

సమస్తలోకనాయకుండవయిన విష్ణుదేవుఁడా! నీశరీరమందీజగత్తంతయుఁ గన్పడుచున్నది, నీవు పుట్టుకలేనివాఁడవు, నిన్ను నిర్దేశింప నేరికినలవిగాదు; అట్టినిన్ను, నేను శరణుఁబొచ్చితిని. అని, కాశ్యపుఁడు



స్తుతించెను. అని తాత్పర్యము.

త మువాచ హరిః ప్రీతః కాశ్యపం ధూతకల్మషమ్
వరం వరయ భద్రం తే వరార్హోసి మతో మమ. ౧౪

టీక॥ హరిః=విష్ణుదేవుఁడు; ప్రీతః=సంతసించినవాఁడై; ధూతకల్మషం,ధూత= పోఁగొట్టఁబడిన,కల్మషం=పాపముగల; కాశ్యపం=కాశ్యపునిఁగూర్చి; "వరం=వరమును;వరయ=కోరుము; తే=నీకు;భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక; మమ=నాకు; వరార్హః = వరమునకుఁదగినవాఁడవుగా;మతః=సమ్మతుఁడవు;అసి=అగుచున్నావు.

విష్ణుదేవుండును, సంప్రీతుండై, "వరముగోరుము,నీకుమంగళమగుఁగాక, నేను,వరమిచ్చుటకు.నీవుదగినవాఁడవు" అని, నిష్కల్మషుండగు కాశ్యపునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా వచనం తస్య మారీచః కాశ్యపోఽబ్రవీత్

టీక ॥ తస్య=ఆవిష్ణుదేవునియొక్క;తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; మారీచః = మరీచికొడుకైన;కాశ్యపః = కాశ్యపుఁడు;అబ్రవీత్=చెప్పెను.

విష్ణుదేవునిమాటవిని, మరీచి మహామునికొడుకైన కాశ్యపుండావిష్ణువుతోనిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

అదిత్యా దేవతానాంచ మమచైవానుయాచతః. ౧౫
వరం వరద సుప్రీతో దాతు మర్హసి సువ్రత

టీక॥ సువ్రత=మంచివ్రతములుగల; వరద=వరములనిచ్చునట్టివిష్ణు




దేవుఁడా! త్వం= (అధ్యాహృతము)నీవు; సుప్రీతః= మిక్కిలిసంతసించిన వాఁడవై; యాచమానాయాః(అధ్యాహృతము)=యాచించుచున్నట్టి; అదిత్యాః= అదితికిని; యాచమానానాం (అధ్యాహృతము) = యాచించుచున్నట్టి; దేవతానాంచ=దేవతలకును;అనుయాచతః=యాచించుచున్నట్టి; మమచైవ=నాకును;వరం=వరమును; దాతుం=ఇచ్చుటకు; అర్హసి=తగుదువు.

సుప్రీతుండవు వరప్రదుండవు నగువిష్ణుదేవుఁడా! నీవు,సుప్రీతుండవయి,నిన్నుయాచించుచున్న,నాకును,నాభార్య యయినయదితికిని, దేవతలకునుంగూడ, వరమునివ్వవలయును. అని,తాత్పర్యము.

పుత్రత్వం గచ్ఛ భగవ న్నదిత్యా మమ చానఘ. ౧౬
భ్రాతా భవ యవీయాం స్త్వం శక్రస్యా సురసూదన
శోకార్తానాంతు దేవానాం సాహాయ్యం కర్తు మర్హసి. ౧౭

టీక॥ అనఘ=పాపములేని; భగవన్=మాహాత్మ్యముగల విష్ణుదేవుఁడా ! అదిత్యాః=అదితికిని; మమచ=నాకును;పుత్రత్వం=కొడుకగుటను; గచ్ఛ=పొందుము. అసురసూదన= రాక్షసులంజంపునట్టి విష్ణుదేవుఁడా!త్వం=నీవు;శక్రస్య= ఇంద్రునకు; యవీయాన్= చిన్నవాఁడైన;భ్రాతా= తోడంబుట్టువుగా;భవ = అగుము. శోకార్తానాం, శోక=దుఃఖముచే, ఆర్తానాం = పీడింపఁబడిన; దేవానాంతు=దేవతలకుమాత్రము; సాహాయ్యం=తోడుపాటును;కర్తుం= చేయుటకు; అర్హసి=తగుదువు.

భగవంతుఁడా ! నీవు,అదితికిని నాకునుంగొడుకుగాఁబుట్టుము;రాక్షసులంజంపునట్టివిష్ణుదేవుఁడా! నీవింద్రునకుఁదమ్ముండవగుము; నీవు, దుఃఖపీడితులగు దేవతలకు మాత్రము తప్పక సాహాయ్యము సేయవలయును. అని,తాత్పర్యము.

అయం సిద్ధాశ్రమోనామ ప్రసాదా త్తే భవిష్యతి
సిద్ధే కర్మణి దేవేశ ఉత్తిష్ఠ భగవ న్నితః. ౧౮

టీక॥ దేవేశ=దేవతలకుఁబ్రభు వయినవిష్ణుదేవుఁడా ! తే=నీయొక్క; ప్రసాదాత్=అనుగ్రహమువలన; కర్మణి=నేనుచేయువ్రతకార్యము; సిద్ధే= సఫలముకాగానె; అయం= ఈయాశ్రమము; సిద్ధాశ్రమోనామ=సిద్ధాశ్రమ మని ప్రసిద్ధమైనదిగా; భవిష్యతి=కాఁగలదు. భగవన్=భగవంతుఁడవయిన విష్ణుదేవుఁడా ! ఇతః= ఇక్కడనుండి; ఉత్తిష్ఠ=లెమ్ము.

దేవవిభుండవగువిష్ణుదేవుఁడా! నీయనుగ్రహంబున నావ్రత కార్యమునఫలమై, యీయాశ్రమముసిద్ధాశ్రమంబనిపొగడొందఁగలదు; నీవు, అవతరించుటకై, యిచ్చట నుండి లెమ్ము. అని, కాశ్యపుఁడువిష్ణుదేవునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

అథ విష్ణు ర్మహాతేజా అదిత్యాం సమజాయత
వామనం రూప మాస్థాయ వైరోచని ముపాగమత్. ౧౯

టీక॥ అథ=అటుపిమ్మట; మహాతేజాః=అధికమైనప్రభావముగల; విష్ణుః=విష్ణుదేవుఁడు; అదిత్యాం=అదితియందు; సమజాయత=పుట్టెను. వామనం = పొట్టిదైన; రూపం=ఆకారమును; ఆస్థాయ=పొంది; వైరోచనిం=విరోచనునికొడుకైనబలిచక్రవర్తిని; ఉపాగమత్ = పొందెను.

అంత, మహాప్రభావుండగువిష్ణుదేవుండదితియందుఁబుట్టి, వామనరూపంబునొంది, బలిచక్రవర్తియొద్దకుఁబోయెను

అని, తాత్పర్యము.

త్రీన్ క్రమా నథ భిక్షిత్వా ప్రతిగృహ్యాచ మానదః
ఆక్రమ్య లోకాన్ లోకాత్మా సర్వభూతహితే రతః. ౨౦
మహేంద్రాయ పునః ప్రాదా న్నియమ్య బలి మోజసా

త్రైలోక్యం స మహాతేజా శ్చక్రే శక్రవశం పునః. ౨౧

అధ=అటుపిమ్మట; మానదః= మానమునిచ్చువాఁడును; లేక, మానమునుఖండించువాఁడును, నిరభిమానుఁడనుట; లోకాత్మా=లోకంబుల కాత్మగానుండు వాఁడును; సర్వభూతహితే, సర్వభూత=సమస్తప్రాణులకొఱకు, హితే=మేలునందు; రతః=ఆసక్తుఁడునగువిష్ణుదేవుఁడు; త్రీన్ = మూఁడైన; క్రమాన్ = అడుగులను; భిక్షిత్వా= యాచించి; ప్రతిగృహ్యచ=పుచ్చుకొనియు; లోకాన్=లోకములను; ఆక్రమ్య = ఆక్రమించి; ఓజసా= తేజస్సుచేత; బలిం=బలిచక్రవర్తిని; నియమ్య=బంధించి; పునః=మఱల; మహేంద్రాయ = దేవేంద్రుని కొఱకు; ప్రాదాత్ = ఇచ్చెను. మహాతేజాః = మహాప్రభావముగల; సః = ఆవిష్ణుదేవుఁడు; త్రైలోక్యం = మూఁడులోకములను; పునః= మఱల; శక్రవశం = ఇంద్రునియధీనముగా; చక్రే = చేసెను.

అంత, విష్ణుదేవుండు, తానందఱకును మానమునిచ్చువాఁడైనను, నిరభిమానుండై, బలిచక్రవర్తినిమూఁడడుగులనేలనుయాచించి, పుచ్చుకొని, సమస్తలోకంబులకునాత్మభూతుండు గావున, సర్వభూతంబులకునుహితంబుగల్గుటకై, సమస్తలోకంబులనాక్రమించి, రెండడుగులకే ముల్లోకంబులునుసరిపోయినందున, మూఁడవయడుగుకు బలిచక్రవర్తిని బంధించి, త్రైలోక్యంబునంతయు, మఱల దేవేంద్రునకొసంగెను; ఇట్లు, మహాతేజుండగునావిష్ణుదేవుండు, మఱల, త్రైలోక్యంబునింద్రాధీనముగాఁజేసెను.

అని, తాత్పర్యము.

తేనైష పూర్వ మాక్రాంత ఆశ్రమ శ్శ్రమనాశనః
మయాపి భక్త్యా తస్యైష వామనస్యో పభుజ్యతే. ౨౨

టీక॥పూర్వం=మునుపు; శ్రమనాశనః=సంసారశ్రమమునునశింపఁజే

యునట్టి; ఏషః=ఈ; ఆశ్రమః=ఆశ్రమము; తేన=ఆవామనునిచేత; ఆక్రాంతః=ఆక్రమింపఁబడినది. మయాపి=నాచేతను; భక్త్యా=భక్తిచేత; తస్య=ఆ; వామనస్య=వామనునియొక్క; ఏషః= ఈయాశ్రమము; ఉపభుజ్యతే=అనుభవింపఁబడుచున్నది.

ఆవామనుఁడు, పూర్వము, సంసారాశ్రమమును బోఁగొట్టునట్టి యీయాశ్రమమందుండెను; నేనును, భక్తితో, వామనునిదగునీయాశ్రమమందునివసించుచున్నాను.

అని, తాత్పర్యము.

ఏత మాశ్రమ మాయాంతి రాక్షసా విఘ్నకారిణః
అత్రైవ పురుషవ్యాఘ్ర హంతవ్యా దుష్టచారిణః. ౨౩

టీక॥పురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవైనరాముఁడా! విఘ్నకారిణః=అంతరాయము సేయునట్టి; రాక్షసాః=రక్కసులు, ఏతం=ఈ; ఆశ్రమం=ఆశ్రమమునుగూర్చి; ఆయాంతి=వచ్చుచున్నారు. అత్రైవ=ఈయాశ్రమమందే; దుష్టచారిణః=దుష్టముగ నడుచు నారాక్షసులు; హంతవ్యాః=చంపఁబడవలసినవారు.

పురుష శ్రేష్ఠుఁడవగు రాముఁడా విఘ్నముసేయురాక్షసులీయాశ్రమమునకేవచ్చెదరు; ఈయాశ్రమమందే, నీవాదుష్టులను జంపవలయును. అని, తాత్పర్యము.

అద్య గచ్ఛామహే రామ సిద్ధాశ్రమ మనుత్తమమ్
తదాశ్రమ పదం తాత తవాప్యేత ద్యథా మమ. ౨౪

టీక॥ రామ=రాముఁడా! అద్య=ఇప్పుడు; అనుత్తమం = తనకన్నశ్రేష్ఠములేని; సిద్ధాశ్రమం=సిద్ధాశ్రమమును; గచ్ఛామహే=పోంచుచున్నాము. తాత = తండ్రీ! తత్=ఆ; ఏతత్=ఈ; ఆశ్రమపదం=ఆశ్రమస్థానము; మమ = నాకు; యథా=ఎట్లో; తవాపి=నీకును; తథైవ(అధ్యాహృతము)=అట్లే.

రాముఁడా ! ఇప్పుడు, శ్రేష్ఠ

మైనసిద్ధాశ్రమమును బ్రవేశించెదము; తండ్రీ! అట్టియీయాశ్రమము, నాకెట్లుసొంతమో,ఆలాగే,నీకును సొంతమె. "నేనిప్పుడీయాశ్రమమందు, తపముసేయుచుండుటంబట్టి, యిది, నాకుసొంతమైనది; నీవును, రాముఁడుగా నవతరించుటకుమునుపు, వామనావతారమందును,అంతకుమునుపును,ఈయాశ్రమమందుఁదపము సేయుచుండినందున నీకును సొంతమే (అని,రహస్యము.)అని,విశ్వామిత్రుఁడుచెప్పెను.

అని, తాత్పర్యము.

ప్రవిశ న్నాశ్రమపదం వ్యరోచత మహామునిః
శశీవ గతనీహారః పునర్వసుసమన్వితః. ౨౫

టీక॥ ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును, ప్రవిశన్=ప్రవేశించుచున్నట్టి; మహామునిః=పూజ్యుఁడైనమునియగు విశ్వామిత్రుఁడు; గతనీహారః=గత=పోయిన,నీహారః=మంచుగల్గినాఁడును;పునర్వసుసమన్వితః=పునర్వసు నక్షత్రములతోఁ గూడినవాఁడునగు;శశీవ = చంద్రుఁడువలె;వ్యరోచత=ప్రకాశించెను.

రామలక్ష్మణులంగూడి, సంతోషంబున, నాశ్రమంబుఁబ్రవేశించుచున్నవిశ్వామిత్రమహాముని, మంచువిడిచి పునర్వసు నక్షత్రములంగూడియున్నచంద్రుఁడుంబోలెఁ,బ్రకాశించెను. అని, తాత్పర్యము.

తం దృష్ట్వా మునయ స్సర్వే సిద్ధాశ్రమ నివాసినః
ఉత్పత్యోత్పత్య సహసా విశ్వామిత్ర మపూజయన్. ౨౬

టీక॥ సిద్ధాశ్రమ నివాసినః=సిద్ధాశ్రమమందువాసముసేయునట్టి; మునయః=మునులు; సర్వే=అందఱును; తం=ఆ; విశ్వామిత్రం=విశ్వామిత్రునిః;దృష్ట్వా=చూచి;సహసా=వేగముగా; ఉత్పత్యోత్పత్య=పరుగెత్తిపరుగెత్తి;అపూజయన్=పూజించిరి.

సిద్ధాశ్రమమందుండు మునులం దఱును, ఆవిశ్వామిత్రునింజూచి, భక్త్యతిశయమునంజేసి వేగమునం బరుగెత్తివచ్చి, యతనింబూజించిరి. అని, తాత్పర్యము.

యథార్హం చక్రిరే పూజాం విశ్వామిత్రాయ ధీమతే
తథైవ రాజ పుత్రాభ్యా మకుర్వ న్నతిథిక్రియామ్. ౨౨

టీక॥ తే (అధ్యాహృతము)= ఆమునులు; ధీమతే=బుద్ధిమంతుండగు;విశ్వామిత్రాయ=విశ్వామిత్రునికొఱకు; యథార్హం=యథాయోగ్యముగ; పూజాం=పూజను; చక్రిరే=చేసిరి. తథైవ=ఆలాగే; రాజపుత్రాభ్యాం= రాచకొమరులగు రామలక్ష్మణులకొఱకు; అతిథిక్రియాం = ఆతిథ్యమును; అకుర్వన్=చేసిరి.

ఆమునులు,ధీమంతుండగువిశ్వామిత్రునకు, యథాయోగ్యముగాఁ బూజగావించి, యాలాగే, రాజపుత్రులగురామలక్ష్మణులకు నాతిథ్యముచేసిరి. అని, తాత్పర్యము.

ముహూర్త మథ విశ్రాంతౌ రాజపుత్రౌ వరిందమౌ
ప్రాంజలీ మునిశార్దూల మూచతూ రఘునందనౌ. ౨౩

టీక॥ అథ=అటుపిమ్మట; అరిందమౌ= శత్రువులనణఁగఁద్రొక్కువారును; రాజపుత్రౌ=రాచకొమరులునగు; రఘునందనౌ= రామలక్ష్మణులు;ముహూర్తం=స్వల్పకాలము;విశ్రాంతౌ=అలపుదీర్చుకొన్నవారలై; ప్రాంజలీ=మంచిచేమోడ్పుగలవారలై; మునిశార్దూలం=మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రునింగూర్చి;ఊచతుః=చెప్పిరి.

అంత,శత్రువులనడంగఁ ద్రొక్కునట్టిరాచకొమరులగురామలక్ష్మణులు,కొంచెమలసటదీర్చికొని, చేతులుమొగిడ్చి, మునిశ్రేష్ఠుండగువిశ్వా



మిత్రునితో, నిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

అద్యైవ దీక్షాం ప్రవిశ భద్రం తే మునిపుంగవ
సిద్ధాశ్రమోఽయం సిద్ధస్స్యాత్ సత్య మస్తు వచ స్తవ. ౨౯

టీక॥ మునిపుంగవ=ముని శ్రేష్ఠుం డవగు విశ్వామిత్రుఁడా! అద్యైవ= ఇప్పుడే; దీక్షాం= తుదీక్షను; ప్రవిశ=పొందుము. తే=నీకు; భద్రం= మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక. అయం=ఈ; సిద్ధాశ్రమః=సిద్ధాశ్రమము; సిద్ధః= సార్థకమగు పేరుగల్గుటచే, సిద్ధిగలది; స్యాత్=అగుఁగాక. తవ=నీయొక్క; వచః=మాట; సత్యం=తప్పనిది; అస్తు=అగుఁగాక.

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! ఇప్పుడే దీక్షవహింపుము; నీకు మంగళమగుఁగాక; నీయాగము సిద్ధించుటం జేసి, ఈసిద్ధాశ్రమము సార్థకమగు పేరుగలదివై సిద్ధినొందుఁగాక; నీమాట సత్యమగుఁగాక. అని, రామలక్ష్మణులు చెప్పిరి.

అని, తాత్పర్యము.

ల॥ ఏవ ముక్తో మహాతేజా విశ్వామిత్రో మహా ఋషిః
ప్రవివేశ తదా దీక్షాం నియతో నియతేంద్రియః. ౩౦

టీక॥ మహాతేజాః= అధికమైన ప్రభావముగలవాఁడును; నియతేంద్రియః, నియత=నిగ్రహింపఁబడిన, ఇంద్రియః=ఇంద్రియములుగలవాఁడును; మహాన్=పూజ్యుఁడైన; ఋషిః=ఋషియునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; ఏవం=ఈ ప్రకారము; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; తదా=అప్పుడు; నియతః= నియమముగలవాఁడై; దీక్షాం=దీక్షను; ప్రవివేశ=వహించెను.

ఇట్లు రామలక్ష్మణులు చెప్పఁగానే, అప్పుడు, మహాప్రభావుండును ఇంద్రియనిగ్రహముగలవాఁడునగు



విశ్వామిత్ర మహర్షి, నియతుండై, దీక్షవహించెను. అని తాత్పర్యము.

కుమారా వపి తాం రాత్రి ముషిత్వా సుసమాహితౌ

( "కుమారావివ" అని మహేశ్వరతీర్థ పాఠము. )

ప్రభాతకాలే చోత్థాయ పూర్వాం సంధ్యా ముపాస్యచ. ౩౧
స్పృష్టోదకౌ శుచీ జప్యం సమాప్య నియమేనచ
హుతాగ్నిహోత్ర మాసీనం విశ్వామిత్ర మవందతామ్. ౩౨

టీక॥ కుమరావపి= పిన్నవాండ్రైనయీరామలక్ష్మణులును(ఇది, గోవిందరాజీయపాఠము). కుమారావివ(స్థితౌ)=స్కందవిశాఖులవలెనున్నట్టిరామలక్ష్మణులు (ఇదిమహేశ్వర తీర్థ పాఠమున కర్థము); తాం=ఆ; రాత్రిం = (అత్యంతసంయోగమందుద్వితీయ) రాత్రియంతయు; ఉషిత్వా=ఉండి; సుసమాహితౌ=చక్కగా ఎచ్చరిక గలవారలై; ప్రభాతకాలే = ప్రాతఃకాలమందు; ఉత్థాయచ = లేచియు; స్పృష్టోదకౌ, స్పృష్ట=తాఁకఁబడిన, ఉదకౌ = జలముగలవారలై, స్నానముచేసినవారలైయనుట; శుచీ=పరిశుద్ధులై; పూర్వాం=మొదటిదైన, లేక, తూర్పునందలి; సంధ్యాం=ప్రాతస్సంధ్యను; ఉపాస్యచ=ఉపాసించియు; నియమేన=నియతిచేత; జప్యం =గాయత్రీజపమును; సమాప్యచ=ముగించియు; హుతాగ్నిహోత్రం=వేల్వఁబడినట్టి ఔపాసనహోమము గలవాఁడును; ఆసీనం=కూర్చుండియున్నవాఁడునగు; విశ్వామిత్రం = విశ్వామిత్రుని; అవందతాం=నమస్కరించిరి.

రామలక్ష్మణులును, ఆరాత్రియంతయుఁ బరుండి, సమాహితులై, ప్రాతఃకాలంబున మేల్కని, స్నానముచేసి, ప్రాతస్సంధ్యావందనముగావించి, నియమంబున గాయత్రిని జపియించి, కృతాగ్నికార్యుఁడైకూర్చుండియున్న విశ్వామిత్రునినమస్కరించిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకోన త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండైకోనత్రింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

## త్రింశసర్గప్రారంభః.

అథ తౌ దేశకాలజ్ఞౌ రాజపుత్రౌ వరిందమౌ
దేశే కాలే చ వాక్యజ్ఞా వబ్రూతాం కౌశికం వచః. ౧

టీక॥ అథ=అటుతర్వాత; దేశకాలజ్ఞౌ= దేశకాలంబులనెఱింగినవారును; వాక్యజ్ఞౌ = వాక్యంబులఁదెలిసినవారును; అరిందమౌ=శత్రుబ్రుపసడంగఁద్రొక్కు వారునగు; తౌ=ఆ; రాజపుత్రౌ= రాచకొమరులగు రామలక్ష్మణులు; దేశే=తగిన, దేశమందును; కాలేచ=తగిన, కాలమందును; కౌశికం=విశ్వామిత్రునిగూర్చి; వచః=మాటను; అబ్రూతాం=చెప్పిరి.

అంత, దేశకాలంబులెఱింగిమాటలాడం దెలిసినవారును, శత్రువులనడంగఁద్రొక్కం జాలినవారునగు నా రామలక్ష్మణులు, ఉచితమగు దేశంబున, సరియైనసమయము సూచి, విశ్వామిత్రునితో, నిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

భగవన్ శ్రోతు మిచ్ఛావో యస్మిన్ కాలే నిశాచరౌ
సంరక్షణీయౌ తౌ బ్రహ్మ న్నాతివర్తేత తత్క్షణమ్. ౨

టీక॥ భగవాన్=మాహాత్మ్యము గల; బ్రహ్మాన్=బ్రాహ్మణుఁడవగువిశ్వామిత్రుఁడా; యస్మిన్=ఏ; కాలే=కాలమందు; తౌ=ఆ; నిశాచరౌ= మారీచసుబాహులనెడు రాక్షసులు; సంరక్షణీయా=రక్షింపఁదగినవారలో, వారలవలసిబాధలేకుండునట్లుయాగము రక్షింపఁదగినదనుట, లేక, (విపరీతలక్షణచే, నిప్పునుముద్దుపెట్టుకొన్నఁ జల్లగానుండును, అన్నట్టు) చంపఁదగినవారలో; తం (అధ్యాహృతము)= ఆకాలమును; శ్రోతుం=వినుటకు; ఇచ్ఛావః= కోరుచున్నాము. తత్=ఆ; క్షణం=సమయము; నాతివర్తేత=దాఁటిపోకుండుఁగాక.

భగవంతుఁడవైనవిశ్వామిత్రుఁడా! ఎప్పుడా రాక్షసులం జంపవచ్చునో, ఆసమయంబు, వినఁగోరెదము; అదిమాకుఁ దెలియక దాఁటిపోవుటకుమును పే, చెప్పుము. అని, రామలక్ష్మణులు చెప్పిరి అని, తాత్పర్యము.

ఏవం బ్రువాణౌ కాకుత్స్థౌ త్వరమాణౌ యుయుత్సయా
సర్వే తే మునయః ప్రీతాః ప్రశశంసు నృపాత్మజౌ. ౩

టీక॥ తే=ఆ; మునయః=మునులు; సర్వే=అందఱును; ప్రీతాః=సంతసించినవారలై; ఏవం= ఈప్రకారము; బ్రువాణౌ=చెప్పుచున్నవారును; యుయుత్సయా=యుద్ధము సేయనిచ్ఛచేత; త్వరమాణౌ=వేగిరపడుచున్నవారునగు; నృపాత్మజౌ= రాచకొమరులైన; కాకుత్స్థౌ= రామలక్ష్మణులనుగూర్చి; ప్రశశంసుః=చెప్పిరి.

ఈప్రకారము చెప్పి యుద్ధము సేయ నిచ్ఛచేత వేగిరపడుచు రామలక్ష్మణులంబూచి, యామును లందఱునుసంతసించి యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

అద్య ప్రభృతి షడ్రాత్రం రక్షతం రాఘవౌ యువామ్
దీక్షాం గతో హ్యేష మునిః మౌనిత్వంచ గమిష్యతి. ౪

టీక॥ రాఘవౌ=రామలక్ష్మణులారా! యువాం=మీరలు; అద్య ప్రభృతి = ఇప్పుడు మొదలు; షడ్రాత్రం= (అత్యంతసంయోగమందు ద్వితీయ) ఆఱు రాత్రులు; రక్షతం= రక్షింపుఁడు; ఏషః=ఈ; మునిః=విశ్వామిత్ర మహాముని; దీక్షాం=దీక్షను; గతోహి=పొందినాఁడుగదా! మౌనిత్వంచ= మౌనముగలవాఁడగుటను; గమిష్యతి = పొందఁగలఁడు.

రామలక్ష్మణులారా! మీరలిప్పుడు మొదలుకొని, ఆఱు రాత్రులు రక్షింపవలయును; ఈవిశ్వామిత్రమహాముని దీక్షవహించి మౌనమునొంది యున్నాఁడు కావున, నితండు మాటలాడఁడు; అని, మునులు చెప్పిరి.

అని, తాత్పర్యము.

సౌ తౌతు తద్వచనం శ్రుత్వా రాజపుత్రౌ యశస్వినౌ
అనిద్రౌ షడహోరాత్రం తపోవన మరక్షతామ్. ౫

టీక॥ యశస్వినౌ=ప్రశస్తమగు కీర్తిగల; తౌ=ఆ; రాజపుత్రౌతు= రాచకొమరులైన రామలక్ష్మణులును; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; షడహోరాత్రం=ఆఱు పవలును రాత్రులును; అనిద్రౌ= తూఁగులేనివారలై; తపోవనం=ఆశ్రమమును; అరక్షతాం=రక్షించిరి;

ఆమునులు చెప్పినమాటను విని, కీర్తిసంపన్నులగు రామలక్ష్మణులు, ఆఱు హోరాత్రములు, నిద్రలేక, తపోవనమును, రక్షింపుచుండిరి.

అని, తాత్పర్యము.

ఉపాసాంచక్రతు ర్వీరౌ యత్తౌ పరమధన్వినౌ
రరక్షతు ర్మునివరం విశ్వామిత్ర మరిందమౌ. ౬

టీక॥ వీరౌ=పరాక్రమశాలులగు రామలక్ష్మణులు; పరమధన్వినౌ, పరమ=శ్రేష్ఠమైన, ధన్వినౌ=విల్లుగలవారలై; యత్తౌ = సన్నద్ధులై; ఉ

పాసాంచక్రతుః=ఉండిరి. అరిందమౌ=శత్రువులనడంగఁ ద్రొక్కునట్టి రామలక్ష్మణులు; మునివరం=ముని శ్రేష్ఠుఁడైన; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; రరక్షతుః=రక్షించిరి.

పరాక్రమశాలులగు రామలక్ష్మణులు, దృఢంబగు విల్లుధరియించి, సన్నద్ధులై యుండిరి; ఇట్లు, శత్రువుల నడంగఁద్రొక్కఁజాలిన రామలక్ష్మణులు ముని శ్రేష్ఠుండగు విశ్వామిత్రుని రక్షించిరి. అని, తాత్పర్యము.

అథ కాలే గతే తస్మిన్ షష్ఠేహని సమాగతే
సౌమిత్రి మబ్రవీ ద్రామో యత్తో భవ సమాహితః. ౭

టీక॥ అథ = అటుపిమ్మట; కాలే=అయిదుదినములు; గతే = కడవఁగా; తస్మిన్=ఆ; షష్ఠే=ఆఱవదియైన; అహని = దినము; సమాగతే=రాఁగానే; రామః = రాముఁడు; సౌమిత్రిం=లక్ష్మణునిగూర్చి; సమాహితః= ఎచ్చరికగలవాఁడవై; యత్తః=సన్నద్ధుఁడవై; భవ=ఉండుము; ఇతి(అధ్యాహృతమ)=అని; అబ్రవీత్=చెప్పెను.

అంత, నైదుదినములును గ చి, నాఱవదినము రాఁగానే, రాముఁడు, లక్ష్మణుంజూచి, "నీవెచ్చరికగల్గి సన్నద్ధుఁడవై యుండుము" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

రామస్యైవం బ్రువాణస్య త్వరితస్య యుయుత్సయా
ప్రజజ్వాల తతో వేది స్సోపాధ్యాయ పురోహితా. ౮

టీక॥ యుయుత్సయా= యుద్ధము సేయనిచ్చచేత; త్వరితస్య=వేగిరపాటుగల్గిన; రామస్య=రాముఁడు; ఏవం=ఇట్లు; బ్రువాణస్య=చెప్పుచుండఁగా; తతః=అంతట; సోపాధ్యాయపురోహితా= ఋత్విజులతోను పురోహితులతోను గూడిన; వేదిః=యాగవేదిక; ప్రజజ్వా

ల=మండెను.

యుద్ధముసేయుటయందలి యాశచేత, రాముండిట్లు చెప్పుచుండఁగానే, ఋత్విజులతోనుఁబురోహితులతోనుం గూడియున్నయాయాగవేదిక,జ్వలించినది.అని,తాత్పర్యము.

సదర్భచమసస్రుక్కా- ససమిత్కుసుమోచ్చయా
విశ్వామిత్రేణ సహితా వేది ర్జజ్వాల సర్త్విజా. ౯

టీక॥సదర్భచమసస్రుక్కా=దర్భలతోనుపానపాత్రలతోహోమపాత్రిలతోనుంగూడినదియును; ససమిత్కుసుమోచ్చయా= సమిధలతోనుపుష్పసమూహములతోనుం గూడినదియును;సర్త్విజా=ఋత్విజులతోఁగూడినదియును; విశ్వామిత్రేణ= విశ్వామిత్రునితో;సహితా = కూడినదియునగు; వేదిః=యాగవేదిః;జజ్వాల=జ్వలించెను.

దర్భలును చానపాత్రలును హోమ పాత్రలునుసమిధలునుఅలంకారార్థంబుగా నునిచినపుష్పంబులునుంగల్గి,ఋత్విజులతోనువిశ్వామిత్రునితోనుంగూడియున్న, యాగవేది,జ్వలించినది.

అని,తాత్పర్యము.

విశేషార్థము.—ఇట్లు, యాగవేదిజ్వలించుటయుత్పాతములలోఁ జేరినదిగావున, రాక్షసాగమనము నుసూచించినది. అని,యభిప్రాయము.

మంత్రవచ్చ యథాన్యాయం యజ్ఞోసౌ సంప్రవర్తతే
ఆకాశే చ మహాన్ శబ్దః ప్రాదురాసీ ద్భయానకః. ౧౦

టీక॥ అసౌ=ఈ;యజ్ఞః=యాగము; మంత్రవచ్చ=మంత్రము గలదిగాను; యథాన్యాయం=యథాశాస్త్రముగాను ; సంప్రవర్తతే=(భూతార్థమందులట్) జరుగుచుండినది. ఆకాశే=ఆకాశమందు; భయానకః =భయముగల్గించునట్టి; మహాన్=గొప్పదైన;శబ్దశ్చ=ధ్వనియును; ప్రాదురాసీత్=పుట్టినది.

యాగంబంతయు, మంత్రవత్తుగ

యథా శాస్త్రముగా జరుగుచుండఁగా, మింట, భయంకరంబైనట్టి మహాధ్వనియొక్కటిగల్గినది.

అని, తాత్పర్యము.



ఆవార్య గగనం మేఘో యథా ప్రావృషి నిర్గతః
తథామాయాం వికుర్వాణౌ రాక్షసా వభ్యధావతామ్. ౧౧

టీక॥ప్రావృషి= వర్షాకాలమందు; నిర్గతః=బయలువెడలిన; మేఘః=మబ్బు; యథా=ఎట్లో; తథా=అట్లు; రాక్షసౌ=మారీచసుబాహువులను రాక్షసులు, గగనం= ఆకాశమును; ఆవార్య= ఆవరించి, మాయాం= మాయను; వికుర్వాణౌ=చేయుచు; అభ్యధావతాం= పరుగెత్తివచ్చిరి.

ఎట్లు, వర్షాకాలమందు మేఘంబాకాశంబు నావరించి వచ్చునో, అట్లు, మారీచసుబాహువులు, ఆకాశమంతయుఁ గ్రమ్మి మాయ సేయుచుఁ బరుగెత్తివచ్చిరి.

అని, తాత్పర్యము.

మారీచశ్చ సుబాహుశ్చ తయో రనుచరాశ్చ యే
ఆగమ్య భీమసంకాశా రుధిరౌఘ మవాసృజన్. ౧౨

టీక॥ మారీచశ్చ=మారీచుఁడును; సుబాహుశ్చ= సుబాహుఁడును; తయోః=ఆమారీచసుబాహువులయొక్క; అనుచరాః=తోటివారలు; యే=ఎవరో; తే(అధ్యాహృతము)చ=వారును; భీమసంకాశాః= భయంకరులైనవారలై; ఆగమ్య= వచ్చి; రుధిరౌఘం=నెత్తురుప్రవాహమును; అవాసృజన్=వర్షించిరి.

మారీచుండునుసుబాహుఁడును వారియనుచరులగు రాక్షసులునుభయంకరులై వచ్చి నెత్తురు వెల్లువగా వర్షించిరి. అని, తాత్పర్యము.

సా తేన రుధిరౌఘేణ వేది ర్జజ్వాల మండితా
సహసాఽభిద్రుతో రామ స్తా నపశ్య త్తతో దివి. ౧౩

టీక॥ సా=ఆ; వేదిః=యాగవేది; తేన=ఆ,రుధిరౌఘేణ=నెత్తురుప్రవాహముచేతః మండితా=అలంకరింపఁబడినదై; జజ్వాల=మండినది. తతః=అంతట; రామః=రాముఁడు; సహసా=శీఘ్రింబుగా; అభిద్రుతః=ఎదురుగాఁబరుగెత్తినవాఁడై; దివి=ఆకాశమందు; తాన్=ఆరాక్షసులను; అపశ్యత్=చూచెను.

ఆ యాగవేది, నెత్తుటివెల్లువం దోఁగిమండుచుండినది; అంత, రాముండు వేగంబున నభిముఖంబుగాఁ బరువెత్తి, యాకాశమందు రాక్షసులంజూచెను. అని, తాత్పర్యము.

తా వాపతంతౌ సహసా దృష్ట్వా రాజీవలోచనః
లక్ష్మణం త్వభిసంప్రేక్ష్య రామో వచన మబ్రవీత్. ౧౪

టీక॥ రాజీవలోచనః= కమలములవంటికండ్లుగల; రామః=రాముఁడు; సహసా=శీఘ్రముగా; ఆపతంతౌ=వచ్చుచున్నట్టి; తౌ=ఆమారీచసుబాహువులను; దృష్ట్వా=చూచి; లక్ష్మణంతు= లక్ష్మణునిమాత్రము; అభిసంప్రేక్ష్య = ఎదురుగాఁ జూచి; వచనం = మాటను; అబ్ర

పీత్ = పలికెను.

వేగంబునవచ్చుచున్నయామారీచసుబాహువులంగని, కమలములవంటికండ్లుగలరాముండు, లక్ష్మణునిమాత్రముచూచి, యిట్లని, చెప్పెను.

విశేషార్థము.—రాముఁడు, తాను "రాక్షసులంజంపెదఁ, జూడు" మనిచెప్పఁబోవుటచే, "దీనిఁబూజ్యులగుఋషులతోనుంజెప్పినట్లైనన్నాత్మస్తుతిగాఁబరిణమించును; తమ్ముఁడగులక్ష్మణునితోఁజెప్పిన,నట్లుకా" దనునభిప్రాయంబున, లక్ష్మణునితోమాత్రముచెప్పెను.

పశ్య లక్ష్మణ దుర్వృత్తాన్ రాక్షసాన్ పిశితాశనాన్
మానవాస్త్రసమాధూతా ననిలేన యథా ఘనాన్. ౧౫

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! దుర్వృత్తాన్ = దురాచారముగలవారును; పిశితాశనాన్ = మాంసమే యాహారముగాఁగలవారునగు; రాక్షసాన్ = రక్కసులను; అనిలేన = వాయువుచేత; ఘనాన్ యథా = మేఘములనువలెఁ; మానవాస్త్రసమాధూతాన్, మానవాస్త్ర = మానవంబనునస్త్రముచేత, సమాధూతాన్ = ఎగురఁగొట్టఁబడినవారినిగా; పశ్య = చూడుము.

లక్ష్మణుఁడా! దురాచారులును మాంసాహారులు నగు నీరాక్షసులను, వాయువుచే మేఘంబులువోలె, మానవాస్త్రంబుచే, పాఱఁదోలఁబడిన వారినిగాఁజేసెదను; చూడుము. అని, తాత్పర్యము.

మానవం పరమోదార మస్త్రం పరమభాస్వరమ్
చిక్షేప పరమక్రుద్ధో మారీచోరసి రాఘవః. ౧౬

టీక॥ రాఘవః = రాముఁడు; పరమక్రుద్ధః = మిక్కిలి కోపించినవాఁడై; పరమోదారం = మిక్కిలియతిశయించి నదియు; పరమ భాస్వ

రం=మిక్కిలిప్రకాశించుచున్నట్టిది యనగు; మానవం=మానవంబనెడు; అస్త్రం = అస్త్రమును; మారీచోరసి= మారీచునిఱొమ్మునందు; చిక్షేప=వేసెను.

రాముండు, మిక్కిలియుఁగోపించి, శ్రేష్ఠంబును బరమభాస్వరంబునగు మానవాస్త్రంబును, మారీచుని ఱొమ్మంట, వేసెను.

అని, తాత్పర్యము.

స తేన పరమాస్త్రేణ మానవేన సమాహితః
సంపూర్ణం యోజనశతం క్షిప్తస్సాగరసంప్లవే. ౧౮

టీక॥ సః=ఆమారీచుఁడు; సమాహితః=ఎచ్చరికగలవాఁడైనను; పరమాస్త్రేణ=శ్రేష్ఠమైనయస్త్రంబగు; తేన=ఆ; మానవేన=మానవాస్త్రముచేత; సాగరసంప్లవే=సముద్రపుగట్టునందు; సంపూర్ణం = నిండిన; యోజనశతం= (అత్యంతసంయోగమందు ద్వితీయ) నూఱుయోజనములు; క్షిప్తః=త్రోయఁబడెను.

ఆమారీచుండెచ్చరిక గల్గియున్నను, శ్రేష్ఠంబగునమ్మానవాస్త్రము, సముద్రతీరమునవ్వల నీటిలోనూఱు యోజనంబులదూరంబున నతనింబడఁద్రోసెను. అని, తాత్పర్యము.

విశేషార్థము.—"స తేన" అనుచోట "స" అనునది గాయత్రి రెండవ యక్షరము; వెయ్యిశ్లోకములై రెండవ వెయ్యి యారంభింపఁబడినది.

విచేతనం విఘూర్ణంతం శీతేషుబలతాడితమ్
నిరస్తం దృశ్య మారీచం రామో లక్ష్మణ మబ్రవీత్. ౧౯

టీక॥ రామః=రాముఁడు; శీతేషుబలతాడితం, శీతేషుబల=మానవాస్త్రముయొక్కబలముచేత, తాడితం= కొట్టఁబడినవాఁడును; నిరస్తం=త్రోయఁబడినవాఁడును; విచేతనం = సంజ్ఞతప్పియున్నవాఁ

డును; విఘూర్ణంతం=తిరుగుడుపడుచున్నవాఁడునగు; మారీచం = మారీచుని; దృశ్య=చూచి; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

మానవాస్త్రబలంబునం గొట్టఁబడి, సముద్రజలంబులంబడి, తెలివితప్పి, తిరుగుడువడుచున్న, మారీచునింజూచి, రాముఁడు లక్ష్మణునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పశ్య లక్ష్మణ శీతేషుం మానవం ధర్మసంహితమ్
మోహయిత్వా నయత్యేనం నచ ప్రాణై ర్వ్యయుజ్యత.

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా ధర్మసంహితం= ధర్మముతోఁగూడినదియు; శీతేషుం=చల్లనిబాణమైనదియునగు, (చల్లగాఁగోయుట యన్నట్లు) తీక్ష్ణమైన బాణమనుట; మానవం=మానవాస్త్రమును; పశ్య=చూడుము; ఏనం=ఈమారీచుని; మోహయిత్వా=మోహింపఁజేసి; నయతి= తీసికొనిపోవుచున్నది. మారీచః(అధ్యాహృతము)=మారీచుఁడు; ప్రాణైః=ప్రాణములచేత మాత్రము; నవ్యయుజ్యత=విడువఁబడలేదు.

లక్ష్మణుఁడా! ధర్మసహితమగు నీమానవాస్త్రంబుచూడుము; ఈ మారీచుని, తెలివితప్పించికొనిపోవుచున్నది; మారీచునకుఁ బ్రాణహాని మాత్రముకల్గలేదు.

అని, తాత్పర్యము.

ఈశ్లోకమునకు మహేశ్వరతీర్థులుమాత్రముదహరించి వ్యాఖ్యానముచేసిరి; ఈశ్లోకములేనట్లె గోవిందరాజు లభిప్రాయము పడినట్లున్నది. కావునదీనికిసంఖ్యవేయలేదు.

ఇమానపి వధిష్యామి నిర్ఘృణాన్ దుష్టచారిణః
రాక్షసాన్ పాపకర్మస్థాన్ యజ్ఞఘ్నాన్ రుధిరాశనాన్.౧౯

టీక॥నిర్ఘృణాన్=దయలేనివారును; దుష్టచారిణః=దుష్టముగాసంచరించువారును; పాపకర్మస్థాన్, పాపకర్మ = పాపముగల్గించు



కార్యములయందు; స్థాః = ఉండువారును; యజ్ఞఘ్నాః=యాగములం జెఱుపువారును; రుధిరాశనాః= రక్తమే ఆహారముగాఁగలవారునగు; ఇమాః=ఈ; రాక్షసానపి=రాక్షసులనుంగూడ; వధిష్యామి=చంపఁబోవుచున్నాను.

ఎంతమాత్రముదయలేక, దురాచారులై, పాపకర్మంబులు సేయుచు,యాగంబులఁజెఱుపుచు,రక్తంబెయాహారముగాఁగల్గియున్న, యీరాక్షసులనుం జంపెదను. అని,రాముఁడులక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సంగృహ్యాస్త్రం తతో రామో దివ్య మాగ్నేయ మద్భుతమ్
సుబాహూరసి చిక్షేప సవిద్ధః ప్రాపత ద్భువి. ౨౦

టీక|| తతః=అంతట; రామః=రాముఁడు; దివ్యం=శ్రేష్ఠమయిన; ఆగ్నేయం= అగ్నిదేవతాకమయిన; అస్త్రం=అస్త్రమును;సంగృహ్య=ఎత్తి; అద్భుతం=ఆశ్చర్యముగల్గునట్లు; సుబాహూరసి=సుబాహువునియొక్క ఱొమ్మునందు;చిక్షేప=వేసెను. సః=ఆసుబాహుఁడు; విద్ధః=కొట్టఁబడినవాఁడై; భువి=నేలయందు;ప్రాపతత్=పడెను.

అంత, రాముండు, దివ్యంబగు నాగ్నేయాస్త్రంబెత్తి, సుబాహు నిఱొమ్మునఁ, జూపఱకాశ్చర్యము గల్గునట్లు, వేసెను;ఆదెబ్బకుసుబాహుండు నేలంబడిచచ్చెను.

అని, తాత్పర్యము.

శేషాః వాయవ్య మాదాయ నిజఘాన మహాయశాః
రాఘవః పరమోదారో మునీనాం ముద మావహః. ౨౧

టీక|| మహాయశాః= అధికంబగుకీర్తిగల వాఁడును; పరమోదారః=మిక్కిలియతిశయించినవాఁడునగు; రాఘవః = రాముఁడు;మునీనాం=ఋషులకు; ముదం=సంతోషమును;ఆవహః=కల్గించుచు;వా

స౩౦

యవ్యం=వాయవ్యాస్త్రమును; ఆదాయ=ఎత్తి; శేషాన్=మిగిలిన రాక్షసులను; నిజఘాన=కొట్టెను.

మహాయశుండు బరమోదారుండునగు రాముండు, మునులకందఱకు సంతోషంబు సేయుచు, శేషించిన రాక్షసుల, వాయవ్యాస్త్రంబునం గొట్టెను. అని, తాత్పర్యము.

స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః
ఋషిభిః పూజిత స్తత్ర యథేంద్రో విజయే పురా. ౨౨

టీక॥ తత్ర=ఆయాశ్రమమందు; సః=ఆ; రఘునందనః=రాముఁడు; యజ్ఞఘ్నాన్= యాగంబులం జెఱుపునట్టి; రాక్షసాన్=రక్కసులను; సర్వాన్=అందఱను; హత్వా=చంపి, పురా=మునుపు; విజయే=అసురజయంబునందు ; ఇంద్రోయథా=ఇంద్రుఁడువలె; ఋషిభిః=ఋషులచేత; పూజితః=పూజింపఁబడెను.

ఇట్లు, యాగంబులకువిఘ్నముగావించునట్టి రాక్షసులనందఱుం జంపిన రాముని, ఋషులు, పూర్వమసురులజయించినపుడు దేవేంద్రునింబోలెఁ, బూజించిరి. అని, తాత్పర్యము.

అథ యజ్ఞే సమాప్తే తు విశ్వామిత్రో మహామునిః
నిరీతికా దిశో దృష్ట్వా కాకుత్స్థ మిద మబ్రవీత్. ౨౩

టీక॥అథ=అటుపిమ్మట; యజ్ఞే=యాగము; సమాప్తేతు=ముగియఁగానే; మహామునిః=పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; నిరీతికాః=ఉపద్రవములేనట్టి; దిశః=దిక్కులను; దృష్ట్వా=చూచి; కాకుత్స్థం = రామునిగూర్చి; ఇదం=దీనిని; అబ్రవీత్=చెప్పెను.

అంత, యాగముసమాప్తింబొందఁగానే, విశ్వామిత్ర మహాముని, యెంతమాత్రము నుపద్రవము లేకశాంతంబులై యుండు దిక్కులం జూచి, రామునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కృతార్థో స్మి మహాబాహో కృతం గురువచ స్త్వయా
సిద్ధాశ్రమ మిదం సత్యం కృతం రామ మహా యశః. ౨౮

టీక॥ మహాబాహో = గొప్పచేతులుగలవాఁడవును; మహాయశః = గొప్పకీర్తిగల వాఁడవునగు; రామ = రాముఁడా! త్వయా = నీచేత; అహం(అధ్యాహృతము) = నేను; కృతార్థః = నెఱవేఱినపనిగలవాఁడను; అస్మి = అయితిని. త్వయా(అధ్యాహృతము, ఇట్లెయుత్తరస్థలమునందును) = నీచేత; గురువచః = తండ్రియొక్క మాట; కృతం = చేయఁబడినది. త్వయా = నీచేత; ఇదం = ఈ; సిద్ధాశ్రమం = సిద్ధాశ్రమము; సత్యం = నిజమైన పేరుగలదిగా; కృతం = చేయఁబడినది.

మహాబాహుండవుగొప్పకీర్తిగలవాఁడవునగు రాముఁడా! నీచేత, నేనుకృతార్థుఁడనైతిని; నీవుతండ్రిపనుపుగావించితివి; ఈసిద్ధాశ్రమము, నీచేత, సార్థకమగు పేరుగలదిగాఁ, జేయఁబడినది. అని, విశ్వామిత్రుఁడు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ త్రింశసర్గటీక,
ముగిసినది.



శ్రీః

## ఏకత్రింశసర్గప్రారంభః.

అధ తాం రజనీం తత్ర కృతార్థౌ రామలక్ష్మణౌ
ఊషతు ర్ముదితౌ వీరౌ ప్రహృష్టే నాంతరాత్మనా. ౧

టీక॥ అధ = అటుపిమ్మట; వీరౌ = పరాక్రమశాలులును; కృతార్థౌ = నెఱవేఱినపనిగలవారును; ముదితౌ = సంతసించినవారునగు; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు; ప్రహృష్టేన = సంతసించిన; అంతరాత్మనా = మనస్సుతో; తాం = ఆ; రజనీం = రాత్రియంతయు; తత్ర = ఆ యాశ్రమమందు; ఊషతుః = ఉండిరి.

అంతట, బరాక్రమశాలులగు రామలక్ష్మణులు, కృతార్థులై, సంతోషంబున, నా రాత్రియంతయు నా యాశ్రమంబుననుండిరి.

అని, తాత్పర్యము.

ప్రభాతాయాం తు శర్వర్యాం కృతపౌర్వాహ్ణికక్రియౌ
విశ్వామిత్ర మృషీం శ్చాన్యాన్ సహితా వభిజగ్మతుః. ౨

టీక॥ తౌ (అధ్యాహృతము) = ఆ రామలక్ష్మణులు; శర్వర్యాం = రాత్రి; ప్రభాతాయాంతు = తెల్లవాఱఁగానే; కృతపౌర్వాహ్ణికక్రియౌ, కృత = చేయఁబడిన, పౌర్వాహ్ణిక = ప్రాతఃకాలమందుఁజేయవలసిన, క్రియా = కార్యముగలవారలై; సహితౌ = ఇద్దఱును జేరినవారలై; విశ్వామిత్రం = విశ్వామిత్రుని గూర్చియు; అన్యాన్ = ఇతరులైన; ఋషీంశ్చ = ఋషులనుంగూర్చి; అభిజగ్మతుః = పోయిరి.

తెల్లవాఱఁగానే, రామలక్ష్మణు లిద్దఱునుంజేరి, ప్రాతఃకాలకృత్యంబులందీర్చికొని, విశ్వామిత్రుండు మొదలగు ఋషులయొద్దకు వెళ్లిరి. అని, తాత్పర్యము.

అభివాద్య మునిశ్రేష్ఠం జ్వలంత మివ పావకమ్
ఊచతు ర్మధురోదారం వాక్యం మధురభాషిణౌ. ౩

టీక॥ మధురభాషిణౌ = మనోహరముగా మాటలాడునట్టి రామలక్ష్మణులు; జ్వలంతం = మండుచున్న; పావకమివ (స్థితం) = నిప్పువలెనున్నట్టి; మునిశ్రేష్ఠం = మునులలో మేటియగు విశ్వామిత్రుని; అభివాద్య = నమస్కరించి; మధురోదారం = మనోహరమును గంభీరమునగు; వాక్యం = మాటను; ఊచతుః = చెప్పిరి.

మనోహరముగా మాటలాడం గలయట్టి రామలక్ష్మణులు, అగ్నిహోత్రునివలె వెలుంగుచున్న విశ్వామిత్రునినమస్కరించి, మధురంబును గంభీరంబునగు నొకమాట చెప్పిరి. అని, తాత్పర్యము.

ఇమౌ స్మ మునిశార్దూల కింకరౌ సముపస్థితౌ
ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవావ కిమ్. ౪

టీక॥ మునిశార్దూల = మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుండా! కింకరౌ = పరిచారకులమైన; ఇమౌ = ఈ; ఆవాం (అధ్యాహృతము) = మేము; సముపస్థితౌ = వచ్చినవారలము; స్మ = అగుచున్నాము. యథేష్టం = ఇష్టముండునట్లు, ("వై" అనునది పాదపూరణార్థము.) ఆజ్ఞాపయ = ఆజ్ఞాపించుము. కిం = ఏః శాసనం = ఆజ్ఞను; కరవావ = చేయుదుము?

మునిశ్రేష్ఠుండవైన విశ్వామిత్రుండా! ఇదిగో కింకరులమువచ్చియున్నాము; మేమేమి సేయ వలయు, యథేష్టంబుగా నాజ్ఞాపింపుము. అని, రామలక్ష్మణులు చెప్పిరి, అని, తాత్పర్యము.

ఏవ ముక్తా స్తత స్తాభ్యాం సర్వఏవ మహర్షయః

విశ్వామిత్రం పురస్కృత్య రామం వచన మబ్రువన్. ౫

టీక॥ మహర్షయః = పూజ్యులైనఋషులు; సర్వఏవ= అందఱునే; తాభ్యాం=ఆ రామలక్ష్మణుల చేత; ఏవం=ఇట్లు; ఉక్తాః=చెప్పఁబడినవారలై; తతః=అటుపిమ్మట; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; పురస్కృత్య=మున్నిడికొని; రామం=రామునిఁగూర్చి; వచనం=మాటను; అబ్రువన్=చెప్పిరి.

ఆ రామలక్ష్మణులిట్లు చెప్పఁగానే, మహర్షులందఱును, విశ్వామిత్రుని మున్నిడుకొని, రామునితో, నిట్లని చెప్పిరి. అని, తాత్పర్యము.

మైథిలస్య నరశ్రేష్ఠ జనకస్య భవిష్యతి
యజ్ఞః పరమధర్మిష్ఠ స్తస్య యాస్యామహే వయమ్. ౬

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుఁడవగు రామఁడా! మైథిలస్య=మిథిలకుఁబ్రభువైన; జనకస్య=జనకుని యొక్క; పరమధర్మిష్ఠః=మిక్కిలి యతిశయించినధర్మముగల; యజ్ఞః= యాగము; భవిష్యతి=కాఁగలదు. తస్య=ఆయాగమునకు; తత్ర (ఇది మహేశ్వరతీర్థపాఠము)= అచ్చటికి; వయం= మేము; యాస్యామహే= పోఁబోవుచున్నారము.

పురుషశ్రేష్ఠుఁడవైన రామఁడా! మిథిలాధిపతియగు జనకమహారాజు పరమధర్మిష్ఠంబగు నొక యాగము సేయఁబోవుచున్నాఁడు; మేమాయాగమునకుఁబోయెదము. అని, తాత్పర్యము.

త్వం చైవ నరశార్దూల సహాస్మాభి ర్గమిష్యసి
అద్భుతం ధనురత్నంచ తత్ర త్వ ద్ద్రష్టు మర్హసి. ౭

టీక ॥ నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవగు రామఁడా! అస్మాభి

స్సహ=మాతోఁగూడ; త్వంచైవ= నీవును; గమిష్యసి=పోఁగలవు, రాఁగలవనుట; తత్ర=అచ్చట; తత్= ఆ, ఎవ్వరికిం బూరించుటకలవిగాని దైయట్లుపూరించినవానికిసీతం బెండ్లియగునట్లు ప్రసిద్ధమైనదనుట; అద్భుతం=ఆశ్చర్యకరమగు; ధనుర త్నంచ(సంధియార్షము)= శ్రేష్ఠమైనవిల్లును; (చకారముచేత) సీతను; ద్రష్టుం=చూచుటకు; అర్హసి=తగుదువు.

రాముఁడా! నీవునుమాతోఁగూడవచ్చి, యచ్చటి ప్రసిద్ధమైయాశ్చర్యకరమగు శివునివిల్లునుసీతనుంజూడవలయును.

అని, తాత్పర్యము.

తద్ధి పూర్వం నరశ్రేష్ఠ దత్తం సదసి దైవతైః
అప్రమేయబలం ఘోరం మఖే పరమభాస్వరమ్. ౮

టీక॥ నరశ్రేష్ఠ= పురుషశ్రేష్ఠుఁడవైన రామఁడా! అప్రమేయ బలం=కొలత పెట్టరానిసారముగలదియు; ఘోరం= భయంకరమైనదియు; పరమభాస్వరం=మిక్కిలిప్రకాశించుచున్నదియునగు; తత్=ఆ విల్లు; పూర్వం=మునుపు; మఖే= యాగమునందు; సదసి=సభయందు; దైవతైః=దేవతలచేత; దత్తం హి=ఇయ్యఁబడినదిగదా!

రాముఁడా! కొలత పెట్టరాని సారముగల్గి భయంకరంబై ప్రకాశించుచున్న, యావిల్లు, మున్ను, యాగకాలమందు, సదస్సున, దేవతలచే, నివ్వఁబడినది.

అని, తాత్పర్యము.

నాస్య దేవా న గంధర్వా నాసురా నచ రాక్షసాః
కర్తు మారోపణం శక్తా న కథంచన మానుషాః. ౯

టీక॥ అస్య=ఈవింటియొక్క; ఆరోపణం= నారినారోపించుటను; కర్తుం=చేయుటకు; దేవాః=దేవతలు; శక్తాః=సమర్థులు; న=కారు. గంధర్వాః=గంధర్వులు; న (శక్తాః)=సమర్థులుకారు. అసు

రాః=అసురులు; న(శక్తాః)=సమర్థులుకారు. రాక్షసాశ్చ=రాక్షసులును; న(శక్తాః)=సమర్థులుకారు. కథంచన=ఎంతప్రయాసముననైనను; మానుషాః=మనుష్యులు; న(శక్తాః)=సమర్థులుకారు.

ఈవింటినారి నారోపించుటకు, దేవతలుగాని, గంధర్వులుగాని, అసురులుగాని, రాక్షసులుగాని; శక్తులుకారు; ఇంక, నెంతశ్రమపడిననుమనుష్యులెట్లు, శక్తులగుదురు?
అని, తాత్పర్యము.

ధనుష స్తస్య వీర్యంతు జిజ్ఞాసంతో మహీక్షితః
న శేకు రారోప యితుం రాజపుత్రా మహాబలాః. ౧౦

టీక॥ రాజపుత్రాః= రాచకొమరులును; మహాబలాః=అధికమైన బలముగలవారునగు; మహీక్షితః=రాజులు; తస్య=ఆ; ధనుషః=వింటియొక్క; వీర్యంతు=సారమునుమాత్రము; జిజ్ఞాసంతః=ఎఱుంగఁగోరువారలై; ఆరోపయితుం=ఆరోపించుటకు; న శేకుః=శక్తులుకారైరి.

రాజవంశమునందుఁ బుట్టినవారునుమహాబలులు నగురాజులు, ఆవింటిసారమునెఱుంగఁగోరి, తుదకు, ఆరోపించుటకేసమర్థులుకారైరి. అని, తాత్పర్యము.

తద్ధను ర్నరశార్దూల మైథిలస్య మహాత్మనః
తత్ర ద్రక్ష్యసి కాకుత్స్థ యజ్ఞం చాద్భుతదర్శనమ్. ౧౧

టీక॥ నరశార్దూల= పురుషశ్రేష్ఠుండవగు; కాకుత్స్థ =రాముఁడా! తత్ర=ఆమిథిలయందు; మహాత్మనః=పూజ్యమగు స్వభావముగల; మైథిలస్య= మిథిలాధిపతియగుజనకమహారాజుయొక్క; తత్=ఆ; ధనుః=వింటిని; అద్భుతదర్శనం, అద్భుత=ఆశ్చర్యకరమగు, దర్శనం=చూడఁబడుటగల; యజ్ఞంచ=యాగమును; ద్రక్ష్యసి=చూడఁగలవు.

పురుష శ్రేష్ఠుఁడవైన రాముఁడా! మహాత్ముఁడగు జనకమహారాజు దివ్యమైనయాధనుస్సును, అతఁడు సేయునద్భుతదర్శనంబగు యాగంబునుంజూడఁగలవు.

అని, తాత్పర్యము.

తద్ధియజ్ఞఫలం తేన మైధిలే నోత్తమం ధనుః
యాచితం నరశార్దూల సునాభం సర్వదైవతైః. ౧౨

టీక॥ నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవైనరాముఁడా! తేన=ఆ; మైధిలేన=మిథిలకుఁబ్రభువగు దేవరాతమహారాజుచేత; (దేవరాతుఁడుని మిచక్రవర్తికిఆఱవవాఁడు) సునాభం=మంచిముష్టిప్రదేశముగల; ఉత్తమం=శ్రేష్ఠమైన; తత్=ఆ; ధనుః=విల్లు; యజ్ఞఫలం=యాగముయొక్కఫలముగా; సర్వదైవతైః=(పంచమ్యర్థమందుఁదృతీయ)సమస్తదేవతలవలన; యాచితంహి=యాచింపఁబడినదిగదా!

మిథిలాధిపతియగు దేవరాతుఁడు, తానుయాగముఁజేసినపుడుసమస్తదేవతలను, "యాగఫలముగా, నా మంచిమధ్యప్రదేశముగలశ్రేష్ఠమైన ధనుస్సునిమ్మని" యాచింపఁగా, నది యతనికివచ్చినది. అని, తాత్పర్యము.

ఆయాగభూతం నృపతే స్తస్య వేశ్మని రాఘవ
("అయాగభూతం" అనిమహేశ్వరతీర్థపాఠము)
అర్చితం వివిధై ర్గంధై ర్ధూపై శ్చాగరుగంధిభిః. ౧౩

టీక॥ రాఘవ= రాముఁడా; తత్)అధ్యాహృతము) = ఆధనుస్సు; తస్య=ఆ; నృపతేః = జనకమహారాజుయొక్క; వేశ్మని = గృహమునందు; వివిధైః=నానావిధములైన, గంధైః=వాసనలచేతను; అగరుగంధిభిః= అగరుచెక్కవాసనగల; ధూపైశ్చ = పొగలచేతను; అర్చితం=పూజింపఁబడినదై; ఆయాగభూతం(ఇదిగోవిందరాజపాఠము)

అయాగభూతం (ఇదిమహేశ్వరతీర్థపారము) = ధనుస్సులయుత్సవములోఁ బ్రధానముగాఁబూజింపఁబడుధనువైనది.

రాముఁడా! ఆధనుస్సు, జనకమహారాజుగృహమందు, నానావిధములగు, గంధములచేతను అగరుధూపములచేతనుం బూజింపఁబడుచు, ధనుస్సులకుత్సవము సేయునపుడు, ప్రధానముగాఁబూజింపఁబడుధనువుగా, నున్నది. అనిమునులుచెప్పిరి. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మునివరః ప్రస్థాన మకరో త్తదా
సర్షిసంఘ స్సకాకుత్స్థ ఆమంత్ర్య వనదేవతాః. ౧౪
స్వస్తి వోస్తు గమిష్యామి సిద్ధ స్సిద్ధాశ్రమా దహమ్
ఉత్తరే జాహ్నవీతీరే హిమవంతం శిలోచ్చయమ్. ౧౫

టీక॥ ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; మునివరః = మునిశ్రేష్ఠుఁడగువిశ్వామిత్రుఁడు; తదా=అప్పుడు; సర్షిసంఘః = ఋషులసమూహముతోఁగూడినవాఁడై; సకాకుత్స్థః= రామలక్ష్మణులతోఁగూడినవాఁడై; "వః=మీకు, స్వస్తి=మంగళము; అస్తు=అగుఁగాక; సిద్ధః=సిద్ధిపొందిన, అహం=నేను; సిద్ధాశ్రమాత్ = సిద్ధాశ్రమమునుండి; ఉత్తరే=ఉత్తరపుతట్టునందలి; జాహ్నవీతీరే=గంగానదిగట్టునందు; హిమవంతం= హిమవంతమనెడు; శిలోచ్చయం= పర్వతమునుగూర్చి; గమిష్యామి=పోయెదను." ఇతి (అధ్యాహృతము)=అని; వనదేవతాః= అడవిదేవతలను; ఆమంత్ర్య= వీడుకొని; ప్రస్థానం=పయనమును; అకరోత్= చేసెను.

ఇట్లు, చెప్పి, మునిశ్రేష్ఠుఁడగువిశ్వామిత్రుఁడు, ఋషులనురామలక్ష్మణులనుంగూడి, "మీకుమంగళమగుఁగాక; నేనుసిద్ధిఁ బొందితిఁగావున, గంగానది యుత్తరతీరమందు, హిమత్పర్వతమునకుంబోయెదను" అని, వనదేవతలవీడ్కొని, పయనం బయ్యెను. అని, తాత్పర్యము.

ప్రదక్షిణం తతః కృత్వా సిద్ధాశ్రమ మనుత్తమమ్
ఉత్తరాం దిశ ముద్దిశ్య ప్రస్థాతు ముపచక్రమే. ౧౬

టీక॥ తతః=అటుపిమ్మట; సః (అధ్యాహృతము) = ఆవిశ్వామిత్రుఁడు; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేని; సిద్ధాశ్రమం=సిద్ధాశ్రమమునుగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా=చేసి; ఉత్తరాం=ఉత్తరపు; దిశం=దిక్కును; ఉద్దిశ్య=కూర్చి; ప్రస్థాతుం=వెళ్లుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

అంత, నావిశ్వామిత్రుఁడు, శ్రేష్ఠమైనసిద్ధాశ్రమమునకుఁ బ్రదక్షిణముచేసి, ఉత్తరపుదిక్కుఁ గూర్చి వెళ్లుటకారంభించెను.

అని, తాత్పర్యము.

తం ప్రయాంతం మునివర మన్వయా దనుసారిణమ్
శకటీశతమాత్రంతు ప్రాయేణ బ్రహ్మ వాదినామ్. ౧౭

టీక॥ ప్రాయేణ= బాహుళ్యముచేత; బ్రహ్మవాదినాం=వేదమునుం జెప్పునట్టివారియొక్క; శకటీశతమాత్రంతు=నూఱుబండ్లుమాత్రము; అనుసారిణం=ఉత్తరదిక్కును, అనుసరించుచున్న వాఁడును; ప్రయాంతం=పోవుచున్న వాఁడునగు; తం=ఆ; మునివరం=మునిశ్రేష్ఠుఁడగువిశ్వామిత్రుని ; అన్వయాత్=వెంబడించినది.

ఉత్తరపుదిక్కుఁ గూర్చిపోవుచున్నమునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుని, బ్రహ్మవాదులగు మునులు, నూఱుబండ్లవఱకు వెంటఁబెట్టుకొని, వెంబడించిరి. అని, తాత్పర్యము.

మృగపక్షిగణా శ్చైవ సిద్ధాశ్రమనివాసినః
అనుజగ్ము ర్మహాత్మానం విశ్వామిత్రం మహామునిమ్. ౧౮

టీక ॥ సిద్ధాశ్రమనివాసినః=సిద్ధాశ్రమమందునివసించునట్టి; మృగ

పక్షిగణాశ్చైవ= జింకలయొక్క యుఁ బక్షులయొక్క సమూహము లును; మహాత్మానం=పూజ్యమైనస్వ భావంబు గలవాఁడును; మహాముని=పూజ్యుఁడైనమునియునగు; వి శ్వామిత్రం=విశ్వామిత్రుని; అను జగ్ముః=వెంబడించినవి.

సిద్ధాశ్రమమందుండు జింకలును బక్షులునుంగూడఁ, బయనమైపోవు చుండుమహాత్ముండగు విశ్వామిత్ర మహామునిని వెంబడించిపోయినవి.

అని, తాత్పర్యము.

నివర్తయామాస తతః పక్షిసంఘా న్మృగానపి

టీక॥సః(అధ్యాహృతము)=ఆ విశ్వామిత్రుఁడు;తతః=అటుపిమ్మ ట; పక్షిసంఘాన్ = పక్షులయొ క్కసమూహములను; మృగానపి= జింకలను;నివర్తయామాస = మ ఱలించెను.

అంత,నావిశ్వామిత్రుఁడు, ప క్షులను మృగంబులను. వీడ్కొని, మఱల సిద్ధాశ్రమంబునకుఁ బోవు నట్లుమఱలించెను.అనితాత్పర్యము.

తే గత్వా దూర మధ్వానం లంబమానే దివాకరే. ౧౯
వాసం చక్రు ర్మునిగణా శ్శోణాకూలే సమాహితాః

టీక॥ తే=ఆ; మునిగణాః=ము నులసమూహములు; దూరం=దూ రమైన; అధ్వానం=మార్గమును; గత్వా=పొంది;దివాకరే = సూ ర్యుఁడు;లంబమానే=వ్రేలాడుచుం డఁగా (అస్తమించుచుండఁగానను ట);సమాహితాః= ఎచ్చరికగవా రలై;శోణాకూలే=శోణనదముయొ క్క గట్టునందు (శోణనదమనునది యొకమగయేఱు;(మగయేఱు, నద మనిచెప్పఁబడును),అదియే,యిచ్చ ట,ఆకారాంతముగాఁ జెప్పఁబడిన ది)వాసం=ఉనికిని;చక్రుః=చేసిరి.

ఆమునులు, చాలదూరముపో యి, సూర్యుండస్తమించునపుడు, శోణనదముగట్టునందు,ఎచ్చరికతో

వాసముగావించిరి. అని, తాత్పర్యము.

తేస్తంగతే దినకరే స్నాత్వా హుతహుతాశనాః. ౨౦
విశ్వామిత్రం పురస్కృత్య నిషేదు రమితౌజసః

టీక॥ అమితౌజసః, అమిత=కొలందిలేని, ఓజసః = తేజస్సుగల; తే=ఆమునులు; స్నాత్వా=స్నానముచేసి; దినకరే=సూర్యుఁడు; అస్తంగతే=అస్తమింపఁగా; హుతహుతాశనాః, హుత=హోమము చేయఁబడిన, హుతాశనాః=అగ్నిహోత్రముగలవారలై; విశ్వామిత్రం= విశ్వామిత్రుని; పురస్కృత్య=మున్నిడుకొని; నిషేదుః=కూర్చుండిరి.

కొలందిలేని తేజముగలయామునులు, స్నానముచేసి, సూర్యుండస్తమించినపిమ్మట, నగ్నిహోత్రమునందు హోమముచేసి, విశ్వామిత్రునిఁబురస్కరించికొని, కూర్చుండిరి.

అని, తాత్పర్యము.

రామోపి సహసౌమిత్రి ర్మునీం స్తా నభిపూజ్యచ. ౨౧
అగ్రతో నిషసాదా థ విశ్వామిత్రస్య ధీమతః

టీక॥ రామోపి=రాముండును; సహసౌమిత్రిః=లక్ష్మణునితోఁగూడుకొనినవాఁడై; తాన్=ఆ; మునీన్=ఋషులను; అభిపూజ్యచ = పూజించి (చకారముచే) నమస్కరించి; అథ=పిమ్మట; ధీమతః=బుద్ధిమంతుఁడగు; విశ్వామిత్రస్య= విశ్వామిత్రునియొక్క; అగ్రతః = ముందఱ; నిషసాద=కూర్చుండెను.

రాముండునులక్ష్మణుండును, ఆమునులంబూజించి నమస్కరించి, ధీమంతుండగు విశ్వామిత్రుని యెదుటంగూర్చుండిరి.

అని, తాత్పర్యము.

అథ రామో మహాతేజా విశ్వామిత్రం మహామునిమ్. ౨౨

పప్రచ్ఛ నరశార్దూలః కౌతూహలసమన్వితః

టీక॥ అథ=అటుపిమ్మట; మహాతేజాః=అధికమైన పరాక్రమముగలవాఁడును; నరశార్దూలః = పురుషశ్రేష్ఠుఁడునగు; రామః= రాముఁడు; కౌతూహలసమన్వితః = కోర్కెతోఁగూడినవాఁడై; మహామునిం = పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రం = విశ్వామిత్రుని; ప్రపచ్ఛ= అడిగెను.

అంత, మహాతేజుండును బురుషశ్రేష్ఠుండునగు రాముండు, కౌతూహలంబున, విశ్వామిత్రమహామునిం జూచి, యిట్లని, యడిగెను.

అని, తాత్పర్యము.

భగవన్ కోన్వయం దేశ స్సమృద్ధవనశోభితః. ౨౩
శ్రోతు మిచ్ఛామి భద్రం తే వక్తు మర్హసి తత్త్వతః

టీక॥ భగవన్= మాహాత్మ్యముగలవిశ్వామిత్రుఁడా సమృద్ధవనశోభితః, సమృద్ధ=వృద్ధినొందిన, వన=వనముచేత, శోభితః=అలంకరింపఁబడిన; అయం= ఈ; దేశః=దేశము; కోను = ఏది? అహం(అధ్యాహృతము)=నేను; శ్రోతుం=వినుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను. తే= నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. తత్త్వతః=ఉన్నదియున్నట్లు; వక్తుం=చెప్పుటకు; అర్హసి=తగుదువు.

భగవంతుఁడవైనవిశ్వామిత్రుఁడా! సమృద్ధంబగువనముచే నొప్పుచున్నయీదేశంబెయ్యది? నేనువినఁగోరెదను; ఉన్నదున్నట్లుచెప్పవలయును. అని, యడిగెను.

అని, తాత్పర్యము.

చోదితో రామవాక్యేన కథయామాస సువ్రతః. ౨౪
తస్య దేశస్య నిఖిల మృషిమధ్యే మహాతపాః

టీక॥ సువ్రతః=మంచివ్రతములుగలవాఁడును; మహాతపాః=అధిక

మైనతపస్సుగలవాఁడునగువిశ్వామిత్రుఁడు; రామవాక్యేన = రాముని మాటచేత; చోదితః = ప్రేరేపింపఁబడినవాఁడై; తస్య = ఆ; దేశస్య = దేశముయొక్క; వృత్తాంతం (అధ్యాహృతము) సమాచారమును; నిఖిలం = అంతను; ఋషిమధ్యే = ఋషులనడుమను; కథయామాస = చెప్పెను.

మంచివ్రతములు గలవాఁడును మహాతపస్వియునగు విశ్వామిత్రుఁడు, రామవాక్యంబునఁబ్రేరేపింపఁబడి, ఋషిమధ్యంబున, నాదేశవృత్తాంతమంతయుఁ, జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకత్రింశస్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండైక త్రింశసర్గటీక,
ముగిసినది.

---

౩౨

## ద్వాత్రింశసర్గప్రారంభః.

బ్రహ్మయోని ర్మహా నాసీ త్కుశో నామ మహాతపాః
అక్లిష్టవ్రతధర్మజ్ఞ స్సజ్జనప్రతిపూజకః. ౧

టీక॥ మహాతపాః = అధికమైన తపస్సుగలవాఁడును; అక్లిష్టవ్రతధర్మజ్ఞః, అక్లిష్టవ్రత = బాధలేనివ్రతముగలవాఁడును (దృఢవ్రతుఁడనుట), ధర్మజ్ఞః = ధర్మములనెఱింగినవాఁడును; సజ్జనప్రతిపూజకః = మంచివారిని బూజించువాఁడును; మహాన్ = శౌర్యాదులచే, అధికుండునగు; కుశోనామ = కుశుఁడనిప్రసిద్ధుఁడైన (కౌశేతే, ఇతి, కుశః, భూమి

యందుండువాఁడు, కావున,కుశుం డనఁబడెను, బ్రహ్మలోకమునువిడిచిప్రజాపాలనమందలి యాశచేత భూలోకమునందుండువాఁడు, కావున, కుశుఁడను పేరుగల్గినదనియభిప్రాయము); బ్రహ్మయోనిః=బ్రహ్మదేవుఁడేపుట్టుకకుఁ గారణము గాఁగలవాఁడు,బ్రహ్మపుత్రుఁడు; ఆసీత్=ఉండెను.

మిక్కిలియుఁ దపముగల్గి,దృఢవ్రతుండై, ధర్మజ్ఞుండై,మంచివారిఁ బూజించుచు, శౌర్యాదులనధికుండై,యుండు,కుశుండను,బ్రహ్మపుత్రుండొకఁడుండెను.

అని, తాత్పర్యము.

**స మహాత్మా కులీనాయాం యుక్తాయాం సుగుణోల్బణాన్**
**వైదర్భ్యాం జనయామాస చతుర స్సదృశాన్ సుతాన్. ౨**
**కుశాంబం కుశనాభంచ అధూర్తరజసం వసుమ్**

టీక॥ మహాత్మా=పూజ్యమగు స్వభావముగల; సః=ఆకుశుఁడు; కులీనాయాం=మంచకులమునందుఁబుట్టినదియు; యుక్తాయాం=తనకు,తగినదియునగు; వైదర్భ్యాం = విదర్భదేశపురాజుకూఁతురియందు; కుశాంబం=కుశాంబుఁడనువానిని; కుశనాభంచ=కుశనాభుఁడనువానిని; అధూర్తరజసం= అధూర్తరజసుఁడనువానిని,వసుం=వసువనువానిని; ఇమాన్(అధ్యాహృతము)=ఈః; సదృశాన్=తనకు,సమానులైన, సుగుణోల్బణాన్=మంచిగుణములచే నధికులగు; సుతాన్=కొడుకులను; చతురః=నల్వురిని; జనయామాస= పుట్టించెను.

మహాత్ముండగు నాకుశునకు, మంచికులమందుఁబుట్టినదియుభర్తకనురూపయు నగు విదర్భరాజపుత్రియందు, గుణాధికులుదండ్రికిసరివచ్చువారునగు, కుశాంబుఁడుఁ గుశనాభుఁడు నధూర్తరజసుఁడు వసువనునల్వురు కొడుకులు, పుట్టిరి. అని, తాత్ప్యము.

దీప్తియుక్తా న్మహోత్సాహాన్ క్షత్త్రధర్మచికీర్షయా. ౩
తా నువాచ కుశః పుత్త్రాన్ ధర్మిష్ఠాన్ సత్యవాదినః

టీక॥ కుశః=కుశుఁడు; దీప్తియుక్తాన్= కాంతితోఁగూడినవారును; మహోత్సాహాన్=అధికమైనయుత్సాహము గల వారును; ధర్మిష్ఠాన్=మిక్కిలి ధార్మికులును; సత్యవాదినః=సత్యమునే చెప్పువారునగు; తాన్=ఆ, పుత్త్రాన్=కొడుకులంగూర్చి; క్షత్త్రధర్మచికీర్షయా, క్షత్త్ర=క్షత్త్రియులయొక్క, ధర్మ=ధర్మమయిన ప్రజాపాలనమును; చికీర్షయా=చేయనిచ్ఛచేత; ఉవాచ=చెప్పెను.

కుశుండు, ప్రజాపాలనముసేయుటకుఁగాను, మహోత్సాహులై, కాంతిగలిగి, మిక్కిలి ధార్మికులై, సత్యవాదులైయున్నకొడుకులంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

క్రియతాం పాలనం పుత్త్రా ధర్మం ప్రాప్స్యథ పుష్కలమ్. ౪

టీక॥ పుత్త్రాః=కొడుకులారా! యుష్మాభిః= (అధ్యాహృతము) మీచేత; పాలనం=ప్రజలఁ, బాలించుట; క్రియతాం=చేయఁబడుఁగాక. యూయం=(అధ్యాహృతము) మీరలు; పుష్కలం=అధికమైన; ధర్మం=ధర్మమును; ప్రాప్స్యథ=పొందఁగలరు.

కొడుకులారా! ప్రజలంబాలింపుఁడు; దానంజేసి, పుష్కలంబైనధర్మంబు నొందెదరు. అనికుశుండు కొడుకులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఋషేస్తు వచనం శ్రుత్వా చత్వారో లోకసమ్మతాః
నివేశం చక్రిరే సర్వే పురాణాం నృపరా స్తదా. ౫

టీక॥ ఋషేః= ఋషియైనకుశునియొక్క; వచనం = మాటను;

శ్రుత్వాతు=వినినంతనే; తదా=అప్పుడు; లోకసమ్మతాః=జనులకందఱకును ఇష్టులైన; చత్వారః=నలువురుకొడుకులు; సర్వే=అందఱును; నృపరాః, నృ = మనుష్యులయందు, పరాః=ఆసక్తులై; పురాణాం=పట్టణములయొక్క; నివేశం=ఏర్పాటును; చక్రిరే=చేసిరి.

ఋషియగు కుశునిమాటవినినంతనే, లోకసమ్మతులగుకొడుకులునల్వురును, ప్రజాపాలనమందాసక్తులై, తమకు రాజధానులుగాఁ బట్టణముల నేర్పరచుకొనిరి.

అని, తాత్పర్యము.

కుశాంబస్తు మహాతేజాః కౌశాంబీ మకరో త్పురీమ్
కుశనాభస్తు ధర్మాత్మా పురం చక్రే మహోదయమ్. ౬

టీక॥ మహాతేజాః= అధికమైన పరాక్రమముగల; కుశాంబస్తు=కుశాంబుఁడు మాత్రము; కౌశాంబీం=కౌశాంబియనెడు(కుశాంబుని చేనిర్మింపఁ బడినదికావున, కౌశాంబియనంబడినది); పురీం= పట్టణమును; అకరోత్ = చేసెను; ధర్మాత్మా=ధర్మస్వభావుఁడైన; కుశనాభస్తు= కుశనాభుఁడు మాత్రము; మహోదయం=మహోదయమనెడు; పురం=పట్టణమును; చక్రే=చేసెను.

మహాతేజుండగు కుశాంబుండు కౌశాంబియనెడుపట్టణమును రాజధానిగాఁ జేసికొనెను; ధర్మాత్ముండగుకుశనాభుండు, మహోదయంబనుపట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. అని, తాత్పర్యము.

అధూర్తరజసో రామ ధర్మారణ్యం మహీపతిః
చక్రే పురవరం రాజా వసు శ్చక్రే మహోదయమ్. ౭

టీక॥ రామ = రాముఁడా! మహీపతిః=భూమికిఁబ్రభువైన; అధూర్తరజసః=అధూర్తరజసుఁడు పురవరం = పట్టణశ్రేష్ఠమైన; ధ

మారణ్యం=ధర్మారణ్యమును; చక్రే=చేసెను; రాజా=రాజైన; వసుః=వసువు; మహోదయం=అధికమైనవృద్ధిగలగిరివ్రజమనుపురమును; చక్రే=చేసెను.

రాముఁడా! భూపతియగు నధూర్తరజసుఁడు ధర్మారణ్యమను పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను; వసుమహారాజు, మహోదయంబగు గిరివ్రజమను పట్టణమును రాజధానిగాఁజేసికొనెను.

అని, తాత్పర్యము.

ఏషా వసుమతీ రామ వసో స్తస్య మహాత్మనః
ఏతే శైలవరాః పంచ ప్రకాశంతే సమంతతః. ౮

టీక॥ రామ = రాముఁడా! ఏషా=ఇది; మహాత్మనః=పూజ్యమైన స్వభావముగల; తస్య=ఆ; వసోః=వసుమహారాజుయొక్క; వసుమతీ=భూమి. ఏతే=ఈ; శైలవరాః=పర్వతశ్రేష్ఠములు; పంచ=అయిదు; సమంతతః = చుట్టును; ప్రకాశంతే=ప్రకాశించుచున్నవి.

రాముఁడా! ఇప్పుడుమనముండునది, మహాత్ముండగునావసుమహారాజుభూమి; ఈపర్వతంబులైదునీభూమినిజుట్టిప్రకాశించుచున్నవి. (గనుకనే, దీనికి, "గిరివ్రజంబు" (పర్వతముల గుంపు) అనుపేరు గల్గినది) అని, తాత్పర్యము.

సుమాగధీ నదీ రమ్యా మగధాన్ విశ్రుతా యయౌ
పంచానాం శైలముఖ్యానాం మధ్యే మాలేవ శోభతే. ౯

టీక॥ విశ్రుతా=ప్రసిద్ధమైన; రమ్యా = మనోహరమైన; సుమాగధీ = మంగళకరమై మగధదేశమందుఁబుట్టిన; నదీ = శోణనది; మగధాన్ = మగధదేశమును; ఆయయౌ=పొందినది. పంచానాం=అయిదైన; శైలముఖ్యానాం=పర్వతశ్రేష్ఠములయొక్క; మధ్యే=నడుమ

ను; మాలేవ=పుష్పమాలికవలె; శోభతే=ప్రకాశించుచున్నది.

ప్రసిద్ధంబును రమణీయంబునైన మగధదేశంబునఁ బుట్టినయీ శోణనది, మగధదేశమందుఁ బ్రవహించుచున్నది, ఈనది, పర్వతములలయిుదింటినడుమ, పుష్పమాలికవలెఁ బ్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

సైషాహి మాగధీ రామ వసో స్తస్య మహాత్మనః
పూర్వాభిచరితా రామ సుక్షేత్రా సస్యమాలినీ. ౧౦

టీక॥ రామ = రాముఁడా! సా=ఆ; ఏషా=ఈ; మాగధీ= మగధదేశమువందుఁబుట్టిన శోణనది; మహాత్మనః= పూజ్యమైనస్వభావముగల; తస్య=ఆ; వసోహి=వసువుదిగదా! రామ=రాముఁడా! ఏషా(అధ్యాహృతము)= ఈశోణనది; పూర్వాభిచరితా, పూర్వ=తూర్పుదేశమునుండి, అభిచరితా= ప్రవహించునది. సుక్షేత్రా= చక్కగాఫలించెడుభూమిగలది. సస్యమాలినీ=పైరులయొక్కపఙ్క్తి గలది.

రాముఁడా! అట్టియీశోణనది, మహాత్ముండగు నావసుమహారాజు దేశములోనిది; ఇది, తూర్పుదేశమునుండిపడమరతట్టుగాఁబ్రవహించుచున్నది; దీనిగట్టున నుండు భూములుచక్కగాఫలించునవి; దీనిగట్టుననంతటను, ఎప్పుడును, పైరులు మెండుగానుండును.

అని, తాత్పర్యము.

కుశనాభస్తు రాజర్షిః కన్యాశత మనుత్తమమ్
జనయామాస ధర్మాత్మా ఘృతాచ్యాం రఘునందన. ౧౧

టీక॥ రఘునందన = రాముఁడా! ధర్మాత్మా=ధర్మస్వభావుండును; రాజర్షిః=రాజునుఋషియునైన; కుశనాభస్తు=కుశనాభుఁడు

మాత్రము; ఘృతాచ్యాం=ఘృతాచియనెడుఅప్సరసయందు; అనుత్తమం= తమకన్న శ్రేష్ఠములేని;కన్యాశతం=కోమార్తెలనూటిని;జనయామాస=పుట్టించెను.

రాముఁడా ధర్మాత్ముండును రాజర్షియ నగుకుశనాభుండు, ఘృతాచియందుఁ,బరమసౌందర్యవతులైననూర్వురఁగొమార్తెలం,గనెను.

అని, తాత్పర్యము.

తాస్తు యౌవనశాలిన్యో రూపవత్య స్స్వలంకృతాః
ఉద్యానభూమి మాగమ్య ప్రావృషీవ శతహ్రదాః. ౧౨
గాయంత్యో నృత్యమానాశ్చ వాదయంత్యశ్చ సర్వశః
ఆమోదం పరమం జగ్ము ర్వరాభరణభూషితాః. ౧౩

టీక ॥ యౌవనశాలిన్యః=యౌవనముచేఁ బ్రకాశించుచున్నవారును; రూపవత్యః=మంచిరూపముగలవారును; స్వలంకృతాః=చక్కఁగా నలంకరింపఁబడినవారును; వరాభరణభూషితాః,వరాభరణ=శ్రేష్ఠములైన యాభరణములచే, భూషితాః=అలంకరింపఁబడినవారునగు; తాస్తు= ఆకోమార్తెలును; ఉద్యానభూమిం=ఉద్యానవనప్రదేశమును; ఆగమ్య = పొంది; ప్రావృషి= వర్షాకాలమందలి; శతహ్రదా ఇవ (స్థితాః)= మెఱుపులు వలె నున్నవారలై; సర్వశః = అన్ని విధములను; గాయంత్యః = పాడుచు; నృత్యమానాశ్చ= ఆడుచును; వాదయంత్యశ్చ = వీణల, వాయించుచును; పరమం = అధికమైన; ఆమోదం = సంతోషమును; జగ్ముః= పొందిరి.

మంచియౌవనంబును రూపంబునుంగల్గి,పుష్పగంధంబులను శ్రేష్ఠంబులగుభూషణంబులునుం జక్కఁగా నలంకరింపఁ బడియొప్పుచున్న కుశనాభునికొమార్తెలు నూర్వురును, ఉద్యాన వనమునకుఁ బోయి, వర్షాకాలమందలి మెఱుపులుంబోలె మెఱయుచు, నానావిధంబులుగాఁ బాడుచునాడుచు వీణలవాయించు

చు, మిక్కిలియుసంతోషంబునొందిరి. అని, తాత్పర్యము.

అథ తా శ్చారుసర్వాంగ్యో రూపేణాప్రతిమా భువి
ఉద్యానభూమి మాగమ్య తారా ఇవ ఘనాంతరే. ౧౪

టీక॥ అథ=అటుపిమ్మట; చారుసర్వాంగ్యః, చారు=సుందరములైన, సర్వాంగ్యః= అన్నియవయవములునుగల్గినవారును; భువి=భూమియందు; రూపేణ=రూపముచే; అప్రతిమాః = సరిలేనివారునగు; తాః= ఆకుశనాభునికూఁతురులు; ఉద్యానభూమిం= ఉద్యానవనప్రదేశమును; ఆగమ్య=పొంది; ఘనాంతరే= మేఘమధ్యమందు; తారా ఇవ=నక్షత్రములువలె; బభుః=(అధ్యాహృతము ) ప్రకాశించుచుండిరి.

సమస్తావయవంబులును సుందరంబులు గాఁగల్గి, రూపంబున, భూలోకంబుననెందును, సరిలేక, యొప్పుచున్న కుశనాభునికూఁతురులు, ఉద్యానవనమునకువచ్చి, తన్మధ్యమందుండి, మేఘమధ్యమందలినక్షత్రములుంబోలెఁ, బ్రకాశించుచుండిరి. అని, తాత్పర్యము.

తా స్సర్వగుణ సంపన్నా రూప యౌవనసంయుతాః
దృష్ట్వా సర్వాత్మకో వాయు రిదం వచన మబ్రవీత్. ౧౫

టీక॥ సర్వాత్మకః, సర్వ=అన్నిప్రదేశములయందును, ఆత్మకః= స్వరూపముగల, సమస్తప్రదేశములయందునుందిరుగువాఁడనుట; వాయుః=వాయుదేవుఁడు; సర్వగుణసంపన్నాః= సమస్తగుణములతోనుంగూడినవారును; రూపయౌవనసంయుతాః= రూపముతోనుయౌవనముతోనుం గూడిన వారునగు; తాః = ఆకుశనాభునికూఁతురులను; దృష్ట్వా=చూచి; ఇదం=ఈ; వచనం= మాటను; అబ్రవీత్ =

చెప్పెను.

సమస్తప్రదేశములయందును సంచరించుచుండువాయుదేవుండు, సమస్తగుణసంపన్నలై రూపయౌవనంబులుగల్గి యొప్పుచున్న కుశనాభుని కూతురులంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అహం వః కామయే సర్వా భార్యా మమ భవిష్యథ
మానుష స్త్యజ్యతాం భావో దీర్ఘమాయు రవాప్స్యథ. ౧౬

టీక॥ అహం=నేను; వః = మిమ్ములను; సర్వాః=అందఱను; కామయే=వలచుచున్నాను. మమ=నాకు; భార్యాః=భార్యలుగా; భవిష్యథ = అగుదురుగాక. మానుషః=మనుష్యునియందలి, భావః=అనురాగము; త్యజ్యతాం=విడువఁబడుగాక. లేక; మానుషః=మనుష్యసంబంధియగు; భావః=ధర్మము; త్యజ్యతాం = విడువఁబడుఁగాక. దీర్ఘం=అధికమైన; ఆయుః=జీవితకాలమును; ప్రాప్స్యథ=పొందుఁడు

నేనుమిమ్ములనందఱం జూచికామించుచున్నాను; నాకు భార్యలుగానుండుఁడు; మనుష్యునియందనురాగముంచవలదు; దేవతనైననాయందనురాగంబుఁ జేర్పుఁడు; (లేక; దేవతనైన నన్నుఁబెండ్లియైమనుష్యత్వమునువిడువుఁడు) మీకుదీర్ఘాయుస్సుకల్గెడిని. అని, తాత్పర్యము.

చలంహి యౌవనం నిత్యం మానుషేషు విశేషతః
అక్షయ్యం యౌవనం ప్రాప్తా అమర్త్యాశ్చ భవిష్యథ. ౧౭

టీక॥ మానుషేషు=మనుష్యులయందు; నిత్యం=ఎల్లప్పుడును; యౌవనం=యౌవనము; విశేషతః=అధికముగా; చలంహి = చంచలముగదా! యూయం = మీరలు; అక్షయ్యం = నశింపనట్టి; యౌవనం=యౌవనమును; ప్రాప్తాః=పొందినవారలై; అమర్త్యాశ్చ=దేవతా

లును గా; భవిష్యథ = కాఁగలరు.

ఎల్లప్పుడును మనుష్యులయావనము విశేషముగాఁ జంచలము; మీరలు నన్నుఁ బెండ్లి యైనట్టయిన, నాశము లేనియావనమునొంది, దేవతాస్త్రీలును గాఁగలరు. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా వాయో రక్లిష్టకర్మణః
అపహాస్య తతో వాక్యం కన్యాశత మథాబ్రవీత్. ౧౮

టీక॥ అక్లిష్టకర్మణః, అక్లిష్ట = కొట్టువడని, కర్మణః = కార్యముగల; తస్య = ఆ; వాయోః = వాయుదేవునియొక్క; తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; తతః = అటుపిమ్మట; అపహాస్య = పరిహాసము చేసి; అథ = ఆపిమ్మట; కన్యాశతం = పడుచులయొక్క నూటను; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పినది.

అప్రతిహతంబులగు కార్యంబులుగల యావాయుదేవుఁడు చెప్పిన మాటనువిని, దానిం బరిహాసించి, యంత, నూర్గురుకన్యలును, ఇట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

అంత శ్చరసి భూతానాం సర్వేషాం త్వం సురోత్తమ
ప్రభావజ్ఞాః స్మ తే సర్వాః కి మస్మా నవ మన్యసే. ౧౯

టీక॥ సురోత్తమ = దేవతలలో మేటియైనవాయుదేవుఁడా! త్వం = నీవు; సర్వేషాం = సమస్తములైన; భూతానాం = ప్రాణులయొక్క; అంతః = లోపల; చరసి = తిరిగెదవు. వయం(అధ్యాహృతము) = మేము; సర్వాః = అందఱము; తే = నీయొక్క; ప్రభావజ్ఞాః = ప్రభావము నెఱింగినవారము; స్మ = అగుచున్నాము. అస్మాన్ = మమ్ములను; కిం = ఎందుకు; అవమన్యసే = అవమానించుచున్నావు

దేవతాశ్రేష్ఠుఁడవైనవాయుదేవుఁడా నీవుసమస్తప్రాణులలోనుం దిరుగుచుండెదవు; మేమందఱము

నీప్రభావము నెఱుంగుదుము; ఎందుకు, మమ్ముల నవమానించెదవు.

అని, తాత్పర్యము.

కుశనాభసుతా స్సర్వా స్సమర్థా స్త్వాం సురోత్తమ
స్థానా చ్చ్యావయితుం దేవం రక్షామస్తు తపో వయమ్. ౨౦

టీక॥ సురోత్తమ=దేవశ్రేష్ఠుఁడవైనవాయుదేవుఁడా! వయం=మేము; సర్వాః=అందఱమును; కుశనాభసుతాః = కుశనాభునికూఁతురులము. త్వాం=నిన్ను; దేవం=నీప్రభువైనయింద్రుని; స్థానాత్=అధికారస్థానమునుండి; చ్యావయితుం=తొలఁగించుటకు; సమర్థాః=శక్తులము. తు=అయితే; తపః=తపస్సును; రక్షామః = కాపాడుచున్నాము. దేవతాశ్రేష్ఠుఁడవైన వాయుదేవుఁడా! మేమందఱముకుశనాభునికూఁతురులము; నిన్ను, నీప్రభువైనయింద్రుని, మీమీయధికారస్థానమునుండి తొలఁగింపఁగలము; అయితే, శపించినట్టయినఁ, దపస్సు తఱుగునని యెంచి, యూరకున్నాము. అని, తాత్పర్యము.

మాభూత్స కాలో దుర్మేధః పితరం సత్యవాదినమ్
నావమన్యస్వ ధర్మేణ స్వయం వర ముపాస్మహే. ౨౧

టీక॥ దుర్మేధః= దుష్టబుద్ధిగలవాయుదేవుఁడా! సః=మాతండ్రియైన, ఆకుశనాభుఁడు; తే(అధ్యాహృతము)=నీకు; కాలః=మృత్యువుగా; మాభూత్=కాకుండుఁగాక. సత్యవాదినం=సత్యమునేమాటలాడునట్టి; పితరం=మా, తండ్రిని; నావమన్యస్వ = అవమానింపకుము. ధర్మేణ=ధర్మముచేత; స్వయం=మేమే; వరం = పెనిమిటిని; ఉపాస్మహే=పొందెదము.

దుష్టబుద్ధిగలవాయుదేవుఁడా మాతండ్రియగు కుశనాభుండునీకు మృత్యువు కాకుండుఁగాక; నీవతని

నవమానింపకుము; ధర్మంబునఁ, దండ్రియనుమతింబట్టి, మేమే, భర్తను, వరించెదము. అని, తాత్పర్యము,

విశేషార్థము.—సః=ఆ, తండ్రిమాటనుదిరస్కరించినీవుచెప్పినట్లుగాంధర్వవివాహంబునఁ బతినివరించుటకుమేమొప్పుకొనునట్టి; కాలః=కాలము; మాభూత్=లేకయే పోవుఁగాక; తండ్రియాజ్ఞనుదిరస్కరించుటవలనంగల్గునధర్మముమాకుఁగల్గకుండుఁగాకయనుట. లేక; సః=ఆ, మాకుఁదండ్రియుండఁగా, తండ్రిలేని వారియట్లు స్వతంత్రముగాఁబతినివరింపవలసివచ్చునట్టి; కాలః=కాలము; మాభూత్=లేకయే పోవుఁగాక. మాకుఁదండ్రియుండఁగాదండ్రిలేనట్లు వ్యవహరించునట్టి యమంగళముగల్గకుండుఁ గాకయనుట. ఇట్లుమునిభావప్రకాశికాకారులుమాత్రమువ్యాఖ్యానముచేసిరి.

పితా హి ప్రభు రస్మాకం పరమం దైవతం హి సః
యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి. ౨౨

టీక॥ అస్మాకం = మాకు; ప్రభుః=ఒడయఁడు; పితాహి=తండ్రిగదా! సః = ఆతండ్రి; పరమం=ఉత్కృష్టుఁడైన; దైవతంహి=దేవుఁడుగదా! పితా=తండ్రి; నః=మమ్ములను; యస్య=ఎవ్వనికి; దాస్యతి=ఇచ్చునో; సః=అతఁడు; నః=మాకు; భర్తా = పెనిమిటి; భవిష్యతి=కాఁగలఁడు.

మాకుఁ బ్రభువుతండ్రి! తండ్రియే పరమదైవతము; మాతండ్రిమమ్ములనెవ్వనికిచ్చునో, అతండుమాకుఁబతిగాఁగలఁడు. అని, కన్యలుచెప్పిరి. అని, తాత్పర్యము.

తాసాం తద్వచనం శ్రుత్వా వాయుః పరమ కోపనః
ప్రవిశ్య సర్వగాత్రాణి బభంజ భగవాన్ ప్రభుః. ౨౩

టీక॥ తాసాం=ఆకన్యలయొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రు

త్వా=విని; పరమకోపనః = అధికమయిన కోపముగలవాఁడును; భగవాన్ = మాహాత్మ్యముగలవాఁడును; ప్రభుః = సమర్థుఁడునగు; వాయుః = వాయుదేవుఁడు; సర్వగాత్రాణి = సమస్తావయవములను; ప్రవిశ్య = ప్రవేశించి; బభంజ=విఱిచెను.

ఆకన్యలుచెప్పినయామాటనువిని, పరమకోపియైనభగవంతుండగు వాయుదేవుండు, వారిసమస్తావయవంబులునుబ్రవేశించివిఱిచెను.

అని, తాత్పర్యము.

తాః కన్యా వాయునా భగ్నా వివిశు ర్నృపతే గృహమ్
ప్రాపతన్ భువి సంభ్రాన్తా స్సలజ్జా స్సాస్రలోచనాః. ౨౪

టీక॥ తాః=ఆ; కన్యాః=పడుచులు; వాయునా=వాయుదేవునిచేత; భగ్నాః=విఱువఁబడినవారలై; నృపతేః= రాజైనకుశనాభునియొక్క; గృహం=ఇంటిని; వివిశుః = ప్రవేశించిరి. తాః (అధ్యాహృతము) = ఆపడుచులు; సంభ్రాంతాః=తొట్రుపాటుగలవారలై; సలజ్జాః=సిగ్గుగలవారలై; సాస్రలోచనాః, సాస్ర=కన్నీటితోఁగూడిన; లోచనాః=కండ్లుగలవారలై; భువి=భూమియందు; ప్రాపతన్=పడిరి.

ఆకన్యలు, వాయువుచేత విఱువఁబడి, యంతఁ గుశనాభునిగృహంబులోనికిం జని, సంభ్రమంబునుసిగ్గునుంజెంది, కండ్లనీరుకాఱఁగా, నేలంబడిరి. అని, తాత్పర్యము.

సచ తా దయితా దీనాః కన్యాః పరమశోభనాః
దృష్ట్వా భగ్నా స్తదా రాజా సంభ్రాన్త ఇద మబ్రవీత్. ౨౫

టీక॥ తదా = అప్పుడు; రాజా=రాజైన; సచ=ఆకుశనాభుఁడును; దయితాః=తనకుఁబ్రీతిగల్గించువారును; పరమశోభనాః = మి

క్కీ—లియుఁబ్రికాశించువారును; భగ్నాః= విఱువఁబడినవారును; దీనాః = దైన్యముగల వారునగు; తాః=ఆ; కన్యాః=కొమార్తెలను; దృష్ట్వా=చూచి; సంభ్రాంతః=కలతనొందినవాఁడై; ఇదం=దీనిని; అబ్రవీత్ =చెప్పెను.

అప్పుడు, ఆకుశనాభమహారాజు, పరమశోభనలగు తనప్రియపుత్రికలు, భగ్నలై దైన్యమునొంది యుండుటంజూచి, కలతనొంది, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కి మిదం కథ్యతాం పుత్ర్యః కో ధర్మ మవమన్యతే
కుబ్జాః కేన కృతా స్సర్వా వేష్టంత్యో నాభిభాషథ, ౨౬

టీక॥ పుత్ర్యః= కొమార్తెలారా! ఇదం=ఇది, కిం=ఏమి? కథ్యతాం=చెప్పఁబడుఁగాక. కః=ఎవఁడు; ధర్మం=ధర్మమును; అవమన్యతే= (భూతార్థమందులట్) అవమానించినాఁడు. యూయం= (అధ్యాహృతము) మీరలు; సర్వాః=అందఱును; కేన=ఎవ్వనిచేత; కుబ్జాః=వంకరశరీరముగలవారలుగా; కృతాః=చేయఁబడితిరి. యూయం (అధ్యాహృతము)=మీరలు; వేష్టంత్యః=చుట్టుకొనినవారలై; నాభిభాషథ = బదులుపలుకరు.

కొమార్తెలారా! ఇదేమి? చెప్పుఁడు; ఎవఁడుధర్మమునతిక్రమించినాఁడు? ఎవ్వఁడు మిమ్ములనిట్లుకబ్జలుగాఁజేసెను? ఎందుకు బదులుచెప్పరు? అని, కుశనాభుండుచెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం రాజా వినిశ్వస్య సమాధిం సందధే తతః

టీక॥ రాజా=రాజైనకుశనాభుఁడు; ఏవం=ఇట్లు; వినిశ్వస్య= దుఃఖించి; తతః=అంతట; సమాధిం=సమాధానమును; సందధే= ధరించెను.

కుశనాభమహారాజిట్లుదుఃఖించి

యంతమనస్సమాధానము నొందెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ద్వాత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ ద్వాత్రింశసర్గటీక,
ముగిసినది.

---

౩౩

త్ర య స్త్రిం శ స ర్గ ప్రా రం భః.

తస్య తద్వచనం శ్రుత్వా కుశనాభస్య ధీమతః
శిరోభి శ్చరణౌ స్పృష్ట్వా కన్యాశత మభాషత. ౧

టీక॥ ధీమతః=బుద్ధిశాలియగు; తస్య=ఆ; కుశనాభస్య=కుశనాభునియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; కన్యాశతం=కొమార్తెలయొక్క నూఱును; శిరోభిః=తలలచేత; చరణౌ= అడుగులను; స్పృష్ట్వా=తాఁకి; అభాషత=పలికెను.

ధీమంతుండగు నాకుశనాభుఁడు చెప్పినయామాటలనువిని, యా కన్యలునూర్వురును, తమతండ్రియడుగులుసోఁకునట్లు ప్రణమిల్లి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

వాయు స్సర్వాత్మకో రాజన్ ప్రధర్షయితు మిచ్ఛతి
అశుభం మార్గ మాస్థాయ న ధర్మం ప్రత్యవేక్షతే. ౨

టీక॥ రాజన్=రాజైనకుశనాభుఁడా!సర్వాత్మకః, సర్వ=అన్నిటియందును,ఆత్మకః=స్వరూపము గల; వాయుః= వాయుదేవుఁడు; ప్రధర్షయితుం= తిరస్కరింటకు; ఇచ్ఛతి= (భూతార్థమందులట్)కోరెను. అశుభం=అమంగళకరమైన; మార్గం=దారిని; ఆస్థాయ = పొంది; ధర్మం=ధర్మమును; నప్రేక్షతే= (భూతార్థమందులట్) చూడలేదు.

కుశనాభుఁడా!అన్నిటందిరుగులాడెడువాయుదేవుండు, మమ్ము ధర్షింపఁగోరెను; అమంగళకరంబనితలంపక, మమ్ము బలాత్కరించుటకుంబూని,ధర్మంబు నెంతమాత్రి మునుంజూడఁడయ్యె.

అని, తాత్పర్యము.

పితృమత్యస్స్మ భద్రం తే స్వచ్ఛందే న వయం స్థితాః
పితరం నో వృణీష్వ త్వం యది నో దాస్యతే తవ. 3

టీక॥ వయం=మేము; పితృమత్యః=తండ్రిగలవారము; స్మ=అగుచున్నాము. స్వచ్ఛందే= స్వాతంత్ర్యమందు; నస్థితాః=ఉండినవారముకాము; నః=మాయొక్క; పితరం=తండ్రిని; త్వం=నీవు; వృణీష్వ=కోరుము. నః= మమ్ములను; తవ=నీకు; యదిదాస్యతే=ఇచ్చునట్టయిన; (“తవ=నీకు; భార్యాః= భార్యలుగా; భవిష్యామః=కాఁగము అని, అధ్యాహృతమగుచున్నది” “భార్యామమభవిష్యథ” అని వాయువుచేనడుగంబడినందు కుత్తరము; “భార్యలమయ్యెద” మనిచెప్పుట యందు; సాధారణముగా స్త్రీలకుంగల్గుసిగ్గను సూచించుటకై,చెప్పఁబడదయ్యె.) తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక.

మాకుఁదండ్రియున్నాఁడు కావున, స్వాతంత్ర్యములేదు; నీవు మాతండ్రినడుగుము; అతండు,మమ్ము నీకిచ్చినట్టయిన, మేము నీకుభార్యలమయ్యెదము; అని, మేమతనికింజెప్పితిమి.

అని, తాత్పర్యము.

తేన పాపానుబంధేన వచనం న ప్రతీచ్ఛతా
ఏవం బ్రువంత్య స్సర్వా స్స్మ వాయునా నిహతా భృశమ్. ౪

టీక॥ ఏవం = ఈప్రకారము; బ్రువంత్యః = చెప్పుచున్నట్టి,వయం(అధ్యాహృతము)=మేము;సర్వాః=అందఱమును; పాపానుబంధేన, పాప=పాపముయొక్క, అనుబంధేన = అనుసరించుటగల; (కనుకనే) వచనం=మాటను; న ప్రతీచ్ఛతా= అంగీకరింపనట్టి; తేన=ఆ; వాయునా= వాయువుచేత;భృశం=మిక్కిలి,నిహతాః=కొట్టఁబడినవారము;స్మ=అగుచున్నాము.

ఈప్రకారము చెప్పుచున్న మమ్మందఱనావాయువు, పాపంబనుసరించువాఁడై, మామాట నంగీకరింపక,యిట్లుకొట్టెను. అని, కన్యలు కుశనాభునితోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

తాసాం త ద్వచనం శ్రుత్వా రాజా పరమధార్మికః
ప్రత్యువాచ మహాతేజాః కన్యాశత మనుత్తమమ్. ౫

టీక ॥ తాసాం=ఆకన్యలయొక్క;తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; పరమధార్మికః=మిక్కిలిధర్మిష్ఠుఁడును; మహాతేజాః=అధికమైన పరాక్రమముగలవాఁడునగు; రాజా=రాజైన కుశనాభుఁడు; అనుత్తమం=తమకన్న శ్రేష్ఠములేని; కన్యాశతం=కొమాతెలయొక్కనూటిసింగూర్చి;ప్రత్యువాచ=బదులుచెప్పెను.

ఆకన్యలుచెప్పినయామాటవిని, మహాపరాక్రమశాలియగు నాకుశనాభుండు, పరమధార్మికుండగుటంజేసి,వాయువుపైఁగోపంబు వహింపక, క్షమయేముఖ్యంబని తలంచి, ఉత్తమమైననూర్వురి కన్యలకునిట్లని,బదులుసెప్పెను

అని, తాత్పర్యము.

క్షాంతం క్షమావతాం పుత్ర్యః కర్తవ్యం సుమహత్కృతమ్
ఐకమత్య ముపాగమ్య కులంచా న్వేక్షితం మమ. ౬

టీక॥ పుత్ర్యః=కూఁతురులారా! క్షమావతాం=ఓర్పుగలవారలకు, కర్తవ్యం=చేయఁదగినది; క్షాంతం=ఓర్చుట. కృతం=చేయఁబడినకార్యము;సుమహత్ = చాల గొప్పది. యుష్మాభిః(అధ్యాహృతము)=మీచేత; ఐకమత్యం=ఒద్దికను;ఉపాగమ్య=పొంది; మమ=నాయొక్క; కులంచ=వంశమును; అన్వేక్షితం=చూడఁబడినది.

కూఁతురులా! ఓర్పుగలవారలు,తమకెవ్వఁడైననపరాధము చేసినపుడు, చేయవలసిన కార్యమంతయు, క్షమించుటయే; ఇప్పుడు, మీరలుచేసినకార్యము, చాలగొప్పది; మీరలొకరితోనొకరు కలసికొని, యొద్దికనొంది, నాకులంబునుం గూడరక్షించితిరి. అని తాత్పర్యము.

అలంకారో హి నారీణాం క్షమా తు పురుషస్య వా

టీక॥ క్షమాతు= ఓర్పుమాత్రము; నారీణాం=స్త్రీలకుఁగాని; పురుషస్యవా=(జాత్యేకవచనము)పురుషులకుఁగాని; అలంకారోహి=భూషణముగదా!

"ఓర్పు," అనునది, స్త్రీలకుని,బురుషులకుఁగాని, భూషణ అని, తాత్పర్యము.

దుష్కరం తచ్చ యత్ క్షాంతం త్రిదశేషు విశేషతః. ౭
యాదృశీ వః క్షమా పుత్ర్యః స్సర్వాసా మవిశేషతః

టీక॥ క్షాంతం = క్షమయనునది;యత్(అస్తి) = ఎదికలదో;తత్ =అది; దుష్కరం=చేయనశక్యమయినది. తత్ (అధ్యాహృతము)=ఆయోర్పు;త్రిదశేషు=దేవతలయందు; విశేషతః=అధికముగా;

దుష్కరం (అధ్యాహృతము) = చేయనశక్యమైనది. పుత్ర్యః = కొమార్తెలారా! వః=మీకు; సర్వాసాం=అందఱకును;అవిశేషతః=భేదములేక; యాదృశీ=ఎట్టిది;ఆసీత్ (అధ్యాహృతము) = కల్గెనో; తాదృశీ ( అధ్యాహృతము) = అట్టిక్షమ ; దుష్కరా (అధ్యాహృతము)=చేయనశక్యమైనది.

సాధారణముగా క్షమించుట యనునదియె కష్టసాధ్యము; అందు రూపైశ్వర్యాదులు గలదేవత లపరాధము సేసినపుడు, వారిని క్షమించుటచాలఁగష్టము; అందును,మీనూర్వురికిని ఏకరీతిగా నోర్పు గలుగుట, మరియు దుర్లభము. అట్టిక్షమ మీకుఁ గల్గినది. అని, తాత్పర్యము.

క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యంహి పుత్రికాః. ౮
క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్

టీక॥ పుత్రికాః=కూఁతురులా! క్షమా=ఓర్పు;దానం= ఈవి. క్ష[మా]=ఓర్పు;యజ్ఞః=యాగము. క్ష[మా]=ఓర్పు;సత్యంహి=సత్యముగ[దా]!క్షమా=ఓర్పు;యశః=కీర్తి.క్షమా=ఓర్పు;ధర్మః=లౌకికముకానిశ్శ్రేయస్సాధనము. క్షమయా=ఓర్పుచేత; జగత్=ప్రపంచము;విష్ఠితం=ఉన్నది.

కూఁతురులా! దానంబునంగల్గు ఫలముక్షమవలనఁగల్గును; యాగంబులంగల్గునదిక్షమవలనంగల్గును;సత్యంబునం గల్గునదిక్షమవలనంగల్గును;కీర్తివలనంగల్గునదిక్షమవలనఁగలుగును;ధర్మంబునంగల్గునదిక్షమవలనంగల్గును; జగత్తంతయుక్షమచేతనేయున్నది. అని,కుశనాభుఁడు కొమార్తెలకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

విసృజ్య కన్యాః కాకుత్థ్స రాజా త్రిదశవిక్రమః. ౯
మంత్రజ్ఞో మంత్రయామాస ప్రదానం సహమంత్రిభిః

స౩౩

దేశకాలౌ ప్రదానస్య సదృశే ప్రతిపాదనమ్. ౧౦

టీక॥ కాకుత్థ్స=రాముఁడా! కన్యాః=కొమార్తెలను; విసృజ్య=విడిచి పెట్టి; త్రిదశవిక్రమః=దేవతలవంటి పరాక్రమముగలవాఁడును; మంత్రజ్ఞః = ఆలోచన నెఱింగినవాఁడునగు; రాజా=రాజైనకుశనాభుఁడు; ప్రదానం=కన్యాదానముగూర్చి; ప్రదానస్య=కన్యాదానముయొక్క; దేశకాలౌ=దేశమును గాలమునుంగూర్చి; సదృశే=తనకు సరియైనపాత్రమునందు; ప్రతిపాదనం=చేయుటనుంగూర్చి; మంత్రిభిస్సహ= మంత్రులతోఁగూడ; మంత్రయామాస=ఆలోచించెను.

రాముఁడా! కొమార్తెలనుబంపి, దేవతాసమానంబగు పరాక్రమంబుగలవాఁడును మంత్రజ్ఞుండునగు నాకుశనాభుఁడు, కన్యాప్రదానమునుగూర్చి; "ఈకన్యల నెచ్చట నెవ్వడెవ్వనికిచ్చునది;" అని, మంత్రులతో నాలోచించెను.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నేవ కాలేతు చూళీనామ మహాతపాః
ఊర్ధ్వరేతా శ్శుభాచారో బ్రాహ్మం తప ఉపాగమత్. ౧౧

టీక॥ ఏతస్మిన్=ఈ; కాలేత్వేవ=కాలమందే; మహాతపాః=అధికమైనతపస్సుగలవాఁడును, ఊర్ధ్వరేతాః=ఎగువమొగమైనవీర్యముగలవాఁడును, అస్ఖలితవీర్యుఁడనుట; శుభాచారః= మంగళకరమైనయాచారముగలవాఁడునగు; చూళీనామ = చూళియనువాఁడు; బ్రాహ్మం=వైదికమైన; తపః=తపస్సును; ఉపాగమత్=పొందెను, చేసెననుట.

ఈకాలమందే, మహాతపుండై యస్ఖలితవీర్యుండై మంచియాచారముగల్గియుండుచూళియను నొకమహాముని వేదచోదితంబగు తపముసేయుచుండెను. అని, తాత్పర్యము.

తప్యంతం త మృషిం తత్ర గంధర్వీ పర్యుపాసతే
సోమదానామ భద్రంతే ఊర్మిళాతనయా తదా. ౧౨

టీక॥ తత్ర=అచ్చట; తదా= అప్పుడు; తప్యంతం= తపస్సుసే యుచున్న; తం=ఆ; ఋషిం=ఋ షిని, ఊర్మిళాతనయా=ఊర్మిళ కూఁతురైన; సోమదానామ=సో మదయనెడు; గంధర్వీ=గంధర్వ స్త్రీ; పర్యుపాసతే=(భూతార్థ మందులట్) సేవించెను. రామ= (అధ్యాహృతము) రాముఁడా! తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక.

అప్పుడాచూళి తపము సేయుచుండఁగా, ఊర్మిళకూఁతురైన సోమదయనుగంధర్వస్త్రీ, యతని యొద్దకుఁబోయి, యతని సేవింపుచుండెను. రాముఁడా! నీకుమంగళమగుఁగాక.

అని, తాత్పర్యము.

సాచ తం ప్రణతా భూత్వా శుశ్రూషణపరాయణా
ఉవాస కాలే ధర్మిష్ఠా తస్యా స్తుష్టోఽభవ ద్గురుః. ౧౩

టీక॥ ధర్మిష్ఠా=మిక్కిలిధార్మికురాలగు; సాచ=ఆసోమదయును; తం=ఆచూళిని; ప్రణతా= నమస్కరించినదియును; శుశ్రూష ణపరాయణా, శుశ్రూషణ=సేవ యే, పర=ముఖ్యమైన; అయనా= గతిగాఁగలదియును; భూత్వా=అ యి; ఉవాస=ఉండెను. కాలే= కొంతకాలమందు; తస్యాః=ఆసో మదకు; గురుః= ఆచార్యుఁడైన చూళి, తుష్టః=సంతసించినవాఁడు; అభవత్=ఆయెను.

మిక్కిలి ధార్మికురాలగునా సోమదయును, ఆచూళిని నమస్కరించియతనికెల్లప్పుడును శుశ్రూష సేయుచుండెను; అంతఁగొంతకాలమునకు, చూళి, సంతోషంబునొందెను. అని, తాత్పర్యము.

సచ తాం కాలయోగేన ప్రోవాచ రఘునందన
పరితుష్టోస్మి భద్రంతే కిం కరోమి తవ ప్రియమ్. ౧౪

టీక॥ రఘునందన = రాముఁడా! సచ=ఆచూళియును; కాలయోగేన= కాలముయొక్క-సంబంధముచేత; తాం=ఆసోమదనుగూర్చి "అహం(అధ్యాహృతము)= నేను; పరితుష్టః = సంతసించినవాఁడను; అస్మి=అగుచున్నాను. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము)= అగుఁగాక. తవ=నీకు; కిం=ఏ ; ప్రియం=ఇష్టమును; కరోమి=చేయుదును. ఇతి(అధ్యాహృతము)= అని; ప్రోవాచ=చెప్పెను.

రాముఁడా! ఆచూళియును, గాలయోగంబున, "నేనుసంతుష్టుఁడనైతిని, నీకుమంగళమగుఁగాక, నీకునేనేమిప్రియముసేయవలయును?' అని, యాసోమదతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

పరితుష్టం మునిం జ్ఞాత్వా గంధర్వీ మధురస్వరా
ఉవాచ పరమప్రీతా వాక్యజ్ఞా వాక్యకోవిదమ్. ౧౫

టీక॥ మునిం=చూళిమహామునిని; పరితుష్టం = సంతసించినవానిఁగా; జ్ఞాత్వా=ఎఱింగి; వాక్యజ్ఞా= మాటలనెఱింగినదియు; మధురస్వరా=మనోహరమైనకంఠధ్వనిగలదియునగు; గంధర్వీ=గంధర్వస్త్రీయైన, సోమద; పరమప్రీతా= మిక్కిలియు సంతసించినదై; వాక్యకోవిదం=మాటలయందు సమర్థుఁడైనచూళినింగూర్చి; ఉవాచ=చెప్పెను.

చూళినిసంతసించినవానిఁగానెఱింగి, మనోహరంబైనకంఠస్వరముగల్గిచక్క-గామాటలాడుటకుఁ జాలినయాసోమద, మిక్కి-లియు సంతసించి, మాటలాడుటయందు సమర్థుఁడైనచూళితో నిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

లక్ష్మ్యా సముదితో బ్రాహ్మ్యా బ్రహ్మభూతో మహాతపాః
("దీప్యసేపరయాలక్ష్మ్యా" అనిపాఠాంతరము.)
బ్రాహ్మేణ తపసా యుక్తం పుత్రమిచ్ఛామి ధార్మిక. ౧౬

టీక॥ ధార్మిక = ధర్మము సేయునట్టిచూళిమహాముని! త్వం(అధ్యాహృతము) = నీవు ; బ్రాహ్మ్యా = బ్రాహ్మణసంబంధియగు; లక్ష్మ్యా = కాంతిచేత, బ్రహ్మవర్చసముచేతననుటసముదితః = శ్రేష్ఠుఁడైనవాఁడవు. ("పరయా = ఉత్కృష్టమైన; లక్ష్మ్యా = కాంతిచేత; దీప్యసే = ప్రకాశించుచున్నావు" అని, పాఠాంతరము). బ్రహ్మభూతః = బ్రహ్మదేవుఁడైనవాఁడవు, బ్రహ్మదేవునితోసమానుఁడవనుట. మహాతపాః = అధికమైనతపస్సుగలవాఁడవు. బ్రాహ్మేణ = బ్రాహ్మణసంబంధియగు; తపసా = తపస్సుతో; యుక్తం = కూడిన; పుత్రం = కొడుకును; ఇచ్ఛామి = కోరుచున్నాను.

ధార్మికుఁడవైనచూళి మహాముని! నీవుబ్రహ్మవర్చసముచేతనందఅనుమించినవాఁడవు ; (నీవు, ఉత్కృష్టంబగు బ్రహ్మవర్చసముచేఁ బ్రకాశించుచున్నావు.) బ్రహ్మదేవునకుసరివచ్చువాఁడవు; మిక్కిలియుఁ దపస్సు గలవాఁడవు; నాకు బ్రాహ్మణశక్తితోఁ గూడినకొడుకు కావలయును.

అని, తాత్పర్యము.

అపతి శ్చాస్మి భద్రంతే భార్యా చాస్మి నకస్య చిత్
బ్రాహ్మోపగతాయా శ్చ దాతు మర్హసి మే సుతమ్. ౧౭

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; అపతిశ్చ = పెనిమిటిలేనిదానను; అస్మి = అగుచున్నాను. తే = నీకు; భద్రం = మంగళము; అస్తు (అధ్యాహృతము) = అగుఁగాక. కస్యచిత్ = ఒకానొకనికిని; భార్యా

చ=పెండ్లామును; నాస్మి=కాను. ఉపగతాయాః= శరణుచొచ్చిన; మేచ=నాకును; బ్రాహ్మేణ=బ్రాహ్మణసంబంధియగు తపోమహిమచేత;సుతం=కొడుకును;దాతుం= ఇచ్చుటకు;అర్హసి=తగుదువు.

నేను పెనిమిటిలేనిదానను; నీకు మంగళమగుఁగాక;నేనెవ్వనినిం బెండ్లాడినదాననుగాను; నిన్ను శరణుచొచ్చితిని;నాకుఁ,దపోమహిమచేఁ గొడుకునివ్వవలయును. అని, సోమద చెప్పినది. అని, తాత్పర్యము.

విశేషార్థము. — ఇచ్చట, “నేను పెనిమిటిలేనిదానను” అను మాటనువిినంతనే “నేనెవ్వరినిం బెండ్లాడలేదు” అనుమాటను వినుటకుమునుపు, చూళి, సోమదను విధవఁగానెంచి, “ఈవిధవ మనకింత కాలము శుశ్రూష సేయుచుండెను గదా!” అని, జుగుప్సనొందకుండుటకై, మొదలిమాటను జెప్పినంతనే “నీకుమంగళమగుఁగాక” యని, చెప్పఁబడినది.

తస్యాః ప్రసన్నో బ్రహ్మర్షి ర్దదౌ పుత్ర మనుత్తమమ్
బ్రహ్మదత్త ఇతి ఖ్యాతం మానసం చూళిన స్సుతమ్. ౧౮

టీక॥ బ్రహ్మర్షిః=బ్రాహ్మణుఁడునుఋషియునైన చూళి; తస్యాః=ఆసోమదకు; ప్రసన్నః = సంతసించినవాఁడై; చూళినః = చూళియను పేరుగల; స్వస్య = (అధ్యాహృతము) తనయొక్క; మానసం= మనస్సునంబుట్టిన; సుతం=కొడుకైనవాఁడును;బ్రహ్మదత్తఇతి=బ్రహ్మదత్తుఁడని (బ్రాహ్మణునిచేనివ్వఁబడుటంబట్టి, బ్రహ్మదత్తుఁడను పేరుగల్గినది); ఖ్యాతం= ప్రసిద్ధుఁడైన వాఁడును; అనుత్తమం = తనకన్న శ్రేష్ఠుఁడులేనివాఁడునగు; పుత్రం=కొడుకును; దదౌ=ఇచ్చెను.

బ్రహ్మర్షియగుచూళి, ప్రసన్నుఁడై, తనమానసంబునఁబుట్టిన, బ్రహ్మదత్తుఁడను నుత్తమపుత్రుని, ఆసోమదకిచ్చెను.

అని, తాత్పర్యము.

స రాజా సోమదేయస్తు పురీ మధ్యావస త్తదా
కాంపిల్యాం పరయా లక్ష్మ్యా దేవరాజోయథా దివమ్. ౧౯

టీక॥ తదా=అప్పుడు;సోమదేయః=సోమదకొడుకైన; సః=ఆ; రాజా తు=బ్రహ్మదత్తమహారాజును;పరయా = ఉత్కృష్టమైన;లక్ష్మ్యా=సంపదతో;కాంపిల్యాం=కాంపిల్యయనెడు;పురీం=పట్టణమును;దివం=స్వర్గమును; దేవరాజో యథా=దేవేంద్రుడువలె; అధ్యవసత్ =అధిష్ఠించియుండెను.

ఆకుశనాభుడుకన్యాదానమును గురించియాలోచించునపుడు, సోమదకొడుకైన, యాబ్రహ్మదత్తుండు,సమస్తసంపదలంగూడె, కాంపిల్యానగరమునందు, స్వర్గమునందు దేవేంద్రుండుంబోలె, వాసముసేయుచుండెను. అని, తాత్పర్యము.

స బుద్ధిం కృతవాన్ రాజా కుశనాభ స్సుధార్మికః
బ్రహ్మదత్తాయ కాకుత్స్థ దాతుం కన్యాశతం తదా. ౨౦

టీక॥ కాకుత్స్థ= రాముడా! తదా=అప్పుడు;సుధార్మికః=మిక్కిలియుధార్మికుడైన;రాజా=రాజైన; సః=ఆ;కుశనాభః=కుశనాభుడు; బ్రహ్మదత్తాయ= బ్రహ్మదత్తునికొఱకు;కన్యాశతం=కొమార్తెలయొక్కనూటిని;దాతుం=ఇచ్చుటకు; బుద్ధిం=నిశ్చయమును; కృతవాన్=చేసెను.

రాముడా! అప్పుడు,మిక్కిలియుధార్మికుండగు నాకుశనాభ మహారాజు, కొమార్తెలనూర్వురిని బ్రహ్మదత్తుని కిచ్చునట్లునిశ్చయము చేసెను. అని,తాత్పర్యము.

త మాహూయ మహాతేజా బ్రహ్మదత్తం మహీపతిః
దదౌ కన్యాశతం రాజా సుప్రీతే నాంతరాత్మనా. ౨౧

టీక॥ మహాతేజాః=అధికమైనప్రభావముగలిగిన;మహీపతిః=భూమి

కిఁబ్రీఘువైన; రాజా=కుశనాభమహారాజు; తం=ఆ; బ్రహ్మదత్తం=బ్రహ్మదత్తుని; ఆహూయ=పిలిచి; సుప్రీతేన = మిక్కిలిసంతసించిన; అంతరాత్మనా = అంతఃకరణముతో; కన్యాశతం=కొమార్తెలయొక్క నూటిని; దదౌ=ఇచ్చెను.

మహాతేజుండగుకుశనాభమహారాజు, ఆబ్రహ్మదత్తునింబిలిచి, పరమప్రీతంబగునంతఃకరణంబున, నతనికిఁ, గొమార్తెలనూర్వుర, నిచ్చెను. అని, తాత్పర్యము.

యథాక్రమం తతః పాణిం జగ్రాహ రఘునందన
బ్రహ్మదత్తో మహీపాల స్తాసాం దేవపతి ర్యథా. ౨౨

టీక॥ రఘునందన=రాముఁడా! తతః=అటుపిమ్మట; దేవపతిర్యథా (స్థితః) = దేవేంద్రుఁడువలెనున్న వాఁడును; మహీపాలః=భూమిం బాలించు వాఁడునగు; బ్రహ్మదత్తః=బ్రహ్మదత్తుఁడు ; యథాక్రమం = వరుసనతిక్రమింపక; తాసాం=ఆకన్యలయొక్క; పాణిం=హస్తములను; జగ్రాహ=గ్రహించెను.

రాముఁడా! అంత, నైశ్వర్యంబున దేవేంద్రునింబోలిన బ్రహ్మదత్తమహారాజు, వరుసగా, నాకన్యలనందఱc, బాణిగ్రహణముచేసి, పెండ్లాడెను. అని, తాత్పర్యము.

స్పృష్టమాత్రే తతః పాణౌ వికుబ్జా విగత జ్వరాః
యుక్తాః పరమయా లక్ష్మ్యా బభుః కన్యా శతం తదా. ౨౩

టీక॥ తతః=అంతట; పాణౌ=(జాత్యేకవచనము) హస్తములు, స్పృష్టమాత్రే= తాఁకఁబడినవిమాత్రమగుచుండఁగానే; తదా=అప్పుడు కన్యాః=(విసర్గలోపమార్షము) పడుచులు; శతం = నూర్వురును;

వికుబ్జాః = వంకరశరీరములేనివారలై; విగతజ్వరాః = పోయినబాధగలవారలై; పరమయా = మిక్కిలి యధికమైన; లక్ష్మ్యా = కాంతితో, యుక్తాః = కూడినవారలై; బభుః = ప్రకాశించిరి.

అంత, నాబ్రహ్మదత్తుఁడు, హస్తముల నంటినమాత్రముననె, యాపదుచులునూర్వురును, కుబ్జత్వము విడిచి, యెంతమాత్రమును బాధ లేనివారలై, పరమకాంతిగల్గి ప్రకాశించిరి. అని, తాత్పర్యము.

స దృష్ట్వా వాయునా ముక్తాః కుశనాభో మహీపతిః
బభూవ పరమప్రీతో హర్షం లేభే పునఃపునః. ౨౫

టీక॥ వాయునా = వాయువుచేత; ముక్తాః = విడువఁబడిన; కన్యాః (అధ్యాహృతము) = కొమార్తెలను; దృష్ట్వా = చూచి; మహీపతిః = భూమికిఁబ్రభువైన; సః = ఆ; కుశనాభః = కుశనాభుఁడు; పరమప్రీతః = మిక్కిలియు నధికముగా సంతసించినవాఁడు; బభూవ = ఆయెను. పునఃపునః = మాటిమాటికిని; హర్షం = సంతోషమును; లేభే = పొందెను.

వాయుబాధచే విడువఁబడినతనకొమార్తెలంజూచి, యాకుశనాభమహారాజు, మిక్కిలిసంతసించెను; మఱియు, మాటిమాటికిని, సంతోషమునొందుచుండెను.

అని, తాత్పర్యము.

కృతోద్వాహంతు రాజానం బ్రహ్మదత్తం మహీపతిః
సదారం ప్రేషయామాస సోపాధ్యాయగణం తదా. ౨౬

టీక॥ తదా = అప్పుడు; మహీపతిః = భూమికిఁబ్రభువైన కుశనాభుఁడు; కృతోద్వాహం = చేయఁబడిన వివాహము గలవాఁడును; సదారం = భార్యలతోఁగూడినవాఁడును; సోపాధ్యాయగణం = ఋత్విజుల యొక్క సమూహముతోఁ గూడినవాఁడునగు; రాజానం = రాజైన; బ్రహ్మదత్తంతు = బ్రహ్మదత్తుని; ప్రేషయామాస = పంపెను.

అప్పుడు, కుశనాభమహారాజు, వివాహముకాఁగానే, బ్రహ్మదత్త మహారాజును, అతనిభార్యలనుబు త్రిజులనుంగూడఁ, గాంపిల్యా నగరమునకంపెను. అని, తాత్పర్యము.

సోమదాపి సుసంహృష్టా పుత్రస్య సదృశీం క్రియామ్
యథాన్యాయంచ గంధర్వీ స్నుషా స్తాః ప్రత్యనందత. ౨౬
స్పృష్ట్వాస్పృష్ట్వా చ తాః కన్యాః కుశనాభం ప్రశస్యచ

టీ॥ గంధర్వీ=గంధర్వస్త్రీయైన; సోమదాపి=సోమదయును; సుసంహృష్టా=మిక్కిలియు సంతసించినదై; తాః=ఆ; కన్యాః=పడుచులను; స్పృష్ట్వాస్పృష్ట్వాచ = తాఁకి తాఁకియు; కుశనాభం= కుశనాభుని; ప్రశస్యచ = కొనియాడియు; పుత్రస్య=కొడుకుయొక్క; సదృశీం=తగిన; క్రియాం=వివాహకార్యమును; తాః=ఆ; స్నుషాః=కోడండ్రను; యథాన్యాయం=న్యాయము నతిక్రమింపక; ప్రత్యనందత=కొనియాడెను.

గంధర్వస్త్రీయైన సోమదయును సంతోషంబున, నాపడుచులను దాఁకిదాఁకికుశనాభునిఁబ్రశంసింపుచు, తనకొడుకున కనురూపమైనవివాహమును దనకోడండ్రినుంజాల నభినందించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, త్రయస్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండత్రయస్త్రింశసర్గటీక,
ముగిసినది.

---

౩౭

చ తు స్త్రిం శ స ర్గ ప్రా రం భః.

కృతోద్వాహే గతే తస్మిన్ బ్రహ్మదత్తేచ రాఘవ
అపుత్రః పుత్ర లాభాయ పౌత్రీ మిష్టి మ కల్పయత్. ౧

టీక॥ రాఘవ=రాముఁడా! కృతోద్వాహే=చేయఁబడిన వివాహముగల; తస్మిన్ = ఆ; బ్రహ్మదత్తే=బ్రహ్మదత్తుఁడు; గతేచ=పోఁగానే; అపుత్రః=కొడుకులులేని; కుశనాభః (అధ్యాహృతము)= కుశనాభుఁడు; పుత్రలాభార్థం, పుత్ర=కొడుకుయొక్క, లాభార్థం=పొందుటకొఱకు; పౌత్రీం=కొడుకు కొఱకుఁ జేయఁబడునట్టి, కొడుకు నిచ్చునట్టియనుట; ఇష్టిం = పుత్రకామేష్టిని; అకల్పయత్ = చేసెను.

రాముఁడా! వివాహము చేసికొని బ్రహ్మదత్తుఁడుపోఁగానే, కుశనాభుఁడు, తనకుకొడుకు లేకుండుటంజేసి, కొడుకుగల్గుటకై, పుత్రప్రదంబగు పుత్రకామేష్టిని జేసెను, అని, తాత్పర్యము.

ఇష్ట్యాంతు వ ర్తమానాయాం కుశనాభం మహీపతిమ్
ఉవాచ పరమోదారః కుశో బ్రహ్మ సుత స్తదా. ౨

టీక॥ ఇష్ట్యాం=పుత్రకామేష్టి; వర్తమానాయాంతు= జరుగుచుండఁగానే; తదా= అప్పుడు; పరమోదారః=మిక్కిలియతిశయించినవాఁడును; బ్రహ్మసుతః=బ్రహ్మదేవునికొడుకునగు; కుశః=కుశనాభునితండ్రియైన, కుశుఁడు; మహీపతిం= భూమికిఁబ్రభువైన; కుశనాభం=కుశనాభునిగూర్చి; ఉవాచ=పలికెను.

పుత్రకామేష్టి జరుగు చుండఁగా, నప్పుడు, అందఱను మించియుండు బ్రహ్మపుత్రుండైన కుశుఁడు, తనకొడుకైన కుశనాభమహా

రాజుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పుత్ర స్తే సదృశః పుత్ర భవిష్యతి సుధార్మికః
గాధిం ప్రాప్స్యసి తేన త్వం కీర్తిం లోకేచ శాశ్వతీమ్. ౩

టీక॥ పుత్ర=కొడుకా! సుధార్మికః=మిక్కిలియు ధర్మమాచరించువాఁడును; తే=నీకు; సదృశః=సమానుఁడునగు; పుత్రః=కొడుకు; తే(అధ్యాహృతము) = నీకు; భవిష్యతి=కాఁగలఁడు; త్వం=నీవు; గాధిం = గాధియనుపేరుగలకొడుకును; ప్రాప్స్యసి=పొందఁగలవు. తేన=ఆ గాధిచేత; లోకే = ప్రపంచమందు; శాశ్వతీం=ఎల్లప్పుడునుండునట్టి, స్థిరమైనయనుట; కీర్తిం చ=కీర్తిని; ప్రాప్స్యసి (అధ్యాహృతము)=పొందఁగలవు.

పుత్రుఁడా! మిక్కిలియు ధార్మికుండును, గుణములచే నీకుసరివచ్చువాఁడునగు పుత్రుఁడు నీకుఁగల్గును; అతనిపేరు "గాధి" యనంబడును; అతనిచే, నీవు, శాశ్వతంబగుయశంబునుం బొందఁగలవు. అని, కుశుఁడు చెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా కుశో రామ కుశనాభం మహీపతిమ్
జగా మాకాశ మావిశ్య బ్రహ్మలోకం సనాతనమ్. ౪

టీక॥ ఏవం = ఇట్లు; మహీపతిం=భూమికిఁబ్రభువైన; కుశనాభం = కుశనాభునిఁ గూర్చి; ఉక్త్వా=చెప్పి; కుశః=కుశుఁడు; ఆకాశం=ఆకాశమును; ఆవిశ్య=పొంది; సనాతనం = శాశ్వతమగు; బ్రహ్మలోకం=బ్రహ్మలోకమును; జగామ=పొందెను.

ఈప్రకారము, కుశనాభమహారాజుతోఁ జెప్పి, కుశుం, డాకాశమార్గంబున, శాశ్వతమగుబ్రహ్మలోకమునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

కస్యచి త్త్వథ కాలస్య కుశనాభస్య ధీమతః
జజ్ఞే పరమ ధర్మిష్ఠో గాధి రిత్యేవ నామతః. ౫

టీక॥ అథ = పిమ్మట; కస్యచిత్=ఒకానొక; కాలస్యతు=కాలముకాఁగానే; ధీమతః=బుద్ధిమంతుఁడైన; కుశనాభస్య=కుశనాభునకు; పరమధర్మిష్ఠః=మిక్కిలిధార్మికుఁడైన; నామతః = పేరుచే; గాధిరిత్యేవ = గాధియనియే ప్రసిద్ధుఁడగు ; పుత్రః (అధ్యాహృతము)=కొడుకు; జజ్ఞే=పుట్టెను.

అంతట, కొంత కాలముకడచినపిదప, బుద్ధిమంతుఁడగు కుశనాభునకు, కుశుఁడుచెప్పినట్లు, గాధియనియే పేరుగల్గిన, పరమధార్మికుండగునొక కొడుకు, పుట్టెను.

అని, తాత్పర్యము.

స పితా మమ కాకుత్స్థ గాధిః పరమ ధార్మికః
కుశవంశ ప్రసూతోఽస్మి కౌశికో రఘునందన. ౬

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! పరమధార్మికః=మిక్కిలియు ధర్మముసేయునట్టి; సః=ఆ; గాధిః=గాధి; మమ=నాయొక్క; పితా=తండ్రి. రఘునందన=రాముఁడా! కుశవంశప్రసూతః = కుశునివంశమునందుబుట్టినవాఁడను ; అస్మి= అగుచున్నాను. (కాఁబట్టి); అహం (అధ్యాహృతము)= నేను; కౌశికః = కౌశికుఁడను పేరుగలవాఁడను (కుశవంశమునందుఁబుట్టినవాఁడు, కౌశికుఁడనంబడును).

రాముఁడా! పరమధార్మికుండగునాగాధికి నేనుబుట్టితిని; ఇట్లు, కుశవంశమునఁబుట్టితిఁగాఁబట్టి, కౌశికుఁడనైతిని. అని, తాత్పర్యము.

పూర్వజా భగినీచాపి మమ రాఘవ సువ్రతా
నామ్నా సత్య వతీ నామ ఋచికే ప్రతిపాదితా. ౭

రాఘవ= రాముఁడా ! సువ్రతా = మంచివ్రతములుగలదియు; నామ్నా= పేరుచేత; సత్యవతీనామ = సత్యవతియనిప్రసిద్ధమైనది యనగు; మమ=నాయొక్క; పూర్వజా= ముందుపుట్టిన; జ్యేష్ఠయనుట; భగినీచాపి= తోడఁబుట్టువును; అక్కయనుట, ఋచికే= (చతుర్థ్యర్థమందుసప్తమి)ఋచికుఁడనుమునికొఱకు; ప్రతిపాదితా= ఇయ్యఁబడినది

రాముఁడా!మంచివ్రతములాచరించిన నాయక్క సత్యవతియనునదిఋచికుండను ఋషికిఁ బెండ్లియైనది. అని, తాత్పర్యము.

సశరీరా గతా స్వర్గం భర్తార మను వర్తినీ
కౌశికీ పరమోదారా ప్రవృత్తాచ మహానదీ. ౮

టీక॥ సా (అధ్యాహృతము)= ఆసత్యవతి; భర్తారం= పెనిమిటిని; అనువర్తినీ=సేవించుచున్నదై; సశరీరా = దేహముతోఁగూడినదిగా; స్వర్గం = స్వర్గమును; గతా=పొందినది. పరమోదారా= మిక్కిలియతిశయించిన; కౌశికీ=కౌశికియను; మహానదీచ = గొప్పనదిగాను; ప్రవృత్తా=అయినది.

ఆసత్యవతి, భర్తను సేవించుచుండి, శరీరంబుతోస్వర్గమునొందినది; మఱియు, నాబిడ, పరమోత్కృష్టంబైన కౌశికియనుమహానదిగాఁ, బ్రవహించినది.

అని, తాత్పర్యము.

దివ్యా పుణ్యోదకా రమ్యా హిమవంత ముపాశ్రితా
లోకస్య హితకామార్థం ప్రవృత్తా భగినీమమ. ౯

టీక॥ మమ=నాయొక్క; భగినీ=అక్క; లోకస్య= లోకముయొక్క; హితకామార్థం, హిత=ఆముష్మికముకొఱకును, కామార్థం= ఐహికముకొఱకును; దివ్యా=శ్రేష్ఠమైనదిగా; పుణ్యోదకా= పరిశుద్ధ

మైనజలముగలదిగా; రమ్యా=మనోహరమైనదిగా; హిమవంతం=హిమవత్పర్వతమును; ఉపాశ్రితా = పొందినదిగా; ప్రవృత్తా=అయినది.

నాభగిని, లోకమునకై హికాముష్మికంబులు సిద్ధించుటకై, దివ్యయుఁ బరిశుద్ధంబగు జలముగల్గినదియు రమణీయయును నగునదియై హిమవత్పర్వతమునాశ్రయించినది. అని, తాత్పర్యము.

తతోఽహం హిమవత్పార్శ్వే వసామి నిరత స్సుఖమ్
భగిన్యాం స్నేహసంయుక్తః కౌశిక్యాం రఘునందన. ౧౦

టీక॥ రఘునందన = రాముఁడా! తతః=అందువలన; అహం=నేను; భగిన్యాం = అక్కయైన, కౌశిక్యాం= కౌశికీనదియందు; స్నేహసంయుక్తః=స్నేహముతోఁగూడినవాఁడనై; నిరతః=మిక్కిలియాసక్తుఁడనై; సుఖం = సుఖముగా; హిమవత్పార్శ్వే = హిమవత్పర్వతముయొక్క పార్శ్వమందు; వసామి=వాసము సేయుచున్నాను.

రాముఁడా! కాఁబట్టి, నేను, భగినియగు కౌశికీనదియందలి స్నేహంబున, మిక్కిలియాసక్తితో, సుఖముగా, హిమవత్పర్వతము దగ్గఱ కౌశికీతీరంబున, వాసము సేయుచున్నాను. అని, తాత్పర్యము.

సాతు సత్యవతీ పుణ్యా సత్యే ధర్మే ప్రతిష్ఠితా
పతివ్రతా మహాభాగా కౌశికీ సరితాం వరా. ౧౧

టీక॥ సా=ఆ; సత్యవతీ=సత్యవతి; పుణ్యా = పరిశుద్ధమైనదిగాను; సత్యే=సత్యమందును; ధర్మే=ధర్మమందును; ప్రతిష్ఠితా = స్థిరముగానుండునదిగాను, పతివ్రతా=పెనిమిటియందలి వ్రతముగలదిగాను; మహాభాగా = పూజ్యురాలుగాను; కౌశికీ=కౌశికియనుపేరుగల్గినదిగాను; సరితాం=నదులలో; వరా=శ్రేష్ఠమైనదిగాను; వర్తతే

(అధ్యాహృతము)=ఉన్నది.

ఆసత్యవతి, పరిశుద్ధమైనది; సత్త్యము ధర్మమునుంగలది; పతివ్రత; పూజ్యమైనది; నదులలో మేటియై, కౌశికియను పేరొందినది.

అని, తాత్పర్యము.

అహంహి నియమా ద్రామ హిత్వా తాం స ముపాగతః
సిద్ధాశ్రమ మనుప్రాప్య సిద్ధోస్మి తవ తేజసా. ౧౨

టీక॥ రామ = రాముఁడా! అహం=నేను; నియమాత్ =యాగనియమమువలన; తాం=ఆకౌశికిని; హిత్వా=విడిచి; సముపాగతః=వచ్చినవాఁడనై; సిద్ధాశ్రమం=సిద్ధాశ్రమమును; అనుప్రాప్య=పొంది; తవ=నీయొక్క; తేజసా=పరాక్రమముచేత; సిద్ధః= సిద్ధినొందినవాఁడను; అస్మిహి = అయితినిగదా.

రాముఁడా! నేను, యాగముసేయుటకై, యాకౌశికీనదిని విడిచి వచ్చి, సిద్ధాశ్రమముచేరి, యచ్చట, నీపరాక్రమంబుచే సిద్ధుండనైతిని. అని, తాత్పర్యము.

ఏష రామ మమోత్పత్తి స్స్వస్య వంశస్య కీర్తితా
దేశస్యచ మహాబాహో యన్మాం త్వం పరిపృచ్ఛసి. ౧౩

టీక॥ మహాబాహో= గొప్పచేతులుగల; రామ = రాముఁడా! త్వం=నీవు; మాం = నన్ను; యత్ = దేనిని; పరిపృచ్ఛసి= అడుగుచున్నావో; సా(అధ్యాహృతము)=ఆ; ఏషా =ఈ; మమ=నాయొక్కయు; స్వస్య=నాదైన; వంశస్య=వంశముయొక్కయు; దేశస్యచ=దేశముయొక్కయు; ఉత్పత్తిః=పుట్టుక; కీర్తితా = చెప్పఁబడినది.

మహా బాహుండవగు రాముఁడా! నీవునన్ను దేనిం జెప్పుమనియడిగితివో; ఆ, నాయుత్పత్తిని నావంశోత్పత్తిని, ఈదేశమునుత్పత్తిని, దాని నంతయు, నీకుఁజెప్పితిని.

అని, తాత్పర్యము.

గతో ర్ధరాత్రః కాకుత్స్థ కథాః కథయతో మమ
నిద్రా మభ్యేహి భద్రం తే మాభూ ద్విఘ్నో ధ్వనీహ నః. ౧౪

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! మమ=నేను; కథాః=కతలను; కథయతః=చెప్పుచుండఁగా; అర్ధరాత్రః=కొంచెమురాత్రి; గతః=కడచినది. నిద్రాం=నిదురను; అభ్యేహి=పొందుము. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక. నః=మాకు; ఇహ=ఇచ్చటః అధ్వని=మార్గమునందు; విఘ్నః=అంతరాయము; మాభూత్=లేక పోవుఁగాక.

రాముఁడా! నేనిట్లుకథలు చెప్పుచుండఁగా రాత్రిలోఁగొంత సేపైనది; ఇంకనిదురింపుము; నీకు మంగళమగుఁగాక; మాకిచ్చోమార్గమునం దంతరాయముగల్గకుండుఁగాక. అని, తాత్పర్యము.

నిష్పందా స్తరవ స్సర్వే నిలీనా మృగపక్షిణః
నై శేన తమసా వ్యాప్తా దిశశ్చ రఘునందన. ౧౫

టీక॥ రఘునందన=రాముఁడా! తరవః=వృక్షములు; సర్వే=అన్నియును; నిష్పందాః=కదలకున్నవి. మృగపక్షిణః=జింకలును బత్తులును; నిలీనాః=మఱుఁగుపడినవి. దిశశ్చ=దిక్కులును; నైశేన=రాత్రియందలి; తమసా=చీఁకటిచేత; వ్యాప్తాః=వ్యాపింపఁబడినవి.

రాముఁడా! వృక్షము లన్నియుఁ, బక్షిసంచారములేకుండుటం జేసి, కదలకున్నవి; మృగములునుబక్షులునుసంచారముమానినిదురించినవి; దిక్కులన్నియుఁ జీఁకట్లుగ్రమ్మినవి అని, తాత్పర్యము.

శనై ర్వియుజ్యతే సంధ్యా నభో నేత్రై రివా వృతమ్
నక్షత్రతారాగహనం జ్యోతిర్భి రవభాస్యతే. ౧౬

(“జ్యోతిర్భిరవభాసతే” అనిగోవిందరాజపాఠము.)

టీక॥ సంధ్యా= సంధ్యాకాలము;శనైః=మెల్లగా;వియుజ్యతే=(ఘూ తార్థమందులట్) విడువఁబడుచున్నది(రాత్రిచేతననుట); నక్షత్రతారాగహనం,నక్షత్ర=సాధారణనక్షత్రములచేతను, తారా=అశ్విన్యాది నక్షత్రములచేతను, గహనం=దట్టమైనది,గనుక నేత్రైః=కండ్లచేత; ఆవృతమివ(స్థితం)=కప్పఁబడినట్లున్నట్టి;నభః = ఆకాశము; జ్యోతిర్భిః = నక్షత్రములయొక్క, కాంతులచేత;అవభాస్యతే=ప్రకాశింపఁజేయఁబడుచున్నది.

సంధ్యాకాలము, మెల్లగాఁగడచినది; ఆకాశము, నక్షత్రములచే నిండియుండుటంబట్టి, అనేక నేత్రములంగూడియున్నట్లగు పడుచున్నదై, యానక్షత్ర కాంతులచేఁ, ప్రకాశింపఁజేయఁబడుచున్నది అని, తాత్పర్యము. ఇట్లు, మహేశ్వరతీర్థులు వ్యాఖ్యానము చేసిరి.

నక్షత్ర తారాగహనం= సాధారణ నక్షత్రములచేతను అశ్విన్యాది నక్షత్రములచేతను దట్టమైన; నభః = ఆకాశము; జ్యోతిర్భిః=కాంతిరూపములైన (కాంతిగలిగినయనుట); నేత్రైః= కండ్లచేత; ఆవృతమివ=కప్పఁబడినదివలె; అవభాసతే = ప్రకాశించుచున్నది.

రాత్రిమెల్లగాఁ గడచినది; ఆకాశము, నక్షత్రములచే నిండినదై, జ్యోతిష్మంతములగు నేత్రములచే నిండియున్నట్లు, ప్రకాశించుచున్నది. అని, తాత్పర్యము.

ఇట్లు, గోవిందరాజులువచించిరి.

ఉత్తిష్ఠతి చ శీతాంశుశ్శశీ లోకతమోనుదః
హ్లాదయన్ ప్రాణినాం లోకే మనాంసి ప్రభయా విభో. ౧౭

టీక॥ విభో=ప్రభువైనరాముఁడా!శీతాంశుః=చల్లనికిరణములుగలవాఁడును; లోకతమోనుదః,లోక=ప్రపంచముయొక్క,తమః=చీఁ

కటిని, నుదః = పోఁగొట్టువాఁడున గు; శశీచ = చంద్రుఁడును; లోకే = లోకమునందు; ప్రభయా = కాంతిచేత; ప్రాణినాం = జంతువులయొక్క; మనాంసి = మనస్సులను; హ్లాదయన్ = సంతసింపఁజేయుచు; ఉత్తిష్ఠతి = ఉదయించుచున్నాఁడు.

రాముఁడా! చల్లనికిరణములుగల్గి లోకంబునందలి చీఁకటింబోఁగొట్టుచంద్రుఁడును, లోకమునందు, సమస్త ప్రాణులమనంబులకునుసంతసము సేయుచు, నుదయించు చున్నాఁడు. అని, తాత్పర్యము.

నైశాని సర్వభూతాని ప్రచరంతి తతస్తతః
యక్షరాక్షససంఘాశ్చ రౌద్రాశ్చ పిశితాశనాః. ౧౭

టీక॥ నైశాని = రాత్రియందుఁ జరించునట్టి; సర్వభూతాని = సమస్తప్రాణులును; రౌద్రాః = భయంకరులును; పిశితాశనాశ్చ = మాంసమె యాహారముగాఁ గలవియగు; యక్షరాక్షససంఘాశ్చ = యక్షులయొక్కయు రాక్షసులయొక్కయు సమూహములును; తతస్తతః = అచ్చటచ్చట; ప్రచరంతి = తిరుగుచున్నవి.

రాత్రి యందుసంచరించునట్టిగుడ్లగూబలు మొదలగు జంతువులును, భయంకరులై మాంసమెయాహారముగాఁగల్గి యుండుయక్షులును రాక్షసులును, అచ్చటచ్చట, సంచరించుచున్నారు. అని, విశ్వామిత్రుఁడు రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజా విరరామ మహామునిః
సాధు సాధ్వితి తం సర్వే మునయో హ్యభ్యపూజయన్. ౧౮

టీక॥ ఏవం = ఇట్లు; ఉక్త్వా = చెప్పి; మహాతేజాః = అధికమైనప్రభావముగల; మహామునిః = పూజ్యుఁడైనమునియగు విశ్వామిత్రుఁడు; విర

రామ=ఊరకుండెను. మునయః= మునులు; సర్వే=అందఱును;తం= ఆవిశ్వామిత్రుని; సాధుసాధు=బాగుబాగు;ఇతి = అని;అభ్యపూజయన్ హి=కొనియాడిరిగదా!

ఈప్రకారముచెప్పి,మహాప్రభావుండగు విశ్వామిత్ర మహాముని, యూరకుండెను; అంత, మునులందఱు, నావిశ్వామిత్రుని, "బాగుబాగు"అనికొనియాడిరి.

అని, తాత్పర్యము.

కుశికానా మయం వంశో మహాన్ ధర్మపర స్తదా
బ్రహ్మోపమా మహాత్మానః కుశవంశ్యా నరోత్తమాః.౨౦

టీక॥ కుశికానాం=కుశునిసంతతియందుఁబుట్టిన వారియొక్క; అయం = ఈ;వంశః=వంశము;సదా=ఎల్లప్పుడును; మహాన్=పూజ్యమైనది; ధర్మపరః=ధర్మమునందాసక్తమైనది· కుశవంశ్యాః = కుశునివంశంబునఁబుట్టిన; నరోత్తమాః=పురుషశ్రేష్ఠులు; మహాత్మానః=పూజ్యమైనస్వభావముగలవారలు.బ్రహ్మోపమాః=బ్రహ్మదేవునితోసమానులు.

కుశికులవంశము, ఎల్లప్పుడును బూజ్యమును ధర్మిష్ఠమునునైనది; కుశునివంశంబునంబుట్టినపురుషశ్రేష్ఠులందఱు,మహాత్ములు, బ్రహ్మదేవునకుసరివచ్చువారలు.

అని, తాత్పర్యము.

విశేషేణ భవా నేవ విశ్వామిత్రో మహాయశాః
కౌశికీ సరితాం శ్రేష్ఠా కులోద్యోతకరీ తవ. ౨౧

టీక॥ విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడనుపేరుగల; భవా నేవ = నీవే; విశేషేణ=ఆధిక్యముచేత;మహాయశాః= అధికమైనకీర్తిగలవాఁడవు.సరితాం = నదులలో; శ్రేష్ఠా=మేటియైన;కౌశికీ=కౌశికీనది;

తవ = నీయొక్క; కులోద్యోత కరీ, కుల=వంశమునకు; ఉద్యోత=ప్రకాశమును, కరీ = చేయునది.

అందు, విశ్వామిత్రుండను పేరంబరఁగు నీవే యందఱికన్నను, అధికమైనకీర్తి గలవాఁడవు; నదీశ్రేష్ఠమగు కౌశికి నీకులమును మఱియుం బ్రకాశింపఁ జేయుచున్నది. అని, మునులువిశ్వామిత్రునిం గొనియాడిరి. అని, తాత్పర్యము.

ఇతి తై ర్మునిశార్దూలైః ప్రశస్తః కుశికాత్మజః
నిద్రా ముపాగమ చ్ఛ్రీమాన్ శ్రీమాన స్త మివాంశువాన్. ౨౨

టీక॥ శ్రీమాన్=బ్రహ్మవర్చసముగల;కుశికాత్మజః = విశ్వామిత్రుఁడు; ఇతి=ఈప్రకారము;తైః= ఆ; మునిశార్దూలైః=మునిశ్రేష్ఠులచేత;ప్రశస్తః=కొనియాడఁబడినవాఁడై,నిద్రాం=నిదురను;అస్తం= కనఁబడకపోవుటను; శ్రీమాన్ = కాంతిగల; అంశుమానివ=సూర్యునివలె;ఉపాగమత్=పొందెను.

శ్రీమంతుండగువిశ్వామిత్రుం,డిట్లుమునిశ్రేష్ఠులచేఁ గొనియాడంబడి,శ్రీమంతుండగుసూర్యుఁడస్తమించునట్లు, నిదురవోయెను.

అని, తాత్పర్యము.

రామోపి సహసౌమిత్రిః కించి దాగత విస్మయః
ప్రశస్య మునిశార్దూలం నిద్రాం సముపసేవతే. ౨౩

టీక॥ సహసౌమిత్రిః= లక్ష్మణునితోఁగూడిన; రామోపి=రాముఁడును; కించిత్=కొంచెము;ఆగతవిస్మయః, ఆగత=పొందఁబడిన, విస్మయః=ఆశ్చర్యముగలవాఁడై,మునిశార్దూలం=మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుని; ప్రశస్య=స్తుతించి; నిద్రాం=నిదురను; సముపసేవతే=(భూతార్థమందులట్) చక్కఁగాఁ బొందెను.

రాముండును లక్ష్మణుండును, నిద్రాపరవశులగుటంజేసి, కొంచెముగానాశ్చర్యమునొంది; మార్గాయాసంబునబడలియున్నవారు కావున, జక్కగానిదురించిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, చతుస్త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండచతుస్త్రింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

పంచత్రింశసర్గప్రారంభః.

ఉపాస్య రాత్రిశేషం తు శోణాకూలే మహర్షిభిః
నిశాయాం సుప్రభాతాయాం విశ్వామిత్రో భ్యభాషత. ౧

టీక॥ విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; శోణాకూలే=శోణనదిగట్టునందు;మహర్షిభిః= పూజ్యులైన ఋషులతో; రాత్రిశేషంతు=(అత్యంతసంయోగమందు ద్వితీయ)మిగిలినరాత్రియంతయు; ఉపాస్య= ఉండి,పరుండియనుట;నిశాయాం=రాత్రి; సుప్రభాతాయాం=చక్కగాఁదెల్లవాఱఁగా;అభ్యభాషత= పలికెను.

విశ్వామిత్రుఁడు,మిగిలినరాత్రికాలమంతయు,శోణానది గట్టునందు, మహర్షులతోఁగూడఁ,బరుండియుండి, తెల్లవాఱఁగానె, యి

ట్లని. చెప్పెను. అని, తాత్పర్యము.

సుప్రభాతా నిశా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే గమనాయా భి రోచయ. ౨

టీక॥ రామ = రాముఁడా! నిశా=రాత్రి; సుప్రభాతా=చక్కగాఁదెల్లవాఱినది. పూర్వా=మొదలిదైన; సంధ్యా = సంధ్యాకాలము; ప్రవర్తతే=వచ్చుచున్నది. ఉత్తిష్ఠ, ఉత్తిష్ఠ = లెమ్ము, లెమ్ము; తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక; గమనాయ=పోవుటకొఱకు; అభిరోచయ=ఆసక్తుఁడవగుము.

రాముఁడా! చక్కగా తెల్లవాఱినది; ప్రాతస్సంధ్యాకాలము, ప్రవర్తించుచున్నది; లెమ్ము, లెమ్ము; నీకుమంగళమగుఁగాక; పయనంబగుటకాసక్తుఁడవగుము. అని, విశ్వామిత్రుఁడు, చెప్పెను.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా వచనం తస్య కృత్వా పౌర్వాహ్ణికీం క్రియామ్
గమనం రోచయామాస వాక్యం చేద ముపాచహ. ౩

టీక ॥ రామః (అధ్యాహృతము)=రాముఁడు; తస్య=ఆవిశ్వామిత్రునియొక్క; తత్ = ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; పౌర్వాహ్ణికీం= పూర్వాహ్ణమందుఁ జేయవలసిన; క్రియాం=కర్మము ను; కృత్వా=చేసి; గమనం=పోవుటను; రోచయామాస=ఒప్పుకొనెను; ఇదం = ఈ; వాక్యం చ=మాటను; ఉవాచ=చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

రాముండా, విశ్వామిత్రునిమాటవిని, పూర్వాహ్ణమందుఁజేయవలసిన కర్మంబులం జేసి, పయనము



కాఁదలంచినవాఁడై, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అయం శోణ శ్శుభజలో గాధః పులినమండితః
కతరేణ పథా బ్రహ్మన్ సంతరిష్యామహే వయమ్. ౪

టీక॥ అయం=ఈ; శోణః=శోణనదము; శుభజలః= మంగళకరమైనజలముగలది; గాధః=లోతులేనిది; పులినమండితః=ఇసుకదిన్నెలచేనలంకరింపఁబడినది. బ్రహ్మన్= బ్రాహ్మణుఁడవైన విశ్వామిత్రుఁడా! వయం=మనము; కతరేణ=ఏ; పథా = మార్గముచేత; సంతరిష్యామహే= దాఁటుదము.

ఈశోణనదము, మంచిజలముగలది, లోతులేనిది, ఇసుకదిన్నెలచేనలంకరింపఁబడియున్నది; విశ్వామిత్రుఁడా! మనముదీని నేమార్గమున దాఁటుదము. అని, రాముఁడు చెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ విశ్వామిత్రో బ్రవీ దిదమ్
ఏష పంథా మయో ద్దిష్టో యేన యాంతి మహర్షయః. ౫

టీక॥ విశ్వామిత్రస్తు=విశ్వామిత్రుఁడును; రామేణ = రామునిచేత; ఏవం=ఇట్లు, ఉక్తః=చెప్పఁబడినవాఁడై; "మహర్షయః=పూజ్యులైనఋషులు; యేన=ఏమార్గముచేత; యాంతి=పోవుచున్నారో, సః(అధ్యాహృతము)=ఆ; ఏషః= ఈ; పంథాః=మార్గము; మయా= నాచేత; ఉద్దిష్టః=ఉద్దేశింపఁబడినది." ఇదం = ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

ఈప్రకారము రాముఁడు చెప్పఁగానే, విశ్వామిత్రుఁడు "ఏమార్గంబున మునులు పోవుచున్నారో, యామార్గంబున దాఁటవలెనని, నాయభిప్రాయము" అని, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.




శ్లో. ఏవముక్తా మహర్షయో విశ్వామిత్రేణ ధీమతా
పశ్యంత స్తే ప్రయాతా వై వనాని వివిధానిచ. ౬

టీక॥ తే=ఆ; మహర్షయః=పూజ్యులైనఋషులు;ధీమతా=బుద్ధిశాలియైన;విశ్వామిత్రేణ=విశ్వామిత్రునిచేత;ఏవం = ఈప్రకారము;ఉక్తాః=చెప్పఁబడినవారలై;వివిధాని=పలుతెఱంగులైన; వనాని = అరణ్యములను;పశ్యంతశ్చ=చూచుచును; ప్రయాతాః=పోయిరి. "వై" అనునది పాదపూరణార్థము.

ఈప్రకారము విశ్వామిత్రుఁడు చెప్పఁగానే, యామహర్షులు, నానావిధంబులగునరణ్యంబులంజూచుచుఁ,బోయిరి. అని, తాత్పర్యము.

తే గత్వా దూర మధ్వానం గతే ఽర్ధదివసే తదా
జాహ్నవీం సరితాం శ్రేష్ఠాం దదృశు ర్మునిసేవితామ్. ౭

టీక॥ తే=ఆమునులు;దూరం=దూరమైన; అధ్వానం= మార్గమును; గత్వా=పోంది; అర్ధదివసే=సగముదివసము; గతే=కడచినదికాఁగా;తదా=అప్పుడు; మునిసేవితాం=మునులచే సేవింపఁబడినదియు;సరితాం =నదులలో; శ్రేష్ఠాం=మేటియునగు;జాహ్నవీం=గంగను;దదృశుః=చూచిరి.

ఆమునులుచాలదూరము పోయి సగముదినముగడచినపిదప, మునులచే సేవింపఁబడినదై,నదులలో శ్రేష్ఠమైయుండుగంగానదిం, జూచిరి అని, తాత్పర్యము.

తాం దృష్ట్వా పుణ్యసలిలాం హంససారససేవితామ్
బభూవు ర్ముదితా స్సర్వే మునయ స్సహ రాఘవాః. ౮

టీక ॥ పుణ్యసలిలాం=పవిత్రమైనజలముగలదియును; హంససారస

సేవితాం = హంసలచేతను బెగ్గురు పక్షులచేతను సేవింపఁ బడినదియు నగు; తాం= ఆగంగానదిని; దృష్ట్వా=చూచి;సహ రాఘవాః=రామ లక్ష్మణులతోఁ గూడిన; మునయః=మునులు;సర్వే=అందఱును; ముదితాః= సంతసించినవారలు; బభూవుః=అయిరి.

పవిత్రంబైనజలముగల్గిహంసలను బెగ్గురు పక్షులనుంగూడియున్న యాగంగానదింజూచి, మునులు రామలక్ష్మణులు నందఱును, సంతసించిరి. అని, తాత్పర్యము.

తస్యా స్తీరే తత శ్చక్రు స్త ఆవాసపరిగ్రహమ్

టీక॥తతః=అటుపిమ్మట; తే= ఆమునులు;తస్యాః = ఆగంగానది యొక్క;తీరే=గట్టునందు; ఆవాసపరిగ్రహం, ఆవాస= నివసించుట యొక్క, పరిగ్రహం=చక్కఁగాఁగ్రహించుటను;చక్రుః=చేసిరి.

అంతట,నామునులు, ఆగంగానదిగట్టునందు, నివాసము గావించిరి. అని,తాత్పర్యము.

తత స్స్నాత్వా యథాన్యాయం సంతర్ప్య పితృదేవతాః. ౫
హుత్వా చైవాగ్నిహోత్రాణి ప్రాశ్యచామృతవ ద్ధవిః
వివిశు ర్జాహ్నవీతీరే శుచౌ ముదితమానసాః. ౧౦
విశ్వామిత్రం మహాత్మానం పరివార్య సమం తతః. ;అబ్రవీ

టీక॥ తతః=అంతట; తే (అధ్యాహృతము)=ఆమునులు; స్నాత్వా=స్నానముచేసి; యథాన్యాయం=యథాశాస్త్రముగా, పితృదేవతాః = పితృదేవతలను; సంతర్ప్య=చక్కఁగాఁదృప్తి నొందించి; అగ్నిహోత్రాణి=అగ్నిహోత్రములను; హుత్వాచైవ = హోమముచేసియు; అమృతవత్=అమృతమువంటి; హవిః=హవిస్సును;ప్రాశ్యచ=భుజించియు; ముదితమానసాః=సంతసించినమనస్సుగలవార

లై; శుచౌ=పరిశుద్ధమైన; జాహ్నవీతీరే= గంగానదిగట్టునందు; మహాత్మానం = అధికమైనప్రభావము గల; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; సమంతతః=చుట్టును; పరివార్య=చుట్టుకొని; వివిశుః=కూర్చుండిరి.

అంత, నామునులు, స్నానము చేసి, యథాశాస్త్రముగాఁ బితృతర్పణము చేసి, వైశ్వదేవము మొదలగు నగ్నిహోత్రికార్యములు నిర్వర్తించి, హోమము సేయఁగా మిగిలిన యమృతమువంటి హవిస్సునుభుజించి, సంతుష్టులై, పరిశుద్ధంబగు గంగానదిగట్టునందు, మహాత్ముండగు విశ్వామిత్రునిఁ జుట్టునుం బరివేష్టించి, కూర్చుండిరి.

అని, తాత్పర్యము.

అథ తత్ర తదా రామో విశ్వామిత్ర మథా బ్రవీత్. ౧౧

టీక॥ అథ = అటుపిమ్మట; తత్ర=అచ్చట; తదా=అప్పుడు; రామః= రాముఁడు; విశ్వామిత్రం=విశ్వామిత్రునిఁగూర్చి; అథ=ప్రశ్నమును ("మంగళానంతరారంభప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ" అనియమరము); అబ్రవీత్=పలికెను.

అంత, నచ్చట, నప్పుడారాముఁడు విశ్వామిత్రునింజూచి, యిట్లని, యడిగెను. అని, తాత్పర్యము.

భగవ ఞ్ఛ్రోతు మిచ్ఛామి గంగాం త్రిపథగాం నదీమ్
త్రైలోక్యం కథ మాక్రమ్య గతా నదనదీపతిమ్. ౧౨

టీక॥ భగవన్= మాహాత్మ్యశ్రీముగల విశ్వామిత్రుఁడా ! త్రిపథగాం=మూఁడుమార్గములచేఁబోవునట్టి; గంగాం=గంగయనుపేరుగల; నదీం=నదిని; శ్రోతుం= వినుటకు; ఇచ్ఛామి= కోరుచున్నాను. సా(అధ్యాహృతము)=ఆగంగ; కథం=ఎట్లు; త్రైలోక్యం=మూఁడులోకములను; ఆక్రమ్య= ఆక్రమించి; నదనదీపతిం=నదములకునునదు

లకునుం బ్రభువైన సముద్రునిన్; గతా=పొందినది?

భగవంతుఁడవైనవిశ్వామిత్రుఁడా! మూఁడుమార్గములంబోవునట్టి గంగానదివృత్తాంతమును వినఁగోరెదను; గంగానది, యెట్లుముల్లోకంబుల నాక్రమించి, సముద్రునింబొందినదో, దానింజెప్పుము. అని, రాముఁడడిగెను.

అని, తాత్పర్యము.

చోదితో రామవాక్యేన విశ్వామిత్రో మహామునిః
వృద్ధిం జన్మచ గంగాయా వక్తు మే వోపచక్రమే. ౧౩

టీక॥ మహామునిః=పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; రామవాక్యేన=రామునిమాటచేత; చోదితః=ప్రేరేపింపఁబడినవాఁడై; గంగాయాః=గంగానదియొక్క; జన్మ=పుట్టుకను; వృద్ధించ=అభివృద్ధిని;వక్తుమేవ=చెప్పుటకే; ఉపచక్రమే=ప్రారంభించెను.

మహామునియగువిశ్వామిత్రుం, డిట్లురామునిమాటచేఁ బ్రేరేపింపఁబడి, గంగానది యెట్లుపుట్టినదో; యెట్లభివృద్ధిఁబొందినదో, యీవృత్తాంతమంతయుఁ జెప్పందొడంగెను.అని, తాత్పర్యము.

శైలేంద్రో హిమవాన్ నామ ధాతూనా మాకరో మహాన్
తస్య కన్యాద్వయం రామ రూపేణా ప్రతిమం భువి. ౧౪

టీక॥రామ=రాముఁడా! ధాతూనాం=గైరికాదిధాతువులకు; మహాన్=గొప్పదైన;ఆకరః=గనియగు;హిమవాన్ నామ=హిమవంతుడనెడు; శైలేంద్రః=పర్వతరాజు; అస్తి (అధ్యాహృతము)=కలఁడు. తస్య=ఆహిమవంతునకు; భువి=భూమియందు; రూపేణ= సౌందర్యముచేత; అప్రతిమం=సరిలేని;కన్యాద్వయం = కొమార్తెలయొక్క జంట; అస్తి (అధ్యాహృతము)=కలదు.

గైరికాది ధాతువులచే నిండిన హిమవంతుండనెడు పర్వత రాజు కలండు; ఆహిమవంతునకు, రూపంబునభూమియందెచ్చటనుం బ్రతిలేనికొమార్తెలిద్దఱు, కలరు.

అని, తాత్పర్యము.

యా మేరుదుహితా రామ తయో ర్మాతా సుమధ్యమా
నామ్నా మనోరమా నామ పత్నీ హిమవతః ప్రియా. ౧౫

టీక॥ సుమధ్యమా= మంచినడుముగల; యా = ఏది; మేరుదుహితా = మేరుపర్వతముయొక్క కొమార్తెగాను; హిమవతః= హిమవంతునకు; ప్రియా=ప్రీతిపాత్రమైన; పత్నీ=భార్యగాను; నామ్నా= పేరుచేత; మనోరమానామ= మనోరమయనిప్రసిద్ధగాను; ఆసీత్ (అధ్యాహృతము)=అయినదో; సా (అధ్యాహృతము) = అది; తయోః=ఆకొమార్తెలకు; మాతా= తల్లి; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది.

మేరుపర్వతపుత్రియైమంచినడుముగల్గి, హిమవంతునకుంబ్రియపత్నియైయుండు మనోరమయనునది యాయిద్దఱకునుందల్లియైనది.

అని, తాత్పర్యము.

తస్యాంగంగేయ మభవ జ్జ్యేష్ఠా హిమవత స్సుతా
ఉమా నామ ద్వితీయా భూ న్నామ్నా తస్యైవ రాఘవ. ౧౬

టీక॥ రాఘవ=రాముఁడా! తస్యాం = ఆమనోరమయందు; హిమవతః=హిమవంతునకు; గంగా=గంగయనుపేరుగల; ఇయం= ఈ; జ్యేష్ఠా=పెద్దదైన; సుతా=కుమార్తె; అభవత్=కల్గినది. తస్యైవ = ఆహిమవంతునకే; నామ్నా=పేరుచేత; ఉమానామ = ఉమయని ప్రసిద్ధమైన; ద్వితీయా= రెండవకొమార్తె; అభూత్=కల్గినది.

ఆమనోరమయందు, హిమవం

తుస, కీగంగానది జ్యేష్ఠపుత్రిగాc, బుట్టినది; అతనికే రెండవకోమార్తె ఉమయనునది పుట్టినది.

అని, తాత్పర్యము.

అథ జ్యేష్ఠాం సురా స్సర్వే దేవతార్థచికీర్షయా
శైలేంద్రం వరయామాసు ర్గంగాం త్రిపథగాం నదీం. ౧౬

టీక॥ అథ = అటుపిమ్మట; సురాః = దేవతలు; సర్వే = అందఱును; దేవతార్థచికీషణయా, దేవతా = దేవతలైనతమయొక్క, అర్థ = కార్యమును, చికీర్షయా = చేయనిచ్ఛచేత; శైలేంద్రం = పర్వతరాజైన హిమవంతుని; జ్యేష్ఠాం = జ్యేష్ఠపుత్రియును; త్రిపథగాం = మూడు మార్గములం బోవునట్టి; నదీం = నదియునగు; గంగాం = గంగను; వరయామాసుః = కోరిరి.

అంత, దేవతలందఱు, తమకార్యము సిద్ధించుటకై, హిమవంతుని యొద్దకుcబోయి, త్రిపథగ యగు గంగానది, నిమ్మనియడిగిరి.

అని, తాత్పర్యము.

దదౌ ధర్మేణ హిమవా న్తనయాం లోకపావనీమ్
స్వచ్ఛంద పథగాం గంగాం త్రైలోక్య హితకామ్యయా. ౧౭

టీక॥ హిమవాన్ = హిమవంతుడు; త్రైలోక్యహితకామ్యయా, త్రైలోక్య = మూcడులోకముల యొక్క, హిత = మేలునందలి, కామ్యయా = ఇచ్ఛచేత; ధర్మేణ = ధర్మముచేత; లోకపావనీం = లోకంబులc బరిశుద్ధములుగాc జేయునదియును; స్వచ్ఛందపథగాం, స్వచ్ఛంద = స్వేచ్ఛచేcగలిగిన, పథ = మార్గముచే, గాం = పోవునదియును; తనయాం = కొమార్తెయునగు; గంగాం = గంగానదిని; దదౌ = ఇచ్చెను.

హిమవంతుcడు, ముల్లోకంబుల హితంబుగోరి, యాచకులయాశవ్యర్థముసేయcదగదనుధర్మం బవలం

| | |
|---|---|
| బించి, లోకంబులఁ బరిశుద్ధములు గాఁజేయునదియు యథేచ్ఛముగా సంచరించుటకుం జాలినదియునగు | తనకొమార్తెయైనగంగానదిని, దేవతలకిచ్చెను. అని, తాత్పర్యము. |

ప్రతిగృహ్య తతో దేవా స్త్రిలోకహితకారిణః
గంగా మాదాయ తేఽగచ్ఛన్ కృతార్థే నాంతరాత్మనా. ౧౯

| | |
|---|---|
| టీక ॥ త్రిలోకహితకారిణః= మూఁడు లోకములకును మేలుసేయునట్టి; తే=ఆ; దేవాః=దేవతలు; ప్రతిగృహ్య=పుచ్చుకొని; తతః=అటుపిమ్మట; గంగాం=గంగను; ఆదాయ=తీసికొని; కృతార్థేన=నెఱవేఱినపనిగల; అంతరాత్మనా=మనస్సుతో; అగచ్ఛన్=పోయిరి. | ముల్లోకంబులకును హితముసేయునట్టిదేవతలు, హిమవంతుండవ్వాఁగాఁబుచ్చుకొని, గంగందీసికొని, కృతార్థులై, పోయిరి. అని, తాత్పర్యము. |

యా చాన్యా శైలదుహితా కన్యా సీ ద్రఘునందన
ఉగ్రం సా వ్రత మాస్థాయ తప స్తేపే తపోధనా. ౨౦

| | |
|---|---|
| టీక॥ రఘునందన = రాముఁడా! అన్యా=ఇతరమైన; యా=ఏ; శైలదుహితా= హిమవంతునికొమార్తె; కన్యా=పెండ్లిగానిదిగా; ఆసీత్=ఆమెనో; సాచ=ఆయుమయును; తపోధనా=తపస్సేధనముగాఁగలదియై; ఉగ్రం=భయంకరమైన; వ్రతం=నియమమును; ఆస్థాయ=పొంది; తపః=తపస్సును; తేపే=తపించెను, చేసెననుట. | రాముఁడా! పెండ్లిగాకయుండినహిమవంతుని రెండవకూఁతురైనయుమయును తపస్సేధనముగానెంచి, భయంకరమగునియమంబవలంబించి, తపముచేసెను. అని, తాత్పర్యము. |

ఉగ్రేణ తపసా యుక్తాం దదౌ శైలవర స్సుతామ్
రుద్రాయా ప్రతిరూపాయ ఉమాంలోకనమస్కృతామ్. ౨౧

టీక॥ శైలవరః=పర్వతరాజైనహిమవంతుఁడు; ఉగ్రేణ=భయంకరమైన; తపసా=తపస్సుతో; యుక్తాం= కూడినదియును; లోకనమస్కృతాం=లోకంబులచేనమస్కరింపఁబడినదియు; సుతాం = కూఁతురునగు; ఉమాం=ఉమాదేవిని; అప్రతిరూపాయ=సరిలేని రూపముగల; రుద్రాయ=రుద్రునికొఱకు; దదౌ=ఇచ్చెను.

హిమవంతుఁడు, లోకంబులచే నమస్కరింపఁబడినదై, భయంకరమగుతపముసేయుచున్న, తనకూఁతురగు, నుమాదేవిని, సరిలేనిసౌందర్యముగలశివునకొసంగెను.

అని, తాత్పర్యము.

ఏతే తే శైలరాజస్య సుతే లోక నమస్కృతే
గంగాచ సరితాం శ్రేష్ఠా ఉమా దేవీ చ రాఘవ. ౨౨

టీక॥ రాఘవ= రాముఁడా లోకనమస్కృతే= లోకములచేనమస్కరింపఁబడిన; తే = అట్టి; ఏతే=ఈ; సరితాం=నదులలో; శ్రేష్ఠా=మేటియైన; గంగాచ=గంగయును, దేవీ=దేవుఁడగుశివునిభార్యయైన; ఉమాచ=పార్వతియును; శైలరాజస్య = పర్వతరాజైనహిమవంతునియొక్క; సుతే=కూఁతురులు.

రాముఁడా! నదులలోశ్రేష్ఠయైన గంగయును, శివునిభార్యయైన యుమయును, లోకములచే నమస్కరింపఁబడుచున్నట్టి వీరలిర్వురును, హిమవంతునికూఁతురులు.

అని, తాత్పర్యము.

ఏత త్తే సర్వ మాఖ్యాతం యథా త్రిపథగా నదీ
ఖం గతా ప్రథమం తాత గతిం గతిమతాం వర. ౨౩

టీక॥ గతిమతాం= మంచినడకగలవారిలో; వర = శ్రేష్ఠుఁడవైన; తాత=నాయనా; యథా=ఎట్లు; త్రిపథగా= మూఁడుమార్గములం బోవునట్టి; నదీ=నదియైనగంగ; ప్రథమం=మొదట; ఖం = ఆకాశమును; గతిం=స్థానమును గా; గతా= పొందినదో; తథా (అధ్యాహృతము)=అట్లు; ఏతత్=ఈ; వృత్తాంతము; సర్వం=అంతయును; తే=నీకొఱకు; ఆఖ్యాతం=చెప్పఁబడినది.

సుందరమైన నడకగలవారిలో శ్రేష్ఠుఁడవైనరాముఁడా! గంగానదియెట్లు, మొదట, నాకాశమునొందినదో, ఆవృత్తాంతమంతయును నీకుఁజెప్పితిని. అని, తాత్పర్యము.

సైషా సురనదీ రమ్యా శైలేంద్రస్య సుతా తదా
సురలోకం సమారూఢా విపాపా జలవాహినీ. ౨౪

టీక॥ తదా=అప్పుడు; రమ్యా= మనోహరమయినదియును; విపాపా=పాపములేనిదియును; జలవాహినీ = జలమునువహించుచున్నదియునగు; సా=అట్టి; ఏషా=ఈ; శైలేంద్రస్య=పర్వతరాజైనహిమవంతునియొక్క; సుతా=కూఁతురైనగంగ; సురనదీ=దేవతానదియై; సురలోకం = దేవలోకమును, సమారూఢా=ఎక్కినది.

అప్పుడు, మనోహరమై, పాపములేక, యెల్లప్పుడునునీళ్లుగలిగిపాఱుచుండు, హిమవంతుని కూఁతురైన, గంగ, దేవతానదియై, దేవలోకమునొందినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే, పంచత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండపంచత్రింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

షట్త్రింశసర్గప్రారంభః.

ఉక్తవాక్యే మునౌ తస్మిన్నుభౌ రాఘవలక్ష్మణౌ
ప్రతినంద్య కథాం వీరా వూచతు ర్మునిపుంగవమ్. ౧

టీక॥ తస్మిన్ = ఆ; మునౌ = విశ్వామిత్రమహాముని; ఉక్తవాక్యే = చెప్పఁబడినమాట గలవాఁడుకాఁగా; వీరౌ = పరాక్రమశాలులగు; రాఘవలక్ష్మణౌ = రామలక్ష్మణులు; ఉభౌ = ఇర్వురును; కథాం = కథను; ప్రతినంద్య = శ్లాఘించి; మునిపుంగవం = మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుని గూర్చి; ఊచతుః = చెప్పిరి.

ఆవిశ్వామిత్రుం డిట్లుచెప్పఁగానే, పరాక్రమశాలులగు రామలక్ష్మణులిర్వురు, నాకథను శ్లాఘించి, మునిశ్రేష్ఠుండగు నావిశ్వామిత్రుం జూచి, యిట్లనిచెప్పిరి.

అని, తాత్పర్యము.

ధర్మయుక్త మిదం బ్రహ్మన్ కథితం పరమం త్వయా,
దుహితు శ్శైలరాజస్య జ్యేష్ఠాయా వక్తు మర్హసి. ౨
విస్తరం విస్తరజ్ఞోసి దివ్యమానుషసంభవమ్

టీక॥ బ్రహ్మన్ = బ్రాహ్మణుఁడవైనవిశ్వామిత్రుఁడా! త్వయా = నీచేత; శైలరాజస్య = పర్వతరాజైన హిమవంతునియొక్క; జ్యేష్ఠా

యాః=పెద్దదైన; దుహితుః=కూతురియొక్క; ధర్మయుక్తం=ధర్మముతోఁ గూడినదియును; పరమం=శ్రేష్ఠమైనదియునగు; ఇదం=ఈవృత్తాంతము; కథితం=చెప్పఁబడినది. తస్యాః(అధ్యాహృతము)=ఆ.గంగానదియొక్క; దివ్యమానుషసంభవం, దివ్య = స్వర్గలోకమందును, మానుష=మనుష్య లోకమందును, సంభవం= కల్గిన; విస్తరం=కథావివరమును; వక్తుం=చెప్పుటకు; అర్హసి = తగుదువు. త్వం(అధ్యాహృతము)=నీవు; విస్తరజ్ఞః= వివరము నెఱింగినవాఁడవు; అసి=అగుచున్నావు.

విశ్వామిత్రుఁడా! ధర్మిష్ఠంబును శ్రేష్ఠంబునగు హిమవంతుని పెద్ద కూఁతురైన గంగానది వృత్తాంతమింత మాత్రము చెప్పితివి; ఇంకనా గంగకు, స్వర్గములోను భూమిలోనుం గల్గిన వృత్తాంతమంతయు, సవిస్తరముగాఁ జెప్పవలయు; నీవిట్టి కథలు సవిస్తరముగా నెఱుంగుదువు. అని, తాత్పర్యము.

త్రీన్ పథో హేతునా కేన ప్లావయే ల్లోకపావనీ. ౩

టీక॥ లోకపావనీ= లోకంబులఁబరిశుద్ధములుగాఁ జేయునట్టిగంగానది, కేన=ఏ; హేతునా=కారణముచేత; త్రీన్=మూఁడైన; పథః=మార్గములను; ప్లావయేత్=(భూతార్థమందులిఙ్) ప్రవహించినది? భావయేత్ (పాఠాంతరము)=ప్రవహించినది?

ఏకారణముచేత, లోకపావనియగుగంగానది, మూఁడుమార్గంబులుగల్గి ప్రవహించినది?

అని, తాత్పర్యము.

కథం గంగా త్రిపథగా విశ్రుతా సరిదుత్తమా
త్రిషు లోకేషు ధర్మజ్ఞ కర్మభిః కై స్సమన్వితా. ౪

టీక ॥ ధర్మజ్ఞ = ధర్మంబుల నెఱింగినవిశ్వామిత్రుఁడా! త్రిపథ

గా=మూఁడుమార్గంబులఁబోవు నట్టి; గంగా=గంగానది; కథం=ఎట్లు; కైః=ఏః; కర్మభిః=కార్యముల తో; సమన్వితా=కూడినదై; త్రిషు=మూఁడైన; లోకేషు=లోకంబులందును; సరిదుత్తమా=నదులలోనుత్తమమై; విశ్రుతా=ప్రసిద్ధమైనది?

ధర్మంబుల నెఱింగిన విశ్వామిత్రుఁడా! త్రిపథగమైన గంగా ఎట్లు, ఏ కార్యములు చేసి, ముల్లోకంబులందును నదీశ్రేష్ఠమై ప్రసిద్ధి, దినది? ఈవృత్తాంతమంతయు నాకుఁజెప్పుము. అని, రాముఁడు చెప్పెను. అని, తాత్పర్యము.

తధా బ్రువతి కాకుత్థ్సే విశ్వామిత్ర స్తపోధనః
నిఖిలేన కథాం సర్వా మృషిమధ్యే న్యవేదయత్. ౫

టీక॥ కాకుత్థ్సే= రాముఁడు; తధా=ఆప్రకారముగా; బ్రువతి=చెప్పుచుండఁగా; తపోధనః = తపస్సేధనముగాఁగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; కథాం=కథను; సర్వాం=అంతను; నిఖిలేన=సాకల్యముచేత; ఋషిమధ్యే=ఋషులనడుమను; న్యవేదయత్=తెలిపెను.

రాముండట్లుచెప్పఁగానే, తపోధనుండగువిశ్వామిత్రుఁడు, గంగానదికథ యంతయును, సాకల్యంబుగా, ఋషులనడుమఁ, జెప్పెను.
అని, తాత్పర్యము.

పురా రామ కృతోద్వాహో నీలకంఠో మహాతపాః
దృష్ట్వాచ స్పృహయా దేవీం మైథునా యోపచక్రమే. ౬

టీక॥ రామ = రాముఁడా! పురా=మునుపు; మహాతపాః=అధికకమైనతపస్సుగల, నీలకంఠః=నల్లని గొంతుగల శివుఁడు; కృతోద్వాహః=చేయఁబడిన వివాహముగలవాఁడై; దేవీం=భార్యయైన పార్వ

స్పృష్ట్వాచ=చూచియు; స్పృహ=ఆశచేత; మైథునాయ =సంగముసేయుటకొఱకు; ఉపచక్రమే=ఆరంభించెను.

రాముఁడా! మునువు, అధికంబగుతపముగలనీలకంఠుఁడైన శివుండు, వివాహముచేసికొని, భార్యయైన పార్వతింజూచి, యాసగొని, సంభోగముసేయ నారంభించెను.

అని, తాత్పర్యము.

శితికంఠస్య దేవస్య దివ్యం వర్షశతం గతమ్
నచాపి తనయో రామ తస్యామాసీ త్పరంతప. ౭

టీక ॥ పరంతప=శత్రువులందపింపఁజేయునట్టి; రామ=రాముఁడా! శితికంఠస్య=నల్లని కంఠముగలశివుఁడు; దేవస్య=క్రీడించుచుండఁగా! దివ్యం=స్వర్గమునందుఁగల్గిన; వర్షశతం=సంవత్సరములయొక్క-నూఱు; గతం= కడచినది. తస్యాం=ఆపార్వతియందు; తనయశ్చాపి=కొడుకును; నాసీత్ =కలుగలేదు.

శత్రువులం దపింపఁజేయు రాముఁడా! శివుండిట్లు క్రీడింపుచుండఁగానే, దివ్యసంవత్సరంబులు నూఱు గడచినవి; అప్పుడును, పార్వతియందుఁగొడుకుపుట్టలేదు.

అని, తాత్పర్యము.

తతో దేవా స్సముద్విగ్నాః పితామహపురోగమాః
("భయోద్విగ్నాః" అనిమహేశ్వరతీర్థపాఠము.)
యదిహోత్పద్యతే భూతం క స్తత్ప్రతి సహిష్యతే. ౮

టీక॥ తతః=అంతట; పితామహపురోగమాః = బ్రహ్మదేవుఁడు ముందు నడచువాఁడుగాఁగల; దేవాః=దేవతలు; "ఇహ=ఈపార్వతియందు; యత్=ఏ; భూతం=భూతము; ఉత్పద్యతే=పుట్టునో; తత్ = ఆభూతమును; కః=ఎవ్వఁడు; ప్రతిసహిష్యతే = ఓర్వఁ

గలఁదు?" ఇతి(అధ్యాహృతము)= అని; సముద్విగ్నాః=భయముపడిన వారలు (అని,గోవింద రాజపాఠము); భయోద్విగ్నాః, భయ=వెఱపుచేత, ఉద్విగ్నాః=కలఁతనొందినవారలు (అని, మహేశ్వరతీర్థపాఠము); ఆసన్ (అధ్యాహృతము)=అయిరి.

అంత, బ్రహ్మదేవుఁడు ష గాఁగల దేవతలు, "ఈపార్వ దుఁ బుట్టుఘాతము నెవ్వాఁ హింపఁగలం" డని భయంబునదిరి.

అని, తాత్పర్యము.

అభిగమ్య సురా స్సర్వే ప్రణిపత్యే ద మబ్రువన్

టీక॥ సురాః = దేవతలు; సర్వే=అందఱును; అభిగమ్య=ఎదుటికేఁబోయి; ప్రణిపత్య= నమస్కరించి; ఇదం= ఈమాటను; అబ్రువన్=చెప్పిరి.

దేవతలందఱు శివుని యొద్దకుఁబోయి నమస్కరించి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము

దేవదేవ మహాదేవ లోకస్యాస్య హితే రత ।
సురాణాం ప్రణిపాతేన ప్రసాదం కర్తు మర్హసి

టీక॥ అస్య=ఈ; లోకస్య=ప్రపంచముయొక్క; హితే=మేలునందు; రత=ఆసక్తుఁడవును; దేవదేవ=దేవతలకును దేవుఁడవునగు; మహాదేవ=ఈశ్వరుఁడా! సురాణాం=దేవతలమైనమాయొక్క; ప్రణిపాతేన=నమస్కారముచేత; ప్రసాదం=అనుగ్రహమును; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

లోకహితంబు నందాసక్తుఁడవు, దేవతలకును దేవుఁడవునగు శివుఁడా! దేవతలమైనమేమందఱమునీకు నమస్కారము చేసెదము; నీవు మాయందనుగ్రహము సేయవల

యును. అని, తాత్పర్యము.

న లోకా ధారయిష్యంతి తవ తేజ స్సురోత్తమ. ౧౦
బ్రాహ్మేణ తపసా యుక్తో దేవ్యా సహ తప శ్చర

టీక॥ సురోత్తమ=దేవతాశ్రేష్ఠుఁడవైనశివుఁడా! లోకాః=లోకములు;తవ=నీయొక్క; తేజః=తేజస్సును, తేజస్సునఁబుట్టినపుత్రునినను టః;నధారయిష్యంతి = ధరింపలేవు. త్వం(అధ్యాహృతము)=నీవు; బ్రాహ్మేణ = వేదోక్తమైన; తపసా=యోగముతో;యుక్తః=కూడినవాఁడవై; దేవ్యాసహ=పార్వతీదేవితోఁగూడ; తపః=తపస్సును; చర=ఆచరింపుము.

దేవతాశ్రేష్ఠుఁడవగుశివుఁడా! నీ తేజస్సునంబుట్టినపుత్రునిలోకంబులుధరింపలేవు, కావున, నీవువేదోక్తంబగుయోగంబవలంబించి, పార్వతీదేవింగూడి, తపం బాచరింపుము. అని,తాత్పర్యము.

త్రైలోక్యహితకామార్థం తేజ స్తేజసి ధారయ. ౧౧

టీక॥ త్రైలోక్య హితకామార్థం,త్రైలోక్య=మూఁడులోకములయొక్క, హిత=మేలనెడు, కామార్థం= కోర్కికొఱకు; తేజః= వీర్యమును; తేజసి=తేజోమయమైన, శరీరమందు; ధారయ= ధరింపుము.

మూఁడు లోకంబులకును మేలుగల్గుటకై, రేతస్సును దేహంబునందె ధరింపుము; విడువవలదు. అని, దేవతలు చెప్పిరి.

అని, తాత్పర్యము.

దేవతానాం వచ శ్శ్రుత్వా సర్వలోకమహేశ్వరః
బాఢ మిత్య బ్రవీ త్సర్వా& పున శ్చేద ముహాచ హ. ౧౨




టీక॥ చేతతానాం = వేల్పుల యొక్క; వచః= మాటను; శ్రుత్వా = విని; సర్వలోకమహేశ్వరః, సర్వ=సమస్తములైన, లోక=లోకములకును, మహేశ్వరః= మహాప్రభువగుశివుఁడు; బాఢం= మంచిది; ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను. పునశ్చ = మఱలను; సర్వాన్=దేవతల, నందఱంగూర్చి; ఇదం=ఈమాటను; ఉవాచ= చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

దేవతలమాటవిని; సమస్తలోకంబులకును మహేశ్వరుండగు శివుండు, "మంచిది" అని, చెప్పి, మఱల నాదేవతలనందఱం జూచి, యిట్లని పలికెను.

అని, తాత్పర్యము.

ధారయిష్యా మ్యహం తేజ స్తైజస్యేవ సహోమయా
త్రిదశాః పృధివీ చైవ నిర్వాణ మధిగచ్ఛతు. ౧౩

టీక॥ అహం=నేను; ఉమయా సహ=పార్వతీదేవితోఁగూడ; తేజస్యేవ= తేజోమయంబగుశరీరమందే; తేజః=రేతస్సును; ధారయిష్యామి=ధరించెదను. త్రిదశాః=దేవతలును; పృధివీచైవ= భూమియును (చకారముచే)ఇతరలోకంబులును; నిర్వాణం=సౌఖ్యమును; అధిగచ్ఛతు=(ఏకవచనమార్షము) పొందుఁగాక.

నేను శరీరమందే రేతస్సును ధరించెదను; ఆలాగే పార్వతియును, శరీరమందే శోణితమును ధరింపఁగలదు ; దేవతలును సమస్త లోకంబులును సౌఖ్యంబు నొందెడుఁగాక.

అని, తాత్పర్యము.

య దిదం క్షుభితం స్థానా న్మమ తేజో హ్యనుత్తమమ్
ధారయిష్యతి కస్త న్మే బ్రువంతు సురసత్తమాః. ౧౪




టీక॥ మమ=నాయొక్క; అనుత్తమం = తనకన్న శ్రేష్ఠములేని; యత్=ఏ; ఇదం=ఈ; తేజః=రేతస్సు;("హి"అనునది పాదపూరణార్థము)స్థానాత్= రేతస్సుండుస్థానమునుండి; క్షుభితం= కదలినదో; తత్=ఆ రేతస్సును; కః=ఎవ్వఁడు; ధారయిష్యతి= ధరింపఁగలఁడు? సురసత్తమాః= దేవతాశ్రేష్ఠులు; మే=నాకొఱకు; బ్రువంతు=చెప్పుదురు గాక.

అయితే, ఇప్పుడు రేతస్సుండు స్థానంబునుండిజాఱిన శ్రేష్ఠమయిన నా రేతస్సు నెవ్వఁడు ధరింపనోపును? దేవతలు నాకుదీనిం జెప్పవలయు. అని, శివుండు చెప్పెను.

అని, తాత్పర్యము.

(దీనివలన, "ఇదివఱకు రేతస్థానమునుండిచలింపని రేతస్సునువిడుచుటలేదు; ఇదివఱకుఆస్థానమునుండిచలించియున్న రేతస్సునుమాత్రము విడిచెదను, దానిధరింపఁగలవాఁడెవ్వఁడు?" అనిశివుఁడుచెప్పెను;అని,పై రెండుశ్లోకములకును దాత్పర్యమేర్పడుచున్నది.)

ఏవ ముక్తా స్సురాస్సర్వే ప్రత్యూచు ర్వృషభధ్వజమ్
య త్తేజః క్షుభితం హ్యేత త్త ద్ధరా ధారయిష్యతి. ౧౫

టీక॥ సురాః = దేవతలు;సర్వే=అందఱును;ఏవం = ఇట్లు;ఉక్తాః=చెప్పఁబడినవారలై; వృషభధ్వజం= ఎద్దుటెక్కెముగాఁగలశివునిగూర్చి; యత్=ఏ; తేజః=రేతస్సు;క్షుభితం=చలించినదో;తత్=అట్టి;ఏతత్=దీనిని;ధరా=భూమి; ధారయిష్యతిహి= ధరింపఁగలదుగదా!" ఇతి(అధ్యాహృతము)=అని;ప్రత్యూచుః=చెప్పిరి.

ఇట్లు,శివుఁడుచెప్పఁగా, దేవతలందఱును "జలించిన రేతస్సును, భూమిధరింపఁగలదు" అని, శివునితోఁజెప్పిరి. అని, తాత్పర్యము.

ఏవ ము క్త స్సురపతిః ప్రముమోచ మహీతలే

తేజసా పృథివీ యేన వ్యాప్తా సగిరి కాననా. ౧౬

టీక॥ సురపతిః=దేవతలకుఁబ్రభువైనశివుఁడు; ఏవం = ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; యేన= ఏ; తేజసా=వీర్యముచేత; సగిరికాననా= పర్వతములతోను అడవులతోనుంగూడినట్టి; పృథివీ=భూమి; వ్యాప్తా=వ్యాపింపఁబడినదో; తత్ (అధ్యాహృతము)= ఆ రేతస్సును; మహీతలే=భూతలమందు; ప్రముమోచ=విడిచెను.

దేవతలకుఁ బ్రభువైనశివుండు, దేవతలమాటవిని, రేతస్సునుభూమిమీఁదవిడిచెను; ఆ రేతస్సుపర్వతములతో నరణ్యములతోనుం గూడియున్నభూమియంతయు వ్యాపించెను. అని, తాత్పర్యము.

తతో దేవాః పున రిద మూచు శ్చాథ హుతాశనమ్
ప్రవిశ త్వం మహా తేజో రౌద్రం వాయు సమన్వితః. ౧౭

టీక॥ తతః = అందువలన; అథ=అటుపిమ్మట; దేవాః=దేవతలు; పునశ్చ=మఱలను; హుతాశనం=అగ్నిదేవునింగూర్చి; "త్వం=నీవు; వాయుసమన్వితః= వాయుదేవునితోఁ గూడినవాఁడవై; రౌద్రం=శివునిదైన; మహా తేజః=మహా రేతస్సును; ప్రవిశ= ప్రవేశించుము." ఇదం=ఈ మాటను; ఊచుః=చెప్పిరి.

అంత, నా రేతస్సుభూమియంతయువ్యాపించినందున, భయపడి, దేవతలగ్నిదేవునింజూచి, "నీవువాయువుంగూడియీశివరేతస్సునుబ్రవేశించుము." అనిమాటిమాటికిఁజెప్పిరి. అని, తాత్పర్యము.

తద గ్నినా పున ర్వ్యాప్తం సంజాత శ్శ్వేతపర్వతః
దివ్యం శరవణం చైవ పావకాదిత్య సన్నిభమ్. ౧౮
యత్ర జాతో మహా తేజాః కార్త్తికేయోగ్ని సంభవః

టీక॥ పునః=మరల; తత్=ఆ రేతస్సు; అగ్నినా=అగ్నిదేవునిచే; వ్యాప్తం=వ్యాపింపఁబడినదై; శ్వేతపర్వతః=తెల్లనికొండగా;సంజాతః=పుట్టినది. యత్ర=ఎచ్చట; కార్తికేయః = కృత్తికలకుఁగొడుకును;అగ్నిసంభవః=అగ్నిదేవునియందుఁ బుట్టిన వాఁడునగు; మహాతేజాః = అధికమైనప్రభావముగల వాఁడునగు, కుమారస్వామి; జాతః=పుట్టెనో; తత్(అధ్యాహృతము) = అట్టి; పావకాదిత్యసన్నిభం = నిప్పుతోనుసూర్యునితోనుసమానమైన; దివ్యం=శ్రేష్ఠమగు;శరవణంచైవ=తెల్లువనముగాను; సంజాతం (అధ్యాహృతం)=పుట్టినది.

ఆ రేతస్సుఅగ్నిదేవునిచేవ్యాపింపఁబడినదై, శ్వేతపర్వతముగానైనది;అంతనిప్పుతోనుసూర్యునితోనుసమానమైన దివ్యమగుతెల్లువనమైనది;ఆతెల్లువనమునందే మహాతేజుండగుకుమారస్వామిపుట్టెను; అతనికిఁగృత్తికలుపాలిచ్చి పెంచినందున గార్తికేయుండనిపేరుగల్గెను;అగ్నిదేవునిచేధరింపఁబడినందున నతండగ్నిపుత్రుండనంబడెను.

అని, తాత్పర్యము.

అథోమాంచ శివంచైవ దేవా స్సర్షిగణా స్తదా. ౧౯
పూజయామాసు రత్యర్థం సుప్రీత మనస స్తతః

టీక॥ అధ = అటుతర్వాత;తదా=అప్పుడు; సర్షిగణాః=ఋషిసమూహములతోఁ గూడిన; దేవాః=దేవతలు; తతః=అందువలన;సుప్రీతమనసః=మిక్కిలిసంతసించినమనస్సుగలవారలై;ఉమాంచ=పార్వతీదేవిని;శివంచైవ=శివుని;అత్యర్థం = అధికముగా;పూజయామాసుః=పూజించిరి.

అంత, నప్పుడు, దేవతలునుఋషులును, మిక్కిలియు సంతసించి, పార్వతీ పరమేశ్వరుల, నధికముగాఁ,బూజించిరి.

అని, తాత్పర్యము.

అథ శైల సుతా రామ త్రిదశా నిద మబ్రవీత్. ౨౦
సమన్యు రశపత్సర్వాన్ క్రోధసంరక్త లోచనా

టీక॥ రామ = రాముఁడా! అథ=అటుపిమ్మట; శైలసుతా=పార్వతీదేవి; త్రిదశాన్=దేవతలఁగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=పలికెను. సమన్యుః= కోపముగలదై; క్రోధసంరక్తలోచనా, క్రోధ=కోపముచేత, సంరక్త=మిక్కిలియెఱ్ఱనైన, లోచనా=కండ్లుగలదై; సర్వాన్=దేవతల, నందఱను; అశపత్=శపించెను.

రాముఁడా! అంతఁబార్వతీదేవి, కోపించి, యెఱ్ఱనికండ్లతో, దేవతల నందఱను, శపించెను.

అని, తాత్పర్యము.

యస్మా న్నివారితా చైవ సంగతిః పుత్ర కామ్యయా. ౨౧
అపత్యం స్వేషు దారేషు తస్మా న్నోత్పాద యిష్యథ.

టీక॥ యస్మాత్= ఎందువలన; పుత్రకామ్యయా= కొడుకునందలి కోరికచేత; క్రియమాణా (అధ్యాహృతము)=చేయఁబడుచున్న; సంగతిః=సంభోగము; నివారితా = నివారింపఁబడినదో; తస్మాచ్చైవ= అందువలననే; యూయం (అధ్యాహృతము)=మీరలు; స్వేషు= తమవైన; దారేషు = భార్యలందు; అపత్యం=సంతానమును; నోత్పాదయిష్యథ=పుట్టింపలేరు.

మీరు, పుత్రేచ్ఛచేఁ జేయఁబడుచున్న సంభోగమును నిలిపించితిరి. కావున, మీకుస్వభార్యలయందు సంతానము కలుగదు.

అని, తాత్పర్యము.

అద్య ప్రభృతి యుష్మాక మప్రజా స్సంతు పత్నయః. ౨౨

టీక॥ అద్యప్రభృతి = ఇప్పుడుమొదలుగా; యుష్మాకం = మీ

యొక్క; పత్న్యః=భార్యలు; అప్రజాః= సంతానములేనివారలు; సంతు=అగుదురుగాక.

ఇదిమొదలు, మీభార్యలకుసంతానము లేక పోవుఁగాక. అని పార్వతి, దేవతలశపించెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా సురాన్ సర్వాన్ శశాప పృథివీ మపి.

టీక॥ సా (అధ్యాహృతము)= ఆపార్వతి; సురాన్=దేవతలను ; సర్వాన్ = అందఱనుంగూర్చి; ఏవం=ఈప్రకారము; ఉక్త్వా= చెప్పి; పృథివీమపి= భూమినింగూడ; శశాప=శపించెను.

ఆపార్వతియీప్రకారము, దేవతలశపియించి, భూమినిం గూడ శపించెను. అని, తాత్పర్యము

అవనే నైకరూపా త్వం బహుభార్యా భవిష్యసి. ౨౩
నచ పుత్ర కృతాం ప్రీతిం మత్క్రోధ కలుషీ కృతా
ప్రాప్స్య సి త్వం సుదుర్మేధే మమ పుత్ర మనిచ్ఛతీ. ౨౪

టీక॥ అవనే = భూమీ!త్వం= నీవు; నైకరూపా = నానావిధములయినరూపముగల దానవుగాను; బహుభార్యా=అనేకులకుభార్యవుగాను; భవిష్యసి = కాఁగలవు. సుదుర్మేధే = మిక్కిలిదుష్టబుద్ధిగల, భూమీ!మమ=నాకు;పుత్రం=కొడుకును; అనిచ్ఛతీ=కోరనట్టి; త్వం=నీవు;మత్క్రోధకలుషీకృతా,మత్క్రోధ = నాకోపముచేత, కలుషీకృతా=కలఁకఁబాఱినదిగాఁజేయఁబడినదానవై;పుత్రకృతాం,కొడుకుచేఁజేయంబడిన;ప్రీతిం,సంతోషమును;నచప్రాప్స్యసి=పొందనేలేవు.

ఓభూమీ! నీవునానావిధరూపములుగల్గి, బహురాజులకుభార్యవు కాఁగలవు; దుష్టబుద్ధిగలభూమీ ! నీవు,నాకుఁగొడుకుగల్గుటకిచ్చగింప

కుండుటంజేసి, నాకోపంబున,నీవెప్పుడును, గొడుకువలనం గల్గుసంతోషంబు నొందలేవు. అని,భూమిని శపించెను.

అని,తాత్పర్యము.

తాన్ సర్వాన్ వ్రీళితాన్ దృష్ట్వా సురాన్ సురపతి స్తదా
గమనా యోపచక్రామ దిశం వరుణ పాలితాం. ౨౫

టీక॥ వ్రీళితాన్= సిగ్గుఁబొందిన; తాన్=ఆ; సురాన్ = దేవతలను, సర్వాన్=అందఱను; దృష్ట్వా=చూచి; సురపతిః=దేవతలకుఁబ్రభువగుశివుఁడు; తదా=అప్పుడు; వరుణపాలితాం= వరుణునిచేఁబాలింపఁబడిన; దిశం= పశ్చిమదిక్కును గూర్చి; గమనాయ = పోవుటకొఱకు; ఉపచక్రామ=ఆరంభించెను.

ఆదేవత లందఱుసిగ్గుఁ బొందియుండుటంజూచి, దేవతలకుఁబ్రభువైనశివుండప్పుడు,వరుణపాలితంబగుపశ్చిమదిక్కునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

స గత్వా తప ఆతిష్ఠ త్పార్శ్వేతస్యో త్తరే గిరౌ
("గిరేః"అనిగోవిందరాజపాఠము.)
హిమవ త్ప్రభవే శృంగే దేవ్యాసహ మహేశ్వరః. ౨౬

టీక॥ సః=ఆ; మహేశ్వరః=శివుఁడు; గత్వా=పోయి; ఉత్తరే=ఉత్తరపుదిక్కునందలి; గిరౌ (అనిమహేశ్వరతీర్థపాఠము.)=హిమవత్పర్వతమునందు; తస్య=ఆహిమవంతునియొక్క; పార్శ్వే=ప్రక్కయందు,ఉన్న; హిమవత్ప్రభవే= హిమవత్పర్వతమె కారణముగాఁగల, హిమవత్పర్వతమునందుఁబుట్టిన యనుట; శృంగే=శిఖరమందు; దేవ్యాసహ= పార్వతీదేవితోఁగూడ; తపః=తపస్సును; ఆతిష్ఠత్= అవలంబించెను.

ఆమహేశ్వరుండుపోయి, యుత్తరపు దిక్కున నుండు హిమవత్పర్వతము నందు, ఆపర్వతము

పార్శ్వమునందుండు నొకశిఖరంబునఁ, బార్వతీ దేవితోఁ, దపము సేయనారంభించెను. అని, తాత్పర్యము. అని, మహేశ్వరతీర్థులు వ్యాఖ్యానముచేసిరి.

సః=ఆ; మహేశ్వరః= శివుఁడు; గత్వా=పోయి; హిమవత్ప్రభవే=హిమవత్పర్వతమె కారణము గాఁగల. తస్య=ఆ;గిరేః( ఇదిగోవిందరాజపారము)=హిమవత్పర్వతముయొక్క; ఉత్తరే=ఉత్తరపు దిక్కునందలి; పార్శ్వే=ప్రక్కయందు, ఉన్న; శృంగే=శిఖరమందు; దేవ్యాసహ=పార్వతీదేవితోఁ గూడ; తపః=తపస్సును; ఆతిష్ఠత్=అవలంబించెను.

ఆమహేశ్వరుండుపోయి, హిమవత్పర్వతము నుత్తరపార్శ్వమందుండు నొకశిఖరమందుఁ బార్వతీ దేవితోడంగూడి తపముసేయ నారంభించెను. అని, తాత్పర్యము.

ఇట్లు, గోవిందరాజులు వచించిరి.

ఏష తే విస్తరో రామ శైలపుత్ర్యా నివేదితః
గంగాయాః ప్రభవంచైవ శృణు మే సహలక్ష్మణః. ౨౭

టీక॥ రామ= రాముఁడా! శైలపుత్ర్యాః=పార్వతియొక్క;ఏషః=ఈ;విస్తరః=కథావివరము; తే=నీకొఱకు; నివేదితః= తెల్పఁబడినది. గంగాయాః=గంగానదివలన; ప్రభవంచైవ = కుమారస్వామియొక్క,యుత్పత్తిని; (ఇది,మహేశ్వరతీర్థాభిప్రాయము); గంగాయాః= గంగయొక్క;ప్రభవంచైవ = ప్రభావమును; (ఇది,గోవిందరాజాభిప్రాయము.); మే=(పంచమ్యర్థమందుషష్ఠి) నావలన; సహలక్ష్మణః = లక్ష్మణునితోఁగూడినవాఁడవై;శృణు=వినుము.

రాముఁడా!నీకీప్రకారము, పార్వతీదేవికథను వివరముగాఁజెప్పితిని; ఇంక,గంగానదివలనఁగుమారస్వామిపుట్టినవృత్తాంతముసెప్పెద, లక్ష్మణునితోఁగూడవినుము (అని,మహేశ్వరతీర్థాభి ప్రాయము).ఇం

క, గంగానదీప్రభావము సెప్పెద, లక్ష్మణునితోఁగూడవినుము. (అని, గోవిందరాజాభిప్రాయము).

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాల కాండే, షట్త్రింశ స్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ షట్త్రింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

సప్తత్రింశ సర్గప్రారంభః.

తప్యమానే తపో దేవే దేవా స్సర్షిగణాః పురా
సేనాపతి మభీప్సంతః పితామహ ముపాగమన్. ౧

టీక॥ దేవే=శివుఁడు; తపః=తపస్సును; తప్యమానే= తపించుచుండఁగా! పురా=మునుపు; సర్షిగణాః=ఋషుల సమూహములతోఁగూడినట్టి; దేవాః=దేవతలు; సేనాపతిం= సేనానాయకుని; అభీప్సంతః=కోరుచు; పితామహం=బ్రహ్మదేవుని; ఉపాగమన్=పొందిరి.

ఇట్లు, శివుఁడు తపస్సు సేయుచుండఁగా, దేవతలును ఋషులును, సేనాపతినిగోరి, బ్రహ్మదేవునియొద్దకుఁబోయిరి. అని, తాత్పర్యము.

తతోఽబ్రువన్ సురా స్సర్వే భగవంతం పితామహమ్
ప్రణిపత్య సురా స్సర్వే సేంద్రా స్సాగ్నిపురోగమాః. ౨

టీక॥ తతః = అంతట; సేంద్రాః = ఇంద్రునితోఁగూడినవారును; సాగ్నిపురోగమాః=ముందునడచునగ్ని దేవునితోఁ గూడినవారునగు;సురాః=దేవతలు,సర్వే=అందఱును;ప్రణిపత్య=నమస్కరించి;భగవంతం = మాహాత్మ్యముగల;పితామహం=బ్రహ్మదేవునిగూర్చి ; సురాః=దేవతలు; సర్వే=అందఱును(క్రియాభేదంబునఁ బునరుక్తిదోషంబులేదు);అబ్రువన్=పలికిరి.

అంత, నగ్నిముందుగాఁగల దేవతలందఱును దేవేంద్రునింగూడి, బ్రహ్మదేవునకు నమస్కరించియిట్లని చెప్పిరి. అని, తాత్పర్యము.

యో న స్సేనాపతి ర్దేవ దత్తో భగవతా పురా
తపః పరమ మాస్థాయ తప్యతే స్మ సహోమయా. ౩

టీక॥ దేవ= బ్రహ్మదేవుఁడా! పురా=మునుపు;భగవతా= భగవంతుఁడవైన నీచేత; నః=మాకొఱకు; యః = ఎవ్వఁడు; సేనాపతిః = సేనానాయకుఁడుగా; దత్తః=ఇవ్వఁబడెనో; సః (అధ్యాహృతము)= ఆశివుఁడు; ఉమయా సహ=పార్వతీదేవితోఁగూడ; పరమం=ఉత్కృష్టమైన; తపః= తపస్సును; ఆస్థాయ = అవలంబించి; తప్యతేస్మ = తపించుచున్నాఁడుగదా!

బ్రహ్మదేవుఁడా! భగవంతుండవగునీవు మునుపుమాకెవ్వని సేనానాయకునిగానిచ్చితివో; ఆరుద్రుండిపుడు పార్వతీదేవిఁగూడి పరమంబయినతపము సేయుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

య దత్రానంతరం కార్యం లోకానాం హితకామ్యయా
సంవిధత్స్వ విధానజ్ఞ త్వం హి నః పరమా గతిః. ౪

టీక॥ విధానజ్ఞ=ఉపాయంబులనెఱింగిన బ్రహ్మదేవుఁడా! అత్ర=



ఈవిషయమునందు; అనంతరం=వెనుకటి; కార్యం = పని; యత్=ఏదో; తత్ (అధ్యాహృతము) = దానిని; లోకానాం=లోకములయొక్క; హితకామ్యయా= మేలునందలికోర్కిచేత; సంవిధత్స్వ=ఆలోచించుము. నః=మాకు; పరమా=ముఖ్యమైన; గతిః=పొందఁదగినస్థానము; త్వంహి=నీవెకదా!

ఉపాయజ్ఞుండ వగు బ్రహ్మదేవుఁడా, యీవిషయంబునందిఁకనే మిసేయవలయునో, లోకంబులకు మేలు గల్గుటకై, దాని, నాలోచింపుము. మాకుఁబరమగతివి నీవె కదా! అని, దేవతలు బ్రహ్మదేవునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

దేవతానాం వచ శ్శ్రుత్వా సర్వలోకపితామహః
సాంత్వయ న్మధురై ర్వాక్యై స్త్రిదశా నిద మబ్రవీత్. ౫

టీక॥ దేవతానాం= దేవతలయొక్క; వచః= మాటను; శ్రుత్వా = విని; సర్వలోకపితామహః=సమస్తలోకములకును తాతమైన బ్రహ్మదేవుఁడు; మధురైః=ఇంపైన; వాక్యైః=మాటలచేత; సాంత్వయన్=ఊఱడించుచు; త్రిదశాన్=దేవతలంగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

దేవతల మాటవిని, సమస్తలోకంబులకును బితామహుండగు బ్రహ్మదేవుఁడు, మధురంబులగు మాటలచే నోదార్చుచు, దేవతలంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

శైలపుత్ర్యా యదుక్తం త న్న ప్రజాస్యథ పత్నిషు
తస్యా వచన మక్లిష్టం సత్య మేత న్న సంశయః. ౬

టీక॥ శైలపుత్ర్యా= పార్వతిచేత; యత్=ఏది; ఉక్తం=చెప్పఁ






బడినదో; తత్ = దానివలన; యూ యం(అధ్యాహృతము)=మీరలు; పత్నీషు=భార్యలయందు; నప్రజాస్యథ=పుట్టింపలేరు. తస్యాః=ఆపార్వతియొక్క; వచనం=మాట; అక్లిష్టం=వ్యర్థముకానిది. ఏతత్=ఈ మాట; సత్యం=యథార్థము. సంశయః=సందేహము; న=లేదు.

పార్వతీదేవి మిమ్ము శపించినందువలన, మీరలు భార్యలయందు సంతానముగలిగింపలేరు; పార్వతీదేవిమాటవ్యర్థముకానేరదు; నేను జెప్పినదిసత్యము, ఇందుసందియము లేదు. అని, తాత్పర్యము.

ఇయ మాకాశగా గంగా యస్యాం పుత్రం హుతాశనః
జనయిష్యతి దేవానాం సేనాపతి మరిందమమ్. ౭

టీక॥ యస్యాం=దేనియందు; హుతాశనః= అగ్నిదేవుఁడు; అరిందమం = శత్రువులనడఁగఁద్రొక్కువాఁడును; దేవానాం=దేవతలయొక్క; సేనాపతిం= సేనానాయకుఁడునగు; పుత్రం=కొడుకును; జనయిష్యతి= పుట్టింపఁగలడో; సా (అధ్యాహృతము)=ఆ; ఇయం= ఈ; ఆకాశగా= ఆకాశమందుఁ దిరుగునట్టి; గంగా = గంగానది; అస్తి(అధ్యాహృతము)= ఉన్నది.

ఇదిగో! ఆకాశమందుఁ దిరుగు గంగానది; దీనియందగ్ని దేవుఁడు, శత్రుల నడఁగఁ ద్రొక్కం జాలిన దేవసేనాపతియగు కొడుకును బుట్టింపఁ గలఁడు.

అని, తాత్పర్యము.

జ్యేష్ఠా శైలేంద్రదుహితా మానయిష్యతి తత్సుతమ్
ఉమాయా స్తత్ప్రియమతం భవిష్యతి న సంశయః. ౮

టీక॥ జ్యేష్ఠా=పెద్దదైన; శైలేంద్రదుహితా = పర్వతరాజుకొమార్తెయగుగంగానది; తత్సుతం, తత్= ఆయగ్నిదేవునియొక్క, సుతం=కొ




దుకైనగర్భమును; మానయిష్యతి= బహుమానింపఁగలదు, బహుమానముతోధరింపఁగలదనుట. తత్= అది; ఉమాయాః=పార్వతికిని; బహుమతం= మిక్కిలియు నిష్టము; భవిష్యతి = కాఁగలదు . సంశయః=సందేహము; న=లేదు.

హిమవంతునిజ్యేష్ఠ పుత్రియగు గంగానది యాయగ్నిదేవునిచేనుంచఁబడినగర్భమునుబహుమానపూర్వకముగాధరింపఁగలదు. అట్లక్కడధరించుట, పార్వతికినిమిక్కిలియిష్టముగానుండును. అని, బ్రహ్మదేవుఁడు దేవతలకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా వచనం తస్య కృతార్థా రఘునందన
ప్రణిపత్య సురా స్సర్వే పితామహ మపూజయన్. ౯

టీక॥ రఘునందన = రాముఁడా! సురాః= దేవతలు; సర్వే= అందఱును; తస్య= ఆబ్రహ్మదేవునియొక్క; తత్=ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; కృతార్థాః= నెఱవేఱినపనిగలవారలై; పితామహం=బ్రహ్మదేవుని; ప్రణిపత్య = నమస్కరించి; అపూజయన్=పూజించిరి.

రాముఁడా! దేవతలందఱు నా బ్రహ్మదేవుని మాటవిని, కృతార్థులై, యాబ్రహ్మదేవుని, నమస్కరించిరి, పూజించిరి.

అని, తాత్పర్యము.

తే గత్వా పర్వతం రామ కైలాసం ధాతుమండితమ్
అగ్నిం నియోజయామాసుః పుత్రార్థం సర్వదేవతాః. ౧౦

టీక॥ రామ=రాముఁడా! తే= ఆ; సర్వదేవతాః=సమస్తదేవతలును; ధాతుమండితం=గైరికాదిధాతువులచేనలంకరింపఁబడిన; కైలాసం = కైలాసమనెడు; పర్వతం= కొండను; (అగ్నిశివుని రేతస్సును

(బ్రవేశింపఁగానే గల్గిన శ్వేతపర్వత మే కైలాసపర్వత మనంబడు చున్నది.) పుత్రార్థం=కొడుకుకొఱకు; అగ్నిం =అగ్నిదేవుని;నియోజయామాసుః=ఆజ్ఞాపించిరి.

రాముఁడా, ఆదేవతలందఱు ధాతువులచేనిండియుండు, కైలాస పర్వతమునకుఁబోయి, కొడుకుఁబుట్టింపుమని, యగ్నిదేవు నాజ్ఞాపించిరి. అని, తాత్పర్యము.

దేవకార్య మిదం దేవ సంవిధత్స్వ హుతాశన
శైలపుత్ర్యాం మహాతేజో గంగాయాం తేజ ఉత్సృజ. ౧౧

టీక॥ హుతాశన= హోమముచేయఁబడినదియె యాహారముగాఁగల; దేవ= అగ్నిదేవుఁడా! ఇదం=ఈ; దేవకార్యం=దేవతలయొక్క-కార్యమును; సంవిధత్స్వ=చేయుము. మహాతేజః=అధికమైనప్రభావముగలయగ్నిదేవుఁడా! శైలపుత్ర్యాం= హిమవత్పర్వతముయొక్క- కొమార్తె యగు; గంగాయాం=గంగయందు; తేజః=రేతస్సును;ఉత్సృజ=విడువుము.

అగ్నిహోత్రుఁడా! నీవీదేవకార్యమునుజేయుము; హిమవంతునికొమార్తెయగు గంగయందు,నీవుధరించియుండు శివుని రేతస్సునవిడువుము. అని, దేవతలాజ్ఞాపించిరి.

అని, తాత్పర్యము.

దేవతానాం ప్రతిజ్ఞాయ గంగా మభ్యేత్య పావకః
గర్భం ధారయ వై దేవి దేవతానా మిదం ప్రియమ్. ౧౨

టీక॥ పావకః=అగ్నిదేవుఁడు; దేవతానాం=(చతుర్థ్యర్థమందుషష్ఠి)=దేవతలకొఱకు;ప్రతిజ్ఞాయ=(ఆలాగేయని) ప్రతిజ్ఞ చేసి; గంగాం=గంగనుగూర్చి;అభ్యేత్య=పోయి;"దేవి=గంగాదేవి! గర్భం=గర్భమును;ధారయ=ధరింపుము. ('వై' అనునది పాదపూరణార్థము)

ఇదం=ఇది; దేవతానాం=వేల్పుల కు; ప్రియం=ప్రీతికరము. ఇతి, ఉవాచ (అధ్యాహృతము)= అనిచెప్పెను.

అగ్నిదేవుఁడు దేవతలమాట నంగీకరించి, గంగయొద్దకుఁబోయి, "నీవు గర్భమునుధరింపుము, ఇది దేవతలకుఁబ్రియము" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా దివ్యం రూప మధారయత్
దృష్ట్వా తన్మహిమానం స సమంతా దవకీర్యత. ౧౩

టీక॥ తస్య=ఆయగ్నిదేవునియొక్క; తత్=ఆ; వచనం= మాటను; శ్రుత్వా=విని; సా (అధ్యాహృతము)=ఆగంగ; దివ్యం=శ్రేష్ఠమైన; రూపం = ఆకారమును; అధారయత్=ధరించెను; సః=ఆయగ్నిదేవుండు; తన్మహిమానం, తత్= ఆగంగయొక్క, మహిమానం= సౌందర్యముయొక్క, అతిశయమును; దృష్ట్వా=చూచి; సమంతాత్= అన్నిటివలనను; అవకీర్యత=(రేతస్సును)వెదచల్లెను.

ఆయగ్నిదేవుండు చెప్పినమాట విని, గంగానది, నదీరూపమునువిడిచి, దివ్యమైన(స్త్రీ)రూపమును ధరించెను, అగ్నియు, నాగంగసౌందర్యాతిశయముంజూచి, కామంబున, సర్వావయవంబులవలనను, రేతస్సును విడిచెను.

అని, తాత్పర్యము.

సమంతత స్తదా దేవీ మభ్యషించత పావకః
సర్వ స్రోతాంసి పూర్ణాని గంగాయా రఘునందన. ౧౪

టీక॥ రఘునందన=రామచంద్రా, తదా=అప్పుడు; పావకః=అగ్నిదేవుఁడు; సమంతతః=అంతటను; దేవీం=గంగను; అభ్యషించత=తడిపెను. గంగాయాః=గంగయొక్క; సర్వస్రోతాంసి = సమస్తములైన యింద్రియములును; పూర్ణాని=నిండినవి.

రాముఁడా! అప్పుడగ్నిహోత్రుఁడు, గంగను, అవయవములందంతటను రేతస్సువ్యాపించునట్టుదడిపెను; అంతగంగానదియింద్రియముల న్నియు రేతస్సుచేనిండినవి.

అని, తాత్పర్యము.

త మువాచ తతో గంగా సర్వదేవపురోహితమ్
అశక్తా ధారణే దేవ తవ తేజ స్సముద్ధతమ్ ౧౫
దహ్యమానాగ్నినా తేన సంప్రవ్యధితచేతనా

టీక॥ తతః=అంతట; గంగా=గంగ; తేన=ఆ; అగ్నినా = రేతస్సుయొక్క వేఁడిమిచేత; దహ్యమానా=దహింపఁబడుచున్నదై; సంప్రవ్యధితచేతనా; సంప్రవ్యధిత = మిక్కిలిదుఃఖమునొందిన, చేతనా= మనస్సు గలదై; సర్వదేవ పురోహితం, సర్వదేవ=సమస్తదేవతలయొక్కయు, పురోహితం=పురోహితుఁడైన; తం= ఆయగ్నిదేవుని గూర్చి; "దేవ=అగ్నిదేవుఁడా! తవ=నీయొక్క; తేజః = రేతస్సు; సముద్ధతం=వృద్ధిఁబొందినది; భవతి (అధ్యాహృతము)= అగుచున్నది. అహం(అధ్యాహృతము)= నేను; ధారణే= ధరించుటయందు; అశక్తా=సమర్థురాలనుగాను" ఇతి (అధ్యాహృతము)= అని; ఉవాచ=చెప్పినది.

అంత, గంగాదేవి, ఆ రేతస్సువేఁడిమిచేదహింపఁబడి, మిక్కిలిదుఃఖమునొంది, "అగ్నిదేవుఁడా! నీ రేతస్సు అప్పటప్పటికి వృద్ధిఁబొందుచున్నది, నేనుదానిధరింపనోపను" అని, సమస్తదేవతలకును బురోహితుండగునగ్నిదేవునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము

అథా బ్రవీ దిదం గంగాం సర్వదేవహుతాశనః. ౧౬
ఇహ హైమవతే పాదే గర్భో యం సన్నివేశ్యతామ్




టీక॥ అథ=అటుపిమ్మట; సర్వదేవహుతాశనః, సర్వదేవ=సమస్తదేవతలకొఱకు, హుతం=హోమముచేయఁబడినది, అశనః=ఆహారముగాఁగల యగ్నిదేవుఁడు; గంగాం=గంగనుగూర్చి; అయం=ఈ; గర్భః=గర్భము; ఇహ=ఈ; హైమవతే=హిమవత్పర్వతమందుఁ బుట్టిన; పాదే=తిప్పయందు; సన్నివేశ్యతాం = ఉంచఁబడుఁగాక." ఇదం=ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, సమస్తదేవతలంగూర్చి హుతంబగుదానిభుజించునట్టియగ్నిదేవుఁడు, "ఈహిమవత్పర్వత పాదమందీ గర్భమునుంచుము" అని, గంగతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రుత్వా త్వగ్నివచో గంగా తం గర్భ మతిభాస్వరమ్. ౧౭
ఉత్ససర్జ మహాతేజ స్స్రోతోభ్యో హి తదానఘ

టీక॥ మహాతేజః=అధికమైనపరాక్రమముగల; అనఘ=పాపములేని, రాముఁడా! గంగా= గంగ; అగ్నివచః= అగ్నిదేవునిమాటను; శ్రుత్వాతు=వినినంతనే; తదా=అప్పుడు; అతిభాస్వరం=మిక్కిలి ప్రకాశించుచున్నట్టి; తం=ఆ; గర్భం=గర్భమును; స్రోతోభ్యః= ఇంద్రియంబులనుండి; ఉత్ససర్జహి= విడిచెనుగదా!

మహాతేజుండవు నిష్పాపుండవునగు రాముఁడా! గంగానది, యగ్నిమాటవిని, యప్పుడు, పరమభాస్వరంబగునాగర్భంబు, నింద్రియంబులవలన విసర్జించెను.

అని, తాత్పర్యము.

యదస్యా నిర్గతం తస్మాత్తప్త జాంబూనద ప్రభమ్. ౧౮
కాంచనం ధరణీం ప్రాప్తం హిరణ్య మమలం శుభమ్

అస్యాః=ఈగంగానదినుండి; నిర్గతం=బయలువెడలిన; యత్=




ఏ రేతస్సు; ధరణీం=భూమిని; ప్రాప్తం=పొందినదో; తస్మాత్=ఆ రేతస్సువలన; తప్తజాంబూనదప్రభం, తప్తజాంబూనద = కాచఁబడిన బంగారమువంటి, ప్రభం=కాంతిగల; కాంచనం=బంగారమును(పరిశుద్ధమైన బంగారమనుట); అమలం=నిర్మలమును; శుభం=మంగళకరమునగు; హిరణ్యాం=వెండియును; అభవత్(అధ్యాహృతము)=అయినది.

ఈగంగనుండిబయలువెడలిన రేతస్సు భూమిమీఁదఁబడుట వలనఁ, గరఁగింపఁబడిపరిశుద్ధమై యుండు బంగారముంబోనిబంగారమును, నిర్మలము మంగళకరమునగు వెండియునుంబుట్టినవి.

అని, తాత్పర్యము.

తామ్రం కార్ష్ణాయసం చైవ తైక్ష్ణ్యాదేవా భ్యజాయత. ౧౯
మలం తస్యా భవ త్తత్ర త్రపు సీసక మేవచ

టీక॥ తత్ర=అచ్చట; తైక్ష్ణ్యాదేవ=కారమువలననే; తామ్రం=రాగియును; కార్ష్ణాయసం చైవ=నల్లనియినుమును; అభ్యజాయత=పుట్టినది. తస్య= ఆ రేతస్సుయొక్క; మలం=మలము; త్రపు=తగరముగాను; సీసకమేవచ=సత్తుగాను; అభవత్=అయినది.

అక్కడ, ఆ రేతస్సు కారమువలన, రాగియు నల్లని యినుమునుబుట్టినవి; ఆ రేతస్సు మలము త గరము గాను సీసముగాను అ[illegible] నది.

అని, తాత్పర్యము.

తదేత ద్ధరణీం ప్రాప్య నానాధాతు రవర్ధత. ౨౦

టీక॥ తత్=ఆ, గంగచేవిడువఁబడిన; ఏతత్ = ఈ రేతస్సు; ధరణీం=భూమిని; ప్రాప్య= పొంది; నానాధాతుః=నానావిధమైనధాతురూపముగా; అవర్ధత= వృద్ధిఁబొందినది.

ఇట్లు, గంగచే విడువఁబడిన యీరేతస్సు, భూమిమీఁదనానావిధములగు ధాతువులై, వృద్ధిఁబొందినది. అని, తాత్పర్యము.

నిక్షిప్తమాత్రే గర్భే తు తేజోభి రభిరంజితమ్
సర్వం పర్వతసన్నద్ధం సౌవర్ణ మభవ ద్వనమ్. ౨౧

టీక॥ గర్భే=గర్భము; నిక్షిప్తమాత్రేతు=ఉంచఁబడినదిమాత్రమగుచుండఁగానే; తేజోభిః= దాని, కాంతులచేత; అభిరంజితం= ప్రకాశింపఁజేయఁబడిన; పర్వతసన్నద్ధం, పర్వత=శ్వేతపర్వతమందు, సన్నద్ధం=మొలిచినట్టి; వనం=తెల్లువనము; సర్వం=అంతయును; సౌవర్ణం=బంగారువికారముగా; అభవత్=అయినది.

గంగ, గర్భమునుంచినమాత్రముననే శ్వేత పర్వతమందు మొలిచిన తెల్లువనమంతయు దానికాంతులచే వ్యాపింపఁబడిసువర్ణమయమైనది. అని, తాత్పర్యము.

జాతరూప మితి ఖ్యాతం తదా ప్రభృతి రాఘవ
సువర్ణం పురుషవ్యాఘ్ర హుతాశనసమప్రభమ్. ౨౨

టీక॥ పురుషవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుఁడవైన; రాఘవ= రాముఁడా! తదాప్రభృతి= అప్పుడుమొదలు; హుతాశనసమప్రభం= నిప్పుతోసమానమైన కాంతిగల; సువర్ణం=బంగారు; జాతరూపం=జాతరూపము(పుట్టినరూపముగలది); ఇతి=అని; ఖ్యాతం=ప్రసిద్ధమైనది.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! అప్పుడు, బంగారము పుట్టినది కాఁబట్టి, అది మొదలు, నిప్పుతోసరివచ్చుకాంతిగలశ్రేష్ఠమైన బంగారము "జాతరూపము(పుట్టినరూపముగలది)" అని, పేర్కొనఁబడినది. అని, తాత్పర్యము.

తృణవృక్షలతాగుల్మం సర్వం భవతి కాంచనమ్

టీక॥ తృణవృక్షలతాగుల్మం=పచ్చికయును వృక్షములును దీఁగెలును బొదలును; సర్వం=అంతయును; కాంచనం=బంగారముగా; భవతి=(భూతార్థమందులట్)అయినది.

ఆవనమందలి, తృణములును వృక్షములును దీఁగెలును బొదలును, అన్నియును, బంగారమైనవి. అని, తాత్పర్యము.

తం కుమారం తతో జాతం సేంద్రా స్సహ మరుద్గణాః. ౨౩
క్షీరసంభావనార్థాయ కృత్తికా స్సమయోజయన్

టీక॥ తతః = ఆపిమ్మట; జాతం=పుట్టిన; తం=ఆ; కుమారం=కొడుకును; సేంద్రాః= ఇంద్రునితోఁగూడిన; మరుద్గణాః= దేవతలయొక్క-సమూహములు; సహ=ఏకకాలమందే; క్షీరసంభావనార్థాయ, క్షీర=పాలచేత, సంభావన=పెంచుటయనెడు, అర్థాయ=ప్రయోజనము కొఱకు; కృత్తికాః=షట్కృత్తికా నక్షత్రములను; సమయోజయన్=కూడునట్లుచేసిరి.

గంగగర్భమునువిడువఁగాఁబుట్టినకుమారుని, ఇంద్రుఁడున్నగుదేవతలు, కృత్తికలందఱుంగూడి యొక్కటిగాఁబాలిచ్చి పెంచుదురనికృత్తికలతోఁజెప్పిరి. అని, తాత్పర్యము

తాః క్షీరం జాతమాత్రస్య కృత్వా సమయ ముత్తమమ్. ౨౪
దదుః పుత్రో యమస్మాకం సర్వాసా మితి నిశ్చితాః

టీక॥ తాః=ఆకృత్తికలు; "అయం=ఈశిశువు; అస్మాకం=మాకు; సర్వాసాం = అందఱకును; పుత్రః=కొడుకు; భవతు(అధ్యాహృతము)=అగుఁగాక;" ఇతి=అని; దైవైస్సహ(అధ్యాహృతము)= దేవ

తలతోఁగూడ; ఉత్తమం=శ్రేష్ఠమైన; సమయం = సంకేతమును; కృత్వా=చేసికొని, నిశ్చితాః= నిశ్చయించినవారలై; జాతమాత్రస్య=పుట్టినట్టుగానేయున్నయాశిశువునకు; క్షీరం=పాలును; దదుః= ఇచ్చిరి.

ఆకృత్తికలు, "ఈశిశువుమాకందఱకును బుత్రుండయ్యెడి" నని దేవతలముందఱ శ్రేష్ఠమైనసంకేతముచేసికొని, పుట్టినట్టుగానే యున్నట్టి యాశిశువునకుఁ బాలిచ్చిరి, అని, తాత్పర్యము.

తత స్తు దేవతా స్సర్వాః కార్తికేయ ఇతి బ్రువన్. ౨౫
పుత్ర స్త్రైలోక్యవిఖ్యాతో భవిష్యతి న సంశయః

టీక ॥ తతః=ఆపిమ్మట; దేవతాః=దేవతలు; సర్వాస్తు=అందఱును; "పుత్రః=కొడుకు; కార్తికేయః=కార్తికేయుఁడు (కృత్తికల కొడుకు); ఇతి=అని; త్రైలోక్యవిఖ్యాతః= మూఁడులోకములయందును బ్రసిద్ధుఁడు; భవిష్యతి=కాఁగలఁడు. సంశయః=సందేహము; న=లేదు". ఇతి(అధ్యాహృతము)=అని; బ్రువన్(అబ్రువన్)=చెప్పిరి.

అంత, దేవతలందఱు, "ఈకుమారుఁడు, కార్తికేయుండని ముల్లోకంబులందును బ్రసిద్ధుఁడు కాఁగలఁడు; సందియములేదు." అని, చెప్పిరి. అని, తాత్పర్యము.

తేషాం త ద్వచనం శ్రుత్వా స్కన్నం గర్భపరిస్రవే. ౨౬
స్నాపయన్ పరయా లక్ష్మ్యా దీప్యమానం యథానలమ్

టీక॥ తేషాం= ఆదేవతలయొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; తాః(అధ్యాహృతము)=ఆకృత్తికలు; గర్భపరిస్రవే=గర్భముయొక్క స్రవించుట యగుచుండఁగా, గర్భస్రావమగుచుండఁ

గానుట; స్కన్నం = పడినట్టి వాఁడును; అనలంయథా = అగ్నిహోత్రునివలె; పరయా=అధికమైన; లక్ష్మ్యా=కాంతిచేత; దీప్యమానం=ప్రకాశించుచున్నవాఁడునగు, నాశిశువును; స్నాపయన్ (అస్నాపయన్)= స్నానముచేయించిరి.

ఆదేవతలమాటవిని, యాకృత్తికలు, గర్భస్రావమగుచుండఁగానే లఁబడి, అగ్నిహోత్రుఁడుం బోలె నధికంబగు కాంతిచేఁ బ్రకాశించుచున్నయాశిశువును, స్నానముసేయించిరి. అని, తాత్పర్యము.

స్కంద ఇత్యబ్రువన్ దేవా స్స్కన్నం గర్భపరిస్రవాత్. ౨౭
కార్తికేయం మహాభాగం కాకుత్స్థ జ్వలనోపమమ్

టీక॥ కాకుత్స్థ= రాముఁడా! దేవాః=దేవతలు; మహాభాగం=అధికమైనభాగ్యముగలవాఁడును; జ్వలనోపమం= నిప్పుతోసరియైనవాఁడునగు; గర్భపరిస్రవాత్= గర్భస్రావమువలన; స్కన్నం= పడిన; కార్తికేయం= కృత్తికలకొడుకును; స్కందఇతి=స్కందుఁడని(పడినవాఁడని) అబ్రువన్=చెప్పిరి.

రాముఁడా! దేవతలు, మహాభాగుండును నిప్పుతోసరివచ్చువాఁడునగు కృత్తికలకొడుకు, గర్భస్రావంబునం బడినవాఁడుకావున, నతనికి, స్కందుండని పేరిడిరి.

అని, తాత్పర్యము.

ప్రాదుర్భూతం తతః క్షీరం కృత్తికానా మనుత్తమమ్. ౨౮
షణ్ణాం షడాననో భూత్వా జగ్రాహ స్తనజం పయః

టీక॥ తతః= స్నానముసేయించినపిమ్మట; కృత్తికానాం=కృత్తికలకు; అనుత్తమం=తనకన్నశ్రేష్ఠములేని; క్షీరం= పాలు; ప్రాదుర్భూతం= పుట్టినది. సః(అధ్యాహృతము)=ఆకుమారుఁడు; షడాననః=

ఆఱు మొగములుగలవాఁడు; భూత్వా=అయి; షణ్ణాం=ఆర్వురియొక్కయు; స్తనజం= స్తనములవలనంబుట్టిన; పయః=పాలను,జగ్రాహ=గ్రహించెను.

స్నానముచేయించినంతటఁ,గృత్తికల స్తనంబులందుఁ బాలుపుట్టినది; ఆశిశువును,ఆఱుముఖములవాఁడయి, యార్వురికృత్తికల యు స్తన్యమునుద్రావెను.

అని, తాత్పర్యము.

గృహీత్వా క్షీర మేకాహ్నా సుకుమారవపు స్తదా. ౨౯
అజయ త్స్వేన వీర్యేణ దైత్యసేనాగణా న్విభుః

టీక॥ విభుః= ప్రభువైనకుమారుఁడు; ఏకాహ్నా= ఒకదినముచేత; క్షీరం=పాలను; గృహీత్వా= గ్రహించి; తదా = అప్పుడు; సుకుమారవపుః(అపి)= కోమలమైనదేహముగలవాఁడైనను; స్వేన=తనదైన; వీర్యేణ=పరాక్రమముచేత; దైత్యసేనాగణాన్ = రాక్షసులసేనలయొక్క సమూహములను; అజయత్ =జయించెను.

అంతనాకుమారుండు,ఒక్కదినంబున స్తన్యం బంతయుఁ ద్రావి, కోమలంబగుదేహము గలవాఁడైనను,బరమేశ్వర పుత్రుండగుటంజేసి, తానునులోకవిభుండుకావున, తన పరాక్రమంబుననె, రాక్షససేనాసమూహంబుల,జయించెను.

అని, తాత్పర్యము.

సురసేనాగణపతిం తత స్త మతులద్యుతిమ్. ౩౦
అభ్యషించ న్సురగణా స్సమేత్యాగ్ని పురోగమాః

టీక॥ తతః=అంతట; అగ్నిపురోగమాః=అగ్నిదేవుఁడుముందునడుచువాఁడుగాఁగల; సురగణాః=దేవతలయొక్క సమూహంబులు; సమేత్య=వచ్చి; అతులద్యుతిం=సరిలేనికాంతిగల; తం=ఆకుమారుని;

సురసేనాగణపతిం = దేవసేనల యొక్క సమూహములకుఁబ్రభువునుగా; అభ్యషించన్ = అభిషేకించిరి.

అంత,నగ్నిమున్నగు దేవతలందఱువచ్చి, సరిలేనికాంతింగ్రాలుచున్నయాకుమారుని, దేవసేనలకన్నింటికధిపతినిగా,నభిషేకించిరి.

అని, తాత్పర్యము.

ఏష తే రామ గంగాయా విస్తరోభిహితో మయా. ౩౧
కుమారసంభవశ్చైవ ధన్యః పుణ్య స్తథైవచ

టీక॥ రామ=రాముఁడా! మయా= నాచేత; తే=నీకొఱకు; ధన్యః= పుణ్యముగలిగించునదియు; పుణ్యః=పవిత్రమైనదియునగు; ఏషః=ఈ;గంగాయాః= గంగానదియొక్క; విస్తరః=స్వర్గమునందలి, కథావివరమును; తథైవచ= ఆలాగేయుండు; కుమార సంభవశ్చైవ= కుమారస్వామియొక్కయుత్పత్తియు; అభిహితః=చెప్పఁబడినది.

రాముఁడా!నీకు, నేను,ధన్యంబునుబుణ్యమునగు, గంగానదికిస్వర్గమందు జరిగినవృత్తాంతమును, ఆలాగేధన్యముఁ బుణ్యమునగు కుమారస్వామియుత్పత్తియుం, జెప్పితిని. అని, తాత్పర్యము.

భక్తశ్చ యః కార్తికేయే కాకుత్స్థ భువి మానవః. ౩౨
ఆయుష్మాన్ పుత్రపౌత్రైశ్చ స్కందసాలోక్యతాం వ్రజేత్

టీక॥ కాకుత్స్థ = రాముఁడా! భువి=భూమియందు; యః = ఏ; మానవః = మనుష్యుఁడు; కార్తికేయే= కుమారస్వామియందు; భక్తః=భక్తిగలవాఁడో;సః(అధ్యాహృతము) చ=వాఁడును; ఆయుష్మాన్= దీర్ఘాయుస్సుగలవాఁడై; పుత్రపౌత్రైః=కొడుకులతోను మను

మలతోను; యుక్తః(అధ్యాహృతము)చ=కూడినవాఁడునై; స్కంద సాలోక్యతాం, స్కంద=కుమారస్వామితో, సాలోక్యతాం=సమానమైన లోకముగలిగియుండుటను; వ్రజేత్=పొందును.

రాముఁడా! భూమియందేమనుష్యుఁడు, కుమారస్వామియందుభక్తిగలిగియుండునో; అతండిచ్చట దీర్ఘాయుస్సు గలిగి, పుత్రపౌత్రులంగూడియుండి, యంతంబునఁ, గుమారస్వామిలోకంబు, నొందును. అని, విశ్వామిత్రుఁడు రామునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, సప్తత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండసప్తత్రింశసర్గటీక,
ముగిసినది.

---

౩౮

అష్టత్రింశసర్గప్రారంభః.

తాం కథాం కౌశికో రామే నివేద్య కుశికాత్మజః
పునరేవాపరం వాక్యం కాకుత్స్థమిద మబ్రవీత్. ౧

టీక॥ కుశికాత్మజః= కుశవంశమునందుఁబుట్టిన గాధికిఁ గుమారుఁడగు; కౌశికః = విశ్వామిత్రుఁడు; తాం=ఆ; కథాం=కతను; రామే=(చతుర్థ్యర్థమందుసప్తమి) రామునికొఱకు; నివేద్య=తెలిపి; పునరేవ=

మఱల నేః కాకుత్థ్సం=రామునిఁగూర్చిః ఇదం = ఈ;అపరం=మఱియొకః వాక్యం = మాటనుఃఅబ్రవీత్=చెప్పెను.

గాధి కుమారుండగు విశ్వామిత్రుఁడు, ఆకథను రామునకుఁజెప్పి, మఱల రామునింజూచి, యీమాటనుజెప్పెను. అని, తాత్పర్యము.

అయోధ్యాధిపతి శ్శూరః పూర్వ మాసీ న్నరాధిపః
సగరో నామ ధర్మాత్మా ప్రజాకామ స్స చాప్రజః. ౨

టీక॥ పూర్వం = మునుపుఃఅయోధ్యాధిపతిః= అయోధ్యకుఁప్రభువును; ధర్మాత్మా=ధర్మస్వభావుండును; శూరః=యుద్ధమునందువెఱపులేని వాఁడునగు; సగరోనామ=సగరుండనియెడు; నరాధిపః=రాజు; ఆసీత్=ఉండెను. స చ=ఆసగరుండును; అప్రజః=సంతానములేనివాఁడై; ప్రజాకామః=సంతానముఁగోరువాఁడుగాఃఆసీత్ (అధ్యాహృతము)= ఉండెను.

పూర్వము, యుద్ధమునందెంతమాత్రము వెఱపులేక,ధర్మాత్ముండై,యయోధ్యకురాజైయుండు, సగరుండనియెడురాజొకండుండెను; అతఁడు, సంతానములేని వాఁడగుటంజేసి, సంతానముఁగోరుచుండెను. అని, తాత్పర్యము.

వైదర్భదుహితా రామ కేశినీ నామ నామతః
జ్యేష్ఠా సగరపత్నీ సా ధర్మిష్ఠా సత్యవాదినీ. ౩

టీక॥ రామ=రాముఁడా! నామతః=పేరువలన; కేశినీనామ=కేశినియనిప్రసిద్ధయైనః వైదర్భదుహితా=విదర్భదేశపురాజుకొమార్తె; ఆసీత్(అధ్యాహృతము)= ఉండెను. ధర్మిష్ఠా= మిక్కిలిధార్మికురాలును; సత్యవాదినీ=సత్యమెచెప్పునదియునగు;సా=ఆకేశిని;

జ్యేష్ఠా=పెద్దదైన; సగరపత్నీ=సగరునిభార్యగా; ఆసీత్ (అధ్యాహృతము) అయినది.

కేశినియనెడు విదర్భరాజుకొమార్తె యొకతెయుండినది; మిక్కిలి ధార్మికురాలును సత్యవాదిని యునగు నాకేశిని, సగరునకు జ్యేష్ఠభార్యయైనది. అని, తాత్పర్యము.

అరిష్టనేమే ర్దుహితా రూపేణా ప్రతిమా భువి
ద్వితీయా సగరస్యా సీ త్పత్నీ సుమతిసంజ్ఞికా. ౪

టీక॥ భువి = భూమియందు; రూపేణ=సౌందర్యముచేత; అప్రతిమా = సరిలేనట్టి; సుమతిసంజ్ఞికా=సుమతియనుపేరు గల; అరిష్టనేమేః=అరిష్టనేమియొక్క, లేక, కశ్యపునియొక్క (కశ్యపునకరిష్టనేమి యనియును బేరుగలదు); దుహితా=కొమార్తె; సగరస్య=సగరునియొక్క; ద్వితీయా=రెండవదియైన; పత్నీ = భార్య; ఆసీత్=ఆయెను.

భూమియందెక్కడను సౌందర్యంబునసరిలేని సుమతియనుకశ్యపునికొమార్తె సగరునకు రెండవ భార్యయైనది. అని, తాత్పర్యము.

తాభ్యాం సహ తదా రాజా పత్నీభ్యాం త_ప్తవాం_స్తపః
హిమవంతం సమాసాద్య భృగుప్రస్రవణే గిరౌ. ౫

టీక॥ తదా = అప్పుడు; రాజా = రాజైన సగరుఁడు; తాభ్యాం=ఆ; పత్నీభ్యాం = భార్యలతోఁగూడ; హిమవంతం=హిమవత్పర్వతమును; సమాసాద్య=పొంది; భృగుప్రస్రవణే= భృగుప్రస్రవణంబనెడు (భృగుమహర్షిచేనధిష్ఠింపఁబడినసెలయేఱుగల); గిరౌ=కొండయందు; తపః=తపస్సును; త_ప్తవాన్=తపించెను.

అప్పుడా సగర చక్రవర్తి, ఆ భార్యలంగూడి, హిమవత్పర్వతముఁజేరి, యందుభృగు ప్రస్రవణంబను నొక్క కొండ యందుఁ దపంబు

చేసెను. అని, తాత్పర్యము.

అథ వర్షశతే పూర్ణే తపసా రాధితో మునిః
సగరాయ వరం ప్రాదా ద్భృగు స్సత్యవతాం వరః. ౬

టీక॥ అథ=అటుపిమ్మట; వర్షశతే=సంవత్సరములయొక్క-నూఱు; పూర్ణే=నిండఁగా; సత్యవతాం=సత్యముగలవారిలో; వరః=శ్రేష్ఠుఁడైన; మునిః=బ్రహ్మానుసంధానము సేయునట్టి; భృగుః=భృగుమహర్షి; తపసా=తపముచేత; ఆరాధితః=సంతోషపఱుపఁబడినవాఁడై; సగరాయ=సగరునికొఱకు; వరం=వరమును; ప్రాదాత్=ఇచ్చెను.

అంత, సగరుఁడిట్లు, నూఱుసంవత్సరములుతపముసేసినపిమ్మట, సత్యవంతులలో శ్రేష్ఠుండగు భృగుమహాముని, యాతపంబునకు సంతోషించి, సగరునకువరంబొసంగెను. అని, తాత్పర్యము.

అపత్యలాభ స్సుమహాన్ భవిష్యతి తవా నఘ
కీర్తిం చా ప్రతిమాం లోకే ప్రాప్స్యసే పురుషర్షభ. ౭

టీక॥ అనఘ=పాపములేని సగరుఁడా! తవ=నీకు; సుమహాన్=మిక్కిలియధికమైన; అపత్యలాభః=సంతానలాభము; భవిష్యతి=కాఁగలదు. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుఁడవైనసగరుఁడా! త్వం (అధ్యాహృతము)=నీవు; లోకే=ప్రపంచమందు; అప్రతిమాం=సరిలేని; కీర్తిం చ= యశమును; ప్రాప్స్యసే=పొందఁగలవు.

పాప రహితుండవగు సగరుఁడా, నీకుఁ మిక్కిలియధికముగా సంతానముగల్గును; పురుషశ్రేష్ఠుఁడవైనసగరుఁడా! నీవీలోకంబునందు, సరిలేని యశంబునుం బొందఁగలవు. అని, తాత్పర్యము.

ఏకా జనయితా తాత పుత్రం వంశకరం తవ
షష్టిః పుత్రసహస్రాణి అపరా జనయిష్యతి. ౮

టీక॥ తాత=నాయనా! తవ=నీ యొక్క; ఏకా=ఒక, భార్య; వంశకరం= వంశమును జేయునట్టి; పుత్రం=కొడుకును; జనయితా = పుట్టింపఁగలదు. అపరా=మఱియొక, భార్య; షష్టిః=అఱువది; పుత్రసహస్రాణి=కొడుకులయొక్క వేలను; జనయిష్యతి= పుట్టింపఁగలదు.

నాయనా! నీభార్యలలోనొకతె వంశకరుండగునొకకొడుకును గనఁగలదు; రెండవభార్య వంశకరులు గానట్టి యఱువదివేల పుత్రులను గనఁగలదు. అని వరమునిచ్చెను. అని, తాత్పర్యము

భాషమాణం మహాత్మానం రాజపుత్ర్యౌ ప్రసాద్య తమ్
ఊచతుః పరమప్రీతే కృతాంజలిపుటే తదా. ౯

టీక॥ తదా=అప్పుడు; భాషమాణం=మాటలాడుచున్న; మహాత్మానం=పూజ్యమైనస్వభావముగలవానిని; తం=ఆ; భృగుమహర్షిని; రాజపుత్ర్యౌ= రాచకొమార్తెలగు కేశినియుసుమతియును; (ఇచ్చట; సుమతికశ్యపుని కూఁతురుకావునఁ, గేశిని మాత్రమే రాచకొమార్తె యయినప్పటికిని, "గొడుగుగలవారలగుంపుపోవుచున్నది" అని, గుంపులోఁగొందఱుగొడుగులేని వారలున్నను, అందఱునుగొడుగుగలవారలనుమాటచే వ్యవహరింపఁ బడునట్లు(ఛత్రిన్యాయమననుసరించి) ద్దఱును రాచకొమార్తెలని ప్పఁబడినది); ప్రసాద్య=సంతోషపెట్టి; పరమప్రీతే=మిక్కిలియుసంతసించినవారలై; కృతాంజలిపుటే, కృత=చేయఁబడిన, అంజలిపుటే=దొప్పవంటిచేమోడ్పుగలవారలై; ఊచతుః=చెప్పిరి.

ఇట్లు, చెప్పుచున్నమహాత్ముండగునాభృగుమహర్షిని, సంతోషపెట్టి, కేశినియుసుమతియును మిక్కి

లిసంతసించి, చేమోడ్పు గీలించి, యిట్లనిచెప్పిరి.

అని, తాత్పర్యము.

ఏకః కస్యా స్సుతో బ్రహ్మన్ కా బహూన్ జనయిష్యతి
శ్రోతు మిచ్ఛావహే బ్రహ్మన్ సత్య మస్తు వచ స్తవ. ౧౦

టీక॥ బ్రహ్మన్ = బ్రాహ్మణుఁడవైన భృగుమహర్షీ! కస్యాః = ఎవతెకు; ఏకః = ఒకఁడైన; సుతః = కొడుకు; భవిష్యతి (అధ్యాహృతము) = కాఁగలఁడు? కా = ఎవతె; బహూన్ = అనేకులను; జనయిష్యతి = పుట్టింపఁగలదు? బ్రహ్మన్ = బ్రాహ్మణుఁడవైనభృగుమహర్షీ! శ్రోతుం = వినుటకు; ఇచ్ఛావహే = కోరెదము. తవ = నీయొక్క; వచః = మాట; సత్యం = అనృతముకానిది; అస్తు = అగుఁగాక.

బ్రాహ్మణుఁడవైన భృగుమహామునీ! ఎవ్వతెకొకకొడుకుపుట్టును? ఎవ్వతెకఱువదివేవురు గొడుకులుగల్గుదురు? దీనినిమేమువిన గోరెదము; నీవెట్లుచెప్పెదవో అట్లెఅగుఁగాక; మాకదియిష్టము. అని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

తయో స్తద్వచనం శ్రుత్వా భృగుః పరమధార్మికః
ఉవాచ పరమాం వాణీం స్వచ్ఛందో త్ర విధీయతామ్. ౧౧
ఏకో వంశకరో వాస్తు బహవోవా మహాబలాః
కీర్తిమంతో మహోత్సాహాః కావా కం వర మిచ్ఛతి. ౧౨

టీక॥ తయోః = ఆకేశినీసుమతులయొక్క; తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; పరమధార్మికః = మిక్కిలియు ధర్మముసేయునట్టి; భృగుః = భృగుమహర్షి; "అత్ర = ఈవిషయమందు; స్వచ్ఛందః = స్వేచ్ఛ; విధీయతాం = ఏర్పాటుచేయఁబడుఁగాక. వంశకరః = వంశ

మును జేయునట్టి; ఏకోవా=ఒకకొడుకైనను; అస్తు=అగుఁగాక. మహాబలాః=అధికమైనబలముగలవారును; కీర్తిమంతః=ప్రశస్తంబగుకీర్తి గలవారును; మహోత్సాహాః=అధికమైన యుత్సాహముగలవారునగు; బహవోవా=బహుపుత్రులైనను; సంతు (అధ్యాహృతము)=అగుదురుగాక. కావా=ఎవతె; కం=ఏ; వరం=వరమును;ఇచ్ఛతి=కోరుచున్నదిః ఇతి(అధ్యాహృతము)=అని; పరమాం=ఉత్కృష్టమైన; వాణీం=మాటను;ఉవాచ=చెప్పెను.

ఆ కేశినీసుమతులమాటనువిని,పరమధార్మికుండగుభృగుమహర్షి, వారలంజూచి, "మీరు స్వేచ్ఛగానేర్పాటుచేసికొనుఁడు; ఎవతెవంశకరుండగునొకకొడుకె కావలయునని కోరునో, దానికట్లెకలుగును;ఎవతె,మహాబలులును,గీర్తిగలవారును అధికమైన యుత్సాహముగలవారునగు, వంశకరులుమాత్రముకానట్టి యఱువదివేవురుఁ గొడుకులఁగోరునో, దానికట్లెయఱువదివేవురునుగల్గుదురు; మీలో, నెవ్వతెకేవరము కావలయుః దానిం జెప్పుఁడు. అని, యుత్కృష్టంబగుమాటచెప్పెను.

అని, తాత్పర్యము.

మునేస్తు వచనం శ్రుత్వా కేశినీ రఘునందన
పుత్రం వంశకరం రామ జగ్రాహ నృపసన్నిధౌ. ౧౩

టీక॥ రఘునందన= రఘువంశమునఁబుట్టినవారిసంతసింపఁజేయునట్టి; రామ=రాముఁడా! మునేః=భృగుమహామునియొక్క; వచనం=మాటను; శ్రుత్వాతు=వినినంతనె; కేశినీ= కేశినియనునది; నృపసన్నిధౌ=రాజైనసగరునిసమీపమందు; వంశకరం= వంశమును జేయునట్టి; పుత్రం=కొడుకును; జగ్రాహ=గ్రహించెను,కోరెననుట.

రఘునందనుండవగు రాముఁడా!భృగుమహామునిమాటవినినంత

నై, పెద్దభార్యయైన కేశిని, సగరునిస న్నిధానంబున, వంశకరుండగు పుత్రునిం, గోరెను.

అని, తాత్పర్యము.

షష్టిః పుత్ర సహస్రాణి సుపర్ణభగినీ తదా
మహోత్సాహాన్ కీర్తిమతో జగ్రాహ సుమతి స్సుతాన్. ౧౪

టీక॥ తదా=అప్పుడు; సుపర్ణభగినీ=గరుత్మంతునితోడం బుట్టువగు; సుమతిః = సుమతియనునది; మహోత్సాహాన్=అధికమైనయుత్సాహముగలవారును; కీర్తిమతః=ప్రశస్తమగుకీర్తిగలవారునగు; సుతాన్=కొడుకులను; షష్టిః=అఱువది; పుత్రసహస్రాణి=కొడుకులయొక్క వేలను; జగ్రాహ = గ్రహించెను.

అప్పుడు, గరుత్మంతుని తోడం బుట్టువగు సుమతి, మహోత్సాహులును గీర్తిగలవారునగు నఱువదివేవురం గొడుకులంగోరెను.

అని, తాత్పర్యము.

ప్రదక్షిణ మృషిం కృత్వా శిరసా భిప్రణమ్యచ
జగామ స్వపురం రాజా సభార్యో రఘునందన. ౧౫

టీక॥ రఘునందన=రాముఁడా! రాజా = రాజైనసగరుఁడు; సభార్యః= భార్యలతోఁగూడినవాఁడై; ఋషిం= భృగుమహర్షినిగూర్చి; ప్రదక్షిణం = ప్రదక్షిణమును; కృత్వా=చేసి; శిరసా=తలచేత; అభిప్రణమ్యచ=నమస్కరించియు; స్వపురం=తనపట్టణమును; జగామ=పొందెను.

రాముఁడా! సగరచక్రవర్తి, భార్యలంగూడి, యాభృగుమహర్షికిఁ బ్రదక్షిణ నమస్కారంబులు చేసి, తనపట్టణంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

అథ కాలే గతే తస్మిన్ జ్యేష్ఠా పుత్రం వ్యజాయత

అసమంజఇతి ఖ్యాతం కేశినీ సగరాత్మజమ్. ౧౬

టీక॥ అథ = అటుపిమ్మట; తస్మిన్ = ఆ; కాలే = గర్భధారణకాలము; గతే = కడవఁగా; జ్యేష్ఠా = పెద్దభార్యయైన; కేశినీ = కేశినియనునది; సగరాత్మజం = సగరునకుఁగొడుకైన; అసమంజఇతి = అసమంజుఁడని; ఖ్యాతం = ప్రసిద్ధుఁడగు; పుత్రం = కొడుకును; వ్యజాయత = కనెను.

అంత, గర్భధారణోపయోగియగుతొమ్మిదిమాసములునుగడవఁగానే, సగరునిపెద్దభార్యయగుకేశిని, యసమంజుఁడనుపేరం బ్రసిద్ధుఁడైన పుత్రునిం, గనెను. అని, తాత్పర్యము.

సుమతిస్తు నరవ్యాఘ్ర గర్భతుంబం వ్యజాయత
షష్టిః పుత్ర సహస్రాణి తుంబభేదా ద్వినిస్సృతాః. ౧౭

టీక॥ నరవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుఁడవైనరాముఁడా! సుమతిస్తు = సుమతియను నదియును; గర్భతుంబం = సొరకాయవంటిగర్భపిండమును; వ్యజాయత = కనెను. తుంబభేదాత్, తుంబ = సొరకాయయొక్క, సొరకాయవంటిగర్భపిండముయొక్కయనుట, భేదాత్ = భేదించుటవలన; పుత్రసహస్రాణి = కొడుకులయొక్కవేలు, షష్టిః = అఱువది; వినిస్సృతాః = బయలువెడలినవి.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! రెండవభార్యయైనసుమతికిని, సొరకాయ వలెనుండు గర్భపిండమొకటిపుట్టినది; ఆపిండమునుభేదింపఁగానే, యందుండి, అఱువదివేవురుకొడుకులుద్భవించిరి అని, తాత్పర్యము.

ఘృతపూర్ణేషు కుంభేషు ధాత్ర్యస్తాన్ సమవర్ధయన్
కాలేన మహతా సర్వే యౌవనం ప్రతిపేదిరే. ౧౮

టీక॥ ధాత్ర్యః = దాదులు; తాన్=ఆకొడుకులను; ఘృతపూర్ణేషు=నేతిచేనిండిన; కుంభేషు= కుండలందు; సమవర్ధయన్=పెంచిరి. సర్వే=అందఱును; మహతా= దీర్ఘమైన; కాలేన=కాలముచేత; యౌవనం=జవ్వనమును; ప్రతిపేదిరే=పొందిరి.

దాదులాశిశువుల నేతిచేనిండిన కుండలందుంచి పెంచిరి; అంత, దీర్ఘకాలంబున వారందఱు యౌవనంబునొందిరి. అని, తాత్పర్యము.

అథ దీర్ఘేణ కాలేన రూపయౌవనశాలినః
షష్టిః పుత్రసహస్రాణి సగరస్యాభవం స్తదా. ౧౯

టీక॥ అథ = అటుపిమ్మట; తదా=అప్పుడు; దీర్ఘేణ=దీర్ఘమైన; కాలేన=కాలముచేత; సగరస్య=సగరచక్రవర్తియొక్క; పుత్రసహస్రాణి= కొడుకులయొక్క వేలు; షష్టిః=అఱువదియును; రూపయౌవనశాలినః= సౌందర్యముచేతనుయౌవనముచేతనుం బ్రకాశించునవి; అభవన్=అయినవి.

అంత, దీర్ఘకాలంబునకు, సగరునికొడుకులఱువదివేవురును సౌందర్యమునుయౌవనంబునుంగల్గి ప్రకాశించిరి. అని, తాత్పర్యము.

సచ జ్యేష్ఠో నరశ్రేష్ఠ సగరస్యాత్మసంభవః
బాలాన్ గృహీత్వా తు జలే సరయ్వా రఘునందన. ౨౦
ప్రక్షిప్య ప్రహస న్నిత్యం మజ్జత స్తాన్ సమీక్ష్యవై

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవైన; రఘునందన=రాముఁడా! సగరస్య=సగరునియొక్క; జ్యేష్ఠః= పెద్దవాఁడైన; ఆత్మసంభవః=కొడుకును; నిత్యం = ఎల్లప్పుడు; బాలాన్ = పిల్లవాండ్రను; గృహీత్వాతు=పట్టుకొని; సరయ్వాః = సరయూనదియొక్క; జలే = నీటియం

దుః; ప్రక్షిప్య = పడవేసి; మజ్జతః= మునుఁగుచున్న; తాన్=ఆపిల్లవాండ్రను; సమీక్ష్య=చూచి("వై" అనునది పాదపూరణార్థము); ప్రహసన్=నవ్వుచు; ఆసీత్(అధ్యాహృతము)=ఉండెను.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! సగరుని జ్యేష్ఠపుత్త్రుఁడు, ఎల్లప్పుడును, బిల్లవాండ్రంబట్టి సరయూనదిజలంబులం బడఁద్రోసి, వారలాజలంబుల మునుంగుటంజూచి, నవ్వుచుండెను. అని, తాత్పర్యము.

ఏవం పాపసమాచార స్సజ్జనప్రతిబాధకః. ౨౧
పౌరాణా మహితే యుక్తః పుత్రో నిర్వాసితః పురాత్

టీక॥ ఏవం=ఇట్లు; పాపసమాచారః, పాప=పాపములుగల్గించునట్టి, సమాచారః=నడతలుగలవాఁడును; సజ్జనప్రతిబాధకః=మంచివారిని బాధించు వాఁడును; పౌరాణాం=పట్టణమందుండువారికి; అహితే=అనిష్టమందు; యుక్తః=ఆసక్తుఁడునగు; పుత్రః=కొడుకైన; యసమంజుఁడు; సగరేణ (అధ్యాహృతము)= సగరునిచేత; పురాత్=పట్టణమునుండి; నిర్వాసితః= వెడలఁగొట్టఁబడెను.

ఇట్లు, పాపిష్ఠంబగు నడతగల్గి, మంచివారిబాధించుచుఁ, బట్టణవాసులగు వారికనిష్టము సేయుచున్న యసమంజుని, సగరుఁడు, పట్టణంబునుండి, వెడలఁగొట్టెను.

అని, తాత్పర్యము.

తస్య పుత్రోంశుమా న్నామ అసమంజస్య వీర్యవాన్. ౨౨
సమ్మత స్సర్వలోకస్య సర్వస్యాపి ప్రియంవదః

టీక॥ తస్య=ఆ; అసమంజస్య= అసమంజునకు; వీర్యవాన్= పరాక్రమము గలవాఁడును; సర్వలోకస్య= సమస్తమైన జనమునకును; సమ్మతః= ఇష్టుఁడైనవాఁడును; సర్వస్యాపి=సమస్తజనమునకును; ప్రి

యంవదః= ఇష్టముగామాటలాడు వాఁడునగు; అంశుమాన్నామ = అంశుమంతుఁడనెడు; పుత్రః=కొడుకు; ఆసీత్ (అధ్యాహృతము)= ఉండెను.

ఆయసమంజునకుఁ, బరాక్రమశాలియుసమస్తజనులకు సమ్మతుండును ఎల్లరకుఁబ్రియంబుగా మాటలాడువాఁడునగు నంశుమంతుండను పుత్రుండొకండుండెను.

అని, తాత్పర్యము.

తతః కాలేన మహతా మతి స్సమభిజాయత. ౨౩
సగరస్య నరశ్రేష్ఠ యజేయ మితి నిశ్చితా

టీక॥ నరశ్రేష్ఠ= పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! తతః= అటుపిమ్మట, మహతా=దీర్ఘమైన; కాలేన=కాలముచేత; సగరస్య= సగరచక్రవర్తికి; యజేయం=యాగముసేయుదును; ఇతి=అని; నిశ్చితా=నిశ్చయముగల; మతిః = బుద్ధి; సమభిజాయత ( సమభ్యాజాయత)=పుట్టినది.

పురుష శ్రేష్ఠుఁడవగు రాముఁడా! అంత, దీర్ఘకాలము గడచిన పిదప, సగరునకు "యాగముసేయవలయు" నని, నిశ్చితంబగుతలంపు గల్గినది. అని, తాత్పర్యము.

స కృత్వా నిశ్చయం రామ సోపాధ్యాయగణ స్తదా. ౨౪
యజ్ఞకర్మణి వేదజ్ఞో యష్టుం సముపచక్రమే

టీక॥ రామ=రాముఁడా! తదా=అప్పుడు; వేదజ్ఞః=వేదంబులనెఱింగినట్టి; సః=ఆ;సగరుఁడు; సోపాధ్యాయగణః = ఋత్విజులయొక్క-సమూహముతోఁ గూడినవాఁడై; యజ్ఞకర్మణి=యాగకార్యమువిషయమై; నిశ్చయం=ఏర్పాటును; కృత్వా= చేసి;యష్టుం = యాగముసేయుటకు; సముపచక్రమే=ఆరంభించెను.

రాముఁడా! అప్పుడు, వేదవేదార్థంబుల నెఱింగినయాసగరుండు, ఋత్విజులంగూడి, యాగకార్యంబు గుఱించి యేర్పాటుచేసి, యాగంబుసేయ, నారంభించెను. అని, విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, అష్టత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండాష్టత్రింశసర్గటీక,
ముగిసినది.

---

౩౯

ఏకోనచత్వారింశసర్గప్రారంభః.

విశ్వామిత్రవచశ్శ్రుత్వా కథాంతే రఘునందనః
ఉవాచ పరమప్రీతో మునిం దీప్తమివానలమ్. ౧

టీక॥ రఘునందనః= రాముఁడు; విశ్వామిత్రవచః=విశ్వామిత్రునిమాటను; శ్రుత్వా=విని; కథాంతే=మాటయొక్కతుదయందు; పరమప్రీతః=మిక్కిలియుసంతసించినవాఁడై; దీప్తం=మండిన; అనలమివ(స్థితం)= అగ్నిహోత్రునివలెనున్నట్టి, మునిం=విశ్వామిత్రమహామునింగూర్చి; ఉవాచ= చెప్పెను.

రాముండు, విశ్వామిత్రునిమాటవిని, తుదను, "సగరుఁడుయాగమునారంభించె" ననుమాటను విని




నంతనే, మిక్కిలిసంతోషము నొంది, చక్కగామండినిలిచి యున్న యగ్నిహోత్రునిం బోలెవెలుంగు విశ్వామిత్రునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

శ్రోతు మిచ్ఛామి భద్రం తే విస్తరేణ కథా మిమామ్
పూర్వకో మే కథం బ్రహ్మన్ యజ్ఞం వై సముపాహరత్. ౨

టీక॥ బ్రహ్మన్ = బ్రాహ్మణుండవైనవిశ్వామిత్రుండా! తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)= అగుంగాక. మే=నాయొక్క;పూర్వకః=కూటస్థుండైన సగరుండు, కథం=ఎట్లు;యజ్ఞం=యాగమును ("వై" అనునదిపాదపూరణార్థకము); సముపాహరత్=చేసెను?ఇమాం = ఈ; కథాం=కతను; విస్తరేణ=వివరముచేత;శ్రోతుం = వినుటకు;ఇచ్ఛామి=కోరుచున్నాను.

బ్రాహ్మణుండవైన విశ్వామిత్రుండా! నీకుమంగళ మగుంగాక; నాకూటస్థుండగు సగరచక్రవర్తి, యాగంబునెట్లుచేసెను? నేనీకథను వివరముగావినంగోరెదను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రస్తు కాకుత్స్థ మువాచ ప్రహసన్నివ

టీక॥ విశ్వామిత్రస్తు=విశ్వామిత్రుండును;ప్రహసన్ = నవ్వుచు ("ఇవ" అనునదివాక్యాలంకారార్థము.);కాకుత్స్థం = రాముని గూర్చి;ఉవాచ=చెప్పెను.

విశ్వామిత్రుండును, "ఇతండు నేనుజెప్పందలంచినదానినే యడిగెను, ఇతండు సర్వజ్ఞుండైనను దానెఱుంగనివాండు వోలె నభినయించుచున్నాం"డనినవ్వుచు, రామునింజూచి యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రూయతాం విస్తరో రామ సగరస్య మహాత్మనః. ౩




టీక॥ రామ=రాముఁడా! త్వయా(అధ్యాహృతము)=నీచేత; మహాత్మనః= పూజ్యస్వభావముగల; సగరస్య =సగరునియొక్క; విస్తరః=కథావివరము; శ్రూయతాం= వినఁబడుఁగాక.

రాముఁడా! మహాత్ముండగు సగరునికథయంతయుఁ జెప్పెద; వినుము. అని, తాత్పర్యము.

శంకరశ్వశురో నామ హిమవా నచలో త్తమః
విన్ధ్యపర్వత మాసాద్య నిరీక్షేతే పరస్పరమ్. ౪

టీక॥ శంకరశ్వశురః= శివునకు మామయైన; హిమవాన్నామ=హిమవంతుఁడనెడు; అచలోత్తమః= పర్వతశ్రేష్ఠము; విన్ధ్యపర్వతం = విన్ధ్యపర్వతమును; ఆసాద్య=సమీపించి; స్థితః = ఉన్నది; (రెండుపర్వతముల నడుమ పెద్ద పర్వతమేదియు లేనందున సమీపమందున్నట్టున్నదనుట). తౌ(అధ్యాహృతము), ఆపర్వతములు; పరస్పరం=ఒండొరులను; నిరీక్షేతే= చూచుచున్నవి.

శివునిమామయైనహిమవంతుండనుపర్వతశ్రేష్ఠము విన్ధ్యపర్వతము దగ్గఱియున్నది; ఆపర్వతములు రెండునుమిక్కిలి యున్నతములై యున్నందునఁ, బరస్పరము చూచుచున్నట్లున్నవి. అని, తాత్పర్యము.

తయో ర్మధ్యే ప్రవృత్తో భూ ద్యజ్ఞ స్స పురుషోత్తమ
సహి దేశో నరవ్యాఘ్ర ప్రశస్తో యజ్ఞకర్మణి. ౫

టీక॥ పురుషోత్తమ=పురుషశ్రేష్ఠుఁడవైనరాముఁడా! సః=ఆ; యజ్ఞః=యాగము; తయోః=ఆరెండుపర్వతములయొక్క; మధ్యే = నడుమను; ప్రవృత్తః=జరిగినది; అభూత్ = అయినది. నరవ్యాఘ్ర= మనుష్యశ్రేష్ఠుఁడవగు రాముఁడా! సః=ఆ; దేశః=రెండుపర్వతములనడుమనుండు దేశము; యజ్ఞకర్మణి= యాగ కార్యమునందు; ప్రశస్తో

హి=శ్రేష్ఠమైనదిగదా!

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఆవింధ్యహిమవత్పర్వతములనడుమనుండు దేశము యాగములు సేయుటకుఁ బ్రశస్తమైనది, కావున, నాసగరునియాగము, ఆరెండు పర్వతములనడుమ, జరిగినది.

అని, తాత్పర్యము.

తస్యాశ్వచర్యాం కాకుత్థ్స దృఢధన్వా మహారథః
అంశుమా నకరో త్తాత సగరస్య మతే స్థితః. ౬

టీక॥ కాకుత్థ్స=కకుత్థ్సవంశమునం బుట్టిన; తాత=నాయనా! దృఢధన్వా=దృఢమైన విల్లుగలవాఁడును; మహారథః=తన్నునుసారథిని గుఱ్ఱములను కాపాడుకొనుచు పదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరువాఁడునగు; అంశుమాన్=అంశుమంతుఁడు; సగరస్య=సగరునియొక్క; మతే=అజ్ఞయందు; స్థితః=ఉన్నవాఁడై; తస్య = ఆయాగముయొక్క; అశ్వచర్యాం= గుఱ్ఱముయొక్క వెంబడించుటను; అకరోత్=చేసెను.

రాముఁడా! దృఢంబగుధనుస్సు ధరించి, తన్నునుసారథిని గుఱ్ఱంబులనుంగాపాడుకొనుచుఁ బదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరం జాలినయంశుమంతుండు, సగరునాజ్ఞనను సరింపుచు, నాయశ్వమును రక్షణార్థమై వెంబడించెను.

అని, తాత్పర్యము.

తస్య పర్వణి తం యజ్ఞం యజమానస్య వాసవః
రాక్షసీం తను మాస్థాయ యజ్ఞీయాశ్వ మపాహరత్. ౭

టీక॥ వాసవః=ఇంద్రుఁడు; రాక్షసీం=. రాక్షససంబంధియగు; తనుం=శరీరమును; ఆస్థాయ=పొంది; పర్వణి = ఉక్థ్యకాలమునందు (ఉక్థ్యమనునదియాగములోనొకభాగము); తం=ఆ; యజ్ఞం=అశ్వమేధ

యాగమును; యజమానస్య = యజించుచున్నట్టి; తస్య = ఆసగరుని యొక్క; యజ్ఞీయాశ్వం = యాగార్హమైన గుఱ్ఱమును; అపాహరత్ = అపహరించెను.

ఇంద్రుఁడు, రాక్షస దేహము దాల్చి, యుక్థ్యము సేయుకాలమందు, అశ్వమేధయాగము సేయుసగరుని యాగీయాశ్వమునపహరించెను. అని, తాత్పర్యము.

హ్రియమాణేతు కాకుత్థ్స తస్మి న్నశ్వే మహాత్మనః
ఉపాధ్యాయగణా స్సర్వే యజమాన మథాబ్రువన్. ౮

టీక॥ కాకుత్థ్స = రాముఁడా! మహాత్మనః = పూజ్యస్వభావముగల సగరుని యొక్క; తస్మిన్ = ఆ; అశ్వే = గుఱ్ఱము; హ్రియమాణేతు = అపహరింపఁబడుచుండఁగానే; అథ = అటుపిమ్మట; ఉపాధ్యాయగణాః = ఋత్విజులసమూహములు; సర్వే = అన్నియును; యజమానం = యాగముసేయునట్టి సగరునిఁగూర్చి; అబ్రువన్ = చెప్పినవి.

రాముఁడా! మహాత్ముండగు సగరుని యాగీయాశ్వంబపహరింపఁ బడుచుండఁగానే, ఋత్విజులందఱు దానింజూచి, సగరునితో, నిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

అయం పర్వణి వేగేన యజ్ఞీయాశ్వో పనీయతే
హర్తారం జహి కాకుత్థ్స హయశ్చైవోప నీయతామ్. ౯

టీక॥ కాకుత్థ్స = రాముఁడా! అయం = ఈ; యజ్ఞీయాశ్వః = యాగార్హమగుగుఱ్ఱము; పర్వణి = ఉక్థ్యకాలమందు; వేగేన = వేగముచేత; అపనీయతే = (భూతార్థమందులట్) అపహరింపఁబడినది. హర్తారం = అపహరించువానిని; జహి = చంపుము; హయశ్చైవ = గుఱ్ఱమును; ఉపనీయతాం = తేఁబడుఁగాక.

(ఇచ్చట "కాకుత్థ్స" అని, విశ్వా

మిత్రుఁడు రాముని గూర్చిసంబోధించెను" అనియెఱుంగునది. కకుత్థ్సుఁడు, సగరునిముని మనుమని మనుమఁడగుటంజేసి, కకుత్థ్సవంశస్థుఁడనుట సగరునియందుంబొసంగదు, కావున, సగరపరముకానేరదు.)

మనము, ఉక్థ్యముసేయుచుండునపు, డీయాగీయాశ్వము, వేగంబున, నపహరింపఁబడినది; కావున, నపహరించినవానింజంపి మఱలనాగుఱ్ఱముసు దీసికొనిరమ్ము.

అని, తాత్పర్యము.

యజ్ఞచ్ఛిద్రం భవత్యేత త్సర్వేషా మశివాయనః
తత్తథా క్రియతాం రాజన్ యథాఽచ్ఛిద్రః క్రతుర్భవేత్. ౧౦

టీక॥ ఏతత్ = ఈ, యజ్ఞచ్ఛిద్రం= యాగమునందలియపరాధము ("ఛిద్రం రంధ్రాపరాధయోః" అని వైజయంతి); నః=మనకు; సర్వేషాం=అందఱకును; అశివాయ=అమంగళముకొఱకు; భవతి=అగుచున్నది. తత్=అందువలన; రాజన్=రాజా! యథా=ఎట్లు; క్రతుః=యాగము; అచ్ఛిద్రః=అపరాధము లేనిది; భవేత్=అగునో; తథా=అట్లు; క్రియతాం=చేయఁబడుఁగాక.

ఇప్పుడు, యాగమునందుఁగలిగినయీతప్పువలన, మనకందఱకును జేటుగల్గును; కావున, రాజా! ఈ యాగంబెట్లపరాధములేక చక్కఁబడునో, ఆప్రకారముసేయుము. అని, ఋత్విజులు, సగరునకుంజెప్పిరి.

అని, తాత్పర్యము.

ఉపాధ్యాయవచశ్శ్రుత్వా తస్మిన్ సదసి పార్థివః
షష్టిం పుత్రసహస్రాణి వాక్యమేత దువాచ హ. ౧౧

టీక॥ పార్థివః= రాజైనసగరుఁడు; ఉపాధ్యాయవచః=ఋత్విజులమాటను; శ్రుత్వా = విని; తస్మిన్=ఆ; సదసి = సభయందు; షష్టిం=అఱువది; పుత్రసహస్రాణి=కొడుకులయొక్క వేలనుంగూర్చి; ఏ

తత్=ఈ;వాక్యం=మాటను;ఉవాచ=చెప్పెను. "హ"అనునది పాదపూరణార్థము.

ఋత్విజులమాటవిని, సగరచక్రవర్తి, ఆయాగసదస్సునందుఁ,దనకొడుకుల నఱువది వేవురంజూచి, యీమాటచెప్పెను,

అని, తాత్పర్యము.

గతిం పుత్రా న పశ్యామి రక్షసాం పురుషర్షభాః
మంత్రపూతై ర్మహాభాగై రాస్థితో హి మహాక్రతుః. ౧౨

టీక॥ పురుషర్షభాః=పురుషశ్రేష్ఠులైన;పుత్రాః=కొడుకులారా! రక్షసాం = రాక్షసులకు;గతిం=అవకాశమును; నపశ్యామి=చూడలేదు;మహాక్రతుః = పూజ్యమైనయీయశ్వమేధయాగము;మంత్రపూతైః=మంత్రములచేతఁబరిశుద్ధులైన; మహాభాగైః=పూజ్యమైనభాగ్యముగల ఋత్విజులచేత; ఆస్థితోహి= అనష్ఠింపఁబడినదిగదా!

పురుష శ్రేష్ఠులరగుకొడుకులారా! ఈయశ్వమేధయాగము,మంత్రజులగుపూజ్యులైనఋత్విజులచేత ననష్ఠింపఁబడుచున్నది, కావున,రాక్షసుల కవకాశం బెంతమాత్రము నాకగుపడలేదు.

అని, తాత్పర్యము.

తద్గచ్ఛత విచిన్వధ్వం పుత్రకా భద్ర మస్తు వః
సముద్రమాలినీం సర్వాం పృథివీ మనుగచ్ఛత ౧౩

టీక॥ పుత్రకాః= కొడుకులారా! తత్=అందువలన; యూయం (అధ్యాహృతము)= మీరలు,గచ్ఛత=పొండు; విచిన్వధ్వం= వెదకుఁడు. వః=మీకు;భద్రం = మంగళము;అస్తు (అధ్యాహృతము)= అగుఁగాక.సముద్రమాలినీం,సముద్రమె యావరణముగాఁగల; పృథివీం=భూమిని;సర్వాం=అంతను; అనుగచ్ఛత=వెదకుఁడు.

కొడుకులారా! గుఱ్ఱమున పహరించినవారు, వీరని, మనమెఱుంగ

ము, కావున, మీరుపోయి వెదకుఁడు; మీకుమంగళమగుఁగాక; సముద్రమధ్యమందున్నట్టి భూమియంత యుఁదిరిగి, వెదకుఁడు.

అని, తాత్పర్యము.

ఏకైకయోజనం పుత్రా విస్తార మధిగచ్ఛత

టీక॥ పుత్రాః=కొడుకులారా! ఏకైకయోజనం=ఒకొకఆమడగా; విస్తారం=భూమియొక్క, వైశాల్యమును; అధిగచ్ఛత=పొందుఁడు.

కొడుకులారా! మీరలొక్కొక్క ఆమడగా, భూమియంతయుఁదిరుగుఁడు. అని, తాత్పర్యము.

యావ త్తురగసందర్శ స్తావ త్ఖనత మేదినీమ్. ౧౪
తం చైవ హయహర్తారం మార్గమాణా మమాజ్ఞయా

టీక॥ యూయం (అధ్యాహృతము)=మీరలు; మమ=నాయొక్క; ఆజ్ఞయా=ఆజ్ఞచేత; తం=ఆ; హయహర్తారం చైవ= గుఱ్ఱమునపహరించినవానిని; మార్గమాణాః=వెదకుచు; యావత్=ఎంతలోపల; తురగసందర్శః = గుఱ్ఱముయొక్క చూచుట; స్యాత్ (అధ్యాహృతము)=అగునో; తావత్=అంతవఱకు; మేదినీం=భూమిని; ఖనత=త్రవ్వుఁడు.

మీరలు, నాయాజ్ఞచొప్పున, గుఱ్ఱమునపహరించిన వానివెదకుచు, గుఱ్ఱముగుపడువఱకు, నేలంద్రవ్వుఁడు. అని, తాత్పర్యము.

దీక్షితః పౌత్రసహిత స్సోపాధ్యాయగణో హ్య హమ్. ౧౫
ఇహ స్థాస్యామి భద్రం వో యావ త్తురగదర్శనమ్

టీక॥ దీక్షితః = యాగదీక్షవహించిన; అహం=నేను; పౌత్రస

హితః=మనుమనితోఁ గూడినవాఁడ నై; సోపాధ్యాయగణః=ఋత్విజులతోడం గూడిన వాఁడనై; యావత్ = ఎంతలోపల; తురగదర్శనం = గుఱ్ఱముయొక్క—చూచుట; స్యాత్ (అధ్యాహృతము)= అగునో; తావత్ (అధ్యాహృతము)= అంతవఱకు; ఇహహి=ఈయజ్ఞవాటమందేకదా! స్థాస్యామి=ఉండెదను. వః=మీకొఱకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక.

నేను,యాగదీక్షవహించి యున్నాను గావున, మనుమండగునంశుమంతునింగూడి, ఋత్విజులతోఁగూడ, నీయజ్ఞవాటమందే,గుఱ్ఱముఁజూచుపర్యంత, ముండెదను; మీకుమంగళమగుఁగాక. అని, సగరుఁడు, కొడుకులంజూచి, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా హృష్టమనసో రాజపుత్రా మహాబలాః. ౧౬
జగ్ము ర్మహీతలం రామ పితు ర్వచనయంత్రితాః

టీక॥ రామ = రాముఁడా! మహాబలాః = అధికమైనబలముగల; రాజపుత్రాః= రాచకొమరులు; ఇతి=ఇట్లు; ఉక్త్వాః=చెప్పఁబడినవారలై; హృష్టమనసః=సంతసించినమనస్సుగలవారలై; పితుః=తండ్రియొక్క; వచనయంత్రితాః=మాటచేతబద్ధులై; మహీతలం=భూతలమును; జగ్ముః=పొందిరి.

రాముఁడా! మహాబలులగు రాచకొమరులు, సగరుని మాటవిని, సంతసించి, తండ్రిమాటకు బద్ధులై, భూమియందు వెదకఁబోయిరి.

అని, తాత్పర్యము.

యోజనాయామవిస్తార మేకైకో ధరణీతలమ్. ౧౭
బిభిదుః పురుషవ్యాఘ్ర వజ్రస్పర్శసమై ర్నఖైః

టీక॥ పురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవైన రాముఁడా! తే(అధ్యా

హృతము) = వారు; ఏకైకశః=ఒక్కొక్కఁడును; వజ్రస్పర్శసమైః=వజ్రముయొక్క తాఁకుడుతో సరియైన తాఁకుడుగల; నఖైః=గోళ్ల చేత, యోజనాయామ విస్తారం, యోజన=ఒకామడప్రమాణము, ఆయామవిస్తారం=నిడుపును వెడల్పునుంగల; ధరణీతలం= భూతలమును; బిభిదుః=త్రవ్విరి.

పురుష శ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఆయఱువది వేవురు రాజపుత్రులును, ఒక్కొక్కఁడు, ఒకయోజనము నిడుపును ఒక యోజనము వెడల్పునుం గలభూమివంతున, వజ్రములుం బోలెఁ గఠినంబులగు నఖములచే, భూయంతయుఁ, ద్రవ్విరి.

అని, తాత్పర్యము.

శూలై రశనికల్పైశ్చ హలైశ్చాపి సుదారుణైః। ౧౮
భిద్యమానా వసుమతీ ననాద రఘునందన

టీక॥ రఘునందన = రాముఁడా! అశనికల్పైః=వజ్రాయుధముతో సమానములైన; శూలైశ్చ = ముమ్మొనవాలులచేతను; సుదారుణైః=మిక్కిలి భయంకరములైన; హలైశ్చాపి=నాగేళ్ల చేతను; భిద్యమానా=భేదింపఁబడుచున్న; వసుమతీ=భూమి; ననాద = ధ్వనించినది.

రాముఁడా! వారలు భూమియంతయు వజ్రాయుధముం బోనిశూలములచేతను, అతిభయంకరంబులగు నాగేళ్ల చేతనుంబగుల్పఁగానే, గొప్పధ్వనిగల్గినది. అని, తాత్పర్యము.

నాగానాం మధ్యమానానా మసురాణాంచ రాఘవ। ౧౯
రాక్షసానాం చ దుర్ధర్ష స్సత్వానాం నినదోభవత్

టీక॥ రాఘవ=రాముఁడా! మధ్యమానానాం=నలఁగఁగొట్టఁబడుచున్న; నాగానాం= సర్పములయొక్కయు; అసురాణాంచ=అసురు

లయొక్కయు; రాక్షసానాంచ= రాక్షసుల యొక్కయు; సత్త్వానాం=ఇతరములైన,జంతువులయొక్కయు; నినదః = ధ్వని;దుర్ధర్షః=పట్టఁగూడనిది,అభవత్=అయినది.

రాముఁడా! సర్వములనసురులు, రాక్షసులు,మఱియు,నితరజంతువులును,వారలచేనలగఁగొట్టంబడి,యార్చుచుండఁగా, నాధ్వని,వినశక్యమైనది. అని,తాత్పర్యము.

యోజనానాం సహస్రాణి షష్టిం తు రఘునన్దన. ౨౦
బిభిదు ర్ధరణీం వీరా రసాతల మనుత్తమమ్

టీక॥ రఘునందన = రాముఁడా!వీరాః = పరాక్రమశాలులగు నాసగరుని కొడుకులు; యోజనానాం=ఆమడలయొక్క; సహస్రాణి=వేలను; షష్టింతు=అఱువదింటిని;ధరణీం=భూమిని;అనుత్తమం= తనకన్న శ్రేష్ఠములేనట్టి; రసాతలం (యథాభవతితథా)= పాతాళమగునట్లుగా;బిభిదుః=త్రివ్విరి.

రాముఁడా! పరాక్రమశాలులగునా సగరునికొడుకుల, అఱువదివేలయోజనములు, భూమిని, పాతాళమగునట్లు, త్రవ్విరి.
అని, తాత్పర్యము.

ఏవం పర్వతసంబాధం జంబూద్వీపం నృపాత్మజాః. ౨౧
ఖనంతో నరశార్దూల సర్వతః పరిచక్రముః

టీక॥ నరశార్దూల=మనుష్యశ్రేష్ఠుఁడవైన; రాముఁడా!నృపాత్మజాః = రాచ కొమరులు; ఏవం=ఇట్లు! పర్వతసంబాధం = కొండలచే దట్టమైన; జంబూద్వీపం=జంబూద్వీపమును;ఖనంతః=త్రవ్వుచు; సర్వతః=అంతటను;పరిచక్రమః=చుట్టిరి.

రాముఁడా! ఆసగరునికొడుకులు, ఇట్లు, పర్వతములచే నిండి

యుండుజంబూద్వీపంబునుద్రవ్వుచు,నంతటనుందిరిగిరి. అని, తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వా స్సాసురా స్సహపన్నగాః. ౨౨
సంభ్రాంతమనస స్సర్వే పితామహ ముపాగమన్

టీక॥ తతః=అంతట; సగంధర్వాః=గంధర్వులతోఁగూడినవారును; సాసురాః= అసురులతోఁగూడినవారును; సహపన్నగాః=సర్పములతోఁగూడినవారునగు; దేవాః=దేవతలు; సర్వే=అందఱును; సంభ్రాంతమనసః=కలతపడిన మనస్సుగలవారలై; పితామహం= బ్రహ్మదేవుని; ఉపాగమన్=పొందిరి.

అంత, దేవతలునుగంధర్వులు నసురులునుబన్నగంబులు నందఱును, సంభ్రాంతులై, బ్రహ్మదేవుని యొద్దకుఁబోయిరి. అని, తాత్పర్యము.

తే ప్రసాద్య మహాత్మానం విషణ్ణవదనా స్తదా. ౨౩
ఊచుః పరమసంత్రస్తాః పితామహ మిదం వచః

టీక॥ తే=ఆదేవతలు; మహాత్మానం=పూజ్యస్వభావముగల; పితామహం=బ్రహ్మదేవుని; ప్రసాద్య=సంతసింపఁజేసి; తదా=అప్పుడు; విషణ్ణవదనాః= దుఃఖముగ్లినముఖముగలవారలై; పరమసంత్రస్తాః=మిక్కిలియుభయముపడినవారలై; ఇదం=ఈ; వచః=మాటను; ఊచుః=చెప్పిరి.

ఆదేవతలు, మహాత్ముండగుబ్రహ్మదేవుని సంతోషపఱిచి, పరమదుఃఖితులై, మిక్కిలియు, భయపడినవారలై, యిట్లనిచెప్పిరి.
అని, తాత్పర్యము.

భగవన్ పృథివీ సర్వా ఖన్యతే సగరాత్మజైః. ౨౪
బహవశ్చ మహాత్మానో హన్యంతే తలవాసినః

టీక॥ భగవన్= మాహాత్మ్యముగలబ్రహ్మదేవుఁడా! సగరాత్మజైః= సగరునికొడుకులచేః; పృథివీ=భూమి; సర్వా=అంతయును;

భగవంతుఁడవైన బ్రహ్మదేవుఁడా! సగరుని కొడుకులు, భూమి యంతయుఁ,ద్రవ్వుచున్నారు; పాతాళమందున్నమహాత్ములనేకులం జంపుచున్నారు. అని, తాత్పర్యము.

ఖన్యతే=త్రవ్వఁబడుచున్నది. తలవాసినః= పాతాళమందున్నట్టి; బహవః=అనేకులైన; మహాత్మానశ్చ=పూజ్యమైన స్వభావముగలవారలును; హన్యంతే, చంపఁబడుచున్నారు.

అయం యజ్ఞహనోస్మాక మనేనాశ్వో పనీయతే. ౨౫
("యజ్ఞహరోస్మాకం" అని పాఠాంతరము.)
ఇతి తే సర్వభూతాని నిఘ్నంతి సగరాత్మజాః

టీక॥ తే=ఆ; సగరాత్మజాః=సగరునికొడుకులు; "అయం=ఇతఁడు; యజ్ఞహనః, యజ్ఞహరః (అని, పాఠాంతరము)= యాగమును జెఱచినవాఁడు. అనేన=వీనిచేత; అస్మాకం= మాయొక్క; అశ్వః=గుఱ్ఱము; అపనీయతే=(భూతార్థమందు లట్) అపహరింపఁబడినది." ఇతి= అని; ఉక్త్వా (అధ్యాహృతము)= చెప్పి; సర్వభూతాని=సమస్తప్రాణులను; నిఘ్నంతి=చంపుచున్నారు.

"ఇతఁడే యాగమును జెఱచిన పాపాత్ముఁడు; ఇతఁడె మాయాగాశ్వంబునపహరించినవాఁడు;" అని, చెప్పుచు, సమస్త ప్రాణులనుంజంపుచున్నారు. అని, దేవతలుబ్రహ్మదేవునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకోనచత్వారింశ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండైకోనచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

౩౨

చత్వారింశసర్గప్రారంభః.

దేవతానాం వచ శ్శ్రుత్వా భగవా న్వై పితామహః
ప్రత్యువాచ సుసంత్రస్తాన్ కృతాంతబలమోహితాన్. ౧

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగల; ("వై" అనునది పాదపూరణార్థము); పితామహః= బ్రహ్మదేవుఁడు ; దేవతానాం=దేవతలయొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; సుసంత్రస్తాన్=మిక్కిలిభయముపడిన వారును; కృతాంతబలమోహితాన్, కృత=చేయఁబడిన; అంత=జననాశముగల సగరపుత్రులయొక్క, బల= బలముచేత, మోహితాన్ = కలతనొందిన వారునగు (అని, గోవిందరాజాభిప్రాయము.); లేక, కృతాంతబల= దైవబలముచేత, మోహితాన్=కలతనొందినవారునగు (అని, మహేశ్వరతీర్థాభిప్రాయము); తాన్ (అధ్యాహృతము)= ఆదేవతలను గూర్చి; ప్రత్యువాచ= బదులుచెప్పెను.

భగవంతుడగు బ్రహ్మదేవుండు, దేవతలమాటవిని, మిక్కిలి భయముఁజెంది, సగరపుత్రులు సేయుజననాశంబున(దైవబలంబున) మోహితులై యున్న దేవతలంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యస్యేయం వసుధా కృత్స్నా వాసుదేవస్య ధీమతః
కాపిలం రూప మాస్థాయ ధారయ త్యనిశం ధరామ్. ౨
తస్య కోపాగ్నినా దగ్ధా భవిష్యంతి నృపాత్మజాః

టీక॥ ఇయం=ఈ; వసుధా= భూమి; కృత్స్నా=అంతయు; ధీమతః=బుద్ధిమంతుఁడైన; యస్య=ఏ; వాసుదేవస్య=విష్ణుదేవునిదో; యః

(అధ్యాహృతము)=ఎవ్వఁడు; కాపిలం౼= కపిలసంబంధియగు; రూపం=ఆకారమును; ఆస్థాయ=పొంది; ధరాం=భూమిని; అనిశం=ఎల్లప్పుడును; ధారయతి=ధరించుచున్నాఁడో; నృపాత్మజాః=రాచకొమరులు; తస్య=ఆకపిలరూపుఁడైన విష్ణుదేవునియొక్క; కోపాగ్నినా=కోపమనెడునిప్పుచేత; దగ్ధాః=దహింపఁబడినవారలు; భవిష్యంతి=కాఁగలరు.

ఈభూమియంతయునే విష్ణుదేవునిదో, ఏ దేవుఁడుకపిలరూపముధరించియీభూమినెల్లప్పుడుభరించుచున్నాఁడో; అట్టికపిలరూపధారియగువిష్ణుదేవునికోపంబున, సగరపుత్రులందఱు, దహింపఁ బడఁగలరు. అని, తాత్పర్యము.

పృథివ్యా శ్చాపి నిర్భేదో దృష్ట ఏవ సనాతనః. ౩
సగరస్య చ పుత్రాణాం వినాశో దీర్ఘజీవినామ్

టీక॥ పృథివ్యాః= భూమియొక్క; నిర్భేదశ్చాపి= త్రవ్వుటయును; సగరస్య=సగరునియొక్క; అదీర్ఘజీవినాం= దీర్ఘకాలముజీవించనట్టి; పుత్రాణాం=కొడుకులయొక్క; వినాశశ్చ=చావును; సనాతనః= పురాతనముగా, అవశ్యము కాఁదగినదిగాననుట; దృష్టఏవ= చూడఁబడినదియే, నిశ్చయింపఁబడినదే, యనుట.

భూమిత్రవ్వుటయు, అల్పాయుష్కులైన సగరపుత్రులచావును, ఇవి, యవశ్యముకాఁదగినవని, నిశ్చయింపఁబడియేయున్నవి. అని, బ్రహ్మదేవుఁడు దేవతలకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

పితామహ వచ శ్శ్రుత్వా త్రయస్త్రింశ దరిందమ. ౪
దేవాః పరమసంహృష్టాః పున ర్జగ్ము ర్యథాగతమ్

టీక॥ అరిందమ=శత్రువులనడంగఁద్రొక్కునట్టి రాముఁడా! పితామ

హావచః=బ్రహ్మదేవునిమాటను;శ్రుత్వా=విని;త్రయస్త్రింశత్= ముప్పదిముగ్గురైన(ఎనిమిదిమందివసువులునుపదునొకండుమందిరుద్రులును పండ్రెండు గురాదిత్యులును ఇద్దఱశ్వినులునుంజేరి,ముప్పదిముగ్గురు.ఇదియితరులకు నుపలక్షణము); దేవాః = దేవతలు; పరమసంహృష్టాః=మిక్కిలిసంతసించినవారలై; పునః=మఱల; యథాగతం=వచ్చినట్టుగా; జగ్ముః=వెళ్లిరి.

శత్రువులనడంగఁ ద్రొక్కఁజాలినరాముఁడా! అష్టవసువులు నేకాదశరుద్రులు ద్వాదశాదిత్యులునశ్వినులిద్దఱు, వీరుమొదలగుదేవతలందఱు,బ్రహ్మదేవునిమాటవిని,మిక్కిలిసంతసించి,మఱలవచ్చినట్టుగావెళ్లిరి. అని, తాత్పర్యము.

సగరస్య చ పుత్రాణాం ప్రాదురాసీన్మహాత్మనామ్. ౫
పృథివ్యాం భిద్యమానాయాం నిర్ఘాతసమనిస్వనః

టీక ॥ మహాత్మనాం= పూజ్యస్వభావముగల;సగరస్య=సగరునియొక్క; పుత్రాణాం=(తృతీయార్థమందుషష్ఠి)కొడుకులచేత; పృథివ్యాం = భూమి; భిద్యమానాయాం= పగులఁగొట్టఁబడుచుండఁగా;నిర్ఘాతసమనిస్వనశ్చ,నిర్ఘాతసమ= పిడుగుతోసరియైన, నిస్వనశ్చ = ధ్వనియును; ప్రాదురాసీత్=పుట్టెను.

మహాత్ములైనసగర పుత్రులు , భూమింద్రవ్వుచుండఁగా, వారిచేటుసూచింపుచుఁ,బిడుగుంబోనియొకశబ్దంబు,పుట్టినది.

అని, తాత్పర్యము.

తతో భిత్త్వా మహీం సర్వే కృత్వాచాభి ప్రదక్షిణమ్. ౬
సహితా స్సగరా స్సర్వే పితరం వాక్య మబ్రువన్

టీక॥ తతః=అంతట;సగరాః=సగరునికొడుకులు;సర్వే=అందఱు

ను; మహీం=భూమిని; భిత్వా= త్రవ్వి; అభిప్రదక్షిణంచ=చుట్టుప్రదక్షిణమును; కృత్వా=చేసి; సర్వే=అందఱును; సహితాః= కూడినవారలై; పితరం=తండ్రినిగూర్చి; వాక్యం=మాటను; అబ్రువన్=చెప్పిరి.

అంత, నా సగరపుత్రులు, భూమిం ద్రవ్వి, చుట్టుం దిరిగి, గుఱ్ఱముగానక, యందఱుం గూడికొని, తండ్రియొద్దకుం బోయి, యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

పరిక్రాంతా మహీ సర్వా సత్వవంతశ్చ సూదితాః. ౭
దేవదానవరక్షాంసి పిశాచోరగకిన్నరాః
నచపశ్యామహేశ్వం త మశ్వహర్తార మేవచ. ౮
కింకరిష్యామ భద్రం తే బుద్ధి రత్ర విచార్యతామ్

టీక॥ అస్మాభిః (అధ్యాహృతము)=మాచేత; మహీ=భూమి; సర్వా=అంతయు; పరిక్రాంతా=చుట్టఁబడినది. సత్వవంతః= బలముగల్గిన; దేవదానవరక్షాంసి=దేవతలును దానవులును రాక్షసులును; పిశాచోరగకిన్నరాశ్చ= పిశాచములును సర్పములును గిన్నరులును; సూదితాః=చంపఁబడిరి. వయం(అధ్యాహృతము)=మేము; తం=ఆ; అశ్వం చ=గుఱ్ఱమును; అశ్వహర్తారమేవచ=గుఱ్ఱమునపహరించినవానిని; నపశ్యామహే=చూడలేదు. కిం=దేనిని; కరిష్యామ(కరిష్యామః); యేఁగలము? అత్ర=ఈవిషయమందు; బుద్ధిః=ఉపాయము; విచార్యతాం=ఆలోచింపఁబడుఁగాక.

మేము భూమియంతయుఁ జుట్టితిమి; బలశాలులగు దేవతల దానవుల రాక్షసులఁ బిశాచంబుల సర్పంబులఁ గిన్నరులఁ బెక్కండ్రం జంపితిమి; ఆ గుఱ్ఱముగాని యాగుఱ్ఱపు దొంగ కాని మాకగపడలేదు; ఏమిసేయుదుము? ఈవిషయమందు పాయమాలోచింపుము. అని, తాత్పర్యము.

తేషాం తద్వచనం శ్రుత్వా పుత్రాణాం రాజసత్తమః. ౯

సమన్యు రబ్రవీ ద్వాక్యం సగరో రఘునందన

టీక॥ రఘునందన = రాముఁడా! రాజసత్తమః=రాజశ్రేష్ఠుఁడగు; సగరః=సగరుఁడు; తేషాం=ఆ; పుత్రాణాం = కొడుకులయొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; సమన్యుః=కోపము గలవాఁడై; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముఁడా! కొడుకులుచెప్పిన మాటవిని, రాజశ్రేష్ఠుఁడగు సగరుఁడుకోపించి, కొడుకులంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

భూయః ఖనత భద్రంవో నిర్భిద్య వసుధాతలమ్. ౧౦
అశ్వహర్తార మాసాద్య కృతార్థాశ్చ నివర్తథ

టీక॥ వః=మీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక; భూయః = మఱల; వసుధాతలం=భూతలమును; నిర్భిద్య=భేదించి; ఖనత=త్రవ్వుఁడు. యూయం(అధ్యాహృతము)=మీరు; అశ్వహర్తారం=గుఱ్ఱము నపహరించినవాని; ఆసాద్య=పొంది; కృతార్థాశ్చ= నెఱవేఱినపనిగలవారలునై; నివర్తథ(నివర్తధ్వం)=మఱలుఁడు.

మీకుమంగళమగుఁగాక; మీరలు మఱల భూతలముభేదించి త్రవ్వుఁడు; గుఱ్ఱమునుగుఱ్ఱము నపహరించిన వానినింబట్టికొని కృతార్థులరై మఱలరండు. అని, సగరుఁడుకొడుకులకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

పితు ర్వచన మాసాద్య సగరస్య మహాత్మనః. ౧౧
షష్టిః పుత్రసహస్రాణి రసాతల మభిద్రవన్

టీక॥ పితుః=తండ్రియైన; మహాత్మనః= పూజ్యస్వభావముగల; సగరస్య= సగరునియొక్క; వచనం=మాటను; ఆసాద్య=పొంది; పు

త్రసహస్రాణి= కొడుకులయొక్క వేలు; షష్టిః=అఱువదియును;రసాతలం=భూతలమునుగూర్చి; అభిద్రవన్ (అభ్యద్రవన్)=పరుగెత్తిపోయిరి.

తండ్రియైనమహాత్ముండగు సగరునియాజ్ఞనువిని, అఱువది వేవురుకొడుకులును,భూమితలమును గూర్చిపరులిడిరి.

అని, తాత్పర్యము.

ఖన్యమానే తత స్తస్మిన్ దదృశుః పర్వతోపమమ్. ౧౨
దిశాగజం విరూపాక్షం ధారయంతం మహీతలమ్

టీక॥ తతః=అంతట; తే (అధ్యాహృతము)=ఆసగరపుత్రులు; తస్మిన్ = ఆభూమి;ఖన్యమానే=త్రవ్వఁ బడుచుండఁగా; పర్వతోపమం= కొండతోఁబోలికగలదియును;మహీతలం=భూతలమును;ధారయంతం = ధరింపుచున్నదియునగు;విరూపాక్షం=విరూపాక్షమనెడు; దిశాగజం=దిగ్గజమును;దదృశుః=చూచిరి.

అంత, నాసగరపుత్రులు, నాభూమిందవ్వుచుఁ, బర్వతంబునకు సాటియైభూమండలమునుమోయుచున్నవిరూపాక్షంబను దిగ్గజముం జూచిరి. అని, తాత్పర్యము.

సపర్వతవనాం కృత్స్నాం పృథివీం రఘునందన. ౧౩
శిరసా ధారయామాస విరూపాక్షో మహాగజః

టీక॥ రఘునందన = రాముఁడా!విరూపాక్షః = విరూపాక్షమనెడు;మహాగజః= గొప్పగజము; సపర్వతవనాం=కొండలతోనుఅడవులతోనుంగూడిన;పృథివీం= భూమిని;కృత్స్నాం = అంతను; శిరసా=తలచేత;ధారయామాస=వహించెను; వహించుచున్నదనుట.

రాముఁడా! విరూపాక్షంబను మహాగజము, పర్వతములువనము

లునుంగూడియున్న భూమినంతను శిరంబునం బెట్టికొని, మోయుచున్నది. అని, తాత్పర్యము.

యదా పర్వణి కాకుత్థ్స విశ్రమార్థం మహాగజః. ౧౪
ఖేదా చ్చాలయతే శీర్షం భూమికంప స్తదా భవేత్

టీక॥ కాకుత్థ్స=రాముఁడా! యదా=ఏ; పర్వణి=కాలమందు; మహాగజః= గొప్పగజమగువిరూపాక్షము; ఖేదాత్ = శ్రమమువలన; విశ్రమార్థం=అలపుదీర్పుటకొఱకు; శీర్షం=తలను; చాలయతే= కదలించునో; తదా=అప్పుడు; భూమికంపః=భూకంపము; భవేత్=కలుగును.

రాముఁడా! విరూపాక్షు, మెప్పుడు, శ్రమచేత, నలసటదీర్చుకొనుటకై, తలకదలించునో, అప్పుడుభూకంపముకలుగును.

అని, తాత్పర్యము.

తం తే ప్రదక్షిణం కృత్వా దిశాపాలం మహాగజమ్. ౧౫
మానయంతో హి తే రామ జగ్ముర్భిత్త్వా రసాతలమ్

టీక॥ రామ=రాముఁడా! తే= ఆసగరుని కొడుకులు; దిశాపాలం=దిక్కునుబాలించునట్టి; తం= ఆ; మహాగజం= విరూపాక్షుంబను గొప్పగజమునుగూర్చి; ప్రదక్షిణం= ప్రదక్షిణమును; కృత్వా=చేసి; మానయంతః=పూజింపుచు; తే=ఆసగరపుత్రులు (క్రియాభేదంబునఁబునరుక్తి దోషంబులేదు.); రసాతలం=భూతలమును; భిత్త్వా= భేదించి; జగ్ముర్హి=పోయిరిగదా!

రాముఁడా! ఆసగరునికొడుకులు, దిక్పాలకంబైన యావిరూపాక్షుంబును బ్రదక్షిణపూర్వకంబుగాఁ బూజించుచు, భూమిభేదించికొని పోయిరి. అని, తాత్పర్యము.

తతః పూర్వాం దిశం భిత్త్వా దక్షిణాం బిభిదుః పునః. ౧౬

టీక॥ తే (అధ్యాహృతము)= ఆసగరపుత్రులు; పూర్వాం=తూర్పు; దిశం=దిక్కును; భిత్త్వా=భేదించి; పునః=మరల; దక్షిణాం= దక్షిణపు దిక్కును; బిభిదుః = భేదించిరి.

ఆసగరునికొడుకులు తూర్పుదిక్కునందలిభూమిని భేదించి, యంత, దక్షిణపుదిక్కునందలిభూమిం ద్రవ్విరి. అని, తాత్పర్యము.

దక్షిణస్యా మపి దిశి దదృశు స్తే మహాగజమ్
మహాపద్మం మహాత్మానం సుమహా త్పర్వతోపమమ్. ౧౭
శిరసా ధారయంతం తే విస్మయం జగ్ము రుత్తమమ్

టీక॥ తే = ఆసగరునికొడుకులు; దక్షిణస్యాం=దక్షిణపు; దిశ్యపి; దిక్కునందును; మహాత్మానం=పూజ్యమైనస్వభావముగలదియును; సుమహాత్(సుమహాంతం)= మిక్కిలి పూజ్యమైనదియు; పర్వతోపమం= కొండతోఁబోలికగలదియును; శిరసా = తలచేత; భూమిం(అధ్యాహృతము)=భూమిని; ధారయంతం=వహించుచున్నదియునగు; మహాపద్మం= మహాపద్మమనెడు; మహాగజం= గొప్పగజమును; దదృశుః=చూచిరి. తే=ఆసగరునికొడుకులు; ఉత్తమం = అధికమైన; విస్మయం=ఆశ్చర్యమును; జగ్ముః=పొందిరి.

ఆసగర పుత్రులు, దక్షిణపుదిక్కునందును, పూజ్యంబగుస్వభావముగల్గి, పర్వతంబునకుసాటిసేయందగి, శిరంబునభూమిని మోయుచున్న, మహాపద్మంబనుదిగ్గజముం జూచి, మిక్కిలియునాశ్చర్యంబు నొందిరి. అని, తాత్పర్యము.

తతః ప్రదక్షిణం కృత్వా సగరస్య మహాత్మనః. ౧౮
షష్టిఃపుత్రసహస్రాణి పశ్చిమాం బిభిదు ర్దిశమ్

టీక॥ తతః=అంతట; మహాత్మనః = పూజ్యమైనస్వభావముగల;

సగరస్య=సగరునియొక్క; పుత్రసహస్రాణి=కొడుకులయొక్క-వేలు; షష్టిః=అఱువది; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా= చేసి; పశ్చిమాం=పడమటి; దిశం=దిక్కు-ను; బిభిదుః=త్రవ్విరి.

అంత, మహాత్ముండగుసగరుని కొడుకులఱువది వేవురు నామహాపద్మంబునకుఁబ్రదక్షిణంబుచేసి, పడపటిదిక్కు-నందలిభూమిం ద్రవ్వినవి. అని, తాత్పర్యము.

పశ్చిమాయా మపి దిశి మహాంత మచలోపమమ్. ౧౯
దిశాగజం సౌమనసం దదృశు స్తే మహాబలాః

టీక॥ మహాబలాః= అధికమైన బలముగల; తే=ఆ; సగరునికొడుకులు; పశ్చిమాయాం=పడమటి; దిశ్యపి=దిక్కు-నందును; మహాంతం=పూజ్యమైనదియును ; అచలోపమం=కొండతోఁ బోలికగలదియు నగు; సౌమనసం=సౌమనసంబను; దిశాగజం=దిగ్గజమును; దదృశుః=చూచిరి.

మహాబలులగు నాసగరపుత్రులు, పడమటిదిక్కు-నందును, బూజ్యమై కొండంతటి యాకారము గల్గియుండు, సౌమనసంబను దిగ్గజమును, జూచిరి. అని, తాత్పర్యము.

తం తే ప్రదక్షిణం కృత్వా పృష్ట్వా చాపి నిరామయమ్. ౨౦
ఖనంత స్సముపక్రాంతా దిశం హైమవతీం తతః

టీక॥ తే=ఆసగరుని కొడుకులు; తం=ఆసౌమనసమునుగూర్చి; ప్రదక్షిణం= ప్రదక్షిణమును; కృత్వా=చేసి;నిరామయంచాపి= ఆరోగ్యమును; పృష్ట్వా=అడిగి; తతః=అంతట; ఖనంతః=త్రవ్వుచు; హైమవతీం = హిమవత్పర్వతసంబంధినియగు;దిశం = ఉత్తరపుదిక్కు-ను; సముపక్రాంతాః=(త్రవ్వుటకు)ఆరంభించిరి.

ఆ సగర పుత్రులు, ఆ సౌమనసంబను దిగ్గజంబునకుఁ బ్రదక్షిణంబు చేసి, యారోగ్యంబడిగి, యాపిమ్మటఁ, ద్రవ్వుచుఁబోయి, హిమవత్పర్వతంబున్న, యుత్తరపు దిక్కును ద్రవ్వనారంభించిరి.

అని, తాత్పర్యము.

ఉత్తరస్యాం రఘుశ్రేష్ఠ దదృశు ర్హిమపాండరమ్. ౨౧
భద్రం భద్రేణ వపుషా ధారయంతం మహీ మిమామ్

టీక॥ రఘుశ్రేష్ఠ=రఘువంశమునఁబుట్టినవారిలో మేటియైన రాముఁడా! తే(అధ్యాహృతము)=ఆసగర పుత్రులు; ఉత్తరస్యాం=ఉత్తరపుదిక్కునందు; భద్రేణ= మంగళకరమగు; వపుషా = దేహముచేత; ఇమాం=ఈ; మహీం=భూమిని; ధారయంతం=ధరించుచున్నదియును; హిమపాండరం = మంచువలెఁదెల్లనిదియునగు; భద్రం=భద్రమను దిగ్గజమును; దదృశుః=చూచిరి.

రాముఁడా! ఆసగరపుత్రులు, ఉత్తరపుదిక్కునందును, మంగళకరంబగు దేహంబునభూమిని వహించుచు, మంచువలెఁదెల్లగానుండు, భద్రంబనుదిగ్గజంబునుజూచిరి.

అని, తాత్పర్యము.

సమాలభ్య తత స్సర్వే కృత్వా చైనం ప్రదక్షిణమ్. ౨౨
షష్టిః పుత్రసహస్రాణి బిభిదు ర్వసుధాతలమ్

టీక॥ పుత్రసహస్రాణి= కొడుకులయొక్క వేలు; షష్టిః=అఱువది; సర్వే=అందఱును; ఏనం=ఈభద్రమను దిగ్గజమును; సమాలభ్య = తాఁకి; ప్రదక్షిణంచ=ప్రదక్షిణమును, కృత్వా=చేసి; తతః=అంతట; వసుధాతలం=భూతలమును; బిభిదుః=త్రవ్విరి.

ఆసగరుని కొడుకులఱువదివేవురందఱును, భద్రంబను దిగ్గజమును, గౌరవార్థము, దాఁకి, ప్రదక్షిణించి, యటుపిమ్మట, మఱల, భూమినిద్రవ్విరి. అని, తాత్పర్యము.

తతః ప్రాగుత్తరాం గత్వా సాగరాః ప్రథితాం దిశమ్. ౨౩
రోషా దభ్యఖనన్ సర్వే పృథివీం సగరాత్మజాః

టీక॥ తతః=అటుపిమ్మట; సాగరాః = సగరునికొడుకులు; ప్రథితాం = ప్రసిద్ధమైన; ప్రాగుత్తరాం=తూర్పునుత్తరపు; దిశం=దిక్కును(ఈశానదిశను); గత్వా=పొంది; సగరాత్మజాః=సగరునికొడుకులు (క్రియాభేదంబునంజేసి పునరుక్తిదోషంబులేదు.); సర్వే=అందఱును; రోషాత్=కోపమువలన; పృథివీం=భూమిని; అభ్యఖనన్=త్రవ్విరి.

అంత, సగరపుత్రులు, ప్రసిద్ధమైనయీశానదిశకుఁబోయి, కోపమున, భూమియంతయుఁద్రవ్విరి.

అని, తాత్పర్యము.

తే తు సర్వే మహాత్మానో భీమవేగా మహాబలాః. ౨౪
దదృశుః కపిలం తత్ర వాసుదేవం సనాతనమ్
హయంచ తస్య దేవస్య చరంత మవిదూరతః. ౨౫
ప్రహర్ష మతులం ప్రాప్తా స్సర్వే తే రఘునందన

టీక॥ మహాత్మానః= గొప్పదేహముగలవారును; భీమవేగాః= భయంకరమైనవేగముగలవారును; మహాబలాః=అధికమైనబలముగలవారునగు; తే=ఆసగరపుత్రులు; సర్వే తు=అందఱును; తత్ర=అచ్చట; కపిలం=కపిలావతారరూపుఁడగు; సనాతనం=పురాతనుఁడైన; వాసుదేవం=విష్ణుదేవుని; తస్య=ఆ; దేవస్య=కపిలమహర్షికి; అవిదూరతః=సమీపమునందు; చరంతం= తిరుగుచున్న; హయంచ=గుఱ్ఱమును; దదృశుః=చూచిరి. రఘునందన= రాముఁడా! తే=ఆసగరునికొడుకులు; సర్వే=అందఱును; అతులం= సరిలేని; ప్రహర్షం=సంతోషమును, ప్రాప్తాః=పొందిరి.

రాముఁడా! గొప్పశరీరంబులు

నుభయంకరంబగు వేగంబునుం గల్గి, మహాబలులై యుండు నా సగరపుత్రులందఱును, ఈశానదిశయందు, కపిల రూపము వహించి యున్న సనాతనుండగు విష్ణుదేవుని, నతనిసమీపంబునం దిరుగుచున్న గుఱ్ఱంబునుం, జూచి, సరిలేని సంతోషంబునొందిరి. అని, తాత్పర్యము.

తే తం హయహరం జ్ఞాత్వా క్రోధపర్యాకులేక్షణాః. ౨౮
ఖనిత్రలాంగల ధరా నానావృక్షశిలాధరాః
అభ్యధావంత సంక్రుద్ధా స్తిష్ఠ తిష్ఠేతి చాబ్రువన్. ౨౯

టీక॥ తే = ఆసగరపుత్రులు; తం=ఆకపిలుని; హయహరం=గుఱ్ఱము నపహరించినవానిఁగా; జ్ఞాత్వా=ఎఱింగి; సంక్రుద్ధాః=కోపమునొందినవారలై; క్రోధపర్యాకులేక్షణాః, క్రోధపర్యాకుల, కోపముచేకలతవడిన, ఈక్షణాః=కండ్లుగలవారలై; ఖనిత్రలాంగలధరాః=గడ్డపాఱలును నాఁగలులును ధరించినవారలై; నానావిధశిలాధరాః=పలుదెఱంగులైన వృక్షములను ఱాళ్లను ధరించినవారలై; అభ్యధావంత=ఎదుర్కొని పరుగెత్తిరి. తిష్ఠ, తిష్ఠ=నిలు, నిలు; ఇతిచ=అనియును; అబ్రువన్=పల్కిరి.

ఆసగరపుత్రులు, ఆకపిలుని గుఱ్ఱపుదొంగగాఁదలంచి, మిక్కిలియుఁ గుపితులై, కోపంబునం గలతపడిన కండ్లు గల్గి, గడ్డపాఱలను నాఁగలులను నానావిధంబులగు వృక్షంబులను ఱాళ్లనుం జేకొని నిలు నిలు, అని యదల్చుచు, నాకపిలుని పైకిఁ బరుగెత్తిపోయిరి.

అని, తాత్పర్యము.

అస్మాకం త్వం హి తురగం యజ్ఞీయం హృతవా నసి
దుర్మేధ స్త్వం హి సంప్రాప్తాన్ విద్ధి నస్సగరాత్మజాన్. ౩౦

టీక॥ త్వం=నీవు; అస్మాకం=మాయొక్క; యజ్ఞీయం = యాగార్హమైన; తురగం= గుఱ్ఱమును; హృతవాన్= అపహరించిన

వాఁడవు; అసిహీ=అగుచున్నావుగదా! దుర్మేధః= దుర్బుద్ధీ! త్వం= నీవు("హి" అనునది పాదపూరణార్థము.); సగరాత్మజాన్= సగరునికొడుకులమైన; నః=మమ్ములను; సంప్రాప్తాన్= వచ్చినవారినిగా; విద్ధి=ఎఱుంగుము.

నీవు, మాయాగీయమగు గుఱ్ఱమునపహరించితివి; దుర్బుద్ధీ! మేము సగరపుత్రులము వచ్చియున్నామనియెఱుంగుము. అని, కపిలునింజూచి చెప్పిరి. అని, తాత్పర్యము.

శ్రుత్వా తు వచనం తేషాం కపిలో రఘునందన
రోషేణ మహతావిష్టో హుంకార మకరోత్తదా. ౨౯

టీక॥ రఘునందన=రాముఁడా! కపిలః=కపిలుఁడు; తేషాం=ఆసగరపుత్రులయొక్క; వచనం= మాటను; శ్రుత్వాతు = వినినంతనె; తదా=అప్పుడు; మహతా=అధికమైన; రోషేణ=కోపముచేత; ఆవిష్టః=ఆవేశింపఁబడినవాఁడై; హుంకారం="హుం"అనుటను; అకరోత్=చేసెను.

రాముఁడా! ఆసగరపుత్రులమాటనువినినంతనె, కపిలుఁడుమిక్కిలియుఁగోపంబునొంది, హుంకారము చేసెను. అని, తాత్పర్యము.

తత స్తేనా ప్రమేయేన కపిలేన మహాత్మనా
భస్మరాశీ కృతా స్సర్వే కాకుత్స్థ సగరాత్మజాః. ౩౦

టీక॥ కాకుత్స్థ= రాముఁడా! తతః= అటుపిమ్మట; అప్రమేయేన = కొలతపెట్టరాని; మహాత్మనా= పూజ్యమైనస్వభావముగల; తేన=ఆ; కపిలేన=కపిలునిచేత; సగరాత్మజాః=సగరునికొడుకులు; సర్వే = అందఱును; భస్మరాశీకృతాః=బూడిదరాసులుగాఁ జేయఁబడిరి.

రాముఁడా! అంతఁ, గొలతలేని ప్రభావముగలమహాత్ముండగునాకపిలునిచే, సగరుని కొడుకులందఱు,

బూడిదరాసులుగాఁ జేయంబడిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, చత్వారింశ స్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ చత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః
ఏకచత్వారింశసర్గప్రారంభః.

పుత్రాం శ్చిరగతా జ్ఞాత్వా సగరో రఘునందన
నప్తార మబ్రవీ ద్రాజా దీప్యమానం స్వతేజసా. ౧

టీక॥ రఘునందన = రాముఁడా! రాజా=రాజైన; సగరః= సగరచక్రవర్తి; చిరగతా=బహుకాలమునుండిపోయిన; పుత్రా=కొడుకులను; జ్ఞాత్వా=ఎఱిఁగి; స్వతేజసా=తనకాంతిచేత; దీప్యమానం=ప్రకాశించుచున్న; నప్తారం=మనుమఁడైనయంశుమంతునిగూర్చి; అబ్రవీత్=పలికెను.

రాముఁడా! సగరచక్రవర్తి, తనకొడుకులు బహుకాలమువఱకు రాక పోవుటంజూచి, నిజతేజంబునఁ బ్రకాశించుచున్నతనమనుమఁడైనయంశుమంతునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

శూరశ్చ కృతవిద్యశ్చ పూర్వై స్తుల్యో౽సి తేజసా
పితౄణాం గతి మన్విచ్ఛ యేనచాశ్వో౽పహారితః. ౨




టీక॥ త్వం (అధ్యాహృతము)= నీవు; శూరశ్చ= యుద్ధమునందుభయపడనివాఁడవును; కృతవిద్యశ్చ= తెలిసికొనఁబడిన యస్త్రవిద్యలుగలవాఁడవును; తేజసా= పరాక్రమముచేత; పూర్వైః=మునుపటివారితో; తుల్యః= సమానుఁడవును; అసి=అగుచున్నావు; పితౄణాం, తంద్రులయొక్క-యు; యేన=ఎవనిచేత; అశ్వః=గుఱ్ఱము; అపహారితః= అపహరింపఁబడినదో; తస్య (అధ్యాహృతము)చ= అతనియొక్క-యు; గతిం= మార్గమును; అన్విచ్ఛ=వెదకుము.

నీవు, శూరుఁడవు, అస్త్రవిద్యలం దెసినవాఁడవు, పరాక్రమంబునఁబూర్వరాజులకుసరివచ్చువాఁడవు; నీవుపోయి, నీమంత్రులనుగుఱ్ఱమునపహరించినవానిని, వెదకుము.

అని, తాత్పర్యము.

అంతర్భౌమాని సత్వాని వీర్యవంతి మహాంతిచ
తేషాం త్వం ప్రతిఘాతార్థం సాస్త్రం గృహ్ణీష్వ కార్ముకమ్. ౩

టీక॥ అంతర్భౌమాని= భూమికిలోపలఁబుట్టినట్టి; సత్వాని=జంతువులు; వీర్యవంతి=పరాక్రమముగలవియు; మహాంతిచ= గొప్పవియునుగా; సంతి (అధ్యాహృతము)= ఉన్నవి. త్వం=నీవు; తేషాం=ఆజంతువులయొక్క-; ప్రతిఘాతార్థం= చంపుటకొఱకు; సాస్త్రం=ఖడ్గముతోఁగూడిన; కార్ముకం=ధనుస్సును; గృహ్ణీష్వ=గ్రహించుము.

భూమికిలోపలనుండు జంతువులుచాలఁబరాక్రమముగలవి, గొప్పవి; నీవువానింజంపుటకు, ఖడ్గమును ధనుస్సునుదీసికొనుము.

అని, తాత్పర్యము.

అభివాద్యాభి వాద్యాం స్త్వం హత్వా విఘ్నకరానపి
సిద్ధార్థ స్సన్నివ ర్తస్వ మమ యజ్ఞస్య పారగః. ౪

టీక॥ త్వం=నీవు; అభివాద్యాన్=నమస్కరింపఁదగినవారలను; అభి




వాద్య=నమస్కరించి; విఘ్నకరానపి=విఘ్నముసేయువారలను(అపిశబ్దముచేత) గుట్టమునపహరించినవానిని; హత్వా= చంపి; సిద్ధార్థః= నెఱవేఱినపనిగలవాఁడవై; మమ= నాయొక్క; యజ్ఞస్య= యాగముయొక్క; పారగః = సమాప్తిసేయువాఁడవై; సన్నివర్తస్వ= మఱలుము.

నీవు, నమస్కరింపఁదగినవారినినమస్కరింపుచు, విఘ్నముసేయువారలనుగుఱ్ఱమునపహరించినవానినింజంపి, కృతార్థుఁడవై, నాయాగమునుసమాప్తినొందించువాఁడవై, మఱలిరమ్ము. అనిసగరుఁడంశుమంతునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తోం శుమాన్ సమ్య క్సగరేణ మహాత్మనా
ధను రాదాయ ఖడ్గంచ జగామ లఘువిక్రమః. ౫

టీక॥ అంశుమాన్ = అంశుమంతుఁడు; మహాత్మనా= పూజ్యమైనస్వభావముగల; సగరేణ=సగరచక్రవర్తిచేత; సమ్యక్= లెస్సగా; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; ధనుః= వింటిని; ఖడ్గంచ=కత్తిని; ఆదాయ= తీసికొని; లఘువిక్రమః = చులుకనైనకాలిసికగలవాఁడై; జగామ=పోయెను.

ఈప్రకారముమహాత్ముండగుసగరచక్రవర్తిలెస్సగా నాజ్ఞాపించిన, నంశుమంతుండు, ధనువునుఖడ్గంబునుధరించి, చులుకనగా నడుచుచుఁ, బోయెను. అని, తాత్పర్యము.

స ఖాతం పితృభి ర్మార్గ మంతర్భౌమం మహాత్మభిః
ప్రాపద్యత నరశ్రేష్ఠ తేన రాజ్ఞా భిచోదితః. ౬

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! సః=ఆయంశుమంతుఁడు; తేన=ఆ; రాజ్ఞా=సగరచక్రవర్తిచేత; అభిచోదితః = ప్రేరేపింపఁబడినవాఁడై; మహాత్మభిః= పూజ్యమైన స్వభావముగల;

పితృభిః=తండ్రులచేత; ఖాతం=త్రవ్వఁబడినదియు; అంతర్భౌమం = భూమికిలోపలఁ బుట్టినదియునగు; మార్గం=దారిని;ప్రాపద్యత=పొందెను.

పురుష శ్రేష్ఠుఁడవైన రాముఁడా! ఆయంశుమంతుండు, ఇట్లు, సగరునిచేఁ బ్రేరేపింపఁబడి, మహాత్ములగుతనతండ్రులు, భూమికిలోపలఁ ద్రవ్వినమార్గమునుబట్టిపోయెను. అని, తాత్పర్యము.

దైత్యదానవరక్షోభిః పిశాచపతగోరగైః
పూజ్యమానం మహాతేజా దిశాగజ మపశ్యత. ౭

టీక॥ మహాతేజాః=అధికమైన పరాక్రమముగల, యంశుమంతుఁడు; దైత్యదానవరక్షోభిః=దైత్యులచేతనుదానవులచేతను రాక్షసులచేతను; పిశాచపతగోరగైః=పిశాచములచేతనుబక్షులచేతనుసర్పములచేతను; పూజ్యమానం=పూజింపఁబడుచున్న;దిశాగజం=దిగ్గజమును; అపశ్యత(అపశ్యత్) = చూచెను.

మహాపరాక్రమశాలియగు నంశుమంతుండు, దైత్యులచేతనుదానవులచేతను రాక్షసులచేతనుబిశాచములచేతనుబక్షులచేతనుసర్పములచేతనుంబూజింపఁబడుచున్న, దిగ్గజముం,జూచెను.అని, తాత్పర్యము.

స తం ప్రదక్షిణం కృత్వా పృష్ట్వాచాపి నిరామయమ్
పితౄంస్స పరిపప్రచ్ఛ వాజిహర్తార మేవచ. ౮

టీక॥ సః = ఆయంశుమంతుఁడు;తం=ఆదిగ్గజమునుగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా=చేసి; నిరామయంచాపి=ఆరోగ్యమును;పృష్ట్వా=అడిగి;సః=ఆయంశుమంతుఁడు (క్రియాభేదంబునఁబునరుక్తి దోషంబు లేదు.); పితౄన్=తండ్రులను; వాజిహర్తార



మేవచ= గుఱ్ఱమునపహరించినవానిని; పరిపప్రచ్ఛ=అడిగెను.

ఆయంశుమంతుఁడు, ఆదిగ్గజమునకుఁబ్రదక్షిణము జేసి, "యారోగ్యమా?" అనియడిగి, "మాతండ్రులెచ్చట నున్నారు? గుఱ్ఱపుదొంగయెచ్చటనున్నాఁడు?" అని,యడిగెను. అని, తాత్పర్యము.

దిశాగజ స్తుతచ్ఛ్రుత్వా ప్రత్యాహాంశుమతో వచః
ఆసమంజ కృతార్థ స్త్వం సహాశ్వ శ్శీఘ్ర మేష్యసి. ౯

టీక॥ దిశాగజస్తు=దిగ్గజమును; తత్=ఆమాటను; శ్రుత్వా=విని; అంశుమతః=అంశుమంతునకు; "ఆసమంజ= అసమంజునిపుత్రుఁడవైన యంశుమంతుఁడా! త్వం=నీవు; కృతార్థః= నెఱవేఱినపనిగలవాఁడవై; సహాశ్వః=గుఱ్ఱముతోఁగూడినవాఁడవై; శీఘ్రం=త్వరితముగా; ఏష్యసి= పోఁగలవు." ఇతి(అధ్యాహృతము)=అని; వచః=మాటను; ప్రత్యాహ=బదులుచెప్పెను.

దిగ్గజమును, ఆయంశుమంతుఁడుచెప్పినమాటవిని, యంశుమంతునింజూచి, "అంశుమంతుఁడా! నీవు, కృతార్థుఁడవై, గుఱ్ఱముంగూడి, శీఘ్రంబుగాఁబోఁగలవు." అని, చెప్పెను. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా సర్వానేవ దిశాగజాన్
యథాక్రమం యథాన్యాయం ప్రష్టుం సముపచక్రమే. ౧౦

టీక॥ సః(అధ్యాహృతము)= ఆయంశుమంతుఁడు; తస్య=ఆదిగ్గజముయొక్క; తత్=ఆ; వచనం= మాటను; శ్రుత్వా=విని; దిశాగజాన్=దిగ్గజములను; సర్వానేవ= అన్నింటినే; యథాక్రమం=వరుసదప్పక; యథాన్యాయం=యథావిధిగా; ప్రష్టుం=అడుగుటకు; సముపచక్రమే= ఆరంభించెను; అడిగెననుట.



ఆదిగ్గజము చెప్పిన మాటవిని, యంశుమంతుండు, అట్లెదిగ్గజంబు లనన్నింటిని, వరుసగాఁజూచి,యథావిధిగఁబూజించి, తనతండ్రులను గుఱ్ఱపుదొంగనుంగూర్చి, యడిగెను. అని, తాత్పర్యము.

తైశ్చ సర్వైర్ది శాపాలై ర్వాక్యజ్ఞై ర్వాక్యకోవిదైః
పూజిత స్సహయశ్చైవ గంతాసీ త్యభిచోదితః. ౧౧

టీక॥ సః (అధ్యాహృతము)= ఆయంశుమంతుఁడు;వాక్యజ్ఞైః= ఇతరులు చెప్పిన,మాటల నెఱింగినవియు;వాక్యకోవిదైః=మాటలయందుస్పష్టార్థములునగు;తైః=ఆ; సర్వైః=సమస్తములైన; దిశాపాలైశ్చ=దిక్కులను బాలించెడిదిగ్గజముల చేతను; పూజితః=పూజింపఁబడినవాఁడై; "త్వం (అధ్యాహృతము)=నీవు; సహయశ్చైవ=గుఱ్ఱముతోఁ గూడినవాఁడవై యే; గంతాసి=పోఁగలవు"; ఇతి=అని; ఉక్త్వా (అధ్యాహృతము)=చెప్పి;అభిచోదితః = తోలఁబడినవాఁడు, పంపఁబడినవాఁడనట, ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

ఇతరులు చెప్పుమాటల యభిప్రాయ మెఱింగియుక్తముగామాటలాడంజాలిన యాదిగ్గజంబు లన్నియు,నంశుమంతునింబూజించి, "నీవు గుఱ్ఱముంగూడియేపోఁగలవు" అని,యాశీర్వదించి, వీడ్కొనినవి. అని, తాత్పర్యము.

తేషాం తద్వచనం శ్రుత్వా జగామ లఘువిక్రమః
భస్మరాశీకృతా యత్ర పితర స్తస్య సాగరాః. ౧౨

టీక॥ సః (అధ్యాహృతము)= ఆయంశుమంతుండు; తేషాం=ఆ దిగ్గజములయొక్క;తత్=ఆ; వచనం=మాటను;శ్రుత్వా=విని;లఘువిక్రమః=చులుకనైన కాలినడకగలవాఁడై,తస్య = ఆయంశుమంతుని




యొక్క; పితరః=తండ్రులైన; సాగరాః=సగరునికొడుకులు; యత్ర= ఎచ్చట; భస్మరాశీకృతాః= బూడిదరాసులుగాఁజేయఁబడిరో; తం(అధ్యాహృతము)=ఆప్రదేశమును; జగామ=పొందెను

ఆదిగ్గజములు చెప్పినమాటవిని, యంశుమంతుఁడు, శీఘ్రముగానడిచి, తనతండ్రులైన సగరపుత్రులు, బూడిదరాసులుగాఁ జేయఁబడిపడియున్నప్రదేశమునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

స దుఃఖవశ మాపన్న స్త్వసమంజసుత స్తదా
చుక్రోశ పరమార్తస్తు వధా త్తేషాం సుదుఃఖితః. ౧౩

టీక॥ దుఃఖవశం= దుఃఖమునకులోఁకువయగుటను; ఆపన్నః తు= పొందియేయున్నట్టి; సః=ఆ; అసమంజసుతః= అసమంజునికొడుకైనయంశుమంతుఁడు; తదా= అప్పుడు; తేషాం= ఆసగరపుత్రులయొక్క; వధాత్=చావువలన; సుదుఃఖితః = మిక్కిలిదుఃఖమునొందినవాఁడై; పరమార్తః తు= మిక్కిలి పీడింపఁబడినవాఁడునై; చుక్రోశ= ఏడ్చెను.

తండ్రులైన సగరపుత్రులదివఱకెంతవెదకినప్పటికి నగపడక[illegible]డుటచేనింతకుమునుపే యతిదుఃఖమునకులోఁబడియున్న యసమంజపుత్రుండగునంశుమంతుండు, తనతండ్రులైన సగరపుత్రులుచచ్చి పడియుండుటం జూచి, యినుమడిగా దుఃఖమునొంది, మిక్కిలియునార్తుఁడై, యేడ్చెను. అని, తాత్పర్యము.

యజ్ఞీయంచ హయం తత్ర చరంత మవిదూరతః
దదర్శ పురుషవ్యాఘ్రో దుఃఖశోకసమన్వితః. ౧౪

టీక ॥ దుఃఖశోకసమన్వితః = దుఃఖముతోనుఏడ్పుతోనుంగూడికొనిన; పురుషవ్యాఘ్రః=పురుశ్రేష్ఠుఁడగునంశుమంతుండు; తత్ర=అచ్చట; అవిదూరతః=సమీపమందు; చరంతం=తిరుగుచున్న; యజ్ఞీయం=




యాగార్హ్యమగు; హయంచ=గుఱ్ఱమును; దదర్శ=చూచెను.

పురుష శ్రేష్ఠుండగు నంశుమంతుం, డిట్లుదుఃఖమునొంది యేడ్చుచు, నచ్చటనేసమీపమందుఁదిరుగుచున్నయాగార్హంబగు గుఱ్ఱమునుం జూచెను. అని, తాత్పర్యము.

స తేషాం రాజపుత్రాణాం కర్తుకామో జలక్రియామ్
సలిలార్థీ మహాతేజా నచాపశ్య జ్జలాశయమ్. ౧౫

టీక॥ తేషాం=ఆ; రాజపుత్రాణాం = రాచకొమరులకు; జలక్రియాం= జలతర్పణమును; కర్తుకామః=చేయఁగోరినవాఁడును; సలిలార్థీ= జలమునుగోరువాఁడును; మహాతేజాః= అధికమైనపరాక్రమముగలవాఁడునగు; సః=ఆయంశుమంతుఁడు; జలాశయం=కొలనును; నచాపశ్యత్=చూడనేలేదు.

ఆయంశుమంతుఁడు, సగరపుత్రులకుఁదర్పణముసేయఁగోరి, జలముకావలసి, యెంత వెదకినను, అతనికి, ఒక్కకొలనైన నగపడలేదు. అని, తాత్పర్యము.

విసార్య నిపుణాం దృష్టిం తతో పశ్య త్ఖగాధిపమ్
పితౄణాం మాతులం రామ సుపర్ణ మనిలోపమమ్. ౧౬

టీక॥ రామ = రాముఁడా! సః (అధ్యాహృతము)= ఆయంశుమంతుఁడు; నిపుణాం=సమర్థమైన, దూరపువాటిని దెలిసికొనునట్టియనుట; దృష్టిం=చూపును; విసార్య=ప్రసరింపఁజేసి; తతః = అటుపిమ్మట; ఖగాధిపం = పక్షులకురాజును; పితౄణాం= తండ్రులైనసగరపుత్రులకు; మాతులం, మేనమామయును; అనిలోపమం= వాయువుతోఁబోలికగలవాఁడనగు; సుపర్ణం=గరుత్మంతుని; అపశ్యత్=చూచెను.

రాముఁడా! ఆయంశుమంతుఁడు, చాలదూరమువఱకు చక్కఁగాఁజూచి, కొలనుంగానక, యటుపిమ్మట= వేగంబునవాయుదేవునకుసరివచ్చు

వాఁడై తనతండ్రులకు మేనమామ యైన పక్షిరాజగు గరుత్మంతునిం జూచెను.

అని, తాత్పర్యము.

స చైవ మబ్రవీ ద్వాక్యం వైనతేయో మహాబలః

టీక॥ మహాబలః= అధికమైనబలముగల! సః=ఆ; వైనతేయశ్చ=వినతకొడుకైనగరుత్మంతుఁడును; ఏవం=ఈప్రకారము; అబ్రవీత్=చెప్పెను.

మహాబలుండును వినతాపుత్రుండునగు నాగరుత్మంతుఁడును, అంశుమంతునిం జూచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

మాశుచః పురుషవ్యాఘ్ర వధోఽయం లోకసమ్మతః. ౧౭

టీక॥ పురుషవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుఁడవైన యంశుమంతుఁడా! త్వం(అధ్యాహృతము)=నీవు; మా శుచః= దుఃఖింపకుము. అయం= ఈ; వధః=చావు; లోకసమ్మతః= లోకంబులకిష్టమైనది.

పురుషశ్రేష్ఠుండవగు నంశుమంతుఁడా! వీరల చావు లోకంబులకన్నింటికిసమ్మతంబైనది, కావున,నీవు దుఃఖింపవలదు.

అని, తాత్పర్యము.

కపిలే నాప్రమేయేన దగ్ధా హీమే మహాబలాః
సలిలం నార్హసి ప్రాజ్ఞ దాతు మేషాంహి లౌకికమ్. ౧౮

టీక॥ మహాబలాః= అధికమైన బలముగల; ఇమే=ఈసగరపుత్రులు; అప్రమేయేన= కొలతపెట్టరానిః; కపిలేన = కపిలునిచేత; దగ్ధాః హి= కాల్పఁబడిరిగదా! ప్రాజ్ఞ= పండితుఁడవైనయంశుమంతుఁడా! ఏషాం=వీరలకు; లౌకికం= ఈలోకమందుఁగలిగిన; సలిలం= జలమును; దాతుం=ఇచ్చుటకు; నార్హసి హి=తగవుగదా!

మహాబలులగు నీసగరపుత్రులు కొలతకురాని ప్రభావంబుగలకపిలునిచేదహింపఁబడిరి; నీవు, సర్వధర్మంబులం దెలిసినవాఁడవు; "చండాలాదుదకాత్సర్పాద్వైద్యుతాద్బ్రాహ్మణాదపి,దంష్ట్రిభ్యశ్చపశుభ్యశ్చమరణం పాపకర్మణాం, ఉదకంపిండదానంచఏతేభ్యోయద్విధీయతే, నోపతిష్ఠతితత్సర్వమంతరిక్షేవినశ్యతి." (ఏపాపిష్ఠులకు, చండాలునివలనఁగాని, జలమువలనఁగాని,సర్పమువలనఁగాని, మెఱుపువలనఁగాని,బ్రాహ్మణునివలనఁగాని, కోఱలుగల్గినక్రూర మృగంబులవలనఁగాని,పశువులవలనఁగాని,మరణముగల్గునో,అట్టివారికిజలతర్పణముగాని, పిండప్రదానముగాని, యెయ్యది,సేయఁబడునో, అదియేమియునువారికిఁజేరదు, అంతరిక్షమందెనశించును.) అని ధర్మశాస్త్రమందుఁజెప్పఁబడుటంజేసి,బ్రాహ్మణుండగు కపిలునిచేఁ జంపఁబడిన యీసగరపుత్రులకు, లౌకికంబగు జలముచేఁ, దర్పణముసేయవలదు.

అని, తాత్పర్యము.

గంగా హిమవతో జ్యేష్ఠా దుహితా పురుషర్షభ
తస్యాం కురు మహాబాహో పితౄణాంతు జలక్రియామ్.౧౯

టీక॥ పురుషర్షభ= పురుషశ్రేష్ఠుఁడవగునంశుమంతుఁడా ! గంగా=గంగయనెడు; హిమవతః= హిమవత్పర్వతము యొక్క; జ్యేష్ఠా, పెద్దదైన;దుహితా=కూఁతురు;అస్తి(అధ్యాహృతము)=ఉన్నది.మహాబాహో=గొప్పచేతులుగలయంశుమంతుఁడా ! తస్యాం=ఆ గంగానదియందు; పితౄణాం = తండ్రులకు;జలక్రియాంతు= జలతర్పణమునుమాత్రము; కురు= చేయుము.

పురుష శ్రేష్ఠుండవు మహాబాహుండవునగు నంశుమంతుఁడా ! హిమవంతుని పెద్దకూఁతురుగంగయనియొకనదియున్నది;నీవు, తండ్రులకు,జలతర్పణమును, దప్పక, యానదియందే, చేయవలయును.

అని,తాత్పర్యము.




భస్మరాశీకృతా నేతాన్ ప్లావయే ల్లోకపావనీ
తయా క్లిన్న మిదం భస్మ గంగయా లోకకాంతయా. ౨౦
షష్టిం పుత్ర సహస్రాణి స్వర్గలోకం నయిష్యతి

టీక॥ లోకపావనీ= లోకంబులంబరిశుద్ధములుగాఁజేయునట్టి గంగానది; భస్మరాశీకృతాన్= బూడిదరాసులుగాఁ జేయంబడిన; ఏతాన్=ఈసగరపుత్రులను; ప్లావయేత్ (యది)= తడుపునట్లైన; లోకకాంతయా=లోకములకుఁబ్రియమైన; తయా=ఆ; గంగయా=గంగానదిచేత; క్లిన్నం=తడుపఁబడిన; ఇదం=ఈ; భస్మ=బూడిద; పుత్రసహస్రాణి= కొడుకులయొక్క వేలను; షష్టిం=అఱువదింటిని; స్వర్గలోకం=దేవలోకమును; నయిష్యతి (నేష్యతి)=పొందింపఁగలదు.

లోకపావనంబగు గంగానది, బూడిదరాసులుగాఁజేయఁబడియున్నవీరలందఱుపునేని, లోకంబులకంతయుఁ బ్రియమైన గంగానదిచే తఁదడుపంబడినయీబూడిద, సగరునికొడుకులనఱువదివేవురను, స్వర్గలోకంబునొందించును.

అని, తాత్పర్యము.

గచ్ఛ చాశ్వం మహాభాగ తం గృహ్యా పురుషర్షభ. ౨౧
యజ్ఞం పైతామహం వీర సంవర్తయితు మర్హసి

టీక॥ మహాభాగ = అధికమైన భాగ్యముగల; పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవైన యంశుమంతుఁడా! తం=ఆ; అశ్వంచ=గుఱ్ఱమును, గృహ్య(గృహీత్వా) = తీసికొని; గచ్ఛ=పొమ్ము. వీర=పరాక్రమశాలివగు నంశుమంతుఁడా ! పైతామహం= తాతయగుసగరునిదైన; యజ్ఞం= యాగమును; సంవర్తయితుం=పూర్తిచేయుటకు; అర్హసి=తగుదువు.

పురుషశ్రేష్ఠుఁడవగు నంశుమంతుఁడా! నీవు, మహాభాగ్యశాలివి(గనుకనే, నీకుగుఱ్ఱమైననుదొరకెనది);

ఈగుఱ్ఱమునుదీసికొని సగరునియొద్దకుఁబొమ్ము; నీవు,వీరుఁడవు,(కావున, నశ్వమేధయాగమునునిర్వహింపవలయును )సగరుఁడు సేయుయాగమునుబూర్తినొందింపుము. అని, గరుత్మంతుఁ డంశుమంతునకుఁ జెప్పెను. అని,తాత్పర్యము.

సుపర్ణవచనం శ్రుత్వా సోంశుమా నతివీర్యవాన్. ౨౨
త్వరితం హయ మాదాయ పున రాయా న్మహాయశాః

టీక॥ సుపర్ణ వచనం = గరుత్మంతునిమాటను;శ్రుత్వా=విని;అతివీర్యవాన్=మిక్కిలియుఁబరాక్రమశాలియును; మహాయశాః=అధికమైనకీర్తిగలవాఁడునగు;సః=ఆ; అంశుమాన్ = అంశుమంతుఁడు; త్వరితం=శీఘ్రముగా;హయం=గుఱ్ఱమును;ఆదాయ = తీసికొని;పునః=మఱల; ఆయాత్=వచ్చెను.

గరుత్మంతుఁడు చెప్పినమాటవిని,యతిపరాక్రమశాలియునుమిక్కిలికీర్తి గలవాఁడునగు నాయంశుమంతుఁడు,శీఘ్రముగాగుఱ్ఱమునుదీసికొని, మఱల, సగరునియొద్దకువచ్చెను. అని,తాత్పర్యము.

తతో రాజాన మాసాద్య దీక్షితం రఘునందన. ౨౩
న్యవేదయ ద్యథావృత్తం సుపర్ణవచనం తథా

టీక॥ రఘునందన=రాముఁడా! తతః= అటుపిమ్మట; సః(అధ్యాహృతము)=ఆయంశుమంతుఁడు;దీక్షితం = దీక్షవహించియున్న;రాజానం = సగరచక్రవర్తిని;ఆసాద్య=చేరి; వృత్తం = తండ్రులయొక్క,సమాచారమును;సుపర్ణవచనం=గరుత్మంతుని మాటయును ; యథా=ఎట్లో;తథా=అట్లు;న్యవేదయత్=తెలిపెను.

రాముఁడా! అంత,నాయంశుమంతుఁడు, దీక్షవహించియున్న,సగరునియొద్దకుఁబోయి, తండ్రులవృత్తాంతమునుగరుత్మంతుఁడు చెప్పిన

మాటను, జెప్పెను. అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా ఘోరసంకాశం వాక్య మంశుమతో నృపః. ౨౪
యజ్ఞం నిర్వర్తయామాస యథాకల్పం యథావిధి

టీక॥ నృపః= రాజైనసగరుఁడు; అంశుమతః = అంశుమంతుని యొక్క; ఘోరసంకాశం=భయంకరముగానున్నట్టి; తత్ = ఆ; వాక్యం=మాటను, శ్రుత్వా=విని; యజ్ఞం= అశ్వమేధయాగమును; యథాకల్పం=వరుసదప్పక; యథావిధి=యథాశాస్త్రముగా; నిర్వర్తయామాస=పూర్తిజేసెను.

సగరచక్రవర్తి, భయంకరమైన యంశుమంతునిమాటవిని, యాగమును, యథాక్రమముగా యథాశాస్త్రముగాఁబూర్తిజేసెను.

అని, తాత్పర్యము.

స్వపురం చాగమ చ్ఛ్రీమా నిష్టయజ్ఞో మహీపతిః. ౨౫
గంగాయా శ్చాగమే రాజా నిశ్చయం నాధ్యగచ్ఛత

టీక॥ శ్రీమాన్=సంపదగల; మహీపతిః=భూమికిఁబ్రభువైన సగరుఁడు; ఇష్టయజ్ఞః, ఇష్ట=యజింపఁబడిన, యజ్ఞః=యాగముగలవాఁడై; స్వపురంచ=తనపట్టణమును; ఆగమత్=పొందెను. రాజా=రాజైనసగరుఁడు; గంగాయాః=గంగానదియొక్క; ఆగమే=వచ్చుటయందు; నిశ్చయంచ=ఉపాయమునుగూడ; నాధ్యగచ్ఛత=తెలియలేదు.

శ్రీమంతుండగు సగరచక్రవర్తి యాగముముగిసినవెనుకఁ, దనపట్టణముఁజేరెను; అతనికి, గంగానదిందెచ్చుటకుపాయంబెంతవిచారించినను, దెలియనేలేదు.

అని, తాత్పర్యము.

అకృత్వా నిశ్చయం రాజా కాలేన మహతా మహాన్. ౨౬
త్రింశ ద్వర్షసహస్రాణి రాజ్యం కృత్వా దివం గతః

టీక॥ మహాన్=పూజ్యుఁడైన; రాజా=రాజగుసగరుఁడు; త్రింశత్=

ముప్పది; వర్షసహస్రాణి= సంవత్సరముల యొక్క వేలు; రాజ్యం=దొరతనమును; కృత్వా=చేసి; నిశ్చయం=ఉపాయమును;అకృత్వా=చేయక; మహతా= దీర్ఘమైన;కాలేన=కాలముచేత;దివం=స్వర్గమును;గతః=పొందెను.

పూజ్యుండగు సగరచక్రవర్తి, గంగానదిందెచ్చుటయందేయుపాయమునుజేయకయె, ముప్పదివేలేండ్లు, రాజ్యంబుచేసి,దీర్ఘకాలంబునకు, దేవలోకమునొందెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే, ఏకచత్వారింశస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండైకచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

౪౨

ద్విచత్వారింశసర్గప్రారంభః.

కాలధర్మం గతే రామ సగరే ప్రకృతీజనాః
రాజానం రోచయామాసు రంశుమంతం సుధార్మికమ్. ౧

టీక॥ రామ=రాముఁడా! సగరః=సగరచక్రవర్తి;కాలధర్మం=కాలముచేఁ బొందఁదగినధర్మమును, (అనఁగా,పుట్టినవారలకందఱకుఁగాలముచే నవశ్యముకావలసినధర్మమునుట.) చావును;గతే=పొందినవాఁడుకాఁగా; ప్రకృతీజనాః(ప్రకృతిజనాః)=మంత్రులుఁను

ధార్మికం = మిక్కిలియుధర్మము నాచరించునట్టి; అంశుమంతం= అంశుమంతుని; రాజానం=రాజునుగా; రోచయామాసుః=కోరిరి.

రాముఁడా, సగరచక్రవర్తిమరణమునొందఁగానే, మంత్రులు, మిక్కిలియుధార్మికుఁడగునంశుమంతుని, రాజుగాఁగోరిరి.

అని, తాత్పర్యము.

స రాజా సుమహా నాసీ దంశుమాన్ రఘునందన
తస్య పుత్రో మహా నాసీ ద్దిలీపఇతి విశ్రుతః. ౨

టీక॥ రఘునందన = రాముఁడా! సః= ఆ; అంశుమాన్=అంశుమంతుఁడు; సుమహాన్= మిక్కిలి పూజ్యుఁడైన; రాజా=రాజుగా; ఆసీత్= ఆయెను. తస్య=ఆయంశుమంతునకు; దిలీపఇతి=దిలీపుఁడని; విశ్రుతః=ప్రసిద్ధుఁడైన; మహాన్= పూజ్యుఁడగు; పుత్రః=కొడుకు; ఆసీత్ =ఉండెను.

రాముఁడా! ఆయంశుమంతుఁడుమిగులఁబూజ్యుఁడైన రాజుగానుండెను; అతనికిదిలీపుఁడనునొకకొనియాడందగినకొడుకుండెను.

అని, తాత్పర్యము.

తస్మిన్ రాజ్యం సమావేశ్య దిలీపే రఘునందన
హిమవచ్ఛిఖరే పుణ్యే తప స్తేపే సుదారుణమ్. ౩

టీక॥ రఘునందన = రాముఁడా! సః(అధ్యాహృతము)=ఆయంశుమంతుండు; తస్మిన్=ఆ; దిలీపే= దిలీపునియందు; రాజ్యం=దొరతనమును; సమావేశ్య=అప్పగించి; పుణ్యే=పవిత్రమైన; హిమవచ్ఛిఖరే= హిమవత్పర్వతముయొక్క శిఖరమునందు; సుదారుణం= మిక్కిలిభయంకరమగు; తపః= తపస్సును; తేపే=తపించెను.

రాముఁడా! ఆయంశుమంతుఁడు, తనకొడుకైన దిలీపునకురాజ్యమునప్పగించి, పవిత్రంబగుహిమవత్పర్వతము శిఖరముఁజేరి, గంగా

నదిందెచ్చుటకై, గొప్పతపముచేసెను. అని, తాత్పర్యము.

ద్వాత్రింశచ్చ సహస్రాణి వర్షాణి సుమహాయశాః
తపోవనం గతో రామ స్వర్గం లేభే తపోధనః. ౪

టీక॥ సుమహాయశాః= మిక్కిలియధికమైన కీర్తిగల యంశుమంతుండు; తపోధనః= తపస్సేధనముగాఁగలవాఁడై; ద్వాత్రింశత్=ముప్పదిరెండు; సహస్రాణి=వేలు; వర్షాణిచ=ఏండ్లును; తపోవనం=తపస్సేయువనమును; గతః= పొందినవాఁడై, తపస్సుచేసినవాఁడైయునుట; స్వర్గం= దేవలోకమును; లేభే=పొందెను.

మిగులఁ గీర్తిశాలియగు నాయంశుమంతుండు, రాజ్యభోగంబులందాసవిడిచి, తపస్సేధనముగానెంచి, ముప్పదిరెండువేలేండ్లుతపముచేసి, పిదపస్వర్గమునొందెను. అని, తాత్పర్యము.

దిలీపస్తు మహాతేజా శ్శ్రుత్వా పైతామహం వధమ్
దుఃఖోపహతయా బుద్ధ్యా నిశ్చయం నాధ్యగచ్ఛత. ౫

టీక॥ మహాతేజాః= అధికమైన పరాక్రమముగల; దిలీపస్తు=దిలీపుఁడును; పైతామహం=తాతలదైన; వధం=చావును; శ్రుత్వా= విని; దుఃఖోపహతయా, దుఃఖ = దుఃఖముచేత, ఉపహతయా = కొట్టఁబడిన; బుద్ధ్యా=బుద్ధితో; యుక్తః (అధ్యాహృతము)= కూడినవాఁడై; నిశ్చయం=ఉపాయమును; నాధ్యగచ్ఛత=తెలియలేదు.

అధికమైన పరాక్రమముగలదిలీపుఁడును, తాతలచావునువిని, "మాతండ్రి, యతిదుష్కరంబగుతపస్సుచేసినప్పటికిని, గంగానది, లభింపఁడయ్యె; మఱేమి యుపాయంబున నొందవచ్చును" అని, దుఃఖాతిశయంబున, బుద్ధి, కొట్టువడియున్నందున, గంగానదిం దెచ్చుటకుందగునుపాయంబుదెలియఁడయ్యె. అని, తాత్పర్యము.

కథం గంగావతరణం కథం తేషాం జలక్రియా
తారయేయం కథం చైనా నితి చింతాపరో భవత్. ౬

టీక॥ సః (అధ్యాహృతము)= ఆదిలీపుఁడు; "గంగావతరణం, గంగా = గంగానదియొక్క, అవతరణం= స్వర్గమునుండిభూమికిదిగుట; కథం = ఎట్లు; స్యాత్ (అధ్యాహృతము)=అగును? తేషాం=వారలకు; జలక్రియా=జలతర్పణము; కథం=ఎట్లు; స్యాత్ (అధ్యాహృతము)=అగును; ఏనాన్= వీరలను; కథం=ఎట్లు; తారయేయం=తరింపఁజేయుదును? ఇతి=ఇట్లు; చింతాపరః, చింతా=ఆలోచనకు, పరః= అధీనుఁడు; అభవత్=ఆయెను.

ఆదిలీపుఁడు "ఎట్లుగంగానదింత్తును? ఎట్లు, తాతలకుజలతర్పణమ సేయుదును? వీరలనెట్లుతరింపఁజేయుదును" అని, యెల్లప్పుడుఁజింతిపుచు నేయుండెను. అని తాత్పర్యము॥

తస్య చింతయతో నిత్యం ధర్మేణ విదితాత్మనః
పుత్రో భగీరథో నామ జజ్ఞే పరమధార్మికః. ౭

టీక॥ విదితాత్మనః=తెలియఁబడిన పరమాత్మ గలవాఁడును, నిత్యం=ఎల్లప్పుడును; ధర్మేణ=ధర్మముచేత; చింతయతః=ఆలోచింపుచున్నవాఁడునగు; తస్య=ఆదిలీపునకు; భగీరథోనామ=భగీరథుఁడనెడు; పరమధార్మికః=మిక్కిలియు ధర్మమునాచరించునట్టి; పుత్రః= కొడుకు; జజ్ఞే=పుట్టెను.

పరమాత్మ స్వరూప మెఱింగినవాఁడై, యీప్రకారమెల్లప్పుడుధర్మబుద్ధిచే నాలోచింపుచున్నయాదిలీపునకు, భగీరథుండనుపరమధార్మికుఁడైనకొడుకుపుట్టెను.

అని, తాత్పర్యము.

దిలీపస్తు మహాతేజా యజ్ఞైర్బహుభి రిష్టవాన్
త్రింశ ద్వర్షసహస్రాణి రాజా రాజ్య మకారయత్

టీక॥ మహాతేజాః= అధికమైన పరాక్రమముగల; రాజా=రాజైన; దిలీపస్తు= దిలీపుఁడును; బహుభిః = అనేకములైన; యజ్ఞైః= యాగముల చేత; ఇష్టవాన్= దేవతలఁ బూజించెను. త్రింశత్=ముప్పది; వర్ష సహస్రాణి=సంవత్సరములయొక్క వేలు; రాజ్యం= దొరతనమును; అకారయత్ =చేసెను.

మిక్కిలియుఁబరాక్రమము గల దిలీప మహారాజును, అనేకయాగములు చేసి, దేవతలనారాధించెను; ముప్పది వేలేండ్లు దొరతనముచేసెను. అని, తాత్పర్యము.

అగత్వా నిశ్చయం రాజా తేషా ముద్ధరణం ప్రతి
వ్యాధినా నరశార్దూల కాలధర్మ ముపేయివాన్. ౯

టీక॥ నరశార్దూల = పురుషశ్రేష్ఠుఁడవైన రాముఁడా! రాజా= దిలీపమహారాజు; తేషాం=ఆతాతయొక్క; ఉద్ధరణం ప్రతి=నరకంబునుండి, లేవుటనుగూర్చి; నిశ్చయం= ఉపాయమును; అగత్వా=పొందక; వ్యాధినా= రోగముచేత; కాలధర్మం=పుట్టినవారలకుఁగాలముచే నవశ్యముకావలసినధర్మమును; ఉపేయివాన్=పొందెను.

పురుష శ్రేష్ఠుఁడవైన రాముఁడా! దిలీపమహారాజు, తన తాతలనుద్ధరింప నుపాయంబు దెలియకయె, రోగముచేమరణమునొందెను. అని, తాత్పర్యము.

ఇంద్రలోకం గతో రాజా స్వార్జితే నైవ కర్మణా
రాజ్యే భగీరథం పుత్ర మభిషిచ్య నరర్షభః. ౧౦

టీక॥ నరర్షభః= పురుషశ్రేష్ఠుఁడైన; రాజా= దిలీపమహారాజు; రాజ్యే = దొరతనమునందు; పుత్రం = కొడుకైన; భగీరథం= భగీరథుని; అభిషిచ్య= అభిషేకించి; స్వార్జితేన= తనచేతసంపాదింపఁబడిన; కర్మణైవ=కర్మముచేతనే; ఇంద్రలోకం = ఇంద్రునిలో

కమైన స్వర్గమును; గతః=పొం దెను.

పురుషశ్రేష్ఠుండగు దిలీపుఁడు, రాజ్యమందుఁదనకొడుకగు భగీరథునియమించి, తానుసంపాదించిన పుణ్యంబుచే, స్వర్గమునొందెను.

అని, తాత్పర్యము.

భగీరథస్తు రాజర్షి ర్ధార్మికో రఘునందన
అనపత్యో మహాతేజాః ప్రజాకామ స్స చాప్రజః. ౧౧
మంత్రి ష్వాధాయ తద్రాజ్యం గంగావతరణే రతః

టీక॥ రఘునందన=రాముఁడా! ధార్మికః= ధర్మమునాచరించువాఁడును; మహాతేజాః=అధికమైన పరాక్రమము గలవాఁడును; రాజర్షిః=రాజునుఋషియునగు; భగీరథస్తు=భగీరథుండును; అనపత్యః= సంతానములేనివాఁడై; (కనుకనే) ప్రజాకామః = సంతానముకోరువాఁడుగా; ఆసీత్ (అధ్యాహృతము)=ఉండెను. అప్రజః=సంతానములేనట్టి; సచ=ఆభగీరథుఁడును, తత్=ఆ; రాజ్యం=దొరతనమును; మంత్రిషు =మంత్రులయందు; ఆధాయ=ఉంచి; గంగావతరణే= గంగయొక్క భూమికి వచ్చుటయందు; రతః=ఆసక్తుఁడు; ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

రాముఁడా! ధార్మికుండును, మిక్కిలియుఁబరాక్రమశాలియు, రాజర్షియునగు, భగీరథుండు, సంతానములేనివాఁడుకావునసంతానముగోరుచుండెను; ఆభగీరథుండుతనకు సంతానములేనందున, రాజ్యభారమునుమంత్రులయందుంచి, గంగనుభూమికిఁదెచ్చుటయందాసక్తుఁడైయుండెను. అని, తాత్పర్యము

స తపో దీర్ఘ మాతిష్ఠ ద్గోకర్ణే రఘునందన. ౧౨
ఊర్ధ్వబాహుః పంచతపా మాసాహారో జితేంద్రియః

టీక॥ రఘునందన = రాముఁడా! సః=ఆభగీరథుఁడు; గోకర్ణే

గోకర్ణ=మను క్షేత్రమందు; ఊర్ధ్వ బాహుః = పైకెత్తినచేతులుగలవాఁడై; పంచతపాః=ఐదింటినడుమను దపముగలవాఁడై, (నాల్గుప్రక్కలను నాలుగగ్ని హోత్రములు, పైననుండుసూర్యుండునొకయగ్ని,ఈయైదగ్నుల నడుమనుండితపస్సుసేయు వాఁడైయనుట.); మాసాహారః= మాసమునకొకమాటుగానాహారముగలవాఁడై; జితేంద్రియః = జయింపఁబడినయింద్రియములుగలవాఁడై;దీర్ఘం= దీర్ఘకాలము;తపః= తపస్సును;ఆతిష్ఠత్ =ఆశ్రయించెను.

రామా! ఆభగీరథుఁడు, గోకర్ణక్షేత్రముఁజేరి, చేతులుపైకెత్తి,పంచాగ్నులనడుమనుండి,మాసమునకొక్కమాటుభుజించుచు, జితేంద్రియుండై, దీర్ఘకాలముతపస్సుచేసెను. అని, తాత్పర్యము.

తస్య వర్ష సహస్రాణి ఘోరే తపసి తిష్ఠతః. ౧౩
అతీతాని మహాబాహో తస్య రాజ్ఞో మహాత్మనః
సుప్రీతో భగవాన్ బ్రహ్మా ప్రజానాం పతి రీశ్వరః. ౧౪

టీక॥ మహాబాహో= గొప్పచేతులుగలరాముఁడా! తస్య = ఆభగీరథుఁడు; ఘోరే=భయంకరమైన;తపసి = తపస్సునందు;తిష్ఠతః=ఉండఁగా;వర్షసహస్రాణి= సంవత్సరముల యొక్క వేలు; అతీతాని=కడచినవి. మహాత్మనః=పూజ్యమైనస్వభావముగల; తస్య=ఆ; రాజ్ఞః=భగీరథమహారాజునకు; భగవాన్=మాహాత్మ్యముగలవాఁడును;ప్రజానాం=జనములకు;పతిః= ప్రభువును;ఈశ్వరః = సమస్తలోకంబులకును నాయకుండునగు; బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు; సుప్రీతః = మిక్కిలి సంతసించెను.

మహాబాహుండగు రాముఁడా! ఆభగీరథుఁడు, భయంకరమగుతపస్సు సేయుచుండఁగాఁ, బెక్కువేలేండ్లుకడచినవి;అంత, మహాత్ముండగునాభగీరథుని విషయమై, ప్రజలకధిపతియును లోకనాయకుండును భగవంతుండునైన బ్రహ్మదేవుం

డు, సంతోషమునొందెను. అని, తాత్పర్యము.

తత స్సురగణై స్సార్థ ముపాగమ్య పితామహః
భగీరథం మహాత్మానం తప్యమాన మథాబ్రవీత్. ౧౫

టీక॥ తతః=అంతట; పితామహః= బ్రహ్మదేవుఁడు; సురగణైస్సార్థం=దేవతలసమూహముల తోఁగూడ; ఉపాగమ్య=వచ్చి; అథ=అటుపిమ్మట; తప్యమానం=తపస్సుసేయుచున్న, మహాత్మానం= పూజ్యమైన స్వభావముగల; భగీరథం=భగీరథునిగూర్చి; అబ్రవీత్= పలికెను.

అంత, బ్రహ్మదేవుండు దేవతలతోఁగూడవచ్చి, తపస్సుసేయుచున్న మహాత్ముండగు భగీరథునింజూచి యిట్లని, చెప్పెను.

అనీ, తాత్పర్యము.

భగీరథ మహాభాగ ప్రీత స్తేహం జనేశ్వర
తపసా చ సుతప్తేన వరం వరయ సువ్రత. ౧౬

టీక॥ మహాభాగ=పూజ్యమైన భాగ్యము గలవాఁడవును; జనేశ్వర=జనులకుఁ బ్రభువైన వాఁడవున గు; భగీరథ=భగీరథుఁడా! అహం= నేను; తే=నీయొక్క; సుతప్తేన=చక్కఁగాఁదపింపఁబడిన; తపసాచ= తపస్సుచేతను; ప్రీతః=సంతసించితి. సువ్రత=మంచివ్రతములుగలభగీరథుఁడా! వరం=కోరఁబడినదానిని; వరయ=కోరుము.

మహాభాగుండవగు భగీరథ మహారాజా! నీవుచేసినగొప్పతపంబునకు నేనుసంతసించితి; నీకేమికావలయుఁ? కోరుము. అని, బ్రహ్మదేవుఁడు చెప్పెను. అని, తాత్పర్యము.

త మువాచ మహాతేజా స్సర్వలోకపితామహమ్
భగీరథో మహాభాగః కృతాంజలి రుపస్థితః. ౧౭

టీక॥ మహాతేజాః=అధికమైన పరాక్రమముగలవాఁడును; మహా

భాగః=పూజ్యమైన భాగ్యముగల వాఁడునగు; భగీరథః=భగీరథుఁడు; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; ఉపస్థితః=ఎదుటనిలుచున్నవాఁడై; సర్వలోకపితామహం=సమస్తలోకంబులకును తాతయైన; తం=ఆబ్రహ్మదేవునింగూర్చి, ఉవాచ=చెప్పెను.

అధికమైనపరాక్రమముగలవాఁడునుమహాభాగ్యశాలియునగు భగీరథుఁడు, చేతులు మొగిడ్చి, యెదుట నిలుచుండి, సమస్తలోకంబులకు బితామహుండైన బ్రహ్మదేవునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యది మే భగవన్ ప్రీతో యద్యస్తి తపసః ఫలమ్
సగరస్యాత్మజా స్సర్వే మత్త స్సలిల మాప్నుయుః. ౧౮

టీక॥ భగవన్ = మాహాత్మ్యముగల బ్రహ్మదేవుఁడా! త్వం(అధ్యాహృతము) = నీవు;ప్రీతోయది=సంతసించినట్టైన; మే=నాయొక్క; తపసః = తపస్సునకు; ఫలం=ఫలము; అస్తియది=ఉన్నట్టైన;సగరస్య=సగరునియొక్క;ఆత్మజాః=కొడుకులు; సర్వే=అందఱు; మత్తః=నావలన; సలిలం=జలమును;ఆప్నుయుః=పొందుదురు.

భగవంతుఁడవైన బ్రహ్మదేవుఁడా! నీవుసంతసించితివేని, నేను జేసినతపస్సుసఫలంబగునేని; నేనుసగరుని కొడుకులకందఱకు జలతర్పణముసేయంజాలుదును.

అని, తాత్పర్యము.

గంగాయా స్సలిలక్లిన్నే భస్మ న్యేషాం మహాత్మనామ్
స్వర్గం గచ్ఛేయు రత్యంతం సర్వే మే ప్రపితామహాః. ౧౯

టీక॥ మహాత్మనాం=పూజ్యమైనస్వభావముగల;ఏషాం=ఈసగరపుత్రులయొక్క;భస్మని=బూడిద; గంగాయాః= గంగానదియొక్క; సలిలక్లిన్నే= జలముచేఁదడుపఁబడఁగా; మే=నాయొక్క;ప్రపితామ




హాః=ముత్తాతలు; సర్వే=అందఱును; అత్యంతం=నాశమునతిక్రమించిన, నాశములేనియనుట; స్వర్గం=దేవలోకమును; గచ్ఛేయుః=పొందుదురు.

మహాత్ములగునీసగరపుత్రులదేహభస్మము గంగానదీజలమునందడుపఁబడెనేని, నాముత్తాతలయిన సగరపుత్రులందఱు,అక్షయమైనస్వర్గముఁనొందుదురు.

అని, తాత్పర్యము.

దేయా చ సంతతి ర్దేవ నావసీదే త్కులం చ నః
ఇక్ష్వాకూణాం కులే దేవ ఏష మేస్తు వరః పరః. ౨౦

టీక॥ దేవ=బ్రహ్మదేవుఁడా! ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినవారియొక్క; కులే=వంశమునందు; సంతతిశ్చ=సంతానమును; దేయా = ఇవ్వఁదగినది. నః=మాయొక్క; కులంచ=వంశమును; నావసీదేత్ = కృశింపకపోవుఁగాక. దేవ=బ్రహ్మదేవుఁడా! ఏషః=ఇది; మే=నాయొక్క; పరః=మిఱియొకటైన; వరః = కోరిక; అస్తు=అగుఁగాక.

బ్రహ్మదేవుఁడా! ఇక్ష్వాకువంశంబునందుసంతానంబు కలుగవలెను; దానంజేసి,మావంశముశాశ్వతముగానుండును;ఇదినారెండవకోరిక(మొదటిది,సగరపుత్రులకుఁదర్పణముసేయుటకుగంగాజల మొసంగుటయువారిదేహభస్మమును గంగాజలముచేఁ దడియనిచ్చుటయునుట).అని,భగీరథుఁడు బ్రహ్మదేవునితోఁజెప్పెను.అని,తాత్పర్యము.

ఉక్తవాక్యం తు రాజానం సర్వలోకపితామహః
ప్రత్యువాచ శుభాం వాణీం మధురాం మధురాక్షరామ్. ౨౧

టీక॥ సర్వలోకపితామహస్తు=సమస్త లోకములకును తాతయైన బ్రహ్మదేవుఁడును; ఉక్తవాక్యం=చెప్పఁబడినమాటగల; రాజానం=




భగీరథ మహారాజును గూర్చి; శుభాం = మంగళకరమును; మధురాం=మనోహరమును (మనోహరమైనయర్థముగలదియనుట); మధురాక్షరాం=మనోహరమైనయక్షరములుగలదియునగు; వాణీం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

సమస్తలోకంబులకును బితామహుండగు బ్రహ్మదేవుండును, ఇట్లు వరములుగోరిన భగీరథుం జూచి, మంగళకరమై, మనోహరంబైనయర్థంబునుమనోహరములైనశబ్దములునుగల్గియుండు, నొకమాటను, జెప్పెను. అని, తాత్పర్యము.

మనోరథో మహా నేష భగీరథ మహారథ
ఏవం భవతు భద్రం తే ఇక్ష్వాకుకులవర్ధన. ౨౨

టీక॥ మహారథ=తన్నుసారథిని గుఱ్ఱములనుం గాపాడుకొనుచుఁబదు నొకండువేల మందివిలుకాండ్రతోఁబోరంగలఁ; భగీరథ=భగీరథుఁడా! ఏషః=ఈమొదటి; మనోరథః=కోర్కి; మహాన్=గొప్పది, దుర్లభమనుట. ఏవం=ఇట్లు; భవతు=అగుఁగాక. ఇక్ష్వాకుకులవర్ధన = ఇక్ష్వాకువంశమునువృద్ధిఁబొందించునట్టిభగీరథుఁడా! తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక.

విశేషార్థము.—"ఇక్ష్వాకువంశమును వృద్ధిబొందించు భగీరథుఁడా!" అని, భగీరథునిసంబోధించుటచేత, "నీకుమంగళమగుఁగాక" అనఁగా, "నీకుమంచికొడుకునుగలుగుఁగాక," అనునర్థము సూచిత మగుచున్నది.

మహారథుండవగుభగీరథుఁడా! నీవడిగినమొదటివరము దుర్లభమైనది; అయినను, నీకోర్కి యీడేఱును; నీవిక్ష్వాకువంశమును వృద్ధిఁబొందింపఁ గలవాఁడవు; నీకుమంగళమగుఁగాక. అని, తాత్పర్యము.

ఇయం హైమవతీ గంగా జ్యేష్ఠా హిమవత స్సుతా
తాం వై ధారయితుం శక్తో హర స్తత్ర నియుజ్యతామ్. ౨౩

టీక॥ ఇయం=ఈ;గంగా=గంగానది, హైమవతీ= హిమవంతునకుఁబుట్టినది. హిమవతః=హిమవంతునియొక్క; జ్యేష్ఠా=పెద్దదైన;సుతా= కూఁతురు. తాం వై=ఆగంగానదిని; ధారయితుం=ధరించుటకు;శక్తః=బలిమిగల;హరః=శివుఁడు; తత్ర=ఆగంగనుధరించుటయందు;నియుజ్యతాం = ప్రార్థింపఁబడుఁగాక.

ఈగంగానది హిమవంతునకుఁ బుట్టినది;ఇదియతనిపెద్దకూఁతురు; అట్టిదీనింగూడ ధరించుటకుంజాలిన శివునినాకార్యమునకై ప్రార్థింపుము.అని, తాత్పర్యము.

గంగాయాః పతనం రాజన్ పృథివీ న సహిష్యతి
తాం వై ధారయితుం వీర నాన్యం పశ్యామి శూలినః. ౨౪

టీక॥ రాజన్ = భగీరథమహారాజా!పృథివీ = భూమి;గంగాయాః = గంగానదియొక్క;పతనం=పడుటను;నసహిష్యతి=ఓర్వలేదు. వీర=పరాక్రమశాలియగుభగీరథుఁడా! తాం వై = ఆగంగనుంగూడ;ధారయితుం=ధరించుటకు; శక్తం(అధ్యాహృతము)=శక్తిగల వానిని;శూలినః = శివునికన్న;అన్యం=ఇతరుని; అహం(అధ్యాహృతము) = నేను;నపశ్యామి=చూడలేదు.

భగీరథుఁడా! నీవుభూపతివి, (కావున, భూమిమేలునునీవుచూడవలయును) గంగానదియాకాశమునుండిపడినట్లైన నాపాటునుభూమిసహింపలేదు; నీవుపరాక్రమశాలివి,(అయినను)శివునికన్ననితరుఁడెవ్వండును, ఆగంగానదినిధరింపలేఁడు. అని, బ్రహ్మదేవుఁడుభగీరథునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

త మేవ ముక్త్వా రాజానం గంగాం చా భాష్య లోకకృత్
జగామ త్రిదివం దేవ స్సహ దేవై ర్మరుద్గణైః. ౨౫

టీక॥లోకకృత్ = లోకంబులఁ జేయునట్టి; దేవః=బ్రహ్మదేవుఁడు; తం =ఆభగీరథునిఁగూర్చి; ఏవం= ఇట్లు; ఉక్త్వా=చెప్పి; గంగాంచ = గంగనుగూర్చియు; ఆభాష్య =చెప్పి; దేవైః=దేవతలతోను; మరుద్గణైస్సహ =వాయువులసమూహములతోనుంగూడ; త్రిదివం= స్వర్గమును; జగామ=పొందెను.

లోక కర్తయైన బ్రహ్మదేవుఁడు, భగీరథునితోనిట్లుచెప్పి, గంగంజూచి, "నీవుభగీరథుండు కోరినప్పుడతనివెంటంబొ"మ్మనివచించి, దేవతలనువాయుసమూహంబులనుం గూడి, స్వర్గమునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ద్విచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ ద్విచత్వారింశసర్గ టీక, ముగిసినది.

---

౪౩

త్రిచత్వారింశసర్గప్రారంభః.

దేవదేవే గతే తస్మిన్ సోఙ్గుష్ఠాగ్రనిపీడితామ్
కృత్వా వసుమతీం రామ సంవత్సర ముపాసత. ౧

టీక॥రామ=రాముఁడా! దేవదేవే=దేవతలకును దేవుఁడైన; తస్మిన్=ఆబ్రహ్మదేవుఁడు; గతే= పోఁగా; సః=ఆభగీరథుఁడు; వసుమతీం=భూమిని; అంగుష్ఠాగ్రనిపీడితాం, అంగుష్ఠాగ్ర=కాలిబొట్టనవ్రేలికొనచే, నిపీడితాం=పీడింపఁబడినదానిఁగా; కృత్వా=చేసి; సంవత్సరం = ఒకసంవత్సరము; శివం=(అధ్యాహృతము) శివుని; ఉపా

సత=ఉపాసించెను.

దేవదేవుండగునాబ్రహ్మదేవుం డుపోఁగానే, ఆభగీరథుండు, భూమియందుబొటనవ్రేలానించినిలిచి, సంవత్సరకాలముశివునింగూర్చి, తపస్సుచేసెను. అని, తాత్పర్యము.

అథ సంవత్సరే పూర్ణే సర్వలోకనమస్కృతః
ఉమాపతిః పశుపతీ రాజాన మిద మబ్రవీత్. ౨

టీక॥ సంవత్సరే = సంవత్సరము; పూర్ణే=నిండఁగా; అథ= అటు పిమ్మట; సర్వలోకనమస్కృతః=సమస్తలోకంబులచేతను నమస్కరింపఁబడిన; ఉమాపతిః=పార్వతికిఁ బెనిమిటియైన; పశుపతిః=శివుఁడు; రాజానం= భగీరథునిగూర్చి; ఇదం=దీనిని; అబ్రవీత్ =చెప్పెను.

సంవత్సరమునిండఁగానే, సమస్తలోకంబులచే నమస్కృతుండును పార్వతికిఁ బెనిమిటియునగు శివుండు, భగీరథునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రీత స్తేహం నరశ్రేష్ఠ కరిష్యామి తవ ప్రియమ్
శిరసా ధారయిష్యామి శైలరాజసుతా మహమ్. ౩

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుఁడవగుభగీరథుఁడా! అహం=నేను; తే=నీకొఱకు; ప్రీతః=సంతసించినవాఁడను. తవ=నీయొక్క; ప్రియం=ఇష్టమును; కరిష్యామి=చేసెదను. అహం= నేను; శైలరాజసుతాం=పర్వతరాజుకొమార్తెయైన గంగను; శిరసా=తలచేత; ధారయిష్యామి=ధరించెదను.

పురుషశ్రేష్ఠుండవగు భగీరథుఁడా! నీకుబ్రీతుండనైతి; నీయభీష్టంబు నెఱవేర్చెదను; పర్వతరాజైనహిమవంతునికొమార్తెయగు గంగనుశిరస్సునధరించెదను. అని, శివుండు చెప్పెను. అని, తాత్పర్యము.

తతో హైమవతీ జ్యేష్ఠా సర్వలోక నమస్కృతా
తదా సాతి మహద్రూపం కృత్వావేగంచ దుస్సహమ్. ౪
ఆకాశా దపత ద్రామ శివే శివ శిరస్యుత

టీక॥ రామ = రాముఁడా! తతః=అటుపిమ్మట; తదా=అప్పుడు; సర్వలోకనమస్కృతా=సమస్తలోకముల చేనమస్కరింపఁబడిన; సా=ఆ; జ్యేష్ఠా=పెద్దదైన; హైమవతీ=హిమవంతుని కూఁతురు; అతిమహత్ = మిక్కిలిగొప్పదైన; రూపం=ఆకారమును; దుస్సహం=సహింపఁగూడని; వేగంచ=వడిని; కృత్వా=చేసి; ఆకాశాత్=ఆకాశమునుండి; శివే=మంగళకరమైన; శివశిరసి=శివునితలయందు; అపతత్ ఉత=పడినదిగదా!

అంత, సర్వలోకనమస్కృతయగు నాహిమవంతుని పెద్దకూఁతురైన గంగానది, గొప్పయాకారమువహించి, సహింపఁగూడని వేగంబుపూని, ఆకాశమునుండి, మంగళకరంబగు శివుని శిరస్సుపైఁబడెను. అని, తాత్పర్యము.

అచింతయచ్చ సా దేవీ గంగా పరమదుర్ధరా. ౫
విశామ్యహం హి పాతాళం స్రోతసా గృహ్య శంకరమ్

టీక॥ పరమదుర్ధరా= ఎంతమాత్రముధరింపఁగూడని; దేవీ=అమ్మవారైన; సా=ఆ; గంగాచ = గంగానదియును; "అహం = నేను ; స్రోతసా = ప్రవాహముచేత; శంకరం = శివుని; గృహ్య (గృహీత్వా)=తీసికొని; పాతాళం=పాతాళలోకమును; విశామిహి=ప్రవేశింతునుగదా!" ఇతి(అధ్యాహృతము)=అని; అచింతయత్ =ఆలోచించెను.

ఎంతమాత్రము ధరింపనలవిగానియాగంగా దేవియును "ఈశివుని ప్రవాహంబునం దీసికొనిపాతాళంబుచొచ్చెదను" అనియాలోచించెను. అని, తాత్పర్యము.

తస్యా వలేపనం జ్ఞాత్వా క్రుద్ధస్తు భగవాన్ హరః. ౬
తిరోభావయితుం బుద్ధిం చక్రే త్రిణయన స్తదా

టీక॥ త్రిణయనః=మూడుకండ్లు గలవాఁడును; భగవాన్=మాహాత్మ్యముగలవాఁడునగు; హరస్తు=ఈశ్వరుఁడును; తస్యాః=ఆగంగానదియొక్క; వలేపనం=గర్వమును; జ్ఞాత్వా=ఎఱింగి; క్రుద్ధః=కోపము నొందినవాఁడై; తదా=అప్పుడు; తిరోభావయితుం = మఱుగుపడిన దానిఁగాఁ జేయుటకు; బుద్ధిం=తలంపును; చక్రే=చేసెను.

త్రినేత్రుండును భగవంతుండు నగు శివుండు, ఆగంగానదిగర్వంబెఱింగి, కోపించి, యాగంగ, మఱుఁగుపడునట్లు సేయందలంచెను.

అని, తాత్పర్యము.

సా తస్మిన్ పతితా పుణ్యా పుణ్యే రుద్రస్య మూర్ధని. ౭
హిమవత్ప్రతిమే రామ జటామండలగహ్వరే

టీక॥ రామ=రాముఁడా! పుణ్యా=పవిత్రయగు; సా=ఆగంగానది; పుణ్యే=పవిత్రమును; హిమవత్ప్రతిమే=హిమవత్పర్వతముతోఁ బోలికగలదియును; జటామండలగహ్వరే, జటామండల=జటలయొక్క సమూహమే, గహ్వరే=గుహగాఁగలదియునగు; రుద్రస్య=శివుని యొక్క; మూర్ధని=శిరస్సునందు; పతితా=పడినది.

రాముఁడా! పవిత్రయగు నాగంగానది, జటాసమూహమే గుహగాఁగల్గి, హిమవద్గిరియుంబోలియున్న పవిత్రంబగు శివునిశిరస్సునం బడెను.

అని, తాత్పర్యము.

సా కథంచి న్మహీం గంతుం నాశకో ద్యత్న మాస్థితా. ౮
నైవ నిర్గమనం లేభే జటామండలమోహితా

టీక॥ సా=ఆగంగానది; కథం చిత్=ఎట్లయినను; మహీం=భూమిని; గంతుం=పొందుటకు; యత్నం=ప్రయత్నమును; ఆస్థితా=అవలంబించినదై; నాశకోత్=శక్తి గల్గినదికాలేదు; జటామండలమోహితా = జటలసమూహమందు, భ్రమమునొందినదై; నిర్గమనం=వెడలంబాటును; నైవలేభే=పొందనేలేదు.

ఆగంగానది,ఎన్ని ప్రయత్నములుచేసినను, భూమిచేరలేకపోయెను; శివునిజటామండలమందుఁ జిక్కుపడియున్నందున, బయలు వెడలుటయును,కాకపోయెను.

అని, తాత్పర్యము.

తత్రైవ బంభ్రమ ద్దేవీ సంవత్సరగణాన్ బహూన్. ౯
తా మపశ్యన్ పున స్తత్ర తపః పరమ మాస్థితః

టీక॥ దేవీ=గంగానది; తత్రైవ=ఆశివునిజటామండలమందే; బహూన్=అనేకములైన; సంవత్సరగణాన్=సంవత్సరసమూహములను; అబంభ్రమత్=తిరుగుచుండెను. భగీరథః(అధ్యాహృతము)=భగీరథుఁడు; తాం=ఆగంగానదిని; అపశ్యన్=చూడనివాఁడై; పునః=మఱల; తత్ర=అచ్చట; పరమం=ఉత్కృష్టమయిన; తపః=తపస్సును; ఆస్థితః=అవలంబించెను.

గంగానది, యిట్లు శివునిజటామండలమందే, పెక్కుసంవత్సరములు, తిరుగుచుపడుచుండెను; అంత, భగీరథుండు, గంగానదిం గానక, మఱల,నచ్చట, బరమంబగుతపస్సుసేసెను.

అని, తాత్పర్యము.

అనేన తోషితశ్చాభూ దత్యర్థం రఘునందన. ౧౦
విససర్జ తతో గంగాం హరో బిందుసరః ప్రతి

టీక॥ రఘునందన=రాముఁడా! అనేన=ఈభగీరథునిచేత; హరః=ఈశ్వరుఁడు; అత్యర్థం=మిక్కిలియును; తోషితశ్చ=సంతోషమునొందిం




పఁబడినవాఁడును; అభూత్ = ఆ యెను. తతః = అంతట; హరః (అధ్యాహృతము) = ఈశ్వరుఁడు, గంగాం = గంగానదిని; బిందుసరః ప్రతి = బిందుసరస్సునుగూర్చి; విససర్జ = విడిచెను.

రాముఁడా! భగీరథుఁడు, తపస్సుచే, శివునిమిక్కిలియుసంతోషపఱచెను; అంతశివుండు, బిందుసరస్సును, బ్రహ్మనిర్మితంబగునొకసరస్సునందు, గంగనువిడిచెను.

అని, తాత్పర్యము.

తస్యాం విసృజ్యమానాయాం సప్తస్రోతాంసి జజ్ఞిరే. ౧౧

టీక॥ తస్యాం = ఆగంగానది; విసృజ్యమానాయాం = విడువఁబడుచుండఁగా; సప్త = ఏడు; స్రోతాంసి = ప్రవాహములు; జజ్ఞిరే = పుట్టినవి.

ఆగంగనువిడవఁగానె, ఏడుప్రవాహములుగల్గినవి.

అని, తాత్పర్యము.

హ్లాదినీ పావనీ చైవ నళినీచ తథాపరా
తిస్రః ప్రాచీం దిశం జగ్ముః గంగాశ్శివజలాశ్శుభాః. ౧౨

టీక॥ హ్లాదినీ = హ్లాదినియనునదియును; పావనీచైవ = పావనియనునదియును; తథా = అట్లు; అపరా = మఱియొకటైన; నళినీచ = నళినియనునదియును; శివజలాః = మంగళకరములైనజలము గల్గినవియును; శుభాః = మంగళకరములయినవియైనను; తిస్రః = మూఁడైన; గంగాః = గంగలు; ప్రాచీం = తూర్పు; దిశం = దిక్కును; జగ్ముః = పొందినవి.

హ్లాదినియుఁ బావనియు నళినియుననునీమూఁడుగంగలు, మంగళకరంబగుజలము గలిగి మంగళకరములై, తూర్పు దిక్కునఁ బ్రవహించినవి.

అని, తాత్పర్యము.

సుచక్షుశ్చైవ సీతాచ సింధుశ్చైవ మహానదీ
తిస్రస్త్వేతా దిశం జగ్ముః ప్రతీచీంతు శుభోదకాః. ౧౩




టీక॥ సుచక్షుశ్చైవ=సుచక్షువనునదియును; సీతాచ=సీతయనునదియును;మహానదీ=గొప్పనదియగు; సింధుశ్చైవ= సింధువననదియును; శుభోదకాః=మంగళకరములైనజలములుగల; ఏతాః=ఈ, తిస్రః=మూడును; ప్రతీచీం=పశ్చిమపు; దిశం=దిక్కును; జగ్ముః=పొందినవి.

సుచక్షువు,సీత, మహానదియగు సింధువు, మంగళకరములయినయుదకముగల యీమూడుగంగలును, పశ్చిమదిక్కునఁ,బ్రవహించినవి.

అని, తాత్పర్యము.

సప్తమీ చాన్వగా త్తాసాం భగీరథ మథో నృపమ్

టీక ॥ అథో=అంతట; తాసాం=వానిలోపల;సప్తమీచ=ఏడవదియును;నృపం=రాజైన; భగీరథం=భగీరథుని; అన్వగాత్=వెంబడించెను.

అంత,వానిలోనేడవగంగ,భగీరథమహారాజును,వెంబడించెను.

అని,తాత్పర్యము.

భగీరథోపి రాజర్షి ర్దివ్యంస్యందన మాస్థితః. ౧౪
ప్రాయాదగ్రే మహాతేజా గంగాతం చాప్యను వ్రజత్

టీక॥ మహాతేజాః= మిక్కిలియుఁబరాక్రమముగల; రాజర్షిః=రాజునుఋషియునయిన; భగీరథోపి=భగీరథుఁడును; దివ్యం=శ్రేష్ఠమయిన;స్యందనం = రథమును;ఆస్థితః=పొందినవాఁడై;అగ్రే=ముందట;ప్రాయాత్=పోయెను;గంగాచాపి=గంగయును; తం=ఆభగీరథుని; అనువ్రజత్ (అన్వవ్రజత్)=వెంబడించిపోయెను.

మహాతేజుండును రాజర్షియు నగుభగీరథుండు, దివ్యంబగురథం బెక్కి-ముందునడిచిపోయెను; గంగ యతనివెనుకం దగిలిపోయెను.

అని, తాత్పర్యము.

గగనాచ్ఛంకరశిర స్తతో ధరణి మాశ్రితా. ౧౫

వ్యసర్పత జలం తత్ర తీవ్రశబ్దపురస్కృతమ్

టీక ॥ గంగా (అధ్యాహృతము)=గంగానది; గగనాత్=ఆకాశమునుండి; శంకరశిరః=శివునిశిరస్సును; తతః=అందుండి; ధరణిం=భూమిని; ఆశ్రితా=పొందినది. కాఁబట్టి; తత్ర= ఆభూమియందు; జలం=గంగాజలము; తీవ్రశబ్ద పురస్కృతం, తీవ్రశబ్ద=అధికమైనధ్వని, పురస్కృతం=ముందిడఁబడినదిగాఁగలదిగా; వ్యసర్పత=వ్యాపించెను.

గంగానది, యాకాశమునుండి, శివుని శిరస్సుపైబడినది - అందుండి, భూమిపైఁబడెను; అట్లుపైనుండి క్రిందఁబడుటచే, జలమునధికముగా ధ్వనిగలిగి, ప్రవహించినది.

అని, తాత్పర్యము.

మత్స్యకచ్ఛపసంఘైశ్చ శింశుమారగణై స్తదా. ౧౬
పతద్భిః పతితైశ్చాన్యై ర్వ్యరోచత వసుంధరా

టీక॥ తదా=అప్పుడు; వసుంధరా=భూమి; పతద్భిః= పడుచున్నట్టి మత్స్యకచ్ఛపసంఘైశ్చ=చేపలయొక్కయు తాఁబేళ్లయొక్కయు సమూహములచేతను; శింశుమారగణైః=మొసళ్ల సమూహములచేతను; పతితైః=పడిన; అన్యైశ్చ= ఇతరములగుజలజంతువులచేతను; వ్యరోచత=ప్రకాశించెను.

అప్పుడు, గుంపులుగుంపులుగాఁబడుచున్న మత్స్యములు తాఁబేళ్లు మొసళ్లువీనిచేతనుమరియు, నట్లుపడినట్టియితర జలజంతువులచేతను, భూమిప్రకాశించినది.

అని, తాత్పర్యము.

తతో దేవర్షిగంధర్వా యక్షా స్సిద్ధగణా స్తదా. ౧౭
వ్యలోకయంత తే తత్ర గగనాద్గాం గతాం తథా

టీక॥ తతః=అంతట; తదా=అప్పుడు; తత్ర=ఆయాకాశమందు;




తే=ఆ; దేవర్షిగంధర్వాః = దేవతలును ఋషులును గంధర్వులును; యక్షాః = యక్షులును; సిద్ధగణాః=సిద్ధులసమూహములును; తథా=అట్లు; గగనాత్=ఆకాశమునుండి; గాం=భూమిని; గతాం=పొందిన; గంగాం=(అధ్యాహృతము) గంగను; వ్యలోకయంత=చూచిరి.

అంతనప్పుడాకాశమందు, దేవతలును ఋషులును యక్షులును సిద్ధులును, అట్లాకాశమునుండి భూమింబడినగంగానదిం జూచిరి.

అని, తాత్పర్యము.

విమానై ర్నగరాకారై ర్హయై ర్గజవరై స్తదా. ౧౭
పారిప్లవగతై శ్చాపి దేవతా స్తత్ర విష్ఠితాః

టీక॥ తదా=అప్పుడు; తత్ర=అచ్చట; దేవతాః=దేవతలు; పారిప్లవగతైః=వేగిరపాటు నొందిన; నగరాకారైః = పట్టణములం బోనియాకారములుగల; విమానైః=విమానములతోను; హయైః=గుఱ్ఱములతోను; గజవరైశ్చాపి=ఏనుంగుల శ్రేష్ఠములైనవానితోను; విష్ఠితాః= విశేషముగానుండిరి.

అప్పుడచ్చట, దేవతలు, సంభ్రాంతములైయున్న పట్టణములంబోలెవిశాలములగు విమానములను గుఱ్ఱములను మంచియేనుంగులను నెక్కియుండిరి. అని, తాత్పర్యము.

త దద్భుతతమం లోకే గంగాపతన ముత్తమమ్. ౧౮
దిదృక్షవో దేవగణా స్సమీయు రమితౌజసః

టీక ॥ అమితౌజసః=కొలతలేని తేజస్సుగల; దేవగణాః=దేవతల సమూహములు; లోకే=ప్రపంచమునందు; అద్భుతతమం=అన్నిటికన్ననాశ్చర్యకరమును; ఉత్తమం=శ్రేష్ఠమునగు; తత్=ఆ; గంగాపతనం= గంగానదియొక్క పడుటను; దిదృక్షవః= చూడఁగోరినవారలై; సమీయుః=చేరిరి.

అమితంబగు తేజస్సుగల దేవత




లు, లోకంబునందంతయు నాశ్చర్యకరంబును శ్రేష్ఠంబునగునాగంగావతరణమును చూడఁగోరి, యచ్చట, చేరిరి. అని, తాత్పర్యము.

సంపతద్భి స్సురగణై స్తేషాం చాభరణౌజసా. ౨౦
శతాదిత్య మివా భాతి గగనం గతతోయదమ్

టీక॥ సంపతద్భిః= చేరుచున్నట్టి; సురగణైః=దేవతలసమూహములచేతను; తేషాం=ఆదేవతాసమూహములయొక్క; ఆభరణౌజసాచ=సొమ్ములకాంతిచేతను; గతతోయదం=పోయినమేఘములుగలది; గగనం=ఆకాశము; శతాదిత్యమివ=నూర్గురుసూర్యులుగలదివలె; ఆభాతి=(భూతార్థమందులట్)ప్రకాశించెను.

మేఘములులేక నిర్మలముగానుండునాకాశము, గంగావతరణముచూడవచ్చినదేవతల శరీరకాంతులచేతను, వారియాభరణకాంతులచేతను, నూఱుగురుసూర్యులు గలిగియున్నట్లు, ప్రకాశించినది.

అని, తాత్పర్యము.

శింశుమారోరగగణై ర్మీనై రపిచ చంచలైః. ౨౧
విద్యుద్భిరివ విక్షిప్త మాకాశ మభవత్తదా

టీక॥ తదా = అప్పుడు; ఆకాశం=ఆకాశము; చంచలైః = చలించుచున్నట్టి; శింశుమారోరగగణైః= మొసళ్లయొక్కయు, సర్పములయొక్కయు సమూహములచేతను; మీనైరపిచ=మత్స్యములచేతను; విద్యుద్భిరివ = మెఱుపులచేతనుబోలె; విక్షిప్తం=వ్యాపింపఁబడినది; అభవత్ =అయినది.

అప్పు, డాకాశముచంచలములగు మొసళ్లనుసర్పములను మత్స్యములనుంగల్గి, మెఱపులుగల్గినదివలెఁబ్రకాశించినది.

అని, తాత్పర్యము.

పాండరై స్సలిలోత్పీడైః కీర్యమాణై స్సహస్రధా. ౨౨
శారదాభ్రై రివాకీర్ణం గగనం హంససంప్లవైః

టీక॥ గగనం = ఆకాశము; సహస్రధా=వేయివిధములుగా; కీర్యమాణైః = వెదచల్లఁబడుచున్న; పాండరైః = తెల్లని; సలిలోత్పీడైః=నీళ్లనురుఁగులచేతను; హంససంప్లవైః = హంసపక్షులసమూహములచేతను; శారదాభ్రైరివ, శారద=శరదృతువునందలి, అభ్రైః రివ=మేఘములచేతవలె; ఆకీర్ణం= వ్యాపింపఁబడినది.

ఆకాశము, వేగవశమున వేయి విధములుగఁ బ్రసరింపుచుండు తెల్లని నురుఁగులును, హంసపక్షులగుంపులునుంగల్గి, శరత్కాలమునందలి తెల్లని మేఘములతోఁ గూడియుండు నట్లొప్పెను. అని, తాత్పర్యము.

క్వచి ద్ద్రుతతరం యాతి కుటిలం క్వచి దాయతమ్. ౨౩
వినతం క్వచి దుద్ధూతం క్వచి ద్యాతి శనైశ్శనైః

టీక ॥ గంగా (అధ్యాహృతము)=గంగానది; క్వచిత్=ఒకానొకచోట; ద్రుతతరం=మిక్కిలియుశీఘ్రముగను; క్వచిత్(అధ్యాహృతము)=ఒకానొకచోట; కుటిలం= వంకరగాను; క్వచిత్=ఒకానొకచోట; ఆయతం= దీర్ఘముగాను; క్వచిత్ (అధ్యాహృతము)= ఒకానొకచోట; వినతం=వంగినదిగాను; క్వచిత్ =ఒకానొకచోట; ఉద్ధూతం= ఊర్ధ్వముఖముగాను; యాతి=(భూతాగ్ధమందులట్) పోయెను . క్వచిత్ = ఒకానొకచోట; శనైశ్శనైః= మెల్లమెల్లగా; యాతి=పోయెను.

గంగానది, పల్లపునేలలో మిక్కిలి యువడిగను, మిట్టపల్లములలో వంకరగను , చదరపునేలలలో దీర్ఘముగను, పల్లములో లోనికివంగినట్లును, పెద్దఱాయి మొదలగువానితాఁకుడుగల్గినపుడూర్ధ్వముఖముగను, ఉన్నతభూములలో మెల్లమెల్లగను, చాటినది.

అని, తాత్పర్యము.

సలిలేనైవ సలిలం క్వచి దభ్యాహతం పునః. ౨౭
ముహు రూర్ధ్వముఖం గత్వా పపాత వసుధాతలమ్

టీక॥ క్వచిత్=ఒకానొకచోట; ముహుః=పలుమారు; సలిలం=జలము; సలిలేనైవ=జలముచేతనే; అభ్యాహతం=ఎదురుగాఁ గొట్టఁబడినదై; ఊర్ధ్వముఖం=పొడవుమొగముగా; గత్వా=వెళ్లి; పునః=మరల; వసుధాతలం=భూతలమును; పపాత=పొందెను.

ఒక్కచోట, బలుమాఱులు, జలము గాలిచేఁ బైకెగురుతరంగముచేఁ గొట్టఁబడి, యూర్ధ్వముఖముగా వెళ్లి, మఱల, నేలపైఁబడినది.

అని, తాత్పర్యము.

త చ్ఛంకరశిరోభ్రష్టం భ్రష్టం భూమితలే పునః. ౨౮
వ్యరోచత తదా తోయం నిర్మలం గతకల్మషమ్

టీక॥ శంకరశిరోభ్రష్టం, శంకర=శివునియొక్క, శిరః=శిరస్సునందు; భ్రష్టం=పడినదియును; పునః=మఱల; భూమితలే = భూతలమందు; భ్రష్టం = పడినదియైనగు; తత్=ఆ; తోయం=గంగానదీజలము; తదా=అప్పుడు; నిర్మలం=మలములేనిదిగాను; గతకల్మషం=పోయినపాపము గలదిగాను, పాపముఁబోఁగొట్టునదిగానను; వ్యరోచత=ప్రకాశించినది.

శివుని శిరస్సునంబడి యాపై భూమిపైఁబడిన యాగంగానదిజలము, అప్పుడు, నిర్మలమై స్నానము సేయువారిపాపములఁ బోఁగొట్టునదిగాఁ బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

తత్ర దేవర్షిగంధర్వా వసుధాతలవాసినః. ౨౯
భవాంగపతితం తోయం పవిత్ర మితి పస్పృశుః

టీక॥ తత్ర=ఆయాకాశమందు, ఉన్న; దేవర్షిగంధర్వాః= దేవత

లునుబుషులును గంధర్వులును; వసుధాతలవాసినః = భూతల మందు నివసించువారును; భవాంగ పతితం, భవాంగ = శివునిశరీరము నుండి, పతితం= పడిన; తోయం= జలము; పవిత్రం = పరిశుద్ధము; ఇతి=అని; పస్పృశుః= తాఁకిరి, లేక, స్నానముచేసిరి.

ఆకాశమందుండు దేవతలును బుషులును గంధర్వులును, భూమియందు వాసముసేయుచుండుజనులును, ఈశ్వరదేహమునుండి పతితమైనజలముపావన " మని స్నానముచేసిరి; (లేక, స్పృశించిరి) అని, తాత్పర్యము.

శాపాత్ప్రపతితా యేచ గగనాద్వసుధాతలమ్. ౨౭
కృత్వా తత్రాభిషేకంతే బభూవు ర్గతకల్మషాః

టీక॥ యేచ=ఎవరును; గగనాత్=ఆకాశమునుండి; శాపాత్= శాపమువలన; వసుధాతలం= భూతలమును; ప్రపతితాః=పొందిరో; తే=వారలు; తత్ర= ఆగంగాజలమందు; అభిషేకం= స్నానమును; కృత్వా=చేసి; గతకల్మషాః= పోయినపాపము గలవారలు; బభూవుః=అయిరి.

ఎవరు, శాపంబునంజేసి, స్వస్థానంబగు నాకాశంబునుండి భూమిపైఁ బడిరో వారా గంగానదిజలమందు స్నానముచేసి, పాపముచే విడువంబడి శుద్ధులైరి. అని, తాత్పర్యము.

ధూతపాపాః పున స్తేన తోయేనా థ సుభాస్వతా. ౨౮
పున రాకాశ మావిశ్య స్వాఁల్లోకాఁ ప్రతిపేదిరే

టీక॥ తే=వారలు; పునః=మరల; సుభాస్వతా= మిక్కిలియుఁ బ్రకాశించుచున్న; తేన=ఆ; తోయేన = జలముచేత; ధూతపాపాః=పోఁగొట్టఁబడిన పాపము గలవారలై; పునః=మరల; ఆకా

శం = ఆకాశమును ; ఆవిశ్య= పొంది; స్వాన్= తమవైన ; లోకాన్= లోకంబులను ; ప్రతిపేదిరే=పొందిరి.

వారలు ఆగంగాజలంబుమహిమంజేసి, పాపవిముక్తులై,యాకాశమార్గంబునఁ దమతమ లోకంబుల నొందిరి.అని, తాత్పర్యము.

ముముదే ముదితో లోక స్తేన తోయేనభాస్వతా.౨౯
కృతాభిషేకో గంగాయాం బభూవ విగతక్లమః

టీక॥ భాస్వతా= ప్రకాశించుచున్నట్టి; తేన=ఆ ; తోయేన= గంగాజలముచేత; లోకః = జనము; ముముదే=సంతసించినది, ముదితః= (మఱల) సంతసించినది ; గంగాయాం=గంగానదియందు;కృతాభిషేకః = చేయఁబడిన స్నానముగలదై; విగతక్లమః = పోనబడలికగలది;బభూవ=అయినది.

ప్రకాశమానంబగు నాగంగాజలము చూచి, జనము మాటిమాటికి సంతసించినది; మఱియు,నాగంగయందు స్నానముచేసి, బడలికవీడి సుఖమునొందినది.

అని, తాత్పర్యము.

భగీరథోపి రాజర్షి ర్దివ్యం స్యందన మాస్థితః.౩౦
ప్రాయా దగ్రే మహాతేజా గంగా తం పృష్ఠతోన్వగాత్.

టీక॥ మహాతేజాః = అధికమైనపరాక్రమముగల; రాజర్షిః = రాజును ఋషియునైన; భగీరథోపి=భగీరథుఁడును; దివ్యం = శ్రేష్ఠమైన; స్యందనం= రథమును; ఆస్థితః=పొందినవాఁడై;అగ్రే=ముందట; ప్రాయాత్= వెళ్లెను; గంగా=గంగానది; తం=ఆభగీరథుని; పృష్ఠతః= వెనుకనుండి ; అన్వగాత్= వెంబడించెను.

మహాపరాక్రమశాలియగు రాజర్షియైన భగీరథుఁడు దివ్యమైన రథం బెక్కి ముందటఁ బోవుచుండెను, గంగానదియు దాని వెనుకనుం

డి వెంబడించెను. అని తాత్పర్యము,

దేవా స్సర్షిగణా స్సర్వే దైత్యదానవరాక్షసాః. ౩౧
గంధర్వయక్షప్రవరా స్సకిన్నరమహోరగాః
సర్వా శ్చాప్సరసో రామ భగీరథరథానుగామ్.౩౨
గంగా మన్వగమన్ ప్రీతా స్సర్వే జలచరాశ్చయే

టీక॥ రామ = రాముఁడా! సర్షిగణాః= ఋషులసమూహములతోఁగూడిన; దేవాః=దేవతలు ; సర్వే= అందఱును; దైత్యదానవరాక్షసాః= దైత్యులును దానవులునురాక్షసులును; సకిన్నరమహోరగాః= కిన్నరులతోను మహాసర్పములతోనుంగూడిన ; గంధర్వయక్షప్రవరాః= గంధర్వులునుయక్షశ్రేష్ఠులును; అప్సరసః=అప్సరసలు;సర్వాశ్చ=అందఱును;ప్రీతాఃసంతోషమునొందినవారలై; భగీరథరథానుగాం= భగీరథునిరథమును వెంబడించుచున్న;గంగాం=గంగను; అన్వగమన్=వెంబడించిరి;యే=ఏవి; జలచరాః= జలమునందుం దిరుగు జంతువులో ; తే (అధ్యాహృతము)=అవి,సర్వేచ= అన్నియును; అన్వగమన్ = (అధ్యాహృతము) వెంబడించినవి.

రాముఁడా! దేవతలు ఋషులు దైత్యులు దానవులు రాక్షసులు గంధర్వులుయక్షులు కిన్నరులు నురగములునప్సరసలు నందఱును సంతోషంబునొంది భగీరథుని రథమును వెంబడించుచున్న గంగానదిని వెంబడించిరి, అట్లు జలచర జంతువులన్నియు ను వెంబడించినవి. అని తాత్పర్యము.

యతో భగీరథో రాజా తతో గంగా యశస్వినీ. ౩౩
జగామ సరితాం శ్రేష్ఠా సర్వపాప ప్రణాశినీ

టీక॥ యతః=ఏతట్టు;రాజా=రాజైన;భగీరథః= భగీరథుఁడు;జగామ= పోయెనో;తతః=ఆతట్టు; యశస్వినీ= ప్రశస్తమగు కీర్తిగల దియును; సరితాం=నదులలోపల; శ్రేష్ఠా= మేటియైనదియును;సర్వ

పాపప్రణాశినీ = సమస్తపాపములం బోఁగొట్టు నదియునగు ; గంగా=గంగానది; జగామ (అధ్యాహృతము)=పోయెను.

భగీరథమహారాజేదారినివెళ్లెనో మంచికీర్తిఁగలిగి నదులలోమేటిదై సమస్త పాపములం బోఁగొట్టు నదియైయున్న గంగానదియునాదారినేవెళ్లెను.

అని తాత్పర్యము.

తతో హి యజమానస్య జహ్నో రద్భుతకర్మణః. ౩౪
గంగా సంప్లావయామాస యజ్ఞవాటం మహాత్మనః

టీక॥ తతః=అంతట; గంగా=గంగానది; యజమానస్య = యాగము సేయుచున్న; అద్భుతకర్మణః=ఆశ్చర్యకరములగు కార్యములు గలవాఁడును; మహాత్మనః = పూజ్యమయిన స్వభావము గలవాఁడునగు; జహ్నోః = జహ్నుమహామునియొక్క; యజ్ఞవాటం=యాగశాలను; సంప్లావయామాసహి= ముంచెనుగదా!

అంత, గంగానది, యాశ్చర్యకరములగు కార్యములు సేయు, మహాత్ముండగు జహ్నుమహామునియాగము సేయుచుండఁగా, నతనియాగశాలయంతయు, నీళ్లతో ముంచెను. అని, తాత్పర్యము.

తస్యా వలేపనం జ్ఞాత్వా క్రుద్ధో యజ్వా తు రాఘవ. ౩౫
అపిబచ్చ జలం సర్వం గంగాయాః పరమాద్భుతమ్

టీక॥ రాఘవ=రామఁడా! యజ్వాతు=యాగము సేయువాఁడైన జహ్నువును; తస్యాః= ఆగంగానదియొక్క; వలేపనం=గర్వమును; జ్ఞాత్వా=ఎఱింగి; క్రుద్ధః= కోపించినవాఁడై; గంగాయాః=గంగానదియొక్క; జలం = నీటిని; సర్వం చ=అంతయు ; పరమాద్భుతం = మిక్కిలియు నాశ్చర్యము గల్గునట్లు అపిబత్ =త్రాగెను.

రామఁడా; యాగము సేయుచున్న జహ్నువును; ఆగంగానది గర్వంబెఱింగి; కోపించి, ఆశ్చర్యకరంబుగ, గంగానది జలంబంత

యుఁద్రావెను. అని, తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వా ఋషయశ్చ సువిస్మితాః ౩౬
పూజయంతి మహాత్మానం జహ్నుం పురుషసత్తమమ్
గంగాంచాపి నయంతి స్మదుహితృత్వే మహాత్మనః. ౩౭

టీక॥ తతః=అంతట; సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన ; దేవాః=దేవతలును ; ఋషయశ్చ=ఋషులును; సువిస్మితాః= మిక్కిలియు నాశ్చర్యము నొందిన వారలై; మహాత్మానం=పూజ్యమైన స్వభావముగలవాఁడును; పురుషసత్తమం = పురుషశ్రేష్ఠుఁడునగు జహ్నుం= జహ్నువును; పూజయంతి=(భూతార్థమందులట్) పూజించిరి , గంగాంచాపి=గంగానదిని; మహాత్మనః=పూజ్యమైన స్వభావముగలజహ్నువునకు ; దుహితృత్వే=కొమార్తెయగుట యందు; నయంతిస్మ= పొందించిరి,

అంత దేవతలును గంధర్వులును ఋషులును మిక్కిలి యాశ్చర్యము నొంది . మహాత్ముండును ఋషి శ్రేష్ఠుండు నగు జహ్నునిం బూజించి , గంగానది నతనికిఁ గొమార్తెనుగా నియమించిరి.

అని తాత్పర్యము.

తత స్తుష్టో మహాతేజా శ్శ్రోత్రాభ్యా మసృజత్ప్రభుః
తస్మా జ్జహ్నుసుతా గంగా ప్రోచ్యతే జాహ్నవీతి చ. ౩౮

టీక॥ మహాతేజాః=అధికమగు ప్రభావముగలజహ్నువు; తతః = అందువలన; తుష్టః=సంతసించిన వాఁడై; పునః = మరల; శ్రోత్రాభ్యాం= చెవులవలన;అసృజత్ = పుట్టించెను;తస్మాత్ =అందువలన; గంగా = గంగానది; జహ్నుసుతా=జహ్నుసుత(జహ్నునికొమార్తె) యనియును; జాహ్నవీతి చ=జాహ్నవి( జహ్నుని కొమార్తె) యనియును; ప్రోచ్యతే=చెప్పఁబడుచున్నది.

మహాప్రభావుండగు జహ్నువు తనకు గంగకొమార్తె యగుటకు సంతసించి, గంగనుమరల, చెవుల నుండి బైటికివిడిచెను, అందువలన గంగానది, జహ్నుసుత యనియు, జాహ్నవి యనియును బిలువంబడు చున్నది.

అని, తాత్పర్యము.

జగామచ పున ర్గంగా భగీరథరథానుగా
సాగరం చాపి సంప్రాప్తా సాసరిత్ప్రవరా తదా. ౩౯
రసాతల ముపాగచ్ఛ త్సిద్ధ్యర్థం తస్య కర్మణః.

టీక॥ గంగాచ=గంగానదియును; పునః=మరల; భగీరథరథానుగా=భగీరథుని రథమును వెంబడించినదియై ; జగామ=వెళ్లెను ; తదా = అప్పుడు సరిత్ప్రవరా = నదులలో మేటియైన ; సా=ఆగంగానది; సాగరంచాపి=సముద్రమునుగూడ;సంప్రాప్తా=పొందినదై; తస్య=ఆ; కర్మణః= కార్యమునకు, సిద్ధ్యర్థం= సాఫల్యముకొరకు; రసాతలం=పాతాళమును; ఉపాగచ్ఛత్=పొందెను.

గంగానదియునుమరలభగీరథుని రథమునువెంబడించుచు వెళ్లినది; అప్పుడునదులలో మేటియైన యా గంగానది సముద్రముఁబొంది యట్లు భగీరథునికార్యముసిద్ధించుటకై పాతాళమునకుబోయెను.

అనితాత్పర్యము.

భగీరథోపి రాజర్షి ర్గంగా మాదాయ యత్నతః. ౪౦
పితామహా న్భస్మకృతా నపశ్య ద్దీనచేతనః

టీక॥ రాజర్షిః= రాజునుఋషియునగు;భగీరథోపి=భగీరథుఁడును; యత్నతః = ప్రయత్నమువలన; గంగాం= గంగానదిని; ఆదాయ=తీసికొని; దీనచేతనః= దుఃఖమునొందిన మనస్సుగలవాఁడై; భస్మకృతాన్=బూడిదెగాచేయఁబడిన; పితామహాన్ = తాతలను;

అపశ్యత్=చూచెను.

రాజర్షియగు భగీరథుఁడును, సుహాయత్నంబున, గంగం దీసికొని, దుఃఖంబున, బూడిదెగాఁజేయఁబడియున్న తాతలంబూచెను.

అని, తాత్పర్యము.

అథ తద్భస్మనాం రాశిం గంగాసలిల ముత్తమమ్. ౪౧
ప్లావయ ద్ధూతపాప్మాన స్స్వర్గం ప్రాప్తా రఘూత్తమ

టీక॥ రఘూత్తమ= రఘువంశమునందుఁబుట్టిన వారిలో శ్రేష్ఠుండవైన రాముఁడా! అథ=అటుపిమ్మట; ఉత్తమం=శ్రేష్ఠమైన; తత్= ఆ; గంగాసలిలం= గంగానదీజలము; భస్మనాం = బూడిదెలయొక్క; రాశిం=సమూహమును; ప్లావయత్ (అప్లావయత్) =ముంచెను. తే(అధ్యాహృతము)=ఆసగర పుత్రులు; ధూతపాప్మానః= పోఁగొట్టఁబడిన పాపము గలవారలై; స్వర్గం=స్వర్గమును; ప్రాప్తాః= పొందిరి.

రాముఁడా! అంత, శ్రేష్ఠమయిన యాగంగానదిజలము బూడిదరాశిని, నీళ్లతో ముంచెను; అంత నా సగర పుత్రులు, నిష్పాపులై, స్వర్గము నొందిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, త్రిచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ త్రిచత్వారింశసర్గ టీక, ముగిసినది.

---

శ్రీ

## చతుశ్చత్వారింశసర్గప్రారంభః.

సగత్వా సాగరం రాజా గంగయానుగత స్తదా
ప్రవివేశ తలం భూమే ర్యత్ర తే భస్మసాత్కృతాః. ౧

టీక॥ తదా=అప్పుడు; సః=ఆ; రాజా=భగీరథుఁడు; గంగయా=గంగానదిచేత; అనుగతః=వెంబడింపఁబడినవాఁడై; సాగరం=సముద్రమును; గత్వా=పొంది; యత్ర=ఎచ్చట; తే=ఆసగరునికొడుకులు; భస్మసాత్కృతాః=బూడిదరూపముగాఁజేయఁబడిరో; భూమేః=భూమినుండి; తత్=(అధ్యాహృతము) ఆ; తలం=పాతాళమును; ప్రవివేశ=ప్రవేశించెను.

అప్పుడాభగీరథుఁడు, గంగను వెంటఁ బెట్టుకొని, సాగరంబునకు పోయి, యట్లు, భూమినుండి, సగరునికొడుకులు బూడిదగాఁ జేయఁబడియున్న పాతాళముఁ బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

భస్మన్యథాఽఽప్లుతే రామ గంగాయా స్సలిలేన వై
సర్వలోకప్రభు ర్బ్రహ్మా రాజాన మిద మబ్రవీత్. ౨

టీక॥ రామ=రాముఁడా! అథ=అంతట; గంగాయాః=గంగానదియొక్క; సలిలేన=జలముచేత; ("వై" అనునది పాదపూరణార్థము) భస్మని=బూడిద; ఆప్లుతే=ముంపఁబడఁగా; సర్వలోకప్రభుః=సమస్తలోకంబులకును నాయకుఁడైన; బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు; రాజానం=రాజైనభగీరథునిఁగూర్చి; ఇదం=దీని; అబ్రవీత్=చెప్పెను.

రాముఁడా! అంత, గంగాజలంబు సగరునికొడుకుల దేహభస్మముపైఁ బ్రవహింపఁగానే, సమస్తలోకనాయకుం డగు బ్రహ్మదేవుఁడు, భగీరథునింజూచి యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

తారితా నరశార్దూల దివం యాతాశ్చ దేవవత్
షష్టిః పుత్రసహస్రాణి సగరస్య మహాత్మనః. ౩

టీక॥ నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవైనభగీరథుఁడా ! మహాత్మనః=పూజ్యమైనస్వభావముగల; సగరస్య = సగరునియొక్క; పుత్రసహస్రాణి=కొడుకులయొక్క వేలు; షష్టిః=అఱువదియును; తారితాః=తరింపఁజేయఁబడినవి; దేవవత్=దేవతలువలె; దివం=స్వర్గమును; యాతాశ్చ=పొందినవియునైనవి.

పురుషశ్రేష్ఠుఁడవైన భగీరథుఁడా! మహాత్ముండగుసగరునికొడుకులఱువదివేవురును నీచేఁదరింపఁబడి దేవతలుంబోలెస్వర్గంబునొందిరి. అని, తాత్పర్యము.

సాగరస్య జలం లోకే యావత్థాస్యతి పార్థివ
సగరస్యాత్మజా స్తావ త్స్వర్గే స్థాస్యంతి దేవవత్. ౪

టీక॥ పార్థివ = రాజైనభగీరథుఁడా! యావత్=ఎంతవఱకు; లోకే=ప్రపంచమందు; సాగరస్య=సముద్రముయొక్క; జలం=నీరు; స్థాస్యతి=ఉండఁగలదో; తావత్=అంతవఱకు; సగరస్య = సగరునియొక్క; ఆత్మజాః = కొడుకులు; దేవవత్=దేవతలువలె; స్వర్గే=స్వర్గమునందు; స్థాస్యంతి=ఉండఁగలరు.

భగీరథుఁడా! సముద్రజలంబెంతవఱకులోకంబునందుండునో, అంతవఱకుసగరునికొడుకులందఱు, దేవతలుంబోలె, స్వర్గంబుననుండఁగలరు. అని, తాత్పర్యము.

ఇయం చ దుహితా జ్యేష్ఠా తవ గంగా భవిష్యతి
త్వత్కృతేనచ నామ్నాథ లోకే స్థాస్యతి విశ్రుతా. ౫

టీక॥ ఇయం=ఈ; గంగాచ=గంగయును; తవ=నీకు; జ్యేష్ఠా=పెద్దదైన; దుహితా=కొమార్తె; భవిష్యతి=కాఁగలదు. అథ=ఇంకను;

లోకే=ప్రపంచమునందు; త్వత్కృతేన = నీచేతఁజేయఁబడిన; నామ్నా=పేరుచేత; విశ్రుతా = ప్రసిద్ధమై; స్థాస్యతి=ఉండఁగలదు.

ఈగంగయునునీకు పెద్దకూఁతుఁరుగా నుండఁగలదు; నీవుతండ్రిగా నుండుటంగల్గిన పేరనీలోకంబునం బ్రసిద్ధినొందఁగలదు.

అని, తాత్పర్యము.

గంగా త్రిపథగా రాజన్ దివ్యా భాగీరథీతి చ
త్రీన్ పథో భావయంతీతి తత స్త్రిపథగా స్మృతా. ౬

టీక॥ రాజన్=భగీరథుఁడా! దివ్యా=స్వర్గమునందుఁబుట్టిన; గంగా=గంగానది; త్రిపథగా=త్రిపథగ(మూఁడుమార్గములంబోవునది) యనియును; భాగీరథీతిచ=భాగీరథి (భగీరథునికొమార్తె) యనియును; విశ్రుతా, స్థాస్యతి (అధ్యాహృతము) = ప్రసిద్ధమై, యుండఁగలదు. త్రీన్=మూఁడైన; పథః = మార్గములను; భావయంతీ=మునుఁగఁజేయుచు;(ప్రవహించినది) ఇతి=అని; తతః=అందువలన; త్రిపథగా=త్రిపథగ(మూఁడుమార్గములంబోవునది) యని; స్మృతా=స్మరింపఁబడినది.

భగీరథుఁడా! స్వర్గమునందుబుట్టిన యీగంగానది, త్రిపథయనియుభాగీరథియనియుఁబ్రసిద్ధినొందఁగలదు స్వర్గము, భూమి, పాతాళము, అను మూఁడుమార్గంబులఁబ్రవహించినది, కావున, "త్రిపథగ" యనిచెప్పఁబడినది. అని, తాత్పర్యము.

పితామహానాం సర్వేషాం త్వ మత్ర మనుజాధిప
కురుష్వ సలిలం రాజన్ ప్రతిజ్ఞా మపవర్జయ. ౭

టీక॥ మనుజాధిప=మనుష్యులకుఁబ్రభువైనభగీరథుఁడా! త్వం=నీవు; అత్ర=ఈగంగాజలమందు; పితామహానాం= తాతలకు; సర్వేషాం=అందఱకును; సలిలం=జలమును (లక్షణచే) జలతర్పణమును; కురుష్వ=చేయుము; రాజన్=భగీరథుఁడా! ప్రతిజ్ఞాం=ప్రతినను; అ

పవర్జయ=కడపుకొనుము.

భగీరథుఁడా ! నీవీ గంగాజలమందు,నీ తాతలయినసగరపుత్రులకందఱకును జలతర్పణము సేయుము నీప్రతినను సమాప్తినొందించుకొనుము. అని, తాత్పర్యము.

పూర్వకేణ హి తే రాజం స్తేనా తియశసా తదా
ధర్మిణాం ప్రవరేణాపి నైషప్రాప్తో మనోరథః. ౮

టీక ॥ రాజన్=భగీరథుఁడా! తే=నీకు;పూర్వకేణ=పూర్వికుఁడును; అతియశసా=అధికమైనకీర్తిగలవాఁడును;ధర్మిణాం = ధర్మముగలవారిలోపల; ప్రవరేణ=శ్రేష్ఠుఁడునగు; తేనాపి = ఆసగరునిచేతనుగూడ; తదా=అప్పుడు;ఏషః=ఈ;మనోరథః = కోరికి;నప్రాప్తో హి=పొందఁబడలేదుగదా!

భగీరథుఁడా ! మిక్కిలియుఁ గీర్తిగల్గి ధార్మికులలో శ్రేష్ఠుఁడైన నీపూర్వికుఁడగు సగరుఁడును, ఈ మనోరథంబువొందలేఁడయ్యె.

అని, తాత్పర్యము.

తద్వైవాం శుమతా తాత లోకేఽ ప్రతిమతేజసా
గంగాం ప్రార్థయతాఽనేతుం ప్రతిజ్ఞా నాపవర్జితా. ౯

టీక॥ తాత=నాయనా! తథైవ=ఆలాగే;లోకే = ప్రపంచమందు; అప్రతిమతేజసా=సరిలేనిపరాక్రమముగలవాఁడును; గంగాం = గంగను;ఆనేతుం=కొనివచ్చుటకు; ప్రార్థయతా= కోరుచున్నవాఁడునగు;అంశుమతా=అంశుమంతునిచేత;ప్రతిజ్ఞా=ప్రతిన;నాపవర్జితా=సమాప్తినొందింపఁబడలేదు.

నాయనా! లోకమందంతటను సరిలేని పరాక్రమముగల్గి గంగానదిం గొనివచ్చుటకుఁ బ్రార్థించుచున్నయంశుమంతుండును బ్రతిజ్ఞను జెల్లింపలేడయ్యె. అని, తాత్పర్యము.

రాజర్షిణా గుణవతా మహర్షిసమతేజసా

మత్తుల్యా తపసా చైవ క్షత్రధర్మస్థితేన చ. ౧౦
దిలీపేన మహాభాగ తవ పిత్రా౽తితేజసా
పునర్న శంకితా౽౽నేతుం గంగాం ప్రార్థయతా౽నఘ. ౧౧

టీక॥ మహాభాగ=గొప్పభాగ్యముగల; అనఘ=పాపములేని భగీరథుఁడా! రాజర్షిణా = రాజును ఋషియు నైన వాఁడును; గుణవతా= ప్రశస్తగుణములుగలవాఁడును; మత్తుల్యతపసాచైవ=నాతోసమానమైనప్రభావముగలవాఁడును; క్షత్రధర్మస్థితేనచ= క్షత్రియులధర్మ మందున్నవాఁడును; అతితేజసా=అధికమైన పరాక్రమము గలవాఁడును; గంగాం=గంగానదిని; ఆనేతుం=కొనివచ్చుటకు; ప్రార్థయతా = కోరుచున్నవాఁడునగు; తవ=నీయొక్క; పిత్రా=తండ్రియైన; దిలీపేన=దిలీపునిచేత; నపునః శంకితా=విచారింపఁబడనులేదు.

మహాభాగ్యశాలివి పాపరహితుండవునగుభగీరథుఁడా! రాజర్షియైగుణవంతుండై మహర్షికి సరివచ్చుప్రభావముగలవాఁడై, నావలెనే మహాతపస్వియునై, క్షత్రియధర్మనిష్ఠుండును, మహాపరాక్రమశాలియునై, గంగానదిం దెచ్చుటకుఁబ్రార్థించుచుండిన, నీతండ్రిగు దిలీపుఁడు, నీప్రతిజ్ఞ గుఱించివిదురమైనఁజేయఁడయ్యె. ను
అని, తాత్పర్యము. ౘి

సా త్వయా సమతిక్రాంతా ప్రతిజ్ఞా పురుషర్షభ
ప్రాప్తో౽సి పరమం లోకే యశః పరమసమ్మతమ్. ౧౨

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవగుభగీరథుఁడా! త్వయా=నీచేత; సా=అట్టి; ప్రతిజ్ఞా=ప్రతిన; సమతిక్రాంతా=చక్కఁగాచెల్లింపఁబడినది. త్వం(అధ్యాహృతము)=నీవు; లోకే=ప్రపంచమందు; పరమం=ఉత్కృష్టమును; పరమసమ్మతం= మిక్కిలియుకొనియాడఁబడినది; యశః=కీర్తిని; ప్రాప్తః=పొందినవాఁడవు; అసి=అగుచున్నావు.

పురుషశ్రేష్ఠుండవగు భగీరథుఁడా! పూర్వికులెవ్వరును జెల్లింపలేని ప్రతిజ్ఞను నీవు చెల్లించితివి; లోకంబున శ్రేష్ఠంబైమిక్కిలియుఁ గొనియాడఁదగుయశంబునొందితివి.

అని, తాత్పర్యము.

యచ్చ గంగావతరణం త్వయా కృత మరిందమ
అనేన చ భవాన్ప్రాప్తో ధర్మస్యాయతనం మహత్. ౧౩

టీక॥ అరిందమ=శత్రువులనడంగఁద్రొక్కు-భగీరథుఁడా! త్వయా=నీచేత; యత్=ఏ; గంగావతరణం చ=గంగానదిక్రిందికివచ్చుట; కృతం=చేయఁబడినదో; తేన(అధ్యాహృతము)=ఆ; అనేనచ=దీనిచేతను; భవాన్=నీవు; ధర్మస్య=ధర్మముయొక్క; మహత్=పూజ్యమైన; ఆయతనం=ప్రతిష్ఠను; ప్రాప్తః=పొందినాఁడవు.

శత్రువులనడంగఁద్రొక్కఁజాలినభగీరథుఁడా! నీవిప్పుడు చేసిన గంగావతరణంబునను నీకుపూజ్యంబనుధర్మప్రతిష్ఠగల్గినది. అని, తాత్పర్యము.

ప్లావయస్వ త్వమాత్మానం నరోత్తమ సదోచితే
సలిలే పురుషవ్యాఘ్ర శుచిః పుణ్యఫలోభవ ౧౪

టీక॥ నరోత్తమ = పురుషశ్రేష్ఠుఁడవగుభగీరథుఁడా! త్వం=నీవు; ఆత్మానం=నిన్ను; సదా=ఎల్లప్పుడు; ఉచితే=(స్నానముసేయుటకు)తగిన; సలిలే=గంగాజలమునందు; ప్లావయస్వ=స్నానముచేయించుకొనుము. పురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవగు భగీరథుఁడా! శుచిః = పరిశుద్ధుఁడవును; పుణ్యఫలః= పుణ్యామేఫలముగాఁగలవాఁడవును; భవ=అగుము.

పురుషశ్రేష్ఠుండవగు భగీరథుఁడా! సముద్రమువలెఁగాక, ఎల్లప్పుడును స్నానయోగ్యమైనయీగంగాజలమందు స్నానము సేయుము; దానంజేసి, నీకుఁబరిశుద్ధియును బుణ్యంబునుంగల్గును.

అని, తాత్పర్యము.

పితామహానాం సర్వేషాం కురుష్వ సలిలక్రియామ్
స్వస్తి తేస్తు గమిష్యామి స్వం లోకం గమ్యతాంనృప. ౧౫

టీక ॥ నృప=రాజైనభగీరథుఁడా! పితామహానాం=తాతలకు; సర్వేషాం=అందఱకును; సలిలక్రియాం=జలతర్పణమును; కురుష్వ=చేయుము. తే=నీకు; స్వస్తి=మంగళము; అస్తు=అగుఁగాక. అహం (అధ్యాహృతము)=నేను; స్వం=నాదైన; లోకం = లోకమునుగూర్చి; గమిష్యామి=పోయెదను. త్వయా(అధ్యాహృతము)=నీచేతను. గమ్యతాం=పోఁబడుఁగాక.

భగీరథుఁడా! నీతాతలకందఱకును జలతర్పణమును జేయుము; నీకు మంగళమగుఁ గాక; నేను నాలోకమునకుఁ బోయెదను, నీవును బొమ్ము. అని బ్రహ్మదేవుఁడు భగీరథునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా దేవేశ స్సర్వలోకపితామహః
యథాగతం తథాగచ్ఛ ద్దేవలోకం మహాయశాః. ౧౬

టీక॥ఇతి=అని; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; మహాయశాః=గొప్పకీర్తిగలవాఁడును; దేవేశః=దేవతలకుఁ బ్రభువును; సర్వలోకపితామహః=సమస్తలోకంబులకుఁ దాతయునగు బ్రహ్మదేవుఁడు; యథా=ఎట్లు=ఆగతం=రాఁబడెనో; తథా=అట్లు; దేవలోకం= దేవతలయొక్క లోకమునుగూర్చి; అగచ్ఛత్=పోయెను.

అని యిట్లు భగీరథునకుఁ జెప్పి, గొప్పకీర్తిగల్గి దేవతలకును బ్రభువై సమస్తలోకంబులకును తాతయైన బ్రహ్మదేవుఁడు దేవలోకంబునకుఁ బోయెను.

అని, తాత్పర్యము.

భగీరథోపి రాజర్షిః కృత్వా సలిల ముత్తమమ్
యథాక్రమం యథాన్యాయం సాగరాణాంమహాయశాః. ౧౭

కృతోదక శ్శుచీ రాజా స్వపురం ప్రవివేశ హ
సమృద్ధార్థో రఘుశ్రేష్ఠ స్వరాజ్యం ప్రశశాస హ. ౧౮

టీక॥ రఘుశ్రేష్ఠ=రఘువంశమునందుఁబుట్టినవారిలోమేటివగు రాముఁడా! రాజర్షిః=రాజర్షియయును; మహాయశాః=అధికమైనకీర్తిగలవాఁడును; రాజా=రాజునగు; భగీరథోపి = భగీరథుఁడును;శుచిః=పరిశుద్ధుఁడై;సాగరాణాం=సగరుని కొడుకులకు; యథా క్రమం= వరుసదప్పక; యథాన్యాయం=శాస్త్రప్రకారముగ; ఉత్తమం=శ్రేష్ఠమైన;సలిలం=జలమును (లక్షణచే) జల తర్పణమును; కృత్వా=చేసి;కృతోదకః=చేయఁబడినజలతర్పణముగలవాఁడై; స్వపురం=తనపట్టణమును;ప్రవివేశ=ప్రవేశించెను ("హ"అనునది పాదపూరణార్థము)! సమృద్ధార్థః=వృద్ధిఁబొందినసంపదగలవాఁడై; స్వరాజ్యం=తనరాజ్యమును; ప్రశశాస=పరిపాలించెను."హ" అనునది పాదపూరణార్థము.

రాముఁడా! మహాయశుండును రాజర్షియునగుభగీరథుండు, సగరుని కొడుకులకు, వరుసగాయథా శాస్త్రముగా, జలతర్పణము చేసి, యంతటఁదనపట్టణమునకుఁబోయి,సమృద్ధంబుగా సంపదగల్గి రాజ్యముపాలించెను.అని,తాత్పర్యము

ప్రముమోద హ లోక స్తం నృప మాసాద్య రాఘవ
నష్టశోక స్సమృద్ధార్థో బభూవ విగతజ్వరః. ౧౯

టీక॥రాఘవ=రాముఁడా! లోకః=జనము;తం=ఆభగీరథుని; నృపం=రాజుగా; ఆసాద్య=పొంది; ప్రముమోద= మిక్కిలియుసంతోషించెను.("హ"అనునదిపాదపూరణార్థము),నష్టశోకః = పోయిన దుఃఖముగలదియునునగు;సమృద్ధార్థః= నిండినసంపదగలదియును; విగతజ్వరః=పోయినపీడగలదియును;బభూవ=అయినది.

రాముఁడా!జనులాభగీరథుఁడు రాజగుటజేసి,చాలసంతసించి;మరి

యు, దుఃఖములేక సంపూర్ణమైన సంపదగల్గి, పీడలేమియు లేక, సుఖముగానుండిరి.

అని, తాత్పర్యము.

ఏష తే రామ గంగాయా విస్తరోభిహితో మయా
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే సంధ్యాకాలోతివర్తతే. ౨౦

టీక॥ రామ=రాముఁడా! మయా=నాచేత; గంగాయాః=గంగ యొక్క; ఏషః=ఈ; విస్తరః=కథావివరము; తే=నీకు; అభిహితః=చెప్పఁబడినది. స్వస్తి=మంగళమును; ప్రాప్నుహి=పొందుదువుగాక. తే=నీకు; భద్రం=మంగళమును; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక. (ఆదరాతిశయంబునను, మరలనీ వృత్తాంతమును రాముండడుగకుండుటకైయును రెండుమారులు చెప్పఁబడినది). సంధ్యాకాలః=సంధ్యావందనము చేయవలసిన కాలము; అతివర్తతే = అతిక్రమించుచున్నది.

రాముఁడా! నీకీగంగానదికథావివరముచెప్పినాఁడను; నీకుమంగళమగుఁగాక; సంధ్యాకాలముకావచ్చినది; ఇంకనడుగవలదు.

అని, తాత్పర్యము.

ధన్యం యశస్య మాయుష్యం పుత్ర్యం స్వర్గ్య మతీవచ
య శ్శ్రావయతి విప్రేషు క్షత్రియే ష్వితరేషు చ. ౨౧
ప్రీయంతే పితర స్తస్య ప్రీయంతే దైవతానిచ

టీక॥ విప్రేషు=బ్రాహ్మణులందును; క్షత్రియేషు=క్షత్రియులందును; ఇతరేషుచ = ఇతరజాతులందును; యః=ఎవ్వఁడు; ధన్యం=ధనమునిచ్చునదియును; యశస్యం=కీర్తినిచ్చునదియును; ఆయుష్యం=దీర్ఘాయుస్సునిచ్చునదియును; పుత్ర్యం=కొడుకులనిచ్చునదియును; అతీవ=మిక్కిలియును; స్వర్గ్యంచ=స్వర్గమునునిచ్చునదియునగు; ఇదం (అధ్యాహృతము)= ఈయుపాఖ్యానమును; శ్రావయతి=వినిపించునో; తస్య=అతనియొక్క; పితరః=పితృదేవతలును; ప్రీయంతే=సంతోషపడు

దురు. దైవతానిచ= దేవతలును; ప్రీయంతే=సంతోషపడుదురు.

బ్రాహ్మణుఁడుగాని, క్షత్రియుఁడుగానియితరజాతీయుఁడుగానియెవ్వఁడు, ధనమునుయశస్సును దీర్ఘాయుస్సునుకొడుకులను స్వర్గమునిచ్చునట్టి యీ గంగావతరణోపాఖ్యానమును వినిపించునో, యతనిపితృదేవతలును దేవతలు నందఱును సంతోషింతురు. అని తాత్పర్యము.

ఇద మాఖ్యాన మవ్యగ్రో గంగావతరణం శుభమ్. ౨౨
య శ్శృణోతి చ కాకుత్స్థ సర్వా న్కామా నవాప్నుయాత్
సర్వే పాపాః ప్రణశ్యంతి ఆయుః కీర్తిశ్చ వర్ధతే. ౨౩

టీక॥ కాకుత్స్థ= రామునఁడా! యః=ఎవఁడు; అవ్యగ్రః=పరాధీనముగాని మనస్సుగలవాఁడై ; శుభం=మంగళకరమైన; ఇదం=ఈ; గంగావతరణం = గంగానదియాకాశమునుండి భూమికివచ్చుటయనెడు;ఆఖ్యానం=చరిత్రమును; శృణోతిచ= వినునో;సః=(అధ్యాహృతము) వాఁడు;కామాన్=కోర్కులను;సర్వాన్=అన్నింటిని;అవాప్నుయాత్=పొందును. పాపాః=పాపములు; సర్వే=అన్నియును;ప్రణశ్యంతి=నశించును; ఆయుః=జీవితకాలమును;కీర్తిశ్చ=యశస్సును;వర్ధతే=వృద్ధిఁబొందును.

రామునఁడా! యెవ్వఁడు, మనసునిలిపి,మంగళకరంబగు నీగంగావతరణచరిత్రంబువినునో, యతండుయన్నికోర్కులంబడయును; అతనిపాపంబు లన్నియు నశించుచుండును; అతనికాయుస్సును గీర్తియువృద్ధినొందును.అని,విశ్వామిత్రుఁడురామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, చతుశ్చత్వారింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము,
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండచతుశ్చత్వారింశసర్గటీక,
ముగిసినది.

౫౫

పంచచత్వారింశసర్గప్రారంభః.

విశ్వామిత్రవచ శ్శ్రుత్వా రాఘవ స్సహ లక్ష్మణః
విస్మయం పరమం గత్వా విశ్వామిత్ర మథాబ్రవీత్. ౧

టీక॥ సహలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడుకొనియున్న; రాఘవః=రాముఁడు; విశ్వామిత్రవచః= విశ్వామిత్రుని మాటను; శ్రుత్వా=విని; పరమం=మిక్కిలియు నధికమైన; విస్మయం= ఆశ్చర్యమును; గత్వా=పొంది; అథ=అటుపిమ్మట; విశ్వామిత్రం= విశ్వామిత్రునింగూర్చి, అబ్రవీత్=పలికెను.

రాముండు లక్ష్మణునితోఁ గూడ, విశ్వామిత్రుఁడు చెప్పినదానివిని; మిక్కిలియునాశ్చర్యపడి, విశ్వామిత్రునితో, నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

అత్యద్భుత మిదం బ్రహ్మన్ కథితం పరమం త్వయా
గంగావతరణం పుణ్యం సాగరస్యాపి పూరణమ్. ౨

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుండవగు విశ్వామిత్రుఁడా! త్వయా=నీచేత; అత్యద్భుతం=మిక్కిలియాశ్చర్యకరమును; పరమం=ఉత్కృష్టమును; పుణ్యం=పవిత్రమునగు, ఇదం=ఈ; గంగావతరణం=గంగానదియాకాశమునుండి భూమికివచ్చుటయును; సాగరస్య=సముద్రముయొక్క; పూరణమపి=నిండించుటయును, కథితం=చెప్పఁబడినది.

విశ్వామిత్రుఁడా! అత్యాశ్చర్యకరమును బరమంబును, పావనంబునగు నీగంగావతరణంబును సముద్రంబు వృద్ధిఁబొందించుటను మాకుఁజెప్పితివి. అని, రాముఁడు విశ్వామిత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య సా శర్వరీ సర్వా సహసౌమిత్రిణా తదా
జగామ చింతయానస్య విశ్వామిత్రకథాం శుభామ్. ౩

టీక॥ తదా=అప్పుడు; సౌమిత్రిణా సహ= సుమిత్రకొడుకైనలక్ష్మణునితోఁగూడ; శుభాం=మంగళకరమైన; విశ్వామిత్రకథాం=విశ్వామిత్రునిచేఁజెప్పఁబడినకథను; చింతయానస్య = తలపోయుచున్నట్టి; తస్య=ఆరామునకు; సా=ఆ; శర్వరీ=రాత్రి; సర్వా=అంతయును; జగామ=కడచినది.

అప్పుడు, లక్ష్మణునితోఁ గూడ రాముండు విశ్వామిత్రుండు సెప్పినకథనుగుఱించి తలపోయుచుండఁగనే, యారాత్రియుఁగడచినది.

అని, తాత్పర్యము.

తతః ప్రభాతే విమలే విశ్వామిత్రం మహామునిమ్
ఉవాచ రాఘవో వాక్యం కృతాహ్నిక మరిందమః. ౪

టీక॥ తతః=అంతట; విమలే=నిర్మలమయిన; ప్రభాతే=ప్రాతఃకాలమునందు; అరిందమః=శత్రువులనడంగఁద్రొక్కునట్టి; రాఘవః=రాముఁడు; కృతాహ్నికం=చేయఁబడినయాహ్నికముగల; మహామునిం = పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రం = విశ్వామిత్రునిఁగూర్చి; ఉవాచ=పలికెను.

అంత, నిర్మలముగ సూర్యోదయముకాఁగానే, విశ్వామిత్రుండాహ్నికకృత్యంబునిర్వర్తించినపిదప, నతనింజూచి, శత్రువులనడంగఁద్రొక్కంజాలిన రాముండిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

గతా భగవతీ రాత్రి శ్శ్రోతవ్యం పరమం శ్రుతమ్
క్షణభూతేవ సా రాత్రి స్సంవృత్తేయం మహాతపః. ౫
ఇమాం చింతయతోస్సర్వాం నిఖిలేన కథాం తవ

టీక॥ మహాతపః=అధికమైనతపస్సుగలవిశ్వామిత్రుఁడా! భగవతీ=



మాహాత్మ్యముగల, గంగావతరణ కథనుధ్యానించుచున్నందునఁ బూజ్యమైన;రాత్రిః=రాతిరి; గతా=కడచినది. పరమం=ఉత్కృష్టమయిన; శ్రోతవ్యం=వినఁబడవలసినది; శ్రుతం= వినఁబడినది. తవ=నీయొక్క;ఇమాం=ఈ;కథాం=కతను; సర్వాం=అంతను; నిఖిలేన=సాకల్యముచే;చింతయతోః=తలపోయుచున్న;నౌ = మాకు;ఇయం=ఈ; రాత్రిః=రాత్రి; క్షణభూతేవ=క్షణముగానున్నట్టు; సంవృత్తా=ఆయినది.

అధికమైన తపస్సుగలవిశ్వామిత్రుఁడా! పూజ్యమైనరాత్రిగడచెది; ముఖ్యముగావినవలసిన దానివింటిమి; నీవుచెప్పినకథనంతయుధ్యానింపుచున్నమాకీరాత్రి క్షణప్రాయమైనది.

అని, తాత్పర్యము.

తరామ సరితాం శ్రేష్ఠాం పుణ్యాం త్రిపథగాం నదీమ్. ౬
నౌరేషా హి సుఖాస్తీర్ణా ఋషీణాం పుణ్యకర్మణామ్
భగవంత మిహ ప్రాప్తం జ్ఞాత్వా త్వరిత మాగతా. ౭

టీక॥పుణ్యకర్మణాం=పావనములైన కర్మములు గల, ఋషీణాం=ఋషులయొక్క; సుఖాస్తీర్ణా=సుఖముగాఁబఱవఁబడిన; ఏషా=ఈ; నౌః=ఓడ(ఋషులెక్కఁదగినయోడ); ఇహ=ఇచ్చట;ప్రాప్తం=వచ్చియున్న; భగవంతం=మాహాత్మ్యముగల; త్వాం (అధ్యాహృతము)=నిన్ను;జ్ఞాత్వా=ఎఱింగి; త్వరితం=శీఘ్రముగా; ఆగతా హి = వచ్చినదిగదా!(ఓడనడపువాండ్రు తెచ్చిరనుట). సరితాం=నదులలో;శ్రేష్ఠాం = మేటియైనదియును;పుణ్యాం = పవిత్రమైనదియును;నదీం=నదియునగు; త్రిపథగాం=గంగను; తరామ=దాఁటుదము.

సుఖముగల్గునట్లు ఆస్తరణముగల్గి,పవిత్రంబులగుకర్మములుసేయు ఋషులెక్కందగినయోడ, మీరువచ్చియుండుటదెలిసి తేఁబడియున్నది;మనము, దీనిచే,నదుల కన్నిటికిని




మేటివైపవిత్రమైనగంగానదినిదాఁటుదము. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః
సంతారం కారయామాస సర్షిసంఘ స్సరాఘవః. ౮

టీక॥మహాత్మనః = పూజ్యమైన స్వభావముగల;తస్య=ఆ; రాఘవస్య=రామునియొక్క; తత్ =ఆ;వచనం=మాటను;శ్రుత్వా=విని; విశ్వామిత్రః (అధ్యాహృతము)=విశ్వామిత్రుఁడు; సర్షిసంఘః=ఋషులసమూహముతోఁ గూడినవాఁడై;సరాఘవః = రామలక్ష్మణులతోఁగూడినవాఁడై; సంతారం = దాఁటుటను; కారయామాస = (స్వార్థమందుణిచ్)చేసెను.

మహాత్ముండగు రాముండు చెప్పినమాటనువిని, విశ్వామిత్రుఁడు ఋషులను రామలక్ష్మణులనుంగూడి,గంగానదినిదాఁటెను.

అని, తాత్పర్యము.

ఉత్తరం తీర మాసాద్య సంపూజ్యర్షిగణం తదా
గంగాకూలే నివిష్టాస్తే విశాలాం దదృశుః పురీమ్. ౯

టీక॥ ఉత్తరం=ఉత్తరపుదిక్కునందలి;తీరం=గట్టును; ఆసాద్య=పొంది;తదా = అప్పుడు;ఋషిగణం=ఋషులసమూహమును; సంపూజ్య=పూజించి; తే=ఆవిశ్వామిత్రరామలక్ష్మణులు;గంగాకూలే=గంగానదిగట్టునందు; నివిష్టాః=ఉన్నవారలై;విశాలాం = విశాలయను;పురీం=పట్టణమును; దదృశుః=చూచిరి.

ఇట్లుగంగానదియుత్తరపుగట్టుచేరి,దారినంపవచ్చినఋషులంబూజించి యావిశ్వామిత్ర రామలక్ష్మణులుగంగాతీరమందుండి విశాలయనుపట్టణమునుజూచిరి.

అని, తాత్పర్యము.

తతో మునివర స్తూర్ణం జగామ సహరాఘవః

విశాలాం నగరీం రమ్యాం దివ్యాం స్వర్గోపమాం తదా.౧౦

టీక॥ తతః=అంతట; తదా=అప్పుడు; మునివరః= మునులలో శ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు; సహరాఘవః = రామలక్ష్మణులతోఁగూడినవాఁడై; తూర్ణం=శీఘ్రముగా; రమ్యాం = మనోహరమును; దివ్యాం = శ్రేష్ఠమును; స్వర్గోపమాం = స్వర్గముతోఁబోలికగలదియునగు; విశాలాం=విశాలయను; నగరం=పట్టణమునుఁగూర్చి; జగామ=పోయెను.

అంత, నప్పుడు, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, రామలక్ష్మణులంగూడి, మనోహరమై శ్రేష్ఠమై స్వర్గంబునకు సరివచ్చుచున్న విశాలానగరికిఁబోయెను. అని తాత్పర్యము.

అథ రామో మహాప్రాజ్ఞో విశ్వామిత్రం మహామునిమ్
పప్రచ్ఛ ప్రాంజలిర్భూత్వా విశాలా ముత్తమాం పురీమ్.౧౧

టీక॥ అథ=అటుపిమ్మట; మహాప్రాజ్ఞః=పూజ్యుఁడైనపండితుండగు; రామః=రాముఁడు; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడు; భూత్వా=అయి; మహామునిం=పూజ్యుఁడైన మునియగు; విశ్వామిత్రుని, ఉత్తమం=శ్రేష్ఠమయిన; పురీం=పట్టణమగు; విశాలాం= విశాలనుగూర్చి; పప్రచ్ఛ=అడిగెను.

అంతఁ, బండితులలో శ్రేష్ఠుండగు రాముండు, చేమోడ్పుగీలించి, విశ్వామిత్రమహామునింజూచి, శ్రేష్ఠంబగు విశాలానగరినిగుఱించి యడిగెను. అని, తాత్పర్యము.

కతరో రాజవంశోఽయం విశాలాయాం మహామునే
శ్రోతు మిచ్ఛామి భద్రం తే పరం కౌతూహలం హి మే. ౧౨

టీక॥ మహామునే=పూజ్యుఁడైనమునివగు విశ్వామిత్రుఁడా! విశాలాయాం = విశాలనగరియందు; (ఉన్న) అయం=ఈ; రాజవంశః=

రాజులవంశము; కతరః = ఎద్దిః శ్రోతుం = వినుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. మే = నాయొక్క; కౌతూహలం = కోర్కి; పరం హి = అధికముగదా!

విశ్వామిత్రుఁడా! విశాలానగరియందున్న రాజులవంశమెట్టిది? నేనుదానివినఁగోరుచున్నాను; నాకు కోర్కి హెచ్చుగానున్నది. అని, రాముఁడు విశ్వామిత్రునడిగెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా రామస్య మునిపుంగవః
ఆఖ్యాతుం త త్సమారేభే విశాలస్య పురాతనమ్. ౧౩

టీక ॥ మునిపుంగవః = మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు; తస్య = ఆ; రామస్య = రాముని యొక్క; తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; విశాలస్య = విశాలానగరమును నిర్మించిన విశాలమహారాజు యొక్క; పురాతనం = ముందునడిచిన; తత్ = ఆవృత్తాంతమును; ఆఖ్యాతుం = చెప్పుటకు; సమారేభే = ఆరంభించెను.

ఆరాముఁడు చెప్పినమాటవిని మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు, విశాలానగరమును నిర్మించినవిశాలమహారాజు పురాతనచరిత్రమును జెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

శ్రూయతాం రామ శక్రస్య కథాం కథయత శ్శుభామ్
అస్మిన్ దేశేతు యద్వృత్తం తదపి శృణు రాఘవ. ౧౪

టీక ॥ రాఘవ = రఘువంశమునం దుఁబుట్టినట్టి; రామ = రాముఁడా! శక్రస్య = ఇంద్రుని యొక్క; శుభాం = మంగళకరమగు; కథాం = కథను; కథయతః = చెప్పుచున్నట్టి; మత్ = (అధ్యాహృతము) నావలన; శ్రూయతాం = వినఁబడుఁగాక. అస్మిన్ = ఈ; దేశేతు = దేశమందును; యత్ = ఏ; వృత్తం = జరిగెనో; తదపి = దానిని; శృణు = వినుము.

రాముఁడా! నేను ఇంద్రునికథను జెప్పెదను; వినుము; ఈ దేశమందేమి



నడచినదో, దానిని, వినుము. అని, తాత్పర్యము.

పూర్వం కృతయుగే రామ దితేః పుత్రా మహాబలాః
అదితేశ్చ మహాభాగ వీర్యవంత స్సుధార్మికాః. ౧౫

టీక॥ మహాభాగ=పూజ్యుఁడైన భాగ్యముగల; రామ=రాముఁడా! పూర్వం=మునుపు; కృతయుగే=కృతయుగమునందు; దితేః=దితియొక్క; పుత్రాః=కొడుకులు; మహాబలాః= అధికమైనబలముగలవారలుగా; ఆసన్(అధ్యాహృతము)= ఉండిరి. అదితేశ్చ= అదితియొక్కయు; పుత్రాః(అధ్యాహృతము)= కొడుకులు; వీర్యవంతః=పరాక్రమము గలవారలు గాను; సుధార్మికాః=మిక్కిలియు ధర్మమునాచరించువారుగాను; ఆసన్(అధ్యాహృతము)=ఉండిరి.

మహాభాగ్యుండవగు రాముఁడా! పూర్వము కృతయుగము నందు, దితికొడుకులు గొప్పబలము గలిగి మాత్రముండిరి; అదితికొడుకులు పరాక్రమముగలిగి ధర్మాచరణము సేయువారును గానుండిరి.

అని, తాత్పర్యము.

తత స్తేషాం నరశ్రేష్ఠ బుద్ధిరాసీ న్మహాత్మనామ్
అమరా అజరాశ్చైవ కథంస్యామ నిరామయాః. ౧౬

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! తతః=అంతట; మహాత్మనాం= పూజ్యమైనస్వభావముగల; తేషాం=ఆ దితికొడుకులకును అదితికొడుకులకును; వయం=(అధ్యాహృతము) మేము; అమరాః=చావులేనివారలు గాను; అజరాః = ముసలితనములేనివారుగాను; నిరామయాశ్చైవ=రోగము లేనివారలు గాను; కథం=ఎట్లు; స్యామ=అగుదుము; ఇతి(అధ్యాహృతము)=అని; బుద్ధిః=ఆలోచన; ఆసీత్=కల్గినది.

అంతమహాత్ములగు నా దితికొ



డుకులకును అదితి కొడుకులకును "మేమేమిచేసిన జావుముసలితనము రోగములేకయుందుము" అని యాలోచనకల్గినది. అని, తాత్పర్యము.

తేషాం చింతయతాం రామ బుద్ధిరాసీ న్మహాత్మనామ్
క్షీరోద మథనం కృత్వా రసం ప్రాప్స్యా మ తత్రవై. ౧౭

టీక॥ రామ=రాముఁడా! చింతయతాం= ఆలోచించుచున్న; మహాత్మనాం= పూజ్యమైనస్వభావముగల; తేషాం=వారలకు; క్షీరోదమథనం, క్షీరోద=పాలసముద్రముయొక్క, మథనం=చిలుకుటను; కృత్వా=చేసి; తత్ర = అచ్చట; ("వై" అనునది పాదపూరణార్థము) రసం=అమృతమును; ప్రాప్స్యామ (ప్రాప్స్యామః)=పొందెదము; ఇతి (అధ్యాహృతము)= అని; బుద్ధిః=తలంపు; ఆసీత్=కల్గినది.

రాముఁడా! ఇట్లాలోచింపుచున్నమహాత్ములగువారలకు "పాలసముద్రమునుజిలికి యమృతంబునొందెదము" అని, బుద్ధికల్గినది.
అని, తాత్పర్యము.

తతో నిశ్చిత్య మథనం యోక్త్రం కృత్వాచ వాసుకిమ్
మంథానం మందరంకృత్వా మమంథు రమితౌజసః. ౧౮

టీక॥ తతః=అంతట; అమితౌజసః=కొలందిలేనిబలముగల యాదేవాసురులు; మథనం = చిలుకుటను; నిశ్చిత్య=నిశ్చయించి; వాసుకిం=వాసుకియనుసర్పమును; యోక్త్రం=త్రాడుగా; కృత్వాచ=చేసియు; మందరం=మందరపర్వతమును; మంథానం=కవ్వముగా; కృత్వా=చేసి; మమంథుః=చిలికిరి.

అంతట, గొలందిలేనిబలంబుఁగలయాదేవాసురులు, చిలుకవలెనని నిశ్చయించి, వాసుకిని త్రాడుగానే ర్పఱిచికొని, మందరపర్వతమును కవ్వమును గాఁజేసికొని, చిలికిరి.
అని, తాత్పర్యము.

అథవర్ష సహస్రేణ యోక్త్రసర్ప శిరాంసిచ
వమంత్యతివిషం తత్ర దదంశు ర్దశనైశ్శిలాః.

టీక॥ అథ=అటుపిమ్మట; తత్ర=ఆ చిలుకుటయందు, వర్షసహస్రేణ=సంవత్సరములయొక్క వేయిచేత; యోక్త్రసర్పశిరాంసి = త్రాడైన వాసుకియొక్క తలలు; ("చ" అనునది పాదపూరణార్థము); అతివిషం=అధికమయినవిషము; వమంతి=(భూతార్థమందులట్) క్రక్కినవి. దశనైః=దంతములచేత; శిలాః=ఱాళ్లను; దదంశుః=కొఱికినవి.

అంత, చిలుకఁగా వేయిసంవత్సరములకు, త్రాడుగానున్నవాసుకితలలు, భయంకరంబగువిషంబు క్రక్కుచు, మందరపర్వతముఱాళ్లను దంతములచేఁగొఱికినవి.

అని, తాత్పర్యము.

(ఈశ్లోకముమొదలు, పండ్రెండుశ్లోకములు నఱు, గోవిందరాజీయమందుదహరింపఁబడవయ్యె. అయినను మహేశ్వరతీర్థీయంబునందుదహరింపఁబడియుండుటంజేసి, యిచ్చటవ్యాఖ్యాతంబులయినవి.)

ఉత్పపాతాగ్ని సంకాశం హాలాహలమహావిషమ్
తేన దగ్ధం జగత్సర్వం సదేవాసురమానుషమ్.

టీక॥ అగ్నిసంకాశం=నిప్పుతో సరియైన; హాలాహలమహావిషం=హాలాహలమను గొప్ప విషము; ఉత్పపాత=పైకివచ్చినది. తేన=ఆహాలాహలముచేత, సదేవాసుర మానుషం=దేవతలతోను అసురులతోను మనుష్యులతోనుంగూడిన; జగత్=ప్రపంచము, సర్వం=అంతయును; దగ్ధం=దహింపఁబడినది.

నిప్పునకుసరివచ్చు హాలాహలంబను మహావిషంబుపుట్టినది; దేవాసురమనుష్యులతోఁగూడిన ప్రపంచమంతయు దానిచేదహింపబడినది.

అని, తాత్పర్యము.

అథ దేవా మహాదేవం శంకరం శరణార్థినః
జగ్ముః పశుపతిం రుద్రం త్రాహి త్రాహీతి తుష్టువుః.

టీక॥ అథ=అటుపిమ్మట; దేవాః=దేవతలు; శరణార్థినః=రక్షకునిం గోరువారలై; శంకరం=సుఖమును జేయునట్టి; మహాదేవం=ఈశ్వరుని; జగ్ముః=పొందిరి; పశుపతిం=ప్రాణముగలవానికన్నిటికిని ప్రభువైన; రుద్రం=ఈశ్వరుని; త్రాహి త్రాహి=రక్షించు రక్షించుమని; తుష్టువుః=స్తుతించిరి.

అంతట దేవతలు రక్షకునింగోరి, సుఖప్రదుండగు నీశ్వరుని యొద్దకుం బోయి పశుపతియైన నాయీశ్వరుని "మమ్ములరక్షించు రక్షించుము" అని, ప్రస్తుతించిరి. అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్తతో దేవై ర్దేవదేవేశ్వరః ప్రభుః

టీక॥ తతః=అంతట; దేవైః=దేవతలచేత; ప్రభుః=లోకనాయకుండును; దేవదేవేశ్వరః=దేవతలకుం ప్రభువైనయింద్రునకును ప్రభువు నగునీశ్వరుండు; ఏవం=ఈప్రకారము; ఉక్తః=చెప్పంబడెను.

అంత, లోకనాయకుండును దేవేంద్రునకును ప్రభువునైనయీశ్వరునింజూచి, దేవతలిట్లని చెప్పిరి. అని, తాత్పర్యము.

ప్రాదురాసీ త్తతో త్రైవ శంఖచక్రధరో హరిః.

టీక॥ తతః = అంతట; అత్రైవ=ఇచ్చటనే; శంఖచక్రధరః=శంఖమును చక్రమును ధరించియున్న; హరిః=విష్ణువు; ప్రాదురాసీత్=ఆవిర్భవించెను.

అంత, నచ్చోటశంఖచక్రధారి యగువిష్ణువునువచ్చెను. అని, తాత్పర్యము.

ఉవాచైనం స్మితం కృత్వా రుద్రం శూలభృతం హరిః

టీక॥ హరిః=విష్ణువు; స్మితం=చిఱునగవును; కృత్వా=చేసి; శూలభృతం=శూలాయుధమునుధరించునట్టి; ఏనం=ఈ; రుద్రం=శివునిఁగూర్చి; ఉవాచ=చెప్పెను.

విష్ణు దేవుఁడును; చిఱునగవునవ్వి, శూలాయుధమునుధరించునట్టి, యీశ్వరునితో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

దైవతై ర్మథ్యమానేతు యత్పూర్వం సముపస్థితమ్.
త్వదీయం హి సురశ్రేష్ఠ సురాణా మగ్రజోసి యత్
అగ్రపూజా మిమాం మత్వా గృహాణేదం విషంప్రభో.

టీక॥ సురశ్రేష్ఠ= దేవతలలో శ్రేష్ఠుఁడ వయిన యీశ్వరుఁడా! యత్=ఏకారణమున; త్వం(అధ్యాహృతము)=నీవు; సురాణాం=దేవతలలోపల; అగ్రజః = మొదటివాఁడవు; అసి=అగుచున్నావో; తత్(అధ్యాహృతము) = ఆకారణమువలన; దైవతైః=దేవతలచేత; మథ్యమానేతు; చిలుకఁబడుచుండఁగానే; యత్=ఏది; పూర్వం=మొదట; సముపస్థితం=పుట్టినదో; తత్(అధ్యాహృతము)=అది; త్వదీయం హి=నీదిగదా! ప్రభో=ఈశ్వరుఁడా! ఇమాం=దీని; అగ్రపూజాం=మొదటిపూజనుగా; మత్వా=తలఁచి; ఇదం=ఈ; విషం=విషమును; గృహాణ=స్వీకరించుము.

దేవతాశ్రేష్ఠుండవగు నీశ్వరుఁడా! నీవు దేవతలకందఱకును మొదటివాఁడవు; కాఁబట్టి, సముద్రమథనమందు మొదటఁబుట్టినది, నీభాగము; నీవు దీనినగ్రపూజగానెంచి విషంబుగ్రహింపుము. అని, విష్ణువు మొదలగు దేవతలు, శివునితోఁజెప్పిరి. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వాచ సురశ్రేష్ఠ స్తత్రైవాంతరధీయత

టీక॥ ఇతి = ఈప్రకారము; ఉక్త్వాచ=చెప్పియు; సురశ్రేష్ఠః=దే



వతాశ్రేష్ఠుండగువిష్ణువు;తత్రైవ= అచ్చటనె;అంతరధీయత = మఱుఁగుపడెను.

ఈప్రకారముగ చెప్పి, విష్ణుదేవుండుపోయెను.

అని, తాత్పర్యము.

దేవతానాం భయం దృష్ట్వా శ్రుత్వా వాక్యంతు శార్ఙ్గిణః।
హాలాహలవిషం ఘోరం స జగ్రాహ మృతోపమమ్

టీక॥ సః=ఆశివుండు; దేవతానాం=దేవతలయొక్క; భయం=వెఱపును;దృష్ట్వా=చూచి;శార్ఙ్గిణః =విష్ణుదేవునియొక్క; వాక్యంతు= మాటను; శ్రుత్వా=విని; ఘోరం= భయంకరమగు; హాలాహలవిషం= హాలాహలమనువిషమును; అమృతోపమం = అమృతముతోఁబోల్కిగలుగునట్లు;జగ్రాహ=గ్రహించెను.

ఈశ్వరుండు, దేవతలకుఁగల్గిన భయమును విష్ణుదేవుండు చెప్పినవిధంబునుదలపోసి,భయంకరమగుహాలాహలంబునమృతంబునట్లు,ద్రావెను. అని,తాత్పర్యము.

దేవాన్ విసృజ్య దేవేశో జగామ భగవాన్ హరః।

టీక॥దేవేశః= దేవతలకుఁబ్రభువును;భగవాన్=సమస్తశక్తులును గలవాఁడునగు; హరః=ఈశ్వరుఁడు; దేవాన్=దేవతలను;విసృజ్య= వీడుకొని; జగామ=పోయెను.

దేవతలకునుఁబ్రభువై సమస్తశక్తులునుగల్గినయీశ్వరుండు దేవతలవీడ్కొనిస్వస్థానంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తతో దేవా స్సురాస్సర్వే మమంథూ రఘునందన

టీక॥రఘునందన=రాముఁడా! తతః=అంతట; దేవాసురాః= దేవతలును అసురులును; సర్వే=అందఱును; మమంథుః=చిలికిరి.



రాముఁడా! అంత, దేవాసురులందఱును, పాలసముద్రంబుచిలుకనారంభించిరి.

అని, తాత్పర్యము.

ప్రవివేశాథ పాతాళం మంథానః పర్వతోనఘ.

టీక॥ అనఘ=పాపములేని రాముఁడా! అథ=అటుపిమ్మట; మంథానః=కవ్వమైన; పర్వతః=మందరపర్వతము; పాతాళం=పాతాళలోకమును; ప్రవివేశ=ప్రవేశించెను

పాపరహితుండవగు రాముఁడా! అంతఁ గవ్వముగానున్నమందరపర్వతము, సముద్రములో మునింగి పాతాళలోకముచేరినది.

అని, తాత్పర్యము,

తతోదేవా స్సగంధర్వా స్తుష్టువు ర్మధుసూదనమ్

టీక॥ తతః=అంతట; సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన; దేవాః=దేవతలు; మధుసూదనం=మధువనురాక్షసుంజంపిన విష్ణువును; తుష్టువుః=స్తుతించిరి.

అంత దేవతలు గంధర్వులును, విష్ణుదేవు, నిట్లని ప్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

త్వం గతి స్సర్వభూతానాం విశేషేణ దివౌకసామ్.
పాలయా స్మాన్ మహాబాహో గిరి ముద్ధర్తు మర్హసి

టీక॥ మహాబాహో=గొప్పచేతులుగలవిష్ణుదేవుఁడా! సర్వభూతానాం=సమస్తప్రాణులకు; విశేషేణ=అధిక్యముచే; దివౌకసాం=దేవతలకు; త్వం=నీవు; గతిః=ప్రాప్యస్థానము. అస్మాన్=మమ్ములను; పాలయ=రక్షింపుము. గిరిం=పర్వతమును; ఉద్ధర్తుం=లేపుటకు; అర్హసి=తగుదువు.

మహాబాహుండవగు విష్ణుదేవుఁడా! నీవె సమస్తప్రాణులకును అందు విశేషముగా దేవతలకు గతివి. మమ్ములను రక్షింపుము; సముద్రములో మునింగి యున్న మందరపర్వతమును లేవనెత్తుము. అని, స్తుతించిరి.

అని, తాత్పర్యము.

ఇతి శ్రుత్వా హృషీకేశః కామఠం రూప మాస్థితః.
పర్వతం పృష్ఠతః కృత్వా శిశ్యే తత్రో దధౌ హరిః

టీక॥ ఇతి=ఇట్లు; శ్రుత్వా=విని; హృషీకేశః= ఇంద్రియములకుఁ బ్రభువైన; హరిః = విష్ణువు; కామఠం = తాఁబేలుసంబంధియయిన; రూపం=ఆకారమును; ఆస్థితః=వహించినవాఁడై; పర్వతం=కొండను; పృష్ఠతః= వీఁపున; కృత్వా=చేసి, ఉంచియనుట; తత్ర=ఆ; ఉదధౌ=సముద్రమునందు; శిశ్యే=శయనించెను.

ఇట్లు దేవతలు సేయు ప్రార్థనను విని, యింద్రియంబులకుఁ బ్రభువైన విష్ణుదేవుఁడు, తాఁబేలురూపము వహించి, మందరపర్వతమును వీఁపు పైనుంచికొని, సముద్రమందు శయనించెను. అని, తాత్పర్యము.

పర్వతాగ్రే తు లోకాత్మా హస్తే నాక్రమ్య కేశవః.
దేవానాం మధ్యత స్థిత్వా మమంథ పురుషోత్తమః

టీక॥ లోకాత్మా= లోకంబులు శరీరమందుఁగలవాఁడును, తనశరీరమందులోకంబుల ధరించినవాఁడు ననుట; పురుషోత్తమః=పురుషశ్రేష్ఠుండునగు; కేశవః=విష్ణుదేవుఁడు; పర్వతాగ్రేతు=పర్వతము యొక్క శిఖరమందుమాత్రము; హస్తేన=చేతిచే; ఆక్రమ్య = పట్టుకొని; దేవానాం=దేవతలయొక్క; మధ్యతః=నడుమను; స్థిత్వా=ఉండి; మమంథ=చిలికెను.

సమస్తలోకంబులఁదనశరీరమందుధరించియున్న పురుషశ్రేష్ఠుండగు విష్ణుదేవుండు చేతులు పైకెత్తి జాఁచి మందరపర్వతంబు శిఖరమును బట్టుకొని, దేవతలనడుమఁ, దానునుజిలికెను. అని, తాత్పర్యము.

అథ వర్షసహస్రేణ సదండ స్సకమండలుః
పూర్వం ధన్వంతరి ర్నామ అప్సరాశ్చ సువర్చసః. ౧౫

టీక॥ అథ=అటుపిమ్మట; వర్షసహస్రేణ=సంవత్సరములయొక్క వేయిచేత; పూర్వం=మొదట; సదండః=దండముతోఁగూడియున్నవాఁడును; సకమండలుః=కమండలువుతోఁగూడియున్నవాఁడునగు; ధన్వంతరిర్నామ=ధన్వంతరియనిప్రసిద్ధుఁడైనవాఁడు; ఉత్పపాత(అధ్యాహృతము)=పైకిలేచెను. సువర్చసః=మంచికాంతిగల; అప్సరాశ్చ(అప్సరసశ్చ)=అప్సరసలును, ఉత్పేతుః (అధ్యాహృతము)=పైకిలేచిరి.

అంత, వేయిసంవత్సరములయిన వెనుక, మొదట, దండకమండలువులతో ధన్వంతరియును, మంచివర్చస్సుగల, యప్సరసలును, బుట్టిరి.

అని, తాత్పర్యము.

అప్సు నిర్మథనాదేవ రస స్తస్మా ద్వరస్త్రియః
ఉత్పేతు ర్మనుజశ్రేష్ఠ తస్మా దప్సరసోఽభవన్. ౨౦

టీక॥ మనుజశ్రేష్ఠ=మనుష్యశ్రేష్ఠుండవగు రాముఁడా! అప్సు=నీళ్లయందు (లక్షణచే) పాలయందు, నిర్మథనాదేవ=చిలుకుటవలననే; రసః=రసము; ఉత్పపాత (అధ్యాహృతము)=పైకిలేచెను. తస్మాత్=ఆరసమువలన; వరస్త్రియః = మంచిస్త్రీలు; ఉత్పేతుః=పైకిలేచిరి. తస్మాత్=అందువలన; అప్సరసః=అప్సరసలనువారలు (నీళ్లయందు అనఁగా, పాలయందుఁ బుట్టినరసమునఁ బుట్టినవారలు); అభవన్ = అయిరి.

రాముఁడా! పాలయందుచిలుకటచే రసమొకటిపుట్టినది; ఆరసమునందు స్త్రీలుపుట్టిరి; కావున్, వీరలప్సరసలనఁబడిరి.

అని, తాత్పర్యము.

షష్టిః కోట్యో౽భవం స్తాసా మప్సరాణాం సువర్చసామ్
అసంఖ్యేయా స్త కాకుత్స్థ యా స్తాసాం పరిచారకాః. ౨౧

టీక॥ కాకుత్స్థ= రాముఁడా! సువర్చసాం = మంచికాంతిగల; తాసాం=ఆ; అప్సరాణాం (అప్సరసాం)= అప్సరసలయొక్క; షష్టిః=అరువది; కోట్యః=కోటులు; అభవన్=కల్గినవి; తాసాం=ఆయ

ప్సరసలయొక్క; పంచాశాః= పనికత్తెలు; యాః = ఎవరో; తా (అధ్యాహృతము)కు=వారలు మాత్రము; అసంఖ్యేయాః= లెక్క పెట్టదగనివారు.

అప్పుడుదయించినయప్సరసలయ అఱువదికోటులు, వారికి పనికత్తెలు లెక్కలేక జన్మించిరి. అని, తాత్పర్యము.

న తాః స్మ ప్రతిగృహ్ణంతి సర్వే తే దేవదానవాః
అప్రతిగ్రహణాత్తాశ్చ సర్వాస్సాధారణాస్స్మృతాః. ౨౨

టీక॥ తే=ఆ; దేవదానవాః=దేవతలును రాక్షసులును; సర్వే=అందఱును; తాః=ఆయప్సరసలను; ప్రతిగృహ్ణంతిస్మ=పెండ్లాడరైరి. అప్రతిగ్రహణాత్= పెండ్లాడకుండుటవలన; తాః=ఆయప్సరసలు; సర్వాశ్చ = అందఱును; సాధారణాః=వేశ్యలుగా; స్మృతాః=చెప్పఁబడిరి.

దేవదానవులలో నెవ్వరునాయప్సరసలం బెండ్లాడరైరి; అట్లెవ్వరును బెండ్లాడకుండుటం జేసి, యాయప్సరలందఱును వేశ్యలని చెప్పఁబడిరి. అని, తాత్పర్యము.

వరుణస్య తతః కన్యా వారుణీ రఘునందన
ఉత్పపాత మహాభాగా మార్గమాణా పరిగ్రహమ్. ౨౩

టీక॥ రఘునందన=రాముఁడా! తతః=అటుపిమ్మట; వరుణస్య=సముద్రమునకధి దేవతయగువరుణుని యొక్క; కన్యా=కూఁతురైన, మహాభాగా=పూజ్యమైనయదృష్టముగల; వారుణీ=సురకు(సారయికి)అధిదేవతమైనవారుణియనునది; పరిగ్రహం = పెండ్లాడుటను; మార్గమాణా = వెదకుచు; ఉత్పపాత=పైకివచ్చెను.

రాముఁడా! అంత, సముద్రాధి దేవతయగువరుణుని కొమార్తెయు మహాభాగ్యశాలినగు సురాధి దేవతయైన వారుణియనునది, తన్నుఁ బెండ్లాడువారి వెదకుచు, సముద్రమునుండి బయలు వెడలినది. అని తాత్పర్యము

దితేః పుత్రా న తాం రామ జగృహు ర్వరుణాత్మజామ్
అదితే స్తు సుతా వీర జగృహు స్తా మనిందితామ్. ౨౪

టీక॥ వీర= పరాక్రమశాలివైన; రామ=రాముఁడా! వరుణాత్మజాం = వరుణునికొమార్తెయగు; తాం=ఆవారుణిని; దితేః=దితియొక్క; పుత్రాః=కొడుకులగు రాక్షసులు; నజగృహుః=గ్రహింపరైరి. అదితేః= అదితియొక్క; సుతాస్తు= కొడుకులైన దేవతలుమాత్రము; అనిందితాం=నిందింపఁబడని; తాం= ఆవారుణిని; జగృహుః=గ్రహించిరి

పరాక్రమశాలివయిన రాముఁడా! రాక్షసులెవ్వరునుఆవారుణిని గ్రహింపరైరి; దేవతలుమాత్రము నిందింపఁబడని యావారుణింబరిగ్రహించిరి.

అని, తాత్పర్యము.

అసురా స్తేన దైతేయా స్సురా స్తేనా దితే స్సుతాః
హృష్టాః ప్రముదితాశ్చాసన్ వారుణీ గ్రహణాత్సురాః. ౨౫

టీక॥ తేన=అందుచేత, వారుణిని గ్రహింపకుండుటచేత; దైతేయాః=రాక్షసులు; అసురాః=అసురులు(సుర, అనఁగావారుణిలేనివారలు); ఆసన్(అధ్యాహృతము)=అయిరి. తేన=అందుచేత, వారుణింబరిగ్రహించుటచేత; అదితేః=అదితియొక్క; సుతాః=కొడుకులైన దేవతలు; సురాః=సురలు(సురగలవారలు); ఆసన్(అధ్యాహృతము)=అయిరి. సురాః=దేవతలు; వారుణీగ్రహణాత్= వారుణిగ్రహించుటవలన; హృష్టాః = గగుర్పాటుగలవారలును; ప్రముదితాశ్చ=మిక్కిలియు సంతసించినవారలును ; ఆసన్=అయిరి.

వారుణిని, గ్రహింపకుండుటంజేసి, దైత్యులసురులయిరి; వారుణింబరిగ్రహించుటవలన దేవతలుసురలయిరి; మరియు, దేవతలు, వారుణిని గ్రహించుటవలన, గగురుపాటుగలిగి మిక్కిలియు సంతసంబునం బొదలిరి.

అని, తాత్పర్యము.

ఉచ్చైశ్శ్రవా హయశ్రేష్ఠో మణిరత్నం చ కౌస్తుభమ్
ఉదతిష్ఠ న్నరశ్రేష్ఠ తథై వామృత ముత్తమమ్. ౨౬

టీక॥ నరశ్రేష్ఠ=మనుష్యశ్రేష్ఠుఁడవగు రామునఁడా! హయశ్రేష్ఠః=గుఱ్ఱములలో మేటిదైన; ఉచ్చైశ్శ్రివాః= ఉచ్చైశ్శ్రవమనునదియును, మణిరత్నం= మణులలో శ్రేష్ఠమైన; కౌస్తుభంచ= కౌస్తుభమనునదియును; తథైవ = అలాగే; ఉత్తమం=అన్నిటికన్న శ్రేష్ఠమగు; అమృతం=అమృతమను; ఉదతిష్ఠత్ =లేచెను.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! గుఱ్ఱములలో శ్రేష్ఠంబగునుచ్చైశ్శ్రవమను మణిశ్రేష్ఠంబగు కౌస్తుభంబును, అట్లుత్తమంబగు నమృతమును, సముద్రమునుండి పైకి వెడలినది. అని, తాత్పర్యము.

అథ తస్యకృతే రామ మహా నాసీ త్కులక్షయః
అదితేస్తు తతః పుత్రా దితేః పుత్రా నసూదయన్. ౨౭

టీక॥ రామ = రాముఁడా! అథ=అటుపిమ్మట; తస్యకృతే = ఆయమృతము కొఱకు; మహాన్=గొప్పదైన; కులక్షయః=వంశముల నాశము; ఆసీత్=కలిగినది. తతః=అంతట; అదితేః = అదితియొక్క; పుత్రాస్తు=కొడుకులైన దేవతలు మాత్రము; దితేః = దితియొక్క; పుత్రాన్ = కొడుకులను; అసూదయన్=చంపిరి.

రాముఁడా! అంతనాయమృతమునకై, దేవతలు దైత్యులునుచాల నశించిరి; దేవతలు దైత్యుల ననేకులంజంపిరి. అని, తాత్పర్యము.

ఏకతో భ్యాగమన్ సర్వే హ్యసురా రాక్షసై స్సహ
యుద్ధమాసీ న్మహాఘోరం వీర త్రైలోక్య మోహనమ్. ౨౮

టీక॥ వీర=పరాక్రమశాలివైన రాముఁడా! అసురాః=దైత్యులు; సర్వే = అందఱును; రాక్షసైస్సహ=రాక్షసులతోఁగూడ; ఏకతః=

ఒకటెగా; అభ్యాగమఃకిహి = చేరఁగవా! త్రైలోక్యమోహనం=మూఁడు లోకముల మోహింపఁ జేయునదియును, మహాఘోరం=మిక్కిలియు భయంకరమైనదియునగు; యుద్ధం=జగడము; ఆసీత్=అయినది.

పరాక్రమశాలివైన రాముఁడా! దైత్యులును రాక్షసులును బలమెచ్చుటకై యొకటిగాఁ జేరిరి; అప్పుడు వారిలకందఱకును మూఁల్లోకంబులకు మోహంబుగల్గించునదియు భయంకరంబునగుయుద్ధమైనది.
అని, తాత్పర్యము.

యదా క్షయం గతం సర్వం తదా విష్ణుర్మహాబలః
అమృతం సోఽహరత్తూర్ణం మాయామాస్థాయ మోహినీమ్. ౨౯

టీక॥యదా=ఎప్పుడు; సర్వం=అంతయును; క్షయం=నాశమును; గతం=పొందినదో; తదా=అప్పుడు; మహాబలః=అధికమైనబలముగలః; సః = ఆ; విష్ణుః=విష్ణుదేవుఁడు; మోహినీం=మోహమును గలుగఁజేయునట్టి; మాయాం=మాయను, ఆస్థాయ=అవలంబించి; తూర్ణం=శీఘ్రముగా; అమృతం=అమృతమును; అహరత్=అపహరించెను.

అంతయు నాశమునొందునట్లు కాఁగానే, మహాబలుండగువిష్ణుదేవుండు, మోహజనకంబగుమోహినీరూపంబునుమాయచేఁగైకొని, శీఘ్రముగా, నమృతమునపహరించెను. అని, తాత్పర్యము.

యే గతాభిముఖం విష్ణుమక్షయం పురుషోత్తమమ్
("సంపిష్టాస్తే" అని పాఠాంతరము)
సంపిష్టాస్తే తదా యుద్ధే విష్ణునా ప్రభవిష్ణునా. ౩౦

టీక॥తదా=అప్పుడు; యుద్ధే=జగడమునందు; యే = ఎవరు; అక్షయం = నాశములేనివాఁడును, పురుషోత్తమం = పురుషులయందు శ్రేష్ఠుఁడునగు; విష్ణుం=విష్ణుదేవునిగూర్చి; అభిముఖం=ఎదురుగా; గతాః=

పోయిరో ("గతాః అభిముఖం"= "గతాభిముఖం" అనినైనది. సంధి యార్షము). తే=ఆదైత్యులు; ప్రభవిష్ణునా=లోకనాయకుండగు; విష్ణునా=విష్ణుదేవుని చేత; సంపిష్టాః=చూర్ణముగాఁ జేయఁబడిరి.

ఎవ్వరాయుద్ధమునందు, అక్షయుండును బురుషశ్రేష్ఠుండునగు విష్ణుదేవునకెదురునడచిరో, ఆరాక్షసులు, లోకనాయకుండగు నావిష్ణుదేవుని చేఁ జూర్ణముగాఁ జేయఁబడిరి అని, తాత్పర్యము.

తదా=అప్పుడు; యుద్ధే=యుద్ధమునందు; అక్షయం=నాశములేనివాఁడును; పురుషోత్తమం = పురుషశ్రేష్ఠుండునగు; విష్ణుం=విష్ణుదేవుని; అభిముఖం = ఎదురుగా; గతాః= పొందిరో, శరణుపొందిరో యనట, తే = ఆదేవతలు; ప్రభవిష్ణునా= లోకనాయకుండగు; విష్ణునా=విష్ణుదేవునిచేత; సంవిష్టాః=ఆవేశింపఁబడిరి.

ఎవ్వరాయుద్ధమునందు, అక్షయుండును బురుషోత్తముండునగు విష్ణుదేవునకెదురుగాఁ బోయిశరణుచొచ్చిరో, ఆదేవతలయందులోకనాయకుండగు నావిష్ణుదేవుండావేశించియుండెను. అని, తాత్పర్యము. "సంవిష్టాస్తే" అనుపాఠమునందిట్లర్థతాత్పర్యంబులెఱుంగునది.

అదితేరాత్మజా వీరా దితేః పుత్రాన్నిజఘ్నిరే
తస్మిన్ ఘోరే మహాయుద్ధే దైతేయాదిత్యయోర్భృశమ్. ౩౦

టీక॥ దైతేయాదిత్యయోః= అసురులయొక్కయు దేవతలయొక్కయు; భృశం=మిక్కిలియును; ఘోరం=భయంకరమయిన; తస్మిన్= ఆ; మహాయుద్ధే = గొప్పయుద్ధమునందు; వీరాః= పరాక్రమశాలులైన; అదితేః=అదితియొక్క; ఆత్మజాః=కొడుకులు; దితేః=దితియొక్క; పుత్రాన్=కొడుకులను; నిజఘ్నిరే=చంపిరి.

దైత్యులకును దేవతలకునుంగలిగిన భయంకరమైనయాగొప్పయుద్ధమునందుఁ బరాక్రమశాలులగు దేవతలు దైత్యులఁ జంపిరి. అని, తాత్పర్యము.

నిహత్య దితిపుత్రాంశ్చ రాజ్యం ప్రాప్య పురందరః
శశాస ముదితో లోకాన్ సర్షిసంఘాన్ సచారణాన్. ౩౨

టీక ॥ పురందరః=ఇంద్రుఁడు; దితిపుత్రాన్=దితికొడుకులను; నిహత్య=చంపి; రాజ్యంచ=రాజ్యమును(చకారముచే) అమృతమును; ప్రాప్య=పొంది; ముదితః= సంతసించినవాఁడై; సర్షిసంఘాన్=ఋషులసమూహముతోఁ గూడినవియును; సచారణాన్=చారణులతోఁగూడినవియునగు; లోకాన్=లోకంబులను; శశాస=శిక్షించెను, పాలించెననుట.

ఇంద్రుండు, దైత్యులం జంపి, రాజ్యంబు నమృతంబునుంబొంది, సంతుష్టుండై, మహర్షి చారణాదులతోడంగూడిన సమస్తలోకంబులంబాలించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, పంచచత్వారింశస్సర్గః.
ఇతి, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ పంచచత్వారింశసర్గటీక, ముగిసినది.

శ్రీ

షట్చత్వారింశసర్గప్రారంభః.

హతేషు తేషు పుత్రేషు దితిః పరమదుఃఖితా
మారీచం కాశ్యపం రామ భర్తార మిద మబ్రవీత్. ౧

టీక॥రామ=రాముఁడా! తేషు=ఆ; పుత్రేషు=కొడుకులు; హతేషు=చంపఁబడఁగా; దితిః=దితి; పరమదుఃఖితా = మిక్కిలియు

దుఃఖముగలదైః భర్తారం=పెనిమిటి యైన; మారీచం=మరీచికొడుకగు; కాశ్యపం = కాశ్యపమహర్షినిగూర్చి; ఇదం=దీః; అబ్రవీత్=చెప్పెను.

తనకొడుకులందఱుఁ జావఁగా నే, దితి, మిక్కిలియు దుఃఖమునొంది, మరీచికొడుకును దనపెనిమిటి యునగు కాశ్యపునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

హతపుత్రాస్మి భగవం స్తవ పుత్రై ర్మహాబలైః
శక్రహంతార మిచ్ఛామి పుత్రం దీర్ఘతపోర్జితమ్. ౨

టీక॥ భగవన్=మాహాత్మ్యము గలకాశ్యపుఁడా! తవ=నీయొక్క; మహాబలైః=అధికమైనబలముగల; పుత్రైః=కొడుకులచేత; హతపుత్రా = చంపఁబడినకొడుకులుగలదానను; అస్మి=అగుచున్నాను. శక్రహంతారం=ఇంద్రునిచంపువాఁడైన; దీర్ఘతపోర్జితం, దీర్ఘ=చాలకాలముచేయఁబడిన, తపః=తపస్సుచేత, ఊర్జితం (సంధియార్ఘ ము)=దార్ఢ్యముగల; పుత్రం=కొడుకును; ఇచ్ఛామి=కోరెదను.

భగవంతుఁడా! అధికబలము గలనీకొడుకులు నాకొడుకులనందఱఁజంపిరి; దీర్ఘకాలంబు చేయఁబడినతపంబునంజేసి, దార్ఢ్యంబుగలిగి, యింద్రునింజంపెడు, కొడుకును, బడయఁగోరెదను.

అని, తాత్పర్యము.

సాహం తప శ్చరిష్యామి గర్భం మే దాతు మర్హసి
ఈశ్వరం శక్రహంతారం త్వ మనుజ్ఞాతు మర్హసి. ౩

టీక॥ సా=అట్టి; అహం=నేను; తపః=తపస్సును; చరిష్యామి=చేసెదను. త్వం=నీవు; మే=నాకొఱకు; ఈశ్వరం= లోకనాయకుండును; శక్రహంతారం=ఇంద్రునిచంపువాఁడునగు; గర్భం = కొడుకును; దాతుం=ఇచ్చుటకు; అర్హసి=తగుదువు; అనుజ్ఞాతుం=అనుమతిం

చుటకు; అర్హసి=తగుదువు.

అట్లుహతపుత్రనగు నేను తపంబుసల్పెదను; నాకు, లోకనాయకుండునిందు)నింజంపువాఁడునగుకొడుకుఁగల్గునట్లనుగ్రహింపుము; నాకనుజ్ఞయిమ్ము. అని, దితి, కాశ్యపునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్యా స్తద్వచనం శ్రుత్వా మారీచః కాశ్యప స్తదా
ప్రత్యువాచ మహాతేజా దితిం పరమదుఃఖితామ్. ౪

టీక॥ తస్యాః = అదితియొక్క, తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; తదా = అప్పుడు; మహాతేజాః = అధికమైన ప్రభావముగలవాఁడును; మారీచః = మరీచికొడుకునగు; కాశ్యపః = కాశ్యపుఁడు, పరమదుఃఖితాం = మిక్కిలియుదుఃఖమునొందియున్న; దితిం = దితినిగూర్చి; ప్రత్యువాచ = బదులుసెప్పెను.

ఆ దితి చెప్పినమాటనువిని, యప్పుడు, మహాప్రభావుండను మరీచిపుత్రుండునగు కాశ్యపుఁడు మిక్కిలియు దుఃఖపడుచున్న దితిం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము

ఏవం భవతు భద్రం తే శుచి ర్భవ తపోధనే
జనయిష్యసి పుత్రం త్వం శక్రహంతార మాహవే. ౫

టీక॥ ఏవం = ఇట్లు; భవతు = అగుఁగాక. తపోధనే = తపస్సేధనముగాఁగలదితీ! తే = నీకు; భద్రం = మంగళము; భవతు (అధ్యాహృతము) = అగుఁగాక. శుచిః = పరిశుద్ధురాలవు; భవ = అగుము. త్వం = నీవు; ఆహవే = యుద్ధమునందు; శక్రహంతారం = ఇంద్రునిచంపువాఁడగు; పుత్రం = కొడుకును, జనయిష్యసి = పుట్టింపఁగలవు.

అట్లెయగుఁగాక; తపస్సేధనముగాఁగలదితీ! నీకుమంగళముగలుగుఁగాక; కొడుకుగలుగు నంతవరకుఁబరిశుద్ధురాలవుగనుండుము: నీకు యుద్ధమునందిందు)నింజంపునట్టికొడుకుపుట్టును. అని, తాత్పర్యము.

పూర్ణే వర్షసహస్రే తు శుచి ర్యది భవిష్యసి
పుత్రం త్రైలోక్య భర్తారం మత్త స్త్వం జనయిష్యసి. ౬

టీక॥ శుచిః= పరిశుద్ధిగలదవు గా; భవిష్యసియది=ఉందువేని;వర్షసహస్రే= సంవత్సరములయొక్క వేలు;పూర్ణేతు = నిండఁగానే;త్వం = నీవు;మత్తః=నావలన; త్రైలోక్యభర్తారం= ముల్లోకములరక్షించువాఁడైన; పుత్రం=కొడుకును; జనయిష్యసి = పుట్టింపఁగలవు.

నీవుపరిశుద్ధిగలిగి యుందువేని, వేయిసంవత్సరములు కాఁగానే, నావలననీకు, ముల్లోకంబులఁ బాలింపంజాలినపుత్రుండు పుట్టును. అని, కాశ్యపుఁడుదితికిఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజాః పాణినా సమమార్జ తామ్
సమాలభ్య తత స్స్వస్తీ త్యుక్త్వా స తపసే యయౌ. ౭

టీక॥ ఏవం=ఈప్రకారము; ఉక్త్వా=చెప్పి;మహాతేజాః=అధికమైనప్రభావముగల; సః=ఆకాశ్యపుఁడు; తాం=ఆదితిని; పాణినా=చేతిచే; సమాలభ్య=తాఁకి;సమమార్జ=ఉడవెను. తతః=అటుపిమ్మట;సః=ఆకాశ్యపుఁడు;స్వస్తి=మంగళము; భవతు (అధ్యాహృతము)=అగుఁగాక.ఇతి=అని;ఉక్త్వా=చెప్పి;తపసే = తపస్సుకొఱకు;యయౌ=పోయెను.

ఇట్లుచెప్పి,మహాప్రభావుండగు కాశ్యపుం,డాదితిని,తనహస్తముచే స్పృశించి, దేహమంతయుఁదడవి, యంత, "నీకుమంగళమగుఁగాక" యనియాశీర్వదించి,తపంబుసేయఁబోయెను.

అని, తాత్పర్యము.

గతే తస్మి న్నరశ్రేష్ఠ దితిః పరమహర్షితా
కుశప్లవన మాసాద్య తప స్తేపే సుదారుణమ్. ౮

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు రామuండా! తస్మిన్=ఆకాశ్యపుండు; గతే=పోcగా; దితిః=దితి; పరమహర్షితా= మిక్కిలియు సంతోషంబు నొందినదై; కుశప్లవనం= కుశప్లవనముఅను ప్రదేశమును; ఆసాద్య= చేరి; సుదారుణం=మిక్కిలిభయంకరంబగు; తపః=తపస్సును; తేపే= తపించెను, చేసెననుట.

పురుషశ్రేష్ఠుండ వగు రాముండా! ఆకాశ్యపుండుపోcగానే, తన కుంగోరినట్లుకొడుకుపుట్టుటకు పాయంబు దెలియుటంజేసి, చాలసంతసంబంది, కుశప్లవనంబుచేరి, భయంకరంబగుతపముచేసెను.

అని, తాత్పర్యము.

తప స్తస్యాం హి కుర్వంత్యాం పరిచర్యాం చకార హ
సహస్రాక్షో నరశ్రేష్ఠ పరయా గుణసంపదా. ౯

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు రాముండా! తస్యాం=ఆదితి, తపః=తపస్సును; కుర్వంత్యాం హి= చేయుచుండcగానే; సహస్రాక్షః = వేయికండ్లుగలదేవేంద్రుండు; పరయా=అధికమైన; గుణసంపదా= గుణములయొక్క సమృద్ధితో; పరిచర్యాం=సేవను; చకార=చేసెను. "హ" అననది పాదపూరణార్థము.

పురుషశ్రేష్ఠుండవగు రాముండా! అదితితపస్సుసేయనారంభింపcగానే, సహస్రాక్షుండగు దేవేంద్రుండు, తనగుణాతిశయముచూపుచు, నాబిడకు సేవcజేసెను.

అని, తాత్పర్యము.

అగ్నిం కుశాన్ కాష్ఠ మపః ఫలం మూలం తథైవచ
న్యవేదయ త్సహస్రాక్షో యచ్చాన్య దపి కాంక్షితమ్. ౧౦

టీక॥ సహస్రాక్షః=వేయికండ్లుగలదేవేంద్రుcడు; అగ్నిం=నిప్పును; కుశాన్=దర్భలను; కాష్ఠం=సమిధను; అపః=నీళ్లను; ఫలం=పం

డును; మూలం=దుంపను; తథైవ చ=అలాగే; అన్యత్ = ఇతరము; యత్=ఏది; కాంక్షితం=కోరఁబడెనో, తత్ (అధ్యాహృతము) చాపి=దానిని; న్యవేదయత్ =సమర్పించెను.

సహస్రాక్షుండగు దేవేంద్రుఁడు, దితికి, అగ్నిని, దర్భలను, సమిధలను, ఉదకమును, ఫలములను, కందమూలములను, మరియు నింకను ఏమికోరునో, వానినన్నింటిని, సమర్పించుచుఁ, బరిచర్యఁ జేయుచుండెను.

అని, తాత్పర్యము.

గాత్రసంవహనైశ్చైవ శ్రమాపనయనైస్తథా
శక్రస్సర్వేషు కాలేషు దితిం పరిచచార హ. ౧౧

టీక॥ శక్రః=దేవేంద్రుఁడు; గాత్రసంవహనైశ్చైవ=ఒళ్లుపట్టుటల చేతను; తథా=అట్లు; శ్రమాపనయనైః=అలసటపోఁగొట్టుటల చేతను, సర్వేషు = సమస్తములైన; కాలేషు=కాలములందును; దితిం=దితిని; పరిచచార=కొలిచెను. "హ" అనునది పాదపూరణార్థము.

దేవేంద్రుఁడు, దితికి, ఒళ్లుపట్టుచు, విసనకఱ్ఱల చే విసరియలసట దీర్చుచు సమస్తకాలంబులందును, బరిచర్య చేయుచుండెను. అని, తాత్పర్యము.

అథ వర్షసహస్రే తు దశోనే రఘునందన
దితిః పరమసంప్రీతా సహస్రాక్షమథాబ్రవీత్. ౧౨

టీక॥ రఘునందన=రాముఁడా! అథ = అటుపిమ్మట, వర్షసహస్రే=సంవత్సరములయొక్క వేయి, దశోనేతు= పదింటిచేఁదక్కువపడియుండఁగానే; అథ=అంతట; దితిః=దితి; పరమసంప్రీతా= మిక్కిలి యుసంతసించినదై; సహస్రాక్షం= వేయికండ్లుగల దేవేంద్రునిఁగూర్చి; అబ్రవీత్ =చెప్పెను.

రాముఁడా! అంత, వేయిసంవత్సరములకును బదేండ్లుకొఱంతపడియుండఁగానే, దితి, మిక్కుటముగ సంతోషంబంది, సహస్రాక్షుండగు దేవేంద్రుంజూచి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

యాచితేన సురశ్రేష్ఠ తవ పిత్రా మహాత్మనా
వరో వర్షసహస్రాంతే దత్తో మమ సుతం ప్రతి. ౧౩

టీక॥ సురశ్రేష్ఠ = దేవతాశ్రేష్ఠుఁడవైనయింద్రుఁడా! యాచితేన=అడుగఁబడిన, మహాత్మనా=అధికమైనప్రభావముగలవాఁడగు; తవ=నీయొక్క; పిత్రా=తండ్రియైన కాశ్యపునిచేత; వర్షసహస్రాంతే=సంవత్సరములయొక్క వేయింటితుదను; మమ=నాకు; సుతం ప్రతి=కొడుకుచుగూర్చి (లక్షణచే) కొడుకుగల్గుటనుగూర్చి; వరః = వరము; దత్తః=ఇయ్యఁబడినది.

దేవతలలో శ్రేష్ఠుఁడవగు దేవేంద్రుఁడా! మహాత్ముండగునీతండ్రివాచే యాచింపఁబడినవాఁడై, వేయి సంవత్సరములయిన పిదప నాకుఁగొడుకుగల్గునట్లు, వరంబొసంగెను.

అని, తాత్పర్యము.

తప శ్చరంత్యా వర్షాణి దశ వీర్య వతాం వర
అవశిష్టాని భద్రం తే భ్రాతరం ద్రక్ష్యసే తతః. ౧౪

టీక॥ వీర్యవతాం = పరాక్రమముగలవారిలో, వర=శ్రేష్ఠుఁడవైన యింద్రుఁడా! తపః=తపస్సును; చరంత్యాః=చేయుచున్న; మమ(అధ్యాహృతము)=నాకు; దశ=పది; వర్షాణి=సంవత్సరములు, అవశిష్టాని=మిగిలియున్నవి. తే = నీకు; భద్రం=మంగళము; భవతు(అధ్యాహృతము)=అగుఁగాక. తతః=ఆపైని; భ్రాతరం=తమ్ముని; ద్రక్ష్యసే=చూడఁగలవు.

పరాక్రమముగల వారలలో శ్రేష్ఠుఁడవైనయింద్రుఁడా! నేనట్లుతపస్సుసేయఁగానిప్పటికిఁబదిసంవత్సరములుమిగిలియున్నవి; నీకుమంగళమగుఁగాక; ఆపైని, తమ్మునింబాడఁగలవు.

అని, తాత్పర్యము.

త మహం త్వత్కృతే పుత్ర సమాధాస్యే జయోత్సుకమ్

త్రైలోక్య విజయం పుత్ర సహభోక్ష్యసి విజ్వరః. ౧౫

టీక॥ పుత్ర=కొడుకా! అహం=నేను; జయోత్సుకం = జయించుటయందుత్సాహముగల; తం=ఆకొడుకును; త్వత్కృతే=నీకొఱకును; సమాధాస్యే= సమాధానపఱచెదను. పుత్ర=కొడుకా! విజ్వరః=దుఃఖములేనివాఁడవై; త్రైలోక్యవిజయం = ముల్లోకంబులజయించుటను; సహ=కూడ; భోక్ష్యసి=అనుభవింపఁగలవు.

కుమారుఁడా! జయింపనుద్యమించు నా కొడుకును నీకొఱకుఁగా నేను సమాధానపఱచెదను; నీవు, దుఃఖములేక యాతనిం గూడి, ముల్లోకంబుల జయింపఁగలవు. అని, దితి, దేవేంద్రునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా దితి శ్శక్రం ప్రాప్తే మధ్యం దివాకరే
నిద్రయా పహృతా దేవీ పాదౌ కృత్వా థ శీర్షతః. ౧౬

టీక॥ దేవీ=రాణియగు; దితిః=దితి; శక్రం= దేవేంద్రునిఁగూర్చి; ఏవం=ఈప్రకారము; ఉక్త్వా=చెప్పి; అథ=అటుపిమ్మట; దివాకరే=సూర్యుఁడు; మధ్యం = ఆకాశముయొక్క, నడుమును; ప్రాప్తే=పొందఁగా; శీర్షతః=తలతట్టు; పాదౌ=అడుగులను; కృత్వా = చేసి, ఉంచియనుట; నిద్రయా=తూఁగుచేత; అపహృతా=అపహరింపఁబడినది, పరవశగాఁజేయఁబడినదనుట.

దితిదేవి, యిట్లు దేవేంద్రునకుఁ జెప్పి, పగలు రెండుజాములప్పుడు, పాన్పునఁదుఁదలతట్టుగాఁ బాదము లుంచికొని నిద్రించినది.

అని, తాత్పర్యము.

దృష్ట్వా తా మశుచిం శక్రః పాదతః కృతమూర్ధజామ్
శిరస్థానే కృతౌ పాదౌ జహాసచ ముమోదచ. ౧౭

టీక॥ శక్రః=దేవేంద్రుఁడు; అశుచిం= అపరిశుద్ధురాలును; పాద



తః=కాళ్లతట్టు; కృతమూర్ధజాం, కృత = చేయఁబడిన,ఉంచఁబడిన, మూర్ధజాం=తలవెంట్రుకలుగల్గి నదియునగు; తాం=ఆదితిని; శిరస్థానే=తలతట్టునందు; కృతౌ=ఉంచఁబడిన; పాదౌ=కాళ్లను; దృష్ట్వా=చూచి; జహాసచ=నవ్వుననవ్వెను, ముమోదచ=సంతోషింపనుసంతోషించెను.

దేవేంద్రుండు, అపరిశుద్ధురాలై, పాదములతట్టుతలవెంట్రుకలునుతలతట్టుపాదంబులను, ఉంచికొని పరుండినిద్రించుచున్నదితింజూచి. "ఈబిడ,నింతమట్టుకుధర్మంబులాడెయిప్పుడుమధ్యాహ్నమని తలంపక వ్యస్తముగాఁ బరుండినిద్రించుచున్నది" అని,నవ్వి, "నాకురంధ్రంబుదొరకినది,నాకార్యంబు సఫలంబైనది" అని,సంతోషంబునొందెను.

అని, తాత్పర్యము.

తస్యా శ్శరీరవివరం వివేశచ పురందరః
గర్భంచ సప్తధా రామ బిభేద పరమాత్మవాన్. ౧౭

టీక॥ రామ=రామచంద్రుఁడా! పరమాత్మవాన్= అధికమైనధైర్యముగల; పురందరః=దేవేంద్రుఁడు; తస్యాః= ఆదితియొక్క; శరీరవివరం=దేహరంధ్రమైనయోనిని; వివేశచ=ప్రవేశించెను. గర్భం=శిశువును; సప్తధా=ఏడుభాగములుగా; బిభేదచ=భేదించెను.

రామచంద్రుఁడా! పరమధైర్యశాలియగుదేవేంద్రుండు, ఆదితియోనిం బ్రవేశించి,గర్భంబునందున్నశిశువును,ఏడుతుంటలుగాఖండించెను.

అని, తాత్పర్యము.

భిద్యమాన స్తతో గర్భో వజ్రేణ శతపర్వణా
రురోద సుస్వరం రామ తతోదితి రబుధ్యత. ౧౮

టీక॥ రామ = రామచంద్రుఁడా! తతః=అంతట; శతపర్వణా=నూఱంచులుగల; వజ్రేణ=వజ్రముచేత; భిద్యమానః= ఖండింపఁబడుచున్న;



గర్భః=శిశువు;సుస్వరం = మంచి కంఠధ్వనిగల్గునట్లు; రురోద=ఏడ్చెను. తతః=అంతట;దితిః=దితి;అబుధ్యత=మేలుకొనెను.

రాముఁడా' ఇంద్రుండు, నూ అంచులుగలవజ్రముచే శిశువునుఖండింపఁగా, నాశిశువుమంచికంఠధ్వనితో నేడ్చెను; అంత, దితిమేలుకొనెను. అని, తాత్పర్యము.

మారుదో మారుద శ్చేతి గర్భం శక్రో భ్యభాషత
బిభేదచ మహాతేజా రుదంత మపి వాసవః. ౨౦

టీక॥ శక్రః = ఇంద్రుఁడు;గర్భం=శిశువునుగూర్చి;"మారుదః=ఏడువకుము; మారుదః=ఏడువకుము;" ఇతి=అని; అభ్యభాషతచ=పలికెను. మహాతేజాః=అధికమైనపరాక్రమముగల;వాసవః = ఇంద్రుఁడు; రుదంతమపి=ఏడ్చుచున్నదైననుశిశువును;బిభేదచ = ఖండించెను.

ఇంద్రుండు,శిశువుంజూచి, "ఏడువకుము, ఏడువకుము" అని,చెప్పెన; ఆశిశువేడ్చుచున్నను, మహాతేజుండగునింద్రుండు, దానిఖండించెను. అని,తాత్పర్యము.

నహంతవ్యో నహంతవ్య ఇత్యేవం దితి రబ్రవీత్
నిష్పపాత తత శ్శక్రో మాతు ర్వచనగౌరవాత్. ౨౧

టీక॥దితిః=దితి;"నహంతవ్యః=చంపఁబడఁగూడదు.నహంతవ్యః=చంపఁబడఁగూడదు." ఇతి= అని; ఏవం=ఇట్లు;అబ్రవీత్=చెప్పెను. తతః=అంతట;శక్రః=ఇంద్రుఁడు; మాతుః=తల్లియొక్క; వచనగౌరవాత్=మాటయందలిగొప్పతనము వలన;నిష్పపాత=బయలువెడలెను.

అప్పుడు,దితి, "చంపకుచంపకు"మనిచెప్పెను; అంత,నింద్రుండు,తల్లిమాటగౌరవించి, గర్భమునుండివెడలివచ్చెను. అని, తాత్పర్యము.

ప్రాంజలి ర్వజ్రసహితో దితిం శక్రో భ్యభాషత



టీక ॥ వజ్రసహితః=వజ్రముతోఁగూడిన; శక్రః= ఇంద్రుఁడు, ప్రాంజలిః = మంచిచేమోడ్పుగలవాఁడై; దితిం=దితినిగూర్చి; అభ్యభాషత=చెప్పెను.

వజ్రధరుండగు దేవేంద్రుండు, చేమోడ్పుగిలించి, దితింజూచి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అశుచి ర్దేవి సుప్తాసి పాదయోః కృతమూర్ధజా. ౨౨
తదంతర మహం లబ్ధ్వా శక్రహంతార మాహవే
అభిదం సప్తధా దేవి తన్మేత్వం క్షంతు మర్హసి. ౨౩

టీక॥ దేవి=తల్లీ ! అశుచిః=అపరిశుద్ధురాలవై; పాదయోః=అడుగులందు, పాదములతట్టునందనుట; కృతమూర్ధజా=ఉంచఁబడిన తలవెండ్రుకలుగలదానవై; సుప్తా=నిద్రించినదానవు; అసి=అగుచున్నావు. తత్ = కాఁబట్టి, అహం=నేను; అంతరం= అవకాశమును; లబ్ధ్వా=పొంది; ఆహవే=యుద్ధమునందు; శక్రహంతారం=ఇంద్రునిచంపువాఁడైనపుత్రుని, సప్తధా=ఏడుభాగములుగా; అభిదం=ఖండించితిని; దేవీ = తల్లీ! త్వం=నీవు; మే=నాయొక్క; తత్ =ఆకార్యమును; క్షంతుం= క్షమించుటకు; అర్హసి=తగుదువు.

తల్లీ ! నీవు, అపరిశుద్ధురాలవై, కాళ్లతట్టుతలవెండ్రుకలుంచికొనినిద్రించితివి; కావున, నాకప్పుడవకాశము గలుగుటంజేసి, యుద్ధమునందునన్ను, జంపనోపునట్టియీశిశువు నేడుతుండంబులుగా ఖండించితి; తల్లీ ! నేను జేసినదానిక్షమింపుము. అని, యింద్రుఁడు దితితోఁ జెప్పెను,

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, షట్చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.



ఇది, పరమార్థచంద్రికావ్యాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ షట్చత్వారింశసర్గటీక, ముగిసినది.

శ్రీః

## సప్తచత్వారింశసర్గప్రారంభః.

సప్తధాతు కృతే గర్భే దితిః పరమదుఃఖితా
సహస్రాక్షం దురాధర్షం వాక్యం సానునయాబ్రవీత్. ౧

టీక॥ గర్భే = శిశువు; సప్తధా = ఏడుభాగములుగా; కృతేతు = చేయఁబడఁగానే; దితిః = దితి; పరమదుఃఖితా = మిక్కిలియు దుఃఖము నొందినదై; సానునయా = ఓడంబాటుతోఁగూడినదై; దురాధర్షం = ఎదిరింపఁగూడని; సహస్రాక్షం = వేయికండ్లుగల యింద్రుని గూర్చి; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

ఇట్లేడుతుండంబులుగా గర్భంబు ఖండింపఁబడఁగానే, దితి, పరమదుఃఖంబు నొంది, యంతకుఁగొంతయూఱడిల్లి, సహస్రాక్షుండు కావున, దన్ని ంబు లేకుండఁ గార్యము చేసికొనియుండుటం జేసి యెదిరింపఁగూడని, యింద్రునింజూచి. యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

మమాపరాధాద్గర్భోయం సప్తధా విఫలీకృతః
నాపరాధోస్తి దేవేశ తవాత్ర వలసూదన. ౨

టీక॥ వలసూదన = వలుఁడను నసురుని జంపువాఁడవయిన; దేవేశ = దేవతలకుఁ బ్రభువగు దేవేంద్రుఁడా! అయం = ఈ; గర్భః = శిశువు; మమ = నాయొక్క; అపరాధాత్ = నేరమువలన; సప్తధా = ఏడుభాగములు




గా; విఫలీకృతః=వ్యర్థముగా జేయఁబడినది, ఏడుభాగములుగా ఖండింపఁబడుటచే వ్యర్థమైనదనుట. అత్ర=ఈవిషయమందు; తవ=నీయొక్క; అపరాధః=నేరము; నాస్తి=లేదు.

వలాసురునింజంపిన దేవేంద్రుఁడా! నాతప్పువలననే, యీగర్భము, ఏడుతుంటలుగాఁజేయఁబడియిట్లువ్యర్థమయినది; ఈవిషయమందునీతప్పేమియులేదు.

అని, తాత్పర్యము.

ప్రియం తు కర్తు మిచ్ఛామి మమ గర్భవిపర్యయే
మరుతాం సప్త సప్తానాం స్థానపాలా భవంత్విమే. ౩

టీక॥ గర్భవిపర్యయే= శిశువుయొక్క చెడిపోవుటవిషయమందు; మమ=నాకు; ప్రియంతు=శ్రేయస్సుమాత్రము; కర్తుం = చేయుటకు; ఇచ్ఛామి =కోరుచున్నాను. సప్త=ఏడైన; ఇమే= ఈతుంటలు; సప్తానాం=ఏడైన; మరుతాం=ఆవహప్రవహసంవహోద్వహవివహపరివహపరావహంబులనెడువాయువులకు; స్థానపాలాః=లోకములపాలించునవిగా, భవంతు=అగుఁగాక.

నాగర్భమట్లుచెడిపోయిన విషయమై, నీవునాకొక ప్రియముసేయవలెను; ఈతుండము లేదును, ఆవహప్రవహ సంవహోద్వహవివహపరివహపరావహంబులనెడు సప్తమారుతంబుల లోకపాలకులుగానయ్యెడుఁగాక.

అని, తాత్పర్యము.

వాతస్కంధా ఇమే సప్త చరంతు దివి పుత్రక
మారుతా ఇతి విఖ్యాతా దివ్యరూపా మమాత్మజాః. ౪

టీక॥ పుత్రక=కుమారుఁడా! ఇమే=ఈ; మమ=నాయొక్క; ఆత్మజాః=కొడుకులు; సప్త=ఏడుగురును; మారుతాఇతి = మారుత




ములని; విఖ్యాతాః=ప్రసిద్ధులై; దివ్యరూపాః=శ్రేష్ఠమైనరూపముగలవారలై; వాతస్కంధాః= వాయుసమూహములై; (లక్షణచే) వాయుసమూహములకధిదేవతలై; దివి=స్వర్గమునందు; చరంతు=తిరుగుదురుగాక.

కుమారుఁడా! నాకొడుకు లీవేడ్గురును, మారుతములని పిలువఁబడుచు, దివ్యరూపంబుగలిగి, వాయుస్కంధంబులకధిదేవతలై, స్వర్గంబునంజరింతురుగాక.

అని, తాత్పర్యము.

బ్రహ్మలోకం చర త్వేక ఇంద్రలోకం తథా పరః
దివి వాయు రితి ఖ్యాత స్తృతీయోపి మహాయశాః. ౫

టీక॥ ఏకః = ఒకఁడు; బ్రహ్మలోకం (సప్తమ్యర్థమందు ద్వితీయ)=బ్రహ్మదేవునిలోకమునందు; చరతు= తిరుగుఁగాక. తథా=అట్లు; అపరః=మఱియొకఁడు; ఇంద్రలోకం = (సప్తమ్యర్థమందుద్వితీయ) ఇంద్రునిలోకమునందు; చరతు (అధ్యాహృతము)= తిరుగుఁగాక. మహాయశాః= అధికమైనకీర్తిగల; తృతీయోపి=మూఁడవవాఁడును; వాయురితి=వాయువని, ఖ్యాతః=ప్రసిద్ధినొందినవాఁడై; దివి = అంతరిక్షమందు; చరతు (అధ్యాహృతము)= తిరుగుఁగాక.

ఒకఁడుబ్రహ్మలోకమందు సంచరించుఁగాక, మఱియొకండింద్రలోకమునందిరుగుచుండుఁగాక, మూఁడవవాఁడును, మహాయశుండై, వాయువనుపేర, నంతరిక్షమునందిరుగులాడుఁగాక. అని, తాత్పర్యము.

చత్వారస్తు సురశ్రేష్ఠ దిశో వై తవ శాసనాత్
సంచరిష్యంతు భద్రం తే దేవభూతా మమాత్మజాః. ౬
త్వత్కృతే నైవ నామ్నా చ మారుతా ఇతి విశ్రుతాః

టీక॥ సురశ్రేష్ఠ = దేవతాశ్రేష్ఠుండవగునింద్రుఁడా! మమ = నా



యొక్క; ఆత్మజాః=కొడుకులు; చత్వారస్తు=నల్వురును; తవ=నీయొక్క; శాసనాత్=ఆజ్ఞవలన; దేవభూతాః=దేవతలైనవారలై; త్వత్కృతేన=నీచేఁజేయఁబడిన; నామ్నా చైవ=పేరుచేతనే; మారుతాఇతి=మారుతులని; విశ్రుతాః=ప్రసిద్ధులై; దిశః=(సప్తమ్యర్థమందు ద్వితీయ) దిక్కులందు; ("వై" అనునది పాదపూరణార్థము) సంచరిష్యంతు=సంచరింపఁగలరు. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము)=అగుఁగాక.

దేవతాశ్రేష్ఠుండవగు నిందుృఁడా! నాకొడుకులుమిగిలిననల్వురును, నీయాజ్ఞంజేసి, దేవత్వమునొంది, నీవు "మారుదః మారుదః" (ఏడ్వకుమేడ్వకుము) అనిపలుకుట వలనం గలిగిన "మారుతులు" అనుపేరం బ్రసిద్ధులై, దిక్కులందు సంచరింతురు. అని, దితి, యింద్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తస్యాస్తద్వచనం శ్రుత్వా సహస్రాక్షః పురందరః. ౭
ఉవాచ ప్రాంజలి ర్వాక్యం దితిం వలనిషూదనః

టీక ॥ తస్యాః=ఆదితియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; వలనిషూదనః=వలాసురునిచంపిన; సహస్రాక్షః= వేయికండ్లుగల; పురందరః=ఇంద్రుఁడు; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై; దితిం=దితినిగూర్చి, వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

దితిచెప్పినమాటనువిని, వలాసురుంజంపిన సహస్రాక్షుండగు నింద్రుండు, చేమోడ్పుగీలించి, దితిం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సర్వమేతద్యథోక్తం తే భవిష్యతి నసంశయః. ౮
విచరిష్యంతి భద్రం తే దేవభూతా స్తవాత్మజాః

టీక ॥ ఏతత్=ఇది; సర్వం=అంతయును; యథా=ఎట్లు; ఉక్తం=



చెప్పఁబడినదో; తథా (అధ్యాహృతము) = అట్లు; తే = నీకు; భవిష్యతి = కాఁగలదు. సంశయః = సందేహము; న = లేదు. తే = నీకు; భద్రం = మంగళము; అస్తు = (అధ్యాహృతము) అగుఁగాక. తవ = నీయొక్క; ఆత్మజాః = కొడుకులు; దేవరూపాః = దేవతలైనవారలై; విచరిష్యంతి = తిరుగఁగలరు.

ఇవంతయునీవుచెప్పినట్లే నీకుజరుగఁగలదు; సందియపడకుము; నీకు మంగళముగలుగుఁగాక; నీకొడుకులందఱుదేవత్వముగలిగిసంచరింపఁగలరు. అని, యింద్రుండు దితితో ననెను.

అని, తాత్పర్యము.

ఏవం తౌ నిశ్చయం కృత్వా మాతాపుత్రౌ తపోవనే. ౯
జగ్మతుస్త్రిదివం రామ కృతార్థావితి నశ్శ్రుతమ్

టీక॥ రామ = రాముఁడా! తౌ = ఆ; మాతాపుత్రౌ = తల్లికొడుకులు; తపోవనే = తపస్సు సేయువనమునందు; ఏవం = ఇట్లు; నిశ్చయం = ఏర్పాటును; కృత్వా = చేసి; కృతార్థౌ = నెఱవేఱినపనిగలవారలై, త్రిదివం = స్వర్గమును; జగ్మతుః = పొందిరి. ఇతి = అని; నః = మాకు; శ్రుతం = వినఁబడినది.

రాముఁడా! తల్లియునుగొడుకుని ట్లుతపోవనమందు నిశ్చయించుకొని కృతార్థులై, స్వర్గమునకుఁ బోయిరి; అని, మేము వినియున్నాము.

అని, తాత్పర్యము.

ఏష దేశస్సకాకుత్స్థ మహేంద్రాధ్యుషితః పురా. ౧౦
దితిం యత్ర తపస్సిద్ధామేవం పరిచచార సః

టీక॥ కాకుత్స్థ = రాముఁడా! పురా = మునుపు; సః = ఆయింద్రుఁడు; యత్ర = ఎచ్చట; తపస్సిద్ధాం = తపస్సునందు సిద్ధిఁబొందిన; దితిం = దితిని; ఏవం = ఇట్లు; పరిచచార = సేవించెనో; సః = అట్టి; మహేంద్రాధ్యుషితః = దేవేంద్రునిచేవాసముచేయఁబడిన; దేశః = ప్రదేశము; ఏషః =

ఇది!

రాముఁడా! మునుపింద్రుండెచ్చటనుండిదపస్సిద్ధయగుదితికిఁబరిచర్య చేసెనో, ఆకుశప్లవనమెయిది; ఇప్పుడు విశాలాపురియను పేరునొందినది.

అని, తాత్పర్యము.

ఇక్ష్వాకో స్తు నరవ్యాఘ్ర పుత్రః పరమధార్మికః. ౧౧
అలంబుసాయా ముత్పన్నో విశాల ఇతి విశ్రుతః

టీక॥ నరవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఇక్ష్వాకో స్తు = ఇక్ష్వాకుమహారాజునకును; విశాలఇతి=విశాలుఁడని; విశ్రుతః= ప్రసిద్ధుఁడును; పరమధార్మికః=మిక్కిలియు ధర్మమునాచరించు వాఁడునగు; పుత్రః=కొడుకు; అలంబుసాయాం=అలంబుసయందు; ఉత్పన్నః=పుట్టెను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఇక్ష్వాకువునకు, విశాలుఁడనెడుపరమధార్మికుండగు పుత్రుండలంబుసయందుజనించెను.

అని, తాత్పర్యము.

తేన చాసీదిహ స్థానే విశాలేతి పురీకృతా. ౧౨

టీక॥ తేనచ = వానిచేతనే; ఇహ=ఈ; స్థానే=ప్రదేశమందు; విశాలేతి=విశాలయనెడు; పురీ=పట్టణము; కృతా = చేయఁబడినది; ఆసీత్=ఆయెను.

ఆవిశాలుండె యిచ్చట విశాలయనునీపట్టణమునునిర్మించెను.

అని, తాత్పర్యము.

విశాలస్య సుతో రామ హేమచంద్రో మహాబలః
సుచంద్ర ఇతి విఖ్యాతో హేమచంద్రా దనంతరః. ౧౩

టీక॥ రామ=రాముఁడా! విశాలస్య = విశాలునియొక్క; సుతః= కొడుకు; మహాబలః=అధికమైనబలముగల; హేమచంద్రః=హేమచంద్రుఁడనువాఁడు; ఆసీత్ (అధ్యాహృతము) = ఆయెను. హేమచం

ద్రాత్=హేమచంద్రునికంటె; అనంతరః=అవ్వలివాఁడు;సుచంద్రఇతి=సుచంద్రుఁడని; విఖ్యాతః=ప్రసిద్ధుఁడు;ఆసీత్(అధ్యాహృతము)=అయ్యెను.

రాముఁడా! విశాలునకుమహాబలుండగు హేమచంద్రుండుపుట్టెను; హేమచంద్రునకు సుచంద్రుండుకలిగెను.

అని, తాత్పర్యము.

సుచంద్రతనయో రామ ధూమ్రాశ్వఇతి విశ్రుతః
ధూమ్రాశ్వతనయశ్చాపి సృంజయ స్సమపద్యత. ౧౪

టీక॥ రామ = రాముఁడా! సుచంద్రతనయః = సుచంద్రునికొడుకు; ధూమ్రాశ్వఇతి=ధూమ్రాశ్వుఁడని; విశ్రుతః=ప్రసిద్ధుఁడు;ఆసీత్(అధ్యాహృతము)=ఆయెను. ధూమ్రాశ్వతనయశ్చాపి = ధూమ్రాశ్వునికొడుకును; సృంజయః=సృంజయుఁడనువాఁడు; సమపద్యత=ఆయెను.

రాముఁడా! సుచంద్రునకుధూమ్రాశ్వుండనిప్రసిద్ధుండైనకొడుకు జనించెను;ధూమ్రాశ్వునకు,సృంజయుండనువాఁడుపుట్టెను.

అని, తాత్పర్యము.

సృంజయస్య సుత శ్శ్రీమాన్ సహదేవః ప్రతాపవాన్
కుశాశ్వ స్సహదేవస్య పుత్రః పరమధార్మికః. ౧౫

టీక॥ సృంజయస్య=సృంజయునియొక్క; సుతః = కొడుకు;శ్రీమాన్=సంపదగలవాఁడును; ప్రతాపవాన్=పరాక్రమముగలవాఁడునగు; సహదేవః=సహదేవుఁడనువాఁడు; ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను. సహదేవస్య= సహదేవునియొక్క;పుత్రః = కొడుకు;పరమధార్మికః=మిక్కిలియు ధర్మమునాచరించునట్టి;కుశాశ్వః=కుశాశ్వుఁడనువాఁడు; ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

సృంజయునకు, సంపదయుఁబరాక్రమమునుంగల సహదేవుండను




కొడుకుజన్మించెను; సహదేవునకుఁ బరమధార్మికుండగుకుశాశ్వుండను వాఁడుకలిగెను.

అని, తాత్పర్యము.

కుశాశ్వస్య మహాతేజాః సోమదత్తః ప్రతాపవాన్
సోమదత్తస్య పుత్రస్తు కాకుత్స్థ ఇతి విశ్రుతః. ౧౬

టీక॥ కుశాశ్వస్య=కుశాశ్వునకు; మహాతేజాః=అధికమైనకాంతిగలవాఁడును; ప్రతాపవాన్=పరాక్రమముగలవాఁడునగు; సోమదత్తః = సోమదత్తుఁడనువాఁడు; ఆసీత్(అధ్యాహృతము)= కలిగెను. సోమదత్తస్య = సోమదత్తునియొక్క; పుత్రస్తు = కొడుకును; కాకుత్స్థ ఇతి=కాకుత్స్థుఁడని; విశ్రుతః= ప్రసిద్ధుఁడు; ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

కుశాశ్వునకు మహాతేజుండును బరాక్రమశాలియునగుసోమదత్తుండనుపుత్రుండు కల్గెను; సోమదత్తునకుఁ గాకుత్స్థుండను కుమారుఁడుజనించెను. అని, తాత్పర్యము.

తస్య పుత్రో మహాతేజా స్సంప్రత్యేష పురీ మిమామ్
ఆవస త్యమరప్రఖ్య స్సుమతిర్నామ దుర్జయః. ౧౭

టీక॥ తస్య= ఆకాకుత్స్థునియొక్క; పుత్రః = కొడుకును; మహాతేజాః= అధికమైనపరాక్రమముగలవాఁడును; అమరప్రఖ్యః=దేవతలతోటి పోల్కిగలవాఁడును; దుర్జయః=జయింపఁగూడనివాఁడునగు; ఏషః= ఈ; సుమతిర్నామ=సుమతియనువాఁడు; సంప్రతి=ఇప్పుడు; ఇమాం=ఈ; పురీం=పట్టణమును; ఆవసతి=అధిష్ఠించియున్నాఁడు.

ఆకాకుత్స్థునికొడుకు, మహాపరాక్రమశాలి, దేవసమానుండు, జయింపఁగూడనివాఁడునగుసుమతి, యిప్పు, డీ విశాలాపట్టణమందువసించుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఇక్ష్వాకోస్తు ప్రసాదేన సర్వే వైశాలికా నృపాః




దీర్ఘాయుషో మహాత్మానో వీర్యవన్తస్సుధార్మికాః. ౧౮

టీక ॥ వైశాలికాః=విశాలానగరమందుండు; నృపాః=రాజులు; సర్వేపి=అందఱును; ఇక్ష్వాకోః=ఇక్ష్వాకువుయొక్క; ప్రసాదేన=అనుగ్రహముచేత; దీర్ఘాయుషః=అధికమైనయాయుస్సుగలవారుగాను; మహాత్మానః = అధికమైనధైర్యము గలవారలుగాను; వీర్యవంతః = పరాక్రమముగలవారలుగాను; సుధార్మికాః= చక్కగాధర్మమునాచరించువారుగాను; భవంతి (అధ్యాహృతము)=అగుచున్నారు.

విశాలా నగరాధిపతులగు రాజులందఱు, ఇక్ష్వాకువు ప్రసాదంబునంజేసి, దీర్ఘాయువును ధైర్యంబునువీర్యంబునుంగల్గి, ధార్మికులై యుందురు. అని, తాత్పర్యము.

ఇహాద్య రజనీం రామ సుఖం వత్స్యామహే వయమ్
శ్వః ప్రభాతే నరశ్రేష్ఠ జనకం ద్రష్టు మర్హసి. ౧౯

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు; రామ= రాముఁడా! వయం=మనము; అద్య=ఇప్పుడు; ఇహ=ఇచ్చట; రజనీం=(అత్యంతసంయోగమందుద్వితీయ) రాత్రియంతయు; సుఖం= సుఖముగల్గునట్లుగా; వత్స్యామహే= (వత్స్యామః)వాసముసేయుదము. శ్వః=రేపు; ప్రభాతే=ప్రాతః కాలమునందు; జనకం=జనకమహారాజును, ద్రష్టుం=చూచుటకు; అర్హసి=తగుదువు.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! మనమిచ్చటనీరాత్రియంతయు సుఖముగానుండుదము; రేపుప్రాతఃకాలంబున జనకుం జూడఁబోవచ్చును. అని, విశ్వామిత్రుఁడు రామునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

సుమతిస్తు మహాతేజా విశ్వామిత్ర ముపాగతమ్
శ్రుత్వా నరవరశ్రేష్ఠః ప్రత్యుద్గచ్ఛ న్మహాయశాః. ౨౦

టీక॥ నరవరశ్రేష్ఠః=రాజశ్రేష్ఠుండును; మహాతేజాః=అధికమైన పరాక్రమముగలవాఁడును; మహాయశాః = అధికమైనకీర్తిగలవాఁడునగు; సుమతిస్తు=సుమతియును, ఉపాగతం = వచ్చినట్టి; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; శ్రుత్వా=విని; ప్రత్యుద్గచ్ఛత్ (ప్రత్యుదగచ్ఛత్) ఎదుర్కొనెను.

రాజశ్రేష్ఠుండును మహాపరాక్రమశాలియునుగొప్పకీర్తిగలవాఁడునగు సుమతి, విశ్వామిత్రమహాముని వచ్చియున్నవాఁడని విని, యెదుర్కొనెను. అని, తాత్పర్యము.

పూజాంచ పరమాం కృత్వా సోపాధ్యాయ స్సబాంధవః
ప్రాంజలిః కుశలం పృష్ట్వా విశ్వామిత్ర మథా బ్రవీత్. ౨౧

టీక॥ సుమతిః (అధ్యాహృతము)= సుమతి; సోపాధ్యాయః= ఋత్విజులతోఁ గూడినవాఁడై; సబాంధవః= బంధువులతోఁగూడినవాఁడై; పరమాం=అధికమైన; పూజాంచ=పూజను; కృత్వా=చేసి, ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై; కుశలం = క్షేమమును; పృష్ట్వా=అడిగి; అథ=అటుపిమ్మట; విశ్వామిత్రం=విశ్వామిత్రునింగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

సుమతి, ఋత్విజులను బంధువులనుంగూడిచక్కఁగాఁబూజించి, చేతులుమోడ్చి, క్షేమంబడిగి, విశ్వామిత్రుంజూచి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్యమే విషయం మునిః
సంప్రాప్తో దర్శనంచైవ నాస్తి ధన్యతరో మయా. ౨౨

టీక॥ మునిః=విశ్వామిత్రమహాముని; యస్య=ఏ; మే=నాయొక్క; విషయం=దేశమును; సంప్రాప్తః= పొందెనో; దర్శనంచైవ=చూడఁబడుటను; సంప్రాప్తః=పొందెనో; సః (అధ్యాహృతము)=అట్టినేను; ధన్యః= పుణ్యముగలవాఁడను; అస్మి = అగుచున్నాను. అనుగృహీ

తః=అనుగ్రహింపఁబడినవాఁడను. అస్మి=అగుచున్నాను. మయా=నాతో; సదృశః (అధ్యాహృతము)=సమానుఁడైన; ధన్యతరః= మిక్కిలి యుఁబుణ్యముగలవాఁడు; నాస్తి= లేడు.

విశ్వామిత్రమహాముని, నాదేశంబునకువచ్చి నాకుదర్శనమిచ్చినందున, నేనుజాలఁబుణ్యవంతుండనైతి, నాయందలియనుగ్రహంబుస్థిరమైనది; నాతోసరియగుపుణ్యవంతుం డెవ్వండునులేఁడు. అని, సుమతి, విశ్వామిత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే, సప్తచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ సప్తచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

౪౮

అష్టచత్వారింశసర్గప్రారంభః.

పృష్ట్వాతు కుశలం తత్ర పరస్పర సమాగమే
కథాం తే సుమతిర్వాక్యం వ్యాజహార మహామునిమ్. ౧

టీక॥ తత్ర=ఆ; పరస్పరసమాగమే, పరస్పర = ఒండొరులయొక్క; సమాగమె=కలియికయందు; సుమతిః= సుమతి; కుశలం=క్షేమమును; పృష్ట్వాతు=అడిగినంతనే, కథాంతే= మాటకడను; మహామునిం=విశ్వామిత్రమహామునినిగూర్చి; వాక్యం=మాటను; వ్యాజహార=చె

ప్పెను.

అట్లు, ఒండొరులు కలసినపిదప, క్షేమంబడిగి, యామాటముగిసినంతనె, సుమతి, విశ్వామిత్రమహామునితో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ. ౨
పద్మపత్ర విశాలాక్షౌ ఖడ్గతూణీ ధనుర్ధరౌ
అశ్వినావివ రూపేణ సముపస్థితయౌవనౌ. ౩
యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకా దివామరౌ
కథం పద్భ్యా మిహ ప్రాప్తౌ కిమర్థం కస్యవా మునే. ౪

టీక॥ మునే=విశ్వామిత్రమహామునీ! తే=నీకు; భద్రం=మంగళము, అస్తు (అధ్యాహృతము)=అగుగాక. దేవతుల్యపరాక్రమౌ=విష్ణుదేవునితో సమానమైన పరాక్రమముగలవారలును; గజసింహగతీ=ఏనుగువంటియు సింహమువంటియు నడకగలవారలును; వీరౌ=పరాక్రమముగలవారలును; శార్దూలవృషభోపమౌ=పెద్దపులితోను ఆఁబోతుతోను బోలికగలవారలును; పద్మపత్రవిశాలాక్షౌ= తామరపూవు రేకులవలె విశాలములైన కండ్లుగలవారలును; ఖడ్గతూణీధనుర్ధరౌ = కత్తియును అమ్ములపొదియు ధనుస్సును ధరించినవారును; రూపేణ=సౌందర్యముచేత; అశ్వినావివ(స్థితౌ)=అశ్వినీదేవతలనునట్లున్నవారును; సముపస్థితయౌవనౌ=సమీపించిన యౌవనముగలవారును; యదృచ్ఛయైవ=ఇచ్ఛచొప్పుననే; దేవలోకాత్=స్వర్గమునుండి; గాం = భూమిని; ప్రాప్తౌ = పొందిన; అమరావివ(స్థితౌ)=దేవతలనునట్లున్నవారునగు; ఇమౌ=ఈ; కుమారౌ=బాలురు; కథం=ఎట్లు; పద్భ్యాం=కాళ్లచేత ఇహ=ఇచ్చటికి; ప్రాప్తౌ=వచ్చిరి; కిమర్థం=ఏమికొఱకు; వా=లేక; కస్య(చతుర్థ్యర్థమందు షష్ఠి)=ఎవనికొఱకు; ప్రాప్తౌ=(అధ్యాహృత

ము) వచ్చిరి.

విశ్వామిత్రమహామునీ! నీకుమంగళమగుఁగాక; ఈకుమారులిద్దఱు, విష్ణుదేవునింబోని పరాక్రమంబుగలిగి, గజసింహశార్దూలవృషభంబులరీతినడుచుచు, ఖడ్గమ్మునమ్ములపొదియునుధనువునుధరియించి, తామరరేకులుంబోలె విశాలంబులగుకండ్లుగలవారలై, సౌందర్యంబున, "నశ్వినులో" యనియెన్నందగి, కొంచెము కొంచెముగా సమీపించుచున్న యౌవనంబుగలిగి, తమయిచ్చచొప్పున దేవలోకంబుననుండి భూలోకంబునకేతెంచిన 'యమరులో' యన, నొప్పుచున్నవారు, వీరలు కాలినడకచే నిచటికెట్లునడచివచ్చిరి? ఎందుకొఱ కెవ్వనినిమిత్తమువచ్చిరి? అని, తాత్పర్యము.

భూషయంతా విమం దేశం చంద్రసూర్యా వివాంబరమ్
పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగితచేష్టితైః. ౫

టీక ॥ ప్రమాణేంగితచేష్టితైః, ప్రమాణ= శరీరపుకొలతచేతను, ఇంగిత= అభిప్రాయములచేతను, చేష్టితైః=బొమముడిలోనగు వికారములచేతను; పరస్పరస్య=ఒండొరులకు; సదృశౌ=సమానులగువీరలు; అంబరం=ఆకాశమును; చంద్రసూర్యావివ= చంద్రుఁడును సూర్యుఁడునువలె; ఇమం=ఈ; దేశం=ప్రదేశమును; భూషయంతౌ= అలంకరించుచు; స్తః=(అధ్యాహృతము) ఉన్నారు.

వీరలు, దేహప్రమాణమునను ఇంగితాకారములను, ఒకరికొకరు సరివచ్చుచు, ఆకాశమును చంద్రసూర్యులుంబోలె, నీదేశమునలంకరించుచున్నారు.

అని, తాత్పర్యము.

కిమర్థంచ మునిశ్రేష్ఠ సంప్రాప్తౌ దుర్గమే పథి
వరాయుధధరౌ వీరౌ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. ౬

టీక॥ మునిశ్రేష్ఠ=మునులలో మేటియగువిశ్వామిత్రుఁడా! వరాయుధ

ధరాః=శ్రేష్ఠములైన యాయుధము లధరించినవారును, వీరౌ= పరాక్రమశాలులునగువీరలు; కిమర్థం=ఎందుకొఱకు; దుర్గమే=ప్రవేశింపఁగూడని; పథి=మార్గమునందు; సంప్రాప్తే=వచ్చిరి. తత్త్వతః=యథార్థముగా, శ్రోతుం=వినుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

మంచి యాయుధముల ధరించి పరాక్రమశాలులగువీరలు, ఎవ్వరికిని జొరరాని మార్గమున నేలవచ్చిరి; దీనినంతయు, ఉన్నదున్నట్లు వినఁగోరెదను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా యథావృత్తం న్యవేదయత్
సిద్ధాశ్రమ నివాసంచ రాక్షసానాం వధం తథా. ౭

టీక॥ తస్య=ఆసుమతియొక్క; తత్=ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; విశ్వామిత్రః (అధ్యాహృతము)=విశ్వామిత్రుఁడు; సిద్ధాశ్రమనివాసం= సిద్ధాశ్రమమందునికిని; తథా = అట్లు; రాక్షసానాం= రాక్షసులయొక్క; వధంచ=చంపుటను (చకారముచే) మిథిలకుఁబోవుచుండుటను, యథావృత్తం=జరిగినట్లు; న్యవేదయత్ =చెప్పెను.

సుమతిచెప్పినమాటవిని, విశ్వామిత్రుండు, తాను సిద్ధాశ్రమమందుండుటయు, విఘ్నము సేయవచ్చిన రాక్షసులు రామలక్ష్మణులచేఁజచ్చుటయు, మిథిలకుఁజనకు యాగముఁ జూడఁబోవుటయునిది మొదలుగా, నడచినవృత్తాంతములం జెప్పెను. అని, తాత్పర్యము.

విశ్వామిత్రవచశ్శ్రుత్వా రాజా పరమహర్షితః
అతిథీ పరమౌ ప్రాప్తౌ పుత్రౌ దశరథస్యతౌ. ౮
పూజయామాస విధివత్సత్కారార్హౌ మహాబలౌ

టీక॥ విశ్వామిత్రవచః= విశ్వామిత్రునిమాటను; శ్రుత్వా = విని; రాజా=సుమతిమహారాజు; పరమహర్షితః = మిక్కిలియుసంతో

షంబునొందినవాండ్రై; సత్కారా|హౌ=పూజకుందగినవారును;మహాబలౌ= అధికమైనబలముగలవారును;ప్రాప్తౌ=వచ్చినవారును;పరమౌ=ఉత్కృష్టులైన; అతిథీ=అతిధులునగు;తౌ= ఆ;దశరథస్య=దశరధునియొక్క; పుత్రౌ=కొడుకులైన రామలక్ష్మణులను; విధివత్=యథాశాస్త్రముగ ; పూజయామాస=పూజించెను.

విశ్వామిత్రునిమాటవిన్నిసుమతి మిగులసంతసంబంది, పూజార్హులు ను మహాబలులును శ్రేష్ఠులైనయతిధు లునగు నా దశరథ కుమారులయిన రామ లక్ష్మణులను యథాశాస్త్ర ముగంబూజించెను.

అని, తాత్పర్యము.

తతః పరమసత్కారం సుమతేః ప్రాప్య రాఘవౌ. ౯
ఉష్య తత్ర నిశా మేకాం జగ్మతు ర్మిథిలాం తతః

టీక॥ తతః = అంతట;రాఘవౌ=రామలక్ష్మణులు; సుమతేః= సుమతివలన ; పరమసత్కారం= గొప్పపూజను; ప్రాప్య=పొంది;తత్ర = ఆవిశాలాపురియందు; ఏకాం=ఒకటైన; నిశాం=(అత్యంతలుయోగమందు ద్వితీయ) రాత్రి స్సప్తమ్యర్థ;ఉష్య (ఉషిత్వా)=ఉండి;తతః=అంతట;మిధిలాం=మిథిలనుగూర్చి;జగ్మతుః=పోయిరి.

అంత, రామలక్ష్మణులు,సుమతి చేసినపరమంబగు పూజనుస్వీకరించి,యచ్చటనొక రాత్రియుండి,వేకువనులేచి, మిధిలనుగూర్చి,పోయిరి.

అని, తాత్పర్యము.

౭.౧౯
తాన్ దృష్ట్వా మునయస్సర్వే జనకస్య పురీం శుభామ్. ౧౦
సాధుసాధ్వితి శంసంతో మిధిలాం సమపూజయన్

టీక॥ మునయః=ఋషులు; సర్వే=అందఱును; తాన్=ఆరామలక్ష్మణవిశ్వామిత్రులను ; దృష్ట్వా= చూచి; సాధుసాధ్వితి=లెస్సలెస్స

యని; శంసంతః=స్తుతించుచున్నవారలై; శుభాం=మంగళకరమును; జనకస్య=జనకునియొక్క; పురీం=పట్టణమునగు; మిథిలాం=మిథిలానగరిని; సమపూజయన్=చక్కఁగాఁ బూజించిరి.

మునులందఱును.ఆరామలక్ష్మణ విశ్వామిత్రులంజూచి, "ఇట్టివారు పోవుటవలన, మిథిలానగరి యెంతో పుణ్యముచేసియుండవలయును" అని, మంగళకరంబగు జనకునిపట్టణమైన మిథిలనుకొనియాడిరి.

అని, తాత్పర్యము.

మిథిలోపవనే శూన్య మాశ్రమం దృశ్య రాఘవః. ౧౧
పురాణం నిర్జనం రమ్యం ప్రపచ్ఛ మునిపుంగవమ్

టీక॥ రాఘవః=రాముఁడు; మిథిలోపవనే= మిథిలసమీపమందుండు వనమునందు; పురాణం=పాఁతదియును; నిర్జనం = జనులు లేనిదియును; శూన్యం=పర్ణశాలమొదలగున వేమియు లేనిదియు; రమ్యం=మనోహరమునగు; ఆశ్రమం=ఆశ్రమమును; దృశ్య(దృష్ట్వా)=చూచి, మునిపుంగవం=మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుని; ప్రపచ్ఛ=అడిగెను.

రాముండు, మిథిలకుఁ జెంగటనుండు వనంబునందుఁ, బురాతనంబును జనంబులుఁ, బర్ణశాలలును లేనిదియును మనోహరమునగు, నొకయాశ్రమంబు చూచి, మునిశ్రేష్ఠుం డగు విశ్వామిత్రు, నిట్లని, యడిగెను.

అని, తాత్పర్యము.

శ్రీమదాశ్రమసంకాశం కిన్న్విదం మునివర్జితమ్. ౧౨
శ్రోతు మిచ్ఛామి భగవన్ కస్యాయం పూర్వ ఆశ్రమః

టీక॥ భగవన్=మాహాత్మ్యము గలవిశ్వామిత్రుఁడా! శ్రీమత్=కాంతిగలదియు; ఆశ్రమసంకాశం=ఆశ్రమమువలెనుండునదియు; మునివర్జితం= మునులచే విడువఁబడినదియునగు; ఇదం=ఇది; కిన్ను=ఏది? అ




యం=ఈ, పూర్వః=మునుపటి;ఆశ్రమః=ఆశ్రమము;కస్య=ఎవ్వనిది? శ్రోతుం=వినుటకు; ఇచ్ఛామి=కోరెదను.

భగవంతుఁడవైన విశ్వామిత్రుఁడా! ఇదియాశ్రమమువలెనగపడుచున్నది; ఇందుమును లెవ్వరును గానఁబడరు; ఇది యెద్ది? ఇది ప్రాచీనముగానున్నది, ఇది యెవ్వనియాశ్రమము? నేను వినఁగోరెదను. అని, రాముండడిగెను.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం వాక్యం వాక్యవిశారదః. ౧౩
ప్రత్యువాచ మహాతేజా విశ్వామిత్రో మహామునిః

టీక॥ రాఘవేణ=రామునిచేత; ఉక్తం=చెప్పఁబడిన; తత్=ఆ;వాక్యం=మాటను; శ్రుత్వా=విని;వాక్యవిశారదః= మాటలయందుఁబండితుండును;మహాతేజాః=అధికమైన ప్రభావముగలవాఁడును; మహామునిః=పూజ్యుఁడైనమునియునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

రాముండు చెప్పినమాటనువిని, మాటలు చెప్పుటయందుసమర్థుండు, మహాప్రభావుండునగు విశ్వామిత్రమహాముని, యిట్లని, బదులు చెప్పెను. అని, తాత్పర్యము.

హంత తే కథయిష్యామి శ్రుణు తత్త్వేన రాఘవ. ౧౪
యస్యేద మాశ్రమపదం శప్తం కోపా న్మహాత్మనా

టీక॥ రాఘవ = రాముఁడా! హంత=సంతోషము! ఇదం=ఈ;ఆశ్రమపదం = ఆశ్రమస్థానము;యస్య=ఎవ్వనిదో; యేన(అధ్యాహృతము)=ఏ;మహాత్మనా=పూజ్యమైన స్వభావముగలవానిచేత ; కోపాత్ =కోపమువలన; శప్తం=శపింపఁబడెనో; తం (అధ్యాహృతము)=అతని; తే=నీకు;తత్త్వేన=యాథార్థ్యముచేత ; కథయిష్యామి=చెప్పెదను.శృణు=వినుము.

రాముఁడా!(అహల్యనుదరింపఁ




జేయుఃకాలముసమీపించెనుగావున) సంతోషము! ఈయాశ్రమమెవ్వనిదోఃఎవ్వనిచేనిదికోపంబునశపింపఁబడెనో,ఆమహాపురుషునిసరిగాఁజెప్పెదను;వినుము.

అని, తాత్పర్యము.

గౌతమస్య నరశ్రేష్ఠ పూర్వ మాసీ న్మహాత్మనః. ౧౫
ఆశ్రమో దివ్యసంకాశ స్సురైరపి సుపూజితః

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! పూర్వం=మునుపు;మహాత్మనః=పూజ్యమైనస్వభావముగల,గౌతమస్య = గౌతముని యొక్క;ఆశ్రమః=ఆశ్రమమై;దివ్యసంకాశః= శ్రేష్ఠమైనదిగాఁబ్రకాశించుచు;సురైరపి=దేవతలచేతను; సుపూజితః=చక్కఁగాఁబూజింపఁబడినదై;ఆసీత్=ఉండినది.

పురుషశ్రేష్ఠుండవయిన రాముఁడా ! మునుపిది, మహాత్ముండగు గౌతమునియాశ్రమమై, నాశ్రమములలోశ్రేష్ఠమై, దేవతలచేతనుంబూజింపఁబడుచుండినది.

అని, తాత్పర్యము.

స చేహ తప ఆతిష్ఠ దహల్యాసహితః పురా. ౧౬
వర్షపూగా ననేకాంశ్చ రాజపుత్ర మహాయశః

టీక॥ మహాయశః=అధికమైన కీర్తిగలవాఁడవగు; రాజపుత్ర= రాచకొమరుఁడవయిన రాముఁడా! పురా=మున్ను; సచ=ఆగౌతముండును; అహల్యాసహితః=అహల్యతోఁగూడినవాఁడై;అనేకాన్=పెక్కులైన; వర్షపూగాంశ్చ = (అత్యంతసంయోగమందుద్వితీయ) సంవత్సరములయొక్క సమూహములను;ఇహ=ఇచ్చట; తపస్సును;ఆతిష్ఠత్=అవలంబించె

గొప్పకీర్తిగల రాజపుత్రుఁడవగు రాముఁడా మున్నాగౌతముఁడిచట,నహల్యంగూడి, పెక్కుసవత్సరంబులు,తపంబుచేసెను.

అని, తాత్పర్యము.

తస్యాం తరం విదిత్వా తు సహస్రాక్ష శ్శచీపతిః. ౧౭
మునివేషధరో హల్యా మిదం వచన మబ్రవీత్

టీక॥సహస్రాక్షః=వేయికండ్లుగలవాఁడగు; శచీపతిః= శచీదేవికిఁబెనిమిటియైనయింద్రుఁడు; తస్య= ఆగౌతమునియొక్క; అంతరం=వ్యవధానమును, లేకుండుటననుట; విదిత్వా తు=తెలిసినంతనే; మునివేషధరః= ఋషియగుగౌతమునివేషముధరించినవాఁడై; అహల్యాం=అహల్యనుగూర్చి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

సహస్రాక్షుఁడగు దేవేంద్రుండు, ఆగౌతముండు లేకుండుట నెఱింగి, గౌతమునియట్లు, వేషంబుధరించి, యహల్యంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఋతుకాలం ప్రతీక్షంతే నార్థిన స్సుసమాహితే. ౧౮
సంగమం త్వహ మిచ్ఛామి త్వయాసహ సుమధ్యమే

టీక॥సుసమాహితే=చక్కఁగా నిర్మింపఁ బడినదానా? మిక్కిలి యుసుందరివగుదానా ! యనుట; అర్థినః=భోగమును, కోరువారలు; ఋతుకాలం = ఋతుసమయమును; నప్రతీక్షంతే=ఎదురుచూడరు. సుమధ్యమే=మంచినడుముగలదానా! అహం=నేను; త్వయాసహ=నీతోడ; సంగమం=సంయోగమునుమాత్రము; ఇచ్ఛామి=కోరుచున్నాను.

బ్రహ్మదేవునిచేతఁజక్కఁగా నిర్మింపఁబడిన యతిసుందరి యగుదానా! కాముకులు, ఇచ్ఛచొప్పునంగ్రీడింతురుగాని, ఋతుకాలము నెదురుచూడరు; మంచి నడుముగల యహల్యా! నేను నీతోటిసంగమముమాత్రమే కోరుచున్నాను. (నాకునీయందుఁ బుత్రోత్పత్తియక్కఱ లేదు, కావున, ఋతుకాలము నెదురుచూడవలసినది లేదు). అని, యింద్రుండహల్యతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన. ౧౯
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్

టీక॥ రఘునందన=రాముఁడా! దుర్మేధాః= దుర్బుద్ధియగునహల్యః మునివేషం = గౌతమునియొక్క వేషమువంటివేషముగల; సహస్రాక్షం=ఇంద్రుని; విజ్ఞాయ=ఎఱింగి; దేవరాజకుతూహలాత్ =దేవతలకుఁ బ్రభువైనయింద్రునియందలికోరికవలన; మతిం=సమ్మతిని; చకార=చేసెను.

రాముఁడా! దుర్బుద్ధియగునాయహల్య, "ఇంద్రుండు గౌతమవేషముఁబూనివచ్చియున్నాఁడని యెఱింగియు" దేవతాప్రభుండగునింద్రునియందలిబహుమానంబునం జేసి, సమ్మతించెను.

అని, తాత్పర్యము.

అథాబ్రవీన్నరశ్రేష్ఠ కృతార్థేనాంతరాత్మనా. ౨౦

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అథ=క్రీడించినపిమ్మట; సా(అధ్యాహృతము) = ఆయహల్య; కృతార్థేన=నెఱవేఱినపనిగల; అంతరాత్మనా=అంతఃకరణముతో; అబ్రవీత్ =చెప్పెను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అట్లు క్రీడించినవెనుక, నాయహల్య, కృతకృత్యురాలై, యింద్రునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కృతార్థాస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్రమితః ప్రభో
ఆత్మానం మాంచ దేవేశ సర్వథా రక్ష మానద. ౨౧

టీక॥ ప్రభో=లోకనాయకుండవగు; సురశ్రేష్ఠ=దేవతాశ్రేష్ఠుండవయినయింద్రుఁడా! కృతార్థా=నెఱవేఱినపనిగలదానను; అస్మి=అగుచున్నాను. ఇతః=ఇచ్చోటనుండి; శీఘ్రం=త్వరగా; గచ్ఛ = పొమ్ము;

మానద=మానమునిచ్చునట్టి; దేవేశ=దేవతలకుఁబ్రభువైనయింద్రుఁడా! ఆత్మానం=నిన్నును; మాంచ=నన్నును; సర్వదా = ఎల్లప్పుడు; రక్ష=రక్షించుకొనుము.

లోకనాయకుండవు దేవతాశ్రేష్ఠుండవగు దేవేంద్రుఁడా! నేనుకృతార్థురాలనైతిని; నీవిచ్చటనుండిశీఘ్రముగఁబొమ్ము; నీవు దేవేశ్వరుండవు, మానమునిచ్చువాఁడవు, నిన్నునునన్నును, ఎల్లప్పుడు, రక్షించుకొనుము. అని, యహల్యయింద్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇంద్రస్తు ప్రహసన్ వాక్య మహల్యా మిద మబ్రవీత్
సుశ్రోణి పరితుష్టోఽస్మి గమిష్యామి యథాగతమ్. ౨౨

టీక॥ ఇంద్రస్తు=ఇంద్రుఁడును; ప్రహసన్=నవ్వుచు; అహల్యాం=అహల్యనుగూర్చి; "సుశ్రోణి=మంచిపిఱుందులుగలదానా! పరితుష్టః=సంతసించినవాఁడను; అస్మి=అగుచున్నాను. యథాగతం = వచ్చిన

ఉః౭ఒ మిష్యామి = పోయెదను." ఇ
మున ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఇంద్రుండును, నవ్వుచు, అహల్యంజూచి, మంచిపిఱుందులుగలసుందరివగు నహల్యా! నేనుసంతుష్టుండనైతిని; వచ్చినదారినిబోయెదను. అని, యింద్రుం డహల్యతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

రు. ఏవం సంగమ్య తు తయా నిశ్చక్రామోటజా త్తతః
స సంభ్రమా త్త్వరన్ రామ శంకితో గౌతమం ప్రతి. ౨౩

ష

టీక॥ రామ=రాముఁడా! సః=ఆయింద్రుండు; ఏవం = ఇట్లు; తయా = ఆయహల్యతో; సంగమ్యతు=క్రీడించినంతనే; తతః=అంతట; సంభ్రమాత్=భయమువలన; గౌతమంప్రతి= గౌతమునింగూర్చి;

శంకితః= సందేహముగలవాఁడై; త్వరన్=వేగిరపడుచు; ఉటజాత్= పర్ణశాలనుండి,నిశ్చక్రామ=బయలు వెడలెను.

ఇంద్రుండిట్లహల్యతోఁగ్రీడించి, యంత, భయంబున,గౌతముండువచ్చునేమోయని శంకించుచు, వేగిరముగాఁ, బర్ణశాలనుండిబయలువెడలెను. అని, తాత్పర్యము.

గౌతమం సందదర్శాథ ప్రవిశంతం మహామునిమ్
దేవదానవదుర్ధర్షం తపోబలసమన్వితమ్. ౨౮
తీర్థోదకపరిక్లిన్నం దీప్యమాన మివానలమ్
గృహీతసమిధం తత్ర సకుశం మునిపుంగవం. ౨౯

టీక॥ అథ = అటుపిమ్మట; తత్ర=ఆయాశ్రమమందు;సః(అధ్యాహృతము)=ఆయింద్రుడు; మహామునిం= పూజ్యుఁడైనమునియును; దేవదానవదుర్ధర్షం= దేవతలచేతను దానవులచేతను ఎదిరింపఁగూడనివాఁడును; తపోబల సమన్వితం= తపస్సుచేఁగలిగినబలముతోఁగూడినవాఁడును; తీర్థోదక పరిక్లిన్నం,తీర్థోదక=నదీజలముచే, పరిక్లిన్నం= తడిసినవాఁడును,స్నానము చేసినవాఁడుననుట; దీప్యమానం = మండుచున్న; అనలమివ(స్థితం)=నిప్పువలెనుండువాఁడును;గృహీతసమిధం=గ్రహింపఁబడినసమిధలుగలవాఁడును;సకుశం = దర్భలతోఁగూడినవాఁడును; మునిపుంగవం = మునిశ్రేష్ఠుండునగు;ప్రవిశంతం=ప్రవేశించుచున్న; గౌతమం= గౌతముని;సందదర్శ=చూచెను.

అంతనాయాశ్రమమందు, దేవతలకును దానవులకును ధర్షింపఁగూడనివాఁడును, తపోబలంగూడినవాఁడునగు,గౌతమముని, నదీతీర్థమందు స్నానమాడి, మండుచున్ననిప్పువోలెనొప్పుచు సమిధలునుదర్భలునుగ్రహించి, యిప్పుడు ప్రవేశింపఁగా, నతనిదేవేంద్రుండుచూచెను.

అని, తాత్పర్యము

దృష్ట్వా సురపతి స్త్రస్తో వివర్ణవదనో భవత్

టీక॥ సురపతిః=దేవేంద్రుఁడు; దృష్ట్వా=చూచి; త్రస్తః=భయపడినవాఁడై; వివర్ణవదనః=వెల్లబాటినముఖముగలవాఁడు ; అభవత్=ఆయెను.

గౌతముంజూడఁగానే, దేవేంద్రుని, మొగంబు, భయంబున, వెల్లఁబాఱెను. అని, తాత్పర్యము.

అథ దృష్ట్వా సహస్రాక్షం మునివేషధరం మునిః. ౨౬
దుర్వృత్తం వృత్తసంపన్నో రోషా ద్వచన మబ్రవీత్

టీక॥ అథ=అటుపిమ్మట; వృత్తసంపన్నః=మంచియాచారముతోఁగూడిన; మునిః=గౌతమమహాముని; మునివేషధరం = మునియొక్క వేషమును ధరించినవాఁడును; దుర్వృత్తం = దుష్టమైనయాచారముగలవాఁడునగు; సహస్రాక్షం=ఇంద్రుని; రోషాత్ = కోపమువలన; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, సదాచారసంపన్నుండగు గౌతముండు, మునివేషముధరించి దురాచారముగావించిన యింద్రునింజూచి, రుష్టుండై, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మమ రూపం సమాస్థాయ కృతవా నసి దుర్మతే. ౨౭
అకర్తవ్య మిదం తస్మా ద్విఫల స్త్వం భవిష్యసి

దుర్మతే=దుర్బుద్ధివగు దేవేంద్రుఁడా! మమ=నాయొక్క; రూపం=ఆకారమును; సమాస్థాయ=వహించి; అకర్తవ్యం=చేయఁబడరానిది; ఇదం=ఈపనిని; కృతవాన్=చేసినవాఁడవు; అసి=అగుచున్నావు. తస్మాత్=దానివలన; త్వం=నీవు; విఫలః=పోయినవృషణములుగలవాఁడవు; భవిష్యసి=కాఁగలవు.

దుర్బుద్ధీ! నారూపమునువహించి, చేయరానియీపనిని జేసితివి; కాఁబట్టి, నీవృషణములుదునిసిపడుఁ

గాక, అని, గౌతముండింద్రునితోననెను. అని, తాత్పర్యము.

గౌతమేనైవ ముక్తస్య సరోషేణ మహాత్మనా. ౨౮
పేతతు వృషణౌ భూమౌ సహస్రాక్షస్య తత్క్షణాత్

టీక॥ సరోషేణ=కోపముతోఁ గూడినవాఁడును; మహాత్మనా=అధికమైన ప్రభావముగలవాఁడునగు; గౌతమేన=గౌతముని చేత; ఏవం=ఇట్లు; ఉక్తస్య=చెప్పఁబడిన; సహస్రాక్షస్య=దేవేంద్రునియొక్క; వృషణౌ=వృషణములు; తత్క్షణాత్=ఆక్షణమువలననే; భూమౌ=నేలయందు; పేతతుః=పడినవి.

ఇట్లు, మహాత్ముండగు గౌతముండు కోపంబునం జెప్పఁగానే, దేవేంద్రునివృషణంబులాక్షణమె నేలంబడినవి. అని, తాత్పర్యము.

తథా శప్త్వా స వై శక్రమహల్యామపి శప్తవాన్. ౨౯

టీక॥ సః=ఆగౌతముండు ("వై" అనునది పాదపూరణార్థము); తథా = అట్లు; శక్రం=ఇంద్రుని; శప్త్వా = శపించి; అహల్యామపి=అహల్యనుంగూడ; శప్తవాన్=శపించెను.

ఆగౌతముండట్లు దేవేంద్రుని పించి, యహల్యనుంగూడనిట్లని శపించెను. అని, తాత్పర్యము.

ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి

టీక॥ త్వం = నీవు; ఇహ=ఈ యాశ్రమమందు; బహూని=అనేకములైన; వర్షసహస్రాణి (అత్యంతసంయోగమందుద్వితీయ)=సంవత్సరములయొక్క వేలు; నివత్స్యసి=వాసముసేయఁగలవు.

నీవీయాశ్రమమందుఁ బెక్కేండ్లు, వాసముసేయుదువు. అని, తాత్పర్యము.

వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ. ౩౦
అదృశ్యా సర్వభూతానా మాశ్రమే స్మిన్నివత్స్యసి

టీక॥అస్మిన్=ఈ; ఆశ్రమే=ఆశ్రమమందు; వాయుభక్షా=గాలినిభక్షించుదానవై; నిరాహారా=ఆహారములేనిదానవై; తప్యంతీ=తపస్సుచేయుచు; భస్మశాయినీ=భూమియందుఁబరుండుదానవై; సర్వభూతానాం=సమస్తప్రాణులకును; అదృశ్యా=కనుపడనిదానవై; నివత్స్యసి=వాసముసేయఁగలవు.

నీవీయాశ్రమమందు, వాయుభక్షణముసేయుచు, ఆహారమువిడిచి, తపంబుగావింపుచు, భస్మంబునంబరుండి, సమస్తప్రాణులకును గాన్పింపనిదానవై యుండఁగలవు.

అని, తాత్పర్యము.

యదా చైతద్వనం ఘోరం రామో దశరథాత్మజః. ౩౧
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదా పూతా భవిష్యసి

టీక॥యదాచ=ఎప్పుడును; దుర్ధర్షః=ఎదిరింపఁగూడని; దశరథాత్మజః=దశరథునికొడుకైన; రామః=రాముఁడు; ఘోరం=భయంకరమయిన; ఏతత్=ఈ; వనం=వనమునుగూర్చి; ఆగమిష్యతి=వచ్చుఁగలఁడో; తదా=అప్పుడు; పూతా=పరిశుద్ధురాలవు; భవిష్యసి=కాఁగలవు.

ఎప్పుడు, దుర్ధర్షుఁడునుదశరథునిపుత్త్రుఁడునగు రాముండుమునులెవ్వరునులేనందున భయంకరంబగునీయాశ్రమంబునకువచ్చునో; అప్పుడునీవుపరిశుద్ధవయ్యెదవు.

అని, తాత్పర్యము.

తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహవివర్జితా. ౩౨
మత్సకాశే ముదా యుక్తా స్వం వపు ర్ధారయిష్యసి




టీక॥ దుర్వృత్తే=దురాచారముగలదానా! తస్య=ఆరామునియొక్క; ఆతిథ్యేన=అతిథిసత్కారముచేత; లోభమోహవివర్జితా=లోభముచేతను మోహముచేతనువిడువఁబడినదానవై; మత్సకాశే=నాసమీపమందు; ముదా=సంతోషముతో; యుక్తా=కూడినదానవై; స్వం=నీదైన; వపుః=శరీరమును; ధారయిష్యసి=ధరింపఁగలవు.

దురాచారముగలయహల్యా! ఆరామున కతిథి సత్కారముఁజేసిదానిచే, లోభమోహంబులువీడి, నాయెదుట, సంతోషంబునమరల నీదగురూపంబు దాల్పఁగలవు. అని, గౌతముండహల్యను శపియించెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజా గౌతమో దుష్టచారిణీమ్. ౩౩
ఇమ మాశ్రమ ముత్సృజ్య సిద్ధచారణ సేవితే
హిమవ చ్ఛిఖరే పుణ్యే తప స్తేపే మహాతపాః. ౩౪

టీక ॥ మహాతపాః=అధికమైన తపస్సు గలవాఁడును; మహాతేజాః= అధికమయినప్రభావముగలవాఁడునగు; గౌతమః=గౌతముఁడు; దుష్టచారిణీం= దుష్టముగానడుచునట్టి యహల్యనుఁగూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; ఇమం=ఈ; ఆశ్రమం=ఆశ్రమమును; ఉత్సృజ్య=విడిచి; సిద్ధచారణసేవితే=సిద్ధులచేతనుజారణులచేతను సేవింపఁబడినదియును; పుణ్యే=పరిశుద్ధమునగు; హిమవచ్ఛిఖరే=హిమవత్పర్వతశిఖరమందు; తపః=తపస్సును; తేపే=తపించెను, చేసెననుట.

అధికమయినతపస్సును ప్రభావంబునుంగల గౌతముండు, దురాచారముగావించిన యహల్యనిట్లుశపించి, యీయాశ్రమంబువిడిచి సిద్ధులుచారణులు మొదలగువారిచే సేవింపఁబడినదియై పుణ్యంబైన, హిమవత్పర్వతముశిఖరమందుఁ, దపంబుగావించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,




బాలకాండే, అష్టచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండ అష్టచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

## ఏకోనపంచాశసర్గప్రారంభః.

అఫలస్తు తతశ్శక్రో దేవా నగ్నిపురోగమాన్
అబ్రవీ త్త్రస్తవదన స్సర్షిసంఘా న్ సచారణాన్. ౧

టీక॥ తతః=అంతట; అఫలః=వృషణములులేని; శక్రస్తు=ఇంద్రుండును; త్రస్తవదనః=భయముపడిన ముఖముగలవాఁడై; అగ్నిపురోగమాన్=అగ్నిదేవుఁడుముందునడచువాఁడు గాఁగలవారును; సర్షి సంఘాన్ = ఋషులసమూహముతోఁ గూడినవారును; సచారణాన్ = చారణులతోఁ గూడినవారునగు; దేవాన్=దేవతలంగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంత, దేవేంద్రుండు, తనవృషణములుపోఁగొట్టుకొని, భయంబున దైన్యంబునొందినముఖంబుతో, ఋషులను జారణులను, అగ్నిమున్నగు దేవతలనుంబూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కుర్వతా తపసో విఘ్నం గౌతమస్య మహాత్మనః
క్రోధ ముత్పాద్య హి మయా సురకార్య మిదం కృతమ్. ౨

టీక॥ మహాత్మనః=అధికప్రభావముగల; గౌతమస్య = గౌతముని




యొక్క; తపః = తపస్సునకు; విఘ్నం=అడ్డిని, క్రోధం=కోపమును; ఉత్పాద్య=పుట్టించి; కుర్వతా=చేయుచున్న, మయా = నా చేత; ఇదం=ఈ; సురకార్యం=దేవతా కార్యము; కృతంహి=చేయఁబడినది.

నేను, మహాత్ముండగు గౌతమునకుఁ, గోపము పుట్టించి, తపోవిఘ్నము చేసి, దేవతా కార్యమును జేసినవాఁడనైతిని. అని, తాత్పర్యము.

అఫలో స్మి కృత స్తేన క్రోధా త్సాచ నిరాకృతా
శాపమోక్షేణ మహతా తపో స్యాపహృతం మయా. ౩

టీక॥ తేన=ఆగౌతముని చేత; క్రోధాత్=కోపమువలన; అహం (అధ్యాహృతము)=నేను; అఫలః=వృషణములు లేనివాఁడను గా; కృతః=చేయఁబడినవాఁడను; అస్మి=అగుచున్నాను. సాచ=ఆయహల్యయును; నిరాకృతా=విడువఁబడినది. మహతా=అధికమైన; శాపమోక్షేణ=శాపము నిచ్చుట చేత; మయా=నాచేత, అస్య = ఈ గౌతముని యొక్క; తపః = తపస్సును; అపహృతం=అపహరింపఁబడినది.

ఆగౌతముండు, కోపంబున నన్ను వృషణములు లేనివానిఁగాఁ జేసి, యహల్యనుఁ బరిత్యజించెను; ఇట్లు గొప్ప శాపంబొసంగుటం జేసి, యతని తపంబు తఱుగుట వలన, నేనతని, తపస్సనపహరించిన వాఁడనైతిని.

అని, తాత్పర్యము.

తస్మా త్సురవరా స్సర్వే సర్షిసంఘా స్సచారణాః
సురసాహ్యకరం సర్వే సఫలం కర్తు మర్హథ. ౪

టీక॥ తస్మాత్=అందువలన; సర్వే=సమస్తులయిన; సురవరాః=దేవతా శ్రేష్ఠులారా! యూయం=(అధ్యాహృతము) మీరలు; సర్వే=అందఱును; సర్షిసంఘాః=ఋషుల సమూహముతోఁ గూడినవారలై; సచారణాః = చారణులతోఁ గూడినవారలై; సురసాహ్యకరం=దేవత







లకు సాహాయ్యము చేసినట్టి; మాం=(అధ్యాహృతము) నన్ను; సఫలం=వృషణములతోఁ గూడినవానిఁగా; కర్తుం=చేయుటకు; అర్హథ=తగుదురు.

అందువలన, దేవతలారా! మీ రందఱు, ఋషులను జారణులనుం గూడి, మీకు సాహాయ్యము చేసిన నాకు వృషణంబులు గల్గునట్లు, చేయవలయును. అని, ఇంద్రుండు, దేవతలతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

శతక్రతో ర్వచ శ్శ్రుత్వా దేవా స్సాగ్నిపురోగమాః
పితృదేవా నుపేత్యాహు స్సహ సర్వై ర్మరుద్గణైః. ౫

టీక॥ శతక్రతోః=నూఱుయాగములుంగల యింద్రునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; సాగ్నిపురోగమాః=ముందునడచువాఁడగు నగ్నిదేవునితోఁగూడిన; దేవాః=దేవతలు; సర్వైః=సమస్తులయిన; మరుద్గణైః సహ=వాయువుల సమూహములతోఁగూడ; పితృదేవాన్=పితృదేవతలను; ఉపేత్య=పొంది; ఆహుః (భూతార్థమందులట్)=చెప్పిరి.

ఇంద్రుండు చెప్పినమాట విని, అగ్నిముఖ్యులగు దేవతలు, సమస్తవాయువులం గూడి, పితృదేవతల యొద్దకుఁ బోయి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

అయం మేష స్సవృషణ శ్శక్రో హ్యవృషణః కృతః
మేషస్య వృషణౌ గృహ్య శక్రాయాశు ప్రయచ్ఛథ. ౬

టీక॥ అయం=ఈ; మేషః=మేక; సవృషణః=వృషణములతోఁగూడినది; శక్రః=ఇంద్రుఁడు; అవృషణః=వృషణములు లేనివాఁడుగా; కృతోహి=చేయఁబడినాఁడుగదా! మేషస్య=మేకయొక్క; వృషణౌ=వృషణములను; గృహ్య (గృహీత్వా)=తీసి; శక్రాయ=ఇంద్రునికొఱకు; ఆశు=శీఘ్రముగా; ప్రయచ్ఛథ=ఇచ్చివేయుఁడు.

మీకు యాగమందు భాగార్థముగాఁ గల్పితంబగు నీ మేషంబు, వృషణ







ములుగలవి, ఇంద్రునివృషణములు పోయినవి, కాఁబట్టి, ఈ మేషమువృషణములందీసి, త్వరగా, నింద్రునకిచ్చివేయుఁడు. అని, తాత్పర్యము.

అఫలస్తు కృతో మేషః పరాం తుష్టిం ప్రదాస్యతి
భవతాం హర్షణార్థాయ యేచ దాస్యంతి మానవాః. ౭

టీక॥ అఫలః=వృషణములులేనిదిగా; కృతః = చేయఁబడిన; మేషస్తు=మేకయును; భవతాం(అధ్యాహృతము)=మీకు; పరాం=అధికమైన; తుష్టిం = సంతోషమును; ప్రదాస్యతి=ఇచ్చును. భవతాం=మీయొక్క; హర్షణార్థాయ=సంతోషింపఁజేయుటయనెడుప్రయోజనముకొఱకు; యే=ఏ; మానవాః=మనుష్యులు; దాస్యంతి=ఇచ్చెదరో; తే(అధ్యాహృతము) చ= వారును; (పరాం = అధికమైన; తుష్టిం=సంతోషమును; ప్రదాస్యంతి=ఇత్తురు.)

ఈ మేషము, వృషణములులేనిదిగాఁజేయఁబడినను, మీకధికమైనసంతోషము సేయును; మిమ్ములసంతోషపెట్టుటకై, దీనినిచ్చువారును, మీకధికమైనసంతోషము చేసినవారలగుదురు. అని, దేవతలు, చెప్పిరి.

అని, తాత్పర్యము.

అగ్నేస్తు వచనం శ్రుత్వా పితృదేవాః సమాగతాః
ఉత్పాట్య మేషవృషణౌ సహస్రాక్షే న్యవేశయన్. ౮

టీక॥ అగ్నేః= అగ్నిదేవునియొక్క; వచనం =మాటను; శ్రుత్వా=వినినంతనె; సమాగతాః= వచ్చియున్న; పితృదేవాః=పితృదేవతలు; మేషవృషణౌ =మేషములయొక్కవృషణములను; ఉత్పాట్య=పెకలించి; సహస్రాక్షే=ఇంద్రునియందు; న్యవేశయన్=ఉంచిరి.

అగ్నిమున్నగుదేవతల మాటవిని, హవిర్భాగముగ్రహించుటకై, యాగభూమికి వచ్చియున్నపితృదేవతలు, మేషమువృషణంబులం బెఱికి, ఇంద్రునకిచ్చిరి.

అని, తాత్పర్యము.




తదాప్రభృతి కాకుత్స్థ పితృ దేవా స్సమాగతాః
అఫలాన్ భుంజతే మేషాన్ ఫలై స్తేషా మయోజయన్. ౯

టీక॥ కాకుత్స్థ= రాముఁడా! తదాప్రభృతి=అదిమొదలు;పితృదేవాః = పితృదేవతలు; సమాగతాః=వచ్చినవారలై; అఫలాన్=వృషణములులేని; మేషాన్=మేకలను;భుంజతే = తినుచున్నారు. తేషాం= వృషణములుగలవానియొక్క; ఫలైః=ఫలములతో;అయోజయన్=(వర్తమానార్థమందులఙ్) చేర్చుచున్నారు.

రాముఁడా! అదిమొదలు,పితృదేవతలు, హవిర్భాగార్థమువచ్చి, వృషణములులేనిమేషములభుజించెదరు; అయినననవియొసంగువారికివృషణములుగలమేషముల నొసంగినఫలమునిచ్చెదరు.అని, తాత్పర్యము.

ఇంద్రస్తు మేషవృషణ స్తదా ప్రభృతి రాఘవ
గౌతమస్య ప్రభావేన తపస శ్చ మహాత్మనః. ౧౦

టీక॥ రాఘవ= రాముఁడా!తదాప్రభృతి=అదిమొదలు;మహాత్మనః=పూజ్యమైనస్వభావముగల;గౌతమస్య = గౌతమునియొక్క;తపసః = తపస్సుయొక్క;ప్రభావేన చ=మహిమచేతను; ఇంద్రస్తు=ఇంద్రుండుమాత్రము; మేషవృషణః=మేకయొక్క వృషణములుగలవాఁడు; అభూత్(అధ్యాహృతము)= ఆయెను.

రాముఁడా!అదిమొదలుమహాత్ముండగుగౌతమునితపోమహిమచేత, దేవేంద్రుండుమాత్రము, మేషవృషణుండయ్యెను. అని,తాత్పర్యము.

తదాగచ్ఛ మహాతేజ ఆశ్రమం పుణ్యకర్మణః
తారయైనాం మహాభాగా మహల్యాం దేవరూపిణీమ్. ౧౧

టీక॥ మహాతేజః= అధికమైన ప్రభావముగలరాముఁడా!తత్ = అందువలన;పుణ్యకర్మణః=పరిశుద్ధములైన కార్యములుగలగౌతముని

త్రయాణా మపి లోకానాం యావ ద్రామస్య దర్శనమ్

టీక॥సా=ఆయహల్య; గౌతమ వాక్యేన = గౌతమునిమాటచేత; యావత్=ఎంతలోపల; రామస్య= రామునియొక్క; దర్శనం=చూచుట; అభవత్ (అధ్యాహృతము)= ఆమెనో; తావత్ (అధ్యాహృతము)=అంతవఱకు; త్రయాణాం= మూఁడైన; లోకానామపి=లోకములకును; దుర్నిరీక్ష్యా=చూడనలవిగానిది; బభూవహి = ఆమెనుగదా! "హ" అనునది పాదపూరణార్థము.

ఆయహల్య, గౌతమవాక్యంబున, రామదర్శనమగునంతవఱకును, ముల్లోకంబులనుండువారికి, నదృశ్యయైయుండెను. అని, తాత్పర్యము.

శాపస్యాంత ముపాగమ్య తేషాం దర్శన మాగతా. ౧౬

టీక॥ సా(అధ్యాహృతము)= ఆయహల్య; శాపస్య = శాపముయొక్క; అంతం=నాశమును; ఉపాగమ్య=పొంది; తేషాం= ఆముల్లోకంబులకును; దర్శనం=చూడఁబడుటకును, ముల్లోకంబులచేఁచూడఁబడుటననుట; ఆగతా=పొందినది.

ఇప్పుడు, శాపముతీఱినది, కాఁబట్టి, అహల్యయందఱకును గన్పడుచున్నది. అని, తాత్పర్యము.

రాఘవౌతు తత స్తస్యాః పాదౌ జగృహతు స్తదా

టీక॥ తతః=అంతట; తదా= అప్పుడు; రాఘవౌతు=రామలక్ష్మణులును; తస్యాః=ఆయహల్యయొక్క; పాదౌ=అడుగులను; జగృహతుః=గ్రహించిరి.

అంతనప్పుడు, రామలక్ష్మణు, లాయహల్య పాదములకు నమస్కరించిరి. అని, తాత్పర్యము.

స్మరంతీ గౌతమవచః ప్రతిజగ్రాహ సాచ తౌ. ౧౭

టీక॥సాచ=ఆయహల్యయును; గౌతమవచః= గౌతమునిమాటను;

స్మరంతీ=తలంచుచున్నదై; తౌ=ఆ రామలక్ష్మణులను; ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

అహల్యయును, గౌతముఁడు "రాముఁడీయాశ్రమమునకు రాఁగా నేనీవు శాపముక్తవగుదువు, మరియు, నతనికాతిథ్యమిచ్చుటంజేసి పరిశుద్ధవగుదువు" అని, తనతోఁజెప్పిన మాటనుదలంచి, రామలక్ష్మణులం, బూజించుటకై, ప్రతిగ్రహించెను.

అని, తాత్పర్యము.

పాద్య మర్ఘ్యం తథా తిథ్యం చకార సుసమాహితా
ప్రతిజగ్రాహ కాకుత్థ్సో విధిదృష్టేన కర్మణా. ౧౮

టీక॥ సా (అధ్యాహృతము)=ఆయహల్య; సుసమాహితా=మిక్కిలి మెచ్చరికగలదై; పాద్యం=పాదోదకమును; అర్ఘ్యం=పూజోదకమును; తథా=అట్లు; ఆతిథ్యం=అతిథిపూజను; చకార=చేసెను. కాకుత్థ్సః=రాముఁడు; విధిదృష్టేన=శాస్త్రమందుఁజూడఁబడిన; కర్మణా=విధిచేత; ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

అహల్య, మిక్కిలియు నెచ్చరికతోఁ, బాద్యమునర్ఘ్యము నాతిథ్యమును రామునకొసంగెను; రాముఁడును, వానిని, యథావిధిగఁ బ్రతిగ్రహించెను.

అని, తాత్పర్యము.

పుష్పవృష్టి ర్మహత్యాసీ ద్దేవదుందుభినిస్స్వనైః
గంధర్వాప్సరసాం చైవ మహా నాసీ త్సమాగమః. ౧౯

టీక॥ దేవదుందుభినిస్స్వనైః=దేవతలయొక్క భేరీధ్వనులతో; సహితా (అధ్యాహృతము)=కూడిన; మహత్=గొప్పదైన; పుష్పవృష్టిః=పూలవాన; ఆసీత్=కలిగినది. గంధర్వాప్సరసాంచైవ=గంధర్వులయొక్కయు, అప్సరలయొక్కయు; మహాన్=గొప్పదైన; సమాగమః=కలియిక (లక్షణచే) ఆటపాట; ఆసీత్=కలిగినది.




అప్పుడు, దేవతలుభేరులు వాయించిరి; పూలవానగురిసినది; గంధర్వులు నప్సరలును, ఆటపాటలు గావించిరి. అని, తాత్పర్యము.

సాధుసాధ్వితి దేవా స్తా మహల్యాం సమపూజయన్
తపోబలవిశుద్ధాంగీం గౌతమస్య వశానుగామ్. ౨౦

టీక॥ దేవాః=దేవతలు; తపోబలవిశుద్ధాంగీం= తపోబలముచేఁబరిశుద్ధమయినదేహముగలదియును; గౌతమస్య=గౌతమునియొక్క; వశానుగాం=అధీనత ననుసరించిపోవునదియునగు; తాం=ఆ అహల్యాం=అహల్యను; సాధుసాధు=లెస్సలెస్స; ఇతి=అని; సమపూజయన్=చక్కఁగాఁబూజించిరి.

దేవతలు,తపోబలంబునఁబరిశుద్ధయైగౌతమునిశాసనంబునకులోఁబడియున్న యాయహల్యంజూచి, "లెస్సలెస్స" అని,కొనియాడిరి. అని, తాత్పర్యము.

గౌతమోపి మహాతేజా అహల్యాసహిత స్సుఖీ
రామం సంపూజ్య విధివ త్తప స్తేపే మహాతపాః. ౨౧

టీక॥ మహాతపాః= అధికమైన తపస్సుగలవాఁడును,మహాతేజాః= అధికమైన ప్రభావముగలవాఁడునగు,గౌతమోపి=గౌతముండును;అహల్యాసహితః= అహల్యతోఁగూడినవాఁడై; సుఖీ=సుఖముగలవాఁడై; విధివత్=యథాశాస్త్రముగ; రామం=రాముని;సంపూజ్య=పూజించి; తపః=తపస్సును; తేపే=తపించెను, చేసెననుట.

మహాతపస్వియుమహాప్రభావుండునగుగౌతమమహామునియును, రామాగమనము విని యచ్చటికివచ్చి, యహల్యంగూడి,సుఖియై,యథావిధిని రామునింబూజించి,తపంబు గావింపుచుండెను. అని, తాత్పర్యము.

రామోపి పరమాం పూజాం గౌతమస్య మహామునేః




సకాశా ద్విధివ త్ప్రాప్య జగామ మిథిలాం తతః. ౨౨

టీక॥ రామోఽపి=రాముఁడును; మహామునేః=పూజ్యుఁడైనమునియగు; గౌతమస్య=గౌతమునియొక్క; సకాశాత్ = సమీపమునుండి; పరమాం=శ్రేష్ఠమైన; పూజాం=పూజను; విధివత్ = యథాశాస్త్రముగ; ప్రాప్య=పొంది; తతః=అంతట; మిథిలాం = మిథిలనుగూర్చి; జగామ=పోయెను.

రాముండును, గౌతమమహాముని చేసినగొప్పపూజను, యథావిధిగఁ బ్రతిగ్రహించి, యామిథిలకుఁ బోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకోనపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండైకోన చత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

పంచాశసర్గప్రారంభః.

తతః ప్రాగుత్తరాం గత్వా రామ స్సౌమిత్రిణా సహ
విశ్వామిత్రం పురస్కృత్య యజ్ఞవాట ముపాగమత్. ౧

టీక॥ రామః=రాముఁడు; సౌమిత్రిణా = లక్ష్మణునితోఁగూడ; తతః=ఆయాశ్రమమునుండి; ప్రాగుత్తరాం = ఈశానదిశనుగూర్చి; గత్వా=పొంది; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; పురస్కృత్య = ముందిడి

కొని; యజ్ఞవాటం=యాగప్రదేశమును; ఉపాగమత్=పొందెను.

రాముండు, లక్ష్మణుంగూడి, యీశానదిశనుగూర్చి, వెళ్లి, విశ్వామిత్రుముందిడుకొని, జనకునియాగశాలం బవేశించెను. అని, తాత్పర్యము.

రామస్తు మునిశార్దూల మువాచ సహలక్ష్మణః

టీక॥ రామస్తు= రాముండును; సహలక్ష్మణః=లక్ష్మణునితోంగూడినవాండై; మునిశార్దూలం=మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుం గూర్చి; ఉవాచ=చెప్పెను.

రాముండును, లక్ష్మణుండునుమునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుంజూచి, యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము

సాధ్వీ యజ్ఞసమృద్ధి హిః జనకస్య మహాత్మనః. ౨

టీక॥ మహాత్మనః=పూజ్యమైన స్వభావముగల; జనకస్య=జనకుని యొక్క; యజ్ఞసమృద్ధిః=యాగమునందలిసంభారసామగ్రి ; సాధ్వీ హి=లెస్స లెస్సయయినదిగదా!

మహాత్ముండగు జనకుని యాగసంభారసామగ్రి, చాలజక్కగానున్నది. అని, తాత్పర్యము.

బహూనీహ సహస్రాణి నానాదేశనివాసినామ్
బ్రాహ్మణానాం మహాభాగ వేదాధ్యయనశాలినామ్. ౩
ఋషివాటాశ్చ దృశ్యంతే శకటీశతసంకులాః

టీక॥ మహాభాగ= పూజ్యమైన స్వభావముగలవిశ్వామిత్రుండా! ఇహ=ఈయాగశాలయందు; నానాదేశనివాసినాం= పలుదేశంబులం దువసించువారును; వేదాధ్యయనశాలినాం= వేదముచదువుటచేం బ్రకాశించువారునగు ; బ్రాహ్మణానాం = బ్రాహ్మణులయొక్క; బహూని = అనేకములయిన; సహస్రాణి = వేలును; శకటీశతసంకులాః, శకటీశత=బండ్లయొక్కనూఱులచే, సంకులాః = ఇఱుకుగలి

గియున్నట్టి; ఋషివాటాశ్చ=ఋషులుండుస్థానములును; దృశ్యంతే=చూడఁబడుచున్నవి.

మహాభాగ్యుఁడవగు విశ్వామిత్రుఁడా! ఈయాగశాలయందు, నానాదేశవాసులును, వేదములనధ్యయనించినవారునగు బ్రాహ్మణోత్తములు, పెక్కువేలమంది, యున్నారు; లెక్కలేనిబండ్లునిలిపియుండుటంజేసి యిఱుకుగల్గియుండుఋషిస్థానములునుగనుపడుచున్నవి.

అని, తాత్పర్యము.

దేశో విధీయతాం బ్రహ్మన్ యత్ర వత్స్యామహే వయమ్. ౪

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవగువిశ్వామిత్రుఁడా! యత్ర=ఎచ్చట; వయం=మనము; వత్స్యామహే (వత్స్యామః)= వసింపఁగలమో; సః(అధ్యాహృతము)=ఆ; దేశః=స్థానము; విధీయతాం=ఏర్పఱుపఁబడుఁగాక.

బ్రాహ్మణుఁడవైనవిశ్వామిత్రుఁడా! మనమెచ్చటనివసింపవచ్చునో; అట్టిప్రదేశము నేర్పఱుచుము. అని, రామలక్ష్మణులు విశ్వామిత్రునకుఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

రామస్య వచనం శ్రుత్వా విశ్వామిత్రో మహామునిః
నివేశమకరోద్దేశే వివిక్తే సలిలాయుతే. ౫

టీక॥ రామస్య= రామునియొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; మహామునిః=పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; వివిక్తే=జనులులేనిదియును, లేక, పరిశుద్ధమగు; సలిలాయుతే= జలముతోఁగూడినదియునగు; దేశే=స్థానమందు; నివేశం=ఉనికిని; అకరోత్=చేసెను.

రాముఁడు చెప్పినదివిని, విశ్వామిత్రమహాముని, జనసమ్మర్దములేనందునఁ బరిశుద్ధమునుసమీపమందు జలముగల్గినదియునగుస్థానమందు, విడిఁదిచేసెను

అని, తాత్పర్యము.




విశ్వామిత్ర మనుప్రాప్తం శ్రుత్వా స నృపతి స్తదా
శతానందం పురస్కృత్య పురోహిత మనిందితమ్. ౬
ప్రత్యుజ్జగామ సహసా వినయేన సమన్వితః

టీక॥ సః=ఆ;నృపతిః = మనుష్యులకుఁ బ్రభువైనజనకుఁడు; తదా=అప్పుడు;అనుప్రాప్తం=వచ్చిన; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; శ్రుత్వా=విని; అనిందితం=దూఱఁబడని; పురోహితం=పురోహితుండయిన;శతానందం=శతానందుని; పురస్కృత్య = ముందిడుకొని;వినయేన = అణఁకువతో;సమన్వితః=కూడినవాఁడై; సహసా=శీఘ్రముగా; ప్రత్యుజ్జగామ=ఎదుర్కొనెను.

ఆ జనకమహారాజు, అప్పుడు,విశ్వామిత్రుండు వచ్చియున్నవాఁడనివిని, అనిందితుండును బురోహితుండునగు శతానందుముందిడికొని, వినయంబున,శీఘ్రముగా,విశ్వామిత్రునెదుర్కొనెను.

అని, తాత్పర్యము.

ఋత్విజోపి మహాత్మాన స్త్వర్ఘ్య మాదాయ సత్వరమ్. ౭
విశ్వామిత్రాయ ధర్మేణ దదు ర్మంత్ర పురస్కృతమ్

టీక॥ మహాత్మానః=పూజ్యమగుస్వభావముగల;ఋత్విజోపితు=ఋత్విజులును; అర్ఘ్యం=పూజాద్రవ్యమును; సత్వరం = వేగముగా;ఆదాయ=గ్రహించి; ధర్మేణ=ధర్మముచేత;మంత్రపురస్కృతం=మంత్రముముందిడఁబడినదిగాగలదియగునట్లు;విశ్వామిత్రాయ=విశ్వామిత్రునికొఱకు;దదుః = ఇచ్చిరి.

జనకునిఋత్విజులు మహాత్ములగువారు, వేగనుగాఁ బూజాద్రవ్యముగొనివచ్చి, ధర్మపద్ధతినిసమంత్రకంబుగా,విశ్వామిత్రునికొసంగిరి.

అని, తాత్పర్యము.

ప్రతిగృహ్యాచ తాం పూజాం జనకస్య మహాత్మనః. ౮




ప్రప్రచ్ఛ కుశలం రాజ్ఞో యజ్ఞస్యచ నిరామయమ్

టీక॥ సః(అధ్యాహృతము)=ఆ విశ్వామిత్రుఁడు; మహాత్మనః=పూజ్యమగుస్వభావముగల; జనకస్య=జనకునియొక్క; పూజాం=పూజను; ప్రతిగృహ్యాచ=స్వీకరించియు; రాజ్ఞః=జనకమహారాజుయొక్క; కుశలం=క్షేమమును; యజ్ఞస్య=యాగముయొక్క; నిరామయంచ=విఘ్నము లేకుండుటను; పప్రచ్ఛ=అడిగెను.

విశ్వామిత్రుండు, మహాత్ముండగు జనకుండు చేసినపూజం బ్రతిగ్రహించి, జనకుంజూచి, "నీవు క్షేమమా? నీయాగము నిర్విఘ్నముగ జరుగుచున్నదా?" అని, యడిగెను. అని, తాత్పర్యము.

సతాం శ్చాపి మునీన్ పృష్ట్వా సోపాధ్యాయపురోధసః. ౯
యథాన్యాయం తత స్సర్వై స్సమాగచ్ఛ త్ప్రహృష్టవత్

టీక॥ సః=ఆవిశ్వామిత్రుఁడు; సోపాధ్యాయపురోధసః=ఋత్విజులతోను పురోహితునితోనుంగూడిన; తాన్=ఆ; మునీంశ్చాపి=మునులనుంగూడ; యథాన్యాయం= వరుసదప్పక; కుశలం (అధ్యాహృతము)=క్షేమమును; పృష్ట్వా=అడిగి; తతః=అంతట; సర్వైః=అందఱితోను; ప్రహృష్టవత్=సంతోషముగల్గునట్లు; సమాగచ్ఛత్=చేరెను.

విశ్వామిత్రుండు, ఋత్విజులు పురోహితుఁడును మొదలగునాములనుంగ్రమంబునఁ గుశలంబడిగి, యంతనందఱితోఁగూడ, సంతోషంబుననుండెను. అని, తాత్పర్యము.

అధ రాజా మునిశ్రేష్ఠం కృతాంజలి రభాషత. ౧౦
ఆసనే భగవా నాస్తాం సహైభి ర్మునిపుంగవైః

టీక॥ అధ=అటుపిమ్మట; రాజా=జనకమహారాజు; కృతాంజలిః=

స ౫౦

చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై, మునిశ్రేష్ఠం= మునులలో మేటియగు విశ్వామిత్రుంగూర్చి; "భగవాన్ = మాహాత్మ్యముగల;భగవాన్(అధ్యాహృతము) = పూజ్యుండవగునీవు;ఏభిః=ఈ;మునిపుంగవైస్సహ= మునిశ్రేష్ఠులతోఁగూడ; ఆసనే=పీఁటయందు;ఆస్తాం= ఉండుఁగాక,కూర్చుండుఁగాకయనుట.ఇతి(అధ్యాహృతము)=అని; అభాషత=చెప్పెను.

అంత,జనకమహారాజు, చేతులుమొగిడ్చి,మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుం జూచి, "భగవంతుండవగునీవీమునివర్యులతోఁగూడ, నాసనంబునంగూర్చుండుము" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.



జనకస్య వచశ్శ్రుత్వా నిషసాద మహామునిః. ౧౧

టీక ॥ జనకస్య=జనకునియొక్క;వచః=మాటను; శ్రుత్వా= విని;మహామునిః=పూజ్యుఁడైన మునియగువిశ్వామిత్రుఁడు;నిషసాద; కూర్చుండెను.

జనకుండుచెప్పినదివిని,విశ్వామిత్ర మహామునికూర్చుండెను.

అని, తాత్పర్యము.

స ౫౦

పురోధా ఋత్విజశ్చైవ రాజాచ సహమంత్రిభిః

టీక॥ పురోధాః = పురోహితుండగు శతానందుండును; ఋత్విజశ్చైవ = ఋత్విజులగు ఋషులును; మంత్రిభిస్సహ = మంత్రులతోఁగూడ; రాజాచ = జనకమహారాజును; నిషేదుః (అధ్యాహృతము) = కూర్చుండిరి.

అంతఁబురోహితుండగు శతానందుండను ఋత్విజులగు మునులును, గూర్చుండిరి; మంత్రులతోజనకుండును గూర్చుండెను.

అని, తాత్పర్యము.

ఆసనేషు యథాన్యాయ ముపవిష్టాన్ సమంతతః. ౧౨
దృష్ట్వా స నృపతి స్తత్ర విశ్వామిత్ర మథా బ్రవీత్

టీక॥ అథ = అటుపిమ్మట; సః = ఆ; నృపతిః = మనుష్యులకుఁ బ్రభువైన జనకుఁడు; సమంతతః = అంతట ను; ఆసనేషు = పీఁటలయందు; యథాన్యాయం = క్రమముదప్పక; ఉపవిష్టాన్ = కూర్చుండినవారిని; దృష్ట్వా = చూచి; తత్ర = అందు; విశ్వామిత్రం = విశ్వామిత్రునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

అంత, నాజనకుండు, ఆసనంబులఁ గ్రమంబుగాఁ గూర్చుండిన మునుల నందఱిం గని, యందు, విశ్వామిత్రుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అద్య యజ్ఞసమృద్ధి ర్మే సఫలా దైవతైః కృతా. ౧౩
అద్య యజ్ఞఫలం ప్రాప్తం భగవద్దర్శనా న్మయా

టీక॥ మే = నాయొక్క; యజ్ఞసమృద్ధిః = యాగములయొక్క సమగ్రముగానుండుట; అద్య = ఇప్పుడు; దైవతైః = దేవతలచేత; సఫలా = ఫలముతోఁగూడినదిగా; కృతా = చేయఁబడినది. అద్య = ఇప్పుడు; మయా = నాచేత; భగవద్దర్శనాత్ = మాహాత్మ్యముగలనీయొక్క చూచు

టవలన; యజ్ఞఫలం=యాగఫలము; ప్రాప్తం=పొందఁబడినది.

నేనుసమగ్రముగాఁ జేసినయాగములఫలం, బిప్పుడు, దేవతలునాకొసంగిరి; ఇప్పుడు, నేనుభగవంతుడగునిన్నుఁజూచుటవలనయాగఫలంబు, నొందితి.

అని, తాత్పర్యము.

ధన్యోస్మ్య నుగృహీతోస్మి యస్య మే మునిపుంగవ. ౧౪
యజ్ఞోపసదనం బ్రహ్మన్ ప్రాప్తోసి మునిభిస్సహ

టీక॥ మునిపుంగవ= మునిశ్రేష్ఠుండవయిన; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవగు విశ్వామిత్రుఁడా! యస్య=ఏ; మే=నాయొక్క; యజ్ఞోపసదనం=యాగశాలనుగూర్చి; మునిభిస్సహ = మునులతోఁగూడ; ప్రాప్తః=వచ్చినవాఁడవు; అసి=అగుచున్నావో; సః(అధ్యాహృతము)=అట్టి; అహం(అధ్యాహృతము)=నేను; ధన్యః = పుణ్యవంతుండను; అస్మి = అగుచున్నాను. అనుగృహీతః = అనుగ్రహింపఁబడినవాఁడను; అస్మి=అగుచున్నాను.

ముని శ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! నీవు, మునులతోఁగూడ, నాయాగశాలకువచ్చుటంజేసి, నేను బుణ్యవంతుండనైతిని; నాయందలియనుగ్రహంబు దెల్లంబయినది.

అని, తాత్పర్యము.

ద్వాదశాహంతు బ్రహ్మర్షే శేషమాహు ర్మనీషిణః. ౧౫
తతో భాగార్థినో దేవాన్ ద్రష్టు మర్హసి కౌశిక

టీక॥ బ్రహ్మర్షే= బ్రాహ్మణుండవుబుుషివైన; కౌశిక=విశ్వామిత్రుఁడా! మనీషిణః=పండితులు; ద్వాదశాహంతు= పండ్రెండుదినములుమాత్రము; శేషం=మిగిలినదానిఁగా; ఆహుః=చెప్పుచున్నారు తతః=అటుపైని; భాగార్థినః=హవిర్భాగమునుగోరిన; దేవాన్=దేవతలను; ద్రష్టుం= చూచుటకు; అర్హసి=తగుదువు.

బ్రహ్మర్షివగు విశ్వామిత్రుఁడా! ఇంకం బండ్రెండు దినములె యాగపూర్తికి మిగిలినవని పండితులు చెప్పుచున్నారు; నీవంతవఱకుండియా పైనిహవిర్భాగమునుగోరివచ్చిన దేవతలంజూడవలయును. అని, విశ్వామిత్రునకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా మునిశార్దూలం ప్రహృష్టవదన స్తదా. ౧౬
పున స్తం పరిపప్రచ్ఛ ప్రాంజలిః ప్రణతో నృపః

టీక॥ నృపః=మనుష్యులం బాలించునట్టిజనకుండు; మునిశార్దూలం=మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రునింగూర్చి; ఇతి=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; తదా=అప్పుడు; ప్రహృష్టవదనః=సంతసించిన ముఖము గలవాఁడై; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై; ప్రణతః= నమస్కరించినవాఁడై; పునః=మరల; తం=ఆవిశ్వామిత్రుని; పరిపప్రచ్ఛ=అడిగెను.

జనకుండట్లు, మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుతోఁ జెప్పి, సంతోషంబునొంది, చేతులుమొగిడ్చి, నమస్కరించి, మరలనావిశ్వామిత్రునింజూచి, యిట్లని, యడిగెను.

అని, తాత్పర్యము.

ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ. ౧౭
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ
పద్మపత్రవిశాలాక్షౌ ఖడ్గతూణీధనుర్ధరౌ. ౧౮
అశ్వినా వివ రూపేణ సముపస్థితయౌవనౌ
యదృచ్ఛ యైవ గాం ప్రాప్తౌ దేవలోకా దివామరౌ. ౧౯
కథంపద్భ్యా మిహప్రాప్తౌ కిమర్థం కస్యవా మునే

టీక॥ మునే=విశ్వామిత్రమహామునీ! తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము) = అగుఁగాక. దేవతుల్యపరాక్రమౌ=విష్ణుదేవునితోసమానమయినపరాక్రమముగలవారలును; గజసింహగ

టీ॥=ఏనుఁగువంటియు సింహమువంటియు నడకగలవారలును; వీరౌ=పరాక్రమముగలవారలును; శార్దూలవృషభోపమౌ= పెద్దపులితోను ఆఁబోతుతోను బోలికగల వారలును; పద్మపత్రవిశాలాక్షౌ=తామరపూరేకులువలెవిశాలములైనకండ్లు గలవారలును; ఖడ్గతూణీధనుర్ధరౌ=కత్తియును అమ్ములపొదియు ధనుస్సునుధరించినవారలును; రూపేణ=సౌందర్యముచే; అశ్వినావివ(స్థితౌ)= అశ్వినీదేవతలవలెనున్నవారలును; సముపస్థితయౌవనౌ=సమీపించిన యౌవనము గలవారలును; యదృచ్ఛయైవ=ఇచ్ఛచొప్పుననే; దేవలోకాత్= స్వర్గమునుండి; గాం=భూమిని; ప్రాప్తౌ=పొందిన; అమరావివ(స్థితౌ)=దేవతలనునట్లున్నవారునగు; ఇమౌ=ఈ; కుమారౌ=బాలురు; కథం=ఎట్లు; పద్భ్యాం=కాళ్లచేత; ఇహ=ఇచ్చటికి; ప్రాప్తౌ=వచ్చిరి? కిమర్థం=ఎందుకొఱకు; వా=లేక; కస్య = (చతుర్థ్యర్థమందుషష్ఠి)ఎవనికొఱకు; ప్రాప్తౌ (అధ్యాహృతిము)=వచ్చిరి?

విశ్వామిత్రమహామునీ! నికుమంగళముగలుగుఁగాక; ఈకుమారులిద్దఱు, విష్ణుదేవునింబోని పరాక్రమంబుగలిగి, గజసింహశార్దూలవృషభంబులరీతినడుచుచు, ఖడ్గమ్మునమ్ములపొదియుధనువునుధరియించి, తామరరేకులంబోలెవిశాలంబులగుకండ్లుగలవారలై, సౌందర్యంబున "సశ్వినులో"యని యెన్నందగి, కొంచెము కొంచెముగా సమీపించుచున్న యౌవనంబునుగలిగి, తమయిచ్ఛచొప్పున దేవలోకంబునుండి భూలోకంబునకేతెంచిన "యమరులో" యన నొప్పుచున్నవారు; వీరలుకాలినడకచేనిచటికెట్లునడచివచ్చిరి? ఎందుకొఱకెవ్వనినిమిత్తమువచ్చిరి?

అని, తాత్పర్యము.

వరాయుధధరౌ వీరౌ కస్య పుత్రౌ మహామునే. ౨౦

టీక॥ మహామునే=పూజ్యుఁడైన మునివగు విశ్వామిత్రుఁడా! వరాయుధధరౌ = శ్రేష్ఠములయినయాయుధములధరించినవారును; వీరౌ=

పరాక్రమముగలవారునగు;ఇమౌ (అధ్యాహృతము)=ఈబాలురు;కస్య=ఎవ్వనియొక్క-;పుత్రౌ = కొడుకులు?

విశ్వామిత్ర మహామునీ! వీరలు శ్రేష్ఠములగు నాయుధములధరించి పరాక్రమశాలులై యున్నవారు; వీరలెవ్వనికొడుకులు?

అని, తాత్పర్యము.

భూషయంతా విమం దేశం చంద్రసూర్యా వివాంబరమ్
పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగితచేష్టితైః. ౨౧
కాకపక్షధరౌ వీరౌ శ్రోతు మిచ్ఛామి తత్త్వతః

టీక ॥ ప్రమాణేంగితచేష్టితైః, ప్రమాణ= దేహపుకొలతచేతను, ఇంగిత = అభిప్రాయములచేతను; చేష్టితైః= బొమముడిలోనగువికారములచేతను; పరస్పరస్య=ఒండొరులకు;సదృశౌ = సమానులయినవారును; కాకపక్షధరౌ=పిల్లజుట్టుధరించినవారలును; వీరౌ=పరాక్రమశాలులునగు; ఇమౌ(అధ్యాహృతము)=వీరలు;అంబరం = ఆకాశమును;చంద్రసూర్యావివ = చంద్రుఁడును సూర్యుఁడునువలె ; ఇమం=ఈ; దేశం=స్థానమును;భూషయంతౌ = అలంకరించుచు;స్తః (అధ్యాహృతము)=ఉన్నారు. తత్త్వతః = యథార్థముగా;శ్రోతుం = వినుటకు;ఇచ్ఛామి=కోరుచున్నాను.

వీరలు, దేహప్రమాణమునను, ఇంగితాకారములను ఒకరికొకరుసరివచ్చుచు, పిల్లజుట్టుగలిగి,పరాక్రమశాలులై,యాకాశంబును జంద్రసూర్యులుంబోలె, నీయాగశాలనలంకరించుచున్నారు; కావునవీరివృత్తాంతమును, ఉన్నదున్నట్టు,వినఁగోరెదను. అని,జనకుండువిశ్వామిత్రునడిగెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా జనకస్య మహాత్మనః. ౨౨

న్యవేదయ న్మహాత్మానౌ పుత్రౌ దశరథస్య తౌ

టీక॥ మహాత్మనః=పూజ్యమైన స్వభావముగల; తస్య = ఆ; జనకస్య=జనకునియొక్క; తత్ =ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; సః (అధ్యాహృతము) = ఆవిశ్వామిత్రుఁడు; తౌ=ఆరామలక్ష్మణులను; మహాత్మానౌ= అధికమైనప్రభావముగలవారలను గాను; దశరథస్య= దశరథునియొక్క; పుత్రౌ=కొడుకులనుగాను; న్యవేదయత్ = తెలిపెను.

విశ్వామిత్రుండు, మహాత్ముండగుజనకమహారాజుమాటవిని; "వీరలు, మహాత్ములు, దశరథమహారాజు కొడుకులు" అని రామలక్ష్మణుల, నతనికిఁ, జెప్పెను.

అని, తాత్పర్యము.

సిద్ధాశ్రమనివాసంచ రాక్షసానాం వధం తథా. ౨౩
తచ్చాగమన మవ్యగ్రం విశాలాయాశ్చ దర్శనమ్
అహల్యాదర్శనం చైవ గౌతమేన సమాగమమ్. ౨౪
మహాధనుషి జిజ్ఞాసాం కర్తు మాగమనం తథా
ఏతత్సర్వం మహాతేజా జనకాయ మహాత్మనే. ౨౫
నివేద్య విరరామా థ విశ్వామిత్రో మహామునిః

టీక॥ మహాతేజాః=అధికమైన ప్రభావముగలవాఁడును; మహాముని=పూజ్యుఁడైనమునియైనగు; విశ్వామిత్రః= విశ్వామిత్రుండు; సిద్ధాశ్రమనివాసంచ = సిద్ధాశ్రమమందుండుటను; తథా=అట్లు; రాక్షసానాం=రక్కసులయొక్క; వధం=చంపుటను; అవ్యగ్రం=నిర్భయముగ; తత్ =ఆ; ఆగమనంచ=వచ్చుటను; విశాలాయాః=విశాలానగరియొక్క; దర్శనంచ=చూచుటను; అహల్యాదర్శనంచైవ=అహల్యనుచూచుటను; గౌతమేన=గౌతమునితోఁ; సమాగమం = చేరుటను; తథా=అట్లు; మహాధనుషి=గొప్పవిల్లునందు; జిజ్ఞాసాం=తెలియఁగోరు

టను, పరీక్షననుట; కర్తుం=చేయు టకు; ఆగమనం = వచ్చుటను; ఏతత్=దీని; సర్వం=అంతను; మహాత్మనే=పూజ్యమైనస్వభావముగల; జనకాయ = జనకునికొఱకు; నివేద్య=తెలిపి; అథ = ఆపైని; విరరామ=ఊరకుండెను.

మహాప్రభావుండగు విశ్వామిత్రమహాముని, రామలక్ష్మణులు, తనతో, సిద్ధాశ్రమమునకువచ్చుటయు, వచ్చుటరాక్షసులంజంపుటయు, రాక్షసులు వ్యాపించియుండు నరణ్యమార్గంబుననిర్భయంబుగ వచ్చుటయు, విశాలానగరింజూచుటయు, అహల్యనుజూచుటయు, గౌతమునిం గనుంగొనుటయు, జనకునింటనుండు శివధనుస్సెంతటిదో, పరీక్షింప, మిధిలకే తెంచుటయు, నీవృత్తాంతమంతయు, సవిస్తరంబుగా, మహాత్ముండగుజనకునకుం జెప్పి, యంత, నూరకుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే, పంచాశస్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండపంచాశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

ఏకపంచాశసర్గప్రారంభః.

తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రస్య ధీమతః
హృష్టరోమా మహాతేజా శ్శతానందో మహాతపాః. ౧
గౌతమస్య సుతో జ్యేష్ఠ స్తపసా ద్యోతితప్రభః

రామ సందర్శనా దేవ పరం విస్మయ మాగతః. ౨

టీక॥ ధీమతః=బుద్ధిమంతుండగు; తస్య=ఆ; విశ్వామిత్రస్య=విశ్వామిత్రుని యొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; గౌతమస్య=గౌతమునియొక్క; జ్యేష్ఠః=పెద్దవాఁడైన; సుతః=కొడుకును; తపసా = తపస్సుచేత; ద్యోతితప్రభః= ప్రకాశింపఁజేయఁబడినకాంతిగలవాఁడును, అధికముగాఁజేయఁబడినకాంతిగలవాఁడునుననుట; మహాతేజాః=అధికమైనప్రభావముగలవాఁడును; మహాతపాః=అధికమైనతపస్సుగలవాఁడునగు; శతానందః = శతానందుఁడు; హృష్టరోమా = గగురుపాటునొందినవెండ్రుకలుగలవాఁడై; రామసందర్శనా దేవ=రాముని చూచుటవలననే; పరం=అధికమైన; విస్మయం=ఆశ్చర్యమును; ఆగతః=పొందెను.

బుద్ధిమంతుండగు విశ్వామిత్రుఁడు చెప్పినదివిని, గౌతముని జ్యేష్ఠకుమారుండును తపంబున రెట్టించిన దేహకాంతిగలవాఁడును మహాప్రభావుండును అధికమైన తపంబును గలవాఁడునగు శతానందుండు, గగుర్పాటునొంది యతిమానుషుండగు రామునింజూచినమాత్రనే మిక్కిలియు నాశ్చర్యంబునొందెను అని తాత్పర్యము

స తౌ నిషణ్ణౌ సంప్రేక్ష్య సుఖాసీనౌ నృపాత్మజౌ
శతానందో మునిశ్రేష్ఠం విశ్వామిత్ర మథా బ్రవీత్. ౩

టీక ॥ సః=ఆ; శతానందః= శతానందుఁడు; నిషణ్ణౌ = కూర్చుండినవారును; సుఖాసీనౌ = సుఖముగునట్లు కూర్చుండిన వారును; తౌ = ఆ; నృపాత్మజౌ = రాచకొమరులయిన రామలక్ష్మణులను; సంప్రేక్ష్య=చూచి; అథ=అటుపైని, మునిశ్రేష్ఠం=మునులలో మేటియగు విశ్వామిత్రుఁగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

ఆశతానందుండు, సుఖంబుగాఁ గూర్చుండియున్న రాచకొమరులగు రామలక్ష్మణులంజూచి, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుతో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అపి తే మునిశార్దూల మమ మాతా యశస్వినీ
దర్శితా రాజపుత్రాయ తపో దీర్ఘ ముపాగతా. ౪

టీక॥ మునిశార్దూల=మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుఁడా! దీర్ఘం=అధికమైన; తపః=తపస్సును; ఉపాగతా=పొందినదియు; యశస్వినీ=ప్రశస్తమగుకీర్తిఁగలదియునగు; మమ=నాయొక్క; మాతా= తల్లి; తే= (తృతీయార్థమందుషష్ఠి) నీచేత; రాజపుత్రాయ=రాచకొమరుండగు రామునికొఱకు; దర్శితా అపి=చూపింపఁబడెనా?

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! నీవు, దీర్ఘతపస్సుచేసినదియు, యశస్వినియునగు నాతల్లియైనయహల్యను, రామునకుఁ జూపితివా?

అని, తాత్పర్యము.

అపి రామే మహాతేజా మమ మాతా యశస్వినీ
వన్యై రుపాహర త్పూజాం పూజార్హే సర్వదేహినామ్. ౫

టీక॥ మహాతేజాః= అధికమైనప్రభావము గలదియును; యశస్వినీ=కీర్తిఁగలదియునగు; మమ=నాయొక్క; మాతా = తల్లి; సర్వదేహినాం = సమస్తప్రాణులకును; పూజార్హే= పూజింపయోగ్యుఁడైన; రామే=రామునివిషయమందు; వన్యైః=వనమునందుఁబుట్టినపదార్థములచేత, పూజాం=పూజను; ఉపాహరదపి=చేసెనా?

మహాప్రభావయును యశస్వినియునగు, నాతల్లియైనయహల్య, సమస్తప్రాణులకునుబూజనీయుండైన రామునకు, వనంబునఁగల ద్రవ్యంబులచేఁ, బూజచేసెనా?

అని, తాత్పర్యము.

అపి రామాయ కథితం యథా వృత్తం పురాతనమ్
మమ మాతు ర్మహాతేజో దైవేన దురనుష్ఠితమ్. ౬

టీక॥ మహాతేజః=అధికమైనప్రభావముగల విశ్వామిత్రుఁడా! మమ=నాయొక్క; మాతుః=తల్లికి; దైవేన=విధిచేత; దురనుష్ఠితం=చెడ్డగాఁజేయఁబడిన; పురాతనం=మునుపటిది; యథావృత్తం=జరిగినట్టుగా; రామాయ=రామునికొఱకు; కథితమపి=చెప్పఁబడినదా?

అధికమైనప్రభావముగలవిశ్వామిత్రుఁడా! మాతల్లికివిధిబలంబున సంభవించినమునుపటికీడు, జరిగినది జరిగినట్టుగా రామునకుఁజెప్పితివా?

అని, తాత్పర్యము.

అపి కౌశిక భద్రం తే గురుణా మమ సంగతా
మమ మాతా మునిశ్రేష్ఠ రామసందర్శనాదితః. ౭

టీక॥ మునిశ్రేష్ఠ= మునులలోమేటివగు; కౌశిక = విశ్వామిత్రుఁడా! తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. మమ=నాయొక్క; మాతా=తల్లి; రామసందర్శనాదితః=రామునిచూచుట మొదలగుదానివలన; మమ=నాయొక్క; గురుణా=తండ్రితో; సంగతా అపి=చేరినదా?

మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! నీకుమంగళము గలుగుఁగాక; రామునిం జూచుట అతనికాతిథ్యంబొసంగుటమీనిచేత, మాతల్లియగునహల్య, నాతండ్రియైన గౌతమునింగూడినదా?

అని, తాత్పర్యము.

అపి మే గురుణా రామః పూజితః కుశికాత్మజ
ఇహాగతో మహాతేజాః పూజాం ప్రాప్తో మహాత్మనః. ౮

టీక॥ కుశికాత్మజ = విశ్వామిత్రుఁడా! మే = నాయొక్క; గురుణా=తండ్రిచేత; రామః=రాముఁడు; పూజితః అపి=పూజింపఁబడినాఁడా? ఇహ=ఇచ్చటికి; ఆగతః=వచ్చిన; మహాతేజాః=అధికమైనప్రభా

వముగలనాతండ్రి; మహాత్మనః= పూజ్యమైన స్వభావముగలరాముని వలన;పూజాం=పూజను; ప్రాప్తః (అపి)=పొందినాఁడా?

విశ్వామిత్రుఁడా? నాతఁడ్రియైన గౌతముండు రామునింబూజించెనా? మహాత్ముండగు నీరాముండు, హిమవత్పర్వతమునుండి, యిచ్చటికి వచ్చినగౌతమునిం, బూజించినాఁడా? అని, తాత్పర్యము.

అపి శాంతేన మనసా గురు ర్మే కుశికాత్మజ
ఇహా౽గతేన రామేణ ప్రయతేనా భివాదితః. ౯

టీక॥కుశికాత్మజ = విశ్వామిత్రుఁడా! ఇహ=ఇచ్చటికి; ఆగతేన=వచ్చిన; ప్రయతేన=పరిశుద్ధుఁడగు; రామేణ=రామునిచేత; శాంతేన = కామక్రోధములులేని;మనసా=మనస్సుతో; మే=నాయొక్క; గురుః=తండ్రి; అభివాదితఃఅపి= నమస్కరింపఁబడినాఁడా?

విశ్వామిత్రుఁడా! మాయాశ్రమమునకువచ్చిన పరిశుద్ధుండగు నీ రాముండు, శాంతంబగుమనంబున, మాతండ్రియగు గౌతమునకు నమస్కారముచేసినాఁడా? అని,శతానందుఁడువిశ్వామిత్రునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా వచనం తస్య విశ్వామిత్రో మహామునిః
ప్రత్యువాచ శతానందం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్. ౧౦

టీక॥తస్య=ఆశతానందునియొక్క;తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని;వాక్యజ్ఞః=మాటలనెఱింగినవాఁడును; మహామునిః= పూజ్యుఁడైన మునియునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు;వాక్యకోవిదం=మాటలందుఁబండితుండగు; శతానందం=శతానందునిఁగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

శతానందుండుచెప్పినయామాటవిని,చక్కగామాటలాడుటయందు నేర్పరియగు విశ్వామిత్రమహా

ముని, మాటలయందుఁ బండితుం డగు శతానందుని కిట్లని బదులుచె ప్పెను.

అని, తాత్పర్యము.

నాతికాన్తం మునిశ్రేష్ఠ యత్కర్తవ్యం కృతం మయా
సంగతా మునినా పత్నీ భార్గవేణేవ రేణుకా. ౧౧

టీక॥ మునిశ్రేష్ఠ=మునులలో మేటివైనశతానందుఁడా! నాతికాన్తం=విడువఁబడలేదు.యత్=ఏది, కర్తవ్యం=చేయఁబడవలసినదో; తత్(అధ్యాహృతము)= అది;మయా=నాచేత; కృతం=చేయఁబడినది.భార్గవేణ = భృగువంశమునందుఁబుట్టినజమదగ్నితో; రేణుకేవ=రేణుకవలె;మునినా=గౌతమమహాముని తో; పత్నీ=భార్యయయిన యహల్య;సంగతా=చేరినది.

మునిశ్రేష్ఠుండవగు శతానందుఁడా! నేనేమియువిడువలేదు; ఏదిసేయవలయునో దానినేఁజేసితిని; రేణుకజమదగ్నింగూడినట్లు, అహల్య గౌతమునింగూడినది.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా వచనం తస్య విశ్వామిత్రస్య భాషితమ్
శతానందో మహాతేజా రామం వచన మబ్రవీత్. ౧౨

టీక॥తస్య=ఆ;విశ్వామిత్రస్య=విశ్వామిత్రునియొక్క ; భాషితం=స్పష్టముగాఁజెప్పఁబడిన; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; మహాతేజాః = అధికమైనప్రభావముగల; శతానందః=శతానందుఁడు;రామం = రామునిగూర్చి;వచనం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

విశ్వామిత్రుఁడు చెప్పిన స్పష్టమైనమాటనువిని, మహాతేజుండగుశతానందుండు, రామునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

స్వాగతం తే నరశ్రేష్ఠ దిష్ట్యా ప్రాప్తోసి రాఘవ

విశ్వామిత్రం పురస్కృత్య మహర్షి మపరాజితమ్. ౧౩

టీక॥ నర శ్రేష్ఠ=పురుష శ్రేష్ఠుండవగు; రాఘవ=రాముఁడా! తే=నీకు; స్వాగతం=సుఖముతోడి రాక; అస్తు(అధ్యాహృతము)= అగుఁగాక. అపరాజితం=ఓటు లేనట్టి; మహర్షిం=పూజ్యుఁడైనఋషియగు; విశ్వామిత్రం= విశ్వామిత్రుని; పురస్కృత్య=ముందిడికొని; దిష్ట్యా=దైవయోగముచేత; ప్రాప్తః=వచ్చినవాఁడవు; అసి=అగుచున్నావు.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! నీకుస్వాగతమగుఁగాక; ఎచ్చటను ప్రతిహతముకాని మహిమగలవిశ్వామిత్రుంబురస్కరించికొని, దైవయోగంబుననిచ్చటికివచ్చితివి.

అని, తాత్పర్యము.

అచింత్యకర్మా తపసా బ్రహ్మర్షి రతులప్రభః
విశ్వామిత్రో మహాతేజా వేత్త్యేనం పరమాంగతిమ్. ౧౪

టీక॥ విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; అచింత్యకర్మా=ఎన్నరానికార్యముగలవాఁడు. తపసా= తపస్సుచేత; బ్రహ్మర్షిః= బ్రహ్మర్షియైనవాఁడు. అతులప్రభః=సరిలేని కాంతిగలవాఁడు ; మహాతేజాః=అధికమైనప్రభావముగలవాఁడు; ఏనం = ఈవిశ్వామిత్రుని; పరమాం=శ్రేష్ఠమైన; గతిం = ప్రాప్యస్థానమునుగా; వేత్తి = ఎఱుంగుదువు.

ఈవిశ్వామిత్రుండు, అచింత్యములగు కార్యంబులంజేసినవాఁడు; తపంబుసల్పిబ్రహ్మర్షియయ్యె; ఇతని కాంతికెచ్చటను సరియైనదిలేదు; మహాప్రభావుండు; ఇతండుపరమగతియనినీవెఱుంగుదువు.

అని, తాత్పర్యము.

నాస్తి ధన్యతరో రామ త్వత్తోన్యో భువి కశ్చన
గోప్తా కుశికపుత్ర స్తే యేన తప్తం మహ త్తపః. ౧౫

టీక॥ రామ=రాముఁడా! భువి=భూమియందు; త్వత్తః=నీకన్న; అన్యః=ఇతరుఁడైనవాఁడు; కశ్చన=ఒకానొకఁడును; ధన్యతరః=మిక్కిలియుఁబుణ్యావంతుఁడు; నాస్తి=లేఁడు; యేన=ఎవ్వనిచేత; మహత్=అధికమైన; తపః=తపస్సు; తప్తం=తపింపఁబడెనో, చేయఁబడెనో యను టః; సః(అధ్యాహృతము)=అట్టి; కుశికపుత్రః=విశ్వామిత్రుఁడు; తే=నీకు; గోప్తా=రక్షకుఁడు.

రాముఁడా! గొప్పతపంబుగావించినవిశ్వామిత్రుండు, నీకురక్షకుఁడుగానున్నాఁడుకావున, లోకంబుననీకన్నమఱియెవ్వాండును బుణ్యావంతుండు లేఁడు. అని, తాత్పర్యము.

శ్రూయతాం చాభిధాస్యామి కౌశికస్య మహాత్మనః
యథా బలం యథా వృత్తం తన్మే నిగదతః శ్రుణు. ౧౬

టీక॥ శ్రూయతాం=వినఁబడుఁగాక; మహాత్మనః=పూజ్యమైనస్వభావముగల; కౌశికస్య = విశ్వామిత్రునియొక్క; బలం = బలము; యథా=ఎట్టిదో; వృత్తం=చరిత్రము; యథా=ఎట్టిదో; తథాచ=అట్లు; అభిధాస్యామి=చెప్పెదను. తత్=దాని; నిగదతః = చెప్పుచున్నట్టి; మే= (పంచమ్యర్థమందుషష్ఠి) నావలన; శ్రుణు=వినుము.

వినుము; మహాత్ముండగు విశ్వామిత్రునిబలమును జరిత్రమును ఎట్టిదో, చెప్పెదను; దానినంతయును; వినుము. అని, తాత్పర్యము.

రాజా భూదేష ధర్మాత్మా దీర్ఘకాల మరిందమః
ధర్మజ్ఞః కృతవిద్యశ్చ ప్రజానాంచ హితే రతః. ౧౭

టీక॥ ఏషః=ఈవిశ్వామిత్రుఁడు; ధర్మాత్మా= ధర్మస్వభావుండును; అరిందమః=శత్రువుల నడంగఁ ద్రొక్కువాఁడును; ధర్మజ్ఞః= ధర్మముల నెఱింగినవాఁడును; కృతవిద్యశ్చ=నేర్పఁబడినవిద్య

లుగలవాఁడును; ప్రజానాం=జనులయొక్క; హితే=మేలునందు; రతశ్చ=ఆసక్తుఁడునగు; రాజా=రాజుగా; దీర్ఘం కాలం = బహుకాలము; అభూత్=ఉండెను.

ఈవిశ్వామిత్రుఁడు, ధర్మస్వభావుండై, శత్రువుల నడంగద్రొక్కుచు, ధర్మంబులనెఱింగి, యెల్లవిద్యలనేర్చి, ప్రజలమేలుగోరుచు, రాజుగా, బహుకాలము, భూమిఁబాలింపుచుండెను.

అని, తాత్పర్యము.

ప్రజాపతిసుత శ్చాసీ త్కుశో నామ మహీపతిః
కుశస్య పుత్రో బలవాన్ కుశనాభ స్సుధార్మికః. ౧౮

టీక॥ ప్రజాపతిసుతః=బ్రహ్మదేవునికుమారుఁడైన; ("చ" అనునది పాదపూరణార్థము); కుశోనామ=కుశుఁడనెడు; మహీపతిః=రాజు; ఆసీత్=ఉండెను. కుశస్య=కుశునియొక్క; పుత్రః=కొడుకు; బలవాన్= బలముగలవాఁడును; సుధార్మికః = చక్కగాధర్మము నాచరించు వాఁడు నగు; కుశనాభః = కుశనాభుఁడగువాఁడు; ఆసీత్ (అధ్యాహృతము)= ఉండెను.

బ్రహ్మదేవునికుమారుండు కుశుండనెడు రాజుండెను; ఆకుశునికి బలవంతుండును బరమ ధార్మికుండునగు కుశనాభుండను కొడుకుగల్గెను.

అని, తాత్పర్యము.

కుశనాభసుత స్త్వాసీ ద్గాధి రిత్యేవ విశ్రుతః
గాధేః పుత్రో మహాతేజా విశ్వామిత్రో మహామునిః. ౧౯

టీక॥ కుశనాభసుతస్తు=కుశనాభునికొడుకును; గాధిరిత్యేవ=గాధియనియే; విశ్రుతః=ప్రసిద్ధుఁడు; ఆసీత్=అయ్యెను; గాధేః = గాధియొక్క; పుత్రః=కొడుకు; మహాతేజాః=అధికమైన ప్రభావముగలవాఁడును; మహామునిః=పూజ్యుఁడైనమునియునగు; విశ్వామిత్రః=

విశ్వామిత్రుఁడు; ఆసీత్=(అధ్యాహృతము)ఆయెను.

కుశనాభునికొడుకు గాధియని ప్రసిద్ధినొందియుండెను; ఆగాధికి, మహాతేజుండగు విశ్వామిత్ర మహామునికల్గెను. అని, తాత్పర్యము.

విశ్వామిత్రో మహాతేజాః పాలయామాస మేదినీమ్
బహువర్షసహస్రాణి రాజా రాజ్య మకారయత్. ౨౦

టీక॥ మహాతేజాః=అధికమైన పరాక్రమముగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; మేదినీం=భూమిని; పాలయామాస=పరిపాలించెను;రాజా = విశ్వామిత్రమహారాజు;బహువర్షసహస్రాణి= అనేకములైనసంవత్సరముల యొక్క వేలు (అత్యంతసంయోగమందుద్వితీయ);రాజ్యం=దొరతనమును; అకారయత్ = (స్వార్థమందుణిచ్) చేసెను.

అధికంబగు పరాక్రమంబుగల విశ్వామిత్రుఁడుభూమిఁ బాలించుచుండెను;ఇతండు, పెక్కువేలేండ్లు దొరతనముచేసెను.

అని, తాత్పర్యము.

కదాచిత్తు మహాతేజా యోజయిత్వా వరూథినీమ్
అక్షౌహిణీపరివృతః పరిచక్రామ మేదినీమ్. ౨౧

టీక॥ కదాచిత్తు = ఒకానొకప్పుడుమాత్రము;మహాతేజాః=అధికమైన పరాక్రమముగలవిశ్వామిత్రుఁడు; వరూథినీం=చతురంగసైన్యమును; యోజయిత్వా=కూర్చి; అక్షౌహిణీపరివృతః= అక్షౌహిణీయుత సైన్యముచేఁజుట్టఁబడినవాఁడై;మేదినీం= (సప్తమ్యర్థమందుద్వితీయ)భూమియంతయు; పరిచక్రామ=తిరిగెను.

ఒకానొకప్పుడు, మహాతేజుండగు విశ్వామిత్రుండు, చతురంగబలంబుగూర్చి యక్షౌహిణీసైన్యముతోఁగూడె, భూమియంతయుదిరిగెను. అని, తాత్పర్యము.

నగరాణి సరాష్ట్రాణి సరితశ్చ తథా గిరీన్
ఆశ్రమాన్ క్రమశో రామ విచరన్నాజగామహ. ౨౨
వసిష్ఠస్యాశ్రమపదం నానావృక్షసమాకులమ్
నానామృగగణాకీర్ణం సిద్ధచారణసేవితమ్. ౨౩
దేవదానవగంధర్వైః కిన్నరై రుపశోభితమ్
ప్రశాంతహరిణాకీర్ణం ద్విజసంఘనిషేవితమ్. ౨౪
బ్రహ్మర్షిగణసంకీర్ణం దేవర్షిగణసేవితమ్
తపశ్చరణసంసిద్ధై రగ్నికల్పై ర్మహాత్మభిః. ౨౫
అబ్భక్షై ర్వాయుభక్షైశ్చ శీర్ణపర్ణాశనై స్తథా
ఫలమూలాశనై ర్దాంతై ర్జితరోషై ర్జితేంద్రియైః. ౨౬
ఋషిభిర్వాలఖిల్యైశ్చ జపహోమపరాయణైః
అన్యై ర్వైఖానసై శ్చైవ సమంతా దుపశోభితమ్. ౨౭

టీక॥ రామ=రాముఁడా! అయం(అధ్యాహృతము)=ఈవిశ్వామిత్రుండు; సరాష్ట్రాణి=దేశములతోఁగూడిన; నగరాణి=పట్టణములను; సరితశ్చ=నదులను; తథా=అట్లు, గిరీన్ = పర్వతములను; ఆశ్రమాన్=ఆశ్రమములను; క్రమశః=వరుసగా; విచరన్=తిరుగుచు; నానావృక్షసమాకులం=నానావిధములగు వృక్షములచేనిబిడముగా నున్నదియును; నానామృగగణాకీర్ణం=నానావిధములగు మృగములచేవ్యాపింపఁబడినదియును; సిద్ధచారణసేవితం=సిద్ధులచేతను జారణులచేతను సేవింపఁబడినదియును; దేవదానవగంధర్వైః=దేవతలచేతను దానవులచేతనుగంధర్వులచేతను; కిన్నరైః = కిన్నరులచేతను; ఉపశోభితం = ప్రకాశింపఁజేయఁబడినదియును; ప్రశాంతహరిణాకీర్ణం=మిక్కిలియుశాంతములైన, యనఁగా, మనుష్యులలో మెదిగినజింకలచే వ్యాపింపఁబడినదియును; ద్విజసంఘనిషేవితం = పక్షులయొక్కసమూహముచేత సేవింపఁ బడినదియును; బ్రహ్మర్షిగణసంకీర్ణం=




బ్రహ్మర్షులయొక్క సమూహములచేత వ్యాపింపఁబడినదియును; దేవర్షిగణసేవితం= దేవతాఋషులసమూహములచే సేవింపఁబడినదియును; తపశ్చరణసంసిద్ధైః=తపస్సుచేయుటచే సిద్ధిఁబొందినవారును; అగ్నికల్పైః=నిప్పుతో సరియగువారును; మహాత్మభిః= అధికమైన ప్రభావముగలవారును; అబ్భక్షైః= జలమునేభక్షించువారును; వాయుభక్షైశ్చ= గాలినిభక్షించువారును; శీర్ణపర్ణాశనైః=రాలినయాకులే యాహారము గాఁగలవారును; తథా=అట్లు; ఫలమూలాశనైః=పండ్లుకందమూలములాహారము గాఁగలవారును; దాంతైః=మనస్సును నిగ్రహించినవారునగు; జితరోషైః= జయింపఁబడినకోపముగలవారును; జితేంద్రియైః=జయింపఁబడిన యింద్రియములుగలవారునగు; ఋషిభిః=ఋషులచేతను; జపహోమపరాయణైః=జపమును హోమము నేముఖ్యమైన గతి గాఁగల; వాలఖిల్యైశ్చ=బ్రహ్మదేవునివాలమునంబుట్టిన వాలఖిల్యులనుఋషులచేతను; అన్యైః=ఇతరులయిన; వైఖానసైశ్చైవ=బ్రహ్మదేవునినఖములందుఁబుట్టిన వైఖానసులనుఋషులచేతను; సమంతాత్=అంతటను; ఉపశోభితం = ప్రకాశింపఁజేయఁబడినదియునగు; వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క; ఆశ్రమపదం = ఆశ్రమస్థానమును; ఆజగామ=పొందెను; "హ" అనునది పాదపూరణార్థము.

రాముఁడా! ఈవిశ్వామిత్రుండు, దేశములుబట్టణములునదులు బర్వతములు నాశ్రమములు మొదలగువానియందుఁగ్రమముగాఁదిరుగుచు, నానావిధంబులగుమ్రాఁకులును బలుదెఱంగులగు మృగంబులునుంగలిగి, సిద్ధులచేతనుజారణులచేతనుదేవదానవగంధర్వులచేతనుగిన్నరులచేతను సేవింపఁబడి, మనుష్యులలోమెదిగినజింకలును, బక్షిసమూహంబులునుంగల్గి, బ్రహ్మర్షులచేతనుదేవర్షులచేతను, మరియు, తపస్సిద్ధినొందినవారును నిప్పువంటివారునుమహాత్ములును, జలమెయాహారము గాఁగలవారును వాయువుదినువారును నేలరాలిన యాకులంభక్షించువారునుఫలంబులమూలంబుల మె




సవువారునుఇంద్రియ నిగ్రహముగలవారును,కోపములేనివారునగుబుషులచేతను,ఎల్లప్పుడుజపహోమంబులవిడువక జేయుచుండు వాలఖిల్యులచేతను, ఇంకనితరులగువైఖానసులు మొదలగువారిచేతను శోభితంబై,యుండు,వసిష్ఠాశ్రమంబునకుంబోయెను. అని, తాత్పర్యము.

వసిష్ఠస్యాశ్రమపదం బ్రహ్మాలోక మివాపరమ్
దదర్శ జయతాం శ్రేష్ఠో విశ్వామిత్రో మహాబలః. ౨౮

టీక॥ జయతాం=జయించువారిలోపల; శ్రేష్ఠ= మేటియైనవాఁడును; మహాబలః=అధికమైనబలముగలవాఁడునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; అపరం=మఱియొకటైన;బ్రహ్మలోకమివ(స్థితం)=బ్రహ్మలోకమునునట్లున్న; వసిష్ఠస్య=వసిష్ఠమహర్షియొక్క;ఆశ్రమపదం=ఆశ్రమమును;దదర్శ=చూచెను.

శూరులలో, శ్రేష్ఠుండునుమహాబలుండునగు, విశ్వామిత్రుండు, రెండవబ్రహ్మలోకమనందగి,యుండు, వసిష్ఠాశ్రమపదంబును,జూచెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకపంచాశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండైకపంచాశసర్గటీక,
ముగిసినది.

---

౫౨

ద్వి పం చా శ స ర్గ ప్రా రం భః.

స దృష్ట్వా పరమప్రీతో విశ్వామిత్రో మహాబలః
ప్రణతో వినయా ద్వీరో వసిష్ఠం జపతాంవరమ్. ౧

టీక॥ మహాబలః=అధికమయిన బలముగలవాఁడును; వీరః=పరాక్రమశాలియునగు; సః=ఆ; విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; జపతాం=జపించువారిలోపల; వరం=శ్రేష్ఠుఁడైన; వసిష్ఠం = వసిష్ఠమహర్షిని; దృష్ట్వా=చూచి; వినయాత్=అణఁకువవలన; ప్రణతః=నమస్కరించినాఁడు.

మహాబలుండును బరాక్రమశాలియునగు నావిశ్వామిత్రుఁడు, మునులలోపల శ్రేష్ఠుండగు వసిష్ఠమహర్షిం జూచి, వినయంబుగలవాఁడు కావున, నమస్కరించెను.

అని, తాత్పర్యము.

స్వాగతం తవ చేత్యుక్తో వసిష్ఠేన మహాత్మనా

టీక॥ సః(అధ్యాహృతము)=ఆ విశ్వామిత్రుఁడు; మహాత్మనా=అధికమైనప్రభావముగల; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; "తవ = నీకును(చకారమున) నీపరివారమునకును; స్వాగతం = సుఖముతోడిరాక; అస్తు(అధ్యాహృతము)= అగుఁగాక." ఇతి=అని; ఉక్తః= చెప్పఁబడినాఁడు.

మహాత్ముండగు వసిష్ఠుండు విశ్వామిత్రునింజూచి "నీకును నీపరివారమునకును స్వాగతంబగుఁగాక" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఆసనం చాస్య భగవాన్ వసిష్ఠో వ్యాదిదేశ హ. ౨

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగల; వసిష్ఠః=వసిష్ఠుండు; అస్య=

ఈవిశ్వామిత్రునకు;ఆసనంచ=పీఁటనుఁగూడ;వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను, ఇప్పించెననుట. "హ" అనునది పాదపూరణార్థము.

భగవంతుండగు వసిష్ఠుం, డీవిశ్వామిత్రునకాసనంబును,ఇప్పించెను. అని, తాత్పర్యము.

ఉపవిష్టాయ చ తదా విశ్వామిత్రాయ ధీమతే
యథాన్యాయం మునివరః ఫలమూల ముపాహరత్. ౩

టీక॥తదా=అప్పుడు;మునివరః=మునిశ్రేష్ఠుండగు వసిష్ఠుండు; ఉపవిష్టాయ=కూర్చుండిన,ధీమతే=బుద్ధిమంతుండగు; విశ్వామిత్రాయ=విశ్వామిత్రునికొఱకు; యథాన్యాయం = యథాశాస్త్రముగా;ఫలమూలం=పండ్లనుమూలములను;ఉపాహరత్ =సమర్పించెను.

అప్పుడు, మునిశ్రేష్ఠుండగు వసిష్ఠుండు, ఆసనంబునంగూర్చుండినబుద్ధిమంతుండగువిశ్వామిత్రునకు, యథాశాస్త్రంబుగా, ఫలమూలంబులసమర్పించెను.

అని, తాత్పర్యము.

ప్రతిగృహ్య తు తాం పూజాం వసిష్ఠా ద్రాజసత్తమః
తపోగ్నిహోత్రశిష్యేషు కుశలం పర్యపృచ్ఛత. ౪
విశ్వామిత్రో మహాతేజా వనస్పతిగణే తథా

టీక॥ రాజసత్తమః= రాజశ్రేష్ఠుండును; మహాతేజాః= అధికమైన పరాక్రమముగలవాఁడునగు విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; వసిష్ఠాత్ = వసిష్ఠునివలన; తాం=ఆ; పూజాం = పూజను;ప్రతిగృహ్య తు = స్వీకరించినంతనె; తపోగ్నిహోత్రశిష్యేషు = తపస్సునందును, అగ్నిహోత్రమునందును శిష్యులందును;తథా= అట్లు;వనస్పతిగణే= వృక్షములయొక్క సమూహమందును; కుశలం=క్షేమమును;ప



ర్యపృచ్ఛత=అడిగెను.

రాజశ్రేష్ఠుండునుమహావీరుండు నగువిశ్వామిత్రుండు, వసిష్ఠుండుచేసినపూజంబ్రతిగ్రహించి, తపస్సు నిర్విఘ్నముగా జరుగుచున్నదా? అట్లగ్నిహోత్రములును క్రమముగ జరుగుచున్నవా? శిష్యులు క్షేమముగనున్నారా? వృక్షములుచక్కఁగాఁబెరుఁగుచున్నవా? అని, యడిగెను.

అని, తాత్పర్యము.

సర్వత్ర కుశలం చాహ వసిష్ఠో రాజసత్తమమ్. ౫

టీక॥ వసిష్ఠః=వసిష్ఠమహర్షి; రాజసత్తమం= రాజశ్రేష్ఠుండగువిశ్వామిత్రునిగూర్చి; సర్వత్రచ=అంతటను; కుశలం=క్షేమమును, ఆహ (భూతార్థమందులట్)=చెప్పెను.

వసిష్ఠుండు "మీరడిగినవన్నియు క్షేమముననే, యున్నవి" అని, విశ్వామిత్రునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సుఖోపవిష్టం రాజానం విశ్వామిత్రం మహాతపాః
పప్రచ్ఛ జపతాం శ్రేష్ఠో వసిష్ఠో బ్రహ్మణస్సుతః. ౬

టీక॥ మహాతపాః=అధికమైనతపస్సుగలవాఁడును; జపతాం=జపముచేయువారిలోపల; శ్రేష్ఠః=మేటియైనవాఁడును; బ్రహ్మణః=బ్రహ్మదేవునియొక్క; సుతః=కొడుకునగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు; సుఖోపవిష్టం=సుఖముగాఁగూర్చుండిన, రాజానం=రాజైన; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; పప్రచ్ఛ=అడిగెను.

మహాతపశ్శాలియును మునిశ్రేష్ఠుండును బ్రహ్మకుమారుండునగు వసిష్ఠుండు, విశ్వామిత్రమహారాజు, సుఖముగాఁగూర్చుండినపిదప, నతని, నిట్లని, యడిగెను.

అని, తాత్పర్యము.

కచ్చిత్తే కుశలం రాజన్ కచ్చిద్ధర్మేణ రంజయన్



ప్రజాః పాలయసే వీర రాజవృత్తేన ధార్మిక. ౭

టీక॥ రాజన్=రాజవైనవిశ్వామిత్రుఁడా! తే=నీకు; కుశలంకచ్చిత్=క్షేమమేనా? వీర=పరాక్రమశాలివి; ధార్మిక=ధర్మమునాచరించు వాఁడవైన విశ్వామిత్రుఁడా! ప్రజాః=జనులను; ధర్మేణ=ధర్మముచే; రంజయన్=సంతోషపఱచుచు; రాజవృత్తేన=రాచకార్యముతో; సహితః=(అధ్యాహృతము)కూడినవాఁడవై; పాలయసే కచ్చిత్=పాలించుచున్నావా?

పరాక్రమశాలివి ధార్మికుండవునగు విశ్వామిత్రమహారాజా! నీకు క్షేమమా? నీవు, ప్రజలనుధర్మపద్ధతిని సంతోషింపఁ జేయుచు, "న్యాయేనార్జనమర్థస్య వర్ధనం పాలనంతథా। సత్పాత్రేప్రతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధం" (న్యాయంబున ధనముసంపాదించుటయు దాని వృద్ధిఁబొందించుటయు రక్షించుటయు సత్పాత్రంబున కొసంగుటయునని రాజవృత్తంబు నాలుగువిధంబులగును, అని చెప్పఁబడిన నాల్గువిధంబులగు రాజవృత్తంబులు గల్గి, పాలించెదవా?

అని, తాత్పర్యము.

కచ్చిత్తే సంభృతా భృత్యాః కచ్చిత్తిష్ఠంతి శాసనే
కచ్చిత్తే విజితా స్సర్వే రిపవో రిపుసూదన. ౮

టీక॥ రిపుసూదన=శత్రువులంజంపునట్టివిశ్వామిత్రుఁడా! తే=నీయొక్క; భృత్యాః=పనివాండ్రు; సంభృతాః=చక్కఁగాఁబోషింపఁబడినవారలై; తిష్ఠంతి(అధ్యాహృతము)కచ్చిత్=ఉన్నారా? శాసనే=ఆజ్ఞయందు; తిష్ఠంతికచ్చిత్=ఉన్నారా? తే=నీయొక్క; రిపవః=శత్రువులు, సర్వే=అందఱును; విజితాఃకచ్చిత్=జయింపఁబడినారా?

శత్రువులంజంపునట్టి విశ్వామిత్రుఁడా! నీవు, నీభృత్యులనుజక్కఁగాఁ బోషించుచున్నావా? వారునీకుఁజెప్పినట్టువినుచున్నారా? నీవుశత్రువులనందఱనుజయించినావా?

అని, తాత్పర్యము.

కచ్చి ద్బలేషు కోశేషు మిత్రేషుచ పరంతప
కుశలం తే నరవ్యాఘ్ర పుత్రపౌత్రే తవానఘ. ౯

టీక ॥ పరంతప=శత్రువులందపింపఁజేయునట్టివాఁడవు; అనఘ=పాపము లేనివాఁడవును; నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుండవునగు,విశ్వామిత్రుఁడా ! తే=నీయొక్క; బలేషు= చతురంగబలములయందును, కోశేషు = బొక్కసములయందును; మిత్రేషు=స్నేహితులయందును;తవ=నీయొక్క; పుత్రపౌత్రే=కొడుకులయందును మనుమలయందును;కుశలంకచ్చిత్ = క్షేమమా యేమి?

శత్రువులందపింపఁ జేయువాఁడవుపాపరహితుండవు పురుషశ్రేష్ఠుండవునగువిశ్వామిత్రుఁడా! నీచతురంగబలంబులకును బొక్కసములకును స్నేహితులకును గొడుకులకును మనుమలకును క్షేమమా! అని,వసిష్ఠుండువిశ్వామిత్రునడిగెను.

అని, తాత్పర్యము.

సర్వత్ర కుశలం రాజా వసిష్ఠం ప్రత్యుదాహరత్
విశ్వామిత్రో మహాతేజా వసిష్ఠం వినయాన్వితః. ౧౦

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; రాజా=రాజైన;విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు, వినయాన్వితః= అణఁకువతోఁగూడినవాఁడై; వసిష్ఠం= వసిష్ఠునిగూర్చి; సర్వత్ర=అంతటను;కుశలం= క్షేమమును; ప్రత్యుదాహరత్=బదులుచెప్పెను.

మహాతేజుండగు విశ్వామిత్రమహారాజు, శ్రేష్ఠుండగువసిష్ఠునకు, "అన్నియును క్షేమముగనే యున్నవి" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

కృత్వోభౌ సుచిరం కాలం ధర్మిష్ఠౌ తాః కథాశ్శుభాః
ముదా పరమయా యుక్తౌ ప్రీయేతాం తౌ పరస్పరమ్. ౧౧

టీక॥ధర్మిష్ఠౌ=మిక్కిలిధర్మముగల; ఆవసిష్ఠవిశ్వామిత్రులు; ఉభౌ=ఇర్వురును; పరమయా=అధికమైన; ముదా=సంతోషముతో; యుక్తౌ=కూడినవారలై; సుచిరం=మిక్కిలియధికమైన; కాలం=(అత్యంతసంయోగమందుద్వితీయ) కాలము; తాః=ఆ; శుభాః=మంగళకరములుయిన; కథాః=కథలను; కృత్వా=చేసి; పరస్పరం=ఒకరినొకరు, ప్రీయేతాం=సంతోషముపరచికొనిరి

ధార్మికులగు నావసిష్ఠవిశ్వామిత్రులిర్వురును మిక్కిలియు సంతోషంబున, బహుకాలమువఱకు, పరస్పర కుశలప్రశ్నలఁ గుఱించిన మాటలుచెప్పుకొని, పరస్పరముసంతోషపఱచుకొనిరి.

అని, తాత్పర్యము.

తతో వసిష్ఠో భగవాన్ కథాంతే రఘునందన
విశ్వామిత్రమిదం వాక్య మువాచ ప్రహసన్నివ. ౧౨

టీక॥ రఘునందన=రాముఁడా! తతః=అటుపిమ్మట; కథాంతే=కథయొక్కకడను; భగవాన్=మాహాత్మ్యముగల; వసిష్ఠః=వసిష్ఠుఁడు; ప్రహసన్ = నవ్వుచు("ఇవ"అనునది వాక్యాలంకారార్థకము); విశ్వామిత్రం = విశ్వామిత్రునిగూర్చి; ఇదం=ఈ; వాక్యం=మాటను, ఉవాచ=చెప్పెను.

రాముఁడా! అంత, కుశలంబడిగినవెనుక, భగవంతుండగు వసిష్ఠుండు, ప్రసన్నముఖుఁడై, విశ్వామిత్రునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఆతిథ్యం కర్తు మిచ్ఛామి బలస్యాస్య మహాబల
తవ చైవా ప్రమేయస్య యథార్హం సంప్రతీచ్ఛ మే. ౧౩

టీక॥మహాబల=అధికమైనబలముగలవిశ్వామిత్రుఁడా! అస్య=ఈ; బలస్య=సైన్యమునకును; అప్రమేయస్య = కొలతపెట్టరాని; తవచైవ=నీకును; యథార్హం = యథాయోగ్యముగా; ఆతిథ్యం=అతిథిపూ

జను; కర్తుం=చేయుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను. మే=నాయొక్క; పార్థనాం(అర్ఘ్యాహ్నాతము)=వేడుకోలును; సంప్రతీచ్ఛ = అంగీకరింపుము.

మహాబలుండవగువిశ్వామిత్రుఁడా! ఈసైన్యంబునకును అప్రమేయుండవగునీకును, యథాయోగ్యముగనతిథిపూజచేయఁగోరెదను; నాప్రార్థననంగీకరింపుము.

అని, తాత్పర్యము.

సత్క్రియాం తు భవా నేతాం ప్రతీచ్ఛతు మయో ద్యతామ్
రాజా త్వ మతిథి శ్రేష్ఠః పూజనీయః ప్రయత్నతః. ౧౪

టీక॥ భవాన్=పూజ్యుఁడవగునీవు; మయా=నాచేత; ఉద్యతాం=యత్నింపఁబడిన; ఏతాం = ఈ; సత్క్రియాంతు = పూజనుమాత్రము; ప్రతీచ్ఛతు=అంగీకరింతువుగాక; త్వం=నీవు; రాజా=ప్రభుండవు; అతిథిశ్రేష్ఠః= అతిథులలో మేటివి; ప్రయత్నతః = మిక్కిలియత్నంబున; పూజనీయః = పూజింపఁదగినవాఁడవు.

నీవు, నేఁజేయఁదలచినయాతిథ్యమునంగీకరింపుము; నీవు, అధిపుండవు, అతిథిశ్రేష్ఠుండవు; కావునఁబ్రయత్నంబున నినుంబూజింప వలయును. అని, వసిష్ఠుండు, విశ్వామిత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తో వసిష్ఠేన విశ్వామిత్రో మహామతిః
కృత మిత్య బ్రవీ ద్రాజా ప్రియవాక్యేన మే త్వయా. ౧౫

టీక॥ మహామతిః=గొప్పబుద్ధిగల; రాజా=రాజైన; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; ఏవం = ఈప్రకారము; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; "మే=నాకు; త్వయా=నీచేత; ప్రియవాక్యేన = ప్రేమతోఁగూడిన మాటచేత; ఆతిథ్యం=(అర్ఘ్యాహ్నా

తము)అతిథిపూజ; కృతం=చేయఁబడినది;" ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను.

బుద్ధిమంతుండగు విశ్వామిత్రమహారాజు; వసిష్ఠుండు చెప్పినదివిని, 'నీవు "ఆతిథ్యముచేసెద" నని చెప్పిన ప్రియవచనముచేతనే, నాకాతిథ్యముచేయఁబడినది" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఫలమూలేన భగవన్ విద్యతే యత్తవాశ్రమే
పాద్యేనాచమనీయేన భగవద్దర్శనేనచ. ౧౬
సర్వథాచ మహాప్రాజ్ఞ పూజార్హేణ సుపూజితః
గమిష్యామి నమస్తేస్తు మైత్రేణేక్షుస్వ చక్షుషా. ౧౭

టీక॥ భగవన్=మాహాత్మ్యము గలవాఁడవును; మహాప్రాజ్ఞ=గొప్ప పండితుండవునగు వసిష్ఠుఁడా! యత్=ఏది; తవ=నీయొక్క; ఆశ్రమే=ఆశ్రమమందు; విద్యతే=ఉన్నదో; తేన(అధ్యాహృతము)=అట్టి; ఫలమూలేన= పండ్లచేతను మూలములచేతను; పాద్యేన=పాదోదకముచేతను; ఆచమనీయేన=ఆచమనార్థమైనజలముచేతను; భగవద్దర్శనేనచ= భగవంతుండవగు నీయొక్క చూచుటచేతను; సర్వథాచ= అన్నివిధములను; పూజార్హేణ= పూజింపఁ దగిననీచేత ; సుపూజితః= చక్కఁగాఁబూజింపఁబడినాఁడను; గమిష్యామి=పోయెదను; తే= నీకు; నమః=నమస్కారము; అస్తు= అగుఁగాక; మైత్రేణ= స్నేహముతోఁగూడిన; చక్షుషా=కంటిచేత; ఈక్షుస్వ=చూడుము.

భగవంతుండవు మహాపండితుండవునగు వసిష్ఠుఁడా! నీయాశ్రమమందు దొరకునట్టి ఫల మూలంబులను, పాద్యంబు నాచమనీయంబు, భగవంతుండవగు నీదర్శనంబు, నివన్నియు, నాకొసంగి, నాచేఁబూజింపఁదగిన నీవు, నాకన్నివిధంబులఁబూజ చక్కఁగాఁజేసితివి; నేనుబోయెదను; నీకు నమస్కారము; నన్ను స్నేహముతోఁజూడుము. అని, విశ్వామిత్రుఁడు

వసిష్ఠునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం బ్రువంతం రాజానం వసిష్ఠః పునరేవహి
న్యమంత్రయత ధర్మాత్మా పునః పున రుదారధీః. ౧౮

టీక॥ ధర్మాత్మా=ధర్మస్వభావుండును; ఉదారధీః=అధికమైనబుద్ధిగలవాఁడునగు; వసిష్ఠః= వసిష్ఠుఁడు; ఏవం=ఇట్లు; బ్రువంతం=చెప్పుచున్న; రాజానం=విశ్వామిత్రమహారాజును; పునరేవ=మఱలనే; పునః పునః=మాటిమాటికిని; న్యమంత్రయతహి= భోజనముకొఱకుఁబ్రార్థించెనుగదా!

ఇట్లువిశ్వామిత్రుఁడు, బదులుచెప్పుచున్నప్పటికిని, ధర్మాత్ముండును బుద్ధిమంతుండునగు వసిష్ఠుండతని మాటిమాటికి, "భోజనమునకునిలువవలె"నని చెప్పి, నిర్బంధించెను.

అని, తాత్పర్యము.

బాఢ మిత్యేవ గాధేయో వసిష్ఠం ప్రత్యువాచ హ
యథా ప్రియం భగవత స్తథాస్తు మునిపుంగవ. ౧౯

టీక॥ గాధేయః=గాధికొడుకైన విశ్వామిత్రుఁడు; వసిష్ఠం=వసిష్ఠుని గూర్చి; "మునిపుంగవ=మునిశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా బాఢం=మంచిది. భగవతః=మాహాత్మ్యముగలనీకు; యథా=ఎట్లు; ప్రియం=ఇష్టమో. తథా=అట్లు; అస్తు=అగుఁగాక." ఇత్యేవ=అనియే; ప్రత్యువాచ=బదులుచెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

గాధికొడుకైన విశ్వామిత్రుండు, "మునిశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా! మంచిది; భగవంతుండవగునీకెట్లిష్టమో, అట్లుకానిమ్ము" అని, వసిష్ఠునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవముక్తో మహాతేజా వసిష్ఠో జపతాం వరః
ఆజుహావ తతఃప్రీతః కల్మాషీం ధూతకల్మషః. ౨౦

టీక ॥ మహాతేజాః=అధికమైన ప్రభావము గలవాఁడును; జపతాం= జపముసేయువారిలో; వరః=శ్రేష్ఠుఁడును; ధూతకల్మషః= పోఁగొట్టఁబడిన పాపములుగలవాఁడునగు;వసిష్ఠః=వసిష్ఠుఁడు;ఏవం= ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తతః=అంతట;ప్రీతః=సంతసించినవాఁడై; కల్మాషీం=చిత్రవర్ణమైన కామధేనువును; ఆజుహావ= పిలిచెను.

మహాతేజండును మునిశ్రేష్ఠుండునుపాపములఁ బోఁగొట్టువాఁడునగువసిష్ఠుండు, విశ్వామిత్రునిమాటవిని,సంతసించి, చిత్రవర్ణంబగు దేహంబుగల కామధేనువుం బిలిచెను.

అని, తాత్పర్యము.

ఏహ్యేహి శబలే క్షిప్రం శృణుచాపి వచో మమ
సబలస్యాస్య రాజర్షేః కర్తుం వ్యవసితోస్మ్యహమ్. ౨౧
భోజనేన మహార్హేణ సత్కారం సంవిధత్స్వ మే

టీక॥ శబలే=చిత్రవర్ణయగు కామధేనువా ! క్షిప్రం=శీఘ్రముగా;ఏహి=రమ్ము; ఏహి=రమ్ము; మమ= నా యొక్క; వచశ్చాపి = మాటను; శృణు = వినుము. అహం= నేను; సబలస్య=సైన్యముతోఁగూడిన;అస్య=ఈ; రాజర్షేః= రాజునుఋషియునగువిశ్వామిత్రునకు;మహార్హేణ = శ్రేష్ఠమైన; భోజనేన=ఆహారముచేత;సత్కారం=పూజను; కర్తుం=చేయుటకు; వ్యవసితః=యత్నించినవాఁడను;అస్మి=అగుచున్నాను. మే=నాకొఱకు; సంవిధత్స్వ=సంపాదింపుము.

చిత్రవర్ణంబగు దేహముగల కామధేనువా ! శీఘ్రముగారమ్ము; రమ్ము;నామాటవినుము; నేనురాజర్షియగునీవిశ్వామిత్రునకును,ఇతనిసైన్యమునకును, శ్రేష్ఠంబగు భోజనంబిడి, సత్కారము సేయఁగోరినాను;నీవునాకుఁగావలయుద్రవ్యంబులసంపాదింపుము.

అని, తాత్పర్యము.

యస్య యస్య యథాకామం షడ్రసేష్వభిపూజితమ్. ౨౨
తత్సర్వం కామధుక్షిప్ర మభివర్ష కృతే మమ

టీక॥ కామధుక్=కోరినవానిం బితుకుకామధేనువా! యత్ = (అధ్యాహృతము) ఏది; యస్యయస్య=ఎవనికెవనికి; షడ్రసేషు=ఆఱురసములయందును; అభిపూజితం=ఇష్టమో; తత్=దానిని; సర్వం= అంతను; తస్యతస్య (అధ్యాహృతము)=వానికివానికి; మమకృతే=నాకుఁగాను; క్షిప్రం=శీఘ్రముగా; అభివర్ష=కురియుము.

కోరినవానినెల్లంబితుకు కామధేనువా! ఆఱురసములయందును, ఎవ్వని కేది యిష్టమో; దానినంతయు వానికి, నాకుఁగా, సృజించి, యొసంగుము.

అని, తాత్పర్యము.

రసేనాన్నేన పానేన లేహ్యాచోష్యేణ సంయుతమ్. ౨౩
అన్నానాం నిచయం సర్వం సృజస్వ శబలే త్వర

టీక॥ శబలే=కామధేనువా! రసేన = రసాయనముతోను; అన్నేన=భక్ష్యముతోను; పానేన=త్రాఁగఁదగినదానితోను; లేహ్యాచోష్యేణ, లేహ్య= నాకఁదగినదానితోను, చోష్యేణ= పీల్చఁదగినదానితోను; సంయుతం=కూడిన; అన్నానాం= వరి మొదలయిన యన్నముల యొక్క; నిచయం = సమూహమును; సర్వం = అంతను; సృజస్వ=సృజింపుము. త్వర= వేగిరించుము.

కామధేనువా! రసాయనములును, భక్ష్యంబులును, పానీయంబులును, లేహ్యంబులగు తేనెమొదలగునవియును, చోష్యంబగు పెఱుఁగుమొదలయినవియునుంగూడిన, యన్నంబులరాశిని, సృజింపుము; శీఘ్రముగా సృజింపుము. అని, వసిష్ఠుఁడు, కామధేనువునకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే,ద్విపంచాశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది , పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్రి
వ్యాఖ్యానంబునందు, బాలకాండ ద్విపంచాశసర్గటీక,
ముగిసినది.

---

౫౩.

త్రిపంచాశసర్గప్రారంభః.

ఏవముక్తా వసిష్ఠేన శబళా శత్రుసూదన
విదధే కామధు క్కామా న్యస్యయస్య యథేప్సితమ్. ౧

టీక ॥ శత్రుసూదన=శత్రువులంజంపునట్టిరాముఁడా ! కామధుక్=కామధేనువు; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; ఏవం=ఈప్రకారము; ఉక్తా= చెప్పఁబడినదై; యస్యయస్య=ఎవ్వని కెవ్వనికి; యథా= ఎట్లు;ఈప్సితం=కోరికో; తస్యతస్య (అధ్యాహృతము)= వానికివానికి; తథా(అధ్యాహృతము)= అట్లు; కామాన్=కోరఁబడినవానిని; విదధే=నిర్మించెను.

శత్రువులం జంపునట్టి రాముఁడా!వసిష్ఠుండిట్లు ప్రార్థింపఁగానే,కామధేనువు, ఎవ్వఁడెట్లుకోరెనో,వానికట్లే, యన్నింటినిసమకూర్చెను. అని, తాత్పర్యము.

ఇక్షూ న్మధూం స్తథా లాజా న్మైరేయాంశ్చ వరాసనాన్
పానానిచ మహార్హాణి భక్ష్యాం శ్చోచ్చావచాం స్తథా. ౨

టీక॥ కామధుక్ (అధ్యాహృతము)=కామధేనువు; ఇక్షూన్=చె

అటుగడలను; మధూన్ (మధూని)=తేనెలను;తథా=అట్లు;లాజాన్=పేలాలను; వరాసనాన్= మంచిపాత్రలుగల; మైరేయాంశ్చ=మైరేయములను మద్యములను; మహార్హాణి=మిగుల శ్రేష్ఠములయిన;పానాని= పానకము మొదలగువానిని; తథా=అట్లు;ఉచ్చావచాన్= నానావిధములయిన;భక్ష్యాంశ్చ=పిండివంటలను; విదధే (అధ్యాహృతము)=నిర్మించెను.

అప్పుడు, కామధేనువు, చెఱకులను, తేనెలను, పేలాలను, మంచిపాత్రంబులనుంచఁబడిన మైరేయంబులనుమద్యంబులను,శ్రేష్ఠములయినపానకాది పేయద్రవ్యంబులను,మరియు నానావిధంబులగుపిండివంటలను, నిర్మించెను. అని, తాత్పర్యము.

ఉష్ణాఢ్యస్యౌదనస్యాత్ర రాశయః పర్వతోపమాః
మృష్టాన్నానిచ సూపాశ్చ దధికుల్యా స్తథైవచ. ౩
నానాస్వాదురసానాంచ షాడబానాం తథైవచ
భాజనాని సుపూర్ణాని గౌడానిచ సహస్రశః. ౪

టీక॥అత్ర=ఈవసిష్ఠాశ్రమమందు;ఉష్ణాఢ్యస్య = వేడిగల;ఓదనస్య = అన్నముయొక్క;పర్వతోపమాః=కొండలతోఁబోలికగల;రాశయః= రాసులును; మృష్టాన్నానిచ=శ్రేష్ఠములయిన యన్నములును; సూపాశ్చ=వండినపప్పులును, తథైవచ=ఆలాగే;దధికుల్యాః=పెరుఁగుకాలువలును;తథైవచ=ఆలాగే; నానాస్వాదురసానాం=పలుతెఱంగులయిన రుచ్యములగు రసములుగల;షాడబానాం (తృతీయార్థమందుషష్ఠి)=షడ్రసములభక్ష్యములచేత;సుపూర్ణాని = చక్కగానిండిన, భాజనానిచ=పాత్రములును; గౌడానిచ=బెల్లముతోఁజేసినభక్ష్యములును; సహస్రశః=వేనవేలుగా; అభూవన్ (అధ్యాహృతము)=ఉండినవి.

ఇట్లు,వసిష్ఠాశ్రమమందు, కొండలంబోలు వేడి యన్నపురాసులును, పాయసంబు మొదలగు మృష్టా

న్నంబులును, సూపంబులును, పెరుఁగు పేఁబులును, పలుతెఱంగులు గారు చ్యంబులగునట్లు షడ్రసంబులం జేయఁబడిన పాడబంబులను భక్ష్యంబులనించిన పాత్రములను, మరియు బెల్లముతోఁ జేసిన భక్ష్యంబులను, వేనవేలుగాఁ గాన్పించినవి.

అని, తాత్పర్యము.

సర్వ మాసీత్సుసంతుష్టం హృష్టపుష్ట జనాయుతమ్
విశ్వామిత్రబలం రామ వసిష్ఠేనా భితర్పితమ్. ౫

టీక॥ రామ=రాముఁడా! విశ్వామిత్రబలం= విశ్వామిత్రునియొక్క సేన; సర్వం=అంతయును; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; అభితర్పితం=తృప్తినొందఁజేయఁబడినదై; హృష్టపుష్టజనాయుతం= సంతసించినవారును దేహవృద్ధి గలవారునగు జనులతోఁగూడినదై; సుసంతుష్టం=మిక్కిలియుసంతసంచినది, ఆసీత్ = అయినది.

రాముఁడా! ఇట్లువసిష్ఠుండుతృప్తినొందునట్లుసేయఁగా' విశ్వామిత్రునిసేనయందలిజనులందఱును, మిక్కిలియుసంతసంబును దేహపుష్టియు, నొందిరి.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రోపి రాజర్షి హృష్టః పుష్ట స్తదా భవత్

టీక॥ తదా = అప్పుడు; రాజర్షిః=రాజునుఋషియునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; హృష్టః= సంతసించినవాఁడును; పుష్టః=దేహపుష్టి నొందిన వాఁడును; అభవత్=ఆయెను.

అప్పుడు, రాజర్షియగు, విశ్వామిత్రుండును, వసిష్ఠుండు సేసినయాదరమునకుసంతసించి, యాభోజనంబుచేదృప్తినొందెను.

అని, తాత్పర్యము.

సాంతఃపురవరో రాజా సబ్రాహ్మణపురోహితః. ౬
సామాత్యో మంత్రిసహిత స్సభృత్యః పూజిత స్తదా




టీక॥ తదా = అప్పుడు; సాంతః పురపరః = అంతిపురములోని శ్రేష్ఠ స్త్రీలతోఁగూడినవాఁడును; సబ్రాహ్మణపురోహితః = బ్రాహ్మణుల తోను బురోహితులతోను గూడిన వాఁడును; సామాత్యః = అమాత్యులతోఁగూడినవాఁడును; మంత్రిసహితః = మంత్రులతోఁ గూడిన వాఁడును; సభృత్యః = నౌకరులతోఁగూడిన వాఁడునగు; రాజా = రాజయినవిశ్వామిత్రుఁడు; పూజితః = పూజింపఁబడెను.

అప్పుడు, విశ్వామిత్రమహారాజును, అతనియంతః పురస్త్రీలును, బ్రాహ్మణులును బురోహితులును అమాత్యులును మంత్రులును నౌకరులునందఱును, బూజింపఁబడిరి.

అని, తాత్పర్యము.

యుక్తః పరమహర్షేణ వసిష్ఠ మిదమబ్రవీత్. ౭

టీక॥ విశ్వామిత్రః (అధ్యాహృతము) = విశ్వామిత్రుఁడు; పరమహర్షేణ = మిక్కిలియు నధికమైన సంతోషముతో; యుక్తః = కూడినవాఁడై; వసిష్ఠం = వసిష్ఠమహర్షిని గూర్చి; ఇదం = ఈమాటను; అబ్రవీత్ = పలికెను.

విశ్వామిత్రుండు, మిక్కిలియు సంతోషంబు నొంది, వసిష్ఠమహర్షిం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పూజితో హం త్వయా బ్రహ్మన్ పూజార్హేణ సుసత్కృతః
శ్రూయతా మభిధాస్యామి వాక్యం వాక్యవిశారద. ౮

టీక॥ బ్రహ్మన్ = బ్రాహ్మణుఁడవయినవసిష్ఠుఁడా! పూజార్హేణ = పూజకుఁదగిన; త్వయా = నీచేత; అహం = నేను; పూజితః = పూజింపఁబడినవాఁడను. సుసత్కృతః = చక్కఁగా సమ్మానింపఁబడినాఁడను; వాక్యవిశారద = మాటలయందుఁ బండితుఁడవయినవసిష్ఠుఁడా! వాక్యం = మాటను; అభిధాస్యామి = చెప్పెదను. శ్రూయతాం = వినఁబడుఁ







గాక.

బ్రాహ్మణుఁడవయిన వసిష్ఠుఁడా! నీవుమాచేఁ బూజింపఁదగినవాఁడవు, అట్టినీవునన్నుచక్కఁగాసమ్మానించిపూజించితివి. నీవుమాటలాడుటయందుసమర్థుఁడవు; నేనొకమాటచెప్పెదను;వినుము.

అని, తాత్పర్యము.

గవాం శతసహస్రేణ దీయతాం శబళా మమ

టీక॥ శబళా=మైలవన్నెగలకామధేనువు; మమ=నాకు; గవాం=ఆవులయొక్క; శతసహస్రేణ=లక్షచేత; దీయతాం = ఇయ్యఁబడుఁగాక.

లక్షావులు దీసికొని యీకామధేనువునాకిమ్ము.

అని, తాత్పర్యము.

రత్నం హి భగవన్నేత ద్రత్నహారీచ పార్థివః. ౯
తస్మాన్మే శబళాం దేహి మమైషా ధర్మతోద్విజ

టీక॥ భగవన్=మాహాత్మ్యముగలవసిష్ఠుఁడా! ఏతత్=ఇది; రత్నం హి=రత్నమువంటిదిగదా! రత్నహారీచ=రత్నములఁదీసికొనువాఁడును; పార్థివః=రాజు. తస్మాత్=అందువలన; మే=నాకు; శబళాం=కామధేనువును; దేహి=ఇమ్ము. ద్విజ=బ్రాహ్మణుఁడవైనవసిష్ఠుఁడా! ఏషా = ఈకామధేనువు; ధర్మతః=ధర్మమువలన; మమ=నాది.

భగవంతుఁడవగు వసిష్ఠుఁడా! ఈకామధేనువురత్నము; రత్నములన్నియురాజుసొమ్ము; కాఁబట్టి,దీనినాకిమ్ము; ధర్మంబుజూడఁగా, నిదిరాజయిననాదియేకాని, బ్రాహ్మణుఁడవగునీదికాదు.

అని, తాత్పర్యము.

ఏవముక్తస్తు భగవాన్వసిష్ఠో మునిసత్తమః. ౧౦
విశ్వామిత్రేణ ధర్మాత్మా ప్రత్యువాచ మహీపతిః

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగలవాఁడును; మునిసత్తమః=ము




నులలో శ్రేష్ఠుడును; ధర్మాత్మా=ధర్మబుద్ధిగలవాడునగు; వసిష్ఠః=వసిష్ఠమహాముని; విశ్వామిత్రేణ=విశ్వామిత్రునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; మహీపతిం = రాజయినవిశ్వామిత్రునిగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

భగవంతుండునుమునిశ్రేష్ఠుండును ధార్మికుండునగువసిష్ఠుండు, విశ్వామిత్రుండుచెప్పినమాటవిని, యతనితో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

నాహం శతసహస్రేణ నాపి కోటిశతైర్గవామ్. ౧౧
రాజన్ దాస్యామి శబళాం రాశిభీ రజతస్యచ

టీక॥ రాజన్=రాజా! అహం=నేను; శబళాం=కామధేనువును; గవాం=ఆవులయొక్క; శతసహస్రేణ=లక్షచేత; నదాస్యామి=ఇవ్వను; కోటిశతైరపి=కోటులయొక్కనూఱులచేతను; న(దాస్యామి) = ఇవ్వను; రజతస్య=వెండియొక్క; రాశిభిః=రాసులచేతను గాని; నదాస్యామి (అధ్యాహృతము) = ఇవ్వను.

విశ్వామిత్రమహారాజా ! లక్షగోవులిచ్చినను, పెక్కునూఱుకోట్లుగోవులిచ్చినను, వెండిరాసులిచ్చినను, నేనుకామధేనువునివ్వను.

అని, తాత్పర్యము.

న పరిత్యాగ మర్హేయం మత్సకాశా దరిందమ. ౧౨

టీక॥ అరిందమ=శత్రువులనడంగఁ ద్రొక్కునట్టివిశ్వామిత్రుఁడా! ఇయం=ఈకామధేనువు; మత్సకాశాత్=నాసమీపమునుండి; పరిత్యాగం=విడుపును; ప్రాప్తుం=(అధ్యాహృతము) పొందుటకు; నార్హా=తగినదికాదు.

శత్రువులనడంగఁ ద్రొక్కంజాలినవిశ్వామిత్రుఁడా! ఈకామధేనువునాసమీపముననే యుండవలసినదిగాని, విడువఁదగినదికాదు.

అని, తాత్పర్యము.

శాశ్వతీ శబళా మహ్యం కీర్తిరాత్మవతో యథా

టీక॥యథా=ఎట్లు;ఆత్మవతః= ధైర్యశాలికి;కీర్తిః = కీర్తియో;తథా(అధ్యాహృతము)=అట్లు; మహ్యం=(షష్ఠ్యర్థమందుఁజతుర్థి)నాకు;శబళా = కామధేనువు;శాశ్వతీ=ఎప్పటికినుండునది.

ధైర్యము గలవానికిఁ గీర్తియుం బోలె,నాకీకామధేనువు,వెప్పటికి,స్థిరముగానుండునది.

అని, తాత్పర్యము.

అస్యాం హవ్యంచ కవ్యంచ ప్రాణయాత్రా తథైవచ. ౧౩
ఆయత్త మగ్నిహోత్రంచ బలిర్హోమ స్తథైవచ

టీక॥ అస్యాం=ఈకామధేనువునందు;హవ్యంచ=దేవతలకియ్యఁదగినదియును;కవ్యంచ=పితృదేవతలకియ్యఁదగినదియును; తథైవచ=ఆలాగే;ప్రాణయాత్రా= జీవికయును,ఆహారముననుట,అగ్నిహోత్రంచ=అగ్నిహోత్రమును; బలిః=భూతబలియును; తథైవచ=ఆలాగే;హోమః= దర్శపూర్ణమాసాదిహోమమును;సర్వం(అధ్యాహృతము)=అన్నియును;ఆయత్తం=అధీనము.

దేవతలకుఁ గాని పితరులకుఁ గానిసమర్పించఁదగినదియును,నాయాహారమును , అగ్నిహోత్రమును, భూతబలియును దర్శపూర్ణమాసాదిహోమములును, ఈకామధేనువువలననేయగుచున్నవి.

అని, తాత్పర్యము.

స్వాహాకార వషట్కారౌ విద్యాశ్చ వివిధా స్తథా. ౧౪
ఆయత్త మత్ర రాజర్షే సర్వ మేత న్న సంశయః

టీక॥రాజర్షే=రాజునుఋషియునగువిశ్వామిత్రుఁడా' స్వాహాకారవషట్కారౌ = "స్వాహా,వషట్"అనుమంత్రములును; తథా=అట్లు;వివిధాః=నానావిధములయిన;విద్యాశ్చ=విద్యలును;ఏతత్ =ఇ




ది; సర్వం=అంతయును; అత్ర=ఈ కామధేనువునందు; ఆయత్తం=అధీనము. సంశయః= సందియము; న=లేదు.

రాజర్షి వగు విశ్వామిత్రుఁడా స్వాహా, వషట్, అనుమంత్రములును నానావిధములయినవిద్యలును, ఇవన్నియు, ఈకామధేనువువలన నేయగుచున్నవి; ఇందుకు సందేహము లేదు. అని, తాత్పర్యము.

సర్వస్వ మేత త్సత్యేన మమ తుష్టికరీ సదా. ౧౫

టీక॥ సత్యేన=సత్యముచేత; వదామి(అధ్యాహృతము)=చెప్పెదను. ఏతత్=ఇది; సర్వస్వం=సమస్తధనమును. మమ=నాకు; సదా=ఎల్లప్పుడు; తుష్టికరీ=సంతోషముసేయునది.

సత్యముగాఁజెప్పెదను, ఇదియే సర్వస్వమును; నాకెల్లప్పుడునుసంతోషముసేయునది.

అని, తాత్పర్యము.

కారణై ర్బహుభీ రాజ న్నదాస్యే శబళాం తవ

టీక॥ రాజన్=రాజా! బహుభిః=పెక్కులయిన; కారణైః=కారణములచేత; తవ=నీకు; శబళాం=కామధేనువును; నదాస్యే=ఇవ్వను.

విశ్వామిత్రుఁడా! పెక్కుకారణములున్నవి; గాన, నేను, నీకుఁగామధేనువునివ్వను. అని, వసిష్ఠమహాముని, విశ్వామిత్రునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

వసిష్ఠేనైవ ముక్తస్తు విశ్వామిత్రోఽ బ్రవీత్తతః. ౧౬
సంరబ్ధతర మత్యర్థం వాక్యం వాక్యవిశారదః

టీక॥ వాక్యవిశారదః=మాటలయందుఁబండితుండగు; విశ్వామిత్రస్తు=విశ్వామిత్రుఁడను; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; ఏవం=ఈప్రకా




రము; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తతః=అటుపిమ్మట;సంరబ్ధతరం= మిక్కిలియుఁబూనికగలదియు; అత్యర్థం= అధికమైనయర్థముగలదియునగు; వాక్యం=మాటను;అబ్రవీత్=పలికెను.

ఇట్లు వసిష్ఠుండుచెప్పినమాటవిని,మాటలయందుఁబండితుండగు విశ్వామిత్రుండు,మిక్కుటంబగుపూనికతో నర్థవంతంబయిన యొకమాట,చెప్పెను.

అని, తాత్పర్యము.

హైరణ్యకక్ష్యాగ్రైవేయాన్ సువర్ణాంకుశభూషితాన్. ౧౭
దదామి కుంజరాం స్తేషాం సహస్రాణి చతుర్దశ

టీక ॥ హైరణ్యకక్ష్యాగ్రైవేయాన్ = హైరణ్యా=బంగారువికారమయిన, కక్ష్యా=నడుమునఁగట్టెడుమోకులును, గ్రైవేయాన్= మెడనుగట్టెడు మోకులును గలవియును;సువర్ణాంకుశభూషితాన్= బంగారంకుశములచే నలంకరింపఁబడినవియునగు; కుంజరాన్=ఏనుఁగులను; దదామి= ఇచ్చెదను. తేషాం=అట్టియేనుఁగులయొక్క; చతుర్దశ=పదునాలుగు; సహస్రాణి=వేలను,దదామి (అధ్యాహృతము)=ఇచ్చెదను.

బంగారుతోఁజేయఁబడిన; నడుమునఁగట్టెడుమోకులును,గంఠంబునఁగట్టెడుమోకులును, గలిగి,పసిండి యంకుశంబుల నలంకృతంబులైయుండు నేనుంగులు పదునాలుగువేల,నిచ్చెదను.

అని, తాత్పర్యము.

హైరణ్యానాం రథానాంచ శ్వేతాశ్వానాంచతుర్యుజాం. ౧౮
దదామి తే శతాన్యష్టౌ కింకిణీకవిభూషితాన్

టీక॥హైరణ్యానాం= బంగారువికారము లయినవియును; శ్వేతాశ్వానాం=తెల్లగుఱ్ఱములుగలవియును;చతుర్యుజాం గేసిగుఱ్ఱములతోఁగూడిన కింకిణీకవిభూషితాన్(కి షితా

నాం=(షష్ఠ్యర్థమందుద్వితీయ)చిఱు గంటలచే నలంకరింపఁబడినవియున గు; రథానాంచ=రథములయొక్క; అష్టౌ=ఎనిమిది; శతానిచ=నూఱులను; తే=నీకు; దదామి=ఇచ్చెదను.

సువర్ణమయములయి, నాలుగేసి తెల్లగుఱ్ఱములుకట్టి, చిఱుగంటల నలంకృతంబులయియుండు, రథంబు లెనిమిదివందలిచ్చెదను.

అని, తాత్పర్యము.

హయానాం దేశజాతానాం కులజానాం మహౌజసామ్. ౧౮
సహస్ర మేకం దశచ దదామి తవ సువ్రత

టీక॥ సువ్రత= మంచివ్రతములు గలవసిష్ఠుఁడా! దేశజాతానాం= మంచిదేశములఁబుట్టినవియును; కులజానాం= మంచికులములందుఁబుట్టినవియును; మహౌజసాం=అధికమయినబలము గలవియునగు; హయానాం = గుఱ్ఱములయొక్క; ఏకం=ఒకటైన; సహస్రం=వేయిని; దశ=పది; సహస్రాణి(అధ్యాహృతము)=వేలను; తవ=నీకు; దదామి= ఇచ్చెదను.

మంచివ్రతంబులుగలవసిష్ఠుఁడా మంచిదేశముల మంచికులంబులంబుట్టి, గొప్పబలంబుగల గుఱ్ఱంబులుపదునొకండువేలు, నీకిచ్చెదను.

అని, తాత్పర్యము.

నానావర్ణ విభక్తానాం వయస్థ్సానాం తథైవచ. ౨౦
దదామ్యేకాం గవాం కోటిం శబలా దీయ తాం మమ

టీక॥ తథైవచ=ఆలాగే; నానావర్ణవిభక్తానాం, నానావర్ణ=పలు తెఱంగులయినరంగులచేత, విభక్తానాం= వేఱుపఱుపఁబడినవియును, వయస్థ్సానాం=యౌవనములోనుండునవియునగు; గవాం=ఆవులయొక్క, ఏకాం=ఒకటైన, కోటిం=కోటిని; దదామి=ఇచ్చెదను. శబలా= కామధేనువు, మమ = నాకు; దీయతాం=ఇయ్యఁబడుఁగాక.

నానావిధంబులగువర్ణంబులు గలిగి; లేఁతవయస్సులోనుండునట్టి

గోవులు లోకకోటియిచ్చెదను; నాకుఁ గామధేనువునిమ్ము. అని తాత్పర్యము.

యావదిచ్ఛసి రత్నంవా హిరణ్యంవా ద్విజోత్తమ. ౨౧
తావ ద్దదామి తత్సర్వం శబలా దీయతాం మమ

టీక॥ ద్విజోత్తమ=బ్రాహ్మణశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా! రత్నంవా=రత్నమునైనా; హిరణ్యంవా=బంగారమునైనా; యావత్=ఎంత; ఇచ్ఛసి=కోరెదవో; తావత్=అంత; తత్=దానిని; సర్వం=అంతయును; దదామి=ఇచ్చెదను; శబలా=కామధేనువు; మమ=నాకు; దీయతాం=ఇయ్యఁబడుఁగాక.

బ్రాహ్మణశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా! నీవురత్నములయినను బంగారమునైనను, ఎంతగోరెదవో, అవన్నియునీకిచ్చెదను; ఈ కామధేనువును నాకిమ్ము. అని, విశ్వామిత్రుఁడు వసిష్ఠునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు భగవాన్ విశ్వామిత్రేణ ధీమతా. ౨౨
న దాస్యామీతి శబలాం ప్రాహ రాజన్ కథంచన

టీక॥ భగవాన్ తు=మాహాత్మ్యముగలవసిష్ఠుఁడును; ధీమతా=బుద్ధిమంతుండగు, విశ్వామిత్రేణ=విశ్వామిత్రునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; "రాజన్=విశ్వామిత్రమహారాజా! కథంచన=ఎట్లయినను; శబలాం=కామధేనువును; న దాస్యామి=ఇవ్వను;" ఇతి=అని; ప్రాహ=చెప్పెను.

భగవంతుండగువసిష్ఠుండు, బుద్ధిమంతుండయిన విశ్వామిత్రుఁడు చెప్పినమాటవిని, "రాజా! ఏలాగైనను, కామధేనువునివ్వను" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏతదేవ హి మే రత్న మేతదేవ హి మేధనమ్. ౨౩
ఏతదేవ హి సర్వస్వ మేతదేవహి జీవితమ్

టీక॥ మే=నాకు; రత్నం=మణి, ఏతదేవహి=ఇదేకదా! మే=నాకు; ధనం=రొక్కము; ఏతదేవహి=ఇదేకదా! సర్వస్వం=సమస్తధనమును; ఏతదేవహి=ఇదేకదా! జీవితం = ప్రాణమును, ఏతదేవహి=ఇదేకదా!

నాకు, రత్నమును, ధనమును, సర్వస్వమును, ప్రాణమును, ఈకామధేనువేను. అని, తాత్పర్యము.

దర్శశ్చ పూర్ణమాసశ్చ యజ్ఞాశ్చైవాప్తదక్షిణాః. ౨౪
ఏతదేవ హిమే రాజన్ వివిధాశ్చక్రియాస్తథా

టీక॥ రాజన్=విశ్వామిత్రమహారాజా! మే=నాకు; దర్శశ్చ=అమావాస్యనాఁడు చేయఁదగినయిష్టియును; పూర్ణమాసశ్చ=పున్నమనాటియాగమును; ఆప్తదక్షిణాః = సరియయినదక్షిణలుగల; యజ్ఞాశ్చైవ=యాగములును; తథా=అట్లు; వివిధాః = నానావిధములయిన; క్రియాశ్చ=కర్మములును; ఏతదేవహి=ఇదియేకదా!

విశ్వామిత్రుఁడా! నాకు, దర్శమును బూర్ణమాసమును, యాగదక్షిణలును, మరియు నానావిధక్రియలును, ఈకామధేనువే.

అని, తాత్పర్యము.

అదోమూలాః క్రియాస్సర్వా మమ రాజన్న సంశయః. ౨౫

టీక॥ రాజన్= విశ్వామిత్రమహారాజా! మమ = నాయొక్క; క్రియాః=కర్మములు; సర్వాః=అన్నియు; అదోమూలాః=ఈకామధేనువే మూలముగాఁగలవి. సంశయః=సందేహము; న=లేదు.

విశ్వామిత్రుఁడా! నేను జేయుసత్కర్మములకంతటికిని, ఈకామధేనువే మూలము; ఇందు, సందియంబులేదు. అని, తాత్పర్యము.

బహునా కిం ప్రలాపేన నదాస్యే కామదోహినీమ్

టీక॥ బహునా = అధికమయి నస్త్రలాపేన = ఉపయోగములేని మాటలచేత; కిం = ఏమిప్రయోజనము? కామదోహినీం = కోర్కులను బితుకునట్టి కామధేనువును; నదాస్యే = ఇవ్వను.

ఉపయోగములేనిమాటల నధికముగా నాడనేల? కోరినవానినన్నింటిని బితుకునట్టి యీ కామధేనువుని వ్వను. అని, వసిష్ఠుండు విశ్వామిత్రునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, త్రిపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ త్రిపంచాశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

చతుఃపంచాశసర్గప్రారంభః.

కామధేనుం వసిష్ఠోపి యదా నత్యజతే మునిః
తదాస్య శబళాం రామ విశ్వామిత్రోఽన్వకర్షత. ౧

టీక॥ రామ = రాముఁడా! యదా = ఎప్పుడు; మునిః = బ్రహ్మానుసంధానము సేయునట్టి; వసిష్ఠోపి = వసిష్ఠుఁడును; కామధేనుం = కామధేనువును; నత్యజతే (భూతార్థమందు లట్) = విడువలేదో; తదా = అప్పుడు; విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; అస్య = ఈవసిష్ఠునియొక్క; శబళాం = కామధేనువును; అన్వకర్షత = ఈడ్చెను.

ఇట్లు, వసిష్ఠమహాముని, కామధేనువును విడువకుండుటంజూచి, విశ్వామిత్రుఁడు, వసిష్ఠుని కామధేనువునుబలాత్కారముగా, నీడ్చెను.

అని, తాత్పర్యము.

నీయమానాతు శబళా రామ రాజ్ఞా మహాత్మనా
దుఃఖితా చింతయామాస రుదంతీ శోకకర్శితా. ౨

టీక॥ రామ=రాముఁడా! శబళాతు=కామధేనువును, మహాత్మనా=అధికమయినధైర్యముగల; రాజ్ఞా= విశ్వామిత్రమహారాజుచేత; నీయమానాతు= తీసికొనిపోఁబడుచున్నదై, దుఃఖితా=వగపునొందినదై; శోకకర్శితా=దుఃఖముచేసన్నముగాఁజేయఁబడినదై; రుదంతీ=ఏడ్చుచు; చింతయామాస=ఆలోచించెను.

రాముఁడా! కామధేనువు, మహాత్ముండగువిశ్వామిత్రునిచే, నీడ్వఁబడి, వగపునంగుందుచు, రోదనంబుసేయుచు, నిట్లని, చింతించెను.

అని, తాత్పర్యము.

పరిత్యక్తా వసిష్ఠేన కిమహం సుమహాత్మనా
యాహం రాజభృత్యై దీనా హ్రియేయం భృశదుఃఖితా. ౩

టీక॥ భృశదుఃఖితా=మిక్కిలియు దుఃఖమునొందిన దానను; దీనా=భయము పడిన దాననగు; యా=ఏ; అహం = నేను; రాజభృత్యైః=విశ్వామిత్రమహారాజుయొక్కబంటులచేత; హ్రియేయం=అపహరింపఁబడుదునో ; సా (అధ్యాహృతము)=ఆ; అహం=నేను; సుమహాత్మనా=మిక్కిలియుఁబూజ్యమైనమనస్సుగల; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; పరిత్యక్తా కిం= విడువఁబడితినాయేమి?

మిక్కిలియుదుఃఖముజెందిభయముపడియున్ననన్నువిశ్వామిత్రునిభటులు, బలాత్కారముగాఁగొనిపోవుచున్నారు; మహాత్ముండగువసిష్ఠుండునన్నువిడిచెనాయేమని, తాత్పర్యము.

కిం మయాఽపకృతం తస్య మహర్షే ర్భావితాత్మనః
యన్మామనాగసం భక్తా మిష్టాం త్యజతి ధార్మికః. ౪

టీక॥ భావితాత్మనః=ధ్యానింపఁబడినపరమాత్మగల; తస్య=ఆ; మహర్షేః = పూజ్యుఁడైనఋషి యగువసిష్ఠునకు; మయా=నాచేత; కిం=ఏమి; అపకృతం=అపకారము చేయఁబడినది. యత్=ఏకారణము వలన; ధార్మికః=ధర్మమునాచరించునట్టివసిష్ఠుఁడు; అనాగసం=అపరాధములేని దానను, భక్తాం=అనురాగముగలదానను; ఇష్టాం=కోరఁబడిన దాననునగు; మాం=నన్ను; త్యజతి=విడుచునో.

ధార్మికుండగువసిష్ఠుండు, నిరపరాధినియునుభక్తురాలునుఁబ్రియయునగునన్నువిడుచునంతటి యపకారము, ఆత్మవేత్తయగువసిష్ఠునకేమిచేసితిని. అని, చింతించెను.

అని, తాత్పర్యము.

ఇతి సా చింతయిత్వా తు వినిశ్శ్వస్య పునఃపునః
నిర్ధూయ తాం స్తదా భృత్యాన్ శతశ శ్శత్రుసూదన
జగామా నిలవేగేన పాదమూలం మహాత్మనః. ౫

టీక॥ శత్రుసూదన=పగతురం జంపురాముఁడా! సా=ఆకామధేనువు; ఇతి=ఇట్లు; చింతయిత్వా తు=ఆలోచించినంతనే; పునఃపునః=మాటిమాటికి; వినిశ్శ్వస్య=నిట్టూర్పువిడిచి; తదా=అప్పుడు; తాన్=ఆ; భృత్యాన్=భటులను; శతశః=నూఱునూఱుగా; నిర్ధూయ=విదిలించి; మహాత్మనః=పూజ్యస్వభావముగలవసిష్ఠునియొక్క; పాదమూలం=అడుగులదరిని; అనిలవేగేన=వాయువేగముచేత; జగామ=పొందెను.

శత్రువులం జంపునట్టి రాముఁడా! ఆకామధేనువిట్లుచింతించి, మాటిమాటికినిట్టూర్పునిగుడించుచు, ఒక్కొకమాటు నూఱునూఱుమందినిగానాభటులనందఱవిదిలించి, వా

యువేగంబున, మహాత్ముండగువసిష్ఠునిపాదమూలంబుఁజేరెను.

అని, తాత్పర్యము.

శబళా సా రుదంతీ చ క్రోశంతీ చేద మబ్రవీత్
వసిష్ఠస్యా గ్రత స్థిత్వా మేఘదుందుభిరావిణీ. ౬

టీక॥ సా=ఆ; శబళా=కామధేనువు; వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క; అగ్రతః=ముందట; స్థిత్వా=ఉండి, రుదంతీచ= ఏడ్చుచును; క్రోశంతీ చ=అఱచుచును; మేఘదుందుభిరావిణీ=మబ్బువలెను భేరివలెనుధ్వనించుచు; ఇదం=దీనిని; అబ్రవీత్=పలికెను.

ఆకామధేనువు, వసిష్ఠునిముందట,నిలిచి, యేడ్చుచు, మేఘదుందుభులుంబోలెనఱచుచు, ఇట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

భగవన్ కిం పరిత్యక్తా త్వయాహం బ్రహ్మణస్సుత
యస్మా ద్రాజభృతా మాం హి నయంతే త్వత్సకాశతః. ౭

టీక॥ బ్రహ్మణః=బ్రహ్మదేవుని యొక్క; సుత=కుమారుఁడవగు; భగవన్=మహాత్మ్యముగల వసిష్ఠుఁడా; త్వయా=నీచేత; అహం=నేను; పరిత్యక్తాకిం= విడువఁబడితినా యేమి? యస్మాత్=ఏకారణమువలన; రాజభృతాః=రాజుయొక్కనౌకరులు; త్వత్సకాశతః=నీసమీపమునుండి; మాం= నన్ను; నయంతే హి=కొనిపోవుచున్నారో

బ్రహ్మపుత్రుండవుభగవంతుండవునగువసిష్ఠుఁడా' నీవునన్నువిడిచినావాయేమి? నన్నేలయీరాజభటులునీసమీపమునుండి యీడ్చికొనిపోయెదరు. అని,కామధేనువు వసిష్ఠునితోఁజెప్పెను.అని తాత్పర్యము.

ఏవ ముక్తస్తు బ్రహ్మర్షి రిదం వచన మబ్రవీత్

టీక॥ బ్రహ్మర్షిః=బ్రాహ్మణుండును ఋషియు నగు వసిష్ఠుండు; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

బ్రహ్మర్షియగు వసిష్ఠుండు, కామధేనువుచెప్పినమాటవిని,యిట్లు నిబదులుచెప్పెను.అని, తాత్పర్యము

శోకసంతప్తహృదయాం స్వసార మివ దుఃఖితామ్. ౮
నత్వాం త్యజామి శబలే నాపి మేఽ పకృతంత్వయా
ఏష త్వాం నయతే రాజా బలా న్మత్తో మహాబలః. ౯
నహితుల్యం బలం మహ్యం రాజాత్వద్య విశేషతః
బలీ రాజా క్షత్రియశ్చ పృథివ్యాః పతిరేవచ. ౧౦

టీక॥ శబలే=కామధేనువా; శోకసంతప్తహృదయాం, శోక=దుఃఖముచేత, సంతప్త=తపింపఁబడుచున్న, హృదయాం=మనంబుగల; స్వసారమివ=చెల్లెలివలె; దుఃఖితాం=ఏడ్చుచున్న; త్వాం=నిన్ను; నత్యజామి=విడిచిపెట్టను; త్వయా=నీచేతను; మె=నాకొఱకు; నాపకృతం=అపకారముజేయఁబడలేదు; మహాబలః, మహత్=అధికమైన; బలః=పరాక్రమముగల; ఏషః=ఈ; రాజా=విశ్వామిత్రమహారాజు; మత్తః=నాసమీపమునుండి; త్వాం=నిన్ను; బలాత్=బలమువల్ల; నయతే=తీసుకొనిపోవుచున్నాఁడు; మహ్యం, మమ=నాకు(షష్ఠ్యర్థమందుఁజతుర్థి); తుల్యం=విశ్వామిత్రమహారాజుతోసరియైన; బలం=సేనాబలము; నహి=లేదుగదా; (తపోబలముచేనిగ్రహించుటకు) రాజాతు=రాజుగానున్నవిశ్వామిత్రుఁడు; అద్యవిశేషతః=ఇవ్వబడినయాతిథ్యముగలయీదినమందు; అవధ్యః(అధ్యాహృతము)=చంపఁదగినవాఁడుకాఁడు; బలీ=బలవంతుఁడైన; రాజా=రాజు; (మరియు) పృథివ్యాః=భూమికి; పతిరేవచ=పరిపాలించు ప్రభువునుగానున్నాఁడు (కావునఁజంపఁగూడదనుట).

ఓ కామధేనువా, దుఃఖముచేఁద

పింపబడుచున్నమనస్సుగల్గితోఁబుట్టువవలె నేడ్చుచున్న నిన్నునే విడువంజాలను మహాబలవంతుండగు నీవిశ్వామిత్రమహారాజు నాసమీపము నుండినిన్నుబలాత్కారముగాఁ దీసికొనిపోవుచున్నాఁడు, నాకారాజుతోసరియైన సేనాబలములేదు, తపోబలముచే నిగ్రహించుటకుఁ బరిపాలించునట్టి రాజుగానున్నాఁడు, మఱియు, నిష్టాడేయాతిథ్యమిచ్చితిగావునజంపగూడదు. ఇంతియెగాక, పృథ్వీపతింజంపినమహాపాతకము. అని, కామధేనువుతో, వసిష్ఠమహర్షిచెప్పెను.

అని, తాత్పర్యము.

ఇయ మక్షౌహిణీ పూర్ణా సవాజిరథ సంకులా
హస్తి ధ్వజసమాకీర్ణా తేనాసౌ బలవత్తరః. ౧౧

టీక॥ హస్తిధ్వజసమాకీర్ణా, హస్తి= ఏనుంగులయందు గట్టఁబడిన, ధ్వజ=టెక్కెములచేత, సమాకీర్ణా=వ్యాప్తమై; సవాజిరథసంకులా, సవాజి=గుఱ్ఱములతోఁగూడియున్న, రథ= అరదములచేత; సంకులా= కిక్కిరిసికొనియున్నట్టి, ఇయం=ఈ; అక్షౌహిణీ = సేన; పూర్ణా = నిండుగనున్నది; తేన = దానిచేత; అసౌ = ఈ విశ్వామిత్ర మహారాజు; బలవత్తరః= అతిశయించిన బలముగలవాఁడు.

ఓకామధేనువా యేనుంగులయందుగట్టఁబడినధ్వజములచేసంకీర్ణమై గుఱ్ఱములు గట్టఁబడిన రథములచే వ్యాప్తమైయున్న యీవిశ్వామిత్రమహారాజుయొక్క సేన సంపూర్ణముగా నున్నది గావున నావిశ్వామిత్రుండుసమికిలిబలము గలవాఁడై యున్నాఁడని, వసిష్ఠమహాముని కామధేనువుతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవముక్తా వసిష్ఠేన ప్రత్యువాచ వినీతవత్
వచనం వచనజ్ఞా సా బ్రహ్మర్షి మమితప్రభమ్. ౧౨



టీక॥ ఏవం = ఈప్రకారము; వసిష్ఠేన=వసిష్ఠమహామునిచేత; ఉక్తా=చెప్పఁబడినదియు; వినీతవత్, వినీతా = వినీతమైనదియు; వచనజ్ఞా,వచన=మాటను, జ్ఞా=ఎఱింగినదియునైన; సా=ఆకామధేనువు; అమితప్రభం, అమిత=మితిలేని,ప్రభం=కాంతిగల; బ్రహ్మర్షిం=బ్రాహ్మణుఁడును ఋషియును నైన వసిష్ఠుని గూర్చి; వచనం=మాటను; ప్రత్యువాచ=బదులు చెప్పెను.

వచనస్వారస్యము దెలిసిన యా కామధేనువు వసిష్ఠమహామునిచే నిట్లు జెప్పంబడి వినీతమైయమిత తేజస్సుగల యా వసిష్ఠ మహర్షి నింగూర్చి యుత్తరవుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

నబలం క్షత్రియస్యాహు ర్బ్రాహ్మణో బలవత్తరః
బ్రహ్మన్ బ్రహ్మబలం దివ్యం క్షత్రాత్తు బలవత్తరమ్. ౧౩

టీ॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా! క్షత్రియస్య=క్షత్రియునియొక్క; బలం=బలము; నబలం=అల్పబలము; బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు; బలవత్తరః=ఎక్కుడు బలము గలవాఁడు; బ్రహ్మబలం = బ్రాహ్మణబలము; క్షత్రాత్ తు=క్షత్రియబలమునకంటెను; దివ్యం=శ్రేష్ఠమైనది; బలవత్తరం=అధికబలయుక్తమైనది, ఇతి(అధ్యాహృతము)=అని; ఆహుః=చెప్పుదురు.

బ్రాహ్మణుఁడవగు నో వసిష్ఠమహామునీ, క్షత్రియుని యొక్క బలమల్పబలము బ్రాహ్మణుఁడు మిగుల బలముగలవాఁడు, బ్రాహ్మణుని బలము క్షత్రియుని బలమునకన్నను శ్రేష్ఠంబున ధికబలిష్ఠంబునని పెద్దలు చెప్పుదురు. అని, తాత్పర్యము.

అప్రమేయబలం తుభ్యం న త్వయా బలవత్తరః
విశ్వామిత్రో మహావీర్య స్తేజ స్తవ దురాసదమ్. ౧౪

టీక॥ బ్రహ్మన్ (అధ్యాహృతము)= బ్రాహ్మణుఁడా! తుభ్యం(తవ)(షష్ఠ్యర్థమందు చతుర్థి) = నీయొక్క; బలం=(అధ్యాహృతము)=తపోబల



ము; అప్రమేయబలం = కొలతపెట్టుటకలవిగానిబలము; మహావీర్యః = అధికమైనపరాక్రమముగల; విశ్వామిత్రః = విశ్వామిత్రమహారాజు; త్వయా (త్వత్తః) (పంచమ్యర్థమందుతృతీయా) = నీకంటెను; బలవత్తరః = అధికమైన బలముగలవాఁడు; న = కాఁడు; తవ = నీయొక్క; తేజః = ప్రభావము; దురాసదం = సహింపశక్యమైనది కాదు.

వసిష్ఠమహామునీ నీయొక్క బలమింతని చెప్పుట కలవిగాదు మిగులపరాక్రమము గలవాఁడైనను విశ్వామిత్రమహారాజు నీకంటెనతిశయుఁడు కాఁడునీప్రభావమె మిక్కిలి యునధికమైనది. అని, తాత్పర్యము.

నియుఙ్క్ష్వమాం మహాభాగ త్వద్బ్రహ్మబలసంభృతామ్
తస్య దర్పబలం యత్తన్నాశయామి దురాత్మనః. ౧౫

టీక॥ మహాభాగ = పూజ్యుఁడవైనవసిష్ఠమహామునీ; త్వద్బ్రహ్మబలసంభృతాం, త్వత్ = నీయొక్క; బ్రహ్మబల = మంత్రబలముచేత; సంభృతాం = వృద్ధిబొందినప్రభావముగల; మాం = నన్ను; నియుఙ్క్ష్వ = నియోగింపుము; దురాత్మనః = దుష్టస్వభావముగల; తస్య = ఆవిశ్వామిత్రునియొక్క; దర్పబలం, దర్ప = గర్వముచేతనైన; బలం = బలము; యత్ = ఏదికలదో; తత్ = దానిని; నాశయామి = పోఁగొట్టుచున్నాను.

పూజ్యుఁడవైనవసిష్ఠమహర్షీ నీమంత్రప్రభావమువలన వృద్ధిబొందినమహిమగల నన్ను నియోగింపుముదురాత్ముండగు నావిశ్వామిత్రునియొక్కగర్వబలమంతయు నాశముఁజేసెదను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తస్తు తయా రామ వసిష్ఠస్సు మహాయశాః
సృజస్వేతి తదోవాచ బలం పరబలారుజమ్. ౧౬

టీక॥ రామ = రాముఁడా! సుమహాయశాః, సుమహత్ = అధికమైన, యశాః = కీర్తిగల; వసిష్ఠః = వసిష్ఠమహామునిః; (తుఅనునది పాదపూరణార్థము) తయా = ఆకామధేనువుచేత, ఇతి = ఇట్లు; ఉక్తః = చె

ప్పఁబడినవాఁడై; తదా=అప్పుడు; పరబలారుజం, పరబల=శత్రుబలమును, ఆరుజం=చంపునట్టి; బలం=సైన్యమును; సృజస్వ=సృజియింపుము; ఇతి=అని; ఉవాచ=పలికెను.

రామా! మహాయశుండగు నావసిష్ఠమహర్షి, కామధేనువుచేనిట్లుఁ జెప్పఁబడినవాఁడైయప్పుడు శత్రుబలంబుల నడగద్రొక్కఁగలబలమును సృజియింపుమనియాకామధేనువుతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా సురభి స్సా సృజత్తదా

టీక॥ సా=ఆ; సురభిః = కామధేనువు; తస్య=ఆవసిష్ఠమహాముని యొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; తదా=అప్పుడు; అసృజత్=సృజించెను.

ఆకామధేనువావసిష్ఠమహర్షి మాటవినియప్పుడుసృజించెను.

అని, తాత్పర్యము.

తస్యా హుంభా రవోత్సృష్టాః పహ్లవా శ్శతశో నృప. ౧౭
నాశయంతి బలం సర్వం విశ్వామిత్రస్య పశ్యతః

టీక ॥ నృప = రాజా! తస్యాః = ఆకామధేనువుయొక్క; హుంభారవోత్సృష్టాః, హుంభా=(పశువులుజేయు)హుంభాఅను, రవ=ధ్వనిచేత, ఉత్సృష్టాః = నిర్మింపఁబడిన; శతశః=వేనవేలైన; పహ్లవాః = పహ్లవులను మ్లేచ్ఛజాతీయులు; విశ్వామిత్రస్య=విశ్వామిత్రమహారాజు; పశ్యతః= చూచుచుండఁగానే; (అనాదరమందుషష్ఠి) సర్వం=సమస్తమైన; బలం=విశ్వామిత్రుని సైన్యమును; నాశయంతి=(భూతార్థమందులట్) నశింపఁజేసిరి.

రాముఁడా! ఆకామధేనువుయొక్క పశువులుసేయు హుంభాయనుశబ్దముచేనిర్మింపఁబడినపహ్లవులను మ్లేచ్ఛులావిశ్వామిత్రమహారాజు చూచుచుండగా నతని సైన్యమంతయుంజంపిరి. అని తాత్పర్యము

బలం భగ్నం తతో దృష్ట్వా రథేనాక్రమ్య కౌశికః. ౧౮
సరాజా పరమ క్రుద్ధో రోషవిస్ఫారితేక్షణః
పహ్లవా న్నాశయామాస శస్త్రై రుచ్చావచైరపి. ౧౯

టీక॥ తతః=పిమ్మట; కౌశికః=కుశికపుత్త్రుండును; రాజా=ప్రభువునగు; సః=ఆవిశ్వామిత్త్రుఁడు; భగ్నం = భంగపఱుచఁబడిన; బలం==తనసైన్యమును; దృష్ట్వా=చూచి; పరమక్రుద్ధః=మిక్కిలికోపముగలవాఁడై; రోషవిస్ఫారితేక్షణః, రోష=రోషముచేత, విస్ఫారిత=చక్కఁగాఁదెరవఁబడిన, ఈక్షణః=నేత్రములుగలవాఁడగుచు; రథేన=రథముచేత; ఆక్రమ్య=అరికట్టి; ఉచ్చావచైః=మీదనుక్రిందను వ్యాపించునట్టి; శస్త్రైః=ఆయుధములచేత; పహ్లవాన్=పహ్లవసంజ్ఞగల మ్లేచ్ఛులను; నాశయామాస= చంపెను.

ఆపిమ్మట కుశికపుత్త్రుండగు విశ్వామిత్రమహారాజు నాశమునొందిన తన సైన్యమును జూచి రోషముచేగన్నులుఱుముచు నత్యంతకోపముతో మ్లేచ్ఛులను రథముచే నాక్రమించి యద్భుతంబులగు శస్త్రములచేతంజంపెను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రార్దితాన్ దృష్ట్వా పహ్లవాం చ్ఛతశ స్తదా
భూయఏవా సృజత్కోపా చ్ఛకాన్ యవన మిశ్రితాన్. ౨౦

టీక॥ సా=(అధ్యాహృతము) ఆకామధేనువు; తదా=అప్పుడు; శతశః=నూఱునూఱులుగా; విశ్వామిత్రార్దితాన్, విశ్వామిత్ర=విశ్వామిత్రమహారాజుచేత, అర్దితాన్=హింసింపఁబడిన; పహ్లవాన్=పహ్లవులను మ్లేచ్ఛులను; దృష్ట్వా=చూచి; కోపాత్=కోపమువలన; యవనమిశ్రితాన్=యవనులతోఁగూడికొనియున్న; శకాన్=శకసంజ్ఞగల మ్లేచ్ఛులను; భూయఏవ=తిరిగియును; అసృజత్=పుట్టించెను.




అప్పుడా కామధేనువు, వేలకొలంది గావిశ్వామిత్రునిచేతం జంపబడినపల్లవ సంజ్ఞికులగు మ్లేచ్ఛులం బూచికోపముతో యవనులతోఁ గూడియున్నశకసంజ్ఞులగు మ్లేచ్ఛులనుమరలసృజించెను. అని, తాత్పర్యము.

తై రాసీ త్సంవృతా భూమి శ్శకై ర్యవనమిశ్రితైః

టీక॥ తైః=ఆ; యవనమిశ్రితైః=యవనులతోడం గూడియున్న; శకైః = శకసంజ్ఞికమ్లేచ్ఛులచేత; భూమిః=భూమి; సంవృతా=ఆవరింపఁబడినది; ఆసీత్ =ఆయెను. ఆయవనులతోఁ గూడియున్న శకసంజ్ఞగల మ్లేచ్ఛులచేత భూమియంతయు నావరింపఁ బడినదాయెను.

అని, తాత్పర్యము.

ప్రభావద్భి ర్మహావీర్యై ర్హేమకింజల్కసన్నిభైః. ౨౧
దీర్ఘాసి పట్టసధరై ర్హేమవర్ణాంబరావృతైః
నిర్దగ్ధం త ద్బలం సర్వం ప్రదీప్తై రివ పావకైః. ౨౨

టీక॥ ప్రభావద్భిః=ప్రకాశముగలవారును; మహావీర్యైః=మిక్కుటంబగు పరాక్రమముగలవారును; హేమకింజల్కసన్నిభైః, హేమ=సంపంగిపువ్వుయొక్క, కింజల్క=కేసరములతో, సన్నిభైః=సమానకాంతిగలవారును; దీర్ఘాసిపట్టసధరైః, దీర్ఘ=పొడవైన, అసి=కత్తులను, పట్టస=పట్టసములను, ధరైః=ధరించినవారును; హేమవర్ణాంబరావృతైః, హేమవర్ణ=బంగారమువన్నెగల, అంబర = వస్త్రములచేత, ఆవృతైః=కట్టఁబడియున్నవారునగు; శకైః=(అధ్యాహృతము) శకసంజ్ఞికమ్లేచ్ఛులచేత; ప్రదీప్తైః = మిక్కిలియుమండుచున్న; పావకైరివ= నిప్పులచేతవలె; తద్బలం, తత్ =ఆవిశ్వామిత్రునియొక్క, బలం=సైన్యము; సర్వం=అంతయును; నిర్దగ్ధం=కాల్పఁబడెను.

మిగులఁ బ్రకాశించుచున్నట్టియు మిక్కుటంబగు పరాక్రమము




గల్గి, సంపంగిరేకులకు సరియైన కాంతులుగల్గిపొడవైనకత్తులు పట్టసములునుధరించికొని బంగారువన్నెబట్టలుగలయామ్లేచ్ఛులచేతనా విశ్వామిత్ర మహారాజు బలమంతయును,మండుచున్న నిప్పులచేతంబలె నిశ్శేషముగఁగాల్పంబడెను.

అని, తాత్పర్యము.

తతో స్త్రాణి మహాతేజా విశ్వామిత్రో ముమోచ హ

తైస్తై ర్యవనకాంభోజాః పహ్లవాశ్చా కులీకృతాః. ౨౩

టీక॥ తతః=అటుపిమ్మట; మహాతేజాః=అధికమైన పరాక్రమముగల; విశ్వామిత్రః=విశ్వామిత్రమహారాజు; అస్త్రాణి= అస్త్రములను; ముమోచ = ప్రయోగించెను ; ("హ" అనునది పాదపూరణార్థము) తైస్తైః=ఆయాయస్త్రములచేత; యవనకాంభోజాః=యవనులు కాంభోజులును; పహ్లవాశ్చ=పహ్లవులును; ఆకులీకృతాః=కలతనొందినవారుగాఁజేయఁబడిరి.

అంతమిగులఁబరాక్రమవంతుండగు, విశ్వామిత్ర మహారాజమోఘంబులగునస్త్రములం బ్రయోగించెనంతనాయస్త్రములచేతయవనులు,కాంభోజులు,పహ్లవులు,అనుపేరంబరగిన మ్లేచ్ఛులఁదఱును,వ్యాకులముఁగలవారుగాఁజేయంబడిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, బాలకాండే,

చతుఃపంచాశస్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండచతుఃపంచాశసర్గటీక, ముగిసినది.

శ్రీ

పంచపంచాశసర్గప్రారంభః.

తత స్తా నాకులా న్దృష్ట్వా విశ్వామిత్రాస్త్రమోహితా
న్వసిష్ఠ శ్చోదయామాస కామధు క్సృజ యోగతః. ౧

టీక॥ తతః=పిమ్మట; వసిష్ఠః=వసిష్ఠమహర్షి; విశ్వామిత్రాస్త్రమోహితాన్, విశ్వామిత్ర = విశ్వామిత్రునియొక్క, అస్త్ర=అస్త్రంబులచేత, మోహితాన్ = మోహమునొందింపబడినట్టియు; ఆకులాన్=కలతవడిపరువిడుచున్న; తాన్=ఆయవనాదులను; దృష్ట్వా=చూచి; కామధుక్=ఓకామధేనువా; త్వం=(అధ్యాహృతము)నీవు; యోగతః=యోగమహిమవలన; తాన్ = (అధ్యాహృతము) ఆయవనాదులను; సృజ=పుట్టింపుము; ఇతి = (అధ్యాహృతము)అని; చోదయామాస=ప్రేరేపించెను.

పిమ్మటవసిష్ఠమహర్షి విశ్వామిత్రమహారాజుయొక్కయస్త్రవేటులకోర్వజాలకపరువిడుచున్నతనసైనికులం జూచి యోకామధేనువానీవుయోగమహిమవలన మరలనాయవనాదులనుసృజింపుమని ప్రేరేపించెను. అని, తాత్పర్యము.

తస్యా హుంభా రవా జ్జాతాః కాంభోజా రవిసన్నిభాః
ఊధస స్త్వథ సంజాతాః పహ్లవా శ్శస్త్రపాణయః. ౨
యోనిదేశా చ్చ యవనా శ్శకృద్దేశా చ్ఛకా స్తథా
రోమకూపేషు చ మ్లేచ్ఛా హారీతా స్సకిరాతకాః. ౩

టీక తస్యాః=ఆకామధేనువుయొక్క; హుంభారవాత్, హుంభ=హుంభయను; ఆరవాత్=ధ్వనివలన; రవిసన్నిభాః, రవి=సూర్యునితో, సన్నిభాః = సమానులయిన; కాంభోజాః= కాంభోజులనువార

లు, జాతాః=పుట్టిరి; అథ=పిమ్మట; ఊధసః= స్తనంబులనుండి; శస్త్రపాణయః, శస్త్ర=ఆయుధములు; పాణయః = చేతులందుగల; పహ్లవాః=పహ్లవులనువారలును; యోనిదేశాత్ = యోనిప్రదేశమునుండి; యవనాశ్చ=యవనులనువారలును; తథా=అలాగుననే; శకృద్దేశాత్= పురీషప్రదేశముననుండి; శకాః=శకులనువారును; రోమకూపేషు, రోమ= వెంట్రుకలయొక్క, కూపేషు=కుదుళ్లయందు; (ఇచటపంచమ్యర్థమందుసప్తమి) మ్లేచ్ఛాశ్చ= తురకలును; సకిరాతకాః=బోయలతోకూడిన; హారీతాః=హారీతులనువారును; సంజాతాః=పుట్టిరి.

ఆకామధేనువుయొక్క హూంభయనుధ్వనివలన సూర్యునితోసమానులయిన కాంభోజులును స్తనప్రదేశంబువలననస్త్రములను ధరించిన పహ్లవులనువారలును యోనిప్రదేశంబునుండియవనులనువారలును శకృత్ప్రదేశమునుండి శకులనువారలును, రోమకూపములనుండి తురకలును, బోయలతోకూడిన హారీతులనువారలునుబుట్టిరి.

అని, తాత్పర్యము.

(ఇచట, ౪ శ్లోకములు,— "తస్యాఇత్యాదిచత్వారః" అని, గోవిందరాజులు వారు వ్యాఖ్యానమందుప్రతీకచేసియున్నారు, సర్వదేశపుస్తకములందును ౩, శ్లోకములే కనుపడుచున్నవి, కాబట్టి, నాలవశ్లోకముపండితులు వెదుకందగినదిగానున్నది.

తైస్తైర్నిషూదితం సర్వం విశ్వామిత్రస్య తత్క్షణాత్
సపదాతిగజం సాశ్వం సరథం రఘునందన. ౫

టీక॥ రఘునందన= రాముఁడా! సపదాతిగజం= కాలుబలములతోను గజములతోనుంగూడినదియు; సాశ్వం= గుఱ్ఱములతోఁగూడినదియు; సరథం=రథములతోఁగూడినదియునగు; విశ్వామిత్రస్య=విశ్వామిత్రమహారాజుయొక్క; సర్వం=సమస్తమైన; తత్=ఆసైన్యము; తైస్తైః=ఆ




యాకాంభోజ పహ్లవ యవనాదుల చేత; క్షణాత్=క్షణమాత్రములో నే; నిషూదితం=చంపఁబడినది.

రాముఁడా! కాలుబలముతోను గజములతోను గుఱ్ఱములతోను రథములతోనుంగూడిన విశ్వామిత్రమహారాజుయొక్క సర్వసైన్యమును నిమిషకాలములో నాకాంభోజపహ్లవయవనాదిమ్లేచ్ఛులచేతఁ జంపఁబడినది. అని, తాత్పర్యము.

దృష్ట్వా నిషూదితం సైన్యం వసిష్ఠేన మహాత్మనా
విశ్వామిత్ర సుతానాంచ శతం నానావిధా యుధమ్. ౬
అభ్యధావ త్సుసంక్రుద్ధం వసిష్ఠం జపతాంవరమ్

టీక॥ నానావిధాయుధం, నానావిధ=పలుఁదెఱంగులైన, ఆయుధం=ఆయుధములుగల; విశ్వామిత్రసుతానాం, విశ్వామిత్ర=విశ్వామిత్రునియొక్క, సుతానాం=కొడుకులయొక్క; శతంచ=నూరును; మహాత్మనా=పూజ్యుడైన; వసిష్ఠేన=వసిష్ఠమహామునిచేత; నిషూదితం=చంపఁబడిన; సైన్యం=బలమును; దృష్ట్వా=చూచి; సుసంక్రుద్ధం=విశేషకోపముతోఁ గూడి యున్న; జపతాం=తపస్సుచేయువారలలో; వరం=శ్రేష్ఠుఁడైన; వసిష్ఠం=వసిష్ఠమహర్షినిగూర్చి; అభ్యధావత్=పరువెత్తెను.

విశ్వామిత్రునియొక్క కొడుకులు నూగుఱు రును మహాత్ముఁడైన వసిష్ఠమహామునిచేతఁజంపఁబడినతమ సైన్యమునుజూచి మిగుల కోపముతోఁగూడుకొనియున్నట్టియు తపముఁజేయు వారలలో శ్రేష్ఠుఁడైనట్టివసిష్ఠమహర్షినిగూర్చి పరువెత్తిరి. అని, తాత్పర్యము.

హుంకారేణైవ తాన్ సర్వాన్ దదాహ భగవా నృషిః. ౭

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగల; ఋషిః=వసిష్ఠమహర్షి; తాన్=వారలను; సర్వాన్=అందఱిను; హుంకారేణైవ=హుంకార




ముచేతనే; దదాహ=దహించెను. మాహాత్మ్యముగల వసిష్ఠమహర్షి వారలనందరను హుంకారము చేతనే దహించెను. అని తాత్పర్యము

తే సాశ్వరథపాదాతా వసిష్ఠేన మహాత్మనా
భస్మీకృతా ముహూర్తేన విశ్వామిత్రసుతా స్తదా. ౮

టీక॥ తదా=అప్పుడు; సాశ్వరథపాదాతాః=అశ్వములతోను రథములతోను పదాతులతోను కూడిన; తే=ఆ; విశ్వామిత్రసుతాః=విశ్వామిత్రుని కొడుకులు; ముహూర్తేన=ముహూర్తకాలములో; మహాత్మనా=మహాప్రభావముగల; వసిష్ఠేన=వసిష్ఠమహర్షిచేత; భస్మీకృతాః=బూడిదగాఁజేయఁబడిరి.

అప్పుడు చతురంగబలముతోఁ గూడిన నావిశ్వామిత్రునికొమారులు మహాప్రభావముగల వసిష్ఠునిచే తముహూర్తకాలములో బూడిదగాఁజేయఁబడిరి. అని తాత్పర్యము

దృష్ట్వా వినాశితాన్ పుత్రాన్ బలంచ సుమహాయశాః
సవ్రీడ శ్చింతయావిష్టో విశ్వామిత్రో భవత్తదా. ౯

టీక॥ తదా=అప్పుడు; సుమహాయశాః=మిగులనతిశయించినకీర్తిగల; విశ్వామిత్రః = విశ్వామిత్రమహారాజు; వినాశితాన్ = నాశమునొందింపఁబడిన; పుత్రాన్=కొడుకులను; బలంచ = బలమును; దృష్ట్వా=చూచి; సవ్రీడః=లజ్జతోఁగూడినవాఁడగుచు; చింతయా=చింతతోడను; ఆవిష్టః=కూడుకొనినవాఁడు; అభవత్=ఆయెను.

అప్పుడుమహాకీర్తిసంపన్నుండగువిశ్వామిత్రమహారాజుచనిపోయినతనకొడులనుఁ జతురంగబలమును జూచిలజ్జతోను చింతతోనుంగూడినవాఁడాయెను.

అని, తాత్పర్యము.

సముద్రఇవ నిర్వేగో భగ్నదంష్ట్ర ఇవోరగః

ఉపరక్త ఇవాదిత్య స్సద్యో నిష్ప్రభతాం గతః. ౧౦

టీక. సః(అధ్యాహృతము)=ఆ విశ్వామిత్రుఁడు; సముద్రఇవ= సముద్రుఁడువలె; నిర్వేగః=యుద్ధ ప్రవృత్తిలేనివాఁడై; భగ్నదంష్ట్రః, భగ్న = విరవఁబడిన, దంష్ట్రః= కోరలుగల; ఉరగఇవ=సర్పమువలె; నిశ్శక్తిః = (అధ్యాహృతము) శక్తిలేనివాఁడై; ఉపరక్తః = రాహు గ్రస్తుఁడైన; ఆదిత్యఇవ = సూర్యుఁడువలె; సద్యః=అప్పుడు; నిష్ప్రభతాం = తేజోహీనమగుటను; గతః=పొందెను.

అప్పుడావిశ్వామిత్రుఁడు, వేగములేనిసముద్రమువలె యుద్ధప్రవృత్తిలేనివాఁడై తీయబడిన కోరలుగలసర్పమువలె శక్తిలేనివాఁడగుచు రాహువుచేఁగ్రహింపఁబడినసూర్యునింబలె తేజోహైన్యమునుబొందెను.

అని, తాత్పర్యము.

హతపుత్రబలో దీనో లూనపక్ష ఇవద్విజః
హతదర్పో హతోత్సాహో నిర్వేదం సమపద్యత. ౧౧

టీక. హతపుత్రబలః, హత=చంపఁబడిన, పుత్ర = కొడుకులును; బలః=చతురంగబలమునుగల; సః= (అధ్యాహృతము) ఆవిశ్వామిత్రుఁడు; లూనపక్షః, లూన=ఛేదింపఁబడిన; పక్షః=ఱెక్కలుగల; ద్విజఇవ=పక్షివలె; దీనః=దీనుఁడై; హతదర్పః, హత=కొట్టఁబడిన, దర్పః= అంతస్సారముగలవాఁడును; హతోత్సాహః, హత = కొట్టఁబడిన, ఉత్సాహః= ఉత్సాహశక్తిగలవాఁడునునై; నిర్వేదం=చతురంగబలమందునిష్ఫలత్వబుద్ధిని; సమపద్యత= పొందెను.

చంపఁబడినకొడుకులును సైన్యమునుంగల యావిశ్వామిత్రుఁడు ఛేదింపఁబడిన యీకెలుగలపక్షివలె దీనుఁడై గర్వమునుత్సాహమునులేని వాఁడై చతురంగబలము మొదలగువానియందు నిష్ఫలత్వ బుద్ధినిఁ బొందెను. అని, తాత్పర్యము.

స పుత్ర మేకం రాజ్యాయ పాలయేతి నియుజ్యచ

పృథివీం క్షత్రధర్మేణ వనమేవా న్వపద్యత. ౧౨

టీక॥సః=ఆవిశ్వామిత్రుఁడు;ఏకం=ఒక్కఁడైమిగిలియున్న ; పుత్రం=కొడుకును; క్షత్రధర్మేణ=క్షత్రధర్మముచేత; పృథ్వీం=భూమిని; పాలయ=పరిపాలింపుము;ఇతి=అని; రాజ్యాయ=రాజ్యముచేయుటకొఱకు;నియుజ్య=నియోగించి;వనమేవ=అరణ్యమునే; అన్వపద్యత=పొందెను; చకారము పాదపూరణార్థము.

ఆవిశ్వామిత్రుఁడుతనపుత్రులలోఁ జావక మిగిలియున్న యొకకుమారునిక్షత్రధర్మముతో భూమింబరిపాలింపుచుండుమని రాజ్యము సేయ నియమించి తానరణ్యమునకుంబోయెను. అని, తాత్పర్యము.

స గత్వా హిమవత్పార్శ్వం కిన్నరోరగసేవితమ్
మహాదేవప్రసాదార్థం తప స్తేపే మహాతపాః. ౧౩

టీక॥మహాతపాః=అధికమైనతపస్సుగల,సః=ఆవిశ్వామిత్రుఁడు;మహాదేవప్రసాదార్థం, మహాదేవ=ఈశ్వరునియొక్క, ప్రసాదార్థం=అనుగ్రహముగలుగుటకొఱకు;కిన్నరోరగసేవితం,కిన్నర=కిన్నరులచేతను,ఉరగ=సర్పములచేతను, సేవితం=సేవింపఁబడుచున్న; హిమవత్పార్శ్వం, హిమవత్=మంచుకొండయొక్క, పార్శ్వం=దరిని;గత్వా=పొంది; తపః=తపమును; తేపే = తపించెను;చేసెననుట.

అతిశయంబగుతపముగలయావిశ్వామిత్రుఁడీశ్వరానుగ్రహముగల్గుటకై కిన్నరులు సర్పములునువాసము సేయుచుండు నట్టి హిమాలయపార్శ్వప్రదేశమునాశ్రయించి తపంబొనర్చెను.అని,తాత్పర్యము.

కేన చి త్త్వథ కాలేన దేవేశో వృషభధ్వజః
దర్శయామాస వరదో విశ్వామిత్రం మహాబలమ్. ౧౪




టీక॥ అథ=పిమ్మట; కేనచిత్ కాలేనతు=కొంతకాలమునకు; దేవేశః, దేవ=దేవతలకు, ఈశః= ప్రభువైన; వరదః=కోర్కులనిచ్చునట్టి; వృషభధ్వజః = వృషభము టెక్కెము గాఁగలయీశ్వరుఁడు; మహాబలం= అధికమైన బలముగల ; విశ్వామిత్రం=విశ్వామిత్రునిఁగూర్చి; ఆత్మానం=(అధ్యాహృతము) తనస్వరూపమును; దర్శయామాస = చూపించెను.

పిమ్మట మఱికొంతకాలమునకు దేవతలకుఁ బ్రభువును వరంబులనొసంగునట్టి పరమేశ్వరుఁడు మహాబలుండగువిశ్వామిత్రునకుఁదనస్వరూపంబుగనుపరచెనని, తాత్పర్యము.

కిమర్థం తప్యసే రాజన్ బ్రూహి యత్తే వివక్షితమ్
వరదోస్మి వరో యస్తే కాంక్షితస్సోఽభిధీయతామ్. ౧౫

టీక॥ రాజన్=రాజైనవిశ్వామిత్రుఁడా; కిమర్థం=దేనికొఱకు; తప్యసే = తపముజేయుచున్నావు; తే=నీయొక్క; వివక్షితం=ఇష్టార్థము; యత్=ఏదో; బ్రూహి=చెప్పుము. అహం=(అధ్యాహృతము)నేను; వరదః=వరమునిచ్చువాఁడను; అస్మి=అగుచున్నాను; తే=నీయొక్క; కాంక్షితః=కోరఁబడిన; వరః=వరము; యః=ఏదో; సః=ఆవరము; అభిధీయతాం=చెప్పఁబడుగాక.

ఓరాజా! ఎందునిమిత్తముతపముసేయుచున్నావు, నీవివక్షితార్థమేదిచెప్పుము. నేను వరములనిచ్చువాఁడనునీచేఁ గోరఁబడువరమేదో దానింజెప్పుము.

అని, తాత్పర్యము.

ఏవముక్తస్తు దేవేన విశ్వామిత్రో మహాతపాః
ప్రణిపత్య మహాదేవ మిదం వచన మబ్రవీత్. ౧౬

టీక॥ మహాతపాః=అధికమైనతపస్సుగల; విశ్వామిత్రస్తు=విశ్వామి

త్రుఁడును; దేవేన= ఈశ్వరుని చేత; ఏవం=ఇట్లు; ఉక్తః=పలుకఁబడిన వాఁడై; మహాదేవం= పరమేశ్వరుని; ప్రణిపత్య = నమస్కరించి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

అధికమైన తపముగల విశ్వామిత్రమహారాజు యీశ్వరుని చేనిట్లుఁజెప్పఁబడినవాఁడగుచు నాపరమేశ్వరు నమస్కరించి యీమాట చెప్పెను. అని, తాత్పర్యము.

యది తుష్టో మహాదేవ ధనుర్వేదో మమానఘ
సాంగోపాంగోపనిషద స్సరహస్యః ప్రదీయతామ్. ౧౭

టీక॥ అనఘ=పాపరహితుఁడవైన; మహాదేవ=ఈశ్వరుఁడా! తుష్టోయది= సంతుష్టుఁడవైతివేని; సాంగోపాంగోపనిషదః, సాంగ=అంగములతోను; ఉపాంగ=ఉపాంగములతోను; ఉపనిషదః= ఉపనిషత్తులతోనుం గూడినదియు; (అకారాంతమాషణము) సరహస్యః=ఉపదేశగమ్యంబులగు రహస్యమంత్రములతోనుంగూడినదియునగు; ధనుర్వేదః=ధనుర్వేదము; మమ=నాకు; ప్రదీయతాం=ఇవ్వఁబడుఁగాక.

పాపరహితుఁడవగునో మహాదేవుఁడా! నీవుసంతుష్టుఁడవైతివేని యంగములు పాంగము లుపనిషత్తులు మఱియు నుపదేశగమ్యంబులగు రహస్యమంత్రములు వీనితోఁ గూడియుండు ధనుర్వేదమునాకుఁ దయచేయుము. అని, తాత్పర్యము.

యాని దేవేషు చాస్త్రాణి దానవేషు మహర్షిషు
గంధర్వయక్షరక్షస్సు ప్రతిభాంతు మమానఘ. ౧౮

టీక॥ అనఘ= పాపరహితుఁడవైనయోస్వామీ; దేవేషు = దేవతలందును; దానవేషు=దానవులయందును; మహర్షిషు = మహర్షులందును; గంధర్వయక్షరక్షస్సు చ=గంధర్వులందునుయక్షులందును రాక్షసులయందును; యాని=ఏ; అస్త్రాణి= అస్త్రములు; సంతి=(అధ్యాహృత

ము) కలవో; తాని=(అధ్యాహృతము)=అవన్నియు; మమ=నాయందు (సప్తమ్యర్థమందుషష్ఠి) ప్రతిభాంతు=ప్రకాశించుగాక.

పాపరహితుఁడవైన యోస్వామీ! దేవదానవమహర్షిగంధర్వయక్షరక్షస్సులయందే యేయస్త్రములు కలవో యవియన్నియు నాయందుఁ బ్రకాశించుగాక.

అని, తాత్పర్యము.

తవప్రసాదా ద్భవతు దేవదేవ మమేప్సితమ్

టీక॥ దేవదేవ= దేవతలకుదేవుఁడవైనయోస్వామీ; మమ= నాయొక్క; అన్యదపి= (అధ్యాహృతము) వేఱైన; ఈప్సితం= మనోరథమును; తవ=నీయొక్క; ప్రసాదాత్=అనుగ్రహమువలన; భవతు= అగుగాక.

దేవతలకు దేవుండవైన యో స్వామీ? మఱియొక నామనోరథమును మీప్రసాదమువల్లనగుగాక.

అని, తాత్పర్యము.

ఏవ మస్త్వితి దేవేశో వాక్య ముక్త్వా గత స్తదా. ౧౯

టీక॥ తదా=అప్పుడు; దేవేశః= దేవతలకుఁ బ్రభువైన యీశ్వరుఁడు; ఏవం=ఇట్లు; అస్తు=అగుగాక; ఇతి=అని; వాక్యం=వచనమును; ఉక్త్వా=పలికి; గతః=అంతర్హితుఁడాయెను.

అప్పుడు దేవదేవుండగునీశ్వరుఁడిట్లగుగాకయని వరమిచ్చి యంతర్హితుఁడాయెను.

అని, తాత్పర్యము.

ప్రాప్య చాస్త్రాణి రాజర్షి ర్విశ్వామిత్రో మహాబలః
దర్పేణ మహతాయుక్తో దర్పపూర్ణో భవత్తదా. ౨౦

టీక ॥ మహాబలః=అధికమైనబలముగల; రాజర్షిః = రాజునుఋషి

యునగు; విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; అస్త్రాణి = అస్త్రములను; ప్రాప్య = పొంది; మహాత్మా = అధికమైన; దర్పేణ = గర్వముతో; యుక్తం = కూడుకొనిన వాఁడయ్యెను; దర్పపూర్ణశ్చ, దర్ప = గర్వముచేత; పూర్ణశ్చ = నిండినవాఁడును; అభవత్ = ఆయెను.

అప్పుడు మహాబలుండును రాజర్షి యునగు విశ్వామిత్రుఁడు క్షత్రియత్వాదిప్రయుక్తగర్వముగలవాఁడయ్యెను. అస్త్రబలమబ్బుటచేమరంతగర్వము గలవాఁడాయెను.

అని, తాత్పర్యము.

వివర్ధమానో వీర్యేణ సముద్ర ఇవ పర్వణి
హతమేవ తదా మేనే వసిష్ఠ మృషిసత్తమమ్. ౨౧

టీక॥ తదా = అప్పుడు; సః = (అధ్యాహృతము) ఆవిశ్వామిత్రుఁడు; పర్వణి = పర్వమునందు; సముద్రఇవ = సముద్రమువలె; వీర్యేణ = పరాక్రమముచేత; వివర్ధమానః = వృద్ధిఁబొందినవాఁడగుచు; ఋషిసత్తమం = ఋషిశ్రేష్ఠుఁడగు; వసిష్ఠం = వసిష్ఠమహర్షిని; హతమేవ = చంపఁబడినవానిగానే; మేనే = తలఁచెను.

అప్పుడా విశ్వామిత్రుఁడు పర్వమందు సముద్రమువలె పరాక్రమముచేవృద్ధిఁబొందుచు ఋషిశ్రేష్ఠుఁడగు వసిష్ఠమహర్షినిజంపఁబడినవానిగానేతలంచెను.

అని, తాత్పర్యము.

తతో గత్వాశ్రమపదం ముమోచాస్త్రాణి పార్థివః
యైస్తత్తపోవనం సర్వం నిర్దగ్ధం చాస్త్రతేజసా. ౨౨

టీక॥ తతః = పిమ్మట; పార్థివః = విశ్వామిత్రమహారాజు; ఆశ్రమపదం, ఆశ్రమ = వసిష్ఠాశ్రమముయొక్క, పదం = ప్రదేశమును, గత్వా = పొంది; తాని = (అధ్యాహృతము) ఆ; అస్త్రాణి = అస్త్రములను; ముమోచ = విడిచిపెట్టెను. యైః = ఏయస్త్రములచేతను; అస్త్రతేజసా




చ= స్వతేజస్సుచేతను; తత్తపోవనం, తత్ = ఆవసిష్ఠమహర్షియొక్క, తపోవనం= తపోవనము; సర్వం=అంతయును; నిర్దగ్ధం=కాల్పఁబడెనో;

ఆపిమ్మట విశ్వామిత్రమహారాజు వసిష్ఠాశ్రమప్రదేశముం జేరి యేయస్త్రములచేతనుస్వతేజస్సుచేతను నావసిష్ఠమహర్షి యొక్క తపోవనమంతయుఁ గాల్పఁబడినదో యాయస్త్రములను విడిచిపెట్టెను.

అని, తాత్పర్యము.

ఉదీర్యమాణ మస్త్రం త ద్విశ్వామిత్రస్య ధీమతః
దృష్ట్వా విప్రద్రుతాస్సర్వే మునయ శ్శతశో దిశః. ౨౩

టీక॥తత్ర=(అధ్యాహృతము) ఆయాశ్రమమందున్న; మునయః= మునులు; ధీమతః=ధైర్యవంతుఁడైన; విశ్వామిత్రస్య=విశ్వామిత్రమహారాజుయొక్క; ఉదీర్యమాణం= ప్రయోగింపఁబడుచున్న; తత్ =ఆ; అస్త్రం= అస్త్రజాతమును; దృష్ట్వా=చూచి; శతశః= నూర్వురు నూర్వురుగా; దిశః= దిక్కులనుఁ గూర్చి; విప్రద్రుతాః=పరువెత్తిరి.

ఆవసిష్ఠాశ్రమమందుండు మును లందరునుఁ బ్రయోగింపఁబడుచున్న ధైర్యవంతుండగువిశ్వామిత్రునియొక్కయాయస్త్రములంజూచిగుంపులుగుంపులుగానలుదెసలంబారిరి.

అని, తాత్పర్యము.

వసిష్ఠస్యచ యే శిష్యా స్తథైవ మృగపక్షిణః
విద్రవంతి భయాద్భీతా నానాదిగ్భ్య స్సహస్రశః. ౨౪

టీక॥ వసిష్ఠస్య=వసిష్ఠమహామునియొక్క; శిష్యాః=శిష్యులు; యే= ఎవరో; తే=(అధ్యాహృతము)వారు; యథా= (అధ్యాహృతము) ఎట్లు; విద్రవంతి = పరుగెత్తిరి; తథైవ = అలాగుననే; మృగపక్షిణశ్చ=మృగములును, పిట్టలును; భయాత్ = భయమునుగలుగఁజేయు చున్న యస్త్రము వలన; భీతాః= భయమునుపడినవై; నానాదిగ్భ్యః=తమతమ స్థానములనుండి; సహస్రశః=వేనవేలుగా; విద్రవంతి






(ఘోరార్థమందురట్) = పరుగెత్తినవి.

అప్పుడచటనున్న వసిష్ఠమహాముని యొక్క-శిష్యులందఱెట్లుబరువెత్తిరో యట్లు మృగములునుబక్షులును భయము గలుగఁజేయుచున్న యస్త్రజాతమువలన భయపెట్టఁబడినవై వేనవేలుగాఁ దమతమస్థానములనుండి పరువెత్తినవి.

అని, తాత్పర్యము.

వసిష్ఠస్యాశ్రమపదం శూన్యమాసీన్మహాత్మనః

టీక॥ మహాత్మనః=పూజ్యుఁడైన; వసిష్ఠస్య=వసిష్ఠమహర్షియొక్క-; ఆశ్రమపదం= తపోవనము; శూన్యం=చెట్లుపొదలు లేనివిగా; ఆసీత్ =ఉండెను.

పూజ్యుఁడైన వసిష్ఠమహర్షియొక్క-తపోవనము, చెట్లుపొదలుమొదలగునవి లేనిదియైయుండెను.

అని, తాత్పర్యము.

ముహూర్తమివ నిశ్శబ్దమాసీదిరిణసన్నిభమ్. ౨౫

టీక॥ కించ=(అధ్యాహృతము) మఱియును; ముహూర్తం = ముహూర్తకాలము; నిశ్శబ్దమివ= శబ్దములేనిదానివలెను; ఇరిణసన్నిభం, ఇరిణ = ఊషరక్షేత్రముతో, సన్నిభం= సరియైనదిగాను, ఆసీత్= ఉండెను.

మఱియు నాతపోవనము ముహూర్తకాలము శబ్దరహితముగాను నూషరక్షేత్రమునకు సరియైనదిగానుండెను.

అని, తాత్పర్యము.

వదతో వై వసిష్ఠస్య మాభైరితి ముహుర్ముహుః
నాశయామ్యద్య గాధేయం నీహారమివ భాస్కరః. ౨౬

టీక॥ భాస్కరః=సూర్యుఁడు; నీహారమివ= మంచునువలె; గాధేయం=విశ్వామిత్రుని; అద్య=ఇప్పుడు; నాశయామి= చంపుచున్నాను;






మాభైః=భయమునుపడకుడు; ఇతి=అని; ముహుర్ముహుః=మాటిమాటికిని;వసిష్ఠస్య=వసిష్ఠమహామునికి;వదతః = చెప్పుచుండఁగా(అనాదరమందుషష్ఠి) విద్రవంతి,ఇతి(అధ్యాహృతము)=పరుగెత్తిరనిపూర్వముతోనన్వయము.

రక్షకుఁడైన నేనుండఁగామీకేమిభయము, సూర్యుఁడుమంచునువలె నేనిప్పుడావిశ్వామిత్రునిఁజంపుచున్నానుభయము పడవలదనివసిష్ఠమహాముని మాటిమాటికిం జెప్పుచుండఁగానాయనమాటను లక్ష్యపెట్టక భయముపడియుండున్నవారందరునుపలాయితులైరి.

అని, తాత్పర్యము.

ఏవముక్త్వా మహాతేజా వసిష్ఠో జపతాం వరః
విశ్వామిత్రం తదా వాక్యం సరోష మిద మబ్రవీత్. ౨౭

టీక॥ మహాతేజాః=అతిశయించినతేజస్సుగల;జపతాంవరః=తపముచేయువారలలోఁ శ్రేష్ఠుఁడైన; వసిష్ఠః=వసిష్ఠమహాముని;ఏవం = ఇట్లు; స్వాన్=(అధ్యాహృతము)తమజనములగూర్చి;ఉక్త్వా=చెప్పి; తదా=అప్పుడు;విశ్వామిత్రం = విశ్వామిత్రునిఁగూర్చి; సరోషం = రోషముతోఁగూడిన; ఇదం = ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్ = పలికెను.

అధికతేజోవంతుఁడును తపముచేయువారలలోఁ శ్రేష్ఠుఁడునైనయీ వసిష్ఠమహాముని యిట్లు స్వజనముతోఁజెప్పి యంతనావిశ్వామిత్రునిం గూర్చిరోషముతోఁగూడినయీమాటఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఆశ్రమం చిరసంవృద్ధం యద్వినాశిత వానసి
దురాచారోసి తన్మూఢ తస్మాత్త్వం న భవిష్యసి. ౨౮

టీక॥ మూఢ=తెలివిలేనివిశ్వామిత్రుఁడా! త్వం=నీవు;చిరసంవృద్ధం,చిర=బహుకాలమునుండి, సంవృద్ధం = వృద్ధిఁజేయఁబడిన; ఆశ్ర



మం=ఆశ్రమమును; యత్=ఏకారణమువలన; వినాశితవాన్= నాశముఁజేసినవాఁడవు; అసి= అయితివో; తత్=ఆకారణమువలన; దురాచారః = దుష్టమగు నాచారముగలవాడవు; అసి=అయితివి; తస్మాత్= అందువలన; నభవిష్యసి=ఉండవు.

మూఢుఁడవయినవిశ్వామిత్రుఁడా! చిరకాలమునుండి వృద్ధిఁబొందింపఁబడిన నాయాశ్రమము నెందువల్లనాశముఁజేసినవాఁడవయితివో అందు వలన నింద్యమైన యాచారము గలవాఁడవయితివి నీవందువలననెమిగులవు. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా పరమక్రుద్ధో దండ ముద్యమ్య సత్వరః
విధూమ మివ కాలాగ్నిం యమదండ మివాపరమ్. ౨౪

టీక॥ పరమక్రుద్ధః=మిక్కిలికోపముతోఁగూడియున్న వసిష్ఠమహాముని; ఇతి=ఇట్లు; ఉక్త్వా=పలికి; సత్వరః=త్వరతోకూడినవాఁడగుచు; విధూమం = పొగలేని; కాలాగ్నిమివ=ప్రలయాగ్నినివలెను; అపరం= రెండవదైన; యమదండమివ=కాలదండమువలె; స్థితం=(అధ్యాహృతము) ఉన్నట్టి; దండం=బ్రహ్మదండమును; ఉద్యమ్య=ఎత్తుకొని; తస్థౌ= (అధ్యాహృతము) ఉండెను.

మిక్కిలికోపముతోఁ గూడియున్నవసిష్ఠమహామునియిట్లుచెప్పిత్వరతోఁ గూడినవాఁడై పొగలేనికాలాగ్నివలెను రెండవదగుకాలదండమునుంబలెనున్న బ్రహ్మదండమును బట్టియుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, బాలకాండే,

పంచపంచాశస్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండపంచపంచాశసర్గటీక, ముగిసినది.

శ్రీ

షట్పంచాశ సర్గ ప్రారంభః.

ఏవ ముక్తో వసిష్ఠేన విశ్వామిత్రో మహాబలః
ఆగ్నేయ మస్త్ర ముత్క్షిప్య తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్. ౧

టీక॥ మహాబలః=అధికబలవంతుఁడగు, విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; వసిష్ఠేన=వసిష్ఠునిచేత; ఏవం=ఈప్రకారము; ఉక్తః=పలుకఁబడినవాఁడగుచు; ఆగ్నేయం=అగ్నిదేవతాకమైన; అస్త్రం=అస్త్రమును; ఉత్క్షిప్య=ఎత్తి; తిష్ఠతిష్ఠ=నిలునిలు; ఇతిచ=అనియును; అబ్రవీత్=పలికెను.

అధికబలముగల విశ్వామిత్రుఁడు, వసిష్ఠునిచేనిట్లుబలుకఁబడినవాఁడగుచు నాగ్నేయాస్త్రముఁ జేతంబట్టినిలునిలుమనిపలికెను.

అని, తాత్పర్యము.

బ్రహ్మదండం సముత్క్షిప్య కాలదండ మివాఽపరమ్
వసిష్ఠో భగవాన్ క్రోధా దిదం వచన మబ్రవీత్. ౨

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగల; వసిష్ఠః=వసిష్ఠుఁడు; అపరం=రెండవదైన; కాలదండమివ=యమదండమువలెనున్నట్టి; బ్రహ్మదండం=బ్రహ్మదండమును; ఉత్క్షిప్య=ఎత్తి; క్రోధాత్=కోపమువలన; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

మాహాత్మ్యముగల వసిష్ఠమహర్షి రెండవకాలదండమువలె నున్న బ్రహ్మదండమెత్తి క్రోధమువలన నీమాటఁజెప్పెను. అని, తాత్పర్యము.

క్షత్రబంధో స్థితోఽస్మ్యేష యద్బలం తద్విదర్శయ
నాశయా మ్యద్య తే దర్పం శస్త్రస్య తవ గాధిజ. ౩

టీక॥ క్షత్రబంధో=క్షత్రియాధముఁడవగు విశ్వామిత్రుఁడా! ఏషః=ఇదుగో; స్థితః=ఉన్నవాఁడను; అస్మి=అగుచున్నాను; తవ=నీయొక్క; బలం=బలము; యత్=ఏదో; తత్=దాన్ని; విదర్శయ=విస్తరించిచూపుము; గాధిజ=గాధిపుత్రుఁడవగువిశ్వామిత్రుఁడా! అద్య=ఇప్పుడు; తే=నీయొక్క; శస్త్రస్య=శస్త్రముయొక్క; దర్పం=గర్వమును; నాశయామి=నాశముఁజేయుచున్నాను.

క్షత్రియాధముండ వగు విశ్వామిత్రుఁడా! ఇదుగోయున్నాఁడను, నీబలమెట్టిదో దానింజక్కఁగాఁజూపుము, నీయొక్కయు నీశస్త్రముయొక్కయు, గర్వమును నాశముఁజేయుచున్నాఁడను. అని తాత్పర్యము.

క్వచ తే క్షత్రియబలం క్వచ బ్రహ్మబలం మహత్
పశ్య బ్రహ్మబలం దివ్యం మమ క్షత్రియపాంసన. ౪

టీక॥ క్షత్రియపాంసన= క్షత్రియాధముఁడా; తే=నీయొక్క; క్షత్రియబలం=క్షత్రబలము; క్వచ = ఎక్కడ; మహత్=గొప్పదైన; బ్రహ్మబలం=బ్రాహ్మణబలము; క్వచ=ఎక్కడ; మమ=నాయొక్క, దివ్యం=అమోఘమైన; బ్రహ్మబలం=బ్రాహ్మణబలమును; పశ్య=చూడుము.

క్షత్రియాధముఁడా! నీయొక్క క్షత్రియబలమెక్కడ, గొప్పదగు బ్రహ్మబలమెక్కడ! శ్రేష్ఠంబగునాబ్రహ్మబలమునుఁజూడుమని, వసిష్ఠుండు విశ్వామిత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్యాస్త్రం గాధిపుత్రస్య ఘోర మాగ్నేయ ముద్యతమ్
బ్రహ్మదండేన తచ్ఛాంత మగ్నేర్వేగ ఇవాంభసా. ౫

టీక॥ గాధిపుత్రస్య=గాధికొడుకగు; తస్య = ఆవిశ్వామిత్రునియొక్క; ఘోరం=భయంకరమగు; ఉద్యతం=ప్రయోగింపబడిన; ఆగ్నే

యం = అగ్నిదేవతాకమైన; అస్త్రం=అస్త్రము; యత్ =(అధ్యాహృతము) ఏదో; తత్ =ఆయస్త్రము; బ్రహ్మదండేన=బ్రహ్మదండము చేత; అంభసా=నీటిచేత; అగ్నేః= నిప్పుయొక్క; వేగ ఇవ=వేడిమివలె; శాంతం=చల్లార్పఁబడెను.

గాధికొమారుండగు నావిశ్వామిత్రునిచేఁ బ్రయోగింపఁబడి ఘోరంబుగ మండుచున్న నాయాగ్నేయాస్త్రము, నీటచేనార్పబడిననిప్పులవేడిమివలె నాబ్రహ్మదండముచేతం జల్లారెను.

అని, తాత్పర్యము.

వారుణం చైవ రౌద్రం చ ఐంద్రం పాశుపతం తథా
ఐషీకం చాపి చిక్షేప కుపితో గాధినందనః. ౮

టీక॥ గాధినందనః=గాధికొమారుఁడగువిశ్వామిత్రుఁడు; కుపితః=కోపముగలవాఁడగుచు; వారుణం చైవ=వరుణదేవతాకమైనయస్త్రమును; రౌద్రం చ=రుద్రదేవతాకమగునస్త్రమును; ఐంద్రం=ఇంద్రదేవతాకమగునస్త్రమును; తథా=ఆలాగుననె; పాశుపతం=పశుపతిదేవతాకమగునస్త్రమును; ఐషీకం చాపి = ఐషీకాస్త్రమును; చిక్షేప=పడవైచెను.

అంత గాధిపుత్రుండగువిశ్వామిత్రుండుమిగులఁ గోపముగలవాఁడగుచువారుణాస్త్రము రౌద్రాస్త్రము నైంద్రాస్త్రము పాశుపతాస్త్రము నైషీకాస్త్రము, అను నస్త్రంబుల నొక్కపెట్టునంబడవైచెను. అని, తాత్పర్యము.

మానవం మోహనం చైవ గాంధర్వం స్వాపనంతథా
జృంభణం మాదనం చైవ సంతాపన విలాపనె. ౯
శోషణం దారణం చైవ వజ్ర మస్త్రం సుదుర్జయమ్
బ్రహ్మపాశం కాలపాశం వారుణం పాశమేవచ. ౧౦
పైనాకాస్త్రం చ దయితం శుష్కార్ద్రె అశనీ ఉభె




దండాస్త్ర మథ పైశాచం క్రౌంచ మస్త్రం తథైవచ. ౯
ధర్మచక్రం కాలచక్రం విష్ణుచక్రం తథైవచ
వాయవ్యం మథనంచైవ అస్త్రం హయశిర స్తథా. ౧౦
శక్తిద్వయంచ చిక్షేప కంకాళం ముసలం తథా
వైద్యాధరం మహాస్త్రంచ కాలాస్త్ర మథ దారుణమ్. ౧౧
త్రిశూల మస్త్రం ఘోరంచ కాపాల మథ కంకణమ్
ఏతాన్యస్త్రాణి చిక్షేప సర్వాణి రఘునందన. ౧౨

టీక॥ రఘునందన = రాముఁడా! మానవం = మనుదేవతాకమగున స్త్రమును; మోహనం = మోహనాస్త్రమును; గాంధర్వం = గంధర్వదేవతాకాస్త్రమును, తథా = అట్లే; స్వాపనం = నిద్రఁబుట్టించున స్త్రమును; జృంభణం = ఆవలింతబుట్టించున స్త్రమును; మాదనం = మత్తుగలుగఁజేయున స్త్రమును; సంతాపన విలాపనే = సంతాపవిలాపములంగల్గఁజేయున స్త్రములను; శోషణం = శోషణమను దానిని; దారణంచైవ = దారణమను దానిని; సుదుర్జయం = జయింపనలవి గాని; వజ్రం = వజ్రమను న స్త్రమును; బ్రహ్మపాశం = బ్రహ్మపాశమును; కాలపాశం = కాలపా... రుణం = వరుణదేవతా... వచ = పాశమును;

పైనాకాస్త్రం = పైనాకమనున స్త్రమును; దయితం = దయితమను దానిని; శుష్కార్ద్రే = శుష్కము, ఆర్ద్రములను; ఉభే = రెండైన; అశనీ = పిడుగులను; దండాస్త్రం = దండాస్త్రమును; అథ = ఆపిమ్మట; పైశాచం = పైశాచాస్త్రమను దానిని; తథైవ = ఆలాగుననె; క్రౌంచమస్త్రం = క్రౌంచమను దానిని; ధర్మచక్రం = ధర్మచక్రమను దానిని; కాలచక్రం = కాలచక్రమను దానిని; తథైవచ = ఆలాగుననే; విష్ణుచక్రం = విష్ణుచక్రమును; వాయవ్యం = వాయుదేవతాకాస్త్రమును; మథనంచైవ = మథనమను దానిని; తథా = అట్లు; హయశిరః = హయగ్రీవమను; అస్త్రం = అస్త్రమును; శక్తిద్వయంచ = రెండుశక్తులను;



చిక్షేప=పడవైచెను; తథా = అట్లు; కంకాళం=కంకాళమనుదానిని; ముసలం=ముసలమనుదానిని; మహాస్త్రించ= గొప్పయస్త్రమగు; వైద్యాధరం= విద్యాధరాస్త్రమును; కాలాస్త్రం=కాలాస్త్రమును; అథ=పిమ్మట; దారుణం=దారుణమనుదానిని; త్రిశూలం=త్రిశూలమనుదానిని; ఘోరమస్త్రం = ఘోరాస్త్రమును; కాపాలం=కాపాలమనుదానిని; అథ=పిదప; కంకణం= కంకణమనుదానిని; సర్వాణి=సమస్తములైన; ఏతాని=ఈ; అస్త్రాణి=అస్త్రములను; చిక్షేప= విడిచిపెట్టెను.

అంతట నావిశ్వామిత్రుండమిక్కుటంబగు కోపముతో మానవమనునది మొదలు కంకణమను వరకునీనామంబులచేఁ బేర్కొనంబడియున్నయస్త్రములనన్నింటిని క్రమముగఁ బ్రయోగించెను.

అని, తాత్పర్యము.

వసిష్ఠే జపతాం శ్రేష్ఠే తదద్భుత మివాభవత్

టీక॥ జపతాం=తపమొనరించువారలలో; శ్రేష్ఠే=ఉత్తముఁడైన; వసిష్ఠే= వసిష్ఠమహామునియందు; తత్=ఆయస్త్రక్షేపణము; అద్భుతమివ = ఆశ్చర్యముంబలె; అభవత్=ఆయెను.

తపోవంతులలో మేటియగునా వసిష్ఠమహాముని విషయమైయాయస్త్రప్రయోగము గార్యలేశమైనం జేయంజాలకపోవుటవల్ల మిగులనాశ్చర్యముగనుండెను.

అని, తాత్పర్యము.

తాని సర్వాణి దండేన గ్రసతే బ్రహ్మణస్సుతః. ౧౩

టీక॥ బ్రహ్మణస్సుతః=బ్రహ్మపుత్రుఁడైనవసిష్ఠమహాముని; దండేన= బ్రహ్మదండముచేత; తాని = ఆ; సర్వాణి=సమస్తములైన యస్త్రములను; గ్రసతే= అగ్రసత (భూతార్థమందు లట్) మ్రింగెను.

బ్రహ్మపుత్రుండైన వసిష్ఠమహామునియాయస్త్రములనన్నింటినియు

ద్ధుతమగునట్లు, తనబ్రహ్మదండము చేగ్రసించెను. అని, తాత్పర్యము.

తేషు శాంతేషు బ్రహ్మాస్త్రం క్షిప్తవాన్ గాధినందనః

టీక॥ గాధినందనః=విశ్వామిత్రుఁడు; తేషు=ఆయస్త్రములన్నియు; శాంతేషు= చల్లఁబడినవగుచుండగా; బ్రహ్మాస్త్రం=బ్రహ్మదేవతాకమగుగొప్పయస్త్రమును; క్షిప్తవాన్= ప్రయోగించినవాఁడు; ఆసీత్(అధ్యాహృతము)= ఆయెను.

విశ్వామిత్రుఁడు, తనయస్త్రములన్నియువ్యర్థములు కాఁగా నప్పుడుబ్రహ్మాస్త్రమునుఁబ్రయోగించెను. అని, తాత్పర్యము.

తదస్త్ర ముద్యతం దృష్ట్వా దేవాస్సాగ్ని పురోగమాః. ౧౪
దేవర్షయశ్చ సంభ్రాంతా గంధర్వా స్సమహోరగాః

టీక॥ సాగ్నిపురోగమాః=మున్నిడుకొనఁబడినయగ్నిదేవుడుగల; దేవాః= దేవతలును; దేవర్షయశ్చ=దేవవిశేషులునుఋషులును, సమహోరగాః= గొప్పసర్పములతోఁగూడిన; గంధర్వాశ్చ=గంధర్వులును;ఉద్యతం=ప్రయోగింపఁబడిన;తత్=ఆ; అస్త్రం=బ్రహ్మాస్త్రమును; దృష్ట్వా=చూచి; సంభ్రాంతాః= తొట్రుపాటుగలవారలు;అభవన్(అధ్యాహృతము)= అయిరి.

అప్పుడు,అగ్నిదేవుఁడుముందుగాగల దేవతలును దేవర్షులును గంధర్వులును మహోరగులును విశ్వామిత్రునిచేఁబ్రయోగింపఁబడిన, బ్రహ్మాస్త్రముం జూచి భ్రాంతచిత్తులైరి. అని, తాత్పర్యము.

త్రైలోక్య మాసీత్సంత్రస్తం బ్రహ్మాస్త్రే సముదీరితే. ౧౫

టీక॥బ్రహ్మాస్త్రే=బ్రహ్మాస్త్రము;సముదీరితే=ప్రయోగింపఁబడుచుండఁ

గానే; త్రైలోక్యం= ముల్లోకము లును; సంత్రస్తం=మిక్కిలిభయము పడినది; ఆసీత్=ఆయెను.

బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁ గానేముల్లోకములుందల్లడిల్లెను. అని, తాత్పర్యము.

తదప్యస్త్రం మహాఘోరం బ్రాహ్మం బ్రాహ్మేణ తేజసా
వసిష్ఠో గ్రసతే సర్వం బ్రహ్మదండేన రాఘవ. ౧౬

టీక॥ రాఘవ=రాముఁడా! వసిష్ఠః=వసిష్ఠమహర్షి; బ్రాహ్మం=బ్రహ్మదేవతాకమైన; మహాఘోరం=అతిక్రూరమైన; తత్ = ఆ; అస్త్రమపి=అస్త్రమును; సర్వం=అంతయును; బ్రాహ్మేణ= బ్రహ్మవిద్యాభ్యాసమువలనగలిగిన; తేజసా=తేజస్సుచేవృద్ధిబొందింపఁబడిన; బ్రహ్మదండేన=బ్రహ్మదండముచేత; గ్రసతే(అగ్రసత)మ్రింగెను. ఇచట(వృత్తైర్గర్దార్భీ ఖారంవహతి) అన్నట్లు గ్రాసక్రియయందు దండమునకన్వయములేదు. అందువలననే వక్ష్యమాణార్థమునకు విరోధము లేదు

రాముఁడా! వసిష్ఠమహర్షి బ్రహ్మదేవతాకమై మహాఘోరంబుగనున్న నాయస్త్రమంతయునుదనబ్రహ్మదండముచేతమ్రింగెను. అని తాత్పర్యము

బ్రహ్మాస్త్రం గ్రసమానస్య వసిష్ఠస్య మహాత్మనః
త్రైలోక్యమోహనం రౌద్రం రూప మాసీత్సుదారుణమ్. ౧౭

టీక॥ బ్రహ్మాస్త్రం= బ్రహ్మాస్త్రమును; గ్రసమానస్య=మ్రింగుచున్నట్టి; మహాత్మనః= మహానుభావుండగు; వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క; రూపం=స్వరూపము; త్రైలోక్యమోహనం, త్రైలోక్య= ముల్లోకములవారికి, మోహనం = మూర్ఛనొందించునదియు; రౌద్రం=భయంకరమైనదియు; సుదారుణం=చూడశక్యముగానిదియునుగా; ఆసీత్= ఆయెను.

అప్పుడుబ్రహ్మాస్త్రమును మ్రింగ

గానే వసిష్ఠమహామునికిఁ త్రైలోక్య మోహనంబును భయంకరంబునును దారుణంబును నగురూపముఁ గలి గెను. అని, తాత్పర్యము.

రోమకూపేషు సర్వేషు వసిష్ఠస్య మహాత్మనః
మరీచ్య ఇవ నిష్పేతు రగ్నే ర్ధూమాకులార్చిషః. ౧౮

టీక॥ మహాత్మనః=మహాప్రభావముం గలిగినవ; వసిష్ఠస్య= వసిష్ఠమహర్షి యొక్క; సర్వేషు= సమస్తమైన; రోమకూపేషు, రోమ=వెంట్రుకలయొక్క; కూపేషు=కుదుళ్లనుండి;(పంచమ్యర్థమందు సప్తమి) ధూమాకులార్చిషః, ధూమ=పొగచేత, ఆకుల= సంకులమైన; అర్చిషః= మంటలుగల; అగ్నేరివ=అగ్నివల్లవలె; మరీచ్యః= విస్ఫులింగములు; నిష్పేతుః=రాలినవి.

మహాత్ముండగువసిష్ఠమహర్షి యొక్క సమస్తములయినరోమకూపములనుండి పొగతోఁగూడినమంటలుగలనిప్పునుండివచ్చుస్ఫులింగముల చాడ్పునజ్వాలలుబయలుపడినవి. అని, తాత్పర్యము.

ప్రాజ్వల ద్బ్రహ్మదండశ్చ వసిష్ఠస్య కరోద్యతః
విధూమ ఇవ కాలాగ్ని ర్యమదండ ఇవాపరః. ౧౯

టీక॥ వసిష్ఠస్య=వసిష్ఠమహాముని యొక్క; కరోద్యతః, కర=హస్తము చేత, ఉద్యతః = ఎత్తఁబడియున్న; బ్రహ్మదండశ్చ=బ్రహ్మదండమును; అపరః= రెండవదియగు; యమదండఇవ = కాలదండమువలెను; విధూమః=పొగలేని; కాలాగ్నిరివ= ప్రళయాగ్నివలెను; అస్త్రగ్రాసేన(అధ్యాహృతము)=అస్త్రములను మ్రింగుటచేత; ప్రాజ్వలత్ =అధికముగ మండెను.

వసిష్ఠమహామునియొక్క హస్తమందుధరింపఁబడియున్న బ్రహ్మదండమును రెండవదియగు యమదండముమాఱ్కియు ధూమము లేక జ్వలించుచున్న కాలాగ్నియునుంబోలె మిడుగులమండుచుండెను. అని, తాత్పర్యము.

తతోఽస్తువన్ మునిగణా వసిష్ఠం జపతాం వరమ్
అమోఘం తే బలం బ్రహ్మన్ తేజో ధారయ తేజసా. ౨౦
నిగృహీతస్త్వయా బ్రహ్మన్ విశ్వామిత్రో మహాతపాః
ప్రసీద జపతాంశ్రేష్ఠ లోకాస్సంతు గతవ్యథాః. ౨౧

టీక ॥ తతః=పిమ్మట; మునిగణాః, ముని=మునులయొక్క, గణాః=సమూహములు; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా! తే=నీయొక్క; బలం=బలము; అమోఘం=శ్రేష్ఠమైనది; తేజసా = మహిమచేత; తేజః=బ్రహ్మాస్త్రతేజస్సును; ధారయ=ఉపశమింపుము; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడా; మహాతపాః = అధికమయినతపముగల; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; త్వయా=నీచేత; నిగృహీతః = ఓటువడినాఁడు; జపతాంశ్రేష్ఠ=జపించువారలలో శ్రేష్ఠుఁడవైనవసిష్ఠుఁడా; ప్రసీద=ప్రసన్నుఁడవగుము; లోకాః=జనులు; గతవ్యథాః, గత=పోయిన, వ్యథాః =దుఃఖముగలవారలు; సంతు=అగుదురుగాక; ఇతి= (అధ్యాహృతము) అని; జపతాంవరం = జపించువారలలో శ్రేష్ఠుఁడైన; వసిష్ఠం=వసిష్ఠమహామునిని; అస్తువన్=స్తోత్రముజేసిరి.

ఓబ్రాహ్మణుఁడవగు వసిష్ఠుఁడా నీబలమెక్కుడైనది నీమహిమచేనా బ్రహ్మాస్త్రతేజముపశమింపుము. అధికమైనతపముగల విశ్వామిత్రుఁడు నీచేనోటువడెనుజపముచేయువారలలోనుత్తముఁడవైనవసిష్ఠుఁడా జనులందఱు దుఃఖములేని వారలగుదురుగాకయనిపూజ్యుఁడైనవసిష్ఠమహర్షిని స్తోత్రముజేసిరి.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తో మహాతేజా శ్శమం చక్రే మహాతపాః

టీక॥మహాతపాః=అధికమైనతపముగలవాఁడును; మహాతేజాః=అధికమైన తేజస్సుగలవాఁడునగువసిష్ఠుఁడు; ఏవం = ఇట్లు; ఉక్తః=చె

ప్పఁబడినవాఁడగుచు; శమం=కోపశాంతిని; చక్రే=చేసెను.

అధికతపమును తేజస్సునుగలవసిష్ఠుఁడు. మునులచేనిట్లుఁబ్రార్థింపఁబడికోపశమనముఁ జేసెను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రోఽపి నికృతో వినిశ్వస్యేద మబ్రవీత్. ౨౨

టీక॥ విశ్వామిత్రోఽపి=విశ్వామిత్రుఁడును; నికృతః=తిరస్కరింపఁబడినవాఁడగుచు; వినిశ్వస్య=నిట్టూర్పువిడిచి; ఇదం=దీన్ని; అబ్రవీత్=పలికెను.

పరాభవ మొందిన విశ్వామిత్రుఁడును, నిట్టూర్పునిగుడించియీమాటఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్
ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే. ౨౩

టీక॥ క్షత్రియబలం, క్షత్రియ=క్షత్రసంబంధియగు; బలం= బలము; ధిక్=నిందింపఁదగినబలము; బ్రహ్మతేజోబలం, బ్రహ్మ= బ్రాహ్మణ్యరూపమైన; తేజః=తేజస్సుయొక్క; బలం=బలమే; బలం=ప్రశస్తమయిన బలము; ఏకేన=ఒకటైన; బ్రహ్మదండేన=బ్రహ్మదండముచేత; మే=నాయొక్క; సర్వాస్త్రాణి=బ్రహ్మాస్త్రముదక్కఁదక్కిన యస్త్రములన్నియు; హతాని=కొట్టువడినవి.

క్షత్రియబలమునిందింపదగిన బలముబ్రాహ్మణ్యరూపమగు తేజోబలమె, మిక్కిలియు శ్రేష్ఠమయినబలము, ఇప్పుడొక బ్రహ్మదండముచే నాయొక్కబ్రహ్మాస్త్ర వ్యతిరిక్తంబులగునన్నియస్త్రములునుం గొట్టువడినవని, విశ్వామిత్రుండు సెప్పెను.

అని, తాత్పర్యము.

తదే తత్సమవేక్ష్యాహం ప్రసన్నేంద్రియమానసః

తపోమహ త్సమాస్థాస్యే యద్వై బ్రహ్మత్వకారణమ్. ౨౪

టీక॥ తదేతత్ = ఆయీ రెంటిని; సమవేక్ష్య = చూచి; ప్రసన్నేంద్రియ మానసః, ప్రసన్న = శాంతమైన, ఇంద్రియమానసః = ఇంద్రియములు మనస్సునుగల; అహం = నేను; యత్ = ఏది; బ్రహ్మత్వకారణం = బ్రాహ్మణ్యాపాదకమైనదో; తత్ (అధ్యాహృతము) = ఆ; మహత్ = గొప్పదైన; తపః = తపస్సును; సమాస్థాస్యే = అవలంబించెదను.

ఈ రెండుబలములకుంగల హెచ్చుతగ్గులంబూచి విడువంబడినక్షుత్ర రోషముగల నేను ముందు బ్రాహ్మణ్యాపాదకమైన తపమెద్దియో యట్టిగొప్పతపంబునవలంబించెదనని, విశ్వామిత్రుండు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, బాలకాండే,
షట్పంచాశస్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండషట్పంచాశసర్గటీక,
ముగిసినది.

---

౫౭.

సప్తపంచాశసర్గప్రారంభః.

తత స్సంతప్తహృదయ స్స్మరన్నిగ్రహ మాత్మనః
వినిశ్శ్వస్య వినిశ్శ్వస్య కృతవైరో మహాత్మనా. ౧
స దక్షిణాం దిశం గత్వా మహిష్యా సహ రాఘవ
తతాప పరమం ఘోరం విశ్వామిత్రో మహా త్తపః. ౨

టీక॥ రాఘవ=రఘువంశమునం దుఁబుట్టినరాముఁడా! తతః=పిమ్మట; సంతప్తహృదయః,సంతప్త= అధికముగఁ దపింపఁ బడుచున్న, హృదయః= మనంబుగలవాఁడును, ఆత్మనః = మనస్సుయొక్క; నిగ్రహం =నిరోధమును; స్మరన్=స్మరించుచున్నవాఁడును;మహాత్మనా= మహాప్రభావముగలవసిష్ఠునితో;కృతవైరః=చేయఁబడినవిరోధముగలవాఁడనగు;సః=ఆ;విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు;వినిశ్శ్వస్యవినిశ్శ్వస్య = నిట్టూర్పువిడిచినిట్టూర్పువిడిచి;మహిష్యాసహ=భార్యతోఁగూడ;దక్షిణాం=శరావతీనదికి దక్షిణమైన; దిశం=దిక్కును; గత్వా=పొంది;ఘోరం=కఠినమైన; మహత్తపః= అధికంబగుతపమును;పరమం= ఉత్కృష్టమగునట్లు; తతాప=తపించెను,(చేసెననుట.)

రాముఁడా ! అటువెనుక సంతాపమొందిన మనంబుతో మనోనిగ్రహము సేయవలయునను తలంపుగలిగిమహానుభావుండగువసిష్ఠునితో ద్వేషించియున్నయావిశ్వామిత్రుఁడు, మాటిమాటికినిట్టూర్పులు విడుచుభార్యతోఁగూడశరావతీనదిదక్షిణపుదిక్కు నాశ్రయించికఠినంబగు,గొప్పతపస్సును, సర్వోత్కృష్టమగునట్లొనర్చెను.అని తాత్పర్యము.

ఫలమూలాశనో దాంత శ్చకార సుమహా త్తపః

టీక ॥ సః=(అధ్యాహృతము)ఆవిశ్వామిత్రుఁడు; ఫలమూలాశనః,

ఫల=ఫలములు, మూల=గడ్డలు, అశనః=ఆహారముగాఁగలవాఁడగుచు; దాంతః= ఇంద్రియనిగ్రహముగలవాఁడై; మహత్తపః=శ్రేష్ఠమగుతపమును; చకార=చేసెను.

మఱియు నావిశ్వామిత్రుఁడు ఫలమూలంబులాహారముగాఁగైకొని నియమముతోనుత్తమంబగుతపంబు సల్పెను.

అని, తాత్పర్యము.

ఈయర్ధశ్లోకము గోవిందరాజులు లెక్కింపకుండినను మహేశతీర్థులు వ్యాఖ్యానించినందునటీకించఁబడెను.

అథాస్య జజ్ఞిరే పుత్రా స్సత్య ధర్మపరాయణాః
హవిష్యందో మధుష్యందో దృఢనేత్రో మహారథః. ౩

టీక॥ అథ=పిమ్మట; అస్య=ఈ విశ్వామిత్రునకు; సత్యధర్మ పరాయణాః, సత్య=సత్యమందును; ధర్మ= ధర్మమందును; పరాయణాః=ఆసక్తులగు; హవిష్యందః=హవిష్యందుఁడు; మధుష్యందః=మధుష్యందుఁడు; దృఢనేత్రః=దృఢనేత్రుఁడు; మహారథః=మహారథుఁడు (ఈనామంబులుగల); పుత్రాః=కొడుకులు; జజ్ఞిరే=కలిగిరి.

పిమ్మట, నీవిశ్వామిత్రునకుసత్యవంతులును, ధార్మికులునగు, హవిష్యందుఁడు, మధుష్యందుఁడు, దృఢనేత్రుఁడు, మహారథుఁడు, అనుపేళ్లుగలకొడుకులు జనించిరి.

అని, తాత్పర్యము.

పూర్ణే వర్షసహస్రేతు బ్రహ్మా లోక పితామహః
అబ్రవీ న్మధురం వాక్యం విశ్వామిత్రం తపోధనమ్. ౪

టీక॥ వర్షసహస్రే=వేయిసంవత్సరములు; పూర్ణే=నిండగానే; లోకపితామహః, లోక=లోకములకన్నిటికి, పితామహః=తాతయైన; బ్రహ్మా= బ్రహ్మదేవుఁడు; ఆగత్య= (అభ్యాహృతము) వచ్చి ; తపోధనం=తపస్సుధనముగాగల; విశ్వామిత్రం= విశ్వామిత్రునిఁగూర్చి; మధురం=చెవులకింపైన; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అట్లుదపంబుసేయుచుండ వెయ్యిసంవత్సరములు నిండగానేసకలలోకపితామహుండగుబ్రహ్మదేవుండు వచ్చితపమే ధనముగాఁగల యావిశ్వామిత్రునిం గూర్చిమధురంబగుమాటఁజెప్పెను.

అని, తాత్పర్యము.

జితా రాజర్షిలోకా స్తే తపసా కుశికాత్మజ
అనేన తపసా త్వాంతు రాజర్షి రితి విద్మహే. ౫

టీక ॥ కుశికాత్మజ= కుశికపుత్రుండవగువిశ్వామిత్రుఁడా! తే= నీయొక్క; తపసా= తపస్సుచేత; రాజర్షిలోకాః = రాజులు ఋషులునగుజనులు; జితాః= జయింపఁబడిరి, అనేన=ఈనీచేఁజేయఁబడిన; తపసాతు= తపస్సుచేతనే; త్వాం=నిన్ను; రాజర్షిః=రాజుఋషివి; ఇతి=అని; విద్మహే = (ఆత్మనే పదమార్షము) ఎఱింగితిమి.

విశ్వామిత్రుఁడా! నీతపస్సుచే రాజర్షిలోకంబులు జయింపఁబడినవి నీవానరించినయీతపముచేత, నిన్నిపుడు, రాజర్షివనితలంచెదమని బ్రహ్మదేవుండు, విశ్వామిత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజా జగామ సహ దైవతైః
త్రివిష్టపం బ్రహ్మలోకం లోకానాం పరమేశ్వరః. ౬

టీక ॥ లోకానాం=లోకములకు; పరమేశ్వరః=ముఖ్యప్రభువగు; మహాతేజాః= అధికతేజస్సుగలబ్రహ్మదేవుఁడు;ఏవం=ఇట్లు; ఉక్త్వా= పలికి; దైవతైస్సహ= దేవతలతోఁగూడ; త్రివిష్టపం=స్వర్గమును;గత్వా(అధ్యాహృతము)= పొంది; తదను(అధ్యాహృతము)= ఆపిమ్మట; బ్రహ్మలోకం= స్వలోకమునుఁగూర్చి;జగామ=పోయెను.

సకలలోకములకుc బ్రభువును, మహాతేజుండునగుబ్రహ్మదేవుcడిట్లు వలికి, దేవతలతోడంగూడి స్వర్గమునకువెళ్లి, యావిమ్మటcదనదగుబ్రహ్మలోకముంగూర్చివెళ్లెను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రోపి తచ్ఛ్రుత్వా హ్రియా కించి దవాఙ్ముఖః
దుఃఖేన మహతాఽఽవిష్ట స్సమన్యు రిద మబ్రవీత్. ౭

టీక॥ విశ్వామిత్రోపి=విశ్వామిత్రుcడును;తత్=ఆమాటను; శ్రుత్వా=విని;హ్రియా=సిగ్గుచేత;కించిత్=కొంచెము; అవాఙ్ముఖః=వంచcబడినముఖముగలవాcడై; మహతా=అధికమయిన; దుఃఖేన=వ్యసనముచే; ఆవిష్టః=ఆక్రమింపcబడినవాcడై;సమన్యుః= దైన్యముతోcగూడినవాcడగుచు;ఇదం = దీన్ని;అబ్రవీత్=చెప్పెను.

విశ్వామిత్రుcడునామాటవినిలజ్జచేc గొంచముదలవంచికొని మహాదుఃఖముతోcగూడిదైన్యమునొందినవాcడగుచునీమాటcజెప్పెను.

అని, తాత్పర్యము.

తపశ్చ సుమహత్తప్తం రాజర్షి రితి మాంవిదుః
దేవా స్సర్షిగణా స్సర్వే నాస్తి మన్యే తపఃఫలమ్. ౮

టీక॥ సుమహత్=మిక్కిలియధికమైన;తపశ్చ=తపమును;తప్తం=తపింపcబడెను;(చేయcబడెననుట) సర్షిగణాః= ఋషిసమూహములతోcగూడిన;దేవాః=దేవతలు; సర్వే=అందరు;మాం=నన్ను; రాజర్షిః=రాజు ఋషియు;ఇతి=అని; విదుః=ఎఱింగిరి;తపఃఫలం = తపస్సునకుసరియైనఫలము; నాస్తి=లేదు;ఇతి=(అధ్యాహృతము)అని;మన్యే=తలcచెదను, అనిముందఱికన్వయము.

గొప్పతపస్సుజేసితిని ఋషిగణములతోcగూడినదేవతలందఱునన్నురాజర్షివనిరి నాతపస్సునకిదిసరియైనఫలముకాదని తలంచెదననివిశ్వా

మిత్రుఁడుచెప్పెను. అని, తాత్పర్యము.

ఇతినిశ్చిత్య మనసా భూయ ఏవ మహాతపాః
తపశ్చకార కాకుత్స్థ పరమం పరమాత్మవాన్. ౯

టీక॥ కాకుత్స్థ=రామఁడా! మహాతపాః=పూజ్యమైనతపస్సుగల; పరమాత్మవాన్ = అతిశయమగుయత్నముగల విశ్వామిత్రుఁడు; ఇతి=ఇట్లు;మనసా=మనస్సుచేత; నిశ్చిత్య= స్థిరపఱచికొని; భూయఏవ=తిరిగియు; పరమం=మునుపటికన్నవెక్కువయగు;తపః=తపస్సును;చకార=చేసెను.

రామఁడా! మహాతపుండునుమహాయత్నముగలవాఁడునగు విశ్వామిత్రుఁడిట్లు మనంబున నిశ్చయించి మున్ను తాఁజేసియున్న తపమునకంటె నెక్కుడగుతపమొనర్చెను.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నేవ కాలేతు సత్యవాదీ జితేంద్రియః
త్రిశంకురితి విఖ్యాత ఇక్ష్వాకు కులవర్ధనః. ౧౦

టీక॥ఏతస్మిన్=ఈ;కాలఏవ=సమయమందే; (తుఅనునది పాదపూరణార్థము)సత్యవాదీ= సత్యముబలుకువాఁడును; జితేంద్రియః=ఇంద్రియనిగ్రహముగలవాఁడును; ఇక్ష్వాకుకులవర్ధనః,ఇక్ష్వాకు= ఇక్ష్వాకుమహారాజుయొక్క,కులవర్ధనః=కులదీపకుఁడును; త్రిశంకుః=త్రిశంకువు;ఇతి=అని; విఖ్యాతః=ప్రసిద్ధుఁడు; యః(అధ్యాహృతము)=ఎవఁడు; అభూత్=(అధ్యాహృతము) ఉండెనో.

ఈసమయమందేసత్యవంతుఁడునుజితేంద్రియుండునునిక్ష్వాకువంశవర్ధనుఁడునగుత్రిశంకువనుప్రసిద్ధుఁడెవఁడుండెనో.అని, తాత్పర్యము.

తస్య బుద్ధి స్సముత్పన్నా యజేయ మితి రాఘవ
గచ్ఛేయం సశరీరేణ దేవానాం పరమాం గతిమ్. ౧౧

టీక॥ రాఘవ=రాముఁడా! దేవానాం=దేవతలకు; పరమాం=ఉత్కృష్టమైన; గతిం= స్థానమయిన స్వర్గమును; సశరీరేణ=శరీరముతోఁ గూడిన; ఆత్మనా=(అధ్యాహృతము)నాచేతను; గచ్ఛేయం=పొందఁ వలయును; యజేయం=యజ్ఞము చేయవలయును; ఇతి = అని; తస్య=ఆత్రిశంకువునకు; బుద్ధిః=జ్ఞానము; సముత్పన్నా=పుట్టెను.

ఓ రామా! దేవతాయోగ్యమయిన స్వర్గము, నీనాశరీరముతోఁ బొందవలెను, అందుకనువైనయాగము చేయవలెను, అని యాత్రిశంకువునకుఁ దలంపుగలిగెను.

అని, తాత్పర్యము.

సవసిష్ఠం సమాహూయ కథయామాస చింతితమ్
అశక్య మితి చాప్యుక్తో వసిష్ఠేన మహాత్మనా. ౧౨

టీక॥ సః=ఆత్రిశంకుమహారాజు; వసిష్ఠం=వసిష్ఠమహర్షిని; సమాహూయ = పిలుపించి; చింతితం=శరీరముతో స్వర్గముం జేరుటకనువయిన యజ్ఞము చేయుటను; కథయామాస=చెప్పెను; మహాత్మనా=మహాప్రభావుండగు; వసిష్ఠేన=వసిష్ఠమహర్షిచేత; అశక్యం=అట్టి యజ్ఞము జేయుట కలవిగాదు; ఇతి=అని; ఉక్తోపిచ=చెప్పఁబడినవాఁడునయ్యెను.

ఆ త్రిశంకుమహారాజు వసిష్ఠమహర్షిని రావించి శరీరముతో స్వర్గముఁ జేరుటకనువైన యజ్ఞము చేయుటనుఁజెప్పిమహానుభావుఁడగు నావసిష్ఠునిచే నట్టి యజ్ఞము జేయుటనీకశక్యమనియుం జెప్పఁబడినవాఁడాయెను. అని, తాత్పర్యము.

ప్రత్యాఖ్యాతో వసిష్ఠేన స యయౌ దక్షిణాం దిశమ్
తత స్తత్కర్మసిద్ధ్యర్థం పుత్రాం స్తస్య గతో నృపః. ౧౩

టీక॥ వసిష్ఠేన=వసిష్ఠమహాముని చేత; ప్రత్యాఖ్యాతః=నిరాకరింపఁ

బడినః సః = ఆత్రిశంకువు; దక్షిణాం=దక్షిణవుదైన; దిశం=దిక్కునుగూర్చి; యయౌ=వెళ్లెను; తతః=పిమ్మట; నృపః= త్రిశంకువు; తత్కర్మసిద్ధ్యర్థం, తత్ =ఆ, కర్మ=సశరీరస్వర్గసాధనకర్మముయొక్క, సిద్ధ్యర్థం= సిద్ధించుటకొఱకు; తస్య= ఆవసిష్ఠమహామునియొక్క; పుత్రాన్ = కొడుకులను; గతః= పొందెను.

వసిష్ఠమహర్షిచేత నిరాకరింపఁబడిన నాత్రిశంకువుదక్షిణదిక్కునకువెళ్లిపిమ్మటనాయజ్ఞకర్మ సిద్ధికొఱకువసిష్ఠమహాముని కొడుకులం బొందెను. అని, తాత్పర్యము.

వాసిష్ఠా దీర్ఘతపస స్తపో యత్రహి తేపిరే
త్రిశంకు స్సుమహాతేజా శ్శతం పరమ భాస్వరమ్. ౧౮
వసిష్ఠ పుత్రాన్ దదృశే తప్యమానాన్ యశస్వినః

టీక॥ దీర్ఘతపసః=ఎక్కుడుతపముగల; వాసిష్ఠాః= వసిష్ఠునికొమారులు; యత్ర=ఎచ్చోటను; తపః= తపస్సును; తేపిరే=తపించుచున్నారో; ("హి" అనునది పాదపూరణార్థము) తత్రగత్వా=(అధ్యాహృతము) అచ్చోటునుబొంది; సుమహాతేజాః = అధికమయినపరాక్రమముగల; త్రిశంకుః= త్రిశంకుమహారాజు; పరమభాస్వరం=మిగులఁబ్రకాశించుచున్న; శతం=నూర్వురైన; (బహ్వర్థమందుశతమనినిపాతమగుట వలన సామానాధికరణ్యముగలదు) యశస్వినః= కీర్తివంతులగు; తప్యమానాన్ =తపముఁజేయుచున్న; వసిష్ఠపుత్రాన్ =వసిష్ఠునికొమారులను; దదృశే=చూచెను.

అధికమైన పరాక్రమముగలత్రిశంకుమహారాజు దీర్ఘతపస్సుగల వసిష్ఠపుత్రులెచ్చోటఁదపముజేయుచుండిరోయచ్చోటికి వెళ్లిమిక్కిలిఁబ్రకాశించుచుఁగీర్తిమంతులై తపంబొనర్చుచున్నవసిష్ఠపుత్రుల నూర్వురంజూచెను. అని, తాత్పర్యము.

సోఽభిగమ్య మహాత్మాన స్సర్వానేవ గురో స్సుతాన్. ౧౯

అభివాద్యానుపూర్వ్యేణ హ్రియా కించి దవాఙ్ముఖః
అబ్రవీ త్సుమహాభాగాన్ సర్వానేవ కృతాంజలిః. ౧౬

టీక॥సః=అత్రిశంకుమహారాజు; మహాత్మానః (మహాత్మనః)= పూజ్యులైన; గురోః=గురువగువసిష్ఠమహామునియొక్క; సుతాన్=కొడుకులను; సర్వాన్ ఏవ=అందఱను;అభిగమ్య=పొంది; హ్రియా=సిగ్గుచేత;కించిత్ = కొంచము;అవాఙ్ముఖః= వంపఁబడినముఖముగలవాఁడగుచు; ఆనుపూర్వ్యేణ=వరుసగా; అభివాద్య = ప్రణమిల్లి;కృతాంజలిః = చేయఁబడినచేమోడ్పులుగలవాఁడగుచు; సుమహాభాగాన్=మిగులశ్రేష్ఠులగు;సర్వానేవ= అందరంగూర్చి;అబ్రవీత్=పలికెను.

అత్రిశంకుమహారాజు పూజ్యులగుగురుపుత్రులనందరంగనుంగొనివసిష్ఠమహామునియొక్కనిరాకరణమువల్లఁగలిగినసిగ్గుచేఁగొంచముఁగఁదలవంచికొని జ్యేష్ఠానుక్రమముందప్పకనమస్కరించిచేమోడ్పుగలవాఁడగుచుమహానుభావులగు వసిష్ఠపుత్రులనందరంగూర్చిపలికెను.

అని, తాత్పర్యము.

శరణం వః ప్రపద్యేహం శరణ్యాన్ శరణాగతః
ప్రత్యాఖ్యాతోస్మి భద్రం వో వసిష్ఠేన మహాత్మనా. ౧౭

టీక॥శరణాగతః; శరణ=రక్షి అపేక్షచేత, ఆగతః=వచ్చిన; అహం=నేను; శరణ్యాన్=రక్షించుటయందుసమర్థులగు; వః= మిమ్ము; శరణం= రక్షించువారలుఁగా;ప్రపద్యే=పొందుచున్నాఁడను; వః=మీకు;భద్రం=మంగళము; మహాత్మనా=మహాప్రభావుండగు; వసిష్ఠేన=వసిష్ఠమహామునిచేత; ప్రత్యాఖ్యాతః = నిరాకరింపఁబడినవాఁడను;అస్మి=అగుచున్నాఁడను.

రక్షకులనపేక్షించివచ్చిన నేను రక్షణసమర్థులగుమిమ్ము రక్షకులుగాఁబొందుచున్నాఁడనుమీకుమంగ

శమగుఁగాక మహానుభావుండగు వసిష్ఠ మహర్షిచేనిరాకరింపఁబడితి నని, త్రిశంకువు జెప్పెను.

అని, తాత్పర్యము.

యష్టుకామో మహాయజ్ఞం తదనుజ్ఞాతు మర్హథ
గురుపుత్రా నహంసర్వా న్నమస్కృత్య ప్రసాదయే. ౧౮

టీక॥మహాయజ్ఞం=గొప్పక్రతువును; యష్టుకామః = చేయవలయునని యిచ్ఛగలవాఁడను;తత్=ఆ యజ్ఞానుష్ఠానమును; అనుజ్ఞాతుం= అనుగ్రహించుటకు; యూయం=(అధ్యాహృతము)మీరు; అర్హథ=తగుదురు; అహం=నేను; సర్వాన్ = సమస్తులైన;గురుపుత్రాన్=గురుపుత్రులను; నమస్కృత్య=నమస్కారముచేసి; ప్రసాదయే = ప్రసన్నులుగఁజేసికొనుచున్నాఁడను.

గొప్పయజ్ఞముచేయఁగోరికగలవాఁడ నట్టియజ్ఞానుష్ఠానమను గ్రహించుటకుమీరుందగియున్నారు నేగురుపుత్రులనందఱనమస్కరించిప్రసన్నులుకావలయునని ప్రార్థించుచున్నాఁడను. అని, తాత్పర్యము.

శిరసా ప్రణతో యాచే బ్రాహ్మణాన్ తపసిస్థితాన్
తే మాం భవంత స్సిద్ధ్యర్థం యాజయంతు సమాహితాః. ౧౯
సశరీరో యథాఽహం హి దేవలోక మవాప్నుయామ్

టీక॥తపసి = తపమందు; స్థితాన్=ఉన్నట్టి; బ్రాహ్మణాన్=బ్రహ్మవేత్తలైన;వః=మిమ్ము; శిరసా=తలచేత, ప్రణతః=నమస్కరించినవాఁడనగుచు; యాచే=యాచించెదను;అహం=నేను; యథా=ఎట్లు; సశరీరః= శరీరముతోఁగూడినవాఁడనగుచు; దేవలోకం=స్వర్గమును;అవాప్నుయాంహి=పొందగలనో; తథా(అధ్యాహృతము)= అట్లు; తే=ప్రసిద్ధులగు; భవంతః=మీరు; సమాహితాః= అవహితులై; సిద్ధ్యర్థం=ఇష్టముసిద్ధించుట కొఱకు;మాం=నన్ను; యాజయంతు=

యజింపఁజేయుదురు గాక.

తపోనిష్ఠులును బ్రహ్మవేత్తలు నగు మిమ్ము శిరంబుచే నమస్కరించియాచించెదను, నేనెట్లు శరీరముతోఁ గూడ స్వర్గ లోకముం బొందఁగలనో, యట్లుప్రసిద్ధులగు మీరలుసావధానచిత్తులరైనాయిష్టముసిద్ధించునట్లు నన్ను యజింపఁజేయుఁడనియాత్రిశంకుమహారాజుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ప్రత్యాఖ్యాతో వసిష్ఠేన గతి మన్యాం తపోధనాః. ౨౦
గురుపుత్రా నృతె సర్వా న్నాహం పశ్యామి కాం చన

టీక॥తపోధనాః=తపమేధనము గాఁగలగురుపుత్రులారా ; వసిష్ఠేన=వసిష్ఠమహామునిచేత; ప్రత్యాఖ్యాతః = నిరాకృతుఁడనైన; అహం=నేను;సర్వాన్ = సమస్తులగు;గురుపుత్రాన్=గురువుయొక్క కుమారులను;ఋతె=వినాయించి; అన్యాం=వేరైన;కాంచనగతిం=ఏయొక్కయజనోపాయమును; నపశ్యామి=చూడలేను.

తపోవంతులగు గురుపుత్రులారా! వసిష్ఠమహాఋషిచేనిరాకృతుఁడనైననేను, గురుపుత్రులయినమిమ్ముందక్క యజ్ఞసాధనోపాయమగుమఱియొకగతియున్నట్టు చూడలేననిత్రిశంకువుసెప్పెను.

అని, తాత్పర్యము.

ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమా గతిః. ౨౧
పురోధస స్తు విద్వాంస స్తారయంతి సదా నృపాన్

టీక॥ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశజులగు; సర్వేషాం=రాజులకందఱకును;పురోధాః=పురోహితుఁడగువసిష్ఠుఁడు; పరమా=ముఖ్యమైన; గతిహి=తారకము గదా ? విద్వాంసః= పండితులగు; పురోధసస్తు = పురోహితులును; సదా=ఎల్లప్పుడు; నృపాన్=రా

జులను; తారయంతి= తరింపఁజేయుచున్నారు.

వేత్తలగు పురోహితులు సర్వకాలములయందు రాజులనుఁదరింపఁజేయు చున్నారు ఇక్ష్వాకువంశపు రాజులకందఱకును బురోహితుండగు వసిష్ఠమహర్షియె ముఖ్యతారకముగదా ! యనిత్రిశంకువుఁజెప్పెను. అని, తాత్పర్యము.

తస్మా దనంతరం సర్వే భవంతో దైవతం మమ. ౨౨

టీక॥ తస్మాత్ = ఆవసిష్ఠునికంటె; అనంతరం=పిమ్మట; భవంతః= మీరు; సర్వే=అందఱును; మమ=నాకు; దైవతం=దైవములు.

సర్వరక్షకుఁడగు వసిష్ఠునికి వెనుక నాకుగురుపుత్రులగు మీరందరు దరింపఁ జేయ వలసిన దైవములుగదా ! యనిత్రిశంకువుచెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, బాలకాండే,
సప్తపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ సప్తపంచాశసర్గ టీక,
ముగిసినది.

---

శ్రీ

అష్టపంచాశసర్గప్రారంభః.

తతస్త్రిశంకో ర్వచనం శ్రుత్వాక్రోధ సమన్వితమ్
ఋషిపుత్రశతం రామ రాజాన మిద మబ్రవీత్. ౧

టీక॥ రామ=రాముఁడా! త్రిశంకోః=త్రిశంకుమహారాజుయొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; తతః=పిమ్మట; క్రోధసమన్వితం=కోపముతోఁ గూడుకొని యున్న; ఋషిపుత్రశతం, ఋషిపుత్ర=ఋషియగు వసిష్ఠముని కొడుకులయొక్క; శతం=నూరు; రాజానం=రాజైనత్రిశంకువుంగూర్చి; ఇదం=ఈ మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముఁడా! త్రిశంకుండు చెప్పినమాటవిని, పిమ్మట, కోపము నొందిన యావసిష్ఠమహామునియొక్క కొడుకులందఱు నారాజునుఁ గూర్చి యీమాటఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

ప్రత్యాఖ్యాతో హి దుర్బుద్ధే గురుణా సత్యవాదినా
తం కథంసమతిక్రమ్య శాఖాంతర ముపేయివాన్. ౨

టీక॥ దుర్బుద్ధే=చెడ్డతలంపుగలత్రిశంకుఁడా! సత్యవాదినా=తథ్యముపలుకుచున్నట్టి; గురుణా=గురువగువసిష్ఠమహర్షిచేత; ప్రత్యాఖ్యాతః హి=నిరాకరింపఁబడితివిగదా? తం=ఆయనను; సమతిక్రమ్య=విడిచిపెట్టి; శాఖాంతరం= ఆశ్రయాంతరమును; కథం=ఎట్లు; ఉపేయివాన్=అవలంబించిన వాఁడవు; అసి (అధ్యాహృతము)=ఐతివి.

దుర్మార్గుఁడవగు త్రిశంకుఁడా! కల్పాంతర వృత్తాంత పరిజ్ఞాత గావునయథార్థముఁ జెప్పిన గురువువలననిరాకరింపఁబడితివి సరిగదా? పిమ్మటనాయనను విడిచి యాశ్రయాంతరమునెందు కవలం

బించితివి, అని, తాత్పర్యము.

ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమో గురుః
నచాతిక్రమితుంశక్యం వచనం సత్యవాదినః. ౩

టీక॥ ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకు వంశజు లయిన ; సర్వేషాం = అందఱకును; పురోధాః=పురోహితుఁడగు వసిష్ఠ మహాముని ; పరమః=ఎక్కువైన; గురుః=ఆచార్యుఁడు; సత్యవాదినః, సత్య = యథార్థమును, వాదినః=పలుకుచున్నయావసిష్ఠునియొక్క; వచనం=మాట; అతిక్రమితుంచ = దాటుటకును; శక్యం=సాధ్యమైనది; న=కాదు.

ఇక్ష్వాకువంశము రాజులకందఱకును బురోహితుఁడగు వసిష్ఠుండు పరమాచార్యుఁడు, సత్యవంతుఁడగు నాయన చెప్పినమాటయతిక్రమింప నలవి గానిదియని చెప్పెను.

అని, తాత్పర్యము.

అశక్య మితిచోవాచ వసిష్ఠో భగవా నృషిః
తంవయం వై సమాహర్తుం క్రతుంశక్తాః కథంతవ. ౪

టీక॥ భగవాన్=మాహాత్మ్యము గలవాఁడును; ఋషిః=ఋషియునగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు; యం = (అధ్యాహృతము) ఏజన్నమును; అశక్యం=చేయనలవి గానిది; ఇతిచ= అనియును; ఉవాచ=పలికెనో; తవ=నీయొక్క; తం= అటువంటి; క్రతుం=జన్నమును; వయం= మేము; ('వై' అనునది పాదపూరణార్థము) సమాహర్తుం=చేయించుటకు; కథం=ఎట్లు; శక్తాః=సమర్థులము.

మాహాత్మ్యముగల ఋషియగు వసిష్ఠుండే యజ్ఞమును జేయుటకశక్యంబని చెప్పెనో నీయొక్కయాక్రతువును జేయించుటకు మేమెట్లు సమర్థులమగుదుమని చెప్పిరి.

అని, తాత్పర్యము.

బాలిశస్త్వం నరశ్రేష్ఠ గమ్యతాం స్వపురం పునః
యాజనే భగవాం ఛ్ఛక్తస్త్రైలోక్యస్యాపి పార్థివ. ౫

టీక॥ నరశ్రేష్ఠ=మనుష్యులలోనుత్తముండవగురాజా; త్వం = నీవు; బాలిశః = మూర్ఖుఁడవు; పునః = మఱల; స్వపురం=నీయొక్కపట్టణము; గమ్యతాం=పొదఁబడుగాక; పార్థివ=రాజా; త్రైలోక్యస్యాపి, (త్రిష్వపిలోకేషు) = మూల్లోకముల యందును; యాజనే = యజ్ఞములు జేయించుటయందు; భగవాణ్ = మాహాత్మ్యముగలవసిష్ఠుఁడు; శక్తః=సమర్థుఁడైయున్నవాఁడు.

రాజామూర్ఖుఁడవు గనున్నావు మఱలనీవు నీపట్టణమునకు వెళ్లుము మాహాత్మ్యముగలవసిష్ఠమహాముని మూఁడులోకములయందును యాగములు జేయించుటకు సామర్థ్యము గలవాఁడని చెప్పెను.

అని, తాత్పర్యము.

అవమానంచ తత్కర్తుం తస్య శక్ష్యామహే కథమ్

టీక॥ తత్ =అసాధ్యమైనయాయజ్ఞమును; తస్య=ఆవసిష్ఠమహామునికి; అవమానంచ=తిరస్కారమును; కర్తుం=చేయుటకు; వయం=(అధ్యాహృతము) మేము; కథం=ఎట్లు; శక్ష్యామహే=సమర్థులమగుదుము

సాధింపశక్యముగాని యజ్ఞమును నావసిష్ఠమహామునికవమానమునుం జేయుటకు మేమెట్లు సమర్థులమగుదుము. అని, తాత్పర్యము.

తేషాం తద్వచనం శ్రుత్వా క్రోధపర్యాకులాక్షరమ్. ౬
స రాజా పునరేవైతా నిదం వచన మబ్రవీత్

టీక॥ సః=ఆ; రాజా=త్రిశంకుమహారాజు; క్రోధపర్యాకులాక్షరం,




క్రోధ=కోపముచేత, పర్యాకుల=కలుషమగు, అక్షరం=వర్ణములు గల; తేషాం=ఆవసిష్ఠపుత్రులయొక్క; తత్=ఆ; వచనం=మాటను, శ్రుత్వా=విని; పునరేవ=తిరిగియును; ఏతాన్=ఈవసిష్ఠపుత్రులంగూర్చి; ఇదం=చెప్పఁబోవుప్రకారమైన; వచనం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

త్రిశంకుమహారాజు, కోపముతో మేళనమైయుండు నక్షరములు గల యావసిష్ఠపుత్రులయొక్క యామాటవిని వీరలంగూర్చి మఱల నీమాటఁ జెప్పెను అని తాత్పర్యము.

ప్రత్యాఖ్యాతోఽస్మి గురుణా గురుపుత్రై స్తథైవచ. ౭
అన్యాం గతిం గమిష్యామి స్వస్తి వోస్తు తపోధనాః

టీక॥ తపోధనాః=తపమేధనముగాఁగలవసిష్ఠపుత్రులారా! గురుణా=గురువగువసిష్ఠునిచేత; ప్రత్యాఖ్యాతః = నిరాకరింపఁబడినవాఁడను; అస్మి=ఐతిని; తథైవ=ఆలాగుననే; గురుపుత్రైః=గురుపుత్రులరగుమీచేతను; ప్రత్యాఖ్యాతః అస్మి(అధ్యాహృతము)=నిరాకరింపఁబడినవాఁడనైతిని; వః=మీకు, స్వస్తి=మంగళము; అస్తు=అగుగాక. అహం=(అధ్యాహృతము) నేను; అన్యాం=మఱియొక; గతిం=యాజకుని; గమిష్యామి=పొందగలను. (అనిచెప్పెనని పూర్వక్రియతోనన్వయము).

తపోధనులగు వసిష్ఠపుత్రులారా! నాగురువుచేతనట్లెగురుపుత్రులరగుమీచేతంబ్రత్యాఖ్యాతుండనైతినిమీకు మంగళమగుగాక నేను మఱియొకయాజకునింబొందెదను అని, త్రిశంకువుచెప్పెను.

అని, తాత్పర్యము.

ఋషిపుత్రా స్తు తచ్ఛ్రుత్వా వాక్యం ఘోరాభి సంహితమ్. ౮
శేపుః పరమసంక్రుద్ధా శ్చండాలత్వం గమిష్యసి

టీక॥ ఋషిపుత్రాః తు=వసిష్ఠమహామునికొడుకులును; ఘోరాభి




సంహితం, ఘోర=ఘోరమగు, అభిసంహితం= అభిప్రాయముతోఁగూడియున్న; తత్=ఆ; వాక్యం=పలుకును; శ్రుత్వా=విని; పరమక్రుద్ధాః=అతిశయమగు కోపముగలవారగుచు; చండాలత్వం=చండాలభావమును; గమిష్యసి=పొందఁగలవు; ఇతి=(అధ్యాహృతము) అని; శేపుః=శపించిరి.

అప్పుడావసిష్ఠమహాముని కొడుకులుసాత్త్వికులగుచుండును బ్రహ్మపుత్రుండునగువసిష్ఠు నతిక్రమించి పురోహితాంతరాశ్రయణము చేసెదనననట్టి ఘోరాభిప్రాయయుక్తంబగు నాత్రిశంకునిమాటవిని పరమకోపనులగుచు జండాలుండవుగమ్మని, నాత్రిశంకువునకు, శాపంబిచ్చిరి. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాత్మానో వివిశు స్తే స్వ మాశ్రమమ్.౯

టీక॥ మహాత్మానః= మహాప్రభావముగల; తే=ఆవసిష్ఠునికొడుకులు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=పలికి; స్వం=తమదైన; ఆశ్రమం=తపోవనమును; వివిశుః=ప్రవేశించిరి.

మహామహిమంబుగల నావసిష్ఠపుత్రులిట్లుశపించి తమ యాశ్రమముంజేరిరి. అని, తాత్పర్యము.

అథ రాత్ర్యాం వ్యతీతాయాం రాజా చండాలతాం గతః
నీలవస్త్ర ధరో నీలః పరుషో ధ్వస్తమూర్ధజః. ౧౦
చిత్యమాల్యానులేపశ్చ ఆయసా భరణోభవత్

టీక॥అథ=పిమ్మట; రాత్ర్యాం=ఆ రాత్రి; వ్యతీతాయాం=కడచిపోఁగానే; రాజా = త్రిశంకుమహారాజు; చండాలతాం= చండాలభావమును; గతః=పొందినవాఁడగుచు; నీలవస్త్రధరః, నీల = నల్లనైన, వస్త్ర=బట్టలను; ధరః=ధరించినవాఁడును; నీలః=నల్లనైనవాఁడును; పరుషః = బిరుసైనదేహముగలవాఁడును; ధ్వస్తమూర్ధజః, ధ్వస్త=కలుచలైన, మూర్ధజః=తలవెంట్రుకలుగలవాఁడును; చిత్యమాల్యానులే

పశ్చ, చిత్యే = శ్మశానమందుగల, మాల్య=పూలదండలును, అనులేపశ్చ = బూడిదమైపూఁతయునుగలవాఁడును; ఆయసాభరణః, ఆయస=ఇనుముతోఁ జేయఁబడిన ; ఆభరణః= సొమ్ములుగలవాఁడును; అభవత్=ఆయెను.

పిమ్మటఁ దెల్లవారగా నాయాత్రిశంకుమహారాజు, చండాలదేహము నొందినల్లని బట్టలుగట్టుకొని నల్లనివాఁడై బిరుసైనశరీరముగల్గి కురుచలగు తలవెంట్రుకలతో శ్మశానమందుండుపూలదండలుం గల్గియుం దలి బూడిదెను దేహమంతయుం బూసికొని యినుముతోఁ జేయంబడినసొమ్ములుగలవాఁడుగా నుండెను. (అనఁగా దొల్లరాజుధరించిన వస్తువులన్నియు నీరూపములుగలవిగానాయెననుట.)

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా మంత్రిణస్సర్వే త్యజ్య చండాలరూపిణమ్. ౧౧
ప్రాద్రవన్ సహితా రామ పౌరా యే స్యానుగామినః

టీక॥ రామ=రాముఁడా! అస్య(ఇమం)= ఈరాజును; అనుగామినః= వెంబడించిపోయిన; పౌరాః=పురజనులు; యే=ఎవరో; తే=(అధ్యాహృతము) వారును; సర్వే=సమస్తులైన; మంత్రిణః=మంత్రులును ; చండాలరూపిణం= చండాలరూపము నొందిన; తం=ఆత్రిశంకువును, దృష్ట్వా=చూచి; త్యజ్య=విడిచిపెట్టి, సహితాః = గుంపుఁగూడుకొని; ప్రాద్రవన్=పరుగెత్తిరి.

రాముఁడా! ఈరాజును వెంబడించివచ్చిన పురజనులునుమంత్రులును, అందరు చండాలరూపము నొందినయాత్రిశంకువునుజూచి త్యజించిగుంపుగూడిపరుగెత్తిరి.

అని, తాత్పర్యము.

ఏకోహి రాజా కాకుత్స్థ జగామ పరమాత్మవాన్. ౧౨
దహ్యమానో దివారాత్రం విశ్వామిత్రం తపోధనమ్




టీక॥ కాకుత్థ్స=రాముఁడా! రాజా=త్రిశంకుమహారాజు; పరమాత్మవాన్=మిక్కిలిధైర్యముగలవాఁడై; దుఃఖేన=(అధ్యాహృతము)వ్యసనముచేత;దివా రాత్రం=రేయింబవలు; దహ్యామానః= దహింపఁబడుచున్నవాఁడగుచు;ఏకోహి=ఒక్కఁడుగానే; తపోధనం=తపము ధనముఁగాగల; విశ్వామిత్రం=వసిష్ఠవైరియైన విశ్వామిత్రునిఁగూర్చి; జగామ=వెళ్లెను.

రాముఁడా! త్రిశంకుమహారాజు మిక్కిలి ధైర్యముగలవాఁడై వ్యసనముచేత, రేయింబవలుదహించుచున్నవాఁడగుచు, ఒక్కఁడుగానే వసిష్ఠవిరోధియైన, తపోవంతుండగు,విశ్వామిత్రునింగూర్చి వెళ్లెను. అని, తాత్పర్యము.

విశ్వామిత్ర స్తుతం దృష్ట్వా రాజానం విఫలీకృతమ్. ౧౩
చండాళరూపిణం రామ మునిః కారుణ్య మాగతః

టీక॥ రామ = రాముఁడా! మునిః=మననశీలుఁడైన; విశ్వామిత్రస్తు=విశ్వామిత్రుఁడును; విఫలీకృతం=వసిష్ఠవాసిష్ఠులచే వ్యర్థముగఁజేయఁబడినమనోరథముగలవాఁడును;చండాళరూపిణం= చండాలరూపమునొందినవాఁడునగు; తం=ఆ; రాజానం= త్రిశంకుమహారాజును;దృష్ట్వా=చూచి; కారుణ్యం=దయను;ఆగతః=పొందెను

రాముఁడా! మననశీలుఁడగువిశ్వామిత్రమహాముని వసిష్ఠునిచేతనతనిపుత్రులచేతనువ్యర్థమనోరథుఁడుగాఁజేయఁబడిచండాళరూపమునొందిననా త్రిశంకుమహారాజునుజూచి దయగలవాఁడాయెనని, తాత్పర్యము

కారుణ్యా త్సమహాతేజా వాక్యం పరమధార్మికః. ౧౪
ఇదం జగాద భద్రం తే రాజానం ఘోరరూపిణమ్

టీక॥ రాజా=(అధ్యాహృతము) త్రిశంకుఁడా! తే=నీకు;భద్రం=మంగళము; అస్తి ఇత్యుక్త్వా=(అధ్యాహృతము)అగుఁగాకయనిచెప్పి;పరమధార్మికః=మిగులధర్మాత్ముఁడును; సుమహాతేజాః=అధికమగు




తేజస్సుగలవాఁడునునగు; సః=ఆ విశ్వామిత్రుఁడు; కారుణ్యాత్=దయవలన; ఘోరరూపిణం=కఠోరరూపముగల; రాజానం=త్రిశంకుమహారాజునుఁగూర్చి; ఇదం=ఈమాటను; జగాద=పలికెను.

త్రిశంకుఁడా! నీకుమంగళమగుగాక యనిచెప్పి పరమధార్మికుండును మహాతేజోవంతుండునగు, నావిశ్వామిత్రుఁడు ఘోరరూపమునొందియున్న, త్రిశంకుమహారాజునుం గూర్చి దయతోనీమాటఁజెప్పెను. అని, తాత్పర్యము.

కి మాగమనకార్యం తే రాజపుత్ర మహాబల. ౧౫
అయోధ్యాధిపతే వీర శాపా చ్చండాలతాం గతః

టీక ॥ మహాబలం=అధికమైనబలముగలవాఁడవు; రాజపుత్ర=రాచకొమరుండవు; వీర=శూరుండవునగు; అయోధ్యాధిపతె= అయోధ్యకురాజనైనత్రిశంకుఁడా! తే=నీయొక్క; ఆగమనకార్యం=వచ్చినపని; కిం=ఏమి; కేనహేతునా =(అధ్యాహృతము) ఏకారణముచేత; శాపాత్=శాపమువలన; చండాలతాం=చండాలత్వమును; గతః=పొందినవాఁడవయితివి.

మహాబలుండవురాజ పుత్రుండవు శూరుండవు నయోధ్యాపతివియునగు త్రిశంకుమహారాజా! నీవు, వచ్చినపనియేమి యేకారణముచేత శాపమువలనఁ జండాల భావమునొందితివని, విశ్వామిత్రుండడిగెను. అని, తాత్పర్యము.

అథ తద్వాక్య మాజ్ఞాయ రాజా చండాలతాం గతః. ౧౬
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్

టీక॥ అథ=పిమ్మట; చండాలతాం=చండాలభావమును; గతః=పొందియున్న; రాజా=త్రిశంకుమహారాజు; తద్వాక్యం, తత్ = ఆవి

శ్వామిత్రునియొక్క; వాక్యం=పలుకును, ఆజ్ఞాయ = విని; వాక్యజ్ఞః= వాక్యమెఱింగిన త్రిశంకుమహారాజు; ప్రాంజలిః= శ్రేష్ఠమైనచేమోడ్పుగలవాఁడగుచు; వాక్యకోవిదం, వాక్య=మాటలాడుటయందు; కోవిదం=సమర్థుఁడైన విశ్వామిత్రుని గూర్చి వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

పిమ్మటఁ జండాలత్వము నొందిన త్రిశంకు మహారాజు విశ్వామిత్రుని చేఁ జెప్పఁబడిన మాటవినిమాటలాడుటయందుచతురుండగు నా త్రిశంకుఁడుమంచిచేమోడ్పుగలవాడగుచు మాటలయందు సమర్థుఁడగు విశ్వామిత్రునింగూర్చి వాక్యము చెప్పెను, అని, తాత్పర్యము.

ప్రత్యాఖ్యాతోஉస్మి గురుణా గురుపుత్రైస్తథైవచ. ౧౭
అనవాప్యైవ తం కామం మయా ప్రాప్తో విపర్యయః

టీక॥ గురుణా=గురువగువసిష్ఠునిచేత; ప్రత్యాఖ్యాతః = నిరాకరింపఁబడినవాఁడను; అస్మి=అయితిని; తథైవ=ఆలాగుననే; గురుపుత్రైశ్చ, గురు=గురువగువసిష్ఠునియొక్క; పుత్రైశ్చ = కొడుకులచేతను; ప్రత్యాఖ్యాతః అస్మి = (అధ్యాహృతము) నిరాకరింపఁబడినవాఁడనైతిని; యం(అధ్యాహృతము)=ఏకోరికనుద్దేశించి; (గుర్వాద్యుపాసనము చేయఁబడెనో ) తం=ఆ; కామం= కోరికను; అనవాప్యైవ=పొందకయే; మయా=నాచేత; విపర్యయః=జాతిభ్రంశము; ప్రాప్తః=పొందఁబడెను.

విశ్వామిత్రుఁడా! నేనునాయొక్క గురువుచేతను గురుపుత్రులచేతను నిరాకరింపఁబడినవాఁడనైతిని యే కోరికనుద్దేశించి గురువుగురుపుత్రులును బ్రార్థింపఁబడిరో యానామనోరథమునుబొందకయే విపరీతప్రయోజనమగు జాతి భ్రంశము నాచే నొందఁ బడినదియని త్రిశంకువుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

సశరీరో దివం యాయామితి మే సౌమ్య దర్శనమ్. ౧౮

మయాచేష్టం క్రతుశతం తచ్చనాఽవాప్యతే ఫలమ్

టీక॥ సౌమ్య = సౌమ్యుఁడవగు విశ్వామిత్రుఁడా ! సశరీరః=శరీరముతోఁగూడినవాఁడనై; దివం=స్వర్గమును; యాయాం=పొందవలేను; ఇతి=అని; మే=నాయొక్క; దర్శనం=సంకల్పము; మయాచ=నాచేతను; క్రతుశతం=జన్మముల యొక్క నూరు; ఇష్టం=యజింపఁబడినది; తత్ ఫలం=ఆక్రతుశతఫలము; మయా=నాచేత; నావాప్యతే=పొందఁబడలేదు.

సౌమ్యుఁడవగు విశ్వామిత్రుఁడా ! యీశరీరముతోడనే స్వర్గమునకుఁ బోవలయునని, నాసంకల్పము నేను నూరుయజ్ఞములు చేసితిని దానిఫలమేమియు నాచేఁబొందఁబడలేదు అని, త్రిశంకుఁడు, చెప్పెను. అని, తాత్పర్యము.

అనృతం నోక్తపూర్వం మె నచ వక్ష్యే కదాచన. ౧౯
కృచ్ఛ్రేష్వపి గత స్సౌమ్య క్షత్రధర్మేణ తే శపె

టీక॥ సౌమ్య=సుముఖుఁడవైన విశ్వామిత్రుఁడా; మే(మయా)=నాచేత; అనృతం = అసత్యము; ఉక్తపూర్వం = ముందుచెప్పఁబడినది; న=కాదు; కృచ్ఛ్రేషు=ఆపత్తులను; (ద్వితీయార్థమందుసప్తమి) గతోపి=పొందినవాఁడనయ్యును; కదాచన=ఎప్పుడును; నచవక్ష్యే=చెప్పుటయేలేదు; క్షత్రధర్మేణ= క్షత్రియత్వసాక్షిగా; తే=నీయొక్క; పురతః=(అధ్యాహృతము)ఎదుటను; శపె=శపథముచేసెదను.

సుముఖుఁడవైన విశ్వామిత్రుఁడా! నాచేనసత్యమింతకుమున్ను జెప్పఁబడలేదిక ముందు నెటువంటి యాపత్తులువచ్చినప్పటి కనృతమాడజాలను, అని, యిప్పుడు నీయెదుట నాక్షత్రధర్మముసాక్షిగాఁబ్రమాణముఁజేసెదను.

అని, తాత్పర్యము.

యజ్ఞై ర్బహువిధైరిష్టం ప్రజా ధర్మేణ పాలితాః. ౨౦
గురవశ్చ మహాత్మాన శ్శీలవృత్తేన తోషితాః

టీక॥ మయా (అధ్యాహృతము)=నాచేత;బహువిధైః=పలు తెఅంగులయిన;యజ్ఞైః=యాగముల చేత;ఇష్టం=యజింపఁబడినదిఅనేక విధంబులగుయాగంబులుచేయఁబడినవనుట.ప్రజాః=జనులు; ధర్మేణ=ధర్మముచేత; పాలితాః=రక్షింపఁబడిరి.మహాత్మానః=పూజ్యమయిన స్వభావముగల;గురవశ్చ = ఆచార్యులును; శీలవృత్తేన = మంచిగుణముతోఁ గూడిన యాచారముచే; తోషితాః = సంతసింపఁ జేయఁబడిరి.

నేను, నానావిధంబులగు యాగంబులం జేసితిని,ధర్మంబునంబ్రజలఁబాలించితిని; మహాత్ములగుగురుజనంబుల వినయాదిగుణంబులచేతనుబూజాదులచేతను సంతోషపఱిచితిని. అని, తాత్పర్యము.

ధర్మే ప్రయతమానస్య యజ్ఞం చా హర్తు మిచ్ఛతః, ౨౧
పరితోషం నగచ్ఛంతి గురవో మునిపుంగవ

టీక॥మునిపుంగవ=మునిశ్రేష్ఠుఁడవయినవిశ్వామిత్రుఁడా! మమ=నేను;ధర్మే=ధర్మమందు,ప్రయతమానస్య= ప్రయత్నించుచుండఁగా;యజ్ఞంచ=యాగమును; ఆహర్తుం = చేయుటకు; ఇచ్ఛతః = ఇచ్ఛయించుచుండఁగా; గురవః= ఆచార్యులయిన వసిష్ఠాదులు; పరితోషం = సంతోషమును; నగచ్ఛంతి=పొందరు.

మునిశ్రేష్ఠుండ వగు విశ్వామిత్రుఁడా! నేనిట్లుధర్మముసంపాదించుటకైప్రయత్నించుచు, యాగముసేయనిచ్ఛగింపఁగా, నాగురువులు,సంతోషమునొందరు.

అని, తాత్పర్యము.

దైవ మేవ పరం మన్యే పౌరుషంతు నిరర్థకమ్. ౨౨
దైవేనా క్రమ్యతే సర్వం దైవం హి పరమా గతిః

టీక॥ దైవమేవ=ప్రారబ్ధమగునదృష్టమునే;పరం=అధికమైనదిగా;

మన్యే = తలంచెదను. పౌరుషం తు=పురుషకారముమాత్రము; నిరర్థకం=ప్రయోజనములేనిది. దైవేన=ప్రారబ్ధమగునదృష్టముచేత; సర్వం=అంతయును; ఆక్రమ్యతే= తిరస్కరింపఁబడుచున్నది. దైవం= ప్రారబ్ధమగునదృష్టము; పరమా= ఉత్కృష్టమయిన; గతిఃహి=ప్రాప్యస్థానముగదా!

కావున, ప్రారబ్ధమగు నదృష్టమే యధికంబనితలంతు; పురుషకారంబునం బ్రయోజనం బేమియు లేదు; ఆయదృష్టంబంతయు రూపుమాపి తానేస్థిరంబుగానిలుచు; కావున, నదియే పరమగతి.

అని, తాత్పర్యము.

తస్య మే పరమార్తస్య ప్రసాద మభికాంక్షతః. ౨౩
కర్తు మర్హసి భద్రం తే దైవోపహతకర్మణః

టీక॥ పరమార్తస్య=మిక్కిలి యుదుఃఖితుండను; దైవోపహతకర్మణః=దైవముచేఁ గొట్టఁబడిన పురుషకారముగలవాఁడను; ప్రసాదం=అనుగ్రహమును; అభికాంక్షతః=కోరువాఁడనగు; తస్య=అట్టి, మే=నాకు; ప్రసాదం(అధ్యాహృతము)=అనుగ్రహమును, కర్తుం= చేయుటకు; అర్హసి=తగుదువు. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక.

ఇట్లు, పరమదుఃఖితుండ; నా పురుషకారంబు దైవంబునం గొట్టఁబడియె; నీయనుగ్రహంబుఁగోరెదను; అట్టి, నాయందనుగ్రహంబు సేయవలయు; నీకుమంగళమగుఁగాక.

అని, తాత్పర్యము.

నాన్యాం గతిం గమిష్యామి నాన్య శ్శరణ మస్తి మే. ౨౪
దైవం పురుషకారేణ నివర్తయితు మర్హసి

టీక॥ అన్యాం=ఇతరమయిన; గతిం=స్థానమును; నగమిష్యామి = పొందను. మే=నాకు; అన్యః=ఇతరుఁడు; శరణం=రక్షకుఁడుగా; నా

స్తి=లేదు. పురుషకారేణ=పౌరుషముచేత; దైవం=దైవమును; నివర్తయితుం=త్రిప్పుటకు; అర్హసి=తగుదువు.

నేను, మఱియొక్కనియొద్దకుఁ బోను; నీవుదక్కనాకురక్షకుండుమఱియెవ్వండునులేడు. నీవు, పౌరుషంబున, దైవంబుత్రిప్పి, నాకనుకూలంబుగాఁజేయవలయును. అని, త్రిశంకువు, విశ్వామిత్రునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే , అష్టపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండాష్టపంచాశసర్గ, టీక,
ముగిసినది.

---

శ్రీ

ఏ కో న ష ష్టి త మ స ర్గ ప్రా రం భః.

ఉక్తవాక్యంతు రాజానం కృపయా కుశికాత్మజః
అబ్రవీ న్మధురం వాక్యం సాక్షా చ్చండాలరూపిణమ్. ౧

టీక॥ కుశికాత్మజస్తు=కుశవంశమందుఁబుట్టినవాని కొడుకయినవిశ్వామిత్రుఁడును; ఉక్తవాక్యం=చెప్పఁబడినమాటగలవాఁడును; సాక్షాత్ = ప్రత్యక్షముగా; చండాళరూపిణం=చండాలునియొక్కయాకారము గలవాఁడునగు ; రాజానం= త్రిశంకుమహారాజునుగూర్చి; కృపయా=దయతోఁ; మధురం= ఇంపైన; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

విశ్వామిత్రుండును, ఇట్లుమాటలాడి, చండాళరూపంబుతోనెదుటనున్నత్రిశంకువుంజూచి, దయగల్గి,

ఇట్లని, మధురంబగునొకమాట చెప్పెను. అని, తాత్పర్యము.

ఐక్ష్వాక స్వాగతం వత్స జానామి త్వాం సుధార్మికమ్
శరణం తే భవిష్యామి మాభైషీ స్నృపపుంగవ. ౭

టీక॥ ఐక్ష్వాక=ఇక్ష్వాకువంశంబునంబుట్టిన; వత్స=బాలుఁడా! తే (అధ్యాహృతము) = నీకు; స్వాగతం=సుఖముతోడిరాక; అస్తు(అధ్యాహృతము) = అగుఁగాక. త్వాం=నిన్ను; సుధార్మికం=చక్కగాధర్మమునాచరించువానింగా; జానామి=ఎఱుంగుదును. తే=నీకు; శరణం=రక్షకుఁడను; భవిష్యామి=అయ్యెదను. నృపపుంగవ = రాజశ్రేష్ఠుఁడవయిన త్రిశంకూ; మాభైషీః=భయపడకుము.

ఇక్ష్వాకువంశంబునంబుట్టిన త్రిశంకుమహారాజా! నీకుస్వాగతంబగుఁగాక; నీవుమిక్కిలియుధార్మికుండవని యెఱుంగుదు; నిన్నురక్షించెదను, నీవురాజులకందఱకును మేటి విభయపడవలదు. అని తాత్పర్యము.

అహం మామంత్రయే సర్వా న్మహర్షీ న్పుణ్యకర్మణః
యజ్ఞసాహ్యకరా న్రాజ న్తతో యక్ష్యసి నిర్వృతః. ౩

టీక॥ అహం=నేను; పుణ్యకర్మణః=పరిశుద్ధంబులగు కర్మంబులుగలవారును; యజ్ఞసాహ్యకరాన్=యాగమునకుఁ దోడుపాటు సేయువారునగు; మహర్షీన్=పూజ్యులయినఋషులను; సర్వాన్=అందఱను; ఆమంత్రయే = పిలిచెదను. రాజన్=త్రిశంకుమహారాజా! తతః=అంతట; నిర్వృతః=సుఖముగలవాఁడవై; యక్ష్యసి= యాగము సేయఁగలవు.

నేను బుణ్యకర్ములును యాగమునకుఁ దోడ్పాటు సేయంగలవారునగు మహర్షుల నందఱం బిలిచెదను, అంత, నీవు, సుఖంబున, యాగము సేయఁగలవు. అని, తాత్పర్యము.

గురుశాపకృతంరూపం యదిదం త్వయివర్తతే
అనేన సహరూపేణ సశరీరో గమిష్యసి. ౪

టీక॥త్వయి=నీయందు; యత్=ఏ; ఇదం=ఈ; గురుశాపకృతం=గురువులశాపంబుచేఁ జేయఁబడిన; రూపం=చండాళరూపము; వర్తతే=ఉన్నదో; తేన(అధ్యాహృతము)=ఆ; అనేన=ఈ; రూపేణసహ=చండాళరూపముతోఁగూడ; సశరీరః=దేహముతోఁగూడినవాఁడవై; స్వర్గం(అధ్యాహృతము)=స్వర్గమును; గమిష్యసి=పొందఁగలవు.

నీయందిప్పుడు, గురుశాపంబు సంగల్గిన యేచండాళరూపం బున్నదో, దానితోఁగూడనే, సశరీరుఁడవై, స్వర్గమునొందెదవు. అని, తాత్పర్యము.

హస్తప్రాప్త మహం మన్యే స్వర్గం తవ నరాధిప
య స్త్వం కౌశిక మాగమ్య శరణ్యం శరణాగతః. ౫

టీక॥ నరాధిప=మనుష్యులకుఁ బ్రభువైనత్రిశంకూ; యః=ఏ; త్వం=నీవు; శరణ్యం=శరణుచొరఁదగినవాఁడగు; కౌశికం=విశ్వామిత్రుని; ఆగమ్య=పొంది; శరణాగతః=శరణుచొచ్చితివో; తస్య(అధ్యాహృతము)=అట్టి; తవ=నీకు; స్వర్గం=స్వర్గము; హస్తప్రాప్తం=అఱచేతనున్నదానిఁగా; అహం=నేను; మన్యే=తలఁచెదను.

త్రిశంకుమహారాజా!నీవు, శరణు చొరఁదగినవాఁడయిన, విశ్వామిత్రుని శరణుచొచ్చినావు, కావున,నీకు, స్వర్గము, అఱచేతనున్న విధంబున,ననాయాసంబుగా ఘటిల్లఁగలదని, తలంచెదను. అని, విశ్వామిత్రుఁడు, త్రిశంకువుతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజాః పుత్రాన్ పరమధార్మికాన్
వ్యాదిదేశ మహాప్రాజ్ఞాన్ యజ్ఞసంభారకారణాత్. ౬

టీక॥ ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; మహాతేజాః=అధికమైనప్రభావముగలవిశ్వామిత్రుఁడు; పరమధార్మికాన్=మిక్కిలియుధర్మమునాచరించువారును; మహాప్రాజ్ఞాన్=గొప్పపండితులునగు ; పుత్రాన్=కొడుకులను ; యజ్ఞసంభారకారణాత్=యాగమునకుఁగావలసినవస్తువులకై; వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

ఇట్లుచెప్పి, మహాతేజుండగు విశ్వామిత్రుఁడు, మిక్కిలియు ధార్మికులును, గొప్ప పండితులు నగు తన కొడుకులం బూచి, "మీరలు యాగంబునకుఁ గావలసినవానిసంపాదింపుఁడు" అని, యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

సర్వాన్ శిష్యాన్ సమాహూయ వాక్యమేత దువాచ హ

టీక॥విశ్వామిత్రః(అధ్యాహృతము)=విశ్వామిత్రుఁడు;శిష్యాన్=శిష్యులను;సర్వాన్=అందఱను; సమాహూయ=పిలిచి; ఏతత్=ఈ; వాక్యం=మాటను; ఉవాచ= చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థకము.

విశ్వామిత్రుఁడుదనశిష్యులనందఱంబిలిచి, వారలతో,నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సర్వా నృషిగణా న్వత్సా ఆనయధ్వం మమాజ్ఞయా ౭
సశిష్యసుహృద శ్చైవ స ర్త్విజ స్స బహుశ్రుతా న్

టీక॥వత్సాః=బాలురా ! మమ=నాయొక్క; ఆజ్ఞయా=ఆజ్ఞచేత; సశిష్యసుహృద శ్చైవ= శిష్యులతోను స్నేహితులతోనుంగూడినవియును; సర్త్విజః=ఋత్విజులతోఁగూడినవియును; సబహుశ్రుతాన్ = చాలవిద్యగల వారితోఁ గూడినవియునగు; ఋషిగణాన్=ఋషుల సమూహములను; సర్వాన్=అన్నింటిని; ఆనయధ్వం=

తోడ్కొనిరండు.

బాలురా! నాయాజ్ఞచేఁబోయి శిష్యులతోను స్నేహితులతోను ఋత్విజులతోను బండితులతోనుంగూడి నఋషుల నందఱం దోడ్కొనిరండు. అని, తాత్పర్యము.

యదన్యో వచనం బ్రూయా న్మద్వాక్యబలచోదితః। ౭
తత్సర్వ మఖిలేనోక్తం మమా ఖ్యేయ మనాదృతమ్

టీక॥ అన్యః=ఇతరుఁడు; మద్వాక్యబలచోదితః= నామాటబల్మిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై; యత్=ఏ మాటను; బ్రూయాత్=చెప్పునో; తత్= ఆ; అనాదృతం= మన్నన లేకుండునట్లు; అఖిలేన = అందఱిచేతను; ఉక్తం=చెప్పఁబడినది; సర్వం=అంతయు; మమ=నాకు; ఆఖ్యేయం=చెప్పఁదగినది.

మీరుగాక, మఱియెవ్వఁడైనను నామాటవినినంతనే, యేదైనను జెప్పెనేని, యట్లనాదరణచేఁ జెప్పిన మాటలనన్నియు నాకుఁ జెప్పవలయును. అని, విశ్వామిత్రుఁడు, శిష్యులకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా దిశో జగ్ము స్తదాజ్ఞయా. ౯

టీక॥ తే(అధ్యాహృతము)=ఆ శిష్యులు; తస్య=ఆవిశ్వామిత్రునియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా = విని; తదాజ్ఞయా=ఆవిశ్వామిత్రునియాజ్ఞచేత; దిశః = దిక్కులంగూర్చి; జగ్ముః=పోయిరి.

విశ్వామిత్రుండుచెప్పిన మాటనువిని, యతనియాజ్ఞను, శిష్యులందఱు, దిక్కులంగూర్చిపోయిరి.

అని, తాత్పర్యము.

ఆజగ్ము రథ దేశేభ్య స్సర్వేభ్యో బ్రహ్మవాదినః

టీక॥ అథ=అటుపిమ్మట; సర్వేభ్యః = సమస్తములయిన ; దేశే

టీక॥ విశ్వామిత్రేణ=విశ్వామిత్రునిచేత; పాలితాః=పాలింపఁబడిన, మహాత్మానః=పూజ్యమయినస్వభావముగల; బ్రాహ్మణావా= బ్రాహ్మణులుగాని; చండాళభోజనం=చండాలునియన్నమును; భుక్త్వా=తిని; కథం=ఎట్లు; స్వర్గం=స్వర్గమును; గమిష్యంతి=పొందఁగలరు?

విశ్వామిత్రునిమాటవిని చండాళాన్నము భక్షించు మహాత్ములగు బ్రాహ్మణులునెట్లు, స్వర్గంబునొందఁగలరు? అని, తాత్పర్యము.

ఏత ద్వచన నైష్ఠుర్య మూచు స్సంర క్తలోచనాః. ౧౫
వాసిష్ఠా మునిశార్దూల సర్వే తే స మహోదయాః

టీక॥ మునిశార్దూల=మునిశ్రేష్ఠుఁడవయినవిశ్వామిత్రుఁడా! సమహోదయాః= మహోదయునితోఁగూడిన; తే=ఆ; వాసిష్ఠాః=వసిష్ఠునికొడుకులు; సర్వే=అందఱును; సంరక్తలోచనాః= మిక్కిలియునెఱ్ఱనికండ్లుగలవారలై; ఏతత్=ఈ మాటను; వచననైష్ఠుర్యం= మాటయందుఁ గాఠిన్యముగల్గునట్లు; ఊచుః=చెప్పిరి.

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! మహోదయుండును వసిష్ఠపుత్రులునందఱును, గోపంబునఁ నెఱ్ఱనైనకండ్లుగల్గి, యతిపరుషంబుగానిప్పుడుచెప్పినట్లు, చెప్పిరి. అని, శిష్యులువిశ్వామిత్రునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

తేషాం త ద్వచనం శ్రుత్వా సర్వేషాం మునిపుంగవః. ౧౬
క్రోధ సంరక్తనయన స్సరోష మిద మబ్రవీత్

టీక॥ తేషాం= ఆశిష్యులయొక్క; సర్వేషాం=అందఱియొక్కయు; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; మునిపుంగవః=మునిశ్రేష్ఠుండయిన విశ్వామిత్రుఁడు; క్రోధసంరక్తనయనః=కోపముచే మిక్కిలియు నెఱ్ఱనయిన కండ్లుగలవాఁడై; సరోషం= రోషముతోఁగూడునట్లు; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆశిష్యులందఱునుం జెప్పినమాటలువిని, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, కోపంబుననెఱ్ఱనైనకంన్నులుగలవాఁడై, రోషముతో నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

యే దూషయన్త్యదుష్టం మాం తప ఉగ్రం సమాస్థితమ్. ౧౭
భస్మీభూతా దురాత్మానో భవిష్యన్తి నసంశయః

టీక ॥ యే=ఎవరు; ఉగ్రం=భయంకరమయిన; తపః=తపస్సును; సమాస్థితం=అవలంబించియున్న; (కావుననే)అదుష్టం = దోషములేని; మాం=నన్ను; దూషయన్తి=దూషించుచున్నారో; దురాత్మానః = దుష్టస్వభావముగల; తే=(అధ్యాహృతము)వారు; భస్మీభూతాః= బూడిదగానయినవారలు; భవిష్యన్తి = కాఁగలరు; సంశయః=సందేహము; న=లేదు.

భయంకరంబగుతపస్సుసేయుచుండుటంబట్టి యదుష్టుండనగు నన్నెవ్వరు దూషించెదరో; దురాత్ములగు నా వసిష్ఠపుత్రులును మహోదయుండును, భస్మీభూతులు కాఁగలరు; ఇందు, సంచియంబులేదు. అని, తాత్పర్యము.

అద్య తే కాలపాశేన నీతా వైవస్వతక్షయమ్. ౧౮
సప్తజాతి శతాన్యేవ మృతపాః సన్తు సర్వశః

టీక॥ తే=ఆవసిష్ఠపుత్రులు; అద్య=ఇప్పుడు; కాలపాశేన=యముని త్రాడుచేత; వైవస్వత క్షయం = యమునిగృహమును; నీతాః=కొనిపోఁబడినవారలై; సప్తజాతిశతాన్యేవ = ఏడునూఱుజన్మములవఱకు; సర్వశః = అన్నివిధములుగాను, మృతపాః=శవములఁద్రాగువారుగా, శవములభక్షించువారుగాననుట; సన్తు=అగుదురుగాక.

ఆవసిష్ఠునికొడుకులు, ఇప్పుడు, కాలపాశంబునయమునియొద్దకునయింపఁబడిపిమ్మట, నేడునూఱుజన్మములవఱకునుపీనుఁగుమాంసంబులందినుచుందురుగాక. అని, తాత్పర్యము.

శ్వమాంసనియతాహారా ముష్టికా నామ నిర్ఘృణాః. ౧౯
వికృతాశ్చ విరూపాశ్చ లోకా ననుచరంత్విమాన్

టీక॥ తే(అధ్యాహృతము)=ఆ వసిష్ఠపుత్రులు;ముష్టికానామ=ముష్టికులనుహీనజాతులయి; శ్వమాంసనియతాహారాః= కుక్కమాంసమె నిత్యమైన యాహారము గాఁగ లవారలయి;నిర్ఘృణాః=దయలేనివారలయి; వికృతాశ్చ=వికారముగలవారలయి, వికారముగలయాచారాదులు గలవారలయియనుట; విరూపాశ్చ = వికృతమయినయాకారముగలవారలయి; ఇమాన్= ఈ;లోకాన్=లోకంబులను; అనుచరంతు= అనుసరించితిరుగుదురుగాక

ఆవసిష్ఠపుత్రులు, ముష్టికులను హీనజాతియందుఁ బుట్టి, కుక్కమాంసమునె నియతముగాఁదినుచు నిర్దయులై,వికృతమయినయాచారంబును,ఆకారంబునుంగల్గి, యీలోకంబులంజరింతురుగాక.

అని, తాత్పర్యము.

మహోదయస్తుదుర్బుద్ధిర్మామదూష్యంహ్యదూషయత్. ౨౦
దూషిత స్సర్వలోకేషు నిషాదత్వం గమిష్యతి

టీక॥ దుర్బుద్ధిః=దుష్టబుద్ధిగల; మహోదయస్తు= మహోదయుండును; అదూష్యం=దూషింపఁదగనిః;మాం = నన్ను;అదూషయత్ హి=దూషించెనుగదా!సః(అధ్యాహృతము)=ఆమహోదయుఁడు; సర్వలోకేషు= సమస్తలోకంబులందును ; దూషితః=దూషింపఁబడినవాఁడై; నిషాదత్వం=బోయవాఁడగుటను; గమిష్యతి=పొందఁగలఁడు.

దుర్బుద్ధియగుమహోదయుండు, దూషింపఁగూడనినన్నుదూషించెనుగదా! అతండుసమస్తలోకంబులందునుదూషితుండైనిషాదజాతియందుఁబుట్టును.అని, తాత్పర్యము.

ప్రాణాతిపాతనిరతో నిరనుక్రోశతాం గతః. ౨౧
దీర్ఘకాలం మమ క్రోధా ద్దుర్గతిం వర్తయిష్యతి

టీక॥ సః (అధ్యాహృతము) ఆమ హోదయుఁడు; ప్రాణాతిపాతనిరతః = ప్రాణములయొక్క నాశము సేయుటయందాసక్తుఁడై; నిరనుక్రోశతాం = దయలేకుండుటను; గతః = పొందినవాఁడై; మమ = నాయొక్క; క్రోధాత్ = కోపమువలన; దీర్ఘకాలం = చిరకాలము; దుర్గతిం = దుష్టజీవికను; వర్తయిష్యతి = పొందఁగలడు.

ఆమహోదయుండు, ప్రాణనాశమందెయాసక్తుఁడై, నిర్దయుండై, నాదుకోపంబునంజేసి, చిరకాలంబు, నిందనీయంబగు జీవికనవలంబించియుండఁగలఁడు. అని, విశ్వామిత్రుఁడు, చెప్పెను. అని తాత్పర్యము.

ఏతావ దుక్త్వా వచనం విశ్వామిత్రో మహాతపాః. ౨౨
విరరామ మహాతేజా ఋషిమధ్యే మహామునిః

టీక॥ మహామునిః = పూజ్యుఁడైన మునియును; మహాతపాః = అధికమయినతపస్సుగలవాఁడును; మహాతేజాః = అధికమయినప్రభావముగలవాఁడునగు; విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు; ఋషిమధ్యే = ఋషులనడుమను; ఏతావత్ = ఇంత; వచనం = మాటను; ఉక్త్వా = చెప్పి; విరరామ = ఊరకుండెను.

అధికమైనతపంబును ప్రభావంబునుంగల విశ్వామిత్ర మహాముని, ఋషులనడుమ, నింతమట్టుకుఁజెప్పి, యంతనూరకుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకోనషష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండైకోనషష్టితమసర్గటీక, ముగిసినది.

శ్రీ

## షష్టితమసర్గప్రారంభః.

తపోబలహతాన్ కృత్వా వాసిష్ఠాన్ సమహోదయాన్
ఋషిమధ్యే మహాతేజా విశ్వామిత్రో భ్యభాషత. ౧

టీక॥ మహాతేజాః=అధికమైనప్రభావముగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; సమహోదయాన్=మహోదయునితోఁ గూడిన; వాసిష్ఠాన్= వసిష్ఠునికొడుకులను; తపోబలహతాన్= తపముయొక్క బల్మిచేఁజంపఁబడినవారినిగా; కృత్వా=చేసి; ఋషిమధ్యే=ఋషులనడుమను; అభ్యభాషత=పలికెను.

మహాప్రభావుండగు విశ్వామిత్రుండుతనతపోబలంబున, మహోదయునితోఁగూడ , వసిష్ఠపుత్రులు, నందఱహతులఁగావించి, మరల, ఋషులనడుమ, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అయ మిక్ష్వాకుదాయాద స్త్రిశంకురితి విశ్రుతః
ధర్మిష్ఠశ్చ వదాన్యశ్చ మాంచైవ శరణంగతః. ౨
తేనానేన శరీరేణ దేవలోకజిగీషయా

టీక॥ అయం=వీఁడు; ఇక్ష్వాకుదాయాదః=ఇక్ష్వాకువుయొక్క వంశమునందుఁబుట్టినవాఁడు. త్రిశంకురితి=త్రిశంకువని; విశ్రుతః = ప్రసిద్ధుఁడు. ధర్మిష్ఠశ్చ=మిక్కిలియు ధార్మికుండును. వదాన్యశ్చ=చాలనీవిగలవాఁడును. తేన=అట్టిదియును, పూర్వముక్షత్రియరూపముగానున్నదియననుట; అనేన = ఇట్టిదియునగు, ఇప్పుడుచండాలరూపముగానున్నదియనగుననుట; శరీరేణ=దేహముచేత ; దేవలోక జిగీషయా=స్వర్గమునుజయింపనిచ్ఛచేత; మాంచైవ=నన్నే; శరణం=రక్షకునిఁగా; గతః=పొందినాఁడు.

వీఁడు, ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినవాఁడు; త్రిశంకువని వీనిపేరు; ఇతండు, మిగులధార్మికుఁడు, దా

తయు, ఇతఁడు, పూర్వము క్షత్రియ రూపముగా నుండి, యిప్పుడు శాపంబునఁ, జండాళత్వమునొందిన తనశరీరముతోనే, స్వర్గము నొందఁగోరి, నన్నుశరణుచొచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

యథాయం స్వశరీరేణ స్వర్గలోకం గమిష్యతి. ౩
తథా ప్రవర్త్యతాం యజ్ఞో భవద్భిశ్చ మయాసహ

టీక॥ యథా=ఎట్లు; అయం=ఈత్రిశంకువు; స్వశరీరేణ = తనదేహముతో; స్వర్గలోకం=స్వర్గలోకమును; గమిష్యతి=పొందునో; తథా=అట్లు; భవద్భిశ్చ=మీచేతను; మయాసహ=నాతోఁగూడ; యజ్ఞః=యాగము; ప్రవర్త్యతాం=గడుపఁబడుఁగాక.

ఈత్రిశంకువెట్లు, తనదేహంబుతో, స్వర్గము నొందునో; అట్లుమీరు, నన్నుంగూడి, యాగముజరిగింపుఁడు. అని, విశ్వామిత్రుండుచెప్పెను. అని, తాత్పర్యము.

విశ్వామిత్రవచ శ్ర్శుత్వా సర్వఏవ మహర్షయః. ౪
ఊచు స్సమేత్య సహితా ధర్మజ్ఞా ధర్మసంహితమ్

టీక॥ విశ్వామిత్రవచః=విశ్వామిత్రునిమాటను; శ్రుత్వా=విని; ధర్మజ్ఞాః= ధర్మంబులనెఱింగిన; మహర్షయః= పూజ్యులయినబుషులు; సర్వఏవ = అందఱునే; సమేత్య=వచ్చి; సహితాః= ఒకటిగాఁగూడుకొనినవారలయి; ధర్మసంహితం= ధర్మముతోఁగూడియుండునట్లు; ఊచుః=చెప్పుకొనిరి.

విశ్వామిత్రునిమాటవిని, ధర్మజ్ఞులగునామహర్షులందఱును, ఒకటిగాఁజేరి, పరస్పరమిట్లని, ధర్మయుక్తంబుగామాటలాడుకొనిరి.

అని, తాత్పర్యము.

అయం కుశికదాయాదో మునిః పరమకోపనః. ౫
యదాహ వచనం సమ్య గేతత్కార్యం నసంశయః

టీక॥కుశికదాయాదః=కుశికుని వంశమునందుఁబుట్టిన; పరమకోపనః=మిక్కిలియుఁగోపించునట్టి; అయం=ఈ; మునిః=విశ్వామిత్రమహాముని,యత్=ఏ;వచనం=మాటను;ఆహ=చెప్పుచున్నాఁడో; తత్ (అధ్యాహృతము)=అ; ఏతత్=ఇది,సమ్యక్=చక్కగా; కార్యం = చేయఁదగినది. సంశయః=సందేహము;న=లేదు.

కుశికవంశంబునం బుట్టినయీవిశ్వామిత్రుండు, మిగులఁగోపంబుగలవాఁడు;ఇతండు, చెప్పినది, చక్కగాఁజేయఁదగినదే; సంశయములేదు. అని, తాత్పర్యము.

అగ్నికల్పో హి భగవాన్ శాపం దాస్యతి రోషితః. ౬

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగలవిశ్వామిత్రుఁడు;అగ్నికల్పో హి = నిప్పుతోసరివచ్చువాఁడుగదా! రోషితః=కోపింపఁజేయఁబడినవాఁడై;శాపం=శాపమును; దాస్యతి=ఇచ్చును.

భగవంతుండగు విశ్వామిత్రుండు, నిప్పువంటివాఁడు; ఇతనికిఁగోపంబుగలుగఁజేసితిమేని, మనలశపించును. అని, తాత్పర్యము.

తస్మా త్ప్రవర్త్యతాం యజ్ఞ స్సశరీరో యథా దివమ్
గచ్ఛే దిక్ష్వాకుదాయాదో విశ్వామిత్రస్య తేజసా. ౭
తథా ప్రవర్త్యతాం యజ్ఞ స్సర్వే సమధితిష్ఠత

టీక॥తస్మాత్=అందువలన; యజ్ఞః=యాగము;ప్రవర్త్యతాం=జరగింపఁబడుఁగాక. యథా=ఎట్లు; ఇక్ష్వాకుదాయాదః= ఇక్ష్వాకువంశంబునంబుట్టినత్రిశంకువు;విశ్వామిత్రస్య=విశ్వామిత్రునియొక్క; తేజసా=ప్రభావముచేత; సశరీరః=దేహముతోఁగూడినవాఁడై ; దివం=స్వర్గమును;గచ్ఛేత్=పొందునో; తథా=అట్లు; యజ్ఞః=యాగము; ప్రవర్త్యతాం=జరిగింపఁబడుఁగాక. సర్వే=అందఱును;సమధితిష్ఠత=ఆరంభింపుఁడు.

కావున,యాగము జరిగింపుఁడు,

ఈత్రిశంకువు, విశ్వామిత్రుని తేజంబున, నెట్లు, సశరీరంబుగా స్వర్గమునొందునో, అట్లు, యాగము సేయింపుడు; అందఱు నారంభింపుడు, అని, ఋషులు, పరస్పరము మాటలాడుకొనిరి. అని, తాత్పర్యము.

ఏవముక్త్వా మహర్షయ శ్చక్రు స్తాస్తాః క్రియా స్తదా. ౮
యాజకశ్చ మహాతేజా విశ్వామిత్రో భవత్క్రతౌ

టీక॥ మహర్షయః = పూజ్యులయినఋషులు; ఏవం = ఇట్లు; ఉక్త్వా= చెప్పి; తదా= అప్పుడు; తాస్తాః= ఆయా; క్రియాః= కార్యములను; చక్రుః= చేసిరి. క్రతౌ= యాగమునందు; యాజకశ్చ= యాగము సేయించువాఁడును; మహాతేజాః= అధికమయినప్రభావముగల; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; అభవత్= అయ్యెను.

మహర్షులిట్లు, పరస్పరము మాటలాడి నిర్ణయించికొని, అప్పుడు, యాగమునందవ్వైకార్యంబులం జేసిరి; మహాతేజుండగు విశ్వామిత్రుండును, అధ్వర్యుండయ్యె.
అని, తాత్పర్యము.

ఋత్విజ శ్చానుపూర్వ్యేణ మంత్రవ న్మంత్రకోవిదాః. ౯
చక్రుః కర్మాణి సర్వాణి యథాకల్పం యథావిధి

టీక॥ మంత్రకోవిదాః= మంత్రంబులందుఁబండితులయిన; ఋత్విజశ్చ= ఋత్విజులును; ఆనుపూర్వ్యేణ= వరుసచేత; కర్మాణి= కార్యంబులను; సర్వాణి= అన్నింటిని; మంత్రవత్= మంత్రముగల్గునట్లుగాను; యథాకల్పం= కల్పసూత్రప్రకారముగాను; యథావిధి= యథాశాస్త్రముగాను; చక్రుః= చేసిరి.

మంత్రజ్ఞులగు, ఋత్విజులును, వరుసగా, సమస్తకర్మంబుల, మంత్రయుక్తంబుగఁ, గల్పసూత్రంబునఁ జెప్పఁబడినట్లు యథాశాస్త్రంబుగఁ జేసిరి. అని, తాత్పర్యము.

తతః కాలేన మహతా విశ్వామిత్రో మహాతపాః. ౧౦
చకారా వాహనం తత్ర భాగార్థం సర్వదేవతాః




టీక॥ తతః=అంతట; తత్ర=ఆ యాగమునందు; మహాతపాః=అధికమయిన తపస్సుగల ; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; మహతా=అధికమయిన; కాలేన=కాలముచేత; భాగార్థం=హవిర్భాగములనిచ్చుటకొఱకు; సర్వదేవతాః=సమస్తదేవతలంగూర్చి; ఆవాహనం=పిలుపును; చకార=చేసెను.

అంత, నాయాగంబునందు, మహాతపస్వియగువిశ్వామిత్రుండు, హవిర్భాగములనిచ్చుటకై, సమస్తదేవతలఁ, జిరకాలము, మంత్రంబులఁ జేఁబిలచెను. అని, తాత్పర్యము.

నాభ్యాగమం స్తదాహూతా భాగార్థం సర్వదేవతాః. ౧౧

టీక॥ సర్వదేవతాః=సమస్తదేవతలు; భాగార్థం = హవిర్భాగముకొఱకు; తదాహూతాః=ఆ విశ్వామిత్రునిచేఁ బిలువఁబడినవారలై; నాభ్యాగమన్=రాకైరి.

ఆవిశ్వామిత్రుఁడు హవిర్భాగమొసంగుటకెంతపిలిచినను, దేవతలెవ్వరును రాకైరి. అని తాత్పర్యము.

తతః క్రోధసమావిష్టో విశ్వామిత్రో మహామునిః
స్రువముద్యమ్య సక్రోధ స్త్రిశంకు మిద మబ్రవీత్. ౧౨

టీక॥ తతః=అటుపిమ్మట; మహామునిః=పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; క్రోధసమావిష్టః=కోపముచేనావేశింపఁబడినవాఁడై; స్రువం=స్రువమనెడు హోమముచేయు నుపకరణమును; ఉద్యమ్య=ఎత్తి; సక్రోధః=కోపముతోఁగూడినవాఁడై; త్రిశంకుం=త్రిశంకువునుగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, విశ్వామిత్రమహాముని, కోపంబునొంది, స్రువంబెత్తి, రోషంబున, త్రిశంకునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పశ్య మే తపసోవీర్యం స్వార్జితస్య నరేశ్వర
ఏష త్వాం సశరీరేణ నయామి స్వర్గమోజసా. ౧౩




టీక॥ నరేశ్వర=మనుష్యులకుఁ బ్రభువైన త్రిశంకూ! మే=నాయొక్క; స్వార్జితస్య=చక్కఁగా సంపాదింపఁబడిన; తపసః= తపస్సుయొక్కఁ; వీర్యం=ప్రభావమును; పశ్య = చూడుము. ఏషః=ఈ; అహం(అధ్యాహృతము)=నేను; ఓజసా=ప్రభావముచేత; త్వాం = నిన్ను; సశరీరేణ=దేహముతోఁగూడ; స్వర్గం=స్వర్గమును; నయామి=పొందించెదను.

త్రిశంకుమహారాజా ! నాదు స్వార్జితంబగు తపంబు ప్రభావముఁజూడుము; ఇదిగో! తపఃప్రభావంబున, నిన్నిప్పుడు, సశరీరంబుగా స్వర్గమునకుఁబోవునట్లు, చేసెదను.

అని, తాత్పర్యము.

దుష్ప్రాపం సశరీరేణ దివం గచ్ఛ నరాధిప

టీక॥ నరాధిప=మనుష్యులకుఁ బ్రభువైన, త్రిశంకూ! దుష్ప్రాపం=పొందఁగూడని; దివం=స్వర్గమును; సశరీరేణ=దేహముతోఁగూడ; గచ్ఛ=పొందుము.

త్రిశంకుమహారాజా! ఇతరులెవరికినిబొందఁగూడనిస్వర్గమును, నీవు, సశరీరంబుగాఁబొందుము.

అని, తాత్పర్యము.

స్వార్జితం కించి దప్యస్తి మయా హి తపసః ఫలమ్. ౧౪
రాజన్ స్వతేజసా తస్య సశరీరో దివం వ్రజ

టీక ॥ రాజన్=త్రిశంకుమహారాజా! మయా=నాచేత; స్వార్జితం=చక్కఁగా సంపాదింపఁబడిన; తపసః=తపసుయొక్కఁ; ఫలం=ఫలము; కించిదపి=కొంచెమైనను; అస్తి హి=ఉన్నదిగదా ! తస్య=ఆతపః ఫలముయొక్కఁ; స్వతేజసా=తనప్రభావముచేత; సశరీరః = దేహముతోఁగూడినవాఁడవై; దివం=స్వర్గమును; వ్రజ=పొందుము.

త్రిశంకుమహారాజా! నేనుసంపాదించిన తపఃఫలంబు కొంచెంబైన

నున్నదిగదా! దానిప్రభావంబునం జేసి, నీవు దేహంబుతోఁగూడస్వర్గంబునకరుగుము. అని,విశ్వామిత్రుఁడు సెప్పెను. అని, తాత్పర్యము.

ఉక్తవాక్యే మునౌ తస్మిన్ సశరీరో నరేశ్వరః. ౧౫
దివం జగామ కాకుత్స్థ మునీనాం పశ్యతాం తదా

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! తస్మిన్=ఆ; మునౌ= విశ్వామిత్రమహామునిఁ; ఉక్తవాక్యే=చెప్పఁబడిన మాటగలవాఁడుకాఁగా;తదా=అప్పుడు;మునీనాం=మునులు; పశ్యతాం= చూచుచుండఁగా; నరేశ్వరః=మనుష్యులకుఁ బ్రభువైనత్రిశంకువు; సశరీరః=దేహముతోఁగూడినవాఁడై; దివం=స్వర్గమును; జగామ=పొందెను.

రాముఁడా! ఇట్లు, విశ్వామిత్రమహాముని చెప్పఁగానే, యప్పుడు మునులందఱుఁ జూచుచుండ త్రిశంకువు, దేహంబుతోఁగూడ, స్వర్గంబునొందెను.

అని, తాత్పర్యము.

దేవలోకగతం దృష్ట్వా త్రిశంకుం పాకశాసనః. ౧౬
సహ సర్వై స్సురగణై రిదం వచన మబ్రవీత్

టీక॥ పాకశాసనః= పాకుండనురాక్షసునిశిక్షించినయింద్రుండు; దేవలోకగతం=స్వర్గమునుబొందినః త్రిశంకుం=త్రిశంకువును; దృష్ట్వా=చూచి; సర్వైః=సమస్తములయిన;సురగణైస్సహ = దేవతలయొక్క సమూహములతోఁగూడ; ఇదం=ఈ,వచనం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

దేవేంద్రుండు, ఇట్లుసశరీరంబుగాస్వర్గంబునొందిన త్రిశంకువుం జూచి, దేవతలనందఱుంగూడి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

త్రిశంకో గచ్ఛ భూయ స్త్వం నాసి స్వర్గ కృతాలయః.౧౭
గురుశాపహతో మూఢ పత భూమి మవాక్ఛిరాః

టీక॥ త్రిశఙ్కో = త్రిశంకూ! త్వం=నీవు; భూయః = మఱల; గచ్ఛ=పొమ్ము; స్వర్గకృతాలయః= స్వర్గమునందుఁ జేయఁబడినయునికిగలవాఁడవు; స్వర్గమునందుండఁదగినవాఁడవనుట; నాసి= కావు. మూఢ=తెలివిలేనిత్రిశంకూ! గురుశాపహతః=గురువులశాపంబుచేఁ గొట్టఁబడినవాఁడవు.అవాక్శిరాః= క్రింది మొగమయిన తలగలవాఁడవై; భూమిం=భూమినిగూర్చి; పత=పడుము, లేక, పొమ్ము.

త్రిశంకూ! నీవుమఱలఁబొమ్ము; నీవుస్వర్గంబునందుండఁదగవు; తెలివిలేనివాఁడా! నీవుగురుశాపంబునఁ గొట్టువడితివి; తలక్రిందుగా నేలంబడుము. అని, యింద్రుండుత్రిశంకుతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తో మహేంద్రేణ త్రిశంకు రపత త్పునః. ౧౮
విక్రోశమాన స్త్రాహీతి విశ్వామిత్రం తపోధనమ్

టీక॥ త్రిశంకుః=త్రిశంకువు; మహేంద్రేణ = దేవేంద్రునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తపోధనం=తపస్సేధనముగాఁగల; విశ్వామిత్రం=విశ్వామిత్రునిం గూర్చి; "త్రాహి=రక్షింపుము"; ఇతి=అని; విక్రోశమానః=అఱచుచు; పునః=మఱల; అపతత్=పడెను.

ఇట్లు, దేవేంద్రుండు చెప్పఁగానే, త్రిశంకువు, తపోధనుండగువిశ్వామిత్రుంగూర్చి "రక్షింపుము." అనియఱచుచుమఱలం, బడెను.

అని, తాత్పర్యము.

త చ్ఛ్రుత్వా వచనం తస్య క్రోశమానస్య కౌశికః. ౧౯
రోష మాహారయ త్తీవ్రం తిష్ఠతిష్ఠేతిచా బ్రవీత్

టీక॥ క్రోశమానస్య=అఱచుచున్న; తస్య = ఆ త్రిశంకువుయొక్క; తత్=ఆ; వచనం = మాటను; శ్రుత్వా=విని; కౌశికః=విశ్వామిత్రుఁడు; తీవ్రం=తీక్ష్ణమయిన; రోషం=కోపమును; ఆహారయత్=చేసెను, "తిష్ఠతిష్ఠ=నిలునిలు;" ఇతి=అని; అబ్రవీచ్చ=చెప్పెను.

ఇట్లు అఱచుచున్న యా త్రిశంకుమాటవిని, విశ్వామిత్రుండు, తీవ్రంబగు కోపంబునొంది, పడుచున్న త్రిశంకుం బూచి, "నిలునిలు" మని చెప్పెను. అని, తాత్పర్యము.

ఋషిమధ్యే స తేజస్వీ ప్రజాపతి రివా పరః. ౨౦
సృజన్ దక్షిణమార్గస్థాన్ సప్తర్షీ నపరాన్ పునః

టీక॥ తేజస్వీ=ప్రభావముగలట్టి; సః=ఆవిశ్వామిత్రుఁడు; ఋషిమధ్యే=ఋషులనడుమను; పునః=మఱల; అపరాన్=ఇతరులయిన; దక్షిణమార్గస్థాన్ = దక్షిణపుదిక్కునందలి మార్గమునందుండు; సప్తర్షీన్=ఏడ్వురఋషులను; సృజన్=సృజించుచు; అపరః=ఇతరుఁడైన; ప్రజాపతిరివ=బ్రహ్మదేవుఁడునట్లు; అభూత్ (అధ్యాహృతము)=ఉండెను.

మహాప్రభావుండగు నావిశ్వామిత్రుండు, ఋషులనడుమనుండి, దక్షిణపుదిక్కునందు, వేఱుగా, సప్తర్షులసృజించి, రెండవబ్రహ్మదేవుండనందగి, యుండెను. అని తాత్పర్యము.

నక్షత్రమాలా మపరా మసృజ త్క్రోధమూర్ఛితః. ౨౧
దక్షిణాం దిశమాస్థాయ మునిమధ్యే మహాయశాః

టీక॥ మహాయశాః=అధికమయిన కీర్తిగల విశ్వామిత్రుఁడు; క్రోధమూర్ఛితః= కోపముచే వ్యాపింపఁబడినవాఁడై; మునిమధ్యే=మునులనడుమను; దక్షిణాం = దక్షిణపు; దిశం=దిక్కును; ఆస్థాయ=అవలంబించి; అపరాం=ఇతరమయిన; నక్షత్రమాలాం=నక్షత్రములపజ్క్తిని; అసృజత్=సృజించెను.

అధికంబగు కీర్తిగల విశ్వామిత్రుండు, చాలఁగోపించి, మునులనడుమనుండి, దక్షిణపుదిక్కునందు, క్రొత్తగా నక్షత్రంబుల సృజించెను. అని, తాత్పర్యము.

సృష్ట్వా నక్షత్రవంశంచ క్రోధేన కలుషీ కృతః. ౨౨
అన్యమింద్రం కరిష్యామి లోకోవాస్యాద నింద్రకః

టీక॥ నక్షత్రవంశం=నక్షత్రములయొక్క సమూహమును ; సృష్ట్వాచ=సృజించియు; సః(అధ్యాహృతము) = ఆవిశ్వామిత్రుఁడు; క్రోధేన = కోపముచేత;కలుషీకృతః=కలఁకఁబాఱునట్లుచేయఁబడినవాఁడై;"అన్యం=ఇతరుఁడైన; ఇంద్రం=ఇంద్రుని; కరిష్యామి=చేసెదను;వా=లేనియెడల; లోకః=ప్రపంచమైనను; అనింద్రకః=ఇంద్రుండు లేనిదిగా;స్యాత్=అగును."లేక; "లోకోవా=లేనియెడ నేనుసృజించులోకము;అనింద్రకః=ఇంద్రుఁడు లేనిది;స్యాత్=అగును." (ఇతి=అని; సమకల్పయత్ = సంకల్పించెను).

ఇట్లు, నక్షత్రములసృజించి, విశ్వామిత్రుండు,కోపంబున "మఱియొకయింద్రునైనం జేసెదను, లేనియెడ ప్రపంచమునందింద్రుఁడె లేకపోవుఁగాక." (అర్థాంతరమందు.) లేనియెడ, నేనుసృజించులోకంబింద్రుండులేనిదేయగుఁగాక" యని సంకల్పించెను. అని, తాత్పర్యము.

దైవతాన్యపి సక్రోధా త్స్రష్టుం సముపచక్రమే. ౨౩

టీక॥ సః=ఆవిశ్వామిత్రుఁడు; క్రోధాత్=కోపమువలన;దైవతాన్యపి=దేవతలనుంగూడ; స్రష్టుం=సృజించుటకు;సముపచక్రమే=ప్రారంభించెను.

ఆవిశ్వామిత్రుండు,కోపంబున, దేవతలనుంగూడసృజింపయత్నించెను. అని,తాత్పర్యము.

తతః పరమసంభ్రాంతా స్సర్షిసంఘా స్సురాసురాః
విశ్వామిత్రం మహాత్మాన మూచు స్సానునయం వచః. ౨౪

టీక॥తతః=అటుపిమ్మట;సర్షిసంఘాః= ఋషులయొక్కసమూహముతోఁగూడిన; సురాసురాః=దేవతలునుఅసురులును; పరమసంభ్రాంతాః= మిక్కిలియు వెఱఁగుపడినవారై; మహాత్మానం=అధికమయిన ప్రభావముగల ; విశ్వామిత్రం=విశ్వామిత్రునిఁగూర్చి;సానున

యం = ఊఱడింపుతోఁగూడిన; వచః=మాటను; ఊచుః=చెప్పిరి.

అంత, ఋషులును దేవతలునసురులును, మిక్కిలియు వెఱఁగువడి, మహాత్ముండగు విశ్వామిత్రునియొద్దకు వచ్చి, యతనినూఱడించుచు, నిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

అయం రాజా మహాభాగ గురుశాపపరిక్షతః
సశరీరో దివంయాతుం నార్హత్యేవ తపోధన. ౨౫

టీక॥ మహాభాగ=పూజ్యమయిన, భాగ్యము గలవాఁడవు; తపోధన=తపస్సేధనముఁగాఁగలవాఁడవునగు విశ్వామిత్రుఁడా! గురుశాపపరిక్షతః= గురువులశాపముచేతఁగొట్టఁబడిన; అయం=ఈ; రాజా=త్రిశంకుమహారాజు; సశరీరః=దేహముతోఁగూడినవాఁడై; దివం=స్వర్గమును; యాతుం=పొందుటకు; నార్హత్యేవ=తగనేతగఁడు.

మహాభాగుండవు తపోధనుండవగు విశ్వామిత్రుఁడా! ఈత్రిశంకుమహారాజు, గురుశాపంబునం గొట్టువడినవాఁడుకావున, దేహంబుతోఁగూడ స్వర్గంబునొందుటకుఁ దగఁడనుటసత్యము. అని, దేవతలు విశ్వామిత్రునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

తేషాం తద్వచనం శ్రుత్వా దేవానాం మునిపుంగవః
అబ్రవీ త్సుమహద్వాక్యం కౌశిక స్సర్వదేవతాః. ౨౬

టీక॥ తేషాం=ఆ; దేవానాం=దేవతలయొక్క; తత్ = ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; మునిపుంగవః = మునిశ్రేష్ఠుండగు; కౌశికః = విశ్వామిత్రుఁడు; సర్వదేవతాః=సమస్తదేవతలనుంగూర్చి; సుమహత్= మిక్కిలియుఁబూజ్యమయిన; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆదేవతలు చెప్పిన మాటనువిని, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, దేవతల నెల్లరం జూచి, మిక్కిలి యుఁబూజ్యంబగు మాటచెప్పెను.

అని, తాత్పర్యము.

సశరీరస్య భద్రం వ స్త్రిశంకో రస్య భూపతేః
ఆరోహణం ప్రతిజ్ఞాయ నానృతం కర్తు ముత్సహే. ౨౭

టీక॥ వః=మీకు;భద్రం=మంగళము;అస్తు(అధ్యాహృతము)= అగుఁగాక. సశరీరస్య=దేహముతోఁగూడిన;అస్య = ఈ;భూపతేః=భూమికిఁబ్రభువైన;త్రిశంకోః=త్రిశంకువునకు; ఆరోహణం=స్వర్గము నెక్కుటను;ప్రతిజ్ఞాయ=ప్రతిజ్ఞ చేసి;అనృతం=దబ్బఱను; కర్తుం=చేయుటకు;నోత్సహే=కోరను.

మీకుమంగళమగుఁగాక;"ఈత్రిశంకుమహారాజు దేహముతోఁగూడ స్వర్గమునకుఁబోవుఁగాక;" యని ప్రతిజ్ఞఁజేసి, దానిదబ్బఱఁజేయనొల్లను. అని, తాత్పర్యము.

స్వర్గోఽస్తు సశరీరస్య త్రిశంకో రస్య శాశ్వతః

టీక॥ సశరీరస్య=దేహముతోఁగూడిన;అస్య=ఈ; త్రిశంకోః=త్రిశంకువునకు; శాశ్వతః=స్థిరమయిన; స్వర్గః=స్వర్గము; అస్తు= అగుఁగాక.

ఈత్రిశంకువు,సశరీరముగానే, శాశ్వతంబగు స్వర్గంబునొందుఁగాక. అని, తాత్పర్యము.

నక్షత్రాణిచ సర్వాణి మామకాని ధ్రువాణ్యథ. ౨౮
యావ ల్లోకా ధరిష్యంతి తిష్ఠం త్వేతాని సర్వశః
మత్కృతాని సురా స్సర్వే తదను జ్ఞాతు మర్హథ. ౨౯

టీక॥అథ=ఇంకను;మత్కృతాని=నాచేఁజేయఁబడినవి,(గనుకనే)మామకాని=నావైన; ఏతాని=ఈ;నక్షత్రాణి=నక్షత్రములు; సర్వాణి=అన్నియు;యావత్= ఎంతవఱకు; లోకాః=లోకంబులు; ధరిష్యంతి= ఉండునో; తావత్ (అధ్యాహృతము)=అంతవఱకు; సర్వశః=అన్నివిధంబులను;ధ్రువాణి= స్థిరములుగా;తిష్ఠంతు = ఉండుఁగాక. సురాః=దేవతలారా!సర్వే = అందఱును;తత్=దానిని; అనుజ్ఞాతుం=




అంగీకరించుటకు; అర్హథ=తగుదురు.

నేనుసృజించిన యీనక్షత్రంబులన్నియు, లోకంబులుండుదనుక,స్థిరంబులయియుండుఁగాక ; దేవతలారా! మీరలందఱును, దానినొప్పుకొనవలయును. అని,విశ్వామిత్రుఁడు దేవతలతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవముక్తా స్సురా స్సర్వే ప్రత్యూచు ర్మునిపుంగవమ్

టీక॥సురాః=దేవతలు;సర్వే=అందఱును;ఏవం=ఇట్లు;ఉక్తాః=చెప్పఁబడినవారలై; మునిపుంగవం=మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రునింగూర్చి;ప్రత్యూచుః=బదులుచెప్పిరి.

విశ్వామిత్రుండు, చెప్పినమాటనువిని,దేవతలందఱును.అతనికిట్లని,బదులుచెప్పిరి.అని, తాత్పర్యము.

ఏవం భవతు భద్రం తే తిష్ఠం త్వేతాని సర్వశః. ౩౦
గగనేతాన్య నేకాని వైశ్వానర పథాద్బహిః
నక్షత్రాణి మునిశ్రేష్ఠ తేషు జ్యోతిష్షు జాజ్వలన్. ౩౧
అవాక్ఛిరా స్త్రిశంకుశ్చ తిష్ఠత్వ మరసన్నిభః

టీక॥మునిశ్రేష్ఠ=మునులలోమేటియైనవిశ్వామిత్రుఁడా! తే=నీకు; భద్రం=మంగళము;అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక. ఏవం=ఇట్లు;భవతు=అగుఁగాక. తాని=ఆ; ఏతాని=ఈ; అనేకాని=పెక్కులయిన;నక్షత్రాణి=నక్షత్రంబులు;సర్వశః=అన్నివిధంబులను; గగనే=ఆకాశమందు ; వైశ్వానర పథాత్=అనాదిగానుండు,జ్యోతిశ్చక్రముయొక్క-మార్గముననకంటెను;బహిః=వెలుపల; తిష్ఠంతు=ఉండుఁగాక! త్రిశంకుశ్చ=త్రిశంకువును; అవాక్ఛిరాః=క్రిందుమొగమయినతలగలవాఁడై; తేషు=ఆ;జ్యోతిష్షు=నక్షత్రంబులందు,నక్షత్రంబులనడుమనుట;జాజ్వలన్=మిక్కిలియుఁబ్రకాశించుచు;అమరసన్నిభః=దేవతతోసమానుఁడై;తిష్ఠతు = ఉండుఁగాక.




మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! నీకు మంగళంబగుఁగాక; నీవు చెప్పినట్లు యగుఁగాక; నీవు సృజించిన నక్షత్రంబులన్నియు, నాకాశమందు నాదిజ్యోతిశ్చక్ర మార్గంబునకు వెలుపల, నన్నివిధంబుల, శాశ్వతంబులుగా నేయుండుఁగాక; ఈత్రిశంకువును, వానినడుమందలక్రిందుగాఁ బ్రకాశించుచు, దేవతాసమానుండై యుండుఁగాక. అని, తాత్పర్యము.

అనుయాస్యంతి చైతాని జ్యోతీంషి నృపసత్తమమ్. ౩౨
కృతార్థం కీర్తిమంతం చ స్వర్గలోకగతం యథా

టీక॥ ఏతాని = ఈ; జ్యోతీంషి చ = నక్షత్రంబులును; కృతార్థం = నెఱవేఱినపనిగలవాఁడును; కీర్తిమంతం చ = మంచికీర్తిగలవాఁడునగు; నృపసత్తమం = రాజశ్రేష్ఠుండయినత్రిశంకువును; స్వర్గలోకగతం యథా = స్వర్గలోకమునొందినవానింబోలె; అనుయాస్యంతి = అనుసరించును.

ఈనక్షత్రంబులును, కృతార్థుండును గీర్తిశాలియునగు త్రిశంకుమహారాజును, స్వర్గమునొందినవానినెట్లో, అట్లనుసరింపుచుండును. అని, దేవతలు విశ్వామిత్రునకుఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రస్తు ధర్మాత్మా సర్వదేవై రభిష్టుతః. ౩౩
ఋషిభిశ్చ మహాతేజా బాఢ మిత్యాహ దేవతాః

టీక॥ మహాతేజాః = అధికమయినప్రభావముగలవాఁడును; ధర్మాత్మా = ధర్మబుద్ధిగలవాఁడునగు; విశ్వామిత్రస్తు = విశ్వామిత్రుఁడును; సర్వదేవైః = సమస్తదేవతలచేతను; ఋషిభిశ్చ = ఋషులచేతను; అభిష్టుతః = పొగడఁబడినవాఁడై; దేవతాః = దేవతలనుగూర్చి; "బాఢం = మంచిది"; ఇతి = అని; ఆహ = (భూతార్థమందులట్) చెప్పెను.

మహాప్రభావుండును ధర్మాత్ముండునగు విశ్వామిత్రుండట్లు దేవ

తలచేతను ఋషులచేతనుం బొగడంబడి, దేవతలంజూచి, "మంచిది" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తతో దేవా మహాత్మానో మునయశ్చ తపోధనాః. ౩౪
జగ్ముర్యథాగతం సర్వే యజ్ఞస్యాంతే నరోత్తమ

టీక ॥ నరోత్తమ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! తతః=అటుపిమ్మట; యజ్ఞస్య= యాగముయొక్క; అంతే = సమాప్తియందు; మహాత్మానః= పూజ్యమయినస్వభావముగల; దేవాః=దేవతలును; తపోధనాః= తపస్సే ధనముగాఁగల; మునయశ్చ=మునులును; సర్వే= అందఱును; యథాగతం=వచ్చినట్లు; జగ్ముః=పోయిరి.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అంతయాగంబుముగిసినపిదప, మహాత్ములగు దేవతలును, తపోధనులగుమునులునందఱును, వచ్చినట్లు, పోయిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, షష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండషష్టితమసర్గటీక,
ముగిసినది.

(శ్రీ)

ఏకషష్టితమసర్గప్రారంభః.

విశ్వామిత్రో మహాత్మా థ ప్రస్థితాన్ ప్రేక్ష్య తా నృషీన్
అబ్రవీ న్నరశార్దూల స్సర్వాం స్తా న్వనవాసినః. ౧

టీక॥అథ=అటుపిమ్మట; మహాత్మా=పూజ్యమయినస్వభావముగలవాఁడును; నరశార్దూలః=పురుషశ్రేష్ఠుండునగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; ప్రస్థితాన్=పయనమయిన; తాన్=ఆ; ఋషీన్=ఋషులను; ప్రేక్ష్య= చూచి; వనవాసినః=వనములోనున్న; తాన్=ఆఋషులను; సర్వాన్ = అందఱినుగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంత, మహాత్ముండును బురుషశ్రేష్ఠుండు నగు విశ్వామిత్రుండు, యాగమునకై వచ్చినఋషులందఱు నుబోవుటంజూచి, తనతిపోవనంబునసనుండుమునులంజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మహాన్విఘ్నః ప్రవృత్తోయం దక్షిణా మాస్థితో దిశమ్
దిశ మన్యాం ప్రపత్స్యామ స్తత్ర తప్స్యామహే తపః. ౨

టీక॥అయం=ఈ; మహాన్=గొప్పదియగు; విఘ్నః=విఘ్నము; దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కును; ఆస్థితః = అవలంబించినదై; ప్రవృత్తః=సంభవించినది. అన్యాం=వేఱైన; దిశం=దిక్కును; ప్రపత్స్యామః=పొందెదము. తత్ర=అచ్చట; తపః = తపస్సును; తప్స్యామహే=తపించెదము, చేసెదమనుట.

ఈదక్షిణపుదిక్కునందు గొప్పవిఘ్నముసంభవించినది; కావునమఱియొక్కదిక్కునకుఁబోవుదము; అచ్చటనెతపంబుసేయుదము.

అని, తాత్పర్యము.

పశ్చిమాయాం విశాలాయాం పుష్కరేషు మహాత్మనః
సుఖం తప శ్చరిష్యామః పరం తద్ధి తపోవనమ్. ౩

టీక॥ మహాత్మనః (మహాత్మానః)=పూజ్యమయినస్వభావముగలమునులారా! విశాలాయాం=వెడల్పుగల; పశ్చిమాయాం=పడమటిదిక్కునందు; పుష్కరేషు=పుష్కరతీరములందు; సుఖం=సుఖముగా; తపః=తపస్సును; చరిష్యామః=చేసెదము తత్=అది; పరం=శ్రేష్ఠమయిన; తపోవనంహి=తపస్సునకుయోగ్యమయినవనముగదా!

విశాలమయిన పశ్చిమపుదిక్కునందుబుష్కరతీర్థంబుల తీరంబులందు, సుఖముగాఁదపంబు గావింతము; అదిమంచితపోవనంబుగదా ! అని, విశ్వామిత్రుఁడుఋషులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజాః పుష్కరేషు మహామునిః
తప ఉగ్రం దురాధర్షం తేపే మూలఫలాశనః. ౪

టీక॥ ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; మహాతేజాః=అధికమయినప్రభావముగల; మహామునిః=పూజ్యుఁడైనయావిశ్వామిత్రుఁడు; పుష్కరేషు = పుష్కరతీర్థములందు; మూలఫలాశనః= గడ్డలునుబండ్లునేయాహారముగాఁగలవాఁడై; ఉగ్రం= భయంకరమయినదియును; దురాధర్షం=తిరస్కరింపఁగూడనిదియునగు; తపః=తపస్సును; తేపే=తపించెను, చేసెననుట.

ఇట్లాఋుషులకుఁజెప్పి, మహాప్రభావుండగు విశ్వామిత్రమహాముని, పశ్చిమదిక్కునకుంబోయి, యందలి పుష్కరతీర్థంబుల తీరంబులందు, ఫలమూలంబులే యాహారంబుగాఁగొని, భయంకరంబును దురాధర్షంబునగుతపంబుగావించెను.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నేవ కాలేతు అయోధ్యాధిపతి నృపః
అంబరీష ఇతిఖ్యాతో యష్టుం సముపచక్రమే. ౫

టీక॥ ఏతస్మిన్=ఈ; కాలేత్వేవ=కాలమునందే; అయోధ్యాధిప

తిః=అయోధ్యకుఁబ్రభువయిన; అంబరీషః=అంబరీషుఁడు; ఇతి=అని; ఖ్యాతః=ప్రసిద్ధుఁడగు; నృపః=రాజు; యష్టుం=యాగముసేయుటకు; సముపచక్రమే=ఆరంభించెను.

ఈకాలమునందే, అయోధ్యకుఁ బ్రభువయిన యంబరీషుండను రాజొకండుయాగముసేయనారంభించెను.

అని, తాత్పర్యము.

తస్య వై యజమానస్య పశు మింద్రో జహార హ
ప్రణష్టేతు పశౌ విప్రో రాజాన మిద మబ్రవీత్. ౬

టీక॥ యజమానస్య=యాగముసేయుచున్న; తస్య=ఆయంబరీషునియొక్క; పశుం = యాగపశువును; ఇంద్రః=ఇంద్రుఁడు; జహార=హరించెను. ("హ" అనునది పాదపూరణార్థము) పశౌ=యాగపశువు; ప్రణష్టేతు=అగపడకపోఁగానే; విప్రః = పురోహితుండగు బ్రాహ్మణుండు; రాజానం=రాజును గూర్చి; ఇదం = ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

యాగము సేయుచున్న యా యంబరీషునిపశువును దేవేంద్రుండపహరించెను; ఇట్లు, పశువుకనుపడకుండుటంజూచి, పురోహితుండు, రాజుతో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పశు రద్య హృతో రాజన్ ప్రణష్ట స్తవ దుర్నయాత్
అరక్షి తారం రాజానం ఘ్నంతి దోషా నరేశ్వర. ౭

టీక॥ రాజన్=అంబరీషమహారాజా! పశుః=యాగపశువు; తవ=నీయొక్క; దుర్నయాత్=దుర్గతివలన, ప్రమాదమువలననుట; హృతః=అపహరింపఁబడినదై; అద్య= ఇప్పుడు; ప్రణష్టః=అగపడదయ్యె. నరేశ్వర= మనుష్యులకుఁ బ్రభువయినయంబరీషుఁడా! దోషాః=దోషములు; అరక్షితారం= కాపాడనట్టి; రాజానం=రాజును;

ఘ్నంతి=చంపుచున్నవి.

అంబరీషుఁడా! నీ వేమఱియుండుటం జేసి, యాగపశువు నెవ్వరో యపహరించిరి; అదియిప్పుడు కానంబడదయ్యె; ఇట్లు, ఏమఱియున్న రాజును, దోషంబులు చంపును.

అని, తాత్పర్యము.

ప్రాయశ్చిత్తం మహద్ధ్యేత న్నరం వా పురుషర్షభ
ఆనయస్వ పశుం శీఘ్రం యావత్కర్మ ప్రవర్తతే. ౮

టీక॥ పురుషర్షభ=పురుష శ్రేష్ఠుండవగు నంబరీషుఁడా! ఏతత్=ఈ, ప్రాయశ్చిత్తం=, ప్రాయశ్చిత్తము; మహద్ధి=గొప్పదికదా! యావత్=ఎంతలోపల; కర్మ=యాగకార్యము; ప్రవర్తతే=(భవిష్యదర్థమందు లట్) జరుగఁగలదో; తావత్ (అధ్యాహృతము)=అంతలోపల; నరంవా=మనుష్య రూపమునైనను; పశుం=పశువును; ఆనయస్వ=కొనిరమ్ము.

మనుష్య శ్రేష్ఠుండవగు నంబరీషుఁడా! ఇప్పుఁడు, గల్గిన యపచారమునకుఁ జేయవలసిన ప్రాయశ్చిత్తంబు చాలగొప్పది; కనుపడకపోయిన పశువును వెదకి కొనితెచ్చుట యుత్తమము, లేనియెడల, మనుష్య పశువునైనను యాగకార్యారంభము సేయుటకు మున్నె, శీఘ్రింబుగాఁ దేవలయును. అని, పురోహితుఁడు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఉపాధ్యాయ వచ శ్శ్రుత్వా స రాజా పురుషర్షభ
అన్వియేష మహాబుద్ధిః పశుం గోభి స్సహస్రశః. ౯

టీక॥ పురుషర్షభ= పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! ఉపాధ్యాయవచః= పురోహితుని మాటను; శ్రుత్వా=విని; మహాబుద్ధిః=అధికమైనబుద్ధిగలః సః=ఆ; రాజా=అంబరీషమహారాజు; సహస్రశః=వేనవేలసంఖ్యగల; గోభిః=ఆవులతో; పశుం= పశువును; అన్వియేష=

వెదకెను.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా; పురోహితునిమాటవిని, మహాబుద్ధిశాలియగు నాయంబరీషుండు, వేనవేలు గాగోవులంగొని, నరపశువునువెదకెను. అని, తాత్పర్యము.

దేశాన్ జనపదాంస్తాంస్తా న్నగరాణి వనానిచ
ఆశ్రమాణిచ పుణ్యాని మార్గమాణో మహీపతిః. ౧౦
స పుత్ర సహితంతాత సభార్యం రఘునందన
భృగుతుంగే సమాసీన మృచీకం సందదర్శ హ. ౧౧

టీక॥ తాత=నాయనవయిన; రఘునందన=రాముఁడా! మహీపతిః=భూమికిఁబ్రభువయిన; సః=ఆయంబరీషుండు; తాంస్తాన్=ఆయాయాదేశాన్=దేశములను; జనపదాన్=గ్రామములను; నగరాణి=పట్టణములను; వనానిచ=అడవులను; పుణ్యాని=పవిత్రంబులగు; ఆశ్రమాణిచ=ఆశ్రమములను; మార్గమాణః=వెదకుచు; పుత్రసహితం=కొడుకులతోఁగూడినవాఁడును; సభార్యం=పెండ్లాముతోఁగూడినవాఁడును; భృగుతుంగే=భృగుతుంగమనుపర్వతమందు; సహ=కూడ, కొడుకులు భార్యవీరితోఁగూడననుట; ఆసీనం=కూర్చుండి యున్నవాఁడునగు; ఋచీకం=ఋచీకమహర్షిని; సందదర్శ=చూచెను. ("హ"అనునది పాదపూరణార్థకము.)

రాముఁడా! ఆయంబరీషుండు, అయ్యైదేశంబుల గ్రామంబులఁబట్టణంబులనడవులఁబవిత్రంబులగు నాశ్రంబుల వెదకుచునెందును నరపశువుంబడయఁజాలక, భృగుతుంగంబనుపర్వతంబునకరిగి, యచ్చోఁగొడుకులతో భార్యతోనుంగూడఁ గూర్చుండియున్న ఋచీకమహర్షిం జూచెను. అని, తాత్పర్యము.

తమువాచ మహాతేజాః ప్రణమ్యాభి ప్రసాద్యచ
బ్రహ్మర్షిం తపసాదీప్తం రాజర్షి రమితప్రభః. ౧౨
పృష్ట్వా సర్వత్రకుశల మృచీకం త మిదం వచః




టీక॥ మహాతేజాః=అధికమయిన ప్రభావముగలవాఁడును; అమితప్రభః=కొలతలేనికాంతిగలవాఁడును; రాజర్షిః = రాజునుఋషియునగునంబరీషుండు; తం=ప్రసిద్ధుండును; బ్రహ్మర్షిం=బ్రాహ్మణుండునుఋషియును; తపసా=తపస్సుచేత; దీప్తం = ప్రకాశించువాఁడునగు; ఋచీకం=ఋచీకుని; ప్రణమ్య=నమస్కరించి; అభిప్రసాద్య=సంతోషపఱచియు ; సర్వత్ర=అన్నిటను; కుశలం=క్షేమమును, పృష్ట్వా=అడిగి; తం=ఆఋచీకునిగూర్చి; ఇదం=ఈ; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

అతి పరాక్రమశాలియు రాజర్షియుఁ గొలందిలేని కాంతిగలవాఁడునగు నంబరీషుండు, బ్రహ్మర్షియుఁ దపస్సుచేఁ బ్రకాశించువాఁడునగుఋచీకుని నమస్కరించి సంతోషపఱచి, యన్నిటనుగుశలం బడిగి, యతనితో నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

గవాం శతసహస్రేణ విక్రీణీషే సుతం యది. ౧౩
పశోరర్థే మహాభాగ కృతకృత్యోఽస్మి భార్గవ

టీక॥ మహాభాగ=పూజ్యంబగు భాగ్యముగల; భార్గవ=భృగువంశమునందుఁబుట్టినఋచీకుఁడా! గవాం= గోవులయొక్క; శతసహస్రేణ=నూఱువేలచేత; పశోః = యాగపశువుయొక్క; అర్థే=ప్రయోజనముకొఱకు; సుతం=కొడుకును ; విక్రీణీషేయది=అమ్ముదువేని; కృతకృత్యః=నెఱవేఱినపనిగలవాఁడను; అస్మి=అగుదును.

మహాభాగుండవగు ఋచీకుఁడా! నూఱువేలయావులంబుచ్చుకొని, యొక్కకొడుకును, నాకుయాగపశువగుటకై, విక్రయింతువేని నేనుగృతార్థుండనగుదును.

అని, తాత్పర్యము.

సర్వే పరిసృతా దేశా యాజ్ఞీయం నలభే పశుమ్. ౧౪
దాతు మర్హసి మూల్యేన సుత మేక మితో మమ




టీక॥ దేశాః=దేశంబులు; సర్వే=అన్నియును; పరిసృతాః=సంచరింపఁబడినవి. యాజ్ఞీయం=యాగమునకుఁగావలసిన; పశుం=పశువును; నలభే=పొందనైతి. ఇతః=వీరిలో; ఏకం=ఒక; సుతం=కొడుకును; మూల్యేన=వెలచేత; మమ=నాకు; దాతుం=ఇచ్చుటకు; అర్హః సి=తగుదువు.

నేనన్ని దేశంబులందిరిగితిని; ఎందును నాయాగమునకుఁగావలసిన పశువుంబడయలేనైతి; నీకొడుకులలో, నొక్కని, వెలదీసికొని, నాకీవలయును. అని, యంబరీషుఁడు ఋచీకునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తో మహాతేజా ఋచీక స్త్వబ్రవీద్వచః. ౧౫

టీక॥ మహాతేజాః=అధికమయిన ప్రభాముగల; ఋచీకస్తు=ఋచీకుఁడును, ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; వచః=మాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండగు ఋచీకుండును, అంబరీషునిమాటవిని, యిట్లని, చెప్పెను. అని. తాత్పర్యము.

నాహం జ్యేష్ఠ న్నరశ్రేష్ఠ విక్రీణీయాం కథంచన

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగునంబరీషుఁడా! కథంచన=ఎట్లయినను; అహం=నేను; జ్యేష్ఠం=పెద్దవానిని; నవిక్రీణీయాం=అమ్మను.

పురుషశ్రేష్ఠుండవగునంబరీషుఁడా! నేనేమైనను పెద్దకొడుకు నమ్ముటలేదు. అని, ఋచీకుఁడంబరీషునితోఁజెప్పెను, అని, తాత్పర్యము.

ఋచీకస్య వచ శ్ర్శుత్వా తేషాం మాతా మహాత్మనామ్. ౧౬
ఉవాచ నరశార్దూల మంబరీషం తపస్వినీ

టీక॥ ఋచీకస్య=ఋచీకునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=

విని; తపస్స్వినీ=అధికమయినతపస్సుగల; మహాత్మనాం=పూజ్యమయినస్వభావముగల; తేషాం=ఆ కొడుకులయొక్క; మాతా=తల్లి; నరశార్దూలం= పురుషశ్రేష్ఠుండగు; అంబరీషం = అంబరీషునిఁగూర్చి; ఉవాచ=పలికెను.

ఋచీకునిమాటవిని, మహాత్ముల గునాకొడుకులతల్లి చాలఁదపస్సుగలది, పురుషశ్రేష్ఠుండగు నంబరీషుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అవిక్రేయం సుతం జ్యేష్ఠం భగవా నాహ భార్గవః. ౧౭
మమాపి దయితం విద్ధి కనిష్ఠం శునకన్నృప
తస్మా త్కనీయసం పుత్రం నదాస్యే తవ పార్థివ. ౧౮

టీక॥ నృప=అంబరీషమహారాజా! భగవాన్=మాహాత్మ్యముగల; భార్గవః=భృగువంశంబునం బుట్టినఋచీకుండు; జ్యేష్ఠం=పెద్దవాఁడైన; సుతం=కొడుకును; అవిక్రేయం=అమ్మఁదగనివానిఁగా; ఆహ=చెప్పుచున్నాఁడు. మమాపి=నాకును; కనిష్ఠం=అందఱికన్నచిన్నవాఁడైన; శునకం=శునకుఁడనువాని; దయితం=ఇష్టునిఁగా; విద్ధి=ఎఱుంగుము. పార్థివ=అంబరీషమహారాజా! తస్మాత్=అందువలన; తవ=నీకు; కనీయసం=అందఱికన్నఁజిన్నవాఁడైన; పుత్రం=కొడుకును; నదాస్యే=ఇవ్వను.

అంబరీషుఁడా! భగవంతుండు సుభార్గవుండునగు ఋచీకుండు, పెద్దకుమారునివిక్రయింపనని చెప్పెను; నాకుఁగనిష్ఠుండగు శునకుండను వాఁడుచాలఁబ్రియుండని యెఱుంగుము, కావున, నీకుఁగనిష్ఠునివ్వనొల్లను. అని, తాత్పర్యము.

ప్రాయేణహి నరశ్రేష్ఠ జ్యేష్ఠాః పితృషు వల్లభాః
మాతౄణాంతు కనీయాంస స్తస్మా ద్రక్షే కనీయసమ్. ౧౯

టీక ॥ నరశ్రేష్ఠ=మనుష్యశ్రేష్ఠుఁడవగునంబరీషుఁడా! ప్రాయేణ=

బాహుళ్యముచేత; జ్యేష్ఠాః=పెద్ద కొడుకులు; పితృషు=తండ్రులవిషయమయి; వల్లభాః హి=ప్రియులుగదా! మాతౄణాంతు=తల్లులకును; కనీయాంసః=కడపటికొడుకులు; వల్లభాః(అధ్యాహృతము)= ప్రియులుగదా! తస్మాత్=అందువలన, కనీయసం(కనీయాంసం)=కడపటికొడుకును; రక్షే=కాపాడెదను.

అంబరీషుఁడా! ప్రాయముగా, లోకంబున, తండ్రులకుఁ బెద్దకొడుకులును దల్లులకు, గడపటికొడుకులు నుఁబ్రియులుగదా! కావున, నేనుఁ గడపటివానిరక్షించెదను. అని, తల్లి, యంబరీషునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఉక్తవాక్యే మునౌ తస్మిన్ మునిపత్న్యాం తథైవచ
శునశ్శేఫ స్స్వయం రామ మధ్యమో వాక్య మబ్రవీత్. ౨౦

టీక ॥ రామ=రాముఁడా! తస్మిన్=ఆ; మునౌ = ఋచీకమహాముని; ఉక్తవాక్యే=చెప్పఁబడినమాటగలవాఁడుకాఁగా; తథైవచ=ఆలాగే; మునిపత్న్యాంచ=ఋచీకముని భార్యయు; ఉక్తవాక్యాయాం(అధ్యాహృతము)=చెప్పఁబడినమాటగలదికాఁగా; మధ్యమః=నడిమివాఁడైన; శునశ్శేఫః=శునశ్శేఫుఁడనువాఁడు; స్వయం=తానె; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముఁడా! ఋచీకుండునుఅతనిభార్యయుఁజెప్పినమాటవిని, నడిమికొడుకైన శునశ్శేఫుండనువాఁడు, తానే, యంబరీషుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పితా జ్యేష్ఠ మవిక్రేయం మాతా చాహ కనీయసమ్
విక్రీతం మధ్యమం మన్యే రాజన్ పుత్రం నయస్వ మామ్. ౨౧

టీక॥ పితా=తండ్రి; జ్యేష్ఠం=పెద్దవాని; అవిక్రేయం=అమ్మఁదగనివానిఁగా; ఆహ=చెప్పుచున్నాఁడు; మాతాచ=తల్లియును; కనీయసం

(కనీయాంసం)=చిన్నవానిని; అవిక్రేయం ఆహ (అధ్యాహృతము)= అమ్మఁదగనివానిఁగాఁ జెప్పుచున్నది. రాజన్=అంబరీషమహారాజా! మధ్యమం=నడిమివాఁడగు; పుత్రం=కొడుకును; విక్రీతం= అమ్మఁబడినవానిఁగా; మన్యే = తలంచెదను. మాం = నన్ను ; నయస్వ=కొనిపొమ్ము.

అంబరీషుఁడా! తండ్రి జ్యేష్ఠునివిక్రయింపనని చెప్పుచున్నాఁడు; తల్లియుఁగనిష్ఠునివిక్రయింపనని చెప్పుచున్నది? కావున, నడిమివానివిక్రయించినట్లు తలంచెదను; నడిమివాఁడనగు నన్నుఁగొనిపొమ్ము. అని, శునశ్శేఫుండు చెప్పెను. అని, తాత్పర్యము.

గవాం శతసహస్రేణ శ్శునశ్శేఫం నరేశ్వరః
గృహీత్వా పరమప్రీతో జగామ రఘునందన. ౨౨

టీక॥ రఘునందన=రామఁడా! నరేశ్వరః= మనుష్యులకుఁబ్రభువైనయంబరీషుండు; గవాం = ఆవుల యొక్క; శతసహస్రేణ=నూఱువేలచేత; శునశ్శేఫం = శునశ్శేఫుని; గృహీత్వా=పుచ్చుకొని; పరమప్రీతః= మిక్కిలియు సంతసించినవాఁడై; జగామ=పోయెను.

అంబరీషమహారాజు, లక్షగోవులొసంగి, శునశ్శేఫునింబుచ్చికొని, పరమసంతోషంబునం బోయెను.

అని, తాత్పర్యము.

అంబరీషస్తు రాజర్షీ రథమారోప్య సత్వరః
శునశ్శేఫం మహాతేజా జగామాశు మహాయశాః. ౨౩

టీక॥ మహాతేజాః=అధికమయిన పరాక్రమముగలవాఁడును; మహాయశాః=అధికమయినకీర్తిగలవాఁడును; రాజర్షిః = రాజును ఋషియునగు; అంబరీషస్తు=అంబరీషుఁడును; సత్వరః=వేగిరపాటుగలవాఁడై, శునశ్శేఫం = శునశ్శేఫుని; రథం=రథమును; ఆరోప్య=ఎక్కించికొని; ఆశు=శీఘ్రముగా; జగామ=పోయెను.

మహాపరాక్రమశాలియును మహాకీర్తిగలవాఁడును రాజర్షియునగునంబరీషుండు, వేగముగా, శునశ్శేఫునిరథంబెక్కించికొని, శీఘ్రంబుగాఁబోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకషష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండైకషష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

## ద్విషష్టితమసర్గప్రారంభః.

శునశ్శేఫం నరశ్రేష్ఠ గృహీత్వాతు మహాయశాః
వ్యశ్రామ్యత్పుష్కరే రాజా మధ్యాహ్నే రఘునందన. ౧

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు; రఘునందన=రాముఁడా! మహాయశాః= అధికమయినకీర్తిగల; రాజా=అంబరీషమహారాజు; శునశ్శేఫం=శునశ్శేఫుని; గృహీత్వాతు=పుచ్చికొనియె; మధ్యాహ్నే=పట్టపగటయందు; పుష్కరే = పుష్కరతీర్థమందు; వ్యశ్రామ్యత్=విశ్రమించెను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! మహాయశుండగునంబరీషుండు, ఇట్లు, శునశ్శేఫునిందోడ్కొని, పోవుచు, మధ్యాహ్నముకాఁగానే, పుష్కరతీర్థమందు కొంతవిశ్రమించెను. అని, తాత్పర్యము.

తస్య విశ్రమమాణస్య శునశ్శేఫో మహాయశాః
పుష్కరక్షేత్ర మాగమ్య విశ్వామిత్రం దదర్శ హ. ౨
తప్యంత మృషిభి స్సార్థం మాతులం పరమాతురః

టీక॥ తస్య=ఆయంబరీషుండు; విశ్రమమాణస్య=విశ్రమించుచుండఁగా; మహాయశాః=అధికమయినకీర్తిఁగలవాఁడును; పరమాతురః=మిక్కిలియుదుఃఖితుఁడునగు; శునశ్శేఫః=శునశ్శేఫుఁడు;పుష్కరక్షేత్రం=పుష్కరస్థలమును;ఆగమ్య=పొంది;ఋషిభిస్సార్థం = ఋషులతోఁగూడ;తప్యంతం = తపస్సుచేయుచున్న;మాతులం= మేనమామయగు; విశ్వామిత్రం=విశ్వామిత్రుని;దదర్శ=చూచెను. "హ"అనునది పాదపూరణార్థము.

అంబరీషుండు విశ్రమించుచుండఁగా, మహాయశుండునుబరమదుఃఖితుండునగు,శునశ్శేఫుండు , పుష్కరక్షేత్రంబునొంది,ఋషులతోఁగూడఁదపస్సుసేయుచున్న,తనమేనమామయగు విశ్వామిత్రునింజూచెను. అని, తాత్పర్యము.

వివర్ణవదనో దీన స్తృష్ణయాచ శ్రమేణ చ. ౩
పపాతాంకే మునే రాశు వాక్యం చేద మువాచ హ

టీక॥ సః(అధ్యాహృతము)=ఆశునశ్శేఫుఁడు;తృష్ణయాచ=దప్పిచేతను;శ్రమేణచ=అలసటచేతను; వివర్ణవదనః = రంగుతప్పిన మొగముగలవాఁడై;ఆశు = శీఘ్రముగా;మునేః=విశ్వామిత్రమహామునియొక్క;అంకే=ఒడియందు; పపాత=పడెను.ఇదం=ఈ;వాక్యంచ=మాటను; ఉవాచ=చెప్పెను."హ" అననది పాదపూరణార్థము.

ఆశునశ్శేఫుండు, దప్పిచేతనుఅలసటచేతనురంగుదప్పిన ముఖముగల్గి,శీఘ్రంబుగా, విశ్వామిత్రునియుత్సంగముపైఁబడి,యిట్లని,చెప్పెను. అని, తాత్పర్యము.

న మే స్తి మాతా న పితా జ్ఞాతయో బాంధవాః కుతః. ౪
త్రాతు మర్హసి మాం సౌమ్య ధర్మేణ మునిపుంగవ

టీక॥ మే=నాకు; మాతా=తల్లి; నాస్తి=లేదు. పితా=తండ్రి; న=లేదు. జ్ఞాతయః=దాయాదులును; బాంధవాః=బంధువులును; కుతః=ఎక్కడివారు? సౌమ్య= శాంతుఁడవును; మునిపుంగవ= మునిశ్రేష్ఠుండవునగు విశ్వామిత్రుఁడా! మాం=నన్ను; ధర్మేణ=ధర్మముచేత; త్రాతుం=రక్షించుటకు; అర్హసి=తగుదువు.

నాకుఁదల్లి గాని తండ్రిగానిబంధువులు గాని జ్ఞాతులు గాని యెవ్వరును లేరు; (తలిదండ్రులున్నను నన్నురక్షింపక విక్రయించుటంబట్టివారును లేనివారె) ; నీవు సౌమ్యుండవుముని శ్రేష్ఠుండవు , ధర్మంబున నన్నురక్షింపుము. అని, తాత్పర్యము.

త్రాతా త్వం హి మునిశ్రేష్ఠ సర్వేషాం త్వం హి భావనః. ౫

టీక ॥ మునిశ్రేష్ఠ=మునులలో మేటివగు విశ్వామిత్రుఁడా! త్వం=నీవు; సర్వేషాం=అందఱకును; త్రాతా హి = రక్షించువాఁడవుగదా! త్వం=నీవు; భావనః=హితముగలుగఁజేయువాఁడవుగదా!

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! నీవెయ్యఁదఱకునురక్షకుండవు, మేలుకలుగఁజేయువాఁడవు. అని, తాత్పర్యము.

రాజా చ కృతకార్య స్స్యా దహం దీర్ఘాయు రవ్యయః
స్వర్గలోక ముపాశ్నీయాం తప స్తప్త్వాహ్య నుత్తమమ్. ౬

టీక॥ రాజాచ=అంబరీషమహారాజును; కృతకార్యః=చేయఁబడిన పనిగలవాఁడు; స్యాత్=అగుఁగాక; అహం=నేను; దీర్ఘాయుః=దీర్ఘమయిన యాయుస్సుగలవాఁడనై; అవ్యయః=నాశములేనివాఁడనై; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠమయినదిలేని; తపః=తపస్సును; త

త్వా=తపించి, చేసియనుట; స్వర్గలోకం=స్వర్గలోకమును; ఉపాశ్నియాంహి=పొందుదునుగాక.

అంబరీషునికార్యమును నెఱవేఱవలయును; నేనును దీర్ఘాయుష్కుండనై, యేమాత్రమును నాశమునొందక, శ్రేష్ఠంబగు తపంబుసల్పి, స్వర్గముఁ బొందవలయును.

అని, తాత్పర్యము.

త్వం మే నాథో హ్యనాథస్య భవ భవ్యేన చేతసా
పితేవ పుత్రం ధర్మాత్మం స్త్రాతుమర్హసి కిల్బిషాత్. ౭

టీక॥ ధర్మాత్మన్=ధర్మబుద్ధిగలవిశ్వామిత్రుఁడా! త్వంహి=నీవే; భవ్యేన=మంగళకరమయిన; చేతసా=మనసుతో; అనాథస్య=నాథుఁడులేనట్టి, రక్షకుండులేనట్టి యనుట; మే=నాకు; నాథః=నాథుండవు, రక్షకుండవనుట; భవ=అగుము. పుత్రం=కొడుకును; పితేవ=తండ్రివలె; కిల్బిషాత్= పాపమునుండి, ఆపదనుండియనుట; మాం= (అధ్యాహృతము) నన్ను ; త్రాతుం=రక్షించుటకు, అర్హసి=తగుదువు.

ధర్మబుద్ధిగల విశ్వామిత్రుఁడా ! నీవుమంగళకరంబగుహృదయంబుతో , ననాథుండనగునాకు నాథుండవుకమ్ము; తండ్రికొడుకునట్లు, ఈయాపదనుదొలఁగించినన్నురక్షింపుము. అని, శునశ్శేఫుఁడు విశ్వామిత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య త ద్వచనం శ్రుత్వా విశ్వామిత్రో మహాతపాః
సాంత్వయిత్వా బహువిధం పుత్రా నిద మువాచ హ. ౮

టీక॥ తస్య=ఆశునశ్శేఫునియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; మహాతపాః=అధికమయినతపస్సుగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; బహువిధం=పలుతెఱంగులుగల్గునట్లుగా ; సాంత్వ

యిత్వా=ఊరడించి; పుత్రాన్=తనకొడుకులంగూర్చి; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను "హ" అనునది పాదపూరణార్థము.

ఆశునశ్శేఫుండు చెప్పినమాట నువిని, మహాతపశ్శాలియగువిశ్వామిత్రుఁడు, పలుతెఱంగులననునయించి, తనకొడుకులంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యత్కృతే పితరః పుత్రాన్ జనయంతి శుభార్థినః
పరలోకహితార్థాయ తస్య కాలో యమాగతః. ౯

టీక॥ శుభార్థినః = మంగళము గోరునట్టి; పితరః = తండ్రులు; యత్కృతే=దేనికొఱకు; పుత్రాన్=కొడుకులను; జనయంతి=పుట్టించుచున్నారో; పరలోకహితార్థాయ= పరలోకమునందలి మేలనెడు ప్రయోజనముకొఱకు; తస్య=దానికి; అయం=ఈ; కాలః=సమయము; ఆగతః=వచ్చినది.

మంగళముగోరునట్టి తండ్రులు, ఏప్రయోజనమపేక్షించి, కొడుకులంబుట్టింతురో, మీకునుమాకునుబరలోకంబునందు మేలు గల్గుటకై, యాప్రయోజనంబునకిప్పుడు సమయంబుగల్గినది. అని, తాత్పర్యము.

అయంబాలో మునిసుతో మత్త శ్శరణ మిచ్ఛతి
అస్య జీవితమాత్రేణ ప్రియం కురుత పుత్రకాః. ౧౦

టీక॥ పుత్రకాః=కొడుకులారా! మునిసుతః = మునికొడుకయిన; అయం=ఈ; బాలః=పిల్లవాఁడు; మత్తః=నావలన; శరణం=రక్షించుటను; ఇచ్ఛతి = కోరుచున్నాఁడు. అస్య=వీనికి; జీవితమాత్రేణ=కేవలప్రాణముచేత, ప్రాణమునుమాత్రమునిచ్చుటచేతననుట; ప్రియం=సంతోషమును; కురుత=చేయుఁడు.

కొమరులారా! మునిపుత్రుండగునీచిన్నవాఁడు, నన్నుశరణుచొచ్చియున్నాఁడు; వీనికిఁబ్రాణంబుమాత్రంబొసంగి, సంతోషంబుగావింపుఁడు. అని, తాత్పర్యము.

సర్వే సుకృతకర్మాణ స్సర్వే ధర్మపరాయణాః
పశుభూతా నరేంద్రస్య తృప్తి మగ్నేః ప్రయచ్ఛత. ౧౧

టీక॥ యూయం(అధ్యాహృతము)=మీరలు; సర్వే=అందఱును; సుకృతకర్మాణః= పుణ్యరూపములయినకార్యములుగలవారలు ; సర్వే = అందఱును; ధర్మపరాయణాః= ధర్మముముఖ్యమయినగతిగాఁగలవారలు; నరేంద్రస్య=మనుష్యులకుఁబ్రభువైన యంబరీషునకు; పశుభూతాః = పశువయినవారలై; అగ్నేః=అగ్నిహోత్రునకు; తృప్తిం=సంతోషమును; ప్రయచ్ఛత= ఒసంగుఁడు.

మీరలందఱుఁ బుణ్యకర్ములరు, అందఱు, ధర్మమునందెయాసక్తులరు; అంబరీషునియాగమునకుఁబశువై, యగ్నికిందృప్తిసేయుఁడు.

అని, తాత్పర్యము.

నాథవాంశ్చ శునశ్శేఫో యజ్ఞశ్చా విఘ్నితో భవేత్
దేవతా స్తర్పితాశ్చ స్యు ర్మమ చాపి కృతంవచః. ౧౨

టీక॥ శునశ్శేఫశ్చ=శునశ్శేఫుఁడును; నాథవాన్ = నాథుఁడుగలవాఁడు,రక్షకుఁడుగలవాఁడనుట; భవేత్ (అధ్యాహృతము)= అగును. యజ్ఞశ్చ = యాగమును; అవిఘ్నితః=విఘ్నములేనిది; భవేత్=అగును. దేవతాశ్చ = దేవతలును; తర్పితాః= తృప్తిఁబొందఁజేయఁబడినవారు; స్యుః=అగుదురు; మమ=నాయొక్క; వచశ్చాపి=మాటయును; కృతం = చేయఁబడినది; భవేత్(అధ్యాహృతము)=అగును.

ఇట్లుచేసినచో, శునశ్శేఫుండు సురక్షింపఁబడినవాఁడగును; అంబరీషునియాగమునుబూర్ణమగును; దేవతలునుదృప్తినొందినవారగుదురు; పితృవాక్యమును జేసినట్లగుచున్నది, అని,విశ్వామిత్రుఁడు, తనకొడుకులతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

మునే స్తు వచనం శ్రుత్వా మధుష్యందాదయ స్సుతాః

సాభిమానం నరశ్రేష్ఠ సలీల మిద మబ్రువన్. ౧౩

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు రామా! మునేః=విశ్వామిత్రమహాముని యొక్క; వచనం=మాటను; శ్రుత్వాతు=వినినంతనె; మధుష్యందాదయః=మధుష్యందుఁడు మొదలగు; సుతాః=కొడుకులు; సాభిమానం= అహంకారముతోఁగూడునట్లుగా; ఇదం=ఈమాటను; అబ్రువన్=పలికిరి.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! విశ్వామిత్రుండు చెప్పినమాటనువిని, మధుష్యందుఁడు మొదలగున తనికొడుకులు, అహంకారంబునం జేసి, పరిహాసంబుగా నిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

కథ మాత్మసుతాన్ హిత్వా త్రాయసే న్యసుతం విభో
అకార్య మివ పశ్యామ శ్శ్వమాంస ఇవ భోజనే ౧౪

టీక॥ విభో=ఒడయఁడవయిన తండ్రీ! కథం=ఎట్లు; ఆత్మసుతాన్=నీకొడుకులను; హిత్వా=విడిచిపెట్టికొని; అన్యసుతం=మఱియొకనికొడుకును; త్రాయసే=రక్షించెదవు. ఏతత్ (అధ్యాహృతము)=దీనిని; భోజనే(తివ్వతి)=అన్నముండఁగా; శ్వమాంసమివ = కుక్కమాంసమువలె(లక్షణచే)కుక్కమాంసమును భక్షించుటవలెనను; అకార్యం=చేయఁదగనిదానిఁగా; "ఇవ" (అనునది వాక్యాలంకారార్థము) పశ్యామః=చూచుచున్నాము.

నీవు మాకొడయఁడవు, అయినను, నీకొడుకులను రక్షించుటను విడిచిపెట్టుకొని, మఱియొక్కనికొడుకు నెట్టు రక్షించెదవు; మంచియన్నము నువిడిచి కుక్క మాంసమునుదినుటవలెన కార్యమని యెంచెదము. అని, కొడుకులు విశ్వామిత్రునితోఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

తేషాం త ద్వచనం శ్రుత్వా పుత్రాణాం మునిపుంగవః

క్రోధసంరక్తనయనో వ్యాహర్తుముపచక్రమే. ౧౫

టీక ॥ తేషాం=ఆ; పుత్రాణాం=కొడుకులయొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; మునిపుంగవః=మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు; క్రోధసంరక్తనయనః=కోపముచేమిక్కిలియునెఱ్ఱనయినకండ్లుగలవాఁడై; వ్యాహర్తుం=చెప్పుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

ఆకొడుకులు చెప్పినమాటవిని, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు, మిక్కిలియుఁ గోపించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

నిస్సాధ్వస మిదం ప్రోక్తం ధర్మాదపి విగర్హితమ్
అతిక్రమ్యతు మద్వాక్యం దారుణం రోమహర్షణమ్. ౧౬

టీక॥మద్వాక్యం=నామాటను; అతిక్రమ్యతు=మీఱియుఁగూడ; నిస్సాధ్వసం=భయములేనట్లుగా; ధర్మాదపి = ధర్మము వలనను, విగర్హితం = నిందింపఁ బడినదియును; దారుణం=భయంకరమును; (కావుననే)రోమహర్షణం=గగుర్పాటుగలుగఁ జేయునదియు నగు;ఇదం=ఈమాట; ప్రోక్తం=చెప్పఁబడినది.

నామాటనతిక్రమించియు, నెంతమాత్రమునుభయంబులేక, మీరు ధర్మంబువలననునిందితంబయినగగుర్పాటుగల్గించుచు భయంకరముగానుండు,నీమాటంజెప్పితిరి.

అని, తాత్పర్యము.

శ్వమాంసభోజిన స్సర్వే వాసిష్ఠా ఇవ జాతిషు
పూర్ణం వర్షసహస్రంతు పృథివ్యా మనువత్స్యథ. ౧౭

టీక॥యూయం (అధ్యాహృతము)=మీరలు; సర్వే=అందఱును; వాసిష్ఠాఇవ= వసిష్ఠునికొడుకులవలె; శ్వమాంసభోజినః= కుక్కమాంసమును దినువారలై; జాతిషు=ముష్టికులనుజాతులందు; పూ

౯౯౦ = నిండిన; వర్షసహస్రం సంవత్సరములయొక్క వేళ్లు; పృథివ్యాం=భూమియందు; అనువత్స్యథ=ఉండఁగలరు. మీరలు, అందఱు, వసిష్ఠునికొడుకులట్లు, ముష్టికులయి, కుక్కమాంసముఁదినుచు, వేయేండ్లు, భూమియందువసియింపఁగలరు. అని, విశ్వామిత్రుఁడు కొడుకులతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

కృత్వా శాప సమాయుక్తాన్ పుత్రాన్ మునివర స్తథా
శునశ్శేఫ మువాచార్తం కృత్వా రక్షాం నిరామయమ్. ౧౮

టీక॥ మునివరః=మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుఁడు; తథా=అట్లు; పుత్రాన్ = కొడుకులను; శాపసమాయుక్తాన్= శాపముతోఁగూడినవారలఁగా; కృత్వా = చేసి; ఆర్తం= దుఃఖమునొందినట్టి; శునశ్శేఫం = శునశ్శేఫునిఁగూర్చి; నిరామయం = బాధలేనట్లుగా; రక్షాం= మంత్రించినవిభూతిమొదలగు, రక్షను; కృత్వా = చేసి; ఉవాచ=చెప్పెను.

మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, అట్లుతనకొడుకులశపియించి, ఆతురుండగుశునశ్శేఫుంజూచి, ఏమియుబాధలేనట్లు, మంత్రితవిభూతిమొదలగురక్షచేసి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పవిత్రపాశై రాసక్తో రక్తమాల్యానులేపనః
వైష్ణవం యూప మాసాద్య వాగ్భిరగ్ని ముదాహర. ౧౯

టీక॥ త్వం(అధ్యాహృతము)= నీవు; పవిత్రపాశైః= దర్భలచేఁజేయఁబడినత్రాళ్లచేత; ఆసక్తః=కట్టఁబడినవాఁడవై; రక్తమాల్యానులేపనః=ఎఱ్ఱనిపుష్పమాలికలునుమైపూఁతయునుగలవాఁడవై; వైష్ణవం=విష్ణుదేవతాకమయిన; యూపం=యాగమునందుఁ బశువునుగట్టెడుస్తంభమును; ఆసాద్య=పొంది, వాగ్భిః=చెప్పఁబోవు, వచనము

లచేత; అగ్నిం=అగ్నిదేవునింగూర్చి; ఉదాహర = చెప్పుము, స్తుతింపుమనుట.

నీవు, దర్భలత్రాళ్లచేఁగట్టఁబడి, రక్తవర్ణంబులగు పుష్పమాలికలు నుమైపూఁతయునుధరించి, విష్ణుదేవతాకంబగుయూపస్తంభమునుబొందునప్పుడు, నేనుజెప్పఁబోవువచనములచే, నగ్నిదేవునింగూర్చి, స్తుతింపుము. అని, తాత్పర్యము.

ఇమే తు గాథే ద్వే దివ్యే గాయేథా మునిపుత్రక
అంబరీషస్య యజ్ఞేస్మిం స్తత స్సద్ధి మవాప్స్యసి. ౨౦

టీక॥ మునిపుత్రక=మునికుమారుండవగుశునశ్శేఫుఁడా! అంబరీషస్య=అంబరీషునియొక్క; అస్మిన్=ఈ; యజ్ఞే = యాగమునందు; దివ్యే=శ్రేష్ఠములయిన; ఇమే = ఈ; గాథే=గాథలను; ద్వేతు=రెంటిని మాత్రము; గాయేథాః=గానము సేయుము.

మునికుమారుండవగు శునశ్శేఫుఁడా; అంబరీషుఁడు సేయునీయాగమునందు, దివ్యంబులగునీగాథలరెంటినిమాత్రము గానము సేఁతువు ; దాననీవాయుస్సునుబొందుదువు. అని, విశ్వామిత్రుఁడుశునశ్శేఫునితోఁజెప్పెను అని, తాత్పర్యము.

శునశ్శేఫో గృహీత్వా తే ద్వే గాథే సుసమాహితః
త్వరయా రాజసింహం త మంబరీష మువాచ హ. ౨౧

టీక॥ శునశ్శేఫః=శునశ్శేఫుఁడు; తే=ఆ; గాథే=గాథలను; ద్వే=రెంటిని; గృహీత్వా=పుచ్చుకొని; సుసమాహితః =మిక్కిలియునెమ్మదినొందినవాఁడై; త్వరయా=వేగముతో; రాజసింహం=రాజశ్రేష్ఠుండగు; తం=ఆ; అంబరీషం=అంబరీషునిఁగూర్చి; ఉవాచ=చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

శునశ్శేఫుఁడా రెండుగాథలగ్రహించి, నెమ్మదినొందినవాఁడై, వేగమునంబోయి, రాజశ్రేష్ఠుండగు

తం=ఆ; అంబరీషం=అంబరీషునిఁ గూర్చి; ఉవాచ=చెప్పెను. ("హ" అనునది పాదపూరణార్థము.)

శునశ్శేఫుఁడా రెండుగాథలగ్రహించి, నెమ్మదినొందినవాఁడై, వేగమునంబోయి, రాజశ్రేష్ఠుండగు నంబరీషునిం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రాజసింహ మహాసత్త్వ శీఘ్రం గచ్ఛావహే సదః
నిర్వర్తయస్వ రాజేంద్ర దీక్షాంచ సముపావిశ. ౨౨

టీక॥ మహాసత్త్వ=అధికమయినబలము గలవాఁడవును; రాజసింహ=రాజశ్రేష్ఠుఁడవగు నంబరీషుఁడా! శీఘ్రం=వడిగా; సదః=యాగశాలను; గచ్ఛావహే = పొందెదము. రాజేంద్ర= రాజశ్రేష్ఠుండవగు నంబరీషుఁడా! దీక్షాంచ=యాగదీక్షను; నిర్వర్తయస్వ=నెఱవేర్పుము. సముపావిశ= ప్రవేశింపుము, ఆరంభింపుమనుట.

మహాబలుండవు రాజశ్రేష్ఠుండవునగు నంబరీషుఁడా! శీఘ్రము గా యాగశాలకుఁబోవుదము; యాగదీక్షనారంభించి, నెఱవేర్పుము. అని, శునశ్శేఫుఁడంబరీషునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తద్వాక్య మృషిపుత్రస్య శ్రుత్వా హర్షసముత్సుకః
జగామ నృపతి శ్శీఘ్రం యజ్ఞవాట మతంద్రితః. ౨౩

టీక॥ ఋషిపుత్రస్య=ఋషికొమారుఁడైనశునశ్శేఫునియొక్క; తత్=ఆ; వాక్యం=మాటను; శ్రుత్వా=విని; నృపతిః=మనుష్యులకుఁ బ్రభువయినయంబరీషుఁడు; హర్షసముత్సుకః=సంతోషముచేతనుత్సాహముగలవాఁడై; అతంద్రితః=ఆలస్యముఁనొందనివాఁడై; శీఘ్రం = వడిగా; యజ్ఞవాటం=యాగశాలను; జగామ=పొందెను.

ఆశునశ్శేఫుఁడు చెప్పినమాట విని, యంబరీషుండు, సంతోషంబున నధికంబగు నుత్సాహంబు నొంది, జాగుసేయక, శీఘ్రింబుగా, యాగ

శాలకుఁబోయెను. అని, తాత్పర్యము.

సదస్యానుమతే రాజా పవిత్రకృతలక్షణమ్
పశుం రక్తాంబరం కృత్వా యూపే తం సమబంధయత్. ౨౪

టీక॥ రాజా=అంబరీషమహారాజు; సదస్యానుమతే=సభికులయనుమతియందు; స్థితః (అధ్యాహృతము)=ఉన్నవాఁడై; తం=ఆశునశ్శేఫుని; పవిత్రకృతలక్షణం=దర్భలచేఁజేయఁబడినగుఱుతుఁగల; రక్తాంబరం=ఎఱ్ఱనివస్త్రముగల; పశుం=పశువునుగా; కృత్వా=చేసి; యూపే=యూపస్తంభమునందు; సమబంధయత్=కట్టెను.

అంబరీషుండు, సదస్యులచే ననుమతుండై, యాశునశ్శేఫుని, దర్భలచేఁగట్టఁబడిన యెఱ్ఱనివస్త్రముఁ జుట్టిన పశువునుగాఁజేసి, యూపస్తంభమునందు, బంధించెను.

అని, తాత్పర్యము.

సబద్ధో వాగ్భి రగ్ర్యాభి రభితుష్టావ వై సురౌ
ఇంద్ర మింద్రానుజం చైవ యథావ న్మునిపుత్రకః. ౨౫

టీక॥ మునిపుత్రకః=మునికుమారుండగు; సః=ఆశునశ్శేఫుండు; బద్ధః=కట్టఁబడినవాఁడై; అగ్ర్యాభిః=శ్రేష్ఠములయిన; వాగ్భిః=వాక్కులచేత; ఇంద్రం=ఇంద్రుని; ఇంద్రానుజం చైవ=ఇంద్రునితమ్ముండగునుపేంద్రుని; సురౌ=ఈదేవతలను; యథావత్=యథావిధిగా; అభితుష్టావ=స్తుతించెను. "వై" అనునది పాదపూరణార్థము.

ఆశునశ్శేఫుండు, యూపమునందుఁగట్టఁబడిన, శ్రేష్ఠంబులగు నాగాథలచే, నింద్రోపేంద్రులయథావిధింబ్రస్తుతించెను.

అని, తాత్పర్యము.

తతః ప్రీత స్సహస్రాక్షో రహస్య స్తుతితర్పితః
దీర్ఘ మాయు స్తదా ప్రాదా చ్ఛునశ్శేఫాయ రాఘవ. ౨౬

టీక॥ రాఘవ = రాముఁడా! తతః = అంతట; సహస్రాక్షః = దేవేంద్రుఁడు; రహస్యస్తుతితర్పితః = ఎవరు నెఱుంగకుండఁ జేసిన స్తోత్రముచేఁ దృప్తినొందఁ జేయఁబడినవాఁడై; ప్రీతః = సంతసించినవాఁడై; తదా = అప్పుడు; శునశ్శేఫాయ = శునశ్శేఫునికొఱకు; దీర్ఘం = అధికమయిన; ఆయుః = జీవితమును; ప్రాదాత్ = ఇచ్చెను.

రాముఁడా! అంత, దేవేంద్రుండు, శునశ్శేఫుండు రహస్యముగాఁ జేసినస్తుతిచేఁదృప్తినొంది, సంతసించినవాఁడై, శునశ్శేఫునకు దీర్ఘాయువు నిచ్చెను. అని, తాత్పర్యము.

సచ రాజా నరశ్రేష్ఠ యజ్ఞస్యచ సమాప్తవాన్
ఫలం బహుగుణం రామ సహస్రాక్షప్రసాదజమ్. ౨౭

టీక॥ నరశ్రేష్ఠ = పురుషశ్రేష్ఠుండవగు; రామ = రాముఁడా! సః = ఆ; రాజాచ = అంబరీషమహారాజును; యజ్ఞస్య = యాగముయొక్క; సహస్రాక్షప్రసాదజం = దేవేంద్రునియనుగ్రహంబువలనం గలిగిన; బహుగుణం = యాగఫలంబునకుఁ బలుమడుగులు హెచ్చైన; ఫలంచ = ఫలమును; సమాప్తవాన్ = పొందెను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఆయంబరీషుండును, దేవేంద్రుని యనుగ్రహంబున యాగఫలంబు బహుగుణంబుగా నొందెను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రోఽపి ధర్మాత్మా భూయస్తేపే మహాతపాః
పుష్కరేషు నరశ్రేష్ఠ దశ వర్షశతాని చ. ౨౮

టీక॥ నరశ్రేష్ఠ = పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ధర్మాత్మా = ధర్మబుద్ధి గలవాఁడును ; మహాతపాః = అధికమయినతపస్సు గలవాఁడునగు; విశ్వామిత్రోఽపి = విశ్వామిత్రుఁడును; భూయః = మఱల; పుష్కరేషు = పుష్కరక్షేత్రములందు; వర్షశతాని = సంవత్సరముల

యొక్క-నూఱులు; దశచ=పదియు ను; తేపే=తపస్సుచేసెను.

ధర్మాత్ముండును మహాతపస్వియునగు విశ్వామిత్రుండునుమఱి వేయిసంవత్సరములు పుష్కరక్షేత్రంబులందుఁ దపంబుగావించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ద్విషష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండద్విషష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

త్రిషష్టితమసర్గప్రారంభః.

పూర్ణే వర్షసహస్రే తు వ్రతస్నాతం మహామునిమ్
అభ్యాగచ్ఛన్ సురా స్సర్వే తపఃఫలచికీర్షవః. ౧

టీక॥ వర్షసహస్రే=సంవత్సరములయొక్క-వేయియును; పూర్ణే తు=నిండఁగానే; సురాః=దేవతలు; సర్వే=అందఱును; తపఃఫలచికీర్షవః= తపస్సుయొక్క-ఫలమునుచేయనిచ్ఛించినవారై; వ్రతస్నాతం=వ్రితసమాప్తియందుస్నానముచేసిన; మహామునిం=పూజ్యుఁడైనమునియగువిశ్వామిత్రునిగూర్చి; అభ్యాగచ్ఛన్=వచ్చిరి.

వేయేండ్లునునిండఁగానే, దేవతలందఱును, ఆతపంబునకుఫలంబొసంగఁగోరి, వ్రతాంతమందుస్నాతుండగు విశ్వామిత్ర మహామునియొద్దకువచ్చిరి.

అని, తాత్పర్యము.

అబ్రవీత్సుమహాతేజా బ్రహ్మా సురుచిరం వచః
ఋషి స్త్వమసి భద్రంతే స్వార్జితైః కర్మభి శ్శుభైః. ౨

టీక॥ సుమహాతేజాః=మిక్కిలి యనధికమయినప్రభావముగల; బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు; 'తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము) = అగుఁగాక. త్వం=నీవు; స్వార్జితైః=చక్కఁగాసంపాదింపఁబడిన; శుభైః=మంగళకరంబులగు; కర్మభిః = కార్యములచేత; ఋషిః=ఋషియనువాఁడవు; అసి=అగుచున్నావు." ఇతి (అధ్యాహృతము)=అని; సురుచిరం=మనోహరమయిన; వచః = మాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండగు బ్రహ్మదేవుండు, విశ్వామిత్రునింజూచి, "నీకుమంగళమగుఁగాక; నీవుచేసినమంగళకరంబులగుతపస్సులచే, నీవు, ఋషియనిచెప్పఁబడెదవు" అని, మనోహరంబుగాఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తమేవముక్త్వా దేవేశ స్త్రిదివం పునరభ్యగాత్

టీక॥ దేవేశః=దేవతలకుఁబ్రభువైనబ్రహ్మదేవుఁడు; తం= ఆవిశ్వామిత్రునిఁగూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; త్రిదివం=స్వర్గమును; పునః=మరల; అభ్యగాత్ = పొందెను.

దేవతలకునుబ్రభువయినబ్రహ్మదేవుండు, ఆవిశ్వామిత్రునకిట్లుచెప్పి, మరల, స్వర్గంబునొందెను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రో మహాతేజా భూయ స్తేపే మహత్తపః. ౩

టీక॥ మహాతేజాః=అధికమయినప్రభావముగల; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; భూయః=మరల; మహత్= గొప్పదైన; తపః=తపస్సును; తేపే=తపించెను, చేసెననుట.

మహా ప్రభావుండగు విశ్వామిత్రుండు, మఱల, గొప్పతపంబు గావించెను. అని, తాత్పర్యము.

ఇచ్చట, "విశ్వామిత్రః" అనుస్థలమునందు, "వి" అని గాయత్రిమూఁడవయక్షరము గ్రహింపఁబడినది.

తతః కాలేన మహతా మేనకా పరమాప్సరాః
పుష్కరేషు నరశ్రేష్ఠ స్నాతుం సముపచక్రమే. ౪

టీక॥ నరశ్రేష్ఠ = పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! తతః = అంతట; మహతా = దీర్ఘమయిన; కాలేన = కాలముచేత, కాలముకడచిన వెనుకననుట; మేనకా = మేనకయనెడు; పరమాప్సరాః = శ్రేష్ఠయయినయప్సరస; పుష్కరేషు = పుష్కరతీర్థములందు; స్నాతుం = జలకమాడుటకు; సముపచక్రమే = ఆరంభించెను.

పురుషశ్రేష్ఠుండ వగు రాముఁడా! అంత, దీర్ఘకాలమునకువెనుక, మేనకయనెడునప్సరసపుష్కరతీర్థములందు స్నానముసేయుచుండెను. అని, తాత్పర్యము,

తాం దదర్శ మహాతేజా మేనకాం కుశికాత్మజః
రూపేణా ప్రతిమాం తత్ర విద్యుతం జలదే యథా. ౫

టీక॥ మహాతేజాః = అధికమయిన ప్రభావముగల; కుశికాత్మజః = కుశికవంశమునందుఁ బుట్టిన గాధికొడుకయినవిశ్వామిత్రుఁడు; రూపేణ = సౌందర్యముచేత; అప్రతిమాం = సరిలేనిదియయిన; తాం = ఆ; మేనకాం = మేనకను; తత్ర = ఆ పుష్కరమునందు; జలదే = మేఘమునందు; విద్యుతం యథా = మెఱుపునవలె; దదర్శ = చూచెను.

మహాతేజుండగు విశ్వామిత్రుండు, సౌందర్యంబునసరిలేక, యాపుష్కరంబునందు, మేఘమునందు మెఱుపుంబోలెఁ బ్రకాశించుచున్నయామేనకంజూచెను.

అని, తాత్పర్యము

దృష్ట్వా కందర్పవశగో ముని స్తా మిద మబ్రవీత్

టీక॥ మునిః=విశ్వామిత్రుఁడు; తాం= ఆమేనకను; దృష్ట్వా=చూచి; కందర్పవశగః= మన్మథునకు లోఁబడుటఁబొందినవాఁడై; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

విశ్వామిత్రుండు, మేనకంజూచి పరవశుండై, దానితో,నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అప్సర స్స్వాగతం తేఽస్తు వస చేహ మమాశ్రమే. ౬
అనుగృహ్ణీష్వ భద్రం తే మదనేన సుమోహితమ్

టీక॥అప్సరః=అప్సరసా! తే=నీకు; స్వాగతం= సుఖముతోడిరాక; అస్తు=అగుఁగాక; ఇహ=ఇచ్చట; మమ=నాయొక్క; ఆశ్రమే=ఆశ్రమమందు; వసచ=ఉండుము. (చకారంబుచే)నాతోఁగ్రీడింపుచుండుము. తే=నీకు; భద్రం=మంగళము;అస్తు (అధ్యాహృతము)= అగుఁగాక. మదనేన= మన్మథునిచేత; సుమోహితం= మిక్కిలియు మోహము నొందునట్లు చేయఁబడిన; మాం (అధ్యాహృతము)= నన్ను;అనుగృహ్ణీష్వ=ఏలుకొనుము.

అప్సరసవయినమేనకా ! నీకు స్వాగతమగుఁగాక; నీవిచ్చట నాయాశ్రమమందుండి, నాతోఁగ్రీడింపుచుండుము; నీకుమంగళమగుఁగాక;మన్మథునిచేమోహము నొందింపఁబడిపరవశుండనైయున్న నన్ననుగ్రహింపుము.అని,విశ్వామిత్రుఁడు,మేనకతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్తా సా వరారోహా తత్ర వాస మథా కరోత్. ౭

టీక॥సా=ఆ; వరారోహా=ఉత్తమస్త్రీయైన మేనక; ఇతి=ఇట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; అథ=అటుపిమ్మట;తత్ర=ఆవిశ్వామిత్రునియా

శ్రీమమందు; వాసం=ఉనికిని; అకరోత్=చేసెను.

ఉత్తమ స్త్రీయయిన యా మేనక, విశ్వామిత్రునిమాటలాలకించి, యచ్చట, వాసముచేసెను.

అని, తాత్పర్యము.

తస్యాం వసంత్యాం వర్షాణి పంచ పంచచ రాఘవ
విశ్వామిత్రాశ్రమే రామ సుఖేన వ్యతిచక్రముః. ౮

టీక॥ రాఘవ=రఘువంశమునందుఁబుట్టిన; రామ=రాముఁడా! విశ్వామిత్రాశ్రమే = విశ్వామిత్రుని యాశ్రమమందు; తస్యాం=ఆమేనక; వసంత్యాం = వాసముసేయుచుండగా; పంచ = అయిదును; పంచచ = అయిదును , పదియును; వర్షాణి= సంవత్సరములు; సుఖేన=సుఖముచేత; వ్యతిచక్రముః= కడచినవి.

రఘువంశమునందుఁ బుట్టినరాముఁడా! ఇట్లా మేనకవిశ్వామిత్రుని యాశ్రమమందు , వాసముసేయుచుండఁగానే,సుఖంబుగాఁబదిసంవత్సరంబులు,కడచినవి.

అని, తాత్పర్యము.

అథ కాలే గతే తస్మి న్విశ్వామిత్రో మహామునిః
సవ్రీళ ఇవ సంవృత్త శ్చింతాశోకపరాయణః. ౯

టీక॥ తస్మిన్=ఆ; కాలే=కాలము; గతే=కడవఁగానే; అథ=అటుపిమ్మట; మహామునిః=పూజ్యుఁడైన మునియగు ; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు;సవ్రీళః= సిగ్గుతోఁగూడినవాఁడుగాను; ("ఇవ" అనునదివాక్యాలంకారార్థకము.) చింతాశోకపరాయణః= వగుపునదుఃఖమునే ముఖ్యమయినస్థితి గాఁగలవాఁడును గా;సంవృత్తః=ఆయెను.

ఆపదిసంవత్సరంబులు కడవఁగానే,విశ్వామిత్రమహాముని,సిగ్గుపడి, చింతయునుదుఃఖమునుంబొందెను. అని, తాత్పర్యము.

బుద్ధి ర్మునే స్సముత్పన్నా సామర్షా రఘునందన

టీక॥రఘునందన=రాముఁడా! మునేః = విశ్వామిత్రునికి; సామర్షా = కోపముతోఁగూడిన; బుద్ధిః=ఆలోచన; సముత్పన్నా = పుట్టెను.

రాముఁడా! ఆవిశ్వామిత్రుండు, కోపంబునొంది, యిట్లని, యాలోచించెను. అని, తాత్పర్యము.

సర్వం సురాణాం కర్మైత త్తపోపహరణం మహత్. ౧౦

టీక॥మహత్ = గొప్పదైన; తపోపహరణం=తపస్సునపహరించెడి; ఏతత్=ఇది; సర్వం=అంతయును; సురాణాం=దేవతలయొక్క; కర్మ=కార్యము.

నాతపంబు తఱుఁగునట్లు సేయుటకై, ఈకార్యంబంతయు దేవతలు చేసిరి. అని, తాత్పర్యము.

అహోరాత్రోపదేశేన గతా స్సంవత్సరా దశ
కామమోహాభిభూతస్య విఘ్నోయంప్రత్యుపస్థితః. ౧౧

టీక॥ అహోరాత్రోపదేశేన=అహోరాత్రంబనెడుకపటముచేత, ఒక్కయహోరాత్రమువలెననుట; దశ=పది; సంవత్సరాః=ఏండ్లు; గతాః=గడచినవి. కామమోహాభిభూతస్య=మన్మథునిచేఁ గలుగు మోహముచేఁ దిరస్కరింపఁబడిన; మమ(అధ్యాహృతము)=నాకు; అయం=ఈ; విఘ్నః=విఘ్నము; ప్రత్యుపస్థితః=కలిగినది.

ఒక్కయహోరాత్రంబట్లు పదిసంవత్సరంబులునుగడచినవి; మన్మథమోహంబునకులోఁబడుటవలననాకీవిఘ్నంబుసంభవించినది. అని,విశ్వామిత్రుండుచింతించెను. అని, తాత్పర్యము.

వినిశ్వసన్ మునివరః పశ్చాత్తాపేనదుఃఖితః
భీతా మప్సరసం దృష్ట్వా వేపంతీం ప్రాంజలిం స్థితామ్. ౧౨
మేనకాం మధురై ర్వాక్యై ర్విసృజ్య కుశికాత్మజః

ఉత్తరం పర్వతం రామ విశ్వామిత్రో జగామహ. ౧౩

టీక॥ రామ=రాముఁడా! మునివరః=మునిశ్రేష్ఠుండును; కుశికాత్మజః=కుశవంశమునందుఁ బుట్టిన గాధికొడుకునైన, విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; వినిశ్శ్వసన్= అధికముగా నిట్టూర్పువిడుచుచు; పశ్చాత్తాపేన= అనుతాపముచేత; దుఃఖితః = దుఃఖమునొందినవాఁడై; భీతాం=భయపడినదియును; వేపంతీం= వడంకుచున్నదియును; ప్రాంజలిం=మంచి చేమోడ్పుగలదియై; స్థితాం=ఉన్నదియునగు; అప్సరసం = అచ్చరయయిన; మేనకాం= మేనకను; దృష్ట్వా=చూచి; మధురైః=మనోహరంబులగు; వాక్యైః=మాటలచేత, విసృజ్య=విడిచి; ఉత్తరం=ఉత్తరపుదిక్కునందుండు, పర్వతం=హిమవత్పర్వతమును, జగామ=పొందెను. ("హ" అనునది పాదపూరణార్థము.

రాముఁడా! మునిశ్రేష్ఠుండును గుశవంశమునందుఁ బుట్టినవాఁడునగు విశ్వామిత్రుండు, నిట్టూర్పులువిడుచుచుఁ, బశ్చాత్తాపంబు నొంది, దుఃఖించుచు, తనయెదుట, భయంబున వడంకుచుఁ, జేతులుమొగిడ్చి, నిలుచున్న మేనకంజూచి, తిన్ననిమాటలనాబిడనంపి, హిమవత్పర్వతంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

స కృత్వా నైష్ఠికీం బుద్ధిం జేతుకామో మహాయశాః
కౌశికీతీర మాసాద్య తప స్తేపే సుదారుణమ్. ౧౪

టీక॥ మహాయశాః=అధికమైన కీర్తిగల; సః=ఆవిశ్వామిత్రుఁడు; కౌశికీతీరం= కౌశికినదిగట్టును; ఆసాద్య=చేరి; నైష్ఠికీం=దృఢమయిన; బుద్ధిం=ఆలోచనను; కృత్వా= చేసి; ఇంద్రియాణి (అధ్యాహృతము)=ఇంద్రియంబులను; జేతుకామః= గెలువనిచ్ఛయించినవాఁడై; సుదారుణం= మిక్కిలిభయంకరంబగు; తపః=తపస్సును; తేపే=తపించెను, చేసెననుట.

అధికమయిన కీర్తిగల యా

విశ్వామిత్రుండు, కౌశికీనది గట్టుచేరి, దృఢమయిన సంకల్పముచేసి, యింద్రియంబుల జయింపనిచ్చగొని, యతిభయంకరంబగు తపంబు గావించెను.

అని, తాత్పర్యము.

తస్య వర్షసహస్రంతు ఘోరం తప ఉపాసతః
ఉత్తరే పర్వతే రామ దేవతానా మభూ ద్భయమ్. ౧౫

టీక॥ రామ=రాముఁడా! ఉత్తరే=ఉత్తరపుదిక్కునందుండు; పర్వతే=హిమవత్పర్వతమునందు; వర్ష సహస్రంతు = సంవత్సరములయొక్క వేయిమాత్రము; తస్య = ఆవిశ్వామిత్రుఁడు; ఘోరం=భయంకరంబయిన; తపః=తపస్సును; ఉపాసతః= సేవింపుచుండఁగా; దేవతానాం=వేల్పులకు; భయం=వెఱపు; అభూత్=కల్గినది.

రాముఁడా! ఇట్లు, హిమవత్పర్వతమునందు, వేయేండ్లు, భయంకరంబుగా, నావిశ్వామిత్రుండు, తపంబుసేయఁగా, దేవతలుభయంబునొందిరి. అని, తాత్పర్యము.

ఆమంత్రయన్ సమాగమ్య సర్వే సర్షిగణా స్సురాః
మహర్షిశబ్దం లభతాం సాధ్వయం కుశికాత్మజః. ౧౬

టీక॥ సర్షిగణాః= ఋషులసమూహముతోఁగూడిన; సురాః= దేవతలు; సర్వే=అందఱును; సమాగమ్య=వచ్చి; "అయం=ఈ; కుశికాత్మజః=విశ్వామిత్రుఁడు; మహర్షిశబ్దం= మహర్షి(పూజ్యుఁడగుఋషి)యనుశబ్దమును; సాధు = లెస్సగా; లభతాం=పొందునుగాక." ఇతి, ఉక్త్వా(అధ్యాహృతము)=అని, చెప్పి; బ్రహ్మాణం=(అధ్యాహృతము) బ్రహ్మదేవుని; ఆమంత్రయన్= పిలిచిరి.

దేవతలు ఋషులునందఱును బ్రహ్మదేవుఁకడకేతెంచి, "ఈవిశ్వామిత్రుండు "మహర్షి" యనిపిలువఁబడుఁగాక" అని, చెప్పి, బ్రహ్మదేవు

నివిశ్వామిత్రునియొద్దకువచ్చుటకుఁబిలిచిరి. అని, తాత్పర్యము.

దేవతానాం వచ శ్శ్రుత్వా సర్వలోకపితామహః
అబ్రవీ న్మధురం వాక్యం విశ్వామిత్రం తపోధనమ్. ౧౭

టీక ॥ సర్వలోకపితామహః=సమస్తలోకంబులకును తాతయయినబ్రహ్మదేవుఁడు; దేవతానాం=వేల్పులయొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; తపోధనం=తపస్సే ధనంబుగాఁగల; విశ్వామిత్రం = విశ్వామిత్రుంగూర్చి; మధురం=మనోహరంబయిన; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

సమస్తలోకంబులకుం బితామహుండగుబ్రహ్మదేవుండు, దేవతలమాటనువిని, తపోధనుండగువిశ్వామిత్రుంజూచి, మనోహరంబుగా, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మహర్షే స్వాగతం వత్స తపసోగ్రేణ తోషితః
మహత్త్వ మృషిముఖ్యత్వం దదామి తవ కౌశిక. ౧౮

టీక॥ మహర్షే=పూజ్యుఁడవయినఋషివగు; వత్స=బిడ్డఁడవగువిశ్వామిత్రుఁడా! స్వాగతం=సుఖముతోడిరాక; తే,అస్తు (అధ్యాహృతము)=నీకగుఁగాక; కౌశిక=విశ్వామిత్రుఁడా! తవ=నీయొక్క; ఉగ్రేణ = భయంకరంబగు; తపసా=తపస్సుచేత; తోషితః=సంతసింపఁజేయఁబడినవాఁడనై; మహత్త్వం = పూజ్యుఁడ వగుటను; (అనఁగా) ఋషిముఖ్యత్వం=ఋషులలో శ్రేష్ఠుఁడవగుటను; దదామి=ఇచ్చెదను.

మహర్షివగుఁబిడ్డఁడా! నీకుస్వాగతంబగుఁగాక; నీవుచేసినభయంకరంబగుతపంబునను సంతసించితిని; నీకుమహర్షిత్వం బిచ్చెదను. అని, బ్రహ్మ, విశ్వామిత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

బ్రహ్మణ స్స వచ శ్శ్రుత్వా సర్వలోకేశ్వరస్య హ

నవిషణ్ణో నసంతుష్టో విశ్వామిత్ర స్తపోధనః. ౧౯

టీక॥ సర్వలోకేశ్వరస్య=సమస్త లోకంబులకును బ్రభువయిన; ("హ" అనునది పాదపూరణార్థము) బ్రహ్మణః = నలువయొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; తపోధనః=తపస్సే ధనముగాఁగల; సః= ఆ; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; నవిషణ్ణః= దుఃఖించినవాఁడునుగా లేడు. నసంతుష్టః= సంతోషించినవాఁడును గాలేదు.

సమస్తలోకనాయకుండగు బ్రహ్మదేవునిమాటవినితపోధనుండయినయావిశ్వామిత్రుిండు, దుఃఖింపను లేదు; సంతోషింపనులేదు.

అని, తాత్పర్యము.

ప్రాంజలిః ప్రణతో భూత్వా సర్వలోకపితామహమ్
ప్రత్యువాచ తతో వాచం విశ్వామిత్రో మహామునిః. ౨౦

టీక॥ మహామునిః=పూజ్యుఁడైన మునియగు; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; ప్రాంజలిః = మంచిచేమోడ్పులుగలవాఁడై; ప్రణతః=నమస్కరించినవాఁడు; భూత్వా=అయి; తతః=అంతట; సర్వలోకపితామహం=సమస్తలోకంబులకును తాతయయిన బ్రహ్మదేవునిగూర్చి; వాచం=మాటను; ప్రత్యువాచ= బదులుచెప్పెను.

విశ్వామిత్రమహాముని, చేతులుమొగిడ్చి, నమస్కరించి, యంత, నెల్లలోకంబులకును బితామహుండయినబ్రహ్మదేవునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మహర్షిశబ్ద మతులం స్వార్జితైః కర్మభి శ్శుభైః
యది మే భగవా నాహ తతోఽహం విజితేంద్రియః. ౨౧

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగల ; భవాన్ (అధ్యాహృతము)=నీవు; స్వార్జితైః=చక్కఁగా సంపాదింపఁబడిన; శుభైః=మంగళ




కరంబులగు; కర్మభిః = తపస్సులచే త; మే = నాకు; అతులం = దీటులేని; మహర్షిశబ్దం = "మహర్షి" (పూజ్యుఁడైనఋషి) యనుపేరును; ఆహ యది = చెప్పదు వేని; తతః = అందువలన; అహం = నేను; విజితేంద్రియః = చక్కఁగా జయింపఁబడిన యింద్రియంబులుగలవాఁడను.

భగవంతుండవగునీవు, నేనుజేసినమంగళకరంబులగు తపంబులకై, నాకు "మహర్షి" యనుపేరొసంగుదువేని, యప్పటికి, నేనుజితేంద్రియుండనయినట్లగుచున్నది. అని, విశ్వామిత్రుఁడు బ్రహ్మతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

త ముచాచ తతో బ్రహ్మా న తావ త్త్వం జితేంద్రియః
యతస్వ మునిశార్దూల ఇత్యుక్త్వా త్రిదివం గతః. ౨౨

టీక॥ తతః = అటుపిమ్మట; బ్రహ్మా = బ్రహ్మదేవుఁడు! తం = ఆవిశ్వామిత్రుంగూర్చి; "మునిశార్దూల = మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! త్వం = నీవు; జితేంద్రియస్తావత్ = జయింపఁబడినయింద్రియంబులుగలవాఁడవుమాత్రము; న = కావు. యతస్వ = యత్నింపుము." ఇతి (అధ్యాహృతము) = అని; ఉవాచ = చెప్పెను. ఇతి = ఇట్లు; ఉక్త్వా = చెప్పి; త్రిదివం = స్వర్గమును; గతః = పొందెను.

అంతబ్రహ్మదేవుండు, విశ్వామిత్రుంజూచి, "మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! నీవుజితేంద్రియుండవుమాత్రముకావు; ఇంకంబ్రయత్నింపుము' అని, చెప్పి, స్వర్గంబునకుంబోయెను. అని, తాత్పర్యము.

విప్రస్థితేషు దేవేషు విశ్వామిత్రో మహామునిః
ఊర్ధ్వబాహు ర్నిరాలంబో వాయుభక్ష స్తపశ్చరన్. ౨౩

టీక॥ దేవేషు = దేవతలు; విప్రస్థితేషు = బయలుదేఱఁగానే; మహామునిః = పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రః = విశ్వామిత్రుండు; ఊర్ధ్వబా




హుః=పొడవుగా నెత్తఁబడిన చేతులుగలవాఁడై; నిరాలంబః=ఊఁతలేనివాఁడై; వాయుభక్షః=గాలి నేతినువాఁడై; తపః= తపస్సును; చరన్=చేయుచు; అభవత్(అధ్యాహృతము)=ఉండెను.

దేవతలుపయనంబయి పోఁగానే, మహామునియగు విశ్వామిత్రుండు, చేతులుపైకెత్తి యెంతమాత్రంబునూఁతలేక నిరాలంబుఁడై, వాయువుందినుచుఁ, దపంబుగావించెను. అని, తాత్పర్యము.

ఘర్మే పంచతపా భూత్వా వర్షాస్వాకాశ సంశ్రయః
శిశిరే సలిలస్థాయీ రాత్ర్యహాని తపోధనః. ౨౪
ఏవం వర్షసహస్రం హి తపో ఘోర ముపాగమత్

టీక॥ తపోధనః=తపస్సే ధనంబుగాఁగలవిశ్వామిత్రుఁడు; ఘర్మే=వేసంగి కాలమునందు; పంచతపాః= అయిదింటినడుమనుతపస్సుసేయువాఁడై(నాల్గుప్రక్కలనాలుగగ్నిహోత్రంబుల నుంచికొనియయిదవయగ్నిసూర్యుఁడుగా నెండలో దపస్సు సేయువాఁడై); వర్షాసు=వానకాలమునందు; ఆకాశసంశ్రయః= బయలె వాసస్థానముగాఁగలవాఁడై; శిశిరే=శిశిరఋతువునందు; రాత్ర్యహాని= రేయుంబవలును; సలిలస్థాయీ=నీటియందుండువాఁడై; ఏవం=ఈప్రకారముగా; వర్షసహస్రం=సంవత్సరములయొక్క వేయి; ఘోరం=భయంకరంబగు; తపః= తపస్సును; ఉపాగమత్ హి=పొందెనుగదా!

తపోధనుండగు విశ్వామిత్రుండు, వేసంగికాలంబునం బంచాగ్నిమధ్యంబుననుండుచు, వానకాలంబునబయలనిలుచుచు, శిశిర ఋతువునందు, రేయుంబవలును, నీటమునింగినటించుచు, నిట్లు, వేయిసంవత్సరంబులు, భయంకరంబుగఁ దపంబుగావించెను. అని, తాత్పర్యము.

తస్మిన్ సంతప్యమానే తు విశ్వామిత్రే మహామునౌ. ౨౫

సంభ్రమ స్సుమహా నాసీ త్సురాణాం వాసవస్యచ

టీక॥ మహామునౌ=పూజ్యుఁడయినమునియగు, తస్మిన్=ఆ; విశ్వామిత్రే=విశ్వామిత్రుఁడు; సంతప్యమానేతు = చక్కఁగాఁదపస్సు సేయుచుండఁగానే; సురాణాం=దేవతలకును; వాసవస్యచ=ఇంద్రునకును; సుమహాన్=మిక్కిలియధికమయిన; సంభ్రమః=భయంబు; ఆసీత్=కల్గినది.

ఆవిశ్వామిత్ర మహామునియిట్లుగ్రంబుగాఁదపము సేయుచుండఁగా దేవతలు నింద్రుండును, మిగులభయంబునొందిరి.

అని, తాత్పర్యము.

రంభా మప్సరసం శక్ర స్సహ సర్వై ర్మరుద్గణైః ౨౬
ఉవాచాత్మహితం వాక్య మహితం కౌశికస్యచ

టీక॥ శక్రః=ఇంద్రుఁడు; సర్వైః= సమస్తములయిన; మరుద్గణైస్సహ=దేవతల సమూహములతోఁగూడ; రంభాం=రంభయనెడు; అప్సరసం=అప్సరసనుగూర్చి; ఆత్మహితం= తనకు మేలు సేయునది; కౌశికస్య=విశ్వామిత్రునకు; అహితంచ=కీడు సేయునదియునైన, వాక్యం = మాటను; ఉవాచ=చెప్పెను.

ఇంద్రుండు దేవతల నెల్లరంగూడి, రంభంజూచి, తనకు మేలును, విశ్వామిత్రునకుఁ గీడునుంగలుగుటకై, యిట్లని, చెప్పెనని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, త్రిషష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండత్రిషష్టితమసర్గటీక,
ముగిసినది.

౫౨

## చతుష్షష్టితమసర్గప్రారంభః.

సురకార్య మిదం రంభే కర్తవ్యం సుమహ త్త్వయా
లోభనం కౌశికస్యే హ కామమోహసమన్వితమ్. ౧

టీక॥ రంభే=రంభా! ఇహ=ఇప్పుడు; కౌశికస్య=విశ్వామిత్రుని యొక్క, విశ్వామిత్రునికి; కామమోహసమన్వితం = మన్మధునిచేతఁగలిగిన మోహముతోఁ గూడునట్లుగా; లోభనం=ఆసగొనఁజేయుట; ఇదం=ఈ; సుమహత్ = మిక్కిలియైనధికమయిన; సురకార్యం=దేవతలపని; త్వయా=నీచేత; కర్తవ్యం=చేయఁబడవలసినది.

రంభా! నీవువిశ్వామిత్రునకు మన్మథమోహంబుకల్పించి, యతని, నీయందాసగొనునట్లుసేయవలయును; ఇదిగొప్పది, దేవతాకార్యము, కావున, దీని, నీవు తప్పకసేయవలయును. అని, యింద్రుండు, రంభతోననెను.

అని, తాత్పర్యము.

తథో క్తా సా ఽప్సరా రామ సహస్రాక్షేణ ధీమతా
వ్రీళితా ప్రాంజలి ర్వాక్యం ప్రత్యువాచ సురేశ్వరమ్. ౨

టీక॥ రామ=రాముఁడా! సా=ఆ; అప్సరాః=అచ్చరయైనరంభ; ధీమతా= బుద్ధిమంతుఁడగు; సహస్రాక్షేణ=ఇంద్రునిచేత; తథా=అట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; వ్రీళితా=సిగ్గుపడినదై; ప్రాంజలిః = మంచి చేమోడ్పుఁగలదై; సురేశ్వరం = దేవేంద్రునిఁగూర్చి; వాక్యం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

రాముఁడా! ఆరంభ, బుద్ధిమంతుండగు నింద్రుండుచెప్పినమాటవిని, సిగ్గుపడి, చేతులుమొగిడ్చి, దేవేంద్రుంజూచి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

అయం సురపతే ఘోరో విశ్వామిత్రో మహామునిః
ఘోర ముత్సృజతే క్రోధం మయి దేవ నసంశయః. ౩

టీక॥ సురపతే=దేవేంద్రుఁడా! మహామునిః=పూజ్యుఁడైన మునియగు; అయం=ఈ; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; ఘోరః=భయంకరుఁడు; దేవ=ఒడయఁడా! మయి=నాయందు; ఘోరం=భయంకరమయిన; క్రోధం=కోపమును; ఉత్సృజతే(భవిష్యదర్థమందు లట్)=విడుచును. సంశయః=సందేహము; న=లేదు.

దేవేంద్రుఁడా! ఈవిశ్వామిత్ర మహాముని, చాలఁగోపిష్ఠుఁడు; నేను బోదునేసినన్ను భయంకరంబుగాఁ గోపంబుపూనిశపించును, సందియము లేదు.

అని, తాత్పర్యము.

తతో హి మే భయం దేవ ప్రసాదం కర్తు మర్హసి

టీక॥ దేవ=ఒడయఁడా! మే=నాకు; భయం=వెఱపు; తతో హి=అందువలనఁగదా! ప్రసాదం=అనుగ్రహమును; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

దేవేంద్రుఁడా! అందువలననేకదా! నాకువెఱపుగలుగుచున్నది; కావున, నన్ననుగ్రహింపవలయును అని, రంభ దేవేంద్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్తయా రామ రంభయా భీతయా తదా. ౪
తా మువాచ సహస్రాక్షో వేపమానాం కృతాంజలిమ్

టీక॥ రామ=రాముఁడా! సహస్రాక్షః = వేయి కండ్లుగలయింద్రుఁడు; తదా= అప్పుడు; భీతయా=వెఱచిన; తయా=ఆ; రంభయా=రంభ చేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; వేపమానాం= వడంకుచున్నదియును; కృతాంజలిం=చేయఁబడిన చేమోడ్పు

గలదియునగు; తాం= ఆరంభను గూర్చి; ఉవాచ=చెప్పెను.

రాముఁడా ! అప్పుడిట్లు, వెఱపుఁజెందినరంభ సెప్పినమాటలవిని, సహస్రాక్షుండగు దేవేంద్రుండు, భయంబున వడంకుచు చేతులు మొగిడ్చికొని నిలుచున్న రంభంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మాభైషి రంభే భద్రం తే కురుష్వ మమ శాసనమ్. ౫

టీక॥ రంభే=రంభా! మాభైషి (మాభైషీః)=వెఱవకుము. తే=నీకు, భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము) అగుఁగాక. మమ=నాయొక్క; శాసనం=ఆజ్ఞను; కురుష్వ=చేయుము.

రంభా ! నీవు వెఱవకుము; నీకు మంగళమగుఁగాక, నేనాజ్ఞాపించినట్లు సేయుము.

అని, తాత్పర్యము.

కోకిలో హృదయగ్రాహీ మాధవే రుచిరద్రుమే
అహం కందర్పసహిత స్థాస్యామి తవ పార్శ్వతః. ౬

టీక॥ అహం=నేను; కందర్పసహితః = మన్మథునితోఁగూడినవాఁడనై; మాధవే=వసంతఋతువునందు; రుచిరద్రుమే=మనోహరమయిన వృక్షమునందు; హృదయగ్రాహీ=మనోహరమయిన; కోకిలః=కోయిలయయి; తవ= నీయొక్క; పార్శ్వతః=ప్రక్కను; స్థాస్యామి=ఉండెదను.

నేను, మన్మథునింగూడి, వసంతఋతువునందు, మనోహరంబగు వృక్షమునందు, మనోహరంబయిన కోయిలరూపంబునొంది, నీప్రక్కనుండెదను. అని, తాత్పర్యము.

త్వం హి రూపం బహుగుణం కృత్వా పరమభాస్వరమ్
తమృషిం కౌశికం రంభే భేదయస్వ తపస్వినమ్. ౭

టీక॥ రంభే=రంభా! త్వంహి=నీవును; బహుగుణం=అనేకములైన



శృంగార చేష్టాది గుణములుగలది యును; పరమభాస్వరం=మిక్కిలి యుఁబ్రకాశించునదియునగు; రూపం=ఆకారమును; కృత్వా=చేసి; తపస్విణం=అధికమైనతపస్సుగలవాఁడును; ఋషిం=ఋషియునగు; తం=ఆ; కౌశికం=విశ్వామిత్రుని; భేదయస్వ=తపస్సునుండి భేదిల్లఁజేయుము.

రంభా! నీవును,శృంగారాదిగుణంబులుగల్గి పరమభాస్వరంబుగానుండురూపంబుధరించి, యుగ్రంబుగాఁదపంబుగావింపుచుండు, విశ్వామిత్రునిమనస్సును,తపంబునుండిమఱలునట్లుసేయుము. అని,యింద్రుండురంభతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సా శ్రుత్వా వచనం తస్య శ్రుత్వా రూప మనుత్తమమ్
లోభయామాస లలితా విశ్వామిత్రం శుచిస్మితా. ౮

టీక॥శుచిస్మితా=తెల్లనిచిఱునవ్వుగలదియును;లలితా = సుందరియయినదియునగు;సా=ఆరంభ;తస్య=ఆయింద్రునియొక్క;వచనం=మాటను;శ్రుత్వా = విని;అనుత్తమం = తనకన్నశ్రేష్ఠములేని;రూపం=ఆకారమును; కృత్వా=చేసి; విశ్వామిత్రం=విశ్వామిత్రుని;లోభయామాస=ఆసగొనునట్లుచేసెను.

తెల్లనిచిఱునవ్వుగల్గి సుందరియయియుండురంభ, యింద్రునిమాట విని,ఉత్తమంబగురూపంబుధరించి, విశ్వామిత్రుంబ్రలోభించెను.

అని, తాత్పర్యము.

కోకిలస్యచ శుశ్రావ వల్గు వ్యాహరత స్స్వనమ్
సంప్రహృష్టేన మనసా తత ఏనా ముదైక్షత. ౯

టీక॥సః(అధ్యాహృతము)=ఆవిశ్వామిత్రుఁడు;వల్గు = మనోహరంబుగా;వ్యాహరతః=కూయుచున్న;స్వనంచ=ధ్వనిని; శుశ్రావ=వినెను;తతః=అంతట;సంప్రహృష్టేన=మిక్కిలియుసంతసించిన; మన






సా=హృదయముతో; ఏనాం=ఈ రంభను; ఉదైక్షత=చూచెను.

ఆవిశ్వామిత్రుండు, మనోహరంబుగాఁ గూయుచున్నకోయిలకూఁతనువిని, యంతట, సంతుష్టంబగుమనంబుతో, నెదుటనిలుచున్నరంభం, జూచెను.

అని, తాత్పర్యము.

అథ తస్య చ శబ్దేన గీతేనా ప్రతిమేన చ
దర్శనేన చ రంభాయా ముని స్సందేహ మాగతః. ౧౦

టీక॥ అథ = అటుపిమ్మట; మునిః=విశ్వామిత్రమహాముని; తస్య=ఆకోయిలయొక్క; శబ్దేనచ=ధ్వనిచేతను; రంభాయాః = రంభయొక్క; దర్శనేనచ = కనుపడుటచేతను; అప్రతిమేన=సరిలేని; గీతేనచ=గానముచేతను; సందేహం=సందియమును; ఆగతః=పొందెను.

అంత, విశ్వామిత్రమహాముని, యాకోయిలధ్వనివినియు, రంభం జూచియు, రంభ పాడినగానము నాలకించియు, సందేహంబునొందెను.

అని, తాత్పర్యము.

సహస్రాక్షస్య తత్కర్మ విజ్ఞాయ మునిపుంగవః
రంభాం క్రోధసమావిష్ట శ్శశాప కుశికాత్మజః. ౧౧

టీక॥ మునిపుంగవః = మునిశ్రేష్ఠుండగు; కుశికాత్మజః = విశ్వామిత్రుండు; తత్=దాని; సహస్రాక్షస్య=ఇంద్రునియొక్క; కర్మ=కార్యమునుగా; విజ్ఞాయ=ఎఱింగి; క్రోధసమావిష్టః= కోపముచేనావేశింపఁబడినవాఁడై; రంభాం=రంభను; శశాప=శపించెను.

మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, దానిదేవేంద్రుండుచేసినపనిగానెఱింగి, కోపమునొంది, రంభ, నిట్లని, శపించెను. అని, తాత్పర్యము.

య న్మాం లోభయసే రంభే కామక్రోధజయైషిణమ్
దశ వర్షసహస్రాణి శైలీ స్థాస్యసి దుర్భగే. ౧౨




టీక॥దుష్కృగే=చెడ్డప్రయత్నం బుగల;రంభే=రంభా! కామక్రోధజ య్యైషిణం= కామముయొక్కయుఁ గోపముయొక్కయు జయించుటకిచ్ఛించుచున్నట్టి; మాం=నన్ను;లోభయసేఇతియత్= ఆసగొనునట్లు చేయుచున్నావను నదియేది గలదో; తస్మాత్(అధ్యాహృతము)= అందువలన;వర్షసహస్రాణి=సంవత్సరములయొక్క వేలు; దశ=పది;శైలీ=ఱాయి గా;స్థాస్యసి=ఉండఁగలవు.

దుష్ట ప్రయత్నముసేయు రంభా! నీవు కామ క్రోధంబులజయింపం బూనిననున్నఁ బ్రలోభించుచున్నావు కావున, నీవు, పదివేలేండ్లు, ఱాయిగానుండఁగలవు.

అని, తాత్పర్యము.

బ్రాహ్మణ స్సుమహా తేజా స్తపోబలసమన్వితః
ఉద్ధరిష్యతి రంభే త్వాం మత్క్రోధకలుషీకృతామ్. ౧

టీక॥రంభే=రంభా! సుమహాతేజాః= మిక్కిలియునధికమయినప్రభావముగలవాఁడును; తపోబలసమన్వితః = తపస్సుబలిమితోఁగూడినవాఁడునగు; బ్రాహ్మణః=పాఱుఁడు (బ్రహ్మపుత్రుండగువసిష్ఠుండనికొందఱందురు) ; మత్క్రోధకలుషీకృతాం=నాకోపముచేతఁగలఁకఁబాఱునట్లుచేయఁబడిన; త్వాం=నిన్ను; ఉద్ధరిష్యతి =మీఁదికెత్తును, శాపమునుండితొలఁగించుననుటః

రంభా! మహాప్రభావుండును దపోబలంబు గలవాఁడునగు బ్రాహ్మణుండయినవసిష్ఠుండు, నాకోపంబునఁగలంకఁబాఱియున్ననిన్ను శాపంబునుండితొలంగించును. అని, విశ్వామిత్రుఁడురంభనుశపియించెను.

అని, తాత్పర్యము,

ఏవ ముక్త్వా మహా తేజా విశ్వామిత్రో మహామునిః
అశక్నువన్ ధారయితుం క్రోధం సంతాప మాగతః. ౧౪

టీక॥మహా తేజాః=అధికమయినప్రభావముగల; మహామునిః=పూ

జ్యుఁడయిన మునియగు ; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు;క్రోధం=కోపమును;ధారయితుం=అణఁచుకొనుటకు;అశక్నువన్ = చాలనివాఁడై;ఏవం=ఇట్లు;ఉక్త్వా=చెప్పి;సంతాపం=పశ్చాత్తాపమును ; అగతః=పొందెను.

మహాప్రభావుఁడగువిశ్వామిత్రమహామునికి కోపంబుపట్టలేక, యిట్లు రంభనుశపియించి, యటుపిమ్మటఁ గోపమునిగ్రహింపఁజాల నయితినని, పశ్చాత్తాపంబునొందెను.
అని, తాత్పర్యము.

తస్య శాపేన మహతా రంభా శైలీ తదాఽభవత్

టీక॥తదా = అప్పుడు;మహతా=గొప్పదైన;తస్య=ఆవిశ్వామిత్రునియొక్క;శాపేన=శాపముచేత;రంభా=రంభ;శైలీ = ఱాయిగా;అభవత్=ఆయెను.

అప్పుడావిశ్వామిత్రునిమహాశాపంబునరంభ , శిలారూపంబునొందెను. అని, తాత్పర్యము.

వచ శ్శ్రుత్వాతు కందర్పో మహర్షే స్సచ నిర్గతః

టీక కందర్పః=మన్మధుఁడును; సచ=ఆయింద్రుఁడును; మహర్షేః=పూజ్యుఁడైన ఋషియగు విశ్వామిత్రునియొక్క;వచః=మాటను; శ్రుత్వాతు = వినినంతనే;నిర్గతః=పోయెను.

మన్మధుండును దేవేంద్రుండును, విశ్వామిత్రమహర్షి రంభను శపియించుటవినినంతనే, యచ్చోటనుండక పోయిరి. అని, తాత్పర్యము.

కోపేన స మహాతేజా స్తపోపహరణే కృతే
ఇంద్రియై రజితై రామ న లేభే శాంతి మాత్మనః. ౧౬

టీక॥రామ=రామఁడా!మహాతేజాః=అధికమయినప్రభావముగల;సః = ఆవిశ్వామిత్రుఁడు;కోపేన=కినుకచేత; తపోపహరణే=తపస్సుయొక్క మోసపుచ్చి తీసికొనిపోవుట;కృతే = చేయఁబడఁగా;అజి

తైః=జయింపఁబడని; ఇంద్రియైః=ఇంద్రియములచేత; ఆత్మనః=మనస్సుకు; శాంతిం=దుఃఖములేకుండుటను; న లేభే=పొందలేదు.

రాముఁడా! ఇట్లు, కోపమూలంబుగాఁ దపస్సు తఱుఁగుటంజూచి, మహాప్రభావుండగు విశ్వామిత్రుండు, జితేంద్రియుండు కానందున మనశ్శాంతిం బొందఁడయ్యె.

అని, తాత్పర్యము.

బభూవాస్య మనశ్చింతా తపోపహరణే కృతే

టీక॥ తపోపహరణే = తపస్సుయొక్క మోసపుచ్చి తీసికొనిపోవుట; కృతే=చేయఁబడఁగా; అస్య=ఈవిశ్వామిత్రునకు; మనశ్చింతా=సంకల్పము; బభూవ=కలిగెను.

ఇట్లు, తపస్సు తఱుఁగఁగానే, విశ్వామిత్రుం డిట్లని, సంకల్పించెను. అని, తాత్పర్యము.

నైవ క్రోధం గమిష్యామి నచ వక్ష్యే కథంచన. ౧౭
అథవానోచ్ఛ్వసిష్యామి సంవత్సర శతాన్యపి

టీక॥ క్రోధం=కోపమును; నైవ గమిష్యామి=పొందనేపొందను; కథంచన=ఎట్లయినను; నచవక్ష్యే=మాట లాడుటయును లేదు; అథవా=అటు కానిపక్షమున; సంవత్సరశతాన్యపి= ఏండ్లయొక్క నూఱులైనను; నోచ్ఛ్వసిష్యామి=నిట్టూర్పువిడువను.

నేనింకఁ గోపంబునొందుటయే లేదు; మాటలాడుటయును లేదు; లేక, పెక్కు నూఱేండ్లయినను నిట్టూర్పువిడువక యేయుండెదను.

అని, తాత్పర్యము.

అహం విశోషయిష్యామి హ్యాత్మానం విజితేంద్రియః. ౧౮

టీక॥ అహం=నేను; విజితేంద్రియః = చక్కగా జయింపఁబడిన యింద్రియంబులు గలవాఁడనై; ఆత్మానం = దేహమును; విశోష

యిష్యామి=ఎండునట్లుచేసెదనుగదా!

నేనింద్రియంబులంజయించి, దేవతలను, శోషింపఁజేసెదను.

అని, తాత్పర్యము.

తావద్యావద్ధి మే ప్రాప్తం బ్రాహ్మణ్యం తపసార్జితమ్
అనుచ్ఛ్వసన్నభుంజాన స్తిష్ఠేయం శాశ్వతీ స్సమాః. ౧౯

టీక॥ యావత్=ఎంతలోపల; తపసా=తపస్సుచేత; ఆర్జితం=సంపాదింపఁబడిన; బ్రాహ్మణ్యం=బ్రాహ్మణత్వము; మే=నాకు; ప్రాప్తం=పొందఁబడినది; భవిష్యతి=(అధ్యాహృతము) కాఁగలదో; తావద్ధి=అంతవఱకును; శాశ్వతీః=అనేకములయిన; సమాః=సంవత్సరములను; అనుచ్ఛ్వసన్=నిట్టూర్పువిడువనివాఁడనై; అభుంజానః=భుజింపనివాఁడనై; తిష్ఠేయం=ఉండెదను.

నాకెంతలోపల, తపంబునసంపాదింపఁబడు, బ్రాహ్మణత్వంబుకలుగునో, అంతవఱకును, బెక్కుసంవత్సరంబులయినను, నిట్టూర్పువిడువక భుజింపకయుండెదను.

అని, తాత్పర్యము.

న హి మే తప్యమానస్య క్షయం యాస్యంతి మూర్తయః

టీక॥ తప్యమానస్య=తపంబుసేయుచున్న; మే=నాయొక్క; మూర్తయః=అవయవములు; క్షయం=నాశమును; నయాస్యంతి హి=పొందవుగదా!

నేనుదపంబు సేయుచుండెదను గావునఁ దపఃప్రభావంబునంజేసి, నాయవయవంబులుక్షయింపకుండెడు. అని, విశ్వామిత్రుఁడుసంకల్పించెను. అని, తాత్పర్యము.

ఏవం వర్షసహస్రస్య దీక్షాం స మునిపుంగవః. ౨౦
చకారా ప్రతిమాం లోకే ప్రతిజ్ఞాం రఘునందన

టీక॥ రఘునందన=రాముఁడా! మునిపుంగవః=మునిశ్రేష్ఠుండగు; సః=

ఆవిశ్వామిత్రుఁడు; ఏవం=ఇట్లు;వర్షసహస్రస్య = సంవత్సరముల యొక్క-వేయికి;దీక్షాం = దీక్షను; లోకే=ప్రపంచమునందు; అప్రతిమాం=సరిలేని;ప్రతిజ్ఞాం = ప్రతినను;చకార=చేసెను.

రాముఁడా! మునిశ్రేష్ఠుండగు నా విశ్వామిత్రుండు, వేయి సంవత్సరంబులకు దీక్షను "నిట్టూర్పు విడువక భుజింపక తపంబు గావించెదను" అని, ప్రతిజ్ఞనుం జేసెను. అని తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, చతుష్షష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండచతుష్షష్టితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

పంచషష్టితమసర్గప్రారంభః.

అథ హైమవతీం రామ దిశం త్యక్త్వా మహామునిః
పూర్వాం దిశ మనుప్రాప్య తపస్తేపే సుదారుణమ్. ౧

టీక॥ రామ=రాముఁడా! అథ= అటుపిమ్మట; మహామునిః=పూజ్యుఁడైన మునియగు విశ్వామిత్రుఁడు; హైమవతీం = హిమవత్పర్వతసంబంధియగు; దిశం = దిక్కును; త్యక్త్వా=విడిచి; పూర్వాం=తూర్పు; దిశం=దిక్కును; అనుప్రాప్య = ప్రాపించి; సుదారుణం=మిక్కిలియు భయంకరంబగు; తపః=తపస్సును; తేపే= తపించెను, చేసెననుట.

రాముఁడా! అంత, విశ్వామిత్ర మహాముని యుత్తరపు దిక్కును విడి

చి, తూర్పుదిక్కునకుఁబోయి,యతిభయంకరంబుగాఁ దపంబుగావించెను. అని, తాత్పర్యము.

మౌనం వర్షసహస్రస్య కృత్వా వ్రత మనుత్తమమ్
చకారా ప్రతిమం రామ తపః పరమదుష్కరమ్. ౨

టీక॥ రామ=రాముఁడా ! సః (అధ్యాహృతము) = ఆవిశ్వామిత్రుఁడు; వర్షసహస్రస్య=సంవత్సరముల యొక్క వేయికి; అనుత్తమం= తనకన్న శ్రేష్ఠములేని; మౌనం= మాటలాడకుండుటయనెడు; వ్రతం = నియమమును;కృత్వా= చేసి; అప్రతిమం=సరిలేనిదియును; పరమదుష్కరం= ఎంతమాత్రమునుఁజేయుట కశక్యమయినదియునగు; తపః=తపస్సును;చకార=చేసెను.

రాముఁడా! ఆవిశ్వామిత్రుఁడు, వేయిసంవత్సరములుమాటలాడకుండునట్లు,సంకల్పించి,లోకంబునవెచ్చటనుసరిలేనిదియు, నితరులకెంతమాత్రంబునుజేయనశక్యమైనదియునగుతపంబుగావించెను.

అని, తాత్పర్యము.

పూర్ణే వర్షసహస్రేతు కాష్ఠభూతం మహామునిమ్
విఘ్నై ర్బహుభి రాధూతం క్రోధో నాంతర ఆవిశత్. ౩

టీక॥ వర్షసహస్రే = సంవత్సరముల యొక్క వేయి; పూర్ణే తు=నిండఁగానే; బహుభిః= పెక్కులయిన; విఘ్నైః=విఘ్నములచేత; ఆధూతం=కొట్టఁబడినవాఁడైనను; కాష్ఠభూతం=కొయ్యాగానున్నట్టి;మహామునిం=పూజ్యుఁడైన మునియగువిశ్వామిత్రునిఁ గూర్చి; క్రోధః=కోపము; అంతరం=అవకాశమును; నావిశత్=పొందలేదు.

వేయిసంవత్సరంబులును ముగియఁగానే, ఎన్నివిఘ్నంబులువచ్చినను,కొయ్యవలెనిశ్చలుండైనవిశ్వామిత్రుఁడు కోపంబునొందఁడయ్యె.

అని, తాత్పర్యము.

స కృత్వా నిశ్చయం రామ తప ఆతిష్ఠ దవ్యయమ్

టీక॥ రామ=రాముఁడా! సః=ఆవిశ్వామిత్రుఁడు; నిశ్చయం=ఏర్పాటును; కృత్వా=చేసికొని; అవ్యయం=నాశములేకుండునట్లు; తపః=తపస్సును; ఆతిష్ఠత్=అవలంబించియుండెను.

రాముఁడా! ఇట్లావిశ్వామిత్రుండు; ఏర్పాటుచేసికొని, విఘ్నము రాకుండునట్లు, నియమముఁగాఁ, దపంబుగావించెను అని, తాత్పర్యము.

తస్య వర్షసహస్రస్య వ్రతే పూర్ణే మహావ్రతః. ౪
భోక్తు మారబ్ధవా నన్నం తస్మిన్ కాలే రఘూత్తమ
ఇంద్రో ద్విజాతి ర్భూత్వా తం సిద్ధ మన్న మయాచత. ౫

టీక॥ రఘూత్తమ=రఘువంశంబునం బుట్టినవారలలో శ్రేష్ఠుండవగు రాముఁడా! తస్య=ఆ; వర్షసహస్రస్య=సంవత్సరంబుల వేయియొక్క; వ్రతే=నియమము; పూర్ణే=ముగియఁగా; మహావ్రతః=గొప్పనియమముగల విశ్వామిత్రుఁడు; అన్నం=అన్నమును, భోక్తుం=తినుటకు; ఆరబ్ధవాన్=యత్నించెను. తస్మిన్=ఆ; కాలే=కాలమునందు; ఇంద్రః=ఇంద్రుఁడు, ద్విజాతిః=బ్రాహ్మణుఁడు, భూత్వా=అయి; తం=ఆవిశ్వామిత్రుని; సిద్ధం=వండఁబడిన; అన్నం=అన్నమును; అయాచత=అడిగెను.

ఆ వేయిసంవత్సరంబుల నియమంబుముగియఁగానే, మహావ్రతంబుబూనియుండు విశ్వామిత్రుండు, అన్నముదిన యత్నించెను; అప్పుడింద్రుండు బ్రాహ్మణవేషంబుధరించి, యావిశ్వామిత్రునికడకేతెంచి, సిద్ధంబగునన్నంబుఁబెట్టుమనియాచించెను.

అని, తాత్పర్యము.

తస్మై దత్వా తదా సిద్ధం సర్వం విప్రాయ నిశ్చితః
నిశ్శేషితే న్నే భగవా నభుక్త్వైవ మహాతపాః. ౬

నకించి దవదద్విప్రం మౌనవ్రత ముపస్థితః

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగలవాఁడును; మహాతపాః=అధికమైనతపస్సుగలవాఁడును; మౌనవ్రతం=మాటలాడకుండుటయును; ఉపస్థితః= పొందినవాఁడగువిశ్వామిత్రుఁడు; నిశ్చితః=సంశయములేనివాఁడై; తదా=అప్పుడు; సిద్ధం=వండఁబడిన; సర్వం=అన్నమునంతను; తస్మై=ఆ; విప్రాయ=బ్రాహ్మణునికొఱకు; దత్వా=ఇచ్చి; అన్నే=సిద్ధాన్నము; నిశ్శేషితే=మిగులకుండునట్లుచేయఁబడఁగా; అభుక్త్వైవ=భుజింపకయే; విప్రం=బ్రాహ్మణునిఁగూర్చి; కించిత్=ఏమియును; నావదత్ = చెప్పఁడయ్యె.

ఇట్లు, మౌనవ్రతంబవలంబించి మహాతపంబుసేయు విశ్వామిత్రుండు, సందేహింపక అప్పుడు, సిద్ధంబగునన్నంబునంతయు, నాబ్రాహ్మణునకొసంగి, యాబ్రాహ్మణుండన్నమంతయుఁదినివేయఁగా, నతనితో నేమియుఁబలుకకయూరకుండెను. అని, తాత్పర్యము.

అథ వర్షసహస్రం వై నోచ్ఛ్వసన్మునిపుంగవః. ౭

టీక॥అథ=అటుపిమ్మట; మునిపుంగవః= మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుఁడు, వర్షసహస్రం వై=సంవత్సరముల యొక్క వేయియంతయు; నోచ్ఛ్వసత్ = నిట్టూర్పువిడువఁడయ్యె.

అంత, మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుఁడు, వేయిసంవత్సరములు, నిట్టూర్పువిడువక, తపంబుగావించెను. అని, తాత్పర్యము.

తస్యానుచ్ఛ్వసమానస్య మూర్ధ్ని ధూమో వ్యజాయత
త్రైలోక్యం యేన సంభ్రాంత మాదీపిత మివాభవత్. ౮

టీక॥అనుచ్ఛ్వసమానస్య=ఊపిరివిడువకయుండునట్టి; తస్య=ఆ విశ్వామిత్రునియొక్క; మూర్ధ్ని= తలయందు; ధూమః=పొగ; వ్యజాయత = పుట్టినది. త్రైలోక్యం = మూఁడులోకములు; యేన= ఏపొ

గచేత; సంభ్రాంతం=కలతపెట్టఁబడినదై; ఆదీపితమివ=కాల్పఁబడినదివలె; అభవత్=ఆయెనో.

ఆవిశ్వామిత్రుండట్లుసిట్టూర్పు విడువకుండఁగా, ఎతనిశిరస్సునఁబొగలేచినది; ఆపొగచేత; ముల్లోకంబులును, కలతనొంది, కాల్పఁబడినట్లయినవి. అని, తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వాః పన్నగాసురరాక్షసాః
మోహితా స్తేజసా తస్య తపసా మందరశ్మయః. ౯
కశ్మలోపహతా స్సర్వే పితామహ మథా బ్రువన్

టీక॥ తతః=అటుపిమ్మట; సగంధర్వాః = గంధర్వులతోఁగూడిన; దేవాః=దేవతలును; పన్నగాసురరాక్షసాః=సర్పములును అసురులును రాక్షసులును; సర్వే=అందఱును; తస్య = ఆవిశ్వామిత్రునియొక్క; తపసా = తపస్సనెడి; తేజసా= అగ్నిచేత; మోహితాః = మూర్ఛనొందినవారలై; మందరశ్మయః=క్షయించిన తేజస్సుగలవారలై; కశ్మలోపహతాః= దుఃఖముచేఁగొట్టఁబడినవారలై; అథ=అటుపిమ్మట; పితామహం=బ్రహ్మదేవునిఁగూర్చి; అబ్రువన్=పలికిరి.

అంత దేవతలునుగంధర్వులును బన్నగులునుఅసురులును రాక్షసులునుఅందఱును, ఆవిశ్వామిత్రునితపస్సనెడు నగ్నిచే మూర్ఛితులయి కాంతివీడి, దుఃఖమునొంది, బ్రహ్మదేవునితో, నిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

బహుభిః కారణై ర్దేవ విశ్వామిత్రో మహామునిః. ౧౦
లోభితః క్రోధిత శ్చైవ తపసా చాభి వర్ధతే

టీక ॥ దేవ=బ్రహ్మదేవుఁడా! మహామునిః= పూజ్యుఁడైనమునియగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు; బహుభిః=అనేకములయిన; కారణైః=హేతువులచేత; లోభితః=ఆసగొనఁజేయఁబడినవాఁడయ్యును; క్రోధిత శ్చైవ = కోపింపఁజేయఁబడినవాఁడయ్యును; తపసాచ= తపస్సు

చేతను; అభివర్ధతే=వృద్ధిఁబొందుచు న్నాఁడు.

బ్రహ్మదేవుఁడా! విశ్వామిత్రమహాముని, పెక్కు కారణంబుల, మన చే, లోభంబునొందునట్లును గోపంబునొందునట్లును జేయఁబడినను, దపంబునం జాల వృద్ధిఁ బొందుచు న్నాఁడు. అని, తాత్పర్యము.

న హ్యస్య వృజినం కించి ద్దృశ్యతే సూక్ష్మమప్య థ. ౧౧

టీక॥ అథ=ఇంక; అస్య=ఈవిశ్వామిత్రునకు; సూక్ష్మమపి=కొంచెమయినను; కించిత్=ఏదైనను; వృజినం=పాపము; నదృశ్యతేహి=అగపడదుగదా!

ఇప్పుడీవిశ్వామిత్రునియందు, ఏదైననుగొంచెమయినను పాపంబు లేదు. అని, తాత్పర్యము.

నదీయతే యదిత్వస్య మనసా యదభీప్సితమ్
వినాశయతి త్రైలోక్యం తపసా సచరాచరమ్. ౧౨

టీక॥ అస్య= ఈవిశ్వామిత్రునకు; మనసా=మనస్సుచేత; యత్=ఏది; అభీప్సితం = కోరఁబడినదో; తత్ (అధ్యాహృతము) తు = అది మాత్రము; నదీయతేయది=ఇవ్వఁబడదేని; అయం(అధ్యాహృతము)=ఈవిశ్వామిత్రుఁడు; తపసా=తపస్సుచేత; సచరాచరం=జంగమస్థావరములతోఁ గూడిన; త్రైలోక్యం=ముల్లోకంబులను; వినాశయతి=నశింపఁజేయును.

ఈవిశ్వామిత్రుఁడుకోరిన,దానినితని కివ్వకుండుదుమేని, యితండు తపంబున, జంగమస్థావరంబులతోఁ గూడినముల్లోకంబులనశింపఁజేయును. అని, తాత్పర్యము.

వ్యాకులాశ్చ దిశ స్సర్వా నచ కించి త్ప్రకాశతే
సాగరాః క్షుభితా స్సర్వే విశీర్యంతే చ పర్వతాః. ౧౩

టీక॥ దిశః=దిక్కులు; సర్వాశ్చ=అన్నియును; వ్యాకులాః = కలఁతనొందినవి. కించిచ్చ=ఏదియు; నప్రకాశతే = ప్రకాశింపదు. సాగరాః=సముద్రములు; సర్వే=అన్నియును; క్షుభితాః=కలఁతపెట్టఁబడినవి. పర్వతాశ్చ= పర్వతంబులును; విశీర్యంతే=పడుచున్నవి.

దిక్కులన్నియుఁ గలంతనొంది యున్నవి, ఏదియుఁ బ్రకాశింపద య్యె, సముద్రంబులన్నియుఁగలంత పడియున్నవి; పర్వతంబులునుసడలి పఁచున్నవి. అని, తాత్పర్యము.

ప్రకంపతే చ పృథివీ వాయు ర్వాతి భృశాకులః
బ్రహ్మ న్నప్రతిజానీమో నాస్తికో జాయతే జనః. ౧౪

టీక బ్రహ్మన్=బ్రహ్మదేవుఁడా! పృథివీచ = భూమియును; ప్రకంపతే=వడంకుచున్నది. వాయుః=గాలి; భృశాకులః=మిక్కిలియును గలంతఁజెందినదై; వాతి=వీఁచుచున్నది; జనః=జనము; నాస్తికః=పరలోకము లేదనువాఁడట్లు ; జాయతే=అగుచున్నది. నప్రతిజానీమః=ఎఱుఁగము.

బ్రహ్మదేవుఁడా! భూమివడంకుచున్నది; గాలిమిక్కిలియుఁగలంతపడివీచుచున్నది; జనులునాస్తికులట్లు, కర్మములవిడిచియున్నారు; దీనికిఁ బ్రతీకారమేమి సేయవలయునో మే మెఱుఁగము. అని, తాత్పర్యము.

సమ్మూఢ మివ త్రైలోక్యం సంప్రక్షుభితమానసమ్
భాస్కరో నిష్ప్రభ శ్చైవ మహర్షే స్తస్య తేజసా. ౧౫

టీక॥ తస్య=ఆ; మహర్షేః=పూజ్యుఁడైన ఋషియగు విశ్వామిత్రునియొక్క; తేజసా = కాంతిచేత; త్రైలోక్యం= మూఁడులోకంబులనుండుజనము ; సంప్రక్షుభితమానసం= మిక్కిలియుగలంతపెట్టఁబడిన బుద్ధిగలదై ; సమ్మూఢమివ=మోహముఁజెందినట్లున్నది. భాస్కరశ్చైవ=సూర్యుఁడును; నిష్ప్రభః=కాంతిలేనివాఁడుగా; భవతి=అగుచున్నాఁడు.

మహర్షియగునావిశ్వామిత్రునికాంతింజేసి, ముల్లోకంబులనుండువారును కలంతనొంది మోహమునొందినట్లున్నవారు ; సూర్యుండు కాంతివీడిమందుండుగాఁ గానంబడియెడి. అని, తాత్పర్యము.

బుద్ధిం న కురుతే యావ న్నాశే దేవ మహామునిః
తావ త్ప్రసాద్యో భగవా నగ్నిరూపో మహాద్యుతిః. ౧౮

టీక॥ దేవ=బ్రహ్మదేవుఁడా! మహామునిః= పూజ్యుఁడైనమునియగు విశ్వామిత్రుఁడు; యావత్ = ఎంతలోపల; నాశే= నశింపఁజేయుటయందు; బుద్ధిం=తలంపును; నకురుతే=చేయఁడో; తావత్=అంతలోపల; భగవాన్=మాహాత్మ్యముగలవాఁడును; అగ్నిరూపః=నిప్పువంటిరూపముగలవాఁడును; మహాద్యుతిః= గొప్పకాంతిగలవాఁడునగు విశ్వామిత్రుఁడు; ప్రసాద్యః= సంతసింపఁజేయఁదగినవాఁడు.

బ్రహ్మదేవుఁడా! భగవంతుఁడును నిప్పువంటివాఁడునునగు విశ్వామిత్ర మహాముని, లోకములనన్నింటిని నశింపఁ జేయఁ దలఁపుగొనుటకుమున్నె, యతనిసంతోషపఱచుట మేలు.

అని, తాత్పర్యము.

కాలాగ్నినా యథా పూర్వం త్రైలోక్యం దహ్యతేఽఖిలమ్
దేవరాజ్యం చికీర్షేత దీయతా మస్య యన్మతమ్. ౧౯

టీక॥పూర్వం=మునుపు; కాలాగ్నినా=ప్రళయకాలమునందలియగ్నిహోత్రునిచేత; యథా=ఎట్లో; తథా(అధ్యాహృతము)=అట్లు; అనేన(అధ్యాహృతము)= ఈవిశ్వామిత్రునిచేత; త్రైలోక్యం=ముల్లోకంబులు; అఖిలం=సమస్తమును; దహ్యతే= దహింపఁబడును. అయం(అధ్యాహృతము)= ఈవిశ్వామిత్రుఁడు; దేవరాజ్యం=దేవతలదొరతనమును; చికీర్షేత=చేయఁగోరును. అస్య=వీనికి, యత్=ఏది; మతం=ఇష్టమో; తత్ (అధ్యాహృతము)=అది; దీయతాం=ఇవ్వఁబడుఁగాక.

పూర్వముప్రళయాగ్నిదహించినట్లు, ఈవిశ్వామిత్రుఁడు, ముల్లోకంబులనన్నింటినిదహింపఁగలఁడు; ఇతండు, ఇంక దేవరాజ్యంబునుం జేయఁగోరినను గోరును; కావున, ఇతండుకోరుదానినిమ్ము. అని, దేవతలుబ్రహ్మదేవునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

తత స్సురగణా స్సర్వే పితామహపురోగమాః

విశ్వామిత్రం మహాత్మానం మధురం వాక్య మబ్రువన్. ౧౮

టీక॥తతః=అంతట;పితామహపురోగమాః=బ్రహ్మదేవుఁడు ముందు నడచువాఁడుగాఁగల;సురగణాః=దేవతలసమూహంబులు;సర్వే=అన్నియును; మహాత్మానం=పూజ్యమగుస్వభావముగల; విశ్వామిత్రం=విశ్వామిత్రుని గూర్చి; మధురం=మనోహరంబగు; వాక్యం=మాటను;అబ్రువన్=చెప్పిరి.

అంత, దేవతలందఱును, బ్రహ్మదేవుమున్నిడికొని,మహాత్ముండగువిశ్వామిత్రునియొద్దకుఁబోయి, యతనితో,మధురంబుగా,నిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

బ్రహ్మర్షే స్వాగతం తేఽస్తు తపసా స్మ సుతోషితాః

టీక॥బ్రహ్మర్షే=బ్రాహ్మణుండవు ఋషివగు విశ్వామిత్రుఁడా! తే=నీకు; స్వాగతం=సుఖముతోడిరాక;అస్తు=అగుఁగాక. తపసా=తపస్సుచేత; సుతోషితాః=చక్కగాసంతోషపఱుపఁ బడిన వారలము;స్మ(స్మః)=అగుచున్నాము.

బ్రహ్మర్షివగు విశ్వామిత్రుఁడా! నీకుస్వాగతంబగుఁగాక;నీవుచేసినతపంబునకుఁ జాలసంతోషించితిమి.అని,దేవతలుచెప్పిరి.

అని,తాత్పర్యము.

బ్రాహ్మణ్యం తపసోగ్రేణ ప్రాప్తవా నసి కౌశిక. ౧౯

టీక॥కౌశిక=విశ్వామిత్రుఁడా! ఉగ్రేణ= భయంకరంబగు; తపసా=తపంబుచేత; బ్రాహ్మణ్యం=బ్రాహ్మణుఁడ వగుటను; ప్రాప్తవాన్=పొందినవాఁడవు; అసి=అగుచున్నావు.

విశ్వామిత్రుఁడా! నీవుభయంకరంబగుతపంబుచేసినందున బ్రాహ్మణత్వంబునొందితివి.

అని,తాత్పర్యము.

దీర్ఘ మాయుశ్చ తే బ్రహ్మన్ దదామి సమరుద్గణః
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే గచ్ఛ సౌమ్య యథాసుఖమ్. ౨౦

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవయినవిశ్వామిత్రుఁడా! అహం=(అధ్యాహృతము)నేను; సమరుద్గణః = దేవతాసమూహంబుతోఁగూడినవాఁడనై; తే = నీకు; దీర్ఘం=అధికమయిన; ఆయుశ్చ=ఆయుస్సును; దదామి=ఇచ్చెదను; స్వస్తి = మంగళమును; ప్రాప్నుహి=పొందుము. తే=నీకు;భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము)అగుఁగాక; సౌమ్య=శాంతుఁడవగువిశ్వామిత్రుఁడా! యథాసుఖం=సుఖమునతిక్రమింపక;గచ్ఛ=పొమ్ము.

బ్రాహ్మణుండవుశాంతుండవునగువిశ్వామిత్రుఁడా!నీకు నేనును దేవతలునుం జేరి, దీర్ఘంబగు నాయుస్సు నిచ్చెదము; నీవుమంగళమును బొందుము;నీకుమంగళమగుఁగాక; సుఖముగాఁబొమ్ము, అని,బ్రహ్మదేవుండువిశ్వామిత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

పితామహవచ శ్శ్రుత్వా సర్వేషాం చ దివౌకసామ్
కృత్వా ప్రణామం ముదితో వ్యాజహార మహామునిః. ౨౧

టీక॥ మహామునిః=పూజ్యుఁడైనమునియగువిశ్వామిత్రుండు;పితామహవచః=బ్రహ్మదేవునిమాటను; దివౌకసాం=దేవతలయొక్క; సర్వేషాంచ= అందఱియొక్కయు; వచః(అధ్యాహృతము)=మాటను; శ్రుత్వా=విని; ముదితః=సంతసించినవాఁడై; ప్రణామం=నమస్కారమును;కృత్వా=చేసి; వ్యాజహార=చెప్పెను.

విశ్వామిత్రమహాముని,బ్రహ్మదేవుండును దేవతలును జెప్పినమాటవిని,సంతసించి,వారికినమస్కారము చేసి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

బ్రాహ్మణ్యం యది మే ప్రాప్తం దీర్ఘ మాయు స్తథైవచ
ఓంకారశ్చ వషట్కారో వేదాశ్చ వరయంతు మామ్. ౨౨

టీక॥ మే=నాకు;బ్రాహ్మణ్యం=బ్రాహ్మణత్వమును; తథైవచ=అలా

గే; దీర్ఘం= అధికమయిన; ఆయుః=ఆయుస్సును; ప్రాప్తంయది=పొందఁబడెనేని; ఓంకారశ్చ=ఓం,అనునదియును;వషట్కారః=వషట్, అను నదియును; వేదాశ్చ=వేదంబులును;మాం=నన్ను;వరయంతు=వరింపుఁగాక.

నాకుబ్రాహ్మణత్వము దీర్ఘాయువును గల్గునేని, ఓంకారమును వషట్కారమునువేదంబులును నేను మఱియొకరికిఁజెప్పుటకును యాగమునందుయాజనంబున వినియోగించుటకును,దగువాఁడనగుదుఁగాక. అని, తాత్పర్యము.

క్షత్రవేదవిదాం శ్రేష్ఠో బ్రహ్మవేదవిదామపి
బ్రహ్మపుత్రో వసిష్ఠో మా మేవం వదతు దేవతాః. ౨౩

టీక॥ దేవతాః=దేవతలారా! క్షత్రవేదవిదాం = క్షత్రియులకు యోగ్యములయిన వేదముల నెఱింగినవారిలోను; బ్రహ్మవేదవిదామపి=బ్రాహ్మణులకుయోగ్యములయిన వేదముల నెఱింగినవారిలోను; శ్రేష్ఠః=మేటియయినవాఁడును;బ్రహ్మపుత్రః= బ్రహ్మదేవునికొడుకునగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు; మాం=నన్నుఁగూర్చి;ఏవం=ఇట్లు; వదతు=చెప్పుఁగాక.

దేవతలారా! క్షత్రియులకు యోగ్యంబులగువేదంబుల నెఱింగిన వారిలోనుబ్రాహ్మణులకుయోగ్యంబులగు వేదంబుల నెఱింగిన వారిలోను శ్రేష్ఠుండును బ్రహ్మదేవునికుమారుండునైయుండువసిష్ఠుండు, మీరు చెప్పినట్లు,నన్నుఁగూర్చి, "బ్రాహ్మణుఁడు" అని,చెప్పవలయును.

అని, తాత్పర్యము.

యద్యయం పరమః కామః కృతో యాంతు సురర్షభాః

టీక॥అయం=ఈ;పరమః=ముఖ్యమయిన; కామః=కోర్కె;కృతో యది= చేయఁబడెనేని; సురర్షభాః = దేవతాశ్రేష్ఠులు; యాంతు=పోవుదురుగాక.

నాకుముఖ్యముగానుండు యీ కోర్కె నెఱవేర్చితిరేని దేవతలందఱు వెళ్లవచ్చును. అని, తాత్పర్యము.

తతః ప్రసాదితో దేవై ర్వసిష్ఠో జపతాం వరః. ౨౪
సఖ్యం చకార బ్రహ్మర్షి రేవ మస్త్వితిచా బ్రవీత్

టీక॥తతః=అంత; జపతాం=జపము సేయువారిలో; వరః=శ్రేష్ఠుఁడును; బ్రహ్మర్షిః=బ్రాహ్మణుండును ఋషియునగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు; దేవైః=వేల్పులచేత; ప్రసాదితః = సంతోషపఱుపఁబడిన వాఁడై; సఖ్యం=స్నేహమును; చకార=చేసెను. "ఏవం=ఇట్లు; అస్తు=అగుఁగాక;" ఇతిచ=అనియు; అబ్రవీత్=చెప్పెను.

అంత, జపము సేయు వారిలో శ్రేష్ఠుండును బ్రహ్మర్షి యునగు వసిష్ఠుండు, దేవతల చేసంతోషపఱుపంబడి, విశ్వామిత్రునితో సఖ్యంబు గావించి, "దేవతలు చెప్పినట్లేయగుఁగాకని, చెప్పెను. అని, తాత్పర్యము.

బ్రహ్మర్షి స్త్వం న సందేహ స్సర్వం సంపత్స్యతే తవ. ౨౫
ఇత్యుక్త్వా దేవతాశ్చాపి సర్వా జగ్ము ర్యథాగతమ్

టీక॥త్వం=నీవు; బ్రహ్మర్షిః=బ్రహ్మర్షివి; సందేహః=సందియము; న=లేదు; సర్వం=అన్నియును; తవ=నీకు; సంపత్స్యతే=కలుగును; ఇతి=అని; ఉక్త్వా=చెప్పి; దేవతాశ్చాపి=దేవతలును; సర్వాః=అందఱును; యథాగతం=వచ్చినట్లు; జగ్ముః=పోయిరి.

నీవు బ్రహ్మర్షివి, ఇందుకుసందియంబు లేదు, బ్రహ్మర్షికింగల సధికారములన్నియు నీకునుం గలుగు; అని, చెప్పి, దేవతలందఱును, వచ్చినట్లు, పోయిరి.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రోపి ధర్మాత్మా లబ్ధ్వా బ్రాహ్మణ్య ముత్తమమ్
పూజయామాస బ్రహ్మర్షిం వసిష్ఠం జపతాం వరమ్

టీక॥ధర్మాత్మా=ధర్మబుద్ధిగల; విశ్వామిత్రోపి=విశ్వామిత్రుఁడును; ఉత్తమం=శ్రేష్ఠమయిన; బ్రాహ్మణ్యం = బ్రాహ్మణత్వమును; ల




ప్య=పొంది; జపతాం=జపముసేయువారలలో; వరం=శ్రేష్ఠుడును; బ్రహ్మర్షిం=బ్రాహ్మణుండును ఋషియునగు; వసిష్ఠం=వసిష్ఠుని; పూజయామాస=పూజించెను.

ధర్మాత్ముండగువిశ్వామిత్రుండును, ఉత్తమంబగుబ్రాహ్మణ్యంబునొంది, మునిశ్రేష్ఠుండునుబ్రహ్మర్షియునగువసిష్ఠునింబూజించెను.

అని, తాత్పర్యము.

కృతకామో మహీం సర్వాం చచార తపసి స్థితః

టీక॥ అయం (అధ్యాహృతము)=ఈవిశ్వామిత్రుఁడు; కృతకామః = చేయఁబడినకోర్కెగలవాఁడై; తపసి=తపస్సునందు; స్థితః=ఉన్నవాఁడై; మహీం = భూమిని; సర్వాం=అంతను; చచార=తిరిగెను.

ఈ విశ్వామిత్రుండిట్లు తనకోరికఁబొంది, తపస్సుసేయుచు, భూమియంతయుందిరిగెను.

అని, తాత్పర్యము.

ఈయొకటియునశ్లోకమువ్యాఖ్యాతలచే నుదాహరింపఁబడకుండెనను, మూలంబునఁగానుపట్టుటంజేసి, లెక్కింపక, వ్యాఖ్యాతంబయ్యె.

ఏవం త్వనేన బ్రాహ్మణ్యం ప్రాప్తం రామ మహాత్మనా. ౨౬

టీక॥ రామ=రామఁడా! మహాత్మనా= పూజ్యమైనస్వభావముగలః; అనేన=ఈవిశ్వామిత్రునిచేత; ఏవంతు=ఇట్లు; బ్రాహ్మణ్యం= బ్రాహ్మణత్వము; ప్రాప్తం = పొందఁబడినది.

రామఁడా! మహాత్ముండగునీవిశ్వామిత్రుండు, ఈప్రకారముగనే, బ్రాహ్మణ్యంబునొందెను.

అని, తాత్పర్యము.

ఏష రామ మునిశ్రేష్ఠ ఏష విగ్రహవాం స్తపః
ఏష ధర్మపరో నిత్యం వీర్యస్యైష పరాయణమ్. ౨౭

టీక॥ రామ = రామఁడా! ఏషః=ఈవిశ్వామిత్రుఁడు; మునిశ్రే




ష్ఠః= మునులలో మేటియయినవాఁడు; ఏషః = ఈవిశ్వామిత్రుఁడు; విగ్రహవాన్ = ఆకారముగల; తపః=తపస్సు; ఏషః= ఈవిశ్వామిత్రుఁడు; నిత్యం=ఎల్లప్పుడును; ధర్మపరః= ధర్మమునందాసక్తుఁడు; ఏష=ఈవిశ్వామిత్రుఁడు; వీర్యస్య=పరాక్రమమునకు; పరాయణం=ముఖ్యస్థానము.

రామునుఁడా! ఈవిశ్వామిత్రుఁడు మునులలో శ్రేష్ఠుఁడు; ఇతండు, ఆకారంబు నొందినతపస్సనందగు, ఇతండు, ఎప్పుడును ధర్మమునే సేయువాఁడు; ఇతండు, మహాపరాక్రమశాలి; అని, శతానందుఁడు, రామునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజా విరరామ ద్విజోత్తమః

టీక॥ మహాతేజాః=అధికమయినప్రభావముగల ; ద్విజోత్తమః= బ్రాహ్మణశ్రేష్ఠుండగు శతానందుఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; విరరామ=ఊరకుండెను.

మహాతేజుండును బ్రాహ్మణశ్రేష్ఠుండునగు శతానందుండు రామున కట్లు చెప్పి, యంతనూరకుండెను. అని, తాత్పర్యము.

శతానందవచ శ్శ్రుత్వా రామలక్ష్మణసన్నిధౌ. ౨౮
జనకః ప్రాంజలి ర్వాక్య మువాచ కుశికాత్మజమ్

టీక ॥ రామలక్ష్మణసన్నిధౌ= రామునియొక్కయు లక్ష్మణునియొక్కయుసమీపమునందు; శతానందవచః=శతానందునిమాటను; శ్రుత్వా=విని; జనకః = జనకుఁడు; ప్రాంజలిః= మంచిచేమోడ్పులుగలవాఁడై; కుశికాత్మజం=విశ్వామిత్రునిం గూర్చి; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

రామలక్ష్మణులసమీపంబున, శతానందుఁడు చెప్పినమాటవిని, జనకుండు, చేతులుమొగిడ్చి, విశ్వామిత్రునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ధన్యోస్మ్యనుగృహీతోస్మి యస్య మే మునిపుంగవ. ౨౯

యజ్ఞం కాకుత్థ్ససహితః ప్రాప్తవా నసి ధార్మిక

టీక॥ ధార్మిక=ధర్మమునాచరించునట్టి; మునిపుంగవ=మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! త్వం (అధ్యాహృతము)=నీవు; కాకుత్థ్ససహితః=కకుత్థ్సవంశంబునంబుట్టిన రామలక్ష్మణులతోఁ గూడినవాఁడవై; యస్య=ఏ, మే = నాయొక్క; యజ్ఞం=యాగమునుఁగూర్చి; ప్రాప్తవాన్=వచ్చినవాఁడవు; అసి=అగుచున్నానో; సః అహం (అధ్యాహృతము)=అట్టి నేను; ధన్యః=పుణ్యవంతుండను; అస్మి=అగుచున్నాను. అనుగృహీతః=అనుగ్రహింపఁబడినవాఁడను; అస్మి=అగుచున్నాను.

ధార్మికుండవు మునిశ్రేష్ఠుండవునగు విశ్వామిత్రుఁడా, నీవు, కాకుత్థ్సవంశంబునంబుట్టిన రామలక్ష్మణులంగూడి, నాయాగంబునకువచ్చినావు, కావున, నేనుధన్యుండను అనుగ్రహింపఁబడినవాఁడను అగుచున్నాను. అని, తాత్పర్యము.

పాలితో హం త్వయా బ్రహ్మన్ దర్శనేన మహామునే. ౩౦

టీక ॥ మహామునే=పూజ్యుఁడయినమునివగు; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవయినవిశ్వామిత్రుఁడా! అహం=నేను; త్వయా=నీచేత; దర్శనేన=చూచుటచేత; పాలితః=రక్షింపఁబడినవాఁడను.

బ్రాహ్మణుండవగు విశ్వామిత్ర మహామునీ! నీవుదర్శనం బొసఁగినన్నుఁ బాలించితివి. అని, తాత్పర్యము.

విశ్వామిత్ర మహాభాగ బ్రహ్మర్షీణాం వరోత్తమ
గుణా బహువిధాః ప్రాప్తా స్తవ సందర్శనా న్మయా. ౩౧

టీక॥ బ్రహ్మర్షీణాం=బ్రహ్మర్షులలో; వరోత్తమ=శ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడవయిన; మహాభాగ=పూజ్యమయినభాగ్యముగల; విశ్వామిత్ర=విశ్వామిత్రుఁడా! తవ=నీయొక్క; సందర్శనాత్ = చూచుటవలన;

మయా=నాచేత, బహువిధాః = పలుతెఱంగులయిన; గుణాః=గుణములు; ప్రాప్తాః=పొందఁబడినవి.

బ్రహ్మర్షులలో నుత్తమోత్తముఁడవు, మహాభాగుండవగు విశ్వామిత్రుఁడా! నిన్నుఁజూచుటవలన, నాకుబహుగుణంబులు ప్రాప్తించినవి. అని, తాత్పర్యము.

ఇచ్చట, బూర్వార్థము, వ్యాఖ్యానంబులందుదహరింపకున్నందున, లెక్కింపఁబడదయ్యె.

విస్తరేణ చ తే బ్రహ్మన్ కీర్త్యమానం మహత్తపః. ౩౧
శ్రుతం మయా మహాతేజో రామేణ చ మహాత్మనా

టీక॥ మహాతేజః=అధికమయిన ప్రభావముగల; బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవయిన విశ్వామిత్రుఁడా! విస్తరేణచ= అతిశయముచేతను; కీర్త్యమానం=పొగడఁబడుచున్న; మహత్=గొప్పదగు; తే= నీయొక్క; తపః=తపస్సు; మయా=నాచేతను; మహాత్మనా=పూజ్యస్వభావముగల; రామేణచ=రామునిచేతను; శ్రుతం=వినఁబడినది.

మహాతేజుండవు బ్రాహ్మణుండవునగువిశ్వామిత్రుఁడా! మిక్కిలి యుఁ గొనియాడంబడుచున్న నీమహాతపస్సును, నేనునుమహాత్ముండగు రాముఁడునువింటిమి.

అని, తాత్పర్యము.

సదస్యైః ప్రాప్య చ సదః శ్రుతాస్తే బహవో గుణాః. ౩౨

టీక॥సదః=సభను; ప్రాప్య=పొంది; స్థితైః(అధ్యాహృతము)=ఉన్నట్టి; సదస్యైశ్చ=సభికులచేతను; తే = నీయొక్క; బహవః=పెక్కులయిన; గుణాః=గుణములు; శ్రుతాః=వినఁబడినవి.

సభకువచ్చియున్నసభికులునునీ పెక్కుగుణంబులనాలకించిరి.

అని, తాత్పర్యము.

అప్రమేయం తపస్తుభ్య మప్రమేయం చ తే బలమ్
అప్రమేయా గుణాశ్చైవ నిత్యం తే కుశికాత్మజ. ౩౩

పితామహస్య చ యథా యథా చైవ హ్యుమాపతేః

టీక॥ కుశికాత్మజ=విశ్వామిత్రుఁడా! పితామహస్యచయథా=బ్రహ్మదేవునియొక్కవలెను; ఉమాపతేర్యథా చైవహి= శివునియొక్కవలెను; తుభ్యం= (షష్ఠ్యర్థమందుఁజతుర్థి) నీయొక్క; తపః=తపస్సు; అప్రమేయం=లెక్కింపరానిది. తే=నీయొక్క; బలంచ=లావును; అప్రమేయం=లెక్కింపరానిది. తే=నీయొక్క; సత్త్వం = ఎల్లస్వభావమును; గుణాశ్చైవ=గుణములును; అప్రమేయాః=లెక్కింపఁగూడనివి.

విశ్వామిత్రుఁడా! బ్రహ్మదేవునియు శివునియు తపోబల గుణంబులట్లు, నీతపస్సును, బలంబును, గుణంబులును, ఎల్లస్వభావమును, "ఇంత" అని లెక్కింపనలవిగావు.

అని, తాత్పర్యము.

ఇచ్చట, "పితామహస్య" అనునదిమొదలుగాఁ గలయర్ధశ్లోకము, వ్యాఖ్యానంబుల నుదాహరింపకుండుటం జేసి, లెక్కింపఁబడదయ్యె.

తృప్తిరాశ్చర్యభూతానాం కథానాం నాస్తి మే విభో

టీక॥ విభో= ఒడయుఁడవైనవిశ్వామిత్రుఁడా! ఆశ్చర్యభూతానాం=అచ్చెరువయిన, కథానాం=కతలయొక్క; శ్రవణే(అధ్యాహృతము)=వినుటయందు; తృప్తిః=చాలుననుట; మే=నాకు; నాస్తి=కలుగదయ్యె.

ఒడయుఁడవైనవిశ్వామిత్రుఁడా! ఆశ్చర్యములుగానుండునీకథలెంతవినినం "జాలు" ననియే తోఁచ దయ్యె. అని, తాత్పర్యము.

కర్మకాలో మునిశ్రేష్ఠ లంబతే రవిమండలమ్. ౩౪

టీక॥ మునిశ్రేష్ఠ=మునులలోమేటివగువిశ్వామిత్రుఁడా! ఏషః (అధ్యాహృతము) = ఇది; కర్మకాలః= కర్మముచేయవలసినకాలము. రవిమండలం= సూర్యమండలము; లంబతే=వంగుచున్నది.

మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! సూర్యాస్తమయముకాఁబోవు

చున్నదికాన, నేను, సాయంకాలము నందుఁజేయవలయు కర్మలంబులుఁ జేయఁబోయెదను.

అని, తాత్పర్యము.

శ్వః ప్రభాతే మహాతేజో ద్రష్టు మర్హసి మాం పునః

టీక॥ మహాతేజః = అధికమయిన ప్రభావముగల విశ్వామిత్రుఁడా! శ్వః = రేపు; ప్రభాతే = ప్రాతఃకాలమునందు; మాం = నన్ను; పునః = మఱల; ద్రష్టుం = చూచుటకు; అర్హసి = తగుదువు.

మహాప్రభావుండవగు విశ్వామిత్రుఁడా! రేపు ప్రాతఃకాలంబునన న్నుమఱలంజూడుము.

అని, తాత్పర్యము.

స్వాగతం తపతాం శ్రేష్ఠ మా మనుజ్ఞాతు మర్హసి. ౩౫

టీక॥ తపతాం = తపస్సు చేయువారలలో; శ్రేష్ఠ = మేటివగు విశ్వామిత్రుండా! స్వాగతం = సుఖముతోడిరాక; అస్తు = (అధ్యాహృతము) అగుఁగాక. మాం = నన్ను; అనుజ్ఞాతుం = అనుమతించుటకు; అర్హసి = తగుదువు.

తపస్సు సేయువారలలో శ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! నీకు స్వాగతమగుఁగాక; నాకనుజ్ఞయిమ్ము. అని, జనకుండు, విశ్వామిత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము

ఏవ ముక్తో మునివరః ప్రశస్య పురుషర్షభమ్
విససర్జా శు జనకం ప్రీతం ప్రీతమనా స్తదా. ౩౬

టీక॥ తదా = అప్పుడు; మునివరః = మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుఁడు; ఏవం = ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; ప్రీతమనాః = సంతసించినమనస్సుగలవాఁడై; పురుషర్షభం = పురుషశ్రేష్ఠుఁడును; ప్రీతం = సంతసించినవాఁడునగు; జనకం = జనకుని; ప్రశస్య = కొనియాడి; ఆశు = శీఘ్రముగా; విససర్జ = విడిచెను.

అప్పుడు, ఇట్లు, జనకుండుచె ప్పఁగా, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు, సంతసించి, యట్ల, సంతసించియున్న పురుషశ్రేష్ఠుండగు జనకునింగొనియాడి, శీఘ్రంబుగాఁబంపెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మునిశ్రేష్ఠం వైదేహో మిథిలాధిపః
ప్రదక్షిణం చకారాశు సోపాధ్యాయ స్సబాంధవః. ౩౭

టీక॥ వైదేహః=విదేహదేశంబునకు రాజయిన; మిథిలాధిపః=మిథిలానగరంబునకుఁ బ్రభువునగు జనకుండు; మునిశ్రేష్ఠం=మునులలో మేటియయిన విశ్వామిత్రునింగూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; ఆశు=శీఘ్రముగా; సోపాధ్యాయః=ఉపాధ్యాయునితోఁ గూడినవాఁడై, సబాంధవః=బంధువులతోఁ గూడినవాఁడై; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; చకార=చేసెను.

ఇట్లు, విదేహదేశమునకు రాజయిన జనకుండు, విశ్వామిత్రునితోఁ జెప్పి, శీఘ్రంబుగా, నుపాధ్యాయుని బంధువులనుం గూడి, యతనికిఁ బ్రదక్షిణంబు చేసెను. అని తాత్పర్యము.

విశ్వామిత్రోపి ధర్మాత్మా సహ రామ స్సలక్ష్మణః
స్వవాట మభిచక్రామ పూజ్యమానో మహర్షిభిః. ౩౮

టీక॥ ధర్మాత్మా=ధర్మబుద్ధి గల; విశ్వామిత్రోపి=విశ్వామిత్రుఁడును; సహ రామః=రామునితోఁ గూడినవాఁడై, సలక్ష్మణః=లక్ష్మణునితోఁ గూడినవాఁడై; మహర్షిభిః=పూజ్యులయిన ఋషులచేత; పూజ్యమానః=పూజింపఁబడుచున్నవాఁడై; స్వవాటం=తన స్థానమునుగూర్చి; అభిచక్రామ=పోయెను.

ధర్మాత్ముండగు విశ్వామిత్రుండును, రామలక్ష్మణులం గూడి, మహర్షులచేఁ బూజింపఁబడుచు, తన విడిదికిఁ బోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

బాలకాండే, పంచషష్టితమస్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, బాలకాండపంచషష్టితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

షట్షష్టితమసర్గప్రారంభః.

తతః ప్రభాతే విమలే కృతకర్మా నరాధిపః
విశ్వామిత్రం మహాత్మాన మాజుహావ సరాఘవమ్. ౧

టీక॥ తతః = అంతట; నరాధిపః = మనుష్యులకుఁ బ్రభువయినజనకుండు; విమలే = స్వచ్ఛమయిన; ప్రభాతే = ప్రాతఃకాలముకాఁగా; కృతకర్మా = చేయఁబడినకర్మములుగలవాఁడై; మహాత్మానం = పూజ్యమయినస్వభావముగల; సరాఘవం = రామలక్ష్మణులతోఁగూడిన; విశ్వామిత్రం = విశ్వామిత్రుని; ఆజుహావ = పిలిపించెను.

అంత, స్వచ్ఛమయినప్రాతఃకాలముకాఁగా, జనకుండు, ప్రాతఃకాలమునందుఁ జేయవలసినకర్మంబులంజేసి, మహాత్ముఁడగు విశ్వామిత్రుని రామలక్ష్మణులను రప్పించెను. అని, తాత్పర్యము.

తమర్చయిత్వా ధర్మాత్మా శాస్త్రదృష్టేన కర్మణా
రాఘవౌ చ మహాత్మానౌ తదా వాక్యమువాచ హ. ౨

టీక॥ ధర్మాత్మా = ధర్మబుద్ధిగలజనకుండు; శాస్త్రదృష్టేన = శాస్త్రమునందుఁజూడఁబడిన; కర్మణా = విధిచేత; తం = ఆవిశ్వామిత్రుని; మహాత్మానౌ = పూజ్యస్వభావముగల; రాఘవౌ చ = రామలక్ష్మణులను; అర్చయిత్వా = పూజించి; తదా = అప్పుడు; వాక్యం = మాటను;

ఉవాచ = చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

ధర్మాత్ముండగు జనకుండు, యథావిధిగ, నా విశ్వామిత్రుని మహాత్ములగు రామలక్ష్మణులనుం బూజించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

భగవన్ స్వాగతం తేఽస్తు కిం కరోమి తవానఘ
భవా నాజ్ఞాపయతు మా మాజ్ఞాప్యో భవతా హ్యహమ్. ౩

టీక॥ భగవన్=మాహాత్మ్యము గల; అనఘ=పాపములేని విశ్వామిత్రుఁడా! తే=నీకు; స్వాగతం=సుఖముతోడి రాక; అస్తు=అగుఁగాక. తవ=నీకు; కిం=దేనిని; కరోమి=చేయుదును? భవాన్=(పూజ్యుఁడవగు) నీవు; మాం=నన్ను; ఆజ్ఞాపయతు=ఆనతిమ్ము. అహం=నేను; భవతా=(పూజ్యుండవగు) నీచేత; ఆజ్ఞాప్యోహి = ఆజ్ఞాపింపఁదగినవాఁడనుగదా!

భగవంతుండవు పాపములేనివాఁడవునగు విశ్వామిత్రుఁడా! నీకు స్వాగతంబగుఁగాక; నీకేమిసేయుదును? నీవు నా కాజ్ఞాపింపుము; నేను నీచే నాజ్ఞాపింపఁదగిన వాఁడనేకదా! అని, జనకుండు విశ్వామిత్రునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్స ధర్మాత్మా జనకేన మహాత్మనా
ప్రత్యువాచ ముని ర్వీరం వాక్యం వాక్యవిశారదః. ౪

టీక॥ ధర్మాత్మా=ధర్మబుద్ధి గలవాఁడును; వాక్యవిశారదః=మాటలయందుఁ బండితుండునగు, సః=ఆ; మునిః=విశ్వామిత్రమహాముని; మహాత్మనా=పూజ్యమయిన స్వభావముగల; జనకేన=జనకునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; వీరం=పరాక్రమశాలియగు జనకునిగూర్చి; వాక్యం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

ధర్మాత్ముండును మాటలాడుటయందుఁ బండితుండునగు నా విశ్వామిత్రమహాముని, మహాత్ముఁడగు జనకునిమాటవిని, వీరుండగు నత

నింజూచి, యిట్లని, బదులు చెప్పెను. అని, తాత్పర్యము.

పుత్రౌ దశరథస్యేమౌ క్షత్రియౌ లోకవిశ్రుతౌ
ద్రష్టుకామౌ ధనుశ్శ్రేష్ఠం యదేతత్త్వయి తిష్ఠతి. ౫

టీక॥ క్షత్రియౌ=క్షత్రియులును; లోకవిశ్రుతౌ=ప్రపంచమునందుఁ బ్రసిద్ధులును; ఇమౌ = ఈ; దశరథస్య=దశరథునియొక్క; పుత్రౌ=కొడుకులైన రామలక్ష్మణులు; యత్=ఏది; త్వయి=నీయందు; తిష్ఠతి=ఉన్నదో; తత్ (అధ్యాహృతము)=ఆ; ఏతత్=ఈ; ధనుశ్శ్రేష్ఠం=విండ్లలో మేటియయిన దానిని; ద్రష్టుకామౌ=చూడనిచ్ఛగించువారలు; భవతః (అధ్యాహృతము)=అగుచున్నారు.

ఈ దశరథుని కొడుకు లిర్వురును క్షత్రియవంశోత్పన్నులు, లోకప్రసిద్ధులు; వీరలు నీయొద్దనుండు శివధనుస్సునఁ జూడఁగోరెదరు.

అని, తాత్పర్యము.

ఏతద్దర్శయ భద్రంతే కృతకామౌ నృపాత్మజౌ
దర్శనా దస్య ధనుషో యథేష్టం ప్రతియాస్యతః. ౬

టీక॥ తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము) = అగుఁగాక. ఏతత్=ఈధనుస్సును; దర్శయ=చూపుము. నృపాత్మజౌ=రాచకొమరులైన రామలక్ష్మణులు; అస్య=ఈ; ధనుషః=వింటియొక్క; దర్శనాత్=చూచుటవలన; కృతకామౌ= చేయఁబడిన కోర్కిగలవారలై; యథేష్టం = యథేష్టంబుగా; ప్రతియాస్యతః=మరలపోయెదరు.

నీకు మంగళమగుఁగాక; ఈధనుస్సునుఁ జూపుము. ఈ రాచకొమారులు, దానింజూచి, తమ కోర్కిం బొంది, యథేష్టంబుగా, మరలపోయెదరు. అని విశ్వామిత్రుఁడు జనకునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు జనకః ప్రత్యువాచ మహామునిమ్

టీక॥ జనకస్తు=జనకుఁడును; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడిన



వాఁడై; మహామునిం = పూజ్యుఁడైన మునియగు విశ్వామిత్రునిగూర్చి; ప్రత్యువాచ = బదులు చెప్పెను.

జనకుండను, విశ్వామిత్రుఁడు చెప్పినమాటవిని, విశ్వామిత్రమహామునిం జూచి, యిట్లని, బదులు చెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రూయతా మస్య ధనుషో యదర్థ మిహ తిష్ఠతి. ౭

టీక॥ ఏతత్ (అధ్యాహృతము) = ఈధనుస్సును; ఇహ = ఇచ్చట; యదర్థం = ఏప్రయోజనముకొఱకు; తిష్ఠతి = ఉన్నదో; అస్య = ఈ; ధనుషః = వింటియొక్క; తత్ (అధ్యాహృతము) = ఆప్రయోజనము; శ్రూయతాం = వినఁబడుఁగాక.

ఈ ధనువిచ్చట నెందుకున్నదో, ఆప్రయోజనమును జెప్పెద, వినుండు. అని, తాత్పర్యము.

దేవరాతఇతి ఖ్యాతో నిమే ష్షష్ఠో మహీపతిః
న్యాసోఽయం తస్య భగవ& హస్తే దత్తో మహాత్మనా. ౮

టీక॥ భగవ& = మాహాత్మ్యముగల విశ్వామిత్రుఁడా! నిమేః = నిమిచక్రవర్తికి; షష్ఠః = ఆఱవవాఁడైన; దేవరాతఇతి = దేవరాతుండని; ఖ్యాతః = ప్రసిద్ధుఁడగు; మహీపతిః = రాజు; ఆసీత్ = (అధ్యాహృతము) ఉండెను; తస్య = ఆదేవరాతునియొక్క; హస్తే = చేతియందు; మహాత్మనా = అధికమయినప్రభావముగల యీశ్వరునిచేత; అయం = ఈధనుస్సు; న్యాసః = నిక్షేపముగా; దత్తః = ఇవ్వఁబడినది.

భగవంతుండవగువిశ్వామిత్రుఁడా! నిమిచక్రవర్తికాఱవపురుషుఁడు దేవరాతుండనురాజొకండుండెను; శివుండీధనుస్సును, అతనిచేతికి, నిక్షేపమునుంచుకొనుటకై, యిచ్చెను. అని, తాత్పర్యము.

దక్షయజ్ఞవధే పూర్వం ధను రాయమ్య వీర్యవా&
రుద్రస్తు త్రిదశా& రోషా త్సలీల మిద మబ్రవీత్. ౯



టీక॥పూర్వం=మున్ను;దక్షయజ్ఞవధే= దక్షునియాగముధ్వంసము సేయుటయందు;వీర్యవాన్=పరాక్రమముగల; రుద్రస్తు = శివుఁడు; రోషాత్=కోపమువలన;ధనుః=విల్లును;ఆయమ్య=ఆకర్షించి; త్రిదశాన్=దేవతలంగూర్చి;సలీలం=విలాసముతోఁగూడునట్లుగ; ఇదం=ఈమాటను;అబ్రవీత్=చెప్పెను.

మున్ను,దక్షునియాగమునుధ్వంసముసేయుకాలమునందు,పరాక్రమశాలియగుశివుండు, ధనుస్సునాకర్షించి,కోపంబున, దేవతలంబూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

యస్మా ద్భాగార్థినో భాగా న్నాకల్పయత మేసురాః
వరాంగాణి మహార్హాణి ధనుషా శాతయామి వః. ౧౦

టీక॥సురాః=దేవతలారా!యస్మాత్=ఏకారణమువలన; భాగార్థినః= హవిర్భాగమునుగోరునట్టి; మే=నాకు; భాగాన్=హవిర్భాగములను; నాకల్పయత=కలిగింపరైతిరో; తస్మాత్(అధ్యాహృతము)=ఆకారణమువలన;వః=మీయొక్క; మహార్హాణి = శ్రేష్ఠములయిన;వరాంగాణి=శిరంబులను; ధనుషా=వింటిచేత; శాతయామి = నఱకెదను.

దేవతలారా! యాగమునందు, నేను హవిర్భాగమునుగోరఁగా, నాకుభాగమునుగలిగింపరైతిరి,కావున, శ్రేష్ఠంబులగుమీశిరంబుల, ధనువుచే,ఛేదించెదను. అని,శివుఁడు దేవతలతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతో విమనస స్సర్వే దేవా వై మునిపుంగవ
ప్రసాదయంతి దేవేశం తేషాం ప్రీతో భవ ద్భవః. ౧౧

టీక॥మునిపుంగవ=మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా!తతః=అటుపిమ్మట; దేవాః = దేవతలు;సర్వే వై=అందఱునే;విమనసః= దుఃఖమునొందినవారలై; దేవేశం=దేవతలకుఁబ్రభువయినశివుని; ప్రసాద

యంతి=(భూతార్థమందులట్) సంతోషపడుచిరి. భవః=శివుఁడు; తేషాం=ఆదేవతలకు; ప్రీతః=సంతసించినవాఁడు; అభవత్ = అయ్యెను.

మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! అంత, దేవతలందఱును దుఃఖంబునొంది, శివునిసంతోషపఱచిరి; శివుండునువారలవిషయమయి, ప్రీతినొందెను. అని, తాత్పర్యము.

ప్రీతియుక్త స్స సర్వేషాం దదౌ తేషాం మహాత్మనామ్

టీక॥సః=ఆశివుఁడు; ప్రీతియుక్తః= సంతోషముతోఁగూడినవాఁడై; మహాత్మనాం= పూజ్యమయినస్వభావముగల; తేషాం=ఆదేవతలకు; సర్వేషాం=అందఱకును; తత్ (అధ్యాహృతము)= ఆధనుస్సును; దదౌ=ఇచ్చెను.

శివుండు సంతోషము నొంది, యాధనుస్సును, దేవతలకందఱకును, ఇచ్చెను. అని, తాత్పర్యము.

త దేత ద్దేవదేవస్య ధనూరత్నం మహాత్మనః. ౧౨

న్యాసభూతం తదా న్యస్త మస్మాకం పూర్వకే విభో

టీక॥విభో=ఒడయుఁడవయినవిశ్వామిత్రుఁడా! మహాత్మనః=అధికమయినప్రభావముగల; దేవదేవస్య= దేవతలకును దేవుఁడయినయీశ్వరునియొక్క; తత్=ఆ; ఏతత్=ఈ; ధనూరత్నం = ధనుశ్శ్రేష్ఠము; న్యాసభూతం = నిక్షేపరూపముగా; అస్మాకం=మాయొక్క; పూర్వకే= పూర్వపురుషుఁడయినదేవరాతునియందు; తదా = అప్పుడు; దేవైః(అధ్యాహృతము) = దేవతలచేత; న్యస్తం=ఉంచఁబడినది.

ఒడయుఁడవయినవిశ్వామిత్రుఁడా! మహాత్ముండును దేవదేవుండునగు శివునిదయినయట్టియాధనుస్సును, మునుపు, మాపూర్వపురుషుఁడయిన దేవరాతునకు, దేవతలొసంగిరి. అని, తాత్పర్యము.

అథ మే కృషతః క్షేత్రం లాంగలా దుత్థితా మయా. ౧౩

క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుతా

టీక॥ అథ=అటుపిమ్మట; మే= నేను; క్షేత్రం=యాగభూమిని; కృషతః = దున్నుచుండఁగా; లాంగలాత్ =నాఁగలివలన; కన్య(అధ్యాహృతము)=పడుచు; ఉత్థితా=లేచినది. క్షేత్రం=యాగభూమిని; శోధయతా= పరిశుద్ధము సేయుచున్న; మయా=నాచేత; లబ్ధా=పొందఁబడిన, గనుక నే; సా(అధ్యాహృతము)=ఆపడుచు; నామ్నా=పేరుచేత; సీతేతి=సీతయని(నాఁగటిచాలునం బుట్టినది); విశ్రుతా= ప్రసిద్ధ నొందినది.

అంత, నేను, యాగము సేయుటకై, భూమి దున్నుచుండఁగా, నాఁగలివలన నొక కన్యపుట్టినది; అది, నేను యాగభూమిని శోధింపుచుండఁగా, నాఁగటిచాలునం బుట్టినది, కావున, "సీత" యని ప్రసిద్ధి నొందినది.

అని, తాత్పర్యము.

భూతలా దుత్థితా సాతు వ్యావర్ధత మమాత్మజా. ౧౪

టీక॥ భూతలాత్=నేలనుండి; ఉత్థితా=పుట్టిన; సాతు= ఆసీతయును; మమ=నాయొక్క; ఆత్మజా= కొమారితెగా; వ్యావర్ధత=వృద్ధిఁబొందినది.

ఇట్లు, భూమివలనం బుట్టిన యీ సీతను, నా కొమారితెగా నుంచికొని, పెంచితిని. అని, తాత్పర్యము.

వీర్యశుల్కేతి మే కన్యా స్థాపితే య మయోనిజా

టీక॥ మే=నాయొక్క; ఇయం= ఈ; అయోనిజా=యోనివలనం బుట్టనట్టి; కన్యా=కొమార్తె; వీర్యశుల్కా=పరాక్రమమే వెలగాఁగలది; ఇతి=అని; స్థాపితా=ఉంచఁబడినది

ఈ కూఁతురు, అయోనిజ కావున, వీర్యవంతునకే యివ్వఁదగినదని యెంచి, యెవ్వరికి నివ్వక యే, యుంచితిని.

అని, తాత్పర్యము.

భూతలా దుత్థితాం తాంతు వర్ధమానాం మమాత్మజామ్. ౧౫

వరయామాసు రాగమ్య రాజానో మునిపుంగవ

టీక ॥ మునిపుంగవ=ముని శ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! భూతలాత్=నేలనుండి; ఉత్థితాం=పుట్టినదియును; వర్ధమానాం=వృద్ధిఁబొందుచున్నదియును; మమ=నాయొక్క; ఆత్మజాం=కూతురునగు; తాంతు=ఆసీతను; రాజానః=రాజులు; ఆగమ్య=వచ్చి; వరయామాసుః=వరించిరి.

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! రాజులనేకులువచ్చి, నేలంబుట్టి, వర్ధిల్లుచున్ననాకొమార్తెయగుసీత "నమ్మ"ని యడిగిరి.

అని, తాత్పర్యము.

తేషాం వరయతాం కన్యాం సర్వేషాం పృథివీక్షితామ్. ౧౬
వీర్యశుల్కేతి భగవన్ న దదామి సుతామహమ్

టీక॥భగవన్=మాహాత్మ్యముగలవిశ్వామిత్రుఁడా! అహం=నేను; కన్యాం=పడుచును; వరయతాం=వరించునట్టి; తేషాం=ఆ; పృథివీక్షితాం = రాజులకు; సర్వేషాం = అందఱకును; "వీర్యశుల్కా"=పరాక్రమమే వెలగాఁగలది; ఇతి=అని; ఉక్త్వా=(అధ్యాహృతము) చెప్పి; సుతం=కూఁతురును; నదదామి = (భూతార్థమందు లట్)ఇవ్వనైతిని.

భగవంతుండవగువిశ్వామిత్రుఁడా! ఇట్లుకన్యనువరింపవచ్చినరాజులకందఱకును, "ఈకన్యక పరాక్రమముగలవానికేయివ్వఁదగినది" అని, చెప్పి, కొమార్తెనివ్వనైతిని.

అని, తాత్పర్యము.

తత స్సర్వే నృపతయ స్సమేత్య మునిపుంగవ. ౧౭
మిథిలా మభ్యుపాగమ్య వీర్యజిజ్ఞాసవ స్తదా

టీక॥మునిపుంగవ=మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! తతః = అటుపిమ్మట; నృపతయః=రాజులు; సర్వే=అందఱును; సమేత్య=చేరి;



మిథిలాం = మిథిలను, అభ్యాగమ్య=పొంది; తదా=అప్పుడు; వీర్యజిజ్ఞాసవః= పరాక్రమమును తెలిసికొనఁగోరువారలు; అభవన్ (అధ్యాహృతము)= ఆయిరి.

అంత రాజులందఱునుం జేరి, మిథిలకువచ్చి, కన్యఁబొందుటకెట్టిపరాక్రమంబుగావలయునో, దానిం దెలియఁగోరిరి.

అని, తాత్పర్యము.

తేషాం జిజ్ఞాసమానానాం వీర్యం ధను రుపాహృతమ్. ౧౭

టీక॥ వీర్యం=పరాక్రమమును; జిజ్ఞాసమానానాం=తెలియఁగోరుచున్న; తేషాం(కృతే)=వారలకొఱకుఁగాను; ధనుః=విల్లు; ఉపాహృతం= తేఁబడినది.

ఇట్లు, కన్నియకువిలువయయిన పరాక్రమంబు తెలియంగోరిన యా రాజులకు, శివధనువుం దెచ్చిచూపితిని. అని, తాత్పర్యము.

న శేకు ర్గ్రహణే తస్య ధనుష స్తోలనే పివా

టీక॥ తే(అధ్యాహృతము)=ఆ రాజులు; తస్య=ఆ; ధనుషః=వింటియొక్క; గ్రహణే=ఎత్తుటయందును; తోలనేపివా=కదలించుటయందైనను; న శేకుః=చాలరైరి.

ఆరాజులు, ఆధనస్సును, ఎత్తుటకుఁగాని, ఇట్టటుఁకగలించుటకుఁగాని, శక్తులు కారైరి.

అని, తాత్పర్యము.

తేషాం వీర్యవతాం వీర్య మల్పం జ్ఞాత్వా మహామునే. ౧౮
ప్రత్యాఖ్యాతా నృపతయ స్తన్నిబోధ తపోధన

టీక॥ తపోధన=తపస్సె ధనంబుగాగల; మహామునే= పూజ్యుఁడవయిన మునివగు విశ్వామిత్రుఁడా! వీర్యవతాం=పరాక్రమముగల, తేషాం= ఆ రాజులయొక్క; వీర్యం=పరాక్రమమును; అల్పం=కొంచెముగా; జ్ఞాత్వా= తెలిసికొని; మయా(అధ్యాహృతము)=నాచేత; నృపతయః=






రాజులు; ప్రత్యాఖ్యాతాః=నిరాకరింపఁబడిరి. తత్=అటువెనుక; నిబోధ=తెలిసికొనుము.

తపోధనుండవగు విశ్వామిత్రమహామునీ! పరాక్రమశాలులగు నా రాజుల పరాక్రమంబల్పంబుగాఁ దెలిసికొని, యా రాజుల నేను నిరాకరించితిని, అటువెనుకటి వృత్తాంతంబు వినుము. అని, తాత్పర్యము.

తతః పరమకోపేన రాజానో మునిపుంగవ. ౨౦
న్యరుంధ న్మిథిలాం సర్వే వీర్యసందేహ మాగతాః

టీక॥ మునిపుంగవ=మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! తతః=అంత; రాజానః=రాజులు; సర్వే=అందఱును; వీర్యసందేహ=పరాక్రమమతిశయమయిన సంశయమును; ఆగతాః=పొందినవారలై, పరమకోపేన=అధికమయిన కోపముచేత; మిథిలాం=మిథిలను; న్యరుంధన్=అడ్డగించిరి.

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! అంత రాజులందఱును, పరాక్రమములేనివారనెడు సంశయంబు గలుగుటం జేసి, మిక్కిలి యాఁగ్రోపించి, మిథిల చుట్టును, ముట్టడించిరి. అని, తాత్పర్యము.

ఆత్మాన మవధూతం తే విజ్ఞాయ నృపపుంగవాః. ౨౧
రోషేణ మహతా విష్టాః పీడయ న్మిథిలాం పురీమ్

టీక॥ తే=ఆ; నృపపుంగవాః=రాజశ్రేష్ఠులు; ఆత్మానం=తన్ను; అవధూతం=తిరస్కరింపఁబడినవానిఁగా; విజ్ఞాయ=తెలిసికొని; మహతా=అధికమయిన; రోషేణ=కోపముచేత; ఆవిష్టాః=ఆవేశింపఁబడినవారలై; మిథిలాం=మిథిలయను; పురీం=పట్టణమును; పీడయన్=(అపీడయన్) బాధించిరి.

ఆ రాజులు, నాచే దాము తిరస్కరింపఁబడినట్లెంచికొని, చాలఁగోపంబునొంది, మిథిలా పట్టణంబును ముట్టడించి, పీడగలుగునట్లు చేసిరి. అని, తాత్పర్యము.




తత స్సంవత్సరే పూర్ణే క్షయం యాతాని సర్వశః. ౨౨
సాధనాని మునిశ్రేష్ఠ తతో౽హం భృశదుంఖితః

టీక। మునిశ్రేష్ఠ=మునులలో శ్రేష్ఠుం డయినవిశ్వామిత్రుండా। తతః=అంతః సంవత్సరే = ఏండాది; పూర్ణే= నిండంగా, సాధనాని=ఉపకరణములు; సర్వశః = అంతయును; క్షయం=నాశమును; యాతాని=పొందినవి. తతః=అందువలన; అహం= నేను; భృశదుఃఖితః=మిక్కిలియు దుఃఖము నొందినవాండను; అభవం (అధ్యాహృతము)=అయితిని.

అంత నొకసంవత్సరంబు నిండంగానే, నాదుసైన్యసామగ్రియంత యుండకంగినది ; దానంజేసి, నేను జాలదుఃఖంబు నొందితిని.

అని, తాత్పర్యము.

తతో దేవగణాన్ సర్వాన్ తపసా౽హం ప్రసాదయమ్. ౨౩
దదుశ్చ పరమప్రీతా శ్చతురంగబలం సురాః

టీక॥ తతః=అంతట; అహం= నేను; తపసా=తపస్సుచేత; దేవగణాన్=దేవతాసమూహంబులను; సర్వాన్=అన్నింటిని; ప్రసాదయం (ప్రాసాదయం)= సంతోషపఱిచితిని. సురాశ్చ=దేవతలును; పరమప్రీతాః= మిక్కిలియు సంతసించినవారలై; చతురంగబలం = రథంబులేనుంగులుగుఱ్ఱంబులు కాలిబలమునను నాలుగంగములుంగల సేనను ; దదుః=ఇచ్చిరి.

అంతట, నేను దపంబుగావించి, దేవతలనందఱ సంతోషపఱిచితిని; దేవతలును, జాలసంతోషపడి, నాకుం జతురంగ సేన, నొసంగిరి.

అని, తాత్పర్యము.

తతో భగ్నా నృపతయో హన్యమానా దిశో౽యయుః. ౨౪
అవీర్యా వీర్యసంద్ధా స్సామాత్యాః పాపకర్మణః

టీక॥ పాపకర్మణః(పాపకర్మాణః) = పాపముగలిగించుకార్య

ములుగలవారును; అవీర్యాః=పరాక్రమములేనివారలును; వీర్యసందిగ్ధా = సందేహింపఁబడిన పరాక్రమముగలవారలును; సామాత్యా= మంత్రులతోఁగూడినవారునగు; నృపతయః=రాజులు; తతః=ఆసేనవలన; భగ్నాః=భంగమునొందినవారలయి; హన్యమానాః=కొట్టఁబడుచున్నవారలై; -శః=దిక్కులనుగూర్చి; యయుః=పోయిరి.

పా వీర్యహీనులును, బలపరాక్రమహీనులును సంశయింపఁదగిన పరాక్రమము గలవారలునగు నారాజులు, మంత్రులతో, నాసేనవలన, నవమానపడి, కొట్టఁబడి, దిక్కులకుం బాఱిరి. అని, తాత్పర్యము.

తదేతన్మునిశార్దూల ధనుః పరమభాస్వరమ్. ౨౫.
రామలక్ష్మణయోశ్చాపి దర్శయిష్యామి సువ్రత

టీక॥ సువ్రత= మంచివ్రతంబుగల; మునిశార్దూల = మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా! తత్= ఆ; ఏతత్=ఈ; పరమభాస్వరం= మిక్కిలియునుబ్రకాశించుచున్నట్టి; ధనుః=వింటిని; రామలక్ష్మణయోశ్చాపి=రామలక్ష్మణులకునుగూడ; దర్శయిష్యామి=చూపెదను.

సువ్రతుండవు మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! పరమభాస్వరంబగు, నీధనుస్సును రామలక్ష్మణులకు నుంజూపెదను. అని, తాత్పర్యము.

యద్యస్య ధనుషో రామః కుర్యాదారోపణం మునే. ౨౬.
సుతామయోనిజాం సీతాం దద్యాం దాశరథేరహమ్

టీక॥ మునే=విశ్వామిత్రమహాముని! రామః = రాముఁడు; అస్య= ఈ; ధనుషః=వింటియొక్క; ఆరోపణం=ఎక్కుపెట్టుటను; కుర్యాద్యది=చేయునేని; అహం = నేను; అయోనిజాం= యోనియందుఁ బుట్టనట్టి; సుతాం = కూఁతురయిన; సీతాం=సీతను; దాశరథేః=దశరథునికొడుకైనరామునకు; దద్యాం= ఇత్తును.

తత స్సంవత్సరే పూర్ణే క్షయం యాతాని సర్వశః. ౨౨
సాధనాని మునిశ్రేష్ఠ తతోఽహం భృశదుఃఖితః

టీక॥ మునిశ్రేష్ఠ=మునులలో శ్రేష్ఠుం డయినవిశ్వామిత్రుఁడా! తతః=అంతః సంవత్సరే = పేండాది; పూర్ణే= నిండఁగా, సాధనాని=ఉపకరణములు; సర్వశః = అంతయును; క్షయం=నాశమును; యాతాని=పొందినవి. తతః=అందువలన; అహం= నేను; భృశదుఃఖితః=మిక్కిలియు దుఃఖము నొందినవాఁడను; అభవం (అధ్యాహృతము)=అయితిని.

అంత నొకసంవత్సరంబు నిండఁగానే, నాదుసైన్యసామగ్రియంతయుఁ దఱిఁగినది ; దానం జేసి, నేను జాలదుఃఖంబు నొందితిని.

అని, తాత్పర్యము.

తతో దేవగణాన్ సర్వాన్ తపసాఽహం ప్రసాదయమ్. ౨౩
దదుశ్చ పరమప్రీతా శ్చతురంగబలం సురాః

టీక॥ తతః=అంతట; అహం= నేను; తపసా=తపస్సుచేత; దేవగణాన్=దేవతాసమూహంబులను; సర్వాన్=అన్నింటిని; ప్రసాదయం (ప్రాసాదయం)= సంతోషపఱిచితిని. సురాశ్చ=దేవతలును; పరమప్రీతాః= మిక్కిలియుసంతసించినవారలై; చతురంగబలం = రథంబులేనుంగులుగుఱ్ఱంబులు కాలిబలమునను నాలుగంగములుగల సేనను ; దదుః=ఇచ్చిరి.

అంతట, నేను దపంబు గావించి, దేవతలనందఱు సంతోషపఱిచితిని; దేవతలును, జాలసంతోషపడి, నాకుఁ జతురంగ సేన, నొసంగిరి.

అని, తాత్పర్యము.

తతో భగ్నా నృపతయో హన్యమానా దిశోఽయయుః. ౨౪
అవీర్యా వీర్యసందిగ్ధా స్సామాత్యాః పాపకర్మణః

టీక॥ పాపకర్మణః (పాపకర్మాణః) = పాపముగలిగించుకార్య

జనకుఁడు; సామంతాన్ =మంత్రులను; దివ్యం=స్వర్గమునందుఁబుట్టినదియును; గంధమాల్యవిభూషితం=గంధముచేతను బుష్పమాలికలచేతను అలంకరింపఁబడినదియునగు; ధనుః=విల్లు; ఆనీయతాం=తేఁబడుగాక. ఇతి(అధ్యాహృతము)=అని; వ్యాదిదేశ= ఆజ్ఞాపించెను. "హ" అనునదిపాదపూరణార్థము.

అంత, జనకమహారాజు, మంత్రులంబిలిచి, "గంధమాల్యంబులచే నలంకరింపఁబడినదివ్యంబగుశివధనువుంగొనితెండు" అనియాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

జనకేన సమాదిష్టా స్సచివాః ప్రావిశన్ పురీమ్
తద్ధనుః పురతః కృత్వా నిర్జగ్మః పార్థివాజ్ఞయా. ౩

టీక॥ సచివాః=మంత్రులు; జనకేన=జనకునిచేత; సమాదిష్టాః=ఆజ్ఞాపింపఁబడినవారలై; పురీం=పట్టణమును; ప్రావిశన్= చొచ్చిరి. పార్థివాజ్ఞయా= రాజుపంపుచేత; తత్=ఆ; ధనుః=శివధనుస్సును; పురతః=ముందట; కృత్వా= చేసికొని, ఉంచికొనియనుట; నిర్జగ్మః= బయలువెడలిరి.

మంత్రులిట్లుజనకునిచే నాజ్ఞాపింపఁబడి, పట్టణంబుప్రవేశించి, యొడయుని పంపునంజేసి, శివధనువుంగైకొని, మఱలివచ్చిరి.

అని, తాత్పర్యము.

నృణాం శతాని పంచాశ ద్వ్యాయతానాం మహాత్మనామ్
మంజూషా మష్టచక్రాం తాం సమూహు స్తే కథంచన. ౪

టీక॥ వ్యాయతానాం=పొడవుగానుండువారలును; మహాత్మనాం=అధికమయినబలము గలవారలునగు; నృణాం=పురుషులయొక్క; పంచాశత్=ఏఁబది; శతాని=నూఱులు; అష్టచక్రాం=ఎనిమిదిచక్రంబులుగల; తాం=ఆ; మంజూషాం=పెట్టెయును; సమూహుః=ఈడ్చిరి. తే=ఆయయిదువేలమందియును; కథంచన=అతిప్రయాసముచేత; సమూహుః=(అధ్యాహృతము) ఈడ్చిరి.

పొడవుగలదేహము గలవార

లును మహాబలులునగు నయిదువేల మందిపురుషులు, ఎనిమిదిచక్రములు గల్గిబండివలెనుండు నా పెట్టికనులాగి రి;ఆయయిదువేలమందియు,నతిప్ర యాసంబుననే లాగుచుండిరి.

అని, తాత్పర్యము.

తా మాదాయ తు మంజూషా మాయసీం యత్ర త ద్ధనుః
సురోపమం తే జనక మూచు నృ్రపతిమంత్రిణః. ౫

టీక॥ తే=ఆ; నృపతిమంత్రిణః= రాజుయొక్క మంత్రులు;యత్ర=దే నియందు;తత్=ఆ;ధనుః=విల్లు; అ స్తి(అధ్యాహృతము)= ఉన్నదో; ఆయసీం = ఇనుపదైన; తాం=ఆ; మంజూషాం=పేటికను; ఆదాయ తు = తీసికొనివచ్చియె; సురోప మం=దేవతలతోఁబోల్కిగల; జన కం=జనకునింగూర్చి; ఊచుః= చెప్పిరి.

ఆమంత్రులు ఆశివధనువుంబెట్టి యున్న యినపపెట్టియందిసికొని, దేవతుల్యుండగు జనకమహారాజుం జూచి,యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇదం ధనుర్వరం రాజన్ పూజితం సర్వరాజభిః
మిధిలాధిప రాజేంద్ర దర్శనీయం యదిచ్ఛసి. ౬

టీక॥ మిథిలాధిప=మిథిలకుఁబ్రభువయిన; రాజేంద్ర=రాజశ్రేష్ఠుం డవగు; రాజన్=జనకమహారాజా! యత్=దేనిని;దర్శనీయం=చూపదగినదానిఁగా;ఇచ్ఛసి=కోరుచున్నావో!సర్వరాజభిః= ఎల్లరాజులచేతను;పూజితం = పూజింపఁబడిన; తత్(అధ్యాహృతము)=ఆ;ధనుర్వరం = విండ్లలోశ్రేష్ఠమయినది;ఇదం=ఇదిగో.

మిథిలకుఁబ్రభుండవు రాజశ్రేష్ఠుండవగు జనకమహారాజా ! నీవు రామునకు దేనింజూపఁగోరితివో,సమస్తరాజులచేతనుంబూజింపఁబడినయాధనుశ్శ్రేష్ఠంబు తెచ్చితిమి;ఇదిగో చూడుము. అని, తాత్పర్యము.

తేషా న్నృపో వచ శ్శ్రుత్వా కృతాంజలి రభాషత
విశ్వామిత్రం మహాత్మానం తౌచాభే రామలక్ష్మణౌ. ౭

టీక॥ నృపః=జనకమహారాజు; తేషాం= ఆమంత్రులయొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; కృతాంజలిః=చేయఁబడినచేమోడ్పు గలవాఁడై; మహాత్మానం=పూజ్యమయినస్వభావముగల; విశ్వామిత్రం = విశ్వామిత్రునింగూర్చి; తౌ=ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను; ఉభౌ వ=ఇద్దఱనుంగూర్చి; అభాషత=పలికెను.

జనకుండామంత్రులమాటవిని, చేతులుమొగిడ్చి, మహాత్ముండగు విశ్వామిత్రుని రామలక్ష్మణులనిద్దఱనుంజూచియిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇదం ధనుర్వరం బ్రహ్మన్ జనకై రభిపూజితమ్
రాజభిశ్చ మహావీర్యై రశక్తైః పూరితుం పురా. ౮

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుండవగువిశ్వామిత్రుఁడా! ఇదం=ఈ; ధనుర్వరం = ధనుశ్శ్రేష్ఠము; జనకైః= జనకవంశమునందుఁ బుట్టిన రాజులచేతను; మహావీర్యైః=అధికమయినపరాక్రమముగలవారును; పురా=మున్ను; పూరితుం=ఎక్కుపెట్టుటకు; అశక్తైః = శక్తిలేనట్టి; రాజభిశ్చ = రాజులచేతను; అభిపూజితం= పూజింపఁబడినది.

బ్రాహ్మణుండవగు విశ్వామిత్రుఁడా! ఈధనుస్సు, పూర్వముమావంశస్థులగుజనకులచేతనుదీనింబూరింపఁజాలని మహావీర్యులగు నితర రాజులచేతనుంబూజింపఁబడుచుండినది.

అని, తాత్పర్యము.

నైత త్సురగణా స్సర్వే నాసురా నచ రాక్షసాః
గంధర్వయక్షప్రవరా స్సకిన్నరమహోరగాః. ౯

టీక॥ఏతత్=దీని; సురగణాః=దేవతాసమూహములు; సర్వే=అన్నియును; పూరయితుం=(అధ్యాహృతము)ఎక్కుపెట్టుటకు; శక్తాః=(అధ్యాహృతము) సమర్థములు; న=కావు. అసురాః=అసురులును;

(పూరయితుంశక్తాః=ఎక్కుపెట్టుటకుసమర్థులు;)న=కారు. రాక్షసాశ్చ=రాక్షసులును; న=కారు. సకిన్నరమహోరగాః = కిన్నరులతోడను మహాసర్పంబులతోడనుం గూడిన, గంధర్వయక్షప్రవరాః=గంధర్వులలోను యక్షులలోను శ్రేష్ఠులగువారలు; న=(అధ్యాహృతము)కారు.

దేవతలుగాని యసురులుగాని రాక్షసులుగాని, గంధర్వులుగాని, యక్షులుగాని,కిన్నరులుగాని యురగులుగాని, యీధనువుం బూరింపఁజాలరు. అని, తాత్పర్యము.

క్వ గతి ర్మానుషాణాంచ ధనుషో స్య ప్రపూరణే
ఆరోపణే సమాయోగే వేపనే తోలనేపి వా. ౧౦

టీక॥ అస్య=ఈ;ధనుషః=వింటియొక్క;ప్రపూరణే=వంచుటయందుఁగాని; ఆరోపణే=అల్లెత్రాడు నెక్కించుటయందుఁగాని ; సమాయోగే=బాణముఁగూర్చుటయందు గాని; వేపనే= అల్లెత్రాడునీడ్చుటయందుఁగాని;తోలనేపివా=కదలించుటయందుఁగాని; మానుషాణాం చ=మనుష్యులలోపలను; క్వ=ఎవ్వనియందు; గతిః=శక్తి,స్యాత్ (అధ్యాహృతము)=ఉండును.

దేవాదులకె యిట్లుండగా, నీధనుస్సునువంచుటకుఁగాని,యల్లెత్రాడుమోపెట్టుకుఁగాని , బాణంబుఁగూర్చుటకుఁగాని,అల్లెత్రాడునీడ్చుటకుఁగాని, యిట్టటుకదలించుటకుఁగాని, మనుష్యులలోనెవ్వరునుంజాలరనిసిద్ధంబె. యని, తాత్పర్యము.

త దేత ద్ధనుషాం శ్రేష్ఠ మానీతం మునిపుంగవ
దర్శయై త న్మహాభాగ అనయో రాజపుత్రయోః, ౧౧

టీక॥మునిపుంగవ=మునిశ్రేష్ఠుండవగువిశ్వామిత్రుఁడా!ధనుషాం=విండ్లలో;శ్రేష్ఠం = మేటిదయిన; తత్=అట్టి; ఏతత్=ఈశివధనువు; ఆనీతం=తేఁబడినది. మహాభాగ=పూజ్యంబగు భాగ్యముగలవిశ్వామిత్రుఁడా! ఏతత్=దీని;అనయోః=ఈ; రాజపుత్రయోః=రాచకొమ

రులగు రామలక్ష్మణులకు; దర్శయ = చూపుము.

మునిశ్రేష్ఠుండవగు విశ్వామిత్రుఁడా! విండ్లలో శ్రేష్ఠంబును, ఇదివరకెవ్వరిచేతను మోపిడంగూడనిదియునగు నీ శివధనువు తేఁబడియున్నది; మహాభాగుండవగు విశ్వామిత్రుఁడా! రాచకొమరులగు నీ రామలక్ష్మణులకు దీనింజూపుము. అని, జనకుండు, విశ్వామిత్రునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రస్తు ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్. ౧౨

టీక॥ ధర్మాత్మా = ధర్మబుద్ధిగల; విశ్వామిత్రస్తు = విశ్వామిత్రుఁడును; జనకభాషితం = జనకుని మాటను; శ్రుత్వా = విని; రాఘవం = రామునిఁగూర్చి; "వత్స = బిడ్డఁడవగు; రామ = రాముఁడా! ధనుః = వింటిని; పశ్య = చూడుము." ఇతి = అని; అబ్రవీత్ = చెప్పెను.

ధర్మాత్ముండగు విశ్వామిత్రుండు, జనకుండు చెప్పిన మాటను విని, రామునింజూచి, "రాముఁడా! విల్లు చూడుము." అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

బ్రహ్మర్షే ర్వచనా ద్రామో యత్ర తిష్ఠతి త ద్ధనుః
మంజూషాం తా మపావృత్య దృష్ట్వా ధను రథా బ్రవీత్. ౧౩

టీక॥ రామః = రాముఁడు; బ్రహ్మర్షేః = బ్రహ్మణుండును ఋషియునగు విశ్వామిత్రుని యొక్క; వచనాత్ = మాటవలన; యత్ర = దేనియందు; తత్ = ఆ; ధనుః = విల్లు; తిష్ఠతి = ఉన్నదో; తాం = ఆ; మంజూషాం = పేటికను; అపావృత్య = తెఱచి; ధనుః = వింటిని; దృష్ట్వా = చూచి; అథ = అటుపిమ్మట; అబ్రవీత్ = చెప్పెను.

రాముండు, బ్రహ్మర్షియగు విశ్వామిత్రుని పంపు గైకొని, ఆ ధనువునుంచియుండు పేటికం దెఱచి, ధనువుంజూచి, యంత, విశ్వామిత్రునితో, నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇదం ధనుర్వరం బ్రహ్మన్ సంస్పృశామీహ పాణినా
యత్నవాంశ్చ భవిష్యామి తోలనే పూరణేపివా. ౧౪

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవగు విశ్వామిత్రుఁడా! ఇహ = ఇప్పుడు; ఇదం=ఈ; ధనుర్వరం=ధనుశ్శ్రేష్ఠమును; పాణినా=హస్తముచేత; సంస్పృశామి= తాఁకుచున్నాను. తోలనే=కదలించుటయందును; పూరణేపివా= మోపెట్టుటయందును; యత్నవాంశ్చ= ప్రయత్నముగలవాఁడను; భవిష్యామి=అయ్యెదను.

బ్రాహ్మణుండవగువిశ్వామిత్రుఁడా! ఇప్పుడీధనుశ్శ్రేష్ఠంబును జేతముట్టెదను, మఱియు, దానింగదలించుటకును మోపెట్టుటకునుం బ్రయత్నించెదను. అని, తాత్పర్యము.

బాఢ మిత్యేవ తం రాజా మునిశ్చ సమభాషత

టీక॥ రాజా= జనకమహారాజును; మునిశ్చ= విశ్వామిత్రమహామునియును; తం = ఆరామునింగూర్చి; "బాఢం=మంచిది;" ఇత్యేవ=అనియే; సమభాషత=పలికెను.

జనకమహారాజును విశ్వామిత్రమహామునియును, రామునింజూచి, "మంచిది" అని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

లీలయా స ధను ర్మధ్యే జగ్రాహ వచనా న్మునేః. ౧౫

టీక॥ సః=ఆరాముఁడు; మునేః= విశ్వామిత్రమహామునియొక్క; వచనాత్=మాటవలన; లీలయా=విలాసముచేత; ధనుః=వింటిని; మధ్యే= నడుమను; జగ్రాహ=పట్టుకొనెను.

రాముండు, విశ్వామిత్రునియనుజ్ఞనొంది, ఎంతమాత్రంబును బ్రయాసములేక, లీలతో, నాధనుర్మధ్యంబుఁబట్టుకొనెను.

అని, తాత్పర్యము.

పశ్యతాం నృసహస్రాణాం బహూనాం రఘునందనః
ఆరోపయ త్స ధర్మాత్మా సలీల మివ త ద్ధనుః

టీక॥ బహూనాం = పెక్కులయిన; నృసహస్రాణాం=మనుష్య

లయొక్క-వేలు; పశ్యతాం=చూచుచుండఁగా, ధర్మాత్మా=ధర్మబుద్ధిగల; సః=ఆ; రఘునందనః = రాముఁడు; తత్=ఆ; ధనుః=వింటిని; సలీలమివ =విలాసముతోఁగూడినట్లుగానే; ఆరోపయత్=మోపెట్టెను.

పెక్కు-వేల జనంబులు చూచుచుండఁగా, ధర్మాత్ముండగు నా రాముండు, శివధనువును, ఎంతమాత్రంబును శ్రమంబులేకయె, మోపెట్టెను. అని, తాత్పర్యము.

ఇచ్చట, నుత్తరార్ధంబు, వ్యాఖ్యాతలచే లెక్కింపబడనందున, లెక్కింపఁబడదయ్యె.

ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాస తద్ధనుః. ౧౬

టీక॥ ధర్మాత్మా=ధర్మబుద్ధిగలరాముఁడు; తత్=ఆ; ధనుః=వింటిని; ఆరోపయిత్వా(ఆరోప్య)=మోపెట్టి; పూరయామాస=బాణముతోఁగూర్చెను.

ధర్మాత్ముండగు రాముండు, ఇట్లు మోపెట్టియాశివధనువును బాణముతోఁబూరించెను. అని తాత్పర్యము.

తద్బభంజ ధనుర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః



టీక॥ మహాయశాః=గొప్పకీర్తిగలవాఁడును; నరశ్రేష్ఠః=పురుషులలో మేటియయినవాఁడునగు రాముండు; తత్=ఆ; ధనుః=వింటిని;

మధ్యే=నడుమను; బభంజ= విఱిచెను.

మహాయశుండును బురుషశ్రేష్ఠుండునగు రాముండు, ఆశివధనువును,నడుమను,విఱిచివేసెన.

అని, తాత్పర్యము.

తస్య శబ్దో మహా నాసీ న్నిర్ఘాతసమనిస్వనః. ౧౭
భూమికంపశ్చ సుమహాన్ పర్వతస్యే వ దీర్యతః

టీక॥ తస్య=ఆధనువువిఱుచుటయొక్క; శబ్దః=ధ్వని; మహాన్=గొప్పదియు; నిర్ఘాతసమనిస్వనః=పిడుగుధ్వనితోసమానమయిన ధ్వనియును గా; ఆసీత్=అయినది. పర్వతస్య=కొండ, దీర్యత ఇవ=పగలుచుండునప్పుడువలె; సుమహాన్=మిక్కిలియు నధికమయిన; భూమికంపశ్చ = భూకంపమును; ఆసీత్=(అధ్యాహృతము)కలిగినది.

ఆధనువువిఱుచుటంగలిగినధ్వని, పిడుగుపడుధ్వనింబోలి గొప్పదిగానుండినది, పర్వతంబు పగులునప్పుడుంబోలె నప్పుడు భూమిమిక్కిలియువడంకినది.

అని, తాత్పర్యము.

నిపేతు శ్చ నరా స్సర్వే తేన శబ్దేన మోహితాః. ౧౮
వర్జయిత్వా మునివరం రాజానం తౌ చ రాఘవౌ

టీక॥మునివరం=మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుని; రాజానంచ=జనకమహారాజును; తౌ=ఆ; రాఘవౌ చ=రామలక్ష్మణులను; వర్జయిత్వా=విడిచి; నరాః=మనుష్యులు; సర్వే=అందఱును; తేన=ఆ; శబ్దేన=ధ్వనిచేత; మోహితాః=మూర్ఛిల్లఁ జేయఁ బడినవారలై; నిపేతుః=పడిరి.

మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రుండును జనకమహారాజును రామలక్ష్మణులునుందక్కఁదక్కిననుమనుష్యులందఱును, ఆధ్వనికి, మూర్ఛిల్లి, నేలంబడిరి. అని, తాత్పర్యము.

ప్రత్యాశ్వస్తే జనే తస్మి న్రాజా విగతసాధ్వసః. ౧౯
ఉవాచ ప్రాంజలి ర్వాక్యం వాక్యజ్ఞో మునిపుంగవమ్

టీక॥ తస్మిన్ = ఆ; జనే = జనము; ప్రత్యాశ్వస్తే = ఊఱడిల్లఁగా; వాక్యజ్ఞః = మాటల నెఱింగిన; రాజా = జనకమహారాజు; విగతసాధ్వసః = పోయినభయముగలవాఁడై; ప్రాంజలిః = మంచిచేమోడ్పుఁగలవాఁడై; మునిపుంగవం = మునిశ్రేష్ఠుండగువిశ్వామిత్రునిగూర్చి; వాక్యం = మాటను, ఉవాచ = చెప్పెను.

ఇట్లుమూర్ఛిల్లిపడినజనులందఱు మూర్ఛదేఱఁగానే, మాటలయందుఁబండితుండగు, జనకుండునిర్భయుండై చేతులుమొగిడ్చి, మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

భగవన్ దృష్టవీర్యో మే రామో దశరథాత్మజః. ౨౦

టీక॥ భగవన్ = మాహాత్మ్యము గలవిశ్వామిత్రుఁడా! దశరథాత్మజః = దశరథునికొడుకయిన; రామః = రాముఁడు; మే = నాకు; దృష్టవీర్యః = చూడఁబడినపరాక్రమము గలవాఁడు.

భగవంతుండవగువిశ్వామిత్రుఁడా! దశరథునిపుత్రుండగురామునిపరాక్రమంబునేనుజూచితిని. అని, తాత్పర్యము.

అత్యద్భుత మచింత్యం చ న తర్కిత మిదం మయా

టీక॥ ఇదం = ఇది; మయా = నాచేత; నతర్కితం = ఊహింపఁబడనిది. అచింత్యం చ = తలంపరానిది. అత్యద్భుతం = మిక్కిలియునాశ్చర్యము గల్గించునది.

ఎవ్వఁడైన నీశివధనుస్సునువంచి విఱుచునని నేనిదివఱకూహింపలేదు; దేవతలకు నశక్యమయినందున మనస్సుచే నైనఁదలంచుట కవకాశంబు గల్గదయ్యె; ఇంతచాలుండింతటికార్యంబు సేయుటచాల నాశ్చర్యముగానున్నది. అని, తాత్పర్యము.

జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా. ౨౧
సీతా భర్తార మాసాద్య రామం దశరథాత్మజమ్

టీక॥ మే = నాయొక్క; సుతా = కొమార్తెయయిన; సీతా = సీత; దశరథాత్మజం = దశరథునికొడుకైన; రామం = రాముని; భర్తారం =

పెనిమిటినిగా; ఆసాద్య=పొంది; జనకానాం= జనకవంశస్థులయొక్క; కులే=వంశమునందు; కీర్తిం=కీర్తిని; ఆహరిష్యతి=చేయఁగలదు.

నాకూఁతురగుసీత, దశరథకుమారుండగు రామునిం బెనిమిటిగాఁబడసి, జనకవంశంబునకుఁ గీర్తి కలుగఁజేయును. అని, తాత్పర్యము.

మమ సత్యా ప్రతిజ్ఞా చ వీర్యశుల్కే తి కౌశిక. ౨౨

టీక॥ కౌశిక=విశ్వామిత్రుఁడా! సీతా (అధ్యాహృతము)=సీత; వీర్యశుల్కా= పరాక్రమంబె వెలగాఁగలది" ఇతి=అనెడు, ప్రతిజ్ఞా=ప్రతిన; సత్యా=అనృతముకానిది; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది.

"సీతపరాక్రమంబు గలవానికే యిచ్చెదను" అని, నేనుఁజేసినప్రతిన యునుసత్యంబయినది.

అని, తాత్పర్యము.

సీతా ప్రాణై ర్బహుమతా దేయా రామాయ మే సుతా

టీక॥ ప్రాణైః (పంచమ్యర్థమందుఁదృతీయ)=ప్రాణములకన్నను; బహుమతా= అధికముగాఁ గౌరవింపఁబడినదియు; మే = నాయొక్క; సుతా=కొమార్తెయునగు; సీతా=సీత; రామాయ=రామునికొఱకు; దేయా=ఇవ్వఁదగినది.

నాప్రాణంబులకన్న నెచ్చుగా నెన్నఁబడుచుండు నదియు నాకొమార్తెయు నగు సీతనురామునకొసంగెదను.

అని, తాత్పర్యము.

భవతో ఽనుమతే బ్రహ్మన్ శీఘ్రం గచ్ఛంతు మంత్రిణః. ౨౩
మమ కౌశిక భద్రం తే అయోధ్యాం త్వరితా రథైః

టీక॥ బ్రహ్మన్=బ్రాహ్మణుండవగు; కౌశిక=విశ్వామిత్రుఁడా! తే=నీకు; భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము) అగుఁగాక. భవతః=నీయొక్క; అనుమతే=అనుజ్ఞయందు; మమ=నాయొక్క; మంత్రిణః=మంత్రులు; త్వరితాః=వేగిరపడినవారలై; రథైః=రథములచేత; అయోధ్యాం = అయోధ్యానగరమునుఁగూర్చి; శీఘ్రం=శీఘ్రముగా;

గచ్ఛంతు=పోదురుగాక.

బ్రాహ్మణుండవగు విశ్వామిత్రుండా! నీకుమంగళమగుంగాక; నీయనుజ్ఞనొంది, నాదూమంత్రులు వేగిరపడి రథంబులనెక్కి శీఘ్రుంబుగా నయోధ్యకుంబోవుదురుగాక.

అని, తాత్పర్యము.

రాజానం ప్రశ్రితై ర్వాక్యై రానయంతు పురం మమ. ౨౮
ప్రదానం వీర్యశుల్కాయాః కథయంతు చ సర్వశః

టీక॥మంత్రిణః=(అధ్యాహృతము)మంత్రులు; ప్రశ్రితైః=అణంకువగల; వాక్యైః=మాటలచేత; రాజానం= దశరథమహారాజును; మమ=నాయొక్క, పురం=పట్టణమునుగూర్చి; ఆనయంతు=తోడితెత్తురుగాక. వీర్యశుల్కాయాః=పరాక్రమము వెలగాంగల సీతయొక్క; ప్రదానంచ=ఇచ్చుటను; సర్వశః=అంతను; కథయంతు=చెప్పుదురుగాక.

మంత్రులుపోయి, వినయంబున నిచ్చటివృత్తాంతములంజెప్పి, దశరథునిటకుందోడితెత్తురుగాక; పరాక్రమంబుగలవానికె యివ్వందగిన సీతను రామునకిచ్చుటకును నిశ్చయించుట మొదలగు వృత్తాంతము నంతయు, నతనికింజెప్పుదురుగాక.

అని, తాత్పర్యము.

మునిగుప్తౌచ కాకుత్స్థౌ కథయంతు నృపాయ వై. ౨౯

టీక॥కాకుత్స్థౌ=రామలక్ష్మణులను; మునిగుప్తౌచ= విశ్వామిత్రమహామునిచేరక్షింపంబడిన వారలనుగాను; నృపాయ=దశరథమహారాజుకొఱకు, కథయంతు=చెప్పుదురుగాక.

మంత్రులు "రామలక్ష్మణులు, విశ్వామిత్రమహామునిచేరక్షింపంబడియున్నవారు" అని, దశరథునకుంజెప్పుదురుగాక. అని, తాత్పర్యము.

ప్రీయమాణం తు రాజాన మానయంతు సుశీఘ్రగాః

టీక॥మంత్రిణః(అధ్యాహృతము)=మంత్రులు; సుశీఘ్రగాః=మిక్కి




లియు శీఘ్రముగాఁబోవువారలై; ప్రీయమాణం= సంతోషించుచున్నట్టి; రాజానంతు=దశరథమహారాజును,ఆనయంతు=తోడి తెత్తురు.

మంత్రులు, శీఘ్రముగాఁబోయి యీమాటలు చెప్పఁగా సంతోషంబు నొంది యుండు నాదశరథునిటకుందోడి తెత్తురుగాక. అని, జనకుండు, విశ్వామిత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

కౌశికశ్చ తథేత్యాహ రాజాచాభాష్యమంత్రిణః. ౨౬
అయోధ్యాం ప్రేషయామాస ధర్మాత్మా కృతశాసనాన్
యథావృత్తం సమాఖ్యాతు మానేతుంచ నృపం తదా. ౨౭

టీక॥ కౌశికశ్చ=విశ్వామిత్రుఁడును; తథేతి=అలాగున, ఆహ=(భూతార్థమందులట్)చెప్పెను. తదా=అప్పుడు; ధర్మాత్మా=ధర్మబుద్ధిగల; రాజాచ=జనకమహారాజును;కృతశాసనాన్=చేయఁబడిన(ఇవ్వఁబడినయనుట) వివాహాహ్వానపత్రికలుగల;మంత్రిణః=మంత్రులను; ఆభాష్య=పిలిచి;యథావృత్తం= జరిగినట్లు; సమాఖ్యాతుం=చెప్పుటకును; నృపం=దశరథమహారాజును,ఆనేతుంచ=తోడి తెచ్చుటకును; అయోధ్యాం= అయోధ్యనుగూర్చి; ప్రేషయామాస=పంపెను.

విశ్వామిత్రుండు "నాలాగే"యనెను,ధర్మాత్ముండగు జనకుండును మంత్రుల బిలిచి,వివాహాహ్వాన పత్రికల నిచ్చి, "జరిగినవృత్తాంతము నంతయుఁజెప్పి దశరథునితోడి తెండు"అని,యాజ్ఞాపించి, యయోధ్యకుఁబంపెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే,సప్తషష్టితమస్సర్గః

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండ సప్తషష్టితమసర్గ, టీక, ముగిసినది.




(శ్లో)

## అష్టషష్టితమసర్గప్రారంభః.

జనకేన సమాదిష్టా దూతా స్తే క్లాంతవాహనాః
త్రిరాత్ర ముషితా మార్గే తేయోధ్యాం ప్రావిశన్ పురీమ్.౧

టీక॥ జనకేన=జనకునిచేత; సమాదిష్టాః=ఆజ్ఞాపంపఁబడిన; తే=ఆ; దూతాః= వార్తఁనదీసికొనిపోవువారలు; క్లాంతవాహనాః=అలసినగుఱ్ఱములుగలవారలై; త్రిరాత్రం=మూఁడురాత్రులు; మార్గే=దారియందు; ఉషితాః=ఉండువారలై; తే=వారు; అయోధ్యాం=అయోధ్యయనెడు; పురీం= పట్టణమును, ప్రావిశన్=ప్రవేశించిరి.

జనకునిచేనాజ్ఞాపింపఁబడినయావార్తాహరులు, తమగుఱ్ఱములలలయునట్లువేగిరముగా, మూఁడురాత్రములు పయినముసేసి, యయోధ్యాపట్టణముప్రవేశించిరి.

అని, తాత్పర్యము.

రాజ్ఞో భవన మాసాద్య ద్వారస్థా నిద మబ్రువన్

టీక॥ తే(అధ్యాహృతము)=ఆదూతలు; రాజ్ఞః=రాజయినదశరథునియొక్క; భవనం=ఇంటిని; ఆసాద్య=చేరి; ద్వారస్థాన్=వాకిటనుండువారలనుగూర్చి; ఇదం= ఈమాటను; అబ్రువన్=పలికిరి.

ఆదూతలుదశరథునియిల్లుచేరి వాకిటనుండు కావలివాండ్రంజూచి యిట్లనిచెప్పిరి. అని, తాత్పర్యము.

శీఘ్రం నివేద్యతాం రాజ్ఞే దూతా న్నో జనకస్య చ

టీక॥ రాజ్ఞే=రాజయినదశరథునికొఱకు; జనకస్య=జనకునియొక్క; ("చ")అనునది పాదపూరణార్థము; దూతాన్=వార్తాహరులమయిన; నః=మమ్ములను; నివేద్యతాం=తెలియఁజేయఁబడుఁగాక.

"జనకునిదూతలమగుమేము వచ్చియున్నాము" అని, దశరథునకుం దెల్పుఁడు, అని, దూతలు, ద్వారపాలకులతోఁ జెప్పిరి, అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా ద్వారపాలాస్తే రాఘవాయ న్యవేదయన్

టీక॥ తే=ఆ; ద్వారపాలాః= వాకిలికావలివాండ్రు; ఇతి=ఇట్లు; ఉక్తాః=చెప్పఁబడినవారలై; రాఘవాయ = దశరథునికొఱకు; న్యవేదయన్=తెల్పిరి.

ఆద్వారపాలకులు, దూతల మాటవిని, "జనకునికడనుండి రాయబారులువచ్చియున్నారు" అని, దశరథునకుం దెల్పిరి. అని, తాత్పర్యము.

ఈయొకటియునఱశ్లోకంబువ్యాఖ్యాతలచే నుదాహృతంబుకాకుండుటంజేసి యిచ్చోటలెక్కింపఁబడదయ్యె.

తే రాజవచనా ద్దూతా రాజవేశ్మ ప్రవేశితాః
దదృశు ర్దేవసంకాశం వృద్ధం దశరథం నృపమ్. ౨

టీక॥ తే=ఆ; దూతాః=రాయబారులు; రాజవచనాత్=దశరథుని మాటవలన; రాజవేశ్మ=దశరథుని గృహమును; ప్రవేశితాః=ప్రవేశింపఁజేయఁబడినవారలై; దేవసంకాశం= దేవతతోసమానుఁడును; వృద్ధం=ముదుసలివాఁడునగు; నృపం=రాజయిన; దశరథం=దశరథుని; దదృశుః=చూచిరి.

ఆరాయబారులు, దశరథునిపంపున, రాజగృహంబు లోనికిఁబోవఁగావలివాండ్లచేవిడువఁబడి దేవతుల్యుండును వృద్ధుండునగు దశరథమహారాజుంజూచిరి. అనితాత్పర్యము.

బద్ధాంజలిపుటా స్సర్వే దూతా విగతసాధ్వసాః
రాజానం ప్రయతా వాక్య మబ్రువ న్మధురాక్షరమ్. ౩

టీక॥ దూతాః = రాయబారులు; సర్వే=అందఱును; బద్ధాంజలిపుటాః= కట్టఁబడినచేమోడ్పులనెడు దొప్పలుగలవారలై; విగతసాధ్వసాః= పోయినభయంబుగలవారలై; ప్రయతాః=పరిశుద్ధులయి; రాజానం = దశరథమహారాజునుగూర్చి; మధురాక్షరం= మనోహరంబులగునక్షరంబులుగల; వాక్యం= మాటను; అబ్రువన్=చెప్పిరి.




ఆరాయబారులందఱును, చేతులుమొగిడ్చి, భయంబువీడి, పరిశుద్ధులయి, దశరథునింజూచి, మధురంబుగా, నిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

మైథిలో జనకో రాజా సాగ్నిహోత్ర పురస్కృతమ్
కుశలంచా వ్యయం చైవ సోపాధ్యాయపురోహితమ్. ౪
ముహుర్ముహు ర్మధురయా స్నేహసంయుక్తయా గిరా
జనక స్త్వాం మహారాజ పృచ్ఛతే సపురస్సరమ్. ౫

టీక॥ మహారాజ=దశరథమహారాజా! మైథిలః = మిథిలాధిపతియగు; జనకః = జనకుండగు; రాజా= రాజు ; సాగ్నిహోత్రి పురస్కృతం=ముందఱఁబడినయగ్నిహోత్రములతోఁగూడినవాఁడును, సోపాధ్యాయపురోహితం = ఋత్విజులతోను బురోహితునితోనుం గూడినవాఁడవును, సపురస్సరం=ముందునడచువారితోఁగూడిన వాఁడవు నగు; త్వాం = నిన్ను; జనకః=జనకుఁడు (మొదటిది జనకశబ్దము నూరస్థంబగుటవలన రెండవమాటును జెప్పఁబడినది); కుశలంచ = క్షేమమును; అవ్యయం చైవ = నాశములేకుండుటను; ముహుర్ముహుః=మాటిమాటికిని; మధురయా = మనోహరమును, స్నేహసంయుక్తయా=చెలిమితోఁగూడినదియునగు; గిరా=మాటచేత; పృచ్ఛతే= అడుగుచున్నాఁడు.

దశరథమహారాజా! మిథిలాధిపతియగుజనకమహారాజు, "నీకును నీయగ్నిహోత్రింబులకునునీఋత్విజులకునుబురోహితునకునునీపరివారజనులకును క్షేమంబె ? యారోగ్యంబె?" యనిమాటిమాటికిని, స్నేహంబునమధురంబగువాక్యంబున నడుగుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

పృష్ట్వా కుశల మవ్యగ్రం వైదేహో మిథిలాధిపః
కౌశికానుమతే వాక్యం భవంత మిద మబ్రవీత్. ౬

టీక॥ మిథిలాధిపః = మిథిలకుఁ బ్రభువయిన; వైదేహః=జనకుఁడు; అవ్యగ్రం= కొంచెతలేని; కుశలం= క్షేమమును; పృష్ట్వా=అడిగి; కౌశి




కాను మతే=విశ్వామిత్రునియనుజ్ఞ యందు; భవంతం = (పూజ్యుఁడవగు) నిన్నుఁగూర్చి; ఇదం = ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

మిథిలకుఁ బ్రభువయినజనకమహారాజు, ఇట్లుకొంత లేనిక్షేమం బడిగి, విశ్వామిత్రునియనుమతిని, నీతో నీమాటఁజెప్పుమనెను.

అని, తాత్పర్యము.

పూర్వం ప్రతిజ్ఞా విదితా వీర్యశుల్కా మమాత్మజా
రాజానశ్చ కృతామర్షా నిర్వీర్యా విముఖీకృతాః. ౭

టీక॥ఆత్మజా=కొమార్తె; వీర్యశుల్కా =పరాక్రమం బెవెలగాఁగలది; ఇతి(అధ్యాహృతము)=అనెడు; మమ=నాయొక్క; పూర్వం=మునుపటి; ప్రతిజ్ఞా=ప్రతిన; విదితా=ఎఱుంగఁబడినది; కృతామర్షాః=చేయఁబడినకోపముగల; రాజానశ్చ=రాజులును; నిర్వీర్యాః=పోయినపరాక్రమముగలవారలై; విముఖీకృతాః= పెడమొగముగలవారలుగాఁజేయఁబడినారు; ఇతి(అధ్యాహృతము)= అనునదియును; విదితం(అధ్యాహృతము)=ఎఱుంగఁబడినది.

"నాకొమార్తెనుబరాక్రమంబుగలవానికెయిత్తును" అని, మున్ను నేఁ జేసినప్రతిన మీకందఱకునుం దెలిసియేయున్నది; రాజులునగోపించి యుద్ధమునకువచ్చి, నిర్వీర్యులయి పరాజయంబునొందిరి" అనునదియును దెలిసినదియె. అని, తాత్పర్యము.

సేయం మమ సుతా రాజన్ విశ్వామిత్రపురస్సరైః
యదృచ్ఛయా గతైర్వీరైర్నిర్జితా తవ పుత్రకైః. ౮

టీక॥రాజన్=విశ్వామిత్రమహారాజా! సా=అట్టి; అయం=ఈ; మమ=నాయొక్క; సుతా=కూఁతురు; యదృచ్ఛయా=భాగ్యముచేత; ఆగతైః=వచ్చినవారును; విశ్వామిత్రపురస్సరైః= విశ్వామిత్రుండు ముందుగా నడచువాఁడుగాఁగలవారును; వీరైః=పరాక్రమశాలులును గు; తవ=నీయొక్క; పుత్రకైః=చిన్నికొడుకులచేత (పూజార్థమం

దుబహువచనము) రాముని చేతనను టం, నిర్జితా=జయింపఁబడినది.

విశ్వామిత్రమహారాజా! అట్లు సమానరాజులకునుం గోర్కెగలిగి యెవ్వరికినింబొందరాని నాకూఁతురయినసీతను, సాభాగ్యంబునవిశ్వామిత్రునివెంటవచ్చిన పరాక్రమశాలియగునీచిన్నికొడుకయిన, రాముండుసాధించెను. అని, తాత్పర్యము.

తచ్చ రాజన్ ధను ర్దివ్యం మధ్యే భగ్నం మహాత్మనా
రామేణహి మహారాజ మహత్యాం జనసంసది. ౯

టీక॥ మహారాజ=పూజ్యుఁడవైన రాజవగు; రాజన్=దశరథమహారాజా; తత్=ఆ; దివ్యం= శ్రేష్ఠమయిన; ధనుశ్చ=శివధనువును; మహాత్మనా=అధికమయినపరాక్రమము గల; రామేణహి=రాముని చేత; మహత్యాం = గొప్పదైన; జనసంసది=జనులసభయందు; మధ్యే=నడుమను; భగ్నంహి= విఱువఁబడినది గదా!

దశరథమహారాజా! ఇదివఱకెవ్వరిచేనైనను గదలింపనుంగూడని దివ్యంబగుశివధనువును, మహాపరాక్రమశాలియగు, రాముండు, పెక్కండ్రుజనులుచూడఁగా, నడుమం బట్టివిఱిచెను. అని, తాత్పర్యము.

అస్మై దేయా మయా సీతా వీర్యశుల్కా మహాత్మనే
ప్రతిజ్ఞాం కర్తు మిచ్ఛామి త దనుజ్ఞాతు మర్హసి. ౧౦

టీక॥ మయా=నాచేత; వీర్యశుల్కా= పరాక్రమంబే వెలగాఁగల; సీతా=సీత; మహాత్మనే=అధికమయినపరాక్రమంబుగల; అస్మై=ఈరామునికొఱకు; దేయా=ఇవ్వఁదగినది; ప్రతిజ్ఞాం=ప్రతినను; కర్తుం= చేయుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. తత్= దానిని; అనుజ్ఞాతుం=అంగీకరించుటకు; అర్హసి= తగుదువు.

నేను, బరాక్రమంబుగలవానికే యివ్వఁదగినసీతను, మహాపరాక్రమశాలియగురామునకిచ్చెదను; నాప్రతినను నెఱవేర్పఁగోరెదను; నీవుదానికనుజ్ఞ యివ్వవలయును,

అని, తాత్పర్యము.

సోపాధ్యాయో మహారాజ పురోహితపురస్సరః
శీఘ్రి మాగచ్ఛ భద్రం తే ద్రష్టు మర్హసి రాఘవౌ. ౧౧

టీక॥ మహారాజ=దశరథమహారాజా! త్వం(అధ్యాహృతము)=నీవు; సోపాధ్యాయః=ఋత్విజులతోఁగూడినవాఁడవై; పురోహితపురస్సరః=పురోహితుఁడు ముందు నడచువాఁడు గాఁగలవాఁడవై; శీఘ్రం=వేగిరముగా; ఆగచ్ఛ= రమ్ము; తే=నీకు;భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. రాఘవౌ= రామలక్ష్మణులను; దష్టుం=చూచుటకు; అర్హసి=తగుదువు.

దశరథమహారాజా! నీవుఋత్విజులను బురోహితునిం గూఁడి, శీఘ్రంబుగా రావలయును;నీకుమంగళమగుఁగాక; నీవురామలక్ష్మణులం జూడవలయును,

అని, తాత్పర్యము.

ప్రీతించ మమ రాజేంద్ర నిర్వర్తయితు మర్హసి
పుత్రయో రుభయో రేవ ప్రీతిం త్వ మపి లప్స్యసే. ౧౨

టీక॥ రాజేంద్ర=రాజశ్రేష్ఠుఁడవగుదశరథుఁడా! మమ=నాకు;ప్రీతించ=సంతోషమును; నిర్వర్తయితుం=నెఱవేలుచుటకు;అర్హసి=తగుదువు; త్వమపి= నీవును; ఉభయోః=ఇద్దఱయిన; పుత్రయోః=కొడుకులయందును;ప్రీతిం=సంతోషమును; లప్స్యసఏవ= పొందనే, పొందుదువు.

రాజశ్రేష్ఠుండవగుదశరథుఁడా! నాప్రార్థననంగీకరించి నాకుసంతోషంబుసేయవలయును, నేనుగూతురులనిద్దఱసంతోషంబునం జూచునట్లునీవును నీయిద్దఱు కొడుకులసంతోషంబునుఁజూడఁగలవు.అని,జనకుండు నీతోఁజెప్పుమనెను.

అని, తాత్పర్యము.

ఏవం విదేహాధిపతి ర్మధురం వాక్య మబ్రవీత్
విశ్వామిత్రాభ్యనుజ్ఞాత శ్శతానంద మతే స్థితః. ౧౩

టీక॥విదేహాధిపతిః=విదేహదేశంబునకుఁ బ్రభువయిన జనకుండు;

విశ్వామిత్రాభ్యనుజ్ఞాతః=విశ్వామిత్రునిచేననుమతింపఁబడినవాఁడై; శతానందమతే= శతానందునిసమ్మతియందు; స్థితః=ఉన్నవాఁడై; ఏవం=ఇట్లు; మధురం=మనోహరముగు; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

విదేహాధిపతియగుజనకుండు, విశ్వామిత్రునియనుమతిని శతానందునిసమ్మతియునొంది, యీప్రకారముగా, మధురంబగుమాటఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా విరతా దూతా రాజగౌరవశంకితాః

టీక ॥ దూతాః=రాయబారులు; ఇతి = ఈప్రకారముగా; ఉక్త్వా = చెప్పి; రాజగౌరవశంకితాః=రాజునందలిగౌరవంబుచేభయంపడినవారలై; విరతాః=ఊరకుండిరి.

రాయబారులు, ఈప్రకారము దశరథునితోఁజెప్పి, రాజుముందట నెచ్చుగామాటలాడఁగూడదనందున నంతనూరకుండిరి. అని తాత్పర్యము.

ఈయర్ధశ్లోకంబు, వ్యాఖ్యాతలచేనుదాహృతంబు కాకుండుటంజేసి, యిచ్చో లెక్కింపఁబడదయ్యె.

దూతవాక్యం తు తచ్ఛ్రుత్వా రాజా పరమహర్షితః
వసిష్ఠం వామదేవంచ మంత్రిణోఽన్యాంశ్చ సోఽబ్రవీత్. ౧౪

టీక॥తత్=ఆ; దూతవాక్యం=రాయబారుల మాటను; శ్రుత్వాతు=వినినంతనే; సః=ఆ; రాజా=దశరథమహారాజు; పరమహర్షితః=మిక్కిలియుసంతసించినవాఁడై; వసిష్ఠం=వసిష్ఠునిగూర్చియు; వామదేవంచ=వామదేవునిగూర్చియు; అన్యాన్= ఇతరులయిన; మంత్రిణశ్చ=మంత్రులంగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

ఆ రాయబారులమాట వినినంతటనే, దశరథుండు, సంతోషంబున నుప్పొంగి, వసిష్ఠునివామదేవుని మఱియునితరులగు మంత్రులనుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

గుప్తః కుశికపుత్రేణ కౌసల్యానందవర్ధనః

లక్ష్మణేనసహ భ్రాత్రా విదేహేషు వసత్యసౌ. ౧౫

టీక॥ అసౌ=ఈ; కౌసల్యానందవర్ధనః=కౌసల్యకుసంతోషమును వృద్ధిఁ బొందించునట్టి రాముఁడు, భ్రాత్రా=తోఁబుట్టువగు; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ; కుశికపుత్రేణ= విశ్వామిత్రునిచేత; గుప్తః= రక్షింపఁబడినవాఁడై; విదేహేషు=విదేహదేశమునందు; వసతి=ఉన్నాఁడు.

కౌసల్యకు సంతోషమునువృద్ధిఁ బొందించునట్టిమనరాముండు, లక్ష్మణునింగూడి, విశ్వామిత్రునిచేరక్షింపఁబడుచు, నిప్పుడు, విదేహదేశమందున్నాఁడు. అని, తాత్పర్యము.

దృష్టవీర్యస్తు కాకుత్స్థో జనకేన మహాత్మనా
సంప్రదానం సుతాయాస్తే రాఘవే కర్తుమిచ్ఛతి. ౧౬

టీక॥ కాకుత్స్థస్తు=రాముఁడును; మహాత్మనా= అధికమయినపరాక్రమంబుగల; జనకేన=జనకమహారాజుచేత; దృష్టవీర్యః=చూడఁబడినపరాక్రమంబుగలవాఁడు. అభవత్(అధ్యాహృతము)=అయ్యెను. జనకః(అధ్యాహృతము)=జనకుఁడు; రాఘవేతు=రామునియందు; సుతాయాః=కొమార్తెయొక్క; సంప్రదానం=ఇచ్చుటను; కర్తుం=చేయుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడు.

మహాపరాక్రమశాలియగు జనకుండు, రామునిపరాక్రమంబుగనుంగొనెను; జనకుండు, తనకూఁతును, రామునకియ్యఁ గోరుచున్నాఁడు. అని, తాత్పర్యము.

యది వో రోచతే వృత్తం జనకస్య మహాత్మనః
పురీం గచ్ఛామహే శీఘ్రం మాభూత్కాలస్య పర్యయః. ౧౭

టీక॥ మహాత్మనః =పూజ్యమైనస్వభావముగల; జనకస్య=జనకునియొక్క; వృత్తం=సమాచారము; వః=మీకు; రోచతేయది=ఇష్టమగునేని; శీఘ్రం=వేగిరముగా; పురీం=మిథిలానగరమునుగూర్చి; గచ్ఛా

మహోదము. కాలస్య=కాలముయొక్క; పర్యయః= మీఱుట; మాభూత్=కాకుండుఁగాక!

మహాత్ముఁడగు జనకుఁడు పంపిన వృత్తాంతము మీకు సమ్మతమగునేని, శీఘ్రంబుగా, మిథిలాపురికరుగుదము; జాగుకారాదు. అని, వసిష్ఠాదులతో ననెను. అని, తాత్పర్యము.

మంత్రిణో బాఢ మిత్యాహు స్సహసర్వై ర్మహర్షిభిః

టీక॥ మంత్రిణః=మంత్రులు; మహర్షిభిః = పూజ్యులగు ఋషులతో; సర్వైస్సహ=ఎల్లరతోను గూడి; "బాఢం=మంచిది;" ఇతి=అని; ఆహుః = (భూతార్థమందులట్) చెప్పిరి.

మంత్రులును, మహర్షులునందఱును, "మంచిది" అని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

సుప్రీత శ్చా బ్రవీ ద్రాజా. శ్వో యాత్రేతి స మంత్రిణః. ౧౭

టీక॥ సః=ఆ; రాజాచ=దశరథమహారాజును; సుప్రీతః = మిక్కిలియు సంతసించినవాఁడై ; మంత్రిణః=మంత్రులఁగూర్చి; శ్వః= రేపు; యాత్రా=పయనము. ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను.

ఆదశరథమహారాజు, పరమసంతుష్టుండై, మంత్రులం జూచి, "రేపు బయనంబయ్యెదము" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మంత్రిణ స్తా న్నరేంద్రస్య రాత్రిం పరమసత్కృతాః
ఊషు స్తే ముదితా స్సర్వే గుణై స్సర్వై స్సమన్వితాః. ౧౮

టీక॥ సర్వైః=సమస్తములయిన; గుణైః=గుణములతో; సమన్వితాః=కూడినవారలైన; తే=ఆ; నరేంద్రస్య=మనుష్యులకుఁబ్రభువైన జనకునియొక్క; మంత్రిణః= మంత్రులు; సర్వే=అందఱును; పరమసత్కృతాః= మిక్కిలియుఁబూజింపఁబడినవారలై; ముదితాః= సంతసించినవారలై; తాం=ఆ; రాత్రిం=రేయియంతయు; ఊషుః = ఉండిరి.

మంత్రిగుణంబులన్నియుగలిగినట్టి

యాజనకుని మంత్రులందఱును, దశరథునివలన మిక్కిలియును సత్కారమునొంది, సంతోషంబున, నారాత్రియంతయు, నుండిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాండే, అష్టషష్టితమస్సర్గః

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, బాలకాండాష్టషష్టితమసర్గటీక, ముగిసినది.

---

౬౯

ఏకోనసప్తతితమసర్గప్రారంభః.

తతోరాత్ర్యాం వ్యతీతాయాం సోపాధ్యాయ స్సబాంధవః
రాజా దశరథో హృష్ట స్సుమంత్ర మిద మబ్రవీత్. ౧

టీక॥ తతః=అంతట; రాత్ర్యాం=రేయి; అతీతాయాం=కడవఁగా; సోపాధ్యాయః= ఋత్విజులతోఁగూడినవాఁడును; సబాంధవః=బంధువులతోఁగూడినవాఁడునగు; దశరథః = దశరథుఁడనెడు; రాజా=రాజు; హృష్టః= సంతసించినవాఁడై; సుమంత్రం=సుమంత్రునిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతనారాత్రికడవఁగానే, దశరథమహారాజు ఋత్విజులను బంధువులనుంగూడి, సంతసించి, సుమంత్రుంబూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అద్య సర్వే ధనాధ్యక్షా ధన మాదాయ పుష్కలమ్
వ్రజంత్వగ్రే సువిహితా నానారత్నసమన్వితాః. ౨

టీక॥ అద్య=ఇప్పుడు; ధనాధ్యక్షాః= బొక్కసమునధికారులు; స

ర్వో=అందఱును; పుష్కలం=శ్రేష్ఠమయిన; ధనం = ధనమును; ఆదాయ=తీసికొని; నానారత్నసమన్వితః = పలు తెఱంగులయినమణులతోఁగూడినవారలై; సువిహితాః= మిక్కిలియు సిద్ధులయి ; అగ్రే= ముందట; వ్రజంతు = పోవుదురుఁగాక.

ఇప్పుడు, కోశాధికారులందఱును, శ్రేష్ఠంబగుధనంబుఁదీసికొని, నానావిధంబులగు రత్నంబులతోఁ గూడి, సిద్ధులయి, ముందటంబోవుదురుగాక.

అని, తాత్పర్యము.

చతురంగబలం చాపి శీఘ్రం నిర్యాతు సర్వశః
మమాజ్ఞాసమకాలంచ యానయుగ్య మనుత్తమమ్. ౩

టీక॥ మమ=నాయొక్క; ఆజ్ఞాసమకాలంచ=ఆజ్ఞకుసమానమయినకాలమునందె; చతురంగబలంచాపి = నాలుగంగములుగలసేనయును; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేనిది; యానయుగ్యం = మేనాలుమొదలగుయానంబులునురథంబులుమొదలగునవియును; సర్వశః = అన్నియును; శీఘ్రం=వేగముగా; నిర్యాతు=బయలుదేఱుఁగాక.

నేను, ఆజ్ఞచేసినక్షణమందె, చతురంగంబగు సేనయును, శ్రేష్ఠంబులగు మేనాలు రథంబులు మొదలగునవియును, అన్నియును, బయలువెడలుఁగాక. అని, తాత్పర్యము.

వసిష్ఠో వామదేవశ్చ జాబాలి రథ కాశ్యపః
మార్కండేయస్సు దీర్ఘాయుః ఋషిః కాత్యాయన స్తథా. ౪
ఏతే ద్విజాః ప్రయాంత్వగ్రే స్యందనం యోజయస్వ మే
యథా కాలాత్యయో నస్యా ద్దూతాహి త్వరయంతిమామ్. ౫

టీక॥ యథా=ఎట్లు; కాలాత్యయః=కాలముగడచుట; నస్యాత్= కాదో; తథా(అధ్యాహృతము)= అట్లు; వసిష్ఠః=వసిష్ఠుఁడును; వామదేవశ్చ=వామదేవుఁడును; జాబాలిః=జాబాలియును; అథ=ఇంకను; కాశ్యపః=కాశ్యపుఁడును; దీర్ఘాయుః= అధికమైనయాయుస్సుగల;




మార్కండేయశ్చ = మార్కండే యుండును; కాత్యాయనః = కాత్యాయనుండనెడు; ఋషిస్తథా = ఋషియును; ఏతే = ఈ, ద్విజాః = బ్రాహ్మణులు; అగ్రే = ముందట; ప్రయాంతు = పోదురుగాక. మే = నాకు; స్యందనం = రథమును; యోజయస్వ = కూర్పుము. కూతాః = రాయబారులు; మాం = నన్ను; త్వరయంతిహి = తొందరపఱుచుచున్నారు గదా!

జాగుకానట్లుగా, వసిష్ఠుండును వామదేవుండును జాబాలియునుగాశ్యపుండును దీర్ఘాయువగు మార్కండేయుండును గాత్యాయనుండును, ఈబ్రాహ్మణులుముందఱం బోదురుగాక; నన్నుగూతలుతొందరపఱచుచున్నారుగదా! అని, దశరథుండుసుమంత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

వచనాత్తు నరేంద్రస్య సా సేనా చతురంగిణీ
రాజాన మృషిభి స్సార్థం వ్రజంతం పృష్ఠతో న్వగాత్. ౬

టీక॥ నరేంద్రస్య = మనుష్యుల కుఁబ్రభువయిన దశరథమహారాజు యొక్క; వచనాత్తు = మాటవలననే; చతురంగిణీ = నాలుగంగములు గల; సా = ఆ; సేనా = దండు; ఋషిభిస్సార్థం = ఋషులతోఁగూడ; వ్రజంతం = పోవుచున్న; రాజానం = దశరథమహారాజును; పృష్ఠతః = వెంటను; అన్వగాత్ = వెంబడించెను.

దశరథమహారాజునాజ్ఞను, ఆచతురంగసేన, ఋషులతోఁగూడఁబోవుచున్న దశరథమహారాజువెంటవెంబడించివెళ్లెను. అని, తాత్పర్యము.

గత్వా చతురహం మార్గం విదేహా నభ్యుపేయివాన్
రాజా తు జనక శ్శ్రీమాన్ శ్రుత్వా పూజా మకల్పయత్. ౭

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ దశరథుఁడు; చతురహం = నాలుగు దినములు; మార్గం = దారిని; గత్వా = పొంది; విదేహాన్ = విదేహ దేశమును; అభ్యుపేయివాన్ = పొందెను. శ్రీమాన్ = సంపదగలిగినట్టి; రాజా = రాజయిన; జనకస్తు = జనకుఁడును; శ్రుత్వా = విని; పూ




జాం=పూజను; అకల్పయత్=చేసెను.

ఆదశరథుండు నాలుగుదినము లుపయనంబుచేసి విదేహదేశంబు ప్రవేశించెను; శ్రీమంతుండగు జనకుండును, దశరథుండుతనదేశముఁ బ్రవేశించుటనువిని, యచ్చటనచ్చటఁ నతనికిఁబూజఁగావించెను.

అని, తాత్పర్యము.

తతో రాజాన మాసాద్య వృద్ధం దశరథ న్నృపమ్
జనకో ముదితో రాజా హర్షంచ పరమం యయౌ. ౮

టీక॥ తతః=అటుపిమ్మట; రాజా=రాజయిన;జనకః=జనకుఁడు; వృద్ధం=ముదుసలివాఁడును ; నృపం=మనుష్యులకుఁబ్రభువునయిన; దశరథం = దశరథుండనెడు; రాజానం=రాజును;ఆసాద్య=పొంది; ముదితః=సంతసించినవాఁడై; పరమం=అధికమయిన;హర్షంచ=గ గుర్పాటును, యయౌ=పొందెను.

అంత,జనకమహారాజు,వృద్ధుం డగుదశరథమహారాజుంబూచి, సంతసంబున, మిక్కిలియుగగుర్పాటు నొందెను. అని, తాత్పర్యము.

ఉవాచచ నరశ్రేష్ఠో నరశ్రేష్ఠం ముదాన్వితః

టీక॥నరశ్రేష్ఠః=పురుషశ్రేష్ఠుం డగుజనకుండు;ముదా = సంతోషముతో; అన్వితః=కూడికొనినవాఁడై;నరశ్రేష్ఠం=పురుషశ్రేష్ఠుండగు దశరథునింగూర్చి; ఉవాచచ=మాటనుంజెప్పెను.

పురుషశ్రేష్ఠుండగు, జనకమహారాజు,సంతోషంబునొంది, పురుషశ్రేష్ఠుండగుదశరథునింబూచి, యిట్లని,చెప్పెను. అని, తాత్పర్యము.

స్వాగతం తే మహారాజ దిష్ట్యా ప్రాప్తోసి రాఘవ. ౯
పుత్రయో రుభయోః ప్రీతిం లప్స్యసే వీర్యనిర్జితామ్

టీక॥ రాఘవ=రఘువంశమునం దుఁబుట్టిన; మహారాజ=దశరథమహారాజా! తే=నీకు; స్వాగతం=సుఖముతోడిరాక;అస్తు(అధ్యాహృత




ము)=అగుcగాక. దిష్ట్యా=భాగ్యముచేత; ప్రాప్తః=వచ్చినవాcడవు; అసి=అగుచున్నావు ఉభయోః=ఇద్దఱయిన, పుత్రయోః=కొడుకులయొక్క; వీర్యనిర్జితాం=పరాక్రమముచేజయింపcబడిన, సంపాదింపcబడినయనుట; ప్రీతిం=సంతోషమును; లప్స్యసే=పొందcగలవు.

రఘువంశంబునంబుట్టిన దశరథమహారాజా ! నీకుస్వాగతంబగుcగాక, మాభాగ్యంబుననీవిచ్చోటికివచ్చితివి; నీయిద్దఱుకొడుకులపరాక్రమంబునంగలిగినసంతోషంబుననుభవింపcగలవు. అని, తాత్పర్యము.

దిష్ట్యా ప్రాప్తో మహాతేజా వసిష్ఠో భగవా నృషిః. ౧౦
సహసర్వై ర్ద్విజశ్రేష్ఠై ర్దేవై రివశతక్రతుః

టీక॥ మహాతేజాః=అధికంబగుకాంతిగలవాcడును ; భగవాన్=మాహాత్మ్యంబుగలవాcడును; వసిష్ఠః=వసిష్ఠుండను; ఋషిః=ఋషి; ద్విజశ్రేష్ఠైః = బ్రాహ్మణశ్రేష్ఠులతోc; సర్వైస్సహ=అందరితోcగూడ; దేవైః(సహ)=దేవతలతోcగూడ; శతక్రతురివ=నూఱుయాగంబులుగల దేవేంద్రుండుం బోలె; దిష్ట్యా=భాగ్యముచేత; ప్రాప్తః=వచ్చినవాcడు.

మహాతేజుండునుభగవంతుండునగు వసిష్ఠమహర్షి, బ్రాహ్మణవర్యులనెల్లరంగూడి, దేవతలంగూడి నూఱు యాగంబులుచేసిన దేవేంద్రుండుంబోలె, మాభాగ్యంబున, నిచ్చోటికేతెంచె. అనితాత్పర్యము.

దిష్ట్యా మే నిర్జితా విఘ్నా దిష్ట్యా మే పూజితం కులమ్. ౧౧
రాఘవై స్సహ సంబంధా ద్వీర్యశ్రేష్ఠై ర్మహాత్మభిః

టీక॥ మహాత్మభిః=పూజ్యమగుస్వభావముగలవారును ; వీర్యశ్రేష్ఠైః=పరాక్రమంబునమేటియయినవారునగు; రాఘవైస్సహ= రఘువంశంబునం బుట్టినవారితోcగూడ; సంబంధాత్ = వియ్యమువలన; దిష్ట్యా=భాగ్యముచేత; మే=నాయొక్క; విఘ్నాః=విఘ్నములును; నిర్జితాః = జయింపcబడినవి. దిష్ట్యా=భాగ్యముచేత; మే=నాయొ




క్క-; కులం=వంశము; పూజితం=పూజింపఁబడినది.

పరాక్రమంబున శ్రేష్ఠులును మహాత్ములునగు రఘువంశంబునం బుట్టిన వారితో వియ్యంబు దొరకొనుటం జేసి, నాభాగ్యంబున, నావిఘ్నంబులు నశించినవి, నాభాగ్యంబున నాకులంబు ప్రశస్తంబైనది. అని తాత్పర్యము.

శ్వః ప్రభాతే నరేంద్రేంద్ర నిర్వర్తయితు మర్హసి. ౧౨
యజ్ఞస్యాంతే నరశ్రేష్ఠ వివాహ మృషిసమ్మతమ్

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవును; నరేంద్రేంద్ర= మనుష్యులకుఁ బ్రభువులగువారిలో శ్రేష్ఠుఁడవునగు దశరథుఁడా! శ్వః= రేపు; ప్రభాతే= ఉదయమున; యజ్ఞస్య= యాగము యొక్క; అంతే=కొనను; ఋషిసమ్మతం=ఋషులకిష్టంబగు, వివాహం=పెండ్లిని, నిర్వర్తయితుం= నెఱవేర్చుటకు; అర్హసి=తగుదువు.

పురుషశ్రేష్ఠుండవు రాజశ్రేష్ఠుండవునగు దశరథుఁడా! రేపటిప్రాతఃకాలమునందు, యాగాంతంబున ఋషులకు సమ్మతంబగునటుల, వివాహంబు నెఱవేఱుపవలయును. అని, జనకుండు దశరథునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా ఋషిమధ్యే నరాధిపః. ౧౩
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠః ప్రత్యువాచ మహీపతిమ్

టీక॥ తస్య=ఆజనకమహారాజుయొక్క, తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; వాక్యవిదాం=మాటలనెఱింగినవారిలో; శ్రేష్ఠః=మేటియయిన; నరాధిపః=మనుష్యులకుఁ బ్రభువగు దశరథుఁడు; ఋషిమధ్యే= ఋషులనడుమను; మహీపతిం=భూమికిఁ బ్రభువయినజనకునింగూర్చి; వాక్యం=మాటను; ప్రత్యువాచ=బదులు చెప్పెను.

ఆజనకుండు చెప్పినమాటవిని, మాటలయందుఁ బండితులలో శ్రేష్ఠుండగు దశరథమహారాజు, ఋషులనడుమను జనకమహారాజుం జూచి

యిట్లని, బదులు చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రతిగ్రహో దాతృవశ శ్శ్రుత మేత న్మయా పురా. ౧౪
యథా వక్ష్యసి ధర్మజ్ఞ త త్కరిష్యామహే వయమ్

టీక॥ధర్మజ్ఞ=ధర్మంబు నెఱింగినజనకుఁడా! ప్రతిగ్రహః=పుచ్చుకొనుట, దాతృవశః=ఇచ్చువానియధీనము. మయా=నాచేత;ఏతత్=ఇది;పురా=మున్ను; శ్రుతం=వినఁబడినది. యథా = ఎట్లు;వక్ష్యసి=చెప్పుదువో;తత్ = అట్లు; వయం=మేము; కరిష్యామహే = చేయుదుము. ఇచ్చువాఁడు, ఎప్పుడిచ్చునో, అప్పుడు, పుచ్చుకొనువాఁడు, పుచ్చుకొనునేగాని, వేఱులేదు కావున, ప్రతిగ్రహము దాతయధీనము;నీవిట్లుకన్యాప్రదానముచేయుటను నేను వినియున్నాఁడను;నీవెట్లుచెప్పుదువో మేమట్లే, చేయుదుము. అని, దశరథుఁడుచెప్పెను. అని, తాత్పర్యము.

ధర్మిష్ఠంచ యశస్యంచ వచనం సత్యవాదినః. ౧౫
శ్రుత్వా విదేహాధిపతిః పరం విస్మయ మాగతః

టీక॥విదేహాధిపతిః= విదేహదేశంబునకుఁ బ్రభువయినజనకుండు; సత్యవాదినః= సత్యమునేమాటలాడునట్టిదశరథునియొక్క ; ధర్మిష్ఠంచ=మిక్కిలియుధర్మముగలదియును; యశస్యంచ = కీర్తిగలిగించునదియునగు; వచనం=మాటను;శ్రుత్వా=విని; పరం=అధికముయిన;విస్మయం=ఆశ్చర్యమును; ఆగతః=పొందినవాఁడాయెను.

విదేహదేశంబునకధిపతియగుజనకుండు, మిక్కిలియుధర్మంబుతోఁగూడినదియును కీర్తికరంబనగు నాదశరథునిమాటనువిని, మిగులనాశ్చర్యంబునొందెను. అని, తాత్పర్యము.

తత స్సర్వే మునిగణాః పరస్పరసమాగమే. ౧౬
హర్షేణ మహతా యుక్తా స్తాం నిశా మవస న్సుఖమ్

టీక॥ తతః = అంతట;మునిగణాః = మునులయొక్కసమూహ

ములు; సర్వే = అన్నియును; పరస్పర సమాగమే = ఒండొరులచేరికకొంగా; మహతా = అధికమయిన; హర్షేణ = సంతోషముతో; యుక్తాః = కూడినవారలై; సుఖం = సుఖముగా; తాం = ఆ; నిశాం = రాత్రియంతయు; అవసన్ = ఉండిరి.

అంత, మునులందఱును, ఒండొరులకును సమాగమంబు గలుగుటం జేసి, మిగుల సంతసంబంది, యా రాత్రి యంతయు, సుఖంబుండిరి.

అని, తాత్పర్యము.

రాజాచ రాఘవౌ పుత్రౌ నిశామ్య పరిహర్షితః ౧౭
ఉవాస పరమప్రీతో జనకేన సుపూజితః

టీక॥ రాజాచ = దశరథమహారాజును; పుత్రౌ = కొడుకులయిన; రాఘవౌ = రామలక్ష్మణులను; నిశామ్య = చూచి; పరిహర్షితః = నగుర్పాటునొందినవాఁడై; జనకేన = జనకునిచేత; సుపూజితః = చక్కఁగాఁ బూజింపఁబడినవాఁడై; పరమప్రీతః = మిక్కిలియు సంతసించినవాఁడై; ఉవాస = ఉండెను.

దశరథమహారాజును, దనకొడుకులగు రామలక్ష్మణులం జూచి, సతోషంబున నగుర్పాటునొంది, జనకునిచేఁబూజింపఁబడి, మిగుల సంతసింపుచుండెను. అని, తాత్పర్యము.

జనకోపి మహాతేజాః క్రియాం ధర్మేణ తత్త్వవిత్. ౧౮
యజ్ఞస్యచ సుతాభ్యాంచ కృత్వా రాత్రిమువాసహ

టీక॥ మహాతేజాః = అధికమయినపరాక్రమముగలవాఁడును, తత్త్వవిత్ = సిద్ధాంతము నెఱింగినవాఁడునగు; జనకోపి = జనకుండును; యజ్ఞస్య = యాగముయొక్క; క్రియాం = కార్యమును; సుతాభ్యాం = కొమార్తెలకొఱకు; క్రియాం (అధ్యాహృతము) = అంకురార్పణము మొదలగు కార్యమును; కృత్వా = చేసి; రాత్రిం = రేయియందు, ఉవాస = ఉండెను (హ అనునది పాదపూరణార్థము)

మహాతేజుండును ధర్మతత్త్వంబు నెఱింగినవాఁడునగు జనకుండును, యాగమునకు మిగత పడిన కార్య

ముసిర్వర్తించి, కొహూత్రేలకును వివాహామునకుముందుచేయవలసిన యంకురార్పణముమొదలగు కార్యములు నెఱవేర్చి, యారాత్రియంత యుగడపెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే,ఏకోనసప్తతితమస్సర్గః
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ ఏకోనసప్తతితమసర్గ, టీక,
ముగిసినది.

(శ్రీ)

సప్తతితమసర్గప్రారంభః.

తతః ప్రభాతే జనకః కృతకర్మా మహర్షిభిః
ఉవాచ వాక్యం వాక్యజ్ఞ శ్శతానందం పురోహితమ్. ౧

టీక॥ తతః=అంతట; ప్రభాతే=ప్రాతఃకాలమునందు; వాక్యజ్ఞః=మాటలనెఱింగినట్టి; జనకః= జనకుండు; కృతకర్మా=చేయఁబడిన యాగకార్యముగలవాఁడై; మహర్షిభిః=పూజ్యులగుఋషులతో; సహితః(అధ్యాహృతము)=కూడినవాఁడై; పురోహితం=పురోహితుండగు; శతానందం = శతానందునిగూర్చి; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

అంత ప్రాతఃకాలముకాఁగానే, చక్కఁగా మాటలాడనెఱింగినజనకుండును, యాగీయకార్యములనిర్వర్తించి, మహర్షులంగూడి, పురోహితుండగు శతానందునిం జూచి, యిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

భ్రాతా మమ మహాతేజా యవీయా నతిధార్మికః
కుశధ్వజ ఇతిఖ్యాతః పురీ మధ్యవస చ్ఛుభామ్. ౨
వార్యాఫలకపర్యంతాం పిబ న్నిక్షుమతీం నదీమ్

("వార్యామలకపర్యంతాం" అని పాఠాంతరము.)

సాంకాశ్యాం పుణ్యసంకాశాం విమాన మివ పుష్పకమ్. ౩

టీక॥ మహాతేజాః=అధికమయి నపరాక్రమముగలవాఁడును; అతిధార్మికః= మిక్కిలియు ధర్మమునాచరించువాఁడును; కుశధ్వజ ఇతి=కుశధ్వజుఁడని, ఖ్యాతః=ప్రసిద్ధుఁడునగు; మమ=నాయొక్క; యవీయాన్=పిన్నవాఁడైన, భ్రాతా=తోడంబుట్టువు; శుభాం = మంగళకరమును; వార్యాఫలకపర్యంతాం, వారి=నీటియందు; ఆ=వెదజల్లఁబడిన, ఫలక=శూలములుగల; పర్యంతాం=చుట్టునుండుప్రదేశములుగలదియును; వార్యామలకపర్యంతాం, (పాఠాంతరము)= నీటియుసిరికచెట్లుగలచుట్టునుండు ప్రదేశములు గలదియును; పుణ్యసంకాశాం=పరిశుద్ధముగానుండునదియును; పుష్పకం= పుష్పకమనెడు; విమానమివ (స్థితం) = విమానమునునట్లున్నది యునగు; సాంకాశ్యాం= సాంకాశ్యయనెడు; పురీం=పట్టణమును; ఇక్షుమతీం=ఇక్షుమతియనెడు; నదీం=ఏటినీ; పిబన్=త్రాగుచు; అధ్యవసత్ = (వర్తమానార్థమందు లఙ్)అధిష్ఠించియున్నాఁడు.

మహాపరాక్రమశాలియుఁ బరమధార్మికుండునగునాతమ్ముఁడు కుశధ్వజుండనువాఁడు, శత్రుపురాకుండుటకై, చుట్టున అగడ్తలయందుఁబాఁతిపెట్టఁబడిన శూలములుగలిగి (చుట్టునునీటియుసిరికచెట్లుగలిగి) మంగళకరంబై, పుణ్యంబై, పుష్పకవిమానంబుంబోలెఁ గనుపట్టుచున్న, సాంకాశ్యయనెడు పట్టణంబునందు, ఇక్షుమతీనది నీళ్లుత్రావుచు, నివసించుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

త మహం ద్రష్టు మిచ్ఛామి యజ్ఞగోప్తా స మే మతః
ప్రీతిం సోపి మహాతేజా ఇమాం భోక్తా మయా సహ. ౪

టీక॥ అహం=నేను; తం=ఆకుశధ్వజుని; ద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛామి=కోరెదను. సః = ఆకుశధ్వజుఁడు; మే = నాయొక్క; యజ్ఞ

గోప్తా=యాగమురక్షించువాఁడు గా;మతః=ఎన్నఁబడినవాఁడు. మహాతేజాః=అధికమైన పరాక్రమంబుగల; సోపి=ఆకుశధ్వజుండును; మయాసహ = నాతోఁగూడ; ఇమాం=ఈ;ప్రీతిం=సంతోషమును; భోక్తా=అనుభవింపఁగలఁడు.

నేనాకుశధ్వజునిం జూడఁగోరెదను; అతండు,నాయాగంబురక్షించువాఁడు; మహా పరాక్రమ శాలియగునతండును, ఈశివధనుర్భంగంబుననుసీతావివాహంబుననుంగల్గుసంతోషంబు ననుభవింపనర్హుండు.అని,జనకుండుశతానందునితోఁ జెప్పెను. అని,తాత్పర్యము.

ఏవ ముక్తేతు వచనే శతానందస్య సన్నిధౌ
ఆగతాః కేచి దవ్యగ్రా జనక స్తాన్ సమాదిశత్

టీక॥శతానందస్య = శతానందునియొక్క;సన్నిధౌ = సమీపమునందు;ఏవం=ఇట్లు;వచనే = మాట;ఉక్తేతు = చెప్పఁబడఁగానే;అవ్యగ్రాః = సోమరులుకాని; కేచిత్ = కొందఱు;ఆగతాః=వచ్చినారు.జనకః=జనకుఁడు; తాన్=వారలను; సమాదిశత్= ఆజ్ఞాపించెను.

జనకుండిట్లు, శతానందునిముందటఁజెప్పఁగానే,కొందఱుసోమరులుకానివారువచ్చిరి;జనకుండువారలకాజ్ఞాపించెను.అని,తాత్పర్యము.

ఈశ్లోకంబు,వ్యాఖ్యాతలచేఁబరిగణితంబుకానందున, నిచ్చటనులెక్కింపఁబడదయ్యె.

శాసనాత్తు నరేంద్రస్య ప్రయయు శ్శీఘ్రవాజిభిః
సమానేతుం నరవ్యాఘ్రం విష్ణు మింద్రాజ్ఞయా యథా. ౫

టీక ॥ తే(అధ్యాహృతము)= వారు; నరేంద్రస్య=మనుష్యులకుఁ బ్రభువయినజనకునియొక్క; శాసనాత్తు = ఆజ్ఞవలననే; నరవ్యాఘ్రం=పురుషశ్రేష్ఠుండగు కుశధ్వజుని;ఇంద్రాజ్ఞయా=ఇంద్రునిపనుపుచేత;విష్ణుంయథా=విష్ణుదేవునింబోలె;సమానేతుం=తెచ్చుటకు;శీఘ్రవాజిభిః=వేగిరముగా నడచుగుఱ్ఱంబులచేత;ప్రయయుః=పోయిరి.




వారలు, జనకుండాజ్ఞాపించినం తటనే, పురుషశ్రేష్ఠుండగు కుశధ్వజుని, దేవేంద్రునాజ్ఞను విష్ణుదేవునట్లు, తోడ్కొనివచ్చుటకై, వేగంబుగాఁ బోవుగుఱ్ఱంబుల నెక్కి, పోయిరి. అని, తాత్పర్యము.

సాంకాశ్యాం తే సమాగత్య దదృశుశ్చ కుశధ్వజమ్
న్యవేదయ న్యథా వృత్తం జనకస్య చ చింతితమ్

టీక॥ తే=ఆదూతలు; సాంకాశ్యాం=సాంకాశ్యాపురిని; సమాగత్య= పొంది. కుశధ్వజం=కుశధ్వజుని; దదృశుః=చూచిరి; యథావృత్తం=జరిగినట్టును; జనకస్య=జనకమహారాజుయొక్క; చింతితంచ= అభిప్రాయమును; న్యవేదయన్ చ= తెల్పను దెల్పిరి.

ఆదూతలు, సాంకాశ్యం జేరి, కుశధ్వజునిజూచి, రాముండు శివధనువునువిఱుచుట మొదలగు జరిగినవృత్తాంతమును, జనకునియభిప్రాయంబునుం దెల్పిరి. అని, తాత్పర్యము.

ఈశ్లోకంబును, రాబోవునర్ధశ్లోకంబును, వ్యాఖ్యానంబుల నుదాహరింపఁబడకుండుటం జేసి, యిచ్చట, లెక్కింపఁబడదయ్యె.

తద్వృత్తం నృపతి శ్శ్రుత్వా దూతశ్రేష్ఠై ర్మహాబలైః
ఆజ్ఞయాథ నరేంద్రస్య ఆజగామ కుశధ్వజః. ౫

టీక॥ నృపతిః= మనుష్యులకుఁ బ్రభువయిన; కుశధ్వజః= కుశధ్వజుండు; మహాబలైః=అధికంబగుబలము గల; దూతశ్రేష్ఠైః=(పంచమ్యర్థమందుఁ ద్వితీయ) రాయబారులలో మేటియగువారలవలన; తత్=ఆ; వృత్తం = వృత్తాంతమును; శ్రుత్వా=విని; అథ=అటుపిమ్మట; నరేంద్రస్య = మనుష్యులకుఁ బ్రభువయినజనకునియొక్క; ఆజ్ఞయా= పనుపుచేత; ఆజగామ=వచ్చెను.

మనుష్యులకుఁ బ్రభువయిన కుశధ్వజుండు, బలవంతులగుదూతశ్రేష్ఠులవలన, నావృత్తాంతమంతయు విని, జనకమహారాజు పనుపునం జేసి మిథిలకువచ్చెను. అని తాత్పర్యము

స దదర్శ మహాత్మానం జనకం ధర్మవత్సలమ్. ౬




టీక॥ సః=ఆకుశధ్వజుఁడు; మహాత్మానం = పూజ్యమయిన స్వభావముగలవాఁడును; ధర్మవత్సలం=ధర్మంబునందు మిక్కిలియు నాసక్తిగలవాఁడునగు; జనకం=జనకుని; దదర్శ=చూచెను.

ఆకుశధ్వజుండు, మహాత్ముండును ధర్మమునందు మిగులనాసక్తుండునగు జనకమహారాజుంజూచెను. అని, తాత్పర్యము.

సోఽభివాద్య శతానందం రాజానంచాపి ధార్మికమ్
రాజార్హం పరమం దివ్య మాసనంచా ధ్యరోహత. ౭

టీక॥ సః=ఆకుశధ్వజుఁడు; శతానందం=శతానందుని; ధార్మికం=ధర్మంబునాచరించునట్టి; రాజానంచాపి= జనకమహారాజును; అభివాద్య=నమస్కరించి; రాజార్హం=రాజునకుఁదగిన దియును; పరమం = ఉన్నతమైనదియును; దివ్యం=శ్రేష్ఠమైనదియునగు; ఆసనంచ=సింహాసనమును; అధ్యరోహత=ఎక్కెను.

ఆకుశధ్వజుండు, శతానందునకును ధార్మికుండగుజనకమహారాజునకున నమస్కారముచేసి, రాజయోగ్యంబును, మిగులనున్నతంబును శ్రేష్ఠంబునగు, సింహాసనంబునెక్కెను. అని, తాత్పర్యము.

ఉపవిష్టా వుభౌ తౌ తు భ్రాతరా వతి తేజసౌ
ప్రేషయామాసతు ర్వీరౌ మంత్రిశ్రేష్ఠం సుదామనమ్. ౮

టీక ॥ వీరౌ=పరాక్రమశాలులును; అతితేజసౌ = మిక్కిలి యుఁగాంతిగలవారునగు; తౌ=ఆ; భ్రాతరౌ= తోడంబుట్టువులు; ఉభౌ=ఇద్దఱును; ఉపవిష్టౌతు=కూర్చుండినంతనే; మంత్రిశ్రేష్ఠం = మంత్రులలో మేటియయిన; సుదామనం=సుదామనుండనువానిని; ప్రేషయామాసతుః=పంపిరి.

పరాక్రమశాలులును తేజస్వులునగుతోడంబుట్టువులయిన యాజనకకుశధ్వజులిర్వురును, ఆసనంబునం గూర్చుండి, మంత్రిశ్రేష్ఠునిసుదామనుండను వాని, దశరథుని కడకుఁబంపిరి.

అని, తాత్పర్యము.

గచ్ఛ మంత్రిపతే శీఘ్ర మైక్ష్వాక మమితప్రభమ్
ఆత్మజైస్సహ దుర్ధర్ష మానయస్వ సమంత్రిణమ్. ౯

టీక ॥ మంత్రిపతే=మంత్రిశ్రేష్ఠుండవగు సుదామనుఁడా! శీఘ్రం=వేగిరముగా; గచ్ఛ=పొమ్ము. అమితప్రభం=కొలఁతపెట్టరాని కాంతిగలవాఁడును; దుర్ధర్షం=ఎదిరింపఁగూడనివాఁడును; సమంత్రిణం=మంత్రులతోఁ గూడినవాఁడునగు; ఐక్ష్వాకుం= ఇక్ష్వాకువంశమునం దుఁబుట్టిన దశరథుని; ఆత్మజైస్సహ=కొడుకులతోఁగూడ; ఆనయస్వ=తోడ్కొనిరమ్ము.

మంత్రిశ్రేష్ఠుండవగు సుదామనుఁడా! నీవుశీఘ్రంబుగాఁబోయి, కొలంతపెట్టరానికాంతిగల్గిదుర్ధర్షుండై, మంత్రులంగూడియున్న దశరథమహారాజును, అతనికొడుకులనుందోడితెమ్ము. అని, చెప్పి, పంపిరి. అని, తాత్పర్యము.

ఔపకార్యం సగత్వాతు రఘూణాం కులవర్ధనమ్
దదర్శ శిరసా చైన మభివాద్యే దమబ్రవీత్. ౧౦

టీక ॥ సతు=ఆసుదామనుండును; ఔపకార్యం=విడిదినికి; గత్వా=పొంది; రఘూణాం=రఘువంశమునందుఁబుట్టినవారలయొక్క; కులవర్ధనం= వంశమునువృద్ధిఁబొందించునట్టిదశరథుని; దదర్శ=చూచెను. ఏనం=ఈదశరథుఁడు; శిరసా చ=తలచేతను; అభివాద్య= నమస్కరించి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=పలికెను.

ఆసుదామనుండు, దశరథుండుండువిడిదికింబోయి, యచ్చట, రఘువంశవర్ధనుండగు దశరథునింజూచి, యతనికిసాష్టాంగంబుగ నమస్కరించియిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

అయోధ్యాధిపతే వీర వైదేహో మిథిలాధిపః
స త్వాం ద్రష్టుం వ్యవసిత స్సోపాధ్యాయపురోహితం. ౧౧

టీక॥ వీర=పరాక్రమశాలివగు; అయోధ్యాధిపతే= అయోధ్యకుఁ

ప్రభువయినదశరథుఁడా! మిథిలాధిపః=మిథిలకుఁబ్రభువయిన; సః=ఆ; వైదేహః=జనకుఁడు; సోపాధ్యాయ పురోహితం=ఋత్విజులతోను పురోహితులతోను గూడిన; త్వాం=నిన్ను; ద్రష్టుం=చూచుటకు; వ్యవసితః=యత్నముగలవాఁడు; భవతి (అధ్యాహృతము)=అగుచున్నాఁడు.

పరాక్రమశాలివి, అయోధ్యాధిపుఁడవగుదశరథుఁడా! మిథిలానాథుండగునాజనకుండు, ఋత్విజులతోను పురోహితునితోను గూడ నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడు. అని, సుదామనుండు చెప్పెను.

అని, తాత్పర్యము.

మంత్రిశ్రేష్ఠవచః శ్రుత్వా రాజా సర్షిగణస్తదా
సబంధు రగమత్తత్ర జనకో యత్ర వర్తతే. ౧౨

టీక॥ మంత్రిశ్రేష్ఠవచః=మంత్రులలో మేటియయినసుదామనుని మాటను, శ్రుత్వా=విని; తదా=అప్పుడు; రాజా= దశరథమహారాజు; సర్షిగణః=ఋషులసమూహముతోఁగూడినవాఁడై; సబంధుః=బంధువులతోఁ గూడినవాఁడై; యత్ర=ఎచ్చట; జనకః=జనకుఁడు; వర్తతే=ఉన్నాఁడో; తత్ర=అచ్చటికి; అగమత్=పోయెను.

మంత్రిశ్రేష్ఠుండగు, సుదామనుండు చెప్పినమాటనువిని, యప్పుడు, దశరథుండు, ఋషులను బంధువులనుంగూడి, జనకుండున్నచోటికింబోయెను.

అని, తాత్పర్యము.

స రాజా మంత్రిసహిత స్సోపాధ్యాయ స్సబాంధవః
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠో వైదేహ మిద మబ్రవీత్. ౧౩

టీక॥ వాక్యవిదాం=మాటలనెఱింగినవారిలో, శ్రేష్ఠః = మేటియయిన; సః=ఆ; రాజా = దశరథమహారాజు; మంత్రిసహితః=మంత్రులతోఁగూడినవాఁడై; సోపాధ్యాయః= ఋత్విజులతోఁగూడినవాఁడై, సబాంధవః=బంధువులతోఁగూడినవాఁడై; వైదేహం=విదేహదేశంబునకధిపతియయిన, జనకునిగూర్చి; ఇదం=ఈ; వాక్యం=మాటను;

అబ్రవీత్=చెప్పెను.

మాటలయందుఁ బండితుండగు నాదశరథమహారాజు, మంత్రులను ఋత్విజులనుబంధువులనుంగూడి, జనకమహారాజుంజూచి, యిట్లని,చెప్పెను అని,చెప్పెను.

అని, తాత్పర్యము.

విదితం తే మహారాజ ఇక్ష్వాకుకులదైవతమ్
వక్తా సర్వేషు కృత్యేషు వసిష్ఠో భగవా నృషిః. ౧౪

టీక॥మహారాజ = జనకమహారాజా!భగవాన్=మాహాత్మ్యము గలవాఁడును; ఋషిః=ఋషియును గు;వసిష్ఠః=వసిష్ఠుఁడు;ఇక్ష్వాకుకులదైవతం=ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారలకిలువేల్పు;సర్వేషు=సమస్తములయిన; కృత్యేషు=కార్యములందు; వక్తా=మాటలాడువాఁడు; ఇతి(అధ్యాహృతము)=అని; తే=నీకు; విదితం=తెలిసినది.

జనకమహారాజా! భగవంతుండగువసిష్ఠమహర్షి, ఇక్ష్వాకువంశంబునఁబుట్టిన వారికిలువేల్పనియు, వారికార్యములనన్నింటను, మాటలాడువాడనియు, నీకుఁ దెలిసియే యున్నది. అని, తాత్పర్యము.

విశ్వామిత్రాభ్యనుజ్ఞాత స్సహసర్వై ర్మహర్షిభిః
ఏష వక్ష్యతి ధర్మాత్మా వసిష్ఠో మే యథాక్రమమ్. ౧౫

టీక॥ ఏషః=ఈ;ధర్మాత్మా=ధర్మస్వభావుండగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు; విశ్వామిత్రాభ్యనుజ్ఞాతః=విశ్వామిత్రునిచే నంగీకరింపఁబడినవాఁడై;మహర్షిభిః=పూజ్యులయిన ఋషులతో; సర్వైస్సహ=అందఱితోఁగూడ;మే = నాయొక్క;కులం(అధ్యాహృతము)=వంశమును; యథాక్రమం=వరుసఁదప్పక;వక్ష్యతి=చెప్పఁగలఁడు.

ధర్మాత్ముండగునీవసిష్ఠుండు, విశ్వామిత్రునియనుజ్ఞనొంది, మహర్షులనందఱంగూడి, నావంశంబుక్రమంబుగాఁజెప్పును. అని, దశరథుండుజనకునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

స ౭౦

ఏవ ముక్త్వా నరశ్రేష్ఠ రాజ్ఞాం మధ్యే మహాత్మనాం
తూష్ణీంభూతే దశరథే వసిష్ఠో భగవా నృషిః
ఉవాచ వాక్యం వాక్యజ్ఞో వైదేహం సపురోధసం. ౧౬

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండగు; దశరథే=దశరథుఁడు; మహాత్మనాం=అధికమయినపరాక్రమంబుగల; రాజ్ఞాం=రాజులయొక్క; మధ్యే=నడుమను; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; తూష్ణీంభూతే=ఊరకున్నవాఁడు కాఁగా; వాక్యజ్ఞః=మాటల నెఱింగినవాఁడును; భగవాన్=మాహాత్మ్యంబుగలవాఁడును; ఋషిః=ఋషియునగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు; సపురోధసం=పురోహితునితోఁగూడియున్న; వైదేహం=జనకునిఁగూర్చి; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

పురుషశ్రేష్ఠుండగు దశరథుండు, మహాత్ములగు రాజులనడుమ, నిట్లు చెప్పి, యూరకుండఁగానే, మాటలయందుఁ బండితుండును భగవంతుండునగు వసిష్ఠమహర్షి, పురోహితునింగూడియున్న జనకుంజూచి యిట్లని, చెప్పెను అని, తాత్పర్యము

అవ్యక్తప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః
తస్మా న్మరీచి స్సంజజ్ఞే మరీచేః కాశ్యపస్సుతః. ౧౭

టీక॥ అవ్యక్తప్రభవః=తెలియనికారణముగలవాఁడును; శాశ్వతః=బహుకాలముండువాఁడును; నిత్యః=కాలత్రయమందునుండువాఁడును; అవ్యయః=నాశములేనివాఁడును; బ్రహ్మా=నలువ; అస్తి (అధ్యాహృతము)=కలఁడు. తస్మాత్=ఆబ్రహ్మవలన; మరీచిః=మరీచి; సంజజ్ఞే=పుట్టెను; మరీచేః=మరీచికి; కాశ్యపః=కాశ్యపుఁడు; సుతః=కొడుకు.

ఎవ్వరికిం దెలియరాని కారణంబుగల్గి, శాశ్వతుండై, నిత్యుండై, నాశరహితుండై, యుండు బ్రహ్మకలఁడు; అతనికిమరీచిపుట్టెను; ఆమరీచికి కాశ్యపుండుపుట్టెను.

అని, తాత్పర్యము.

వివస్వాన్ కాశ్యపాజ్జజ్ఞే మను ర్వైవస్వతస్స్మృతః

మనుః ప్రజాపతిః పూర్వ మిక్ష్వాకుస్తు మనోస్సుతః. ౧౮

టీక॥ కాశ్యపాత్ = కాశ్యపునివలన; వివస్వాన్ = సూర్యుఁడు; జజ్ఞే = పుట్టెను. వైవస్వతః = సూర్యునికొడుకు; మనుః = మనువు, అని; స్మృతః = చెప్పఁబడినవాఁడు. పూర్వం = మునుపు; మనుః = మనువు; ప్రజాపతిః = మనుష్యులకుఁ బ్రభువుగా; ఆసీత్ (అధ్యాహృతము) = ఉండెను. మనోః = మనువుయొక్క; సుతస్తు = కొడుకును; ఇక్ష్వాకుః = ఇక్ష్వాకువనువాఁడు.

కాశ్యపునకుసూర్యుఁడు పుట్టెను; సూర్యుని కొడుకుమనువనువాఁడు; ఆమనువె, మున్ను రాజయ్యెను; ఆమనువునకు, ఇక్ష్వాకుఁడనువాఁడు పుట్టెను. అని, తాత్పర్యము.

త మిక్ష్వాకు మయోధ్యాయాం రాజానం విద్ధిపూర్వకమ్

టీక॥ తం = ఆ; ఇక్ష్వాకుం = ఇక్ష్వాకువును, పూర్వం = మునుపటి; అయోధ్యాయాం = అయోధ్యయందు, మొదటివాఁడైనయనుట; రాజానం = రాజునుగా; విద్ధి = ఎఱుంగుము.

ఆ ఇక్ష్వాకువె యయోధ్యయందు మొదటిరాజనియెఱుంగుము. అని, తాత్పర్యము.

ఇక్ష్వాకోస్తు సుతశ్శ్రీమాన్ కుక్షిరిత్యేవ విశ్రుతః. ౧౯

టీక॥ ఇక్ష్వాకోస్తు = ఇక్ష్వాకువుయొక్కయు; సుతః = కొడుకు; శ్రీమాన్ = సంపదగలిగినట్టి; కుక్షిరిత్యేవ = కుక్షియనియె; విశ్రుతః = ప్రసిద్ధుఁడయ్యెను.

ఇక్ష్వాకువు, కొడుకు, శ్రీమంతుఁడగుకుక్షియయ్యెను. అని, తాత్పర్యము.

కుక్షే రథాత్మజ శ్శ్రీమాన్ వికుక్షి రుదపద్యత
వికుక్షేస్తు మహాతేజా బాణః పుత్రః ప్రతాపవాన్. ౨౦

టీక॥ అథ = అంతట; కుక్షేః = కుక్షికి; శ్రీమాన్ = సంపదగలవాఁడగు; వికుక్షిః = వికుక్షియను; ఆత్మజః = కొడుకు; ఉదపద్యత = పుట్టెను.

వికుక్షే స్తు = వికుక్షికిని; మహాతేజాః= అధికమయినకాంతిగలవాఁడును; ప్రతాపవాన్ = పరాక్రమశాలియునగు; బాణః= బాణుఁడను; పుత్రః=కొడుకు; ఉదపద్యత (అధ్యాహృతము)=పుట్టెను.

కుక్షికి, శ్రీమంతుండగు వికుక్షి యనుకొడుకు పుట్టెను; వికుక్షికి, మహాతేజుండును బరాక్రమశాలియునగు, బాణుండను పుత్రుండు పుట్టెను. అని, తాత్పర్యము.

బాణస్యతు మహాతేజా అనరణ్యః ప్రతాపవాన్
అనరణ్యా త్పృథు ర్జజ్ఞే త్రిశంకు స్తు పృథోస్సు తః. ౭౧

టీక॥ బాణస్యతు=బాణునకును; మహాతేజాః= అధికమయినకాంతి గలవాఁడును; ప్రతాపవాన్=పరాక్రమశాలియునగు; అనరణ్యః=అనరణ్యుండనువాఁడు; జజ్ఞే (అధ్యాహృతము)=పుట్టెను. అనరణ్యాత్=అనరణ్యునివలన; పృథుః=పృథువనువాఁడు; జజ్ఞే = పుట్టెను. పృథోస్తు=పృథువునకును; త్రిశంకుః=త్రిశంకువను; సుతః=కొడుకు; జజ్ఞే=(అధ్యాహృతము) పుట్టెను.

బాణునకు, మహాతేజుండును బరాక్రమశాలియునగు ననరణ్యుండు పుట్టెను; అనరణ్యునకుఁ బృథువనువాఁడు పుట్టెను; పృథుపుత్రుండు, త్రిశంకువు. అని, తాత్పర్యము.

త్రిశంకో రభవ త్పుత్రో దుందుమారో మహాయశాః
యువనాశ్వసుతస్త్వాసీ న్మాంధాతా పృథివీపతిః. ౭౨

టీక॥ త్రిశంకోః = త్రిశంకువునకు; మహాయశాః = అధికమయినకీర్తిఁగల; దుందుమారః=దుందుమారుండను; పుత్రః = కొడుకు; అభవత్ = కలిగెను. యువనాశ్వసుతస్తు= యువనాశ్వుండనునామాంతరముగల, దుందుమారునికొడుకును; పృథివీపతిః=భూమికిఁ బ్రభువయిన; మాంధాతా= మాంధాత యనువాఁడు; ఆసీత్ =ఆయెను.

త్రిశంకువునకు మహాయశుండగు దుందుమారుండను కొడుకు పుట్టెను; అతనికి యువనాశ్వుండను నామాంతరము గలదు; అతనికి మాంధా

తయనువాఁడుపుత్రుండయ్యె. అని, తాత్పర్యము.

మాంధాతుస్తు సుత శ్శ్రీమాన్ సుసంధి రుదపద్యత
సుసంధేరపి పుత్రౌ ద్వౌ ధ్రువసంధిః ప్రసేనజిత్. ౨౩

టీక॥ మాంధాతుస్తు=మాంధాతకును; శ్రీమాన్ = సంపదగలఁ; సుసంధిః = సుసంధియనెడు; సుతః=కొడుకు; ఉదపద్యత=పుట్టెను. సుసంధేరపి=సుసంధికిని; ధ్రువసంధిః=ధ్రువసంధియనువాఁడును; ప్రసేనజిత్=ప్రసేనజిత్తనువాఁడును; ద్వౌ=ఇద్దఱు; పుత్రౌ=కొడుకులు; ఉదపద్యేతాం(అధ్యాహృతము)=పుట్టిరి.

మాంధాతకు, శ్రీమంతుండగు సుసంధియనువాఁడు పుట్టెను; సుసంధికి ని ధ్రువసంధియని ప్రసేనజిత్తని, నిర్వురుకొడుకులుగల్గిరి. అనితాత్పర్యము

యశస్వీ ధ్రువసంధే స్తు భరతో నామ నామతః
భరతాత్తు మహాతేజా అసితో నామ జాతవాన్. ౨౪

టీక॥ ధ్రువసంధేస్తు=ధ్రువసంధికిని; యశస్వీ=ప్రశస్తంబగుకీర్తిగల; నామతః=పేరువలన; భరతో నామ= భరతుఁడని ప్రసిద్ధుండైనవాఁడు; జాతవాన్=(అధ్యాహృతము)పుట్టెను. భరతాత్తు=భరతునివలనను; మహాతేజాః=అధికమయినపరాక్రమంబుగల; అసితో నామ= అసితుండనువాఁడు; జాతవాన్=పుట్టెను.

ధ్రువసంధికిఁగీర్తిశాలియగు భరతుండనువాఁడుపుట్టెను; భరతునకు, మహాపరాక్రమశాలి యయిన యసితుండను పుత్రుండు జనియించెను.

అని, తాత్పర్యము.

యస్యై తే ప్రతిరాజాన ఉదపద్యంత శత్రవః
హైహయా స్తాలజంఘాశ్చ శూరా శ్చశశిబిందవః. ౨౫

టీక ॥ యస్య=ఏయసితునకు; హైహయాః= హైహయులనువారును; తాలజంఘాశ్చ=తాలజంఘులనువారును; శూరాః=యుద్ధము

నందుభయపడనట్టి; శశిబిందవశ్చ= శశిబిందువులనువారును; ఏతే=ఈ; ప్రతిరాజానః= ప్రతిపక్షరాజులు; శత్రవః=హింసించువారుగా; ఉదపద్యంత=పుట్టిరో.

ఆయసితునకు, హైహయులును దాలజంఘులును శూరులగుశశిబిందువులును ఈరాజులు, శత్రువులయి హింససేయుచుండిరి.

అని, తాత్పర్యము.

తాంస్తు స ప్రతియుధ్యన్ వై యుద్ధే రాజా ప్రవాసితః

టీక॥ రాజా=రాజైన; సతు= ఆయసితుండును; తాన్=ఆశత్రువులనుగూర్చి; ప్రతియుధ్యన్=బదులుయుద్ధముసేయుచు ("వై" అనునది పాదపూరణార్థము); యుద్ధే=జగడమునందు; ప్రవాసితః= ఊరువెడలఁగొట్టఁబడెను.

ఆయసితుండును, వారలుయుద్ధమునకురాఁగావారలతోఁ బోరుచుండఁగా, నాయుద్ధమునందే, పరాజితుండై, యూరువెడలఁగొట్టఁబడెను. అని, తాత్పర్యము.

హిమవంత ముపాగమ్య భృగుప్రస్రవణేఽవసత్. ౨౬

అసి తోఽల్పబలో రాజా మంత్రిభి స్సహిత స్తదా

టీక॥ తదా=అప్పుడు; రాజా= ప్రభువయిన; అసితః = అసితుఁడు; అల్పబలః=కొంచెపుసైన్యముగలవాఁడై; మంత్రిభిః= మంత్రులతో; సహితః=కూడినవాఁడై; హిమవంతం= హిమవత్పర్వతమును; ఉపాగమ్య=పొంది; భృగుప్రస్రవణే=భృగుప్రస్రవణమను శిఖరమునందు; అవసత్=ఉండెను.

అప్పుడు, అసితుండు, అల్పంబగుసేనంగూడి, మంత్రులతో, హిమవత్పర్వతంబునకుఁబోయి, యచ్చట భృగు ప్రస్రవణంబను శిఖరంబున, వాసముసేయుచుండెను.

అని, తాత్పర్యము.

ద్వేచా స్య భార్యే గర్భిణ్యౌ బభూవతు రితి శ్రుతమ్. ౨౭

టీక ॥ అస్య=ఈయసితునియొక్క; భార్యే=పెండ్లాములు; ద్వే




చ=ఇర్వురును; గర్భిణ్యౌ=చూలు గలవారలుగా; బభూవతుః=అయిరి; ఇతి=అని; శ్రుతం=వినఁబడినది.

అప్పుడా యసితునిభార్య లిర్వురును, గర్భములుధరించిరి; అని, వినియున్నాను. అని, తాత్పర్యము.

ఏకా గర్భవినాశాయ సపత్న్యై సగరం దదౌ

టీక॥ఏకా=ఒకతె; సపత్న్యై=చవతికొఱకు; గర్భవినాశాయ=గర్భముయొక్క-నశించుటకొఱకు; సగరం=విషముతోఁగూడినదానిని; దదౌ=ఇచ్చెను.

ఆభార్యలలోనొక్క-తె, తనచవతికి, దానిగర్భమునశించుటకై, విషముపెట్టినభక్ష్యంబునిచ్చినది.

అని, తాత్పర్యము.

తత శ్శైలవరం రమ్యం బభూవా భిరతో మునిః. ౨౮

భార్గవ శ్చ్యవనో నామ హిమవంత ముపాశ్రితః

టీక॥తతః=అటుపిమ్మట; భార్గవః=భృగువంశమునందుఁబుట్టినట్టి; చ్యవనో నామ=చ్యవనుండనెడు; మునిః=ముని; అభిరతః=సంతసించినవాఁడై, రమ్యం=మనోహరమును; శైలవరం=పర్వతంబులకుఁబ్రభువునగు; హిమవంతం=హిమవత్పర్వతమును; ఉపాశ్రితః=పొందినవాఁడు; బభూవ=ఆయెను.

అంత, భృగువంశంబునంబుట్టిన చ్యవనుండనుమహర్షి, యసితుననుగ్రహింపఁగోరి, రమణీయంబును బర్వతరాజంబునగు హిమవత్పర్వతంబునకువచ్చెను. అని తాత్పర్యము

తత్రై కాతు మహాభాగా భార్గవం దేవవర్చసమ్. ౨౯

వవందే పద్మపత్రాక్షీ కాంక్షంతీ సుత మాత్మనః

టీక॥తత్ర=ఆయిరువురిభార్యలలో, మహాభాగా=పూజ్యమయినభాగ్యము గలదియు; పద్మపత్రాక్షీ= తామరపూరేకులవంటికండ్లు గలదియునగు; ఏకాతు=ఒక్క-తెమాత్రము; ఆత్మనః=తనయొక్క-; సుతం=కొడుకును; కాంక్షంతీ=కోరుచు; దేవవర్చసం = వేల్పుయొ




కర్ణికారకాంతివంటికాంతిగలః భార్గవం—భృగువంశమునంబుట్టిన చ్యవనునిః వవందే=నమస్కరించెను.

ఆయిర్వురిలో, మిక్కిలియు భాగ్యశాలియుఁ దామర పూరేకుల వంటికండ్లుగలదియునగునది విషం బుభక్షించినభార్య, తనకొడుకుశ్రేష్ఠుంబుగాఁబుట్టవలెననికోరి, వేల్పునకుంబోలెఁ గాంతిగల భార్గవుండగు, చ్యవనునినమస్కరించెను.

అని, తాత్పర్యము.

త మృషిం సా భ్యుపాగమ్య కాళిందీచా భ్యవాదయత్. ౩౦

టీక ॥ సా=ఆచవతికివిషంబిడినః కాళిందీచ= కాళిందియనునదియునుః తం=ఆః ఋషిం=ఆచ్యవనమహర్షినిః అభ్యుపాగమ్య=చేరిః అభ్యవాదయత్=నమస్కరించెను

అట్లు, చవతికివిషంబిడిన కాళిందియనుమఱియొకభార్యయును, ఆ చ్యవనుడగ్గఱి, యతనికి నమస్కారంబుగావించెను.

అని, తాత్పర్యము.

స తా మభ్యవద ద్విప్రః పుత్రేప్సుం పుత్రజన్మని

టీక॥సః=ఆః విప్రః=బ్రాహ్మణుండగుచ్యవనుండుః పుత్రేప్సుం=కొడుకును గోరుచున్న; తాం=ఆ మొదట నమస్కరించిన దానింగూర్చి, పుత్రజన్మని=కొడుకు పుట్టుట విషయమైః అభ్యవదత్=చెప్పెను.

బ్రాహ్మణుండగునాచ్యవనుండు కొడుకుంగోరి తనకు మొదట, నమస్కరించినవిషంబు దిన్నదానింజూచి, కొడుకుజనించువిషయమై, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తవ కుక్షౌ మహాభాగే సుపుత్ర స్సుమహాబలః. ౩౧
మహావీర్యో మహాతేజా అచిరా త్సంజనిష్యతి
గరేణ సహిత శ్శ్రీమాన్ మాశుచః కమలేక్షణే. ౩౨



టీక॥ మహాభాగే=పూజ్యమయి నస్వభావముగల; కమలేక్షణే=తామరపూలవంటి కండ్లుగలయాఁడుదానా! తవ=నీయొక్క; కుక్షౌ=కడుపునందు; సుమహాబలః=మిక్కిలియునధికమయిన బలముగలవాఁడును; మహావీర్యః=అధికమయినపరాక్రమముగలవాఁడును ; మహాతేజాః= అధికమయినకాంతిగలవాఁడును; శ్రీమాన్ = సంపదగలవాఁడునగు; సుపుత్రః=మంచికొడుకు; గరేణ=విషముతో; సహితః=కూడినవాఁడై; అచిరాత్ = శీఘ్రముగా; సంజనిష్యతి = పుట్టఁగలఁడు. మాశుచః=దుఃఖింపకుము.

మహాభాగ్యశాలివగు చిన్నదానా! నీకడుపునందు, మహాబలుండును మహాపరాక్రమశాలియును మహాతేజుండును శ్రీమంతుండునగుమంచి పుత్రుండు, విషముతోఁగూడినవాఁడై, శీఘ్రింబుగాఁబుట్టును. అని, చ్యవనుండు చెప్పెను. అని తాత్పర్యము.

చ్యవనంతు నమస్కృత్య రాజపుత్రీ పతివ్రతా
పతిశోకాతురా తస్మాత్పుత్రం దేవీ వ్యజాయత. ౩౩

టీక॥ పతివ్రతా=పతిభక్తిగలదియును; దేవీ=పట్టపురాణియునగు; రాజపుత్రీ=రాచకొమార్తె; చ్యవనంతు= చ్యవనునిమాత్రము; నమస్కృత్య=మ్రొక్కి; పతిశోకాతురా= పెనిమిటివలనిదుఃఖముచేఁ బీడింపఁబడినదై; తస్మాత్=ఆచ్యవనునియనుగ్రహంబువలన; పుత్రం= కొడుకును; వ్యజాయత=కనెను.

పతివ్రతయునుబట్టపురాణియునగు నారాచకొమార్తె చ్యవనునకుమ్రొక్కి, యంతఁబెనిమిటిచనిపోవఁగామిక్కిలియుదుఃఖంబునొంది, చ్యవనుననుగ్రహంబునంజేసి , పుత్రుంగనెను.

అని, తాత్పర్యము.

సపత్న్యాతు గరస్తస్యై దత్తో గర్భజిఘాంసయా
సహ తేన గరేణైవ జాతస్స సగరోభవత్. ౩౪

టీక॥ సపత్న్యాతు=చవతిచేతను; గర్భజిఘాంసయా=గర్భమునుజంపనిచ్ఛచేత; తస్యై=ఆబిడకొఱకు; గరః=విషము; దత్తః= ఇవ్వఁ



బడినది. తేన=ఆ; గరేణసహైవ=విషముతోఁగూడనే; జాతః=పుట్టిన, (కావుననే); సః=ఆపుత్రుఁడు; సగరః = సగరుఁడనువాఁడు(విషముతోఁగూడినవాఁడు); అభవత్=ఆయెను.

ఆబిడకుఁ, జవతి, గర్భమునుబోఁగొట్టఁదలంచి, విషముఁబెట్టెను; ఆవిషముతోఁగూడనేపుట్టినందున, నాపుత్రుండుసగరుండనంబడెను.

అని, తాత్పర్యము.

సగరస్యా సమంజ స్తు అసమంజా త్తథాం శుమాన్
దిలీపోం శుమతః పుత్రో దిలీపస్య భగీరథః ౩౫

టీక॥ సగరస్యతు=సగరునియొక్కయు; పుత్రః (అధ్యాహృతము)=కొడుకు; అసమంజః = అసమంజుండనువాఁడు; తథా=అట్లు; అసమంజాత్= అసమంజునివలన; అంశుమాన్= అంశుమంతుండనువాఁడు; జాతః(అధ్యాహృతము)= పుట్టెను. అంశుమతః=అంశుమంతునియొక్క; పుత్రః=కొడుకు; దిలీపః=దిలీపుండు. దిలీపస్య = దిలీపునియొక్క; పుత్రః(అధ్యాహృతము) కొడుకు; భగీరథః = భగీరథుండనువాఁడు.

సగరునకసమంజుండుపుట్టెన; అసమంజున కంశుమంతుండుజనించెను; అంశుమంతునకుదిలీపుఁడనువాడుకల్గెను, దిలీపునకుభగీరథుండు పుట్టెను. అని, తాత్పర్యము.

భగీరథా త్కకుత్థ్సశ్చ కకుత్థ్సస్య రఘుస్సుతః

టీక॥భగీరథాచ్చ=భగీరథునివలనను; కకుత్థ్సశ్చ=కకుత్థ్సుండనువాఁడు; జాతః=(అధ్యాహృతము)పుట్టెను; కకుత్థ్సస్య = కకుత్థ్సునియొక్క; సుతః = కొడుకు; రఘుః=రఘువనువాఁడు.

భగీరథునకుఁ గకుత్థ్సుండుపుట్టెను, కకుత్థ్సునకురఘువనువాఁడుకలిగెను. అని, తాత్పర్యము.

రఘోస్తు పుత్ర స్తేజస్వీ ప్రవృద్ధః పురుషాదకః. ౩౬
కల్మాషపాదో హ్యభవ త్తస్మా జ్జాత స్తు శంఖణః

టీక॥ రఘోస్తు=రఘువుయొక్క యొక్క; పుత్రః=కొడుకు; తేజస్వీ=కాంతిగల; ప్రవృద్ధః=ప్రవృద్ధుండను పేరుగల వాఁడును; పురుషాదకః=(మనుష్యులందినువాఁడును) పురుషాదకుండనువాఁడును; కల్మాషపాదః=(కల్మషము పాదమునందుఁగలవాఁడును) కల్మాషపాదుండనువాఁడునుగా; అభవత్ హి=అయెనుగదా! తస్మాత్తు=అతనివలనను; శంఖణః=శంఖణుండనువాఁడు; జాతః=పుట్టెను.

రఘువునకుఁ, బూర్వము ప్రవృద్ధుండను పేరొంది, యవ్వాలవసిష్ఠుని శాపంబున రాక్షసుండై పురుషాదుండను నామంబునొందియంతదానువసిష్ఠునిశపింపజలము గ్రహించి తనభార్యయూఁబడింపఁగా దానివిడిచినది తనకాళ్లమీదంబడుటవలనఁ గల్మాషపాదుండనుపేరం బ్రసిద్ధుండైన,పుతుృండుగల్గెను; అతనికి శంఖణుండనువాఁడుపుట్టెను.

అని, తాత్పర్యము.

స్సుదర్శన శ్శంఖణస్య అగ్నివర్ణ స్సుదర్శనాత్. ౩౭

టీక॥ శంఖణస్య=శంఖణునకు; సుదర్శనః=సుదర్శనుండనువాఁడు; జాతః(అధ్యాహృతము)=పుట్టెను. సుదర్శనాత్=సుదర్శనునివలనఁ అగ్నివర్ణః=అగ్నివర్ణుండనువాఁడు; జాతః (అధ్యాహృతము) = పుట్టెను.

శంఖణునకు సుదర్శనుండుపుట్టెను; సుదర్శనునకగ్నివర్ణుండు, జనించెను. అని, తాత్పర్యము.

శీఘ్రగ స్త్వగ్నివర్ణస్య శీఘ్రగస్య మరు స్సుతః
మరోః ప్రశుశ్రుక స్త్వాసీ దంబరీషః ప్రశుశ్రుకాత్. ౩౮

టీక॥ అగ్నివర్ణస్యతు=అగ్నివర్ణునకును; శీఘ్రగః=శీఘ్రగుండనువాఁడు ; ఆసీత్(అధ్యాహృతము)=కలిగెను . శీఘ్రగస్య=శీఘ్రగునకు; మరుః=మరుండను; సుతః=కొడుకు ; ఆసీత్ (అధ్యాహృతము)=కలిగెను. మరోస్తు=మరువునకును; ప్రశుశ్రుకః=ప్రశుశ్రుకుం

డనువాఁడు, ఆసీత్ = కలిగెను. ప్రశు శ్రుకాత్ = ప్రశుశ్రుకునివలన; అంబరీషః = అంబరీషుండనువాఁడు; ఆసీత్ (అధ్యాహృతము) = కలిగెను.

అగ్నివర్ణునకు శీఘ్రగుండుపుట్టెను, శీఘ్రగునకుమరువుజనించెను; మరువునకుఁ బ్రశుశ్రుకుండుకలిగెను; ప్రశుశ్రుకునకంబరీషుండు పుట్టెను. అని, తాత్పర్యము.

అంబరీషస్య పుత్రో భూ న్నహుషః పృథివీపతిః
నహుషస్య యయాతి స్తు నాభాగ స్తు యయాతిజః. ౨౯

టీక॥ అంబరీషస్య = అంబరీషునకు; పృథివీపతిః = భూమికిఁబ్రభువయిన; నహుషః = నహుషుండనువాఁడు; పుత్రః = కొడుకు; అభూత్ = కలిగెను. నహుషస్యతు = నహుషునకును; యయాతిస్తు = యయాతియనువాఁడు; అభూత్ (అధ్యాహృతము) = కలిగెను. యయాతిజస్తు = యయాతివలనంబుట్టినవాఁడును; నాభాగః = నాభాగుండనువాఁడు; అభూత్ (అధ్యాహృతము) = అయ్యెను.

అంబరీషునకు భూపతియయిన నహుషుండనువాఁడుపుత్రుండయ్యెను; నహుషునకు యయాతిపుట్టె; యయాతికి నాభాగుండనువాఁడుజనించె. అని, తాత్పర్యము.

ఈనహుషుండునుయయాతియును వేఱు; చంద్రవంశంబునఁబుట్టిన నహుషయయాతులు వేఱు.

నాభాగస్య బభూవా జః అజా ద్దశరథో భవత్
అస్మా ద్దశరథా జ్జాతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౩౦

టీక॥ నాభాగస్య = నాభాగునకు; అజః = అజుండనవాఁడు; బభూవ = కలిగెను. అజాత్ = అజునివలన; దశరథః = దశరథుఁడు; అభవత్ = కలిగెను. అస్మాత్ = ఈ; దశరథాత్ = దశరథునివలన; భ్రాతరౌ = తోడంబుట్టువులయిన; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు; జాతౌ = పుట్టిరి.

నాభాగునకజుండనవాఁడు

పుట్టెను; అజునకుదశరథుండు జన్మిం చెను; ఈదశరథునకుసహోదరుల గనీరామలక్ష్మణులుపుట్టిరి. అని, తాత్పర్యము.

ఆదివంశవిశుద్ధానాం రాజ్ఞాం పరమధర్మిణామ్
ఇక్ష్వాకుకులజాతానాం వీరాణాం సత్యవాదినామ్. ౪౧
రామలక్ష్మణయోరర్థే త్వత్సుతే వరయే నృప
సదృశాభ్యా న్నరశ్రేష్ఠ సదృశే దాతు మర్హసి. ౪౨

టీక॥ నృప=జనకమహారాజా! ఆదివంశవిశుద్ధానాం=మొదటనుండివంశముచేఁబరిశుద్ధులును; పరమధర్మిణాం = మిక్కిలియుధర్మముగలవారలును; వీరాణాం = పరాక్రమంబుగలవారలును;సత్యవాదినాం= సత్యమునేమాటలాడువారలు నగు; ఇక్ష్వాకు కులజాతానాం=ఇక్ష్వాకువంశంబునందుఁబుట్టిన; రాజ్ఞాం=రాజులసంబంధులగు; రామలక్ష్మణయోరర్థే=రామలక్ష్మణులకుఁగాను; త్వత్సుతే=నీకొమార్తెలనిద్దఱను; వరయే=వరింపుచున్నాను. నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగుజనకుఁడా! సదృశాభ్యాం=సమానులయినరామలక్ష్మణులకొఱకు; సదృశే=సమానులగుకూఁతులను; దాతుం=ఇచ్చుటకు; అర్హసి=తగుదువు.

జనకుఁడా! మొదటనుండిపరిశుద్ధంబగువంశంబుగల్గిపరమధార్మికులై, పరాక్రమశాలులై, సత్యవాదులయిన, యిక్ష్వాకు వంశ్యులగు రాజులకులమునందుఁబుట్టినరామలక్ష్మణులకునీకొమార్తెలనిమ్మనికోరెదను; వీరును నీకొమార్తెలును రూపసౌందర్యంబుల నీడుగానున్నవారు;వీరికి నీకొమార్తెలనిచ్చుటయుక్తంబగు.అని,వసిష్ఠుండు, జనకునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే,సప్తతితమస్సర్గః
ఇది,స్పష్టార్థము,
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రి

వ్యాఖ్యానంబునందు, బాలకాండసప్తతితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

ఏకసప్తతితమసర్గప్రారంభః.

ఏవం బ్రువాణం జనకః ప్రత్యువాచ కృతాంజలిః

టీక ॥ జనకః=జనకుఁడు; కృతాంజలిః= చేయఁబడినచేమోడ్పుగలవాఁడై; ఏవఁ=ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్న వసిష్ఠునిఁగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

వసిష్ఠుండట్లుచెప్పఁగానే, జనకుండు చేతులుమొగిడ్చి వసిష్ఠునకు బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

శ్రోతు మర్హసి భద్రం తే కులం నః పరికీర్తితమ్. ౧

టీక॥ తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)= అగుఁగాక. నః=మా యొక్క; పరికీర్తితం=పొగడఁబడిన; కులం=వంశమును; శ్రోతుం=వినుటకు; అర్హసి=తగుదువు.

నీకుమంగళమగుఁగాక; పొగడ్తకెక్కినమావంశమును నీవువినవలయును.

అని, తాత్పర్యము.

ప్రదానే హి మునిశ్రేష్ఠ కులం నిరవశేషతః
వక్తవ్యం కులజాతేన తన్నిబోధ మహామునే. ౨

టీక ॥ మునిశ్రేష్ఠ=మునులలో మేటివయినవసిష్ఠుఁడా! కులజాతేన= మంచికులంబునందుఁబుట్టినవానిచేత; ప్రదానే=కన్యనిచ్చుటవిషయమునందు; కులం=వంశము; నిరవశేషతః= సాకల్యముగా; వక్తవ్యం= చెప్పఁబడవలసినది; మహామునే= పూజ్యుఁడగుమునివగు వసిష్ఠుఁడా! తత్=ఆవంశమును; నిబోధ=తెలిసికొనుము.

మునిశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా! మంచికులంబునందుఁ బుట్టినవాఁడు తానుగన్యాదానంబుసేయునపుడు తనవంశమునంతయు, నిశ్శేషంబుగాఁ జెప్పవలయును; నావంశము చెప్పెదవినుము అని, తాత్పర్యము.

రాజా భూ త్త్రిషు లోకేషు విశ్రుత స్స్వేన కర్మణా
నిమిః పరమ ధర్మాత్మా సర్వస త్త్వవతాం వరః. ౩

టీక॥ స్వేన=తనదైన; కర్మణా=కార్యముచేత; త్రిషు=మూఁడైన; లోకేషు=లోకంబులయందు, విశ్రుతః=ప్రసిద్ధుండును; పరమధర్మాత్మా=మిక్కిలియును ధర్మబుద్ధి గలవాఁడును; సర్వసత్త్వవతాం=ఎల్లబలముగలవారిలోను; వరః=శ్రేష్ఠుండునగు; నిమిః=నిమియను; రాజా=రాజు; అభూత్=ఉండెను.

తనకర్మంబులచేత ముల్లోకంబులందునుం బ్రసిద్ధికెక్కి, పరమధార్మికుండై బలవంతులనెల్లరిలోను శ్రేష్ఠుండై నిమియను నొకరాజుండెను. అని, తాత్పర్యము.

తస్య పుత్రో మిథి ర్నామ మిథిలా యేన నిర్మితా
ప్రథమో జనకో నామ జనకా దప్యుదావసుః. ౪

టీక॥ తస్య=ఆనిమియొక్క; పుత్రః=కొడుకు; యేన=ఎవ్వనిచేత; మిథిలా=మిథిలాపట్టణము; నిర్మితా=నిర్మింపఁబడినదో, సః=(అధ్యాహృతము)అట్టి; మిథిర్నామ=మిథియనువాఁడు; అభవత్=(అధ్యాహృతము)అయ్యెను. సః=(అధ్యాహృతము) వాఁడు; ప్రథమః=మొదటి, జనకోనామ=జనకుండని ప్రసిద్ధుఁడయినవాఁడు. జనకాదపి=జనకునివలనను; ఉదావసుః=ఉదావసువు; బభూవ(అధ్యాహృతము)=కలిగెను.

ఆనిమికుమారుండు మిథియనువాఁడు; అతనిచేతనే యీమిథిలనిర్మింపఁబడినది; అతండే మొదటి జనకుండు; అతనికి దావసువు కలిగెను. అని, తాత్పర్యము.

ఉదావసో స్తు ధర్మాత్మా జాతో వై నందివర్ధనః

నందివర్ధన పుత్రస్తు సుకేతు ర్నామ నామతః. ౫

టీక॥ ఉదావసోస్తు=ఉదావసువునకును, ధర్మాత్మా=ధర్మబుద్ధి గలః నందివర్ధనః=నందివర్ధనుండనువాఁడు; జాతః=కలిగెను("వై" అను నది పాదపూరణార్థము). నందివర్ధనపుత్రస్తు= నందివర్ధనునికొడుకును; నామతః=పేరువలనః సుకేతుర్నామ= సుకేతువని ప్రసిద్ధుఁడు.

ఉదావసువునకు, ధర్మాత్ముండగు నందివర్ధనుండు పుట్టెను; నందివర్ధనునకు సుకేతువని ప్రసిద్ధుండయిన కొడుకు గల్గెను.

అని, తాత్పర్యము.

సుకేతోరపి ధర్మాత్మా దేవరాతో మహాబలః
దేవరాతస్య రాజర్షే ర్బృహద్రథఇతి స్మృతః. ౬

టీక॥ సుకేతోరపి=సుకేతువునకును; ధర్మాత్మా=ధర్మబుద్ధిగలవాఁడును; మహాబలః=అధికమయినబలము గలవాఁడునగు; దేవరాతః= దేవరాతుండు; బభూవ = (అధ్యాహృతము)కలిగెను. రాజర్షేః= రాజునుఋషియునగు; దేవరాతస్య=దేవరాతునకు; బృహద్రథఇతి= బృహద్రథుండని; స్మృతః=చెప్పఁబడినవాఁడు; బభూవ= (అధ్యాహృతము)కల్గెను.

సుకేతువునకు ధర్మాత్ముండును అధికమయినబలముగలవాఁడునగు దేవరాతుండుజనించెను; రాజర్షియగు దేవరాతునకు బృహద్రథుండనువాఁడు కలిగెను.

అని, తాత్పర్యము.

బృహద్రథస్య శూరో భూ న్మహావీరః ప్రతాపవాన్
మహావీరస్య ధృతిమాన్ సుధృతి స్సత్యవిక్రమః. ౭

టీక॥ బృహద్రథస్య=బృహద్రథునకు; శూరః=యుద్ధమునందు భయపడనివాఁడును, ప్రతాపవాన్= పరాక్రమంబు గలవాఁడునగు; మహావీరః=మహావీరుండనువాఁడు; అభూత్=కలిగెను. మహావీరస్య=మ

హావీరునకు, ధృతిమాన్ = ఎచ్చుగా ధైర్యముగలవాఁడును; సత్యవిక్రమః = ఎచ్చటను వ్యర్థము కానిపరాక్రమంబుగలవాఁడునగు; సుధృతిః = సుధృతియనువాఁడు; అభూత్ = (అధ్యాహృతము) కలిగెను.

బృహద్రథునకు శూరుండును బరాక్రమశాలియునగు మహావీరుండు కలిగెను; మహావీరునకు ధైర్యశాలియు సత్యపరాక్రముండునగు సుధృతిజన్మించెను.

అని, తాత్పర్యము.

సుధృతేరపి ధర్మాత్మా దృష్టకేతు స్సుధార్మికః
దృష్టకేతోస్తు రాజర్షే హర్యశ్వఇతి విశ్రుతః. ౮

టీక॥ సుధృతేరపి = సుధృతికిని; ధర్మాత్మా = ధర్మబుద్ధిగలవాఁడును; సుధార్మికః = చక్కగా ధర్మమునాచరించువాఁడునగు; దృష్టకేతుః = దృష్టకేతువనువాఁడు; అభూత్ (అధ్యాహృతము) = కల్గెను. రాజర్షేః = రాజును ఋషియునగు; దృష్టకేతోస్తు = దృష్టకేతువునకును; హర్యశ్వ ఇతి = హర్యశ్వుండని; విశ్రుతః = ప్రసిద్ధుఁడయినవాఁడు; అభూత్ (అధ్యాహృతము) = కల్గెను.

సుధృతికి, ధర్మబుద్ధిగలిగి ధర్మంబునాచరించుచుండిన దృష్టకేతువు జన్మించెను; రాజర్షియగు దృష్టకేతువునకును హర్యశ్వుండనువాఁడుకల్గెను. అని, తాత్పర్యము.

హర్యశ్వస్య మరుః పుత్రో మరోః పుత్రః ప్రతింధకః
ప్రతింధకస్య ధర్మాత్మా రాజా కీర్తిరథ స్సుతః. ౯

టీక॥ హర్యశ్వస్య = హర్యశ్వుని యొక్క; పుత్రః = కొడుకు; మరుః = మరువనువాఁడు. మరోః = మరువు యొక్క; పుత్రః = కొడుకు; ప్రతింధకః = ప్రతింధకుఁడు. ప్రతింధకస్య = ప్రతింధకుని యొక్క; సుతః = కొడుకు; ధర్మాత్మా = ధర్మబుద్ధిగల; కీర్తిరథః = కీర్తిరథుఁడను; రాజా = రాజు.

హర్యశ్వునికొడుకు మరువనంబ

డియె; మరువునకుఁ బ్రతింధకుఁడు; ప్రతింధకునకు ధర్మబుద్ధిగల కీర్తిర థుఁ డను పుత్రుండుఁ గల్గె.

అని, తాత్పర్యము.

పుత్రః కీర్తిరథస్యాపి దేవమీఢ ఇతి స్మృతః
దేవమీఢస్య విబుధో విబుధస్య మహీంధ్రకః. ౧౦

టీక॥ కీర్తిరథస్యాపి=కీర్తిరథుఁ నియొక్కయు; పుత్రః=కొడుకు; దేవమీఢ ఇతి = దేవమీఢుఁడని; స్మృతః = చెప్పఁబడినాఁడు. దేవమీఢస్య=దేవమీఢునకు; విబుధః = విబుధుండనువాఁడు; అభవత్ (అధ్యాహృతము)=కలిగెను. విబుధస్య=విబుధునకు; మహీంధ్రకః = మహీంధ్రకుఁడు ; అభవత్ (అధ్యాహృతము)=కలిగెను.

కీర్తిరథుని పుత్రుండు దేవమీఢుం డనంబడెను; దేవమీఢునకు విబుధుం డనువాఁడు కల్గెను ; విబుధునకు మహీంధ్రకుఁడు జన్మించె.

అని, తాత్పర్యము.

మహీంధ్రకసుతో రాజా కీర్తిరాతో మహాబలః
కీర్తిరాతస్య రాజర్షే ర్మహారోమా వ్యజాయత. ౧౧

టీక॥ మహీంధ్రకసుతః = మహీంధ్రకుని కొడుకు; మహాబలః=అధికమైనబలముగల; రాజా=రాజయిన; కీర్తిరాతః = కీర్తిరాతుండను వాఁడు. రాజర్షేః=రాజునుఋషియునగు; కీర్తిరాతస్య=కీర్తిరాతునకు; మహారోమా=మహారోముండు; వ్యజాయత=పుట్టెను.

మహీంధ్రకునకు మహాబలుండగు కీర్తిరాతుండను వాఁడు కల్గెను; రాజర్షియగు కీర్తిరాతునకు మహారోముండు జన్మించెను.

అని, తాత్పర్యము.

మహారోమ్ణస్తు ధర్మాత్మా స్వర్ణరోమా వ్యజాయత
స్వర్ణరోమ్ణస్తు రాజర్షే ర్హ్రస్వరోమా వ్యజాయత. ౧౨

టీక॥ మహారోమ్ణస్తు=మహారోమునకును; ధర్మాత్మా= ధర్మబు

ద్ధిగలు, స్వర్ణరోమా=స్వర్ణరోముండనువాఁడు; వ్యజాయత=కలిగెను. రాజర్షేః = రాజునుబుషియునగు; స్వర్ణరోమ్ణస్తు=స్వర్ణరోమునకును; హ్రస్వరోమా=హ్రస్వరోముండు; వ్యజాయత = కలిగెను.

మహారోమునకు ధార్మికుండగుస్వర్ణరోముండుకల్గెను; రాజర్షియగునాస్వర్ణరోమునకు హ్రస్వరోముండు జన్మించెను.

అని, తాత్పర్యము.

తస్య పుత్రద్వయం జజ్ఞే ధర్మజ్ఞస్య మహాత్మనః
జ్యేష్ఠోఽహ మనుజో భ్రాతా మమ వీరః కుశధ్వజః. ౧౩

టీక॥ ధర్మజ్ఞస్య=ధర్మము నెఱింగినవాఁడును, మహాత్మనః=పూజ్యంబగుస్వభావముగలవాఁడునగు, తస్య=ఆహ్రస్వరోమునకు; పుత్రద్వయం= కొడుకులయొక్క జంట; జజ్ఞే=పుట్టినది. అహం=నేను; జ్యేష్ఠః=పెద్దవాఁడను; మమ=నాకు; అనుజః = చిన్నవాఁడైన; భ్రాతా= తోడఁబుట్టువు, వీరః=పరాక్రమము గల; కుశధ్వజః=కుశధ్వజుండు.

ధర్మముల నెఱింగినవాఁడును మహాత్ముండునగు నాహ్రస్వరోమునకు మేమిర్వురముకొడుకులముపుట్టితిమి; నేను పెద్దవాఁడను; నాతమ్ముండు, పరాక్రమశాలియగుకుశధ్వజుండు. అని, తాత్పర్యము.

మాం తు జ్యేష్ఠం పితా రాజ్యే సోఽభిషిచ్య నరాధిపః
కుశధ్వజం సమావేశ్య భారం మయి వనం గతః. ౧౪

టీక॥ పితా = తండ్రియయిన; సః=ఆ; నరాధిపః=మనుష్యులకుఁ బ్రభువయినహ్రస్వరోముండు; జ్యేష్ఠం=పెద్దవాఁడనగు; మాంతు=నన్నుమాత్రము; రాజ్యే = దొరతనమునందు; అభిషిచ్య=అభిషేకించి; మయి=నాయందు; కుశధ్వజం=కుశధ్వజుని; భారం= పోషింపఁదగినవానిఁగా; సమావేశ్య = ఉంచి; వనం=అడవిని; గతః=పొందెను.

మా తండ్రియగు నాహ్రస్వరోముండు, జ్యేష్ఠపుత్రుండనగు నన్ను

రాజ్యాభిషిక్తునింజేసి, కుశధ్వజునిరక్షించుభారమునాయుందుంచి, తపోవనంబునకుంబోయెను.
అని, తాత్పర్యము.

వృద్ధే పితరి స్వర్యాతే ధర్మేణ ధుర మావహమ్
భ్రాతరం దేవసంకాశం స్నేహా త్పశ్య న్కుశధ్వజమ్. ౧౫

టీక॥ వృద్ధే=ముదుసలియగు; పితరి=తండ్రి; స్వర్యాతే=స్వర్గంబునొందఁగానే; అహం(అధ్యాహృతము)=నేను; దేవసంకాశం=దేవతతోసమానుఁడయిన; భ్రాతరం=తమ్ముండగు; కుశధ్వజం=కుశధ్వజుని; స్నేహాత్=చెలిమివలన; పశ్యన్=చూచుచు; ధర్మేణ=ధర్మముచేత; ధురం=భారమును; ఆవహం=వహించితిని.

ముదుసలియగు తండ్రిచనిపోవఁగానే నేను దేవసమానుండు దమ్ముండునగుకుశధ్వజుని స్నేహంబునంజూచుచు, ధర్మంబున, రాజ్యభారంబు వహించితిని. అని, తాత్పర్యము.

కస్యచి త్త్వథ కాలస్య సాంకాశ్యా దగమ త్పురాత్
సుధన్వా వీర్యవా న్రాజా మిథిలా మవరోధకః. ౧౬

టీక॥ అథ=అటుపిమ్మట; కస్యచిత్=కొంత; కాలస్య=కాలము; గతే(అధ్యాహృతము)తు= పోఁగానే; సాంకాశ్యాత్=సాంకాశ్యమనెడు; పురాత్=పట్టణమునుండి; వీర్యవాన్=పరాక్రమముగల; సుధన్వా = సుధన్వుండనెడు; రాజా= రాజు; అవరోధకః = ముట్టడించువాఁడై; మిథిలాం = మిథిలను; అగమత్=పొందెను.

అంతఁ గొంతకాలమయినపిమ్మట, సాంకాశ్యపురంబునుండి, పరాక్రమశాలియగుసుధన్వుండనెడురాజు, ముట్టడివేయుటకై, మిథిలకువచ్చెను. అని, తాత్పర్యము.

సచ మే ప్రేషయామాస శైవం ధను రనుత్తమమ్
సీతా కన్యాచ పద్మాక్షీ మహ్యం వై దీయతా మితి. ౧౭



టీక॥ సచ = ఆసుధన్వుండును; "అనుత్తమం = తనకన్న శ్రేష్ఠము లేని; శైవం = శివునిదైన; ధనుః = విల్లును; పద్మాక్షీ = తామరపూలవంటి కండ్లుగల; సీతా = సీతయునేదు; కన్యాచ = పడుచును; మహ్యం = నాకు ("వై" అనునది పాదపూరణార్థము); దీయతాం = ఇయ్యఁబడుఁగాక; ఇతి = అని; దూతాన్ = (అధ్యాహృతము) రాయబారులను; మే = నాకు; ప్రేషయామాస = పంపెను.

ఆసుధన్వుండును, "శ్రేష్ఠంబగు, శివధనువును దామరపూలవంటికండ్లుగలసీతనునాకీవలయును" అని, దూతలనాయొద్దికిఁబంపెను.

అని, తాత్పర్యము.

తస్యాప్రదానాద్బ్రహ్మర్షే యుద్ధమాసీన్మయా సహ

టీక॥ బ్రహ్మర్షే = బ్రాహ్మణుండవగువసిష్ఠుఁడా! అప్రదానాత్ = ఇయ్యకుండుటవలన; తస్య = ఆసుధన్వునకు; మయాసహ = నాతోఁగూడ; యుద్ధం = జగడము; ఆసీత్ = కల్గినది.

బ్రహ్మర్షివగువసిష్ఠుఁడా! నేనాసుధన్వునకు శివధనువుసీతను ఇయ్యకపోవుటంజేసి, నాకును అతనికినియుద్ధమైనది. అని, తాత్పర్యము.

స హతోఽభిముఖో రాజా సుధన్వాతు మయా రణే. ౧౮

టీక॥ రాజా = రాజైన; సః = ఆ; సుధన్వాతు = సుధన్వుండును; రణే = యుద్ధమునందు; అభిముఖః = ఎదురుముగమై; మయా = నాచే; హతః = చంపఁబడినాఁడు.

ఆసుధన్వుండును యుద్ధమునందు నాకెదురునడిచినాచేఁ జంపఁబడెను. అని, తాత్పర్యము.

నిహత్య తం మునిశ్రేష్ఠ సుధన్వానం నరాధిపమ్
సాంకాశ్యే భ్రాతరం వీర మభ్యషించం కుశధ్వజమ్. ౧౯

టీక॥ మునిశ్రేష్ఠ = మునులలో మేటివగువసిష్ఠుఁడా! నరాధిపం = మనుష్యులకుఁబ్రభువైన; తం = ఆ; సుధన్వానం = సుధన్వుని; నిహత్య = చంపి;



సాంకాశ్యే= సాంకాశ్యపట్టణము నందు; వీరం= పరాక్రమశాలియగు; భ్రాతరం=తమ్ముఁడయిన; కుశధ్వజం= కుశధ్వజుని; అభ్యషించం=అభిషేకించితిని.

మునిశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా! మనుష్యులకుఁబ్రభువయిన యాసుధన్వునిం జంపి సాంకాశ్యపట్టణమునందు పరాక్రమశాలియగు నాతమ్ముఁడయినకుశధ్వజునిఁ బట్టాభిషిక్తునిఁ గావించితిని.

అని, తాత్పర్యము.

కనీయా నేష మే భ్రాతా అహం జ్యేష్ఠో మహామునే
దదామి పరమప్రీతో వధ్వౌ తే మునిపుంగవ. ౨౦

టీక॥ మహామునే=పూజ్యుఁడగు మునివయినవసిష్ఠుఁడా! ఏషః=వీఁడు; మే=నాయొక్క; కనీయాన్ = చిన్నవాఁడైన; భ్రాతా=తోఁబుట్టువు. అహం=నేను; జ్యేష్ఠః=పెద్దవాఁడను. అహం=(అధ్యాహృతము) నేను. మునిపుంగవ=మునిశ్రేష్ఠుండవగువసిష్ఠుఁడా! పరమప్రీతః=మిక్కిలియు సంతసించినవాఁడనై; తే=అ; వధ్వౌ=స్త్రీలనిద్దఱను; దదామి=ఇచ్చెదను.

మునిశ్రేష్ఠుండవగు వసిష్ఠమహామునీ! వీఁడు, నాతమ్ముండగు కుశధ్వజుండు; నేను జ్యేష్ఠుండను; నీవడిగినట్లు, పరమసంతోషంబున, నాయిద్దఱుఁగోడండ్ర నిచ్చెదను.

అని, తాత్పర్యము.

సీతాం రామాయ భద్రం తే ఊర్మిళాం లక్ష్మణాయ చ

టీక॥ తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక. రామాయ=రామునికొఱకు; సీతాం= సీతను; లక్ష్మణాయ= లక్ష్మణునికొఱకు; ఊర్మిళాంచ=ఊర్మిళను; దదామి = (అధ్యాహృతము) ఇచ్చెదను.

నీకుమంగళమగుఁగాక; రామునకుసీతనులక్ష్మణునకూర్మిళను ఇచ్చెదను. అని, తాత్పర్యము.

వీర్యశుల్కాం మమ సుతాం సీతాం సురసుతోపమామ్. ౨౧

ద్వితీయా మూర్మిళాంచైవ త్రిర్దదామి న సంశయః

టీక॥ వీర్యశుల్కాం=పరాక్రమంబే వెలగాఁగలదియును; మమ=నాయొక్క; సుతాం=కూఁతురును; సురసుతోపమాం=దేవతయొక్క కూఁతురుతోఁ బోల్కగలదియునగు; సీతాం=సీతను; ద్వితీయాం=రెండవకూఁతురయిన; ఊర్మిళాంచైవ=ఊర్మిళను; త్రిః=మూఁడయిన మనోవాక్కాయములచేతను; దదామి=ఇచ్చెదను. సంశయః=సందేహము; న=లేదు.

పరాక్రమంబు గలవానికె యిచ్చునట్లునిశ్చయింపబడినదియు దేవపుత్రివంటిదియునగు నాకూఁతురయినసీతను రెండవకూఁతురయిన యూర్మిళను, మనోవాక్కాయంబులచేతను, ఇచ్చెదను; సందియంబులేదు. అని, వసిష్ఠునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

దదామి పరమప్రీతో వధ్వౌ తే రఘునందన

టీక॥ రఘునందన=దశరథుఁడా! అహం (అధ్యాహృతము)=నేను; పరమప్రీతః=మిక్కిలియుసంతసించినవాఁడనై; తే=ఆ; వధ్వౌ=స్త్రీలను; దదామి=ఇచ్చెదను.

దశరథుఁడా! నేను, బరమసంతోషంబున, సీతనుఊర్మిళను, ఇచ్చెదను. అని, తాత్పగ్యము.

ఈయర్ధశ్లోకంబు, వ్యాఖ్యానంబులంబరిగణితంబు కాకుండుటంజేసి, లెక్కింపఁబడదయ్యె.

రామలక్ష్మణయో రాజన్ గోదానం కారయస్వ హ. ౨౨

పితృకార్యంచ భద్రం తే తతో వైవాహికం కురు

టీక॥ రాజన్=దశరథమహారాజా! రామలక్ష్మణయోః=రామునకునులక్ష్మణునకును; గోదానం=సమావర్తనమును; కారయస్వ=చేయించుము. ("హ" అనునది పాదపూరణార్థము) తే=నీకు; భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము) అగుఁగాక. తతః=అటుపిమ్మ




ట; వైవాహికం= వివాహమునం దుఁజేయవలసిన; పిత్ర్యకార్యంచ= నాందీ శ్రాద్ధమును; కురు=చేయుము, చేయింపుమనుట.

దశరథుఁడా! రామలక్ష్మణులకు సమావర్తనము చేయించుము; నీకు మంగళమగుఁగాక; అటుపిమ్మట, నాందీశ్రాద్ధమును జేయించుము.

అని, తాత్పర్యము.

మఘాహ్యద్య మహాబాహో తృతీయే దివసే ప్రభో. ౨౩
ఫల్గున్యా ముత్తరే రాజం స్తస్మిన్ వైవాహికం కురు

టీక॥ మహాబాహో=గొప్పచేతులుగల; ప్రభో=ఒడయఁడవగు దశరథుఁడా! అద్య=ఈదినమునందు; మఘాహి=మఘానక్షత్రముగదా! ఫల్గున్యాం=ఫల్గునియనెడు; తస్మిన్= ఆ; ఉత్తరే=ఉత్తరనక్షత్రమునందు; వైవాహికం=వివాహకార్యమును; కురు=చేయుము.

మహాబాహుండవగు దశరథమహారాజా! ఈదినమునందు మఘానక్షత్రముగదా! ఇంక నేటికిమూఁడవ దినమునందు శుభప్రదంబగునుత్తర ఫల్గునీ నక్షత్రమునందు వివాహకార్యమును జేయించుము.

అని, తాత్పర్యము.

రామలక్ష్మణయో రాజన్ దానం కార్యం సుఖోదయమ్. ౨౪

టీక॥ రాజన్=దశరథమహారాజా! రామలక్ష్మణయోః=రామలక్ష్మణులకు; సుఖోదయం=సుఖమే రాఁగల ఫలముగాఁగల; దానం=గోదానము మొదలగు దానమును; కార్యం=చేయఁదగినది.

దశరథమహారాజా! సుఖముగలిగించునట్టిగోదానాది దానంబులను, రామలక్ష్మణులచేఁ జేయింప వలయును. అని, జనకుండు, దశరథునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, ఏకసప్తతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.




ఇది, పరమార్థచంద్రికాఖ్యాసంబగు, శ్రీమద్రామాయణాంధ్రి వ్యాఖ్యానంబునందు, బాలకాండైకసప్తతితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

ద్విసప్తతితమసర్గ ప్రారంభః.

తముక్తవంతం వైదేహం విశ్వామిత్రో మహామునిః
ఉవాచ వచనం వీరం వసిష్ఠ సహితో నృపమ్. ౧

టీక॥మహామునిః = పూజ్యుఁడయినమునియగు;విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడు;వసిష్ఠసహితః=వసిష్ఠునితోఁగూడినవాఁడై ; ఉక్తవంతం=మాటలాడినవాఁడును;వీరం=పరాక్రమశాలియును;నృపం=మనుష్యులంబాలించువాఁడునగు; తం=ఆ;వైదేహం= జనకునిగూర్చి;వచనం=మాటను;ఉవాచ=చెప్పెను.

విశ్వామిత్రమహాముని , వసిష్ఠునింగూడి, ఇట్లుచెప్పి యూరకున్నపరాక్రమశాలియగు జనకమహారాజుం జూచి,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అచింత్యాన్య ప్రమేయాని కులాని నరపుంగవ
ఇక్ష్వాకూణాం విదేహానాం నైషాం తుల్యోస్తికశ్చన. ౨

టీక॥నరపుంగవ=పురుషశ్రేష్ఠుండవగుజనకుఁడా!ఇక్ష్వాకూణాం = ఇక్ష్వాకువంశపు రాజులయొక్కయు; విదేహానాం= విదేహదేశపురాజులయొక్కయు;కులాని=వంశములు; అచింత్యాని= తలంపరానివి. అప్రమేయాని= కొలఁతపెట్టరానివి ఏషాం=ఈయిక్ష్వాకువంశపురాజులకును విదేహ దేశపురాజులకును; తుల్యః= సరియయినవాఁడు; కశ్చన=ఎవ్వఁడును;నాస్తి=లేఁడు.

పురుషశ్రేష్ఠుండవగుజనకుఁడా! ఇక్ష్వాకువంశపురాజుల వంశమును విదేహదేశపురాజులవంశమును, తలంపను గొలతపెట్టనుంగూడనట్టిమహిమగలవి; వీరలకుసరియెవ్వండు

నులేదు. అని, తాత్పర్యము.

సదృశో ధర్మసంబంధ స్సదృశో రూపసంపదా
రామలక్ష్మణయో రాజన్ సీతా చో ర్మిళయా సహ. ౩

టీక॥ రాజన్ = జనకమహారాజా! అయం(అధ్యాహృతము)=ఈ, ధర్మసంబంధః =వివాహరూపమైన ధర్మసంబంధము; సదృశః=తగినది. రూపసంపదా = సౌందర్యముయొక్క-అతిశయము చేతను; సదృశః=సరియయినది. సీతాచ=సీతయును; ఊర్మిళయాసహ= ఊర్మిళతోఁగూడ; రామలక్ష్మణయోః= రామలక్ష్మణులకును; సదృశా=(అధ్యాహృతము)సరియైనది ("సీతాచ" అనుస్థలమునయందుచకారముచే; రామః,లక్ష్మణేనసహ, సీతోర్మిళయోః,సదృశః=రాముండు, లక్ష్మణునితోఁగూడ,సీతోర్మిళలకు,సరియైనవాఁడు)

ఈవివాహసంబంధము, సమానంబులగు కులంబులకు. గల్గుటంజేసి, తగియున్నది; వధూవరులకుంగలసౌందర్యముచేతను, జాలనొప్పియున్నది;సీతయునుఊర్మిళయును, రామలక్ష్మణులకుఁ దగియున్నవారు; రామలక్ష్మణులును, సీతకును ఊర్మిళకునుదగియున్నవారు.

అని, తాత్పర్యము.

వక్తవ్యంచ నరశ్రేష్ఠ శ్రూయతాం వచనం మమ

టీక॥నరశ్రేష్ఠ=పురుషులలో మేటివగుజనకుఁడా; వక్తవ్యంచ=చెప్పఁబడవలసినదియును ; అస్తి(అధ్యాహృతము)=కలదు మమ=నాయొక్క;వచనం=మాట; శ్రూయతాం=వినఁబడుఁగాక.

పురుషశ్రేష్ఠుండవగుజనకుఁడా! ఇంకంజెప్పవలసినది కొంచెమున్నది;నాచెప్పునదివినుము.

అని, తాత్పర్యము.

భ్రాతా యవీయాన్ ధర్మజ్ఞ ఏష రాజా కుశధ్వజః. ౪

టీక ॥ రాజా=రాజయిన; ఏషః=ఈ;కుశధ్వజః=కుశధ్వజుఁడు; యవీయాన్=చిన్నవాఁడైన; భ్రాతా=తోడఁబుట్టువు; ధర్మజ్ఞః=

ధర్మము నెఱింగినవాఁడు.

ఈకుశధ్వజమహారాజు, నీకుఁద మ్ముండు, చాలధర్మంబుల నెఱింగినవాఁడు. అని, తాత్పర్యము.

అస్య ధర్మాత్మనో రాజన్ రూపేణాప్రతిమం భువి
సుతాద్వయం నరశ్రేష్ఠ పత్న్యర్థం వరయామహే. ౫

టీక॥ నరశ్రేష్ఠ=పురుషులలో మేటివయిన; రాజన్=జనకమహారాజా! ధర్మాత్మనః=ధర్మబుద్ధిగల; అస్య = ఈకుశధ్వజునియొక్క; భువి=భూమియందు; రూపేణ=సౌందర్యముచేత; అప్రతిమం=సరిలేని; సుతాద్వయం= కూఁతులయొక్క జంటను; పత్న్యర్థం = భార్యార్థముగా; వరయామహే=వరించుచున్నాము.

పురుషశ్రేష్ఠుండవగు జనకుఁడా! ధర్మాత్ముండగు నీకుశధ్వజుని కూఁతులనిద్దఱను రూపంబున భూమియం దెచ్చటను సరిలేనివారలను, భార్యార్థముగా వరించెదము.

అని, తాత్పర్యము.

భరతస్య కుమారస్య శత్రుఘ్నస్యచ ధీమతః
వరయామ స్సుతే రాజన్ తయో రర్థే మహాత్మనోః. ౬

టీక॥ రాజన్ = జనకమహారాజా! కుమారస్య=పిన్నవాఁడైన; భరతస్య=భరతునియొక్కయు; ధీమతః = బుద్ధిమంతుఁడగు; శత్రుఘ్నస్యచ=శత్రుఘ్నునియొక్కయు; మహాత్మనోః= అధికమయినపరాక్రమముగల; తయోః=వారలయొక్క; అర్థే=ప్రయోజనముకొఱకు; సుతే = కూఁతులనిద్దఱను; వరయామః=వరించుచున్నాము.

జనకమహారాజా! భరతునికొఱకును ధీమంతుండగు శత్రుఘ్నునికొఱకును మహాపరాక్రమశాలులగు నీయిద్దఱికొఱకు, కుశధ్వజుకూఁతుల నిద్దఱను వరించుచున్నాము.

అని, తాత్పర్యము.

పుత్రా దశరథస్యే మే రూపయౌవనశాలినః
లోకపాలోపమా స్సర్వే దేవతుల్య పరాక్రమాః. ౭




టీక॥ దశరథస్య=దశరథునియొక్క; ఇమే=ఈ; పుత్రాః= కొడుకులు; సర్వే=అందఱును; రూపయౌవనశాలినః=సౌందర్యముచేతను యౌవనముచేతనుం బ్రకాశించువారు. లోకపాలోపమాః = దిక్పాలురతోఁ బోల్కిగలవారు. దేవతుల్యపరాక్రమాః= దేవతలతో సమానమయిన పరాక్రమము గలవారలు.

ఈదశరథునికొడుకులందఱును, సౌందర్యమునను యౌవనంబునను బొప్పుచున్నవారు; దిక్పాలురతో సాటి సేయఁదగుదురు ; దేవతలకుం బోలెం బరాక్రమంబుగలవారలు. అని, తాత్పర్యము.

ఉభయోరపి రాజేంద్ర సంబంధేనానుబధ్యతామ్
ఇక్ష్వాకోః కుల మవ్యగ్రం భవతః పుణ్యకర్మణః. ౮

టీక॥ రాజేంద్ర=రాజశ్రేష్ఠుండవగు జనకుఁడా! ఇక్ష్వాకోః=ఇక్ష్వాకువుయొక్కయు; పుణ్యకర్మణః=పరిశుద్ధమయిన కార్యములుగల; భవతః = నీయొక్కయు; ఉభయోరపి=ఇద్దఱియొక్కయు; అవ్యగ్రం=కలంకములేని; కులం=వంశము, సంబంధేన=వియ్యముచేత; అనుబధ్యతాం=చుట్టఱికముగలదిగాఁ జేయఁబడుఁగాక.

జనకుఁడా! నిర్దోషంబగు నిక్ష్వాకువంశమును బుణ్యకర్ముండవగు నీవంశమును ఈరెండును, వియ్యముచేసి, చుట్టఱికము గలవగుఁగాక. అని, విశ్వామిత్రుఁడు జనకునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

విశ్వామిత్రవచశ్శ్రుత్వా వసిష్ఠస్య మతే తదా
జనకః ప్రాంజలి ర్వాక్య మువాచ మునిపుంగవౌ. ౯

టీక॥ తదా=అప్పుడు; జనకః=జనకుఁడు; విశ్వామిత్రవచః=విశ్వామిత్రునిమాటను; శ్రుత్వా=విని; వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క; మతే=ఇష్టమునందు; స్థితః=(అధ్యాహృతము) ఉన్నవాఁడై; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; మునిపుంగవౌ=మునిశ్రేష్ఠులగు విశ్వామిత్రవ

సిష్ఠులనుగూర్చి; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

అప్పుడు, జనకమహారాజు, విశ్వామిత్రుఁడు చెప్పినమాటవిని, వసిష్ఠునియనుజ్ఞనొంది, చేతులుమొగిడ్చికొని, యావిశ్వామిత్రవసిష్ఠులం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కులం ధన్య మిదం మన్యే యేషాం నో మునిపుంగవౌ

సదృశం కులసంబంధం యదా జ్ఞాపయథ స్స్వయమ్. ౧౦

టీక॥ మునిపుంగవౌ=మునిశ్రేష్ఠులగు విశ్వామిత్రవసిష్ఠులారా యువాం (అధ్యాహృతము)=మీరలు; యత్=ఏకారణమువలన; యేషాం=ఏ; నః=మాకు; సదృశం=సరియయిన; కులసంబంధం=వంశముతోటివియ్యమును; స్వయం=మీరలయ్యే; ఆజ్ఞాపయథః=ఆనతిచ్చుచున్నారో; తత్=(అధ్యాహృతము) ఆకారణము వలన; తేషాంనః=(అధ్యాహృతము) అట్టిమాయొక్క; ఇదం=ఈ; కులం=వంశమును; ధన్యం=పుణ్యముగలదానిఁగా; మన్యే=తలఁచుచున్నాను.

మునిశ్రేష్ఠులరగు విశ్వామిత్రవసిష్ఠులారా! మీరుమాకుసరియయిన వంశముతోవియ్యముచేయుమని మీరలయ్యేయాజ్ఞాపించుచున్నారు కావున, మావంశముధన్యంబనితలంచుచున్నాను. అని, తాత్పర్యము.

ఏవం భవతు భద్రం వః కుశధ్వజ సుతే ఇమే

పత్న్యౌ భజేతాం సహితౌ శత్రుఘ్నభరతౌ వుభౌ. ౧౧

టీక॥ ఏవం=ఇట్లు; భవతు=అగుఁగాక. వః=మీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. శత్రుఘ్నభరతౌ=శత్రుఘ్నుండునుభరతుండును; ఉభౌ=ఇద్దఱును; సహితౌ=కూడినవారలయి; ఇమే=ఈ; కుశధ్వజసుతే=కుశధ్వజుని కూఁతుల నిద్దఱను; పత్న్యౌ=పెండ్లాములనుగా; భజేతాం=పొందుదురుగాక.

మీరు చెప్పినట్లగుఁగాక; మీకు మంగళమగుఁగాక; శత్రుఘ్నుండును భరతుండును వీరిద్దఱునుంగూడి, యీకుశధ్వజునికూఁతుల నిద్దఱనుం

బెండ్లాడుదురు గాక. అని, తాత్పర్యము.

ఏకాహ్నా రాజపుత్రీణాం చతసృణాం మహామునే
పాణీన్ గృహ్ణంతు చత్వారో రాజపుత్రా మహాబలాః. ౧౨

టీక॥ మహామునే=పూజ్యుఁడవయినమునివగువిశ్వామిత్రుఁడా! ఏకాహ్నా(ఏకాహేన)= (సప్తమ్యర్థమందుఁదృతీయ) ఒక్కపగటియందు; మహాబలాః=అధికమయినబలముగల; రాజపుత్రాః=రాచకొమరులు; చత్వారః=నల్వురు; చతసృణాం=నల్వురయిన, రాజపుత్రీణాం= రాచకొమార్తెలయొక్క; పాణీన్=హస్తములను; గృహ్ణంతు=పట్టుకొనుదురు గాక.

విశ్వామిత్రమహామునీ! మహాబలులగు రాజపుత్రులునల్వురును, ఒక్కపగటనే, నల్వుర రాజపుత్రిలను బెండ్లాడుదురు గాక.

అని, తాత్పర్యము.

ఉత్తరే దివసే బ్రహ్మన్ ఫల్గునీభ్యాం మనీషిణః
వైవాహికం ప్రశంసంతి భగో యత్ర ప్రజాపతిః. ౧౩

టీక॥బ్రహ్మన్=బ్రాహ్మణుఁడవయినవిశ్వామిత్రుఁడా!యత్ర=ఏనక్షత్రమునందు;ప్రజాపతిః=సంతానమునకధిపతియయిన,సంతానమునిచ్చువాఁడయినయనుట;భగః=భగుఁడు; దేవతా= (అధ్యాహృతము)దేవతయో; తస్మిన్=(అధ్యాహృతము)అట్టి;ఫల్గునీభ్యాం (సప్తమ్యర్థమందు ద్వితీయ)= ఫల్గునియనెడు;ఉత్తరే=ఉత్తరనక్షత్రమునందు;దివసే=పగటియందు; మనీషిణః=పండితులు; వైవాహికం=వివాహకార్యమును; ప్రశంసంతి=కొనియాడుచున్నారు.

విశ్వామిత్రుఁడా!ప్రజాపతియగుభగుండు దేవతగాఁగలయుత్తరఫల్గునీనక్షత్రమందుఁ బగలువివాహముసేయుటప్రశస్తమని పండితులు చెప్పుచున్నారు. అని,జనకుండుచెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా వచ స్సౌమ్యం ప్రత్యుత్థాయ కృతాంజలిః

ఉభౌ మునివరౌ రాజా జనకో వాక్యమబ్రవీత్. ౧౪

టీక॥ రాజా=రాజయిన; జనకః=జనకుండు; ఏవం=ఇట్లు; సౌమ్యం=తిన్ననిః వచః=మాటను; ఉక్త్వా=చెప్పి; కృతాంజలిః=చేయఁబడినచేమోడ్పుగలవాఁడై; మునివరౌ=మునిశ్రేష్ఠులగు విశ్వామిత్రవసిష్ఠులను; ఉభౌ=ఇద్దఱును; ప్రత్యుత్థాయ=ఎదురోఁగొని; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

జనకమహారాజిట్లు తిన్నదనముగాఁజెప్పి, చేతులుమొగిడ్చి, మునిశ్రేష్ఠులగు విశ్వామిత్రవసిష్ఠుల నెదురోఁగొనియిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పరో ధర్మః కృతో మహ్యం శిష్యోస్మి భవతో స్సదా

టీక॥ మహ్యం=నాకొఱకు; పరః=అధికమయిన; ధర్మః=ధర్మము; కృతః = చేయఁబడినది. భవతోః=మీకు; సదా = ఎల్లప్పుడు; శిష్యః = శిష్యుఁడను, అస్మి=అగుచున్నాను.

మీరలు నాకుఁ, గన్యాదానఫలంబానగూర్చి చాలధర్మంబుగలుగఁజేసినారలు; మీకు నేనెల్లప్పుడును శిష్యుఁడనైతి. అని, తాత్పర్యము.

ఇమాన్యా సనముఖ్యాని ఆసాతాం మునిపుంగవౌ. ౧౫

టీక॥ మునిపుంగవౌ=మునిశ్రేష్ఠులగువిశ్వామిత్రవసిష్ఠులు, మీరలనుట; ఇమాని=ఈ; ఆసనముఖ్యాని=ఆసనములలోశ్రేష్ఠములయినసింహాసనములను (సింహాసనము లనుటచే, రాజ్యములుసూచింపఁబడుచున్నవి); ఆసాతాం = అధిష్ఠింతురుగాక.

మునిశ్రేష్ఠులరగుమీరలు, ఈ మూఁడుసింహాసనములనెక్కి, నా రాజ్యమును గుశధ్వజునిరాజ్యమును దశరథుని రాజ్యమునుం బాలింపుఁడు. అని, తాత్పర్యము.

యథా దశరథస్యేయం తథాయోధ్యాపురీ మమ
ప్రభుత్వేనాస్తి సందేహో యథార్హం కర్తుమర్హథ. ౧౬




టీక॥ దశరథస్య=దశరథునకు; ఇయం=ఈమిథిల; యథా=ఎట్లో, మమ=నాకు; అయోధ్యా=అయోధ్యయను; పురీ=పట్టణము; తథా=అట్లు; యువయోః (అధ్యాహృతము)=మీకు; ప్రభుత్వే = ప్రభువులగుటయందు; సందేహః=సందియము; నాస్తి=లేదు; యథార్హం=యథాయోగ్యముగా; కర్తుం = చేయుటకు; అర్హథ=తగుదురు.

ఈమిథిల యెట్లు దశరథునకు సొంతమో; అట్లు, అయోధ్యయును నాకు సొంతము; కావున, నేనుదశరథరాజ్యంబున మీకేవచ్చును; కాఁబట్టి, మీకు మూఁడు రాజ్యంబులందును ప్రభుత్వంబు గల్గుటయందు సందియంబు లేదు; యథాయోగ్యముగాఁ జేయుఁడు. అని, జనకుండు, విశ్వామిత్రవసిష్ఠులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తథా బ్రువతి వైదేహే జనకే రఘునందనః
రాజా దశరథో హృష్టః ప్రత్యువాచ మహీపతిమ్. ౧౭

టీక॥ వైదేహే=విదేహదేశపురాజయిన, జనకే = జనకుఁడు; తథా=అట్లు; బ్రువతి=చెప్పుచుండఁగా; రఘునందనః=రఘువునుసంతసింపఁజేయునట్టి; రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; హృష్టః=సంతసించినవాఁడై; మహీపతిం=భూమికిఁబ్రభువైనజనకునింగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

విదేహాధిపుండగు జనకుఁడట్లు చెప్పఁగా, రఘువంశంబునంబుట్టిన దశరథమహారాజు, సంతోషించి, జనకమహారాజుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యువామసంఖ్యేయగుణౌ భ్రాతరౌ మిథిలేశ్వరౌ
ఋషయో రాజసంఘాశ్చ భవద్భ్యామభిపూజితాః. ౧౮

టీక॥ మిథిలేశ్వరౌ=మిథిలకుఁ బ్రభువులును; భ్రాతరౌ=తోడఁబుట్టువులునగు; యువాం=మీరలు; అసంఖ్యేయగుణౌ=లెక్కింపరానిగుణంబులుగలవారలు. భవద్భ్యాం=మీచేత; ఋషయః= ఋషులును;






రాజసంఘాశ్చ=రాజులసమూహమును; అభిపూజితాః=పూజింపఁబడిరి.

మిథిలకునాథులరు సహోదరులరునగుమీగుణంబులలెక్కింపనలవిగాదు;మీరుఋషులను బెక్కండ్రురాజులనుం జక్కఁగఁబూజించితిరి.

అని, తాత్పర్యము.

స్వస్తి ప్రాప్నుహి భద్రం తే గమిష్యామి స్వ మాలయమ్
శ్రాద్ధకర్మాణి సర్వాణి విధాస్యామి తిచాబ్రవీత్. ౧౯

టీక॥ స్వస్తి=మంగళమును;ప్రాప్నుహి=పొందుదువుగాక. తే=నీకు;భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము)అగుఁగాక (ఆదరాతిశయంబున రెండుమాటలుచెప్పఁబడినది);స్వం=నాదైన;ఆలయం=ఇంటిని; గమిష్యామి=పొందెదను. శ్రాద్ధకర్మాణి= నాందీశ్రాద్ధము మొదలగుకర్మములను;సర్వాణి=అన్నింటిని; విధాస్యామి= చేసెదను.ఇతిచ=అనియును; అబ్రవీత్=చెప్పెను.

నీవుమంగళమును బొందుదువుగాక; నీకుమంగళమగుఁగాక; నాయింటికింబోయెదను; నాందీశ్రాద్ధము మొదలగుకర్మంబులనన్నింటిని నెఱవేర్చెదను. అని,దశరథుఁడుజనకునితోఁజెప్పెను అని, తాత్పర్యము

తమాపృష్ట్వా నరపతిం రాజా దశరథ స్తదా
మునీంద్రౌ తౌ పురస్కృత్య జగామా శు మహాయశాః. ౨౦

టీక॥ తదా=అప్పుడు; మహాయశాః = అధికమయినకీర్తిగల; రాజా=రాజయిన; దశరథః=దశరథుండు;తం=ఆ; నరపతిం=మనుష్యులకుఁబ్రభువయినజనకుని;ఆపృష్ట్వా(ఆపృచ్ఛ్య)=వీడ్కొలిపి మునీంద్రౌ=మునిశ్రేష్ఠులగు; తౌ=ఆ వసిష్ఠవిశ్వామిత్రులను; పురస్కృత్య=మున్నిడికొని; ఆశు=శీఘ్రము గా;జగామ=పోయెను.

అప్పుడు, మహాయశుండగు నా దశరథమహారాజు, జనకమహారాజునువీడుకొని,మునిశ్రేష్ఠులగు వసిష్ఠ విశ్వామిత్రులమున్నిడికొని, శీఘ్రంబుగాఁబోయెను.

అని, తాత్పర్యము



స గత్వా నిలయం రాజా శ్రాద్ధం కృత్వా విధానతః
ప్రభాతే కాల్య ముత్థాయ చక్రే గోదాన ముత్తమం. ౨౧

టీక॥ సః=ఆ; రాజా=దశరధ మహారాజు; నిలయం=ఇంటిని; గత్వా=పొంది; విధానతః= శాస్త్ర పద్ధతిని; శ్రాద్ధం= నాందీశ్రాద్ధమును; కృత్వా=చేసి, ప్రభాతే=ప్రాతఃకాలమునందు; ఉత్థాయ=లేచి, కాల్యం=కాలమునందుఁ జేయవలసిన; ఉత్తమం= శ్రేష్ఠమగు; గోదానం=సమావర్తనమును; చక్రే= చేసెను.

ఆదశరధుండు తనవిడిదికిం బోయి, యధావిధిగా నాందీశ్రాద్ధము చేయించి, ప్రాతఃకాలమునందు లేచి, యప్పుడు చేయవలసిన యుత్తమంబగు సమావర్తనంబు చేయించెను. అని, తాత్పర్యము.

గవాం శతసహస్రాణి బ్రాహ్మణేభ్యో నరాధిపః
ఏకైకశో దదౌ రాజా పుత్రా నుద్దిశ్య ధర్మతః. ౨౨

టీక। నరాధిపః= మనుష్యులకుఁ బ్రభువయిన; రాజా=దశరథమహారాజు; పుత్రాన్=కొడుకులను; ఏకైకశః= ఒక్కొక్కనిఁగా; ఉద్దిశ్య=ఉద్దేశించి; గవాం=ఆవులయొక్క; శతసహస్రాణి=నూఱువేలను; బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకొఱకు; దదౌ=ఇచ్చెను.

మనుష్యులకధిపుండగు, నాదశరధమహారాజు, కొడుకులకొక్కొకనికిఁగాను, లక్షగోవులచొప్పున, బ్రాహ్మణులకొసంగెను.

అని, తాత్పర్యము.

సువర్ణశృంగా స్సంపన్నా స్సవత్సాః కాంస్యదోహనాః
గవాం శతసహస్రాణి చత్వారి పురుషర్షభః. ౨౩
విత్త మన్యచ్చ సుబహు ద్విజేభ్యో రఘునందనః
దదౌ గోదాన ముద్దిశ్య పుత్రాణాం పుత్రవత్సలః. ౨౪

టీక॥పురుషర్షభః= పురుషశ్రేష్ఠుఁడును; పుత్రవత్సలః=కొడుకుల

యుండుప్రేమగలవాఁడనగు, రఘునందనః = దశరథుఁడు; పుత్రాణాం=కొడుకులయొక్క, గోదనం=సమావర్తనమును;ఉద్దిశ్య=ఉద్దేశించి,గవాం=ఆవులయొక్క;సువర్ణశృంగాః = బంగారువికారములయిన కొమ్ములు గలవియును (పుంలింగత్వమార్షము, ఇట్లేముందునుం జూచుకొనునది) ; సంపన్నాః=పాలచేత, సమృద్ధములయినవియును; సవత్సాః=లేఁతదూడలతోఁగూడినవియును; కాంస్యదోహనాః= కంచువియైన పితుకుపాత్రములు గలవియునగు ; శతసహస్రాణి = నూఱువేలను;చత్వారి= నాల్గింటిని, అన్యత్ =ఇతరమయిన; సుబహు= మిక్కిలియునధికమయి వసువిత్తంచ=ధనమును;ద్విజేభ్యః= బ్రాహ్మణులకు;దదౌ=ఇచ్చెను.

పురుషశ్రేష్ఠుండగునాదశరథమహారాజు, పుత్రులయందువాత్సల్యముగలవాఁడుకావున, కొడుకులసమావర్తనోత్సవమునుద్దేశించి,నాలుగు లక్షలగోవులను బంగారుకొమ్ములునుక్షీరసమృద్ధియునులేఁదూడలునుగంచుతోఁ జేసిన దోహనపాత్రంబులునుంగల్గినవానిని, మఱియు నధికముగా, నితరమయినధనమును బ్రాహ్మణులకొసంగెను.

అని, తాత్పర్యము.

సుతైః కృతగోదానై ర్వృతస్తు నృపతిస్తదా
లోకపాలై రివాభాతి వృత స్సౌమ్యః ప్రజాపతిః. ౨౫

టీక॥తదా=అప్పుడు,కృతగోదానైః=చేయఁబడినసమావర్తనముగలు;సుతైః=కొడుకులచేత; వృతః= చుట్టఁబడిన, సః=ఆ;నృపతిస్తు=మనుష్యులకుఁబ్రభువయినదశరథుఁడుమాత్రము; లోకపాలైః=దిక్పాలురచేత;వృతః=చుట్టబడిన;సౌమ్యః= ప్రసన్నుండగు; ప్రజాపతిరివ=బ్రహ్మదేవుఁడువలె;ఆభాతి=(భూతార్థమందులట్) ప్రకాశించెను.

అప్పుడాదశరథమహారాజు, సమావర్తనముచేసికొనినకొడుకులచేఁబరివేష్టింపఁబడి,దిక్పాలురచేఁబరివేష్టింపఁబడిప్రసన్నుండైయుండు బ్రహ్మదేవుండుంబోలెఁ బ్రకాశించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే,ద్విసప్తతితమస్సర్గః
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ ద్విసప్తతితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ
త్రిసప్తతితమసర్గప్రారంభః.

యస్మింస్తు దివసే రాజా చక్రే గోదాన ముత్తమమ్
తస్మింస్తుదివసే శూరో యుధాజి త్సముపేయివాన్. ౧

టీక॥యస్మిన్=ఏ; దివసేతు=దినమునందే; రాజా=దశరథమహారాజు; ఉత్తమం=శ్రేష్ఠమయిన;గోదానం=సమావర్తనమును;చక్రే=చేసెనో;తస్మిన్=ఆ; దివసేతు=దినమునందే; శూరః=యుద్ధమునందు భయపడని; యుధాజిత్=యుధాజిత్తనువాడు; సముపేయివాన్=వచ్చెను

ఏదినమునందు,దశరథమహారాజు, కొడుకులకుత్తమంబగుసమావర్తనంబుచేసెనో; ఆదినమునందే, శూరుండగు యుధాజిత్తుదశరథుని కడకువచ్చెను. అని,తాత్పర్యము.

పుత్రః కేకయరాజస్య సాక్షాద్భరతమాతులః
దృష్ట్వా పృష్ట్వాచ కుశలం రాజాన మిద మబ్రవీత్. ౨

టీక॥ సాక్షాద్భరతమాతులః=భరతుని మొడములేసి మేనమామయును;కేకయరాజస్య=కేకయరాజునకు; పుత్రః=కొడుకునగు, యుధాజిత్తు; రాజానం=దశరథమహారాజును;దృష్ట్వా=చూచి;కుశలం=క్షేమమును,పృష్ట్వాచ=అడిగియు; ఇదం=ఈమాటను;అబ్రవీత్= చెప్పెను.

భరతునకు,తల్లితోడఁబుట్టినమే

నమామయమనుగేకయరాజునకుఁగు ధుంజూచి, కుశలంబడిగి, ముట్లని, చెమారుండునగుయుధాజిత్తు, దశర ప్పెను. అని, తాత్పర్యము.

కేకయాధిపతీ రాజా స్నేహాత్కుశల మబ్రవీత్
యేషాం కుశలకామో సి తేషాం సంప్రత్య నామయమ్. ౩

టీక॥ రాజా = రాజయిన, కేకయాధిపతిః = కేకయరాజు; స్నేహాత్ = చెలిమివలన; కుశలం = క్షేమమును; అబ్రవీత్ = చెప్పెను. త్వం (అధ్యాహృతము) = నీవు; యేషాం = ఎవరియొక్క; కుశలకామః = క్షేమమునుగోరువాఁడవు; అసి = అగుచున్నావో; తేషాం = వారలకు; సంప్రతి = ఇప్పుడు; అనామయం = ఆరోగ్యము; అస్తి (అధ్యాహృతము) = కలదు.

కేకయరాజు, స్నేహంబుననీకుశలంబడుగుమనెను; నీవెవ్వరి క్షేమంబుకోరుదువో, అట్టి మేమందఱము క్షేమంబుగ నున్నవారము.

అని, తాత్పర్యము.

స్వస్రీయం మమ రాజేంద్ర ద్రష్టుకామో మహీపతిః
తదర్థ ముపయాతో హ మయోధ్యాం రఘునందన. ౪

టీక॥ రాజేంద్ర = రాజశ్రేష్ఠుండవగుదశరథుఁడా మహీపతిః = భూమికిఁ బ్రభువయిన కేకయరాజు; మమ = నాయొక్క; స్వస్రీయం = మేనల్లుఁడయినభరతుని, ద్రష్టుకామః = చూడఁగోరువాఁడు. రఘునందన = దశరథుఁడా! అహం = నేను; తదర్థం = దానికొఱకు; అయోధ్యాం = అయోధ్యను, ఉపయాతః = పొందినవాఁడను.

రాజశ్రేష్ఠుఁడవగుదశరథుఁడా! నాతండ్రియయినకేకయరాజు, నామేనల్లుండగు భరతుంజూడఁగోరుచున్నాఁడు; నేను, అందునిమిత్తము భరతుంగొనిపోవుటకై, యయోధ్యకుంబోతిని. అని, తాత్పర్యము.

శ్రుత్వా త్వహ మయోధ్యాయాం వివాహార్థం తవాత్మజాన్
మిథిలా ముపయాతాంస్తు త్వయా సహ మహీపతే. ౫
త్వరయా భ్యుపయాతో హం ద్రష్టుకామ స్స్వసుస్సుతమ్

టీక॥ మహీపతే=భూమికిఁబ్రభుఁడవయినదశరథుఁడా! అహం=నేను; అయోధ్యాయాం=అయోధ్యయందు; వివాహార్థం=పెండ్లికొఱకు; త్వయాసహ=నీతోఁగూడ; మిథిలాం=మిథిలను; ఉపయాతాన్=పొందిన, తవ=నీయొక్క; ఆత్మజాన్=కొడుకులను; శ్రుత్వా=విని సంతనే; అహం=నేను; స్వసుః=తోఁబుట్టినదానియొక్క; సుతం=కొడుకును; ద్రష్టుకామః=చూడఁగోరువాఁడనై; త్వరయా=వేగముచేత; అభ్యుపయాతః=వచ్చినాఁడను.

దశరథమహారాజా! నేనయోధ్యాపట్టణమునందు, "నీవునునీకొడుకులునువివాహార్థముమిథిలకువచ్చియుండుటనువిని, నామేనల్లునిఁజూడఁగోరి, శీఘ్రముగావచ్చినాఁడను. అని, యుధాజిత్తు, దశరథునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అథ రాజా దశరథః ప్రియాతిథి ముపస్థితమ్. ౬
దృష్ట్వా పరమసత్కారైః పూజార్హం సమపూజయత్

టీక॥ అథ=అటుపిమ్మట; రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; ఉపస్థితం=వచ్చిన; పూజార్హం=పూజకుఁదగిన; ప్రియాతిథిం=ప్రియుఁడును అతిథియునగు, యుధాజిత్తును; దృష్ట్వా=చూచి, పరమసత్కారైః=శ్రేష్ఠములయిన పూజలచేత; సమపూజయత్=చక్కఁగాఁబూజించెను.

అంత, దశరథమహారాజు, ప్రియాతిథియయినయుధాజిత్తువచ్చుటంజూచి, పూజార్హుఁడగునతనినిమిక్కిలియుఁబూజించెను.

అని, తాత్పర్యము.

తత స్తా ముషితో రాత్రిం సహపుత్రై ర్మహాత్మభిః. ౭

టీక. తతః=అంతట, సః(అధ్యాహృతము) = ఆదశరథుఁడు; మహాత్మభిః= అధికమయినపరాక్రమముగల; పుత్రైస్సహ=కొడుకులతోఁగూడ; తాం = ఆ; రాత్రిం=రాతిరియంతయు; ఉషితః=ఉండెను.

అంత, నాదశరథుండు, మహాపరాక్రమశాలులగు పుత్రులంగూడి, యారాత్రియంతయుఁగడపెను.

అని, తాత్పర్యము.

ప్రభాతే పున రుత్థాయ కృత్వా కర్మాణి కర్మవిత్
ఋషీం స్తదా పురస్కృత్య యజ్ఞవాట ముపాగమత్. ౮

టీక॥ కర్మవిత్=కార్యంబుల నెఱింగినదశరథుండు; పునః=మఱల; ప్రభాతే= ప్రాతఃకాలమునందు, ఉత్థాయ= మేల్కని; కర్మాణి=కర్మములను; కృత్వా=చేసి; తదా=అప్పుడు; ఋషీన్ = ఋషులను; పురస్కృత్య=మున్నిడికొని; యజ్ఞవాటం=యాగశాలనుగూర్చి; ఉపాగమత్=పోయెను.

ఏకాలమునందేకర్మముచేయవలయునోవానినన్నింటినెఱింగిన దశరథుండు, ప్రాతఃకాలమునందు మేల్కని, యప్పటికర్మంబులందీర్చి, యంత, ఋషులంబురస్కరించికొని, జనకునియాగశాలకుఁబోయెను.

అని, తాత్పర్యము.

యుక్తే ముహూర్తే విజయే సర్వాభరణభూషితైః
భ్రాతృభి స్సహితో రామః కృతకౌతుకమంగళః. ౯
వసిష్ఠం పురతః కృత్వా మహర్షీ నపరా నపి

టీక॥ యుక్తే = వివాహమునకుఁదగిన; విజయే = విజయంబనెడు; ముహూర్తే = ముహూర్తమునందు; రామః=రాముఁడు ; సర్వాభరణభూషితైః= ఎల్లభూషణంబులచేతను అలంకరింపఁబడిన; భ్రాతృభిః=తమ్ములతో; సహితః= కూడినవాఁడై ; కృతకౌతుకమంగళః=చేయఁబడినతోరముగట్టుకొనుటయనెడుమంగళాచారముగలవాఁడై; వసిష్ఠం=వసిష్ఠుని; అపరాన్= ఇతరులయిన; మహర్షీనపి=పూజ్యులైనఋషులను; పురతః=ముందట; కృత్వా = చేసికొని, ఉంచికొనియనుట ; ఉపాగమత్(అధ్యాహృతము)=పోయెను.

రాముండు, సమస్తభూషణంబులచేతను అలంకరింపఁబడియున్న తమ్ములంగూడి, తోరముఁగట్టుకొని, వివాహంబునకుఁదగినవిజయంబనెడు

మహాత్ములంబునందు, వసిష్ఠుని మరియుఁ బెక్కండ్రమహర్షులనుము న్నిడికొని, తండ్రివెంటఁ బోయెను.

అని, తాత్పర్యము.

పితు స్సమీప మాశ్రిత్య తస్థౌ భ్రాతృభి రావృతః

టీక॥ రామః(అధ్యాహృతము)=రాముఁడు; భ్రాతృభిః=తమ్ములచేత; ఆవృతః=చుట్టఁబడినవాఁడై; పితుః=తండ్రియొక్క; సమీపం=చేరువను; ఆశ్రిత్య=పొంది; తస్థౌ=ఉండెను.

ఇట్లు, రాముండు, తమ్ములంగూడి, తండ్రిసమీపంబునందుండెను.

అని, తాత్పర్యము.

ఈయర్ధశ్లోకంబు, వ్యాఖ్యానంబుల నుదాహరింపఁబడకుండుటం జేసి, యిచ్చో లెక్కింపఁ బడదయ్యె.



వసిష్ఠో భగవా నేత్య వైదేహ మిద మబ్రవీత్. ౧౦

టీక॥ భగవాన్=మహాత్మ్యము గల; వసిష్ఠః= వసిష్ఠుఁడు; వైదేహం= జనకుని; ఏత్య=పొంది; ఇదం=ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

భగవంతుండగు వసిష్ఠుండు, ముందుగా జనకునికడకుఁ బోయి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

రాజా దశరథో రాజన్ కృతకౌతుకమంగళైః

పుత్రైః నరవరశ్రేష్ఠ దాతార మభికాంక్షతే. ౧౧

టీక॥ నరవరశ్రేష్ఠ=మనుష్యులకంట్రబ్రభువులయినవారిలో మేటివయిన; రాజన్=జనకమహారాజా! రాజా=రాజైన; దశరథః=దశరథుఁడు; కృతకౌతుకమంగళైః=చేయఁబడినతోరము గట్టుకొనుటయనెడుమంగళాచారముగల; పుత్రైః (సహ)=కొడుకులతోఁగూడ; దాతారం=కన్యలనిచ్చువట్టినిన్ను; అభికాంక్షతే= ఎదురుచూచుచున్నాఁడు.

రాజశ్రేష్ఠుండవగు జనకమహారాజా! దశరథమహారాజు, తోరము గట్టుకొనియున్న కొడుకులతోఁగూడ, దాతవగు నిన్నెదురుచూచుచున్నాఁడు. అని, తాత్పర్యము.

దాతృప్రతిగ్రహీతృభ్యాం సర్వార్థాః ప్రభవంతి హి
స్వధర్మం ప్రతిపద్యస్వ కృత్వా వైవాహ్య ముత్తమమ్. ౧౨

టీక॥ దాతృప్రతిగృహీతృభ్యాం= ఇచ్చువానికిఁ బుచ్చుకొనువానికిని; సర్వార్థాః=ఎల్లపురుషార్థంబులును; ప్రభవంతిహి=కలుగుచున్నవిగదా! ఉత్తమం=శ్రేష్ఠమయిన; వైవాహ్యం=వివాహమును; కృత్వా=చేసి; స్వధర్మం=నీదైన ప్రతిజ్ఞ యనెడుధర్మమును; ప్రతిపద్యస్వ=పొందుము.

దాతకును బ్రతిగ్రహీతకునువీరలకిద్దఱకును, సమస్తపురుషార్థములును, సమకూరును. కావున, నీవు, కన్యాదానముచేసి, నీప్రతిజ్ఞనుదీర్చికొనుము. అనివసిష్ఠుండు జనకునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తః పరమోదారో వసిష్ఠేన మహాత్మనా
ప్రత్యువాచ మహాతేజా వాక్యం పరమధర్మవిత్. ౧౩

టీక॥ పరమోదారః=మిక్కిలియు దాతయును; పరమధర్మవిత్ = మిక్కిలియుధర్మములనెఱింగినవాఁడును; మహాతేజాః=అధికమయిన పరాక్రమంబు గలవాఁడునగుజనకుండు; మహాత్మనా=అధి

కమయినబుద్ధిగల; వసిష్ఠేన=వసిష్ఠుని చేత; ఇతి=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; వాక్యం=మాటను; ప్రత్యువాచ=బదులు చెప్పెను.

పరమోదారుఁడును సమస్తధర్మంబులనెఱింగినవాఁడును మహాపరాక్రమశాలియునగు జనకుఁడు, మహాబుద్ధిశాలియగు వసిష్ఠుని మాటనువిని, యిట్లని, బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

కస్స్థితః ప్రతిహారో మే కస్యాజ్ఞా సంప్రతీక్ష్యతే
స్వగృహే కో విచారోఽస్తి యథా రాజ్యమిదం తవ. ౧౪

టీక॥ మే=నాయొక్క; ప్రతిహారః=ద్వారపాలుఁడు; కః=ఎవ్వఁడు; స్థితః=ఉన్నాఁడు? కస్య=ఎవ్వనియొక్క; ఆజ్ఞా=పనుపు; సంప్రతీక్ష్యతే=ఎదురుచూడఁబడుచున్నది. స్వగృహే=తనయింటియందు; విచారః=ఆలోచన; కః=ఏమి; అస్తి=ఉన్నది? రాజ్యం=నీదొరతనమునకు లోఁబడిన దేశము; యథా=ఎట్లో; ఇదం=ఈరాజ్యము; తవ=నీకు; తథా(అధ్యాహృతము)=అట్లు.

నాద్వారపాలకుఁడెవ్వఁడు కావలియున్నాఁడు? ఏలలోపలికి రాఁగూడదు? ఎవరియాజ్ఞకుఁ గనిపెట్టియున్నావు? స్వగృహమునందేమి విచారమున్నది? నీరాజ్యము నీకెట్లో, నాయీరాజ్యమును నీకట్లే సొంతము. (ఇదిదశరథునుద్దేశించి చెప్పఁబడినది). అని, తాత్పర్యము.

కృతకౌతుకసర్వస్వా వేదిమూలముపాగతాః
మమ కన్యా మునిశ్రేష్ఠ దీప్తా వహ్నేరివార్చిషః. ౧౫

టీక॥ మునిశ్రేష్ఠ=మునులలోమేటివగు వసిష్ఠుఁడా! మమ=నాయొక్క; కన్యాః=కొమార్తెలు; కృతకౌతుకసర్వస్వాః=చేయఁబడిన మంగళాచారము లంతయును గలవారలై; వేదిమూలం=వేదిసమీపమును; ఉపాగతాః=పొందినవారలై; వహ్నేః=నిప్పుయొక్క; దీప్తాః=మండిన; అర్చిషః ఇవ(స్థితాః)=మంటలనునట్లున్నవారు.

మునిశ్రేష్ఠుఁడవగు వసిష్ఠుఁడా! నాకొమార్తెలు, వివాహమునకుఁ గావలసినమంగళములనన్నింటిని జేసికొని, వేదిమూలమునందు, మండు

చున్నయగ్నిజ్వాలలుఁబోలె, వెలుంగుచున్నవారు. అని, తాత్పర్యము.

సజ్జో హం త్వత్ప్రతీక్షో స్మి వేద్యా మస్యాం ప్రతిష్ఠితః
అవిఘ్నం కురుతాం రాజా కిమర్థ మవలంబతే. ౧౬

టీ॥ అహం = నేను; సజ్జః = సిద్ధుఁడనై; అస్యాం = ఈ; వేద్యాం = వేదియందు; ప్రతిష్ఠితః = ఉన్నవాఁడనై; త్వత్ప్రతీక్షః = నిన్నెదురుచూచువాఁడను; అస్మి = అగుచున్నాను రాజా = దశరథమహారాజు; అవిఘ్నం = విఘ్నములేనట్టుః కురుతాం = చేయుఁగాక కిమర్థం = ఎందుకొఱకు; అవలంబతే = జాగుసేయుచున్నాఁడు?

నేను సిద్ధుండనై యీవేదియందుండి మిమ్ముల నెదురుచూచుచున్నాఁడను; దశరథుండు, నిర్విఘ్నంబుగఁజేయుఁగాక; జాగుసేయనేల? అని, జనకుండు, వసిష్ఠునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తద్వాక్యం జనకేనోక్తం శ్రుత్వా దశరథ స్తదా
ప్రవేశయామాస సుతాన్ సర్వా నృషిగణానపి. ౧౭

టీక॥ తదా = అప్పుడు; దశరథః = దశరథుఁడు; జనకేన = జనకుని చేత; ఉక్తం = చెప్పఁబడిన; తత్ = ఆ; వాక్యం = మాటను; శ్రుత్వా = విని; సుతాన్ = కొడుకులను; సర్వాన్ = సమస్తములయిన; ఋషిగణానపి = ఋషులసమూహములను; ప్రవేశయామాస = ప్రవేశింపఁజేసెను.

జనకుండుచెప్పిన యామాటను విని, దశరథుఁడుతనకొడుకులను ఋషులనందఱను, గూడఁదీసికొని, యాగశాలఁబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

తతో రాజా విదేహానాం వసిష్ఠ మిదమబ్రవీత్

టీక॥ తతః = అటుపిమ్మట; విదేహానాం = విదేహదేశమునకుః రాజా = ప్రభువయినజనకుండుఃవసిష్ఠం = వసిష్ఠునిగూర్చి; ఇదం = ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, విదేహదేశంబునకు రాజయిన జనకుండు, వసిష్ఠుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము

కారయస్వ ఋషే సర్వ మృషిభి స్సహ ధార్మిక. ౧౮
రామస్య లోకరామస్య క్రియాం వైవాహికీం విభో

టీక॥ ధార్మిక=ధర్మమునాచరించునట్టి; విభో=ఒడయఁడవైన; ఋషే=వసిష్ఠమహర్షీ! త్వం(అధ్యాహృతము)= నీవు; ఋషిభిస్సహ=ఋషులతోఁగూడ, లోకరామస్య=జనులు క్రీడించుస్థానమైన; రామస్య=రామునకు; వైవాహికీం = వివాహముతోఁజేరిన; క్రియాం = కార్యమును; సర్వం=అంతను; కారయస్వ=చేయించుము.

వసిష్ఠమహర్షీ! నీవు ధార్మికుండవు; నీవమాకుఁ బ్రభుండవు; లోకుల నందఱ నరమియిచ్చునట్టి యంగలరామునకు వివాహమును, వధూవరులనంతయు, నీవ బుషులు, హోమము యింపుము. అని, తాత్పర్యము.

తథే త్యుక్త్వాతు జనకం వసిష్ఠో భగవా నృషిః. ౧౯
విశ్వామిత్రం పురస్కృత్య శతానందంచ ధార్మికమ్
ప్రపామధ్యేతు విధివ ద్వేదిం కృత్వా మహాతపాః. ౨౦
అలంచకార తాం వేదిం గంధపుష్పై స్సమంతతః
సువర్ణపాలికాభిశ్చ ఛిద్రకుంభైశ్చ సాంకురైః. ౨౧
అంకురాఢ్యై శ్శరావైశ్చ ధూపపాత్రై స్సధూపకైః
శంఖపాత్రై స్స్రువై స్స్రుగ్భిః పాత్రై రర్ఘ్యాభిపూరితైః. ౨౨
లాజపూర్ణై శ్చపాత్రీభి రక్షతై రభిసంస్కృతైః

టీక॥ మహాతపాః=అధికమయినతపస్సుగలవాఁడును; భగవాన్=మాహాత్మ్యముగలవాఁడునగు; వసిష్ఠః=వసిష్ఠుండనెడు; ఋషిః=ఋషి; జనకంతు= జనకునింగూర్చి; తథా ఇతి=అలాగేయని; ఉక్త్వా=చెప్పి; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; ధార్మికం=ధర్మమునాచరించునట్టి; శతానందంచ=శతానందుని; పురస్కృత్య = ముస్నిడికొని; ప్రపామధ్యేతు=పందిరినడుమనే; విధివత్=యథాశాస్త్రముగా; వేదిం=అగ్నిస్థానమును; కృత్వా = చేసి ; తాం=ఆ; వేదిం= అగ్నిస్థానమును; సమంతతః = అంతటను; గంధపుష్పైః= గంధములచేతను బూ

చున్నయగ్నిజ్వాలలుఁబోలె, వెలుంగుచున్నవారు. అని, తాత్పర్యము.

సజ్జో హం త్వత్ప్రతీక్షో స్మి వేద్యా మస్యాం ప్రతిష్ఠితః
అవిఘ్నం కురుతాం రాజా కిమర్థ మవలంబతే. ౧౬

టీ॥ అహం = నేను; సజ్జః=సిద్ధుఁడనై; అస్యాం=ఈ; వేద్యాం=వేదియందు; ప్రతిష్ఠితః=ఉన్నవాఁడనై; త్వత్ప్రతీక్షః=నిన్నెదురుచూచువాఁడను; అస్మి=అగుచున్నాను రాజా = దశరథమహారాజు; అవిఘ్నం = విఘ్నములేనట్టు; కురుతాం=చేయుఁగాక కిమర్థం=ఎందుకొఱకు; అవలంబతే=జాగుసేయుచున్నాఁడు?

నేను సిద్ధుండనై యీవేదియందుండి మిమ్ముల నెదురుచూచుచున్నాఁడను; దశరథుండు, నిర్విఘ్నంబుగఁజేయుఁగాక; జాగుసేయనేల? అని, జనకుండు, వసిష్ఠునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తద్వాక్యం జనకేనోక్తం శ్రుత్వా దశరథస్తదా
ప్రవేశయామాస సుతాన్ సర్వా నృషిగణానపి. ౧౭

టీక॥ తదా=అప్పుడు; దశరథః=దశరథుఁడు; జనకేన=జనకుని చేత; ఉక్తం=చెప్పఁబడిన; తత్=ఆ; వాక్యం=మాటను; శ్రుత్వా=విని; సుతాన్ = కొడుకులను; సర్వాన్= సమస్తములయిన; ఋషిగణానపి= ఋషులసమూహములను; ప్రవేశయామాస= ప్రవేశింపఁజేసెను.

జనకుండుచెప్పిన యామాటను విని, దశరథుఁడుతనకొడుకులను ఋషులనందఱను, గూడఁదీసికొని, యాగశాలఁబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

తతో రాజా విదేహానాం వసిష్ఠ మిదమబ్రవీత్

టీక॥ తతః=అటుపిమ్మట; విదేహానాం=విదేహదేశమునకు; రాజా = ప్రభువయినజనకుండు; వసిష్ఠం=వసిష్ఠునిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, విదేహదేశంబునకు రాజయిన జనకుండు, వసిష్ఠంబూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము

కారయస్వ ఋషే సర్వ మృషిభి స్సహధార్మిక. ౧౮
రామస్య లోకరామస్య క్రియాం వైవాహికీం విభో

టీక॥ ధార్మిక=ధర్మమునాచరించునట్టి; విభో=ఒడయఁడవైన; ఋషే=వసిష్ఠమహర్షీ! త్వం(అధ్యాహృతము)= నీవు; ఋషిభిస్సహ=ఋషులతోఁగూడ, లోకరామస్య=జనులుక్రీడించుస్థానమైన; రామస్య=రామునకు; వైవాహికీం = వివాహముతోఁజేరిన; క్రియాం = కార్యమును; సర్వం=అంతను; కారయస్వ=చేయించుము.

వసిష్ఠమహర్షీ! నీవుధార్మికుండవు; నీవమాకుఁ బ్రభుండవు; లోకుల నందఱనురమియింపఁజేయంగలరామునకు వి... బునంతయు, నీవుబు... యింపుము. అని, తాతి

తథే త్యుక్త్వాతు జనకం వసిష్ఠో భగవా నృషిః. ౧౯
విశ్వామిత్రం పురస్కృత్య శతానందంచ ధార్మికమ్
ప్రపామధ్యేతు విధివ ద్వేదిం కృత్వా మహాతపాః. ౨౦
అలంచకార తాం వేదిం గంధపుష్పై స్సమంతతః
సువర్ణపాలికాభిశ్చ ఛిద్రకుంభైశ్చ సాంకురైః. ౨౧
అంకురాఢ్యై శ్శరావైశ్చ ధూపపాత్రై స్సధూపకైః
శంఖపాత్రై స్స్రువై స్స్రుగ్భిః పాత్రై రర్ఘ్యాభిపూరితైః. ౨౨
లాజపూర్ణైశ్చ పాత్రీభి రక్షతై రభిసంస్కృతైః

టీక॥ మహాతపాః=అధికమయినతపస్సుగలవాఁడును; భగవాన్=మాహాత్మ్యముగలవాఁడునగు; వసిష్ఠః=వసిష్ఠుండనెడు; ఋషిః=ఋషి; జనకంతు = జనకునింగూర్చి; తథా ఇతి=ఆలాగేయని; ఉక్త్వా=చెప్పి; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; ధార్మికం=ధర్మమునాచరించునట్టి; శతానందంచ=శతానందుని; పురస్కృత్య = మున్నిడికొని; ప్రపామధ్యేతు=పందిలినడుమనే; విధివత్=యథాశాస్త్రముగా; వేదిం=అగ్నిస్థానమును; కృత్వా = చేసి ; తాం=ఆ; వేదిం= అగ్నిస్థానమును; సమంతతః = అంతటను; గంధపుష్పైః= గంధములచేతను బూ

లచేతను; సాంకురాభిః (అధ్యాహృతము)=మొలకలతో (జాజాలతో)(గూడిన; సువర్ణపాలికాభిశ్చ=బంగారుపాలికలచేతను, సాంకురైః= మొలకలతోఁగూడిన; ఛిద్రకుంభైశ్చ=అడుగులేనిపాత్రలచేతను;–అంకురాఢ్యైః=మొలకలుగల, ...మూఁకుళ్ల చేతను;స...పముతోఁగూడిన, ...ః= ధూపమువేయు ...తను; శంఖపాత్రైః= శంఖమువంటి ...పాత్రములచేతను: స్రువైః= హోమముసేయునుపకరణములయిన స్రువంబులనెడు పాత్రలచేతను;స్రుగ్భిః=హోమముసేయునుపకరణములయిన స్రుక్కులనెడు పాత్రములచేతను; అర్ఘ్యాభిపూరితైః=పూజార్థమగుజలముచేనింపఁబడిన; పాత్రైః=పాత్రలచేతను; లాజపూర్ణైః= పేలాలచేనిండిన; పాత్రీభిశ్చ(పాత్రైః)=పాత్రములచేతను, అభిసంస్కృతైః = సంస్కరింపఁబడిన; అక్షతైః = అక్షతలచేతను;అలంచకార=అలంకరించెను.

అధికంబగుతపస్సుగలవాఁడునుభగవంతుండునగువసిష్ఠమహర్షి, జనకునకు"ఆలాగే"యనిచెప్పి,విశ్వామిత్రునిధామికుండగుశతానందునింబురస్కరించికొని, పెండ్లిపందిలినడుమనువేదినిగల్పించి, యావేదికిం,జుట్టును, గంధపుష్పంబులును, జాజాలతోనింపియుండుబంగారుపాలికలును,జాజాలతోఁగూడిన అడుగులేనిపాత్రలునుమూఁకుళ్లును,ధూపముతోఁగూడినధూపపాత్రలును శంఖమువంటిపాత్రంబులును, స్రుక్స్రువంబులును,అర్ఘ్యపాత్రంబులును పేలాలతోనిండినపాత్రంబులును,ఉంచియలంకరించెను. అని, తాత్పర్యము.

దర్భైః స్సమైః స్సమాస్తీర్య విధివ న్మంత్రపూర్వకమ్. ౨౩
అగ్ని మాదాయ వేద్యాం తు విధిమంత్రపురస్కృతమ్
జుహా వాగ్నౌ మహాతేజా వసిష్ఠో భగవా నృషిః. ౨౪

టీక॥ మహాతేజాః=అధికమయినబ్రహ్మవర్చస్సుగలవాఁడును; భగవాన్= మాహాత్మ్యముగలవాఁడునగు;ఋషిః = ఋషియయిన;వసి

ష్ఠః=వసిష్ఠుఁడు; వేద్యాం=వేదియం
దు;అగ్నిం=నిప్పును; ఆదాయ తు=
గ్రహించినంతనే;విధివత్=యథా
శాస్త్రముగా; మంత్రపూర్వకం=
మంత్రముముందుగల్గునట్లుగా; స
మైః = ఒకదానికొకటిసమానము
గానుండు;దర్భైః= దర్భలచేత;
సమాస్తీర్య=పఱచి;అగ్నౌ=అగ్ని
హోత్రమునందు ; విధిమంత్రపుర
స్కృతం= వేదమునందలిమంత్రము
లుమున్నిడఁ బడినవిగాఁ గల్గునట్లు
గా; జుహావ=హోమముచేసెను.

మహాతేజుండును భగవంతుండు
నగు వసిష్ఠమహర్షి, వేదియంద
గ్నిఁ బ్రతిష్ఠించి, శాస్త్రపద్ధతిని, స
మంత్రకముగా, నొకదానికొకటె
చ్చుతక్కువలు లేని, దర్భలఁ బఱ
చి, వైదికమంత్రంబులచే, వధూవరు
లకభ్యుదయార్థంబు, హోమము
చేసెను. అని, తాత్పర్యము.

### శ్రీసీతారామవివాహఘట్టః.



తత స్సీతాం సమానీయ సర్వాభరణభూషితామ్
సమక్ష మగ్నే స్సంస్థాప్య రాఘవాభిముఖే తదా. ౨౫
అబ్రవీ జ్జనకో రాజా కౌసల్యానందవర్ధనమ్

టీక॥ తతః = అటుపిమ్మట; త
దా=అప్పుడు; రాజా=రాజయిన;
జనకః=జనకుఁడు; సర్వాభరణభూ
షితాం= ఎల్లసొమ్ములచేతను అలం

కరింపఁబడిన; సీతాం=సీతను; సమానీయ=తోడ్కొనివచ్చి; అగ్నేః=అగ్నిహోత్రమునకు; సమక్షం=ఎదుటను, రాఘవాభిముఖే = రాముని యొక్క ఎదుటను; సంస్థాప్య=నిలిపి; కౌసల్యానందవర్ధనం= కౌసల్యాసంతోషమును వృద్ధిఁబొందించునట్టి రాము
అబ్రవీత్=చెప్పెను.

అంతట, నప్పుడు, జనకమహారాజు, సొమ్ములన్నియుఁ బెట్టియలంకరింపఁబడియున్న సీతం దోడ్కొనివచ్చి, యగ్నికిని రామునకు నెదుటను నిల్పి, కౌసల్యకు సంతోషవృద్ధి సేయు రాముఁజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ. ౨౬
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా

టీక॥ మమ = నాయొక్క; సుతా = కొమార్తెయైన; ఇయం=ఈ, సీతా=సీత; తవ=నీకు, సహధర్మచరీ= కూడధర్మము నాచరించునది, ధర్మపత్నియగునట్టి; భవిష్యతి(అధ్యాహృతము)= కాఁగలదు. ఏనాం=ఈసీతను; ప్రతీచ్ఛ=ప్రతిగ్రహింపుము (చకారము పాదపూరణార్థకము) తే= నీకు; భద్రం=మంగళము; అస్తు= (అధ్యాహృతము) అగుఁగాక. పాణినా=హస్తముచేత; పాణిం=హస్తమును; గృహ్ణీష్వ=పట్టుకొనుము.

నాకొమార్తె సీత యిదిగో! ఈనిడ నీకు ధర్మపత్ని కాఁగలదు; ఈబిడను బ్రతిగ్రహింపుము; నీకు మంగళముగుఁగాక; నీహస్తమున నీబిడ హస్తము గ్రహింపుము.

అని, తాత్పర్యము.

విశేషార్థములు — ఇయం= "ఇదిగో నీవు పరాక్రమంబున శివధనువును విఱిచి జయించినది "ఇదిగో" దీనిరూపంబును సౌందర్యంబును లావణ్యంబునుం జూడుము; సీతా=నాఁగటిచాలు, అందుఁబుట్టుటవలన నా పేరుగలది ఇది, పరిలేని సౌందర్యాదులుగల్గినది మాత్రంబె కాదు నాఁగటిచాలునఁబుట్టుటం జేసి, అయోనిజ కావున, దీఁయందు సమస్తగుణంబులను ఒప్పియుండును. ఇయఁసీ




తా= "ఇదిగో! సీత; నీవు సిద్ధాశ్రమం
బున జనకునియొద్ద శివధనువున్నది,
దాని వంచినవాఁడతని కూఁతురై
యినసీతం బెండ్లాడఁగలఁడు" అని,
విన్నప్పటినుండి, నీకంగల్గిన కుతూ
హలంబునకు విషయంబుగానుండిన
సీత ఇదిగో! చూడుము; లేక; సీత మె
ఱుపువంటిది కావున, సీతం జూడఁగా
నే, మెఱుపుఁ జూచినట్లు, కండ్లకేమి
యుఁ గనుపడదగుటం జేసి, మొదట
నాపాతంబుగ సీతా శరీరకాంతిం
జూచినంతనె, సీతాశరీరంబునం
గూడఁ జూడనేరక, సంభ్రాంతంబు
లయినకండ్లతోనున్న, రాముం జూ
చి, జనకుండు "ఇయం సీతా (ఇదిగో!
సీత)" అని, చెప్పుచున్నాఁడు; లేక;
సిద్ధాశ్రమంబుననుండి, సీతయందుఁ
గుతూహలంబు రాముని మనంబున నె
లకొనియుండుటం జేసి, "ప్రాసా
దేసా పథిపథిచ సా ప్రష్ఠతస్సా పుర
స్సా" (మేడపయిని ప్రతిమార్గము
నందును వెనుకను ముందటను అదియే
కన్పట్టుచున్నది) అని, చెప్పఁబడి
యుండు రీతి, విరహిజనంబులకు, భా
వనా విశేషంబునఁ, బ్రియజనంబె
ల్లెడలను గాన్పించుచుండుఁ గావున,

నట్లు ప్రపంచంబంతయు సీతామ
యంబుగఁ జూచుచున్న రామునకు
జనకుఁడయ్యాఁబో వ్రసీతాగవిశేషంబు
గాఁ దెలియుటకై జనకుఁడు "ఇయం
సీతా" (ఇదిగో! సీత) యని చెప్పుచు
న్నాఁడు. మమసుతా=నాకూఁతు
రు, నాచేఁ బెంపఁబడినది; సౌంద
ర్యంబు గల్గియున[illegible]యోనిజ
యయినను, దుష్టకుల సహవాసం
బున దూషిత యని తలంపవలదు;
కర్మఋషులని వినుతికెక్కిన మాచేఁ
బోషింపఁ బడినది; కావున, జన్మ
శుద్ధిమాత్రంబె గాక, కులశుద్ధియు
నుఁ గల్గియున్నది; లేక; మమసు
తా=నాకూఁతురు, నీవెట్లు దశరథు
నకుఁ బ్రియకుమారుఁడవో, అట్లె,
యిది నాకుఁ బ్రియపుత్రి; కావున, నీవు
దీనియందుస్థిరంబుగఁ బ్రేమయుంచ
వలయు; తవ సహధర్మచరీ=నీకు
ధర్మపత్ని కాఁగలదు, నీవు భోగంబు
నకు మాత్రంబె యీవనిత యని తలం
పకుము, దీనితోడ నీవు ధర్మములనా
చరింపుము, దీని నే ధర్మపత్నిగాఁ జే
కొనుము; అయోనిజత్వరూపంబగు
జన్మశుద్ధి యిట్టులొండుస్థలంబునం
జూడలేము, అట్లె, కులశుద్ధియునుం




జేరి, రెండునుంగలదివోరకోఁదను టచెప్పనక్కఱలేదు; కావున, దీనిం దక్కమఱియొక్కదానిధర్మపత్నిఁ గాఁజేకొనుటయుక్తంబుగాదనుట; లేక; తవసహధర్మచరీ=నీకు సరియయిన ధర్మమునాచరించునది, నీవెట్టిధర్మమునాచరింతువో, ఇదియునుఅట్టిఆధర్మమునే యాచరించునది, లోకంబున, నొక్కనివలె మఱియొక్కరుండడు; ఇదియట్లుగాదు; లోకవిలక్షణంబుగా, నీయట్లె యుండుటంజేసి, నీకీసీత యొతగినది, దీనిందక్కమఱివేవనితయునీకుఁబత్నియగుటకానేరదు. ఏనాంప్రతీచ్ఛచ = ఈసీతను, (ప్రతిగ్రహింపుము, (చకారంబున) ధర్మపత్నినిగాఁ జేకొనుము. ఇట్టిలక్షణంబులు గలదిగావున, పరాక్రమంబునజయింపఁబడినదనిసాధారణ బుద్ధియుంచక, నేనుజెప్పినట్లు, దీనినేధర్మపత్నిగా వరింపుము. తేభద్రం=నీకుమంగళమగుఁగాక, ఇట్టిశుభలక్షణంబులుగలదానింబెండ్లాడుటవలన నీకుసమస్తమంగళంబులునుఘటిల్లును; లేక; దృష్టిదోషంబుగాకుండుఁగాక. పాణిం పాణింగృహ్ణీష్వ=నీహస్తముచేదీనిహస్తమునుబట్టుకొనుము; ప్రణయకోపంబుగల్గినకాలంబుననీహస్తంబునఁబాదంబుపట్టుకొనుటయు ఘటిల్లుఁగాక, ఇప్పుడుమాత్రముహస్తమునేపట్టుకొనుము, లేక ; సిద్ధాశ్రమంబునుండి, సీతావిషయకంబగు ననురాగంబు రామునకుం గల్గియున్నదగుటంజేసి, భావనాబలంబున; సీతకుఁబ్రణయకోపంబు గల్గినట్లు దోఁచి, యందుమీఁదఁబాదంబునెపట్టుకొనుట సంభవించునని యెంచి, "పాణింగృహ్ణీష్వ(హస్తమునుబట్టుకొనుము)" అని, చెప్పుచున్నాఁడు.

ఎవ్వరికినింగదలింపనుంగూడనిశివధనువు రాముండులీల[illegible] విఱుచుటవలనను, రామునియప్రమేయంబగురూపంబునను, ఆకాలమునందుఁగలిగినసంవిధానవైచిత్రివలనను, జనకుండు, బ్రహ్మనిష్ఠుండు కావున, రాముండువిష్ణుదేవుండనియుసీత శ్రీదేవియనియుమనంబుననెఱింగి, దేవరహస్యంబు వెల్లడియగుట ఇష్టముకాకుండుటంజేసి, స్పష్టముగాఁ గాకున్నను, ధ్వనివృత్తిచే, సీతారాములయనాదిసంబంధంబునుసూచింపుచున్నాఁడు. —ఇయం=ఇదిగో! జగత్సృష్ట్యాది కారణభూతుఁడవు

సాక్షాద్విష్ణుదేవుండవగు నీవు రామ
రూపంబునననవతరించినట్లె, లక్ష్మి
యును సీతారూపంబున నవతరించి
యున్నది, చూడుము ; మీకు దాంప
త్యంబు నిత్యంబయినను , మనుష్య
త్వంబు ననుసరించి, వేఱ నీతం బెండ్లి
గుము; సీతా = నాఁగటిచాలునం బు
ట్టినదగుటం జేసి, యయోనిజ; నీవు,
దేవకార్యార్థంబుగాఁ, గౌసల్యా
గర్భంబునం, బుట్టినవాఁడవు, అట్లు
పుట్టుక యే లేనిదై నిన్ననుసరించుట
కై మనుష్యత్వంబున మాత్రఁ బవలం
బించి, నిన్నెవరింపుచు, నీకునుందన
కును నిత్యదాంపత్యం బున్నట్లు ;
సూచింపుచున్నది. మమ సుతా = నా
కూఁతురు; నాయింటం బెరిఁగినందు
న నేను కూఁతురుగా భావించి నీకు
దానము సేయుచున్నాను. తవ సహ
ధర్మచరీ = నీకు ధర్మపత్ని, నీ యట్లు
ధర్మంబుల నాచరించునట్టిది, నీవలె
నుండునది, నీకవినాభూతమై జగ
త్సృష్ట్యాదులందు నీకుఁదోడ్పాటును
వహించియుండునది ఏనాం ప్రతీచ్ఛ
చ = దీనినంగీకారమునుం జేయు
ము, నిత్యపత్నిగానున్నదైనను, ఇప్పు
డు, మనుష్యత్వంబు నభినయించుట
కై, యంగీకరింపుము; తే భద్రం = నీ
కు మంగళమగుఁగాక; నేనను వెంత
మనుష్యుఁడనై యున్నను జగదీశ్వ
రుఁడవగు నీకు నిత్యసిద్ధయగు దానిని
చ్చెదనని చెప్పుటకు సాహసించుటకు
ము జ్ఞఁపవలెను. పాణిం పాణినా గృ
హ్ణీష్వ = హస్తముచే హస్తము బట్టు
కొనుము, నీవెప్పుడు వక్షస్థలంబున ధ
రించినవాఁడవు, ఇప్పుడు మనుష్యుల
ననుసరించుటకై, హస్తంబును బ
ట్టుకొనుము, లేక , నీవిదివఱకెన్ని
మాఱులో ప్రణయకోపకాలంబునం
దు హస్తముచే దీనిపాదంబులం బట్టి
యుందువు; ఇప్పుడు, చిరవియోగం
బుగల్గుటం జేసి, విరహిజనసాధార
ణంబైన యుత్కంఠాబలంబునం, బ్రి
య ననునయించుటకై, పాదంబులం
బట్టఁజూతువు కాఁబోలు; అట్లు చేయ
కుము ; వివాహమునందు వేముచే
యునట్లు, ఇప్పుడు మాత్రము, చేతిం
బట్టుకొనుము.

ఇయం = ఈ, ఇది వీర్యశుల్కా, "పరాక్రమంబుఁ జూపి, క్రయంబున
కుం బోలెఁ గొనంబడినది, శివధనువు
ను విఱిచినందున నాచే జయింపఁబ
డినది" అని యలంతిగాఁ దలంపవల

దు; మెఱుపుంబోలె మెఱయుచున్నది, "ఇదిగో" చూడుము; నీకను గౌరవింపఁదగినది, నీ వెంత గౌరవించినను వాసికిందగినది; సీతా=నాఁగటిచాలునఁబుట్టినది, నీవు మొదలగు సమస్తజంతుజాలంబులభరించుచున్న పృథ్వీదేవికిఁగూఁతురు, కావున, నీవిప్పు డవశ్యంబు నీబిడయందు బహుమానం బుంచవలయును; భార్యగానుండునప్పుడు విశేషంబుగా బహుమానింపవలయునని చెప్ప నేల; మరియు, సీత=ఇది యయోనిజ, నీవు కౌసల్యకుఁ బుట్టినవాఁడవు కావున నీకును దీనికిని జాలనంతరంబున్నది, ఇందువలనను నీవు దీని యందుఁ జాలగౌరవబుద్ధి యుంచవలసియున్నది. మమసుతా=నాకొమార్తె, రాజరాజుండనగు నాచేఁ బెంపఁబడినది, కావున, నాయందుండు గౌరవంబును నీవు దీనియందుం జూపవలయును; మమసుతా=నాకుమార్తె, నేను బ్రహ్మనిష్ఠుండను, జాలఁదపస్విని, దీనియందు గౌరవంబుంచకున్నచో, నాకుంగోపంబుగల్గు, దానం జేసి నీకుఁగీడు వాటిల్లు; తవసహధర్మచరీ=నీకు ధర్మపత్ని; నీవు దీనిని గ్రపత్నిగానుంచుకొనవలయును; ఏనాం=ప్రతీచ్ఛచ, దీనిం బ్రతిగ్రహింపుము; తేభద్రం=అట్లు మేము చెప్పినట్లు చేసిన నీకు మంగళంబౌదవు.

ఇయం=ఈ, నీవెవ్వరికిని గదలింపను గూడని శివధనువును రెండుగా విఱిచి యసదృశంబగు పరాక్రమంబుఁ జూపి, జయించినది, ఇదియె, నీ పరాక్రమంబునకు సరియయినది కాకున్నను గరుణింపవలయుననుట; సీతా=నాఁగటిచాలునంబుట్టినది, తల్లి లేనిది, లోకంబునందల్లి లేని బిడ్డయందుఁ బ్రేమ మెచ్చుగాఁ జేయుదురు, నీవునట్లు తప్పక దీనియందుదయ యుంచవలయు; మమసుతా=నాకూఁతురు, నేను బెంచినవాఁడను, నేను బ్రహ్మనిష్ఠుండను గావున నావలనఁ బెంపుడు సౌఖ్యంబును దీనికిఁ గల్గి యుండదు; అట్లు నేను బ్రహ్మనిష్ఠుండనై యుంటఁ జేసి, నీవు దీని నుపేక్షించినను విచారించు వారు లేరగుటవలన, నట్లు చేయక, దీని యందు దృఢంబగు ప్రేమయుంచవలయునని, యిప్పుడె చెప్పెదను; తవసహధర్మచరీ = నీకుధర్మపత్ని, నీవుధర్మపత్నిగాగ్రహించి

నంబూలు, మేముకర్మతులముకావుననది మెమాకుఁ బ్రార్థనీయంబు; ఏనాం ప్రతీచ్ఛ = దీనినంగీకరింపుము; చాలగౌరవముగల్గిన, తలిదండ్రులివ్వఁగాఁ బుచ్చుకొనుటకుం దామెత్వరపడుదురు; ఇట్టిదానిఁ బుచ్చుకొనుటకుఁ గొంత ప్రార్థించినంగాని కాదనుట. తేభద్రిఁ = నీకుమంగళమగుఁగాక; ఇట్టివారియందుఁ బ్రేమయుంచుటవలనను, బ్రహ్మనిష్ఠులమగు మామాట వినుటవలనను, నీకుమంగళంబుగల్గును.

తనిశ్లోకి.—ఇయం = ఇదిగో! రూపసౌందర్యంబుల నేనయధికుండనని గర్వంబునొంది యూరకుండకుము, నీవలెరూపసౌందర్యంబులుగల్గియుండు సీతంజూడుము; సీతా = నాఁగటిచాలునంబుట్టినది, బంగారుతీఁగెయును భూమియందేపుట్టును. అట్లు, బంగారుతీఁగెవంటిదికావున, భూమియందుఁబుట్టినది; అట్లయోనిజకావున, నాభిజాత్యవిచారంబెయక్కఱలేదు; మమసుతా = నాకొమార్తె, ఇట్టిదినాచేఁ బెంపఁబడుటంజేసి, నేనుధన్యుండనైతిని; తవ సహధర్మచరీ = నీకు, కూడధర్మమునాచరించునది, ధర్మమునాచరించుటకుసహాయురాలు, నీవుచేయుధర్మంబులకుఁ బ్రవర్తకురాలు; ఏనాం ప్రతీచ్ఛ = నిన్నువరించియున్నదీని, విడిచిపెట్టక, యాదరించిగ్రహింపుము. భద్రం తే = నీకుమంగళంబగుఁగాక; ముందుప్రాదిర్ఞఁబోవుకార్యంబ[illegible]నను కూలుండవుగమ్ము; పాణినా పాణిం, గృహ్ణీష్వ = హస్తముచేహస్తమును బట్టుకొనుము, నీవు, ఎవ్వరికినింగదలింపనుంగూడని శివధనువును [illegible]మెయివిఱువఁదగినంతటి హస్తంబుగలవాఁడవు, సీతహస్తంబతిమృదులంబు, కావునఁ, దిన్నగాఁ, బట్టుకొనుము, మఱికొందఱువచింపుచున్నారు—ఇయం = ఈ, నిన్నువిడువనప్పుడు మాత్రంబెయుండునది; సాధారణపతివ్రతయె, భర్తనువిడిచియుండనేరదని, "ఆర్తార్తేముదితేహృష్టాప్రోషితేమలినాకృశా। మృతేమ్రియేత యానారీసాస్త్రీజ్ఞేయాపతివ్రతా" (భర్త, దుఃఖితుండయినదుఃఖిత, సంతసించినసంతసించునది, దూరదేశంబునకుఁ బోయినపుడు మలినమైకృశాంగియగునది, మృతుండ

నంబూలు, మేముకర్మతులముకావు నసదియెమాకుఁబార్థనీయంబు ; ఏ నాఁప్రతీచ్ఛ= దీనినంగీకరింపుము; చాలగౌరవముగల్గిన, తలిదండ్రులి వ్వఁగాఁబుచ్చుకొనుటకుందామెత్వ రపడుచుతు; ఇట్టిదానిఁబుచ్చుకొను టకుఁగొంతప్రార్థించినంగానికా దనుట, తేభద్రం=నీకుమంగళమగుఁ గాక; ఇట్టివారియందుఁప్రేమయుం చుటవలనను, బ్రహ్మనిష్ఠులముగమా మాట వినుటవలనను, నీకుమంగళం బుగల్గును.

తనిశ్లోక.—ఇయం = ఇదిగో! రూపసౌందర్యంబుల నేనయధికుండ నని గర్వంబునొంది యూరకుండకు రాలు; స౦

ట్టినది; అట్లు, భూమియందుఁ బు ట్టినది, "మాతరమంగనాః (స్త్రీలు గుణంబులందల్లిఁబోలుదురు)" అని, యుండుటవలన, భూదేవి కొమా ర్తెయగుటంజేసి,క్షమాదిసద్గుణం బులున్నవని చెప్పంబనిలేదు. మమసు తా=నాకొమార్తె,భూమికొమా

మునాచరించునది, ధర్మమునాచ రించుటకుసహాయురాలు , నీవుచే యుధర్మంబులకుఁ బ్రవర్తకురా లు;ఏనాంప్రతీచ్ఛ = నిన్నువరించి యున్నదీని,విడిచిపెట్టక, యాదరిం చిగ్రహింపుము. భద్రంతే=నీకుమం గళంబగుఁగాక; ముందుప్రార్థింప బడునది కార్యంబునకు ..లుం డవుగము పాణినా పాణిం,గృహ్ణీ ష్వ=హస్తముచేహస్తమును బట్టు కొనుము,నీవు, ఎవ్వరికినింగదలింప నుంగూడనిశివధనువును ..

ఉవఁదగినంతటి హస్త డవు , సీతహస్తంబతిమ

మును,గ్ర..

నచెయిచాచి నీచెయిఁబట్టుకొనం జాలదు, కావుననీవేపట్టుకొనుము.

(ఈతనిశ్లోకియందు, ముందు వ్రాయఁబడినవానికభిన్నంబులగున ర్థంబులు,విస్తరభయంబున,విడు వంబడినవి).

పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా. ౨౭

టీక॥ఇయం(అధ్యాహృతము)=ఈ సీత;పతివ్రతా=పతియందువిడువని భక్తిగలదై; మహాభాగా=పూజ్య మైనభాగ్యముగలదై; సదా=ఎల్ల ప్పుడు;ఛాయేవ=నీడవలె; త్వాం (అధ్యాహృతము)=నిన్ను; అనుగ

తా = వెంబడించినదై; భవిష్యతి (అధ్యాహృతము)= ఉండఁగలదు.

ఈసీత, పతివ్రతయయి, మహాభాగ్యంబునొంది, నిన్ను నీడవలెనను సరింపుచుండంగలదు. అని, జనకుం డు రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా ప్రాక్షిపద్రాజా మంత్రపూతం జలంతదా

టీక॥ రాజా=జనకమహారాజు; తదా= అప్పుడు; ఇతి=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; మంత్రపూతం=మంత్రముచేఁబరిశుద్ధమయిన; జలం=నీటిని; రామహస్తే (అధ్యాహృతము)= రాముని చేతియందు; ప్రాక్షిపత్ విడిచెను.

అప్పుడు జనకమహారాజిట్లు చెప్పి, రామునిహస్తంబున సమంత్రంబుగా నీళ్లువిడిచెను. అని తాత్పర్యము

సాధు సాధ్వితి దేవానా మృషీణాం వదతాం తదా. ౭౦
దేవదుందుభి నిర్ఘోషః పుష్పవర్షో మహానభూత్

టీక॥ తదా=అప్పుడు; దేవానాం= దేవతలును; ఋషీణాం = ఋషులును; సాధుసాధు=బలే! బలే! ఇతి=అని [illegible]=చెప్పుచుండఁగా; మ[illegible]నీకమయిన; దేవదుందుభి[illegible]షః= దేవతలభేరులధ్వనియును; పుష్పవర్షః=పూలవానయును; అభూత్=కల్గినది.

అప్పుడు, దేవతలునుఋషులును, "బలే! బలే!" అని, చెప్పిరి; దేవతలుభేరులవాయించిరి, పూలవానగురిపించిరి. అని, తాత్పర్యము.

ఏవం దత్త్వా తదా సీతాం మంత్రోదకపురస్కృతామ్. ౭౧
అబ్రవీ జ్జనకో రాజా హర్షేణాభిపరిప్లుతః

టీక॥ తదా=అప్పుడు; రాజా=రాజయిన; జనకః = జనకుండు; ఏవం=ఇట్లు; సీతాం=సీతను; మంత్రోదకపురస్కృతాం=మంత్రములును నీళ్లునుముందిడఁబడినది గాఁగలదానిఁగా; దత్త్వా= ఇచ్చి; హర్షేణ=

సంతోషముచేత; అభిపరిప్లుతః=తడుపఁబడినవాఁడై; అబ్రవీత్=చెప్పెను.

అప్పుడు, జనకమహారాజు, ఇట్లు, మంత్రజలంబులతోఁగూడ సీతను రామునకొసంగి, సంతోషంబునందడిసి, ఇట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

లక్ష్మణా గచ్ఛ భద్రం తే ఊర్మిళా ముద్యతాం మయా. ౩౦
ప్రతీచ్ఛ పాణిం గృహ్ణీష్వ మాభూ త్కాలస్య పర్యయః

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఆగచ్ఛ=రమ్ము; తే=నీకు; భద్రం=మంగళము; అస్తు=(అధ్యాహృతము)అగుఁగాక. మయా=నాచేత; ఉద్యతం= ఇవ్వనిశ్చయింపఁబడిన; ఊర్మిళాం ఊర్మిళను; ప్రతీచ్ఛ=అంగీకరింపుము; పాణిం=హస్తమును; గృహ్ణీష్వ=గ్రహింపుము. కాలస్య= కాలముయొక్క; పర్యయః = అతిక్రమించుట; మాభూత్=కాకపోవుఁగాక.

లక్ష్మణుఁడా! రమ్ము; నీకుమంగళమగుఁగాక; నేను నీకూర్మిళనిచ్చెద నంగీకరింపుము; పాణిగ్రహణమునుం జేయుము; జాగుసేయకుము. అని జనకుండు లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

త మేవ ముక్త్వా జనకో భరతం చా భ్యభాషత. ౩౧

టీక॥జనకః=జనకుండు; ఏవం=ఇట్లు; తం=ఆలక్ష్మణుంగూర్చి; ఉక్త్వా=చెప్పి; భరతంచ= భరతునింగూర్చియు; అభ్యభాషత=చెప్పెను.

జనకుండు, ఇట్లు, లక్ష్మణునితోఁ జెప్పి, భరతునితోను, ఇట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

గృహాణ పాణిం మాండవ్యాః పాణినా రఘునందన

టీక॥ రఘునందన=భరతుఁడా! మాండవ్యాః= మాండవియొక్క; పాణిం=హస్తమును; పాణినా= హస్తముచేత, గృహాణ=గ్రహిం

వుము.

భరతుఁడా! మాండవిహస్తము నుహస్తంబునం బట్టుకొనుము. అని, జనకుండు భరతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

శత్రుఘ్నంచాపి ధర్మాత్మా అబ్రవీ జ్జనకేశ్వరః. 3౭

టీక॥ ధర్మాత్మా=ధర్మబుద్ధి గల; జనకేశ్వరః = జనకమహారాజు; శత్రుఘ్నంచాపి= శత్రుఘ్నునిం గూర్చియు; అబ్రవీత్=చెప్పెను.

ధర్మాత్ముఁడగు జనకమహారాజు, శత్రుఘ్నునిం జూచి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

శ్రుతకీర్త్యా మహాబాహో పాణిం గృహ్ణీష్వ పాణినా

టీక॥ మహాబాహో=గొప్పచేతులుగల శత్రుఘ్నుఁడా ! శ్రుతకీర్త్యాః=శ్రుతకీర్తియొక్క; పాణిం= హస్తమును; పాణినా=హస్తముచేత; గృహ్ణీష్వ=గ్రహింపుము.

మహాబాహుండవగు శత్రుఘ్నుఁడా! శ్రుతకీర్తి హస్తంబును నీహస్తంబునఁబట్టుకొనుము. అని, జనకుండు శత్రుఘ్నునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సర్వే భవంత స్సౌమ్యాశ్చ సర్వే సుచరితవ్రతాః. 33
పత్నీభి స్సంతు కాకుత్స్థా మాభూ త్కాలస్య పర్యయః

టీక॥ కాకుత్స్థాః=రామలక్ష్మణ భరతశత్రుఘ్నులారా! భవంతః= మీరు; సర్వే = అందఱును ; సౌమ్యాః= శాంతులరు. సర్వే=అందఱును; సుచరితవ్రతాః = చక్కగా నాచరింపఁబడిన వ్రతంబులుగలవారలు. పత్నీభిః= భార్యలతోఁ; సహితాః(అధ్యాహృతము)= కూడినవారలుగాఁ; సంతు = అగుదురుగాక. కాలస్య=కాలముయొక్క; పర్యయః = అతిక్రమించుట; మాభూత్=కాకపోవుఁగాక.

రామలక్ష్మణ భరతశత్రుఘ్నులారా! మీరందఱును సౌమ్యులరు; మీరందఱును, చక్కగా వ్రతంబుల నాచరించినవారలు; భార్యలంబొందుఁ

ము; జాగు సేయవలదు. అని, యందఱితోను జనకుండు చెప్పెను. అని, తాత్పర్యము.

జనకస్య వచ శ్శ్రుత్వా పాణీ న్పాణిభి రస్పృశన్. ౩౪
చత్వార స్తే చతసృణాం వసిష్ఠస్య మతే స్థితాః

టీక॥ తే=ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులు; చత్వారః=నల్వురును; జనకస్య = జనకునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క; మతే=ఇష్టమునందు; స్థితాః=ఉన్నవారలై; చతసృణాం = నల్వురియొక్కయు; పాణీన్=హస్తములను; పాణిభిః=హస్తములచేతను; అస్పృశన్=తాఁకిరి.

ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులు నల్వురును, జనకునిమాటనువిని, వసిష్ఠుననుజ్ఞనొంది, రాజపుత్రికలనల్వురిహస్తంబులను దమహస్తంబులచేఁదాఁకిరి. అని తాత్పర్యము.

అగ్నిం ప్రదక్షిణీకృత్య వేదిం రాజానమేవచ. ౩౫
ఋషీంశ్చైవ మహాత్మాన స్సభార్యా రఘుసత్తమాః
యథోక్తేన తదాచక్రు ర్వివాహం విధిపూర్వకమ్. ౩౬

టీక॥ తదా=అప్పుడు; మహాత్మానః=అధికమైనపరాక్రమముఁగల; రఘుసత్తమాః=రఘువంశమునందుఁబుట్టినవారిలోపల శ్రేష్ఠులగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులు; సభార్యాః = భార్యలతోఁగూడినవారలై; అగ్నిం=అగ్నిహోత్రమును; వేదిం=వేదిని; రాజానమేవచ=జనకమహారాజును; ఋషీంశ్చైవ=ఋషులను; ప్రదక్షిణీకృత్య=ప్రదక్షిణించి; యథోక్తేన=శాస్త్రమునందుఁజెప్పఁబడినరీతిచేత; వివాహం=పెండ్లిని; విధిపూర్వకం=సూత్రముముందుగాఁగల్గునట్లు; చక్రుః=చేసిరి.

అప్పుడు, మహాత్ములగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులు తమతమభార్యలంగూడి, అగ్నిహోత్రమునకును వేదికిని జనకమహారాజునకును

ఋషులకును బ్రదక్షిణంబుచేసి, శాస్త్రపద్ధతిని గల్పసూత్రంబు ప్రకారము వివాహంబుచేసికొనిరి.

అని తాత్పర్యము.

కాకుత్థైశ్చ గృహీతేషు లలితేషుచ పాణిషు
పుష్పవృష్టి ర్మహత్యాసీ దంతరిక్షా త్సుభాస్వరా. ౩౬

టీక॥ కాకుత్థైః = రామలక్ష్మణభరతశత్రుఘ్నులచేత ("చ" అనునది పాదపూరణార్థము); లలితేషు = సుందరంబులయిన; ("చ" అనునది పాదపూరణార్థము) పాణిషు = హస్తంబులు; గృహీతేషు = గ్రహింపఁబడినవి కాఁగా; అంతరిక్షాత్ = ఆకాశంబునుండి; మహత్ = గొప్పదియును; సుభాస్వరా = మిక్కిలియుఁ బ్రకాశించునది యునగు; పుష్పవృష్టిః = పూలవాన; ఆసీత్ = అయినది.

రామలక్ష్మణభరత శత్రుఘ్నులు సుందరంబులగు తమభార్యలహస్తంబులు పట్టుకొనఁగా నేఆకాశంబునుండి పరమభాస్వరంబగు గొప్పపూలవానకలిగినది.

అని, తాత్పర్యము.

ఇందు మొదటి యర్థశ్లోకము వ్యాఖ్యాత లుదాహరింపకున్నందు ననిచ్చోపిలెక్కింపఁబడదయ్యె.

దివ్యదుందుభినిర్ఘోషై ర్గీతవాదిత్రనిస్వనైః. ౩౭
ననృతుశ్చాప్సరస్సంఘా గంధర్వాశ్చ జగుః కళమ్

టీక ॥ దివ్యదుందుభినిర్ఘోషైః = స్వర్గంబునఁబుట్టిన భేరులధ్వనులతోను; గీతవాదిత్రనిస్వనైః = పాటలయొక్కయు వాద్యములయొక్కయు ధ్వనులతోను; అప్సరస్సంఘాః = అప్సరసలసమూహంబులును; ననృతుః = ఆడినవి. గంధర్వాశ్చ = గంధర్వులును; కళం = మధురముగా; జగుః = పాడిరి.

స్వర్గంబున భేరులు మ్రోఁగినవి; పాటలువాద్యములు మించినవి; అప్సరసలాడిరి; గంధర్వులు మధురంబుగాఁబాడిరి.

అని, తాత్పర్యము.

వివాహే రఘుముఖ్యానాం త దద్భుత మదృశ్యత. ౩౮

టీక॥ రఘుముఖ్యానాం = రఘువంశంబునఁ బుట్టిన వారిలోపల శ్రే

ఘ్నులయినరామలక్ష్మణ భరతశత్రుఘ్నులయొక్క; వివాహే=పెండ్లియందు;తత్=ఆ;అద్భుతం=ఆశ్చర్యము;అదృశ్యత=చూడఁబడినది.

రామలక్ష్మణభరతశత్రుఘ్నులవివాహమునందు పుష్పవృష్టిగురియుట, యప్సరసలాడుట, గంధర్వులుపాడుట, మొదలగ నాశ్చర్యములు, చూడఁబడినవి. అని, తాత్పర్యము.

ఈదృశే వర్తమానే తు తూర్యోద్ఘుష్టనినాదితే
త్రిరగ్నిం తే పరిక్రమ్య ఊహుర్భార్యాం మహౌజసః. ౩౯

టీక॥ఈదృశే=ఇట్టి;తూర్యోద్ఘుష్టనినాదితే =నృత్తగీతవాద్యములయొక్క, ధ్వనిచేగలిగినధ్వని; వర్తమానేతు=కలుగుచుండఁగానే; మహౌజసః= అధికమయినకాంతిగల; తే= ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులు;త్రిః=మూఁడుమాఱులు;అగ్నిం = అగ్నిహోత్రమును;పరిక్రమ్య=చుట్టి,భార్యాం=భార్యను;ఊహుః=పెండ్లాడిరి.

ఇట్లు, నృత్తగీతవాద్యములధ్వని చేఁబ్రపంచఁబంతయుఁబ్రతిధ్వనిగల్గిశబ్దాయమానంబగుచుండఁగానే, మిక్కిలియును గాంతిగలఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులు, మూఁడు మాఱులగ్నికిఁ బ్రదక్షిణంబు చేసి, భార్యలం బెండ్లాడిరి.

అని, తాత్పర్యము.

అథోపకార్యాం జగ్ముస్తే సభార్యా రఘునందనాః
రాజాప్యనుయయౌ పశ్యం త్సర్షిసంఘ స్సబాంధవః. ౪౦

టీక॥అథ=అటుపిమ్మట; తే=ఆ; రఘునందనాః=రామలక్ష్మణభరతశత్రుఘ్నులు; సభార్యాః=పెండ్లాములతోఁ గూడినవారలై; ఉపకార్యాం=విడిసినిగూర్చి;జగ్ముః = పోయిరి. రాజాపి= దశరథమహారాజును;సర్షిసంఘః= ఋషులసమూహముతోఁగూడినవాఁడై; సబాంధవః= బంధువులతోఁగూడినవాఁడై; పశ్యన్=చూచుచు; అనుయయౌ= వెంబడించెను.

అంత, నారామలక్ష్మణభరతశత్రుఘ్నులు,విడిదికిఁబోయిరి; దశరథమహారాజును, ఋషులను బంధువులనుంగూడి, భార్యలతోఁగూడిన కొడుకులం జూచుచు, వెంబడించి

వెళ్లెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే,త్రిసప్తతితమస్సర్గః
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండ త్రిసప్తతితమసర్గటీక,
ముగిసినది.

---

౭౪

చ తు స్స ప్త తి త మ స ర్గ ప్రా రం భః.

అథరాత్ర్యాం వ్యతీతాయాం విశ్వామిత్రో మహామునిః
ఆపృష్ట్వా తౌ చ రాజానౌ జగామోత్తరపర్వతమ్. ౧
ఆశీర్భిః పూరయిత్వాచ కుమారాంశ్చ సరాఘవాన్

టీక॥అథ = అటుపిమ్మట;రాత్ర్యాం=రాతిరి;వ్యతీతాయాం=కడవఁగా ; మహామునిః=పూజ్యుఁడయినమునియగు; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు;తౌ=ఆ; రాజానౌ చ=జనకమహారాజును, దశరథమహారాజును; ఆపృష్ట్వా=వీడ్కొని; సరాఘవాన్ = రామునితోఁగూడిన;కుమారాంశ్చ=పిల్లవాండ్రయిన లక్ష్మణభరతశత్రుఘ్నులను,(చకారంబుచే)సీతను,ఊర్మిళను మాండవిని శ్రుతకీర్తిని; ఆశీర్భిః=దీవనలచే; పూరయిత్వాచ=నింపియు;ఉత్తరపర్వతం= ఉత్తరపుదిక్కునందుండుకొండయయిన హిమవత్పర్వతమును;జగామ=పొందెను.

అంతనారాత్రికడవఁగానే, విశ్వామిత్రమహాముని,జనకమహారాజునుదశరథమహారాజునువీడ్కొని, రామలక్ష్మణభరతశత్రుఘ్నులనుసీతోర్మిళా మాండవీశ్రుతకీర్తులను ఆశీర్వదించి, హిమవత్పర్వతంబునకుఁబోయెను. అని,తాత్పర్యము.

ఇందుఁగడపటియర్ధశ్లోకంబు,

వ్యాఖ్యాతలుదాహరింపకుండుటంజేసి , యిచ్చోగణింపఁబడదయ్యె.

విశ్వామిత్రే గతే రాజా వైదేహం మిథిలాధిపమ్
ఆపృష్ట్వా థ జగామా శు రాజా దశరథః పురీమ్. ౨

టీక॥ విశ్వామిత్రే=విశ్వామిత్రుఁడు; గతే=పోఁగా; రాజా=దశరథమహారాజు; మిథిలాధిపం=మిథిలకుఁబ్రభువైన; వైదేహం=జనకుని; ఆపృష్ట్వా=వీడ్కొని; అథ=అంత; ఆశు=శీఘ్రముగా; రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; పురీం=అయోధ్యాపట్టణమునుగూర్చి; జగామ=పోయెను.

విశ్వామిత్రుండు పోయినపిమ్మట, దశరథమహారాజు, మిథిలకుఁబ్రభువయిన జనకమహారాజును వీడ్కొని, శీఘ్రముగాఁ, దనపట్టణమయినయయోధ్యకుఁబోయెను. అని, తాత్పర్యము.

గచ్ఛన్తం తంతు రాజాన మన్వగచ్ఛ న్నరాధిపః

టీక॥ నరాధిపః=మనుష్యులకుఁ బ్రభువయినజనకుఁడు; గచ్ఛంతం=పోవుచున్న; తం=ఆ; రాజానంతు=దశరథమహారాజును; అన్వగచ్ఛత్=వెంబడించిపోయెను.

దశరథుండుపోవుచుండఁగా, జనకమహారాజు, కొంతదూరము, దారివిడుచుటకై, వెంబడించెను. అని, తాత్పర్యము.

అథ రాజా విదేహానాం దదౌ కన్యాధనం బహు. ౩

టీక॥ అథ=అటుపిమ్మట; విదేహానాం=విదేహదేశంబునకు; రాజా=ప్రభువయినజనకుండు; బహు=అధికమయిన; కన్యాధనం=అరణమును; దదౌ=ఇచ్చెను.

అంత, విదేహదేశప్రభుండగుజనకుండధికముగా నరణంబొసంగెను. అని, తాత్పర్యము.

గవాం శతసహస్రాణి బహూని మిథిలేశ్వరః
కంబళానాం చ ముఖ్యానాం క్షౌమకోట్యం బరాణిచ. ౪

హస్త్యశ్వ రథపాదాతం దివ్యరూపం స్వలంకృతమ్
దదౌ కన్యా పితా తాసాం దాసీదాస మనుత్తమమ్. ౫

టీక॥ మిథిలేశ్వరః=మిథిలకుఁబ్రభువును; కన్యాపితా= కన్యలకుఁదండ్రియునయినజనకుండు; గవాం=ఆవులయొక్క; బహూని= పెక్కులయిన; శతసహస్రాణి=నూఱువేలను; ముఖ్యానాం=శ్రేష్ఠములయిన; కంబళానాం=కంబళ్లయొక్క; బహూని; శతసహస్రాణి (అధ్యాహృతము)=పెక్కులయిననూఱువేలును; క్షౌమకోట్యంబరాణిచ= పట్టువైన శ్రేష్ఠవస్త్రంబులును; దివ్యరూపం=శ్రేష్ఠమయినయాకారముగలదియును; స్వలంకృతం=చక్కగానలంకరింపఁబడినదియునగు; హస్త్యశ్వరథపాదాతం=ఏనుఁగులనుగుఱ్ఱములనరథములను ... గాలిబంటువులను; అనుత్తమం=తమకన్న శ్రేష్ఠము లేని; దాసీదా... స్త్రీలను బనివాం... సకు... తాసాం= ఆపడుచులకు; దదౌ=ఇచ్చెను.

మిథిలకుఁబ్రభువయిన జనకమహారాజు, పెక్కులక్షలావులను, పెక్కులక్షలు శ్రేష్ఠంబులగు కంబళవస్త్రములును, శ్రేష్ఠములయిన పట్టువస్త్రంబులును, చక్కని రూపంబుగలిగియలంకరింపఁబడినయేనుఁగులునుగుఱ్ఱములునుంబదాతులును, చక్కని దాసదాసీజనంబులను, దనకొమాతెలకొఱకుంగాను.

అని, తాత్పర్యము.

హిరణ్యస్య సువర్ణస్య ముక్తానాం విద్రుమస్యచ
దదౌ పరమసంహృష్టః కన్యాధన మనుత్తమమ్. ౬

టీక॥ సః(అధ్యాహృతము)= ఆజనకుండు; పరమసంహృష్టః=మిక్కిలియుసంతసించినవాఁడై; హిరణ్యస్య= వెండియొక్కయు; సువర్ణస్య=బంగారుయొక్కయు; ముక్తానాం=ముత్తెములయొక్కయు; విద్రుమస్యచ=పవడముయొక్కయు; బహూని, శతసహస్రాణి=పెక్కులయిన, నూఱువేలను; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేని; కన్యాధనం= అరణమునుగా; దదౌ=ఇచ్చెను.

జనకుండు, మిగులసంతోషంబు

| | |
|---|---|
| ం వెండినాణెములును | క్షులకులును, కోమా తేరలకరణం |
| గారు నాణెములు | బుగానిచ్చెను. |
| బు పవడములుపె | అని, తాత్పర్యము. |

ంధనం రాజా సమనుజ్ఞాప్య పార్థివమ్
ప్ర ంనిలయం మిథిలాం మిథిలేశ్వరః. ౭

టీక ॥ మిథిలేశ్వరః— లకుం ప్రభువయిన; రాజా=జనకమహా రాజు; బహుధనం=అధికమయినధనమును; దత్వా=ఇచ్చి; పార్థివం=దశరథ మహారాజును; సమనుజ్ఞాప్య=వీడుకొని; స్వనిలయం= తనయునికిపట్టయిన; మిథిలాం=మిథిలను; ప్రవివేశ=ప్రవేశించెను.

మిథిలానాథుండగు జనకుండు, ఇట్లుకోమా తేరలకుబహుధనంబొసంగి, దశరథునివీడ్కొని, తనపట్టణంబైనమిథిలంబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

రాజాప్య యోధ్యాధిపతి స్సహపుత్రై ర్మహాత్మభిః
ఋషీన్ సర్వాన్ పురస్కృత్య జగామ సబలానుగః. ౮

టీక॥అయోధ్యాధిపతిః = అయోధ్యకుంబ్రభువయిన;రాజాపి=దశరథమహారాజును ; సబలానుగః=సైన్యముతోనుగింకరులతోనుం గూడినవాఁడైన; మహాత్మభిః=అధికమయినపరాక్రమముగల;పుత్రైస్సహ = కొడుకులతోఁగూడ;ఋషీన్=ఋషులను; సర్వాన్=అందఱను; పురస్కృత్య=మున్నిడికొని;జగామ=పోయెను.

అయోధ్యకుఁబ్రభువయినదశరథుండును సైనికులను గింకరులనుం గూడి,మహాపరాక్రమశాలులగుకొడుకులతో,ఋషులనందఱంబురస్కరించికొని,పోయెను.

అని, తాత్పర్యము.

గచ్ఛంతం తం నరవ్యాఘ్రం సఋషిసంఘం సరాఘవమ్
ఘోరా స్స పక్షిణో వాచో వ్యాహరంతి తత స్తతః. ౯



టీక॥ సర్షిసంఘః = ఋషులసమూహములతోఁ గూడినవాఁడును; సరాఘవం = రామునితోఁగూడినవాఁడునగు; గచ్ఛంతం = పోవుచున్న; తం = ఆ; నరవ్యాఘ్రం = పురుషశ్రేష్ఠుండగుదశరథునింగూర్చి; ఘోరాః = భయంకరములయిన; పక్షిణః = పక్షులు; తతస్తతః = అచ్చటచ్చట; వాచః = పలుకరంతిస్మ = కూసినవి.

పురుషశ్రేష్ఠుం డు ఋషులనురా చుండఁగా, నతని టచ్చట, భ ంబులగు ... లు కూసినవి, ఇట్లాకాశంబున దుశ్శకునంబు కాన్పించినదని, తాత్పర్యము.

భౌమా శ్చైవ మృగా స్సర్వే గచ్ఛంతిస్మ ప్రదక్షిణమ్

టీక॥ భౌమాః = భూమియందుఁ బుట్టిన; మృగాశ్చైవ = మృగములును; సర్వే = అన్నియును; ప్రదక్షిణం = ప్రదక్షిణముగా; గచ్ఛంతిస్మ = పోయినవి.

భూమియందలి మృగంబులన్నియునతనికిఁ బ్రదక్షిణంబుగానడచినవి; ఇట్లు, భూమియందు శుభశకునంబుఁగల్గినది.

అని, తాత్పర్యము.

తాన్ దృష్ట్వా రాజశార్దూలో వసిష్ఠం పర్యపృచ్ఛత. ౧౦

టీక॥ రాజశార్దూలః = రాజశ్రేష్ఠుండగుదశరథుండు; తాన్ = ఆ పక్షులను మృగంబులను; దృష్ట్వా = చూచి; వసిష్ఠం = వసిష్ఠుని; పర్యపృచ్ఛత = అడిగెను.

రాజశ్రేష్ఠుండగు దశరథుండు, అట్లు, ఆకాశంబునందు, భయంకరంబుగాఁ బక్షులుకూయుటయు, భూమియందుమృగంబులు ప్రదక్షిణంబుగానడచుటయుంజూచి, వసిష్ఠునితో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అసౌమ్యాః పక్షిణో ఘోరా మృగాశ్చాపి ప్రదక్షిణాః
కి మిదం హృదయోత్కంపి మనో మమ విషీదతి. ౧౧

టీక॥ అసౌమ్యాః = క్రూరంబులగు; పక్షిణః = పక్షులు; ఘోరం = భ




గా; భవంతి(అధ్యా ౹గుచున్నవి. మృగా ౦బులును; ప్రదక్షి ౦బుగానడుచునవి ్యాహృతము)= ఉ ... హృద ... చు ... సు

రంబుగాఁగూయుచున్నవి; దానంజే సి, యశుభనిమిత్తంబుదోఁచెడు; మృగంబులు ప్రదక్షిణంబుగానడచు చున్నవి; దీన, శుభనిమిత్తంబుగా న్పించుచున్నది; ఇదియేమి? నాగుండె యదరుచున్నది; మనంబునకుదుఃఖం బగుచున్నది; చెప్పుము. అని, దశర థుండువసిష్ఠునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

... వాక్యం మహా న్ఋషిః
... తా మస్య య త్ఫలమ్. ౧౨

టీక॥ మహాన్= పూజ్యుఁడయి నట్టి; ఋషిః= వసిష్ఠమహర్షి; రాజ్ఞః= రాజయిన; దశరథస్య= దశరథునియొక్క; ఏతత్= ఈ; వాక్యం= మాటను; శ్రుత్వా= విని, మధురాం= మనోహరమయిన; వాణీం= మాటను; ఉవాచ= చెప్పెను. అస్య = దీనికి; ఫలం= ఫలము; యత్= ఏదో; తత్= (అధ్యాహృతము) అది, శ్రూయతాం= వినఁబడుఁగాక.

పూజ్యుండగు వసిష్ఠమహర్షి, దశరథమహారాజు చెప్పిన మాటను విని, యతనికి, మధురంబుగనిట్లని, చెప్పెను. దీనివలనంగల్గు ఫలంబు చెప్పెదను, వినుము. అని, తాత్పర్యము.

ఉపస్థితం భయం ఘోరం దివ్యం పక్షిముఖా చ్చ్యుతమ్
మృగాః ప్రశమయంత్యే తే సంతాప స్త్యజ్యతా మయమ్. ౧౩

టీక॥ ఘోరం= భయంకరమును; ఉపస్థితం= సమీపించినదియునగు; భయం= భయము; దివ్యపక్షిముఖాత్= ఆకాశమునందలిపక్షులము



ఖంబువలన; చ్యుతం=జాఱినది, సూచింపఁబడినదనుట; ఏతే=ఈ; మృగాః=మృగములు; ప్రశమయంతి=పోఁగొట్టుచున్నవి. అయం=ఈ; సంతాపః=దుఃఖము; త్యజ్యతాం=విడవఁబడుఁగాక.

ఇప్పుడు, మనకుఁ గలుగంబోవు భయంకరంబు నాకాశంబునందు పక్షులకచించుచున్నవి; ఈ మృగంబులు చేయుపానిను పశమింపఁన, భయంబువదలుము, దశరథునకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తేషాం సంవదతాం తత్ర వాయు ర్ప్రాదుర్బభూవహ
కంపయన్పృథివీంసర్వాం పాతయంశ్చ ద్రుమాంచ్ఛుభాన్. ౧౪

టీక॥తత్ర=అచ్చట; తేషాం=వారు; సంవదతాం=మాటలాడుచుండఁగా; వాయుః = గాలి; పృథివీం=భూమిని; సర్వాం=అంతను; కంపయన్ = కదలించుచు; శుభాన్ = మంగళకరంబులగు; ద్రుమాన్=వృక్షంబులను; పాతయం శ్చ=పడఁద్రోయుచున; ప్రాదుర్బభూవ = పుట్టినది, వీచినదనుట "హ" అననది పాదపూరణార్థంబు—

అచ్చో వారలిట్లు మాటలాడుచుండఁగా, వాయువు, భూమినంతయుం గదలించుచు శుభంబులగు వృక్షంబులంబడఁద్రోయుచు వీచెను. అని, తాత్పర్యము.

తమసాసంవృతస్సూర్య స్సర్వాన ప్రబభు ర్దిశః
భస్మనాచావృతంసర్వం సమ్మూఢమివతద్బలమ్. ౧౫

టీక॥సూర్యః=సూర్యుఁడు; తమసా=చీఁకటిచేత; సంవృతః=కప్పఁబడినాఁడు. దిశః=దిక్కులు; సర్వాః=అన్నియు; న ప్రబభుః=ప్రకాశింపలేదు. తత్=ఆ; బలంచ=సైన్యమును; భస్మనా=బూడిదచేత, దుమ్ముచేతననుట; ఆవృతం=కప్పఁబడినదై; సమ్మూఢమివ=మూర్ఛ




నె; ఆసీత్(అధ్యాహృ | యంతయు దుమ్మునమునింగి మూ
నది. | ర్ఛఁబొందినట్లయినది.
ార్యునిం(గమ్మెను, ది | అని, తాత్పర్యము.
పవన్యే , ఆసేన |

శ్చఋషయశ్చాన్యే రాజాచససుతస్తదా
ససంజ్ఞా ఇవ తత్రాసన్ సర్వమన్యద్విచేతనమ్.౧౬

టీక॥ తదా=అప్పుడు; తత్ర=అచ్చట; వసిష్ఠశ్చ = వసిష్ఠుఁడును, అన్యే=ఇతరులయిన; ఋషయశ్చ=ఋషులును; ససుతః= కొడుకులతోఁగూడిన; రాజాచ=దశరథమహారాజును; ససంజ్ఞాః=తెలివిగలవారువలె; ఆసన్ = ఉండిరి. అన్యత్=ఇతరమయినది; సర్వం=అంతయును; విచేతనం=తెలివిలేనిది; అభవత్ (అధ్యాహృతము)= అయినది.

అప్పుడచ్చట, వసిష్ఠుండు, ఇతరులయినఋషులును, దశరథుండును, అతనికొడుకులును, మాత్రము, సంజ్ఞ గలిగినట్లుండిరి; తక్కినవారందఱుమూర్ఛిల్లిరి. అని, తాత్పర్యము.

తస్మింస్తమసి ఘోరేతు భస్మచ్ఛన్నేవసాచమూః

టీక॥ ఘోరే=భయంకరమయిన; తస్మిన్=ఆ; తమసితు=చీకటియందు మాత్రము; సా= ఆ; చమూః=సేన; భస్మచ్ఛన్నేవ=బూడిదచేఁ గప్పఁబడినదునట్లు; ఆసీత్ (అధ్యాహృతము)=ఉండినది.

అట్లుభయంకరంబుగాఁజీకటి క్రమ్మఁగా, నప్పుడా సేన, బూడిదచేఁ గప్పఁబడినట్లుండినది.

అని, తాత్పర్యము.

దదర్శ భీమసంకాశం జటామండల ధారిణమ్.౧౭
భార్గవం జామదగ్న్యంతం రాజరాజ విమర్దినమ్
కైలాస మివదుర్ధర్షం కాలాగ్ని మివదుస్సహమ్.౧౮
జ్వలంత మివ తేజోభి ర్దుర్నిరీక్ష్యం పృథగ్జనైః

స్కంధే చాసజ్య పరశుం ధనుర్విద్యుద్గణోపమమ్ .
ప్రగృహ్య శరముఖ్యంచ త్రిపురఘ్నం యథా శివమ్

టీక॥ సా (అధ్యాహృతము) = ఆసేన; భీమసంకాశం = భయంకరుఁడుగానుండువాఁడును; జటామండలధారిణం = జడలసమూహమును ధరించినవాఁడును; రాజరాజవిమర్దినం = రాజశ్రేష్ఠులను నలఁగఁగొట్టినవాఁడును; కైలాసమివ = కైలాసపర్వతముంబోలె; దుర్ధర్షం = ఎదిరింపఁగూడనివాఁడును; కాలాగ్నిమివ = ప్రళయకాలమునందలియగ్నిహోత్రునింబోలె; దుస్సహం = ఓర్వఁగూడనివాఁడును; తేజోభిః = కాంతులచేత; జ్వలంతమివ (స్థితం) = మండుచున్నట్లుండువాఁడును, పృథగ్జనైః = పామరులచేత; దుర్నిరీక్ష్యం = చూడఁగూడనివాఁడును; స్కంధే = మూఁపునందు; పరశుం = గొడ్డలిని; ఆసజ్య చ = ఉంచికొనియు; ధనుః = వింటిని; విద్యుద్గణోపమం = మెఱుపులసమూహముతోఁ బోలికగల; శరముఖ్యం చ = బాణశ్రేష్ఠమును; ప్రగృహ్య = పట్టుకొని; స్థితం (అధ్యాహృతము డును; త్రిపురఘ్నం = లఁ జంపునట్టి; శి తం) = శివు గు; భార్గవం = భృగువంశమునం బుట్టిన, తం = ఆ; జామదగ్న్యం = జమదగ్నికొడుకైన పరశురాముని; దదర్శ = చూచెను.

ఆసేన, భయంకరుండై కనుపట్టుచు, జడలధరించి, కైలాసముఁ బోలెదుర్ధర్షుండై ప్రళయకాలమునందలియగ్నిహోత్రుఁడుం బోలెసహింపఁగూడనివాఁడై, కాంతులం బ్రజ్వరిల్లునట్లు దేజరిల్లుచు, పామరులకుం జూడనశక్యుఁడై, మూఁపునం బరశువునిడికొని ధనువును మెఱపులంగుంపుం బోలు బాణంబునుం బట్టుకొని, త్రిపురాసురులఁ జంపఁ బూను శివుండోయనం బ్రకాశించుచున్న, రాజులం జంపినవాఁడును భార్గవుండునగు పరశురాముం జూచెను.

అని తాత్పర్యము.

తం దృష్ట్వా భీమసంకాశం జ్వలంత మివ పావకమ్. ౨౦

సిష్ఠప్రముఖా విప్రా జపహోమపరాయణాః
గతా మునయస్సర్వే సంజజల్పు రథో మిథః. ౨౧

ర్థో=అటుపిమ్మట; భీ
భయంకరుండుగా
జ్వలంతం=మండు
కం)=నిప్పువ
లెనుండువాఁడునగు; తం=ఆపరశు
రామునిఁ; దృష్ట్వా = చూచి; మున
యః= ఆత్మమననముచేయువారు
ను; జపహోమపరాయణాః=జప
మును హోమము నేముఖ్యంబగుగతి
గాఁగలవారలునగు ; వసిష్ఠప్రము
ఖాః=వసిష్ఠుఁడు మొదలుగాఁగల; వి
ప్రాః=బ్రాహ్మణులు; సర్వే=అంద
ఱును; సంగతాః=చేరినవారలై; మి
థః = పరస్పరమును; సంజజల్పుః=
మాటలాడుకొనిరి.

భయంకరుండై మండుచున్నని
ప్పుంబోలెనున్న యాపరశురాముం
జూచి, ఎల్లప్పుడును జపమును హో
మమును విడువక చేయుచుండు వసి
ష్ఠుఁడు మొదలగు బ్రహ్మర్షులందఱు
నొకటిగాఁజేరి, పరస్పరము, మాట
లాడికొనిరి. అని, తాత్పర్యము.

కచ్చి త్పితృవధామర్షీ క్షత్రం నోత్సాదయిష్యతి

టీక ॥ పితృవధామర్షీ=తండ్రివ
ధముచేఁగోపముగల; అయం (అ
ధ్యాహృతము)=ఈపరశురాముం
డు; క్షత్రం=క్షత్రియజాతిని; నోత్సా
దయిష్యతి కచ్చిత్= పెల్లగింపఁడా
యేమి?

క్షత్రియులు తండ్రింజంపుటచేఁ
గోపించియుండు నీపరశురాముం, డి
ప్పుడు, మఱల, క్షత్రియులంజంపు
నా? చంపఁడా? అని, తాత్పర్యము.

పూర్వం క్షత్రవధం కృత్వా గతమన్యు ర్గతజ్వరః. ౨౨
క్షత్రస్యోత్సాదనం భూయో నఖల్వస్య చికీర్షితమ్

టీక ॥ అయం (అధ్యాహృత
ము) ఈపరశురాముఁడు ; పూ
ర్వం=మునుపు; క్షత్రవధం= క్షత్రి
యులయొక్క-చంపుటను; కృత్వా=
చేసి; గతమన్యుః=పోయినకోపము
గలవాఁడును; గతజ్వరః=పోయిన,

కోపమునం గల్గుతాపము, గలవాఁడును. అభవత్ (అధ్యాహృతము)= ఆయెను. భూయః= మఱల; క్షత్రస్య=క్షత్రియజాతియొక్క; ఉత్సాదనం=పెల్లగించుట; అస్య = ఇతనియొక్క; చికీర్షితం=చేయనిచ్ఛింపఁబడినది; నఖలు=కాదుగదా!

ఈపరశురాముండు, క్షత్రియులనందఱంజంపి, దాపంబును వీడియున్నతండు, మఱల, క్షత్రియులంపుగొనండు. అనిరము చెప్పుకొనిరి

ఏవ ముక్త్వార్ఘ్య మాదాయ భార్గవం భీమదర్శనమ్. ౨౩
ఋషయో రామరామేతి వచో మధుర మబ్రువన్

టీక॥ ఋషయః=ఋషులు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పుకొని; అర్ఘ్యం=పూజాద్రవ్యమును; ఆదాయ=తీసుకొని; భీమదర్శనం=భయంకరం బగు చూపుగల; భార్గవం= భృగువంశమునందుఁబుట్టినపరశురామునిగూర్చి; రామ రామ= రాముఁడా! రాముఁడా! ఇతి=అని; మధురం=ఇంపయిన; వచః = మాటను; అబ్రువన్=చెప్పిరి.

ఋషులిట్లు పరస్పరమ్ము మాటలాడుకొని, అర్ఘ్యంబుగొని, భీమదర్శనుండగు పరశురామునింబూచి మధురంబుగా, "రాముఁడా! రాముఁడా!" యనిపిలిచియతనిం బూజించిరి. అని తాత్పర్యము.

ప్రతిగృహ్య తు తాంపూజా మృషిదత్తాం ప్రతాపవాన్. ౨౪
రామం దాశరథిం రామో జామదగ్న్యోఽభ్యభాషత

టీక॥ ప్రతాపవాన్= పరాక్రమముగల; జామదగ్న్యః= జమదగ్నికొడుకైన; రామః=పరశురాముండు ఋషిదత్తాం= ఋషులచేనివ్వఁబడిన; తాం=ఆ; పూజాంతు=పూజనుమాత్రము; ప్రతిగృహ్య=పుచ్చుకొని; దశరథం=దశరథునికొడుకైన; రామం=రామునిఁగూర్చి; అభ్యభాషత=పలికెను.

జమదగ్నికొడుకు పరాక్రమశాలియగు పరశురాముఁడు ఋషులొసంగినపూజనుమాత్రము ప్రతిగ్రహిం

|ధపుత్రుండగు, రాముని| అనితాత్పర్యము.
ట్లనిచెప్పెను.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
బాలకాండే, చతుస్సప్తతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

శ్రీచంద్రికాఖ్యావంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, బాలకాండచతుస్సప్తతితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ
## పంచసప్తతితమసర్గప్రారంభః.

రామ దాశరథే రామ వీర్యం తే శ్రూయతే ద్భుతమ్
ధనుషో భేదనంచైవ నిఖిలేన మయా శ్రుతమ్. ౧

టీక॥ దాశరథే = దశరథునిపుత్రుండవైన; రామ=రాముఁడా! రామ=రాముఁడా; (కోపంబున రెండుమారులు సంబోధించుట) తే=నీయొక్క; అద్భుతం=ఆశ్చర్యకరమైన, వీర్యం= పరాక్రమము, శ్రూయతే = వినబడుచున్నది, మయా=నాచేత; ధనుషః=శివధనువుయొక్క; భేదనంచైవ = విఱుచుటయును (చకారముచే) తాటకంజంపుట మొదలగునదియును; నిఖిలేన= సాకల్యముచేత; శ్రుతం=వినఁబడినది.

దశరథపుత్రుండవగు రాముఁడా! రాముఁడా! ఆశ్చర్యకరంబగనీ పరాక్రమంబు లోకంబులనన్నిటను వినంబడుచున్నది, శివునివిల్లువిఱుచుట, తాటకంజంపుటవిశ్వామిత్రయాగముఁగాచుట మొదలగునీకార్యంబులనంతయు, నేనువింటిని.

అనితాత్పర్యము.




తదద్భుత మచింత్యం చ భేదనం ధనుష స్త్వయా
తచ్ఛ్రుత్వాహ మనుప్రాప్తో ధనుర్గృహ్య పరం శుభమ్. ౨

టీక॥ త్వయా = నీచేత; ధనుషః=శివునివింటియొక్క; తత్ =ఆ; భేదనం=విఱుచుట; అద్భుతం=ఆశ్చర్యకరమును; అచింత్యం=తలంపనుంగూడనిదియును; భవతి(అధ్యాహృతము)=అగుచున్నది అహం= నేను; తత్ =దాని; శ్రుత్వా=విని; శుభం = మంగళకరమయిన; అపరం=మఱియొక్క; ధనుః=వింటిని; గృహ్య(గృహీత్వా)=తీసికొని; అనుప్రాప్తః=వచ్చినాఁడను.

నీవు, శివునివిల్లువి [illegible] డి. చాలనాశ్చర్యకరము; మనంబునను దలంపఁగూడనిది; దానివిని, నేను, శుభంబగు మఱియొక్క ధనువుంగైకొని, వచ్చినాఁడను. అని తాత్పర్యము.

తదిదం ఘోరసంకాశం జామదగ్న్యం మహాద్ధనుః
పూరయస్వ శరేణైవ స్వబలం దర్శయస్వ చ. ౩

టీక॥ ఘోరసంకాశం=భయంకరంబుగానుండునదియును; జామదగ్న్యం= జమదగ్నివలనవచ్చినదియును; మహత్ =గొప్పదియునగు; తత్ =ఆ; ఇదం=ఈ; ధనుః=వింటిని; శరేణైవ=బాణముచేతనే; పూరయస్వ=పూరింపుము. స్వబలంచ=నీబలమును; దర్శయస్వ=చూపుము.

భయంకరంబును మాతండ్రియగు జమదగ్ని నాకొసంగినదియును గొప్పదియునగు నీధనువును బాణంబునంబూరించి నీబలంబునుంజూపుము. అని, తాత్పర్యము.

తదహం తే బలం దృష్ట్వా ధనుషో స్య ప్రపూరణే
ద్వంద్వయుద్ధం ప్రదాస్యామి వీర్యశ్లాఘ్యస్య రాఘవ. ౪

టీక॥ రాఘవ=రాముఁడా! తత్ = అప్పుడు; అహం=నేను; అస్య=ఈ; ధనుషః=వింటియొక్క; పూరణే= పూరించుటయందు; తే=నీయొక్క; బలం=బలమును; దృష్ట్వా=చూచి; వీరశ్లాఘ్యస్య= పరాక్రమముచే మెచ్చుకొనఁదగిన; తవ (అధ్యాహృతము)= నీకు; ద్వంద్వయుద్ధం=ఇద్ద




స ౭౫

 

ఆకరితోనాకుచేయు యుద్ధమును; ప్రదాస్యామి=ఇచ్చెదను.

రాముఁడా; అప్పుడు, నీవీధనువునుబూరింపఁగా నీబలంబెఱింగి, పరాక్రమంబున మెచ్చఁదగిననీతోద్వంద్వ యుద్ధంబు చేసెదను. అని పరశురాముండు రామునితోఁ జెప్పెను.

అని తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా రాజా దశరథ స్తదా
విషణ్ణవదనో దీనః ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్. ౫

టీక॥ తదా=అప్పుడు; రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; తస్య=ఆపరశురామునియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; విషణ్ణవదనః=దుఃఖించినముఖంబుగలవాఁడై; దీనః=భయపడినవాఁడై; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అప్పుడు, దశరథమహారాజు, ఆపరశురామునిమాటవిని, దుఃఖంబున, వెల్వెలంబాఱిన మొగంబుగలిగి, భయంబునంజేమొగుడ్చి, యిట్లని చెప్పెను. అని తాత్పర్యము.

క్షత్రరోషా త్ప్రశాంత స్త్వం బ్రాహ్మణశ్చ మహాయశాః
బాలానాం మమ పుత్త్రాణా మభయం దాతుమర్హసి. ౬

టీక॥ త్వం=నీవు; క్షత్రరోషాత్=క్షత్రియులయందలి కోపంబునుండి; ప్రశాంతః=మిక్కిలియు శాంతిబొందినవాఁడవును; బ్రాహ్మణః=బ్రాహ్మణుండవును; మహాయశాః=అధికమయినకీర్తిగలవాఁడవు; బాలానాం=పిల్లవాండ్రైన; మమ=నాయొక్క; పుత్రాణాం=కొమరులకు; అభయం=భయము లేకుండుటను; దాతుం=ఇచ్చుటకు; అర్హసి=తగుదువు.

నీవు, క్షత్రియులయందలి కోపంబు వదలి శాంతుండవైతివి; మఱియు, బ్రాహ్మణుండవు; మహాయశుండవు; నాకొడుకులు బాలురు; వీరలకభయంబొసంగుము.

అని, తాత్పర్యము.

భార్గవాణాం కులేజాత స్స్వాధ్యాయవ్రతశాలినామ్

 

సహస్రాక్షే ప్రతిజ్ఞాయ శస్త్రం నిక్షిప్తవానసి. ౭

టీక॥ త్వం (అధ్యాహృతము) నీవు; స్వాధ్యాయవ్రతశాలినాం= వేదాధ్యయనము మొదలగు వ్రతములచేఁ బ్రకాశించుచుండు; భార్గవాణాం=భృగువంశమునందుఁ బుట్టినవారియొక్క; కులే=వంశమునందు; జాతః=పుట్టినాఁడవు; సహస్రాక్షే=ఇంద్రునియందు, ఇంద్రుని సమీపము నందనుట; ప్రతిజ్ఞాయ= ప్రతినయొనర్చి; శస్త్రం=ఆయుధమును; నిక్షిప్తవాన్=విడిచినవాఁడవు; అసి=అగుచున్నావు.

ఎప్పుడును వేదాధ్య...ము మొదలగు వ్రతంబులంజె... గవుల వంశమునం బుట్టితివి; ఇంద్రునియొద్దఁ బ్రతిజ్ఞ చేసి, శస్త్రంబు విడిచినాఁడవు. అని, తాత్పర్యము

స త్వం ధర్మపరో భూత్వా కాశ్యపాయ వసుంధరామ్
దత్వా వన ముపాగమ్య మహేంద్రకృతకేతనః ౮

టీక॥ సః=అట్టి; త్వం=నీవు; ధర్మపరః=ధర్మమునందాసక్తుండవు; భూత్వా=అయి; కాశ్యపాయ=కాశ్యపునికొఱకు; వసుంధరాం=భూమిని; దత్వా=ఇచ్చి; వనం=అడవిని; ఉపాగమ్య=పొంది, మహేంద్రకృతకేతనః=మహేంద్రపర్వతమునందుఁ జేయఁబడినయునికి గలవాఁడవు; అసి (అధ్యాహృతము)=అగుచున్నావు.

అట్లు, నీవు ధర్మపరుండవై, భూమియంతయుఁ గాశ్యపున కొసంగి, యడవిఁ జేరి, మహేంద్రపర్వతమునందు వాసము సేయుచున్నావు. అని, తాత్పర్యము.

మమ సర్వవినాశాయ సంప్రాప్తస్త్వం మహామునే
నచైకస్మిన్ హతే రామే సర్వే జీవా మహేవయమ్. ౯

టీక॥ మహామునే=పూజ్యుఁడవయినమునియగు పరశురాముఁడా; త్వం=నీవు; మమ=నాయొక్క; సర్వవినాశాయ = సమస్తముయొక్కయు నశించుటకొఱకు; సంప్రాప్తః=వచ్చినాఁడవు; ఏకస్మిన్ = ఒ




కఁబడైన; రామే=రాముఁడు, హతే=చంపఁబడఁగా; వయం= మేము; సర్వేచ = అందఱమును; నజీవామహే=బ్రతుకము.

మహా నివగు పరశురాముఁ కయునశించుటకై, నీవిచ్చటికి తెంచితివి రాముఁడొకఁడు చంపఁబడఁగానే, మేమందఱమును ప్రాణంబువిడుతుము; అని దశరథుండు పరశురామునితోఁ జెప్పెను. అని; తాత్పర్యము.

బ్రువత్యేవం దశరథే జామదగ్న్యః ప్రతాపవాన్
అనాదృత్యైవ తద్వాక్యం రామమేవాభ్యభాషత. ౧౦

టీక॥ దశరథే=దశరథుఁడు; ఏవం=ఇట్లు; బ్రువతి= చెప్పుచుండఁగా; ప్రతాపవాన్=పరాక్రమముగల; జామదగ్న్యః=జమదగ్నికొడుకయినపరశురాముఁడు; తద్వాక్యం = ఆదశరథునిమాటను; అనాదృత్యైవ=ఆదరింపకయే; రామమేవ=రామునిగూర్చియె; అభ్యభాషత=చెప్పెను.

దశరథుండట్లుచెప్పుచుండఁగా, పరాక్రమశాలియగుపరశురాముండు, దశరథునిమాటనుసరకుసేయక, రామునితోనే, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇమే ద్వే ధనుషీ శ్రేష్ఠే దివ్యే లోకాభివిశ్రుతే
దృఢే బలవతీ ముఖ్యే సుకృతే విశ్వకర్మణా. ౧౧

టీక॥ ఇమే=ఈ; ధనుషీ=విండ్లు; ద్వే=రెండును; శ్రేష్ఠే=విండ్లలోమేటియయినవి; దివ్యే=స్వర్గమునందుఁ బుట్టినవి; లోకాభివిశ్రుతే=లోకంబులందుఁ బ్రసిద్ధంబులయినవి; దృఢే=గట్టివి; బలవతీ=సారముగలవి; ముఖ్యే=ప్రధానమయినవి; విశ్వకర్మణా = విశ్వకర్మచేత; సుకృతే = చక్కఁగాఁజేయఁబడినవి.

నీవువిఱిచినదినాయొద్దనుండినది యీరెండుధనువులును, శ్రేష్ఠంబులు; స్వర్గంబునంబుట్టినవి; లోకంబులం బ్రసిద్ధములైనవి; దృఢంబులు;




సారంబుగల్గినవి; ప్రధానములు; వీనిని, విశ్వకర్మ ప్రయత్నంబునంజక్కఁగాఁజేసెను.

అని, తాత్పర్యము.

అతిసృష్టం సురై రేకం త్ర్యంబకాయ యుయుత్సవే
త్రిపురఘ్నం నరశ్రేష్ఠ భగ్నం కాకుత్థ్స యః

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగు; కాకుత్థ్స=రాముఁడా! త్వయా=నీచేత; యత్=ఏది; భగ్నం=విఱువఁబడినదో; తత్ = ఆ; త్రిపురఘ్నం= త్రిపురాసురులంజంపిన; ఏకం=ఒకధనువు; సురైః=దేవతలచేత; యుయుత్సవే=యుద్ధముసేయనిచ్ఛించిన; త్ర్యంబకాయ=శివునికొఱకు; అతిసృష్టం=ఇయ్యఁ

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఆ రెంటిలోనొకటినిత్రిపురాసురులతోయుద్ధముసేయఁగోరినశివునకు దేవతలొసంగిరి; అదియిప్పుడు త్రిపురులంజంపినది; అదియెనీచేత విఱువంబడినది.

అని, తాత్పర్యము.

ఇదం ద్వితీయం దుర్ధర్షం విష్ణోర్దత్తం సురోత్తమైః

టీక॥ దుర్ధర్షం = ఎదిరింపఁగూడని; ద్వితీయం=రెండవదియగు; ఇదం=ఈధనువు; సురోత్తమైః=దేవతాశ్రేష్ఠులచేత; విష్ణోః=విష్ణుదేవునకు; దత్తం=ఇయ్యఁబడినది.

దుర్ధర్షంబగు నీరెండవధనుస్సును దేవతలువిష్ణుదేవునకిచ్చిరి.

అని, తాత్పర్యము.

ఈయర్ధశ్లోకంబు , వ్యాఖ్యానంబులంబరిగణితంబుగానందున,నిచ్చో లెక్కింపఁబడదయ్యె.

త దిదం వైష్ణవం రామ ధనుః పరమభాస్వరమ్
సమానసారం కాకుత్థ్స రౌద్రేణ ధనుషా త్విదమ్. ౧౩

టీక॥ రామ=రాముఁడా! పరమభాస్వరం= మిక్కిలియుఁబ్రకాశించునట్టి; తత్=ఆ; ఇదం = ఈ; ధనుః=విల్లు; వైష్ణవం=విష్ణుదేవునిది;

కాకుత్స్థ=రాముఁడా! ఇదంతు=ఇదియును; రౌద్రేణ=శివునిదైన; ధనుషా=వింటితో, సమానసారం=సరియయినసా[illegible]బగలది.

రాముఁడా పరమభాస్వరంబగు నీధనువు, విష్ణుదేవునిది; ఇదియును, శివునివింటికున్నంతటి సారంబుగలది. అని, తాత్పర్యము.

దేవతా స్సర్వాః పృచ్ఛంతిస్మ పితామహమ్
శ్రి[illegible]విష్ణోశ్చ బలాబలనిరీక్షయా. ౧౪

టీక॥ తదాతు = అప్పుడె, దేవతాః=దేవతలు; సర్వాః=అందఱును; శితికంఠస్య=శివునియొక్కయు; విష్ణోశ్చ= విష్ణుదేవునియొక్కయు; బలాబలనిరీక్షయా= ప్రాబల్యమును దౌర్బల్యమునుజూడనిచ్ఛచేత; పితామహం=బ్రహ్మదేవుని; పృచ్ఛంతిస్మ=అడిగిరి.

అప్పుడు, దేవతలందఱును, శివకేశవులయెచ్చుతక్కువల నెఱుంగఁగోరి, బ్రహ్మదేవుని "శివుండుబలవంతుఁడా? లేక, విష్ణుండుబలవంతుఁడా? అనియడిగిరి.

అని, తాత్పర్యము.

అభిప్రాయం తు విజ్ఞాయ దేవతానాం పితామహః
విరోధం జనయామాస తయో స్సత్యవతాం వరః. ౧౫

టీక॥ సత్యవతాం=సత్యముగలవారిలో; వరః=శ్రేష్ఠుఁడయిన; పితామహః=బ్రహ్మదేవుఁడు; దేవతానాం= దేవతలయొక్క; అభిప్రాయం= తాత్పర్యమును; విజ్ఞాయతు= ఎఱిఁగినంతనే, తయోః= ఆశివవిష్ణువులకు; విరోధం=పగను; జనయామాస=కలిగించెను.

సత్యవంతులలో శ్రేష్ఠుండగు బ్రహ్మదేవుండు, దేవతలయభిప్రాయంబు నెఱింగి, శివునికిని, విష్ణునకునుఁబగపుట్టించెను.

అని, తాత్పర్యము.

విరోధేచ మహ ద్యుద్ధ మభవ ద్రోమహర్షణమ్
శితికంఠస్య విష్ణోశ్చ పరస్పరజిగీషిణోః. ౧౬




టీక॥ విరోధేచ = పగగలుగఁగానే; పరస్పరజిగీషిణోః = ఒండొరులజయింప నిచ్చించునట్టి; శితికంఠస్య = శివునకును; విష్ణోశ్చ = విష్ణుదేవునకును; మహాత్ = గొప్పదియును; రోమహర్షణం = వెండ్రుకలను గగురుపొడుచునట్లు చేయునట్టిది యునగు; యుద్ధం = జగడము; అభవత్ = అయినది.

ఇట్లు పగగలుగఁ నువిష్ణుండును, ఒం నిచ్చగొన్ని, రోమహ ప్పయుద్ధము చే అని, తాత్పర్యము.

తదాతు జృంభితం శైవం ధనుర్భీమపరాక్రమమ్
హుంకారేణ మహాదేవ స్తంభితోథ త్రిలోచనః. ౧౭

టీక॥ తదాతు = అప్పుడు; హుంకారేణ = "హుం" అనుటచేత; భీమపరాక్రమం = భయంకరంబగు శక్తిగల; శైవం = శివునిదైన; ధనుః = విల్లు; జృంభితం = ఆవులించినది. త్రిలోచనః = మూఁడుకన్నులుగల; మహాదేవః = పూజ్యుఁడైన దేవుండగు శివుండు; స్తంభితః = భ్రమానుపడునట్లు చేయఁబడినాఁడు.

అప్పుడు, విష్ణుండు హుంకారము ~~సేయఁగా భయంకరంబగు~~ భయంకరంబగు శక్తిగలదైనను శివునిధనువు జడమయినది; మూఁడుకండ్లుగల మహాదేవుండగు శివుండును స్తంభితుఁడయ్యె.

అని, తాత్పర్యము.

దేవై స్తదా సమాగమ్య సర్షిసంఘైః సచారణైః
యాచితౌ ప్రశమం తత్ర జగ్మతు స్తౌ సురోత్తమౌ. ౧౮

టీక॥ తత్ర = అచ్చట; సురోత్తమౌ = దేవతలలో శ్రేష్ఠులయిన; తౌ = ఆశివవిష్ణువులు; తదా = అప్పుడు; సర్షిసంఘైః = ఋషులసమూహముతోఁ గూడినవారును; సచారణైః = చారణులతోఁ గూడినవారునగు; దేవైః = దేవతలచేత; సమాగమ్య = వచ్చి; యాచితౌ = అడుగఁబడినవారలై; ప్రశమం = శాంతిని; జగ్మతుః = పొందిరి.




అచ్చట, దేవతాశ్రేష్ఠులగు నా శివవిష్ణువులు, అప్పుడు దేవతలును ꞌగణులునువచ్చి ప్రార్థింపఁగా, శాంతిఁబొందిరి.

అని, తాత్పర్యము.

ం తద్ధను ర్దృష్ట్వా శైవం విష్ణు పరాక్రమైః
మేనిరే విష్ణుం దేవా స్సర్షిగణా స్తదా. ౧౯

అప్పుడు; సర్షిగణాః = ఋషులసమూహముతోఁ గూడిన; దేవాః=దేవతలు; విష్ణుపరాక్రమైః= విష్ణునిపరాక్రమంబులచేత; జృంభితం=ఆవులించిన; శైవం=శివునిదైన; తత్=ఆ; ధనుః= వింటిని; దృష్ట్వా=చూచి; విష్ణుం=విష్ణుదేవుని; అధికం= ఉత్కృష్టునిఁగా; మేనిరే=తలంచిరి.

అప్పుడు, దేవతలును ఋషులును, విష్ణుదేవునిపరాక్రమంబున శివునిధనువుజడంబగుటంజూచి, శివుని కన్నవిష్ణుండధికుండని, తలంచిరి.

అని, తాత్పర్యము.

ధనూ రుద్రస్తు సంక్రుద్ధో విదేహేషు మహాయశాః
దేవరాతస్య రాజర్షే ర్దదౌ హస్తే ససాయకమ్. ౨౦

టీక॥ మహాయశాః = అధికమయినకీర్తిగల; రుద్రస్తు = శివుండును; సంక్రుద్ధః=కోపించినవాఁడై; ససాయకం=బాణముతోఁగూడిన; ధనుః=వింటిని; విదేహేషు = విదేహదేశంబునందు; రాజర్షేః=రాజును ఋషియునగు; దేవరాతస్య= దేవరాతునియొక్క; హస్తే=చేతియందు; దదౌ=ఇచ్చెను.

మహాయశుండగుశివుండును గోపించి, యాధనువును బాణంబుతోఁ గూడ, విదేహదేశంబున దేవరాతుండను రాజర్షిచేతికిచ్చెను.

అని, తాత్పర్యము.

ఇదం చ వైష్ణవం రామ ధనుః పరపురం జయమ్
ఋచీకే భార్గవే ప్రాదా ద్విష్ణు స్సన్న్యాస ముత్తమమ్. ౨౧

టీక॥ రామ=రాముఁడా! పరపురంజయం=శత్రువులపట్టణంబు

లజయించునట్టి; వైష్ణవం=విష్ణుదే వునిదైన; ఇదం=ఈ; ధనుశ్చ=విం టిని;విష్ణుః=విష్ణుదేవుఁడు; భార్గవే = భృగువంశమునందుఁబుట్టిన; ఋచీకే=ఋచీకునియందు; ఉత్తమం=శ్రేష్ఠమయిన;సన్న్యాసం= మంచినిక్షేపమనుగా; దదౌ= ఇచ్చెను.

రాముఁడా! శత్రుబలజయించునట్టిదియ దియునగునాచేతనుఁ విష్ణుండుభార్గవుంకు "నియొద్దనుంచ్చక నియిచ్చెను. అ

ఋచీకస్తు మహాతేజాఃపుత్రస్యాప్రతిక
పితు ర్మమ దదౌ దివ్యం జమదగ్నే ర్మ

టీక॥మహాతేజాః=అధికమయినప్రభావముగల; ఋచీకస్తు=ఋచీకుండును; అప్రతికర్మణః=బదులులేనికార్యములుగలవాఁడు పుత్రస్య=కొడుకును; మమ=నాయొక్క;పితుః=తండ్రియును; మహాత్మనః= పూజ్యమయినస్వభావముగలవాఁడునగు; జమదగ్నేః=జమదగ్ని మహర్షికి; దివ్యం= బుట్టినధనువును;దదౌ=ఁ

మహాప్రభావుండగు డును ప్రతీకారములేని కార్యములు చేయువాఁడును అతనికిఁగొడుకును నాకుఁదండ్రియునగు మహాత్ముండయినజమదగ్నికి, దివ్యంబగునాధనువు,నిచ్చెను. అని, తాత్పర్యము.

న్యస్తశస్త్రే పితరి మే తపోబల సమన్వితే
అర్జునో విదధే మృత్యుం ప్రాకృతాం బుద్ధిమా స్థితః.౨౩

టీక॥మే=నాయొక్క; పితరి= తండ్రి; న్యస్తశస్త్రే= ఉంచఁబడినయాయుధముగలవాఁడై; తపోబల సమన్వితే= తపస్సుయొక్కయతిశయముతోఁ గూడియుండఁగా; అర్జునః= కార్తవీర్యార్జునుఁడు; ప్రాకృతాం= పామరమయిన; బుద్ధిం=జ్ఞానమును; ఆస్థితః=అవలంబించినవాఁడై;మృత్యుం=చావును; విదధే=చేసెను.

కంత్రి, యాయుధంబువిడి
సేయుచుండఁగా, కా
ణనుఁడు, పామరబు

ద్ధినొంది, మాతండ్రిం జంపెను.
అని, తాత్పర్యము.

ప్రతిరూపంతు పితు శ్శ్రుత్వా సుదారుణమ్
మత్పాదయ న్రోషా జ్జాతం జాత మనేకశః. ౨౮
ఖిలాం ప్రాప్య కాశ్యపాయ మహాత్మనే
తదా రామ దక్షిణాం పుణ్యకర్మణే. ౨౮
దనిలయ స్తపోబలసమన్వితః

డా! అహం(అ
)=నేను; పితుః=తం
, అప్రతిరూపం=సరిలే
; సుదారుణం=మిక్కిలి
యుభయంకరమయినదియునగు;
వధం=చంపుటను; శ్రుత్వాతు=వి
నినంతనే; రోషాత్=కోపంబువ
లన; అనేకశః=పెక్కుమాఱులు;
జాతంజాతం= పుట్టిపుట్టియున్న;
క్షత్రం=క్షత్రియజాతిని; ఉత్పాద
యన్; పెల్లగించుచు; పృథివీం=భూ
మిని; అఖిలాంచ= అంతను; ప్రా
ప్య=పొంది; తదా=అప్పుడు; యజ్ఞ
స్య=యాగముయొక్క; అంతే=
కడను; పుణ్యకర్మణే=పరిశుద్ధమ
గుకర్మముగలవాఁడును; మహాత్మ
నే=పూజ్యమగు స్వభావము గల

వాఁడునగు; కాశ్యపాయ=కాశ్య
పునికొఱకు; దక్షిణాం=దక్షిణను
గా; దత్వా=ఇచ్చి; మహేంద్రనిల
యః=మహేంద్రపర్వతంబునందుని
కిగలవాఁడనై; తపోబలసమన్వితః=
తపస్సుయొక్క యతిశయముతోఁ
గూడినవాఁడనై; అస్మి(అభ్యాహృ
తము)=అగుచున్నాను-

రాముఁడా! నేను, అట్టిలోకం
బునకువిరుద్ధంబుగా భయంకరంబు
గాఁ గార్తవీర్యార్జునుండు నా
తండ్రింజంపుటవిని, క్షత్రియులయం
దుఁగోపంబుపూని, పెక్కుమాఱు
లు అప్పుడప్పుడు పుట్టుచున్న క్షత్రి
యులంజంపి, భూమియంతయుం
బొంది, అప్పుడు, యాగాంతంబునం
దు, ఆభూమినంతయు, మహాత్ముం

